# ఆంధ్రప్రదేశ్‌లో కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర

## 1936–42

### రెండవ భాగం

రచయితలు :

వై. వి. కృష్ణారావు

తుమ్మల వెంకట్రామయ్య

ఏటుకూరు బలరామమూర్తి

పరకాల పట్టాభి రామారావు



**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**

విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్

హైదరాబాద్-500 001

# రచయితల పరిచయం



## యార్లగడ్డ వెంకట కృష్ణారావు

కృష్ణాజిల్లా పెద అవుటపల్లెలో 1916 లో జన్మించారు. 1937లో భారత కమ్యూనిస్టు పార్టీలో చేరారు. 1937-40 ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ సంయుక్త కార్యదర్శి. 1940లో గుంటూరు ఎ సి. కాలేజీ నుండి బి.ఎస్ సి. పట్టభద్రులయ్యారు. 1948-51 వరకు రహస్య జీవితం. 1951-87 వరకు ఆంధ్ర రాష్ట్ర, ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర కమ్యూనిస్టు కమిటీ కార్యదర్శి వర్గ సభ్యులు. 1951 నుండి 87 వరకు ఆంధ్ర రాష్ట్ర, ఆంధ్రప్రదేశ్ రైతు సంఘ ప్రధాన కార్యదర్శి, అధ్యక్ష బాధ్యతలు నిర్వహించారు. 1958 నుండి భారత కమ్యూనిస్టు పార్టీ జాతీయ సమితి సభ్యులుగా కొనసాగుతున్నారు. 1987 నుండి అఖిల భారత రైతు సంఘ ప్రధాన కార్యదర్శిగా ఉన్నారు. రాజకీయ, ఆర్థిక అంశాలపై పెక్కు వ్యాసాలు, పలు గ్రంధాలు వ్రాశారు.

## తుమ్మల వెంకట్రామయ్య



గుంటూరు జిల్లా కొల్లూరులో
జననం : 1914 అక్టోబరు 6
మరణం : 1987 నవంబరు 7

బెనారస్ విద్యా పీఠ్‌లో విద్యాభ్యాసం పిమ్మట, నవశక్తి, ప్రజాశక్తి పత్రికలలో సంపాదక వర్గ బాధ్యతలు. 1948-51 కడలూరులో నిర్బంధం. పిమ్మట విశాలాంధ్ర లోనూ తర్వాత విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్‌లోనూ సంపాదక బాధ్యతలు. ఉదయిని, అభ్యుదయ పత్రికల సంపాదకులు. అభ్యుదయ రచయితల ఉద్యమ నిర్మాతలలో ఒకరు. ఆ సంఘ కార్యదర్శిగాను చిరకాలం వ్యవహరించారు.



## ఏటుకూరు బలరామమూర్తి

గుంటూరు జిల్లా ఏటుకూరులో 1918 లో జన్మించారు. 1940 నుండి 12 ఏండ్లపాటు కమ్యూనిస్టు పార్టీ ఆర్గనైజరుగా రాష్ట్రంలోని వివిధ జిల్లాలలో బాధ్యతలు నిర్వహించారు. 1949-51లలో కడలూరులో డిటెన్యూగా ఉన్నారు. 1952-72 వరకు విశాలాంధ్ర దిన పత్రికలో సంపాదక వర్గంలో వివిధ బాధ్యతలు నిర్వర్తించి, పిమ్మట విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, ఎడిటరుగా ఉంటున్నారు. రాష్ట్ర కమ్యూనిస్టు సమితి సభ్యులు. రచనలు- ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర, భారతీయ తత్వ శాస్త్రం, మన చరిత్ర, మార్క్సిజం - భగవద్గీత, బౌద్ధం - గతితర్కం, గాంధేయమార్గం తాత్వికత, ఉపనిషత్ చింతన

## ఏలకాల పట్టాభి రామారావు



1920 నవంబరు 16 పశ్చిమ గోదావరి జిల్లా కవిటంలో జన్మించారు. మారుటేరు హైస్కూలు, కాకినాడ పి. ఆర్. కాలేజీలలో విద్యాభ్యాసం 1936లో విద్యార్థి ఉద్యమం ద్వారా జాతీయోద్యమంలో కమ్యూనిస్టు ఉద్యమంలో ప్రవేశం ఉభయ గోదావరి జిల్లాల్లో విద్యార్థి ఉద్యమ నిర్మాణం. 1939-42 మధ్య అజ్ఞాతవాసం. 1942 నుండి 52 వరకు పశ్చిమ గోదావరి జిల్లాలో కమ్యూనిస్టు పార్టీ ఆర్గనైజరు - 1948-52 మధ్య తిరిగి అజ్ఞాతవాసం. 1952 జూన్ నుండి విశాలాంధ్ర దిన పత్రిక సంపాదకులుగా పనిచేస్తున్నారు. రాష్ట్ర కమ్యూనిస్టు సమితి సభ్యులు అనేక మార్క్సిస్టు సిద్ధాంత గ్రంథాల అనువాదం, మత మౌఢ్యానికి వ్యతిరేకంగా, జాతీయ పునరుజ్జీవనోద్యమం-దిగో గార్షియా. భారత-సోవియట్ ఆర్థిక సహకారం తదితర గ్రంథాల రచన.

# ముందుమాట

కామ్రేడ్ కంభంపాటి సత్యనారాయణ (సీనియర్) ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర వ్రాయాలని సంకల్పించి మొదటి భాగాన్ని వ్రాశారు. అది అచ్చులో వుండగానే వారు 1983 జనవరి 16 న మృతిచెందారు. వారు వ్రాసిన మొదటి భాగం పార్టీ సభ్యుల, ప్రజల విశేష ఆదరణ పొందింది. తరువాత చరిత్రకూడా వ్రాయటం అవసరమని భావించి కొందరు పార్టీ సభ్యులు ఆ విషయాన్ని రాష్ట్ర కమిటీకి వ్రాశారు. ఫిబ్రవరి 28, 29, 1984 లో జరిగిన ప్రదేశ్ కమ్యూనిస్టు సమితి కార్యదర్శి వర్గ సమావేశం ఈ విషయాన్ని చర్చించి కామ్రేడ్స్ వై. వి. కృష్ణారావు (సమావేశ కర్త) వై. బలరామమూర్తి, పరకాల పట్టాభి రామారావు గార్లతో పార్టీ చరిత్ర రచనా సంఘాన్ని నియమించింది.

ఈ కమిటీ మొదటి సమావేశం 1984 మార్చిలో జరిగింది. పార్టీ చరిత్ర రచనా కార్యకలాపాలకు సహాయపడవలసిందిగా కామ్రేడ్ తుమ్మల వెంకట్రామయ్య గారిని కోరాలని కమిటీ తీర్మానించింది. వారిని ఆ విధంగా కోరడం, అందుకు వారు అంగీకరించడం జరిగింది. హైద్రాబాదులో కార్యాలయానికి తోడు, విజయవాడలో కూడ ఈ కమిటీ కార్యాలయాన్ని ఏర్పాటుచేసి దాని బాధ్యత తుమ్మల వెంకట్రామయ్య గారికి అప్పగించడం జరిగింది. 1987 లో వారు చనిపోయే వరకూ ఆ బాధ్యతను వారు నిర్వర్తించారు. కమిటీ వారి కప్పగించిన భాగాల రచన కొద్ది మినహాయింపులతో ముగించారు.

కామ్రేడ్ సీనియర్ రచించిన మొదటి భాగంలో కమ్యూనిస్టు ఉద్యమ ప్రారంభ దినాల్లో ఏర్పడిన ఆర్గనైజింగ్ కమిటీని గురించి 1936 కాకినాడ ప్రథమ మహాసభను గురించి కూడా వ్రాయటం జరిగింది. అయినా ఆ కాలానికి సంబంధించిన మరికొన్ని వివరాలు అందులో రానందున రెండవ భాగం 1936-42 కాలానికే పరిమితం కాకుండా కమ్యూనిస్టు ఉద్యమ ప్రారంభ దినాలకు సంబంధించిన విషయాలను కూడ వరుస క్రమంలో తీసుకురావాలని, ఆయా జిల్లాలలో పార్టీ నిర్మాణం ఎలా ప్రారంభమయిందో, ఎలా విస్తరించిందో వివరించడం అవసరమని చరిత్ర రచనా కమిటీ నిర్ణయించింది. అందువల్ల మొదటి ప్రకరణాన్ని 'కమ్యూనిస్టు పార్టీ ఆవిర్భావం, పెరుగుదల' అను శీర్షికతో ప్రారంభించాము. జిల్లాల నిర్మాణాన్ని ఆయా జిల్లాలలో మొదటిగా

ఏర్పడ్డ సెల్లులు, ఎవరెవరితో, ఎవరికృషి వల్ల ఏర్పడిందీ మాకు లభ్యమైన అన్ని వివరాలను యిచ్చాము. ఏవైనా వివరాలు రాకపోతే, అవి మాకు లభ్యం కానందు వల్లనే జరిగింది.

ఉద్యమ చరిత్రను ఏ పద్ధతిలో వ్రాయాలనే విషయాన్ని మేము చర్చించాము. దీనిని వివిధ పద్ధతులలో వ్రాయవచ్చు. ఆనాటి రాజకీయ పరిస్థితులు పార్టీ అనుసరించిన ప్రధాన రాజకీయ విధానాలు, ఉద్యమ రథ సారధ్యం వహించిన కమిటీలు, నిర్వహించిన కార్యకలాపాలు, పార్టీ ఆధ్వర్యమున లేదా దాని నాయకత్వంలో నిర్వహించ బడిన ప్రజా ఉద్యమాలు, ప్రజా సంఘాల నిర్మాణం ఉద్యమ వ్యాప్తి వీటికి పరిమితమై రచన సాగించాలని నిర్ణయించాము. పాఠకులు, చరిత్ర కారులు మా యీ పరిమితిని గమనంలో వుంచుకోవాలని కోరుతున్నాము.

పార్టీ చరిత్ర వ్రాయాలంటే అచ్చు అయిన, లేదా వ్రాత రూపంలోవున్న అధికారయుత పత్రాలు, నివేదికలు, ఇతర ప్రచురణలు, పత్రికలలో వచ్చిన వార్తలు అవసరం. కాని ఈ కాలంలో భారత కమ్యూనిస్టు పార్టీని ప్రభుత్వం నిషేధించిన కారణంగా, ప్రారంభంలో కార్మిక రక్షణ సమితులు, అటు తరువాత కాంగ్రెసు సోషలిస్టు పార్టీ వేదికను ఉపయోగించుకొని ఆంధ్రలో కమ్యూనిస్టు పార్టీ కార్యకలాపాలు సాగించింది. అందువల్ల అచ్చు అయిన పార్టీ నివేదికలు మొదలగునవి లేవు. సోషలిస్టు పార్టీ ముఖ్య పత్రికగా 1937 డిసెంబరు-39 సెప్టెంబర్ సంవత్సరాలలో వెలువడిన నవశక్తి వారపత్రిక కమ్యూనిస్టుపార్టీ నిర్వహించినదే. అందువల్ల దానిలోని భోగట్టాపై ప్రధానంగా ఆధారపడ్డాము.

అయితే 1934-37 మధ్య కాలానికి సంబంధించి, 1939 నుండి 42 లో ప్రజాశక్తి వెలువడే వరకు పార్టీ చరిత్రకు సంబంధించిన విషయాన్ని సేకరించడం మాకు పెద్ద సమస్యగా తయారైంది.

ఇందుకు మేము నాలుగుపద్ధతులు అనుసరించాము.ఒకటి ఆనాడు ఉద్యమంలో పనిజేసి, జీవించి వున్న వారిని కలుసుకొని ఇంటర్వ్యూ ద్వారా సమాచారాన్ని సేకరించడం. రెండవది కొందరు వ్రాసిన స్వీయ చరిత్రల నుండి సమాచారము సేకరించడం. మూడవది దినపత్రికలు వారపత్రికలలో వార్తల సేకరణ. నాల్గవది ప్రభుత్వ పోలీసు సి. ఐ. డి. రిపోర్టులు, పరిపాలనా నివేదికలలోని విషయాన్ని సేకరించడము.

పార్టీ ప్రారంభం నుండి 42 వరకు పార్టీ ఉద్యమంలో పనిజేసి, జీవించి వున్నవారు కొందరు ప్రస్తుతం ఏ రాజకీయంలోనూ లేకుండా వున్నారు. మరి కొందరు భారత కమ్యూనిస్టు పార్టీలో కొనసాగుతూ అందులో పనిజేస్తున్నారు.

మరి కొందరు భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) లోనూ, ఇంకా మరి కొందరు వివిధ నక్సలైటు గ్రూపుల్లోనూ వున్నారు. మేము కలుసుకోగల వారినందరినీ కలుకొని భోగట్టా సేకరించాము. మరికొందరు మా ప్రశ్నావళికి జవాబులు వ్రాసి పంపారు.

మేము కలుసుకున్న వారి పేర్లు, వ్రాత మూలకంగా స్టేటుమెంట్లు పంపిన వారి పేర్ల లిస్టు అనుబంధంలో యిచ్చాము.

హైదరాబాదులో నున్న రాష్ట్ర పురాపత్ర భాండాగారం నుండి పోలీసు సి.ఐ డీ రిపోర్టులలోని విషయాలు సేకరించాము. భారత కమ్యూనిస్టుపార్టీ అజయ భవన్ లైబ్రెరీలోని న్యూ ఏజ్ మాస, వారపత్రికలు, నేషనల్ ఫ్రంటు, రహస్య కమ్యూనిస్టు పత్రికలనుండి ఆంధ్రకు సంబంధించిన వార్తలు సేకరించాము. ఆంధ్ర పత్రిక, కాగడా, జమీన్‌రైతు పత్రికలనుండి కూడా సమాచార సేకరణ చేశాము.

పై విధంగా సేకరించిన సమాచారాన్ని ఆధారం చేసుకొని మేము ఈ భాగాన్ని రచించాము. చరిత్రను వాస్తవిక దృక్పథంతో వ్రాయాలన్నది మా సంకల్పం. అయితే ఈ భాగంలో ప్రారంభంలో పార్టీ ఉద్యమ నిర్మాణానికి సంబంధించిగాని, లేదా అటు తరువాత ఉద్యమ వ్యాప్తికిగాని కృషి చేసిన అందరి కార్యకలాపాలను మేము సంతృప్తికరంగా తీసుకురాగలిగామని భావించడం లేదు. విషయం లభ్యం కానందువల్లనే అట్టి లోటుపాటులు జరిగివుంటాయి గాని మరే కారణంవల్లనూ కాదని సవినయంగా మనవిచేస్తున్నాము. ఆ వివరాలు ఇప్పటికైనా లభ్యమైనచో రెండవ ముద్రణలో వాటిని చేర్చగలమని తెలియజేస్తున్నాం.

పార్టీ ఉద్యమ చరిత్ర వ్రాయాలని పూనుకున్నా, పార్టీ నిర్వహించిన, లేదా ఇతరులలో కలిసి నిర్మించిన వివిధ ప్రజా సంఘాల, ఉద్యమాల చరిత్ర కూడా ఈ భాగంలో పొందుపరిచాము. ఆ కాలానికి సంబంధించిన విషయ సేకరణ జరిగిన తరువాత వివిధ ప్రజా రంగాలను గురించి వ్రాసేటప్పుడు ప్రధానమైన ఘట్టాలను, విషయాలనూ వ్రాయటమా లేక లభ్యమైన సమాచారాన్ని అంతా ఉపయోగించి వ్రాయటమా అన్న సమస్య మా ముందుకు వచ్చింది. అవసరమైన వివరాలు అన్నిటితో వ్రాద్దామని నిర్ణయించాము. అందువల్లనే ఆయా రంగాలలో పార్టీ కార్యకలాపాలకు తోడు, ఆ ఉద్యమాల చరిత్ర కూడా వచ్చింది. ఈ కారణంవల్లనే గ్రంథం ఇంత పెద్దదిగా తయారైంది.

అరుదుగా లభ్యమయ్యే ఆనాటి సోషలిస్టు పార్టీ మహాసభలు, అందులో తీర్మానాలు, కమిటీ పేర్లు, నవశక్తిలో వివిధ ప్రజా సంఘాలపై పార్టీ తీర్మానాలు అనుబంధంలో పొందు పరిచాము.

1943 లో జరిగిన 3 వ రాష్ట్ర పార్టీ మహాసభకు సమర్పించబడిన కార్య కలాపాల నివేదికను అనుబంధంలో యివ్వటం జరిగింది. ఈ కారణంవల్ల కూడా పుస్తకం పరిమాణం మరింత పెరిగింది. అయినా వీటిలోని విలువైన, అరుదుగా లభ్యమయ్యే సమాచారాన్ని చూచిన తరువాత పాఠకులు మా నిర్ణయంతో ఏకీభ విస్తారని మా విశ్వాసం.

మేము మరికొన్ని చిక్కులను కూడా ఎదుర్కొన్నాం. ఆయా ఘటనలు జరిగిన తేదీలు, సంవత్సరాల విషయం, ఎవరి జ్ఞాపకాలను బట్టి వారు వ్యాసాలు, స్వీయ చరిత్రలు వగైరాలలో వ్రాస్తూ వుండడం వల్ల ఏర్పడిన గందరగోళాన్ని తొలగించి సరైన తేదీ, సంవత్సరం తెల్పి వ్రాయాలని చూచాము. ఇందుకు చాల శ్రమ వెచ్చించవలసి వచ్చింది. ఆంధ్రలో ప్రారంభంలో ఏర్పడిన ఆర్గనైజింగు కమిటీ సభ్యుల పేర్లు, కార్యదర్శి విషయం, 1936 లో కాకినాడలో జరిగిన ప్రథమ మహాసభలో ఎవరు కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారనే విషయంలో కూడ చాల గందరగోళం వున్నది. ఈ గందరగోళానికి సంబంధించిన సమాచారం ఈ క్రింది విధంగా వున్నది.

తొలుత ఏర్పడిన ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ ఆర్గనైజింగు కమిటీ కార్యదర్శి అదే విధంగా 1936 జనవరిలో కాకినాడలో జరిగిన ప్రథమ ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు మహాసభలో ఎన్నికైన కార్యదర్శి విషయంలో అనేక మంది కామ్రేడ్సు తమ జ్ఞాపకాలలో బహు అస్పష్టంగా, సందిగ్ధంగా అభిప్రాయాలు వెలిబుచ్చారు. ఇవి ప్రథమ కార్యదర్శి ఎవరు అనే విషయ నిర్ధారణలో గందర గోళానికి దారి తీసే విధంగా ఉన్నాయి. ఉదాహరణకు కామ్రేడ్ పులుపుల శివయ్య గారు పలు సమయాల్లో పలు రకాలుగా తమ అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

కామ్రేడ్ పోలేపెద్ది నరసింహ మూర్తిగారు మరణించిన సమయంలో శివయ్యగారు 'ప్రజాశక్తి' దినపత్రికలో ఒక వ్యాసం వ్రాస్తూ ఇలా తెలియచేశారు.

జైల్లో మీరట్ ఖైదీలతో పరిచయంవల్ల కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని స్వీక రించిన సుందరయ్య, కంభంపాటి సీనియర్, రామలింగయ్య, చంద్రం మొదలైన యువకులు, నరసింహమూర్తి కలిసి 1934 సెప్టెంబరులో మొదటి మారు సమా వేశమై రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ నేర్పరిచారు. కామ్రేడ్ నరసింహమూర్తి మన మొదటి కార్యదర్శి. 1936 జనవరి కాకినాడ సమావేశంవరకు కార్యదర్శిగా పని చేశారు.

(పార్టీకి సర్వస్వం ధారపోసిన కామ్రేడ్ పోలేపెద్ది నరసింహమూర్తి - పులుపుల శివయ్య - ప్రజాశక్తి దినపత్రిక 1948 జనవరి 18 ఆదివారం 5 వ పేజీ.)

పోలెపెద్ది నరసింహమూర్తిగారు 1936 వరకు మాత్రమే కార్యదర్శిగా ఉన్నట్లు ఇది తెలియజేస్తుంది. అయితే దీనికి విరుద్ధమైన అభిప్రాయాన్ని 'కమ్యూనిజం' మాసపత్రికలో 1975 డిసెంబరులో వ్రాసిన వ్యాసంలో వారే వెలిబుచ్చారు.

(1935 ఏప్రియల్ 17 న గుంటూరు జిల్లా సమావేశం జరిగింది. నరసింహమూర్తి కార్యదర్శిగా 5 గురితో జిల్లా కమిటీ ఎన్నుకోబడింది )

"1936-37 రాజమండ్రిలో కాంగ్రెసు సోషలిస్టు పార్టీ రాష్ట్ర మహాసభల బహిరంగ సభలో కామ్రేడ్ సుందరయ్య రాజద్రోహకర ఉపన్యాసం చేశాడన్న నేరారోపణతో అరెస్టు చేయబడ్డారు. అప్పటికి రాష్ట్ర పార్టీ కార్యదర్శిగా ఉన్న కామ్రేడ్స్ నరసింహమూర్తికి పని వత్తిడి ఎక్కువైంది. అదేకాలంలో సోవియట్ నుంచి వచ్చిన అన్నాప్రగడ కామేశ్వరరావు రాష్ట్ర కమిటీకి కోఆప్టు చేసుకోబడి ఆర్గనైజింగు కార్యదర్శిగా నియమింపబడ్డాడు."

(పి.వి. శివయ్య వ్యాసం. 1975 డిసెంబరు, కమ్యూనిజం 102వ పేజీ.)

'కమ్యూనిజం మాసపత్రికలోని ఈ భాగాలు నరసింహ మూర్తిగారు 1936 కాకినాడ మహాసభ నుండి కార్యదర్శిగా ఉన్నట్లు తెలియజేస్తున్నాయి.

జొన్నలగడ్డ రామలింగయ్యగారు 'సంఘం' పత్రికలో వ్రాసిన భాగం ఈ విధంగా ఉంది.

"ఆంధ్ర రాష్ట్ర యువజన మహాసభ 1936 జనవరిలో కాకినాడ అన్నదాన సమాజంలో జరిగింది. దానికి ముందు రాత్రి అక్కడే ఆంధ్రరాష్ట్ర కమ్యూనిస్టు ప్రథమ మహాసభ జరిగింది రహస్యంగా. ఆ మహాసభకు కేంద్ర కమిటీ ప్రతినిధి ఘాటే కూడా హాజరయ్యారు. పార్టీ కార్యదర్శి సుందరయ్య పార్టీ పాలసీలో వచ్చిన మార్పును వివరించారు."

"రాష్ట్ర కమిటీకి జరిగిన ఎన్నికల్లో పోలేపెద్ది నరసింహమూర్తి కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు." (సంఘం - 1961 జూలై 15) ఆంధ్రప్రదేశ్‌లో కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర మొదటి భాగం 159, 160 పేజీలు.

ఈ భాగం 1936 వరకు సుందరయ్యగారు కార్యదర్శిగాను, 1936 నుండి నరసింహమూర్తిగారు కార్యదర్శిగాను ఉన్నట్లు తెలియజేస్తోంది.

ప్రథమంలో ఆంధ్ర రాష్ట్రంలో ఏర్పడిన ఆర్గనైజింగ్ కమిటీ గురించి సుందరయ్యగారు 'విప్లవపథంలో నాపయనం' అనే పుస్తకంలో ఇలా వ్రాశారు.

"ఇలా ఈ సంబంధాల ద్వారా పరిచయమైన వాళ్ళందరము ఒకచోట కలుసుకొని ఒక కమిటీని ఎన్నుకుందామనుకున్నాం. తదనుగుణంగా విజయవాడ పటమటలో కాట్రగడ్డ నారాయణరావు గారి తోటలో కలుసుకొన్నాము. అప్పుడు ఏడుగురితో ఒక కమిటీని ఎన్నుకున్నట్లు గుర్తు. అయితే నాకు ఐదుపేర్లే గుర్తున్నాయి. వారు పోలేపెద్ది నరసింహమూర్తి, చలసాని వాసుదేవరావు, చంద్రం, అల్లూరి సత్యనారాయణ, టి. వి చలపతి".

అదే పేజీలో ఈ విధంగా రాశారు.

నేను ఈ విధంగా మద్రాసులో వుంటూ, ఏర్పడిన కమిటీతో సంబంధాలు పెట్టుకుంటూ, అలాగే మద్రాసులో కొత్త సంబంధాలు నెలకొల్పుకుంటూ వున్నాను. ఈ లోపల, యీ కమిటీ మరి కొందరితో సంబంధాలు ఏర్పరచుకోసాగింది. ఆ దశలో బనారస్ హిందూ యూనివర్సిటీ నుండి వచ్చిన విద్యార్థులతో సంబంధాలేర్పడ్డాయి. అలాగే జైలు నుండి విడుదలై వచ్చినవారు - యిలా ఉద్యమం అభివృద్ధి చెందసాగింది. అక్కడ కమిటీకి పోలేపెద్ది నరసింహమూర్తి కార్యదర్శి. నా విషయానికొస్తే ఆనాటి ఉమ్మడి మద్రాసు రాష్ట్రానికి అంతటికీ కలిసి ఒక కమిటీ వుంది. దానికి నేను కార్యదర్శిని (విప్లవ పథంలో నా పయనం - సుందరయ్య పేజీలు 91, 92). ఎటువంటి లిఖిత ఆధారాలు లేకపోవడంవల్ల కేవలం తమ జ్ఞాపకశక్తిపైనే ఆధారపడి జరిగిన సంఘటనలను అనేక సంవత్సరాల తరువాత వివరించడంవల్ల పై రచయితలలో ఈ అస్పష్టత ఏర్పడిందని మేము అభిప్రాయపడ్డాం.

ఈ గ్రంథంలో 1934 సెప్టెంబరులో ఏర్పడిన ఆంధ్రరాష్ట్ర ఆర్గనైజింగు కమిటీకి కార్యదర్శి కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్యగారు అని మేం పేర్కొన్నాము. అదే విధంగా 1936 కాకినాడ మహాసభలో కూడా సుందరయ్యగారే కార్యదర్శిగా ఎన్నికయ్యారు. 1936 అక్టోబరులో ఆయన అరెస్టు అయిన తరువాత పోలేపెద్ది నరసింహమూర్తిగారు కార్యదర్శి బాధ్యతలు స్వీకరించారు అని పేర్కొన్నాం.

ఈ క్రింద పేర్కొన్న భాగాలను ఆధారంగా చేసుకుని మేము ఆ విధంగా నిర్ణయానికొచ్చాం.

రాష్ట్ర కమ్యూనిస్టు ఆర్గనైజింగ్ కమిటీని గురించి కంభంపాటి సీనియర్ గారు ఈ విధంగా రాశారు.

1934 సెప్టెంబరులో పుచ్చలపల్లి సుందరయ్యగారి కృషి ఫలితంగా బెజవాడలో ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు ఆర్గనైజింగు కమిటీ ఏడుగురు సభ్యులతో ఎన్నికోబడింది. వారు : పోలేపెద్ది నరసింహమూర్తి, కొసరాజు శేషయ్య,

మద్దుకూరి చంద్రశేఖరరావు, చలసాని వాసుదేవరావు, తనికెళ్ళ వెంకటచలపతి, అల్లూరి సత్యనారాయణ, సుందరయ్య.

1934 అక్టోబరులో బొంబాయిలో సమావేశమైన భారత కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ సుందరయ్య గారిని రాష్ట్ర కార్యదర్శిగా ఎన్నుకొంది.

(ఆంధ్రప్రదేశ్‌లో కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర-మొదటి భాగం-126 వ పేజీ).

కాకినాడ మహాసభ గురించి వ్రాస్తూ రామలింగయ్యగారు "పార్టీ కార్యదర్శి సుందరయ్య పార్టీ పాలసీలో వచ్చిన మార్పును వివరించారు" అని పేర్కొన్నారు. (సంఘం - 1961 జూలై 15)

"1936 సెప్టెంబరులో సుందరయ్య గారు అరెస్టు అయ్యాక రాష్ట్ర కార్యదర్శిగా (నరసింహమూర్తిగారు) ఉంటూ కాలికి బలపం కట్టుకుని జిల్లాలన్నీ తిరిగేవారు." (ఆంధ్ర ప్రదేశ్‌లో కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర మొదటి భాగం - 82 వ పేజీ).

పై భాగాల ఆధారంగా 1936 అక్టోబరులో అరెస్టు అయ్యే వరకూ సుందరయ్య గారే ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు కమిటీకి కార్యదర్శిగా ఉన్నారని అర్థం అవుతుంది.

ఈ కృషిలో మాకు అనేకమంది పార్టీ సభ్యులు, నాయకులు, ఇతరులు ఎంతోమంది తోడ్పడ్డారు. వారందరికి మా ధన్యవాదాలు తెలియజేస్తున్నాం. ఈ సందర్భంగా కొందరు వ్యక్తులు చేసిన ప్రత్యేక కృషిని, సహాయాన్ని ప్రస్తావించడం అవసరం.

ప్రదేశ్ కమ్యూనిస్టు సమితి కార్యాలయానికి కార్యదర్శిగా, ఇప్పుడు పార్టీ కోశాధికారిగా పనిచేస్తున్న కామ్రేడ్ డి. రామచంద్ర రావుగారు మాకు ఎన్నోవిధాల తోడ్పడ్డారు. అందుకు వారికి మా ధన్యవాదాలు. ఈ చరిత్రకు సంబంధించిన సమాచారాన్ని చరిత్ర భాగాలన్నింటినీ ఒకటికి, రెండుసార్లు టైపుచేసి మా ఈ కృషికి తోడ్పడిన బి. విజయలక్ష్మికి కూడా మా ధన్యవాదాలు తెలియజేస్తున్నాం.

మేము తీసుకున్న అనేక జాగ్రత్తలు తరువాత కూడా చరిత్ర రచనలో ఏవైనా లోపాలు దొర్లితే సానుభూతితో అర్థం చేసుకొని, వాటిని తొలగించడానికి పాఠకులు తోడ్పడగలరని ఆశిస్తున్నాము. కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర రెండవ భాగానికి పాఠకుల ఆదరాభిమానాలు లభిస్తాయని ఆశిస్తాము.

హైద్రాబాద్ — వై. వి. కృష్ణారావు

29-9-1988

# విషయ సూచిక

## ఒకటవ ప్రకరణం



## రెండవ ప్రకరణం



## మూడవ ప్రకరణం

# అనుబంధాలు



—(o)—

ఒకటవ ప్రకరణం

# అధ్యాయం-1

## ఆంధ్రప్రదేశ్‌లో కమ్యూనిస్టు పార్టీ ఆవిర్భావం - పెరుగుదల

*

# అధ్యాయం-2

## ప్రధాన రాజకీయ ఘటనలు - పార్టీ ప్రతిస్పందన

*

# అధ్యాయం-3

## వివిధ జిల్లాలలో పార్టీ నిర్మాణం

# ఆంధ్రప్రదేశ్‌లో కమ్యూనిస్టు పార్టీ ఆవిర్భావం–పెరుగుదల

## (I)

1920 నుండి బొంబాయి, బెంగాలు మొదలగు రాష్ట్రాలలో చిన్న చిన్న గ్రూపులుగా పనిచేస్తూ వచ్చిన కమ్యూనిస్టులు 1925 డిసెంబరు 26 న పారిశ్రామిక పట్టణమైన కాన్పూరులో ప్రారంభ మహాసభ జరిపారు. కమిటీ ఎన్నుకోబడింది. అటు తరువాత దేశంలోని మిగతా ప్రాంతాలలో కూడ క్రమంగా కమ్యూనిస్టు సెల్సు ఏర్పడ్డాయి. 1934 నాటికి కమ్యూనిస్టు ఉద్యమం ఆంధ్ర రాష్ట్రంలో ప్రవేశించింది.

కమ్యూనిస్టు పార్టీకి ఆంధ్రప్రదేశ్‌లో ఉజ్జ్వల చరిత్ర వుంది. 1930-32 సత్యాగ్రహోద్యమంలో జైళ్లకు వెళ్లిన కాంగ్రెసులోని అతివాద భావాలుగల యువకులు ఏమీ సాధించకుండానే ఆ ఉద్యమం విరమించబడటంతో అసంతృప్తి చెందారు. స్వరాజ్య సాధనకు వీరంతా మరో మార్గం వెతక నారంభించారు. సోషలిస్టు సాహిత్యాన్ని చదివి వీరు కమ్యూనిస్టు పార్టీలోకి వచ్చారు.

జైళ్ళకు వెళ్లిన యువకులలో మరి కొందరికి బళ్లారి, రాయవెల్లూరు, తిరుచునాపల్లి, రాజమండ్రి జైళ్ళలో నిర్బంధించబడ్డ లాహోరు కుట్రకేసు ఖైదీలు, బెంగాలు విప్లవ కారులతో పరిచయం ఏర్పడింది. ప్రతుల్ చంద్ర భట్టాచార్య, విజయకుమార్ సిన్హా, శివవర్మ రాజమండ్రిలోనూ, మరి కొందరు విప్లవ కారులు ఇతర జైళ్ళలోనూ నిర్బంధించబడ్డారు. వీరితో కలిగిన పరిచయం, జరిగిన చర్చలవల్ల సోషలిజంవైపు ఆకర్షితులయ్యారు. సోషలిస్టు సాహిత్యాన్ని చదివారు. ఇట్టి అతివాద యువకులందరికీ జైళ్లు శిక్షణాలయాలుగా ఉపయోగపడ్డాయి. వీరందరు జైలు నుండి విడుదలైన తరువాత కమ్యూనిస్టు పార్టీలో చేరారు. ఇట్టి వారిలో పుచ్చలపల్లి... పుద్దుకూరు చంద్రశేఖరరావు, ఉద్ధరాజు రామం, అల్లూరి సత్యనారాయణరాజు, పొన్నలగడ్డ రామలింగయ్య, చలసాని జగన్నాధరావు, కానూరు బలరామమూర్తి, తనికెళ్ల చలపతి, కొసరాజు శేషయ్య, గద్దే లింగయ్య గారపాటి సత్యనారాయణ, కృత్తివెంటి కుటుంబరావు మొదలగు వారున్నారు.

ఈ కాలంలోనే ఆంధ్ర నుండి బెనారసు విశ్వవిద్యాలయంలోనూ, కాశీ విద్యాపీఠ్‌లోనూ విద్యను అభ్యసించడానికి వెళ్లిన యువకులకు అప్పటికే అక్కడ

వున్న కమ్యూనిస్టులతో పరిచయాలు ఏర్పడ్డాయి. మార్క్సిస్టు అధ్యయన తరగ తులకు హాజరు కావడం ద్వారానూ, మార్క్సిస్టు సాహిత్యాన్ని చదవడం ద్వారానూ ఆంధ్ర నుండి బెనారసు వెళ్ళిన విద్యార్థులలో ఎక్కువమంది కమ్యూ నిజం వైపు ఆకర్షితులయ్యారు. వీరు ముందుగా యంగ్ కమ్యూనిస్టు లీగ్‌లో చేరారు. ఇట్టి వారిలో చంద్రరాజేశ్వరరావు, పౌన్నం వీర రాఘవయ్య, తుమ్మల వెంకట రామయ్య, కాట్రగడ్డ వెంకట నారాయణరావు, పోలేపెద్ది నరసింహమూర్తి పులపుల శివయ్య, నండూరి ప్రసాదరావు, యాళ్లబండి పోలిశెట్టి, సోమూరి వెంకట్రామయ్య, చంద్ర రామలింగయ్య, సి. యల్. రాయుడు, కాట్రగడ్డ శ్రీనివాసరావు మొదలగు వారు 50 మంది సభ్యులుండేవారు. ఈనాడు భారత కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శిగానున్న చంద్ర రాజేశ్వరరావు 1931 లోనే యంగ్ కమ్యూనిస్టు లీగ్‌లో చేరారు 1934 లో కమ్యూనిస్టు పార్టీ పూర్తి సభ్యత్వాన్ని స్వీకరించారు. వీరు మిగతా విద్యార్థులను కమ్యూనిజం వైపు తీసుకు రావడానికి కృషి చేసారు. బెనారసు విశ్వ విద్యాలయంలో నున్న ఆర్.యస్.యస్. విద్యార్థులకు కమ్యూనిస్టు భావాలతోనున్న యువకులకు మధ్య తరచు ఘర్షణలు జరుగుతుండేవి. ఆర్. యస్. యస్. వారిని ఎదుర్కోవడంలో రాజేశ్వరరావుది ప్రధాన పాత్ర. ఇందువల్లనే విశ్వ విద్యాలయ అధికారులు 1936 లో రాజేశ్వర రావుకు టి.సి. యిచ్చి పంపివేసారు.

బెనారసులో 1934 లో సభ్యులైన వారిలో తుమ్మల వెంకట్రామయ్య, పౌన్నం వీర రాఘవయ్య గార్లు వున్నారు. నండూరి ప్రసాదరావు గుంటూరు వచ్చిన తరువాత 1935 లో పార్టీలో చేరారు.

టెక్నికల్‌గా పార్టీలో చేరకపోయినా కాట్రగడ్డ నారాయణరావుగారు బెనారసు నుండి సోషలిస్టు సాహిత్యాన్ని ఆంధ్రకు విరివిగా తెచ్చి అనేకమంది అతి వాద యువకులను కమ్యూనిస్టు పార్టీ వైపు తీసుకురావడానికి కృషి చేసారు.

పోలేపెద్ది నరసింహమూర్తి 1933 చివరకు తెనాలి వచ్చి, గుంటూరు జిల్లాలోని అతివాద కాంగ్రెసు యువకులను పార్టీ వైపు తీసుకురావడానికి, సెల్లులు ఏర్పాటు చేయడానికి కృషి చేసారు.

1929-34 మధ్య మీరట్ కుట్రకేసు దీర్ఘకాలం సాగింది. మీరట్ కుట్ర కేసు ముద్దాయిలు దాఖలు చేసిన సంజాయిషీ పత్రాలు సుదీర్ఘమైనవి. భారత కమ్యూ నిస్టు ఉద్యమానికి ఇవి సిద్ధాంత ప్రాతిపదికలుగా ఉపయోగపడ్డాయి. మీరట్ కేసు ముద్దాయిలలో ఒకరైన అమీర్ హైదర్‌ఖాన్ అరెస్టు కాకుండా తప్పించుకొని అజ్ఞాతవాసంలో వుంటూ పార్టీ ఆదేశంపై మద్రాసు వచ్చారు. ఆయన మద్రాసులో కమ్యూనిస్టు బీజాలు నాటిన మూల పురుషుడు. కార్మికుల్లోనూ, విద్యార్థులలోనూ

చైతన్యవంతులైన వారితో యంగ్ వర్కర్సు లీగ్‌ను స్థాపించి, కమ్యూనిస్టు ప్రణాళిక, తదితర మార్క్సిస్టు గ్రంథాలను చదివించేవారు.

పుచ్చలపల్లి సుందరయ్యగారి జీవిత చరిత్రనుబట్టి కంభంపాటి సత్యనారాయణ, సుందరయ్య 1930 లోనే మద్రాసుకు వచ్చిన హెచ్ డి. రాజా పరిచయంతో కమ్యూనిస్టులుగా మారారు మద్రాసు వచ్చిన అమీర్ హైదర్‌ఖాన్ ద్వారా వారిద్దరు 1932 లో పార్టీలో చేరారు. వీరిద్దరు మద్రాసులోనున్న మరి కొంతమంది తెలుగు, తమిళ యువకులను యంగ్ వర్కర్సు లీగ్‌లోకి, కమ్యూనిస్టు పార్టీలోకి చేర్చారు. 1934 నాటికి మద్రాసులో కమ్యూనిస్టు పార్టీ శాఖను స్థాపించారు.

ఈ మూడు ప్రవాహాల ద్వారా కమ్యూనిస్టు ఉద్యమం వైపు ఆకర్షితులైన యువకులు 1934 ప్రాంతంలో ఆంధ్ర కమ్యూనిస్టు ఉద్యమానికి పునాది వేసారు. పుచ్చలపల్లి సుందరయ్య ప్రధానంగా ఆంధ్ర ప్రాంతంలో వివిధ జిల్లాలలో కమ్యూనిస్టు భావాలతోనున్న వారిని, అతివాద కాంగ్రెసు యువకులను కలుసుకొని కమ్యూనిస్టు శాఖల నిర్మాణానికి పూనుకున్నారు. ఈ విధంగా కమ్యూనిస్టు ఉద్యమం వైపు వచ్చిన వారితో విజయవాడ, పటమటలో కాట్రగడ్డ నారాయణ రావుగారి తోటలో 1934 సెప్టెంబరులో ఒక సమావేశం జరిగింది. ఈ సమావేశంలో పుచ్చలపల్లి సుందరయ్య కార్యదర్శిగా 7 గురు సభ్యులతో ఒక ఆర్గనైజింగు కమిటీ ఏర్పడింది. ఇందులో సుందరయ్యతోపాటు మద్దుకూరి చంద్రశేఖర రావు, పోలేపెద్ది నరసింహమూర్తి, చలసాని వాసుదేవరావు, తనికెళ్ల వెంకట చలపతి, కొసరాజు శేషయ్య, అల్లూరి సత్యనారాయణ రాజు సభ్యులుగావున్నారు.

ఈ సమావేశం రాష్ట్రమంతటా కూలి రక్షణ సమితుల్ని ఏర్పరచి, వాటి ద్వారా కార్మికుల్లో పనిచేయాలని, తెలుగులోవున్న మార్క్సిస్టు గ్రంథాల ద్వారా యువతీ, యువకుల్లో చైతన్యం కలిగించాలని తీర్మానించింది.

మీరట్ కుట్ర కేసు ఖైదీలు 1934 నాటికే కొంతమంది విడుదలయ్యారు. బ్రిటిషు ప్రభుత్వం 1934 జూలై 23 న భారత కమ్యూనిస్టు పార్టీని నిషేధించింది. 1934 సెప్టెంబరు 20 న మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం యంగ్ వర్కర్సు లీగ్‌ను కూడా నిషేధిస్తూ ఆజ్ఞలు జారీ చేసింది.

అందువల్ల ఆంధ్ర ప్రాంతంలోని కమ్యూనిస్టులు వివిధ పట్టణాలలో కూలి రక్షణ సమితులను స్థాపించి వాటి ద్వారా పనిచేయ నారంభించారు. ఈ విధంగా గుంటూరు, బెజవాడ, నెల్లూరు, ఏలూరు, బందరు, తెనాలి, భీమవరం, విశాఖ పట్నం, రాజమండ్రి మొదలగు పట్టణాలలో కూలి రక్షణ సమితులు ఏర్పడ్డాయి. ఇవి పార్టీకి బహిరంగ వేదికలు. వర్గ ప్రాతిపదికపై కార్మిక సంఘాలను ఏర్పాటు

జేస్తూ ఈ కూలి రక్షణ సమితులు సోషలిజాన్ని గురించి ప్రచారంచేసేవి. వీటి ద్వారా రైల్వే తదితర కార్మికులలోను వ్యవసాయ కూలీలలో కూడ పనిజేసేవారు.

మొట్ట మొదటిసారి వర్గ ప్రాతిపదికపై కార్మిక సంఘాలను ఏర్పాటుజేసి, కార్మికులను సంఘటితపరచడంతోపాటు, వారి హక్కులకై సమ్మె పోరాటాలు నిర్వహించడం జరిగింది. ప్రెస్సు, మున్సిపల్ తదితర కార్మికులలో పనిజేస్తూ ఉండేవారు. ఈ కృషిలోనే కమ్యూనిస్టులు ప్రభుత్వ నిర్బంధ విధానానికి గురై, శిక్షలు పడి జైళ్లకు వెళ్ళారు.

గుంటూరు కూలి రక్షణ సమితి ఆధ్వర్యం క్రింద కార్మికులకు రాజకీయ పాఠశాలలు నడుపబడేవి. వివిధ జిల్లాలలోని పార్టీ కార్యకర్తల భార్యలు, చెల్లెళ్లు మొదలైన వారికి గుంటూరులో 1935 ఆగష్టులో నెల రోజులు రాజకీయ పాఠశాల నడపబడింది.

1935 ఆగష్టులో 7 వ అంతర్జాతీయ కమ్యూనిష్టు మహాసభ జరిగింది. అప్పటికే ఫాసిస్టు ప్రమాదం పెరిగింది. 7 వ మహాసభకు ప్రముఖ కమ్యూనిస్టు నాయకుడు డిమిట్రాప్ సమర్పించిన నివేదికలో ఫాసిస్టు వ్యతిరేక, సామ్రాజ్య వ్యతిరేక ఐక్య సంఘటనకు పిలుపు యివ్వబడింది. వలస దేశాలలో సాగుతున్న జాతీయ విముక్తి పోరాటాలను సమీక్షించి, జాతీయ ఐక్య సంఘటనా కార్యక్రమాన్ని 7 వ అంతర్జాతీయ కమ్యూనిస్టు మహాసభ రూపొందించింది. ఈ పిలుపును ఆధారం జేసుకొని, దానిని భారతదేశ పరిస్థితులకు అన్వయింపజేస్తూ ప్రముఖ బ్రిటీషు కమ్యూనిస్టు నాయకులు పామీదత్, బెన్‌బ్రాడ్లీలు, ఒక సిద్ధాంత పత్రాన్ని తయారుచేసి భారతదేశానికి పంపారు. దీనినే దత్తు - బ్రాడ్లీ థీసిస్ అని పిలుస్తారు. భారత కమ్యూనిస్టు పార్టీ జాతీయ కాంగ్రెసుతో ఐక్య సంఘటనా ఎత్తుగడలు అవలంభించి సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా జాతీయ స్వాతంత్ర్య పోరాటాన్ని కొనసాగించాలని దత్తు - బ్రాడ్లీ థీసిస్ సూచించింది.

1935 చివరిలో నాగపూరులో సమావేశమైన భారత కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ దత్తు-బ్రాడ్లీ పత్రాన్ని చర్చించి, దానిని ఆమోదించింది. దానిని ఎలా అమలు జరుపాలనే విషయంపై వివరమైన సూచనలతో రెండు పత్రాలను తయారు జేసి, వాటిని క్రింది యూనిట్లకు పంపటం జరిగింది. జాతీయ కాంగ్రెసు సంస్థనే సామ్రాజ్య వ్యతిరేక సంఘటనగా మార్చాలని కేంద్ర కమిటీ నిర్ణయించింది. పార్టీ సభ్యత్వాన్ని వుంచుకుంటూనే కమ్యూనిస్టులు కాంగ్రెసులో చేరాలని, దానితో సన్నిహిత సంబంధాలు వుంచుకుని పని చేయాలని, నిర్ణయించబడింది ట్రేడ్ యూనియన్ కాంగ్రెసును, కిసాన్ సభను బలవత్తరంగా నిర్మించి, ఆ వర్గాల ప్రజల పోరాటాలు సాగిస్తూ ఆ సంస్థలను కూడ కాంగ్రెసుకు సమిష్టిగా

అనుబంధించి జాతీయ కాంగ్రెసును ఐక్యసంఘటనా సంస్థగా పెంపొందించాలని నిర్ణయించబడింది. అలాగే కాంగ్రెసులోనే వుంటూ సోషలిస్టు భావాల వ్యాప్తికై పనిచేస్తున్న కాంగ్రెసు సోషలిస్టు పార్టీలోకూడ కమ్యూనిస్టులు సభ్యులుగా చేరాలని ఆసమావేశములోనే నిర్ణయించబడింది.

1936 జనవరిలో మీరట్ పట్టణంలో జరిగిన అఖిల భారత సోషలిస్టు మహాసభ మార్క్సిజంలో విశ్వాసమున్న వారందరితోనూ కూడిన పార్టీగా, కాంగ్రెసు సోషలిస్టుపార్టీ వుంటుందని ప్రకటించింది. సోషలిస్టు పార్టీ తీసుకున్న ఈ వైఖరివల్ల కమ్యూనిస్టులు, కాంగ్రెసు సోషలిస్టు పార్టీలోచేరి, పనిచేయడానికి వీలు కలిగింది.

ఆంధ్రలో ప్రథమ కమ్యూనిస్టు పార్టీ మహాసభ కాకినాడ అన్నదాన సమాజ సత్రంలో 1936 జనవరి 29 వతేదీన అక్కడ జరుగుతున్న ఆంధ్ర రాష్ట్ర యువజన మహాసభ సందర్భంగా జరిగింది. దీనికి 10 మంది ప్రతి నిధులు హాజరయారు. అప్పటికి మొత్తం పార్టీ సభ్యత్వం 40. ఈ సమావేశానికి కేంద్రకమిటీ తరపున కామ్రేడ్ యస్. వి. ఘాటే హాజరయారు. పార్టీ కార్యదర్శి సుందరయ్య పార్టీ పాలసీలో వచ్చిన మార్పును వివరించారు. రాయిజం విష యంలో జాగ్రత్త వహించాలని చెప్పారు. ఇదే విషయంపై ఘాటే కూడ మాట్లా డారు. పుచ్చలపల్లి సుందరయ్య,పోలేపెద్ది నరసింహమూర్తి,చలసాని వాసుదేవరావు' అల్లూరి సత్యనారాయణ రాజు, మద్దుకూరి చంద్రశేఖరరావు, తనికెళ్ళ వెంకట చలపతి, కొసరాజు శేషయ్య సభ్యులుగా ఏడుగురితో కమిటీ ఎన్నుకోబడింది. ఈ సమావేశంలో సుందరయ్య గారే కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు. జూన్‌లో వారి అరెస్టుతరువాత పోలేపెద్ది నరసింహమూర్తి కార్యదర్శి బాధ్యతలు స్వీకరించారు.

కేంద్ర కమిటీ పంపిన పత్రాలను, ఎత్తుగడలను ఆమోదించటం జరిగింది. కాంగ్రెసు సంస్థలో చేరి పనిచేయాలని, అలాగే కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో చేరి, దానిని నిజమైన మార్క్సిస్టు పార్టీగా అభివృద్ధి చేయాలని ఆ సమావేశంలో నిర్ణ యించబడింది. కార్మిక, రైతు, యువజన, విద్యార్థి ప్రజానీకంలో పనిజేస్తూ ఆయా వర్గ సంఘాల ఏర్పాటుకు కృషి చేయాలని నిర్ణయించబడింది

అప్పటికే ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ఏర్పడింది. అన్ని కోస్తా జిల్లాలలో సోషలిస్టు పార్టీశాఖలు ఏర్పడ్డాయి ఆంధ్ర ప్రాంతంలోని కమ్యూ నిస్టులు కాకినాడ మహాసభ నిర్ణయానుసారం కాంగ్రెసులోనూ, కాంగ్రెసు సోష లిస్టు పార్టీలోనూ చేరి పనిజేసారు. ఐక్యసంఘటనా ఎత్తుగడలను అమలు జరిపారు.

1936 సెప్టెంబరులో రాజమండ్రిలో జరిగిన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ రెండవ మహాసభలో మద్దూరి అన్నపూర్ణయ్య కార్యదర్శిగానూ,

పుచ్చలపల్లి సుందరయ్య జాయింటు సెక్రటరీలలో ఒకరుగానూ ఎన్నుకోబడ్డారు కార్యవర్గ సభ్యులు 13 మందిలో దాదాపు 7 గురు కమ్యూనిస్టు పార్టీసభ్యులు న్నారు. అప్పటికి మద్దూరి అన్నపూర్ణయ్య గారు కూడ కమ్యూనిస్టు పార్టీ సభ్యులేనన్న విషయాన్ని గమనిస్తే కమ్యూనిస్టు పార్టీ సభ్యులు రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ వర్గంలో ఎక్కువసంఖ్యలో వుండటమే గాక, ప్రధాన పదవులలో కూడ వున్న విషయం స్పష్టమవుతుంది.

1937 నవంబరులో పాలకొల్లులో జరిగిన రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ 3వ సభలో కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్య కార్యదర్శిగా ఎన్నుకో బడ్డారు. కార్యవర్గం 14 మందిలో ఇద్దరు మినహా మిగతా వారంతా కమ్యూనిస్టు పార్టీ సభ్యులే.

అలాగే అనేక జిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీలలో కూడ కమ్యూనిస్టు పార్టీ సభ్యులు ప్రధానమైన పదవులకు ఎన్నుకోబడి, కార్యక్రమాలను నిర్వహిం చారు.

జాతీయ కాంగ్రెసుపట్ల కమ్యూనిస్టు పార్టీ ఐక్యసంఘటనా విధానాన్ని అవలంభించి పనిచేయడంతో చాలమంది సాధారణ కాంగ్రెసు వాదులు అతివాద భావాల వైపు మొగ్గటం జరిగింది. కాంగ్రెసు కమిటీలలో కమ్యూనిస్టులకు గణ నీయమైన స్థానాలు లభించాయి. పశ్చిమ గోదావరి, పశ్చిమ కృష్ణా, కాంగ్రెసు కమిటీలు, అనేక తాలుకా కాంగ్రెసు కమిటీలు కమ్యూనిస్టుల, అతివాదుల నాయ కత్వంలో వుండేవి. త్రిపుర కాంగ్రెసు అధ్యక్ష ఎన్నికల్లో కాంగ్రెసు అగ్ర నాయ కుడైన డాక్టరు పటాభి సీతారామయ్య, సుభాష్ చంద్రబోస్ మధ్య పోటీ జరిగింది. రాష్ట్రాభిమానంతో ఆంధ్ర రాష్ట్రంలో పట్టాభికి ఎక్కువ ఓట్లు వచ్చినా అన్ని ఓట్లూ సంపాదించాలన్న ప్రయత్నం నెరవేరలేదు. అతివాదులంతా సుభాష్ చంద్ర బోస్‌కే ఓట్లు వేసారు సుభాష్ చంద్రబోస్ స్వల్ప మెజారిటీతో నెగ్గారు. ఆంధ్ర రాష్ట్రంలో అతివాదులు ఓటు చేయనందువల్లనే పట్టాభి సీతారామయ్య ఓడిపోయా డని మితవాదులు ఆరోపణ చేసారు.

1937 రాష్ట్రపతి శాసన సభకు జరిగిన సాధారణ ఎన్నికల్లో ఫ్యూడల్ జమీందారీ వర్గాన్ని ఓడించేందుకు, కాంగ్రెసు అభ్యర్థుల్ని బలపరుస్తూ కమ్యూ నిస్టు పార్టీ పెద్దఎత్తున ప్రచారం చేసింది కమ్యూనిస్టులైన వారు సోషలిస్టు పార్టీలో వున్నా కార్మిక, యువజన, విద్యార్థి మొదలగు ఏ ప్రజా సంఘంలో వున్నా కాంగ్రెసు గెలుపుకు తీవ్రంగా కృషి చేసారు.

1937 మే-లో ఒంగోలు సమీపంలోని కొత్తపట్నంలో ఏర్పాటు చేసిన రాజకీయ పాఠశాలకు 180 మందికి పైగా యువతీ యువకులు హాజరయ్యారు.

ఆనాటి రెడ్డినాయుడు నదమంత్రపు మంత్రి వర్గం ఈ పాఠశాలను నిషేధించింది. పోలీసులు విద్యార్థులపై అమానుషంగా లాఠీ చార్జి చేసారు అనేక మందిని అరెస్టు చేసి కేసులు పెట్టారు. 1938 లో బాపట్ల తాలూకా మంతెనవారి పాలెంలో మరొక రాష్ట్ర రాజకీయ పాఠశాల నిర్వహించబడింది. దీనికి 300 మంది యువతీ యువకులు హాజరయ్యారు. అలాగే జిల్లా స్థాయిలో రాజమండ్రి, ఇచ్ఛాపురం, తునికి పాడు, పల్లెకోన, పామర్రు, కాల్వబుగ్గ, రాజోలు, సత్తెనపల్లి మొదలగు ప్రదేశాలలో పాఠశాలలు నిర్వహించబడ్డాయి. వీటిలో మార్క్సిస్టు అర్థశాస్త్రము,చారిత్రక భౌతికవాదం, గతితార్కిక భౌతికవాదం, వంటి మార్క్సిస్టు మూలసూత్రాలతో పాటు, భారత జాతీయోద్యమ చరిత్ర, కార్మికోద్యమ చరిత్ర, కమ్యూనిస్టు పార్టీ విధానం, వర్గసంఘాల నిర్మాణం - మొదలగు అంశాలన్నీ బోధించబడ్డాయి. అప్పటికే పార్టీ సభ్యులుగా వున్నవారికి అతివాద యువకులకు, మార్క్సిస్టు విజ్ఞానాన్ని కల్గించడము, అతివాద యువకులను పార్టీవైపు ఆకర్షించడము, వారిని కార్యకర్తలుగా తయారు చేయడము ఈ రాజకీయ పాఠశాలల ముఖ్యోద్దేశము.

ఈ కాలంలో కేంద్రపార్టీ పత్రికలు ఇంగ్లీషులో రహస్యపత్రిక "కమ్యూనిస్టు'' బహిరంగంగా వచ్చే "న్యూ ఏజ్'' మాసపత్రిక "నేషనల్ ఫ్రంటు"తో పాటు తెలుగులో రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ తరపున "నవశక్తి" వారపత్రికగా 1937 డిశంబరు నుండి 1939 సెప్టెంబరులో రెండవ ప్రపంచయుద్ధ ప్రారంభం వరకు వెలువడింది. ఆ రోజులలో ఈ పత్రికల వ్యాప్తికి బాగా కృషిచేయడం జరిగింది.

మార్క్సిస్టు సాహిత్యాన్ని ప్రచురించి ప్రజలకు అందజేయడం జరిగింది. ఈ కృషికి 193 లో కృష్ణా జిల్లా యలమర్రులో స్థాపించబడ్డ ఆదర్శ గ్రంథ మండలి, 1934 లో ముంగండ (తూర్పు గోదావరి)లో ఏర్పాటు చేయబడిన విశ్వ సాహిత్య మాల, గుంటూరులోని అతివాద గ్రంథమాల, నిడమర్రు (పశ్చిమ గోదావరి) లోని ప్రగతి ప్రచురణాలయం చాలా తోడ్పడ్డాయి.

## రెండవ పార్టీ మహాసభ

1938 జూన్ నెలలో ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ రెండవ మహాసభ విజయవాడ లోని కాట్రగడ్డ వారిమేడలో, అంటే నవశక్తి పత్రిక కార్యాలయంలో జరిగింది. అప్పటికి పార్టీ సభ్యులు 200 ఈ మహాసభకు దాదాపు 60 మంది ప్రతినిధులు హాజరయ్యారు. పార్టీ కేంద్ర కమిటీ తరపున కార్యదర్శి పి సి జోషి ఈ మహాసభకు హాజరయ్యారు అప్పటికి పార్టీ సోషలిజాన్నిగురించి సాధారణ ప్రచార ఆందోళన దశను దాటింది. జాతీయఐక్య సంఘటన నినాదాలతోనూ,

కాంగ్రెసు సోషలిస్టు పార్టీలోనూ, వివిధ ప్రజా రంగాలలోను పనిచేయడం ప్రారంభించింది పార్టీ నిర్మాణ రీత్యా కొన్ని సమస్యలు ఎదుర్కొంది. ప్రతి రంగంలో జాతీయ ఐక్య నినాదాల ననుసరించి ప్రజలను ఎలా సంఘటిత పర్చాలో, విడివిడిగా వున్న ఈ ప్రజా సంఘాలన్నింటిని సమన్వయపర్చి జాతీయఐక్య సంఘటన ఎలా నిర్మాణం చేయాలో పార్టీ స్పష్టీకరించవలసిన అవసరం ఏర్పడింది. అట్టి స్పష్టమైన అవగాహన దృక్పథం కలుగజేస్తేతప్ప ఆయా రంగాలు, పార్టీ ముందుకు పోవడానికి వీలులేదు. అందువల్ల ఈ మహాసభ ఈ క్రింది వివరమైన పత్రాలను ఆమోదించింది. 1. కాంగ్రెసు - సోషలిస్టులు 2. రైతు ఉద్యమం ఎడల సోషలిస్టుల వైఖరి 3. ఆంధ్రరాష్ట్ర కార్మికోద్యమం 4. వ్యవసాయ కూలీలు - సోషలిస్టులు. 5. యువజనోద్యమం - సోషలిస్టులు 6. ఆంధ్ర రాష్ట్రము - సోషలిస్టులు. అయితే కమ్యూనిస్టు పార్టీపై నిషేధము వున్నందువల్ల ఈ పత్రాలు అటుతరువాత సోషలిస్టు పార్టీ తీర్మానాలుగా, పార్టీ పత్రిక నవశక్తిలో ప్రచురింపబడ్డాయి. వివిధ రంగాలకు ఈ పత్రాలలో ఆచరణయోగ్యమైన, ఖచ్చితమైన కార్యక్రమం యివ్వబడింది. ఈ తీర్మానాల పూర్తిపాఠాన్ని అనుబంధంలో యిస్తున్నాం.

తరువాత కాలంలో ఈ పత్రాల ఆధారంగా వివిధ రంగాలలో నున్న పార్టీ సభ్యులు పనిచేసారు ఆ రంగాల అభివృద్ధి కూడ జరిగింది. ఈ మహాసభ తరువాత యువజన సంఘాల పనిలో ప్రధానమైన మార్పులు వచ్చాయి. యువజనులు ఎక్కువగా ఈ సంఘాలవైపు ఆకర్షించబడ్డారు.

పార్టీ నూతనంగా మహిళలతో పనిచేయడం ప్రారంభమైంది. కృష్ణా,పశ్చిమ గోదావరి జిల్లాలలో మహిళా ఉద్యమం ప్రారంభమై సంఘాలు నిర్మించబడాయి

మహాసభలో నూతనంగా 7 గురు సభ్యులతో రాష్ట్రకమిటీ ఎన్నుకోబడింది దీనికి పుచ్చలపల్లి సుందరయ్య కార్యదర్శి, చంద్ర రాజేశ్వరరావు, మద్దుకూరి చంద్రశేఖరరావు, చలసాని వాసుదేవరావు, అల్లూరి సత్యనారాయణ, పోలేపెద్ది నరసింహమూర్తి, పులుపుల శివయ్య కమిటీ సభ్యులు

## 1939-42 రెండవ దశ

1939 సెప్టెంబరులో రెండు సామ్రాజ్యవాద కూటముల మధ్య రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది. ప్రజాభీష్టానికి వ్యతిరేకంగా బ్రిటిషు పాలకులు భారతదేశాన్ని యుద్ధంలో దింపారు. భారత జాతీయకాంగ్రెసు దీనికి వ్యతిరేకతను తెలియజేసింది. యుద్ధానికి సహాయం చేయరాదని తీర్మానించింది.

యుద్ధం ప్రారంభం కాగానే ఇంగ్లీషు పాలకులు భారత కమ్యూనిస్టు పార్టీ పైన, ఇతర అతివాద పక్షాలు, ప్రజా సంఘాలు, అభ్యుదయ కాముకులైన

వ్యక్తుల పైన క్రూరమైన నిర్బంధ విధానాన్ని ప్రయోగించారు. అనేకమంది ప్రముఖులను, కార్యకర్తలను అరెస్టు చేసి, దేశ రక్షణ నిబంధనల క్రింద జైళ్ళలోనూ, కాన్‌సన్‌ట్రేషన్ క్యాంపులలోనూ నిర్బంధించారు. ప్రభుత్వం మార్క్సిస్టు సాహిత్య ప్రచురణలపైన దాడి చేసింది. పార్టీ పత్రికలను నిషేధించింది. నవశక్తి ప్రచురణ నిలిచిపోయింది అరెస్టులను తప్పించుకొన్న కమ్యూనిస్టు నాయకులు, కార్యకర్తలు కర్తవ్య నిర్వహణకు అజ్ఞాతవాసానికి వెళ్ళారు.

రాష్ట్ర కమిటీ ముఖ్యులంతా అజ్ఞాతవాసానికి వెళ్ళారు. తిరిగి 1942 జూలైలో పార్టీపై నిషేధము తొలగిన తరువాత బహిరంగంగా వచ్చి బహిరంగ కార్యాలయాలను పెట్టి కార్యకలాపాలు సాగించారు.

స్వాతంత్ర్య సాధనకై పోరాటాన్ని తీవ్రతరం చేయాలని, కమ్యూనిస్టు పార్టీ దానికి నాయకత్వం వహించి నడపాలని కేంద్ర కమిటీ నిర్ణయించింది.

"నవశక్తి" వారపత్రిక ఆగిపోగానే "స్వతంత్ర భారత్" అనే రహస్య పత్రికను నిర్వహించి, దీనిని విస్తృతంగా ప్రజలలోకి పార్టీ తీసుకెళ్ళింది. కొన్ని వేల గ్రామాలలో దీని పంపకం జరిగింది. స్వతంత్ర భారత్ పత్రికా నిర్వహణలోనూ, దానిని పంపకం చేయడంలోనూ అనేకమంది సభ్యులు అరెస్టు అయ్యారు. యుద్ధ వ్యతిరేక ప్రచారానికి గాను వందలమంది కామ్రేడ్సును అరెస్టు చేసి దేశ రక్షణ చట్టం క్రింద కేసులు పెట్టి శిక్షలు విధించటం జరిగింది. ఎంత తీవ్ర నిర్బంధ విధానం అమలు జరిపినప్పటికీ, కమ్యూనిస్టు పార్టీ కార్యకలాపాలను అణచడం ప్రభుత్వానికి చేత కాలేదు. రహస్యంగా వుంటున్న కమ్యూనిస్టు నాయకులను ప్రజానీకం ఆదరించి, అనేక విధాల తోడ్పడింది యుద్ధం పట్ల ప్రజల్లో ద్వేషాన్ని తీవ్రతర మొనర్చి, సామ్రాజ్య వ్యతిరేక చైతన్యాన్ని పార్టీ పెంపొందించింది. ఈ కాలంలో అనేకమంది యువకులు క్రొత్తగా పార్టీ వైపుకు రావడం, అనేక క్రొత్త గ్రామాలకు పార్టీ విస్తరించడం జరిగింది.

యుద్ధ కాలంలో ప్రభుత్వ నిర్బంధ విధానాన్ని ఎదుర్కొంటూనే సామ్రాజ్యవాద యుద్ధానికి వ్యతిరేకంగా ప్రజలలో విస్తృతంగా ప్రచారం చేయడం జరిగింది. కమ్యూనిస్టు పార్టీ దళాలు గ్రామాల వెంట ప్రచార యాత్రలు సాగించాయి. గోడలపై యుద్ధ వ్యతిరేక నినాదాలు వ్రాసారు. నిర్బంధ యుద్ధ నిధి వసూళ్ళను, యుద్ధ బాండ్లకు నిర్బంధ వసూళ్ళను వ్యతిరేకించడం జరిగింది. సైన్యంలోకి యువకుల రిక్రూట్‌మెంటుకు వ్యతిరేకంగా జనరల్‌గా ప్రచారం చేయడమే గాక రిక్రూట్‌మెంటు కేంద్రాల వద్దకు వెళ్ళి సైన్యంలో భర్తీ కావడానికి వచ్చిన యువకులలో కూడ ప్రచారం చేయడం జరిగింది. ఈ సంద

ర్భంగా రాష్ట్రంలోని పలుకేంద్రాలలో కమ్యూనిస్టుల అరెస్టులు జరిగాయి. దేశ రక్షణ చట్టం క్రింద కేసులు పెట్టబడి శిక్షలు విధించబడ్డాయి.

పై కార్యక్రమాలతోపాటు ప్రభుత్వం ప్రవేశపెట్టిన నిర్బంధ ప్రొక్యూర్ మెంటుకు వ్యతిరేకంగానూ, నిత్య జీవితావసర వస్తువుల సప్లయి కొరకు పని చేయడం జరిగింది.

## 1942-43

యూరోపులోని పెట్టుబడి దారీ దేశాలను జయించి, బాంబు దాడులతో బ్రిటన్‌ను చితకకొట్టిన హిట్లరు, ప్రపంచాధిపత్యం కోసం సోవియట్ యూనియన్ పై 1941 జూన్ 22 న దాడి చేశాడు. సోవియట్ యూనియన్‌ను ఆక్రమించి అటు తరువాత భారతదేశాన్ని ఆక్రమించాలనేది హిట్లరు పథకం. ఈ పథకం వివరాలు అనేకం ఇటీవల లభించాయి. రెండో వైపు జపాన్, ఆసియా దేశాలైన ఫిలిప్పైను, ఇండోనేషియా, మలయా, బర్మాలను ఆక్రమించి ఈశాన్య భారత దేశం లోనికి చొరబడింది. 1942 ఏప్రిల్ 6 న కాకినాడ, విశాఖపట్నాలపై జపాను బాంబులు వేసింది. బంగాళా ఖాతంలో జపాను యుద్ధ నౌకలు తిరగడం ప్రారంభించాయి. మన దేశంపై జపాన్ ఏ క్షణంలోనైనా పెద్ద ఎత్తున ఆక్రమణకు పూనుకోవచ్చునని భయపడుతున్న రోజులవి యుద్ధ స్వభావంలో మార్పు వచ్చింది.

ఈ కాలంలో భారత కమ్యూనిస్టు పార్టీ, వివిధ రాష్ట్రాలలోని దాని శాఖలు, జాతీయ, అంతర్జాతీయ బాధ్యతలను రెంటెని మేళవించి పోరాడటం జరిగింది. కమ్యూనిస్టు పార్టీ విధానంపై జాతీయవాదులలో తాత్కాలికంగా అపోహలు ఆనాడు ఏర్పడ్డా అటు తరువాత జరిగిన పరిణామాలు కమ్యూనిస్టుపార్టీ ఆనాడు వేసిన ప్రధానమైన అంచనాలు సరైనవని రుజువుచేశాయి.

1934 నుండి కమ్యూనిస్టు పార్టీపై వున్న నిషేధం 1942 జూలై 23న తొలిగింది జైళ్ళలో నిర్బంధించబడ్డవారు క్రమక్రమంగా విడుదలయారు. అప్పటినుండి పార్టీ బహిరంగంగా కార్యాలయములు పెట్టి పనిచేయడం ప్రారంభమైంది. దీనితో పార్టీ నిర్మాణములో నూతన శకము ఆరంభమయింది.

పార్టీ విధానాన్ని సభ్యులకు ప్రజలకు వివరించ వలసిన అవసరం ఏర్పడింది. ఇందుకై **1**942 జూన్ 17 న పార్టీ లీగల్ పత్రిక ప్రజాశక్తి ప్రారంభ సంచిక 2000 ప్రతులతో వెలువడింది.

జాతీయ కాంగ్రెసు 1942 ఆగస్టులో క్విట్ ఇండియా తీర్మానాన్ని ఆమోదించింది. జాతీయ నాయకులందరిని బ్రిటిష ప్రభుత్వం

నిర్బంధించింది కాంగ్రెసు కమిటీలను చట్ట విరుద్ధంగా ప్రకటించింది కాంగ్రెసు ఆఫీసులకు సీలు వేసింది. ఆ విధంగా దేశ ప్రజలను బ్రిటిషు పాలకులు రెచ్చగొట్టారు. ప్రజలు కోపోద్రిక్తులయ్యారు. దేశంలో క్లిష్ట పరిస్థితులు ఏర్పడ్డాయి.

జాతీయ నాయకులను విడుదల చేసి జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పరచాలని 42-45 మధ్య కాలంలో కమ్యూనిస్టు పార్టీ నిర్విరామంగా, విస్తృతంగా ఆందోళన చేసింది.

1942 అక్టోబరులో ఆంధ్ర రాష్ట్ర కమిటీ విస్తృత సమావేశం జరిగింది. ఈ సమావేశం జాతీయ నాయకుల విడుదల ఉద్యమాన్ని విస్తృతంగా కొనసాగించాలని, పార్టీని అన్ని జిల్లాలలోనూ, అన్ని ప్రజా రంగాలలోనూ విస్తృత పరచి ప్రజా పార్టీగా నిర్మించాలని అతి ముఖ్యమైన నిర్ణయాలను చేసింది.

జపాను బాంబుల దాడుల నుండి ప్రజల్ని కాపాడేందుకు ప్రజా రక్షణ దళాలను ఏర్పాటు చేసింది. విమాన దాడుల నుండి రక్షించుకోడానికి అవలంభించవలసిన రక్షణ చర్యలను గురించి శిక్షణా శిబిరాలు పెట్టి ప్రజలకు బోధించడం జరిగింది. మహిళలకు ప్రత్యేక శిక్షణా శిబిరాలు ఏర్పాటు చేసి, శిక్షణ నిచ్చారు. ఒకవేళ జపాను మన దేశాన్ని ఆక్రమిస్తే, వారితో పోరాటానికి సాయుధ గెరిల్లా దళాలను ఏర్పాటు చేయాలని నిర్ణయించి, కార్యకర్తలకు ఆ శిక్షణ యివ్వటం జరిగింది.

1942 నవంబరులో జాతీయ ఐక్యతా వారోత్సవం జరుపబడింది. పార్టీ మొత్తంగా ఈ వారోత్సవంలో కదిలి, ఇంటింటికి తిరిగి జాతీయ ఐక్యతా అవసరాన్ని గురించి వివరించటం, జాతీయ నాయకులను విడుదల చేయాలన్న మహజర్లపై సంతకాలు సేకరించడం జరిగింది. ఆంధ్ర జిల్లాలలో 750 గ్రామాలలో 1,25,000 మంది ప్రజల సంతకాలు సేకరించబడ్డాయి.

అంతేకాదు, యుద్ధం వల్ల నిత్య జీవితావసర వస్తువుల ధరలు విపరీతంగా పెరిగాయి. బ్లాక్ మార్కెటు పెద్ద ఎత్తున సాగుతోంది. 1941 డిసెంబరులోనూ, 1942 ఆగష్టు తరువాత ఆంధ్ర రాష్ట్రంలో తిండి గింజలకు తీవ్ర కొరత ఏర్పడింది. సంఘ వ్యతిరేక శక్తులు ఆహార ధాన్యాలను దాచివేసి, ధరలు పెంచేసారు. జాతీయ సంక్షోభానికి, ఆహార సంక్షోభం కూడా తోడైంది. కొన్ని పట్టణాలలో తిండి గింజల దోపిళ్లు కూడ జరిగాయి. ఈ పరిస్థితులలో పార్టీ సభ్యులు పట్టణాలలో చౌక డిపోలకై ఆందోళన చేసారు దాదాపు అన్ని పట్టణాలలోనూ, చౌక డిపోలు తెరిపించడంలో కమ్యూనిస్టులు కృతకృత్యులయ్యారు 1942 వ సంవత్సరం కరువు రోజుల్లో వ్యవసాయ కూలీలకు రైతులచేత ఉచితంగా ధాన్యం యిప్పించడానికి కృషి చేసారు. కరువు రోజుల్లో గ్రామాలు ఆవిధంగా దోపిళ్ళకు

గురికాకుండా కాపాడారు. బజార్లో బట్టలు, ఎరువులు, వ్యవసాయ పనిముట్లు, కిరస నాయిలు వగైరా దొరకడం లేదు. బ్లాక్ మార్కెటుకు వ్యతిరేకంగా ప్రజలను సమీకరించి ఉద్యమాన్ని నడిపి, నిత్య జీవితావసర వస్తువులు, ఎరువులు, వ్యవసాయ పని ముట్లు సప్లయికొరకు కృషి చేయడం జరిగింది. అలాగే అధికోత్పత్తి కొరకు బంజర్లు సాగు చేయడానికై పిలుపు ఇవ్వబడింది. ఆహారధాన్యాలు దాచిన సంఘ వ్యతిరేక శక్తులను పట్టుకోవడం, తిండి గింజలను బయటకులాగి ప్రజలకు సక్రమ ధరలకు పంచడం జరిగింది. ఆహార ధాన్యాలు సక్రమ పంపిణీకై కృషి చేయబడింది.

1943 లో రాయలసీమ జిల్లాలో కరువు రాక్షసి తాండవించి ఆకలి చావులు ప్రారంభమయ్యాయి. రాయలసీమ కరువు నివారణకు పార్టీ చాలా కృషి చేసింది. కరువు సహాయక క్యాంపుల దగ్గర పని చేయడానికి 23 మంది వలంటీర్లను 6,000 రూపాయలను పంపింది. అలాగే ఉత్తర విశాఖలో (శ్రీకాకుళం జిల్లా) వ్యాపించిన క్షామ - నివారణకు 'క్షామ నివారణ కమిటీ'ని ఏర్పాటు చేసింది. డబ్బును, మందులను వసూలు చేసి పంపింది. వలంటీర్లను కూడా పంపింది. అధికాహారోత్పత్తికి, బంజరు భూముల పట్టాల కొరకు పార్టీ, ప్రజా సంఘాలు కృషి చేసాయి.

## 1934-42 మధ్య జిల్లాల్లో పార్టీ విస్తరణ

1934-36 సంవత్సరాల మధ్య కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి, నెల్లూరు జిల్లాలలో మాత్రమే పార్టీ సెల్సు కొన్ని ఏర్పడ్డాయి. అటు తర్వాత తూర్పు గోదావరి, విశాఖ (అంటే ఈనాటి విశాఖ, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలు) జిల్లాలకు పార్టీ వ్యాపించింది. 1940-42 మధ్య అనంతపురం, కడప, చిత్తూరు, కర్నూలు జిల్లాలకు వ్యాపించింది. అలాగే 1940-42 మధ్య కాలములో హైదరాబాదు స్టేట్‌లోని తెలంగాణా జిల్లాలకు కూడా పార్టీ వ్యాపించింది ఈ విధంగా 1943 జూలైలో జరిగిన మూడవ రాష్ట్ర పార్టీ మహాసభ నాటికి దాదాపు తెలుగునాడులోని అన్ని జిల్లాలకు పార్టీ విస్తరించింది. అయితే పార్టీ నిర్మాణం దాని వ్యాప్తి కృష్ణా, గుంటూరు, ఉభయ గోదావరి జిల్లాలలో వున్నంతగా మిగతా జిల్లాలలో లేదు.

1934 లో కల్వపూడి గ్రామంలో కృష్ణా జిల్లాలోని కమ్యూనిస్టులు సమావేశమయ్యారు. ఈ సమావేశంలో కొసరాజు శేషయ్యగారు కార్యదర్శిగా జిల్లా ఆర్గనైజింగు కమిటీ ఏర్పాటైంది. 1936 నాటికి జిల్లా మొత్తం మీద 12 మంది కమ్యూనిస్టు పార్టీ సభ్యులు వున్నారు. 2 వ ప్రపంచ యుద్ధ ప్రారంభం

తరువాత 1939 చివరిలో జిల్లా కమిటి పునర్నిర్మాణం జరిగింది. కృత్తివెంటి కుటుంబరావు, కంఠంనేని చలపతిరావు, కొండపల్లి సీతారామయ్య చలసాని జగన్నాధరావు గార్లతో పునర్నిర్మించబడ్డ కమిటీకి కడియాల గోపాలరావు కార్యదర్శిగా వున్నారు. 942 చివరినాటికి కృష్ణా జిల్లాలోని అన్ని తాలూకాలకు పార్టీ విస్తరించింది. గన్నవరం, దివి, గుడివాడ తాలూకాలు పార్టీకి బలమైన కేంద్రాలుగా రూపొందినాయి. 1943 జూన్‌లో జిల్లా మహాసభ జరిగేనాటికి 1561 మంది పార్టీ సభ్యులు వున్నారు. ఈ మహాసభలో కంఠంనేని చలపతిరావు కార్యదర్శిగా నూతన కమిటీ ఎన్నుకోబడింది.

1935 ఏప్రిల్‌లో గుంటూరులో జరిగిన గుంటూరు జిల్లా సమావేశంలో పోలేపెద్ది నరసింహమూర్తి కార్యదర్శిగా 5 గురితో జిల్లా కమిటీ ఏర్పాటైంది. 1940 ఏప్రిల్‌లో 2 వ మహాసభ రహస్యంగా జరిగింది. దీనికి 6 తాలూకాలనుండి 70 మంది హాజరయ్యారు. మాకినేని బసవపున్నయ్య కార్యదర్శిగా జిల్లా కమిటీ ఏర్పాటైంది. 1943 జూలైలో జరిగిన జిల్లా తృతీయ మహాసభ నాటికి జిల్లాలోని 9 తాలూకాలకు పార్టి విస్తరించింది. అప్పటికి 400 మంది పార్టీ సభ్యులు, 500 మంది దాకా సానుభూతి సభ్యులు ఏర్పడ్డారు.

పశ్చిమ గోదావరి జిల్లాలో 1934 లో భీమవరంలో మార్క్సిస్టు భావాలు గలిగిన యువకుల సమావేశం జరిగింది. దీనికి పుచ్చలపల్లి సుందరయ్య హాజరయ్యారు కలిదిండి సుబ్రహ్మణ్యంరాజు కార్యదర్శిగా, ఉద్ధరాజు రామం, గారపాటి సత్యనారాయణ, తనికెళ్ల వెంకటచలపతి, అల్లూరి సత్యనారాయణ రాజు సభ్యులుగా జిల్లాలో మొదటి కమ్యూనిస్టు యూనిట్ ఏర్పడింది. ఇదే జిల్లా ఆర్గనైజింగు కమిటీగా పని చేసింది. 1938 లో అనారోగ్య కారణాలవల్ల సుబ్రహ్మణ్యరాజు జిల్లా పార్టీ కార్యవర్గం నుండి తప్పుకున్నారు. ఉద్ధరాజు రామం ఆ స్థానంలో జిల్లా కార్యదర్శిగా రావడం జరిగింది. 1943 జూన్‌లో జరిగిన జిల్లా మహాసభనాటికి పార్టీ నిర్మాణం దాదాపు అన్ని తాలూకాలకు విస్తరించింది. జిల్లా మొత్తంమీద అప్పటికి 300 మంది పార్టీ సభ్యులు, 42 మంది హోల్‌టైమర్లు వున్నారు.

తూర్పు గోదావరి జిల్లాలో మొట్టమొదటగా పార్టిలో చేరిన పందిరి మల్లికార్జునరావు 38 వరకు జిల్లా కమిటీ ఆర్గనైజరుగా పని చేశారు. అటు తరువాత పెన్మెత్స సూర్యనారాయణరాజు జిల్లా ఆర్గనైజరుగా పని చేశారు 42 చివరలో ఇసుగంటి నారాయణరావు కన్వీనరుగా ఆర్గనైజింగు కమిటీ పునర్నిర్మాణం జరిగింది ఇందులో మహీధర జగన్మోహనరావు, బాలాజీ దాసు, చింతం సత్యనారాయణదాసు, సి. సురేంద్రనాథ్ చౌదరి సభ్యులుగా వున్నారు. 43 నాటికి

కాకినాడ, రాజమండ్రి పట్టణాలకు, పిఠాపురం, రామచంద్రాపురం, కొత్తపేట, రాజోలు, తుని, అమలాపురం తాలూకాలకు పార్టీ వ్యాపించింది.

## 1936-42 మధ్య ప్రజారంగాలు

**కార్మికోద్యమం :**

1930 దశకం నాటికి ఆంధ్ర రాష్ట్రము పరిశ్రమల స్థాపనలో బాగా వెనుకబడివుంది గుంటూరు, ఏలూరు, నెల్లిమర్లలోని జూట్ మిల్లులను మినహాయిస్తే అధునాతన పరిశ్రమలు దాదాపు లేవనే చెప్పాలి. 4000 కార్మికులు పనిజేసే పొగాకు ఫ్యాక్టరీ చీరాలలో ఒక్కటే వున్నది. రైల్వే, ఓడరేవు కారిక్మలు వున్నారు. మిగతావన్నీ బియ్యం, నూనె మిల్లులు మాత్రమే. ముద్రణాలయాలు అన్ని పట్టణాలలోనూ వచ్చాయి. అందువల్ల కార్మికులలో పనిచేయడం అంటే జూట్ మిల్లు కార్మికులను, ప్రెస్ కార్మికులను, బియ్యం, నూనె మిల్లు కార్మికులను, రైల్వే, ఓడరేవు కార్మికులను సంఘటితపర్చడం మాత్రమే 30 దశకం చివరకు గాని సిమెంటు మిల్లు, చక్కెర మిల్లులు స్థాపించబడలేదు.

1934-35 సంవత్సరాలలో కమ్యూనిస్టు పార్టీలోకి వచ్చిన ముఖ్యులు కార్మికుల మధ్య పనిచేయడానికే ముందుగా పూనుకున్నారు. కమ్యూనిస్టు పార్టీపై నిషేధం వుండటం వల్ల వీరు బహిరంగంగా పనిచేయడానికి అవకాశం లేదు. అందువల్ల వివిధ పట్టణాలలో కూలి రక్షణ సమితులను ఏర్పాటు జేసి, వారి కోర్కెలపై కార్మికులను సంఘటితపరిచి, వారిమధ్య పనిచేయడం ప్రారంభించారు. కూలి రక్షణ సమితులను పార్టీ కార్యకలాపాలకు బహిరంగ వేదికలుగా ఉపయోగించుకోవటం జరిగింది.

కూలి రక్షణ సమితులు ఆంధ్ర రాష్ట్రంలోని దాదాపు అన్ని ప్రధాన పట్టణాలలోనూ ఏర్పాటు చేయటం జరిగింది. అయితే వీటిని కూడా ప్రభుత్వం నిషేధించడంతో ఆ లక్ష్యానికి దెబ్బ తగిలింది. 1936 ప్రారంభం నుండి ఐక్య సంఘటనా ఎత్తుగడలు అవలంభించడంతో కాంగ్రెసులోనూ, కాంగ్రెసు సోషలిస్టు పార్టీలోనూచేరి పనిచేయడం జరిగింది. దీనితో పరిస్థితిలో పూర్తి మార్పువచ్చింది. కొన్ని ప్రదేశాలలో అతివాద కాంగ్రెసువాదులు, సోషలిస్టులు, కమ్యూనిస్టులు కలిసి పనిచేయడం జరిగింది. ఎక్కువచోట్ల కమ్యూనిస్టులు వేరుగా కార్మికులమధ్య పనిచేసి, కార్మిక సంఘాలను నిర్మించటం జరిగింది. వారి కోర్కెలపై పలు ప్రదేశాలలో సమ్మెలు జరిగాయి.

ప్రెస్ కార్మికులు, బియ్యం, నూనె మిల్లు కార్మికులు, జనపనార మిల్లు కార్మికులు, జట్టు కార్మికులు, లాగుడు బళ్ల కార్మికులు మున్సిపల్ పారిశుధ్య

కార్మికులు, రిక్షా ఒళ్ల కార్మికులు, పీచు కార్మికులు, రేవు, స్టీమ్ డోర్ కార్మికులు, పొగాకు, సిమెంటు కార్మికుల మధ్య పనిచేసి, ఆయా పరిశ్రమలోని కార్మికులను స్థానికంగా కార్మిక సంఘాలలో నిర్మాణం చేయడం జరిగింది అలాగే ఒక్కొక్క పరిశ్రమకు చెందిన కార్మిక సంఘాలతో రాష్ట్ర యూనియన్నును ఏర్పాటు చేయడం జరిగింది.

రాష్ట్రములో కాంగ్రెసు మంత్రివర్గం ఏర్పడిన తరువాత అనేక పట్టణాలలో కార్మిక సంఘాలు సమ్మెలు జేసి తమ హక్కులను కొంతవరకు సాధించుకొన్నాయి. ఈ కాలంలో కార్మిక సంఘాలు బలపడ్డాయి.

రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో తీవ్ర నిర్బంధ విధానం సాగుతున్నా పెరిగిన ధరలకు అనుగుణ్యంగా అధిక ధరల అలవున్సులు, జీతభత్యాలు పెంచాలని కోరుతూ కార్మిక సంఘాలు సమ్మెలు చేసాయి.

మొత్తంమీద చెప్పాలంటే 1936 - 42 మధ్య కార్మికులలో కమ్యూనిస్టులకు బలమైన స్థానం ఏర్పడింది. ఈ కాలంలో కార్మికోద్యమం విస్తరించి బలపడింది.

## విద్యార్థి ఉద్యమం

1920-21 సహాయ నిరాకరణ ఉద్యమ సమయంలో భారత జాతీయ కాంగ్రెసు పాశ్చాత్య విద్య నేర్పే పాఠశాలలను బహిష్కరించవలసిందిగా విద్యార్థులకు పిలుపు యిచ్చింది. ఆ సందర్భంగానే దేశంలోని అనేక ప్రాంతాలలో జాతీయ విద్యాలయాలు నెలకొల్పబడ్డాయి.

సహాయ నిరాకరణోద్యమ సందర్భంగా విద్యార్థులలో ఏర్పడిన జాతీయ భావాలు, సామ్రాజ్యవాద వ్యతిరేకత స్వాతంత్ర్య కాంక్ష ఆంధ్ర విద్యార్థులను కూడ పోరాటరంగంలోకి తీసుకు వచ్చాయి. ఈ పూర్వ రంగంలోనే 1920 లో ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభ జరిగి రాష్ట్ర విద్యార్థి సంఘం ఏర్పడింది. 1936 నాటికి 13 మహాసభలు జరిగాయి. కాని ఈ దశలో ఉద్యమం కొన్ని తీర్మానాలు చేయడం వరకే పరిమితమైంది. పటిష్టమైన నిర్మాణం ఏర్పడలేదు.

1936 ప్రథమ పార్టీ మహాసభ తరువాత కమ్యూనిస్టులు విద్యార్థులలో పనిచేయడం ప్రారభించారు. అప్పటినుండి విద్యార్థి ఉద్యమం తిరిగి విప్లవ పట్టాలపై పునర్నిర్మించబడింది. స్పష్టమైన కార్యక్రమం రూపొందింది. 1937లో గుంటూరులో 15వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభను కమ్యూనిస్టు పార్టీలో చేరిన లేదా కమ్యూనిస్టు పార్టీ వైపు ఆకర్షితులైన విద్యార్థులు నాయకత్వం వహించి జరిపారు. రాష్ట్ర విద్యార్థి ఉద్యమం గుంటూరు మహాసభతో ముఖ్య మలుపు తీసుకున్నది. ఆ మహాసభ విద్యార్థి ఉద్యమంలో ఒక మైలురాయి అని చెప్పవచ్చును.

విద్యార్థులను పబ్లిక్ పరీక్షలకు పంపకుండా నిలిపివేసి డిటెన్షన్ విధానానికి వ్యతిరేకంగానూ, విద్యార్థులు రాజకీయాలలో పాల్గొనరాదన్న బానిస విద్యా నిబంధనలకు వ్యతిరేకంగానూ, దేశ స్వాతంత్ర్యం కోసం, ప్రత్యేకాంధ్ర రాష్ట్రం కోసం విద్యార్థులు జరిపిన చరిత్రాత్మక సమ్మెల వెల్లువ గుంటూరు మహాసభ తోనే ప్రారంభమైంది.

15 వ రాష్ట్ర విద్యార్థి మహాసభ 1938లో విజయవాడలోనూ, 16వ మహాసభ కాకినాడలోనూ జరిగాయి. 16వ మహాసభ జరుగుతుండగానే సెప్టెంబరు 3న రెండవ ప్రపంచ యుద్ధం ప్రకటించబడింది, దానితో విద్యార్థి సంఘాలపైన ఇతర ప్రజా సంఘాలపైన, తీవ్రనిర్బంధ విధానం ప్రారంభమైంది. సామ్రాజ్య వాద యుద్ధ వ్యతిరేక ఉద్యమంలో విద్యార్థులు అగ్రభాగాన నిలబడ్డారు.

తీవ్ర నిర్బంధ విధానం కొనసాగుతున్న దశలోనే 17వ రాష్ట్ర మహాసభ 1940 నవంబరులో గుంటూరులో జరిగింది.

18 వ రాష్ట్ర విద్యార్థి వైజ్ఞానిక సభలు విజయవాడలో 1941 లో నవంబరులో జరిగాయి.

ఈ దశలో విద్యార్థి ఉద్యమం ఆంధ్ర ప్రాంతంలోని అన్ని జిల్లాలకు విస్తరించింది. కాలేజీలకే పరిమితం కాకుండా ఉన్నత విద్యాలయాలకు కూడ విస్తరించింది. విద్యార్థి ఉద్యమం ఒక బలమైన సామ్రాజ్య వ్యతిరేక, ప్రగతిశీల, ప్రజాతంత్ర ఉద్యమంగా రూపొందింది. పార్టీ నిర్వహించిన రాజకీయ పాఠశాలలకు, మార్క్సిస్టు అధ్యయన తరగతులకు పెద్ద సంఖ్యలో విద్యార్థులు హాజరయ్యారు. మార్క్సిస్టు విజ్ఞానం పొందిన విద్యార్థులు వందల సంఖ్యలో పార్టీ సభ్యులుగా, కార్యకర్తలుగా ముందుకు వచ్చారు. ఇలా వచ్చిన వారిలో కొందరు భారత కమ్యూనిస్టు పార్టీలోనూ, మార్క్సిస్టు పార్టీలోనూ ప్రధాన బాధ్యతలలో వున్నారు.

విద్యార్థి ఉద్యమంలో కమ్యూనిస్టులు ప్రముఖ పాత్ర వహించారు. అయితే విద్యార్థి సంఘాలలో కమ్యూనిస్టులేగాక, సోషలిస్టులు, కాంగ్రెసు వాదులు కూడా వున్నారు. సోవియట్ యూనియన్‌పై హిట్లరు దాడి తరువాత ప్రపంచ యుద్ధ స్వభావంలో మార్పు వచ్చింది. దీనిపై అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్ తీసుకున్న వైఖరితో విభేదించి కాంగ్రెసు వారు విద్యార్థి సంఘాల నుండి వేరుగా పోయి జాతీయ విద్యార్థి సంఘాన్ని ఏర్పాటు చేయడం జరిగింది. ఆంధ్ర రాష్ట్రంలో కూడ కాంగ్రెసువాదులుగావున్న విద్యార్థి నాయకులు జాతీయ విద్యార్థి సంఘాన్ని 1942 లో ఏర్పాటు చేసారు.

# యువజనోద్యమం

జాతీయ కాంగ్రెసు 1920-22 లో సాగించిన సహాయ నిరాకరణ ఉద్య మంలోనూ, 1930 - 34 శాసనోల్లంఘన ఉద్యమంలోనూ ఆంధ్ర రాష్ట్రంలోని యువకులు ఎక్కువగానే పాల్గొన్నారు. కాని రెండు పర్యాయాలు ఉధృతంగా సాగుతున్న ఉద్యమాన్ని కాంగ్రెసు నాయకత్వం అకస్మాత్తుగా ఆపడంతో వాటిలో పాల్గొన్న యువకులలో అతివాదులలో తీవ్రమైన నిరుత్సాహం, అసంతృప్తి ఏర్పడ్డాయి.

1930కి ముందు, ఆటు తరువాత కాలంలో ఆంధ్ర రాష్ట్రంలో అక్క డక్కడ స్థానిక యువజన సంఘాలు ఏర్పడ్డాయి. కాని వాటిని సమన్వయపరచి నడిపే జిల్లా, రాష్ట్ర సంఘాలు ఏర్పడలేదు. స్థానికంగా ఏర్పడ్డ సంఘాలకు ఒక స్పష్టమైన కార్యక్రమం కూడాలేదు.

1934లో ఆంధ్రలో సోషలిస్టుపార్టీ ఏర్పడిన తరువాత యువజన సంఘా లకు ఒక రూపం యివ్వడానికి ప్రయత్నించడం జరిగింది. 1935 జనవరిలో కాంగ్రెసు సోషలిస్టుల చొరవ, కృషితో విశాఖపట్నంలో ప్రథమ రాష్ట్ర యువ జన మహాసభ జరిగింది.

తిరిగి 1936 జనవరిలో కాకినాడలో రెండవ రాష్ట్ర మహాసభ జరిగింది. ఈ మహాసభ జరిగిన సందర్భంలోనే ఆంధ్ర రాష్ట్ర ప్రథమ కమ్యూనిస్టు మహా సభ కూడా రహస్యంగా రాత్రివేళ జరిగిందనే విషయాన్ని ఇంతకుముందే ప్రస్తా వించాము. పగలు యువజన మహాసభలో పాల్గొన్న కమ్యూనిస్టు యువకులు రాత్రి పార్టీ రహస్య సమావేశం జరిపారు.

కాకినాడ యువజన మహాసభలోనే యువజనులకు ఒక కార్యక్రమం రూపొందించబడింది. సంఘ నిర్మాణాన్ని అన్ని జిల్లాలకు వ్యాపింప జేయాలని నిర్ణయించబడింది. కాకినాడ యువజన మహాసభ నాటినుండి కమ్యూనిస్టులు యువ జన సంఘాలలో పనిజేస్తూ, వాటివ్యాప్తికి కృషిచేసారు. వాటిని క్రియాశీల సంఘా లుగా రూపొందించారు.

తృతీయ రాష్ట్ర యువజన మహాసభ 1937 మార్చిలో బందరు పట్టణంలో జరిగింది. 1936-1939 సంవత్సరాల మధ్య యువజనోద్యమం ఆంధ్ర ప్రాంత జిల్లాలన్నింటికి విస్తరించింది. జిల్లా యువజన మహాసభలు జరిగాయి. తాలుకాలు, జిల్లాలలో యువజన సంఘాలకు నిర్మాణ రూపం ఏర్పడింది. కోస్తా జిల్లాలలో సంఘ నిర్మాణం, ప్రాథమిక సంఘాల నిర్మాణం కొంతవరకు పటిష్ఠంగా వున్న

వని చెప్పవచ్చు. కాగా రాయలసీమ జిల్లాలలో సంఘ నిర్మాణంలో అంత పటిష్ఠత ఏర్పడలేదు. సత్వర స్వాతంత్ర్య సాధన కొరకు పోరాడుటంతో పాటు, యువ జనులకు సంఘ సేవలో తర్ఫీదు యివ్వడం, ఆటల పోటీలు నిర్వహించడం, నూతన సాంఘిక విధానం కొరకు పోరాడటం, యువజనులలో విప్లవ చైతన్యం కల్గించడం యువజన సంఘాల ప్రధాన కర్తవ్యాలుగా వుండేవి.

1939 జూన్‌లో మదనపల్లిలో రాయలసీమ యువజన మహాసభ జరిగింది.

1939 సెప్టెంబరులో ప్రారంభమైన రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో యుద్ధాన్ని వ్యతిరేకిస్తూ పట్టణాలలోనూ, గ్రామాలలోనూ యువజన సంఘాలు ప్రచారం చేసాయి. యుద్ధ నిధి వసూళ్లను, నిర్బంధ ధాన్య ప్రొక్యుర్‌మెంటుకు వ్యతిరేకంగాను రైతు సంఘాలతో పాటుగా యువజన సంఘాలు కూడ పని చేసాయి.

యువజన సంఘాలు, 1942 సంవత్సరంలో ఫాసిస్టు ప్రమాదానికి వ్యతిరేకంగా విస్తృతంగా ప్రచారం చేయడం జరిగింది. ప్రజలకు విమానదాడుల నుండి రక్షించుకొనే పద్ధతులు, గాయపడిన వారికి చేయవలసిన ప్రథమ చికిత్సా విధానాలు, ప్రజారక్షణ శిబిరాల ద్వారా నేర్పడం జరిగింది. ఈ కాలంలోనే వైజ్ఞానిక శిక్షణా శిబిరాలు పెట్టి, సాంస్కృతిక కార్యక్రమాల ద్వారా రాజకీయ ప్రచారం సాగించడం జరిగింది. 1942 ఆగష్టులో నిర్బధించబడ్డ జాతీయ నాయకుల విడుదలకై విస్తృతంగా ఉద్యమం సాగించబడింది.

## వ్యవసాయ కూలీ ఉద్యమం

1930-32 ఆర్థిక మాంద్య కాలంలో వ్యవసాయ కూలీల పరిస్థితులు దుర్భరంగా తయారయ్యాయి. పిచ్చిముంతలు, తక్కువ కూళ్లు, సవానాగులు, సరినాగులు, సాంఘిక పీడన, అంటరానితనం మొదలగు సమస్యలతో వ్యవసాయ కూలీలు ఆర్థిక, సాంఘిక పీడనకు గురి అయ్యారు. జాతీయ కాంగ్రెసు నిర్వహించిన ఉద్యమాలు ఈ తరగతి ప్రజానీకాన్ని ఎక్కువగా కదిలించలేదు. ఈ వర్గాను స్వాతంత్ర్యోద్యమంలోకి తీసుకురావడానికి చేసిన ప్రయత్నాలు కూడ లేవు. అయితే కొన్ని కుల సంఘాలు మాత్రం అక్కడక్కడ ప్రారంభమయ్యాయి.

ఎటు తిరిగి 1933-34 సంవత్సరాల నుండి వ్యవసాయ కూలీలను సంఘటిత పరచడానికి ప్రయత్నాలు జరిగాయి. కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్య తన స్వగ్రామమైన అలగానిపాడు, ఆ చుట్టుప్రక్కల గ్రామాలలో వ్యవసాయ కూలీలలో పని చేయడంతో ఆంధ్ర రాష్ట్రంలో వ్యవసాయ కూలీలను సంఘటితపరచడానికి కృషి ప్రారంభమయిందని చెప్పవచ్చు.

1934 లో అలగానిపాడు వ్యవసాయ కూలీ సంఘం ఏర్పడింది. దీనికి ఒక నిబంధనావళి కూడా తయారు చేయబడింది. 1935 లో దావులూరులోనూ, 1936 లో గుంటూరు జిల్లా పల్లెకోన ప్రాంతంలోనూ, కృష్ణా జిల్లా వీరులపాడు గ్రామంలోనూ వ్యవసాయ కూలీల సంఘాలు పెట్టే కృషి జరిగింది.

1937 లో నెల్లూరులో వెన్నెలకంటి రాఘవయ్యగారి చొరవతో ఆంధ్ర రాష్ట్ర వ్యవసాయ కూలీ సంఘం అనే పేరుతో రాష్ట్ర సంఘం ఒకటి ఏర్పడింది. కాని ఇది పని చేయలేదు

1936 నుండి కమ్యూనిస్టులు ప్రధానంగా వ్యవసాయ కూలీల మధ్య పని చేస్తూ, వారిని సంఘటిత పరచడానికి ప్రయత్నించారు. ఈ కృషి ఫలితంగానే నెల్లూరు, గుంటూరు, ఉభయ గోదావరి, కృష్ణా జిల్లాలలో 39 సంవత్సరం నాటికి జిల్లా సంఘాలు, కొన్ని తాలూకా సంఘాలు ఏర్పడ్డాయి. 1938, 39 సంవత్సరాలలో వేతన సమస్యపై నెల్లూరు, తూర్పు గోదావరి, కృష్ణా జిల్లాలలో సమ్మెలు జరిగాయి.

1938 లో జరిగిన ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ ద్వితీయ మహాసభలో వ్యవసాయ కూలీ ఉద్యమాన్ని గురించి, రైతు-వ్యవసాయ కూలీ ఐక్యతను గురించి ఒక ముఖ్యమైన పత్రం ఆమోదించబడింది. వ్యవసాయ కూలీలలో పని చేయడానికి తగు సూచనలు ఈ పత్రంలో యివ్వబడ్డాయి.

రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో ముఖ్య నాయకులు కొందరు జైళ్ళలో నిర్బంధించబడినా మరి కొందరు రహస్యంగా వుండి వుద్యమాన్ని నడిపారు. వ్యవసాయ కూలీ సంఘాలు కృష్ణా, పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి, నెల్లూరు జిల్లాలలో 1940-41 సంవత్సరాలలో ఆకలియాత్రలు నిర్వహించాయి.

ప్రజా యుద్ధ కాలంలోనే బెంగాలు, రాయలసీమ, ఉత్తర విశాఖ జిల్లాలలో ఘోరమైన కరువులు వచ్చాయి. అధికాహారోత్పత్తిజేసి కరువు వాతపడ్డ ప్రజలకు ఆహార ధాన్యాలు అందించడం దేశభక్తియుతమైన నిర్మాణ కార్యక్రమం. ఆంధ్ర రాష్ట్రంలోని రైతు, వ్యవసాయ కూలీ సంఘాలు ఈ కర్తవ్య నిర్వహణను పూనుకున్నాయి. బంజరు భూముల సాగుకు, ఆహార ధాన్యాలు, ఇతర నిత్య జీవితావసర వస్తువులు దాచి వేసిన తిండి దొంగలను సంఘ విద్రోహ శక్తులను పట్టుకొని, ఆ వస్తువులు కంట్రోలు ధరలకు అందించే కార్యక్రమాన్ని ఈ రెండు సంఘాలు జయప్రదంగా నిర్వహించాయి.

ఈ విధంగా 1936-42 మధ్య కాలంలో వ్యవసాయ కూలీలను వారి వర్గ సంఘాలలో సంఘటిత పర్చి, వారి హక్కులకై పోరాడటం జరిగింది. ఆంధ్ర రాష్ట్రంలోని 5 కోస్తా జిల్లాలలో 1942 చివరకు ఈ ఉద్యమానికి కొంత

బలం సమకూరింది. భారత కమ్యూనిస్టు ఉద్యమంలో వ్యవసాయ కూలీల కై మొట్ట మొదటి సారిగా వారి వర్గ సంఘాలను నిర్మించిన ఖ్యాతి, ఘనత ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీదేనని చెప్పవచ్చు.

## రైతు రంగం

ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘం 1928లో ఏర్పడ్డా 1935 నాటికి అది అన్ని జిల్లాలకు విస్తరించలేదు. 1930-34 శాసనోల్లంఘన కాలంలో నాయకులు అరెస్టు కావడంతో సంఘ కార్యకలాపాలు స్తంభించాయి. నిర్మాణరూపం అంతకు ముందు ఉన్నది కూడ దెబ్బతిన్నది.

1934లో ఆంధ్ర రాష్ట్రంలో కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ఏర్పడటం, జైళ్ళ నుండి విడుదలై వచ్చిన అతివాద యువకులు సోషలిస్టు భావాల వైపు మొగ్గడం, కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి, నెల్లూరు జిల్లాలలో కొందరు యువకులు కమ్యూనిస్టు పార్టీలో చేరడంతో తిరిగి రైతు సంఘాలు వర్గ ప్రాతి పదికపై పునరుద్ధరించబడ్డాయి. 1934 డిసెంబరులో విశాఖపట్నంలో 4 వ రాష్ట్ర రైతు మహాసభ జరిగింది. 1935 లో కృష్ణా, పశ్చిమ గోదావరి జిల్లా రైతు సంఘాలు పునరుద్ధరించ-బడ్డాయి. ఆటు తరువాత కొన్ని జిల్లాలలో కూడ రైతు సంఘాలు పునరుద్ధరించ బడ్డాయి అంతకు ముందు ఏర్పడని జిల్లాలో కొత్తగా నిర్మించ బడ్డాయి 1936లో రాష్ట్ర రైతు సంఘం రిజిస్టరు చేయబడింది. 1936లో 5వ రాష్ట్ర మహాసభ 1937లో 6వ రాష్ట్ర రైతు మహాసభలు నిడుప్రోలులోనే జరిగాయి. 1937 మహాసభలో కొమ్మారెడ్డి సత్యనారాయణ మూర్తి అధ్యక్షుడుగా, వలసాని వాసుదేవరావు ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు. కమ్యూనిస్టులు రైతు సంఘాల నిర్మాణంలోనూ, పోరాటాలకు నాయకత్వం వహించడంలోనూ ప్రధాన పాత్ర వహించారు.

1937లో జరిగిన శాసనసభ ఎన్నికలు రాజులు, జమీందార్లు, పెద్ద భూస్వాములతో నున్న జస్టిస్ పార్టీకి, జాతీయ కాంగ్రెసుకు పెద్ద పోరాటంగా జరగటం, అందులో జమీందారీ వర్గం ఓడిపోయి కాంగ్రెసు గెలవడంతో రైతాంగంలో పెద్ద ఊపు ఉత్సాహం వచ్చాయి జమీందార్లు చేస్తున్న దౌర్జన్యాలకు, ఆక్రమాలకు, అధిక శిస్తులకు వ్యతిరేకంగా రైతు రుణ నివారణ కొరకు ఆందో ళన, రైతు పోరాటాలు రాష్ట్రమంతటా ప్రారంభమయ్యాయి.

ఇచ్ఛాపురం నుండి మద్రాసువరకు ఆంధ్రరాష్ట్ర రైతు సంఘం 1937లో నిర్వహించిన సరిత్రాత్మక రైతు రక్షణయాత్ర మూల మూలన వున్న రైతాంగాన్ని మేల్కొలిపింది. సంఘంలోకి సమీకరించడానికి ఎంతగానో తోడ్పడింది.

ప్రకాశం కమిటీ రిపోర్టు ప్రకటించబడిన తరువాత జమీందార్లు పెద్ద ఎత్తున భూములు అన్యాక్రాంతాలకు, అమ్మకాలకు పూనుకోవడం, బకాయీల వసూళ్ళకై వత్తిడి పెట్టడంతో, అనేక జమీలలో రైతులు తమ హక్కులకై పోరాడవలసి వచ్చింది. ఈ పోరాటాలకు కొన్ని ప్రదేశాలలో అతివాద కాంగ్రెసు వాదులు, మరికొన్ని చోట్ల రంగా అనుచరులు నాయకత్వం వహించినా, ప్రధాన నాయకత్వం కమ్యూనిస్టులదేనని చెప్పాలి ఈ కాలంలో వివిధ జిల్లాలలో 1938 లో పీరపల్లిలో 8 వ రాష్ట్ర రైతు మహాసభ జరిగింది. రైతు కార్యకర్త లను తయారుచేయడానికి రైతాంగ విద్యాలయాలు నిర్వహించబడ్డాయి.

ఈ కాలంలో జరిగిన రైతు పోరాటాలలో మునగాల, ముక్త్యాల, చల్లపల్లి, కాళిపట్నం, మందసా మొదలగు పోరాటాలు ప్రధానమైనవి మునగాల, కాళి పట్నం పోరాటాలలో వందలమంది రైతులు, రైతు కార్యకర్తలు సత్యాగ్రహంచేసి జైళ్లకు వెళ్ళారు.

1939 లో రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమవడంతో రైతు ఉద్య మంపై క్రూర నిర్బంధ విధానం అమలుపరచబడింది రైతు నాయకులు ఎందరో జైళ్లలో నిర్బంధించబడ్డారు మరి కొందరు అజ్ఞాతవాసానికి వెళ్ళవలసి వచ్చింది.

యుద్ధము వచ్చిన తరువాత నిర్బంధ యుద్ధ వసూళ్లకు, నిర్బంధ ధాన్య సేకరణ విధానానికి వ్యతిరేకంగానూ, రైతాంగానికి అత్యవసరమైన వస్తువుల సప్లయి కొరకు రైతు సంఘాలు పని చేసాయి. 1936 - 42 కాలంలో రైతు సంఘాలు రాయలసీమ జిల్లాలకు కూడ విస్తరించటం జరిగింది.

నిర్బంధ విధాన కాలంలోనే 1940 ఏప్రియల్‌లో శ్రీకాకుళం జిల్లా పలాసాలో అఖిల భారత రైతు మహాసభ జరిగింది.

1941 జూన్ తరువాత రెండవ ప్రపంచయుద్ధ స్వభావంలో మౌలికమైన మార్పు వచ్చింది. ఫాసిస్టు ప్రమాదాన్ని వ్యతిరేకించడం ప్రధాన కర్తవ్యంగా ముందుకు వచ్చింది. రైతు సంఘ విధానాలలో వచ్చిన మార్పులతో అంగీక రించక కొందరు, మారిన విధానాలను అంగీకరించి కూడా 1942 ఆగస్టు పోరాటం తరువాత మరి కొందరు అఖిల భారత రైతు సంఘం నుండి విడి పోయారు. ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘం 1942 లో రంగాగారి అనుయాయుల చేతులలో వుండటంవల్ల, దానిని ఆదనుగా తీసుకుని రైతు సంఘాలనే వారు రద్దు చేసారు.

కమ్యూనిస్టు పార్టీ ఈ విచ్ఛిన్నాన్ని ఎదుర్కొని. రాష్ట్ర, జిల్లా సంఘాలను పునరుద్ధరించి రైతు ఉద్యమాన్ని ముందుకు తీసుకెళ్లింది 1943 లో రాష్ట్ర రైతు సంఘాన్ని పునర్నిర్మాణం చేసింది.

1936 - 42 సంవత్సరాల మధ్య రైతు ఉద్యమం ఆంధ్ర ప్రాంతంలో బాగా విస్తరించి బలపడింది కమ్యూనిష్టులు, రంగా అనుయాయులు విచ్ఛిన్నాన్ని ఎదిరించి, పోరాడి, రైతు ఉద్యమాన్ని ముందుకు తీసుకెళ్లడం జరిగింది. 1944లో విజయవాడలో జరిగిన అఖిల భారత రైతు మహాసభను పెద్ద ఎత్తున జయప్రదం చేయడం జరిగింది దీనికి లక్షమంది రైతులు, ఇతర వర్గాల ప్రజలు వచ్చారు ఆంధ్రలో ఆనాటి రైతు ఉద్యమ బలాన్ని అంచనా వేయడానికి అఖిల భారత రైతు మహాసభ తోడ్పడుతుంది

## తృతీయ పార్టీ మహాసభ

1943 జూలై 8-15 తేదీలలో పార్టీ తృతీయ మహాసభ విజయవాడలో జరిగింది. 1940 లో 700 మంది సభ్యులు 450 మంది కాండిడేటు సభ్యులతో నున్న పార్టీ సభ్యత్వం 1942 లో 1176 కు, 1943 తృతీయ పార్టీ మహాసభ నాటికి 3260కి పెరిగింది. పూర్తికాలం విప్లవోద్యమానికి పనిచేసే కార్యకర్తలు 650 వరకు వున్నారు. ఈ కాలంలోనే అనేకమంది పార్టీ ముఖ్యులు, సభ్యులు ఎంతో ఆదర్శాన్ని చూపుతూ, తమ యావదాస్తిని అమ్మి పార్టీకి విరాళంగా యిచ్చారు. 2000 ప్రతులతో ప్రారంభమైన పార్టీ వారపత్రిక ప్రజాశక్తి సర్క్యులేషన్ సంఖ్య 9500 వరకు పెరిగింది. రాష్ట్రంలోని 1900 గ్రామాలకు వెళ్ళు తుండేవి. పార్టీ నిధికై 2 లక్షల రూపాయలు వసూలు చేయబడ్డాయి.

**ప్రజా సంఘాలతో జరిగిన అభివృద్ధి**

కమ్యూనిస్టు పార్టీ 3 వ రాష్ట్ర మహాసభ జరిగే నాటికి ఆంధ్ర ప్రాంతంలో వివిధ ప్రజా సంఘాల అభివృద్ధి ఈ విధంగా ఉంది.

రైతు సంఘంలో 70 వేల మంది సభ్యులుగా ఉండగా, వ్యవసాయ కార్మిక సంఘంలో 24 వేల మంది సభ్యులు వున్నారు. రైల్వే కార్మిక సంఘం లోని 10 వేల మంది సభ్యులను కలుపుకుని కార్మిక సంఘంలో మొత్తం 24 వేల మంది సభ్యులున్నారు.

పార్టీ ఎంతగా విస్తరించిందో ఈ వివరాలు తెలియజేస్తాయి. తృతీయ పార్టీ మహాసభ బహిరంగంగా జరిగిన ప్రథమ మహాసభ దీనిలో అప్పటివరకు జరిగిన కార్యక్రమాలను సమీక్షించుకొని పార్టీ విస్తరణకు, ప్రజారంగాల విస్తరణకు అవసరమైన కార్యక్రమం రూపొందించబడింది.

ఈ మహాసభలో చండ్ర రాజేశ్వరరావు కార్యదర్శిగా 7 గురితో నూతన రాష్ట్ర కమిటీ ఏర్పడింది పుచ్చలపల్లి సుందరయ్య, మద్దుకూరి చంద్రశేఖర రావు, మాకినేని బసవపున్నయ్య, చలసాని వాసుదేవరావు కమిటీ సభ్యులుగానూ, కడియాల గోపాలరావు. యస్ వి కె ప్రసాద్ కాండిడేటు సభ్యులుగాను ఈ మహాసభలో ఎన్నుకోబడ్డారు.

# తెలంగాణాలో కమ్యూనిస్టు పార్టీ ప్రారంభం
## (II)

1930 దశకంలో జాతీయ అంతర్జాతీయ రంగాలలో శీఘ్రగతిని అనేక మార్పులు జరిగాయి. పెట్టుబడిదారీ ప్రపంచం తీవ్రమైన ఆర్థిక మాంద్యంలో చిక్కుకొని సతమతమవుతుండగా సోషలిస్టు దేశమైన సోవియట్ యూనియన్ సోషలిస్టు సమాజ నిర్మాణంలో జయప్రదంగా పురోగమించటం, నూతన రాజ్యాంగమును అమలు జరపటం యొక్క ప్రభావం ప్రపంచమంతటా కార్మిక, కర్షకులపైన, ముఖ్యంగా మేధావి వర్గం, విద్యార్థులపైన పడింది. మన దేశంలో కూడా స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్న నాయకులపైన ముఖ్యంగా యువజనులు, విద్యార్థులపైన పై ఘటనల ప్రభావం బాగా పడింది. 1936 లో భారత జాతీయ కాంగ్రెసు అధ్యక్ష పదవికి ఎన్నుకోబడిన పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ పెరుగుతున్న ఫాసిస్టు ప్రమాదాన్ని గురించి సోషలిజాన్ని గురించి తన విస్తృత పర్యటనలో ఇచ్చిన ఉపన్యాసాలు యువకులను ఎంతగానో ఆకర్షించాయి.

జర్మనీలో హిట్లర్ నాయకత్వాన నాజీశక్తుల పెరుగుదల, స్పెయిన్ ప్రజా ప్రభుత్వంపై ఫ్రాంకో దాడి, అబిసీనియాపై (ఇథోపియా) ముస్సోలినీ దాడి, అంతకంతకు పెరుగుకున్న ఫాసిస్టు ప్రమాదము ప్రజాస్వామ్య, ప్రగతిశీల శక్తులను ఆందోళన పరిచాయి.

బ్రిటీషు ప్రభుత్వం సాగించిన మీరట్ కుట్రకేసు నుండి విడుదలైన కమ్యూనిస్టు నాయకులు 1934 లో తిరిగి భారత కమ్యూనిస్టు పార్టీకి కేంద్ర సంఘాన్ని ఏర్పాటుజేసారు సోషలిస్టు, కమ్యూనిస్టు సాహిత్యం, బ్రిటీషు పాలకులు, దాని తొత్తులు నిజాం నవాబు లాంటి సంస్థానాధీశులు పెట్టిన అనేక విధి నిషేధాల నుండి తప్పించుకొని బ్రిటీషు రాష్ట్రాలలోనూ, సంస్థానాలలోనూ రహస్యంగా ప్రచారమవుతూ వచ్చింది.

హైదరాబాదు సంస్థాన ప్రజానీకం పౌరసత్వ హక్కుల కొరకు తమతమ భాషా సంస్కృతి, సాహిత్యాభివృద్ధికి కృషి చేయడం ప్రారంభించింది.

తెలంగాణా ప్రాంతంలో 1921 లో ఆంధ్ర జన సంఘంగా ప్రారంభమైన సంస్థ, 1930 లో ఆంధ్ర మహా సభగా పరిణామం చెందింది. ఆంధ్ర మహా సభ పౌరసత్వ హక్కుల కొరకు, తెలుగు భాషా వికాసానికి రైతాంగ సమస్యలపైన

ప్రజాతంత్ర హక్కులకొరకు పనిజేస్తూ వచ్చింది. క్రమంగా ఈ సంస్థ రాజకీయ హక్కులకై కూడా పోరాడటం జరిగింది. అలాగే మరట్వాడా ప్రాంతములో మహారాష్ట్ర పరిషత్ 1931 లో ఏర్పడింది. కన్నడ ప్రాంతములో కన్నడ పరిషత్తు 1930 లో ఏర్పడి కన్నడ ప్రజల మధ్య పనిచేసింది. క్రమంగా ఆంధ్ర మహాసభ శాఖలు, జిల్లా, తాలూకా స్థాయిలోకూడా ఏర్పడ్డాయి.

1937 ఎన్నికలలో బ్రిటిషు ఇండియాలో కాంగ్రెసుకు 8 రాష్ట్రాలలో అఖండ విజయం చేకూరింది. హైదరాబాదు సంస్థానానికి చుట్టూవున్న మద్రాసు, బొంబాయి, మధ్యప్రదేశ్ రాష్ట్రాలలో కాంగ్రెసు మంత్రి వర్గాలు ఏర్పడ్డాయి. పౌరసత్వ హక్కులు విస్తరింపబడ్డాయి. కొన్ని ప్రజోపయోగ శాసనాలు చేయబడ్డాయి. అనేక రైతు, కూలీ పోరాటాలు చుట్టూ వున్న రాష్ట్రాలలో జరిగాయి ఇవన్నీ హైదరాబాదు సంస్థానంలోని యువకులను ఎంతగానో ఉత్తేజపరిచాయి.

1938 ఫిబ్రవరిలో హరిపురాలో జరిగిన జాతీయ కాంగ్రెసు మహాసభకు హైదరాబాదు నుండి 500 మంది వరకు యువకులు హాజరయ్యారు. కాంగ్రెసు సంస్థ తమకు సహాయ పడుతుందని వీరంతా ఆశించారు. కాంగ్రెసు మితవాద నాయకులు సంస్థానాలన్నింటిలోనూ, ముఖ్యంగా మైసూరు, తిరువాన్కూరు సంస్థానాలలోని ప్రజా ఉద్యమ ఉధృతాన్ని చూచి భయపడ్డారు. అవి తీవ్ర ప్రజా ఉద్యమాలుగా మారకుండా ఎలా ఆపాలా అని వారు ఆలోచించారు. అందువల్లనే ఆ ప్రజల ఆశయ సిద్ధికి తోడ్పడాలని కమ్యూనిస్టులు, సోషలిస్టులు పెట్టిన తీర్మానం త్రోసి వేయబడింది. సంస్థాన ప్రజలు తమ కాళ్ళ మీద తామే ఆధారపడాలని తీర్మానించారు. సంస్థానాలలోని ప్రజా ఉద్యమం మీద చన్నీళ్ళు చల్లడానికి ఉద్దేశించినదే ఈ తీర్మానం. హైదరాబాదు నుండి హరిపురా కాంగ్రెసుకు వెళ్ళిన యువకులకు స్టేటు కాంగ్రెసును ఏర్పరచి, బాధ్యతాయుత ప్రభుత్వానికై ఉద్యమాన్ని ఆరంభించాలనే భావం కల్గింది.[1]

హైదరాబాదు ప్రజా పరిషత్తు బాధ్యతాయుత ప్రభుత్వాన్ని సాధించే ఆశయంతో స్టేటు కాంగ్రెసును ఏర్పరచడానికి తీర్మానించింది. దాని కనుగుణంగా 1938 జూలైలో ఒక తాత్కాలిక కమిటీ ఏర్పడింది. ఉత్సాహవంతులైన యువకులు దీనిలో చేరారు. ఆగష్టు 2 వ వారంలో స్టేటు కాంగ్రెసు యొక్క ఆశయాలను వివరిస్తూ ఒక విన్నపం ప్రకటించబడింది

1938 ఆగష్టు 23 న ప్రధానామాత్యులైన సర్ అక్బర్ హైదరీ, లెజిస్లేటివ్ కౌన్సిలు ప్రత్యేక సమావేశాన్ని జరిపి ప్రభుత్వం రాజ్యాంగ సంస్కరణలు ప్రవేశపెట్టబోతున్నదని, వాటిలో పౌరసత్వ హక్కులు గూడా యిమిడి వున్నవని చెప్పటం జరిగింది. స్టేటు కాంగ్రెసులో మత తత్వవాదులున్నారని, రాజద్రోహ

చర్యలను ప్రోత్సహించే సంస్థగా దానిని పేర్కొంటూ, నైజాం ప్రభుత్వం సెప్టెంబరు 7 న స్టేటు కాంగ్రెసును నిషేధించడం జరిగింది. స్టేటు కాంగ్రెసు మతతత్వ చర్యలను ప్రోత్సహించే సంస్థ కాదని, తాత్కాలిక కమిటీ సభ్యులు సర్ అక్బర్ హైదరీని కలుసుకొని చెప్పినా ఏమీ లాభం లేకపోయింది.

ఈ నిషేధాన్ని ఎత్తివేయడానికి ప్రభుత్వం అంగీకరించక పోవడంతో స్టేటు కాంగ్రెసు పోరాటం ప్రారంభించాల్సిన అవసరం ఏర్పడింది. తాత్కాలిక కమిటీ సత్యాగ్రహం చేయడానికి నిర్ణయించింది. పోరాట సమితిని ఏర్పరచి, స్టేటు కాంగ్రెసు తాత్కాలిక కమిటీ రద్దు అయినట్లు ప్రకటించటం జరిగింది. పోరాట సమితి స్టేటు కాంగ్రెసు కార్య నిర్వాహక వర్గంగా ప్రకటించుకొన్నది. ఈ కార్య నిర్వాహకవర్గం అక్టోబరు 24 న స్టేటు కాంగ్రెసును ఏర్పరచినట్లుగా హైదరాబాదు లోని సుల్తాన్ బజారు మైదానంలో 2 వేల మంది ప్రజలముందు ప్రకటన చేస్తూ, లక్ష్యాలను గురించి దిగువ విధంగా వివరించటం జరిగింది.

1. నైజాంయొక్క అధికారం క్రింద బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పాటు చేయుట. ఇందుకై సత్యాహింసలతో కూడిన పద్ధతుల పైన స్టేటు కాంగ్రెసు పని చేయును.

2. తాత్కాలికంగా వ్యక్తి సత్యాగ్రహాన్ని కొనసాగించుట.

3. కోర్టులో విచారణ సాగేటప్పుడు ఏ విధమైన డిఫెన్సును పెట్టకుండుట.[2]

ఈ ప్రకటన జరిగినవెంటనే కార్యవర్గం అరెస్టుచేయబడింది. దీనితో సత్యాగ్రహ పోరాటం ప్రారంభమైంది. మొదటగా అరెస్టు అయిన కార్యవర్గంలో అధ్యక్షుడు గోవిందరావు నానల్, కార్యదర్శి రామకృష్ణ ధూత్, జనార్ధన దేశాయి, రావి నారాయణ రెడ్డి, శ్రీనివాసరావు బోరికరు సభ్యులు.

నైజాం ఆధిపత్యం క్రింద బాధ్యతాయుత ప్రభుత్వం కోసం స్టేటు కాంగ్రెసు సత్యాగ్రహం చేస్తుండగా రాష్ట్రంలో పౌరసత్వ హక్కుల సాధనకోసం, మత స్వాతంత్ర్యం కోసం ఆర్యసమాజ్ వారు, హిందూ రాజ్య స్థాపనకోసం హిందూ మహాసభ వారు అదేరోజులలో సత్యాగ్రహం ప్రారంభించారు. సంస్థానం వెలుపలి నుండి సత్యాగ్రహులను పెద్ద ఎత్తున సమీకరించారు.

స్టేటు కాంగ్రెసు నిషేధింపబడిన తరువాత డిక్టేటర్లు ఏర్పాటు అయి దళము తరువాత మరొక దళము వంతున ప్రభుత్వ ఆజ్ఞలను ఉల్లంఘించి, అరెస్టు అయ్యారు. స్వామీ రామానంద తీర్థ మొదటి డిక్టేటరు ఆరుట్ల లక్ష్మీ నరసింహా రెడ్డి రెండవ డిక్టేటరు ఐదవ డిక్టేటరు బద్దం ఎల్లారెడ్డి. నవంబరు 19 వ తేదీన 52 మంది సత్యాగ్రహులతో 9 దళాలు హైదరాబాదులో అరెస్టు చేయబడ్డాయి. దినదినం సంస్థానంలోని అన్ని జిల్లాలకు, తాలూకాలకు ఈ ఉద్యమం వ్యాపిం

చింది. రెండు నెలల లోపున స్టేటు కాంగ్రెసు ఉద్యమం గ్రామాలకు కూడా వ్యాపించింది. మీటింగులపైనున్న నిషేధాజ్ఞను ప్రజలు లెక్క చేయక సమావేశములు జరిపారు నవంబరు 23 వ తేదీ అఖిల హైదరాబాదు సత్యాగ్రహ దినంగా పాటించబడి సంస్థానంలోని అన్ని జిల్లాలు తాలూకాలలోనూ సత్యాగ్రహం జరిగి అనేక మంది అరెస్టు అయ్యారు.[3]

సత్యాగ్రహుల ఫోటోలు తీసినందుకు కూడ కొందరిని అరెస్టు చేశారు. అసలు గ్రూపు ఫొటోలు తీయించుకుంటే సత్యాగ్రహం కోసమేనని ఫోటోలు తీయించుకోనీయలేదు.

సత్యాగ్రహం జరుగుతున్న సమయంలో చాలాచోట్ల తీవ్రమైన హిందూ, ముస్లిం గలాటాలు జరిగాయి. అన్నిటికన్నా ముఖ్యమైనది హైదరాబాదు పట్టణంలో జరిగింది. హిందువులు, మహమ్మదీయులు చాలా మంది చనిపోయారు. ఉద్యమం స్టేట్ కాంగ్రెసు చేయి దాటిపోయింది.

స్టేట్ కాంగ్రెసు నిర్వహించిన సత్యాగ్రహంలో మొత్తం 500 మంది అరెస్టు అయి జైళ్ళకు వెళ్ళారు. ప్రజలు, కార్యకర్తలు అనేక నిర్బంధాలకు గురి అయ్యారు.

రావి నారాయణరెడ్డి పాల్గొన్న మొదటి స్టేట్ కాంగ్రెసు సత్యాగ్రహ దళ సభ్యులు పెండున్నర నెలల శిక్షాకాలం పూర్తి అయిన తరువాత విడుదలై బయటికి వచ్చారు వెంటనే వార్ధా రమ్మని గాంధీజీ వద్దనుండి వీరికి పిలుపు వచ్చింది. ఆర్యసమాజ్, హిందూ మహాసభల మాదిరిగానే స్టేట్ కాంగ్రెసు సత్యాగ్రహం కూడా మతవాదంతో కూడినదని గాంధీజీకి ఎవరో తప్పుడు వార్త చెప్పారు దానితో స్టేటు కాంగ్రెసు సత్యాగ్రహాన్ని ఆపుచేయవలసిందిగా గాంధీజీ అక్కడకు వెళ్ళినవారికి చెప్పారు. అలా నిలుపుదలచేస్తే రంగమంతా మత తత్వ వాదులకు వదలినట్లు అవుతుందని, ప్రజలు ఈ విరమణను తప్పుగా అర్థం చేసుకుంటారని హైదరాబాదునుండి వెళ్ళిన నాయకులు చెప్పినా గాంధీజీ దానికి అంగీకరించలేదు. సత్యాగ్రహాన్ని విరమిస్తున్నట్లు ఆయనే ఒక స్టేట్‌మెంటు వ్రాసి విడుదల చేయటం జరిగింది. దానితో స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహం విరమించబడింది.

సత్యాగ్రహ ఉద్యమంలో అవలంభించబడిన ఎత్తుగడలు, ప్రజాసామాన్యం అందులో పాల్గొనకుండా పెట్టబడిన అడ్డంకులు, ఏమీ సాధించకుండానే అర్థాంతరంగా ఉద్యమాన్ని విరమించడం నారాయణరెడ్డి, ఎల్లారెడ్డిలాంటి అనేక మంది యువ కార్యకర్తలకు అసంతృప్తిని కలిగించింది. వీరంతా సమరశీల మార్గాల కోసం అన్వేషణ ప్రారంభించారు.



హైదరాబాద్ స్టేట్ సత్యాగ్రహంలో పాల్గొన్న ఆరవ దళం

మధ్యనున్నవారు బద్దం యల్లారెడ్డి. మిగిలినవారు- జె వి. మురళీధరరావు (కరీంనగర్) డి.నర్సయ్య
నరహరిరావు (ఉస్మానాబాదు) శంకరరావు ఖానాపూర్కర్ (ఉస్మానాబాద్)



హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహంలో పాల్గొన్న ఆరుట్ల ఆరుట్ల లక్ష్మీ నరసింహారెడ్డి(3వ దళ నాయకుడు)

1940 లో రాంఘర్ కాంగ్రెసు మహాసభ తరువాత మహాత్మాగాంధీ సూచించిన వ్యక్తిగత సత్యాగ్రహం హైదరాబాదు సంస్థానంలోని ఈ యువ కార్యకర్తలకు నచ్చలేదు. వీరిపై ఆంధ్ర ప్రాంతంలోని కమ్యూనిస్టుపార్టీ కార్యకలాపాల ప్రభావం పడి, కమ్యూనిస్టుపార్టీ వైపు ఆకర్షితులయ్యారు.

**నిజాం ఆంధ్ర రైతాంగ విద్యాలయం**

1938లో నైజాం సంస్థానంలో స్టేట్ కాంగ్రెసు ఆధ్వర్యాన జరిగిన సత్యాగ్రహ ఉద్యమానికి ఖమ్మం జిల్లాను ఆనుకొని వున్న కృష్ణా జిల్లా గ్రామాలలో సభలు జరిపి సంస్థానంలోని సత్యాగ్రహులకు సంఘీభావం తెలుపబడింది. ఇటువంటి కొన్ని సభలలో వాసిరెడ్డి శివలింగప్రసాద్, జొన్నలగడ్డ రామలింగయ్య మొదలగు ఆ జిల్లా కమ్యూనిస్టులు, అఖిల భారత రైతు సంఘ నాయకులయిన ఆచార్య రంగా, ఇందులాల్ యాజ్ఞిక్ ప్రసంగించారు. తిరువూరు, నందిగామ తాలూకాలలో జరిగిన ఇట్టి సభలకు తెలంగాణా గ్రామాల నుండి ప్రజలు వేల సంఖ్యలో పాల్గొన్నారు [4] తిరువూరు తాలూకా తునికిపాడులో స్టేటు కాంగ్రెస్ సత్యాగ్రహ శిబిరం నెలకొల్పాలనే ప్రయత్నం జరిగింది. కాని అది ఫలించలేదు. స్టేటు కాంగ్రెసు సత్యాగ్రహం విరమించిన తరవాత శ్రీయుతులు జమలాపురం కేశవరావు, వాసిరెడ్డి వెంకటపతి, వట్టికొండ నాగేశ్వరరావు, వట్టికొండ రామకోటయ్య, వట్టికొండ కాంతయ్య, పైడిపల్లి లింగయ్య మొదలగు సత్యాగ్రహులను ఈ గ్రామానికి ఆహ్వానించి, సన్మానించారు.

1939 లో నైజాం సంస్థానాన్ని ఆనుకొని వున్న కృష్ణా జిల్లా ఎస్టేట్లలో రైతాంగ పోరాటాలు జరిగాయి. నైజాం భూభాగం మధ్యలో దీవులుగా వున్న మునగాల, లింగగిరి పరగణాలలో రైతుల సత్యాగ్రహోద్యమం జరిగింది. మునగాల రైతుల పోరాటం, వారు సాధించిన విజయం నైజాం సంస్థానంలోని చుట్టుపట్ల గ్రామాల ప్రజలపై పడింది హుజూర్‌నగర్ తాలుకాలోని బేతవోలు మక్తా (ఒకే గ్రామం) మునగాల పరగణాకు దగ్గరగావుంది. బేతవోలు మక్తాలో దారుణమైన పరిస్థితులుండేవి. ప్రజలపై రకరకాల పన్నులు దారుణలగా వసూలు చేసేవారు. గొడ్డలికి పన్ను, స్త్రీల చంటికి పన్ను వుండేది. మునగాలలో వచ్చిన విజయంతో బేతవోలు ప్రజలు మునగాల వచ్చి తమ దుర్భర పరిస్థితులను రైతు నాయకులకు వివరించారు. మునగాల నుండి రైతు కార్యకర్తలతో కామ్రేడ్ చంద్ర రాజేశ్వరరావు, బేతవోలు గ్రామానికి వెళ్ళారు. ఈ నికృష్టమైన పన్నులకు, వెట్టిచాకిరికి వ్యతిరేకంగా పోరాటానికి పిలుపుయిచ్చారు. ప్రజలను సమీకరించి పోరాటం సాగించి విజయం సాధించారు[5].

1937 ఆఖరులో ప్రారంభించబడిన ఆంధ్ర రాష్ట్ర సోషలిస్టుపార్టీ పత్రిక "నవశక్తి" తెలంగాణా ప్రాంతంలోని కొన్ని కేంద్రాలకు వెళ్ళేది. యువకులను సోషలిస్టు భావాలవైపు ఆకర్షించడానికి, నైజాం నవాబు వ్యతిరేక పోరాటంలో యువకులను తయారు చేయడానికి నవశక్తి తోడ్పడింది.

ఇటువంటి వాతావరణంలో నైజాం సరిహద్దులో తిరుపూరు తాలూకాలో వున్న చిన్న గ్రామం తునికిపాడులో 1939 మే 23 నుండి జూన్ 13 వరకు రాజకీయ శిక్షణా శిబిరం జరిగింది. ఈ విద్యాలయానికి తెలంగాణా ప్రాంతము నుండి 50 మంది విద్యార్థులు హాజరయ్యారు. రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి గార్లు దీనికి హాజరై హైదరాబాదు సంస్థాన సమస్యలపై క్లాసులు తీసుకున్నారు.

## వందేమాతరం ఉద్యమం

స్టేటుకాంగ్రెసు సత్యాగ్రహ ఉద్యమం విద్యార్థులలో పెద్ద ప్రభావాన్ని కలుగజేసింది. ఈ సత్యాగ్రహ ఉద్యమంలో కొందరు విద్యార్థులు ముఖ్యంగా మహారాష్ట్ర ప్రాంతంలో విద్యార్థులు ఎక్కువగా సత్యాగ్రహంలో పాల్గొన్నారు.

ఉస్మానియా విశ్వ విద్యాలయంలోనూ, ఇతర కాలేజీలు. స్కూళ్ళలోనూ, నైజాం సంస్థానమంతటా ఉస్మానలీ పాషాగారు (నైజాం నవాబు) చిరంజీవిగా వర్థిల్లాలని ప్రతినిత్యం విద్యార్థులు ప్రార్థన చేయవలసి ఉండేది దేశంలో ఉవ్వెత్తున విజృంభించిన రాజకీయ ప్రజా ఉద్యమాలతో ప్రభావితులైన విద్యార్థులు 'వందేమాతరం' గేయాన్ని ప్రార్థనా గీతంగా పాడాలని నిశ్చయించారు. ప్రభుత్వం ఈ గీతాన్ని ఎవ్వరూ, ఎక్కడా పాడరాదని నిషేధపు ఉత్తర్వును 1938 నవంబరు 28 న జారీచేసింది. కాని విద్యార్థులు ఈ నిషేధాజ్ఞను ఖాతరు చేయకుండా వందేమాతరం గీతాన్ని ఉస్మానియా విశ్వ విద్యాలయంలోనూ, ఇతర పాఠశాలలోనూ పాడడానికి నిశ్చయించారు. నైజాం ప్రభుత్వము పౌరహక్కుల అణచివేస్తున్నందుకు వ్యతిరేకంగా నిరసనోద్యమాన్ని ప్రారంభించారు. విద్యార్థులు ఈ సమస్యను సామ్రాజ్య వ్యతిరేక, నిజాం వ్యతిరేక పోరాటానికి చిహ్నంగా తీసుకున్నారు. హైదరాబాదు సంస్థానంలోని విద్యార్థులు ప్రారంభించిన ఈ ఉద్యమాన్ని వందేమాతరం ఉద్యమం, అని పిలవటం జరిగింది. స్టేటు కాంగ్రెసు ఉద్యమంతో ఉత్తేజం పొందిన విద్యార్థులకు, వందేమాతరం ఉద్యమం మరొక ఊపు నిచ్చింది. ఈ ఉద్యమం ఉస్మానియా విశ్వ విద్యాలయ విద్యార్థులతో ప్రారంభించి, సంస్థానంలోని ఇతర పాఠశాలలకన్నింటికి వ్యాపించింది.

ఉస్మానియా యూనివర్శిటీ హాస్టలులో ప్రార్థనా సమయంలో వందేమాతరం గీతం పాడినందుకు 115 మంది విద్యార్థులను కాలేజీనుండి అధికారులు వెళ్ల

గొట్టారు. ప్రభుత్వం తీసుకున్న ఈ చర్యకు నిరసన తెలియజేస్తూ విశ్వ విద్యాలయంలోని విద్యార్థులు 840 మంది అనేక చోట్ల సమ్మెజేసారు. హైదరాబాదు సంస్థానంలో ప్రజాపోరాటం పెరుగుతున్న కొలదీ నిర్బంధ విధానం హెచ్చింది. పాలనాధికారులు రాక్షస కృత్యాలకు పూనుకొన్నారు.

విద్యార్థుల పోరాటం రోజు రోజుకు వ్యాపిస్తోంది. అఖిల హైదరాబాదు విద్యార్థి దినోత్సవాన్ని జరపాలని విద్యార్థులకు పిలుపు యివ్వబడింది. గుల్బర్గా కాలేజీలో విద్యార్థులు సమ్మె చేసినందుకు 3000 మంది పేర్లను హాజరు పట్టీల నుండి కొట్టివేశారు. విద్యార్థులను ఆరెస్టుచేశారు. అధికార్లు అంతటితో ఆగక దేశీయ గీతాలు, వందేమాతరం గీతాలు, దేశనాయకుల చిత్రాలువున్న 'గృహలక్ష్మి', 'తుకారాం' మొదలగు సినిమాలను సంస్థానంలో ప్రదర్శించరాదని నిషేధించారు.

ఈ ఉద్యమం పుట్టుక, ఉధృతి గురించి క్లుప్తంగా లాహోర్‌కు చెందిన "ది సివిల్ అండ్ మిలిటరీ గజెట్" 1939 జూలై 22 వ తేదీ సంచికలో ఇచ్చిన సమాచారం ఎంతో వివరంగా వుంది. దానిని తిరిగి యిక్కడ ఇవ్వడం జరిగింది. " .. ..కొన్ని సంవత్సరాల పాటు 'వందేమాతరం' గీతాన్ని హిందూ ప్రార్థనా మందిరం (ఉస్మానియా యూనివర్శిటీ) లో ప్రతి రోజూ ఆలాపించారు. అప్పుడెవరూ అభ్యంతరం చెప్పలేదు. 1938 జూలైలో యితర రెండు హాస్టళ్ళకుచెందిన హిందూ విద్యార్థులు (ఉస్మానియా యూనివర్శిటీ) కూడా తమ ఉమ్మడి గీతంగా 'వందేమాతరం' ను ఆమోదించారు. 1938 నవంబరు 28న రంజాన్ సెలవుల తర్వాత కాలేజీ తెరవగానే హిందూ విద్యార్థులకు నిషేధపు ఉత్తర్వులను జారీ చేశారు. ఆ ఉత్తర్వుపై వైస్ ఛాన్సలర్ సంతకం చేశారు. అయినా, విద్యార్థులు ఆ గీతాన్ని ఆలాపించడం మానలేదు. అందువల్ల మరో ఉత్తర్వును 1938 నవంబరు 29 వ తేదీన జారీ చేశారు.

రెండు కారణాలపై ఆ గీతాన్ని ఆలాపించడానికి అభ్యంతరం తెలిపినట్లు తెలుస్తుంది మొదటిది : ఆ గీతం రాజకీయ, వివాదాస్పదమైన స్వభావం కలిగినదిగా యూనివర్శిటీ అధికారులు భావించారు రెండవది : హిందూయేతర విద్యార్థుల భావాలను దెబ్బ తీస్తుందని భావించడం జరిగింది.

ఈ ఉద్యమం ఉధృతిని గురించి పైన పేర్కొన్న గజెట్ 1939 జూలై 22 న వెలువడిన సంచికలో యిలా వ్రాసింది. " . .. ఇప్పుడు 6 నెలలకుపైగా అయింది. అప్పటినుండి ఉస్మానియా యూనివర్శిటీకి చెందిన 350 మందితోసహా హైదరాబాదుకుచెందిన 1200 మంది హిందూ విద్యార్థులు, గుల్బర్గా ఇంటర్మీడియట్ కాలేజీకిచెందిన 350 మంది, మహబూబ్‌నగర్ హైస్కూలుకుచెందిన 120 మంది, సిటీ కాలేజికి చెందిన 70 మంది, వరంగల్, ఔరంగాబాద్, బీదర్ తదితర

ప్రాంతాలకుచెందిన 350 మందికి పైగా విద్యార్థుల పేర్లను ఆయా సంస్థల హాజరు పట్టీలలో కొట్టి వేశారు. వరంగల్, గుల్బర్గా కాలేజీలలో ఒక్క హిందూ విద్యార్థి కూడా మిగులలేదు." ఆ పత్రిక యింకా ఇలా పేర్కొన్నది. "వారిలో ఎక్కువ భాగం ఒక సంవత్సరం తమ విద్యా కాలం వృధాగాకుండా కాపాడుకోవటానికి నాగపూర్ యూనివర్శిటీకి వలసపోవాల్సి వచ్చింది."

వందేమాతరం ఉద్యమంలో పాల్గొని నాగపూర్ విశ్వవిద్యాలయంలో చేరిన విద్యార్థులు జవహర్‌లాల్ నెహ్రూ, ఆచార్య నరేంద్ర దేవ్, ఎం. ఎన్. రాయ్ తదితర ఉన్నత స్థాయి కాంగ్రెసు నాయకులతోనూ, ఇతర వామపక్ష నాయకుల తోనూ సంబంధాలు పెట్టుకున్నారు. వీరికి స్టడీ సర్కిల్స్ నిర్వహించబడ్డాయి. అనేక మంది వందేమాతరం విద్యార్థులలో వామపక్ష భావాలు బలపడ్డాయి.

నైజాం ప్రభుత్వం వందేమాతరం ఉద్యమానికి మతతత్వ రంగు పులమడానికి ప్రయత్నించినప్పటికీ అది నైజాం వ్యతిరేక పోరాటంలో భాగమని విద్యార్థులు ధృడంగా విశ్వసించారు.

1939 మే, జూన్ మాసాలలో నాగపూర్‌లో వందేమాతరం విద్యార్థి సంఘాన్ని ఏర్పాటు చేసుకున్నారు దీనికి అధ్యక్షులుగా శ్రీ అచ్యుతరెడ్డి, ప్రధాన కార్యదర్శిగా స్టేటు కాంగ్రెస్ యువజన నాయకులు శ్రీ వి డి. దేశపాండేలను ఎన్నుకున్నారు.

నాగపూర్‌లో విద్యా సంవత్సరం ముగింపు సందర్భంగా, కొత్త విద్యా సంవత్సరం ప్రారంభంలో హైదరాబాదు అంతటా కాలేజీ, హైస్కూలు విద్యార్థుల సార్వత్రిక సమ్మెను ప్రారంభించాలని ఆ సంఘం నిర్ణయం తీసుకుంది. హైదరాబాదు సంస్థానంలోని వివిధ జిల్లాలలో పర్యటించి స్థానిక కమిటీలను ఏర్పాటు చేశారు ఈ ఉద్యమాన్ని సమన్వయం చేసి మార్గ దర్శకత్వం ఇవ్వడానికిగాను డాక్టర్ బి ఎస్. పరంజిపే సంపాదకత్వాన నాగపూర్‌లో "ది స్టూడెంట్ మార్చ్" అన్న ఒక వారపత్రిక ప్రారంభించబడింది

సార్వత్రిక సమ్మెకు ముమ్మరంగా సన్నాహాలు జరుగుతున్న సమయంలో స్టేటు కాంగ్రెస్ నాయకత్వంలోని మితవాదులు తాము నైజాం ప్రభుత్వంతో రాజీ సంప్రదింపులు కొనసాగిస్తూ సమ్మెను వ్యతిరేకించారు ఈ సమయంలో పండిట్ నెహ్రూ సిలోన్ (ఇప్పుడు శ్రీలంక) వెళుతూ మార్గమధ్యంలో హైదరాబాదులో ఆగారు. స్టేట్ కాంగ్రెస్ నాయకులతో ఒకరైన శ్రీ ఎస్. కె. రావు ఆయనను కలుసుకొని సార్వత్రిక సమ్మె మతపరమైన ఉద్రిక్తతలకు దారి తీసే ప్రమాద మున్నందున సమ్మెకు స్వస్తి చెప్పాలని విద్యార్థులకు సూచించాలని కోరారు. దానిపై పండిట్ నెహ్రూ విద్యార్థులు తలపెట్టిన సార్వత్రిక సమ్మె తలంపును

వదులుకోవాలని వందేమాతరం విద్యార్థి సంఘ నాయకత్వానికి సలహా యిచ్చారు. ఈ సంఘంలోని వామపక్ష విభాగం నాయకత్వం దీపని వ్యతిరేకించినప్పటికీ, తలపెట్టిన సార్వత్రిక సమ్మెకు స్వస్తి చెప్పాలని మెజారిటీ నిర్ణయించింది.

పౌర హక్కుల కోసం జరుపుతున్న ఉద్యమంలోనూ, నైజాంకు వ్యతిరేకంగా జరుపుతున్న ప్రజా తంత్ర పోరాటంలోనూ భాగమైన తమ ఉద్యమానికి తోడ్పాటు యివ్వాలని ముస్లిం విద్యార్థులకు వందేమాతరం అసోసియేషన్ అనేక పర్యాయాలు విజ్ఞప్తి చేసింది.

యూనివర్శిటీ విద్యార్థుల ఈ పోరాటం 1938 అక్టోబరులో ప్రారంభమైన హైదరాబాదు స్టేటు కాంగ్రెస్ సత్యాగ్రహ ఉద్యమం నుండి ప్రత్యక్షంగా ఉత్తేజిత మైంది అదే సమయంలో ఆర్య సమాజ్ కూడా తన మతపరమైన కార్యకలాపాలపైన, పౌరహక్కులపైన ఆంక్షలు విధించినందుకు వ్యతిరేకంగా పెద్ద ఎత్తున సత్యాగ్రహోద్యమాన్ని నిర్వహించింది, అది పెద్ద సంఖ్యలో ప్రజలను సమీకరించింది విద్యార్థులు ఈ సమస్యను సామ్రాజ్య వ్యతిరేక, నిజాం వ్యతిరేక పోరాటానికి చిహ్నంగా చేశారు. వందేమాతరం ఉద్యమమే గాకుండా సంస్థానం విద్యార్థులు ముఖ్యంగా మరాట్వాడా విద్యార్థులు స్టేటు కాంగ్రెస్ సత్యాగ్రహ ఉద్యమంలో కూడా పాల్గొన్నారు పైగా సత్యాగ్రహులలో వీరే మెజారిటీగా వున్నారు.

సంస్థానంలో ఆ కాలంలో వున్న సాధారణ పరిస్థితి ఈ క్రింది విధంగా వుంది.

సాధారణంగా ప్రజలలో ప్రత్యేకంగా విద్యార్థి, యువజనులలో పెరుగుతున్న సామ్రాజ్యవాద వ్యతిరేక, నైజాం వ్యతిరేక చైతన్యాన్ని నిరోధించడానికి గానూ నిజాం, పాలక ముఠా ఒకవైపు నిర్బంధ కాండకు సంబంధించి తమ సొంత వ్యూహాన్ని రూపొందించింది. అలాగే, మరోవైపు మతతత్వ ప్రాతిపదికపై ప్రజలను విభజించి, అసిఫ్‌జాహి పాలన, ఫ్యూడల్‌వ్యవస్థల ప్రధాన పరిరక్షకులుగా మజ్లిస్‌ను తయారు చేయడానికి వీలుగా మజ్లిస్-ఎ-ఇత్తెహాదుల్-ముసల్మాన్ సంస్థను పునరుద్ధరింప చేయడానికి కూడా వ్యూహాన్ని రూపొందించింది. ఈ పరిస్థితిలో, విద్యార్థి లోకాన్ని గందర గోళ పరిచి విభజించారు. దానివల్ల వారు తమ డిమాండ్ల కోసం గాని, పౌర హక్కులపైన ఆంక్షలు పెట్టడానికి వ్యతిరేకంగా గాని, సంస్థానంతో పెరుగుతున్న మతతత్వ, అభివృద్ధి నిరోధక శక్తులకు వ్యతిరేకంగాగాని పోరాటం జరుపడానికి తమ స్వంత సమైక్య, ప్రజాతంత్ర సంఘం దేని లోనూ సంఘటితం కాలేదు. ఆ కాలంలో మెజారిటీ హిందూ విద్యార్థులు స్టేటు కాంగ్రెస్, ఆర్య సమాజ్, ప్రభావం క్రింద వున్నారని,

ఎక్కువ భాగం ముస్లిం విద్యార్థులు అధికారికంగా మజ్లిస్ ప్రభావం క్రిందకు వచ్చారని చెప్పవచ్చు.

అయితే స్టేటు కాంగ్రెస్‌లోని మితవాద నాయకత్వం, వందేమాతరం ఉద్యమం, సమరశీల పోరాట స్వరూపాన్ని సంతరించుకునేందుకు అనుమతించ లేదు. అంతేకాదు ఆర్థికంగా బలహీనంగావున్న విద్యార్థులకు వందేమాతరం పాట పాడకూడదని గతంలో వందేమాతరం ఉద్యమంలో పాల్గొన్నందుకు యూని వర్శిటీ అధికారులకు వ్రాత పూర్వకంగా క్షమాపణలు చెప్పి, పునః ప్రవేశాన్ని కోరవలసిందిగా వత్తిడి చేసింది. ఇటువంటి రాజీ విధానం విద్యార్థులలో నిరుత్సాహాన్ని కల్గించింది. వామపక్ష భావాలు గల విద్యార్థులలోని ఒక వర్గం ఇటువంటి పంథాను చేపట్టటానికి తిరస్కరించింది నాగపూర్ విశ్వ విద్యా లయంలో ప్రయివేటు అభ్యర్థులుగా హాజరు కావటానికి వారు నిర్ణయించు కున్నారు. అంతేకాక నరేంద్రదత్ తదితరుల నాయకత్వాన ఒక వర్గం, రాష్ట్రకాంగ్రెస్ నాయకత్వం తమపై బలవంతంగా రుద్దిన పంథాకు వ్యతిరేకంగా నిరసన తెలియజేయటానికి బహిరంగ సభను ఏర్పాటు చేసింది. "రాడికల్ స్టూడెంట్స్ లీగ్ "స్టూడెంట్స్ పాపులర్ ఫ్రంట్" అన్న శీర్షికతో విడదుల చేసిన కరపత్రంలో వారు తమ ఆగ్రహాన్ని ఈ క్రింది విధంగా వ్యక్తం చేశారు. "అగ్రస్థాయిలో వున్న వారు అర్థాంతరంగా, అనుకోకుండా, కాదనకుండా అప్రతిష్ఠాకరంగా మన ఉద్యమాన్ని ఎలా ముగించింది మీకు తెలుసు. ఇది మనకు అత్యంత ప్రేమ పాత్రమైన లక్ష్యానికి పూర్తిగా ద్రోహం చేయటమేనని మేము చెప్పవలసిన అవసరం లేదు." స్టేటు కాంగ్రెస్ సత్యాగ్రహ ఉద్యమాన్ని, ఉస్మానియా విశ్వవిద్యాలయం విద్యార్థులు వందేమాతరం ఉద్యమాన్ని ఉపసంహ రించుకున్న తరువాత వున్న పరిస్థితులివి.

వందేమాతర ఉద్యమంలో పాల్గొన్న విద్యార్థులలో నేవులపల్లి వెంకటేశ్వర రావు, సర్వదేవరభట్ల రామనాథం, ఆరుట్ల రామచంద్రారెడ్డి, కె. యల్. మహేంద్ర, ఎ. గురువారెడ్డి మొదలగువారున్నారు. అటు తరువాత వీరందరు కమ్యూనిస్టుపార్టీ సభ్యులయ్యారు.

మహారాష్ట్ర పరిషత్తులో పనిజేస్తున్న యువకులలో ఔరంగాబాదుకు చెందిన చంద్రగుప్త చౌదరి, హబీబుద్దీన్, వి డి. దేశపాండేలాంటివారు, కర్ణాటక ప్రాంతా నికి చెందిన శ్రీనివాస గుడి సోషలిస్టు భావాలవైపు ఆకర్షింపబడి, తరువాత కమ్యూ నిస్టు పార్టీలో చేరారు మరాట్వాడాలో చంద్రగుప్త చౌదరి జైలునుండి విడుదలై వచ్చిన తరువాత 1942 లో కమ్యూనిస్టు సెల్ ఏర్పడింది.[6]

# కామ్రేడ్స్ అసోసియేషన్

స్టేటు కాంగ్రెస్ సత్యాగ్రహ ఉద్యమం, వందేమాతరం విద్యార్థి ఉద్యమం మొత్తంగా సంస్థానంలోని హిందువులలో, ప్రత్యేకించి యువజన, విద్యార్థులలో నూతనోత్సాహాన్ని కల్పించి రాజకీయ చైతన్యాన్ని పెంపొందించింది. ఈ ఉద్యమాలు ముస్లిం ప్రజలను ముఖ్యంగా యువజన, విద్యార్థులను ఎంతవరకు ప్రభావితం చేశాయన్నది చెప్పడం కష్టం. కాని మెజారిటీ ముస్లింలపై మతపరమైన రాజకీయాల ప్రభావం వున్నదనడంలో ఎటువంటి సందేహం లేదు. హైదరాబాదు సంస్థాన పాలకులు, మజ్లిస్-ఎ-ఇత్తేహాదుల్-ముసల్మాన్ నాయకులు మతం మత్తు ప్రయోగించి వారి మనోభావాలను విషపూరితం చేయడమే అందుకు కారణం. హైదరాబాదు ముస్లింల రాజ్యమని, ప్రతి ముస్లిం ఒక రాజు "అనల్ మాలిక్" అని అందువల్ల, తమ ప్రాణాలను సైతం బలిపెట్టి "ముస్లిం రాజ్యాన్ని" "నిజాం సార్వభౌమత్యాన్ని" పరిరక్షించుకోవడం ముస్లింల పవిత్ర కర్తవ్యమని అత్యంత హానికరమైన సిద్ధాంతాన్ని వారు ప్రచారంలో పెట్టి ముస్లింలకు మతం మత్తు ఎక్కించారు. ప్రజల పౌరహక్కులను అతిక్రూరంగా అణగద్రొక్కి, వారి సామాజిక, సాంస్కృతిక విద్యా కార్యకలాపాలపై సైతం తీవ్రమైన ఆంక్షలు విధించడం వల్ల, సంస్థానంలో జాతీయోద్యమం చాలా బలహీనంగా వుండిపోయింది. ప్రత్యేకంగా ముస్లింలలో ప్రజాతంత్ర చైతన్యం తక్కువ స్థాయిలో వుంది. ఈ ప్రతికూల పరిస్థితి వున్నప్పటికీ, జాతీయోద్యమంపట్ల సానుభూతి కలిగినటువంటి వారు నైజాం నిరంకుశ ప్రభుత్వ జాతీయ వ్యతిరేక, అభివృద్ధి నిరోధక విధానాలను వ్యతిరేకిస్తున్నటువంటి, ప్రజాతంత్ర భావాలు కలిగి ముస్లింలు గణనీయమైన సంఖ్యలోనే వున్నారు. అయితే, వారికి బహిరంగంగా ముందుకువచ్చి సంఘటితంగా ఈ విధానాలపై పోరాడే ధైర్యం లేకుండాపోయింది.

ఇలాంటి భీభత్సమైన, నిరంకుశ ప్రజావ్యతిరేక వాతావరణం వున్నప్పటికీ సయ్యద్ ఆలం ఖుంద్‌మీర్ నాయకత్వాన ఉస్మానియా యూనివర్శిటీకి చెందిన కొందరు ముస్లిం విద్యార్థులు వందేమాతరం ఉద్యమానికి తమ సానుభూతిని తెలిపారు హిందూ విద్యార్థుల పౌరహక్కులను అణచివేయడాన్ని వారు నిరసించారు. అంతేగాదు. ఈ ఉద్యమంలో బాధితులైన పేద విద్యార్థుల సహాయార్థం నిధులను వసూలుచేసి సహాయపడ్డారు

అలాగే, ఆయూనివర్శిటీకి చెందిన కొందరు ముస్లిం ప్రొఫెసర్లు కూడా వందేమాతరం ఉద్యమానికి సంబంధించి నిజాం ప్రభుత్వం, యూనివర్శిటీ అధికారులు అనుసరిస్తున్న పెత్తందారీ, నిరంకుశ విధానాన్ని వ్యతిరేకించారు. అంతేకాదు.

హిందూ విద్యార్థుల పౌరహక్కుల అణచివేతకు, యూనివర్శిటీ అధికారులు అనుసరిస్తున్న మతతత్వ విధానానికి వ్యతిరేకంగా తమ నిరసనను వ్యక్తం చేయడానికి ప్రొఫెసరు ఖలీఫా అబ్దుల్ హకీం, కామ్రేడ్ ఆలంను, అటువంటి భావాలు కలిగిన ముస్లిం విద్యార్థుల గ్రూపులను ఎంతో ప్రోత్సహించారు. అదేవిధంగా ప్రొఫెసరు హుస్సేన్ ఆలీఖాన్ వందేమాతరం ఉద్యమం ప్రారంభమైన తర్వాత కామ్రేడ్ ఓంకార్ ప్రసాద్‌ను కలుసుకొని ఆ ఉద్యమంలో చేరకపోవడానికి కారణం అడిగారు. ఆ ఉద్యమంలో సమ్మె చేస్తున్న సోదర విద్యార్థులకు అండగా వుండాలని ఆయనకు సూచించారు.

ఈ ముస్లిం యువజన విద్యార్థుల గ్రూపు ఆక్షణంలో వందేమాతరం ఉద్యమం విద్యార్థుల పట్ల కేవలం సానుభూతిని వ్యక్తం చేయడానికి మాత్రమే పరిమితమైపోలేదు. ముస్లిం విద్యార్థి లోకంలో మతపరమైన విషక్రిములను జొప్పిస్తుండటాన్ని వ్యతిరేకించడంతోపాటు, వారిని జాతీయోద్యమ, ప్రజాతంత్ర సోషలిస్టు భావాలవైపు ఆకర్షించి, సామ్రాజ్యవాదానికి, ఫాసిజానికి నైజాం నిరంకుశ ప్రభుత్వానికివ్యతిరేకంగావారు సంఘటితమై పోరాడేట్లుచేయడానికి పూనుకొన్నారు.

ఈ మహోన్నత భావాలు, ఆశయాలతో 1939 చివరి మాసాలలో వారు "కామ్రేడ్స్ అసోసియేషన్"గా పిలువబడే ఒక యువజన సంస్థను ఏర్పాటుచేశారు ఈ ప్రారంభ కార్యక్రమం చంచల్‌గూడాలో వున్న కామ్రేడ్ ఆలం ఖుంద్‌మీర్ పూర్వీకుల ఇంటిలో జరిగింది ఈ యువజన సంస్థతో అభ్యుదయ భావాలు గల ప్రొఫెసర్ ఖలీఫా అబ్దుల్ హకీంకు సన్నిహిత సంబంధముంది. ఆయన ఎప్పుడూ తన విద్యార్థులలో మహోన్నతమైన సెక్యులరిజం, సోషలిజం భావాలతో తీర్చిద్దేవారు. ఆయన సూచన మేరకే ఆ సంస్థకు "కామ్రేడ్స్ అసోసియేషన్" అని పేరు పెట్టారు. ఈ సంస్థ ఆశయాలు, లక్ష్యాలు అన్నీ ఆ పేరులోనే ఇమిడి వున్నాయి.

కామ్రేడ్స్ అసోసియేషన్ సంస్థాపక సభ్యులలో కామ్రేడ్సు ఆలం ఖుంద్‌మీర్, సయ్యద్ ఇబ్రహీం, మనిక్‌లాల్ గుప్తా, కుతుబ్-ఎ-ఆలం, హసన్ అలీ మిరజ్, ఎన్. నాగరావు, ఎన్. కె. రావులు వున్నారు ఆ తర్వాత స్వల్పకాలంలోనే మీర్జా హైదర్‌హుస్సేన్, గులామ్ హైదర్, దిల్వార్ అలీఖాన్, రాజ్ బహదూర్ గౌర్, మఖ్దూం మొహియుద్దీన్, జవాద్‌రజ్వీ, ఓంకార్‌ప్రసాద్, హుస్సేని షాహిన్, శ్రీనివాస లహోటీలు ఒకరి తర్వాత మరొకరు ఈ సంస్థలో చేరారు

ఉస్మానియా యూనివర్శిటీకి చెందిన ప్రగతిశీల భావాలు గలిగిన ముస్లిం విద్యార్థులు అత్యంత సాహసోపేతమైన ఇలాంటి తరహా చర్య తీసుకోవడం అప్పటి హైదరాబాదు చరిత్రలోనే అది ప్రథమం. హైదరాబాదు రాజకీయరంగంపై

కామ్రేడ్సు అసోసియేషన్ ఆవిర్భవించడాన్ని ఆకస్మికమైన, యాదృచ్ఛికమైన సంఘటనగా పరిగణించరాదు అంతకుపూర్వం 15 నుండి 20 సంవత్సరాల కాలంలో హైదరాబాదు సామాజిక వ్యవస్థలో పని చేస్తున్న వివిధ రాజకీయ, సామాజిక, సాంస్కృతిక, సాహిత్య ధోరణులు కలిగించిన ప్రభావంవల్లనే ఈ సంస్థ ఏర్పడింది.

## జాతీయవాద, ప్రగతిశీల సాహిత్య ప్రభావం

కొన్ని ఉర్దూ పత్రికలు, జాతీయ స్థానిక వార్తాపత్రికలు కూడా హైదరాబాదు మేధావులతో ప్రజాతంత్ర, లౌకిక చైతన్యాన్ని రగులుకొల్పి వారిని జాతీయోద్యమం వైపు, సోషలిజం వైపు ఆకర్షించడంలో అత్యంత నిర్ణయాత్మక పాత్రను నిర్వహించాయి.

వాటిలో ప్రపథమంగా చెప్పుకోతగ్గది కాజి అబ్దుల్ గఫార్‌కు చెందిన "పయాం" దినపత్రిక (1933). అది దశాబ్దానికిపైగా యువతరాన్ని ప్రోత్సహించి వారిలో స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం, సెక్యులరిజం భావాలు బాగా బలపడేటట్లు కృషి చేసింది. నిజాం ప్రభుత్వం అనుసరిస్తున్న ప్రజా వ్యతిరేక, మతతత్వ రాజకీయాలను ఆ పత్రిక బాగా దుయ్యబట్టేది. అలాగే "రయ్యత్" వారపత్రికగా ప్రారంభమై ఆ తర్వాత అది దినపత్రికగా వెలువడింది. ఆ పత్రిక కూడా ప్రజలలో జాతీయ, ప్రజాతంత్ర చైతన్యాన్ని కలిగించడంలో ప్రధాన పాత్ర నిర్వహించింది. అది మితవాదులైన కాంగ్రెస్‌వారి వాణి అయినప్పటికి కామ్రేడ్సు అసోసియేషన్ ఏర్పాటును, దాని కార్యకలాపాలను బలపరచింది.

లక్నోకు చెందిన నియాజ్ ఫతేపురి, సంపాదకత్వాన వెలువడిన "నైగర్" మాసపత్రిక ఛాందసత్వానికి, మతమౌఢ్యానికి, మూఢ నమ్మకాలకి వ్యతిరేకంగా పోరాడింది. ఇంతేగాదు స్వాతంత్ర్య, సామ్రాజ్యవాద వ్యతిరేక లక్ష్యాన్ని ముందుకు తీసుకు పోవడానికి ఈ పత్రిక కృషి చేసింది. అందువల్ల ఈ పత్రిక అత్యంత ప్రమాదకరమైనదని నైజాం ప్రభుత్వం భావించి హైదరాబాదు సంస్థానంలోకి దాని ప్రవేశాన్ని నిషేధించిది. జమియా, పర్చమ్, నయాదబ్, హిందూస్థాన్, హిందీ, మదీనా (బిజ్‌నూర్) మొదలగు జాతీయవాద, ప్రగతిశీల పత్రికలు హైదరాబాదుతో సహా దేశమంతటా యువతరాన్ని ప్రభావితం చేసాయి. ఆరోజుల్లో అభ్యుదయ పుస్తకాలు, మార్క్సిస్టు సాహిత్యం హైదరాబాదులో చాలా అరుదుగా లభించేది. 1934 లో దేశమంతటా భారత కమ్యూనిస్టు పార్టీ నిషేధించబడింది. హైదరాబాదు సిటీలో అప్పటికి కమ్యూనిస్టు పార్టీ యింకా ఏర్పాటు కాలేదు అయితే రహస్యంగా ప్రచురింపబడిన పార్టీ సాహిత్యం హైదరాబాదుకు మెల్లగా రావడం ప్రారభించింది.

# కామ్రేడ్స్ అసోసియేషన్ ఏర్పాటు - దాని ఆశయాలు, లక్ష్యాలు

పైన ప్రచురించిన ఘటనలు హైదరాబాదు యువకులలో ప్రగతి-శీలమైన మార్పు తీసుకు రావడానికి దోహదపడ్డాయి. అవి క్రమేణా 1939 లో కామ్రేడ్స్ అసోసియేషన్ ఏర్పాటుకు దారితీశాయి.

కామ్రేడ్స్ అసోసియేషన్ రాజకీయ పార్టీ కాదు. నిరంకుశ నిజాం ప్రభుత్వం నుండి అల్పమైన కొన్ని రాజకీయ రాయితీలు, వ్యక్తిగత ప్రయోజనాలు పొందే దృష్టితో సమాజంలోని ఉన్నత వర్గాలు, ఉదారవాద రాజకీయవాదులు దీనిని నెలకొల్పలేదు. ఇది ప్రగతిశీల భావాలున్న యువకుల సంస్థ. సామ్రాజ్యవాదం, ఫాసిజం, మతతత్వం, నిజాం నిరంకుశ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడ టానికై మార్క్సిస్టు, అభ్యుదయ భావాలు గల విద్యార్థులు, యువకులు దీనిని ప్రారంభించారు. ఇది సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫాసిస్టు వ్యతిరేక, నిజాం వ్యతిరేక శక్తులయొక్క, స్వేచ్ఛా ప్రజాస్వామ్యం, లౌకికత్వం, సోషలిజానికి, కట్టుబడి వున్న శక్తులయొక్క విశాలవేదిక, కామ్రేడ్స్ అసోసియేషన్ కమ్యూనిస్టులకు, సోషలిస్టులకు, రాయిస్టులు, కాంగ్రెస్ వాదులకు, ఏ రాజకీయ పార్టీతో సంబంధంలేని అభ్యుదయ వ్యక్తులకు ఉమ్మడి వేదికగా పనిచేసింది.

హైదరాబాదు ప్రజలు ఆనాడు ఎదుర్కొంటున్న ఆహార సమస్యలాంటి కొన్ని తక్షణ సమస్యలను, ట్రేడ్ యూనియన్ సమస్యలను కూడా కామ్రేడ్స్ అసోసియేషన్ చేపట్టింది. ప్రజల పౌర హక్కులను హరించి వేయడానికి వ్యతిరే కంగా కూడా అది పోరాడింది.

ఈ అసోసియేషన్ సంస్థాపకులు దానికి వాంఛనప్రాయంగా నిర్మాణ రూపం ఇచ్చే ఉద్దేశంతో కామ్రేడ్స్ అసోసియేషన్ ప్రారంభ సమావేశాన్ని 1939 డిసెంబరు 13 వ తేదీన [illegible] గంజ్ లోని మార్వాడి పాఠశాలలో ఏర్పాటు చేశారు. దీనికి శ్రీ కాశీనాథరావు వైద్య అధ్యక్షత వహించారు. ఈ సందర్భంగా ఎం. నరసింగరావు, సిరాజుల్ హసన్ తిర్మిజి, అసోసియేషన్ క్రియాశీల కార్యదర్శి సయ్యద్ ఇబ్రహీంలు మాట్లాడారు. మతతత్వానికి వ్యతిరే కంగా పోరాడి, హిందూ ముస్లిం ఐక్యతను పెంపొందించడమే తమ ఆశయం, లక్ష్యాలని [illegible].

1940 సెప్టెంబరు [illegible] తేదీన ఎం. ఎల్. గుప్తా అధ్యక్షతన అసోసి యేషన్ సర్వసభ్య సమావేశం [illegible] జరిగింది. ఈ సమావేశంలో సభ్యుల పరిశీలన కొరకు అసోసియేషన్ కార్యదర్శి ఇబ్రహీం అసోసియేషన్ నియమావళిని

ప్రవేశపెట్టారు. ఆ తర్వాత 1940 సెప్టెంబరు 27 వ తేదీన జరిగిన సర్వసభ్య సమావేశంలో ఆ నియమావళిని కూలంకషంగా చర్చించి ఆమోదించటం జరిగింది.

## రాజకీయ ప్రచారాలు, సభలు

రెండవ ప్రపంచ యుద్ధ జ్వాలలు అప్పటికే యూరప్‌లోని అనేక ప్రాంతాలను చుట్టుముట్టాయి ఒక దేశం తర్వాత మరొకటి ఫాసిస్టు శక్తుల కబంధ హస్తాలకు చిక్కిపోతున్నాయి ఆ సమయంలో కామ్రేడ్స్ అసోసియేషన్ ఆవిర్భవించింది.

పాసిజం ప్రపంచమంతటా ప్రజల స్వాతంత్ర్య, ప్రజాతంత్ర అస్తిత్వానికి తీవ్రమైన ప్రమాదకారిగా పరిణమించింది.

దీనిని దృష్టిలో వుంచుకుని నగరంలోను, కొన్ని జిల్లాలలోనూ ప్రజలను సమీకరించడం ద్వారా, రహస్య సమావేశాలు (నిజాం బహిరంగ సభలను అనుమతించనందున) జరిపి పెరుగుతున్న ఫాసిస్టు ప్రమాదానికి వ్యతిరేకంగా రాజకీయ ప్రచారోద్యమాన్ని కామ్రేడ్స్ అసోసియేషన్ చేబట్టింది.

## నాజీ వ్యతిరేక దినం

**8-9-1940** న నాజీ వ్యతిరేక దినం జరప బడింది. ఈ సందర్భంగా ఒక బహిరంగ సభ జరిపారు. సభకు కుమారి పద్మజా నాయుడు అధ్యక్షత వహించారు. ఈ సందర్భంగా డాక్టర్ ఖలీఫా అబ్దుల్ హకీం, బి. రామకిషన్‌రావు, సిరాజుల్ హసన్ తిర్మైజి, కాశీనాథ్‌రావ్ వైద్య, డాక్టర్ లతా, సయీద్ తదితర ప్రముఖులు ప్రసంగించారు.

1941 సెప్టెంబరు 3 వ తేదీన రెండవ ఫాసిస్టు వ్యతిరేక దినం జరుపడానికి నిర్ణయించింది. అయితే, నిజామ్ ప్రభుత్వ ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్ అందుకు అనుమతి నిరాకరించింది. గత సంవత్సరం జరిగిన మొదటి నాజీ - వ్యతిరేక దినం సందర్భంగా వక్తలు ఫాసిజాన్ని, నిజాంను మాత్రమే గాకుండా బ్రిటీషు ప్రభుత్వాన్ని కూడా తీవ్రంగా ఖండించారన్న సాకుతో అనుమతి యివ్వలేదు. అందువల్ల, బ్రిటీషు పాలకులైన తమ యజమానులను విమర్శిస్తే సహించే స్థితిలో ప్రభుత్వం లేదు. అసోసియేషన్ అధ్యక్షుడు కామ్రేడ్ ఆలమ్ ఖుంద్‌మీర్ ఒక పత్రికా ప్రకటన చేస్తూ, ఫాసిస్టు శక్తుల దురాక్రమణ పన్నాగాలకు వ్యతిరేకంగా ప్రజలను చైతన్యపరచి సమీకరించడానికి ఉద్దేశించిన బహిరంగ సభలపై నిషేధం విధించడాన్ని తీవ్రంగా నిరసించారు. అంతటితో, అసోసియేషన్ వూరుకోలేదు. ''రయ్యత్'' దిన పత్రిక 1941 సెప్టెంబరు 19 వ తేదీ సంచికలో ''ఫాసిజం,

నాజిజం''అనే వ్యాసాన్ని ప్రచురించింది. ఫాసిజం ప్రమాదానికి, బ్రిటీషు సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా హైదరాబాదు ప్రజలను ఉత్తేజ పరచడానికి ''ఫాసిజం'' అన్న శీర్షికతో చిన్న కరపత్రం కూడా తీసుకురాబడింది.

## కామ్రేడ్సు అసోసియేషన్ ప్రథమ వార్షిక మహాసభ

1940 డిసెంబరులో "బొంబాయి క్రానికల్" సంపాదకుడు ఎస్. అబ్దుల్లా బ్రెల్వి అధ్యక్షతన ప్రథమ వార్షిక మహా సభను జరపాలని కామ్రేడ్సు అసోసియేషన్ నిర్ణయించింది. అందుకు ఒక సన్నాహక సంఘం ఏర్పాటు అయింది.

కుమారి పద్మజా నాయుడు, రావి నారాయణరెడ్డి, సిరాజుల్ హసన్ తిర్మైజి, ఎం. నరసింగరావు, డాక్టర్ జై. సూర్యనాయుడు, లక్ష్మినివాస్ జెనెరివాల్, మహమ్మద్ సిద్దికి లు కామ్రేడ్సు అసోసియేషన్ ఆశయాలు, లక్ష్యాలకు తోడ్పాటు యిచ్చి వార్షిక మహా సభను జయప్రదం చేయడానికి తమ నైతిక పాదార్థిక సహాయం చేయవలసిందిగా ప్రజలకు విజ్ఞప్తిజేస్తూ పత్రికలకు ఒక సంయుక్త ప్రకటన 2-12-1940 న విడుదల చేసారు

మహాసభ జరుపుకోడానికి నిజాం ప్రభుత్వం అనుమతి యివ్వనందున చేసిన కృషి అంతా వృధా అయిపోయింది. అందువల్ల అసోసియేషన్ సభ్యులు, సానుభూతిపరులు ఆహ్వానితులతో ఆ మహా సభను ప్రయివేటు సమావేశంగా మార్పు చేయాల్సి వచ్చింది. ఈ సమావేశం 1940 డిసెంబరు 20 న సుల్తాన్ బజార్లోని హష్మత్‌గంజ్‌లో జరిగింది. సమావేశానికి అసోసియేషన్ నూతన అధ్యక్షుడు కామ్రేడ్ ఆలంఖుంద్‌మీర్ అధ్యక్షత వహించారు. ఈ సమావేశంలో పెద్ద సంఖ్యలో యూనివర్శిటీ విద్యార్థులు- హిందువులు, ముస్లింలు, అనేకమంది స్టేటు కాంగ్రెస్ ఆంధ్ర మహా సభ నాయకులు పాల్గొన్నారు. వారిలో సిరాజుల్ హసన్ తర్మైజి, ఎం. నరసింగరావు, సేట్ లక్ష్మినివాస్, గనేరివాల్, హరీష్ చంద్రహెడ, డి హెచ్ దేశాయి, రామచంద్రరావు అంతూ, డాక్టర్ జై. సూర్యనాయుడు, రావి నారాయణరెడ్డి, ఒద్దం ఎల్లారెడ్డి, మఖ్దుం మొహియుద్దీన్ (ఆయన అప్పుడు సిటీకాలేజీ టీచరుగా పనిచేస్తున్నారు ) తదితర ప్రముఖులు వున్నారు

సమావేశంలో అసోసియేషన్ కార్యదర్శి సయ్యద్ ఇబ్రహీం గత రెండు సంవత్సరాల కార్యకలాపాల నివేదికను చదివి వినిపించారు. ఆ తర్వాత కామ్రేడ్ ఆలం అధ్యక్ష ఉపన్యాసం చేస్తూ ఆనాడు నెలకొని వున్న అంతర్జాతీయ పరిస్థితిని గురించి వివరించారు హైదరాబాదు ప్రజలలో అంతర్జాతీయ దృక్పథాన్ని కలిగించాల్సిన ఆవశ్యకత గురించి నొక్కి చెప్పారు. అసోసియేషన్ ఆశయాలు,

లక్ష్యాల గురించి వివరిస్తూ, మత తత్వానికి వ్యతిరేకంగా పోరాడుతూ ప్రజలలో చైతన్యం రగుల్కొల్పాల్సిన ఆవశ్యకత గురించి నొక్కి చెప్పారు. అలాగే బహిరంగ సభ జరుపుకోడానికి అసోసియేషన్‌కు అనుమతి యివ్వని ప్రభుత్వ చర్యను కూడా ఆయన నిరసించారు.

సమావేశం ఈ క్రింది విషయాలపై తీర్మానాలు ఆమోదించింది

1. అసోసియేషన్ బహిరంగ సభ జరుపుకోవడానికి అనుమతి యివ్వ నిరాకరించిన ప్రభుత్వ చర్యను సమావేశం నిరసించింది.
2. కార్మికుల, రైతుల సంక్షేమానికి సంబంధించి చట్టాలు చేయాలనిడిమాండు చేసింది.
3. అన్ని జీవన రంగాలలో మహిళలకు సమాన ప్రతిపత్తి కల్పించాలని డిమాండు చేసింది.
4. ప్రభుత్వం అనుసరిస్తున్న అభివృద్ధి నిరోధక విధానాలను ఖండించింది.
5. నిర్బంధ విద్యను ప్రవేశ పెట్టాలని కోరింది.
6 అన్ని కాలేజీలు, పాఠశాలల్లో విద్యార్థి యూనియన్ల ఏర్పాటుకు విద్యార్థులకు గల హక్కులను ఆమోదించాలని చేసింది.

## హిందూ-ముస్లిం ఐక్యతా దినోత్సవం

1941 మే దినోత్సవాన్ని హిందూ - ముస్లిం ఐక్యతా దినోత్సహంగా పాటించి ఖాజీ అబ్దుల్ గఫార్ అధ్యక్షతన ఒక బహిరంగ సభ జరుపాలని అసోసియేషన్ నిర్ణయించింది. అయితే, నిజాం ప్రభుత్వం, ఈ సభ జరుపుకోడానికి అనుమతి నిరాకరించింది. ఇప్పుడు మే దినోత్సవం, ట్రేడ్ యూనియన్లు మాత్రమే గాక రాష్ట్రప్రభుత్వాలు కూడా జరుపుతున్నాయి. అయితే ఆ రోజుల్లో మే దినోత్సవం అత్యంత ప్రమాదకరమైనదిగా పరిగణించబడింది నిజాం నిరంకుశ పరిపాలకుల ప్రధాన కుతంత్రం హిందూ-ముస్లిం ప్రజల మధ్య విభజనను, అనైక్యతను శాశ్వతం చేయడమే. అందువల్ల నిజాం ప్రభుత్వ చర్యలోని అంతరార్థం సుస్పష్టం. ప్రభుత్వం పౌరహక్కులను అణచివేయడాన్ని నిరసించడానికిగానూ అదే రోజున “రయ్యత్'' దిన పత్రిక ఆఫీసులో ఒక ప్రయివేటు సమావేశం ఏర్పాటు చేయబడింది. ఆ సమావేశంలో దాని సంపాదకుడు ఎం. నరసింగరావు, సిరాజుల్ హసన్ తిర్మైజి, హరిశ్చంద్ర హెడా, ఆలం ఇబ్రహీం, అసోసియేషన్‌కు చెందిన యితర సభ్యులు పాల్గొన్నారు. అసోసియేషన్ ప్రతినిధి వర్గం ఒకటి ప్రభుత్వ అధికారులను కలుసుకుని ప్రభుత్వ చర్యకు తీవ్ర నిరసన తెలపాలని నిర్ణయించారు. బహిరంగ సభ జరపడానికి ప్రభుత్వం ఈ కార్యక్రమేడున్న

అసోసియేషన్‌కు అనుమతి యివ్వనందున "హిందూ-ముస్లిం ఐక్యత"పై ఒక కరపత్రం వేసి పెద్ద ఎత్తున పంపిణీచేశారు. ఈ కరపత్రంలో మార్క్సిస్టు దృక్పథం నుండి మతతత్వ సమస్యను వివరించటం జరిగింది. దారిద్ర్యం నిరుద్యోగ సమస్య కులంమతాలతో నిమిత్తం లేకుండా అందరినీ పట్టి పీడిస్తోందని, అందువల్ల వాటిని కుల, మతాలతో నిమిత్తం లేకుండా ఆర్థిక, రాజకీయ సమస్యలుగా పరిగణించాలని నొక్కి చెప్పటం జరిగింది.

## రెండవ వార్షిక సమావేశం

అసోసియేషన్ రెండవ వార్షిక సమావేశం కూడా 1941 డిసెంబరు 21 వ తేదీన హష్మత్ గంజ్‌లోని మార్వాడీ విద్యాలయంలో కామ్రేడ్ ఆలం ఖుంద్‌మీర్ అధ్యక్షతన ప్రయివేటుగానే జరిగింది. ఈ సమావేశంలో అనేక మంది రైల్వే కార్మికులు ఎన్. యస్. రైల్వే ఎంప్లాయిస్ యూనియన్ ఉపాధ్యక్షుడు రాఘవేంద్రరావు, యూనియన్ ప్రధాన కార్యదర్శి రామచంద్రరావు, తదితర యూనియన్ నాయకులు పాల్గొన్నారు. సమావేశం రావినారాయణ రెడ్డిగారి ఉపన్యాసంతో ప్రారంభమైంది. కార్మిక, రైతాంగ సమస్యలపై ప్రధాన తీర్మానాలు ఈ సమావేశంలో ఆమోదించ బడ్డాయి.

ఈ క్రింది డిమాండ్లపై 3 తీర్మానాలను అధ్యక్షుడు ప్రతిపాదించగా ఆమోదించబడ్డాయి.

1. జైళ్ళు కటకటాల వెనుక యింకా మగ్గుతున్న రాజకీయ ఖైదీలందరినీ విడుదల చేయాలి.
2. నెలకు రు. 500/-అంతకు పైగా పొందుతున్న ప్రభుత్వోద్యోగుల వేతనాలలో 50% కోత పెట్టాలి
3. సంస్థానంలో అక్షరాస్యత 5% మాత్రమే వున్నందున ప్రభుత్వం లక్ష్యంగా వున్న అన్నివనరులను వినియోగించి పెద్దఎత్తున విద్యాప్రబోధం చేయాలి

సమావేశం క్రింది తీర్మానాలను కూడ ఆమోదించింది.

1. సంస్థాన ప్రజలందరికీ పూర్తిగా పౌరహక్కులు కల్పించాలి.
2. (i) సమగ్ర ట్రేడ్ యూనియన్ చట్టాన్ని ఆమోదించాలి (ii) కార్మికులు సభలు జరుపుకోడానికి, తమ యూనియన్లను ఏర్పాటు చేసుకోవడానికి స్వేచ్ఛ యివ్వాలి.
3. (i) తగినంత వర్షపాతం లేని అన్ని ప్రాంతాలలో పూర్తిగా భూమిశిస్తు రెమిషన్ యివ్వాలి. (ii) ఆర్థిక సంక్షోభానికి రైతులు గురికాకుండా చూడటానికిగాను యితర అన్ని ప్రాంతాలలో 50% రెమిషన్ మంజూరుచేయాలి.

4. జాగీర్ల సమస్యను ప్రభుత్వం తక్షణం పరిశీలించాలి. జాగీర్ పాలనను కనీసం ఖల్సా పాలనతో సమానంగా చేయాలి.
5. పేదవర్గాలపై పన్నులను తగ్గించాలి. సంపన్న వర్గాల ఆదాయాలపై వృద్ధి క్రమానుగత పన్నులు విధించాలి

## జపాన్ వ్యతిరేక దినం

జపాన్ వ్యతిరేక దినం పాటించడానికిగాను 31-7-1942వ తేదీన "జమరుద్‌మహల్ టాకీస్"లో కామ్రేడ్ మఖ్దూం మొహియుద్దీన్ అధ్యక్షతన పెద్ద సభ జరిగింది. ఈ సమావేశంలో ఎం. నరసింగరావు, బద్రిచంద్ చౌదరి (కాంగ్రెస్), సయ్యద్ మహమ్మద్ అహసన్, మహమ్మద్ అలీ (మజ్లిస్-ఎ-ఇత్తెహాదుల్ ముస్లమీన్), పండిట్ నరేందర్‌జీ, హకీం శివప్రసాద్ (ఆర్య సమాజ్), షఫిఖలేది, సాలాల్ (రజాకార్ సంస్థ), కాజి అబ్దుల్ గఫార్ ('పయాం' దినపత్రిక సంపాదకులు), ఫతేవుల్లాఖాన్ (ప్రముఖ ట్రేడ్‌యూనియన్ నాయకుడు) పాల్గొనడం ప్రధానంగా చెప్పుకోదగ్గ విషయం. ఈ సమావేశం సందర్భంగా విద్యార్థి వాలంటీర్లు "జపాన్ మన శత్రువు", "జుగోజగావో" అన్న నినాదాలు వ్రాసి వున్న చిన్న పేపరు జండాలను విక్రయించారు.

మఖ్దూం వ్రాసిన ప్రఖ్యాత గేయం "జంగ్-ఎ-ఆజాది"ని అచ్చు వేయించి సభలో పాల్గొన్నవారికి పంచిపెట్టారు.

ఈ సందర్భంగా డాక్టర్ జైసూర్యనాయుడు, ఫతేనుల్లాఖాన్, సిరాజుల్ హసన్ తిరిమైజీ, కామ్రేడ్ ఆలంలు మాట్లాడారు కామ్రేడ్ రావి నారాయణరెడ్డి సమావేశంలో ప్రధాన రాజకీయ తీర్మానాన్ని ప్రతిపాదించారు. అందులో ఈ క్రింది డిమాండ్లు ఉన్నాయి :

1. ఎన్నికైన ప్రజాప్రతినిధులతో స్టేట్ ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్‌ను పునర్వ్యవస్థీకరి చాలి.
2. అదే పద్ధతిలో ప్రస్తుత డిఫెన్సు కౌన్సిల్‌ను పునర్వ్యవస్థీకరించాలి.
3. ఎయిర్ రైడ్ ప్రొటెక్షన్ (ఎ ఆర్. పి) సర్వీసులను పునర్వ్యవస్థీకరించాలి.
4. ప్రజల పౌర హక్కులను పునరుద్ధరించాలి.
5. రాజకీయ ఖైదీలందరినీ విడుదల చేయాలి.
6 దేశ రక్షణకొరకు ప్రజలకు ఆయుధాలివ్వాలి
7 యుద్ధ వ్యయ భారాన్ని అన్ని వర్గాల ప్రజల మధ్య సమానంగా పంచాలి. పేదలపై యుద్ధ విరాళాల భారాన్ని మోపరాదు.

8 వాలంటరీ సంస్థలపై ఆంక్షలను తొలగించాలి.

9. గజిటెడ్ అధికార్ల వేతనాన్ని తగ్గించాలి.

10. ప్రజలకు చౌకధరపై ధాన్యం సప్లయి చేయాలి

11. పారిశ్రామిక కార్మికులకు 25% డి ఎ. (జీవనభృతిని) యివ్వాలి

పై డిమాండ్ల ప్రాతిపదికపై అన్ని రాజకీయ పార్టీల, గ్రూపుల, వ్యక్తుల విస్తృత సహకారాన్ని కోరాలని, ఈ డిమాండ్ల సాధనకు సాధ్యమైనంత ఎక్కువగా ప్రజలను సమీకరించి ఐక్యపరచాలని కామ్రేడ్సు అసోసియేషన్ తీర్మానించింది.

## ఐక్యతా దినోత్సవం

వి. ఐ. లెనిన్ వర్ధంతి ఉత్సవం సందర్భంగా కామ్రేడ్సు అసోసియేషన్ 1943 జనవరి 21 వ తేదీన "ఐక్యతా దినోత్సవం" నిర్వహించింది. ఈ సందర్భంగా జరిపిన బహిరంగసభలో ప్రజలు పెద్ద సంఖ్యలో పాల్గొన్నారు. ఔరంగాబాదుకు చెందిన కామ్రేడ్ హబీబుద్దీన్ సభకు అధ్యక్షత వహించారు.

నిజాం సంస్థానంలోని రైల్వే కార్మికులు 45 రోజుల పాటు జరిపిన చారిత్రక సమ్మె పూర్వ రంగ-లో పైసభ జరిగింది. ఈ సభలో పెద్ద సంఖ్యలో రైల్వే కారికులు, ఆల్విన్ మెటల్ వర్క్సు కార్మికులు వారి నాయకులైన రామచందర్‌రావు, రాఘవేందర్ రావులు పాల్గొన్నారు.

ఆనాటి సంక్లిష్ట పరిస్థితిలో కామ్రేడ్సు అసోసియేషన్ సంస్థాన రాజకీయ జీవితంలో ప్రతిష్టంభనను తొలగించి హిందూ, ముస్లింల మధ్య ఐక్యతను తీసుకువచ్చే దృష్టితో ఒక తాత్కాలిక పరిష్కారంతో ముందుకు వచ్చింది. స్టేట్ ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్‌లో ముస్లింలకు 50% సీట్లు, ఆంధ్రమహాసభ, మహారాష్ట్ర, కర్నాటక పరిషత్‌ల ప్రతినిధులకు మిగిలిన 50% సీట్లు యివ్వాలన్న పరిష్కారాన్ని ముందుపెట్టింది. అదే సమయంలో బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పాటు చేయాలన్న డిమాండ్‌కు పూర్తి తోడ్పాటు యిచ్చింది.

పైన పేర్కొన్న డిమాండ్లను ఐక్యతా దినోత్సవం సభ ముందు పుంచారు. జాతీయ ప్రభుత్వాల క్రింద ముస్లింలు తమ సర్వీసులు కోల్పోకుండా చూచేందుకుగాను తమ పోరాటాన్ని కొనసాగిస్తామని కామ్రేడ్స్ అసోసియేషన్ నాయకులు ప్రకటించారు.

"ఐక్యతా దినోత్సవ సభ"ను పురస్కరించుకొని రాజగోపాలాచారి, సి. పి. ఐ. ప్రధాన కార్యదర్శి పి.సి. జోషి, కామ్రేడ్ సజ్జాద్ జహీర్ తదితరులు తమ సందేశాలు పంపారు.

కామ్రేడ్సు అసోసియేషన్ నాయకులు ప్రాంతీయ కాన్ఫరెన్సుల ఆంధ్ర మహాసభ మహారాష్ట్ర, కర్ణాటక పరిషత్‌ల నాయకులను కలుసుకొని అసోసియేషన్ ప్రతిపాదించిన పైన పేర్కొన్న రాజకీయ నినాదాలకు తోడ్పాటు ఇవ్వాలని కోరారు. అయితే ఆంధ్ర మహాసభ, కాంగ్రెస్‌లోని కొందరు ఉదారవాదులు తప్ప మిగతావారు నిర్లిప్తత వ్యక్తం చేశారు.

## వివిధ రాజకీయ సమస్యలపై ఉపన్యాసాలు, చర్చలు

జర్మనీ, జపాన్ ఫాసిజానికి వ్యతిరేకంగా గట్టి ప్రచారోద్యమాన్ని కామ్రేడ్స్ అసోసియేషన్ నిర్వహించింది. హైదరాబాద్ ప్రజల రాజకీయ చైతన్యాన్ని పెంపొందించేందుకు అనేక రాజకీయ సమస్యలను, జాతీయ, అంతర్జాతీయ సమస్యలను కూడా అసోసియేషన్ చేపట్టింది. ఇందుకోసం ప్రముఖ వ్యక్తుల ఉపన్యాసాలను, చర్చలను ఏర్పాటు చేసింది. వివిధ సమస్యలపై కరపత్రాలు ప్రచురించింది.

జమ్మూ, కాశ్మీర్ నేషనల్ కాన్ఫరెన్సు అధ్యక్షుడు, ఆల్ఇండియా స్టేట్స్ పీపుల్స్ కాన్ఫరెన్సు స్టాండింగ్ కమిటీ సభ్యుడు అయిన షేక్ అబ్దుల్లా హైదరాబాదు సందర్శించినపుడు 27-2-1940 వ తేదీన కామ్రేడ్సు అసోసియేషన్ సభ్యులు, సానుభూతి పరులు, తదితరులతో ఒక సమావేశం ఏర్పాటు చేసారు. అందులో షేక్ అబ్దుల్లా ప్రసంగించారు.

ఈ అసోసియేషన్ 1942 ఆగష్టు 22 వ తేదీన హష్మత్‌గంజ్‌లో భారత కమ్యూనిస్టు పార్టీకి చెందిన ప్రముఖ నాయకులు కామ్రేడ్ జలాలుద్దీన్ బుఖారి ప్రసంగాన్ని ఏర్పాటు చేసింది. ఈ సందర్భంగానే బుఖారి జాతీయ, అంతర్జాతీయ రంగాలలో జరుగుతున్న కొత్త పరిణామాల గురించి వివరించారు.

## కామ్రేడ్సు అసోసియేషన్ శాఖలు

అసోసియేషన్ ఆశయాలు, లక్ష్యాలను ప్రజలలో ప్రచారం చేయడానికి, యువతరంలో వ్యాప్తి చేసేందుకు, నగరంలోని వివిధ ప్రాంతాలలో దాని కార్యకలాపాలు విస్తరించడానికి 1940 అక్టోబర్ 8 వ తేదీ నుండి 15 వ తేదీ వరకు "కామ్రేడ్సు వారోత్సవం" పాటించాలని, యీ సందర్భంగా సభ్యత్వ ప్రచారోద్యమాన్ని ప్రారంభించాలని, వివిధ పేటలలో శాఖలను ప్రారంభించాలని నిర్ణయించారు [7]

ఆ తర్వాత నగరంలోని ఈ క్రింది పేటలలో కామ్రేడ్సు అసోసియేషన్ శాఖలు ఏర్పాటు చేయబడ్డాయి. 1) మల్లెపల్లి (1940 మే 15) 2) దరు-షిఫా (1941 మే 4) 3) మలక్‌పేట 4) చంచలగూడ 5) షాలిబండ 6) జాంబాగ్ 7) సికింద్రాబాదు.

సాధ్యమైన చోట్ల రీడింగ్ రూములను, చిన్న లైబ్రరీలను ప్రారంభించడం సాధారణంగా జరిగిన పని. వాటిని ఆయా శాఖలకు అనుబంధించారు.

## ట్రేడ్‌యూనియన్ ఉద్యమం-కామ్రేడ్స్ అసోసియేషన్

కామ్రేడ్స్ అసోసియేషన్ సహజంగానే పారిశ్రామిక కార్మికులను సంఘటితపరిచి వారి యూనియన్లు ఏర్పాటు చేయడం పట్ల అత్యంత ఆసక్తిని ప్రదర్శించింది అయితే, దురదృష్టవశాత్తు ఆనాటికి నగరంలో అతి కొద్ది పరిశ్రమలు మాత్రమే వుండేవి. ఆ పరిశ్రమలలో ఎటువంటి యూనియన్లు లేవు.

సికింద్రాబాదులో 1927 లో లాలాగూడ వర్క్‌షాపులో గొప్ప సంచలనం కలిగించిన సమ్మె జరిగిన ఫలితంగా రైల్వే వర్కర్స్ యూనియన్ ఏర్పాటైంది వి. వి గిరికి ఈ యూనియన్ ఏర్పాటుతో కూడా సంబంధం వుండటం ఆసక్తి కల్గించే విషయం. ఆ తర్వాత 1935 లో బొంబాయికి చెందిన ముంబై గిర్ని కంగార్ యూనియన్ ప్రభావంతో ఔరంగాబాదు గిర్ని కంగార్ యూనియన్ ఏర్పాటైంది.

1940 దశకం ప్రథమార్థంలో నగరంలోని అనేక పరిశ్రమలలో కార్మికులు వరుసగా సమ్మెలు చేశారు. కార్మిక వర్గంలో పెరిగిన అశాంతి ఆ విధంగా వ్యక్తం కావడం ప్రారంభమైంది.

అజామాబాదులోని వజీర్ సుల్తాన్ సిగరెట్ ఫ్యాక్టరీ కార్మికులు 1941 నవంబరులో సమ్మె చేశారు. 1941 నవంబరు 6 వ తేదీన కామ్రేడ్స్ అసోసియేషన్ కార్యవర్గం సమావేశమై సమ్మె చేస్తున్న కార్మికులకు సంఘీభావం తెలిపింది. "ఈ ఫ్యాక్టరీ వివాదంలో జోక్యం చేసుకుని, సాధ్యమైనంత త్వరగా ఆ పేద, కార్మికుల డిమాండ్లను యాజమాన్యం ఆమోదించేట్లు వత్తిడి తీసుకురావాలని" ప్రభుత్వానికి, నిజాంకు విజ్ఞప్తి చేసింది.

ఎబిడ్‌బాగ్ సమీపంలో ఒక ఆల్విన్ కత్తుల ఫ్యాక్టరీ (అక్కడ ప్రస్తుతం న్యూసైన్సు కాలేజీ వుంది) వుండేది. అది పారిశ్రామిక వేత్తలైన అల్లావుద్దీన్ గ్రూప్స్ యాజమాన్యాన వుండేది. ఈ ఫ్యాక్టరీ కార్మికులు 1942 నవంబరులో సమ్మె చేశారు. కామ్రేడ్సు అసోసియేషన్ నేరుగా యీ సమ్మెలో జోక్యం చేసుకుంది. నాయకత్వాన్ని చేపట్టింది. కామ్రేడ్ ఆలం యూనియన్ అధ్యక్షుడుగా ఎన్నికయ్యారు. ఈ సమ్మె ఒకటిన్నర నెలకు పైగా కొనసాగింది. కార్మికులు సహజంగానే అనేకకష్టాలను ఎదుర్కొనవలసివచ్చింది. అందువల్ల సమ్మెచేస్తున్న ఈకార్మికులకు తోడ్పాటుగా ప్రజాభిప్రాయాన్ని సమీకరించగానికిగాను కామ్రేడ్స్ అసోసియేషన్ కార్యవర్గం 1942 నవంబరు 22 వ తేదీన సమావేశమై కార్మికుల

డిమాండ్లను, సమ్మెను బలపరుస్తూ ఒక తీర్మానం ఆమోదించింది. అంతే గాదు, వారి డిమాండ్లను, ఆమోదించాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసింది. ఈ వివాదంలో జోక్యం చేసుకుని ఆ కార్మికుల సమస్యలను పరిష్కరించాలని ప్రభుత్వానికికూడా విజ్ఞప్తి చేసింది.'' ఈ తీర్మానం ప్రతిని నిజాం ప్రభుత్వ ప్రధానమంత్రికి పంపుతూ వెంటనే జోక్యం చేసుకోవాలని కోరింది.

ఆదే సమయంలో, ఎన్.ఎస్ రైల్వే కార్మికులు 45 రోజులపాటు మహత్తర సమ్మె జరిపారు. 1942 నవంబర్ - డిసెంబరు మాసాలలో జరిగిన ఈ సమ్మెకు యూనియన్ అధ్యక్షుడు శ్రీ ఫతేవుల్లాఖాన్, (ఉదారవాద కార్మిక నాయకుడు) నాయకత్వం వహించారు. ఈ సమ్మె సందర్భంగా నిజాం ప్రభుత్వం ఫతేవుల్లా ఖాన్‌ను, యూనియన్‌కు చెందిన యితర నాయకులను అరెస్టు చేసింది. రైల్వే కార్మికులు క్లిష్ట పరిస్థితిలో పడ్డారు. అందువల్ల కామ్రేడ్సు అసోసియేషన్ నాయకులైన కామ్రేడ్ ముఖ్దుం, రాజ్ బహదూర్‌గౌర్ ఆలంలు తమ సహకారాన్ని అందజేశారు. సమ్మె నిర్వహించడానికి, దానిని విజయవంతం చేయడానికి సాధ్యమైనంత సహాయం చేశారు. ఫతేవుల్లా ఖాన్, ఇతర కార్మిక నాయకులు జైలు నుండి విడుదల కాగానే కామ్రేడ్సు అసోసియేషన్ ఒక సమావేశాన్ని జరిపి సమ్మెను విజయవంతం చేసిన వారిని అభినందించింది

కొన్ని బటన్ ఫ్యాక్టరీలు మినహా, హైదరాబాదు నగరంలో వున్న కొద్ది పరిశ్రమల్లో ఎక్కువ భాగం అజామాబాద్, కవాడిగూడా, సికింద్రాబాదులలో వున్నాయి. గుండీల ఫ్యాక్టరీలు చిన్నవి, పెద్దవి మాత్రం పాతబస్తీలోనే వుండేవి.

ఈ ఫ్యాక్టరీలలో ఎక్కువ భాగం ముస్లింల యాజమాన్యంలో ఉండేవి. మెజారిటీ కార్మికులు కూడా ముస్లింలే. ఈ ఫ్యాక్టరీలలో పని పరిస్థితులు అత్యంత దారుణంగా వుండేవి. వారి వేతనాలు కూడా అంతంత మాత్రమే. పని భారం చాలా ఎక్కువ ఆ కార్మికులకు వారాంతపు సెలవులుగాని మరే ఇతర సెలవు సౌకర్యాలు గాని లేవు. అంతేకాదు వారికి ఉద్యోగ భద్రత ఏ మాత్రం లేదు. ఎక్కువ దోపిడీ చేసి అధిక లాభాలు ఆర్జించడానికి గాను యీ ఫ్యాక్టరీల యజమానులు, వృద్ధులను, యువకులను చిన్న పిల్లలను సైతం వాడుకునేవారు. ఈ అమానుష పరిస్థితులే కార్మికులలో అశాంతిని సృష్టించాయి. ఫలితంగా కార్మికులు సమ్మెలు చేశారు. వాటికి కామ్రేడ్ గులాం హైదర్, కామ్రేడ్ ముఖ్దుంలు నాయకత్వం వహించారు.

## రాజకీయ పాఠశాల

ఆంధ్ర మహాసభలో ముఖ్య కార్యకర్తలుగా వుండి కమ్యూనిస్టు పార్టీతో పరిచయం ఏర్పడిన రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, ఆరుట్ల లక్ష్మీనరసింహా

రెడ్డి, ఆరుట్ల రామచంద్రారెడ్డి, సర్వ దేవర భట్ల రామనాథం, పెరవలి వెంకట రమణయ్య, దేవులపల్లి వెంకటేశ్వరరావు, గంగసాని గోపాలరెడ్డి, చిర్రావూరి లక్ష్మి నర్సయ్య గార్లకు కృష్ణా జిల్లా తునికిపాడులో 1940 లో కామ్రేడ్ చంద్ర రాజేశ్వరరావు రహస్యంగా ఒక ప్రత్యేక రాజకీయ పాఠశాలను నిర్వహించారు. స్కూలు ఆరంభమైన 4 రోజుల తరువాత ఇది పోలీసులకు తెలిసి, స్కూలుపై దాడి చేయనున్నారని వార్త తెలియడంతో, వారంతా అక్కడి నుండి రావి నారాయణరెడ్డి గారి స్వగ్రామం బొల్లేపల్లికి వెళ్ళారు. నారాయణరెడ్డి గారి ఇంట్లోనే ఆ పాఠశాలను కొనసాగించారు అటు తరువాత వీరందరు పార్టీ సభ్యులయ్యారు.

## మల్కాపురం ఆంధ్ర మహాసభ

ఈ పాఠశాల జరిగిన తరువాత రంగారెడ్డి జిల్లా మల్కాపురంలో 1940 ఏప్రిల్‌లో జరిగిన 7 వ ఆంధ్ర మహాసభకు ఇతర కామ్రేడ్సుతో పాటు అజ్ఞాతవాసంలో వున్న చంద్ర రాజేశ్వరరావుగారు కూడ హాజరయ్యారు. ఈ మహా సభలో చర్చకు వచ్చిన విషయాలపై కమ్యూనిస్టులుగా వున్న రావి నారాయణరెడ్డి మొదలగువారు స్పష్టమైన అతివాద వైఖరి తీసుకున్నారు.

1939 మునగాల రైతు ఉద్యమ నిర్వహణ సందర్భంగా అక్కడికి వెళ్ళిన సందర్భాలలో కామ్రేడ్ రాజేశ్వరరావు సూర్యాపేట, ఖమ్మం పట్టణాలకు కూడ వెళ్ళుతుండేవారు. ఖమ్మంలో చిర్రావూరి లక్ష్మినర్సయ్య సూర్యాపేటలో దేవులపల్లి వెంకటేశ్వరరావు ఆ విధంగా కాంటాక్టులోకి వచ్చారు. మల్కాపురం ఆంధ్ర మహా సభ తరువాత తెలంగాణా ప్రాంతంలోని కమ్యూనిస్టు ఉద్యమాన్ని గురించి రాజేశ్వరరావు ఆంధ్ర రాష్ట్ర కమిటీకి నివేదించారు. అప్పటినుంచి తెలంగాణా ప్రాంత ఉద్యమానికి రాష్ట్ర కమిటీ తరఫున కామ్రేడ్ రాజేశ్వరరావు బాధ్యుడుగా వున్నారు. భువనగిరి ఆంధ్ర మహా సభ వరకు ఈ ఏర్పాటే కొనసాగింది. ఈ కాలంలో రాజేశ్వరరావు పలుదఫాలు తెలంగాణా ప్రాంతానికి వచ్చి, పార్టీ నిర్మాణానికి, ప్రజా ఉద్యమాభివృద్ధికి తోడ్పడ్డారు

హైదరాబాదు సంస్థానంలో రాజ్యాంగ సంస్కరణలను సూచించడానికి నియమించబడిన అయ్యంగార్ కమిటీ ప్రభుత్వానికి తన నివేదికను సమర్పించింది. ఈ నివేదికలో ప్రజలకు వృత్తి పూర్వకమైన ప్రాతినిధ్యం (ఫంక్షనల్ రిప్రజెంటేషన్) వుండాలని సూచించబడింది. తక్కువ సంఖ్యాకులైన జాగిర్దార్లకు, వర్తకులకు ఎంత ప్రాతినిధ్యం వున్నదో, అత్యధిక సంఖ్యాకులైన రైతులకు కూడా అంతే ప్రాతినిధ్యం ఆ కమిటీ నివేదికలో సూచించబడింది.

మల్కాపురం మహాసభలో రాజ్యాంగ సంస్కరణలపై ప్రధాన తీర్మానాన్ని రావి నారాయణరెడ్డి గారు ప్రవేశ పెట్టారు. ఈ సంస్కరణలను

బహిష్కరించాలని ఆ తీర్మానంలో పేర్కొనబడింది. దీనికి మందుముల నరసింగ రావు మొదలగు మితవాదులు ఒక సవరణ పెట్టారు. చర్చల తర్వాత జరిగిన ఓటింగులో సవరణ వీగిపోయి అసలు తీర్మానం అత్యధిక ఓట్లతో ఆమోదించ బడింది.

అప్పటికి ఆంధ్ర మహాసభలో అతివాద యువకుల ప్రాబల్యం ఎంత వున్నదీ ఈ సంఘటనవల్ల స్పష్టమవుతుంది దీనిని గురించి మాడపాటి హనుమంత రావు గారు రచించిన 'ఆంధ్రోద్యమం' అన్న గ్రంథములో యిలా వ్రాసారు

## రాజ్యాంగ సంస్కరణలు

"19 జులై 1939 నాడు ప్రభుత్వం వారి వలన ప్రకటింప బడిన రాజ్యాంగ సంస్కరణములు తీవ్రంగా విమర్శించి ఖండింపబడుటయేగాక అట్టి నిరుపయోగములును, అభివృద్ధి నిరోధకములునగు సంస్కరణములను బహిష్క రించవలయునను తీర్మానము ప్రతిపాదింపబడెను. దీనిలోని 'బహిష్కరించ వలయును అను భాగమును తొలగించవలయునని మితవాద నాయకులు ప్రవేశ పెట్టిరి. ఉభయ పక్షముల వాదములు జరిపిన మీదట తీర్మానమును ఓటింగుకు పెట్టగా సవరణ వీగిపోయి తీర్మానము అత్యంత బహుళ సంఖ్య ఆమోదము పొంది అంగీకరింపబడెను.

"ఇట్టి ముఖ్యమగు తీర్మానమునకు అనుకూలముగ ప్రసంగించిన వారి యొక్కయు దీనికి సవరణ యవసరమని ప్రసంగించిన వారియొక్కయు పేర్లు తెలిసికొనుట పాఠకులకు ఉపయోగకరముగా నుండును. కనుక వానిని తెల్పెదను. తీర్మానము ప్రతిపాదించిన మహాశయుడు శ్రీ రావి నారాయణరెడ్డిగారు. దాని నామోదించిన వారు శ్రీయుతులు ఎన్. కె. రావు, కాశోజీ నారాయణరావు, కీర్తి శేషులు పోల్కంపల్లి వెంకటరామారావు గారలు. సవరణలు ప్రతిపాదించినవారు శ్రీ మందుముల నరసింగరావుగారు సవరణ నామోదించుతూ ఉపన్యసించిన వారు శ్రీయుతులు కొండా వెంకట రంగారెడ్డి, పులిజాల వెంకటరంగారావు, మాడపాటి హనుమంతరావుగార్లు. పై పేర్లను చూచినచో ఉభయ పక్షముల ప్రాతి నిధ్యము వ్యక్తంగాదు. తీర్మానము అంగీకరింపబడుటయు, సవరణ వీగిపోవు టయు, పై ఉభయ పక్షములకు ఆసందర్భమున ఆంధ్ర మహాసభ వేదికపై నుండిన బలము ఎట్లెట్లు మార్పు చెందినదో తెల్లమగును సారాంశమేమనగా ఏడవ ఆంధ్ర మహాసభ నాటికి యువ నాయకత్వం బలపడినది.

## ఎనిమిదవ ఆంధ్ర మహాసభ

1941 లో నల్గొండజిల్లా చిలుకూరు గ్రామంలో జరిగిన ఎనిమిదవ ఆంధ్ర మహాసభకు రావినారాయణరెడ్డిగారు అధ్యక్షుడుగా ఎన్నికయ్యారు. నారాయణరెడ్డి

గారు కమ్యూనిస్టు పార్టీ సభ్యులు. అధ్యక్ష ఉపన్యాసం పార్టీ వైఖరిని ప్రతిబింబించింది. అంతక్రితం జరిగిన ఆంధ్ర మహాసభలకు, చిలుకూరు సభకు అనేక విషయాలలో భేదం వుంది. ఈ మహాసభ గురించి మాడపాటి హనుమంతరావు గారు తమ ఆంధ్రోద్యమ గ్రంథంలో ఈ దిగువ విధంగా పేర్కొన్నారు.

"ఈ మహాసభ యొక్క అగ్రాసేనాధిపతి పేరు వినగానే ఎనిమిదవ మహాసభ నుండి ఆంధ్ర నాయకత్వమొక కొత్త తరము ననుసరించుచున్నదని తోపక మానదు. శ్రీ రెడ్డిగారు విద్యార్థి దశ నుండియు ఉత్సాహవంతులుగా నుండి ఆంధ్రోద్యమమును తమ తోడ్పాటుచే సర్వ విధముల ప్రోత్సహించియుండిరి. మల్కాపురము మహాసభకు ముందు వారు హైద్రాబాదు స్టేటు కాంగ్రెసు పక్షమున సత్యాగ్రహ సమరమున పాల్గొని అనేక మాసములు ఖైదుననుభవించి వచ్చిన తర్వాత, వారు పూర్వం కంటే ఎక్కువ తీవ్రవాదులైన యంశము మల్కాపురము మహాసభలో వ్యక్తమైయుండెను. పిమ్మట జరిగిన యొక సంవత్సర కాలంలో వారు ఆంధ్రోద్యమము సంతృప్త మానసముతో పనిచేసినట్లు కానరాలేదు. వారి హృదయము నూతన భావముల, నూతన సిద్ధాంతముల, నవీనాదర్శములవలన నాకర్షింపబడుటయు (అది మార్క్సిస్టు సిద్ధాంతము అను ఆదర్శమని మా యభిప్రాయము) వారొక కొత్త ఉద్యమమున సాగిపోతున్నట్లు కానవచ్చినది".

నారాయణరెడ్డిగారి అధ్యక్ష ఉపన్యాసంలో అనేక జాతీయ, అంతర్జాతీయ విషయాలు పేర్కొనబడ్డాయి. సామ్రాజ్యవాద యుద్ధం, దానిపట్ల వ్యతిరేకత, ప్రదర్శించబడింది. దేశీయ సంస్థానాలపై తీవ్రమైన విమర్శ చేయడం జరిగింది. స్త్రీ స్వాతంత్ర్యాన్ని గురించి, ఇంకా అనేక స్థానిక సమస్యలు అధ్యక్షోపన్యాసంలో ప్రస్తావించబడ్డాయి. శ్రీ మాడపాటి హనుమంతరావుగారి గ్రంథంలో ఈ విధంగా రాశారు.

"శ్రీ రావి నారాయణరెడ్డిగారి అధ్యక్షోపన్యాసమందు తెలంగాణా వాసుల సమస్యలు సవిమర్శముగా చర్చింపబడుటయేగాక, అంతకు పూర్వపు అధ్యక్షోపన్యాసములలో నుల్లేఖించబడని కొన్ని సమస్యలు కూడా వచ్చినవి. ప్రపంచ యుద్ధములు, అంతర్జాతీయ పరిస్థితులు, పెట్టుబడిదారీ ఆర్థిక విధానంవలన గలిగెడి ఘోర పరిణామములు, దానికి మారుగా రావలసిన నూతన విధానం యొక్క ఆవశ్యకత, స్త్రీ స్వాతంత్ర్యం, స్త్రీల యొక్క ఆర్థిక స్వావలంబనం అనివార్యమనుట - ఇత్యాది నూతన అంశములను వారి ఉపన్యాసం వెల్లడించుచున్నది."[8]

# ముస్లింల వింత స్వప్నం

"శ్రీ రెడ్డిగారు అధ్యక్షోపన్యాసమున ఈ విషయమును ఖండితముగానిట్లు వక్కాణించిరి. దురదృష్టము వలన హైదరాబాదు నందలి కొందరు ముస్లిం సోదరులు వ్యవస్థాపూర్వకముగా వింత వింత స్వప్నములు గని హైదరాబాదు మహమ్మదీయులెల్లరు రాజులనియు, మహ్మమదీయులు లేకున్న రాజు లేడనియు హద్దుపద్దు లేని ఆడంబరములు ప్రదర్శించి అలజడికి కారకులైరి. రాజకీయాభివృద్ధిని గోరు యితరులను అనుమాన దృష్టితో చూచి, తాము కేవలం తమకై హక్కులను సాధించి స్వస్థత నొంద తలంచి యుండిరి. హైదరాబాదులోని ముస్లిముల మత పాక్షికములను, విద్వేష సూచకములును నగు భావములను వారి వింత స్వప్నములను, విద్వేష ఆంధ్ర మహాసభ నివేదిక నుండి యింత స్పష్టముగ యింతకు పూర్వం ఖండించినట్లగపడదు."[9]

ఇంతకు ముందు జరిగిన ఆంధ్ర మహాసభల తరువాత కార్యకర్తలకు ఉత్సాహకరమైన కార్యక్రమం ఏమీ వుండేది కాదు. కాని 8 వ మహాసభ తరువాత ఉద్యమ రూపం మారింది. అంతవరకు మహజర్లతో మాత్రమే సరిపెట్టుకునేది. 8 వ మహాసభ తరువాత వివిధ సమస్యలపై ఆందోళనా కార్యక్రమం యివ్వబడింది. 'డిఫెన్స్యాడే'అని 'విద్యావారం'అని 'వెట్టిచాకిరి వ్యతిరేక వారమని' కార్యకర్తలకు ఆందోళనల కార్యక్రమం రూపొందించి, యివ్వటం జరిగింది. ఈ విధంగా ప్రజలను అనేక సమస్యలపై విద్యావంతులను చేసి పోరాటాలకు సంసిద్ధం చేసే కార్యక్రమం చేపట్టబడింది.

అంతవరకు ఆంధ్ర మహాసభ సభ్యత్వ రుసుము ఒక రూపాయిగా వుండేది. చిలుకూరు సభలో దానిని నాలుగణాలకు తగ్గించారు. లోగడ ఆంధ్ర మహాసభ నిబంధ-నావళిలో తీవ్ర భాషావాదులు చేర్చిన 31 వ నిబంధనను ఈ మహాసభలో తొలగించడం జరిగింది. ఇవి రెండు చాలా ముఖ్యమైన విషయాలు. దీనివల్ల ఆంధ్ర మహాసభ సభ్యత్వం అశేష ప్రజానీకానికి అందుబాటులోకి వచ్చింది. ఈ మహాసభలో భాషాతత్వ తీవ్రవాదం అంతమైంది. ఈ కాలంలో జాగీర్దార్లు వసూలు చేసే అధిక పన్నులకు వ్యతిరేకంగా కొలనుపాక, పులిగిల్ల మొదలైన ప్రాంతాలలో పోరాటాలు మొదలయ్యాయి.

1940 లో రాంఘుర్ కాంగ్రెసు మహాసభ తరువాత జాతీయ కాంగ్రెసు వ్యక్తిగత సత్యాగ్రహాన్ని ప్రారంభించింది. హైదరాబాదు సంస్థానంలో స్టేటు

కాంగ్రెసు నాయకుడు స్వామి రామానంద తీర్థ ఆరెస్టు అయ్యేటప్పుడు రావి నారాయణరెడ్డిని నాయకుడుగా నియమించడం జరిగింది అయితే కొంతమంది కాంగ్రెసువారు నారాయణ రెడ్డి సోషలిస్టు అని గాంధీ సూత్రాలపై నమ్మకం లేదని మహాత్మాగాంధీకి కొన్ని ఫిర్యాదులు చేసారు. గాంధీజీ నారాయణరెడ్డి గారిని వార్ధాకు పిలిపించారు నారాయణరెడ్డి తాను సోషలిజాన్ని నమ్ముతున్నట్లు చెప్పారు. హైదరాబాదు సంస్థానంలో వ్యక్తిగత సత్యాగ్రహానికి సిద్ధపడ్డ వాళ్ళందరిని తనవద్దకు పంపవలసిందిగా గాంధీజీ చెప్పారు నారాయణరెడ్డిగారు అలాగే అన్ని ప్రాంతాలు తిరిగి వ్యక్తిగత సత్యాగ్రహంలో నమ్మకమున్న వారందరినీ గాంధీజీ వద్దకు పంపారు. కమ్యూనిస్టులుగా వున్న వారిని వార్ధా వెళ్ళనవసరం లేదని చెప్పారు.

## తెలంగాణా ప్రాంతీయ కమిటీ

తెలంగాణా ప్రాంతములో పార్టీ కార్యకలాపాలను సమన్వయం చేసి, మరింత ముందుకు తీసుకుపోవడానికి 1941 లో ప్రాంతీయ కమిటి ఏర్పాటుచేశారు. దీనికి పెరవలి వెంకట రమణయ్య కార్యదర్శిగా వున్నారు. ఈ కమిటిలోని సభ్యులు రావి నారాయణరెడ్డి, ఒద్దం ఎల్లారెడ్డి దేవులపల్లి వెంకటేశ్వరరావు 1940 లో చంద్ర రాజేశ్వరరావుగారు రెడ్డి హాస్టలులోనూ, ఉస్మానియా విశ్వ విద్యాలయంలోనూ రాజకీయ క్లాసులు నిర్వహించారు. రెడ్డి హాస్టలులో జరిగిన క్లాసులకు గురవారెడ్డి, పి రామచంద్రారెడ్డి, శివరామిరెడ్డి, వి రామిరెడ్డి మొదలైన వారు హాజరైనారు. విశ్వ విద్యాలయంలో జరిగిన క్లాసులకు సర్వ దేవభట్ల రామనాథం, తీగల సత్యనారాయణ, రామకృష్ణశాస్త్రి, గోవిందరావు మొదలగు వారు హాజరయ్యారు.

ఈ కాలంలో స్వతంత్ర్య భారత్, ఇతర కమ్యూనిస్టు సాహిత్యం హైదరాబాదుకు వచ్చేది. దేవులపల్లి వెంకటేశ్వరరావు, రావి నారాయణరెడ్డి మొదలగు నాయకులు వాటిని పంపకం చేసేవారు విద్యార్థులలో ఇవి పంపకం అవుతూ వుండేవి 1943 లో మునిపల్లె రామారావుద్వారా ఎ. గురవారెడ్డి పార్టీలోకి వచ్చారు.

1943 జులైలో జరిగిన 3వ రాష్ట్ర పార్టీ మహా సభ తరువాత కామ్రేడ్ యస్. వి. కె. ప్రసాద్ (రాష్ట్ర కమిటి కాండిడేటు సభ్యుడు)ను తెలంగాణాకు ఆర్గనైజరుగా పంపటం జరిగింది కామ్రేడ్ యస్ ఎ కె. ప్రసాద్ అంతకు ముందు 1942 లో ఒకసారి తెలంగాణాకు వచ్చి వెళ్ళారు.

అప్పటికి మహారాష్ట్ర ప్రాంతంలోనూ, కర్ణాటక ప్రాంతంలోనూ కొన్ని పార్టీ సెల్సు ఏర్పడ్డాయి. వీరికి బొంబాయిలోని పార్టీ హెడ్ క్వార్టర్స్‌తో సంబంధం వుండేది. పార్టీ కేంద్రం సూచనపై 1943 లో హైదరాబాదు సంస్థానంలో పార్టీ కార్యకలాపాలను సమన్వయం చేసి నడపడానికి స్టేటు కో-ఆర్డినేషన్ కమిటీ ఏర్పాటు చేయబడింది దీనిలో తెలంగాణా ప్రాంత నాయకులతో పాటు, వి.డి. దేశ్ పాండే, చంద్ర గుప్త చౌదరి (మహారాష్ట్ర) శ్రీనివాస్ గుడి (కర్ణాటక) కూడా వున్నారు.

## ఆధారాలు


1. నేటి హైదరాబాదు - మన కర్తవ్యం : బద్దం ఎల్లారెడ్డి, దేవులపల్లి వేంకటేశ్వరరావు
2. నవశక్తి 16-11-38వ సంచిక
3. నవశక్తి 20-11-38వ సంచిక
4. సుంకర వీరభద్రరావు : తిరువూరు తాలుకాలో రైతు ఉద్యమ పోరాటాలు - 192 వ పేజీ
5. చంద్ర రాజేశ్వరరావుతో ఇంటర్వ్యూ
6. సి. డి. చౌదరీ - మరట్వాడా ఇన్ యాంటీ నైజాం స్ట్రగుల్ : డి గ్లోరియస్ తెలంగాణా ఆర్మ్‌డ్ స్ట్రగుల్ - 130 వ పేజీ
7. జవాద్ రజ్వీ - హైదరాబాదు సంస్థానంలో రాజకీయ చైతన్యం - విద్యార్థి యువజనుల పాత్ర
8. వీర తెలంగాణా - నా అనుభవాలు, జ్ఞాపకాలు : రావినారాయణరెడ్డి
9. వీర తెలంగాణా - నా అనుభవాలు, జ్ఞాపకాలు : రావినారాయణరెడ్డి

# ప్రధాన రాజకీయ ఘటనలు – పార్టీ ప్రతిస్పందన

1936 నాటికి భారత రాజకీయాలు వామపక్ష దిశగా మారసాగాయి. ఇందుకు అనేక కారణాలున్నాయి.

1930 లో గాంధీజీ ప్రారంభించిన ఉప్పు సత్యాగ్రహం ఒక్క ఏడాది పాటు సాగేటప్పటికి, బ్రిటిష ప్రభుత్వం రెండవ రౌండ్ టేబుల్ సమావేశాన్ని ఏర్పరచి కాంగ్రెసు నాయకులను ఆహ్వానించింది. గౌరవప్రదమైన రాజీకి తానెప్పుడూ సంసిద్ధుడనేనని ప్రకటించుకున్న గాంధీజీ అందుకు ఆమోదించారు.

ఈలోగా భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవ్‌లకు ప్రభుత్వం ఉరిశిక్ష విధించింది. వామపక్షవాదులను అణచివేయడం, కాంగ్రెసు నాయకులను ఆహ్వానించడం ఉభయుల మధ్య గండిని తీవ్రతరం చేసి, చివరకు కాంగ్రెసు నాయకులకు సైతం మొండిచేయి చూపటం బ్రిటిష పాలకుల పద్ధతి. అదే విధానాన్ని లార్డ్ ఇర్విన్ 1931 లో కొనసాగించారు.

గాంధీ ఇర్విన్ ఒడంబడికను ధృవీకరించి, రౌండ్ టేబుల్ సభకు గాంధీజీ ప్రయాణాన్ని ఆమోదించేందుకు కరాచీలో 1931 మార్చి 29 న కాంగ్రెసు ప్రత్యేక మహాసభ జరిగింది. ఈ ఒప్పందంలో భాగంగా భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవ్‌ల ఉరిశిక్ష రద్దు చేయటమో, కనీసం యావజ్జీవ కారాగార శిక్షగా మార్చటమో చేయించాలని గాంధీజీ ఎంతో ప్రయత్నించారు. కాని విఫలమైనాడు. ఆ ముగ్గురు విప్లవకారులను మార్చి 23 న ఉరి తీశారు. అయినప్పటికీ రౌండ్ టేబుల్ సభకు వెళ్ళటానికి ఆయనకు కాంగ్రెసు మహాసభ ఆమోదం ఇచ్చింది.

ఇంత చేసినా, రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సు నుండి గాంధీజీ రిక్తహస్తాలతో తిరిగి వచ్చాడు. ఈలోగా ఇర్విన్ స్థానే వెల్లింగ్‌టన్ వైస్రాయిగా వచ్చి దారుణ నిర్బంధ విధానం అమలు జరిపాడు. గాంధీజీ స్వదేశం వచ్చేసరికి, నెహ్రూలాంటి ప్రముఖ కాంగ్రెసు నాయకులు అరెస్టు అయినారు. తప్పనిసరై గాంధీజీ తిరిగి శాసనోల్లంఘనోద్యమాన్ని ప్రారంభించారు. 1934 నాటికి ఆ ఉద్యమం పూర్తిగా బలహీనపడింది. 1934 ఏప్రిల్ 7 న శాసనోల్లంఘనోద్యమాన్ని కాంగ్రెసు అధికారపూర్వకంగా ఆపివేసింది.

ఈ మొత్తం పరిణామాల పట్ల సాధారణ కాంగ్రెసువాదులు తీవ్ర అసంతృప్తిచెందారు. గాంధీజీ పదే పదే వైస్రాయి పట్ల లొంగుబాటు ప్రదర్శిస్తున్నందుకు బాధపడ్డారు. నెహ్రూ, బోస్‌లు గాంధీజీని బహిరంగంగానే విమర్శించారు.

గాంధీవాదం కంటే భిన్నమైన శాస్త్రీయ విప్లవవాదం వైపు కాంగ్రెస్ యువకులు మళ్ళటానికి ప్రధాన కారణాలలో ఇదొకటి. ఈ పరిణామాల ద్వారా విసిగిపోయి, అప్పటికే సోషలిస్టు భావాలవైపు ఆకర్షితులైన యువకులు 1934 మే నెలలో కాంగ్రెసు సోషలిస్టుపార్టీని ఏర్పరిచారు.

సోవియట్ యూనియన్‌లో సోషలిస్టు ప్రయోగం జయప్రదమై సత్ఫలితాల నివ్వటం యావత్ప్రపంచంలోని అభ్యుదయ వాదులను ఆకర్షించింది. ఇంగ్లీషు భాషా పరిచయంగల విద్యాధికులందరు తత్సంబంధమైన గ్రంధాలను ఎంతో ఆసక్తిగా చదువసాగారు. "సోవియట్ కమ్యూనిజం ఎ న్యూ సివిలైజేషన్" "సోవియట్ కమ్యూనిజం ఒక నూతన నాగరికత" అను పేరుతో సుప్రసిద్ధ బ్రిటీషు మేధావులు సిడ్నీ, అండ్ బిట్రిష్ వెబ్‌లు రాసిన పుస్తకం గొప్ప ప్రభావాన్ని కలిగించింది. అదే కాలంలో జవహర్‌లాల్ నెహ్రూ 'సోవియట్ రష్యా' అనే చిన్న కరపత్రం వ్రాశారు. తెలుగులో నార్ల వెంకటేశ్వరరావుగారు అదే పేరుతో మరో గ్రంథాన్ని రాశారు. అమెరికాలో విద్యాభ్యాసం చేసి కార్మికోద్యమంతో సంబంధం పెట్టుకుని సోషలిస్టు భావాలతో స్వదేశం తిరిగి వచ్చి జాతీయోద్యమంలో పాల్గొని, నిర్బంధాలకు గురై, అప్పటికే ప్రముఖ నాయకుడుగా గుర్తింపు పొందిన జయప్రకాశ్ నారాయణ, కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ప్రథమ ప్రధాన కార్యదర్శిగా 1934 లో ఎన్నికయ్యారు.

ఈ వాతావరణంలో 1936 ఏప్రిల్‌లో లక్నోలో కాంగ్రెసు మహాసభ జరిగింది. ఆ మహాసభకు అధ్యక్షత వహించిన జవహర్‌లాల్ నెహ్రూ "సోషలిజం ఓన్లీ సొల్యూషన్ ఫర్ ఆల్ అవర్ ఇల్స్" "మన సమస్యలన్నింటికీ సోషలిజం ఒక్కటే ఏకైక పరిష్కారం" అంటూ ఇచ్చిన గంభీరోపన్యాసం, యావద్భారతంలోని యువకులను ఉత్తేజపరిచింది ఈ నేపథ్యంలో సాధారణ కాంగ్రెసు వాదులు వామపక్షం వైపు కదలసాగారు.

యూరోపులో అప్పటికే ఫాసిజం తలఎత్తింది. ఇటలీలో ఫాసిస్టు ముసోలినీ అధికారంలో ఉన్నాడు. జర్మనీలో హిట్లర్ అధికారంలోకి వచ్చాడు. ఇథియోపియాను ఇటలీ కబళించింది. ఎన్నికల ద్వారా స్పెయిన్‌లో ఏర్పడిన వామపక్ష ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఆదేశంలోని రాచరికవాదులు అంతర్యుద్ధాని ప్రారంభించారు మరో రెండు మూడు సంవత్సరాలలో యూరపులో రెండో ప్రపంచ యుద్ధం మొదలవుతుందని విజ్ఞులు ఊహించ సాగారు

జాతీయ పోరాటాన్ని అంతర్జాతీయ ఫాసిస్టు వ్యతిరేక పోరాటంతో జత చేయాలని మొదటి నుండి వాదిస్తున్న జవహర్‌లాల్ నెహ్రూ వాదనకు ఈ ఘటనలన్నీ బలంచేకూర్చాయి.

## బ్రిటీషు ప్రభుత్వ పన్నాగాలు

ఈలోగా బ్రిటీషు ప్రభుత్వం తన పథకాలతో ముందుకు సాగుతూనే ఉంది.

1919 భారత ప్రభుత్వ చట్టం 84 వ విభాగంలో బ్రిటీషు ప్రభుత్వం ఇలా ప్రకటించుకున్నది. "ప్రతి పదేండ్లకు భారత రాజ్యాంగం ఎలా పని చేస్తున్నదో పరిశీలించి ముందు చర్యలు తీసుకుంటాము" అని

భారత జాతీయోద్యమంతో ప్రమేయం లేకుండా తమకు తాముగా, భారతీయులు ప్రజాస్వామ్య పాలనకు అర్హులా కారా అని పరిశీలిస్తూ దఫ దఫాలుగా భారతదేశానికి అధినివేశ ప్రతిపత్తి కల్పిస్తున్నాము అనే దురహంకార ధోరణికి పై మాటలు చిహ్నం.

పరిశీలన పేరుతో భారత జాతీయోద్యమంలో చీలికలు కల్పించి, కాంగ్రెసు లీగు విభేదాలను సృష్టించి, ప్రాంతీయ విద్వేషాలను రెచ్చగొట్టి, సంస్థానాధీశులను ఉసిగొల్పి, తమ ఆధిపత్యం కొనసాగించుకోవటం బ్రిటీషు సామ్రాజ్యవాదుల పన్నాగం.

ఇందులో భాగంగా 1928 లో సైమన్ కమీషన్‌ను పంపింది జాతీయ కాంగ్రెసు సైమన్ కమీషన్‌ను బహిష్కరించింది ఈ బహిష్కరణ మహోద్యమంగా సాగింది.

1930 లో సైమన్ కమీషన్ నివేదిక వెలువడ్డది అందులోని సూచనలన్నీ అభివృద్ధి నిరోధకమైనవీ, భారత సమైక్యతకు హానికరమైనవి. అందులోని ముఖ్యాంశాలు ఇవి.

రాష్ట్రాలలో ఎన్నికైన మంత్రి మండలులకు అధికారం లభిస్తుంది. అయితే గవర్నరుకు విశేషాధికారాలు ఉండనే ఉంటాయి.

కేంద్రంలో ఈ పాటి సౌకర్యం కూడా లేదు సంస్థానాధీశులకు, నామినేటెడ్ సభ్యులకు విశేషాధికారాలుండే విధంగా ఒక ఫెడరల్ ప్రభుత్వం ఏర్పడుతుంది.

సైమన్ బహిష్కరణోద్యమంలో అంతగా పాల్గొనని సింధు, ఒరిస్సాలు ప్రత్యేక రాష్ట్రాలుగా ఏర్పడతాయి.

సింహళం, బర్మాలు భారతదేశం నుండి వేరు వేరౌతాయి

ఈ సూచనలు, కాంగ్రెసు వాదులకే కాక, తేజబహదూర్ సప్రూలాంటి మితవాదులకు కూడా నచ్చలేదు. కేంద్రంలో సంస్థానాధీశుల ప్రాబల్యం ఏర్పడటమంటే భారతదేశం, ఆధునికత వైపు పయనించే అవకాశమే లేదు. ఫ్యూడల్ దశలోనే ఉండవలసి వుంటుంది.

అయినా పోరాటం ద్వారా కాక, రాయబారాల ద్వారా లక్ష్యసాధన మితవాదుల లక్ష్యం. గాంధీజీతో సప్రూ, జయకర్ లాంటి మితవాదులకు నిత్యం సత్సంబంధాలు ఉంటూనే ఉన్నాయి

మొదటి రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సుకు సప్రూ, జిన్నా, సంస్థానాధీశుల ప్రతినిధులు హాజరయ్యారు. 1930 నవంబరులో జరిగిన ఈ సభను కాంగ్రెసు బహిష్కరించింది.

ఎలాగైనా కాంగ్రెసును కూడా ఒప్పించాలనే ఉద్దేశ్యంతో రెండో రౌండ్ టేబుల్ సభను బ్రిటిషు ప్రభుత్వం ఏర్పరచింది. సప్రూ, జయకర్‌ల మధ్యవర్తిత్వం ఫలితంగా హాజరు కావటానికి గాంధీజీ అంగీకరించారు. గాంధీ ఇర్విన్ ఒడంబడిక, కరాచీ కాంగ్రెసు తర్వాత వరుసగా జరిగిన పరిణామాలు.

ఈలోగా నాటి బ్రిటిషు ప్రధాని రామ్సే మాక్డొనాల్డ్ కమ్యూనల్ అవార్డు ప్రకటించాడు. ముస్లిములకు, క్రైస్తవులకు, యూరోపియన్లకు, ఆంగ్లో ఇండియన్లకు, సిక్కులకు మాత్రమేకాక, హరిజనులకు కూడా ప్రత్యేక నియోజకవర్గాలు ఏర్పాటు ఈ పథకంలో భాగం.

వివిధ మత విభాగాలను విడదీసి, జాతీయ సమైక్యతను భగ్నం చేయటం ఈ పథకం ఉద్దేశ్యం. అంతేకాదు మతరీత్యా హిందువులైన హరిజనులను, సవర్ణ హిందువుల నుండి శాశ్వతంగా వేరు చేసే కుట్ర కూడా ఇందులో ఉంది.

ఇందుకు వ్యతిరేకంగా గాంధీజీ ఆమరణ నిరాహారదీక్ష జరిపి చివరకు అంబేద్కర్‌కు సైతం హరిజనులకు ప్రత్యేక నియోజకవర్గాల స్థానే, సీట్ల రిజర్వేషన్‌కు ఒప్పించటంతో ఆ భాగం రద్దు అయింది.

కేంద్రంలో సంస్థానాదీశుల ప్రాబల్యం క్రింద ఏర్పడే ఫెడరల్ ప్రభుత్వ భూతం మాత్రం ఉండనే ఉంది.

1934 లో శాసనోల్లంఘనం ఉద్యమాన్ని ఆపివేశారు. 1935 రాజ్యాంగ చట్టంలో ఫెడరేషన్ భావన ఉండనే ఉన్నది కనుక ఫెడరేషన్ వ్యతిరేకపోరాటం జాతీయోద్యమ ప్రధాన కర్తవ్యాలలో ఒకటిగా నిలిచింది

1934 మే నెలలో కాంగ్రెసు కార్యవర్గం శాసనోల్లంఘనోద్యమాన్ని నిలిపివేసింది. 31 జూన్‌లో కాంగ్రెస్ సంస్థపై నిషేధం తొలగించింది 1934 జూలైలో కమ్యూనిస్టు పార్టీపై నిషేధం విధించింది.

జాతీయోద్యమ స్రవంతిని, కమ్యూనిస్టు ఉద్యమ స్రవంతిని వేరు వేరుగా వీలైతే పరస్పర విరుద్ధంగా ఉంచటం మొదటి నుండి బ్రిటిషు సామ్రాజ్యవాదుల పన్నాగం.

1924 లో కాన్పూరు కమ్యూనిస్టు కుట్ర కేసు, 1929 లో మీరట్ కుట్ర కేసులను ప్రారంభించటంలోనూ ఇదే ధోరణి కన్పిస్తుంది. 1934లో కాంగ్రెస్‌పై నిషేధం తొలగించి, కమ్యూనిస్టుపార్టీని నిషేధించడంలోను తిరిగి క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలో, కాంగ్రెస్‌పై నిషేధం విధించి, కమ్యూనిస్టుపార్టీపై నిషేధం తొలగించటంలోనూ, ఈ దుష్ట పన్నాగమే వ్యక్తమైంది.

బ్రిటిషు ప్రభుత్వంతో గాంధీజీ ఎంత సర్దుబాటు ధోరణి ప్రదర్శించినా పాలకులలో ఈషణ్మాత్రం ప్రతిస్పందన లేకపోగా విభజించి, పాలించు విధానాన్ని మరింత తీవ్రంగా అవలంభిస్తూన్నారనే ఆగ్రహం సాధారణ కాంగ్రెసువాదులలో కలిగింది. వారిలో ఆలోచనాపరులైనవారు ప్రత్యామ్నాయ మార్గం, సిద్ధాంతాల కొరకు అన్వేషణ చేయసాగారు.

## దత్తు బ్రాడ్లీ థీసిస్

1935 ఆగష్టులో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ 7 వ మహాసభ జరిగింది. యూరప్‌లో ఫాసిస్టు వ్యతిరేక సంఘటన, వలస దేశాలలో సామ్రాజ్య వ్యతిరేక సంఘటనా నినాదాలు ఆ మహాసభలో ఆవిర్భవించాయి. ప్రధాన కార్యదర్శి డిమిట్రొవ్ సమర్పించిన నివేదిక భారతదేశంలో కమ్యూనిస్టుల కర్తవ్యాన్ని గురించి ఇలా చెప్పింది. "భారతదేశంలో కమ్యూనిస్టులు జాతీయ సంస్కరణవాద నాయకత్వం క్రింద కొనసాగే సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజా కార్యకలాపాలను, సకల విధాలైన సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజా కార్యకలాపాలను బలపరచాలి. విస్తృతమొనర్చాలి. వాటిలో పాల్గొనాలి. తమ రాజకీయ నిర్మాణ స్వేచ్ఛను నిలబెట్టుకుంటూనే వారు భారత జాతీయ కాంగ్రెసు సంస్థలలో చేరి పనిచేయాలి. ఆ విధంగా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా భారత ప్రజలు సాగిస్తూన్న జాతీయ విముక్తి ఉద్యమాన్ని మరింతగా అభివృద్ధి చేసేందుకు అవసరమైన జాతీయ విప్లవ విభాగమొకటి రూపొందడానికి తోడ్పడాలి" (కొమిటర్న్ జాతుల - వలసల సమస్య (ఆంగ్లం) కమ్యూనిస్టు పార్టీ ప్రచురణ, న్యూఢిల్లీ 1973 పేజీ 25)

ఈ పత్రం భారత కమ్యూనిస్టులకు చేరేందుకు నాలుగు నెలలు పట్టింది.

ఈ నివేదికను ఆధారం చేసుకుని, బ్రిటిషు కమ్యూనిస్టు నాయకులు రజని పామిదత్తు, బెన్‌బ్రాడ్లీలు, భారత పరిస్థితులను, కమ్యూనిస్టు పార్టీ అవలంబించ వలసిన ఎత్తుగడలను మరింత లోతుగా విశ్లేషిస్తూ ఒక పత్రం తయారుచేశారు.

దత్తు - బ్రాడ్లీ దీసిస్‌గా ప్రసిద్ధి పొందిన ఈ పత్రం అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థ పత్రిక 'ఇంప్రికార్' ( ఇంటర్‌నేషనల్ కరస్పాండెన్సు ) లో 1936 ఫిబ్రవరి 29 న ప్రచురింపబడింది. 1936 ఏప్రిల్‌లో లక్నో కాంగ్రెసు మహాసభ జరిగేసమయానికి ఆ పత్రం కూడా భారత కమ్యూనిస్టులకు చేరింది.

అందులోని ముఖ్యాంశాలు ఇలా ఉన్నాయి.

1. సామ్రాజ్య వ్యతిరేక సంఘటనను నిర్మించడంలో జాతీయ కాంగ్రెసు ప్రధాన పాత్ర వహించగలదు అంతేకాదు తన నిర్మాణాన్ని, కార్యక్రమాన్ని మార్చుకోవడం ద్వారా అది సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజా సంఘటనగా రూపొందగల్గుతుంధి.
2. జాతీయ పోరాటంలో అత్యంత ప్రధానమైన శక్తులు కార్మిక - కర్షక ప్రజా సంఘాలు. ఈ శక్తులన్నీ కలిస్తేనే, కాంగ్రెసుతో ఐక్య సంఘటన ఒప్పందం ద్వారా గాని, సమిష్టి ప్రాతినిధ్యం ద్వారా గాని అవి ఐక్యత సాధిస్తేనే నిజమైన సామ్రాజ్య వ్యతిరేక సంఘటనగా, విస్తృత జాతీయైక్య సంఘటనగా, అది రూపొందగలదు
3 కాంగ్రెస్ సోషలిస్టులు, కమ్యూనిస్టులు, కాంగ్రెసు వామపక్షీయులందరూ సంపూర్ణ స్వాతంత్ర్యం కొరకు జరిగే కనీస పోరాట కార్యక్రమంపై ఐక్యతను సాధించవచ్చు.
4. రానున్న ఏన్నికలలో జాతీయైక్య సంఘటన చీలిపోకుండా సర్వవిధాల కృషిచేయడం అవసరం. పోతే వామపక్ష శక్తుల గొంతు నులమడానికి మాత్రం ఎవరూ ఈ ఐక్యతను ఉపయోగించే అవకాశం ఇవ్వరాదు.
5. రాజ్యాంగ నిర్ణయ సభను సమావేశ పరచటం మన కేంద్ర నినాదంగా ఉండాలి
6. మితవాద కాంగ్రెసు నాయకత్వంపై జరిపే సిద్ధాంత పోరాటం నిరంతరం విశదీకరణ రూపంలో ఒప్పించే విధంగా ఉండాలి జాతీయైక్య సంఘటనను చీల్చే విధంగా ఉండకూడదు.

ఈ నూతన అవగాహనతో భారత కమ్యూనిస్టు పార్టీ 1936 నుండి జాతీయ రాజకీయాలలో క్రియాశీల జోక్యం కలిగించుకోసాగింది. తత్ఫలితంగా అనేక విజయాలు సాధించింది.

ఈ నూతన వైఖరిని వివరిస్తూ ఒక ఏడాదిపాటు కమ్యూనిస్టు పత్రికలో అనేక వ్యాసాలు వెలువడ్డాయి కాంగ్రెసు పట్ల మౌలికమైన మార్పు ఈ క్రింది అంశాలలో వ్యక్తమైంది :

1. కాంగ్రెసు సంస్థనే సామ్రాజ్య వ్యతిరేక ఐక్యసంఘటనా వేదికగా మార్చ వచ్చు. అలా మార్చాలి.
2. ప్రజలు వామపక్షం వైపు మొగ్గుతున్నారు. కాంగ్రెసుకు నాయకత్వం వహిస్తున్న వర్గాలు మితవాదం వైపు కదులుతున్నారు.
3. రెండో ప్రపంచ యుద్ధం ఏ క్షణంలోనైనా బద్దలు కావచ్చు. ఈలోగా బలమైన సామ్రాజ్య వ్యతిరేక సంఘటనను, అందులో వామపక్ష ఐక్యతను పెంపొందించాలి.
4 బూర్జువా వర్గ నాయకత్వం దీర్ఘకాలం ఊగిసలాటను ప్రదర్శిస్తూనే ఉంటుంది. అయినప్పటికి సామ్రాజ్య వ్యతిరేక ప్రజా ఉద్యమాన్ని నిర్మించటానికి భౌతిక పరిస్థితులు పరిపక్వంగా ఉన్నాయి.
5. కాంగ్రెసులో వామపక్ష భావాల వ్యక్తీకరణ కాంగ్రెసు సోషలిస్టు పార్టీ.
6. కనుక కమ్యూనిస్టులు కాంగ్రెసులోనూ, కాంగ్రెసు సోషలిస్టుపార్టీలోనూ చేరి కృషి చేయాలి.
7. రాజ్యాంగ నిర్ణయసభ నినాదం విప్లవాత్మక నినాదం.

ఈ వైఖరికి అనుగుణంగా లక్నో కాంగ్రెసులో కమ్యూనిస్టుపార్టీ నాయకులు పాల్గొన్నారు. సాధారణ కాంగ్రెసువాదులు కమ్యూనిస్టుల ప్రవేశాన్ని మన స్ఫూర్తిగా ఆహ్వానించారు

కార్మిక, రైతు తదితర వర్గ సంఘాలకు కాంగ్రెసులో సమిష్టి ప్రాతినిధ్యం ఉండాలనేది కమ్యూనిస్టుపార్టీ ప్రధాన నినాదం. ఈ కోర్కెను కాంగ్రెసు అధ్యక్షుడు నెహ్రూ తన అధ్యక్షోపన్యాసంలో ఆమోదించాడు. అయితే కాంగ్రెసులోని మితవాద నాయకత్వ వ్యతిరేకత ఫలితంగా రెండేండ్లు ఆందోళన జరిపినా ఈ కోర్కె అమలు జరుగలేదు

## కమ్యూనిస్టు ఉద్యమ పురోగమనం

ఈ నూతన విధానం ఫలితంగా 1936 - 39 సంవత్సరాలలో కమ్యూనిస్టు పార్టీ భారతదేశమంతటా విస్తరించింది అన్ని రాష్ట్రాలలోనూ శాఖల నేర్పరచుకొన్నది. జాతీయ రాజకీయాలలో క్రియాశీలంగా జోక్యం చేసుకొంటూ దేశ రాజకీయాలను వామపక్షం వైపు త్రిప్పటానికి గట్టికృషి చేసింది.

లక్నో కాంగ్రెసులో కమ్యూనిస్టులు క్రియాశీల పాత్రవహించారు. అదే సంవత్సరం అఖిల భారత కిసాన్ సభ, అఖిల భారత విద్యార్థి సంఘం, అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘాలు ఏర్పడాయి. ఈ మహాసభలన్నీ లక్నోలోనే కొన్ని నెలల వ్యవధిలో జరిగాయి.

అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసులో ఏర్పడిన చీలిక అంతకు ముందే అధిగమించబడ్డది.

కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో కమ్యూనిస్టులు చేరారు.

1935 రాజ్యాంగ చట్టాన్ననుసరించి పరిమిత ఓటింగు ప్రాతిపదికపై 1937 లో దేశమంతటా శాసన సభలకు ఎన్నికలు జరుపటానికి సన్నాహాలు మొదలైనాయి.

వివిధ రాష్ట్రాలలో ఫ్యూడల్ మితవాద పార్టీలకు, అప్పుడే నిషేధం నుండి బైటపడిన కాంగ్రెసు పార్టీకి ప్రధానమైన పోటీజరిగింది. కాంగ్రెసు సోషలిస్టు పార్టీ కమ్యూనిస్టు పార్టీలు, మితవాద ఫ్యూడల్ శక్తులకు వ్యతిరేకంగా కాంగ్రెసు అభ్యర్థులను బలపరచాయి. వీలైనచోట్ల వామపక్షవాదులు కాంగ్రెసు అభ్యర్థులుగా ఎన్నిక పొందేందుకు తీవ్ర ప్రయత్నం చేశాయి.

ఎన్నికలను బహిష్కరించాలనే వాదనను కమ్యూనిస్టుపార్టీ వ్యతిరేకించింది. మంత్రి వర్గాలను కాంగ్రెసు వాదులు స్వీకరించవలెనా, కూడదా అనే సమస్య అప్రధాన సమస్య అనీ, ముందు ఎన్నికలలో మితవాద ఫ్యూడల్ శక్తులను ఓడించిన మీదట, ఆ విషయంలో ఆలోచించ వచ్చునని సూచించింది.

1937 జనరల్ ఎన్నికలు దేశవ్యాపితంగా సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్య సంఘటనకు గొప్ప దోహదం చేశాయి. మద్రాసులో జస్టిస్ పార్టీ ఉత్తరప్రదేశ్, బీహార్‌లలో జమీందారీ పార్టీలు, పంజాబులో యూనియనిస్టు పార్టీలపై కాంగ్రెసు తీవ్రంగా పోరాడింది. మద్రాసు, బొంబాయి, ఉత్తరప్రదేశ్, బీహార్, మధ్యప్రదేశ్ ఒరిస్సాలలో కాంగ్రెసు అఖండ విజయం సాధించింది. పంజాబులో సర్ సికిందర్ హయత్ ఖాన్ నాయకత్వాన యూనియనిస్టు పార్టీ బెంగాలులో ఫజకిహక్ నాయకత్వాన మరొక మితవాద పార్టీ గెలిచాయి.

మొత్తం మీద జనరల్ సీట్లలోనే కాంగ్రెసు ఎక్కువగా గెల్చింది. ముస్లింలకు కేటాయించిన 58 సీట్లలో 28 సీట్లను మాత్రమే గెల్చింది.

మంత్రిపదవులు స్వీకరించడమా, వద్దా అనే చర్చ కాంగ్రెసులో ప్రధాన అంశమైంది ఈ చర్చకంటే, మంత్రి వర్గాలు స్వీకరించి, తాము ఎన్నికలలో చేసిన వాగ్దానాలను అమలు జరపడం ముఖ్యమనే అంశానికి కమ్యూనిస్టు పార్టీ ప్రాధాన్యతనిచ్చింది.

## ఫైజపూర్

1936 ఏప్రిల్‌లో లక్నో కాంగ్రెస్ జరిగింది సంవత్సరం తిరగకముందే 1936 డిసెంబరులో ఫైజ్‌పూర్ మహాసభ జరిగింది. ఆ మహాసభకు జవహర్

రాల్ నె[హూయే అధ్యక్షుడు 1937లో జరుగనున్న ఎన్నికలలో పాల్గొనటం, ఎన్నికల [పణాళిక ఆమోదించుట వంటి ముఖ్య విషయాలను నిర్ణయించేందుకై ఫైజపూర్ కాం[గెస్ నిర్ణీత సమయం కంటే ముందగా సమావేశమైంది.

లక్నోలో కంటే [కియాశీలంగా ఫైజపూర్ కాం[గెసులో కమ్యూనిస్టులు పాల్గొన్నారు. లక్నో మహాసభలో వామపక్షవాదులు 7 గురు మా[తమే. ఫైజపూర్‌లో ఎ.ఐ.సి.సి సమావేశంలో కమ్యూనిస్టుల తరపున డాంగే సవరణకు అనుకూలంగా 83 మంది ఓటు చేశారు బహిరంగ సమావేశంలో 262 మంది అనుకూలంగా ఓటు చేశారు. 451 మంది వ్యతిరేకంగా ఓటు చేయడంతో ఆ సవరణ వీగిపోయింది.

ఇంతకూ ఆ సవరణ ఏమిటి "రాజ్యాంగ నిర్ణయ సభ [కియాశీల సా[మాజ్య వ్యతిరేక పోరాటాల ద్వారా మా[తమే ఏర్పడగలదు" అని

సర్దార్ పటేల్ నాయకత్వాన మితవాదులందరూ ఈ సవరణను వ్యతిరేకించారు.

ఫైజపూర్ కాం[గెసు సభల సందర్భంలోనే కాం[గెస్ సోషలిస్టు పార్టీ మరొకడుగు ముందుకు నడిచింది. "ఐక్య జాతీయ సంఘటన విప్లవ సోషలిజం నాయకత్వంలో ఆవిర్భవి చగలదు." అని మీరట్ సభ తీర్మానించగా, ఫైజపూర్‌లో "కార్మికవర్గ నాయకత్వాన" అనే నిర్దిష్ట భావన చోటు చేసుకుంది. అఖిల-భారత కాం[గెసు కమిటీలో 40 మంది కాం[గెసు సోషలిస్టులు సభ్యులుగా ఉండేవారు.

యం యన్. రాయ్. నిర్బంధం నుండి అప్పుడే విడుదలై ఫైజ్‌పూర్ కాం[గెసు మహాసభలకు హాజరైనారు కాం[గెసు సోషలిస్టు పార్టీ ఉనికినే [పశ్నిస్తూ యం. యన్ రాయ్ రెచ్చగొట్టే [పకటన చేశారు. దాంతో కాం[గెసు సోషలిస్టు నాయకులకు చాలా ఆ[గహం కలిగింది. అయినప్పటికీ దీర్ఘ కాలం నిర్బంధంలో ఉండి విడుదలై వచ్చినందుకుగానూ యం. యన్. రాయ్‌ని అభినందిస్తూ కాం[గెసు సోషలిస్టు పార్టీ ఒక తీర్మానం ఆమోదించింది. వామపక్ష శక్తులన్నింటినీ ఐక్యం చేసే బాధ్యతను కాం[గెసు సోషలిస్టు పార్టీ స్వీకరించడమే ఇందుకు కారణం. సోషలిస్టు పార్టీలో పనిచేస్తున్న కమ్యూనిస్టు పార్టీ నాయకుల [పోత్సాహం తోడ్పాటు ఇందుకు కారణం.

అఖిల భారత రాజకీయాలలో [పదర్శితమైన ఈ వైఖరి ఆం[ధ రాష్ట్ర రాజకీయాలలోనూ వ్యక్తమైంది.

1936 సెప్టెంబరు 26, 27 తేదీలలో ఆం[ధ రాష్ట్ర కాం[గెసు సోషలిస్టు పార్టి ద్వితీయ మహాసభలు రాజమం[డిలో జరిగాయి. ఆం[ధలోని కమ్యూనిస్టు

లందరూ అప్పటికే కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలో చేరారు. మద్దూరి అన్నపూర్ణయ్య ప్రధాన కార్యదర్శిగా, క్రొవ్విడి లింగరాజు, బసవరాజు రంగశాయి, పుచ్చలపల్లి సుందరయ్యలు సంయుక్త కార్యదర్శులుగా నూతన కార్యవర్గం ఎన్నికైంది.

యూసఫ్ మెహరాలీ తన అధ్యక్షోపన్యాసంలో ఫెడరల్ ప్రభుత్వ ప్రమాదాన్ని ప్రముఖంగా ప్రస్తావించారు. కాంగ్రెసు నాయకులు తమ ఉపన్యాసాలలో ఈ ప్రమాదాన్ని చేప్పేవారు కాదు. వారిలో మితవాదులు, ఫెడరల్ ప్రభుత్వ ప్రతిపాదనకు చాటుమాటుగా తోడ్పాటు ప్రకటించేందుకు సిద్ధపడటమే ఇందుకు కారణం. ఈ వివాదం పెరిగి పెద్దదై 1939 మార్చిలో జరిగిన త్రిపురి కాంగ్రెసు నాటికి కాంగ్రెసులో చీలికకు దారితీసిన విషయం విదితమే.

అత్యంత అభివృద్ధి నిరోధకమైన ఈ అంశాలకు వ్యతిరేకంగా 36 నుండి పోరాటం ప్రారంభమైంది స్వదేశ సంస్థానాలలో ప్రజోద్యమం మొదలైంది. ఈ ఉద్యమాలలో కమ్యూనిస్టులు కాంగ్రెసు సోషలిస్టులు ప్రధాన పాత్ర వహించారు. వామపక్షవాదులే అంతటా నాయకత్వంవహిస్తున్నందున తాము వెనుకబడుతామేమో అని కాంగ్రెసు వాదులలో కొందరు స్వదేశ సంస్థానాల ప్రజోద్యమంలో చేరారు. స్టేట్స్ పీపుల్స్ కాన్ఫరెన్సుకు కాంగ్రెసు నాయకులు పట్టాభి సీతారామయ్యగారు నాయకత్వం వహించారు.

కాంగ్రెసులోని అత్యంత మితవాద శక్తులకు నాయకులైన పటేల్, రాజేంద్రప్రసాద్‌లు ఈ ఉద్యమాలకు ఎల్లప్పుడు దూరంగానే ఉన్నారు.

36-39 మధ్యలో దేశ రాజకీయాలు వామపక్ష దిశగా మొగ్గాయంటే అందుకు కమ్యూనిస్టు పార్టీ అవలభించిన క్రియాశీల, సానుకూల జోక్యం ఒక ముఖ్య కారణమని గుర్తించటం అవసరం

## నిర్బంధ విధానానికి వ్యతిరేకంగా

1934 లో కమ్యూనిస్టు పార్టీపై నిషేధం విధించారు. ఈ నిషేధం తొలగించాలనే ఉద్యమం ప్రతి సందర్భంలోనూ వ్యక్తమవుతూ వచ్చింది.

రాజమండ్రిలో జరిగిన కాంగ్రెసు సోషలిస్టు పార్టీ మహాసభ రెండు తీర్మానాలను ఆమోదించింది.

కమ్యూనిస్టులపై కఠిన చర్యలు తీసుకోవాలని, కౌన్సిల్ ఆఫ్ స్టేట్సులో మితవాద నాయకుడు సేత్నా ప్రతిపాదించనున్న తీర్మానానికి వ్యతిరేకంగా సోషలిస్టులు ఆందోళన సాగించాలని తీర్మానించింది.

పిల్లలమర్రి వెంకటేశ్వర్లుపై సెక్యూరిటీ కేసు బనాయించటాన్ని కూడా రాజమండ్రి మహాసభ తీర్మానంలో ఖండించింది.

1937 సాధారణ ఎన్నికలలో మద్రాసు రాష్ట్రంలో, ప్రత్యేకించి ఆంధ్ర ప్రదేశ్‌లో కాంగ్రెసు సోషలిస్టులు, కమ్యూనిస్టులు, కాంగ్రెసు పార్టీకి అనుకూలంగా, జస్టిస్ పార్టీకి వ్యతిరేకంగా తీవ్రప్రచారం చేశారు

వీలైన చోట్ల వామపక్ష వాదులు, కాంగ్రెసు అభ్యర్థులుగా ఎన్నికయ్యేటట్లు కృషిచేశారు.

కృష్ణా జిల్లా నందిగామ నియోజకవర్గం నుండి, కాట్రగడ్డ వెంకట నారాయణరావు, రైల్వే నియోజక వర్గం నుండి, రాజమండ్రికి చెందిన నరసింహం గారు గెలుపొందారు.

మదరాసు రాష్ట్రంలో జస్టిస్ పార్టీ, అందులోనుండి చీలి ఏర్పడిన పీపుల్సు పార్టీ- ఘోరంగా ఓడిపోయాయి.

మంత్రి వర్గాలు స్వీకరించవచ్చునా, కూడదా అని కాంగ్రెసు నాయకత్వంలో వాదోపవాదాలు తీవ్రంగా జరిగాయి. చివరకు గాంధీగారి జోక్యంతో ఎ. ఐ. సి. సి ఒక రాజీ తీర్మానం ఆమోదించింది. గవర్నరు తన ప్రత్యేకాధికారాలు ఉపయోగించడనీ మంత్రుల సలహాలను త్రోసిపుచ్చడనీ నమ్మకం కల్గితే మంత్రి పదవులు స్వీకరించ వచ్చునని ఎ. ఐ. సి. సి. తీర్మానించింది.

గవర్నర్లు అలాంటి హామీ యివ్వడానికి కూడా తిరస్కరించి, తాత్కాలిక మంత్రి వర్గాలను నియమించారు.

ఏప్రిల్ 1 న మదరాసులో కె.వి. రెడ్డి నాయుడు మంత్రివర్గం నియామకం జరిగింది.

1937 మే లో కొత్తపట్నంలో ప్రారంభమైన రాజకీయ పాఠశాలను 20 రోజులు జరుగకముందే, మే 20 న ప్రభుత్వం నిషేధించింది. విద్యార్థులపై పాశవిక లాఠీఛార్జి జరిపి, పెక్కుమందిని నిర్బంధించి కేసులు పెట్టింది

ఈలోగా మంత్రి వర్గాలు స్వీకరించాలనే ఆసక్తి కాంగ్రెసు నాయకులలో హెచ్చింది. చివరకు నాటి గవర్నరు జనరల్ లార్డ్ లిన్‌లితిగో నోటి మాటగా ఒక హామీ యిచ్చారు దైనందిన పరిపాలనా నిర్వహణలో మంత్రి వర్గాల వ్యవహారాలలో గవర్నర్లు జోక్యం కల్పించుకోరు అని.

దాంతో కాంగ్రెసు మంత్రి వర్గాలు ఏర్పడటానికి మార్గం సుకరమైంది. మద్రాసులో రాజాజీ మంత్రివర్గం 1937 జూలై 14 న ఏర్పడ్డది.

కొత్తపట్నం రాజకీయ ఖైదీలను ప్రభుత్వం విడుదల చేసింది. కాని కొత్తపట్నం స్కూలుపై నిషేధాన్ని తొలిగించలేదు.

కాంగ్రెసు మంత్రి వర్గ ద్విముఖ స్వభావం ప్రతి సందర్భంలోనూ వ్యక్తం కాసాగింది. ప్రజా ఒత్తిడికి లొంగి, లోగడ చేసిన వాగ్దానాలను ఒకటో, రెండో

అమలు జరుపటం, వెనువెంటనే శాంతిభద్రతల రక్షణ పేరుతో వామపక్ష ఉద్యమాలపై నిర్బంధాలు విధించటం. అన్ని కాంగ్రెసు మంత్రి వర్గాల కంటే హెచ్చుగా ఆనాడు రాజాజీ మంత్రి వర్గం ప్రజా వ్యతిరేక ధోరణిని అనుసరిస్తూ ఉండేది. కమ్యూనిస్టు ప్రమాదంపై రాజాజీ మంత్రి వర్గం 1937 సెప్టెంబరులో ఒక తీర్మానాన్ని ఆమోదించింది.

ఆనాడు కమ్యూనిస్టు పార్టిపై నిషేధం ఉన్నది. కమ్యూనిస్టుపార్టి జాతీయ స్రవంతిలో వామపక్ష శ్రేణులకు అగ్రభాగాన పని చేస్తున్నది. అట్టి కమ్యూనిస్టు పార్టిపై రాజాజీ మంత్రి వర్గం ఇలా తీర్మానించటం అనుచితమని ఆంధ్రలోని సోషలిస్టు పార్టీ శాఖలన్నీ నిరసన తెలిపాయి.

ఆంధ్ర కాంగ్రెసు నాయకత్వం కూడా, పట్టాభి సీతరామయ్యగారి ఆధ్వర్యాన ఇలాంటి ప్రజా వ్యతిరేక వైఖరినే చేపట్టింది.

పశ్చిమ గోదావరి జిల్లా కాశి పట్నం రైతులు తమ హక్కులకై జమీందారుకు వ్యతిరేకంగా జరుపుతున్న పోరాటాన్ని హింసాయుత పోరాటంగా వక్రీకరించి కేంద్ర కాంగ్రెసు నాయకత్వానికి నివేదికను పంపింది. అందుపై గాంధీజీ, కాశీపట్నం పోరాటాన్ని వ్యతిరేకిస్తూ ఒక ప్రకటన చేశారు

పట్టాభి సీతారామయ్యగారి చర్య ద్వారా కాంగ్రెసు, కాంగ్రెసు సోషలిస్టు పార్టీల మధ్య అఖాతం పెరిగింది.

పశ్చిమ గోదావరి జిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీకార్యవర్గం, కాశీపట్నం రైతు పోరాటాన్ని సమర్థిస్తూ సెప్టెంబరు 26, 27 తేదీలలో పొలమూరులో సమావేశమై తీర్మానించింది. సెప్టెంబరు 21వ తేదీన 'నవశక్తి' పత్రిక, కాశీపట్నం పోరాటాన్ని బలపరుస్తూ సంపాదకీయం వ్రాసింది.

రాజాజీ మంత్రి వర్గం ఆనాడు చేపట్టిన ప్రజా వ్యతిరేక చర్చలు చాలా ఉన్నాయి. రైతు కార్మిక పోరాటాలను క్రిమినల్ కేసుల పరిధితోకి తెస్తూ రాజాజీ మంత్రివర్గం ఒక తీర్మానాన్ని ఆమోదించింది.

'అన్నా' అనే గ్రంథంపైన 'జమీన్ రైతు' అను నాటకంపైన నవంబరు 16, 1938న మద్రాసు ప్రభుత్వం నిషేధంవిధించింది 'రష్యా విప్లవం' మన్యంలో రైతు తిరుగుబాట్లు గ్రంథాలు కూడా నిషేధానికి గురయ్యాయి.

కృష్ణా జిల్లా నుండి, సుందరయ్యగారు ఇతర ప్రాంతాలకు వార్తా లేఖలు పంపరాదని కృషా జిల్లా కలెక్టరు ఒక ఆంక్ష విధించారు

ఇలాంటి ప్రజాస్వామ్య వ్యతిరేక చర్యలన్నింటిని నిరసిస్తూ కమ్యూనిస్టు పార్టీపై నిషేధాన్ని తొలగించాలని డిమాండ్‌చేస్తూ రాష్ట్రంలో పెక్కు చోట్ల సోషలిస్టుపార్టీ ఆధ్వర్యాన సభలు జరిగాయి,

# బాట్లీవాలా అరెస్టు

కాంగ్రెసు సోషలిస్టు పార్టీ నాయకులు బాట్లీవాలా ఆంధ్రలో పర్యటించి ఉత్తేజకర ఉపన్యాసాలు ఇవ్వసాగారు. రాజాజీ ప్రభుత్వం బాట్లీవాలాను అరెస్టు చేసి, రాష్ట్రం నుండి వెళ్ళిపోవాలనే షరతుపై కొంత కాలానికి విడుదల చేసింది. ఆయనపై బహిష్కరణ ఉత్తర్వు రద్దు చేయాలని, ఆంధ్రలో పెద్ద ఆందోళన మొదలైంది. కాంగ్రెసు మంత్రి వర్గాలు ఏర్పడి రాజకీయ ఖైదీల విడుదల లాంటి కొన్ని చర్యలు అమలు జరిగినా, కమ్యూనిస్టు పార్టీపై నిషేధం మాత్రం తొలగ లేదు. కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగించాలని ఆంధ్రలో వామపక్షవాదులు తీవ్ర అందోళన చేశారు.

ఋణ విమోచన బిల్లును రెవిన్యూ మంత్రి ప్రకాశం గారు ప్రవేశపెట్టారు కాని జమీందారీల రద్దు వంటి మౌలిక సంస్కరణల ప్రస్తావన లేదు. రైతుల కోర్కెలను ప్రభుత్వ దృష్టికి తీసుకు వచ్చేందుకై చరిత్రాత్మకమైన రైతు రక్షణ యాత్ర, పలాసా నుండి మద్రాసు వరకు జరిగింది. ఇది యావదాంధ్రలోనూ రైతాంగంలో గొప్ప సంచలనం కల్గించింది రాష్ట్ర రైతు సంఘ అధ్యక్ష కార్యదర్శులు, కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి, చలసాని వాసుదేవరావు గారలు ఈ యాత్రకు నాయకత్వం వహించారు.

కాంగ్రెసు సోషలిస్టులందరూ, అనగా ఆంధ్రలోని కమ్యూనిస్టు పార్టీ ముఖ్యులతో సహా, కాంగ్రెసు సంస్థలో చేరారు. కాంగ్రెసు సంస్థనే, సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనగా రూపొందించాలనే ఎత్తుగడకు అనుగుణంగా ఈ మార్పు జరిగింది

నెల్లూరు జిల్లాలో పుచ్చలపల్లి సుందరయ్య గారు కాంగ్రెసు వాదిగానే రాజకీయ జీవితం ప్రారంభించారు. కృష్ణా జిల్లాలో, మద్దుకూరు చంద్రశేఖరరావు, చలసాని వాసుదేవరావు గారలు, పశ్చిమ గోదావరి జిల్లా అల్లూరి సత్యనారాయణ, ఉద్ధరాజు రామం గారలు, గుంటూరు జిల్లాలో పులుపుల శివయ్య, పోలపెద్ది నరసింహమూర్తి, జొన్నలగడ్డ రామలింగయ్య తదితరులు అందరూ 1930 సత్యాగ్రహంలో పాల్గొని కాంగ్రెసు వాదులుగా నిర్భందాలకు గురైనారు. పిమ్మట కమ్యూనిస్టు ఉద్యమం వైపు ఆకర్షితులైనారు.

34 ప్రాంతంలో కమ్యూనిస్టు పార్టీ అనుసరించిన విధానం ఫలితంగా వారు కాంగ్రెసు నుండి రాజీనామా చేసి, కూలీ సంరక్షణ సమితులు ఏర్పరిచారు. తిరిగి 1937 లో కమ్యూనిస్టు పార్టీ వైఖరిలో వచ్చిన మార్పు ఫలితంగా వీరందరూ కాంగ్రెసు సభ్యులుగా చేరారు. పెక్కు జిల్లా కాంగ్రెసు కమిటీలలో ప్రముఖ స్థానాలు ఆక్రమించారు.

పశ్చిమ గోదావరి జిల్లాలో అల్లూరి సత్యనారాయణ రాజుగారు జిల్లా కాంగ్రెసు కమిటీ అధ్యక్షులుగానూ, గారపాటి సత్యనారాయణ కార్యదర్శిగానూ ఎన్నికయ్యారు. వామపక్షవాదులే కమిటీలో అత్యధికులు. పశ్చిమ కృష్ణా జిల్లా కాంగ్రెస్ కమిటీలో కూడా అతివాదులు అధిక సంఖ్యలో ఉండేవారు. కాంగ్రెసులో అతివాద, మితవాద ఘర్షణలు కృష్ణాజిల్లాలో తీవ్ర రూపంలో సాగాయి. అతివాదులు, వామపక్షాల వారు చేర్పించిన 35 వేల మంది కాంగ్రెసు సభ్యులను, సభ్యత్వం నుండి తొలగిస్తూ పట్టాభి సీతారామయ్యగారి ప్రోత్సాహంతో అఖిల భారత కాంగ్రెసు కమిటీ తీర్మానించింది.

కార్మిక, విద్యార్థి, యువజనోద్యమాలు కూడా, చేసిన వాగ్దానాలు అమలు జరపండి అంటూ పెద్ద ఉద్యమాన్ని నిర్మించాయి.

## ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం

ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం కొరకు 1922లోనే ఆంధ్రలో ఉద్యమం ప్రారంభమైంది. కమ్యూనిస్టు పార్టీ మొదటి నుండి భాషా ప్రయుక్త రాష్ట్రాల ప్రాతిపదికపై ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం కొరకు ఆందోళన చేస్తూనే ఉంది. కాంగ్రెసు పార్టీ కూడా ఇదే వైఖరిని అనుసరించింది. కాని ఆందోళనచేసేదికాదు.

1938 జూన్‌లో కమ్యూనిస్టు పార్టీ రెండవ మహాసభ జరిగింది. అందులో వివిధ సమస్యలపై తీర్మానాలు ఆమోదించారు. ఆంధ్ర రాష్ట్రంపై ఆమోదించిన తీర్మానాన్ని వివరిస్తూ శ్రీ పోలేపెద్ది నరసింహమూర్తి జూలై 3, 1938 నవశక్తి సంచికలో వ్యాసం వ్రాశారు. అందులో ఇలా తెలియజేశారు.

"భాషల ప్రకారం రాష్ట్ర విభజన కోరటం ప్రజాతంత్ర కోరిక.... బయటి తీవ్ర ఆందోళన ఫలితంగా మద్రాసు కాంగ్రెసు మంత్రి వర్గం, భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన కొరకు తీర్మానము నొకదానిని ప్యాసు చేయించి, ప్రభుత్వానికి పంపేటట్లు చేయగలిగింది.

కాంగ్రెసు నాయకత్వం రాష్ట్రాల విభజన సిద్ధాంతాన్ని మాటల్లోనే ఆమోదించింది. కాని దానినొక సామ్రాజ్య వ్యతిరేక నినాదంగా చేసి విరివిగా ఆందోళన చేయాలనుకోలేదు.

"ఫలితంగా ప్రత్యేక రాష్ట్రం కొరకు జరిగే ఆందోళక దారి, తెన్నూ లేకుండా ఉంది. కాంగ్రెసులోని అధిక సంఖ్యాకులకు, కాంగ్రేసేతరులకు బ్రిటిష ప్రభుత్వం దగ్గరకు డెప్యుటేషన్ పోయి ప్రాధేయపడితే రాష్ట్రం సిద్ధిస్తుందనే సంకుచిత సంస్కరణ తత్వం పూర్తిగా ఆవహించింది.

"రాష్ట్ర విభజన కొరకు ఆందోళన మానుకోవలెనని ప్రధాన సమస్యల నుండి ప్రజల దృష్టిని ఇది మరలుస్తుందని కాంగ్రెసు కార్యవర్గం తీర్మానించింది. కాంగ్రెసుకు, అధికారం రాగానే రాష్ట్రవిభజన సమస్య పరిష్కారం చేస్తామని కార్యవర్గం చెప్పింది."

"అధికారం అంటే సంపూర్ణ స్వాతంత్ర్యమా, లేక ఫెడరల్ ప్రభుత్వంలో సెంటరులో కాంగ్రెసు ప్రభుత్వం ఏర్పడటమా."

"మొదటిదైతే అది చాలాకాలం పడుతుంది. రెండో పద్ధతి ఐతే ఫెడరేషన్‌లో కేంద్రంలో కాంగ్రెసు పదవిలోకి వచ్చినా, వారికి ఎలాంటి అధికారాలు ఉండవు."

"ఈ సమస్యను సామ్రజ్య వ్యతిరేక నినాదంగా తీసుకొని యితర సమస్యలతో పాటు తీవ్ర ఆందోళన సాగించినట్లయితే మన స్వాతంత్ర్య పోరాటం తీవ్రతరమగుటకు పూర్తి అవకాశములున్నవి .. . .. భాషా ప్రయుక్త రాష్ట్రాల కొరకు జరిగే పోరాటం కూడా సామ్రాజ్య వ్యతిరేక పోరాటమని గుర్తించాలి."

కమ్యూనిస్టు పార్టీ ఆంధ్ర రాష్ట్ర సమస్యపై పై విధంగా సూత్రబద్ధమైన వైఖరిని అవలంభించింది.

రాజాజీ మద్రాసు ముఖ్యమంత్రి కాగానే, విశాఖలోని ఆంధ్ర మెడికల్ కళాశాలకు తగినన్ని నిధులు మంజూరు చేసి, గుర్తింపు ఇవ్వాలనే ఆందోళన ప్రారంభమైంది. ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ ఈ ఉద్యమంలో ప్రముఖ స్థానం వహించింది. ఫెడరేషన్‌లో నాయకత్వ స్థానంలో ఉన్న కమ్యూనిస్టు విద్యార్థులు ప్రశంసనీయమైన పాత్ర వహించారు.

ఆంధ్ర మెడికల్ కాలేజీ గుర్తింపు, ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం, మద్రాసు రాష్ట్రంలో అప్పటికి భాగమైన ఆంధ్రలో పరిశ్రమలు, విద్యాభివృద్ధికి ఇతోధిక కృషి - ఇవి నాటి కమ్యూనిస్టు పార్టీసాగించిన ఆందోళనలోని ముఖ్యాంశములు. కాంగ్రెసువాదులకు కూడా ఈ అంశాలలో ఏకీభావం ఉన్నప్పటికీ, కాంగ్రెసు మంత్రి వర్గాలు అప్పటికే ఏర్పడి ఉన్నందున, ఆ మంత్రి వర్గాలకు వ్యతిరేకంగా ఆందోళనలోకి వచ్చేవారు. కాదు.

మద్రాసు ముఖ్యమంత్రి రాజాజీ, ఆంధ్ర రాష్ట్రానికి వ్యతిరేకి అని అప్పటికే అందరికి అర్థమైంది. కనుక రాజాజీకి వ్యతిరేకంగా ఆంధ్రలో విద్యార్థులు, యువకులు, కమ్యూనిస్టు పార్టీ ఆధ్వర్యాన సాగించిన ఉద్యమానికి కాంగ్రెసు వాదుల ప్రచ్ఛన్న తోడ్పాటు వుంటూ వుండేది.

# రాయ్ వైఖరి

1938 ప్రారంభంలో యం.యన్. రాయ్ ఆంధ్రలో పర్యటించారు. ఆనాటికే కమ్యూనిస్టు ఉద్యమం నుండి యం.యన్. రాయ్ వేరైనారు. కాంగ్రెసు సోషలిస్టు పార్టీ నిర్మాణాన్ని సైతం వ్యతిరేకించారు. అయినప్పటికీ, మార్క్సిస్టు మేధావిగా అప్పటికి గొప్ప పేరు కాంచిన రాయ్ గారిని కలుసుకొని చర్చించే వైఖరినే, నాటి యువ కమ్యూనిస్టులు ప్రదర్శించారు. చర్చలు సాగిన కొద్ది యం.యన్. రాయ్ ఆలోచనా ధోరణిలోని ప్రమాదకర వైఖరి, సోవియట్ వ్యతిరేకత, కమ్యూనిస్టు వత్యిరేక వ్యక్తం కాసాగాయి.

లెనిన్ కాలం నుండి రాయ్ చేసిన కొన్ని సిద్ధాంత ప్రతిపాదనలు వివాద గ్రస్థాలుగా ఉండేవి. 1920 లో కొమింటర్న్ ద్వతీయ మహాసభ, వలస సమస్య పై ఒక పత్రాన్ని ఆమోదించింది. లెనిన్ రచించిన ఈ పత్రం "జాతి వలస సమస్యలపై ప్రాథమిక ముసాయిదా థీసిసు" అదే సమస్య యం.యన్ రాయ్ ప్రతిపాదించిన అనుబంధ దీసిన్‌ను అనేక అంశాలను లెనిన్ తొలగించిన మీదట, ఆమోదించింది.

రాయ్ తొలి థీసిస్‌లో లెనిన్ చేసిన సవరణలు ఇవి :

1. వలస దేశాలలో బూర్జువా జాతీయ శక్తులు అని రాయ్ రాసిన మాటల స్థానే లెనిన్ 'బూర్జువా జాతీయ విప్లవ శక్తులు' అనే మాట చేర్చారు.
2. రాయ్ దృష్టిలో బూర్జువా జాతీయత విప్లవశక్తి కాదు. కనుక వలసదేశాల 'బూర్జువా ప్రజాతంత్ర ఉద్యమాన్ని' బలపరచడం సముచితం కాదు. దీనిని లెనిన్ తోసిపుచ్చారు.
3. పెట్టుబడిదారీయేతర పంథా అనే భావనను లెనిన్ ప్రవేశపెట్టాడు. రాయ్ తొలి థీసిస్‌లో ఈ భావన లేదు.

(ఈ వివాదంపై పూర్తి వివరాలకు ఆంధ్రప్రదేశ్‌లో కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర, మొదటి భాగం రచన కంభంపాటి సత్యనారాయణ, పేజీలు 177-190 చూడండి.)

కొమింటర్న్ ఆమోదించిన థీసిస్‌కు రాయ్ తలఒగ్గినా, ఆయన భావాలతో మాత్రం నిజమైన మార్పు రాలేదు. భారతదేశంలో బూర్జువా నాయకత్వం గాంధీజీ ఆధ్వర్యాన ప్రజానీకానికి ద్రోహం చేస్తున్నది. కనుక ఆ నాయకత్వాన్ని బహిర్గతం చేసి, ప్రజల నుండి వేరు చేయుటమే కమ్యూనిస్టుల కర్తవ్యం అనేది రాయ్ వాదన సారాంశం.

భారత కమ్యూనిస్టులు తొలిరోజులలో అవలంబించిన వైఖరికి బీజాలు రాయ్ భావనలు, ఆయన అందించిన సూచనలోనే ఉన్నవని స్పష్టం కాగలదు.

1928 కొమింటర్న్ 6 వ కాంగ్రెసు నాటికి రాయ్ "డీకాలనైజేషన్" అనే కొత్త సిద్ధాంతాన్ని రూపొందించారు. అనగా బ్రిటీషు సామ్రాజ్యవాదం తన అంతరంగిక వైరుధ్యాల కారణంగా, తనకు తానై భారత దేశం నుంచి వైదొలగి భారతదేశానికి స్వాతంత్ర్యం ఇస్తుంది. కమ్యూనిస్టులు చేయవలసినదల్లా కాంగ్రెసు సంస్థలో చేరి, కాంగ్రెసు నాయకత్వాన్ని ఏదో విధంగా చేజిక్కించుకోవటం. సామ్రాజ్య వ్యతిరేక పోరాటాలు అక్కరలేదు. 1920-గాంధీజీ సహాయ నిరాకర ణోద్యమం కూడా రాయ్ దృష్టిలో "ప్రిమెచ్యూర్" అనగా అకాలంలో జరిగింది. ఈ వాదనను కొమింటర్న్ తిరస్కరించింది. మరికొన్ని నిర్మాణ సంబంధమైన ఉల్లంఘనల కారణంగా యం యస్. రాయ్‌ని కమ్యూనిస్టు పార్టీనుండి తొల గించింది.

ఈ వివరాలన్నీ భారత కమ్యూనిస్టులకు అనాటి పరిస్థితులలో పూర్తిగా తెలిసే అవకాశం లేకపోయింది. కొందరు నాయకులకు తెలిసినా, నాటి రహస్య పరిస్థితులలో పార్టీ అనుచరవర్గానికి పూర్తిగా బోధపడలేదు.

ఈ పరిస్థితిని అవకాశంగా తీసుకుని రాయ్, అతని అనుచరులు కమ్యూ నిస్టు ఉద్యమంలో గందరగోళాన్ని కల్పించటానికి ప్రయత్నించేవారు.

1935 కొమింటర్న్, 7 వ కాంగ్రెసు తర్వాత, భారత కమ్యూనిస్టులు, కాంగ్రెసులోనూ, కాంగ్రెసు సోషలిస్టు పార్టీలోనూ చేరి పని చేయసాగారు. ''మేము ఆనాడు చెప్పినది ఇప్పుడు మీరు అనుసరిస్తున్నారు" అని రాయ్ అనుచరులు వాదించసాగారు.

వాస్తవం అది కాదు. కాంగ్రెసులోనూ, కాంగ్రెసు సోషలిస్టు పార్టీలోనూ చేరి, కాంగ్రెసును పోరాట పథంలో ముందుకు నెట్టి, వర్గ సంఘాల సమిష్టి ప్రాతి నిధ్యం తదితర చర్యల ద్వారా, సామ్రాజ్య వ్యతిరేక సంఘటనగా కాంగ్రెసును రూపొందించటం కమ్యూనిస్టుల లక్ష్యం.

రాయ్, అతని అనుచరుల లక్ష్యం అదికాదు. కాంగ్రెసు నాయకత్వాన్ని ఏవో కుట్రలు, కుతంత్రాల ద్వారా చేజిక్కించుకోవటం.

వర్గ సంఘాల సమిష్టి ప్రాతినిధ్యం ప్రతిపాదనను, రాయ్ మొదటి నుండి వ్యతిరేకించారు. అలా చేసే కాంగ్రెసులో చీలికలు వస్తాయని, కార్మికులు రాజ కీయాలకు సంబంధం లేకుండా కేవలం ఆర్థిక సమస్యలకే పరిమితం కావాలని ఆయన వాదన.

ఈ ధోరణికి అనుగుణంగానే కాంగ్రెసు సోషలిస్టు పార్టీ నిర్మాణాన్ని ఆయన వ్యతిరేకించాడు. ఫైజ్‌పూర్ కాంగ్రెసు మహా సభలో మొట్ట మొదటి సారిగా ఆయన జైలునుంచి విడుదలై బైటికి వచ్చి చేసిన ప్రసంగంలోనే

కాంగ్రెసు సోషలిస్టు పార్టీ నిర్మాణాన్ని ఖండిచారు. దాంతో మణిబెన్‌కారా, ఆర్. యస్. నింబ్కర్ లాంటివారు, కాంగ్రెసు సోషలిస్టు పార్టీనుండి నిష్క్రమించారు. ట్రేడ్ యూనియన్ రంగంలో కూడా కమ్యూనిస్టులకు ప్రతి సమస్య మీద దూరంగా ఉండేవారు.

1938 లో ఆంధ్రలో రాయ్ పర్యటించినపుడు గుంటూరులో ఎ. సి. కాలేజి పక్కనే ఉన్న జిల్లా బోర్డు వారి రహదారి బంగళాలో అనేక మంది యువకులను ఉద్దేశించి రాయ్ ప్రసంగించారు. పై సిద్ధాతాలతో పాటు ఆ సమావేశంలో 'జాకోబినిజం' అనే కొత్త భావనతు ప్రవేశపెట్టారు.

భారత విప్లవ పురోగతికి మార్క్సిజం మార్గదర్శకము కాదు. 1789 ఫ్రెంచి మహా విప్లవానికి సిద్ధాంత చోదక శక్తిగా, ఉన్న బూర్జువా ఉదార విప్లవ వాదం (జాకోబినిజం) మాత్రమే భారత దేశానికి అవసరం అని వాదించారు.

అంతవరకూ మార్క్సిస్టు మేధావిగా రాయ్‌ని పరిగణిస్తున్న వారికి, ఈ కొత్తవాదన ఆశ్చర్యం కల్గించింది. యం. యన్ రాయ్‌ని కొమింటర్న్ నుండి తొలగించడంలో అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం ఏమైనా తొందరపాటును ప్రదర్శించేదేమో అని అనుమానాలున్న వారు సైతం, క్రమంగా రాయిజం నుండి దూరం కాసాగారు.

సోవియట్ వ్యతిరేకత, సిద్ధాంత రీత్యా మార్క్సిస్టు వ్యతిరేకభావాలకు లోనైన వారు మాత్రమే రాయ్ అనుచరులుగా స్థిరపడిపోయినారు. తెనాలికి చెందిన ఆవుల గోపాల కృష్ణమూర్తి, రాధాకృష్ణమూర్తి బాపట్లకు చెందిన యం. వి. రామమూర్తి గారలు వీరిలో ముఖ్యులు. కాంగ్రెసు సోషలిస్టు, కమ్యూనిస్టు భావాలు గల వారందరూ రాయిజం నిజస్వరూపం గ్రహించసాగారు.

## హరిపురా

ఈ లోగా భారత రాజకీయాలలో వేగంగా మార్పులు రాసాగాయి. 1938 ఫిబ్రవరిలో హరిపురా కాంగ్రెసు మహాసభ జరిగింది. సుభాష్ చంద్రబోస్ ఆ మహాసభకు ఏకగ్రీవంగా అధ్యక్షులుగా ఎన్నికైనారు.

సామ్రాజ్యవాదులు తమ పన్నాగాలు సాగిస్తూనే ఉన్నారు. కేంద్రంలో ఫెడరేషన్ స్థాపన సామ్రాజ్యవాదుల ధ్యేయం.

కాంగ్రెసు కార్యవర్గం సూత్రరీత్యా ఫెడరేషను వ్యతిరేకించింది. కాని రాజీ ద్వారం ఒకటి తెరిచే వుంచింది. కేంద్ర శాసన సభకు ప్రత్యక్ష ఎన్నికలు, స్వదేశ సంస్థానాలలో నామమాత్రపు బాధ్యతాయుత ప్రభుత్వాలు ఏర్పర్చటానికి సంస్థానాధీశుల ఆమోదం - ఈ రెండూ జరిగితే ఫెడరేషన్‌కు సమ్మతిస్తాము అని కాంగ్రెసు కార్యవర్గం తీర్మానించింది.

స్వదేశ సంస్థానాంలో ప్రజోద్యమాలను బలపరుస్తూనే, కాంగ్రెసు సంస్థ వాటితో ప్రత్యక్ష సంబంధం ఏర్పరచుకోరాదు అని తీర్మానించింది. ఈ అభ్యంత రాన్ని అధిగమించటానికి, స్టేట్స్ పీపుల్సు కాన్ఫరెన్సు అనే ఒక సంస్థను, కాంగ్రెసు నాయకులు పట్టాభి సీతారామయ్య గారి లాంటి వారు ప్రారంభించారు.

కాంగ్రెసు మంత్రి వర్గాలు, కార్మిక, రైతు సంఘాపై దాడులు సాగిస్తూనే ఉన్నాయి ఆంధ్రలో చీరాల, చిట్టివలస కార్మిక సమ్మెలను అణచేందుకు రాజాజీ మంత్రి వర్గం పోలీసు కాల్పులు జరిపింది.

ఈ సమస్య లన్నింటిని చర్చించి కమ్యూనిస్టు పార్టీ తన వైఖరిని వివరిస్తూ కమ్యూనిస్టులు - కాంగ్రెసు అనే పత్రాన్ని జారీ చేసింది.

కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగకపోయినా, కమ్యూనిస్టు పార్టీ దాదాపు బహిరంగంగానే పని చేయసాగింది. ఇంగ్లీషులో 'నేషనల్ ఫ్రంట్' వారపత్రిక తెలుగులో 'నవశక్తి' అలాగే ఇతర భాషలలో మరి కొన్ని పత్రికలు వెలువడ సాగాయి. కార్మికుల సమ్మె పోరాటాల ఉధృతి పెరిగింది. 1937 లో 379 కార్మిక సమ్మెలు జరిగాయి. 6,76,000 కార్మికులు అందులో పాల్గొన్నారు 1921 తర్వాత ఇది అతి హెచ్చు సంఖ్య.

ఈ నేపథ్యంలో కమ్యూనిస్టు పార్టీ ఐక్య సంఘటన విధానాన్ని మరింత ముందుకు తీసుకుపోయేందుకు చర్యలు తీసుకున్నది.

అక్టోబరు 1938 లో నాగపూర్‌లో రెండు అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసులు విలీనమై ఎ.ఐ.టి.యు.సి. ఆవిర్భవించింది. ఐక్యత కొరకై కమ్యూ నిస్టులు రెండు రాజీ ప్రతిపాదనలను ఆమోదించారు. అఖిల భారత సమ్మెలు, రాజకీయ సమ్మెలు, అంతర్జాతీయ కార్మిక సంస్థలతో అనుబంధం వంటి సమస్య లను నాలుగింట 3 వంతులు మెజారిటీతో నిర్ణయించాలని అంగీకరించారు.

ఈ ఐక్యత సాధించిన తర్వాత ఎ. ఐ. టి. యు. సి. ఇచ్చిన రాజకీయ సమ్మెలో నవంబరు 1938 లో, 90 వేల కార్మికులు పాల్గొన్నారు. బొంబాయి ప్రభుత్వం అమలు జరిపిన కార్మిక వివాదాల చట్టానికి నిరసనగా ఆ సమ్మె జరిగింది.

ఫెడరేషన్ ప్రతిపాదనకు వ్యతిరేకంగానూ, రాజ్యాంగ నిర్ణయ సభ ఏర్పడాలనే కోర్కెకు అనుకూలంగానూ, విశాలమైన సమైక్య ప్రతిఘటన నిర్మించటం కమ్యూనిస్టు పార్టీ లక్ష్యం.

## ఫెడరేషన్ వ్యతిరేక ఆందోళన

1938 సెప్టెంబరు 16 న ఫెడరేషన్‌కు వ్యతిరేకంగా సభలు, ప్రదర్శనలు చేయవలసిందిగా ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు ప్రధాన కార్యదర్శి హోదాలో శ్రీ పుచ్చలపల్లి సుందరయ్యగారొక ప్రకటన చేశారు.

ఫెడరేషన్‌కు వ్యతిరేకంగా సెప్టెంబరు 28 వ తేదీన 'నవశక్తి' ఒక ఉత్తేజకర సంపాదకీయాన్ని వ్రాసింది.

ఈ పిలుపు మేరకు రాష్ట్రంలో పెక్కు చోట్ల సభలు జరిగాయి. ప్రధానంగా, విద్యార్థి, యువజన సంఘాల ఆధ్వర్యాన ఈ ఆందోళన కొనసాగింది. (యువజన, విద్యార్థి విభాగాలు చూడండి.)

"1939 జనవరి 28, 29 తేదీలలో బెజవాడలో జరిగిన 15వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభ ఫెడరేషన్ వ్యతిరేకంగా ఆందోళన చేయాలని, ఫెడరేషన్‌ను వ్యతిరేకించే కాంగ్రెసువారినే త్రిపుర కాంగ్రెసు ప్రతినిధులుగా ఎన్నుకోవాలని తీర్మానించింది.

2938 జూన్‌లో జరిగిన రెండవ పార్టీ మహాసభ, ఫెడరేషన్‌పై కూడా ఒక తీర్మానం ఆమోదించింది.

ఫెడరల్ ప్రభుత్వాన్ని స్వీకరించాలనే ధోరణి కాంగ్రెసు నాయకులలో కొందరిలో ఉన్నదని, ఇది చాలా ప్రమాదకరమని, ఫెడరల్ ప్రభుత్వంలో అధికారం లభిస్తుందనుకోవడం కేవలం భ్రమ అని హెచ్చరించింది. ఫెడరేషన్ వ్యతిరేక కార్యక్రమాన్ని తీవ్రతరం చేయాలని కూడా తీర్మానించింది.

వామపక్షాలు ఈ దిశలో సాగుతూండగా, కాంగ్రెసు నాయకులు రాజ్యాంగ విర్ణయ సభ స్థానంలో, ఒక రాజ్యాంగ సదస్సును ఏర్పరచాలని తీర్మానం చేశారు. ఈ తీర్మానాన్ని సోషలిస్టులు, కమ్యూనిస్టులు వ్యతిరేకించారు. కాగా రాయ్ అనుచరులు బలపరిచారు. కాంగ్రెసు నాయకత్వంతో మితవాద ప్రాతిపదికపై సర్దుబాటు చేసుకోటానికి రాయిస్టులు సిద్ధపడ్డారు.

ఫెడరేషన్ ప్రతిపాదనకు కాంగ్రెసు నాయకత్వం ఆమోదించటానికి రహస్య పన్నాగాలు చేస్తున్నదని బోసు అనుచరులు ప్రచారం చేయసాగారు. కాంగ్రెసు మితవాద నాయకులకు, బోసు అనుచరులకు అఘాతం పెరగసాగింది.

ఈ పరిస్థితులలో కమ్యూనిస్టులు పైన వివరించిన పత్రంలో తమ విధానాన్ని పునరుద్ఘాటించారు. అందులోని ముఖ్యాంశాలు ఇవి.

## కమ్యూనిస్టుల ఐక్యతా విధానం

కార్మిక, రైతాంగ పోరాటాలు పెరుగుతున్న దృష్ట్యా కాంగ్రెసును ఐక్య సంఘటనా వేదికగా మార్చే అవకాశాలు పెరుగుతున్నాయి. కాంగ్రెసు నాయకత్వం ఊగిసలాటలను అరికట్టుతూ, కాంగ్రెసును చీల్చాలని చేసే ప్రయత్నాలను (బోసు) లేక నాయకత్వాన్ని ఏదో విధంగా ఆక్రమించుకోవాలనే చేసే ప్రయత్నాలను (రాయ్) ఎదుర్కొంటూ, కమ్యూనిస్టులు తమ విధానాన్ని పట్టుదలతో అమలు జరపాలని పై పత్రం పునరుద్ఘాటించింది.

హరిపురా (1938 ఫిబ్రవరి) నుండి త్రిపుర (1939 మార్చి) వరకు జరిగిన పరిణామాలు, పై అవగాహన సరైనదని రుజువు చేశాయి.

కాంగ్రెసులోని వామపక్ష వాదులు బలం పుంజుకోసాగారు. నెహ్రూ, బోసులు పరోక్షంగా వీరిని బలపరుస్తూ వచ్చారు. కాంగ్రెసు మంత్రి వర్గాల పని తీరుపై ముఖ్యంగా మద్రాసు వంటి రాష్ట్రాలలో కాంగ్రెసు వాదులలోనే తీవ్ర అసంతృప్తి పెరగసాగింది

అంతర్జాతీయంగా యుద్ధ ప్రమాదం ముంచుకు రాసాగింది. యుద్ధమే వస్తే ఎవరి వైఖరి ఎలా ఉండాలనే విషయమై ప్రతి పార్టీలోనూ చర్చలు జరుగుతూ వచ్చాయి.

త్రిపుర కాంగ్రెసు అధ్యక్ష పదవికి తిరిగి పోటీచేయాలని బోస్ నిర్ణయించాడు. వామపక్షాలన్నీ ఆయన అభ్యర్థిత్వాన్ని బలపరచాయి. కాంగ్రెసు మితవాద నాయకత్వానికి అది ఇష్టంలేదు. లక్నో, ఫైజ్‌పూర్ కాంగ్రెసు మహాసభలకు వరుసగా నెహ్రూయే అధ్యక్షుడుగా ఎన్నికయ్యేటట్లు శ్రద్ధ తీసుకున్న గాంధీజీ, బోస్ పునర్నియామకానికి సుముఖం కాలేదు. పట్టాభి సీతారామయ్య గారిని కాంగ్రెసు అధ్యక్ష పదవికి మితవాదులు పోటీ పెట్టించారు. ఆయన అభ్యర్థిత్వాన్ని గాంధీజీ బలపరచారు.

మొట్ట మొదటి సారిగా కాంగ్రెస్‌లో అత్యున్నత పదవి అయిన అధ్యక్ష పదవికి ఎన్నిక జరిగింది. పట్టాభి సీతారామయ్యకు 1375 ఓట్లు రాగా, బోసుకు 1575 ఓట్లు వచ్చాయి. బోస్ గెలిచాడు. కాంగ్రెసులో వామపక్ష వాదుల బలం పెరుగుదలకు ఇది ప్రత్యక్ష తార్కాణం. కమ్యూనిస్టు పార్టీ అవలంబించిన ఐక్య సంఘటన ఎత్తుగడలకు గొప్ప విజయం.

బొంబాయి రాష్ట్ర కాంగ్రెసు కమిటీ ఎన్నికలలో కమ్యూనిస్టు నాయకుడు డాక్టరు అధికారి అత్యధిక ఓట్లు సంపాదించాడు.

బోసు ఎన్నికతో గాంధీజీ గొప్ప ఆశాభంగం పొంది, కాంగ్రెస్ సంస్థ తన చెప్పు చేతల్లో ఉండబోదని గ్రహించాడు. "పట్టాభి ఓటమి, నా ఓటమి" అని ప్రకటించాడు. బోస్ ఏర్పరచిన కాంగ్రెసు కార్యవర్గం నుండి 12 మంది మితవాద వర్గానికి చెందినవారు రాజీనామా యిచ్చారు. వారితో కలవకుండా, తన ప్రత్యేక కారణాలతో జవహర్‌లాల్ నెహ్రూ కూడా రాజీనామా యిచ్చారు.

బ్రిటిషు ప్రభుత్వంతో రాజీ పడటానికి కాంగ్రెసు నాయకత్వం ప్రయత్నిస్తున్నదని చేసిన ఆరోపణను బోసు ఉపసంహరించ నిరాకరించినందున తాను రాజీనామా చేస్తున్నట్లు నెహ్రూ ప్రకటించారు.

## అఖిలభారత నాయకుల పర్యటనలు

సోషలిస్టు, కమ్యూనిస్టు ఉద్యమాలు రెండూ అఖిల భారత ఉద్యమాలు. కమ్యూనిస్టు ఉద్యమానికి అదనంగా అంతర్జాతీయ అనుబంధం ఉన్నది. కనుక అఖిల భారత నేపథ్యం కలిగిన నాయకులు వివిధ రాష్ట్రాలలో పర్యటించి రాజకీయ సైద్ధాంతిక వివరణలిచ్చే కృషికి, చరిత్రలో ఎంతో ప్రాధాన్యమున్నది.

1936 సెప్టెంబరు 26, 27 తేదీలలో రాజమండ్రిలో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ద్వితీయ మహాసభ జరిగింది. ఆ సభకు యూసఫ్ మెహరాలీ అధ్యక్షత వహించారు బొంబాయికి చెందిన మెహరాలీ, సోషలిస్టు పార్టీ అఖిల భారత నాయకులలో ఒకరు.

ఆయన తన ప్రసంగంలో రాజకీయ, ఆర్థిక, సైద్ధాంతిక సమస్యలను అన్నింటినీ ప్రస్తావించారు. సోషలిస్టు ఉద్యమ భవిష్యత్తుకు మార్గనిర్దేశం చేశారు. ఆయన ప్రసంగంలోని ముఖ్యాంశాలు.

భారతదేశంపై బ్రిటిషు ప్రభుత్వం ఫెడరేషన్‌కు రుద్దబోతున్నది. ఆ ఫెడరేషన్‌లో స్వదేశ సంస్థానాధీశులకు, బ్యూరోక్రటిక్ ప్రభుత్వోద్యోగులకు అత్యధిక స్థానాలుంటాయి. పైగా వైస్రాయికి అన్నిటి పైన వీటో అధికారం ఉంటుంది. కనుక ఫెడరేషన్ ప్రతిపాదకు వ్యతిరేకంగా పోరాడాలి.

నూతన రాజ్యాంగ చట్టంలో రాష్ట్రాల స్వయం పాలనా విభాగం క్రింద త్వరలో జనరల్ ఎన్నికలు జరుగనున్నాయి. ఆ ఎన్నికలలో కాంగ్రెసు అభ్యర్థుల విజయానికి కృషిచేయాలి అయితే కాంగ్రెసు వాదులు మంత్రి పదవులు స్వీకరించే యత్నాన్ని వ్యతిరేకించాలి.

జమీందారీ విధానాన్ని రద్దు చేయాలి. 1842 లో సర్ థామస్ మనో్ర తన నివేదికలో భారత దేశంలో ప్రతి రైతుకు ఎంతో కొంత భూమి ఉండేదని పేర్కొన్నాడు. అలాంటిది 30 ఏండ్ల తర్వాత 1872 లో 75 లక్షల మంది రైతులకు ఏ కొంచెం భూమి కూడా లేకుండా పోయింది. ఈ పరిస్థితిని అంతం చేయాలి. రైతుల ఋణభారాన్ని, లాండ్ రెవిన్యూ పద్ధతిని రద్దుచేయాలి వృద్ధి క్రమానుగతంగా ఆదాయాల మీద పన్ను విధించాలి.

రాజకీయ ఘటనలపై మెహరాలీ స్పష్టమైన అభిప్రాయాలను వెల్లడించాడు.

లక్నో కాంగ్రెసు మహాసభ అధ్యక్షులుగా నెహ్రూ సోషలిజం ప్రాశస్త్యాన్ని నొక్కి చెప్పాడు. ఫైజ్‌పూర్ కాంగ్రెసుకు కూడా ఆయనే అధ్యక్షుడు కావాలి. స్పెయిన్‌లో జరుగుతున్న అంతర్యుద్ధంలో ఫాసిస్టు శక్తులు, ప్రజాతంత్ర శక్తులపై యుద్ధాన్ని ప్రకటించాయి. బ్రిటన్ కనుక తిరిగి రెండో ప్రపంచ యుద్ధంలోకి ఈడిస్తే మనం సామ్రాజ్య వ్యతిరేక ఐక్య సఘటనను నిర్మించి, స్వాతంత్ర్య సాధనకై పోరాడాలి.

సోషలిస్టు పార్టీని, వివిధ మార్క్సిస్టు సోషలిస్టు శాఖల ఐక్య వేదికగా రూపొందించాలనే సక్రమమైన అవగాహన మెహరాల్ ప్రసంగంలో స్పష్టంగా కనిపించింది.

పిమ్మట జయప్రకాశ్ నారాయణ 1937 లో ఆంధ్రలో ప్రకటించారు. 1937 నవంబరులో కర్నూలు జిల్లా, నంద్యాల, మహానది పట్టణాలను సందర్శించారు. నంద్యాలలో వారికి పౌర సన్మానం కూడా జరిగింది. నెల్లూరు, వెంకటగిరి పట్టణాలలో కూడా జయప్రకాశ్ నారాయణ పర్యటించారు.

1936 అక్టోబరు 17, 18 తేదీలలో గుంటూరు జిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ మహాసభ జరిగింది. ఆ సభకు అధ్యక్షత వహించవలసిందిగా శ్రీ డాంగేను, ప్రారంభింప వలసిందిగా జవహరలాల్ నెహ్రూను ఆహ్వానించారు.

వెంటనే నాటి అఖిల భారత కార్యదర్శి మసానీ, డాంగేను పిలవ రాదనీ ఆయన కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో సభ్యుడు కాదని అభ్యంతరం చెప్పారు. నెహ్రూ విషయంలో ఎట్టి అభ్యంతరం చెప్పలేదు ఆయన కూడా కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో సభ్యుడు కాదు.

ఈ అభ్యంతరాన్ని త్రోసిపుచ్చి, గుంటూరు జిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ మహాసభ అక్టోబరు 17, 18 తేదీలలో గుంటూరులో జరిగింది. డాంగే అధ్యక్షత వహించారు.

రాష్ట్ర కాంగ్రెసు నాయకులైన అయ్యదేవర కాళేశ్వరరావు అభ్యంతరం వలన, నెహ్రూ ఆసమయంలో ఆంధ్రలో పర్యటిస్తూ కూడా, మహాసభ ప్రారంభోత్సవానికి రాలేదు.

ఆ సందర్భంలో గుంటూరు గాంధీ మైదాన్‌లో జరిగిన బహిరంగ సభలో డాంగే చేసిన ప్రసంగం, సోషలిస్టు - కమ్యూనిస్టు ఐక్యతా ప్రాతిపదికపై శ్రోతలను ఎంతో ఉత్సాహ పరచింది.

అదే సందర్భంలో పార్టీ కార్యకర్తల నుద్దేశించి, కొత్తపేటలోని ఒక పొగాకు వ్యాపారస్తుని భవనంలో డాంగే ప్రసంగించారు. మార్క్సిస్టు సిద్ధాంతాన్ని తాత్విక, ఆర్థిక, రాజకీయ పార్శ్వాలను వివరిస్తూ ఆయన చేసిన ప్రసంగం యువకులను, విద్యార్థులను, కార్యకర్తలను ఎంతో ఉత్సాహ పరచింది. మార్క్సిస్టు సిద్ధాంత అధ్యయన ప్రాధాన్యాన్ని గుర్తించేటట్లు చేసింది.

ఆ తర్వాత డాంగే తెనాలి, జిన్నూరు, కవుతరం గ్రామాలలో జరిగిన బహిరంగ సభలలో కూడా పాల్గొన్నారు. ఒంగోలు మున్సిపాలిటీ వారికి పౌర సన్మానం చేసింది.

1937 మేలో కొత్తపట్నం రాజకీయ పాఠశాలను, నడమంత్రపు కె. వి. రెడ్డి నాయుడు మంత్రివర్గం నిషేధించి, లాఠీ చార్జీ జరిపి, పెక్కు మందిని అరెస్టు చేసింది. ఆ తర్వాత రాజాజీ మంత్రివర్గం అక్టోబరులో అధికారం స్వీకరించి, ఆ ఖైదీలను విడుదల చేసింది. కాని దాదాపు అదే సమయంలో ఆంధ్రదేశంలో పర్యటిస్తున్న యస్. బాట్లీవాలా సభలపై నిషేధం విధించి, రాష్ట్రం నుండి వెళ్ళి పోవాలని ఆయనను కోరింది. అందుకు ఆయన నిరాకరించటంతో ఆయనను అరెస్టు చేసింది.

గుంటూరులో జరిగిన రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ మహా సభలో పాల్గొనేందుకై బాట్లీవాలా గుంటూరు వచ్చారు. గుంటూరు, బందరు, నెల్లూరు, వెంకటగిరి, కావలి, ఒంగోలు పట్టణాలలో సోషలిస్టు, కమ్యూనిస్టు ఐక్యతావశ్యకత పైన సామ్రాజ్య వ్యతిరేక సంఘటన నిర్మాణంద్వారా జాతీయ పోరాటాన్ని తీవ్రతరం చేసే అంశం పైన ఉత్తేజకరంగా ప్రసంగించారు యువకుడైన బాట్లీవాలా ప్రసంగ ధోరణి, విద్యార్థులను, యువకులను ఎంతగానో ఆకర్షించింది బహుశా ఇందుకు భయపడే, రాజాజీ ఆయనను అరెస్టు చేశారు.

పిమ్మట జరిగిన ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ కార్యవర్గం రాజాజీ చర్యను తీవ్రంగా ఖండించి, బాట్లీవాలాను వెంటనే విడుదల చేయాలని కోరింది. కాంగ్రెసు తన ఎన్నికల ప్రణాళికలో ఏ పోలీసు సెక్షన్‌ను రద్దు చేయాలని కోరిందో, అట్టి 124 ఏ సెక్షను క్రింద బాట్లీవాలను అరెస్టు చేయటం మరీ దారుణమని. కనుక కాంగ్రెసు నాయకత్వం మద్రాసు ముఖ్యమంత్రి రాజాజీపై క్రమశిక్షణా చర్యను తీసుకోవాలని కూడా డిమాండ్ చేసింది.

ఆ పిమ్మట ప్రజా ఒత్తిడిలో లొంగి రాజాజీ మంత్రి వర్గం బాట్లీవాలాను విడుదల చేసింది. కాని రాష్ట్రం నుండి బహిష్కరించింది. రాజాజీ మంత్రి వర్గం ఆ సందర్భంలో చేసిన అనుచిత వ్యాఖ్యలను నిరసిస్తూ రాష్ట్ర మంతటా సోషలిస్టు పార్టీ సభలు చేసి, తీర్మానాలను ఆమోదించింది.

1937 ఆగష్టులో అఖిల భారత మహిళా నాయకులు, కమ్యూనిస్టు నాయకులు అయిన శ్రీమతి హజ్రాజానాబేగం కృష్ణా జిల్లా ద్వితీయ యువజన మహా సభలో ప్రసంగించారు.

అంతకు ముందు జరిగిన కొత్తపట్నం రాజకీయ పాఠశాలకు ఇందులాల్ యాగ్నిక్, యస్. దత్త మజుందార్ లాంటి అఖిల భారత నాయకులు హాజరై ఉపన్యాసాలు చేశారు.

1938 మార్చిలో మంతెనవారిపాలెంలో మరింత పెద్ద ఎత్తున రాజకీయ పాఠశాల జరిగింది. అఖిల భారత కమ్యూనిస్టు నాయకులందరూ హాజరై సుమారు

నెల రోజుల పాటు అక్కడ తరగతులు తీసుకొన్నారు. ప్రత్యేక ప్రసంగాలు చేశారు.

మంతెన వారిపాలెం పాఠశాలను గురించి వ్రాస్తూ ఆనాటి కేంద్ర పార్టీ పత్రిక "మంతెన వారి పాలెంలో మార్పు" అను ఉత్తేజకర వ్యాసాన్ని ప్రచురించింది. ఆంధ్రలో కమ్యూనిస్టు కార్యకర్తలను భారీ ఎత్తున తయారు చేయడంలో మంతెనవారి పాలెం పాఠశాల గణనీయమైన సేవ సేసింది.

పాఠశాల అనంతరం శ్రీ బి. టి. రణదివే, విజవాడలో ఆనాడు డాక్టరు అచ్చమాంబ గారు నివసిస్తున్న (వసతి) గృహంలో, పార్టీ కార్యకర్తలను ఉద్దేశించి ప్రసంగించారు.

చైనా కమ్యూనిస్టు పార్టీ జాతీయైక్య ఘటనా ఎత్తుగడలను జయప్రదంగా ఎలా అవలంభిస్తున్నదో సోదాహరణంగా వివరించారు. భారత దేశంలో సైతం ఐక్య సంఘటనా ఎత్తుగడలు కదిలిస్తున్న సత్ఫలితాలను తెలియజేశారు.

పిమ్మట వారు, రాజోలు తాలుకా, చేకిశెట్టి పాలెంలో జరిగిన వ్యవసాయ కార్మిక మహాసభకు హాజరైనారు.

మరో కమ్యూనిస్టు నాయకులు జోగ్లేకర్ 1938 ఏప్రిల్‌లో కృష్ణా జిల్లా తాడిగడపలో జరిగిన ద్వితీయ జిల్లా యువజన మహాసభకు హాజరైనారు. పిమ్మట గన్నవరం తాలుకా పెద అవుటపల్లి గ్రామంలో బహిరంగసభలో ప్రసంగించారు.

## త్రిపుర ప్రతిష్ఠంభన

గాంధీజీ సలహా మేరకు కాంగ్రెసు కార్య వర్గాన్ని పునర్నియమించవలసిందిగా బోసును కోరుతూ త్రిపుర కాంగ్రెసులో మితవాదులు ఒక తీర్మానాన్ని పెట్టి ఆమోదింపజేశారు. ఆ తీర్మానం మేరకు బోస్, గాంధీజీని సంప్రతించారు. కాని తానెలాంటి సూచనలను చేయదలచలేదని గాంధీజీ అన్నారు. ఈ సహాయ నిరాకరణతో విసిగిపోయి బోస్ 1939 ఏప్రిల్ నెలలో అధ్యక్షపదవికి రాజీనామా యిచ్చారు. ఫార్వర్డు బ్లాకు అని వేరే పార్టీని స్థాపించారు. కాంగ్రెసుకు రాజేంద్ర ప్రసాద్ అధ్యక్షులయ్యారు. కాంగ్రెసులో చీలిక వచ్చింది.

ఈ చీలికను నివారించటానికి కమ్యూనిస్టులు తీవ్ర కృషిచేశారు. సోషలిస్టులతో కలిసి బోస్ విజయానికి తీవ్ర కృషి చేసింది కమ్యూనిస్టులే. కాగా, కాంగ్రెసునుండి చీలి వేరే పార్టీని పెట్టవద్దని కమ్యూనిస్టులు బోస్‌ను అభ్యర్థించారు. ప్రపంచయుద్ధం ముంచుకొస్తున్న సమయంలో జాతీయ కాంగ్రెసులో చీలిక రావడం అనర్థదాయకం అనే విశాల దృష్టితో కమ్యూనిస్టులు వ్యవహరించారు. వారి ప్రయత్నాలు భగ్నమైనప్పటికి జాతీయ సమైక్యతకై కమ్యూనిస్టుల పట్టుదల సాధారణ కాంగ్రెసు వాదుల ప్రశంసను సైతం పొందింది.

ఐక్య సంఘటనా విధానమనుసరించి ఆంధ్రలో 1937 - 40 సంవత్స రాల మధ్య కమ్యూనిస్టుల, సోషలిస్టు కాంగ్రెసు సంస్థలో చేరి, కాంగ్రెసును నిజ మైన జాతీయైక్య సంఘటనా వేదికగా మార్చేందుకు కృషి చేశారు. ఈ కృషిలో వారు చిత్తశుద్ధిగల కాంగ్రెసువాదులుగా గుర్తింపు పొందారు ఫలితంగా హరిపురా, త్రిపుర కాంగ్రెసును మహాసభలకు, కమ్యూనిస్టు నాయకులు ప్రతినిధులుగా అత్యా ధిక ఓట్లతో ఎన్నికయ్యారు.

హరిపురా కాంగ్రెసుకు తనను ప్రతినిధిగా ఎన్నుకోవలసిందిగా శ్రీ కంభం పాటి సత్యనారాయణ (సీనియర్) 16-12-37 న తుని తాలుకాలోని కాంగ్రెసు సభ్యులకు ఒక విజ్ఞప్తి చేశారు. ప్రతినిధిగా ఎన్నికైనవారు రాష్ట్ర కాంగ్రెసు కమిటీ సభ్యులుగా కూడా కొనసాగారు.

వీరికి పోటీగా శ్రీ మొసలికంటి తిరుమలరావుగారు నిలిచాడు. అయినప్ప టికి, సత్యనారాయణగారు 807 ఓట్లు సంపాదించారు. గెలుపొందారు. తిరుమల రావుగారికి 176 ఓట్లు మాత్రమే వచ్చాయి.

పశ్చిమ కృష్ణానుండి వామపక్ష కాంగ్రెసు వాదులు 21 మంది హరిపురా కాంగ్రెసుకు ప్రతినిధులుగా ఎన్నికయ్యారు. వీరి ఎన్నిక చెల్లనేరదని నాటి రాష్ట్ర కాంగ్రెసు కమిటీ కార్యదర్శి గొట్టిపాటి బ్రహ్మయ్యగారు రద్దు చేశారు అందుపై కాంగ్రెసు వాదులలో పెద్ద అలజడి జరిగింది. చివరకు రాష్ట్ర కాంగ్రెసు అధ్య క్షులు పట్టాభి సీతారామయ్యగారు, బ్రహ్మయ్యగారి ఉత్తర్వును రద్దుచేయక తప్పలేదు.

కాంగ్రెసులోని వామపక్షవాదులకు ఇది గొప్ప విజయం.

జనవరి 25, 1939 న త్రిపురా కాంగ్రెసుకు జరిగిన ప్రతినిధుల ఎన్నిక లలో నెల్లూరు నుండి శ్రీపుచ్చలపల్లి సుందరయ్య గారు ఏకగ్రీవంగా ఎన్ని కయ్యారు. వీరుగాక, ఆచార్య రంగా, కొమ్మారెడ్డి సత్యనారాయణ మూర్తి, అన్నపూర్ణయ్య, వెన్నెలకంటి రాఘవయ్య, రెబ్బాప్రగడ మందేశ్వర శర్మ గారులు కూడా త్రిపుర ప్రతినిధులుగా ఎన్నికయ్యారు. వీరందరూ కాంగ్రెసుతో వామపక్ష ధోరణికి చెందినవారు.

ఈ కాలం అంతటా మితవాద కాంగ్రెసు నాయకుల కుట్రలను బహిర్గతం చేస్తూ నవశక్తిలో ప్రకటనలు, సంపాదికీయాలు వెలువడ్డాయి.

## ద్వితీయ ప్రపంచ యుద్ధం

ఈలోగా ప్రపంచ పరిణామాలు వేగంగాసాగాయి. 1939 సెప్టెంబరు 1 న హిట్లర్ పోలెండుపై దాడి చేశాడు. బ్రిటన్, ఫ్రాన్స్‌లు వెంటనే జర్మనీపై యుద్ధాన్ని ప్రకటించాయి. ఎన్నికైన ప్రజా ప్రతినిధులతో ఎలాంటి సంప్ర

తింపులు జరుపకుండా వైస్రాయి సెప్టెంబరు 3 న యుద్ధంలో జర్మనీకి వ్యతిరే కంగా బ్రిటన్ తరఫున భారతదేశం చేరుతున్నట్లు ప్రకటించాడు. సెప్టెంబరు 3 ననే, భారత దేశ రక్షణ, ఆర్డినెన్సును వైస్రాయి జారీచేశాడు. రాజ్యాంగం రద్దు అయింది. డిక్రీల ద్వార పరిపాలించే అధికారం కేంద్ర ప్రభుత్వానికి లభిం చింది. ఫెడరేషన్ స్థాపన సన్నాహాలన్నీ రద్దు అయినట్లు వైస్రాయి ప్రక టించాడు.

సెప్టెంబరు 14 న కాంగ్రెసు కార్యవర్గం సమావేశమై, యుద్ధకాల భారత ప్రభుత్వాన్ని ఏర్పరచాలని, కేంద్ర శాసన సభకు అది బాధ్యత వహించాలని, సూచించింది. ఇది కనీస కోర్కె. సర్వం సహాధికార రాజ్యాంగ నిర్ణయ సభ ఏర్పాటు యుద్ధానంతరం వరకు వాయిదా వేయటానికి అంగీకరించింది. కాని వైస్రాయి కాంగ్రెసు కనీస కోర్కెకు కూడా ఆమోదం తెలుపలేదు. దాంతో అక్టోబరు 23, 1939 న రాజాజీ మంత్రి వర్గంతో సహా, దేశంలోని కాంగ్రెసు మంత్రి వర్గాలన్నీ రాజీనామా చేశాయి.

## యుద్ధం - కమ్యూనిస్టు పార్టీ వైఖరి

బ్రిటన్, ఫ్రాన్సులు ఒక శిబిరంలోనూ, జర్మనీ, ఇటలీలు మరొక శిబిరం లోనూ మోహరించు యుద్ధం సాగించ సాగాయి. హిట్లర్ ఫాసిజానికి వ్యతిరేకంగా, బ్రిటను, ఫ్రాన్సులను కూడగట్టాలని సోవియట్ యూనియన్, ఎంతో ప్రయత్నిం చింది. ఆ ప్రయత్నాలన్నీ విఫలం కావటంతో, ఆగష్టు 1939 లో సోవియట్ యూనియన్, జర్మనీతో సంధి చేసుకున్నది. సెప్టెంబరు 1 న జర్మనీ పోలెండుపై దాడి చేసింది. వెంటనే బ్రిటన్ ఫ్రాన్సులు జర్మనీపై యుద్ధాన్ని ప్రకటించాయి.

పోలెండు వైపుగా హిట్లర్ తన సేనలు నడపడంతో సోవియట్ యూనియన్ కూడా పోలెండు వైపు రెడ్ ఆర్మీని నడిపింది. జర్మన్, సోవియట్ సేనలు ఎదురు మదురుగా మోహరించాయి. అంతకు పూర్వమే జరిగిన నిర్యుద్ధ సంధి జర్మనీకి జ్ఞాపకం వచ్చింది. ఎదురుగా బలమైన రెడ్ ఆర్మీ వుంది. ఇక విధి లేక పోలెం డులో సగభాగం రెడ్ ఆర్మీ అధిపత్యానికి వదలి, సగభాగం పోలెండును మాత్రం ఆక్రమించుకుని, హిట్లర్ తన సేనలను పశ్చిమ దిశగా మళ్ళించాడు. క్రమంగా పశ్చిమ యూరప్ అంతా హిట్లర్ పాదాక్రాంతమైంది. ఇంగ్లీషు ఛానెల్ దాటటానికి తగిన నౌకాబలం లేనందున బ్రిటన్‌పై దాడి చేయలేక పోయాడు. విమాన దాడులు మాత్రం ప్రారంభించాడు.

అతివేగంగా జరిగిన ఈ యుద్ధ పరిణామాలను భారతదేశంలోని వివిధ రాజకీయ పార్టీలు అంచనా వేయసాగాయి.

యుద్ధం ప్రారంభమైన కొద్ది రోజులకే కమ్యూనిస్టు పార్టీ తన వైఖరిని స్పష్టం చేసింది. రెండేండ్లుగా యూరపులో జరుగుతున్న ఫాసిస్టు వ్యతిరేక సంఘటనా నిర్మాణ యత్నాలు, వాటికి బ్రిటిషు ప్రధాని చేంబర్లేన్, ఫ్రెంచి ప్రభుత్వం కల్గిస్తున్న ఆటంకాలు గ్రహించిన వారందరూ. సామ్రాజ్య వాద దుష్ట స్వభావాన్ని గుర్తించారు. హిట్లర్‌ను రష్యా వైపు నెట్టి. జర్మనీ, సోవియట్ రష్యాలు పరస్పర హననోద్యోగంలో ఉంటే తాము చూస్తూ, సమయం వచ్చి నప్పుడు రెంటికీ వ్యతిరేకంగా జోక్యం చేసుకోవచ్చుననే దుర్బుద్ధితో బ్రిటన్ వ్యవహరించ సాగింది.

కనుకనే సోవియట్ యూనియన్, ఫాసిస్టు వ్యతిరేక సంఘటన నిర్మాణానికై చేసిన కృషి అంతా భగ్నమైంది.

ఈ పరిణామాలను సక్రమంగా అర్థం చేసుకున్న వారెవరు కూడా జర్మన్-సోవియట్ నిర్యుద్ధ సంధిని అపార్థం చేసుకోలేరు. ఆత్మరక్షణకై కొంత వ్యవధి సంపాదించుకునేందుకు తప్పనిసరై, సోవియట్ యూనియన్ తీసుకున్న చర్యగా దానిని గుర్తించారు. ఈ యుద్ధం సామ్రాజ్య వాద యుద్ధంగా అంచనా కట్టారు.

భారత కమ్యూనిస్టుపార్టీ ఇదే సూత్రబద్ధ వైఖరిని తీసుకున్నది. సామ్రాజ్య వాద యుద్ధాన్ని అవకాశంగా తీసుకుని, భారత స్వాతంత్ర్య పోరాటాన్ని తీవ్ర తరం చేయాలని, కార్మిక, కర్షక పోరాటాల ప్రాతిపదికగా, తిరుగుబాటు స్థాయికి ఉద్యమాన్ని పెంచాలని, కాంగ్రెసు సంస్థనే ఈ పోరాట వేదికగా రూపొందించాలనే వైఖరి చేపట్టింది. 1937 నుండి అవలంబిస్తున్న ఐక్య సంఘటనా ఎత్తుగడలకు పూర్తిగా అనుగుణమైన వైఖరి ఇది.

## కాంగ్రెసు సోషలిస్టు పార్టీ వైఖరి

కాగా, కాంగ్రెసు సోషలిస్టు పార్టీ భిన్న వైఖరిని తీసుకున్నది. అంతర్జాతీయ ఘటనల పరిణామంలో సోవియట్ యూనియన్ పాత్రను సరిగ్గా అర్థం చేసు కోక, సోవియట్ - జర్మన్ నిర్యుద్ధ సంధిని విమర్శించింది. సోవియట్ యూని యన్ తన సంకుచిత దేశ ప్రయోజనాలకై ఫాసిస్టు వ్యతిరేక సంఘటనా యత్నా లను బలి పెట్టినట్లు ఆరోపించింది. ఈ తప్పుడు వైఖరి ఫలితంగా, కమ్యూనిస్టులకు దూరం కాసాగింది. కాంగ్రెసు సోషలిస్టు పార్టీలోని కమ్యూనిస్టు ప్రముఖులైన దినకర్ మెహతా తదితరులను పార్టీ నుండి బహిష్కరించింది.

జాతీయ పోరాటాన్ని తీవ్రతరం చేసే విషయంలో కూడా జయప్రకాశ్ నారాయణ, విచిత్ర వైఖరి తీసుకున్నారు. కాంగ్రెసును కాదని స్వతంత్ర్యంగా సత్యాగ్రహం జరపాలని మొదట్లో జయప్రకాశ్ భావించారు. సుభాష్‌చంద్ర బోసు అదే ప్రయత్నాలు చేశారు.

వెనువెంటనే ఇది సాధ్యం కాదని గుర్తించి, గాంధీజీ ఇవ్వబోయే పిలుపు కోసం వేచి ఉండటం మినహా చేయగలిగిందేమీ లేదనే వైఖరిని జయప్రకాశ్ నారాయణ చేపట్టాడు. దాంతో కాంగ్రెస్ సోషలిస్టుల మార్గం, కమ్యూనిస్టుల మార్గం వేరయ్యాయి.

## ఫార్వర్డ్ బ్లాకు

బోసు ఫార్వర్డ్ బ్లాకును కాంగ్రెసుకు పోటీగా ఏర్పరచటంతో అంతవరకు కాంగ్రెసు సోషలిస్టు పార్టీ నాయకులుగా, కమ్యూనిస్టు పార్టీకి సన్నిహితముగా ఉంటున్న వామపక్షవాదులు కొందరు ఫార్వర్డ్ బ్లాకులో చేరిపోయారు. ఆంధ్రలో, మద్దూరి అన్నపూర్ణయ్య, అన్నె అంజయ్య గారలు ఇలా ఫార్వర్డు బ్లాకులో చేరిన వారిలో ప్రముఖులు.

యం.యన్. రాయ్ యుద్ధం ప్రారంభమైన మరుక్షణం నుండి, ఇది ఫాసిస్టు వ్యతిరేక యుద్ధం అని అంచనా వేశారు. కనుక యుద్ధంలో బ్రిటిషు ప్రభుత్వానికి భారత ప్రజలు పూర్తి సహాయం చేయాలి. యుద్ధానంతరం బ్రిటీషువారు తమం తట తామే స్వతంత్ర్యం యిస్తారు. ఈ లోగా కాంగ్రెసు మంత్రులు తమ రాజీ నామాలు ఉపసంహరించుకొని బేషరతుగా మంత్రి వర్గాలను స్వీకరించాలి. యుద్ధ కృషికి ప్రజలను సమీకరించాలి.

యం.యన్. రాయ్ అనుసరించిన ఈ వైఖరి, ఆయన అంతకు పూర్వం ప్రతిపాదించిన డీకాలనైజేషన్ సిద్ధాంతానికి అనుగుణంగానే ఉన్నది. కాని భారత స్వాతంత్ర్య పోరాట వాదులెవ్వరూ, ఈ వైఖరిని ఆమోదించలేదు.

కాంగ్రెసు నాయకత్వం గాంధీజీ నాయకత్వాన "వేచి చూద్దాం "అనే సాంప్రదాయక బూర్జువా వైఖరినే అవలంభించింది. యుద్ధం మందకొడిగా సాగు తున్నది. బ్రిటన్ మరింతగా ఓటమి పాలైన కొద్దీ ఒత్తిడి తీవ్రతరం చేద్దాం. అంతవరకు వేచి చూద్దాం - ఇది వారి వైఖరి.

గాంధీజీ వ్యక్తిగత హోదాలో, యుద్ధం ప్రారంభమైన వెంటనే బ్రిటన్‌కు సానుభూతి సందేశం పంపారు. శత్రువు అయినా సరే చిక్కుల్లో ఉన్నపుడు సానుభూతి ప్రదర్శించాలనే ఆయన వైయక్తిక సిద్ధాంతానికి అది అనుగుణమే కావచ్చు. కాంగ్రెసు కార్యవర్గం మాత్రం అట్టి సానుభూతి ప్రకటనను ఆమో దించలేదు.

ఈ యుద్ధం ప్రారంభమైన వెంటనే వివిధ రాజకీయ పార్టీలు తమ తమ సిద్ధాంతాల కనుగుణంగా ఇట్టి భిన్న వైఖరులు అవలంభించాయి.

## రాంఘర్

ఈ వాతావరణంలో 1940 మార్చిలో రాంఘర్ కాంగ్రెస్ మహాసభ జరిగింది. మౌలానా ఆజాద్ కాంగ్రెస్ అధ్యక్షునిగా ఎన్నికయ్యారు.

బోస్ అప్పటికే కాంగ్రెసు నుండి నిష్క్రమించారు. ఆయన అనుచరు లెవ్వరూ కాంగ్రెసు మహాసభకు హాజరు కాలేదు. మౌలానా అజాద్‌కు పోటీగా యం. యన్. రాయ్ కాంగ్రెసు అధ్యక్ష పదవికి పోటీచేసి ఘోరంగా ఓడిపోయారు. దాంతో రాయ్, అతని అనుచరులు కాంగ్రెసు నుంచి దాదాపు నిష్క్రమించారు. కమ్యూనిస్టులు అజాద్ అధ్యక్షతను బలపరిచారు.

కాంగ్రెసు నాయకత్వాన్ని ఎలాగైనా చేజిక్కించుకోవాలని, అదే విప్లవానికి మార్గమని ఫైజపూర్ కాంగ్రెసు నుండి యం.యన్. రాయ్ అనుసరిస్తూ వచ్చిన వైఖరి, రాంఘర్ కాంగ్రెస్‌లో ఘోరంగా విఫలం కావడంతో రాయ్ దాదాపు భారత రాజకీయాల నుండి నిష్క్రమించారు. ఆ తర్వాత కొద్ది రోజులకే తన రాజకీయ పార్టీ అయిన రాడికల్ డెమొక్రటిక్ పార్టీని రద్దుచేసి రాడికల్ హ్యూమ నిజం అనే సిద్ధాంత ప్రచార వేదికను ఏర్పచారు. పిమ్మట ఈ పేరు నవ్య మానవ వాదంగా మారింది.

దేశంలో కమ్యూనిస్టు వ్యతిరేకత, అంతర్జాతీయంగా సోవియట్ వ్యతి రేకతలతో పాటు, మార్క్సిస్టు సిద్ధాంతం స్థానే, బూర్జువా విప్లవవాదమైన 'జాకోబినిజం'ను ప్రచారం చేయడంతో రాయిజం క్రమంగా రాజకీయ రంగం నుండి నిష్క్రమించి, 1940 తర్వాత, కేవలం సిద్ధాంత వేదికగా మారిపోయింది.

కాంగ్రెసు నాయకత్వం బ్రిటిష ప్రభుత్వంతో రాజీపడడం ఖాయమని, నిరాశ చెంది ఫార్వర్డ్ బ్లాక్ స్థాపించిన బోస్‌కి వ్యతిరేకంగా, గాంధీజీ తనంతట తానే పోరాటం ప్రారంభించిందాకా వేచి ఉండాలనే సోషలిస్టుల వైఖరికి వ్యతిరే కంగా కమ్యూనిస్టు పార్టీ క్రమబద్ధమైన పోరాట వైఖరి చేపట్టింది.

స్వతంత్రంగా పోరాట కార్యక్రమాన్ని క్రింది నుండి కార్మిక, కర్షక సమైక్యత ద్వారా సాగిస్తూ వత్తిడి తెచ్చి కాంగ్రెసు నాయకత్వాన్ని పోరాట మార్గంలో మళ్ళించవచ్చు. ఐక్య సంఘటనా వేదికగా కాంగ్రెసును మార్చవచ్చు.

ఈ వైఖరిని వివరిస్తూ 1940 మార్చిలో రాంఘర్ కాంగ్రెసు సందర్భంలో కమ్యూనిస్టు పార్టీ ఒక పత్రాన్ని పంచిపెట్టింది. స్వల్ప మార్పులతో అదే పత్రాన్ని ఆగస్టు 1940 న, 'కార్మిక వర్గ పంథా' పేరుతో దేశమంతటా ప్రచారంలో పెట్టింది.

## కార్మికవర్గ పంథా

బేషరతుగా దేశవ్యాపిత సహాయ నిరాకరణోద్యమం ప్రారంభించాలి. పన్నుల నిరాకరణ, కౌళ్ల మాఫీ కార్యక్రమాలు ఇందులో జోడించాలి. ప్రజలు సార్వభౌమాధికారాన్ని స్థాపించాలి.

ఇవి కమ్యూనిస్టు పార్టీ కీలక నినాదాలు. రాంఘర్ కాంగ్రెసులో వాటిని ప్రచారంలో పెట్టింది.

కాంగ్రెసుతో సంబంధం లేకుండా "రాజీ వ్యతిరేక సదస్సులు" నిర్వహించాలనే పిలుపు బోస్ ఇచ్చారు. ఈ నినాదం విచ్ఛిన్న కర మని కమ్యూనిస్టు పార్టీ విమర్శించింది.

కాంగ్రెసుపార్టీ గాంధీజీ నాయకత్వాన ఏప్రిల్ 1940 న వ్యక్తిగత సత్యాగ్రహం ప్రారంభించింది. యుద్ధానికి లాంచనప్రాయంగా వ్యతిరేకత వెలిబుచ్చటం అరెస్టుకావటం వారి పద్ధతి.

అలా సత్యాగ్రహంలో పాల్గొనే వారంతరూ గాంధీజీ అహింసా సిద్ధాంతంలో పూర్తి విశ్వాసం కలిగి ఉండాలనే మరో షరతు విధించి, తొలి సత్యాగ్రహిగా గాంధేయవాది వినోభాభావేను గాంధీగారు ఎన్నిక చేశారు.

ఇది లాంచనప్రాయ సత్యాగ్రహం. దీనిని ప్రజా సత్యాగ్రహంగా మార్చాలని కమ్యూనిస్టు పార్టీ పిలుపిచ్చింది.

అంతకుముందే "యుద్ధం - వివిధ పార్టీల వైఖరి" అనే పేరుతో నాటి ప్రధాన కార్యదర్శి పి. సి. జోషి ఒక వ్యాసం వ్రాశారు.

ఈ వ్యాసాలు, పత్రాలు యుద్ధంపట్ల కమ్యూనిస్టుపార్టీ వైఖరిని సుస్పష్టం చేశాయి. కమ్యూనిస్టు వర్గాలకు మార్గదర్శక పత్రాలుగా మాత్రమే కాకుండా, వామపక్షవాదులైన కాంగ్రెసువాదులను పోరాట పంథాలోకి మళ్లించటానికి ఇవి ఎంతో తోడ్పడ్డాయి.

## ఆంధ్రలో - నిర్బంధ విధానం

ఈ విధానాన్ని ప్రచారం చేసుకుంటూ ముందుకుపోయిన కొద్దీ కమ్యూనిస్టులపై ప్రభుత్వ నిర్బంధ విధానం తీవ్రమైంది.

యుద్ధం ప్రారంభమైన వెంటనే 'నవశక్తి' పత్రికను మూసివేసి, ఆంధ్ర కమ్యూనిస్టు నాయకత్వంలోని ప్రధాన విభాగం రహస్య జీవితంలోకి వెళ్ళిపోయింది. 'స్వతంత్ర భారత్' అను రహస్య పత్రికను అచ్చువేస్తూ రాష్ట్రమంతటా యుద్ధ వ్యతిరేక కార్యకలాపాలకు నాయకత్వం వహించసాగరు.

'కార్మిక వర్గ పంథా' అను పేరుతో వెలువడిన పత్రాన్ని 24 వేల కాపీలు రాష్ట్రమంతటా పంచిపెట్టారు. ఇది గొప్ప సంచలనాన్ని కల్గించింది.

గుంటూరు, ఏలూరు, నెల్లూరు, కాకినాడ, విజయవాడ, చల్లపల్లి తదితర ప్రాంతాలలో ఈ సంచలనం బాగా కలిగింది. అదే విధంగా అంతర్జాతీయ రంగంలో, సామ్రాజ్యవాద యుద్ధంపట్ల సోవియట్ యూనియన్ పాత్రను వివరిస్తూ కూడా వేలాది కరపత్రాలను కమ్యూనిస్టుపార్టీ పంచిపెట్టింది. సోవియట్ వైఖరిపై

కాం[గెసు సోషలిస్టులు కాం[గెసువాదులు చేస్తున్న దుష్ప్రచారం దృష్ట్యా కూడా, ఈ కరపత్రాల పంపకానికి విశేష రాజకీయ ప్రాధాన్యత ఉంది.

ఒక్క గుంటూరు జిల్లాలోని 900 గ్రామాలలోనూ, 500 గ్రామాలలో ఈ కరపత్రాల పంపిణీ జరిగింది. నెల్లూరు జిల్లాలో 100 గ్రామాలలో పంపిణి జరిగింది.

యుద్ధ వ్యతిరేక పికెటింగు జరిపినందుకు గుంటూరులో ప్రభల కృష్ణ మూర్తి, పెండ్యాల లోకనాథంగార్లను ప్రభుత్వం అరెస్టు చేసింది. గుంటూరు జిల్లాలో సైనిక రిక్రూటింగు కేంద్రాలలో, రిక్రూటింగుకు వ్యతిరేకంగా కమ్యూనిస్టు విద్యార్థులు, యువజనులు, ప్రచారం పికెటింగు చేశారు.

'సైన్యంలో చేరవద్దు' 'యుద్ధనిధికి చందాలివ్వవద్దు' సామ్రాజ్యవాద యుద్ధాన్ని అవకాశంగా తీసుకొని, స్వాతంత్ర్య పోరాటాన్ని తీవ్రతరం చేయాలి, అనే పార్టీ విధానాలను విస్తృతంగా ప్రచారం చేశారు.

ఇంతేగాక విద్యార్థి సంఘాలు, వయోజన విద్యా కార్యక్రమాన్ని ఒక ముఖ్యాంశంగా స్వీకరించి ఆ సందర్భంలో రాజకీయ ప్రచారం చేశాయి. కృష్ణా జిల్లా ఎలమర్రు, జమీగొల్వేపల్లి గ్రామాలలో 100 కి 15 శాతం అక్షరాస్యులుగా మారారు. కృష్ణాజిల్లాలో వంద గ్రామాలలో ఈ ప్రచారం సాగింది. ప్రభుత్వం ఈ వయోజన విద్యా ప్రచారాన్ని కూడా నిషేధించింది.

పెక్కుమంది కమ్యూనిస్టు నాయకులను అరెస్టు చేశారు. మిగిలిన వారు అజ్ఞాత వాసంలోకి వెళ్లారు. కొందరిని గృహ నిర్బంధాలలో ఉంచారు.

(వివరాలు జిల్లాల పార్టీ నిర్మాణ విభాగంలో చూడగలరు.)

బాపట్లలో యుద్ధ ప్రచార వాన్‌ను కమ్యూనిస్టులు తిరగగొట్టారు. తెనాలిలో రిక్రూట్‌మెంటును ఆపగలిగారు. అక్కడి వ్యక్తిగత సత్యాగ్రహులుగా నమోదైన యువకులు చాలా మంది కమ్యూనిస్టు పార్టీ వైపు ఆకర్షితులైనారు.

ఒక ఊళ్లో వ్యక్తిగత సత్యాగ్రహంపై ప్రసంగించిన పట్టాభి సీతా రామయ్య గారి సభకు 100 మంది హాజరు కాగా అదే గ్రామంలో కమ్యూనిస్టుల యుద్ధ వ్యతిరేక ప్రచార సభకు 500 మంది హాజరైనారు. నిర్బంధ విధానాన్ని తట్టుకుంటూనే కమ్యూనిస్టు పార్టీ ఈ కార్యక్రమాలను కొనసాగించింది.

## యుద్ధ స్వభావంలో మార్పు

ఇలా ఉండగా యుద్ద పరిణామంలో గొప్ప మార్పు వచ్చింది. ప్రపంచాధి పత్యం సంపాదించాలన్న లక్ష్యంతో 1941 జూన్ 22 వ తారీఖున హిట్లర్ మాలటోవ్-రిబెన్‌ట్రాప్ నిర్యుద్ధ ఒప్పందాన్ని ఉల్లఘించి ఆకస్మాత్తుగా సోవియట్ యూనియన్‌పై దాడిచేశాడు.

కాని హిట్లర్ ఆశించినట్లు బ్రిటన్, అమెరికాలు సోవియట్‌పై దాడిని బల పరచలేదు. తటస్థంగానూ ఉండలేదు. "సోవియట్ యూనియన్ మా మిత్ర దేశం" అని చర్చిల్ ప్రకటించాడు. 41 డిసెంబరులో జపాన్, అమెరికాకు చెందిన పెరల్ హార్బర్‌పై దాడి చేసి, ఫాసిస్టు జర్మనీ తరఫున ప్రపంచ యుద్ధంలో చేరింది. జర్మనీ, జపాన్, ఇటలీలు ఒక పక్షాన, సోవియట్ యూనియన్, చైనా, బ్రిటన్, అమెరికాలు మరొక పక్షాన యుద్ధంలో మోహరించాయి. చైనాలో అప్పుడు చాంక్ కై షేకు అధికారంలో ఉన్నాడు. మావో సేటుంగు నాయకత్వాన సాగుతున్న కమ్యూనిస్టు విప్లవ దళాలు సైతం జపాన్ వ్యతిరేక ఐక్య సంఘటనను దేశంలో నిర్మించసాగాయి.

యుద్ధ స్వభావంలో వచ్చిన మార్పుతో ప్రపంచంలోని అన్ని దేశాల కమ్యూనిస్టు పార్టీలు తమ వైఖరిని మార్చుకున్నాయి.

పశ్చిమ యూరోప్‌కు సంబంధించినంత వరకు ఇదేమంత క్లిష్ట సమస్య కాదు. ఫ్రాన్సు, ఇటలీ దేశాల లాంటి చోట్ల కమ్యూనిస్టు పార్టీలు అంతకు ముందు నుంచే ఫాసిస్టు వ్యతిరేక పోరాటం సాగిస్తున్నాయి. తమ దేశాలలోని మితవాద ప్రభుత్వాలు సోవియట్ యూనియన్‌తో చేతులు గలపాలని యుద్ధాన్ని ప్రజాతంత్ర యుద్ధంగా మార్చి ఫాసిజాన్ని ఓడించాలని, డిమాండ్ చేస్తూ వచ్చాయి.

1941 జూన్ 22 తర్వాత బ్రిటన్ అమెరికాలు, మిత్ర రాజ్యాల శ్రేణిలో చేరటంతో, వారి ఒక డిమాండ్ నెరవేరింది. దేశంలోని ఇతర ఫాసిస్టు వ్యతిరేక బూర్జువా శక్తులతో కూడా కలిసి, ఫాసిస్టు వ్యతిరేక ఐక్య పోరాటాన్ని వారు సాగించారు.

జాతీయ స్వాతంత్ర్యం కొరకు పోరాడుతున్న భారత దేశం లాంటి చోట సమస్య సహజంగానే క్లిష్టమైంది.

దేశ స్వాతంత్ర్యాన్ని సాధించటం మన ప్రథమ కర్తవ్యం. కాగా ప్రపంచ యుద్ధ పరిణామంలో వచ్చిన మార్పును గుర్తించకుండా ఉండలేము. అంతవరకు సోవియట్‌కు వ్యతిరేకంగా ఉన్న బ్రిటన్ అమెరికాలు, సోవియట్ యూనియన్‌తో భుజం, భుజం కలిపి, యుద్ధ రంగంలో ఫాసిజానికి వ్యతిరేకంగా నిలబడడం చిన్న విషయ మేమీ కాదు. అంతర్జాతీయ, జాతీయ కర్తవ్యాలను మేళవించవలసి వచ్చింది.

ఈ మార్పును 1941 డిసెంబరు నాటికి కాని కమ్యూనిస్టు నాయకులు గుర్తించలేదు. డియోల్ క్యాంపు జైలులో నిర్బంధంలో ఉన్న కమ్యూనిస్టు నాయకులు కొందరు ఒక పత్రాన్ని, 1941 డిసెంబరులో బైటి పార్టీ నాయకత్వానికి పంపారు. సామ్రాజ్యవాద యుద్ధం, ప్రజా యుద్ధంగా మారిందని, తదనుగుణంగా పార్టీ విధానంలో మార్పురావాలని ఆ పత్రాలలో తెలియచేయబడ్డది.

దాదాపు అదే కాలంలో జవహర్‌లాల్‌నెహ్రూ ఈ క్రింది బహిరంగ ప్రకటన చేశారు. "రష్యా, బ్రిటన్, అమెరికా, చైనాలు ప్రాతినిధ్యం వహిస్తున్న పక్షం వెనుక ప్రపంచ అభ్యుదయ కాముక శక్తులు నిలబడ్డాయి" అని.

కాగా బ్రిటిషు ప్రభుత్వం విజ్ఞత ప్రదర్శించలేదు. 1941 ఆగష్టులో వారు అట్లాంటిక్ ప్రణాళికను ప్రకటించారు ఫాసిస్టువ్యతిరేక యుద్ధంలో పాల్గొనే దేశాలన్నిటికి యుద్ధానంతరం స్వాతంత్ర్య ప్రకటన జరుగుతుంది అని. కాగా ఈ ప్రకటన వలస దేశమైన భారత దేశానికి వర్తించదని చర్చిల్ ప్రకటించాడు. దాంతో భారతదేశంలోని జాతీయవాదులకు తీవ్ర ఆగ్రహం కల్గింది. యుద్ధ స్వభావంలో మార్పు వచ్చిందని గుర్తించిన నెహ్రూ లాంటి వారు సైతం ఆచరణలో ఏమీ చేయజాలని నిస్సహాయత ఏర్పడ్డది.

బ్రిటిషు ప్రభుత్వం కొన్నిచర్యలు చేపట్టింది. వ్యక్తిగత సత్యాగ్రహంలో అరెస్టయిన కాంగ్రెస్ ముఖ్య నాయకులను కొందరిని 1941 డిసెంబరులో విడుదల చేసింది. అదే నెలలో కాంగ్రెసు కార్యవర్గం సమావేశమై ఇలా తీర్మానించింది.

"దురాక్రమణకు గురై తమ స్వాతంత్ర్యం కొరకు పోరాడుతున్న వారి పట్లనే కాంగ్రెస్ సానుభూతి ఉంది. అయినా స్వాతంత్ర్య స్వేచ్ఛా భారత దేశం మాత్రమే జాతీయ ప్రాతిపదికపై దేశ రక్షణ కొనసాగించ గలదు."

కమ్యూనిస్టు పార్టీ తన వైఖరిని మార్చుకున్నది. "ప్రజా యుద్ధంలో ప్రజా పాత్రను నిర్వహించే విధంగా భారత ప్రజలను సన్నద్ధం చేయండి" అని 1941 డిసెంబరులో పొలిట్ బ్యూరో ఒక తీర్మానం చేసింది.

డియోలి జైలు నుండి వచ్చిన పత్రం యుద్ధ స్వభావంలో వచ్చిన మౌలిక మార్పును గుర్తించింది. 'ప్రజా యుద్ధం' అనే నినాదాన్ని ఇచ్చింది.

ఆ మేరకు ఆ మార్పు సరైనదే కాగా భారత దేశ పరిస్థితులలో ఎలా ఈ నినాదాన్ని అన్వాయించాలి అనేదే కీలక సమస్య.

జాతీయ ప్రభుత్వ స్థాపన ద్వారా దేశ రక్షణ బాధ్యతను కాంగ్రెసు నాయకులు స్వీకరించాలి. వామపక్షాలు తదితరులు అందులో భాగస్వాములు కావాలి అనే నినాదాన్ని కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం 1942 ఫిబ్రవరిలో ఇచ్చింది. ఈ నూతన వైఖరిని సుదీర్ఘంగా వివరిస్తూ 'స్వాతంత్ర్యానికి ముందుకు సాగండి' 'ఫార్వర్డ్ టు ఫ్రీడమ్' అనే పత్రాన్ని ఆనాటి పార్టీ నాయకత్వం విడుదల చేసింది.

ఆ విధానాన్ని కమ్యూనిస్టు పార్టీ శాఖలన్నీ ఆచరణలో పెట్టసాగాయి. ఆ విధానంలోని ముఖ్య అంశాలు యివి.

బ్రిటిషు సామ్రాజ్య వాదం తనకు తానై స్వాతంత్ర్యం ఇవ్వదు. ఏదో సాకుతో భారత దేశంలో ప్రతిష్టంభనను కొనసాగిస్తూ తన ఆధ్వర్యంలో నిరంకుశాధికార యంత్రాంగం ద్వారా యుద్ధ కృషి సాగించటం దాని పద్ధతి.

ఈ పద్ధతి ద్వారా భారత ప్రజలు యుద్ధకృషిలో జయప్రదంగానూ, మనస్ఫూర్తిగానూ పాల్గొన జాలరు. యుద్ధం తూర్పునుండి కూడా భారత దేశపు సరిహద్దులకు చేరుకున్నది. సింగపూరు జపాన్ వరమైంది. బర్మావారి చేతులలోకి పోయింది. కలకత్తా, విశాఖపట్నం, మద్రాసులపై జపాను బాంబులు కురిపించింది.

ఈ వాతావరణంలో ప్రతిష్టంభనను బద్దలు చేయవలసిన బాధ్యత భారత ప్రజలపైన ఉంది. బేషరతుగా యుద్ధ కృషికి కాంగ్రెసు తోడ్పాటు ప్రకటించాలి. అదే సమయంలో కాంగ్రెసు, లీగులు కలిసి జాతీయ ప్రభుత్వాన్ని స్థాపించాలి.

స్థూలంగా కమ్యూనిస్టు పార్టీ ఇచ్చిన విధానంయిది.

అటు బ్రిటిషు ప్రభుత్వ వైఖరిలో మార్పులేదు ఇటు కాంగ్రెసు నాయకత్వంలో చొరవలేదు.

దేశ పరిస్థితులలో విసిగిపోయి, సుభాష్ బోస్ 1941 జనవరి 17 న రహస్యంగా ఆఫ్ఘనిస్థాన్ మీదుగా పశ్చిమ జర్మనీ వెళ్ళిపోయాడు.

భారత స్వాతంత్ర్య సంపాదన బోసు ఏకైక లక్ష్యం. భారత ప్రజలు స్వశక్తి ద్వారా ఎలాగో సాధించలేరు. కాంగ్రెసు నాయకత్వం ఎప్పుడో ఒకసారి బ్రిటిషు ప్రభుత్వంతో రాజీ పడుతోంది. కనుక వీలైతే జర్మనీ, జపాన్‌ల సాయుధ సహాయంతోనైనా భారతదేశాన్ని విముక్తం చేయాలనేది ఆయన లక్ష్యం. జర్మనీ నుండి ఆయన కెట్టి ప్రతిస్పందన రాకపోవటంతో జపాన్ వెళ్ళిపోయాడు.

బోసు ఆఫ్ఘనిస్థాన్ మీదుగా తప్పించుక పోయేందుకు ఆనాడు అన్ని విధాల తోడ్పాటు యిచ్చింది, కమ్యూనిస్టు వర్గాలేనన్న సంగతి ఆ తర్వాత వెల్లడైంది. ఆ తర్వాత కాలంలో బోస్ పట్ల కమ్యూనిస్టు పార్టీ వైఖరి ఎలా ఉన్నా అప్పటికి బోస్‌ను స్వాతంత్ర్య పోరాట వీరునిగానే కమ్యూనిస్టులు గుర్తించి, వ్యవహరించారని చెప్పేందుకే ఈ ప్రస్తావన.

## క్రిప్స్ రాయబారం

ఈలోగా 1942 మార్చిలో నాటి బ్రిటిషు మంత్రి వర్గంలో సభ్యుడైన క్రిప్స్ నాయకత్వాన ఒక రాయబార వర్గం భారత దేశానికి వచ్చింది.

కాంగ్రెసుతో, ముస్లిం లీగ్‌తో స్వదేశసంస్థానాధీశులతో విడివిడిగా చర్చించి వారు అడిగిన కోర్కెలకు అంగీకరించినట్లే క్రిప్స్ మాట్లాడాడు. కేవలం విభేదాలను పెంచేందుకై క్రిప్స్ రాయబారం వచ్చిందని అన్ని రాజకీయ పార్టీలకు అర్థమైంది. అన్ని పార్టీలు క్రిప్స్ ప్రతిపాదనలను త్రోసిపుచ్చాయి.

1942 మేలో అలహాబాదులో అఖిల భారత కాంగ్రెసు కమిటీ సమావేశమైంది. యుద్ధంలో ఎలాగూ బ్రిటన్ ఓడి పోతుంది. కనుక వారితో రాయబార

మేమిటి అని కొందరు మితవాద నాయకులు వాదించారు. జపాను మనపై దండ యాత్ర చేస్తే ఏదోరూపంలో వారిని ప్రతిఘటించాల్సిందేనని నెహ్రూలాంటి వారు వాదించారు. ఫాసిజం ఎలాగు ఓడి పోతోంది కనుక క్రిప్స్ ప్రతిపాదనలు ఆమోదించాలని రాజగోపాలాచారి ఒక్కరే వాదించారు.

తాను ఏకాకి కావడంతో రాజగోపాలాచారి కాంగ్రెసు నుండి రాజీనామా చేశారు.

1942 జూలైలో బ్రిటిషు ప్రభుత్వం కమ్యూనిస్టు పార్టీపై నిషేధాన్ని తొలగించింది. కమ్యూనిస్టు నాయకులు క్రమంగా జైళ్ళనుండి విడుదల కాసాగారు "జాతీయ రక్షణకై జాతీయ ప్రభుత్వం, జాతీయ ప్రభుత్వానికై జాతీయైక్యత" అనే రెండు కీలక నినాదాలతో కమ్యూనిస్టు పార్టీ ముందుకు సాగింది.

యుద్ధ కృషిలో నిర్నిబంధంగా పాల్గొనటం ద్వారా ప్రతిష్టంభనను బద్దలు చేసి ముందుకు సాగాలి.

సామ్రాజ్యవాద యుద్ధ కాలంలో ప్రతిష్టంభననుండి పోరాటానికి పోవలసిన కర్తవ్యం ఉంది కాని జాతీయ నాయకత్వం పోరాటానికి సాగలేదు.

ఇప్పుడు ప్రజా యుద్ధ దశలో ప్రతిష్టంభననుండి పరిష్కారానికి పోవాలి. యుద్ధ కృషిలో పాల్గొంటూ, జాతీయ ప్రభుత్వ స్థాపనకు కృషి చేయాలి.

భారత దేశ రక్షణ బాధ్యతను బ్రిటిషు ప్రభుత్వం చేతులలో ఉంచరాదు. భారత ప్రజలు స్వీకరించాలి. ప్రజా యుద్ధంలో పాల్గొనటం ద్వారా స్వాతంత్ర్యాన్ని సాధించాలి

కారణం ఏమైనప్పటికి ముస్లింలీగ్ ప్రజలలో పలుకుబడి సంపాదించింది. కనుక కాంగ్రెస్ లీగ్ ఐక్యత అవసరం. అదే సమయంలో కార్మిక, రైతు, విద్యార్థి తదితర వర్గ సంఘాలూ, కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెసు, లీగూ అన్నీ కలిసి విస్తృత జాతీయైక్య సంఘటన ఏర్పడాలి.

మాకు స్వాతంత్ర్యం యివ్వండి. యుద్ధ కృషిలో పాల్గొంటాం. ఇది కాంగ్రెసు వైఖరి.

యుద్ధ కృషిలో పాల్గొనటం ద్వారా స్వాతంత్ర్యం సాధించుదాం. ఇది కమ్యూనిస్టుపార్టీ వైఖరి.

సైన్యంలో చేరవలసిందిగా యువకులను ప్రోత్సహించింది. జపాన్ బాంబు దాడులు జరిగితే ఆత్మరక్షణ ఎలా చేసుకోవలనో ప్రజలకు తర్ఫీదు ఇచ్చే శిబిరాలను స్థాపించింది.

నిర్బంధ యుద్ధ వసూళ్ళను వ్యతిరేకించింది.

# క్విట్ ఇండియా

ఇలా వుండగా 1942 ఆగస్టు 9 న బొంబాయి ఎ.ఐ.సి.సి. లో గాంధీజీ 'క్విట్ ఇండియా' నినాదం యిచ్చారు. వెనువెంటనే కాంగ్రెసు నాయకులందరినీ ప్రభుత్వం నిర్బంధించింది. తాము అరెస్టయితే ఏమి చేయాలో కూడా వారు నిర్దిష్ట కార్యక్రమం ఏదీ ఇవ్వలేదు.

దేశమంతటా నిర్బంధ విధానం తాండవించింది. ఆగస్టు 9 - డిసెంబరు నెలల మధ్య దేశవ్యాపితంగా 60 వేలపైచిలుకు కాంగ్రెసువాదులను అరెస్టుచేశారు. వేలాది నాయకులను డిటెయిన్ చేశారు. పోలీసు కాల్పులతో దాదాపు 1000 మంది చనిపోయారు.

క్విట్ ఇండియా తీర్మానాన్ని కమ్యూనిస్టుపార్టీ వ్యతిరేకించింది. అదే సమయంలో బ్రిటిషు ప్రభుత్వ నిర్బంధ విధానాన్ని తీవ్రంగా ఖండించింది. జాతీయ నాయకులను విడుదల చేయాలి. జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పరచాలి అనే రాజకీయ నినాదాన్ని నిరంతరాయంగా ప్రచారం చేస్తూనేవచ్చింది.

కమ్యూనిస్టు పార్టీ 'క్విట్ ఇండియా' ఉద్యమంలో చేరక పోవటానికి బలమైన కారణం ఉంది.

ఫాసిస్టు జర్మనీకి వ్యతిరేకంగా సాగే కృషికి ఎలాంటి అవాంతరం జరిగినా భారతదేశానికే కాక యావత్ మానవ జాతికే వినాశకరంగా పరిణమించేది.

స్టాలిన్‌గ్రాడ్‌ను వశం చేసుకున్న తర్వాత, కాకసస్ ద్వారా భారత దేశంలోకి చొచ్చుకు రావాలని హిట్లర్ పథకం వేశాడు. అదే సమయంలో జపాన్ తూర్పు నుండి భారత దేశంలో ప్రవేశించాలని ఉభయులూ భారత దేశాన్ని ఫాసిస్టు కబంధ హస్తాలలో బిగించాలని పన్నాగం.

ఈ పన్నాగం అప్పటికే కమ్యూనిస్టు పార్టీ గుర్తించింది. ఇందుకు సంబంధించిన అనేక పత్రాలు, దాఖలాలు యుద్ధానంతర కాలంలో వెలువడ్డాయి.

స్టాలిన్‌గ్రాడ్ వద్ద సోవియట్ సైన్యాలు హిట్లరును ఓడించి వెనుకకు నెట్టినందు వల్లనే ఈ పథకాలన్నీ భగ్నమయ్యాయి. భారతదేశానికి ఏర్పడిన ప్రమాదం తొలిగిపోయింది.

ఈ అంశాన్ని, ఆనాడు జాతీయ శక్తులు గుర్తించక కమ్యూనిస్టు పార్టీ వైఖరిని అపార్థం చేసుకున్నాయి. కాని చరిత్ర, కమ్యూనిస్టు పార్టీ వైఖరి సరైనదని నిరూపించింది.

ఫాసిజం ఓటమి తర్వాతనే సామ్రాజ్య వ్యవస్థ విచ్ఛిన్నం, వలస దేశాల స్వాతంత్ర్య పోరాట విజయాలు సాధ్యమైన విషయం, ఈ నాడు ప్రతి ఒక్కరూ గుర్తిస్తున్నారు.

ఫార్వర్డ్ బ్లాకు వారు, కాంగ్రెస్ సోషలిస్టులు క్విట్ ఇండియా తీర్మాన పరిధిని దాటిపోయి, తంతి తీగెలను తెంచటం, రైలు పట్టాలను పీకటం వంటి విధ్వంసక కార్యకలాపాలు చేపట్టారు. కొందరు కాంగ్రెసు వాదులు కూడా అందులో పాల్గొన్నారు.

ఈ విధ్వంసక చర్యలను కమ్యూనిస్టు పార్టీ వ్యతిరేకించింది. దేశ రాజకీయాలలో దాదాపు ఒంటరిగా నిలబడి, తన రాజకీయ విధానాన్ని దీక్షతో అమలు జరుప సాగింది.

సోవియట్ యూనియన్ పాత్రను, స్వభావాన్ని అంచనా వేయటంలో భారత కమ్యూనిస్టు పార్టీ ఒంటరిగా లేదనే విషయాన్ని గుర్తించటం అవసరం.

1942 ఆగష్టులో కాంగ్రెసు ఆమోదించిన క్విట్ ఇండియా తీర్మానంలో సైతం ఇలా ఉన్నది. "సోవియట్ యూనియన్, చైనాల స్వాతంత్ర్యం భారత దేశమునకు సైతం ఎంతో పవిత్రమైనది. ఈ పోరాటాన్ని ప్రారంభించటంద్వారా సోవియట్ యూనియన్, చైనాల స్వాతంత్ర్యానికి ఆ దేశాల వీరోచిత రక్షణకు ఎలాంటి నష్టం కలుగజేయడం కాంగ్రెసు లక్ష్యం కాదు".

రాయిస్టు విధానానికి, కమ్యూనిస్టు పార్టీ విధానానికి 1942 ఆగస్టు క్విట్ ఇండియా ఉద్యమం తర్వాత కూడా ఎట్టి పోలికలేదు.

కాంగ్రెసు నాయకులను విడుదల చేయవలసిందిగా రాయిస్టులు కోరలేదు. పైగా వారి విడుదలను వ్యతిరేకించారు. బ్రిటిషు సామ్రాజ్యవాదులు, మితవాద శక్తులు అధికార యంత్రాంగం సాయంతో యుద్ధ కృషి సాగించాలి, అని రాయిస్టుల వైఖరి.

జాతీయైక్యత, జాతీయ ప్రభుత్వం అనే మాటలే వారికి లేవు.

## అక్టోబరు ప్లీనం

ప్రజా యుద్ధ నినాదాన్ని అమలు జరిపే కృషిలో కొంత ముందుకు సాగిన పిమ్మట, 1942 అక్టోబరులో రాష్ట్ర కమిటీ ప్లీనం సమావేశం జరిగింది,

ప్రతి పార్టీ సభ్యుడు, ప్రతి కమిటీ, కోటాలు తీసుకుని నిర్ణీత కాలంలో. నిర్ణీత కర్తవ్యం పూర్తి చేయాలని ఈ ప్లీనం తీర్మానించింది.

1942 ఆగష్టు నుండి అక్టోబరు వరకు, జాతీయ ఐక్యత, జాతీయ ప్రభుత్వ స్థాపన, కాంగ్రెసు నాయకుల విడుదల కోరుతూ, 750 గ్రామాలలో, 1 లక్ష 25 వేల మంది ప్రజలచేత మహజర్లపై సంతకాలు చేయబడ్డాయి.

పౌర రక్షణలో పాల్గొనడానికి గాను, విమాన దాడి రక్షణోపాయాలను ప్రజలకు నేర్పడానికి, గుంటూరు, కృష్ణా, పశ్చిమ, తూర్పు గోదావరి, నెల్లూరు జిల్లాలలో విమాన దాడి రక్షణ శిబిరాలు నిర్వహించబడ్డాయి. సుమారు 50 దళాలు ఇలాంటివి ఏర్పాటైనవి.

ఈ కాలంలో పార్టీ సభ్యత్వం 738 మంది 1077 కు పెరిగింది. నూటికి 40 వంతులు పార్టీ సభ్యులు, పార్టీకి సర్వకాలం పని చేసే హోల్ టైమర్లుగా వచ్చారు.

## 3 వ కమ్యూనిస్టు పార్టీ మహాసభ

ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు పార్టీ ప్రథమ బహిరంగ మహాసభ (మూడవ మహాసభ) విజయవాడలో 1943 జూలై 3 న, దుర్గాగ్రహారంలో జరిగింది.

ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ ప్రథమ మహా సభ 1936 లోనూ, 2 వ మహాసభ 1938 లోనూ జరిగాయి. 1934 లో రాష్ట్ర వ్యాపితంగా పార్టీ సభ్యులు 40 మంది మాత్రమే. 1943 లో 3 వ పార్టీ మహాసభ నాటికి 3,250 మంది పార్టీ సభ్యులైనారు.

వివధ జిల్లాల నుండి 200 మంది ప్రతినిధులు హాజరైనారు. కామ్రేడ్ పోలేపెద్ది నరసింహమూర్తి సభకు అధ్యక్షత వహించారు. కేంద్ర కమిటి సభ్యులు కామ్రేడ్ సుందరయ్య మహాసభను ప్రారంభిస్తూ పార్టీ ప్రజా యుద్ధ విధానాన్ని వివరించారు.

ప్రజలకు, పోలీసులకు మధ్య నిలబడి, విచ్ఛిన్నకర చర్యలను, నిర్బంధ విధానాన్ని అరికట్టడం, ఆహార సంక్షోభాన్ని అవకాశంగా తీసుకుని అన్నార్తులు జరిపే లూటీలను నివారించి గోదాముల నుండి ఆహార ధాన్యాలు సక్రమంగా పంపిణీ చేయడం, వ్యవసాయరంగంలో. పారిశ్రామికరంగంలో అధికోత్పత్తికి కృషి చేయడం వంటి పార్టీ విధానాలు వివరించారు.

మహాసభ ముగింపు రోజున (జూలై 11 న) విజయవాడలో బ్రహ్మాండమైన ఊరేగింపు, జింఖానా గ్రౌండ్స్‌లో బహిరంగ సభ జరిగాయి. జోరున వర్షం కురుస్తున్నా చెదిరిపోకుండా అశేష ప్రజానీకం, కమ్యూనిస్టు పార్టీ నూతన విధానాన్ని, సుందరయ్య గారు వివరించగా శ్రద్ధగా విన్నారు.

కామ్రేడ్ చంద్ర రాజేశ్వర రావుగారు, ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు సమితి కార్యదర్శిగా ఈ మహా సభలో ఎన్నికయ్యారు.

ఈ మహాసభకు ముందే వివిధ జిల్లా పార్టీ మహా సభలు జరిగాయి.

కృష్ణా జిల్లా కమ్యూనిస్టు పార్టీ మహాసభ సందర్భంగా సమర్పించిన నివేదిక ననుసరించి, 1939-42 మధ్య (సామ్రాజ్యవాద యుద్ధ దశలో) కృష్ణా జిల్లాలో 30 వేల మందితో ఆకలి యాత్రలు జరిగాయి. జిల్లా బోర్డు ఎన్నికలలో మితవాద అభ్యర్థులకు వ్యతిరేకంగా, కాంగ్రెసు అభ్యర్థులను గెలిపించడానికి కమ్యూనిస్టు పార్టీ కృషి చేసి విజయం సాధించింది.

1941 జూన్ 22 తర్వాత యుద్ధ స్వభావంలో మార్పు వచ్చిన మీదట 80 మంది ఫాసిస్టు వ్యతిరేక ప్రచారకులకు పార్టీ శిక్షణ యిచ్చింది. లక్ష రూపాయల ఎరువులు, 1200 ఎకరాల బంజరు భూమి పంపకంలో తోడ్పడ్డది. గన్నవరం విమానాశ్రయ నిర్మాణానికి ప్రజా సహకారాన్ని సమీకరించింది. అప్పటికే కృష్ణా జిల్లాలో రైతు, వ్యవసాయ కార్మిక, యువజన, విద్యార్థి, మహిళా, బాల సంఘాలు విస్తృతంగా ఏర్పడసాగాయి. 1561 మంది పార్టీ సభ్యులున్నారు.

పశ్చిమ గోదావరి జిల్లాలో అప్పటికే 300 మంది పార్టీ సభ్యులు, 42 మంది హోల్‌టైము కార్యకర్తలు, విశాఖ జిల్లాలో 60 మంది పార్టీ సభ్యులున్నారు. గుంటూరు జిల్లా కమ్యూనిస్టు మహాసభ దిగ్విజయంగా జరిగింది. కామ్రేడ్ మాకినేని బసవ పున్నయ్య కార్యదర్శిగా ఎన్నికయ్యారు.

దీర్ఘకాలం కాంగ్రెసులో గడిపి, 1942 ఆగస్టు తర్వాత కమ్యూనిస్టు పార్టీ విధానం సక్రమమైందని గుర్తించి, శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య, రావి అమ్మయ్య, దర్శి లక్ష్మయ్య, కస్తూరి కుటుంబరావు గారలు కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వాన్ని స్వీకరించారు.

ఈ విధంగా ప్రజా యుద్ధ నినాదంతో 1943 నుండి ఆంధ్ర ప్రదేశ్‌లో కమ్యూనిస్టు పార్టీ ప్రజా పార్టీగా రూపొందేందుకు ఉరకలూ వేస్తూ పురోగమించ సాగింది.

# విశాఖ జిల్లాలో కమ్యూనిస్టు పార్టీ నిర్మాణం

1930 దశకం మధ్య కాలానికే ఆంధ్ర దేశంలో ఒక పెద్ద కార్మిక కేంద్రంగా విశాఖ జిల్లా అభివృద్ధి చెందింది. 1934 నాటికి విశాఖ పట్టణం పోర్టు హార్బర్‌లో 3000 మంది కార్మికులు, నెలిమర్ల జనుపనార మిల్లులో 1500 మంది, చిట్టివలస జనపనార మిల్లులో 3000 మంది కార్మికులు పని చేస్తూండే వారు.[1] కమ్యూనిస్టు పార్టీని ఈ జిల్లాలో నిర్మించేందుకు 1934 నుండే ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి. విశాఖ జిల్లాలో కమ్యూనిస్టు భావాల వ్యాప్తికి తోడ్పడిన వారిలో అబ్బూరి రామకృష్ణారావు ప్రథములు. ఆంధ్ర విశ్వ విద్యాలయంలో లైబ్రేరియన్‌గా పనిచేస్తున్న అబ్బూరి రామకృష్ణారావుకు 1933-1934 లో బొంబాయిలోని కమ్యూనిస్టు నాయకులతో పరిచయం ఏర్పడింది. తరువాత సుందరయ్య గారి సాన్నిహిత్యంతో విశాఖ ప్రాంతంలో కమ్యూనిస్టు ఉద్యమాన్ని నెలకొల్పే బాధ్యతను తీసుకున్నారు.[2] ఇదే కాలంలో (34-35 సంవత్సరాలలో) విశ్వ విద్యాలయంలో ఆచార్యుడుగా పని చేసిన హిరేన్ ముఖర్జీ విశాఖ పట్టణంలో కమ్యూనిస్టు భావాల వ్యాప్తికి కృషి చేశారు. వీరిరువురి ప్రయత్నం మూలంగా పెద్ద మొత్తంలో సోషలిస్టు సాహిత్యం విశ్వ విద్యాలయ గ్రంథాలయంలో చోటు చేసుకుంది. విద్యార్థులలో వామపక్ష భావాలు పెంపొందటానికి ఈ సాహిత్యం ఎంతగానో ఉపయోగపడింది. అబ్బూరి రామకృష్ణారావుకి పార్టీ నిర్మాణంలో తోడ్పడేందుకు వీలుగా 1934 చివరిలో గుంటూరు నుంచి అత్తలూరి నరసింహారావును రాష్ట్ర పార్టీ పంపింది.[3] వీరిరువురు కలసి రాత్రి పాఠశాలలు నిర్వహించడం ద్వారా హార్బర్ వర్కర్సుతో సంబంధాలను పెంచుకున్నారు. ఈ పాఠశాలలో సాధారణ విద్యతో పాటు రాజకీయ ఆర్థిక విషయాలను కూడా కార్మికులకు బోధించడం జరిగేది.[4] కార్మికులలో రాజకీయ చైతన్యం పెంపొందించి కార్మిక సంఘ నిర్మాణానికి 1935 లోనే ప్రయత్నాలు చేశారు. అనేక ఒడిదుడుకులను దాటుకుని చివరకు 1936 జనవరి 10 న హార్బర్ వర్కర్సు యూనియన్ స్థాపించబడింది. దీనికి ప్రథమ అధ్యక్ష, కార్యదర్శులుగా డా॥ ఎం. వి. కృష్ణారావు, అత్తలూరి నరసింహారావులు ఎన్నికయ్యారు.

మరో వైపున అబ్బూరి రామకృష్ణారావు పరిచయం ద్వారాను, సోషలిస్టు సాహిత్య ప్రభావం మూలంగానూ, దేశంలో ప్రచారమవుతున్న సోషలిస్టు భావాల

వల్లనూ వైద్య కళాశాల విద్యార్థులనేక మంది వామపక్ష భావాల వైపు మొగ్గు చూపారు. ఈ విద్యార్థుల ప్రయత్నాల ఫలితంగానే 1936 లో 'ఆంధ్ర విద్యార్థి సంఘం' పేరుతో ఒక విద్యార్థి సంఘం ఏర్పడింది. దానిని అఖిల భారత విద్యార్థి సమాఖ్యకు అనుబంధించడం కూడా జరిగింది.[5]

1936 విద్యా సంవత్సరంలో ఎం. బి. బి. ఎస్ చదివేందుకు కామ్రేడు చంద్ర రాజేశ్వరరావు విశాఖ పట్టణం వచ్చారు. ఈ సంవత్సరంలోనే బి. కాం. చదివేందుకు నిడమర్తి అశ్వనీ కుమార్ దత్తు విశాఖ పట్టణం రావడం జరిగింది. కామ్రేడ్ రాజేశ్వరరావు వచ్చిన తరువాత విద్యార్థి సంఘ కార్యక్రమాలు చురుకుగా సాగడమే కాకుండా పార్టీ నిర్మాణం కూడా ఒకరూపు దిద్దుకుంది. పార్టీ సాహిత్యం, సర్క్యులర్లు విద్యార్థులకు అందించబడేవి. దీనితో పాటుగా విద్యార్థులలో కమ్యూని నిస్టు భావాలను పెంపొందిస్తూ సామ్రాజ్య వాద వ్యతిరేక పోరాట వెల్లువలోకి తెచ్చేందుకు కృషి జరిగింది. అందుకు వీలుగా మార్క్సిస్టు స్టడీ సర్కిల్‌ను ఏర్పాటు చేసి హార్బర్ వర్కర్సుకు, విశ్వవిద్యాలయ విద్యార్థులకు సామ్యవాద సిద్ధాంతాలు బోధించడం జరిగేది.[6]

ఈ విధంగా 1936 వ సంవత్సరంలో కార్మిక విద్యార్థి సంఘాల నిర్మాణంతో పాటుగా వారిలో వామపక్ష భావాలు పెంపొందించి కమ్యూనిస్టు పార్టీవైపు ఆకర్షించటం జరిగింది. ప్రతి రాజకీయ సమస్యపై స్పందించే మిలిటెంటు గ్రూప్‌గా విద్యార్థులను తయారుచేయడం జరిగింది. 1936 ఆఖరులో బ్రిటీషు గవర్నర్ విశాఖపట్టణం సందర్శించినపుడు కామ్రేడ్ రాజేశ్వరరావు నాయకత్వంలో పెద్ద ఎత్తున విద్యార్థులు నిరసన ప్రదర్శన నిర్వహించారు. 1937 మద్రాసు రాష్ట్ర అసెంబ్లీ ఎన్నికల సందర్భంలో కాంగ్రెసు విజయానికి విద్యార్థులను కార్మికులను కమ్యూనిస్టు పార్టీ సమీకరించింది. విశాఖ పట్టణం నియోజక వర్గంలో పోటీ చేసిన జస్టిస్ పార్టీ అభ్యర్థి ఎ.వి. భానోజీరావు పెద్దపలుకుబడి కల్గిన వ్యక్తి. ఈయన తరపున పనిచేస్తున్న గూండాలు కాంగ్రెసు ఊరేగింపులను నిర్వహించ నిచ్చే వారుకారు. అందువల్ల కాంగ్రెసు ఊరేగింపులో కమ్యూనిస్టు విద్యార్థులు ముందు భాగాన ఉండి ఊరేగింపును నడిపేవారు. వెలమ పేటలో (విశాఖ పట్టణం లోని ఒక భాగం) అడ్డు వచ్చిన జస్టిస్ పార్టీ గుండాలను చితకకొట్టి మరీ ఊరేగింపును ముందుకు తీసుకు వెళ్ళడం జరిగిందని కామ్రేడ్ రాజేశ్వరరావు ఇచ్చిన ఇంటర్వ్యూలో తెలియచేసారు.

ఈ ఎన్నికలలో కాంగ్రెసు అభ్యర్థులుగా పోటీ చేసిన తెన్నేటి విశ్వనాథం (విశాఖ పట్టణం) వి.వి. గిరి (బొబ్బిలి), కరుణాకరం సుబ్బారావు (లేబర్ కాని స్టిట్యుయేన్సీ) గెలుపొందారు.

ఈ విధంగా సామ్రాజ్య వాదులు, వారి మద్దతుదారులపై పోరాడటానికి దొరికిన ప్రతి అవకాశాన్ని వినియోగించుకొని సామ్యవాద సిద్ధాంతాలను ప్రచారం చేయడం జరిగింది. దీనితో పాటుగా కమ్యూనిస్టు పార్టీ బలం కూడా పెరిగింది. 1937 ఏప్రిల్ నాటికి విశాఖపట్టణంలో వున్న సెల్స్ వివరాలు

**1.** టౌన్ యూనిట్ :-

అబ్బూరి రామకృష్ణరావు
అత్తలూరి నరసింహారావు
నిడమర్తి అశ్వనీకుమార దత్తు
కొత్తమాసు సత్యనారాయణ

**2.** హార్బరు వర్కర్స్ యూనిట్

మోటూరి వీరాస్వామి
కదిరి తాత
వాడమెదలు అప్పలనర్సయ్య
చీకటి పరశురామ నాయుడు
పైదాడ లచ్చన్నలు ఉండేవారు,
ఈ యూనిట్లకు కామ్రేడ్ రాజేశ్వరరావు ఆర్గనైజరుగా ఉండేవారు.

వీరేకాక వైద్య కళాశాల విద్యార్థులు కొంతమంది ఒక మితిమెంటు కమ్యూనిస్టు గ్రూపుగా ఉండేవారు.

డా॥ కె. సోమయ్య
డా॥ చలపతి నాయుడు
డా॥ రామదాసు
డా॥ కుప్పా వెంకట్రామ శాస్త్రి
డా॥ సుందర రామమూర్తి
డా॥ గద్దే రామకోటేశ్వరరావు
జె. వి. కె. వల్లభరావు
డా॥ జి. సుదర్శనం
డా॥ డి. లక్ష్మి (1938 నుండి) మొదలగువారు.

1937 మే, కొత్త పట్టణం స్కూలు తరువాత పార్టీ కోరికపై హోల్ టైమర్ బాధ్యతలు స్వీకరించేందుకు కా॥ రాజేశ్వరరావు విజయవాడకు వెళ్ళారు. వీరి తరువాత విశాఖపట్టణంలో కొత్తమాసు సత్యనారాయణ పార్టీ బాధ్యతలను నిర్వహించారు. ఈ కాలంలోనే యమ్. ఎన్. రాయ్ సిద్ధాంతాల ప్రభావం విశాఖకు కూడా విస్తరించింది. రాయ్ సిద్ధాంతాలు ఆమోదించి, వాటిని అమలు

పరిచే ప్రయత్నం చేయడంతో అబ్బూరి రామకృష్ణరావు, అత్తలూరి నరసింహారావు, చీకటి పరశురామ నాయుడును కమ్యూనిస్టు పార్టీ నుండి 1937 చివరిలో తొలగించారు.

కమ్యూనిస్టుపార్టీ 1937 నాటికి విద్యార్థులలో బలమైన పునాదిని ఏర్పరచుకోగలిగింది. గుంటూరులో జరిగిన 14 వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభకు డా॥ కుప్పా వెంకట్రామశాస్త్రి, డా॥ జి. రామకోటేశ్వరరావు ఆధ్వర్యంలో పెద్ద సంఖ్యలో విశాఖపట్టణ విద్యార్థులు హాజరయ్యారు ఈ మహాసభ తరువాత విశాఖ జిల్లాలో విద్యార్థి ఉద్యమం విస్తరించింది. ఆంధ్ర మెడికల్ కాలేజీ ఎం.బి.బి.ఎస్. డిగ్రీకి గుర్తింపు ఇవ్వ నిరాకరించినందున మెడికల్ కాలేజీలో జరిపిన సభలో ఆరోగ్యశాఖా మంత్రి టి. ఎస్. ఎస్. రాజన్‌ని మాట్లాడనీయకుండా విద్యార్థులు ప్రదర్శన జరిపారు. టౌనుహాలులో సభ జరపటానికి చేసిన ప్రయత్నం కూడా సఫలం కాలేదు. విద్యార్థి సంఘ కార్యక్రమాలకే పరిమితం కాకుండా కార్మిక వాడల్లో రాత్రి పాఠశాలలను విద్యార్థులు నడిపేవారు. జాలరిపేటలోని రాత్రి పాఠశాలను వైద్య విద్యార్థులే పూర్తిగా నడిపేవారు.

ఈ విధంగా పార్టీ కార్యక్రమాలన్నిటిని నిర్వహిస్తూ వైద్య విద్యార్థులలో కమ్యూనిస్టు గ్రూపుగా ఉన్నవారంతా 1938 లో పార్టీ సభ్యులయ్యారు. ఈ కాలంలోనే బొడ్డపాటి అచ్యుతం కూడా పార్టీలోకి వచ్చారు. వీరితో పాటుగా డి. నర్సింగరావు కూడా టౌన్‌యూనిట్‌లో సభ్యులుగా చేరారు. వీరు మద్రాసులో కంభంపాటి సత్యనారాయణ సహచరులు. పార్టీ నిర్మాణాన్ని సంఘటితపరిచి మరింత ముందుకు తీసుకుపోవడానికి 1939 ప్రారంభంలో జొన్నలగడ్డ రామలింగయ్యను విశాఖజిల్లా ఆర్గనైజర్‌గా రాష్ట్ర పార్టీ పంపింది. 1938-39 కాలంలో చిట్టివలస కార్మికులతో పార్టీకి సంబంధాలు ఏర్పడ్డాయి. 1939లో చిట్టివలస కార్మికులపై అక్రమంగా కాల్పులు జరిగినప్పుడు విశాఖపట్టణంలోని పార్టీ కార్యకర్తలు తమ పూర్తి సంఘీభావాన్ని ప్రకటించారు. జొన్నలగడ్డ రామలింగయ్య ఆధ్వర్యంలో వైద్య కళాశాల విద్యార్థులు చిట్టివలసను సందర్శించి కాల్పులపై సవివరమైన నివేదికను తయారుచేశారు. ఈ కాల్పులను ఖండిస్తూ హార్బర్ వర్కర్సు యూనియన్ ఒక తీర్మానాన్ని ఆమోదించింది. అంతేకాకుండా చిట్టివలస కార్మికులతో కలిసి బెజవాడ గోపాలరెడ్డి (మద్రాసు మంత్రివర్గ సభ్యుడు) వద్దకు తమ నిరసన వ్యక్తపరుస్తూ ఊరేగింపు కూడా చేశారు. కార్మికులు వస్తున్నారని తెలిసి ముందుగానే సభను ముగించి మంత్రిగారు ఉడాయించారు.

ఈ సంఘటనల తర్వాత చిట్టివలస కార్మికులతో పార్టీ పరిచయాలు క్రమంగా పెరిగాయి.

కార్మికులలో రాజకీయ చైతన్యాన్ని పెంపొందించి కమ్యూనిస్టు భావాల వైపుగా మళ్ళించేందుకు జొన్నల గడ్డ రామలింగయ్య వారికి రాజకీయ తరగతులను నిర్వహించారు.

మరో వైపున 1939 మే నెలలో జిల్లా యువజన, విద్యార్థి రైతు సంఘాల తరపున ఇచ్ఛాపురంలో ఒక రాజకీయ పాఠశాలను నిర్వహించారు. దీనికి హాజరైన చెన్నూరు నారాయణ రావు పార్టీ సభ్యులయ్యారు. 1930 లో కొత్త మాసు సత్యనారాయణ గారి ద్వారా పార్టీ పత్రికలు సాహిత్యం చదువుతూ వామపక్ష ఆలోచనల వైపు మొగ్గిన ఎం. వి. భద్రం కూడా ఈ స్కూలుకు హాజరయ్యారు. పార్టీ నిర్దేశించిన కార్యక్రమాలన్నిటిని అమలు పరుస్తూ 1939 డిసెంబరులో ఎం. వి. భద్రం పార్టి సభ్యులయ్యారు.[9] 1940 ప్రారంభంలో చిట్టి వలస కార్మికులలో పనిచేయడానికి ఎం.వి. భద్రంను పార్టీ పంపింది. కార్మికసంఘ కార్యక్రమాలలో పాల్గొంటూ వారికి రాత్రిళ్ళు రాజకీయ తరగతులు నిర్వహిస్తూ అనేక మంది కార్మికులను పార్టీ సానుభూతి పరులుగా తయారు చేసారు. సామ్రాజ్య వాద యుద్ధ కాలంలో రహస్యంగా ముద్రిత మవుతున్న స్వతంత్ర భారత్, ఇతర యుద్ధ వ్యతిరేక కరపత్రాలును కూడా రహస్యంగా మిల్లు లోపలకు వెళ్ళే యంత్రాంగం నిర్మించబడింది. ఇదే విధంగా విశాఖపట్టణంలో కూడా యుద్ధ వ్యతిరేక కార్యకలాపాలు ఉధృత స్థాయిలో సాగించారు. యుద్ధ వ్యతిరేక ప్రచారాన్ని బహిరంగంగా సాగించడం, యుద్ధ వ్యతిరేక నిధిని ఏర్పాటు చేసి బహిరంగ సభలలో చందాలు పోగుచేయడం కూడా జరిగింది.

యుద్ధ వ్యతిరేక చర్యలతో పాటుగా రైతు సంఘ కార్యక్రమాలలో కూడా కమ్యూనిస్టులు చొరవతో పాల్గొని, ఉద్యమ నిర్మాణానికి తోడ్పడ్డారు. 1940 మార్చి 24-27 న పలాసలో జరిగిన అఖిల భారత రైతు మహా సభ విజయ వంతం కావడానికి జొన్నలగడ్డ రామలింగయ్య, కొత్త మాసు సత్యనారాయణ, ఎం.వి. భద్రం కృష చేసారు. ఈ మహాసభ ప్రేరణతో మందసా రైతులు పెద్ద ఎత్తున పోరాటం నడిపారు. అప్పుడు జరిగిన కాల్పులకు వ్యతిరేకంగా జిల్లా అంతటా నిరసన ప్రచారాన్ని, కమ్యూనిస్టులు చేపట్టారు.

విశాఖ జిల్లాలో రైతు ఉద్యమాభివృద్ధికి ప్రధాన కారకులైన పుల్లెల శ్యాం సుందరరావు, గౌతు లచ్చన్న వంటి నాయకులు కమ్యూనిస్టులు కాకపోయి నప్పటికి, కమ్యూనిస్టు కార్యకర్తలతో సన్నిహితంగానే పనిచేసే వారు. రైతు సంఘ కార్యక్రమాలలో కమ్యూనిస్టులు, ఇతరులు కూడా కలసి పని చేసేవారు. 1937 రైతు రక్షణ యాత్ర సందర్భంలో విశాఖ జిల్లాలో పుల్లెల శ్యాం సుందర రావు, గౌతు లచ్చన్న జిల్లా అంతటా విస్తృతంగా తిరిగి సభలు, ప్రదర్శనలు నిర్వహించి, ఆ యాత్ర దిగ్విజయం అవటానికి దోహదపడ్డారు.

పార్టీ కార్యకర్తలు అనుసరించిన యుద్ధ వ్యతిరేక విధానానికి, ప్రజా ఉద్యమాల నిర్మాణానికి భయపడిన ప్రభుత్వం, తీవ్ర నిర్బంధ విధానాన్ని చేపట్టింది. పలాస రైతు మహా సభలో ప్రభుత్వం వ్యతిరేక ఉపన్యాసం చేసారనే నెపం మీద 1940 ఏప్రిల్‌లో జొన్నలగడ్డ రామలింగయ్యను స్వగ్రామంలోనే జొన్నలగడ్డ ఉండాలని **Internament** ఉత్తర్వు జారీ చేసింది.[11]

తరువాత డా॥ కుప్పా వెంకట్రామశాస్త్రి, కొత్తమాసు సత్యనారాయణలను ప్రభుత్వం డిటెయిను చేసింది.

పార్టీ నిర్మాణాన్ని కొనసాగించడానికి పిల్లలమర్రి వెంకటేశ్వర్లు ఆర్గనైజరుగా 1940 మధ్యభాగంలో విశాఖపట్టణానికి వచ్చారు. ఈయన రహస్యంగా ఉంటూనే స్వతంత్ర్య భారత్ పంపకాన్ని, కమ్యూనిస్టు సాహిత్య ప్రచారాన్ని యుద్ధ వ్యతిరేక కార్యక్రమాలను వైద్య విద్యార్థుల సహకారంతో నెరవేర్చారు. కాని 1940 నవంబరు 3 న ఈయనను కూడా ప్రభుత్వం నిర్బందించింది.[12] యుద్ధ వ్యతిరేక కార్యక్రమాలలో పాల్గొంటూకమ్యూనిస్టులకు తోడ్పడుతున్నారనే కక్షతో డా॥ రంగయ్య, డా॥ రంగనాయకులు, డా॥ సి. సూర్యనారాయణలను ప్రభుత్వం నిర్బందించింది. విద్యార్థి ఉద్యమాన్ని అభివృద్ధిచేస్తూ కమ్యూనిస్టు కార్యక్రమాలలో పాల్గొంటున్నా డా॥ లక్ష్మిని స్వగ్రామంలోనే (బందరు) ఉండాలని ప్రభుత్వం ఆదేశించింది.[13]

యుద్ధ వ్యతిరేక చర్యలు, నిర్వహిస్తూ కార్మిక సంఘ నిర్మాణాన్ని చూస్తున్న ఎం.వి. భద్రంను కూడా 1940 డిసెంబరులో ప్రభుత్వం నిర్బందించింది. ఈ విధంగా 1941 ప్రారంభ కాలం నాటికి జిల్లాలోని పార్టీ ముఖ్య కార్యకర్తలంతా ప్రభుత్వ నిర్బంధ విధానానికి గురి అయ్యారు.

పార్టీపై ఇంతటి నిర్బంద విధానం అమలులో వున్నా మరో వైపున పార్టీ కార్యక్రమాలు చురుకుగానే సాగినాయి. 1940 సెప్టెంబరులో జొన్నలగడ్డరామలింగయ్య పోలీసు నిఘా నుండి తప్పించుకుని రహస్య జీవితం ప్రారంభించారు. విజయనగరంలో వుంటూ పార్టీ కార్యక్రమాలను కొనసాగించారు. 1940 నుండి 43 వరకు విజయనగరమే పార్టీ కార్యక్రమాలకు జిల్లా కేంద్రంగా ఉండేది. విజయకుమార్ నివసిస్తున్న లాడ్జి పార్టీ కార్యకర్తలకు ఒకడెన్‌గా ఉపయోగపడింది. విద్యార్థులలో అనేకమంది పార్టీ సానుభూతిపరులుగా ఉండేవారు. గుంటూరు జిల్లా నుంచి వచ్చి 1937 లో విజయనగరం కాలేజి విద్యార్థిగా చేరిన విజయకుమార్ విద్యార్థులలో వామపక్ష భావాలు పెంపొందించటానికి కృషిచేసారు. ఆ తరువాత జొన్నలగడ్డ రామలింగయ్య ద్వారా పార్టీ సభ్యులై పార్టీ కార్యక్రమా

లను రహస్యంగా కొనసాగించేవారు బి ఎస్.సి. ఆఖరి సంవత్సరం పరీక్షలు పూర్తిచేసుకుని 1941 ఏప్రియల్ నుండి జొన్నలగడ్డ రామలింగయ్యగారితో కలిసి పార్టీ నిర్మాణానికి పూనుకున్నారు. విజయనగరం కేంద్రంగా జొన్నలగడ్డ రామలింగయ్య, విజయకుమార్‌లు పార్టీని అభివృద్ధిపరిచారు. ఈ కాలంలోనే (41 చివరి నాటికి) చిట్టివలసలో కార్మికులైన కొండేటి రామస్వామి, కవ్వలసోంబాబు, కవ్వల పాపారావు, ఆలేపె అప్పలకొండ, ఇమండి రాములు, ఇప్పర జోగారావు, ఇప్పర తాత, కాకి అప్పలస్వామి పార్టీ సభ్యులయ్యారు.[14]

ఈ కాలంలో కమ్యూనిస్టు పార్టీ రహస్యంగా ముద్రిస్తున్న 'స్వతంత్ర భారత్' పత్రిక విశాఖ జిల్లాలోని అన్ని ముఖ్య కేంద్రాలకు అందేది. రైల్వేలో ఆర్ ఎమ్.ఎస్. ఉద్యోగిగా పని చేస్తున్న ఏటుకూరి బలరామ మూర్తి స్వతంత్ర భారత్ పత్రికను విశాఖ జిల్లాకు అందించడంలో ప్రధానంగా తోడ్పడ్డారు. డ్యూటీలో భాగంగా రెండు రోజులకొకసారి విజయవాడ నుండి విశాఖకు, విశాఖ నుండి బరంపురంకు ఏటుకూరి బలరామమూర్తి వెళ్తుండేవారు విజయవాడ నుండి స్వతంత్ర భారత్ పత్రికలను తీసుకుని వాటిని ఎవరూ గుర్తుపట్టకుండా ఒక మామిడిపళ్ల బుట్టలో పెట్టేవారు. విశాఖ పట్టణంలో ఉన్న పార్టీ కార్యకర్తలకు ఆ మామిడి పళ్ల బుట్టలను అందించేవారు. ఈ స్వతంత్ర భారత్ పత్రిక పంపకంలో కాంగ్రెసులోని అతివాద భావాలున్న వారు కూడా తోడ్పడేవారు. బలరామ మూర్తి వద్ద నుండి మామిడిపళ్ళ బుట్ట రూపంలో స్వతంత్ర భారత్‌ను అందుకున్న వారిలో గౌతు లచ్చన్న కూడా ఒకరు.

యుద్ధ వ్యతిరేక వార్తలను ముమ్మరంగా ప్రచురిస్తూ సామ్రాజ్య వాద వ్యతిరేకతను పెంపొందిస్తున్న స్వతంత్ర భారత్ ప్రభుత్వాధికారులను కలవర పెట్టింది. చివరికి రహస్యాన్ని పసిగట్టిన అధికారులు బలరామ మూర్తిని 1940 జూలైలో మద్రాసు హెడ్ పోస్టాఫీసుకు ట్రాన్స్ఫర్ చేసారు.

విజయనగరంలో విద్యార్థులుగా ఉన్న కామ్రేడ్ కె. గోవిందరావు, కరవది వెంకటేశ్వర్లు పార్టీ సభ్యులయ్యారు ఇదే కాలంలో విజయనగరంలోని సెట్టి ఈశ్వరరావు, అంబళ్ళ సూర్యారావు, అవసరాల సూర్యారావు, డి.వి. గరిగరాజు వంటి విద్యావంతులు కూడా పార్టీ సభ్యులు అయ్యారు.

శ్రీకాకుళం ప్రాంతంలోని యం. అబ్బయ్య నాయుడు, మెదళ్ళవలస సీతారాం, బొడ్డేపల్లి రాజగోపాలరావు, డా॥ వెంకటేశ్వరరావు మొదలగువారితో పార్టీ సెల్లు ఏర్పడింది.[15]

అనకాపల్లిలో హోటల్ వర్కరుగా వున్న సి. ఆర్. వల్లభన్ (మణి) విజయకుమార్ పరిచయం ద్వారా 1941 చివరలో పార్టీ సభ్యుడై హోటల్

వర్కర్సు యూనియన్, మున్సిపల్ వర్కర్సు యూనియన్, షుగర్ కేన్ ఫారమ్ వర్కర్సు యూనియన్‌లు నిర్మించారు. ప్రజా యుద్ధ కాలం ప్రారంభమైన తరువాత 1942 జూన్, జూలై వరకు కూడా జిల్లాలోని ముఖ్య కమ్యూనిస్టు నాయకులను విడుదల చేయలేదు. 1942 జూన్ నెలలో పార్టీపై నిషేధం తొలగించడంతో పార్టీ కార్యకర్తలకు బహిరంగంనా పని చేసే అవకాశం ఏర్పడింది. పార్టీపై నిషేధం తొలిగిన సంవత్సరం పిదప 1943 లో విశాఖ జిల్లా కమ్యూనిస్టు పార్టీ ప్రథమ మహా సభను జూన్ 1, 2, 3 తేదీలలో విశాఖపట్టంలో నిర్వహించారు. ఈ మహాసభలో జొన్నలగడ్డ రామలింగయ్య కార్యదర్శిగాను, వై. వి. జయకుమార్, ఎం.వి భద్రం, కె. గోవిందరావు, మంత్రి ప్రగడ రమణమూర్తులతో జిల్లా కమిటీ ఏర్పడింది. ఈ మహాసభ నాటికి విశాఖపట్టణం జిల్లాలో 66 మంది కమ్యూనిస్టు పార్టీ సభ్యులున్నారు.[16]

## ఆధారాలు


1. విశాఖ హార్బర్ వర్కర్సు యూనియన్ స్వర్ణోత్సవ సంచిక
2 అబ్బూరి వరద రాజేశ్వరరావు, వరద కాలం, ఉదయం పత్రిక నుండి
3. అత్తలూరి నరసింహారావుతో ఇంటర్వ్యూ
4. అత్తలూరి నరసింహారావు వ్యాసం, హార్బర్ వర్కర్స్ యూనియన్ స్వర్ణోత్సవ సంచిక
5. ఎ. ఐ ఎస్. ఎఫ్. చరిత్ర, ఉజ్వల ఘట్టాలు
6. ఎ. ఐ. ఎస్. ఎఫ్. చరిత్ర, ఉజ్వల ఘట్టాలు - 48 వ పేజీ
7. ఎం. వి. భద్రం వ్యాసం, సి. ఆర్. ఇంటర్వ్యూ
8. సంఘం పత్రిక, 15-11-61
9. ఎం. వి. భద్రం వ్యాసం
10. సంఘం, 15-12-61
11. 1940 ఏప్రిల్ మద్రాసు ప్రభుత్వ పక్ష నివేదిక
12. 5-3-41 జి. ఓ. నెంబరు 489, పబ్లిక్ జనరల్
13. 14-8-41, జి. ఓ. నెం. 1740, పబ్లిక్ జనరల్
14. 1975 సెప్టెంబరు, కమ్యూనిజం, 54 వ పేజీ
15. 1975 సెప్టెంబరు, కమ్యూనిజం విజయకుమార్ వ్యాసం
16. 14-7-43, ప్రజా శక్తి, 3 వ పేజీ.

# తూర్పు గోదావరి జిల్లాలో కమ్యూనిస్టు పార్టీ నిర్మాణం

1930 నాటికి తూర్పు గోదావరి జిల్లాలో జాతీయోద్యమ ప్రభావంతో పాటు సెటిమెంటు వ్యతిరేక రైతాంగ పోరాట ప్రచారం ఎక్కువగానే వుంది. అప్పుడప్పుడే వెల్లివిరుస్తున్న సామ్యవాద భావాలు 1930 దశకం ప్రథమ భాగంలో తూర్పు గోదావరి జిల్లాకు విస్తరించాయి. రాజమండ్రిలో హిందీ పాఠాలు నేర్పుతున్న పందిరి మల్లిఖార్జునరావు ఉత్తర భారతదేశం నుండి వెలువడే పత్రికలలో రష్యా విప్లవాన్ని గురించి వస్తున్న వ్యాసాలు చదివి ప్రభావితులయ్యారు. దీనితోపాటుగా మద్రాసులోని సింగారవేలు చెట్టియార్‌తో ఏర్పడిన పరిచయం మూలంగా కూడా ఆయన సోషలిస్టు భావాల వైపు ఆకర్షితులయ్యారు. పోలీసులు 1929 లో వీరి ఇల్లు సోదా చేసినప్పుడు స్టాలిన్ వ్రాసిన 'లెనినిజం', ట్రాట్‌స్కీ వ్రాసిన 'రష్యా విప్లవ చరిత్ర' వంటి పుస్తకాలు లభ్యమయ్యాయి. సోషలిస్టు భావాలతో ఉత్తేజితులై శాసనోల్లంఘన ఉద్యమం విరమించబడిన తరువాత 1934 తో ఈయన కమ్యూనిస్టు పార్టీలో సభ్యులుగా చేశారు.[1]

పందిరి మల్లిఖార్జున రావు జిల్లాలో మొదటి కమ్యూనిస్టు సభ్యుడు కావడంతోపాటుగా 1935 నుండి 1938 వరకు పార్టీ జిల్లా ఆర్గనైజరుగా పని చేసారు. మరో వైపున కాకినాడలో స్థాపించబడిన సోదర సమితి సభ్యులు ఓడల ద్వారా సోషలిస్టు సాహిత్యాన్ని తెప్పించి యువకులకు అందజేసేవారు. జిల్లాలో సోషలిస్టు భావాల వ్యాప్తికి తోడ్పడిన మరో ముఖ్య సంస్థ 'విశ్వ సాహిత్య మాల.'

ఆంధ్ర రాష్ట్రంలో మార్క్సిస్టు సాహిత్యాన్ని ప్రచురించి, తెలుగు ప్రజలలో 'కమ్యూనిస్టు సిద్ధాంతాలను ప్రచారంలో పెట్టిన సంస్థలలో విశ్వ సాహిత్య మాల' ప్రముఖమైంది. ఈ సంస్థ తూర్పు గోదావరి జిల్లా ముంగండ గ్రామంలో 1935 లో ప్రారంభించబడింది. 1934 లో పోలేపెద్ది నరసింహమూర్తి పరిచయం ద్వారా మార్క్సిస్టు సాహిత్యం పట్ల ఆకర్షణ ఏర్పడటంతో వాటిని తెలుగు ప్రజలకు అందించాలనే ఉద్దేశ్యంతో మహీధర జగన్మోహనరావు మహీధర రామమోహనరావులు ఈ విశ్వ సాహిత్య మాలను ప్రారంభించారు. కమ్యూనిస్టు పార్టీ నిర్మాణంతో పాటుగా మార్క్సిస్టు సాహిత్య ప్రచురణను కూడా ప్రారంభించిన జిల్లాలలో తూర్పు గోదావరి జిల్లా ఒకటి.

తూర్పు గోదావరి జిల్లాలో కమ్యూనిస్టు పార్టీ నిర్మాణానికి కృషి చేసిన వారిలో నండూరి ప్రసాదరావు ఒకరు. 1935 మధ్య భాగంలో పార్టీ సభ్యుడుగా చేరిన నండూరి ప్రసాదరావు పార్టీ నిర్ణయం మేరకు తూర్పు గోదావరి జిల్లాలో పార్టీ నిర్మాణానికి పూనుకున్నారు. నండూరి ప్రసాదరావు, విశ్వ సాహిత్యమాలను ప్రారంభించిన 'మహీధర రామ మోహనరావుతోనూ, పెనుమత్స సూర్య నారాయణ రాజు మరి ఒకరు తోనూ కాకినాడలో 1935 అక్టోబరులో కమ్యూనిస్టు సెల్‌ను ఏర్పరిచారు'.[2]

కాకినాడ పి. ఆర్. కళాశాలలో విద్యార్థిగా ఉన్న పర్వతనేని వెంకటేశ్వర రావు "1936 కి కమ్యూనిస్టు పార్టీలో చేరి విద్యార్థి ఉద్యమంలో పని చేయ ప్రారంభించారు." వీరితోపాటుగా 1936 లో కాంగ్రెసు సోషలిస్టు పార్టీ సభ్యుడిగా ఉన్న డాక్టర్ ఎమ్. వీరయ్య 1937 లో పార్టీ సభ్యులై కాకినాడ పట్టణంలో ఎంతో మంది యువకులకు మార్క్సిస్టు పరిజ్ఞానాన్ని అందించి కమ్యూనిస్టులుగా తయారు కావడానికి కృషి చేసారు.

ఈ సమయంలోనే మిలిటరీ శిక్షణ పొంది వచ్చిన కొరపాటి పట్టాభి రామయ్య కపిలేశ్వర పురంలో జమీందార్లకు వ్యతిరేకంగా ప్రచారం చేస్తూ వ్యవసాయ కూలీలను సమీకరించసాగారు. 1937 మద్రాసు రాష్ట్ర అసెంబ్లీ ఎన్నికల సందర్భంగా నండూరి ప్రసాదరావుతో వీరికి పరిచయం ఏర్పడి 1937 చివరి నాటికి ఈయన కూడా కమ్యూనిస్టు పార్టీలోకి వచ్చారు.

ఉన్నత విద్యాభ్యాసానికి ఇంగ్లాండ్ వెళ్ళిన సి. వి. కె. రావు అక్కడ మార్క్సిస్టు సాహిత్యం చదవడం మూలంగా ప్రభావితులై కమ్యూనిస్టు పరిజ్ఞానంతో 1937 మధ్య భాగానికి కాకినాడ తిరిగి వచ్చి కమ్యూనిస్టు పార్టీ నిర్మాణానికి పూనుకున్నారు.

యువజన సంఘ కార్యక్రమాలలో చురుకుగా పాల్గొంటూ 1937 అసెంబ్లీ ఎన్నికల సందర్భంగా నండూరి ప్రసాదరావుతో పరిచయం ఏర్పడి చింతం సత్యనారాయణదాసు 1937 చివరి నాటికి కమ్యూనిస్టు పార్టీలో చేరారు. ఈ సంవత్సరంలోనే యువజన సంఘ కార్యకర్తగా ఉన్న నెన్మెత్స అనంతం పార్టీలోకి వచ్చారు.

వివిధరంగాల నుంచి పార్టీ కార్యకర్తలుగా వచ్చిన వీరంతా జిల్లాలో వివిధ ప్రజా సంఘాల నిర్మాణానికి, పూనుకున్నారు. చురుకైన పార్టీ సభ్యులను తయారు చేయ నారంభించారు. పార్టీ నిర్మాణాన్ని సమన్వయ పరచి అభివృద్ధి చేసేందుకు వీలుగా 1938 నుండి పెన్మెత్స సూర్యనారాయణ రాజు జిల్లా ఆర్గనైజరుగా పనిచేసారు.[3]

పార్టీ అనుసరించిన ఐక్య సంఘటనా ఎత్తుగడ వల్ల, చురుకైన కార్యకర్తలు పనిచేయడం మూలంగా జిల్లాలోని వివిధ ప్రజా సంఘాలు ముఖ్యంగా విద్యార్థి కార్మిక సంఘాలు 1938 నుండి అభివృద్ధి చెందడం, విస్తృత స్థాయిలో కార్యక్రమాలు సాగించడం ప్రారంభమైంది. జిల్లాలోని ఉన్న మొత్తం 16 హైస్కూలు విద్యార్థులను సమీకరించి 1938 నవంబరులో జిల్లా విద్యార్థి మహాసభ నిర్వహించబడింది. అప్పటికే పిఠాపురం హైస్కూలు విద్యార్థుల సమ్మె బాలాజీ దాస్ నాయకత్వంలో నడుపబడి విజయం సాధించింది జిల్లాలో వివిధ ప్రాంతాలలో వయోజన విద్యాలయాలు నడుప బడుతుండేవి. ముఖ్యంగా కార్మిక వాడల్లో ఈ వయోజన విద్యాలయాలు నిర్వహించబడేవి. విద్యార్థి ఫెడరేషన్ తరపున ఈ వయోజన విద్యాలయాలు నడుపటానికి, అందుకు అవసరమైన శిక్షణనివ్వటానికి ఒక క్యాంపును 1938 చివరి కాలంలో కాకినాడలో నిర్వహించారు.[4]

వయోజన విద్యాలయాలతో పాటుగా జిల్లాలో జరిగే కార్మిక సమ్మెలన్నింటికి విద్యార్థులు పరోక్షంగా తోడ్పడేవారు. జిల్లా విద్యార్థి సంఘ కార్యదర్శిగా ఉన్న పి.ఎస్. శర్మ 1938 చివరి నాటికి పార్టీ సభ్యులయ్యారు.

'1938 నాటికి కాకినాడ పట్టణంలోని అన్ని రకాల కార్మికులను సంఘటితం చేయడం జరిగింది. బర్మాషెల్, స్టీవ్‌డోర్, ఫైబర్, స్కావెంజరు, సాల్ట్, మున్సిపల్, మొదలగు రంగాలలోని కార్మికులను ఐక్యం చేసి, సంఘాలు నిర్మించారు. కార్మికుల సమస్యలపై దఫ దఫాలుగా సమ్మెలు నిర్వహించి విజయాలు సాధించారు కాకినాడలోని ఈ కార్మిక సంఘాల కార్యక్రమాలలో సి.వి కె. రావు, పర్వతనేని వెంకటేశ్వర రావులతో పాటుగా ఎస్.వి రత్నం, రామాయణం సత్యనారాయణ ప్రముఖ పాత్ర వహించారు. ఇలా వివిధ కార్మిక సంఘాలు ఏర్పడిన తరువాత 1939 లో కాకినాడ టౌన్ ట్రేడ్ యూనియన్ కౌన్సిల్ ఏర్పడింది దీనికి అధ్యక్ష కార్యదర్శులుగా సి.వి.కె. రావు, పర్వతనేని వెంకటేశ్వర రావులు ఉన్నారు.[5]

కాకినాడ కార్మిక సంఘాల నిర్మాణంలో ప్రధాన పాత్ర వహించిన ఎస్.వి. రత్నం, రామాయణం సత్యనారాయణ 1933 సంవత్సరంలో పార్టీ సభ్యులు అయ్యారు

వ్యవసాయ కూలీ సమస్యలపై జిల్లాలో అనేకచోట్ల ముఖ్యంగా రాజోలు తాలూకాలో కమ్యూనిస్టులు పోరాటాలు నిర్వహించారు. వీరి కృషి ఫలితంగా జిల్లా వ్యవసాయ కూలీ మహాసభ 1938 జనవరి 2 న రాజోలు తాలూకా మోరి గ్రామంలో నిర్వహించబడింది. ఈ సభలో జిల్లా కార్యదర్శిగా కొరపాటి పట్టాభిరామయ్య, సహాయ కార్యదర్శులుగా నంబూరి శ్రీనివాసరావు, గెడ్డం మహాలక్ష్మి, కాపూరి పట్టాభిరామయ్య, అధ్యక్షుడిగా ఉండ్రు సుబ్బారావు ఎన్నికయ్యారు.[6]

ఈ మహాసభ అనంతరం రాజోలు తాలూకాలో పెద్ద ఎత్తున వ్యవసాయ కూలి సమస్యలపై సమ్మెలు నిర్వహించబడినాయి. 1938 జూలై, ఆగస్టు మాసాలలో శివకోడు, సావరం, సోంపల్లి, ఈదరాడ, పొన్నమండ, అంతర్వేది, దిండి, చిన్నాడం గ్రామాలలో వ్యవసాయ కూలి రేట్లు పెంపుదలకోసం సమ్మెలు నిర్వహించారు. రాజోలు తాలూకా వ్యవసాయ కూలీ సంఘ కార్యక్రమాలవల్ల ఉత్తేజితులై రామచంద్రాపురం తాలూకాలో కూడా వ్యవసాయకూలీలు సంఘాలు స్థాపించుకున్నారు. దీని ఫలితంగా 1938 అక్టోబరు 4 న రామచంద్రాపురం తాలూకా వ్యవసాయ కూలీ మహాసభ జరిగింది. ఈ సభలో గెద్దం మహాలక్ష్మి అధ్యక్షుడిగా ఎన్నుకోబడ్డారు.[7]

రైతు, వ్యవసాయ కూలీ సమస్యలపై పోరాటాలు నిర్వహిస్తూ సంఘాలను నిర్మిస్తూ 1938-39 కాలంలో కందికట్ల నాగభూషణం, గెద్దం మహాలక్ష్మి, చొప్పల నవరత్నం, కానేటి రామమోహనరావు, ఇనుగంటి నారాయణరావులు పార్టీ సభ్యులయ్యారు.

కమ్యూనిస్టులు జిల్లాలోని రైతాంగాన్ని సమీకరించి రైతు సంఘాల నిర్మాణాన్ని కూడా చేపట్టారు. 1937లో జిల్లా రైతుసంఘం ఆర్గనైజింగు సెక్రటరీగా ఉన్న పెన్మెత్స సూర్యనారాయణరాజు కమ్యూనిస్టే. ఈ కాలంలో నిర్వహించిన రైతురక్షణయాత్రలో జిల్లాలోని అన్ని తాలూకాలనుంచి రైతులుసమీకరించబడ్డారు 1938 లో జమీందారీ ఎంక్వయిరీ కమిటీ రాజమండ్రి వచ్చిన సందర్భంలో రైతు సంఘం తరఫున సాక్ష్యాలు చెప్పేందుకు రైతులను ప్రోత్సహించి సమీకరించారు. ఈ సందర్భంగా రాజమండ్రిలో జరిగిన సభకు దాదాపు 5 వేల మందికి పైగా రైతులు అన్ని తాలూకాల నుండి హాజరయ్యారు భూస్వాముల దురంతాలకు వ్యతిరేకంగా అనేక చోట్ల ఉద్యమాలు నడుపబడ్డాయి. రాజోలు తాలూకా గుడిమాల గ్రామ భూస్వామికి వ్యతిరేకంగా అడ్డాల పాలెం, లేకిశెట్టి పాలెం, గుడిమూల, అంతర్వేది పాలెం, సఖినేటిపల్లి గ్రామాలలో రైతులను సమీకరించడం జరిగింది. ఈ సమస్యల్లో పోరాట కార్యక్రమాన్ని చేపట్టడానికి 28-6-39 న అల్లూరి సోమరాజు, కార్యదర్శిగా, వీరా రామమూర్తి అధ్యక్షులుగా ఒక కార్యవర్గాన్ని కూడా ఏర్పరిచారు.[8]

వివిధ పోరాట కార్యక్రమాల ద్వారా జిల్లాలోని అన్ని ప్రజా సంఘాలను విస్తృత పరచి, చురుకైన కార్యకర్తలకు సిద్ధాంత శిక్షణ ఇవ్వటానికి జిల్లాలో 1937 లో సామర్లకోటలోనూ, 38 లో రాజమండ్రిలోనూ, 39 లో అంతర్వేది పాలెంలోనూ రాజకీయ పాఠశాలలు నిర్వహించారు. వీటితో పాటుగా మహీధర రామమోహనరావు, మహీధర జగన్మోహనరావు, సి వి.కె. రావు మొదలగు వారు

కాకినాడలో స్టడీ సర్కిల్స్‌ను నిర్వహించి కార్యకర్తలకు, సిద్ధాంత బోధన వేసారు. ఈ విధంగా ప్రజా సమస్యలపై పోరాడి కమ్యూనిస్టు సిద్ధాంతాలను ఆచరణలో పెట్టే వారితో పార్టీ సెల్స్‌ను ఏర్పాటు చేయడం జరిగింది.

**1939 సంవత్సరంలో జిల్లాలో ఉన్న కొన్ని కమ్యూనిస్టు పార్టీ సెల్సు వివరాలు**

గొల్లప్రోలు :- మల్లిరెడ్డి వెంకటరాజు, కొప్పుల వెంకటారావు, కొప్పున నాయన మల్లం సూర్యారావు

రాజోలు :- అల్లూరి సోమరాజు, అల్లూరి సీతారామరాజు, కానేటి రామమోహన రావు, గెడ్డం మహాలక్ష్మి

కొత్తపల్లి :- రావు వెంకట జగ్గారావు, చిత్తడి చిన్న, రావు సత్యనారాయణ రావు

కాకినాడ :- రామాయణం సత్యనారాయణ (పట్టణ సెక్రటరీ) డా ఎమ్.వీరయ్య జగదాంబ, సి వి. రత్నం.
మహీధర రామమోహన రావు, మహీధర జగన్మోహన రావు, సుసర్ల సత్యనారాయణ, సరస్వతుల సోమేశ్వర రావు

కొత్తపేట :- పెన్మెత్స సోదరులు, చింతం సత్యనారాయణ దాసు, దామిసెట్టి పార్థసారధి.

ఆత్రేయపురం:- ఇందుకూరి సోమరాజు, ఇతరులతో కలిసి సెల్ ఉండేది.

1939 సంవత్సరములో రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమవడంతోనే కమ్యూనిస్టులపై ప్రభుత్వం తీవ్ర నిర్బంధ విధానాన్ని చేపట్టింది.

కమ్యూనిస్టు కన్పించడంతోనే అరెస్టు చేయడం, వారివద్ద నిషిద్ధ సాహిత్యం లభ్యమయిందని ఆరోపించి తామే వారివద్ద కమ్యూనిస్టు సాహిత్యం ఉంచడం దొంగ సాక్ష్యాలు సృష్టించి, కేసులుబనాయించి శిక్షించటం పోలీసులకు సామాన్యమై పోయింది. ప్రతి కమ్యూనిస్టు కార్యకర్తను వెంటాడి అరెస్టుచేయడం ప్రారంభించారు జిల్లా కమిటీ కార్యదర్శిగా ఉన్న పెన్మెత్స సూర్యనారాయణ రాజును ప్రభుత్వం నిర్బంధించింది. ప్రభుత్వ దమనకాండ తీవ్రమవడంతో జిల్లాలో పార్టీ నిర్మాణాన్ని పునర్వవస్థీకరించుకుని పటిష్టపరుచుకోవల్సిన అవసరం ఏర్పడింది.

రహస్య కాలంలో పార్టీ నిర్మాణాన్ని కాపాడుకుంటూ, యుద్ధ వ్యతిరేక కార్యక్రమాలు కొనసాగించటానికి, రహస్య సాహిత్య ముద్రణా, పంపిణీలను విస్తృతపరచడానికి 1940 డిసెంబరులో జిల్లా పార్టీ సభ్యులు సమావేశమయ్యారు. రామచంద్రాపురం తాలూకా మోదుకూరు గ్రామంలోని చెరుకుతోటలో ఈ సమావేశం జరిగింది. ముగ్గురితోకూడిన కార్యదర్శి వర్గం ఏర్పడింది. పి. అనంతం, కొరపాటి పట్టాభిరామయ్య, దామిశెట్టి పార్థసారధి కార్యదర్శి వర్గ సభ్యులు.

పి ఆనంతం, జిల్లా కమిటీ కార్యదర్శి. వివిధ ప్రజా సంఘాలలో పనిచేస్తున్న మరో 8 మంది జిల్లా కమిటీ సభ్యులుగా ఎన్నికయ్యారు.

ప్రభుత్వ నిర్బంధ విధానం తీవ్రమైన దశలో, పార్టీ కార్యకర్తలు రహస్య జీవితం గడుపుతున్న కాలంలో జిల్లా పార్టీ అనుసరించిన ఈ విస్తృత కమిటీ నిర్మాణ పద్ధతిని, రాష్ట్ర కమిటీ ఖండించింది. విస్తృత నిర్మాణం దుస్సాహసమని, ఏ చిన్న పొరపాటు జరిగినా మొత్తం సభ్యులు నిర్బంధానికి గురి అవుతారని రాష్ట్ర కమిటీ హెచ్చరించింది. పదకొండు మందితో కూడిన జిల్లా కమిటీని రద్దుచేసుకుని, ముగ్గురితో కూడిన కార్యదర్శి వర్గ నిర్మాణ పద్ధతిని అనుసరించమని గట్టిగా చెప్పింది.

ఈ సమావేశం తరువాత పార్టీ సభ్యులు కడు జాగ్రత్తతో వ్యవహరిస్తూ యుద్ధ వ్యతిరేక ప్రచారం సాగించారు. పార్టీ సాహిత్యాన్ని రహస్యంగా సైకిళ్లపై చేరవేస్తూ, యుద్ధ వ్యతిరేక నినాదాలను గోడలపై వ్రాస్తూ ప్రజలలో యుద్ధ వ్యతిరేక భావనలను పెంపొందించారు.

రహస్యంగా ముద్రితమై పంపిణీ చేయబడుతున్న 'స్వతంత్ర్య భారత్'ను పట్టుకోవడానికి ప్రభుత్వం తీవ్ర చర్యలు చేపట్టింది. కమ్యూనిస్టు సాహిత్యం, స్వతంత్ర్య భారత్ పంపిణీ చేస్తున్నారనే నెపంతో 1940 సంవత్సరంలో ఆర్. సత్యనారాయణ, మహీధర జగన్మోహనరావులకు 16 నెలలు జైలు శిక్షను విధించారు. దేశ భద్రతా నిబంధనల క్రింద పందిరి జగదాంబను అరెస్టు చేసి నెల్లూరు జైలుకు పంపారు. ఈ సంవత్సరంలోనే స్వతంత్ర్య భారత్ ముద్రణ, పంపిణీ చేస్తున్నారనే నేరం క్రింద మల్లాది కృష్ణమూర్తి, సరస్వతుల సోమేశ్వరరావులకు 2 సంవత్సరముల కఠిన కారాగార శిక్ష విధించారు. అప్పటికే జైలులో నిర్బంధించబడివున్న సి. వి. కె. రావు డిటెన్షన్ పొడిగించారు 1940 జూన్ నెలలో ఎన్. వెంకటరత్నంలకు నిషిద్ధ సాహిత్యం, స్వతంత్ర్య భారత్ పంపిణీ చేస్తున్నారనే నేరం క్రింద 6 నెలల జైలు శిక్ష విధించారు.[9] వీరేకాక కామరసు లక్ష్మిపతి, చింతం సత్యనారాయణ దాసు, పి. ఎస్. శర్మ, కొరపాటి పట్టాభిరామయ్య మొదలైనవారు కూడా తరువాత కాలంలో డిటెయిన్ చేయబడ్డారు.

జిల్లా నాయకత్వంలోని మిగిలిన ముఖ్యులంతా రహస్యంగా వుంటూ ప్రజా ఉద్యమాలను పెంపొందించటానికి పార్టీ నిర్మాణానికి కృషి చేసారు. ఈ సమయం లోనే జిల్లాలో యుద్ధ వ్యతిరేక ప్రచారం చేస్తూ గ్రామ గ్రామాన్న సభలు నిర్వహిస్తున్న కంభంపాటి సత్యనారాయణను 1940 జనవరి 22న ఆయన స్వగ్రామం అత్తిపూడి (తుని తాలుకా) లో ప్రభుత్వం ఇంటర్న్ చేసింది.[10]

ప్రభుత్వం నిర్బంధం తీవ్రంగా ఉన్నా రైతులను, కూలీలను సమీకరించి తిండి పని కల్పించాలని, భూమి శిస్తును తగ్గించాలని, ఋణ నివారణ కావించాలని కోరుతూ పెద్ద ఎత్తున ఊరేగింపులు నిర్వహించారు. 1940 జనవరిలో రాజోలు తాలుకాలోని రైతులు వ్యవసాయ కూలీలు సంయుక్తంగా పెద్ద యాత్రను నిర్వహించారు. కాకినాడలోని 1000 మంది కార్మికులు పని, తిండి కల్పించాలని డిమాండు చేస్తూ లేబర్ కమీషనర్ వద్దకు నినాదాలు చేస్తూ ఊరేగింపు జరిపారు.

వ్యవసాయ కూలీలను సమీకరించి ప్రపథమంగా ఆకలి యాత్రలను నిర్వహించింది తూర్పుగోదావరి జిల్లాలోనే. కమ్యూనిస్టు నాయకత్వంలో 1940 మేలో జరిగిన రాజోలు తాలూకా ఆకలి యాత్ర ప్రభుత్వాన్ని భూస్వాములను కలవరపరిచింది.

యుద్ధ వ్యతిరేక కార్యక్రమ సందర్భంగా 'యుద్ధంలో రైతుల దురవస్థ' అనే యుద్ధ వ్యతిరేక కరపత్రాన్ని 15000 వేల కాపీలు తీసి జిల్లా అంతటా పంచి పెట్టారు.[11]

కాకినాడలో ఎక్కడ చూసినా ఏదో ఒక యుద్ధ వ్యతిరేక కరపత్రం కన్పించేది. కాకినాడతో యుద్ధ వ్యతిరేక కరపత్రం పంచుతున్న ఒక కార్మికుడిని పోలీసులు అరెస్టు చేసారు. కాని ప్రజలంతా ఒత్తిడి చేయడంతో పోలీసులు అతనిని వదిలి వేయక తప్పలేదు.

యుద్ధ వ్యతిరేక కార్యక్రమాలలో విద్యార్థులు కూడా చురుకుగా పాల్గొన్నారు: పి ఆర్. కళాశాల విద్యార్థులు, సామ్రాజ్యవాద యుద్ధాన్ని వ్యతిరేకిస్తూ, 1940 జనవరి 7న సమ్మె చేసి ఊరేగింపు జరిపారు. ఆ రోజు సాయంత్రం సామ్రాజ్యవాద యుద్ధాన్ని వ్యతిరేకించాలని కోరుతూ ఒక బహిరంగ సభనుకూడా నిర్వహించారు.

సామ్రాజ్యవాద యుద్ధ కాలంలో రాజమండ్రి పట్టణంలోని కార్మికులందరిని సంఘటిత పరచి ప్రెస్ వర్కర్సు యూనియన్, రైల్వే వర్కర్సు యూనియన్, మున్సిపల్ వర్కర్సు యూనియన్‌లు స్థాపించారు. 1940 సంవత్సరం మే డే రోజున రాజమండ్రిలోని కార్మికులంతా పెద్ద ఎత్తున ఊరేగింపు జరిపి, సభను నిర్వహించారు. రాజమండ్రి పట్టణంలో కార్మికులంతా ఐక్యమై సమావేశం జరపడం అదే మొదటిసారి. కార్మిక సంఘాల నిర్మాణంతో పాటుగా కమ్యూనిస్టుపార్టీ నిర్మాణం కూడా ఈ కాలంలోనే జరిగింది. 1940వ సంవత్సరంలో రాజమండ్రి పట్టణంలో 6 గురితో ఒక కమ్యూనిస్టు కమిటీ ఏర్పడింది. దీనిలో మామిడి అప్పారావు, సలుమూరి నరసింహా అప్పారావు, గురినెల్ల గోపాలకృష్ణ, ఆకుల

పాపారావు, అడ్డాల సోమరాజు, కాటం సత్యనారాయణ ఉండేవారు. ఈ కమిటీ సెక్రటరీగా నలుమూరి నరశింహ అప్పారావు పనిచేశారు.[12]

రాజమండ్రి పట్టణంలో విద్యార్థి సంఘ కార్యక్రమాల నిర్వహించి, కార్మిక వర్గ సంఘ నిర్మాణాలను చూస్తున్న చిట్టూరి ప్రభాకరరావు చౌదరి 1941 లో పార్టీ సభ్యులయ్యారు. వీరితో పాటుగా ఏలూరు జోగారావు, దుంగల అప్పలస్వామి, శనగళ్ళ సీతారామయ్య కామరసు లక్ష్మీపతి మొదలగు వారు కూడా పార్టీ సభ్యులు కావడంతో 1941 చివరి నాటికి రాజమండ్రి పట్టణంలో మొత్తం పార్టీ సభ్యుల సంఖ్య 11 కి పెరిగింది.

సామ్రాజ్యవాద యుద్ధ కాలంలో ప్రభుత్వ దమనకాండను, నిర్బంధ విధానాన్ని తట్టుకుంటూ పార్టీని అభివృద్ధి చేయటానికి పార్టీ సభ్యులు కృషిచేశారు. విద్యార్థి నాయకులుగా ఉన్న పరకాల పట్టాభి రామారావు 1939 చివరిలో పార్టీ సభ్యులై 1940 ఏప్రిల్ లో పార్టీ హోల్ టైమరుగా బాధ్యతలు స్వీకరించారు. 1940 చివరి నుండి జిల్లా పార్టీ (రహస్య) ఆఫీస్ సెక్రటరీగా పర్వతనేని వెంకటేశ్వరరావుతో పాటుగా పనిచేశారు.

1940 వ సంవత్సరంలో ఉప్పాడ, పిఠాపురం, ఇసుకపూడి, రామరాజు లంక గ్రామాలలో కూడా పార్టీ సెల్సు ఏర్పడ్డాయి. 1939 - 40 సంవత్సరములలోనే అల్లూరి వెంకట్రామరాజు, మళ్లపూడి సూర్యనారాయణలు పార్టీ సభ్యులయ్యారు. సామ్రాజ్యవాద యుద్ధ దశ ముగిసి ప్రజా యుద్ధం కాలం ప్రారంభమయ్యే నాటికి జిల్లా మొత్తంగా 60 మంది పార్టీ సభ్యులతో, రాజోలు, అమలాపురం (కొంత భాగం) తాలూకాలలో బలమైన వ్యవసాయ కూలీ సంఘాలతోనూ, రామచంద్రాపురం, పిఠాపురం కొత్తపేట తాలూకాలలో పటిష్టమైన రైతు సంఘాలతోనూ, కాకినాడ, రాజమండ్రి పట్టణాలలో మిలిటెంటు ట్రేడ్ యూనియన్‌లతోనూ, జిల్లా మొత్తంగా వ్యాపించిన విద్యార్థి సంఘంతోనూ కమ్యూనిస్టు పార్టీ ఉంది.

సోవియట్ యూనియన్‌పై హిట్లర్ దాడిని ఖండిస్తూ, రామచంద్రాపురంలో (దాడి జరిగిన వారం రోజులకు) ఫాసిస్టు వ్యతిరేక సభను డా॥ చెలికాని రామారావు, వుత్సల సత్యనారాయణలు ఏర్పాటు చేసారు. జిల్లాలో సోవియట్ యూనియన్‌పై దాడిని ఖండిస్తూ ఏర్పాటు చేయబడిన మొట్టమొదటి సభ ఇది.

పార్టీ పాలసీలో వచ్చిన మార్పు ఫలితంగా కమ్యూనిస్టు పార్టీపట్ల ప్రభుత్వం తన నిర్బంధ విధానాన్ని కొంత సడలించింది. జైళ్ళలో నిర్బంధించిన కమ్యూనిస్టు కార్యకర్తలను నెమ్మది నెమ్మదిగా విడుదల చేయటం ప్రారంభించింది.

కమ్యూనిస్టు కార్యకర్తలు జైలునుంచి విడుదలైన తరువాత 1942 చివరికాలంలో పార్టీ నిర్మాణాన్ని సమన్వయపరిచి అభివృద్ధి చేయడానికి ఒక నూతన ఆర్గనైజింగ్ కమిటీని ఏర్పాటు చేసారు. ఈ కమిటీ కన్వీనరుగా ఇసుగంటి నారాయణరావు పని చేసారు. ఈయనతో పాటు మహీధర జగన్మోహనరావు, బాలాజీదాసు (కార్మిక రంగ బాధ్యుడు) చింతం సత్యనారాయణ దాసు (రైతు రంగ బాధ్యుడు) సి. సురేంద్రనాథ్ చౌదరి (విద్యార్థి రంగ బాధ్యుడు) ఈ కమిటీలో ఉన్నారు.

ఈ కమిటీ ఏర్పాటైన తర్వాత వివిధ తాలూకాలకు ఆర్గనైజర్లను నియమించారు.

రాజోలు తాలూకాకు - అల్లూరి వెంకట్రామరాజు
కొత్తపేట తాలూకాకు - జి. జి. శాస్త్రి
అమలాపురం - మహీధర జగన్మోహనరావు
రామచంద్రాపురం - దోనెపూడి ధర్మారావు
రాజమండ్రి - చిట్టూరి ప్రభాకరరావు చౌదరి
పెద్దాపురం - పడాల రామారావు
పిఠాపురం - కందికొండ బుల్లిరాజు

ఆర్గనైజర్లుగా పని చేసారు.

## ఆ ధా రా లు


1. ఆంధ్రప్రదేశ్‌లో కమ్యూనిష్టు ఉద్యమ చరిత్ర మొదటి భాగం, 37 వ పేజి
2. జూలై 1985, కమ్యూనిజం
3. ధామిశెట్టి పార్థసారధి సమాచార పత్రం
4. చిట్లూరి ప్రభాకర చౌదరి ఇంటర్యూ
5. ఎస్.వి. రత్నం ఇంటర్యూ
6. 12.1.38 నవశక్తి, 13 వ పేజీ
7. 12.10.38 నవశక్తి ఎ, 17 వ పేజీ
8. 12.7.39. నవశక్తి 12 వ పేజీ
9. 1940 సంవత్సరా మద్రాసు ప్రభుత్వ నివేదికల నుండి
10. 1940 జనవరి 24, ఆంధ్రపత్రిక, 2వ పేజీ
11. 1940, జనవరి, కమ్యూనిస్టు
12. చిట్టూరి ప్రభాకర రావు చౌదరి. ఇంటర్యూ.

# పశ్చిమ గోదావరి జిల్లాలో కమ్యూనిస్టు పార్టీ నిర్మాణం

ఆంధ్ర ప్రాంతంలో మొదటి దశలోని నిర్మాణయుతమైన కమ్యూనిస్టు పార్టీ ఏర్పడిన జిల్లాలలో పశ్చిమ గోదావరి జిల్లా ఒకటి 1932 కాంగ్రెస్ శాసన ఉల్లంఘన ఉద్యమంలో పాల్గొని రాజమండ్రి తిరుచునాపల్లి జైళ్లకు వెళ్ళిన గారపాటి సత్యనారాయణ, తనికెళ్ళ చలపతి, ఉద్దరాజురామం, వంకినేని సత్య నారాయణ మొదలగు వారికి అక్కడ నిర్బంధించబడియున్న లాహోర్ కుట్ర కేసు ముద్దాయిలు బెంగాల్ ప్రిజనర్స్‌తో పరిచయం ఏర్పడింది. వీరి ద్వారా రష్యా విప్లవం గురించి, మార్క్సిజం గురించి తెలుసుకొన్నారు.[1] 1933 మే, జూన్ నెలలో అతివాద భావాలతోనూ, మార్క్సిస్టు ప్రాథమిక పరిజ్ఞానంతోనూ వీరు జైళ్ల నుండి బయటకు వచ్చారు.

జిల్లాలో పార్టీని నిర్మించేందుకు సుందరయ్యగారు 1933-34 లో జిల్లా అంతా విస్తృతంగా పర్యటించారు. ఇందులో భాగంగానే తనికెళ్ళ వెంకట చలపతిని, గారపాటి సత్యనారాయణను కలుసుకొని చర్చలు జరిపి కొంత మార్క్సిస్టు సాహిత్యాన్ని అందించారు.[2] ఇదే పనిమీద ఉద్దరాజు రామంను కంభంపాటి సత్యనారాయణ 1934 లో కలుసుకున్నారు.[3]

అతివాద భావాలు కల్గిన కలిదిండి సుబ్రమణ్య రాజుకు బెనారస్ విద్యార్థి కాట్రగడ్డ నారాయణరావుగారి ద్వారా మార్క్సిస్టు సాహిత్యం అందేది. మార్క్సిస్టు సాహిత్య పంపిణీకి ఏలూరులోని గారపాటి సత్యనారాయణ నడిచేస్తున్న ఖద్దరు షాపు ఒక కేంద్రంగా ఉండేది. ఇక్కడ నుంచి జిల్లాలోని ఇతర వ్యక్తులకు మార్క్సిస్టు సాహిత్యాన్ని ఆయన అందించేవారు.

మార్క్సిస్టు భావాలు కల్గిన ఈ యువకులంతా 1934 భీమవరంలో సమావేశమయ్యారు. ఈ సమావేశానికి సుందరయ్యగారు కూడా హాజరయ్యారు. ఈ సమావేశ ఫలితంగా పశ్చిమ గోదావరి జిల్లాలో మొట్టమొదటి కమ్యూనిస్టు యూనిట్ 1934 ప్రథమ భాగంలో భీమవరంలో ఏర్పాటైంది. ఈ యూనిట్‌లో గారపాటి సత్యనారాయణ, ఉద్దరాజు రామం, కలిదిండి సుబ్రహ్మణ్యం, తనికెళ్ళ వెంకట చలపతి, అల్లూరి సత్యనారాయణ ఉన్నారు.

ఈ యూనిట్‌కి కలిదండి సుబ్రహ్మణ్య రాజు కార్యదర్శిగా వున్నారు.[4] ఇది జిల్లా ఆర్గనైజింగు యూనిట్‌గా పని చేసింది. జిల్లాలోని వివిధ తాలూకాలలో కమ్యూనిస్టు పార్టీ సెల్స్ ఏర్పడటానికి ఈ యూనిట్ లోని సభ్యులు కృషి చేశారు.

క్రమంగా 1935 చివరికి యండగండి, వాలమర్రు, ఏలేటిపాడు,ఏలూరు, పొలమూరు గ్రామాలలో పార్టీ సెల్స్ ఏర్పడ్డాయి.

ఏలూరులో కడుపు రామున్న, వంకినేని సత్యనారాయణ, తాడి అప్పల స్వామి, బనిసెట్టి అప్పారావు, కరణం సింహాచలం, లంకా జోగారావు, విభూతి రాఘవయ్య మొదలైనవారితో కలిసి గారపాటి సత్యనారాయణ పట్టణంలోని వివిధ కార్మికులను సంఘటితం చేసి కార్మిక సంఘాలను స్థాపించారు. జూట్ వర్కర్స్ యూనియన్, ప్రెస్ వర్కర్స్ యూనియన్, తోళ్ళ కార్మికుల యూనియన్. మున్సిపల్ వర్కర్స్ యూనియన్ మొదలగు సంఘాల ద్వారా కార్మిక సమస్యలపైన పని చేశారు. వీరందరి కృషి మూలంగా "1936 ఫిబ్రవరి 4 న ఏలూరు కూలీ రక్షణ సమితి స్థాపించబడింది. దీని అధ్యక్షులు గారపాటి సత్యనారాయణ, కార్యదర్శి తాడి అప్పలసామి, ఇదే విధంగా భీమవరంలో కూడా కూలి రక్షణ సమితి 1936 ఫిబ్రవరిలో స్థాపించబడింది. దీని అధ్యక్షులు తనికెళ్ళ వెంకటచలపతి, కార్యదర్శి అల్లూరి సత్యనారాయణ, సభ్యులుగా ఉద్ధరాజు రామం ఉన్నారు." "వీరితోపాటు కొండేపూడి లక్ష్మీనారాయణ 1936 లో ప్రెస్ వర్కర్స్ యూనియన్ కార్యకలాపాలను నిర్వహిస్తూ ఏలూరులో వుండేవారు. కార్మిక సమస్యలతోపాటుగా మార్క్సిస్టు సాహిత్య ప్రచురణ, యువజన సంఘాల స్థాపన, హిందీ విద్యాలయాల నిర్వహణ మొదలైన కార్యక్రమాలను కూడా కమ్యూనిస్టులు చేపట్టారు. "సామ్యవాద సిద్ధాంతం, కమ్యూనిస్టు ప్రణాళిక, సామ్రాజ్యవాదం అనే పుస్తకాలను ఏలూరులోని పాండురంగా ప్రెస్‌లో 1000 కాపీలు ప్రచురించి రాష్ట్రం అంతటా పంపిణీ చేశారు.''

వామపక్ష భావాలు కల్గిన యువకులను సమిన్వయపరచి, మార్క్సిస్టు భావాలవైపు మళ్ళించేందుకు, గ్రామాలలో యువజన సంఘాలను స్థాపించారు. 1935-36 సంవత్సరంలో తోలేరు, నవుడూరు, కోరుకల్లు, విస్సాకోడేరు, యండగండి గ్రామాలలో గ్రంథాలయాలు, యువజన సంఘాలు, హిందీ విద్యాలయాలను స్థాపించారు. ఈ విధంగా వివిధ రంగాలలో పనిచేస్తూ కమ్యూనిస్టు కార్యక్రమాలను అంగీకరించినవారితో జిల్లాలో కమ్యూనిస్టుపార్టీ సెల్లులు నిర్మాణమయ్యాయి.బెనారస్ విశ్వవిద్యాలయంలో విద్యార్థిగా ఉన్న యాళ్ళబండి పోలిసెట్టి అక్కడి కమ్యూనిస్టు స్టడీ సర్కిల్ కార్యక్రమాలలో పాల్గొని కమ్యూనిస్టు భావా

లతో 1935 లో పశ్చిమ గోదావరి జిల్లాకు వచ్చారు. యువజన సంఘాల నిర్మాణానికి, పార్టీ అభివృద్ధికి ఆయన కృషి చేశారు

1939 సంవత్సరానికి పశ్చిమ గోదావరి జిల్లాలోని ఏర్పడిన కొన్ని సెల్స్ వివరాలు :-

జిన్నూరు :- ఉద్ధరాజు రామం, ఉద్ధరాజు సూరపరాజు, కోసూరు సుబ్బరాజు
పొలమూరు :- కలిదిండి సుబ్రహ్మణ్యం, యాళ్ళబండ రంగనాయకులు
నౌడూరు :- పోలిసెట్టి
ఏలూరు :- గారపాటి సత్యనారాయణ, వంకినేని సత్యనారాయణ, కడుపు రాములు, బనిసెట్టి అప్పారావు, తాడి అప్పలసామి
వెంప :- కలిదిండి బంగార్రాజు
భీమవరం :- తనికెళ్ళ వెంకట చలపతి, కృత్తివెంటి వెంకటేశ్వర రావు
ఏలేటిపాడు :- ఇవటూరి వీరభద్రరావు

1936 చివరి నాటికి భీమవరం, తణుకు, నర్సాపురం, ఏలూరు, తాలూకాలలో యువజన సంఘాలు ఏర్పడ్డాయి. ఈ యువజన సంఘాల ద్వారా పగలు గ్రామలలో సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రచారం, రాత్రిపూట బహిరంగ సభలు, నిర్వహించడం మొదలైన కార్యక్రమాలు చేపట్టారు. ఈ విధంగా యువజన సంఘ కార్యక్రమాలలో పాల్గొని 1937 లో సంకు అప్పారావు, దాట్ల సూర్యనారాయణ రాజు, ప్రేరేపు మృత్యుంజయుడు పార్టీ సభ్యులయ్యారు.

జిల్లాలో యువజన సంఘ కార్యకలాపాలను సమన్వయ పరచుకుని విస్తృత పరిచేందుకు 1936 ప్రారంభంలో భీమవరంలోనూ, 1936 చివరిలో ఆచంటలోనూ, జిల్లా యువజన మహాసభలను నిర్వహించారు. భీమవరం మహాసభలో గారపాటి సత్యనారాయణ, అల్లూరి సత్యనారాయణ అధ్యక్ష కార్యదర్శులుగా ఎన్నికయ్యారు.

హిందీ విద్యాలయాల ద్వారా పెరిగిన పార్టీ పరిచయాలలో నెక్కలపూడి రామారావు, గారపాటి సత్యనారాయణ గారి పరిచయంద్వారా అన్నే వెంకటేశ్వర రావు, ప్రేరేపు మృత్యుంజయుడు ద్వారా నెక్కంటి నరసింహారావు యువజన సంఘ కార్యకలాపాలలో పాల్గొని 1938 నాటికి పార్టీ సభ్యులయ్యారు.

కార్మిక, యువజన సంఘాలను ఆర్గనైజ్ చేయడంతో పాటుగా 1937 నుండి వ్యవసాయ కూలీ, రైతు సంఘాలలో కూడా కమ్యూనిస్టులు విశ్లేషించి కృషి చేసారు. 1937 నాటికి జిల్లాలోని భీమవరం, నర్సాపురం, ఏలూరు, తణుకు తాలూకాల రైతు సంఘాలు, జిల్లా రైతు సంఘ నిర్మాణం జరిగింది. ఈ సంఘాలన్నిటి లోనూ కాంగ్రెసు వాదులు కమ్యూనిస్టు పార్టీ సభ్యులు ప్రధానంగా

పనిచేసారు. కమ్యూనిస్టుల కృషి మూలంగా పొలమూరు, పోడూరు, ఆచంట, కరుగోలు మిల్లి గ్రామాలలో 1938 నాటికి వ్యవసాయ కూలీ సంఘాలు ఏర్ప డ్డాయి. 1938 నాటికి జిల్లా మొత్తం మీద కమ్యూనిస్టు పార్టీ సభ్యులు సంఖ్య 25 కి పెరిగింది.[15] 1938 లో అనారోగ్య కారణాలవల్ల కలిదిండి సుబ్రహ్మణ్య రాజు జిల్లా పార్టీ కార్యదర్శి పదవి నుంచి తప్పుకున్నారు. అప్పుడు కార్యదర్శిగా ఉద్ధరాజు రామం బాధ్యతలు స్వీకరించారు [16]

కమ్యూనిస్టు పార్టీ అనుసరించిన ఐక్య సంఘటనా ఎత్తుగడల ఫలితంగా 1938 నాటికి నర్సాపురం తాలూకా, భీమవరం తాలూకా కాంగ్రెస్ కమిటీలు పూర్తిగా కమ్యూనిస్టుల అధీనంలోకి వచ్చాయి. నర్సాపురం తాలూకా కాంగ్రెస్ అధ్యక్ష కార్యదర్శులుగా ఉద్ధరాజు రామం, ఉద్ధరాజు నారపరాజులు ఎన్నిక అయ్యారు. ఇదే విధంగా భీమవరం తాలూకా కాంగ్రెసు కమిటీ కార్యదర్శిగా గొట్టుముక్కల వెంకట్రామరాజు, సంయుక్త కార్యదర్శిగా కృత్తివెంటి వెంకటేశ్వరరావు ఉన్నారు. జిల్లా కాంగ్రెసు సంఘ అధ్యక్షులుగా, కార్యదర్శులుగా గారపాటి సత్యనారాయణ, అల్లూరి సత్యనారాయణ ఉన్నారు.

ఐక్య సంఘటన ఎత్తుగడల ననుసరించి పార్టీ కార్యకర్తలు విస్తృతంగా పనిచేసేందుకు పార్టీని అభివృద్ధిపరిచేందుకు చాలా అవకాశాలు ఏర్పడ్డాయి. 1938-39 మధ్య కాలంలో పార్టీ జిల్లాలోని అన్ని తాలూకాలకు విస్తరించింది. 1938 చివరి నాటికి భీమవరం తాలూకాలో 15 పార్టీ యూనిట్లు ఏర్పడ్డాయి. వీరవాసరం, మెంటేపూడి, కాళ్లకూరు, వేండ్ర, గొల్లల కోడూరు, గరగపర్రు, చిలకూరు, పొలమూరు మొదలగు గ్రామాలలో పార్టీ సెల్సు ఏర్పడ్డాయి. ఈ కాలంలోనే భీమవరం తాలూకా మెంటేపూడి కౌలు రైతుల పోరాటాన్ని కమ్యూ నిస్టులు నడిపారు. చుట్టుప్రక్కల గ్రామాల్లో ఈ పోరాటం పెద్ద ప్రభావం కలిగిం చింది. కౌలు రేట్లు తగ్గించడం జరిగింది.

నర్సాపురం తాలూకాలో కూడా 1938 - 39 మధ్య కాలంలో పార్టీ అభివృద్ధి చెంది బలమైన యూనిట్లు ఏర్పడ్డాయి. పండిత వెల్లూరు, చిన్నమల్లం, ఆచంట, ఊలపర్రు, పోడూరు, లక్షణేశ్వరం, చించినాడ, చింతపర్రు మొదలగు గ్రామాలలో పార్టీ సెల్సు ఏర్పడ్డాయి. కరుగోలు మిల్లి గ్రామంలో వ్యవసాయ కూలీల సమస్యపై ఉద్యమాన్ని నిర్వహించారు. 1940 సంవత్సరంలో నర్సాపురం తాలూకాలో పెద్ద ఎత్తున వ్యవసాయ కూలీల సమ్మెలు నిర్వహించారు వ్యవసాయ కూలీలను సమ్మెకు ప్రోత్సహిస్తున్నారనే నెపంతో కోసూరి సుబ్బరాజు, పెక్కలపూడి రామరావు, పడాల వెంకట సుబ్బారావులను అరెస్టు చేసారు. కాని కోర్టుతో తగినన్ని సాక్షాధారాలు లేనందువల్ల 1940 నవంబరులో వారిని విడుదల చేసారు.[7]

1939 సంవత్సరంలో చరిత్రాత్మకమైన కాళిపట్నం రైతుల పోరాటం కమ్యూనిస్టు కార్యకర్తల నాయకత్వంలో నిర్వహించబడింది.

తాడేపల్లి గూడెం తాలుకాలో మొట్ట మొదటి సెల్లు 1939 లో ఏర్పాటైంది. కేశవరంలో ఏర్పడిన ఈ సెల్లులో ఇందుకూరి సుబ్బారాజు, కందికొండ బుల్లి రాజు, దండు సూరపరాజు, దండు సుబ్బరాజు, లచ్చిరెడ్డి, సన్యాసిరావు, అశ్వనీ కుమార్, దత్తు ఉన్నారు.[8] క్రమంగా దండగర్ర, గణపవరం, నిడమర్రు, పత్తేపురం, పెదనింద్రకోలను, పెంటపాడులలో సెల్సు ఏర్పడ్డాయి.

ఎస్ ఆనందరావు ఆర్గనైజరుగా ఉన్న తణుకు తాలుకాలో 1939-40 మధ్య కాలంలో పార్టీ సెల్సు నిర్మాణం, యుద్ధ వ్యతిరేక ప్రచారం, స్వతంత్ర్య భారత్ పంపకం చురుకుగా సాగింది. 1940-41 సంవత్సరానికి ఐతంపూడి, ఇలపర్రు, మార్టేరు, మల్లేశ్వరం, మల్లిపూడి, తూర్పు విప్పర్ర, వేలవెన్ను, ఆలమూరు, తాపలూరు, కంచుమర్రు, ఏలేటిపాడు మొదలగు గ్రామాలలో పటిష్టమైన పార్టీ సెల్సు ఏర్పడి పనిచేస్తున్నాయి. విద్యార్థి ఉద్యమం ద్వారా వంకా సత్యనారాయణ 1941 లో పార్టీ సభ్యులుగా రిక్రూట్ కాబడ్డారు. ఈయనతో పాటుగా, "ప్రత్తివాడ నరసింహమూర్తి, మత్రి రాములు, నాసర సూర్యారావు, బుద్ధాని తుమ్మన్న పార్టీ సెల్ సభ్యులు. ఈ సెల్ కార్యదర్శిగా మహ్మద్ అన్సారీ ఉన్నారు "[9]

ఏలూరు తాలుకాలో 1939-40 నాటికి వ్యవసాయ కూలీ సంఘాల ఏర్పాటుతో పాటుగా, పార్టీ నిర్మాణం కూడా పెరిగింది. ఏలూరు చుట్టుప్రక్కల గ్రామాలైన పెదపాడు, పాలగూడెం, నాయుడుగూడెం, దెందులూరు, కాట్లంపూడి, పోతునూరు మొదలైన గ్రామాలలో పార్టీ సెల్సు ఏర్పడ్డాయి. వ్యవసాయ కూలీ సంఘాలలో పనిచేస్తూ కోంద్రు సుబ్బారావు, నేతల పోతరాజు 1940 లో పార్టీ సభ్యులయ్యారు. కమ్యూనిస్టు నాయకత్వంలో ఏలూరు జూట్‌మిల్లు కార్మికులు వేతన సమస్యపై 1940 లో 6 నెలల పాటు సమ్మె నడిపారు.

చింతలపూడి తాలుకాలో కమ్యూనిస్టు పార్టీ నిర్మాణం మిగిలిన తాలుకాలలో పోల్చి చూస్తే ఆలస్యంగా ప్రారంభమైందని చెప్పవచ్చు. 1940 సంవత్సరంలో జిల్లా సెంటర్ నుండి ఈడ్పుగంగి పూర్ణచంద్రరావు, రంభా వెంకటప్పయ్య, సంకు అప్పారావు తరుచుగా చింతలపూడి వస్తూ అక్కడి యువకులతో సంబంధాలు పెంచుకున్నారు. కమ్యూనిస్టు పార్టీ రహస్యంగా ముద్రిస్తున్న "స్వతంత్ర్య భారత్" పత్రిక చింతలపూడి చుట్టుప్రక్కల గ్రామాలలోని యువకులకు అందించబడేవి. సామ్రాజ్యవాద యుద్ధ కాలంలో చింతలపూడి తాలుకా

బాధ్యత వహించి ఈడ్పుగంటి పూర్ణచంద్రరావు పార్టీ నిర్మాణానికి కృషిచేసారు. చింతలపూడి, ప్రగడవరం, ఎర్రగుంటపల్లి మొదలగు గ్రామాలలో సామ్రాజ్య వాద యుద్ధ వ్యతిరేక ప్రచారంతో పాటుగా కమ్యూనిస్టు సూత్రాలను కూడా రైతు యువకులలో ఎక్కువగా ప్రచారమయ్యాయి. ఈ కృషి మూలంగా 1941 సంవత్సరంలో చింతలపూడి తాలుకా మొట్టమొదటి కమ్యూనిస్టు సెల్ ఏర్పడింది. ఈ సెల్‌లో కంచెన కాశీ, మాదాసు వీరవెంకయ్య, మాదాసు శేషగిరి రావు, కారుమడి సత్యనారాయణ రెడ్డి, మొదలైనవారు సభ్యులుగా ఉన్నారు 20 క్రమంగా కమ్యూనిస్టు పార్టీ ప్రచారం విస్తృత మవడంతో 1942 లో ప్రగడ వరం గ్రామంలో మరో పార్టీ సెల్ ఏర్పడింది.

యుద్ధ వ్యతిరేక కార్యక్రమాలలోనూ, స్వతంత్రభారత్ పంపకంలోనూ జిల్లాలోని అన్ని తాలుకాలలో కమ్యూనిస్టు కార్యకర్తలు దీక్షతో పనిచేసారు. కమ్యూనిస్టు కార్యకర్తలతో పాటుగా కాంగ్రెసులోని అతివాదులు కూడా ఈ యుద్ధ వ్యతిరేక ప్రచారంలో ముమ్మరంగా పాల్గొన్నారు. జిల్లాలో యుద్ధ వ్యతి రేక ప్రచారం చేయడానికి ప్రత్యేకంగా ఒక దళాన్ని జిల్లా కాంగ్రెసు సంఘం నియమించింది యుద్ధ వ్యతిరేక ప్రచారం చేస్తున్న అల్లూరి సత్యనారాయణ, కలిదిండి బంగార్రాజు, కలిదిండి నారాయణరాజు, పేటేటి వెంకట రత్నం, తోలేటి పేర్రాజులను ప్రభుత్వం తీవ్ర హెచ్చరికలు చేసింది. ఏలూరు పట్టణంలో ప్రభాత భేరీలు మ్రోగించడం, వీధి మలుపులలో ప్రతి సాయంత్రం సమావేశాలు ఏర్పాటు చేయడం మొదలైన కార్యక్రమాల ద్వారా యుద్ధ వ్యతిరేక ప్రచారం సాగింది. వీటితోపాటు యుద్ధ వ్యతిరేక కరపత్రాలు పంచడం, పోస్టర్లు అంటిం చడం మొదలైన కార్యక్రమాలు గ్రామాలలో సహితం జరిగాయి. 1940 జనవరి 26 స్వాతంత్ర్యోత్సవ దిన సందర్భంగా ఏలూరు, పాలకొల్లు, భీమవరం, నర్సాపురం పట్టణాలు పూర్తిగా హర్తాళ్ సాటించారు. ఆరోజు సాయంత్రం ఏలూరు పట్టణంలో కార్మికులు విద్యార్థులు కలిసి ఒకపెద్ద ఊరేగింపును నిర్వహించి బహి రంగ సభను ఏర్పాటు చేసారు.[10]

ఈ యుద్ధ వ్యతిరేక ప్రచారంతో పాటుగా ప్రజాసమస్యలపై పార్టీ కార్య కర్తలు అనేక పోరాట కార్యక్రమాలు చేపట్టారు. ముఖ్యంగా వ్యవసాయ కార్మి కుల సమస్యలపై ఈ కాలంలో పార్టీ కేంద్రీకరించి పనిచేసింది.

వ్యవసాయ కార్మికులను సమీకరించి అనేకఆకలియాత్రలు నిర్వహించారు సామ్రాజ్యవాద యుద్ధ కాలంలో కమ్యూనిస్టు పార్టీ నిర్వహించిన ఆకలియాత్రలో వేల కొలది వ్యవసాయ కూలీలు పాల్గొన్నారు. 1940 సెప్టెంబరు 12 న నర్సాపురం తాలూకాలో జరిగిన ఆకలియాత్రలోనూ, అదే విధంగా అక్టోబరు

12 న భీమవరంలో జరిగిన ఆకలియాత్రలోనూ 10 వేల మందికి పైగా వ్యవసాయ కూలీలు పాల్గొన్నారు.[11]

తిండి, పని కల్పించండి, అని నినాదాలు చేస్తూ అరుణ పతాకాలతో మైళ్ళ పొడవున జరిగిన ఈ యాత్రలు ప్రభుత్వాధికారులకు ఆశ్చర్యం, భయం కల్గించాయి. ఏలూరు పట్టణంలో 1500 మంది కార్మికులు బ్లాక్ మార్కెట్‌ను అరికట్టాలి అని నినాదాలు చేస్తూ 1940 జనవరిలో కలెక్టర్ వద్దకు పెద్ద ఊరేగింపుగా వెళ్లారు.

తాడేపల్లి గూడెంలో జరిగిన ఆకలియాత్రకు 41 గ్రామాల నుండి 4 వేల మంది వ్యవసాయ కూలీలు హాజరయ్యారు. సంకు అప్పారావు, ఇంగుమూరి సుబ్బరాజు నాయకత్వంలో జరిగిన ఈ ఆకలియాత్ర తాలూకాలోని వ్యవసాయ కూలీలను చైతన్యవంతుల్ని చేసింది.

యుద్ధ వ్యతిరేక ప్రచారాన్ని దైనందిన సమస్యలతో మిళితం చేసి వ్యవసాయ కార్మికులను చైతన్యవంతుల్ని చేయడంలో ఈ ఆకలియాత్రలు మిక్కిలి ఉపయోగపడ్డాయి. ఎన్ని నిర్బంధాలు విధించినప్పటికీ కమ్యూనిస్టు కార్యకర్తల ప్రచారం నానాటికీ తీవ్రమవుతుండటం, ప్రజాందోళన రోజు రోజుకి పెరగడం ప్రభుత్వానికి కలవరపాటు కలిగించింది. కమ్యూనిస్టులను పూర్తిగా అణచివేయాలనే ఉద్దేశ్యంతో ప్రభుత్వం తీవ్ర నిర్బంధ విధానాన్ని అవలంభించింది.

ముఖ్య కమ్యూనిస్టు కార్యకర్తలను అరెస్టు చేసింది. 1940 నవంబరులో దాట్ల సూర్యనారాయణ రాజు, సంకు అప్పారావు, కలిదిండి సూర్యనారాయణ రాజు, ఉద్ధరాజు రామం, ప్రేరేపు మృత్యుంజయుడు, కోసూరి సుబ్బరాజు, వంకినేని సత్యనారాయణ, అన్నె వెంకటేశ్వరరావు మొదలైన వారిని డిటెయిన్ చేయటానికి ఆజ్ఞలు జారీ చేసింది. అప్పటికే 1940 జూలైలో గారపాటి సత్యనారాయణ, కలిదిండి బంగార్రాజులను అరెస్టు చేసి వెల్లూరు జైలులో డిటెయిన్ చేసారు. ఇదే విధంగా కడుపు రాములు, దండుపాటి మాణిక్యాలరావులను కూడా 1940 జూలైలో ప్రాసిక్యూట్ చేసి కారాగార శిక్ష విధించారు.[12]

అరెస్టు కాకుండా రహస్య జీవితం గడుపుతున్న సంకు అప్పారావు, దాట్ల సూర్యనారాయణ రాజు, మృత్యుంజయుడు, ఉద్ధరాజు రామంలను ఏదో విధంగా పట్టుకోవాలన్న కక్షతో వారి ఆస్తులను జప్తు చేస్తూ 1941 లో ప్రభుత్వం ఆజ్ఞలు జారీ చేసింది. అయినప్పటికి వారు రహస్యంగానే వుంటూ యుద్ధ వ్యతిరేక ప్రచారాన్ని కొనసాగించారు.

సామ్రాజ్య వాద యుద్ధ కాలంలో ప్రజా ఉద్యమ నిర్మాణంతో పాటుగా కార్యకర్తలకు సిద్ధాంత పరంగా శిక్షణ ఇవ్వటానికి పశ్చిమ గోదావరి జిల్లాలో స్థానికంగా కొన్ని రాజకీయ పాఠశాలలను నిర్వహించారు. అటువంటి పాఠశాలలో అచంట ఫిర్కాలో జరిగిన రాజకీయ పాఠశాల ప్రధానమైంది. అచంట ఫిర్కాలో గోదావరి ఒడ్డున చినమల్లం, పెదమల్లం గ్రామాలకు చేరువులో 15 రోజుల పాటు ఈ పాఠశాలను నిర్వహించారు.

ఈ పాఠశాలకు హాజరైన వారికి సిద్ధాంత బోధనతో పాటుగా మిలిటరీ శిక్షణ కూడా ఇచ్చారు. ఈ పాఠశాలకు యువకులతోపాటు మధ్య వయస్సు కల్గిన దేశ భక్తులు, అతివాదులు, కమ్యూనిస్టు భావాలు కల్గిన కార్యకర్తలు సుమారు 60, 70 మంది హాజరయ్యారు. ఈ పాఠశాల ప్రిన్సిపాల్‌గా అల్లూరి సత్యనారాయణ రాజు బాధ్యత వహించారు కాని జిన్నూరులోనే ఆయన డిటెయిన్ చేయబడటంతో ప్రేరేపు మృత్యుంజయుడు పాఠశాల ప్రిన్సిపాలుగా బాధ్యత వహించారు. పాఠశాల ఆఖరు రోజున విద్యార్థులంతా ఖాకీ దుస్తులు ధరించి అచంట గ్రామంలో మిలిటరీ కవాతు చేస్తూ అన్ని వీధులు గుండా ప్రదర్శనగా తిరిగారు. ఇది ప్రజలలో పెద్ద సంచలనాన్ని కల్గించింది. ఈ పాఠశాల నిర్వహణకు పేద ప్రజలు డబ్బు, బియ్యం, కూరగాయలు ఇచ్చి ఎంతో సహాయపడ్డారు

దీనికి ముందుగా యండగండిలో రాజకీయ పాఠశాల, వలంటీర్ శిక్షణా శిబిరాన్ని నిర్వహించారు. యుద్ధకాలంలో ప్రభుత్వ నిర్బంధం తీవ్రమపడంతో స్థానికంగా కార్యకర్తలకు సిద్ధాంత బోధన చేసేందుకు కొన్ని రాజకీయ పాఠశాలలను రహస్యంగా నిర్వహించారు. పార్టీపై నిషేధం పూర్తిగా తొలగక ముందు 1942 లో మద్దుకూరి చంద్రశేఖరరావు ఒక రహస్య రాజకీయ పాఠశాలను దండగర్రలో నిర్వహించారు. సిద్ధాంత బోధన కోసం రహస్యంగా నిర్వహించన ఈ పాఠశాలకు 10 మంది విద్యార్థులు హాజరయ్యారు.

1941 - 42 కాలంలో విద్యార్థి సంఘ కార్యక్రమాలు విస్తృతిమై విద్యార్థి ఉద్యమం నుండి అనేకమంది చురుకైన పార్టీ కార్యకర్తలుగా ముందుకు వచ్చారు.

1941 జూన్‌లో తూర్పు గోదావరి జిల్లా నుండి పశ్చిమ గోదావరి జిల్లాకు వచ్చిన పరకాల పట్టాభి రామారావు అజ్ఞాతవాసంలో వుంటూ జిల్లా విద్యార్థి సంఘ ఆర్గనైజరుగా బాధ్యతలు స్వీకరించి, జిల్లాలోని అన్ని హైస్కూళ్ళలో విద్యార్థి సంఘాలను నిర్మించారు

ఇదే సమయంలో విద్యార్థి ఉద్యమం నుండి మార్నెళ్ల నరసింహారావు, వంకా సత్యనారాయణ, కోయ బాపిరాజు, భూపతిరాజు సుబ్బరాజు వంటి కార్యకర్తలు పార్టీ సభ్యులుగా వచ్చారు. ఇదే సమయంలో తూర్పుగోదావరి జిల్లాలో పార్టీ కార్య

కర్తగా వున్న అత్తులూరి సర్వేశ్వరరావు కూడా జిల్లాకువచ్చి ఇతర పార్టీ బాధ్యతలు స్వీకరించారు. భీమవరం, ఏలూరు, నర్సాపురం, తణుకు, పాలకొల్లు, మార్టేరు మొదలైన చోట్ల బలమైన విద్యార్థి ఉద్యమం నిర్మించబడింది. జిల్లాలోని ప్రతి హైస్కూలులోనూ ఒక ఆగ్జిలరీ పార్టీ యూనిట్ ఏర్పడింది. విద్యార్థులలో కమ్యూనిస్టు పార్టీ ప్రభావం క్రమక్రమంగా పెరగడం గమనించిన ప్రభుత్వం 1942 లో జిల్లా స్టూడెంటు ఫెడరేషన్‌ని నిషేధించింది. అయినా విద్యార్థులు కల్చరల్ క్లబ్‌ల పేరిట బహిరంగంగా ఉద్యమాన్ని సాగించారు జిల్లా విద్యార్థి కల్చరల్ దళాన్ని ఏర్పరచి తమ ప్రచారాన్ని కొనసాగించారు. ఈ కల్చరల్ దళం ఫాసిస్టు వ్యతిరేక ప్రచారమే చేస్తున్నా ప్రభుత్వం దానిని కమ్యూనిస్టు ప్రచారంగా భావించింది. 1942 మే లో ఎండగండిలో ప్రచారం చేస్తున్న కల్చరల్ దళ సభ్యులను అరెస్టు చేసి శిక్ష విధించింది.

1942 నుండి ప్రజా యుద్ధ నినాదంలో కమ్యూనిస్టు పార్టీ పని చేస్తున్నా, జైళ్ళలో నిర్బంధితులైన వారందరినీ మాత్రం ప్రభుత్వం విడుదల చేయ లేదు. పైపెచ్చు విడుదలై వచ్చిన వారిని ఏదో ఒక నెపంతో మరలా అరెస్టు చేయసాగింది క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంగా జరిగిన అల్లరులలో కూడా కమ్యూనిస్టు కార్యకర్తలను ఇరికించి జైళ్ళ పాలు చేసింది. నెక్కలపూడి రామారావు, మైలవరపు రామారావు, పడాల సుబ్బారావు, నెక్కంటి నరసింహారావులపై టెలిగ్రాఫ్ తీగలు తెంచారని నేరం ఆరోపించి 1942 సెప్టెంబరులో అరెస్టుచేసింది. రెండున్నర సంవత్సరాల జైలు శిక్షను, 20 కొరడా దెబ్బలను శిక్షగా విధించారు.

ప్రభుత్వ నిర్బంధ విధానం కొనసాగుతున్నా కమ్యూనిస్టు కార్యకర్తలు ప్రజాయుద్ధ నినాదాన్ని చిత్తశుద్ధితో అమలు జరిపారు. ఫాసిస్టు వ్యతిరేక శిబిరాలు నెలకొల్పి ప్రజలకు ఆత్మ రక్షణోపాయాలను నేర్పారు. ఏలూరు సమీపంలోని పెదపాడు గ్రామంలో 20 రోజులపాటు ఒక ఫాసిస్టు వ్యతిరేక శిబిరాన్ని 1942 ఆగస్టులో నిర్వహించారు. ఈ శిబిరానికి 50 మంది హాజరయ్యారు. '1942 చివరి నాటికి ఏలూరులో బుర్రకథం దళం, వైజ్ఞానిక దళం ఏర్పడ్డాయి. గ్రామాలలో మీటింగులు పెట్టడం, పట్టణాలలో వీధి మలుపుల వద్ద సమావేశాలు ఏర్పరచడం, మేడ మైకుల ద్వారా ప్రజాయుద్ధ నినాదాలు ఇవ్వడం మొదలగు కార్యక్రమాల ద్వారా ప్రజా యుద్ధ పాలసీని ప్రజలలో విస్తృత ప్రచారం చేసారు.

ప్రజా యుద్ధ పాలసీని వివరిస్తూ వంద మంది కార్యకర్తలు సైకిళ్ళపై భీమవరం నర్సాపురం, తణుకు తాలుకాలు పర్యటించి విస్తృత ప్రచారం చేసారు. వీర వాసరంలో జరిగిన జిల్లా ఫాసిస్టు వ్యతిరేక మహా సభకు 2000 మందికి పైగా హాజరయ్యారు.

1942-43 కాలంలో పార్టీ నిర్మాణం విస్తృత స్థాయిలో పెరిగింది. దీనితోపాటుగా ప్రజా సంఘాల నిర్మాణం కూడా పెరిగింది. 1943 జూలైలో జిల్లా మహాసభ జరిగేనాటికి జిల్లా మొత్తం మీద 300 మంది పార్టీ సభ్యులు 42 మంది హోల్ టైమర్లు ఉన్నారు[13] రైతు సంఘం మొదలుకొని బాల సంఘం వరకు అన్ని ప్రజా సంఘాలు పూర్తిగా నిర్మాణం రూపం తీసుకున్నాయి. 316 మంది సభ్యులతో కూడిన ప్రజా రక్షక దళాలు 7 గ్రామాలలో ఏర్పాటయ్యాయి. జిల్లాలో పార్టీ నిర్మాణాన్ని సంఘటిత పరచి ముందుకు తీసుకుపోవడానికి 1943 జూలై 1, 2. 3 తేదీలలో జిల్లా పార్టీ మహా సభను నిర్వహించారు. ఈ మహా సభలో యాళ్ళబండి పోలిశెట్టి కార్యదర్శిగా, ఈడ్పుగంటి పూర్ణచంద్ర రావు, పరకాల పట్టాభి రామారావు, వేములపల్లి హనుమంతరావు, వరికొండ వెంకట సుబ్రమణ్య శర్మ, సభ్యులుగా, అన్నే వెంకటేశ్వర రావు, నర్రా ఆంజనేయులు కాండడేట్ సభ్యులుగా నూతన జిల్లా కమిటీ ఎన్నుకోబడింది.

1936-42 కాలంలో పశ్చిమగోదావరి జిల్లాలో కమ్యూనిస్టు ఉద్యమానికి, ప్రజా సంఘాల నిర్మాణానికి కమ్యూనిస్టుపార్టీ సభ్యులు కానివారు కూడా అనేక మంది తోడ్పడ్డారు. అటువంటి వారిలో కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి ముఖ్యులు.

పశ్చిమగోదావరి జిల్లా కమ్యూనిస్టు ఉద్యమ చరిత్రలో 1936-40 మధ్య కాలంలో కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తికి ఒక ప్రత్యేకమైన స్థానం ఉంది. ఈయన టెక్నికల్‌గా పార్టీ సభ్యుడు కాకపోయినప్పటికీ, జిల్లాలో 1936-37 సంవత్సరాలలో జిల్లా రైతు సంఘాధ్యక్షులుగా, కాంగ్రెసు సంఘ ముఖ్య బాధ్యుడుగా-కమ్యూనిస్టులు ప్రతిపాదించిన ప్రతి అంశాన్ని బలపరుస్తూ రైతు ఉద్యమంలో వామపక్ష శక్తులు బలపడేందుకు కృషి చేశారు.

## ఆధారాలు


1. గారపాటి సత్యనారాయణ ఇంటర్వ్యూ.
2. గారపాటి సత్యనారాయణ, తనికెళ్ల వెంకటాచలపతులతో ఇంటర్వ్యూ.
3. కామ్రేడ్ సుందరయ్యకు అరుణాంజలి, 87 వ పేజీ.
4. కలిదిండి సుబ్రమణ్యంతో ఇంటర్వ్యూ.
5. మద్రాసు రాష్ట్రంలో సోషలిస్టు సంస్థల గురించి ప్రభుత్వ మెమో నెం. యస్/45-1 హెచ్ - 36. తేదీ 30-5-36కి సమాధానంగా స్పెషల్ బ్రాంచి (సి.ఐ.డి) పోలీసు సూపర్నిడెంటు పంపిన సమాచారం.

6. ఉద్ధరాజు రామంతో ఇంటర్వ్యూ.
7. జి.ఓ. నెం. 47, పబ్లిక్ (జనరల్) డిపార్టుమెంటు, 8-1-41.
8. ఇందుకూరి సుబ్బరాజుతో ఇంటర్వ్యూ.
9. వంకా సత్యనారాయణతో ఇంటర్వ్యూ.
10. 1940, ఫిబ్రవరి కమ్యూనిస్టు 20 వ పేజీ.
11. 1940 డిసెంబరు, కమ్యూనిస్టు, 12 వ పేజీ.
12. మద్రాసు ప్రభుత్వ పక్ష నివేదికలు, 1940.
13. ఇందుకూరు సుబ్బరాజు ఇంటర్వ్యూ.
14. 14-7-43, ప్రజాశక్తి, 3 వ పేజీ.

# కృష్ణా జిల్లాలో కమ్యూనిస్టు పార్టీ నిర్మాణం

తొలిదశలోనే సుశిక్షితులైన కార్యకర్తలతో నిర్మాణయుతమైన కమ్యూనిస్టు పార్టీ ఏర్పడిన జిల్లాలలో కృష్ణా జిల్లా ప్రధానమైనది. 1930 దశకం నాటికే జాతీయ ఉద్యమానికి ఒక ప్రధాన కేంద్రంగా కృష్ణా జిల్లా రూపుదిద్దుకుంది. ఈ జాతీయోద్యమ ప్రభావం మూలంగా జిల్లాలోని విద్యార్థులు సామాన్య రైతులు స్వాతంత్ర్య పోరాట ప్రవాహంలోకి వచ్చారు. 1930-32 లలో ఉవ్వెత్తున లేచిన శాసనోల్లంఘన ఉద్యమం యువకులైన దేశభక్తులును ముందుకు ఉరికించింది. ఈ ఉద్యమాల ద్వారా బ్రిటిషు సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రజల్ని చైతన్యవంతుల్ని చేసిన అనేక మంది యువకులు శిక్షించబడి జైళ్ళకు పంపబడ్డారు.

భట్ల పెనుమర్రు కాంగ్రెసు వాలంటీరు శిబిరంలో పాల్గొని కల్లుదుకాణాలను పికెటింగు చేసినందుకు చలసాని జగన్నాథరావు, చలసాని ప్రకాశరావు, చలసాని నారాయణమూర్తి, వేలినేని భీమయ్య, చలసాని సీతారామయ్య మొదలైన వారు అరెస్టు గావింపబడి రాజమండ్రి, బళ్ళారి జైళ్ళకు పంపబడ్డారు [1]

అదేవిధంగా పెంట్రప్రగడ గ్రామంలో ఉంటూ రహస్య కరపత్రాలు, పత్రికలు ముద్రిస్తున్న మద్దుకూరి చంద్రశేఖరరావుకు రెండేళ్ళ కఠిన శిక్ష విధించి రాజమండ్రి జైలుకు పంపారు. తరువాత బళ్ళారి జైలుకు మార్చబడ్డారు.

కానూరి బలరామయ్యను శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొన్నందుకు ఒక సంవత్సరం కఠిన కారాగార శిక్ష విధించి 16-1-1933 నుండి రాజమండ్రి జైలులో నిర్బంధించారు. ఇదే విధంగా గద్దే లింగయ్యకు కఠిన శిక్షను విధించి 2-5-1932 నుండి ఆరు నెలల పాటు రాజమండ్రి కన్ననూరు జైళ్ళలో నిర్బంధించారు. నిషిద్ధ కరపత్రాలు పంచిపెడుతున్నారనే నేరం క్రింద కొసరాజు శేషయ్య గారికి 23-5-1932 నుండి కఠిన కారాగార శిక్ష విధించి రాజమండ్రి తిరుచునాపల్లి జైళ్ళకు పంపారు.[2]

ఈ విధంగా జైళ్ళలో నిర్బందించబడిన వారికి అక్కడి లాహోరు కుట్ర కేసు ముద్దాయిలతోనూ, బెంగాల్ విప్లవ కారులతోనూ పరిచయం ఏర్పడింది. వీరి పరిచయం మూలంగా సామ్యవాద సిద్ధాంతాల గురించి, సోవియట్ విప్లవం గురించి తెలుసుకోవడమే కాకుండా కొంత కమ్యూనిస్టు సాహిత్యాన్ని కూడా ఈ నిర్బందించబడిన యువకులు చదివారు. జైళ్ళలో కమ్యూనిస్టు భావాలను ఆకళింపు

చేసుకున్న యువకులంతా 1933 చివరినాటికి జైళ్ళ నుంచి విడుదల అయ్యారు. చలసాని జగన్నాథరావు జైలులో ఉన్న కాలంలో స్వగ్రామంలోని చలసాని వాసుదేవరావుకు సోషలిజం, సోవియట్ రష్యాల గురించి ఉత్తరాల ద్వారా తెలియచేస్తుండేవారు. వాటికి సంబంధించిన సాహిత్యం చదవమని ప్రోత్స హించడం జరిగింది. ఈ ప్రోత్సాహంతో కమ్యూనిస్టు సాహిత్యం పట్ల ఆసక్తి కల్గిన చలసాని వాసుదేవరావు గాంధీ - లెనిన్ అనే పుస్తకాన్ని స్వయంగా తెప్పించుకుని చదివి మార్క్సిజం - లెనినిజం పట్ల ఆసక్తిని పెంచుకున్నారు.

ఈ విధంగా జైళ్ళలో కమ్యూనిస్టు భావాలు ఆకళింపు చేసుకున్న యువకులు బయటనున్న వారిలో కూడా కమ్యూనిస్టు భావాలను పెంపొందించారు. వీరిలో సోషలిస్టు అవగాహనను పెంపొందించేందుకు కాట్రగడ్డ నారాయణరావు మరో విధంగా తోడ్పడ్డారు. బెనారస్ విశ్వ విద్యాలయ విద్యార్థిగా ఉన్న కాట్రగడ్డ నారాయరావు సోషలిస్టు సాహిత్యాన్ని తీసుకువచ్చి అనేకమంది యువకులకు అందించారు. అత్తగారి ఊరైన భట్ల పెనుమర్రు వస్తూ కొంత సోషలిస్టు సాహిత్యాన్ని, లెనిన్ గ్రంథాలను అక్కడి యువకులకు అందించేవారు. దాదాపుగా ఇదే సమయంలో కమ్యూనిస్టు పార్టీని నిర్మించేందుకు రాష్ట్రం అంతా పర్యటిస్తున్న పుచ్చలపల్లి సుందరయ్య, కొసరాజు శేషయ్యతోనూ, మద్దుకూరి చంద్రశేఖరరావు, చలసాని జగన్నాథరావులతో చర్చలు జరిపారు.

సుందరయ్య గారు ఇలా ఒక్కొక్కరినే కలుసుకుంటూ వారికి కమ్యూనిస్టు పంథాను వివరించారు. చర్చల అనంతరం వీరందరూ కమ్యూనిస్టు పార్టీలో సభ్యులుగా చేరారు. వీరందరిలో ముందుగా పార్టీలో చేరింది, మద్దుకూరి చంద్రశేఖరరావు.[4]

ఈ చర్యలన్నిటి పర్యవసానమే 1934 మే లో జరిగిన కల్లూపూడి సమావేశం. మద్దుకూరి చంద్రశేఖరరావు, కొసరాజు శేషయ్య, చలసాని జగనాన్నాథరావు, కాట్రగడ్డ నారాయణరావు, చలసాని వాసుదేవరావు, సూదపనేని గోపాల కృష్ణయ్య ఈ సమావేశానికి హాజరయ్యారు. తెలుగులో కమ్యూనిస్టు ప్రణాళిక, కూలిపని - పెట్టుబడి వగైరా పుస్తకాలని అనువదించాలని, పట్టణ కార్మికుల్లోను, వ్యవసాయ కార్మికుల్లోను కేంద్రీకరించి పని చేయాలని ఈ సమాశంలో నిర్ణయించుకున్నారు.

ఈ సమావేశానికి హాజరైన వారిలో కాట్రగడ్డ నారాయణరావుగారు తప్ప మిగిలిన వారంతా పార్టీ సభ్యులే. ఈ సమావేశంలో కొసరాజు శేషయ్యగారు కార్యదర్శిగా జిల్లా ఆర్గనైజింగు కమిటీ ఏర్పాటు చేయబడింది.

కాంగ్రెసులోని అతివాదులను సమన్వయపరచుకొని, వారిలో సామ్యవాద భావాలను పెంపొందించి, బ్రిటీషు సామ్రాజ్యవాదులపై పోరాటాన్ని తీవ్రతరం చేయటానికి కమ్యూనిస్టులు పూనుకున్నారు.

కృష్ణా జిల్లాలోని కమ్యూనిస్టు యువకులు జిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ నిర్మాణానికి పూనుకున్నారు. 1934 జూలై 10 న ఏర్పాటైన జిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో కమ్యూనిస్టులే ప్రధాన పాత్ర వహించారు. అధ్యక్షుడిగా గద్దె లింగయ్య, కార్యదర్శులుగా వి. రామబ్రహ్మం, వెల్లంకి పూర్ణ చంద్రయ్య, కమిటీ సభ్యులుగా చలసాని జగన్నాథరావు, మద్దుకూరి చంద్రశేఖర రావు, అన్నే అంజయ్య, పల్లఖనేని వెంకట్రావు, కొసరాజు శేషయ్య, పోచరాజు కృష్ణారావు వున్నారు.

కాంగ్రెసు సోషలిస్టు పార్టీ తరపున 'లెనిన్ జీవితం' అనే గ్రంథాన్నికూడా తెలుగులో ముద్రించారు. దీనిని ప్రభుత్వం నిషేధించింది. అయితే కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో కమ్యూనిస్టులు ఎక్కువ కాలం పనిచేయలేదు. 1935 సంవత్సరం నుండి స్వతంత్రంగా కార్మిక సంఘ నిర్మాణానికి కమ్యూనిస్టులు పూనుకున్నారు. వీరి కృషి మూలంగా 1935 అక్టోబరు 10 న బెజవాడ కూలి రక్షణ సమితి స్థాపించబడింది. దీని కార్యదర్శిగా పిల్లలమర్రి వెంకటేశ్వర్లు, సభ్యులుగా కొసరాజు శేషయ్య, చలసాని వాసుదేవరావు, అల్లూరి సత్యనారాయణ కె. శ్రీనివాసరావు, మద్దుకూరి చంద్రశేఖర రావులు వున్నారు. ప్రెస్ వర్కర్సు యూనియన్ కూడా పునర్నిర్మించబడింది. దీనితో పాటుగా బెజవాడ మున్సిపల్ స్కావెంజర్సు యూనియన్ ఏర్పాటుకు కూడా ప్రయత్నాలు చేసారు.

అతివాద యువకులలో సామ్యవాద భావాలు పెంపొందించడంతో పాటుగా కార్మిక సంఘాల నిర్మాణాన్ని కొనసాగిస్తూ 1936 నాటికి పార్టీ సభ్యులనుకూడా కొంతమేరకు పెంచుకోవడం జరిగింది. 1936 నాటికి జిల్లా మొత్తం మీద 12 మంది దాకా పార్టీ సభ్యులున్నారు. వెంట్రప్రగడ, భట్లపెనమర్రు, విజయవాడ, బందరు దగ్గర చిట్టి గూడూరు సంస్కృత కళాశాలలను సెంటర్లుగా చేసుకుని ఈ కమ్యూనిస్టు కార్యకర్తలు పని చేసేవారు.[6] ఈ గ్రామాలలో ముగ్గురు సభ్యులుతో పార్టీ సెల్సు ఏర్పాడ్డాయి.

ఐక్య సంఘటనా ఎత్తుగడలు అనుసరిస్తున్న ఫలితంగా 1936 సంవత్సరం నుండి పార్టీ కార్యకర్తలు విస్తృతంగా పనిచేయడానికి అవకాశాలు ఏర్పడ్డాయి. కాంగ్రెసులోని అతివాదులను కలుపుకుని వివిధ ప్రజా సంఘాల నిర్మాణానికి కమ్యూనిస్టులు పూనుకున్నారు. 1937 మేలో జరిగిన కొత్త పట్నం రాజకీయ పాఠశాల యువకులలో మార్క్సిస్టు సిద్ధాంత అవగాహనను పెంపొందించింది.

కృష్ణాజిల్లా నుండి ఈ స్కూలుకు హాజరైన వారంతా చురుకైన కమ్యూనిస్టు కార్యకర్తలయ్యారు.

కొత్త పట్టణం స్కూలుకు హాజరైన కడియాల గోపాలరావు అటు తరువాత పార్టీ సభ్యులవ్వడమే కాకుండా జిల్లా యువజన సంఘ అధ్యక్షుడిగా బాధ్యత వహిస్తూ యువజనోద్యమాన్ని ముందుకు నడిపించారు. కొత్త పట్టణం స్కూలు తరువాత కాటూరు గ్రామంలో 40 రోజుల పాటు ఆ యువకులకు మిలిటరీ డ్రిల్లులో చంద్ర రాజేశ్వరరావు శిక్షణ యిచ్చారు. రాత్రివేళలో రాజకీయ తరగతులను కూడా నిర్వహించారు. ఈ స్కూలు తరువాత కాటూరు గ్రామంలో కడియాల గోపాలరావు, కడియాల పిచ్చయ్య ఈడ్పుగంటి సుబ్బారావు, నార్ల తాతారావు, నార్ల గోపాల కృష్ణయ్యలతో పార్టీ సెల్లు నిర్మాణమయింది.[6]

కొత్తపట్నం స్కూలుకి విద్యార్థిగా వచ్చిన కోనేరు రాజగోపాలరావు దివి తాలూకాలో రైతు ఉద్యమ నిర్మాణానికి, పార్టీ అనవృద్ధికి కృషి చేసారు. కోనేరు రాజగోపాలరావు 1937 నవంబరులో పార్టీ సభ్యుడిగా రావడమే కాకుండా తన తోటి విద్యార్థులుగా ఉన్న వారిని కూడా కమ్యూనిస్టులుగా రూపుదిద్దారు. కోనేరు రాజ గోపాలరావు ద్వారా మాలెంపాటి సీతారామయ్య, పర్చూరి రామకోటయ్య, రావి సుబ్బారావు, యార్లగడ్డ లక్ష్మయ్య, కావూరి కుటుంబరావు, కావూరి సోమేశ్వర ప్రసాద్ మొదలైన వారు 1938 ప్రారంభ కాలానికి పార్టీలోకి వచ్చారు దివి తాలూకాలో రైతు ఉద్యమ అభివృద్ధికి ఈకార్యకర్తలంతా ఎనలేని కృషి చేసారు. 1938 సంవత్సరంలో గ్రామ గ్రామాన తిరిగి రైతు సంఘం సభ్యత్వం చేర్పించడమే కాకుండా గ్రామ కమిటీలను కూడా ఏర్పాటు చేయడం జరిగింది. సుమారుగా 40 గ్రామాలలో 1500 మందిని రైతు సంఘ సభ్యులుగా చేర్పించారు.

దివి తలూకాలో రైతు ఉద్యమంతో పాటుగా పార్టీ నిర్మాణం కూడా చురుకుగా సాగింది. 1938 మే నాటికి తాలూకా మొత్తంమీద 24 మంది పార్టీ సభ్యులయ్యారు. కోనేరు రాజగోపాలరావు కార్యదర్శిగా, మాలెంపాటి సీతారామయ్య, సనకా బుచ్చికోటయ్యలతో తాలూకా పార్టీ కమిటీ కూడా ఏర్పాటైంది.[7]

మరో వైపున 1936 చివరికాలంలో మునిపల్లి రామారావు, వెల్లంకి విశ్వేశ్వరరావులు కూడా కమ్యూనిస్టు పార్టీ సభ్యులై పార్టీ నిర్మాణానికి కృషి చేయడం ప్రారంభించారు. మునిపల్లి రామారావు బందరు, గుడివాడ విద్యార్థులను సంఘటిత పరుస్తూ, వారిలో మార్క్సిస్టు అవగాహన పెంచి దీక్షాపరులైన పార్టీ కార్యకర్తలను తయారు చేసారు.

1937 నాటికి కాట్రగడ్డ రాజగోపాలరావు, వల్లభనేని నారాయణ దాసు సోమూరి వెంకట్రామయ్యలతో పార్టీ సెల్లు ఏర్పడింది.

1938 వేసవిలో జరిగిన మంతెనవారిపాలెం రాజకీయ పాఠశాల మరికొంత మంది కమ్యూనిస్టు కార్యకర్తలను తయారు చేసింది. 1938 నాటికే కాంగ్రెసు సోషలిస్టు పార్టీ కార్యక్రమాలలో పాల్గొంటూ, మంతెనవారి పాలెం పాఠశాలకు, హాజరైన జోస్యభట్ల సత్యనారాయణ అటుతర్వాత పార్టీ సభ్యులయ్యారు.

పాఠశాల ముగిసిన తరువాత పూర్తి కాలం కార్యకర్తగా గుడివాడలో పనిచేయడానికి జోస్యభట్ల సత్యనారాయణను పార్టీ నియమించింది. అప్పటికే వంగపాటి రంగారెడ్డి, కానూరి బలరామయ్య, సూరపనేని గోపాలకృష్ణయ్యలతో ఒక పార్టీ సెల్లు పని చేస్తోంది.

1938 సంవత్సరంలో గుడివాడ ఫ్యాక్టరీ వర్కర్సు యూనియన్, మునిసిపల్ వర్కర్సు యూనియన్, ప్రెస్ వర్కర్సు యూనియన్‌లు ఏర్పాటుకు గుడివాడలోని కమ్యూనిస్టు పార్టీ సభ్యులు కృషి చేసారు.

మునిపల్లి రామారావు, జోస్యభట్ల సత్యనారాయణ విద్యార్థి సంఘ నిర్మాణంలో సూచనలు, సలహాలు యిస్తూ విద్యార్థులను పార్టీ కార్యకర్తలుగా మరల్చబడడంలో ముఖ్య పాత్ర వహించారు. ఈ ప్రయత్నాల మూలంగా 1939 సంవత్సరంలో లింగవరం, గుడివాడ విద్యార్థులలో కొంతమంది పార్టీ సభ్యులు అయ్యారు. ఇటువంటి వారిలో తమ్మారెడ్డి సత్యనారాయణ, తమ్మారెడ్డి కృష్ణమూర్తి, ప్రకాశరావు, జొన్నపాడులోని కొండ్లు జనార్ధనరెడ్డి అట్లూరి సీతారామయ్య మొదలైన వారు ఉన్నారు.[8]

కొండపల్లి సీతారామయ్య కూడా 1939 సంవత్సరంలో కమ్యూనిస్టు పార్టీ సభ్యుడై గుడివాడలో కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమాలను అమలుపరిచే చురుకైన కార్యకర్తగా రూపొంధారు. కవుతరం గ్రామవాసి అయిన తాళ్లూరి మంగపతిరావు కూడా కానూరి బలరామయ్యగారి పరిచయం ద్వారా 1939లో పార్టీ సభ్యులయినారు.

ఈ కాలంలోనే గన్నవరం తాలూకాలో పార్టీ నిర్మాణ రూపం తీసుకోవడం ప్రారంభించింది. 1938 గన్నవరంలో హైస్కూలు టీచరుగా పని చేయడానికి వచ్చిన టి. కె. రామస్వామి, చుట్టు ప్రక్కల గ్రామాలలోని యువకులలో కమ్యూనిస్టు భావాలను పెంపొందించారు. వీరి ద్వారా 1938 చివరి నాటికి, ముక్కామల నాగభూషణం, కాట్రగడ్డ పెద వెంకట రాయుడు, మాప్పూరి బసవయ్య, చింతపల్లి పాపారావులతో 'బుద్ధవరం' పార్టీ సెల్ ఏర్పడింది. గన్నవరం తాలూకాలో ఏర్పడిన రెండవ పార్టీ సెల్ ఇది.

ఈ కాలంలో యువజన సంఘాల ద్వారా పార్టీ ప్రచారం, నిర్మాణం విస్తృత మయ్యాయి.

యువజన సంఘ కార్యక్రమాలలో పాల్గొంటూ చిన్నవోగిరాలలో యువ జన సంఘాన్ని నిర్మించిన బండి వెంకట కృష్ణయ్య 1939 లో పార్టీ సభ్యు లయ్యారు. క్రమంగా 1940 నాటికి చినఓగిరాలలో అక్కినేని రామలింగేశ్వరావు, జె.ఎస్.ఆర్. ఆంజనేయశాస్త్రి, కోడే మాధవరావు, వెనమకూరి కృష్ణమూర్తి, కడియాల పరుశురామయ్యతో ఒక పార్టీ సెల్లు ఏర్పాటైంది.

1939 చివరి నాటికి కృష్ణా జిల్లాలో

| | |
|---|---|
| వెంట్రప్రగడ | కవుతరం |
| కాటూరు | పెడ్లవల్లేరు |
| యలమర్రు | సిరులపాడు |
| జమీగొల్వేపల్లి | మంగళాపురం |
| పెద మద్దాలి | నడకుదురు |
| బల్లిపర్రు | భట్లపెనుమర్రు |
| దింటకుర్రు | |
| పాములపాడు | బార్లపూడి |
| రావులపాడు | మొదలైన గ్రామాలతో పాటుగా |
| జొన్నపాడు | విజయవాడ, గుడివాడ పట్టణాలలో |

పార్టీ సెల్సుఏర్పడిన పని చేస్తున్నాయి.

1939 సెప్టెంబరులో రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమవటంతో కమ్యూనిస్టులపై ప్రభుత్వం తీవ్ర నిర్బంధ విధానాన్ని ప్రయోగించింది. రహ స్యంగా ముద్రిత మవుతున్న స్వతంత్ర్య భారత్‌ను పట్టుకునేందుకు, కమ్యూ నిస్టు కార్యకర్తలను అణచి-వేసేందుకు కఠిన చర్యలు గైకొంటి, కమ్యూనిస్టులపై దాడులు అరెస్టులు ముమ్మరం చేసింది. ఈ నిర్బంద విధానాన్ని ఒదుర్కొంటూ కూడా సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని పార్టీసభ్యులు తీవ్రతరం చేసారు.

"భారత స్వాతంత్ర్య పోరాట విజయానికి కృషి చేస్తామని యుద్ధానికి సహాయ నిరాకరణను తీవ్రం చేస్తామని ప్రమాణం చేస్తూ 1940 జనవరి 26 స్వాతంత్ర్య దినోత్సవాన్ని విజయవంతం" చేయవల్సిందిగా రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ పిలుపునిచ్చింది. ఈ పిలుపును అమలుజరపడానికి కృష్ణా జిల్లాలోని కమ్యూ నిస్టు కార్యకర్తలు నిర్భయంగా ముందుకు వచ్చారు. చల్లపల్లి గుడివాడలో నిర్వ హించబడిన ఊరేగింపులే ఇందుకు ఉదాహరణలు.

"చల్లపల్లిలో 400 మందితో ఊరేగింపును, 1000 మందితో బహిరంగ సభను నిర్వహించారు." ఈ బహిరంగ సభను ఏకంగా చల్లపల్లి జమీందారు తోటలోనే నిర్వహించారు. సభను విచ్ఛిన్నం చేయటానికి ప్రయత్నించిన జమీం

దారు గుండాలను ప్రతిఘటించి మిరీ ఈ సభను నిర్వహించారు. పార్టీ రహస్యంగా ముద్రించి పంపిణి వేసిన ప్రమాణ పత్రాన్ని కూడా సభలో బహిరంగంగా చదివారు.[9]

ఆదే రోజున గుడివాడలో మరో పెద్ద ప్రదర్శనను నిర్వహించారు. ఈ ప్రదర్శనకు "కవుతరం, అంగలూరు, గుడ్లవల్లేరు, పెంట్రప్రగడ, వానపాముల దింటకుర్రు, పామలపాడు, రాపులపాడు, జొన్నపాడు, లింగవరం, పెదముద్దాలి ఎంమర్రు, చౌటుపల్లి, పెదపాలపర్రు మొదలగు గ్రామాల నుంచి ఎర్ర జండాలు ప్లేకార్డ్సు ధరించిన విద్యార్థి యువజన, మహిళలు గుడివాడ పట్టణంలో ప్రదర్శన నిర్వహించారు. సామ్రాజ్యవాద ప్రభుత్వం నశించాలి. ప్రపంచ కార్మిక కర్షకులారా ఏకం కండు, అంటూ యుద్ధ వ్యతిరేక నినాదాల్ని దిక్కులు పిక్కటిల్లేలా నినదిస్తూ ఊరేగింపును నిర్వహించారు. నిషేధాజ్ఞలు విధించిన ప్రభుత్వం, ఇంత పెద్ద ఎత్తున సమీకృతమైన ప్రజావాహినిని చూసి ఏమీ చేయలేక ఊరుకుంది.

సామ్రాజ్యవాద యుద్ధానికి వ్యతిరేకంగా పోరాటం సాగిస్తూనే మరో వైపున పార్టీ నిర్మాణాన్ని కూడా విస్తృతపర్చారు. 1939 చివరి కాలంలో నూతన జిల్లా కమిటీని ఏర్పాటు చేశారు. కడియాల గోపాలరావు కార్యదర్శిగా, కృత్తివెంటి కుటుంబరావు, కంఠంనేని చలపతిరావు, కొండపల్లి సీతారామయ్య కమిటీ సభ్యులుగా ఈ నూతన జిల్లా కమిటీ ఏర్పాటైంది.[10]

సామ్రాజ్యవాద యుద్ధ కాలంలో
విజయవాడ నగర కమిటీ కార్యదర్శిగా
కృత్తివెంటి కుటుంబరావు
విజయవాడ తాలుకాకు, మైనేని లక్ష్మణస్వామి

దివి తాలుకాకు కోనేరు రాజగోపాలరావు కార్యదర్శిగా వుంటూ పార్టీ అభివృద్ధికి కృషి చేసారు.

సామ్రాజ్యవాద యుద్ధ దశలో 1939 - 40 సంవత్సరముల మధ్య నందిగామ, తిరువూరు, మునగాల పరిగణాలకు కమ్యూనిస్టు పార్టీ విస్తరించింది. 1938-39 మధ్య కాలంలో నందిగామ తాలుకాలో రైతు ఉద్యమ వ్యాప్తికి కమ్యూనిస్టులు కృషిచేసారు. నందిగామను కేంద్రంగా చేసుకుని ఈ తాలుకాలో కమ్యూనిస్టు పార్టీ నిర్మాణానికి వాసిరెడ్డి రామారావు కృషిచేసారు. 1938 - 39 కాలంలో వాసిరెడ్డి భాస్కరరావు, వాసిరెడ్డి నారాయణరావు, వీరమాచినేని వెంకటేశ్వరరావు, చావా రామలింగయ్య పాటిబండ్ల జానకి రామయ్య, అమరవాది

కాశేశ్వరరావు మొదలైనవారు కమ్యూనిస్టు కార్యకర్తలుగా పనిచేస్తూ బలమైన రైతు సంఘ నిర్మాణానికి దోహదకారులయ్యారు. 1938 జనవరిలో పొట్టిపాడు రైతాంగ విద్యాలయానికి హాజరైన గుణ్ణం రామిరెడ్డి నందిగామ హైస్కూలులో హిందీ టీచరుగా పనిచేస్తున్న వాసిరెడ్డి భాస్కరరావు ద్వారా పార్టీ పరిచయాలు ఏర్పరచుకున్నారు. వీరు 1939 నాటికి పార్టి సభ్యులవ్వడమే కాకుండా, ముక్త్యాల ఎస్టేటు రైతాంగ పోరాటాన్ని వీరోచితంగా నడిపించారు

ఎన్నో కష్ట నష్టాలను ఎదుర్కొంటూ రైతు సంఘ అభివృద్ధికి 1938 సంవత్సరం నుండి కమ్యూనిస్టులు పనిచేయనారంభించారు. 1939 లో మునగాల పరగణా వీరోచిత రైతాంగ పోరాటాన్ని నడిపించారు.

1938 లో చలసాని వాసుదేవరావు, కామినేని వెంకటప్పయ్య, జోస్యభట్ల సత్యనారాయణ, మునగాల పరగణాలోని వివిధ గ్రామాలు పర్యటించి పోరాటానికి రైతులును సమాయత్తం చేసారు. తిరిగి 1938 మధ్యకాలంలో చండ్ర రాజేశ్వర రావు నండూరి ప్రసాదరావు మునగాల పరగణాలో పర్యటించారు. మోటూరి పరంధామయ్య వేములపల్లి హనుమంతరావు రైతు సంఘ నిర్మాణానికి పూనుకొని 4 వేల మంది రైతులను రైతు సంఘం సభ్యులుగా చేర్చారు.

కమ్యూనిస్టుల ద్వారా మనోధైర్యాన్ని పొందిన రైతులు ఉత్తేజితులై జమీందారుకు వ్యతిరేకంగా పోరాటానికి సిద్ధమయ్యారు. మొదటిసారిగా జమీందారుకు వ్యతిరేకంగా 1938 డిసెంబరు నెలలో కలుకోవ వ్యవసాయ కూలీల పోరాటాన్ని నల్లపాటి వెంకట్రామ నరసయ్య దిగ్విజయంగా నడిపారు. 1939 మునగాల వీరోచిత సత్యాగ్రహ పోరాటంలో కమ్యూనిస్టు నాయకులైన జోస్యభట్ల సత్యనారాయణ, నండూరి ప్రసాదరావు, మోటూరి పరంధామయ్య లతోపాటుగా ఎస్టేటు రైతులును ప్రభుత్వం అరెస్టు చేసింది. ఈ విధంగా పోరాటాల్లో పాల్గొంటూ కమ్యూనిస్టు పార్టీ పట్ల ఆకర్షితులైన వారితో 1939 చివరి కాలంలో మునగాల పరగణాలో కమ్యూనిస్టు పార్టీని నిర్మించారు. దాదాపుగా 30 మంది కమ్యూనిస్టు పార్టీలో సభ్యులయ్యారు. ప్రథమంలో నల్లపాటి వెంకట్రామ నరసయ్య పార్టీ ఆర్గనైజరుగా పనిచేశారు. క్రమ శిక్షణా చర్యక్రింద ఈయనను పార్టీ నుండి తొలగించిన తరువాత కొల్లు చినకోటయ్య పార్టీ ఆర్గనైజరుగా పనిచేసారు. మునగాల పరగణాలలో రైతు ఉద్యమంతో పాటుగా యుద్ధ వ్యతిరేక ప్రచారాన్ని కూడా సాగించారు. ముక్కామల నాగభూషణం, పరగణాలోని కొమరబండ, రామాపురం, నడిగూడెం, శిరిపురం, రేపాల, మాధవరం మొదలైన గ్రామాలలో బహిరంగ సభలను నిర్వహించి, సామ్రాజ్యవాద యుద్ధానికి వ్యతిరేకంగా ప్రజల్ని చైతన్యవంతుల్ని చేసారు.

తిరువూరు తాలూకాలో రైతు ఉద్యమ నిర్మాణానికి పాటుపడుతున్న సుంకర వీరభద్రరావు కూడా కమ్యూనిస్టు పార్టీ భావాలపట్ల ఆకర్షితులై 1939-40 కాలంలో పార్టీ సభ్యులయ్యారు. ఈ తాలుకాలో కమ్యూనిస్టు పార్టీని నిర్మించేందుకు రైతు ఉద్యమాన్ని ముందుకు నడిపేందుకు తాలూకా బయటి నుంచి వెల్లంకిరామారావు, గరికిపాటి కృష్ణారావు, వీరపనేని రంగారావు, కోడూరు పూర్ణ చంద్రరావు, కేమిశెట్టి కోటయ్యలను 1942-43 సంవత్సరములో పార్టీ నియమించింది. తాలూకావాసులైన పేటరామారావు, అనంతోజబోధాయన, రామిశెట్టి వేణుగోపాలరావు, సువారపు కృష్ణమూర్తి, కాశీ సోమశేఖరాచార్యులు, సయ్యద్ సాలార్ మొదలగువారు అప్పటకే పార్టీ సభ్యులుగా ఉంటూ పార్టీ నిర్మాణానికి కృషిచేస్తున్నారు.[12]

సామ్రాజ్యవాద యుద్ధ కాలంలో కమ్యూనిస్టులపై ఎంత తీవ్ర నిర్బంధ విధానం అమలు జరుపబడుతున్నప్పటికి ప్రజా సమస్యలపై పార్టీ సభ్యులు కృషి చేస్తూ వచ్చారు. ముఖ్యంగా వ్యవసాయ కూలీ సమస్యలపైన పార్టీ కేంద్రీకరించి పనిచేసింది. దీని మూలంగా వ్యవసాయ కార్మికోద్యమం ఈ కాలంలో ఒక నిర్మాణాత్మకమైన రూపుదిద్దుకోవడమే కాకుండా, వ్యవసాయ కార్మికులలో పార్టీకి బలమైన పునాది ఏర్పడింది. 1939 లో పార్టీ సభ్యులైన చల్లపల్లి నారాయణరావు ఆయన ద్వారా 1939 చివరికి పార్టీలోకి వచ్చిన గుంటూరు బాపనయ్య వ్యవసాయ కూలీ ఉద్యమంలో ప్రధాన పాత్ర వహించారు.

యుద్ధం ప్రారంభమయిన తరువాత ప్రజా సమస్యలపై ఆందోళనలు చేపట్టకుండా "వ్యక్తిగత సత్యాగ్రహం" వరకే ప్రజాందోళనను పరిమితంచేయ చూస్తున్న కాంగ్రెస్ మితవాదుల వాదనకు వ్యతిరేకంగా 'సమిష్టి సత్యాగ్రహాన్ని' నిర్వహించాలని కోరారు. వర్గ పోరాటాలని చేస్తూ, వర్గ సంఘాలను పటిష్ఠం చేయాలని కాంగ్రెసులోని కమ్యూనిస్టులు తలపెట్టారు. అందులో భాగంగానే 1940 మధ్య కాలంలో వివిధ జిల్లాలలో ఆకలి యాత్రలునూ కమ్యూనిస్టులు నిర్వహించారు.

కృష్ణా జిల్లాలోని దివి తాలూకాలో చల్లపల్లి నారాయణరావు, చంద్ర వెంకట రంగయ్య, గుంటూరు బాపనయ్య ఆధ్వర్యాన మూడు దళాలు తాలుకా లోని గ్రామాలు తిరిగి వ్యవసాయ కూలీల్ని ఉత్తేజపరిచి అందర్నీ అవనిగడ్డ తహశీల్దారు వద్దకు సమీకరించి వారి డిమాండ్లను ప్రభుత్వానికి తెలియచేసారు.

ఆదే విధంగా తాళ్లూరి మంగపతిరావు ఆధ్వర్యాన ఒక దళం గుడివాడ తాలుకాలోని అనేక గ్రామాలు తిరిగి వ్యవసాయ కూలీ పేటలలో సమావేశాలు పెట్టి వారి వారి డిమాండ్లను సేకరించి గుడివాడలోవున్న జిల్లా కలెక్టరుకు వాటిని అంద చేసారు.

వ్యవసాయ కూలీ దళాలు నిర్వహించిన ఈ చైతన్యపూరిత ఆకలియాత్రలే వివిధ తాలుకా వ్యవసాయ కూలీ సంఘాల నిర్మాణానికి ప్రాతిపదికలయ్యాయి. వ్యవసాయ కూలీలను జాగృతంచేసి 1940 జూన్ మాసంలో ప్రథమ కృష్ణాజిల్లా వ్యవసాయ కూలీ మహాసభను వెంట్రప్రగడ గ్రామంలో నిర్వహించారు. జిల్లా వ్యవసాయ కూలీ సంఘ అధ్యక్షుడిగా కామ్రేడ్ అయ్యంకి దావీదు, కార్యదర్శిగా గుంటూరు బాపనయ్య ఎన్నికయ్యారు.

యుద్ధ వ్యతిరేక కార్యకలాపాలు నిర్వహిస్తూ ప్రజా సమస్యలపై పోరాటం చేస్తున్నందుకు కృష్ణా జిల్లాలోని కమ్యూనిస్టు కార్యకర్తల ఇండ్లపై పోలీసులు పెద్ద ఎత్తున దాడి చేసారు. ఒక ప్లాను ప్రకారం ఏక కాలంలో వివిధ తాలూకాల్లోని 70 మంది కమ్యూనిస్టు ఇండ్లను పోలీసులు సోదా చేసారు. గుడివాడ, నందిగామ, బందరు, గన్నవరం, బెజవాడ, దివి తాలూకాలో ఈ సోదాలు జరిగాయి. గన్నవరంలో జరిగిన దాడి గురించి కాగడా పత్రిక ఈ విధంగా తెలియచేసింది. "గన్నవరం తాలూకా ముదునూరు గ్రామంలో శ్రీ గోపరాజు రామచంద్రరావు, అన్నె అంజయ్యగార్ల ఇళ్ళ సోదాలు చాలా విచిత్రంగా జరిపారు. వీరిద్దరు ప్రసిద్ధ నాస్తిక వాద ప్రచారకులు. కంకిపాడు సబ్ ఇన్‌స్పెక్టరు, 8 మంది పోలీసులతో అకస్మాత్తుగా ఉదయం 6 గంటలకు రామచంద్రరావు గారింటికి వెళ్ళారు. ముందుగా ఆ ఇంటికి తాళాలు వేసారు. అక్కడి నుంచి అన్నె అంజయ్యగారి ఇంటికి వెళ్ళి రెండు గంటల సేపు ఆ ఇంటిని సోదాచేసి రామచంద్రరావు గారింటికి వచ్చి తాళం తీసి సోదా చేసారు. ఇంత శ్రమకు ఫలితంగా ఏమీ దొరకలేదు."[13]

రహస్యంగా ప్రభుత్వ వ్యతిరేక కార్యకలాపాలు కొనసాగిస్తున్నారనే నెపంతో కమ్యూనిస్టులనే కాకుండా ఇతర అతివాదులను కూడా బ్రిటిషు ప్రభుత్వం వేధించింది.

వర్గ సంఘాల నిర్మాణంతోపాటుగా కార్మిక కర్షకులను విద్యావంతులను చేయటానికి కూడా కమ్యూనిస్టు పార్టీ పెద్ద ఎత్తున వయోజన విద్యా కార్యక్రమాలను చేపట్టింది.. ఇందులో భాగంగానే 1940 మే మాసంలో జమీగొల్వేపల్లి, ఎలమర్రు గ్రామాలలో జరిగిన రాజకీయ పాఠశాలలకు హాజరైన విద్యార్థి యువజన, మహిళా కార్యకర్తలకు వయోజన విద్యాకేంద్రాలను నిర్వహించడంలో తగిన శిక్షణ ఇవ్వబడింది. వయోజన విద్యను నేర్పటానికి వీలుగా సులభ శైలిలో అవసరమైన పాఠ్యాంశాలను గోపరాజు రామచంద్రరావు తదితరులు రూపొందించారు. వీటిని "మా పాఠాలు" అనే రెండు పుస్తకాలుగా కృష్ణాజిల్లా యువజన సంఘం అచ్చు వేయించింది.

ఈ వేసంగి పాఠశాలలో శిక్షణ పొందిన అనేక మంది యువకులు తమ తమ గ్రామాలలో వయోజన విద్యా కేంద్రాలను నిర్వహించారు. కవుతరం, ఎలమర్రు చుట్టుపక్కల గ్రామాలలో తాఝ్యూరి మంగపతిరావు కొన్ని వయోజన కేంద్రాలను నిర్వహించారు.[14] ఇదే విధంగా జిల్లాలోని మరికొన్ని తాలుకాలలో ఈ వయోజన విద్యా కేంద్రాలను పార్టీ సభ్యులు నిర్వహించారు. ఈ విద్యా కేంద్రాలలో సాధారణ విద్యతో పాటు రాజకీయాలను కూడా బోధించారు. ఈ వయోజన విద్యా కేంద్రాల మూలంగా గ్రామీణ పేదవర్గాలలో, ముఖ్యంగా వ్యవసాయ కూలీలలో పార్టీకి గట్టి పట్టు లభించింది.

ఈ కార్యక్రమాలతో పాటుగా రాజకీయ చైతన్యం పొంది ముందుకు వచ్చిన యువకులతో పార్టీ నిర్మాణాన్ని పెంపొందించడం జరిగింది. ముఖ్యంగా గన్నవరం, దివి, గుడివాడ తాలుకాలలో పార్టీ సభ్యుల సంఖ్య గణనీయంగా పెరిగింది.

తేలప్రోలు గ్రామంలో గుంటక పుల్లారెడ్డి, వేంకటేశ్వర రెడ్డి మొదలగు వారితో 1941 ప్రారంభ కాలంలో పార్టీ సెల్ ఏర్పడింది అట్లూరి శ్రీమన్నారాయణ మొదలగువారితో ఆత్మకూరులో 1941 లో పార్టీ సెల్ ఏర్పడింది.

ఈ కాలం నాటికి పశ్చిమ కృష్ణాలోని వామపక్ష కాంగ్రెసు వాదులనేక మంది కమ్యూనిస్టు పార్టీ అనుసరిస్తున్న రాజకీయ విధానాలవైపు ఆకర్షితులై కమ్యూనిస్టు పార్టీ సభ్యులయ్యారు. విద్యాభ్యాసాన్ని ముగించుకుని గుంటూరునుంచి వచ్చిన వై.వి. కృష్ణారావు 1940 చివరినుంచి 42 వరకు వీరవల్లి ఫిర్కాలోని వివిధ గ్రామాలలో పార్టీ కార్యక్రమాన్ని నిర్వహించారు పార్టీ సెల్స్ ఉన్న గ్రామాలలో కార్యకర్తలకు సిద్ధాంత, రాజకీయ బోధనచేస్తూ పటిష్ఠవంతమైన పార్టీ నిర్మాణానికి కృషి చేసారు.

అదే విధంగా జాలాది రామకోటయ్య మొదలగువారితో వెలిదిపాడులో మరో సెల్ ఏర్పడింది.

సామ్రాజ్యవాద యుద్ధ కాలంలో పార్టీ సెల్స్ ఏర్పడిన కొన్ని గ్రామాలు:-

| | |
|---|---|
| పెదముత్తేవి | కొయ్యగూరపాడు |
| వక్కలిగడ్డ | వేంపాడు |
| దావాజీగూడెం | గారపాడు |
| ఉంగుటూరు | ఇందుపల్లి |
| వెల్దిపాడు | ఆరుగొలను |

మొదలగు గ్రామాలతో పాటుగా నూజివీడు తాలుకాలోని మునునూరు, పోతారెడ్డి, మైలవరం దగ్గర కొండూరు, గణపవరం, నందిగామ తాలుకాలోని

కంచికచర్ల, చెర్వుకొమ్ముపాలెం, పెద్దవరం, తిరువూరు తాలుకాలోని తునికిపాడు గ్రామాలలో కూడా పార్టీ సెల్స్ ఏర్పడ్డాయి.

ఈ కాలంలోని (1940 సం॥లో) నందమూరులోని మానికొండ సుబ్బారావు పార్టీ సభ్యులై రహస్య కాలంలో పార్టీ కార్యక్రమాలను చురుకుగా అమలుపరుస్తూ 1941 లో గన్నవరం తాలుకా పార్టీ ఆర్గనైజరుగా పార్టీ నిర్మాణానికి కృషి చేశారు.

1941 జూన్ తరువాత ఏర్పడిన ప్రజా యుద్ధ దశలో అందుకు అనుగుణమైన ఎత్తుగడలను పార్టీ అనుసరించింది. జపాన్‌ద్వారా ముంచుకొస్తున్న యుద్ధ ప్రమాదం నుండి విమానదాడులనుండి ప్రజల్ని రక్షించేందుకై ఏ.ఆర్.పి శిక్షణను పార్టీ ప్రారంభించింది. రాజకీయాలతో పాటుగా ప్రజలకు ఏ.ఆర్.పి. శిక్షణ (ఎయిర్ రైడ్ ప్రికాషన్స్) కు క్లాసులను కూడా నిర్వహించింది. ఫాసిస్టు శక్తులకు వ్యతిరేక ప్రచారం ప్రధానంగా పార్టీ చేస్తూ అనేక కార్యక్రమాలు చేపట్టింది. ఇందుకొరకు ఫాసిస్టు వ్యతిరేక ప్రచార శిక్షణాశిబిరాల్ని నెలకొల్పి, ఫాసిజానికి వ్యతిరేకంగా ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయడం జరిగింది.

తీవ్రమవుతున్న ఫాసిస్టు ప్రమాదాన్ని ప్రజలందరికి వివరించటానికి పెద్ద ఎత్తున్న ప్రచార కార్యక్రమాన్ని కమ్యూనిస్టులు ప్రారంభించారు. ఫాసిస్టు వ్యతిరేక ప్రచారాన్ని చేయడానికి, యుద్ధ సమయంలో ప్రజా రక్షణకు అవసరమైన శిక్షణ ఇచ్చేందుకు గండిగుంటలో ఏప్రియల్ 10 నుండి 25 వరకు ఒక శిక్షణా శిబిరం నిర్వహించారు. కృష్ణా జిల్లా యువజన విద్యార్థి సంఘాల ఆధ్వర్యంలో జరిగిన ఈ శిబిరంలో 57 మంది శిక్షణ పొందారు.[15] శిక్షణ పొందిన ఈ యువకులు గుడివాడ గన్నవరం, బందరు, దివి, బెజవాడ తాలుకాలలోని 15 గ్రామాలలో ఫాసిస్టు వ్యతిరేక కేంద్రాలు నిర్వహించారు. బహిరంగ సభలు, చిత్రవిచిత్ర వేషాలు-డాక్టరు వేషం, గొల్ల సుద్దులు, సింగి వేషం, మాదిగ వేషం, బుర్రకథలు, నాటకాలు, తత్వాలు మొదలగు ప్రచార పద్ధతులను ఉపయోగించి ప్రజాయుద్ధ నినాదాన్ని గ్రామ గ్రామాలకు తీసుకు వెళ్ళారు. మొత్తం 80 గ్రామాలలో 90 బహిరంగ సభలు నిర్వహించారు. వీటితోపాటుగా అధ్యయన తరగతులు కూడా కొన్ని గ్రామాలలో నిర్వహించారు. ఈ తరగతులలో రాజకీయ విజ్ఞానంతో పాటుగా ప్రథమ చికిత్సా సూత్రాలు, విమాన దాడుల నుండి ఏవిధంగా రక్షించుకోవాలి మొదలైన అంశాలను కూడా బోధించారు. ఈ కార్యక్రమాల ద్వారా ఫాసిస్టు శక్తుల ప్రమాదం గురించి ప్రచారం చేయడంతో పాటు దేశ రక్షణపట్ల యువకులను జాగృత మొనర్చి, వారిలో రాజకీయ చైతన్యాన్ని పెంపొందించి అనేకమంది యువకులను పార్టీ వైపుకు ఆకర్షించారు.

1941-1942 మధ్య కాలంలో గన్నవరం తాలూకాలోనూ, విజయవాడ పట్టణంలో పార్టీ నిర్మాణం పెరిగి ఒక సంఘటిత రూపు దిద్దుకుంది.

1941 చివరి కాలంలోనే విజయవాడ పట్టణ కమిటీ ఏర్పాటైంది. ఈ కమిటీకి కార్యదర్శిగా కృత్తివెంటి కుటుంబరావు వున్నారు తమ్మిన పోతరాజు, ఎల్. వెంకటరత్నం కమిటీ సభ్యులుగా వుంటూ పార్టీ నిర్మాణానికి కృషి చేసారు.

యుద్ధకాలంనుండి పార్టీ కార్యకర్తలకి, అభిమానులకు తన పూర్తి సహాయ సహకారాలను అందిస్తున్న డా॥ అచ్చమాంబ గారు కూడా ఈ కాలంలోనే పార్టీ సభ్యత్వాన్నిపొంది పార్టీ కార్యక్రమాలలో చురుగ్గా పాల్గొన సాగారు. మద్రాసునుండి వచ్చిన వెంకట్రామ శాస్త్రి (డా॥ అచ్చమాంబగారి భర్త) గారు కూడా పార్టీ నిర్మాణానికి తోడ్పడుతూ పార్టీలో ముఖ్య కార్యకర్త అయ్యారు.

1942 సంవత్సరంలో గన్నవరం తాలూకా కమిటీ ఏర్పాటైంది ఇందులో కామ్రేడ్ మానికొండ సుబ్బారావు (కార్యదర్శిగా) జాలాది రామకోటయ్య, కాట్రగడ్డ పెద వెంకట్రాయుడు కడియాల పిచ్చయ్య, సభ్యులుగా ఉన్నారు.

1942 చివరి నాటికి, కృష్ణాజిల్లాలోని అన్ని తాలూకాలకు పార్టీ విస్తరించింది. గన్నవరం, దివి, గుడివాడ తాలూకాలు పార్టీకి బలమైన కేంద్రాలుగా రూపొందాయి. రైతు సంఘం మొదలుకొని బాల సంఘం వరకు అన్ని ప్రజా సంఘాలు పటిష్టమైన సంఘాలుగా రూపొందాయి.

1943 జూన్‌లో జిల్లా మహాసభ జరిగే నాటికి 1561 మంది పార్టీ సభ్యులుతో జిల్లాలో ఒక ప్రధాన రాజకీయ శక్తిగా కమ్యూనిస్టు పార్టీ రూపు దిద్దుకుంది.

ఈ మహాసభలో పార్టీ నిర్మాణాన్ని మరింత ముందుకు తీసుకుపోవడానికి వీలుగా జిల్లా కమిటీ ఏర్పాటైంది ఈ కమిటీకి కఠారంనేని చలపతిరావు (కార్యదర్శి) మానికొండ సుబ్బారావు, వి. వెంకట్రామ శాస్త్రి, వెల్లంకి విశ్వేశ్వరరావు పొట్లూరి సుందరం, టి. పోతరాజు (కాండిడేట్), ఎ. వి. సి సీతారామారావు (కాండిడేట్) సభ్యులుగా ఎన్నికయ్యారు.[16]

## ఆధారాలు


1. 1975 డిసెంబరు, కమ్యూనిజం, 46 వ పేజీ
2. ప ల ఈజ్ హు ఆఫ్ ఫ్రీడమ్ స్ట్రగుల్ ఇన్ ఆంధ్రప్రదేశ్ - వాల్యూమ్ సెకండ్
3. 1975 డిసెంబరు, కమ్యూనిజం, 47 వ పేజీ
4. ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర, 74 వ పేజీ

5. కడియాల గోపాలరావుతో ఇంటర్వ్యూ
6. కడియాల గోపాలరావుతో ఇంటర్వ్యూ
7. కోనేరు రాజగోపాలరావు సమాచార పత్రం
8. జోస్యభట్ల సత్యనారాయణ సమాచార పత్రం
9. కోనేరు రాజగోపాలరావు సమాచార పత్రం
10. కడియాల గోపాలరావుతో ఇంటర్వ్యూ
11. మునగాల పరగణా ప్రజా ఉద్యమ చరిత్ర, 71 వ పేజీ
12. ఆంధ్రప్రదేశ్‌లో రైతు ఉద్యమాలు పోరాటాలు 153 వ పేజీ
13. కాగడ, 1941 సెప్టెంబరు 10, 7 వ పేజీ
14. తాళ్లూరి మంగపతిరావు సమాచార పత్రం
15. 17-6-42, ప్రజాశక్తి 6 వ పేజీ
16. 14-7-43, ప్రజాశక్తి, 3 వ పేజీ

# గుంటూరుజిల్లాలో కమ్యూనిస్టు పార్టీ నిర్మాణం

ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు ఉద్యమ చరిత్రలో గుంటూరు జిల్లాకు ఒక విశిష్టస్థానం ఉంది. ప్రప్రథమ దశలోనే కమ్యూనిస్టు పార్టీకి ఈ జిల్లాలో గట్టి పునాదులు ఏర్పడటమే కాకుండా ఇతర జిల్లాలలో పార్టీని నిర్మించేందుకు అవసరమైన కార్యకర్తలను అందిచే కేంద్రంగాకూడా గుంటూరుజిల్లా పార్టీ రూపొందింది.

ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని జైలుకువెళ్ళి వచ్చిన తరువాత కాంగ్రెసు ప్రచారం కొనసాగిస్తున్నందుకు జొన్నల గడ్డ రామలింగయ్యకు 6 నెలలు కఠిన శిక్ష విధించి రాజమండ్రి జైలుకు తరలించారు.

ఇదే విధంగా తెనాలిలో సత్యాగ్రహం చేసిన కొత్తమాను సత్యనారాయణకు కూడా ఒక సంవత్సరం శిక్ష విధించి రాజమండ్రి జైలుకు తరలించారు వీరిద్దరికి అక్కడవున్న శివవర్మ, విజయకుమార్ సిన్హా, జయదేవ్ కపూర్, బినయరాయ్ చౌదరి, ప్రతుల్‌చంద్ర భట్టాచార్య మొదలైన విప్లవకారులతో పరిచయం ఏర్పడింది. ఈవిప్లవకారులవల్ల వీరిద్దరికి మార్క్సిస్టు ప్రాథమిక సూత్రాలపట్ల ఒక అవగాహన ఏర్పడింది. సత్తెనపల్లిలో వస్త్రదుకాణాలముందు 1932 లో పెకెటింగు చేసినందుకు దుర్భా కృష్ణమూర్తికి ఒక సంవత్సరం శిక్ష ధించి రాజమండ్రి జైలుకు తరలించారు. జైలులో ప్రచారమవుతున్న కమ్యూనిస్టు భావాలపైపు వీరు కూడా ఆకర్షితులయ్యారు.

దాదాపు ఇదే సమయంలో ప్రభుత్వ వ్యతిరేక కార్యకలాపాలు నిర్వహిస్తూన్నందుకు ముత్తేవి మాధవాచార్యను కూడా అరెస్టుచేసి మొదట రాజమండ్రి జైలుకు తరువాత బళ్ళారి జైలుకు తరలించారు.

బళ్ళారి జైలులో వున్న కంభంపాటి సత్యనారాయణగారి ద్వారా కమ్యూనిస్టు సూత్రాల గురించి వీరు తెలుసుకున్నారు. ఈ విధంగా వీరికి కూడా జైలే మార్క్సిస్టు పాఠశాల అయింది.

జైలులో కమ్యూనిస్టు భావాలు ఆకళింపు చేసుకున్న ఈ యువకులంతా 1933 చివరినాటికి జైలునుంచి విడుదలై వచ్చారు. జైలుకు వెళ్ళిన యువకులు ఈ విధంగా కమ్యూనిస్టు భావాలతో బయటకువస్తున్న తరుణంలో వీరికి మరికొంత

మంది కమ్యూనిస్టులుగా మారిన విద్యార్థులు తొడయ్యారు. 1932 లో బెనారస్ విశ్వవిద్యాలయానికి బి.యే చదువు నిమిత్తం వెళ్లిన పోలేపెద్ది నరసింహమూర్తి అక్కడి కమ్యూనిస్టు స్టడీసర్కిల్‌తో పరిచయం ఏర్పడి కమ్యూనిస్టుగా మారారు. బి య్యే పరీక్షలు పూర్తి చేయకుండానే 1934 ప్రారంభానికి తెనాలి చేరుకుని సుందరయ్య, కంభంపాటి సత్యనారాయణ మొదలైన వారితో పరిచయం ఏర్పరచుకున్నారు. అతివాద యువకులను పార్టీవైపు తీసుకురావడానికి కృషి చేసారు.

వీరితో పాటుగా బి ఎస్.సి. చదివేందుకు బెనారసు వెళ్లిన పి వి. శివయ్య కూడా కొంచెం ఆలస్యంగా కమ్యూనిస్టు గ్రూపుతో పరిచయం ఏర్పడి మార్క్సిస్టు అధ్యయన తరగతులకు హాజరవడం, కమ్యూనిస్టు గ్రంథాల పఠనం ద్వారా కమ్యూనిస్టు భావాల వైపు ఆకర్షితులయ్యారు

కాంగ్రెసు శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొని, జైలు నుండి 1933 లో విడుదలై వచ్చిన ప్రతాప రామసుబ్బయ్య కాంగ్రెసు 'నిర్మాణ కార్యక్రమం' పట్ల నిరుత్సాహం పొంది ప్రత్యామ్నాయ పోరాట మార్గాల అన్వేషణలోవున్న తరుణంలో బెనారస్ నుంచి వి. వి. శివయ్య తెచ్చిన మార్క్సిస్టు సాహిత్యాన్ని అధ్యయనం చేసారు. వీరితోపాటుగా మాడభూషి వెంకటాచారి ఈ సాహిత్య అధ్యయనంద్వారా కమ్యూనిస్టు భావాల వైపు మొగ్గు చూపారు.[1]

వివిధ మార్గాల ద్వారా కమ్యూనిస్టు భావాలవైపు ఆకర్షితులైన వీరందరిని పుచ్చలపల్లి సుందరయ్య విడివిడిగా కలుసుకొని వారితో చర్చించి, గుంటూరు జిల్లాలో కమ్యూనిస్టు పార్టీ నిర్మాణానికి ఏర్పాటులు చేసారు.

1934 జూలైలో మంతెనవారిపాలెంలోఉన్న జొన్నలగడ్డరామలింగయ్యను పార్టీ సభ్యుడిగా తీసుకోవడంతోపాటుగా పార్టీకోసం పనిచేసే పూర్తి కార్యకర్తగా గుంటూరుకు మకాంమార్పించారు.[2]

బెనారస్‌లోనే కమ్యూనిస్టుగా మారి వచ్చిన పోలెపెద్ది నరసింహమూర్తి ద్వారా తెనాలిలో కమ్యూనిస్టు భావాల వైపు ఆకర్షితులైన యువకులతో 1935 ప్రారంభ కాలంలో కమ్యూనిస్టు సెల్ ఏర్పాటైంది. ఈ సెల్లులో పోలేపెద్ది నరసింహమూర్తి, ముక్తేవి మాధవాచార్య, కొత్తమాసు సత్యనారాయణ, కాకుమాను నారాయణరావులు సభ్యులుగా ఉన్నారు.

జొన్నలగడ్డ రామలింగయ్యతో 1935 మార్చిలో గుంటూరులో మరొక సెల్ ఏర్పాటైంది. ఇందులో మాడభూషి వెంకటాచారి, ప్రతాప రామసుబ్బయ్య సభ్యులయ్యారు.

1935 ఏప్రియల్‌లో బెనారస్ నుండి తిరిగివచ్చిన పి.వి. శివయ్య కూడా కమ్యూనిస్టు పార్టీ నిర్మాణానికి పూనుకున్నారు. కాశీవిద్యా పీఠ్‌లో 'శాస్త్రి' కోర్సు

చదవటానికి 1934 లో వెళ్లిన తుమ్మల వెంకట్రామయ్య అక్కడి కమ్యూనిస్టు సెల్‌లో సభ్యుడై కోర్సు పూర్తి చేయకుండానే వెనక్కి తిరిగివచ్చి కమ్యూనిస్టు సెల్‌లో సభ్యులయ్యారు.

జొన్నలగడ్డరామలింగయ్య, ప్రతాప రామసుబ్బయ్యల పరిచయంలో జాతీయ భావాలు కల్గిన వెండ్యాల లోకనాథం 1935 లో కమ్యూనిస్టు పార్టీ సభ్యుడై గుంటూరు సెల్‌లో చేరారు. ఈ సమయంలోనే తెనాలి తాలూకాలో పండితారాధ్యుల మల్లిఖార్జున శర్మ పోలేపెద్ది నర్సింహమూర్తి పరిచయంద్వారా కమ్యూనిస్టు భావాలవైపు ఆకర్షితులై పార్టీ సభ్యత్వాన్ని పొందారు

ఈ విధంగా 1935 ఎప్రిల్ నాటికి తెనాలి, గుంటూరు కేంద్రాలుగా కమ్యూనిస్టులుగా మారిన యువకులతో జిల్లాలో కమ్యూనిస్టు పార్టీ నిర్మించబడింది.

జిల్లాలోని కమ్యూనిస్టు పార్టీ సభ్యులందరు 1935 ఏప్రిల్ 17 న గుంటూరులో సమావేశమై పోతేపెద్ది నరసింహమూర్తి కార్యదర్శిగా 5 గురితో కూడిన జిల్లాకమిటీని ఎన్నుకొన్నారు. ఈ సమావేశానికి మొత్తం 17 మంది సభ్యులు హాజరయ్యారు.

పార్టీ సెల్స్‌గా ఏర్పడి ఏర్పడటంతోనే కార్మికవర్గంలో పనిచేయడానికి పూనుకున్నారు. గుంటూరులో ఉన్న వివిధ కార్మికులను సంఘటితం చేసి వారిలో వర్గదృక్పథాన్ని పెంపొందించేందుకు జొన్నలగడ్డ రామలింగయ్య, ప్రతాప రామసుబ్బయ్య కృషి చేసారు ప్రథమంగా రిక్షా, గుర్రబళ్లు ఒంటెద్దు బళ్లు, కార్మికులను ఆ తరువాత క్రమంగా మున్సిపల్, ప్రెస్ కార్మికులు జూట్‌మిల్లు కార్మికులలోకి కూడా విస్తరించి వారిని సంఘటిత పరిచేందుకు ప్రయత్నాలు చేసారు. కార్మికులను ఐక్యంచేసి వారి సమస్యలపై పోరాటాలను నడిపేందుకు 1935 మార్చిలో గుంటూరు కూలి రక్షణ సమితిని ఏర్పాటు చేయడం జరిగింది. ఈ సమితి అధ్యక్షుడిగా ప్రతాప రామసుబ్బయ్య కార్యదర్శులుగా జొన్నలగడ్డ రామలింగయ్య దుర్భా కృష్ణమూర్తి వుండి కార్యక్రమాలను చురుకుగా నడిపించారు. కార్మికులలో కమ్యూనిస్టు భావాలను పెంపొందించి వర్గ చైతన్యాన్ని పెంచేందుకు 1935 ఆగష్టులో ఒక నెల రోజులపాటు కార్మికులకు ప్రాథమిక రాజకీయ పాఠశాలను కూలిరక్షణ సమితి తరపున నిర్వహించారు. ఈ రాజకీయ పాఠశాలలో మార్క్స్, లెనిన్ జీవిత విశేషాలు, వారు ప్రబోధించిన సిద్ధాంతాలు బోల్షివిక్ విప్లవ ఘట్టాలను కూర్చి కార్మికులకు బోధించారు.[4]

దీనితో పాటుగా వర్గ దృక్పథాన్ని బోధిస్తూ కార్మిక ఐక్యతను ప్రబోధిస్తూ, డజను కరపత్రాలను ముద్రించి వాటిని కార్మికులకు చదివి వినిపించేవారు. "ధన ప్రభావం" అనే నాటికను కార్మిక వాడల్లో ప్రదర్శించేవారు. ఈ కూలి

రక్షణ సమితి తరఫున ప్రకటించిన రెండు కరపత్రాలు వర్గ ద్వేషాన్ని ప్రేరేపిస్తూన్నాయనే నేరం క్రింద జొన్నలగడ్డ రామలింగయ్య, ప్రతాప రామ సుబ్బయ్య, దుర్భా కృష్ణమూర్తికి 1935 అక్టోబరులో 6 నెలలు శిక్ష విధించి రాజమండ్రి జైలుకు పంపించారు. గుంటూరు కూలీ రక్షణ సమితి ఆఫీసు పైన, రాష్ట్రంలోని ఇతర చోట్ల ఉన్న కూలీ రక్షణ సమితి ఆఫీసుల పైన, కార్యకర్తల ఇండ్లపైన పోలీసులు దాడిచేసి పెద్ద ఎత్తున కమ్యూనిస్టు సాహిత్యాన్ని స్వాధీనం చేసుకుని అనేకమంది కమ్యూనిస్టులను అరెస్టు చేసారు

కూలీ రక్షణ సమితి కార్యక్రమాలను నిర్విఘ్నంగా కొనసాగించేందుకు వీలుగా పెండ్యాల లోకనాథం అధ్యక్షుడిగా, బాచినప్ప నరసింహం, పి. వి. శివయ్య కార్యదర్శులుగా పనిచేశారు. గుంటూరు కూలీ రక్షణ సమితి కార్యక్రమాలను ముందుకు నడిపించారు.

కార్మిక వర్గంలో కార్యక్రమాలు ఇలా కొనసాగుతూ ఉండగా బెనారస్ నుండి కమ్యూనిస్టు భావాలతో 1935 ప్రథమ భాగంలో సంచారి ప్రసాదరావు గుంటూరు వచ్చారు ఈయన గుంటూరు రావడంతోడనే పార్టీ సభ్యులై పార్టీ కార్యక్రమాలలో పాల్గొనడం ప్రారంభించారు.[5] పి. వి. శివయ్యతో కలిసి 'ఫ్రెండ్స్ హోమ్' అనే హోటలును ప్రారంభించారు. వీరితో పాటుగా పెండ్యాల లోకనాథం, బాచినప్ప నరసింహం, కుందేటి రామకోటి, శ్రీ గిరిరాజు సత్య నారాయణ, కుందా పుల్లారావు మరో ముగ్గురు హోల్ టైమర్లు ఈ హోటల్ బాధ్యతలను చూస్తూ మధ్యాహ్నం, రాత్రిళ్లు కార్మిక పేటలో యూనియన్ కార్య కలాపాలు, రాత్రి పాఠశాలలు కొనసాగించారు.

మరో వైపున తెనాలి తాలూకాలో 1936 వ సంవత్సరంలో దావులూరులో చింతల సూర్యనారాయణ, కాబోతు రామస్వామిలతో పార్టీ సెల్ ఏర్పడింది. దీనితో పాటు ఇంటూరులో కూడా మరో పార్టీ సెల్ ఇదే కాలంలో ఏర్పాటైంది. ఈ రెండు సెల్స్ సభ్యులు ఆయా చుట్టుప్రక్కల గ్రామాల్లో ముఖ్యంగా వ్యవసాయ కూలీలలో పార్టీకి గట్టి పునాదిని ఏర్పాటు చేయగలిగారు.

గుంటూరు మిరా కార్మికులలో పార్టీ చేసిన కృషి ఫలితంగా 1936 చివరినాటికి పటిష్టమైన మిరా కార్మిక సంఘం పార్టీ ఆధ్వర్యంలో ఏర్పడింది. 1936 నాటికి పార్టీ సభ్యులైన కనపర్తి నాగయ్య ఈ సంఘం ఏర్పడటానికి కృషి చేసారు. పిల్లలమర్రి వెంకటేశ్వర్లు, కె. ఎల్. నరసింహం కూడా పార్టీ సభ్యు లవడంతో గుంటూరులో పార్టీ సభ్యుల సంఖ్య మరికొంత పెరిగింది. వీరితోపాటుగా పార్టీ సభ్యులైన పమిడిముక్కల లక్ష్మణరావు కూడా కార్మికులలో పనిచేస్తూ సంఘ నిర్మాణానికి తోడ్పడ్డారు.

ఈ కార్యక్రమాలు సాగుతున్న కాలంలోనే డి. వి. అప్పారావు, నాళం నరసింహారావులు కూడా పార్టీ సభ్యులయ్యారు ఆ తరువాత క్రమంగా 1937 జూలైలో ఏటుకూరి బలరామమూర్తి, వెంపటి శ్రీనువాసమూర్తి, ఏ. వి. సుబ్బారావులు పార్టీ సభ్యత్వాన్ని పొందారు. మరి కొద్ది కాలానికి చతుర్వేదుల పార్థసారథి, అమరవాది కృష్ణమూర్తి, ఊరె పాపారావులు కూడా పార్టీ సభ్యులయ్యారు. 1937 చివరి నాటికి గుంటూరులో విద్యార్థి, యువజన కార్మిక సంఘాలలో పనిచేసే చురుకైన కార్యకర్తలు లభించారు.

1936 సంవత్సరములోనే ఒంగోలు తాలుకాకు కూడా పార్టీ నిర్మాణం విస్తరించింది. 1936 మార్చిలో జరిగిన జిల్లా బోర్డు ఎన్నికల సందర్భంగా అన్నాప్రగడ కామేశ్వరరావు, డి. కామేశ్వరరావులు పోలేపెద్ది నరసింహమూర్తి ప్రతాప రామసుబ్బయ్యల ప్రోద్బలంతో కమ్యూనిస్టు పార్టీ సభ్యులు కావడంతో ఒంగోలులో మొట్ట మొదటి కమ్యూనిస్టు సెల్ నిర్మాణం జరిగింది. కొద్ది రోజుల తరువాత ఈ సెల్ సభ్యులుగా కోట వెంకటేశ్వర శాస్త్రిని కూడా రిక్రూట్ చేసుకున్నారు.[6]

ఒంగోలు తాలుకాలో పార్టీ సభ్యులుగా ముగ్గురే ఉన్నప్పటికి అతి ఉత్సాహంగా కార్యక్రమాలను నిర్వహిస్తూ యువజన విద్యార్థులను చైతన్యవంతుల్ని చేయడానికి కృషిచేసారు. విద్యార్థి, యువజనులను సంఘటితపరచటానికి వీలుగా రహస్యంగా కొన్ని అధ్యయన తరగతులను నిర్వహించారు. ఈ తరగతులద్వారా వారిలో రాజకీయ చైతన్యం పెంపొందించి సోషలిస్టు భావాలను వ్యాపింపజేసి సంఘ నిర్మాణానికి బాటలువేసారు. పార్టీ సభ్యులు చేసిన ఈ కృషి మూలంగా ఒంగోలు తాలుకా ప్రథమ యువజన మహాసభ 1936 జూన్‌లో ఒంగోలులో నిర్వహించారు.

ఈ మహాసభ ప్రేరణతో ఒంగోలు తాలుకా యువజన సంఘంతోపాటు చుట్టుప్రక్కల 10 గ్రామాలలో కూడా యువజన సంఘాలు ఏర్పడ్డాయి. ప్రతివారం ఒక్కొక్క గ్రామంలో మీటింగ్‌నిర్వహించి జాతీయోద్యమం, మార్క్సిజం-రష్యా విప్లవం మొదలైన అంశాలపై యువజనుల మధ్య చర్చలును నిర్వహించేవారు. ఈ చర్చలతోపాటు అందుబాటులోవున్న కమ్యూనిస్టు సాహిత్యం అధ్యయనం కూడా కొనసాగేది. ఈ విధమైన కార్యక్రమాల ద్వారా యువజనులలో రాజకీయ చైతన్యస్థాయిని పెంపొందించి అనేక మంది యువకులలో సోషలిస్టు భావాలను వ్యాపింపజేసారు. దీనితోపాటుగా పార్టీ నిర్మాణాన్ని కూడా ఒంగోలు తాలుకాలో విస్తరింపచేసారు. 1937 ప్రారంభానికి ఒంగోలు తాలుకాలో మరో సెల్ ఏర్పడింది. మెట్టు జయరామ నాయుడు, సాంబశివరావు, వెంపటి

రామకోటయ్యలు ఈ సెల్ సభ్యులుగా ఉన్నారు. పార్టీ సభ్యులు కా పోయి నప్పటికి దాదాపు 30 మంది దాకా యువకులు పార్టీకి గట్టి సానుభూతిపరులుగా 1937 నాటికి ఒంగోలు తాలుకాలో రూపొందారు.[7]

గుంటూరు జిల్లాలో పార్టీ నిర్మాణం విస్తృతమవడానికి తోడ్పడిన మరో ప్రధాన అంశం గుంటూరు కమ్మ హాస్టల్. నిజానికి ఆ రోజుల్లో కమ్యూనిస్టు పార్టీకి ఈ హాస్టల్ ఒక పెట్టని కోటవలె ఉపయోగపడింది. హాస్టలులోని అధికశాతం విద్యార్థులు అతివాద భావాలతో వుండటంవల్ల, కమ్యూనిస్టులను తయారుచేసే కేంద్రంగా కమ్మహాస్టల్ పనిచేసింది. దీనితోపాటుగా గుంటూరులో వున్న హరి జన్ హాస్టల్‌నుండి కొంతమంది విద్యార్థులు కమ్యూనిస్టు సభులయ్యారు. ఈరెండు హాస్టలులోవున్న విద్యార్థులు రాష్ట్రవ్యాపితంగా విద్యార్థి సంఘాన్ని నిర్మించడం లోనూ కమ్యూనిస్టు పార్టీ విస్తరించడానికి ఎనలేని సేవ చేసారు. ఏ. సి. కాలేజీలో బి.ఎ. చదువుతూ కమ్మహాస్టల్‌లో వున్న మాకినేని బసవపున్నయ్య, పి వి. శివయ్య గారి ద్వారా 1935 చివరినాటికి పార్టీ సభ్యులయ్యారు. ఎ. సి. కాలేజీ విద్యార్థిగా ఉన్న ప్రబల కృష్ణమూర్తి కమ్యూనిస్టు భావాలవల్ల ప్రభావితుడై 1936 లో కమ్యూనిస్టుపార్టీ సభ్యులయ్యారు

గుంటూరులో ఉన్న హరిజన్ హాస్టలోని విద్యార్థులకు ఏటుకూరి బలరామ మూర్తి అధ్యయన తరగతులు నిర్వహించి హరిజన విద్యార్థులలో కమ్యూనిస్టు భావాల వ్యాప్తికి కృషి చేసారు. ఈ కృషి ఫలితంగా 1937 లో హరిజనహాస్టలు విద్యార్థులుగాఉన్న గోవాడ నిరీక్షణరావు, లంకపల్లి బుల్లయ్య (ఆంధ్ర విశ్వవిద్యా లయ మాజీ వైస్ చాన్సులర్) బుస్సా బిక్షాలు పార్టీ సభ్యులయ్యారు.[9]

కమ్యూనిస్టులుగా మారిన ఈ విద్యార్థులంతా విద్యార్థిసంఘ కార్యక్రమా లను చురుకుగా అమలుపరుస్తూ రాష్ట్రవ్యాపితంగా విద్యార్థిసంఘానికి ఒకరూపు దిద్దుకోవడానికి ఎంతో తోడ్పడ్డారు. ఆంధ్ర రాష్ట్ర విద్యార్థిసంఘం ఒక సిద్ధాంత ప్రాతిపదికను,నిర్మాణాత్మకంగా బలమైన సంఘం ఏర్పడటానికి ఈ విద్యార్థులంతా ప్రధాన కారకులయ్యారు. 14వ ఆంధ్రరాష్ట్ర విద్యార్థి మహాసభను గుంటూరులో 1937 ఆగష్టు 27, 28 తేదీలలో నిర్వహించి జాతీయోద్యమ స్రవంతిలో ఒక భాగంగా విద్యార్థి సంఘాన్ని రూపొందించారు. డిటెన్షన్ విధానానికి వ్యతిరేకంగా 1937 డిసెంబరులో ఎ. సి. కాలేజీ విద్యార్థులు నిర్వహించిన చరిత్రాత్మక సమ్మెను కమ్యూనిస్టు విద్యార్థులే ముందు భాగాన నిలిచి విజయవంతంగా నడి పారు. ఈ సమ్మె ప్రభావం రాష్ట్ర విద్యార్థిలోకం అంతటిపైన ప్రగాఢ ముద్రను వేసింది.

కమ్యూనిస్టు సాహిత్య అధ్యయనం, కమ్యూనిస్టు నాయకుల పరిచయ ప్రభావం వల్ల కమ్మ హాస్టలులో ఉండే అనేక మంది విద్యార్థులు కమ్యూనిస్టులుగా మారారు. 1936 నుండి ఎ. సి. కాలేజీలో చదువుతూ ఈ హాస్టలులో వుంటున్న వై. వి. కృష్ణారావు, తుమ్మల వెంకట సుబ్బయ్య, సి. ఎల్. నారాయణ, 1937 లో పార్టీ సభ్యులై ఒక సెల్‌గా ఏర్పడ్డారు.[8] ఈ కాలంలోనే మాదాల నారాయణస్వామి, భావిరెడ్డి వెంకటేశ్వర్లు కూడా పార్టీ సభ్యులయ్యారు.

కమ్యూనిస్టు సాహిత్య అధ్యయనం పట్ల కమ్మ హాస్టలులోని విద్యార్థులు ఒకరు తరువాత ఒకరు ఆకర్షితులయ్యారు. క్రమంగా హాస్టలు విద్యార్థులుగా ఉన్న మోటూరు రాధాకృష్ణ, లావు బాలగంగాధరరావు, వేములపల్లి శ్రీకృష్ణ, మోటూరు హనుమంతరావు మొదలైన వారు 1938 లో పార్టీ సభ్యులయ్యారు.

ఆ తరువాత విద్యార్థి కార్యక్రమాలలో పాల్గొంటూ కంచంపాటి శ్రీరామ మూర్తి, టి. వెంకటేశ్వరరావులు కూడా 1939 లో కమ్యూనిస్టు పార్టీ సభ్యులైనారు. ఈ కాలంలో గుంటూరులో విద్యార్థులుగా ఉన్న అనేక మంది విద్యార్థులపై కమ్యూనిస్టు భావాల ప్రభావం అత్యంత బలంగా ఉంది. చదువు పూర్తి చేసుకుని స్వగ్రామాలకు వెళ్ళిన తరువాత అక్కడి వివిధ ప్రజా సంఘాల కార్యకలాపాలను నిర్వహిస్తూ తరువాత కాలంలో పార్టీ సభ్యులైన వారు అనేక మంది ఉన్నారు.

గుంటూరులో విద్యార్థిగా వుంటూ ప్రథమ కాలంలో కమ్యూనిస్టు పార్టీ సభ్యులైన వారిలో కొల్లా వెంకయ్య కూడా ఒకరు 1934 నుండి 36 వరకు ఇంటర్మీడియట్ చదివేందుకు గుంటూరులో ఉన్న కొల్లా వెంకయ్యకు కమ్యూనిస్టు సాహిత్యంతోను నాయకులతోను పరిచయం ఏర్పడింది. పి వి. శివయ్య కమ్యూనిస్టు సాహిత్యాన్ని రహస్యంగా కొల్లా వెంకయ్య గదిలో దాచేవారు. ఈ పరిచయా ప్రభావంతో 1936 మధ్య కాలానికే కమ్యూనిస్టు పార్టీ ప్రాథమిక సభ్యత్వాన్ని కొల్లా వెంకయ్య పొందారు.

జిల్లాలో విస్తరిస్తున్న పార్టీ నిర్మాణాన్ని సమన్వయపరిచేందుకు 1938 జూన్‌లో గుంటూరు జిల్లా కమ్యూనిస్టు పార్టీ ప్రథమ మహా సభను గుంటూరులో నిర్వహించారు ఈ మహా సభలో పులుపుల శివయ్య కార్యదర్శిగా నూతన జిల్లా కమిటీ ఏర్పాటయింది. జిల్లా కమిటీ సభ్యులలో మాకినేని బసవ పున్నయ్య ఒకరు.

1936 నుంచి కమ్యూనిస్టులు కాంగ్రెసు సోషలిస్టు పార్టీ సభ్యులుగా పని చేయసాగారు. అప్పటికి కమ్యూనిస్టులుగా ఉన్న రామలింగయ్య, పి వి. శివయ్య, ప్రతాప రామసుబ్బయ్య గుంటూరు పట్టణ సి. ఎస్. పి. కమిటీకి ఎన్నుకోబడ్డారు.

ఈ కమిటీలో ఉన్న అమరవాది కృష్ణమూర్తి, తరువాత కాలంలో కమ్యూనిస్టులుగా మారారు. 1936 జూలై 25 న ఏర్పడ్డ ఈ నగర కమిటీ కమ్యూనిస్టు పార్టీకి బహిరంగ వేదికగా ఉపయోగపడింది. నిజానికి కమ్యూనిస్టులే కాంగ్రెసు సోషలిస్టు పార్టీ పేరుతో తమ కార్యక్రమాలను కొనసాగించారు.

గుంటూరు జిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ మహాసభను 1936 అక్టోబరు 17, 18 తేదీలలో కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తలు ముందు భాగాన వుండి నిర్వహించారు. ఈ మహాసభకు కమ్యూనిస్టు నాయకుడైన డాంగేను ఆహ్వానించారు. ఈ సందర్భంగా గుంటూరు, తెనాలి పట్టణాలలో బహిరంగ సభలు ఏర్పాటుచేసి సోషలిస్టు ప్రచారాన్ని నిర్వహించారు. 1939 వరకు పోలెపెద్ది నరసింహమూర్తి 1939 మార్చి నుండి పి వి. శివయ్య కాంగ్రెసు సోషలిస్టు పార్టీ జిల్లా కార్యదర్శులుగా పనిచేసారు. తెనాలి శాఖకు ముక్తేవి మాధవాచార్యు కార్యదర్శిగా పనిచేసారు. జిల్లా తాలుకా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ కమిటీలలో కమ్యూనిస్టులే అధిక శాతంలో ఉండేవారు 1939 మార్చి 29 న ఏర్పడ్డ జిల్లా కమిటీ 10 మంది సభ్యులలో పి వి శివయ్య (కార్యదర్శి) శ్రీ గిరిరాజు సత్యనారాయణ, మాదాల వీరభద్రరావు, ముక్తేవి మాధవాచార్యు, లావు అంకమ్మ, చదలవాడ పిచ్చయ్య కమ్యూనిస్టు పార్టీ సభ్యులు. కాంగ్రెసు సోషలిస్టు పార్టీని బహిరంగ వేదికగా చేసుకుని కమ్యూనిస్టు భావ ప్రచారాన్ని సాగిస్తూ స్వాతంత్ర్య పోరాటాన్ని కమ్యూనిస్టులు తీవ్రతరం చేసారు.

1937 మద్రాసు అసెంబ్లీ ఎన్నికలలో కాంగ్రెసు అభ్యర్థులందర్నీ బలపర్చి వారి విజయానికి కృషిచేయాలనీ కమ్యూనిస్టు పార్టీ నిర్ణయించింది. గుంటూరు జిల్లాలో గుంటూరు, తెనాలి పట్టణ నియోజకవర్గానికి దేశభక్త కొండా వెంకటప్పయ్య తెనాలి, గుంటూరు, సత్తెనపల్లి తాలుకాల రూరల్ నియోజకవర్గానికి చాపరాల కృష్ణ బ్రహ్మానందం - నర్సరావుపేట, వినుకొండ, పల్నాడు తాలుకాల నియోజక వర్గానికి కాంగ్రెసు అభ్యర్థులుగా కాసు వెంకటరెడ్డి పోటీ చేచారు

ఈ ఎన్నికలలో కాంగ్రెసు అభ్యర్థుల విజయానికి ప్రధాన ప్రచారకులుగా కమ్యూనిస్టులే అగ్రభాగాన నిలిచి పనిచేసారు. పి వి శివయ్య మాడభూషి వెంకటాచారి, అమరవాది కృష్ణమూర్తి, శ్రీ గిరిరాజు సత్యనారాయణ, దుర్భా కృష్ణమూర్తి మొదలైన కమ్యూనిస్టులంతా దళాలుగా ఏర్పడి వినుకొండ, పల్నాడు, నర్సరావు పేట తాలుకా గ్రామాలలో కాంగ్రెసు అభ్యర్థికి ప్రచారంచేసారు మరోవైపున కమ్యూనిస్టు పార్టీ వైపుకు ఆకర్షితులైన గుంటూరు విద్యార్థులు కూడ దళాలుగా ఏర్పడి జిల్లా అంతట పర్యటించి కాంగ్రెసు విజయానికి కృషి చేసారు. ఈ ప్రచార సందర్భంలో జస్టిస్ పార్టీ, పీపుల్స్ పార్టీ వారి దౌర్జన్యాలను, బాడు

లను సహితం ఎదుర్కొని కమ్యూనిస్టులు ప్రచారం సాగించారు. వినుకొండ ప్రచార సభలో జస్టిస్ పార్టీ వారు రాళ్ళతో నిండిన పొట్లాలతో దాడి చేయగా ప్రసంగిస్తున్నా దుర్భా హనుమాయమ్మ గాయపడింది. 10

ఇదేవిధంగా వై. వి. కృష్ణారావు ఒక విద్యార్థిదళంతో గుంటూరు, గుంటూరు రూరల్ నర్సరావు పేట అసెంబ్లీ నియోజక వర్గాలలో విస్తృతంగా ప్రచారం చేసారు. గుంటూరులో సంగడి గుంటలో ప్రచారం చేస్తున్నప్పుడు నడింపల్లి నరసింహారావు (స్వతంత్ర అభ్యర్థి) మనుషులు, కృష్ణారావు దళంపై దాడి చేసారు.

జస్టిస్ పార్టీ వారిని ఓడించటానికి కమ్యూనిస్టులు ధైర్యంగా కృషి చేసారు. ఈ ఎన్నికల సందర్భంగా సామ్రాజ్య వాదానికి, దానితో చేతోడుగావున్న జమీందార్లు, జస్టిస్ పార్టీ వర్గాలకు వ్యతిరేకంగా ముమ్మరంగా ప్రచారం చేయడం జరిగింది. దీనితోపాటుగా జిల్లాలోని మారుమూల గ్రామాలలో సహితం సోష లిస్టు భావాలను వ్యాపింప జేసి అనేక మంది యువకులను, రైతులును కమ్యూ నిస్టు పార్టీ వైపుకు ఆకర్షితులయ్యేటట్లు చేయడంలో కమ్యూనిస్టులు కృతకృత్యు లయ్యారు. ఎగరాలి ఎగరాలి మన ఎర్రజెండా.... .. , ఎండలో వానలో ఏనాటి కానాడు .. . , అనే పాటలను పాడుతూ ప్రజలలోకి బాగా చొచ్చుకు పోవడానికి ఈ ఎన్నికలు, కమ్యూనిస్టులకెంతో ఉపయోగ పడ్డాయి.

ఆ తరువాత కాలంలో కమ్యూనిస్టులు నిర్వహించిన కొత్తపట్నం (37) మంతెనవారిపాలెం (38) పాఠశాలలకు జిల్లాలోని ప్రజలు తమ పూర్తిసహాయ సహకారాలను అందించారు. కొత్తపట్నం రాజకీయ పాఠశాలపై పోలీసుల దమన కాండను నిరసిస్తూ మే 22 న ఒంగోలులో జరిగిన బహిరంగ సభకు వందల మంది యువకులు అరుణపతాకాలతో ఊరేగుతూ సభను జయప్రదం చేసారు. ఈ సభలో పాల్గొన్న కాంగ్రెసు వాదులు కూడా పోలీసు పైశాచిక దమనకాండను నిర్ద్వంద్వంగా ఖండించారు

ఈ రెండు పాఠశాలల నిర్వహణ తరువాత గుంటూరు జిల్లాలో కమ్యూ నిస్టు పార్టీ నిర్మాణ బలం మరింత పెరిగింది. ఈ పాఠశాలలకు హాజరైన జిల్లా లోని యువకులు వివిధ తాలూకాలలో పార్టీ శాఖలను ఏర్పరచి పార్టీ కార్యక్రమా లను చురుకుగా అమలు పరచసాగారు.

గుంటూరు పట్టణ యువజనసంఘ ఆధ్వర్యంలో ఒక వాలంటరీ శిక్షణా శిబిరం 1938 లో నిర్వహించబడింది. వామపక్ష భావాలు కల్గిన యువకులు విద్యా ర్థులు ఈ శిబిరానికి హాజరయ్యారు. 1938 జనవరి - ఫిబ్రవరి మాసాలలో నెల రోజుల పాటు జరిగిన ఈ శిబిరంలో కామ్రేడ్ చండ్ర రాజేశ్వరరావు మిలిటరీ డ్రిల్లు నేర్పారు.11

తుపాకీని ఏ విధంగా ఉపయోగించాలి దానిలోని మెళుకువలు మొదలగు వాటి గురించి చెక్కతుపాకీతో కామ్రేడ్ చంద్ర రాజేశ్వరరావు ప్రాక్టీసు చేయించారు.

1938 లో సత్తెనపల్లి తాలూకాకు చెందిన సత్తెనపల్లి, తాళ్లూరు, అచ్చంపేట, ఫణిరం, కూరపాడు గ్రామాలలో పార్టీ సెల్సు ఏర్పడ్డాయి ఈ తాలూకాలో మాడాల వీరభద్రరావు, వావిలాల వీరభద్రరావు, చాట్ల గురవరాజు, చతుర్వేదుల సీతారామశాస్త్రి, దర్శి లక్ష్మయ్య, మొదలైనవారు పార్టీ సభ్యులై వివిధ ప్రజా సంఘాల ద్వారా గ్రామాంలో కమ్యూనిస్టు భావాల వ్యాప్తికి కృషి చేయ ప్రారంభించారు.

ఇదే విధంగా బాపట్ల తాలుకాలో 1938 చివరి నాటికి పెదనందిపాడు, నరసాయపాలెం, జూపూడి, పొన్నూరు గ్రామాలలో పార్టీ సెల్సు ఏర్పడి పని చేయడం ప్రారంభించాయి.

గుంటూరు కమ్మ హాస్టల్‌లో 1937-38 సంవత్సరంలో విద్యార్థులుగా ఉన్న కరణం రంగారావు, కరణం నర్సింగరావులు చదువు ముగించుకొని స్వగ్రామం (వేలూరు) వచ్చిన తరువాత చిలకలూరి పేట, వేలూరు చుట్టు ప్రక్కల గ్రామాలలో బలమైన యువజన సంఘాలు ఏర్పడ్డాయి. కరణం నర్సింగరావు, కరణం రంగారావు, శ్రీ గిరిరాజు సత్యనారాయణ ముఖ్య కార్యకర్తలుగా నర్సరావుపేట తాలుకా యువజన మహాసభను నిర్వహించి తాలుకాలోని యువజనులు సంఘటితపరచి కమ్యూనిస్టు పార్టీ వైపుగా మళ్ళించేందుకు కృషి చేసారు. యువజన సంఘాలతో పాటుగా వేలూరు, జొన్నలగడ్డ, కొండిచర్ల, నర్సరావుపేట, చిలకలూరి పేటలలో పటిష్ఠమైన రైతు సంఘాలు ఏర్పడి పని చేయడానికి కూడా ఈ కార్యకర్తలు కృషి చేసారు.[12]

తెనాలి, రేపల్లె తాలూకాలలో యువజన, రైతు ఉద్యమాలతో పాటుగా వ్యవసాయ కూలీ ఉద్యమం కూడా వేగంగా అభివృద్ధి, చెందింది. దావులూరు, పల్లెకోనలలో 1936 లో ప్రారంభమైన వ్యవసాయ కూలీల సంఘం క్రమ క్రమంగా తాలూకా అంతటా విస్తరించింది. 1937 లో వ్యవసాయ కూలీల కిచ్చే కూలీ రేటు పెంచాలని దావులూరు చుట్టుప్రక్కల 14 గ్రామాలలోని వ్యవసాయ కూలీలు 4 రోజులు సమ్మె చేసి విజయం సాధించారు. ఈ సమ్మె ప్రభావం జిల్లా లోని మిగిలిన గ్రామాలకు కూడా వ్యాపించింది. జిల్లాలో వ్యాప్తి చెందుతున్న వ్యవసాయ కూలీ ఉద్యమానికి ఒక సంఘటిత రూపం ఇవ్వడానికి 1938 మేలో జిల్లా వ్యవసాయ కూలీ ప్రథమ మహాసభను రేపల్లె తాలూకా పల్లెకోన గ్రామంలో నిర్వహించారు.

వివిధ వర్గ సంఘాల ద్వారా ప్రజా సమస్యలపై పోరాటాన్ని సాగిస్తూ ఆ పోరాటాల్లో మిలిటెంట్లుగా ముందుకు వచ్చిన వారితో కమ్యూనిస్టు పార్టీ సెల్స్ ఏర్పాటుకు కృషి జరిగింది. ఈ కృషి ఫలితంగా 1938-39 కాలంలో తెనాలి రేపల్లె తాలూకాలలోని పల్లెకోన, కొల్లూరు, అనంతవరం, వల్లభాపురం, చినపాలెం చిలుమూరు, పెదపాలెం, మంచికలపూడి, కరేవరం, సంగం, జాగర్లమూడి, ఈమని, కంచెర్లపాలెం మొదలగు గ్రామాలలో కమ్యూనిస్టు పార్టీ సెల్స్ ఏర్పాటు జరిగింది. చుక్కపల్లి నర్సయ్య, కొత్త రామకృష్ణయ్య, అన్నే సీతయ్య, గుమ్మడి బసవ పున్నయ్య, శేకూరి వెంకట సుబ్బయ్య, కోగంటి కోటయ్య, ఆరవేటి రామయ్య మొదలైన వారు దీక్షాపరులైన కమ్యూనిస్టులుగా తెనాలి తాలూకాలో కమ్యూనిస్టు పార్టీ నిర్మాణానికి తోడ్పడ్డారు.[13]

కమ్యూనిస్టు కార్యకర్తలు, వర్గ సంఘాలను నిర్మిస్తూ ప్రజా సమస్యలపై పోరాటాన్ని వేగంగా సాగిస్తున్న ఈ కాలంలోనే 1939 సెప్టెంబరు 3 న రెండవ ప్రపంచ యుద్ధ ప్రకటన జరిగింది. సామ్రాజ్యవాదుల మధ్య జరుగుతున్న ఈ వినాశకర యుద్ధాన్ని కమ్యూనిస్టు పార్టీ వ్యతిరేకించింది. "యుద్ధ సహాయ నిధికి ఒక పైసా ఇవ్వరాదని, సైన్యంలో ఒక్క భారతీయుడు కూడా చేరరాదని" యుద్ధ వ్యతిరేక కార్యకలాపాలు చేపట్టాలని కమ్యూనిస్టు పార్టీ నిర్ణయించింది. దీనిని అనుసరించి గుంటూరు జిల్లాలోని కమ్యూనిస్టు కార్యకర్తలు పెద్ద ఎత్తున ఉద్యమాన్ని చేపట్టారు. వాల్ పోస్టర్లు గోడలపై యుద్ధ వ్యతిరేక నినాదాలు వ్రాయడం, యుద్ధ వ్యతిరేక ప్రదర్శనలు నిర్వహించడం, రిక్రూట్‌మెంటు కేంద్రాల వద్ద వ్యతిరేక ప్రదర్శనలు నినాదాలు మొదలైన కార్యక్రమాలు గుంటూరులోని కమ్యూనిస్టులు ప్రారంభించారు.

1939 అక్టోబరు 28 న గుంటూరు పట్టణంలోని 300 మంది విద్యార్థులు యుద్ధ వ్యతిరేక ప్రదర్శనను నిర్వహించారు.

గుంటూరులో జరుగుతున్న రిక్రూట్‌మెంటుని వ్యతిరేకిస్తూ 1939 నవంబరులో గుంటూరుపట్టణ కమ్యూనిస్టులు ప్రచారాన్ని చేపట్టారు. రిక్రూటింగు కోసం వచ్చిన యువకులను సైన్యంలో చేరవద్దని ప్రబోధిస్తూ పెండ్యాల లోకనాథం, చతుర్వేదుల పార్థసారథి, ప్రఖల కృష్ణమూర్తి మరికొంత మంది విద్యార్థులు నినాదాలు యిస్తూ రిక్రూటింగుని వ్యతిరేకించారు. యుద్ధ వ్యతిరేక చర్యలు చేపడుతూ రిక్రూటింగుని ఆటంకపరచినందుకు ఈ కమ్యూనిస్టు నాయకులను ప్రభుత్వం నిర్బంధించింది.[14]

ఈ యుద్ధ వ్యతిరేక ప్రచారదళంలోను, ఆ సాయంత్రం సామ్రాజ్య వాద దిష్టిబొమ్మను వూరేగించి, దహనం చేసిన కార్యక్రమంలోనూ, వై. వి. కృష్ణారావు, మోటూరి హనుమంతరావు వున్నారు.

సామ్రాజ్యవాద యుద్ధాన్ని వ్యతిరేకిస్తూ విద్యార్థి ఫెడరేషన్ నాయకత్వంలో విద్యార్థులు స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంగా 1940 జనవరి 26 న సమ్మెకు పిలుపు నిచ్చారు. గుంటూరులోని ఎ. సి. కాలేజీ, హిందూ కాలేజీ విద్యార్థులు సమ్మెలో పాల్గొన్నారు. మిగిలిన విద్యా సంస్థలన్నిటిని ఆ రోజున మూసివేసారు.

తెనాలి పట్టణంలో యుద్ధ వ్యతిరేక పోస్టర్లు అంటించడం, యుద్ధ వ్యతిరేక నినాదాలను గోడలపై వ్రాయడం, రహస్యంగా వెలువడుతున్న 'స్వతంత్ర భారత్' పత్రికను పంచడం మొదలగు కార్యక్రమాలను కమ్యూనిస్టులు విస్తృతంగా చేపట్టారు పెరుగుతున్న యుద్ధ వ్యతిరేక చర్యలను నిరోధించేందుకు ప్రభుత్వం తీవ్ర నిర్బంధ విధానాన్ని చేపట్టింది. తెనాలిలోని కాకుమాను సుబ్బారావు, ఆరవేటి రామయ్య ఇండ్లను సోదాచేసి ఆరవేటి రామయ్యను అరెస్టుచేసి 9 మాసాల కఠిన శిక్ష విధించారు. కాకుమాను సుబ్బారావు పోలీసులకు చిక్కకుండా తప్పించుకున్నారు.[15]

ఒంగోలు తాలూకాలో నాలుగు దళాలుగా ఏర్పడిన కమ్యూనిస్టులు అన్ని ఫిర్కాలు తిరుగుతూ తాలూకాలో 180 గ్రామాలలో యుద్ధ వ్యతిరేక ప్రచారాన్ని సాగించారు. దళ కార్యక్రమం ఈ విధంగా ఉండేది "గ్రామం చేరిన వెంటనే గ్రామ కేంద్రంలో యుద్ధ వ్యతిరేక నినాదాల్ని దళసభ్యులు పెద్ద పెట్టున చేసే వారు. పిల్లలు మొదట చేరేవారు. వారితో కలిసి ఊరేగింపుగా వెళుతూ సభ ఉన్న దని చెప్పుకుంటూ గ్రామం అంతా తిరిగి కేంద్రానికి చేరుకునేవారు. అక్కడ సభ జరిపి సామ్రాజ్యవాద, యుద్ధ స్వభావాన్ని గురించి ఉపన్యసించేవారు. ఈవిధంగా రోజుకు రెండు మూడు గ్రామాలు తిరిగేవారు. పెద్ద గ్రామం అయితే ఒకరోజల్లా అక్కడే సరిపోయేది. యుద్ధ వ్యతిరేక ప్రచారం చేస్తున్న సమయంలో ప్రభుత్వానికి జడిసి, భోజనం పెట్టడానికి కొన్ని చోట్ల ప్రజలు భయపడేవారు. అటువంటి చోట్ల స్వయంగా వండు కోవడమో, లేదా పస్తు లుండటమో దళసభ్యులు చేసే వారు"[16]

ఈ విధమైన దళ ప్రచారం ప్రభుత్వ దృష్టికి అందిన వెంటనే ఒంగోలు, సంతనూతలపాడు ఫిర్కాలో పోలీసులు ఈ దళాలను వెంబడించి దళ సభ్యులుగా ఉన్న నాగినేని వెంకయ్య, ఐల్లా సుబ్బరామిరెడ్డిలను అరెస్టు చేసి 6 నెలల కఠిన శిక్ష విధించారు.

రహస్య కాలంలో పార్టీ నిర్మాణాన్ని పెంపొందించడానికి, అమలు జరుగు తున్న కార్యక్రమాలను సమీక్షించుకొని, పార్టీని పటిష్టవంతంగా ముందుకు తీసుకు పోవడానికై పార్టీ మహాసభను జరిపారు. ఈ మహాసభ రహస్యంగా 1940 ఏప్రియల్‌లో పల్లెకోన, ఇంటూరు ఎడారిబాటలో ఒక కొట్టంలో జరిగింది.

గుంటూరు జిల్లా కమ్యూనిస్టు ఉద్యమ చరిత్రలో ఈ మహా సభకు ఒక ప్రత్యేకత ఉంది. సామ్రాజ్యవాద యుద్ధంవల్ల వచ్చిన పరిణామాలను, అఖిల భారత కాంగ్రెసు సోషలిస్టు పార్టీ అనుసరిస్తున్న విప్లవ వ్యతిరేక ధోరణులను మహాసభ పూర్తిగా సమీక్షించింది. "పార్టీ పలుకుబడి వున్న చోట్ల కాంగ్రెసు సోషలిస్టు పార్టీని పూర్తిగా కమ్యూనిస్టు పార్టీలో మిళితం చేయాలని" ఈ మహా సభ నిర్ణయించింది. 150 మంది జిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ సభ్యులలో అప్పటికే 40 మంది కమ్యూనిస్టు పార్టీ సభ్యులున్నారు. అర్హతలున్న మరో 75 మంది కాంగ్రెసు సోషలిస్టు పార్టీ సభ్యులకు కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వాన్ని ఇచ్చింది.[17] దీనితో జిల్లా కాంగ్రెసు సోషలిస్టుపార్టీ పూర్తిగా కమ్యూనిస్టుపార్టీగా మారిపోయింది. రహస్యంగా జరిగిన ఈ మహాసభకు 6 తాలూకాల నుండి 70 మంది ప్రతినిధులు హాజరయ్యారు. మాకినేని బసవ పున్నయ్య కార్యదర్శిగా ఐదుగురు సభ్యులతో కూడిన నూతన జిల్లా కమిటీని కూడా ఈ మహాసభ ఎన్నుకుంది.

యుద్ధ వ్యతిరేక ప్రచారం తీవ్రమవుతున్న కొద్దీ ప్రభుత్వ నిర్బంధ విధానం పెచ్చు పెరిగింది. ప్రభుత్వ దమనకాండను తట్టుకుని, పార్టీ కార్యక్రమాలు అమలుపరుస్తూ,నిర్మాణాన్ని పెంచటానికి వీలుగా జిల్లాలోని ముఖ్య కమ్యూనిస్టు నాయకులంతా రహస్య జీవితం గడిపారు. గుంటూరు స్టూడెంటు ఎంపోరియంపై 1939 నవంబరులో దాడి జరిగిన వెంటనే పి. వి. శివయ్య మొదలైన వారంతా రహస్య జీవితం ప్రారంభించి కమ్యూనిస్టు పార్టీ నిర్మాణాన్ని కొనసాగించారు.

1940 ప్రారంభ కాలానికి కరణం రంగారావు, కరణం నర్సింగరావు, కృష్ణమూర్తిగార్లతో వేలూరులో పార్టీ సెల్ ఏర్పడింది. 1940లో కాశీ సుబ్బరామయ్య, మేకపత్తుల పిచ్చయ్య, కట్టా సుబ్బయ్య చెరుకుపల్లి దిబ్బయ్యలతో చిలకలూరిపేటలో పార్టీ సెల్ ఏర్పాటయింది. వీటితోపాటుగా జొన్నలగడ్డ, గుడిపాడు గ్రామాలలో కూడా పార్టీ సెల్స్ ఏర్పడ్డాయి.

1940 డిసెంబరులో హనుమంతరావు, తురిమెళ్ల సీతారామయ్య, వారణాసి మల్లయ్యలతో వినుకొండలో పార్టీ సెల్ ఏర్పడింది. 1941 నాటికి కోలా సుబ్బారెడ్డి,, తూములూరు సత్యనారాయణ, వెంకటేశ్వర్లుతో పల్నాడు తాలూకా మొదటి పార్టీ సెల్ ఏర్పాటైనది.

1939 - 40 కాలంలో గుంటూరు తాలుకాలోని గ్రామాలలో యువకులు రైతులలోనూ ప్రాథమిక కమ్యూనిస్టు సిద్ధాంతాలప్రచారం పార్టీ ఆధ్వర్యాన సాగింది. రహస్యంగా కొన్ని గ్రామాలలో అధ్యయన తరగతులును కూడా పార్టీ

నిర్వహించింది. 1940 చివరి నాటికి పొనేకల్లు తాడికొండ, తేలపాడు, చముళ్ళ పాడు, కంతేరు, దొండపాడు, తుళ్ళూరు, నిడుముక్కలు గ్రామాలలో పార్టీ సెల్స్ ఏర్పడి పనిచేయడం ప్రారంభించాయి

యుద్ధ వ్యతిరేక ప్రచారం కూడా తీవ్రమైంది తెనాలిలో జరుగుతున్న సైన్యం రిక్రూట్‌మెంట్‌కు వ్యతిరేకంగా చిత్రమైన పద్ధతిలో కమ్యూనిస్టులు ప్రచారం చేసారు. గడ్డితో ఒక శవాన్ని తయారుచేసి పైన తెల్లనిగుడ్డ కప్పేవారు. "గత యుద్ధంలో పాల్గొన్న పట్టిన వారికి గతి ఇది. ఇప్పుడు సైన్యంలో చేర బోయే వారికి పట్టబోయే గతి కూడా ఇదే" అని అట్టలపై వ్రాసి, వాటిని ఆ శవంపై ఉంచి ఆ శవాన్ని తీసుకునివెళ్ళి పట్టణం నడిబొడ్డులో ప్రజలు చూసే విధంగా ప్రదర్శనకు పెట్టారు.[18]

గుంటూరు జిల్లాలో యుద్ధ వ్యతిరేక కరపత్రాలను మొత్తం 500 గ్రామా లలో పంచిపెట్టి ప్రజలలో సామ్రాజ్యవాద యుద్ధ వ్యతిరేక భావనను పెంపొం దించారు.

సామ్రాజ్య వాదులకు వ్యతిరేకంగా స్వంతంత్ర పోరాటాన్ని తీవ్రతరం చేయాలని,ప్రభోధిస్తూ 1940,41 సంవత్సరాలలోస్వాతంత్రోత్సవ దినసందర్భంగా 20,000 తెలుగు కరపత్రాలను, జిల్లా అంతటా పంచారు. ముస్లిం ప్రజలలో సామ్రాజ్యవాద యుద్ధ వ్యతిరేకతను,స్వాతంత్ర్య పోరాటాన్ని పెంపొందించేందుకు ప్రత్యేకంగా 500 ఉర్దూ కరపత్రాలను పంచారు.[19] ఇక 'స్వతంత్ర్య భారత్' విషయానికొస్తే జిల్లాలోని 175 గ్రామాలకు 300 పత్రికలు రహస్యంగా అందించబడేవి.

యుద్ధ వ్యతిరేక ప్రచారాన్ని కొనసాగిస్తూనే ప్రజా సమస్యలపై ఆందో ళన కార్యక్రమాలను చేపడుతూ వర్గ సంఘాలను మరింత పటిష్టం పరిచేందుకు కమ్యూనిస్టులు కృషి చేసారు బాపట్ల, రేపల్లె తాలుకాలలోని 20 ఎకరాల బంజరు భూమిని సాగులోకి తేవాలని వాటిని వ్యవసాయ కూలీలకే ఇవ్వాలని వ్యవసాయ కూలీ సంఘం తరపున ప్రభుత్వంపై వత్తిడి తెచ్చారు. కొన్నిచోట్ల వ్యవసాయ స్వయంగా బంజరు భూములును సాగులోకి తెచ్చారు. ఈ విషయంలో ప్రభుత్వాధి కారుల బెదిరింపులను, వ్యక్తులు చేస్తున్న మోసాలను ఎప్పటికప్పుడు కమ్యూ నిస్టులు బట్టబయలుచేసి ప్రచారం చేసారు. వ్యవసాయకూలీ సమస్యలపై కేంద్రీక రించి పనిచేయడంవల్ల సత్తెనపల్లి, తెనాలి, రేపల్లె, ఒంగోలు, బాపట్ల తాలుకాలలో వ్యవసాయ కూలీ సంఘం నిర్మాణ మయింది. 1941 సెప్టెంబరు 13న దావు లూరులో జరిగిన జిల్లా రెండవ వ్యవసాయ కూలీ మహాసభకు 4,000 మంది వ్యవసాయ కూలీలను సమీకరించారు.[20] ఈ మహాసభ తరువాత తాలుకా ఆర్గనై

జర్లు ఏర్పడి జిల్లా అంతటా వ్యవసాయ కూలీ సమస్యలపై పోరాటాల్ని నిర్వ హించి ఆ సంఘాన్ని ఒక బలమైన సంఘంగా నిర్మించారు.

వ్యవసాయ కూలీ రైతాంగ సమస్యలతో పాటు స్థానిక సమస్యలపై కూడా కేంద్రీకరించి పని చేస్తూ అక్కవారిపాలెం, బ్రాహ్మణ కోడూరు, బేత పూడి, తుమ్మల మొదలగు గ్రామాలలో పార్టీ సెల్స్ నిర్మాణం 1941 నాటికి జరిగింది.

1941 జూన్ 22 తరువాత ప్రపంచ యుద్ధం స్వభావంలో వచ్చిన మార్పు తరువాత కమ్యూనిస్టు పార్టీ పంథాలో మార్పువచ్చింది. అయినా ప్రభుత్వం కమ్యూనిస్టులను వెనువెంటనే జైలునుంచి విడుదల చేయలేదు. సామ్రాజ్యవాద యుద్ధకాలంలో అరెస్టయిన కమ్యూనిస్టు కార్యకర్తలను 1942 ప్రథమ భాగంలో విడిచిపెట్టసాగికది. పార్టీపై నిషేధం తొలగిన తరువాత కమ్యూ నిస్టు పార్టీ సభ్యులు బహిరంగంగా పనిచేయడం ప్రారంభించారు.

రహస్య జీవితము గడుపుతున్న కార్యకర్తలు బహిరంగా వచ్చి పని చేయడానికి విస్తృత అవకాశాలు ఏర్పడ్డాయి. బహిరంగ అవకాశాలను వినియో గించుకుని రైతు కూలీ సామరస్యాన్ని పెంపొందిస్తూ అధికోత్పత్తిని సాధించేం దుకు దొంగ మార్కెట్టుదార్లకు వ్యతిరేకంగా జిల్లాలోని ప్రజల్ని సమీకరించడం జరిగింది. మరో వైపున కూలీ రేట్లు పెంపుకొరకు, పాలేర్ల సమస్యపైన ఉద్యమా లను నడిపి పార్టీ బలాన్ని పెంపొందించడం జరిగింది. అమృతలూరు పాలేర్ల విజయం జిల్లా అంతటా పెద్ద ప్రభావాన్ని చూపింది

గుంటూరు జిల్లా కమ్యూనిస్టు పార్టీ తృతీయ మహాసభ జరిగే నాటికి జిల్లా లోని 9 తాలుకాలకు పార్టీ విస్తరించింది 1935 లో గుంటూరు,తెనాలి పట్టణాలలో కేవలం 15 మంది సభ్యులు కలిగిన కమ్యూనిస్టు పార్టీ 1943 జూలై ఒకటి నాటికి జిల్లాలోని అన్ని తాలుకాలలో మొత్తం 60 సెల్లులలో 714 మంది సభ్యులు కలిగిన ప్రధాన రాజకీయ శక్తిగా రూపొందింది. పటిష్ఠవంతమైన ప్రజా సంఘాల నిర్మాణంతో ప్రజా సమస్యలపై పోరాడే పార్టీగా కమ్యూనిస్టు పార్టీ రూపొందింది.

1943 జూలై 1 న జిల్లా మహాసభ జరిగే నాటికి జిల్లాలో 14,141 మంది రైతు సంఘంలో సభ్యులుగావున్నారు అలాగే వ్యవసాయ కూలీ సంఘంలో 4686 మంది, యువజన సంఘంలో 4703 మంది విద్యార్థి సంఘంలో 2095 మంది మహిళా సంఘంలో 2536 మంది కార్మిక సంఘంలో 2250 మంది సభ్యులుగావున్నారు. 1,456 మందితో ప్రజా రక్షణదళం, 1018 మంది సభ్యులతో బాల సంఘం నిర్మాణమై ఉన్నాయి. జిల్లా మొత్తంలో పార్టీ కోసం పూర్తి కాలం పనిచేసే 150 మంది కార్యకర్తలతో పార్టీ ముందంజ వేస్తూ వుంది.

జిల్లాలో పార్టీ నిర్మాణాన్ని సంఘటితపరిచి, మరింత ముందుకు తీసుకు పోవడానికి వీలుగా నూతన జిల్లా కమిటీని ఈ మహాసభ ఎన్నుకుంది. ఈ కమిటీకి మోటూరు హనుమంతరావు (కార్యదర్శి) లావు బాలగంగాధరరావు, మాదాల వీరభద్రరావు, కొల్లా వెంకయ్య, ముక్కై వి మాధవాచార్య సభ్యులుగాను, వెనిగళ్ళ రామకృష్ణయ్య, కంతంనేని కోటేశ్వరరావు కాండిడేట్ సభ్యులుగాను ఎన్నికయ్యారు.

ఈ కాలంలో కమ్యూనిస్టు పార్టీ అనుసరించిన పాసిస్టు వ్యతిరేక విధానం కాంగ్రెసులోని అతివాద భావాలు కల్గిన వారిని కూడా ఆకర్షించింది. వావిలాల గోపాల కృష్ణయ్య, రావి అమ్మయ్య, దర్శి లక్ష్మయ్య కస్తూరి కుటుంబరావు వంటి కాంగ్రెసు అతివాద యువకులనేకమంది కమ్యూనిస్టు పార్టీ సభ్యులయ్యారు.

## ఆధారాలు


1. పోరాట పథంలో నేను - ప్రతాప రామసుబ్బయ్య - 85వ పేజీ
2. 15-4-1961 - సంఘం
3. కమ్యూనిజం 1975 డిసెంబరు, 95వ పేజీ
4. పోరాటపథంలో నేను - ప్రతాపరామసుబ్బయ్య
5. నండూరి ప్రసాదరావుతో ఇంటర్వ్యూ
6. డి. కామేశ్వరరావు - సమాచార పత్రం
7. డి. కామేశ్వరరావు - సమాచార పత్రం
8. 1985 అక్టోబరు, కమ్యూనిజం 78 వ పేజీ
9. గోవాడ నిరీక్షణ రావుతో ఇంటర్వ్యూ
10. దుర్భా కృష్ణమూర్తి స్మృతులు, 71 వ పేజీ
11. 1985 నవంబరు, కమ్యూనిజం, వై. వి కృష్ణరావు స్మృతులు 76వ పేజీ
12. కరణం రంగారావు, నర్సింగరావులతో ఇంటర్వ్యూ
13. 1939 నవంబరు, మద్రాసు ప్రభుత్వ పక్ష నివేదిక
14. కాగడ పత్రికలు, 12-6-40, 17-7-40
15. డి. కామేశ్వరరావు సమాచార పత్రం
16. గుంటూరుజిల్లా కమ్యూనిస్టుపార్టీ 3 వ మహాసభ నివేదిక 13 వ పేజీ
17. 1939, డిసెంబరు, కమ్యూనిస్టు (ఆంగ్ల పత్రిక) 5వ పేజీ
18. గుంటూరుజిల్లా కమ్యూనిస్టుపార్టీ 3వ మహాసభ నివేదిక 14 వ పేజీ

# నెల్లూరు జిల్లాలో కమ్యూనిస్టు పార్టీ నిర్మాణం

ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు ఉద్యమ చరిత్రలో నెల్లూరు జిల్లాకు ఒక ప్రత్యేకమైన స్థానం ఉంది. ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాణానికి, అభివృద్ధికి ప్రధాన కారకులలో ఒకరైన పుచ్చలపల్లి సుందరయ్య నెల్లూరు జిల్లాకు చెందినవారు.

భారత స్వాతంత్ర్య పోరాటంలో నూతన అధ్యాయాన్ని ప్రారంభించిన 1930 శాసనోల్లంఘన ఉద్యమం ఆసేతు హిమాచల పర్యంతం యువతను జాతీయ పోరాట స్రవంతిలోకి మళ్లించింది. 1930 ఏప్రియల్ 9 న దేశం నలుమూలలా చెలరేగిన ఉప్పు సత్యాగ్రహ ఉద్యమ ప్రభంజనానికి స్పందించి నెల్లూరు జిల్లాలోని యువకులు రాష్ట్రంలోని వివిధ సత్యాగ్రహ శిబిరాల్లో పాల్గొన్నారు. 1931 మార్చి 4 న గాంధీ - ఇర్విన్ ఒడంబడిక కుదరటం, సత్యాగ్రహ ఉద్యమం విరమించటం యువకులకు నిరాశ కలిగించింది. గాంధీజీ సిద్ధాంతంపట్ల ఈ యువకులకు అవిశ్వాసం ఏర్పడింది ఇటువంటివారిలో అలగాని పాడు గ్రామానికి చెందిన పుచ్చలపల్లి సుందరయ్య ఒకరు. మద్రాసు లయోలా కాలేజీ విద్యార్థిగా ఉన్న కాలంలోనే (1929) హెచ్.డి. రాజాతో సుందరయ్యకు పరిచయం ఏర్పడింది హెచ్ డి. రాజా వచ్చిన సందర్భంగా కాలేజీ హాస్టలులో ఏర్పాటుచేసిన సమావేశంలో కమ్యూనిజం అంటే ఏమిటి? అనే అంశంపై ఆయన చేసిన ప్రసంగం సుందరయ్యను ఆకట్టుకుంది. క్రమంగా హెచ్ డి. రాజు అందించిన కమ్యూనిస్టు మానిఫెస్టో, తదితర సోషలిస్టు సాహిత్యం సుందరయ్యను కమ్యూనిస్టు అభిమానిగా మార్చాయి. తనతోపాటు హాస్టలులో ఉన్న కంభంపాటి సత్యనారాయణ, పి కె. నరసింహన్‌లతో కలిసి కమ్యూనిస్టు సాహిత్య అధ్యయనం చేసారు తిరిగి బెంగుళూరులో ఇంటర్మీడియట్ రెండవ సంవత్సరం చదువుతున్న కాలంలో (193 ) కబ్బన్ పార్కు లైబ్రరీలోని సోషలిజం, కమ్యూనిజం, రష్యన్ విప్లవం గూర్చి దొరికిన సాహిత్యాన్ని అధ్యయనంచేసి కమ్యూనిజంపట్ల ఒక స్పష్టమైన అవగాహనకు ప్రయత్నించారు.

గాంధీ మార్గం పట్ల అవిశ్వాసం ఏర్పడినా ఆ మార్గంలో స్వాతంత్ర్యం సాధించడం అసాధ్యం అని పూర్తిగా నిర్ధారణకు రాని సుందరయ్య పూర్తి కాలం

కార్యకర్తగా రంగంలోకి దిగటానికి సిద్ధం కాలేదు. అమీర్ హైదర్‌ఖాన్ బెంగుళూరు వచ్చి తనతో కల్సిన సందర్భంలో కూడా తన చదువు పూర్తి కావాలి ఆ తరువాతనే పార్టీ కోసం పూర్తి కాలం కార్యకర్తగా పనిచేస్తాను అని చెప్పటం జరిగింది.

అయితే 1931 డిసెంబరులో చదువు పూర్తి చేయకుండానే సుందరయ్య అలగానిపాడు తిరిగి వచ్చి తిరిగి తన సాంఘిక సేవా కార్యక్రమాలను ప్రారంభించారు. వ్యవసాయ కూలీలను వ్యాపారస్థుల దోపిడీ నుండి అరికట్టడానికి సహకార దుకాణాన్ని, వ్యవసాయ కూలీల పిల్లల కోసం ఒక ప్రాథమిక పాఠశాలను ఏర్పాటు చేసి వారిని సమీకరించేందుకు ప్రయత్నాలు చేసారు. సాంఘిక సేవా కార్యక్రమాలతో పాటు అలగాని పాడు చుట్టు ప్రక్కల గ్రామాలలో రాజకీయాంశాలను బోధించడం, వారిలో రాజకీయ చైతన్యాన్ని పెంపొందించడం, గ్రామంలోని గ్రంథాలయాన్ని సక్రమంగా నిర్వహించడం లాంటి కార్యక్రమాలను చేపట్టారు. స్వగ్రామంలో ఈ కార్యక్రమాలు నిర్వహిస్తూనే 1933 చివరి నుండి రాష్ట్రంలోని అతివాద కాంగ్రెసు యువకులను కలుసుకుంటూ కమ్యూనిస్టు పార్టీ నిర్మాణం గురించి చర్చలు జరిపారు. ఈ కృషిలో భాగంగానే నెల్లూరు జిల్లాలోని అతివాద కాంగ్రెసు యువకులను కమ్యూనిజం వైపుకు ఆకర్షించేందుకు కూడ ప్రయత్నించారు.

కాంగ్రెసు వాదులుగా ఉన్న వెన్నెల కంటి రాఘవయ్య, ముత్తరాజు గోపాలరావు, బొమ్మా శేషురెడ్డి, గండవరపు హనుమారెడ్డి మొదలగు వారితో నిత్య సంబంధాలు పెట్టుకుంటూ వారిలో అతివాద భావాలును పెంపొందించేందుకు కృషి చేసారు. మరో వైపున టెర్రరిస్టు భావాల వైపు ఆకర్షితులైన దువ్వూరి బలరామిరెడ్డి, చుండి జగన్నాథం, రావి ఆదిశేషయ్య మొదలగు యువకులతో వ్యక్తిగత హింసా వాదనవల్ల ప్రయోజనం లేదని కార్మిక కర్షకులను సంఘటిత పరచనిదే స్వాతంత్ర్యం సాధించడము అసాధ్యమని చర్చిస్తూ, వారిని కూడా కమ్యూనిజం వైపుకు ఆకర్షించేందుకు ప్రయత్నించారు. కాంగ్రెసు వాదులను, టెర్రరిస్టు యువకులను కమ్యూనిజం వైపుకు ఆకర్షించేందుకు ప్రయత్నిస్తూనే వ్యవసాయ కూలీలను సంఘటిత పరిచి 1934 లో అలగాని పాడులో వ్యవసాయ కార్మిక సంఘాన్ని ఏర్పాటు చేసారు. అతివాద భావాలు కల్గిన నెల్లూరు జిల్లా కో-ఆపరేటివ్ బ్యాంకు కార్యదర్శి ఖండవల్లి కృష్ణారావుతో కూడా పరిచయం పెట్టుకుని కమ్యూనిస్టు సాహిత్యాన్ని అందించి వారిని కూడా కమ్యూనిజం వైపుకు ఆకర్షించారు. ఈ కార్యక్రమాలు జరుగుతున్న కాలంలోనే 1934 మే నెలలో విడుదలైన అమీర్ హైదర్‌ఖాన్‌ను కల్సుకుని పార్టీ నిర్మాణ పరిస్థితిని గురించి చర్చించి వివరాలు తెలుసుకున్నారు.[2]

1934 సెప్టెంబరులో అమీర్ హైదర్‌ఖాన్ తిరిగి అరెస్టు కావడంతో కమ్యూనిస్టు ఉద్యమాన్ని నిర్మించే బాధ్యతను తీసుకున్నారు.

1933 మద్రాసు కుట్ర కేసులో అరెస్టయిన చుండి జగన్నాథం, రావి ఆదిశేషయ్యలు 1935 విడుదలై వచ్చారు. వీరు వేలూరు జైలులో ఉన్న కాలంలో మార్క్సిస్టు సాహిత్యం అధ్యయనం చేసి కమ్యూనిస్టు సిద్ధాంతాలు గురించి, రష్యన్ విప్లవం గురించి ఒక అవగాహనకు వచ్చారు. జైలులో ఉన్న కాలంలోనే 'సర్కార్' అనే బెంగాల్ కార్మికుడితో చర్చలు జరిపి మార్క్సిస్టు అవగాహనను పెంచుకున్నారు. జైలు నుంచి విడుదలై వచ్చిన తర్వాత సుందరయ్యతో కలిసి పనిచేయడానికి సంసిద్ధులయ్యారు. ఇదే కాలంలో ఇందుకూరుకు చెందిన బస్వారెడ్డి శంకరయ్య కూడా వామపక్ష భావాలవైపు ఆకర్షితులయ్యారు. జైలు నుంచి విడుదలై వచ్చిన రావి ఆదిశేషయ్య, చుండి జగన్నాథంగార్లతో పరిచయం యేర్పరుచుకుని కమ్యూనిస్టు సాహిత్యాన్ని అధ్యయనం చేసారు.

కమ్యూనిస్టు భావాలపట్ల ఆకర్షితులైన చుండి జగన్నాధం, రావి ఆదిశేషయ్య, బస్వారెడ్డి శంకరయ్య, ఖండవల్లి కృష్ణారావు, పూసపాటి నరసింహరాజుగార్లు 1935 జులై 1 న నెల్లూరు లేబర్ ప్రొటెక్షన్ లీగ్‌ను ఏర్పాటు చేసారు. వివిధ కార్మికులను సంఘటితపరిచి వారి సమస్యలపై పోరాడేందుకు ఏర్పడిన ఈ కూలీ సంరక్షణ సమితికి కార్యదర్శిగా రావి ఆదిశేషయ్య వ్యవహరించారు. పట్టణ కార్మికుల సమస్యలపైనే కాకుండా గ్రామీణ వ్యవసాయ కార్మికుల సమస్యలపై కూడా తగిన శ్రద్ధను, చొరవను ఈ లేబర్ ప్రొటెక్షన్ లీగ్ చూపింది. 1935 జూలై నెలలో అలగానిపాడు గ్రామ వ్యవసాయ కూలీలు వేతన పెంపు కొరకు చేసిన సమ్మెకు కూలీ సంరక్షణ సమితి సభ్యులు ప్రత్యక్షంగా మద్దతునిచ్చి విజయం చేకూర్చారు ఈ సమ్మె ప్రభావం క్రమక్రమంగా ఇతర గ్రామాలకు కూడా విస్తరించి రోజుకు ఎనిమిది గంటలు పని మాత్రమే ఉండాలని వేతనాన్ని ధాన్యరూపంలో చెల్లించేటప్పుడు సరికొలతలు కొలవాలని వ్యవసాయ కూలీలు డిమాండ్ చేస్తూ సమ్మెలు నిర్వహించారు.

ప్రెస్ కార్మికులను సంఘటితపరిచి కార్మిక సంఘాన్ని ఏర్పాటు చేసేందుకు కూలీ సంరక్షణ సమితి సభ్యులు ప్రయత్నించారు. 1935 జులై 28 న నెల్లూరులోని వివిధ ప్రెస్ కార్మికులను సమావేశపరిచి ప్రెస్ కార్మిక సంఘ ఏర్పాటుకు రావి ఆదిశేషయ్య అధ్యక్షతన ఒక కన్వీనింగ్ కమిటీని ఏర్పాటు చేసారు.

ఈ కూలీ సంరక్షణ సమితి కార్యక్రమాలలో కాంగ్రెస్‌లోని అతివాదులుగా ఉన్న వారుసహితం ఎంతో చురుకుగా పాల్గొనేవారు. కాంగ్రెసు కార్యకర్తగా

ఉన్న ముత్తరాజం గోపాలరావు కమ్యూనిస్టు కార్యకర్తలతో సమానంగా కార్య క్రమాలలో పాల్గొనేవారు కార్మికులను సంఘటిత పర్చడం, వారి సమస్యలపై పోరాటాలు జరుపడంతో పాటుగా వారిలో రాజకీయ చైతన్యాన్ని పెంపొందించ డానికి కూడా కూలీసంరక్షణ సమితి సభ్యులు కృషి చేసారు. ఇందులో భాగం గానే 'తిప్పరాజు గోడ వారపత్రిక'ను ప్రచారంలోకి తెచ్చారు. దేశ రాజకీయ పరిస్థితులును తెలియజేస్తూ ప్రతిరోజూ సత్రం (నెల్లూరు) గోడపై వార్తలు వ్రాయడం,అప్పుడప్పుడు సమావేశాలు ఏర్పాటుచేయడం ఈ కూలీసంరక్షణ సమితి కార్యక్రమాలలో ఒక భాగంగా ఉండేవి. కమ్యూనిస్టు భావాలను జిల్లా అంతటా వ్యాపింప జేయడానికి కూలీ సంరక్షణ సమితి సభ్యులు గ్రామాలలో తిరుగుతూ సభల నిర్వహించేవారు. జాతీయ భావాలు కలిగి అతివాదులుగా ఉన్న యువకులు తారసపడితే వారికి కమ్యూనిస్టు మానిఫెస్టో తదితర సోషలిస్టు సాహిత్యాన్ని అందించి వాటిని చదవమనేవారు. 3

వివిధ మార్గాలద్వారా కమ్యూనిస్టు భావాలపట్ల ఆకర్షితులై కార్మిక వ్యవసాయ కూలీలలో పనిచేస్తున్న కూలీ సంరక్షణ సమితి సభ్యులతోనే నెల్లూరు జిల్లా కమ్యూనిస్టు పార్టీ ఏర్పడింది. 1935 మధ్య కాలానికే చుండి జగన్నాథం, రావి ఆదిశేశయ్య, ఖండవల్లి కృష్ణారావు కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వాన్ని పొందారు. కూలీ సంరక్షణ సమితి కార్యక్రమాలలో పాల్గొంటూ బస్వారెడ్డి, శంకరయ్యలు, పూసపాటి నరసింహరాజు 1936 నాటికి పార్టీ సభ్యులు అయ్యారు.

క్రమ క్రమంగా జిల్లా అంతటా / పెరుగుతున్న కమ్యూనిస్టు ప్రచారం, కూలీ సంరక్షణ సమితి కార్యక్రమాలపై పోలీసుల కన్నుపడింది. వీటని నిరో ధించే ఉద్దేశ్యంతో 1935 ఆగష్టు నెలలో నెల్లూరు కూలీ సంరక్షణ సమితి ఆఫీసుపై పోలీసులు దాడి చేసారు. నిషిద్ధ సాహిత్యం, కరపత్రాలు లభించాయని ప్రభుత్వ వ్యతిరేక కార్యక్రమాలలో పాల్గొంటున్నారని ఆరోపిస్తూ చుండి జగన్నాథం, గావి ఆదిశేషయ్యలను అరెస్టు చేసారు. సెషన్సు కోర్టులో 6 నెలలు శిక్ష వేయగా అప్పీలులో ఆ శిక్షను హైకోర్టు కొట్టివేసింది. 4

దాదాపు ఇదే సమయంలో గుంటూరు మద్రాసు కూలీ సంరక్షణ సమితి ఆఫీసులపై కూడ దాడిచేసి అక్కడి కమ్యూనిస్టు కార్యకర్తలనుకూడా అరెస్టు చేసి శిక్షలు విధించారు.

కమ్యూనిస్టు కార్యకర్తలు కలిగించిన చైతన్యం మూలంగా వెగూరు, విడవలూరు, మోడేగుంట, కాకుపల్లి, పూడిపర్తి మొదలగు గ్రామాలలోని వ్యవ సాయ కూలీలు 1935-36 మధ్యకాలంలో అనేక సమ్మెలను నిర్వహించారు. కొన్ని గ్రామాలలో సమ్మెలు ధీర్ఘకాలం పాటు జరిగాయి. కాంగ్రెసు కార్యకార్తగా

ఉంటూనే, వ్యవసాయ కూలి సమస్యలపై పోరాటాలు నిర్వహిస్తున్న వెన్నెల కంటి రాఘవయ్య కమ్యూనిస్టు కార్యకర్తలు నిర్వహించే ఈ సమ్మేళలకు తన సహాయ సహకారాలను అందించారు.

1936 మార్చి నెలలో ఏ. యస్. కె. అయ్యంగారిని ఆహ్వానించి నెల్లూరు యూత్ లీగ్ సమావేశాన్ని ఏర్పాటు చేశారు. సామ్రాజ్యవాద ప్రభుత్వాని దుయ్య బడుతూ అయ్యంగార్ చేసిన ప్రసంగంపై ప్రభుత్వం ఆయనను శిక్షించేందుకు ప్రయత్నించింది. సత్యాగ్రహోద్యమంలో పాల్గొని వెంకటగిరి ప్రాంతంలో రైతులను, యువకులను సమీకరిస్తున్న బీరం రామనాథం కూడా ఈ కాలంలోనే వామ పక్ష భావాలవైపు ఆకర్షితులయ్యారు. వెంకటగిరి ప్రాంతంలో యువజనోద్యమానికి పునాది ఏర్పడటానికి బీరం రామనాథం చేసిన ప్రయత్నాలే కారణం. వీరి కృషి వల్లనే వెంకటగిరిలో యువజన సంఘం ఏర్పడింది. 1936 లో ఏర్పడిన ఈ యువజన సంఘానికి సి. గుర్నాధం అధ్యక్షతన 9 మంది సభ్యులతో ఒక కమిటీ కూడా ఏర్పాటైంది.[5]

సామ్రాజ్యవాద పోరాటంలో యువజనులను సమీకరించి ఒక ప్రధాన శక్తిగా రూపొందించేందుకు 1936 నవంబరులో కమ్యూనిస్టు పార్టీ నాయకుడైన డాంగే నెల్లూరు జిల్లాలో పర్యటించారు. ఈ సందర్భంలో జిల్లాలోని అనేకమంది యువకులను డాంగే కలుసుకుని కమ్యూనిస్టు పార్టీ సిద్ధాంతాల గురించి, విధానాల గురించి వివరించారు.

క్రమంగా 1937 వచ్చేసరికి జిల్లాలోని రైంతాంగంలో అతివాద భావాలు కల్గిన క్యాడరు తయారైంది. రైతాంగ సమస్యలపై పోరాడుతూ కొవ్వూరు తాలూకాకు చెందిన అల్లూరూ రంగయ్య, భీమవరపు శేషయ్య, దామినేని అక్కయ్య, ఆత్మకూరు తాలుకాకు చెందిన జి. సి. కొండయ్య, పాములపాటి నరసయ్య, గంగాపెదకొండయ్య, గుది పెంచలయ్య మొదలైనవారు కమ్యూనిస్టు పార్టీతో సన్నిహితంగా పనిచేసే రైతు సంఘ కార్యకర్తలుగా తయారయ్యారు. వెంకటగిరి జమిందారుకు వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో కమ్యూనిస్టు పార్టీ సానుభూతి పరులుగా ఉన్న ఈ రైతు యువకులు, జమీన్ రైతు సంఘ కార్యకర్తలతో కలిసి పని చేశారు.

1937 మద్రాసు రాష్ట్ర అసెంబ్లీ ఎన్నికలలో నెలూరు జిల్లాలోని కమ్యూనిస్టు పార్టీ సభ్యులు సానుభూతిపరులు కాంగ్రెస్ విజయానికి గట్టి కృషిచేసారు. గూడూరు నియోజకవర్గానికి జస్టిస్ పార్టీ అభ్యర్థిగా పోటీచేసిన వెంకటగిరి జమీందార్ మహా రాజకుమార్‌ను ఓడించడానికి యువజన సంఘకార్యకర్తలు, రైతు సంఘ కార్యకర్తలు గ్రామ గ్రామాన తిరిగి ప్రచారంచేసారు. ఈ నియోజక

వర్గంలో కమ్యూనిస్టు కార్యకర్తగావున్న బీరం రామనాథం ఒకప్రక్క కాంగ్రెసు విజయం కొరకు గ్రామ గ్రామాన తిరిగి ప్రచారం చేస్తూనే మరో ప్రక్క సోష లిస్టు సాహిత్యాన్ని గ్రామాలలో అమ్ముతూ సోసలిస్టు ప్రచారం కూడా చేసారు.

ఈ ఎన్నికలలో కమ్యూనిస్టులు చేసిన సామ్రాజ్యవాద వ్యతిరేకప్రచార ప్రభావం జిల్లా ప్రజలపై ప్రగాఢ ప్రభావాన్ని కలిగించింది.

ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభకు వచ్చిన బాట్లీవాలా 1937 సెప్టెం బరులో నెల్లూరు, కావలి, వెంకటగిరి పట్టణాలలో పర్యటించి సోషలిస్టు సిద్ధాంతా లను విస్తృతంగా ప్రచారం చేసారు.

1937 సెప్టెంబరు 3 న వెంకటగిరిలో జరిగిన సభలో సామ్రాజ్యవాద ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శిస్తూ బాట్లీవాలా చేసిన ప్రసంగం యువకులను ఎంతో ఉత్తేజాన్ని ఇచ్చింది. ఈ సభలో బాట్లీవాలా చేసిన ప్రసంగానికే ఆయనపై కేసుపెట్టి 6 నెలల శిక్షనువిధించారు. ఆ తరువాత 1937 నవంబరులో జయప్రకాశ్ నారాయణ కూడా నెల్లూరు జిల్లాలో పర్యటించి సోషలిస్టుసిద్ధాంత ప్రచారం చేసారు. ఈ నాయకులు చేసిన ప్రచారం జిల్లాలోని అనేకమంది యువకులను విద్యార్థులును, సోషలిస్టు భావాలవైపు ఆకర్షించింది. ఈ కాలంలోనే నెల్లూరు వి.ఆర్. కళాశాల విద్యార్థులు కూడా వామపక్షభావాలవైపు ఆకర్షితు లయ్యారు. వి. ఆర్. కళాశాల విద్యార్థులుగావున్న అరిశ సుందరరాజన్, ఆమంచర్ల గంగాధరరావు కమ్యూనిస్టుల పరిచయంతో, విద్యార్థులను సమీకరించి స్టూడెంట్ ఫెడరేషన్ కార్యక్రమాలను 1937 లోనే ప్రారంభించారు. క్రమంగా విద్యార్థి ఫెడరేషన్ ఒక బలమైన సంఘంగా రూపొందింది. 1938 జనవరి 29, 30 లతో ప్రథమ జిల్లా మహాసభ జరిగింది.

1937, 38 లలో జరిగిన కొత్తపట్నం, మంతెనవారిపాలెం రాజకీయ సిద్ధాంత పాఠశాలలు నెల్లూరు జిల్లాకు ఎంతో మంది సుశిక్షితులైన కార్యకర్తలను అందించాయి. ఈ రెండు పాఠశాలలు తరువాత నెల్లూరు జిల్లాలో పార్టీ సభ్యత్వం గణనీయంగా పెరిగింది. అల్లూరి రంగయ్య, భీమవరపు శేషయ్య, రామినేని అక్కయ్య, జి సి. కొండయ్య, పాములపాటి నరసయ్య, గంగాపెద కొండయ్య గుడి పెంచలయ్య, సూకలపాటి శంకరయ్య, కోట అబ్బయ్య శెట్టి, అంశ సుందర రాజన్ మొదలైనవారంతా 1938 మధ్య కాలానికి పార్టీ సభ్యులుగా వచ్చారు.

విస్తృతమవుతున్న పార్టీ కార్యక్రమాలకనుగుణంగా పార్టీ ఆర్గనైజేషన్‌ను అభివృద్ధిపరచడానికి 1938 లో రాష్ట్ర కమిటీ తరఫున పి వి శివయ్య నెల్లూరు జిల్లా ఆర్గనైజరుగా వచ్చారు. దాదాపు 6 నెలలకు పైగా నెల్లూరు జిల్లాలో ఉండి కమ్యూనిస్టు పార్టీకి ఒక నిర్మాణరూపం ఇచ్చేందుకు ప్రయత్నంచేసారు.

నెల్లూరు వి.ఆర్. కళాశాల విద్యార్థులు వి బి. యం. హైస్కూలు విద్యార్థులు డిటెన్షన్లకు వ్యతిరేకంగా విద్యార్థి ఫెడరేషన్ నాయకత్వంలో 1938 ఫిబ్రవరిల్లో సమ్మెచేసి విజయం సాధించారు.

రాష్ట్రంలో ఎక్కడా జరగని ఒక విచిత్రమైన సమ్మె నెల్లూరు జిల్లాలో జరిగింది. నెల్లూరు రోమన్ కాథలిక్ చర్చిలో ఉన్న కుల భేదానికి వ్యతిరేకంగా 1938లో కమ్యూనిస్టు నాయకత్వంలో చర్చి సమ్మెజరిగింది.[6]

వివిధ ప్రజా రంగాలలో పార్టీ సభ్యులు నిర్వహిస్తున్న కార్యక్రమాలను సమీక్షించుకుని, పార్టీకి ఒక నిర్మాణ రూపం ఇచ్చేందుకు 1938లో జిల్లా మహా సభ ఇందుపూరులో జరిగింది. ఈ రహస్య కాన్ఫరెన్సులో చుండి జగన్నాథం కార్యదర్శిగా ఒక జిల్లాకమిటీ ఏర్పాటైంది. రావి ఆదిశేషయ్య, బస్వారెడ్డి శంకరయ్య, పూసపాటి నరసింహరాజు, పుచ్చలపల్లి గోవిందమ్మ, బాలసుబ్రమణ్యం జిల్లా కమిటీ సభ్యులుగా ఉన్నారు.

జిల్లా కాన్ఫరెన్సు జరిగే నాటికి జిల్లా మొత్తం మీద 25 మంది దాకా పార్టీ సభ్యులున్నారు. వీరు వివిధ ప్రజా సంఘాలలో పనిచేస్తూ బలమైన సామ్రాజ్య వాద వ్యతిరేకశక్తిగా రూపొందారు ప్రధానంగా వ్యవసాయ కూలీ, రైతు సంఘాల కార్యక్రమాలలో పాల్గొంటూ జమీందారు వ్యతిరేక పోరాటాన్ని తీవ్ర తరం చేసారు.

జిల్లా రహస్య కాన్ఫరెన్సు జరిగిన కొద్ది నెలలకే చుండి జగన్నాథం ప్రధాన బాధ్యతల నుండి వైదొలగడంతో 1939 నుండి బస్వారెడ్డి శంకరయ్య జిల్లా ఆర్గనైజింగుకమిటీ కార్యదర్శిగా బాధ్యతలు స్వీకరించారు. ఆ సంవత్సరంలోనే జి.సి. కొండయ్యనుకూడా జిల్లా కమిటీలోకి కోఆప్టు చేసుకున్నారు.[7]

వివిధ ప్రజా సంఘాలలో పని చేస్తున్నా పార్టీ సభ్యులకు తగిన శిక్షణ ఇచ్చేందుకు 1939 మే నెలలో ఒక రాజకీయ పాఠశాలను మైపాడులో నిర్వహించారు. ఈ పాఠశాలలో ప్రజాసమస్యలు, ప్రజల్లో పనిచేయు విధానంపై మాత్రమే క్లాసులు జరిగాయి. మైపాడు పాఠశాలకు కామ్రేడ్ ఎస్.వి. ఘాటే కూడా హాజరయ్యారు.

అరెళ సుందర రాజన్, ఆమంచర్ల గంగాధర రావుల నాయకత్వంలో 1939 నాటికి జిల్లాలో విద్యార్థి ఫెడరేషన్ కార్యక్రమాలు విస్తృతమయ్యాయి. విద్యార్థులనుండి కొత్త కేడరు కమ్యూనిస్టు పార్టీ వైపుకు ఆకర్షించబడ్డారు. కడప జిల్లాకు చెందిన పంజం నరసింహారెడ్డి 1939-40 సంవత్సరములలో నెల్లూరు వి. ఆర్. కళాశాల విద్యార్థిగాఉన్నతరుణంలోనే విద్యార్థి ఫెడరేషన్ కార్యక్రమాలలో పాల్గొంటూ కమ్యూనిస్టు పార్టీలో చేరారు. ఆమంచర్ల పురుషోత్తం కూడా 39 చివరి నాటికి పార్టీ సభ్యుడిగా వచ్చారు.

రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమయ్యే నాటికి వెంకటగిరి, కొవ్వూరు ఆత్మకూరు తాలూకాలు పార్టీకి బలమైనకేంద్రాలుగా ఏర్పడ్డాయి. జిల్లాలోని కమ్యూనిస్టులు యుద్ధ వ్యతిరేక ప్రచారాన్ని పెద్దఎత్తున చేపట్టారు. యుద్ధ నిధి వసూలును, సైన్యంలోకి రిక్రూట్‌మెంట్‌ను వ్యతిరేకిస్తూ వాల్‌పోస్టర్లు, కరపత్రాల ద్వారా ప్రచారం కొనసాగించారు. కమ్యూనిస్టు పార్టీ రహస్యంగా ముద్రిస్తున్న 'స్వతంత్ర భారత్' పత్రాలు జిల్లాలో పంపకం జరిగేవి. ఆత్మకూరు, నెల్లూరు, కొవ్వూరు తాలూకాల్లో 100 'స్వతంత్ర భారత్' పత్రాలు పంపకం చేసే వారు.

యుద్ధ నిధికి సహాయం చేయమని కోరుతూ జిల్లా మెజిస్ట్రేట్ వెంకటగిరి తాలూకా గ్రామాలలో పర్యటిస్తూండగా, మరో ప్రక్క బీరం రామానాథం, చిన్న చిన్న గ్రూపు సభలు జరిపి యుద్ధనిధిని ఇవ్వద్దని అత్తివరం, పిరమిడి మొదలగు గ్రామాలలో యుద్ధ వ్యతిరేక ప్రచారంచేస్తూ మెజిస్ట్రేటు లంచగొండితనాన్ని కూడా బట్టబయలు చేశారు.

యుద్ధ ప్రారంభానికి ముందు నిరుద్యోగులు, మహమ్మదీయులు ఎక్కువగా ఉన్న ప్రాంతాలను ఎంచుకొని మరీ ప్రభుత్వం మున్సబులద్వారా సైనిక రిక్రూట్‌మెంట్‌కు ప్రయత్నించింది. ఇది గ్రహించిన కమ్యూనిస్టు కార్యకర్తలు, దళాలుగా ఏర్పడి అదే గ్రామాలలో యుద్ధ వ్యతిరేక ప్రచారాన్ని ముమ్మరం చేసారు బహిరంగ సభల ద్వారా యుద్ధంలో చేరితే కలిగే నష్టాన్ని, స్వాతంత్ర్య పోరాటాన్ని తీవ్రతరం చేయవల్సిన ఆవశ్యకతను గ్రామీణులకు బోధించారు. ఆత్మకూరు తాలూకాలోని అనంత సాగరం, దుంగుపల్లె, కామిరెడ్డిపాడు, గౌరవరం, తోపుగుంట, కేతుగుంట, కాంసాపేట మొదలగు గ్రామాలలో విస్తృతంగా ప్రచారం జరిగింది. 1939 డిసెంబరులో జిల్లా మొత్తంమీద నూరుగ్రామాలలో యుద్ధ వ్యతిరేక సభలు జరిగాయి. 1940 జనవరిలో రహస్యంగా యుద్ధ వ్యతిరేక కర పత్రాలను పంచారు.

కమ్యూనిస్టు పార్టీ నిర్వహిస్తున్న యుద్ధ వ్యతిరేక ప్రచారం తీవ్రతరమైన కొద్దీ పార్టీ సభ్యులపై ప్రభుత్వ నిర్బంధం హెచ్చింది. 1940 జూన్ నెలలో అల్లూరి రంగారెడ్డి, బస్వారెడ్డి శంకరయ్య, రావి ఆదిశేషయ్యలను ప్రభుత్వం అరెస్టు చేసి నెల్లూరు సెంట్రల్ జైలులో నిర్బంధించింది. ఖండవల్లి కృష్ణారావును 1940 ఆగష్టులో ఇంటెర్న్ చేసింది. కమ్యూనిస్టు పార్టీ సభ్యులు సానుభూతి పరులుగా ఉన్న వారందరి పైన ప్రభుత్వ నిఘా పెరిగింది. ప్రభుత్వ నిఘాను తప్పించుకుంటూ యుద్ధ వ్యతిరేక ప్రచారాన్ని తీవ్రతరం చేయటానికి ముఖ్యకార్య

కర్తలంతా రహస్య జీవితం ప్రారంభించారు. ముమ్మరంగా యుద్ధ వ్యతిరేక ప్రచారం కొనసాగుతున్న ఈ కాలంలోనే దువ్వూరి రమణారెడ్డి, గూడూరుకు చెందిన సి. సి. సుబ్బయ్యా కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వాన్ని పొందారు. జిల్లాలోని ప్రధాన నాయకత్వం అరెస్టు కావడంతో యుద్ధ వ్యతిరేక ప్రచారాన్ని చురుకుగా సాగించటానికి వెంకటగిరి ప్రాంతంలోని డి. వి. శేషయ్య, కె. వి. సుబ్బయ్య, రామనాధం పార్టీ హోల్ టైమర్లుగా బాధ్యతలు స్వీకరించారు.

నెల్లూరు జిల్లా అంతటా ప్రచారం చేస్తూనే ప్రక్కనేఉన్న చిత్తూరు జిల్లాలో కూడా యుద్ధ వ్యతిరేక ప్రచారాన్ని కమ్యూనిస్టు భావ ప్రచారాన్ని బీరం రామనాథం మొదలగు కమ్యూనిస్టు కార్యకర్తలు నిర్వహించారు.

1940-41 సంవత్సరాలలో నెల్లూరు, రాయలసీమ జిల్లాలకు రాష్ట్ర పార్టీ ఆర్గనైజరుగా ఉన్న ఏటుకూరి బలరామమూర్తి తరచు నెల్లూరు జిల్లాకు వెళ్ళి తాలూకాలలోని పార్టీ కార్యకర్తలను సమావేశపరచి కార్యక్రమాలను సమీక్షిస్తుండే వారు. 1941 జూన్‌లో సోవియట్ యూనియన్‌పై హిట్లరు దాడి జరగడం, పార్టీ పాలసీలో వచ్చిన మార్పు ఫలితంగా 1942 ప్రారంభానికి పార్టీ సభ్యులు బహిరంగంగా పనిచేయడానికి అవకాశాలు లభించాయి. అరెస్టు అయిన పార్టీ కార్యకర్తలు విడుదల చేయబడ్డారు. జిల్లాలో పార్టీ నిర్మాణాన్ని మరింత విస్తృత పరచడానికి వీలుగా 1942 మధ్య కాలంలో దివి తాలూకా నుండి పరుచూరి రామకోటయ్యను రాష్ట్రకమిటీ నెల్లూరు జిల్లాకు పంపింది. 1942-43 కాలంలో గూడూరు తాలూకాకు కూడా పార్టీ విస్తరించి నిర్మాణ రూపం దాల్చింది. వెంకటగిరి తాలూకాలోని చేనేత కార్మికులలోకి అమెచ్యూర్ ఆర్టిస్టులలోకి పార్టీ విస్తరించింది. 1942లో వెంకటగిరిలో ఏడు పార్టీ సెల్స్, చుట్టుప్రక్కల గ్రామాల్లో మరో 5 పార్టీ సెల్సు ఏర్పడ్డాయి. 1942 చివరినాటికి నెల్లూరు, గూడూరు కొవ్వూరూ, ఆత్మకూరు, వెంకటగిరి తాలూకాల్లో పార్టీనిర్మాణం ఏర్పడింది. జిల్లాలో ఒక ప్రధాన రాజకీయశక్తిగా కమ్యూనిస్టు పార్టీ ఏర్పడింది.

విస్తరిస్తున్న పార్టీ నిర్మాణాన్ని సంఘటిత పరచి ఫాసిస్టు వ్యతిరేక ప్రచారాన్ని ప్రజలలో తీవ్ర ప్రచారం చేయడానికి, పార్టీ కార్యక్రమాలను సమీక్షించుకుని ముందుకుపోవడానికి జిల్లా పార్టీ మహాసభను నెల్లూరులో నిర్వహించారు. 1943 జూలై 3, 4 తేదీలలో జరిగిన ఈ మహాసభలో నూతన జిల్లా కమిటీ ఏర్పాటైంది. ఈ కమిటీకి ఖండవల్లి కృష్ణారావు కార్యదర్శిగా, బస్వారెడ్డి శంకరయ్య, పి. రామ కొండయ్య, పి. సి. సుబ్బయ్యలు కమిటీ సభ్యులుగా ఎన్నికయ్యారు [8]

## ఆధారాలు


1. విప్లవ పథంలో నా పయనం - పి. సుందరయ్య 60 పేజీ.
2. విప్లవ పథంలో నా పయనం - పి. సుందరయ్య, 68 వ పేజీ.
3. 10-7-36, మద్రాసు ప్రభుత్వ పబ్లిక్ డిపార్టుమెంటు, జి. ఓ. నెం. 1291.
4. 1975 డిసెంబరు, కమ్యూనిజం, 68 వ పేజీ.
5. బీరం రామనాథం సమాచార పత్రం.
6. 1975 డిసెంబరు, కమ్యూనిజం. 104 వ పేజీ.
7. బస్వారెడ్డి శంకరయ్య ఇంటర్వ్యూ.
8. 21-7-43, ప్రజాశక్తి, 11 వ పేజీ.

# అనంతపురం జిల్లాలో కమ్యూనిస్టు పార్టీ నిర్మాణం

1930 దశకం చివరి భాగంలో కమ్యూనిస్టు భావాల ప్రభావం ఈ జిల్లాకు కూడా విస్తరించింది. క్రమంగా 1943లో కమ్యూనిస్టుపార్టీకి ఒక నిర్మాణ రూపం ఏర్పడింది.

మద్రాసు రాష్ట్ర అసెంబ్లీకి 1937లో జరిగిన ఎన్నికలు జిల్లా రాజకీయాలను ఒక మలుపు త్రిప్పాయి. ఈ ఎన్నికలలో హిందూపూర్, అనంతపురం నియోజక వర్గాలలో కాంగ్రెసు ఘన విజయం సాధించింది. జస్టిస్ పార్టీ తరఫున పోటీ చేసిన అభ్యర్థులు ఘోర పరాజయం పొందారు. జిల్లాలో కర్నాటక భూస్వామిగా పేరు పొందిన పాముదుర్తి బయ్యపురెడ్డి జస్టిస్ పార్టీ తరఫున పోటీ చేసి ఓడిపోయాడు జస్టిస్ పార్టీ పరాజయం, జాతీయ భావాలు కలిగిన యువకులకు ఎంతో ఉత్తేజాన్ని, ఉత్సాహాన్ని కలిగించింది. కాంగ్రెసు విజయంతో ఉత్తేజాన్ని పొందిన ఈ యువకులకు ఒక నిర్మాణ రూపం లేదు జాతీయ భావాలు కలిగిన యువకులును సంఘటితపర్చడానికి జిల్లా కాంగ్రెసు కార్యదర్శిగా ఉన్న ఐదుకల్లు సదాశివన్ చొరవ తీసుకుని కృషిచేసారు. సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొని జైలుకు వెళ్ళివచ్చిన సదాశివన్ 1934లో ఎన్. జి. రంగానిడుబ్రోలులో నిర్వహించిన రాజకీయ పాఠశాలకు హాజరై సోషలిస్టు భావాలవైపు ఆకర్షితులయ్యారు. వీరి కృషి మూలంగా జిల్లా యువజనసంఘానికి 1937 ఏప్రిల్‌లో ఒక నిర్మాణ రూపం ఏర్పడింది. జిల్లా యువజనసంఘ కార్యదర్శిగా ఐదుకల్లు సదాశివన్, నీలం సంజీవరెడ్డి బాధ్యతలు స్వీకరించారు.

జిల్లాలో సోషలిస్టు భావాల వ్యాప్తికి ఈ యువజనసంఘం ఒక వేదికగా ఉపయోగపడింది. యువకులలో రాజకీయ చైతన్యాన్ని కలుగజేసి వారిలో సోషలిస్టు భావాలు అంకురించడానికి యువజన సంఘ కార్యక్రమాలు దోహదం చేసాయి. వివిధ ప్రాంతాల నుంచి సోసలిస్టు సాహిత్యాన్ని తెప్పించి యువకులకు అమ్మడం, స్టడీ సర్కిల్స్‌ద్వారా రాజకీయ తరగతులు నిర్వహించడం ఈ యువజనసంఘ ప్రధాన కార్యక్రమాలు. జిల్లా యువజనసంఘం ఏర్పడిన తరువాత జిల్లాలోని వివిధ ప్రాంతాలలో 70 స్టడీ సర్కిల్స్ ఏర్పాటుచేసి 15 రోజులకు లేదా నెలకొకమారు క్లాసులుపెట్టి రాజకీయాలు బోధించడం జరిగింది.[1] ఈ క్లాసులలో

సోషలిస్టు ప్రచురణల ఆధారంగా రాజకీయాలను బోధించేవారు. మరో వైపున బెనారస్‌విశ్వవిద్యాలయానికి వెళ్ళిన తరిమెల నాగిరెడ్డి, నీలం రాజశేఖర రెడ్డి కమ్యూనిస్టు భావాలవైపు ఆకర్షితులయ్యారు 1936లో కమ్యూనిస్టు స్టడీ సర్కిల్ సభ్యులుగాచేరి కమ్యూనిస్టు సాహిత్య అధ్యయనం చేసారు. ఈ స్టడీ సర్కిల్ ప్రభావంతో బెనారస్‌లో వీరిరువురు 1938 డిసెంబరులోకమ్యూనిస్టుపార్టీ సభ్యుల య్యారు [2] వేసవి సెలవులకు అనంతపురం వచ్చినపుడు యువజనసంఘం నిర్వ హిస్తున్న రాజకీయ తరగతులలో పాఠాలు చెప్పేవారు. 1938 వేసవిలో యువజన సంఘం నిర్వహించిన హిందూపూర్ రాజకీయపాఠశాలకు తరిమెల నాగిరెడ్డి, నీలం రాజశేఖరరెడ్డి ఉపాధ్యాయులుగా హాజరయ్యారు. ఈ పాఠశాలలో రాజకీ యాలతోపాటు, భౌతికవాదం, సోషలిజం, సామ్రాజ్యవాదం, రష్యా విప్లవం, వివిధ వర్గాలు వాటి దృక్పథం గురించి బోధించారు.

జిల్లాలోని యువకులకు విద్యార్థులకు సోషలిస్టు రాజకీయాలు చెప్పడం ఇదే ప్రథమం. అసెంబ్లీ ఎన్నికల తరువాత రాజకీయ చైతన్యం పొందుతున్న యువకు లను సోషలిస్టు భావాలవైపు మళ్ళించేందుకు ఈ హిందూపురం పాఠశాల బాగా ఉపకరించింది. క్రమక్రమంగా రాజకీయ పాఠశాలలకు స్త్రీలు కూడా హాజరవడం ప్రారంభించారు పల్లె ప్రాంతాలలో కూడా రాజకీయ తరగతులు నిర్వహించ బడ్డాయి. 1939 ఆఖరులో శెట్టూరు గ్రామంలో యువజన సంఘం నిర్వహించిన రాజకీయ పాఠశాలకు 18 మంది యువకులతోపాటు ఇద్దరు మహిళలు కూడా హాజరయ్యారు. రాజకీయ తరగతుల నిర్వహణతోపాటు అనంతపురంలోని విద్యార్థులకు తరిమెల నాగిరెడ్డి, నీలం రాజశేఖరరెడ్డి ప్రత్యేకంగా కొన్ని క్లాసులను నిర్వహించారు

ఈ పాఠశాలల ద్వారా విద్యార్థులు యువకులలో రాజకీయ చైతన్యం కలగడమే కాకుండా వారిలో అతివాద భావాలను పెంపొందించేందుకు అవకాశం ఏర్పడింది. ఈ పాఠశాలలు జిల్లాలోని యువకులపై బలమైన ప్రభావాన్ని కలుగ జేసాయి. గ్రామ ప్రాంతాలలో భూస్వాముల దౌర్జన్యాలకు యువకులు ఎదురు నిల్చి పోరాడటం ప్రారంభించారు. జిల్లాలో కరుడుగట్టిన ఫ్యూడల్ భూస్వామిగా పేరొందిన పాముదుర్తి బయ్యపురెడ్డి 60 గ్రామాలపై పెత్తనం కలిగియుండేవాడు. ఎటువంటి దౌర్జన్యానికైనా వెనుతీసేవాడుకాదు. ఇతని దౌర్జన్యాలకు యువజన సంఘం ఎదురు నిల్చి 40 గ్రామాలలో అతని పట్టు లేకుండా చేసింది.

విద్యార్థి, యువజన రంగాలతోపాటు కార్మిక రంగాన్ని కూడా సంఘటిత పరిచేందుకు కొంత కృషి జరిగింది. ఈ కృషి మూలంగానే వీరయ్య నాయుడు

కార్యదర్శిగా, కె. వి. రామకృష్ణ అధ్యక్షుడిగా అనంతపురం ప్రెస్ వర్కర్స్ యూనియన్ ఏర్పడింది.

క్రమంగా అనేక రంగాలలో ఉన్న ప్రజలను సంఘటిత పరచి అతివాద భావాలవైపు మళ్లించేందుకు కృషి జరుగుతున్న ఈ తరుణంలోనే రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమయింది. కమ్యూనిస్టులపై ప్రభుత్వం తీవ్ర నిర్బంధ విధానం చేపట్టింది. బెనారస్ విశ్వవిద్యాలయం విద్యార్థిగావున్న రాజశేఖర రెడ్డిపై వారెంట్ జారీ చేసింది. వారెంట్‌ను తప్పించుకునేందుకు రాజశేఖర రెడ్డి 1940 ప్రథమ భాగంలో అనంతపురం వచ్చి రహస్య జీవితం ప్రారంభించారు. రహస్య జీవితం గడుపుతున్న సమయంలోనే బుక్కపట్నం, ఉరవకొండ, కళ్యాణదుర్గం, అనంతపురం మరో 5-6 గ్రామాలలో రాజకీయ తరగతులు నిర్వహించారు. ఈ క్లాసులలో కమ్యూనిస్టు సిద్ధాంతాలతో పాటు, యుద్ధ వ్యతిరేక ప్రచార ఆవశ్యకతను కూడా వివరించడం జరిగింది.

ఇదే కాలంలో సామ్రాజ్యవాద యుద్ధ దుష్ఫలితాలును వివరిస్తూ 'భరద్వాజ' వ్రాసిన 'ఎకనమిక్ ఎఫెక్ట్స్ ఆఫ్‌దివార్' అనే పుస్తకాన్ని విద్వాన్ విశ్వం అనువదించారు. ఈ పుస్తకాన్ని తరిమెల నాగిరెడ్డి నవ్యసాహిత్యమాల పేరుతో పప్పూరి రామాచారి సాధనా ప్రింటింగ్ ప్రెస్‌లో అచ్చు వేయించారు. సామ్రాజ్యవాద శక్తుల మధ్య జరుగుతున్న యుద్ధ పరిణామాన్ని చక్కగా వివరిస్తూ, దానిని ఎందుకు వ్యతిరేకించాలో స్పష్టంగా వివరించిన ఈ పుస్తకాన్ని ప్రభుత్వం నిషేధించింది. తరిమెల నాగిరెడ్డి, విద్వాన్ విశ్వం, పప్పూరి రామాచారిలను 1940 సెప్టెంబరులో ప్రభుత్వం అరెస్టు చేసి వెల్లూరు సెంట్రల్ జైలులో డిటెయిన్ చేసింది

బలవంతంగా యిద్ధ నిధిని, ధాన్యాన్ని ప్రభుత్వం వసూలుచేయడం ప్రారంభించింది. యుద్ధానికి అవసరమైన సైన్యాన్ని సమకూర్చుకునేందుకు రిక్రూట్‌మెంటు కేంద్రాలను తెరిచింది. ప్రభుత్వం చేపట్టిన ఈ నిర్బంగ విధానాన్ని యువజనసంఘ ప్రభావంలోని యువకులంతా వ్యతిరేకించారు యుద్ధనిధి వసూలును, రిక్రూట్‌మెంటును వ్యతిరేకిస్తూ వాల్ పోస్టర్లద్వారా ప్రచారంచేసారు. యుద్ధ వ్యతిరేక పోస్టర్లను అంటిస్తున్న బోయవెంకటప్ప అనే యువకుడిని 1940 జనవరిలో అరెస్టు చేసి ४ నెలలు కఠిన శిక్ష విధించింది [3]

యుద్ధ వ్యతిరేక వాణిని జిల్లా నలుమూలలా వినిపించేందుకు 'ఆకాశవాణి' అనే సైక్లోస్టయిల్ పత్రికను ఐదుకల్లు సదాశివన్ 1940 ప్రథమ భాగంలో నిర్వహించారు. యుద్ధనిధి వసూలుకు, ప్రొక్యూరట్‌మెంటుకు వ్యతిరేకంగా ఈ పత్రిక ద్వారా ప్రచారం జరిగింది. గ్రామాలకు సైతం ఈ పత్రిక అందేది. రాత్రిళ్ళు అనేక గ్రామాలలో 'ఆకాశవాణి' రైతులకు చదివి వినిపించబడేది.

దీనితో పాటుగా 'స్వతంత్ర్య భారత్' కాపీలు జిల్లాలో పంపకం జరిగేవి. ఆకాశవాణి', 'సత్వంత్ర్య భారత్' ద్వారా జరిగిన యుద్ధ వ్యతిరేక ప్రచారం ప్రజలను పోరాటోన్ముఖులను చేసింది. బుక్కపట్నం, ఉరవకొండ, పూలకుంట మొదలైన గ్రామాలలో యుద్ధనిధి వసూలుకు, ప్రొక్యూర్‌మెంటుకు ప్రజలు ఎదురు తిరిగారు. నిర్బంధ వసూళ్లు తగ్గుముఖం పట్టాయి. కొన్ని సందర్భాలలో సైనిక రిక్రూమెంటు కూడా నిలిచిపోయింది.[4]

తీవ్రమవుతున్న యుద్ధ వ్యతిరేక ప్రచారం, ప్రజాందోళన ప్రభుత్వాన్ని కలవరపెట్టాయి. అనేక ప్రయత్నాలు చేసి చివరకు 1940 ఆఖరి భాగంలో ఆకాశవాణిని నిర్వహిస్తున్న సదాశివన్, జి రామకృష్ణ, వెంకట నాయుడులను ప్రభుత్వం అరెస్టు చేసి సదాశివన్‌కు 18 నెలలు, మిగిలిన ఇరువురికి 3 నెలలు శిక్ష విధించింది.

యుద్ధకాలంలో రహస్య జీవితం గడుపుతున్న ఏటుకూరి బలరామమూర్తి 40, 41 సంవత్సరాలలో అనంతపురాన్ని షెల్టర్‌గా ఉపయోగించారు. జాతీయ భావాలతో ప్రభావితుడైన వి.కె. ఆదినారాయణ రెడ్డి ఆ కాలంలో అనంతపురం కాలేజీ విద్యార్థిగా ఉన్నారు. అతివాద భావాలవైపు ఆకర్షితుడై 1941 లో అనంతపురంలో విద్యార్థి ఫెడరేషన్ శాఖను ప్రారంభించారు. కార్యదర్శిగా విద్యార్థి ఉద్యమానికి వి. కె. ఆదినారాయణ రెడ్డి నాయకత్వం వహించారు. జాతీయ భావాలు కల్గిన విద్యార్థులందరికి ఠాగూర్ స్టూడెంటు లాడ్జి ఒక కేంద్రంగా ఉండేది.[5] ఏటుకూరి బలరామమూర్తి అనంతపురం వచ్చినప్పుడు విద్యార్థులకు క్లాసులు నిర్వహించి వారిని సోషలిస్టు భావాల వైపుకు మళ్లించేందుకు కృషిచేసారు.

రహస్య జీవితం గడుపుతున్న రాజశేకరరెడ్డిని ప్రభుత్వం 1941 ఆగష్టులో అరెస్టుచేసి ఉత్తర భారతదేశంలోని అనేక జైళ్లకు తిప్పి చివరకు రాజమండ్రి జైలులో ఖైదు చేసింది.

1942 ఆగష్టు ప్రాంతాలలో రాజశేకరరెడ్డి, సదాశివన్ జైళ్లనుంచి విడుదలై వచ్చారు. మారిన పరిస్థితులు కనుగుణంగా ప్రజా యుద్ధ నినాదాన్ని వివరిస్తూ పార్టీ సానుభూతిపరులు ఎక్కువగా ఉన్న పూలకుంట గ్రామంలో బహిరంగ సభ నిర్వహించారు. అయితే సామ్రాజ్యవాద యుద్ధానికి, ప్రజా యుద్ధానికి తేడాతెలియని స్థానిక పోలీసులు ప్రభుత్వ వ్యతిరేక చర్యలక్రింద వీరిద్దరిని అరెస్టు చేసారు.

ఈ కేసు నడుస్తుండగానే ఆగష్టు ఉద్యమ ప్రభావంతో 1942 సెప్టెంబరులో కాలేజీ లేబరేటరీని కొంతమంది విద్యార్థులు తగులబెట్టారు. ఠాగూర్ లాడ్జిలో పథకంవేసి ఈ చర్యకు పాల్పడ్డారని ఆరోపిస్తూ వి.కె. ఆదినారాయణరెడ్డిని మరి

కొంతమంది. కాంగ్రెసు వారిని ప్రభుత్వం అరెస్టుచేసింది. సదాశివన్, రాజశేకర రెడ్డిలను కూడా ఈ కేసులో ఇరికించారు. జిల్లాలో పెద్ద సంచలనాన్ని కలిగించిన ఈ కేసులో ముద్దాయిలు తరుఫున బళ్లారి రాఘవ, నగురూరి రాఘవరావు వాదించారు ముద్దాయిలందర్ని నిర్దోషులుగా పరిగణించి కోర్టు, కేసు కొట్టివేసింది కానీ పూలకుంట కేసులో రాజశేఖరరెడ్డి సదాశివన్‌లకు 3 నెలలు శిక్షవిధించి అలీపురం జైలుకు పంపారు.

జైలునుండి 1942 డిసెంబరులో విడుదలైన రాజశేఖరరెడ్డి, సదాశివన్ తిరిగి తమ కార్యక్రమాలను ప్రారంభించారు. వీరిద్దరు జైలులో ఉన్నకాలంలో తరిమెల నాగిరెడ్డి జిల్లాలోని అతివాద యువకులను సంఘటిత పరిచేందుకు కృషి చేసారు. 1937 నుండి యువజన సంఘ కార్యక్రమాల మూలంగానూ, రాజకీయ పాఠశాలల ప్రభావంవల్ల యుద్ధ వ్యతిరేక కార్యక్రమాలలో పాల్గొంటూ కమ్యూనిస్టు భావాలవైపుకి అనేకమంది యువకులు ఆకర్షితులయ్యారు.

భూస్వాముల దౌర్జన్యానికి వ్యతిరేకంగా యువజన సంఘం నిర్వహించిన పోరాటంవల్ల అనేక గ్రామాలలో పార్టీ సానుభూతిపరులు ఏర్పడ్డారు. ప్రధానంగా బుక్కపట్నం, ఉరవకొండ, చీమలవాగుపల్లి, నెట్టికల్లు, కళ్యాణదుర్గం, ముద్దలాపురం, ప్రసన్నాయనపల్లె, లోచర్ల, సిద్ధరాంపురం, తలమర్ల, లింగారెడ్డిపల్లి మొదలైన గ్రామాలు పార్టీ సానుభూతిపరుల కేంద్రములుగా 1942 నాటికి ఏర్పడ్డాయి. బాబాసాహెబ్, సిరుమళ్ల సంజీవులు (ఉరవకొండ), దయ్యం నాగిరెడ్డి, సంజీవులు (పూలకుంట) ఎం. కె. దాసప్ప, ఎం. కె. రామప్ప, ఇబ్రహీం (బుక్కపట్నం) ఎర్రిసామివారి సోదరుడు (కళ్యాణదుర్గం) ఆదినారాయణరెడ్డి (లోచర) మొదలైన యువకులంతా కమ్యూనిస్టు సిద్ధాంతాల ప్రభావంతో 1943 వరకు వివిధ కార్యక్రమాలను నిర్వహిస్తూ వచ్చారు. 1943 వరకు కమ్యూనిస్టు పార్టీ సభ్యులు కాకపోయినా ఐమకల్లు సదాశివన్, వి. కె. ఆదినారాయణరెడ్డి, విద్వాన్ విశ్వం, జి. రామకృష్ణ మొదలగువారు కమ్యూనిస్టు పార్టీతో సన్నిహితంగా పనిచేస్తూ వచ్చారు.

ప్రభుత్వ నిర్బంధ విధానం మూలంగా తగినన్ని అవకాశాలు లేకపోవడంవల్ల 1943 వరకు అనంతపురం జిల్లాలో కమ్యూనిస్టు పార్టీ నిర్మాణరూపం దాల్చలేదు.

ఐదుకల్లు సదాశివన్, వి. కె. ఆదినారాయణరెడ్డి జి. రామకృష్ణ 1943 ప్రథమ భాగంలో పార్టీ సభ్యత్వం పొంది పార్టీకి సానుభూతిపరులుగా ఉన్నవారినందరిని పార్టీలోకి రిక్రూట్ చేయడం ప్రారంభించారు. దీనితో 1943 ప్రారంభ

కాలంలో పార్టీకి ఒక నిర్మాణరూపం ఏర్పడింది. నీలం రాజశేఖరరెడ్డి, తరిమెల నాగిరెడ్డి, ఐదుకల్లు సదాశివన్, విద్వాన్ విశ్వం వి. కె. ఆదినారాయణరెడ్డి జిల్లా కమిటీగా ఏర్పడి పార్టీ నిర్మాణాన్ని పెంపొందించారు. ఈ జిల్లా కమిటీకి కార్యదర్శిగా నీలం రాజశేఖరరెడ్డి పనిచేసారు.

## ఆధారాలు


1. కమ్యూనిజం మాసపత్రిక, 1975 మే.
2. నీలం రాజశేఖర రెడ్డితో ఇంటర్వ్యూ.
3. మద్రాసు ప్రభుత్వ పక్ష నివేదిక, 1940 జనవరి.
4. రాజశేఖరరెడ్డితో ఇంటర్వ్యూ.
5. వి. కె. ఆదినారాయణ రెడ్డితో ఇంటర్వ్యూ.
6. రాజశేఖరరెడ్డితో ఇంటర్వ్యూ.

# కడప జిల్లాలో కమ్యూనిస్టు పార్టీ నిర్మాణం

కడప జిల్లాలో 1943 వరకు కమ్యూనిస్టు పార్టీ నిర్మాణం శైశవ దశలోనే ఉంది. ప్రచార దశవరకే పరిమితమై సరిఅయిన నిర్మాణరూపం ఏర్పడలేదు. ప్రారంభంలో కాంగ్రెసులో అతివాదులుగా ఉన్నవారు కమ్యూనిస్టు భావాలవైపు ఆకర్షితులై పార్టీ సభ్యులుగా వచ్చారు. జిల్లా కాంగ్రెసు కమిటీలో ముఖ్యులుగా ఉన్న ఎన్. సంగమేశ్వరరెడ్డి, ఎన్. వరదారెడ్డి, మోకా వెంకటసుబ్బయ్యలు సుందరయ్యగారి పరిచయంతో కమ్యూనిస్టు సిద్ధాంతాల పట్ల ఆకర్షితులై 1938లో కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వం పొందారు. వీరు కాంగ్రెసులో సభ్యులుగా ఉంటూనే అతివాద భావాలు కల్గిన యువకులను సమీకరించి వారిని కమ్యూనిస్టు పార్టీవైపుకు ఆకర్షించేందుకు ప్రయత్నించారు.

1938 సంవత్సరం నుండి పెద్ద పసుపుల గ్రామంలోని యువకులతో సంగమేశ్వరరెడ్డి, మోకా వెంకటసుబ్బయ్య పరిచయాలు ఏర్పర్చుకుని వారిని అతివాద భావాలవైపు తిప్పడానికి కృషిచేసారు. వీరి కృషి మూలంగా ఆ గ్రామంలోని వై. ఈశ్వరరెడ్డి, నూకల కొండయ్య వామపక్ష భావాలవైపు ఆకర్షితులయ్యారు.

అప్పటికే వై ఈశ్వరరెడ్డి, నూకల కొండయ్య మొదలైన యువకులు 'మిత్ర మండలి' అనే సంఘాన్ని స్థాపించి (1936 లో) రైతు యువకులను సమీకృతం చేస్తున్నారు. ఈ మిత్రమండలి ద్వారా స్థానిక పెత్తందారు, జస్టిస్ పార్టీ సభ్యుడు అయిన సంజీవరెడ్డి చర్యలను వ్యతిరేకించడం ప్రారంభించారు. 1937 జిల్లా బోర్డు ఎన్నికలలో కాంగ్రెసు అభ్యర్థిగా పోటీచేసిన పాలూరు పాపిరెడ్డిని మిత్రమండలి బలపర్చింది. కాంగ్రెసులో అతివాదులుగా ఉన్న ఈ యువకులకు ఎన్. సంగమేశ్వరరెడ్డి కమ్యూనిస్టు సాహిత్యం అందిస్తూ క్రమంగా వారిలో కమ్యూనిస్టు భావాలు ఏర్పడటానికి కృషిచేసారు, జమ్మలమడుగు తాలూకా కాంగ్రెసు కమిటీ సభ్యుడైన యం. నాగముని (పెద్ద పసుపుల గ్రామం) కూడా ఈ కాలంలోనే వామపక్ష భావాల వైపు ఆకర్షితులయ్యారు. 1938 ఇటవలపాడు రాజకీయ పాఠశాలకు హాజరై కమ్యూనిస్టు పార్టీ అనుకూలురుగా మారారు పెద్ద పసుపుల గ్రామానికి చెందిన ఈ యువకులంతా కాంగ్రెసు ఉద్యమాలలో పాల్గొంటూ కాంగ్రెసును అతివాద మార్గం వైపు మళ్ళించేందుకు ప్రయత్నించారు. 1940

సంవత్సరంలో జిల్లా కాంగ్రెసు అధ్యక్ష స్థానానికి బాల నారాయణ రెడ్డి, వై. ఆది నారాయణరెడ్డిలు పోటీపడగా, అతివాదిగా పరిగణింపబడుతున్న వై. ఆది నారాయణ రెడ్డిని వామపక్ష భావాలు కల్గిన ఈ యువకులంతా బలపర్చి గెలిపించారు. ఈ యువకుల మద్దతుతోనే కమ్యూనిస్టు పార్టీ సభ్యుడుగా ఉన్న ఎన్. వరదారెడ్డి జిల్లా కాంగ్రెసు ప్రధాన కార్యదర్శిగా ఎన్నికయ్యారు.

రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమయిన తరువాత ప్రభుత్వం అవలంభించిన నిర్బంధ యుద్ధ నిధి వసూళ్ళను జిల్లాలోని కమ్యూనిస్టు పార్టీ సభ్యులు, సానుభూతిపరులు అయిన యువకులు వ్యతిరేకించారు. పెద్ద పసుపుల గ్రామంలో యుద్ధ నిధి వసూలును ప్రతిఘటించిన ఎనిమిది మంది యువకులపై ఆర్. డి. ఓ. ఆక్రమ కేసులు బనాయించారు.

ఇదే సమయంలో, రాజంపేట వాస్తవ్యుడైన పంజం నరసింహారెడ్డి నెల్లూరు కళాశాలలో విద్యార్థిగా ఉంటూ కమ్యూనిస్టు పార్టీ సభ్యుడయ్యారు. 1940 లో చదువును మధ్యలో వదిలివేసి కడప జిల్లాకు తిరిగి వచ్చి కమ్యూనిస్టు ఉద్యమ వ్యాప్తికి పూనుకున్నాడు

యుద్ధకాలంలో రహస్యంగా వెలువడుతున్న స్వతంత్ర్య భారత్ పత్రికను అంకాళమ్మ గూడూరు, పెద్ద పసుపుల, అలంఖాన్‌పల్లి మొదలైన గ్రామాలలోని యువకులకు అందించబడేది. జాతీయ భావాలు కల్గిన యువకులకు స్వతంత్ర్య భారత్‌ను అందిస్తూ యుద్ధ వ్యతిరేక ప్రచారాన్ని ముమ్మరం చేసారు. స్వతంత్ర్య భారత్ ద్వారా పరిచయం ఏర్పడిన యువకులలో కూడా వామపక్ష భావాలు పెంపొందించటానికి కమ్యూనిస్టులు ప్రయత్నించారు. 1940 లో అంకాళమ్మ గూడూరుకు స్వతంత్ర్య భారత్‌ను పంపిణీ చేస్తున్న సందర్భంలోనే సంగమేశ్వర రెడ్డితో పొన్నతోట వెంకటరెడ్డి, గజ్జల మల్లారెడ్డికి పరిచయం ఏర్పడింది. క్రమంగా ఈ పరిచయం వారిలో అతివాద భావాలను పెంపొందించి తరువాత కాలంలో 1943-44 కమ్యూనిస్టులుగా మార్చేందుకు దోహదపడింది.

యుద్ధ వ్యతిరేక ప్రచారం కొనసాగుతున్న కాలంలోనే కమ్యూనిస్టు భావాలు కల్గిన యువకులు ప్రజా సంఘాల నిర్మాణం కూడా చేపట్టారు. 1941 లో పాలూరులో జరిగిన జిల్లా ప్రథమ రైతు మహాసభ విజయవంతం అవడానికి వై. ఈశ్వర రెడ్డి, డి. ఆర్. సంజీవరెడ్డి, నాగముని తదితర ముఖ్యులు విశేషించి కృషిచేసారు. రైతు ఉద్యమం ప్రారంభమవుతున్న దశలోనే చెన్నూరులో (1941 మధ్య భాగంలో) రంగా నిర్వహించిన రైతాంగ పాఠశాలకు వై. ఈశ్వర రెడ్డి హాజరై, పాఠశాల చివరి రోజున సత్యాగ్రహంలో పాల్గొనడంవల్ల ప్రభుత్వం నిర్బంధించి జైలు శిక్ష విధించింది.

1942 లో పార్టీపై నిషేధం తొలిగిన తరువాత పార్టీ సభ్యులు బహిరంగంగా పనిచేసేందుకు అవకాశాలు లభించాయి. శైశవదశలో వున్న కడప జిల్లా కమ్యూనిస్టు పార్టీ నిర్మాణాన్ని అభివృద్ధి పరిచేందుకు రాష్ట్ర పార్టీ నిర్ణయించింది. ఈ నిర్ణయం మేరకు తెనాలిలో కమ్యూనిస్టు కార్యకర్తగా ఉన్న ముక్తేవి మాధవాచార్యను 1942 లో కడప జిల్లాకు పంపటం జరిగింది.

ఇదే సమయానికి వై. ఈశ్వరరెడ్డి కూడా జైలు నుండి విడుదలై వచ్చి ప్రజా యుద్ధ నినాదాన్ని ప్రచారం చేయసాగారు. ప్రొద్దుటూరులో జరిగిన జిల్లా కాంగ్రెసు కార్యకర్తల సమావేశంలో (1942 లో) యుద్ధ స్వభావంలో వచ్చిన మార్పును విశదీకరిస్తూ ఉపన్యసించి, సమావేశాన్ని బహిష్కరించి బయటకు వచ్చారు.

కమ్యూనిస్టు పార్టీ సభ్యులు సానుభూతిపరులు ప్రజా యుద్ధ నినాదాన్ని బలపరుస్తూ కార్యక్రమాలు చేపట్టారు. ముక్తేవి మాధవాచార్య కడప జిల్లాకు వచ్చిన తరువాత పార్టీ సానుభూతిపరులుగా ఉన్న వారికి పార్టీ సభ్యత్వం ఇచ్చి, కమ్యూనిస్టు పార్టీ సెల్స్‌గాను ఏర్పాటు చేసారు.

1943 నాటికి అలంఖాన్‌పల్లి, పెద్దపసుపుల గ్రామాలు పార్టీ కేంద్రాలుగా ఏర్పడ్డాయి. 1942-43 లలో అలంఖాన్‌పల్లి, రాజంపేట గ్రామాలలో రాజకీయ పాఠశాలలను నిర్వహించి పార్టీ విధానాల గురించి ప్రజలలో ప్రచారం చేయడం జరిగింది. 1942 చివరి కాలంలో జిల్లా పార్టీ ఆఫీసు కడపలో ఏర్పాటుచేసి పార్టీ కార్యక్రమాలు మరింత వేగంగా అమలు పరిచేందుకు కృషి చేసారు. కడప, రాజంపేటలలోని కార్మికవర్గాన్ని సంఘటిత పరిచేందుకు ప్రయత్నాలు ప్రారంభించారు. అప్పటికే ఏర్పడిన రైతు సంఘాన్ని విస్తృత పరచి రైతులలో పార్టీ విధానాల గురించి, ప్రజా యుద్ధ విధానం గురించి ప్రచారం ప్రారంభమైంది. ముఖ్యంగా నంద్యాల వరదారెడ్డి, నంద్యాల నాగిరెడ్డి రైతు సంఘ బాధ్యతలు చూస్తూ రైతులను సంఘటిత పరిచేందుకు కృషి చేశారు.

1942 నుండి పార్టీ నిర్మాణానికి ఒక రూపు కల్పించేందుకు జరిగిన ప్రయత్నాల మూలంగా 1942 చివరి కాలంలో కడప జిల్లా ఆర్గనైజింగు కమిటీ ఏర్పాటైంది. ఈ కమిటీ కార్యదర్శిగా పంజం నరసింహారెడ్డి వ్యవహరిస్తూ నిర్మాణ బాధ్యతలు చేపట్టారు.

## ఆధారము

1. ముక్తేవి మాధవాచార్య ఇంటర్వ్యూ.

# కర్నూలు జిల్లాలో కమ్యూనిస్టు పార్టీ

రాయలసీమ ప్రాంతమైన కర్నూలు జిల్లాలో 1940 దశకం వరకు కమ్యూనిస్టు పార్టీ ప్రచార దశలోనే ఉంది. ప్రజాయుద్ధ కాలం 1942-43 లలోనే కమ్యూనిస్టు పార్టీ నిర్మాణరూపం తీసుకోవడం ప్రారంభించింది.

ఆంధ్ర రాష్ట్రానికి ఎంతోమంది సుశిక్షితులైన కమ్యూనిస్టు కార్యకర్తల నందించిన కొత్త పట్టణం రాజకీయ పాఠశాల, కర్నూలు జిల్లాలో కమ్యూనిస్టు భావాల వ్యాప్తికి నాంది పలికింది. 1937 మేలో జరిగిన కొత్తపట్నం రాజకీయ పాఠశాలకు కర్నూలు జిల్లా నుంచి అతివాద భావాలు కల్గిన కాంగ్రెసు యువకులు హాజరయ్యారు. నంద్యాల నుంచి కోడినరసింహం, బలరాం, కర్నూలు పట్టణం నుంచి తిప్పారెడ్డి, నరసింహమూర్తి, నాగప్ప, అనుమలపాడు నుంచి పిడతల రంగారెడ్డి, బోగోలు నుంచి చేగిరెడ్డి బాలిరెడ్డి, తురిమెళ్ల నుంచి బెల్లంకొండ శాయన్నా మొదలైన యువకులు కొత్తపట్నం రాజకీయ పాఠశాలకు హాజరైన వారిలో ఉన్నారు. కొత్తపట్నం రాజకీయ పాఠశాల ప్రభావంతో ఈ యువకులు సోషలిస్టు భావాలవైపు ఆకర్షితులయ్యారు.

ఈ పాఠశాల ద్వారా కర్నూలుజిల్లా యువకులలో అంకురించిన సోషలిస్టు భావాలను పెంపొందించి జిల్లాలో కమ్యూనిస్టు పార్టీకి నిర్మాణరూపం ఇచ్చేందుకు రాష్ట్ర పార్టీ నిర్ణయించింది. అందుకు అనుగుణంగా గుంటూరు నుంచి దుర్భా కృష్ణమూర్తి 1937 జూలైలో కర్నూలుజిల్లా వచ్చారు. కమ్యూనిస్టు పార్టీకి సన్నిహితంగా ఉన్న బెల్లంకొండ శాయన్నల సహకారంతో తురిమెళ్ళ గ్రామంలో ఒక హిందీ పాఠశాలను ప్రారంభించారు. ఈ హిందీ పాఠశాలే కర్నూలుజిల్లాలో కమ్యూనిస్టు భావాల వ్యాప్తికి కేంద్రంగా పని చేసింది. పాఠశాలకు హాజరయ్యే విద్యార్థులకు హిందీ పాఠాలతోపాటుగా కమ్యూనిస్టు సిద్ధాంతాలను కూడా దుర్భా కృష్ణమూర్తి బోధించేవారు. విద్యార్థులలో కమ్యూనిస్టు భావాలను పెంపొందించటానికి గదర్ వీరుల చరిత్ర, అమ్మ నవల, సోషలిస్టు సాహిత్యం విద్యార్థులకు ఇచ్చి చదివించేవారు. ఈ పాఠశాలకు హాజరైన యువకులలో పిడతల రంగారెడ్డి కూడా ఒకరు. చేగిరెడ్డి బాలిరెడ్డి కూడా అప్పుడప్పుడు వచ్చి కమ్యూనిస్టు సిద్ధాంతాల గురించి తెలుసుకొంటూ ఉండేవారు.

పాఠశాలకు హాజరయ్యే విద్యార్థులకేకాక చుట్టుప్రక్కల గ్రామాలలో కూడా కమ్యూనిస్టు సిద్ధాంతాలను ప్రచారం చేయడానికి దుర్భా కృష్ణమూర్తి కొన్ని పయత్నాలు చేశారు. హిందీ పాఠశాల విద్యార్థులను జట్లుగా వెంటతీసుకుని గిద్దలూరు తాలుకాలోని గ్రామాలలో కమ్యూనిస్టు భావాలను ప్రచారంచేశారు. ఈ పచారాన్ని క్రమేపి ద్రోణాచలం, నందికొట్కూరు తాలుకా గ్రామాలకు కూడా విస్తరింపజేసి కమ్యూనిస్టు సిద్ధాంతాల గురించి గ్రామాల్లోని యువకులకు తెలియజేసారు.

సిద్ధాంత ప్రచారం చేస్తూనే జాతీయ భావాలు కల్గిన యువకులను సమీకరించి గ్రామాలలో యువజన సంఘాలను స్థాపించారు. ఐక్య సంఘటనా ఎత్తుగడతో కమ్యూనిస్టులంతా కాంగ్రెసు సోషలిస్టు పార్టీగా పనిచేస్తున్న కాలమది. కాంగ్రెసు సోషలిస్టు పార్టీ రాష్ట్ర మహాసభ, పాలకొల్లులో 1937 నవంబరు 22 న జరిగింది. రాష్ట్ర కార్యనిర్వాహక వర్గానికి అత్యధికశాతం కమ్యూనిస్టులే ఎన్నికయ్యారు. కర్నూలు జిల్లానుంచి కోడి నరసింహం రాష్ట్ర కార్యనిర్వాహక వర్గానికి ఎన్నికయ్యారు. జిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీలోకూడా కమ్యూనిస్టు ప్రభావం ఉన్న యువకుల ప్రధాన పాత్రను నిర్వహిస్తూ ఉండేవారు. ప్రచార దళాలుగా గ్రామ గ్రామాన తిరుగుతూ కాంగ్రెసు సభ్యత్వాన్ని పెంచి కమిటీలను ఏర్పరచడం, చదువుకున్న యువకులను సమీకరించి కాంగ్రెసు సోషలిస్టు పార్టీ శాఖలు ఏర్పరచడం ముఖ్య కార్యక్రమంగా తీసుకుని కమ్యూనిస్టు భావాలు కలిగిన యువకులు పనిచేసారు. ఈ యువకుల కార్యదీక్షత పని విధానం - దుర్భా శేషిరెడ్డి, ఆదినారాయణరావు వంటి కాంగ్రెసు నాయకుల అభిమానాన్ని కూడా పొందింది.

విస్తరిస్తున్న యువజన సంఘ కార్యక్రమాలను సంఘటితపరచి నిర్మాణ రూపం కల్పించేందుకు 1938 లో పిడతల రంగారెడ్డి జిల్లా యువజన ఆర్గనైజర్ గా నియమించబడ్డారు. అప్పటికే కంభం తాలుకాలో యువజన సంఘాలు అనేక గ్రామాలలో స్థాపించబడ్డాయి. జిల్లాలో మొట్టమొదటగా నిర్మాణ రూపం తీసుకున్నది కంభం తాలుకా యువజన సంఘమే. 1938 జనవరిలో బెల్లంకొండ శాయన్న అధ్యక్షుడిగా చేగిరెడ్డి, బాలిరెడ్డి, పి. కోటయ్యనాయుడు కార్యదర్శులుగా కంభం తాలుకా యువజన సంఘం ఏర్పడింది. ఈ యువజన సంఘాల ద్వారా సోషలిస్టు ప్రచారం, నవశక్తి పత్రిక పంపకం గ్రామాలలో సాగుతుండేది. జిల్లా కాంగ్రెసులో కూడా సోషలిస్టు యువకుల ప్రభావం అధికంగానే ఉండేది పిడతల రంగారెడ్డి, నరసింహమూర్తి జిల్లా కాంగ్రెసు కార్యదర్శులుగానూ, కోడి నరసింహం, తిప్పారెడ్డి, బలరాంలు జిల్లా కాంగ్రెసు కమిటీ సభ్యులుగానూ

ఎన్నికయ్యారు. జిల్లా మొత్తంగా కమ్యూనిస్టు భావాలు కల్గిన వ్యక్తులు కొద్దిమందే అయినా జిల్లా కాంగ్రెసులోనూ, కాంగ్రెసు సోషలిస్టు పార్టీలోనూ ప్రధాన పాత్ర వహిస్తూ సోషలిస్టు ప్రచారాన్ని సాగించారు. అఖిల భారత కాంగ్రెసు సోషలిస్టు పార్టీ కార్యదర్శిగా జయప్రకాశ్ ఆంధ్ర రాష్ట్రంలో సోషలిస్టు ప్రచారం గావిస్తూ 1937 నవంబరులో కర్నూలు జిల్లా వచ్చారు. ఈ సందర్భంగా నంద్యాల, మహానంది మొదలగు చోట్ల బహిరంగ సభలు జరిపి సోషలిస్టు ప్రచారంచేసారు.

"కాంగ్రెసు ప్రచారం చేస్తున్న, ఖద్దరు ప్రోత్సాహము, గ్రామోద్ధరణ, హరిజనోద్ధరణ, మొదలగు కార్యక్రమాల ద్వారా ప్రజలలో సంచలనం కలిగించటం జరగదని, ప్రతి గ్రామంలోనూ రైతుసంఘములు నెలకొల్పి ప్రబోధములు ద్వారానూ, సమ్మెలద్వారానూ వారి ఆదాయము అభివృద్ధి పరచవలయునని స్వరాజ్యమనగా "పేదరికము రూపుమాపుటయే, కేవలం బ్రిటీషు వారిని పారద్రోలుట మాత్రమేకాదు" అని స్పష్టంగా సామ్యవాదుల గమ్యాన్ని తెలియజేస్తూ జయప్రకాశ్‌నారాయణ ప్రచారం చేసారు. ఈ ప్రచార సందర్భంలోనే నంద్యాల నూనెపల్లె కార్మికులలోనూ మోటారు డ్రైవర్ల సంఘం కార్మికులతోనూ సోసలిస్టు ప్రచారం జరిగింది.

సోసలిస్టు నాయకుల ప్రచారంద్వారా జిల్లాలోని అతివాద కాంగ్రెసు యువకులనేకమంది సోషలిస్టు భావాలవైపు ఆకర్షితులయ్యారు. ఆతరువాత 1938 మే లో జరిగిన మంతెనవారిపాలెం రాజకీయ పాఠశాలకు కూడా కర్నూలు జిల్లా నుండి కొంతమంది అతివాద యువకులు హాజరై వామపక్ష భావాలవైపు మొగ్గుచూపారు. ఇలా జిల్లాలో సోషలిస్టు ప్రచారం సాగుతున్న కాలంలో జిల్లా కాంగ్రెసు ఆధ్వర్యంలో కాల్వబుగ్గ రాజకీయ పాఠశాల నిర్వహించబడింది. ఈ పాఠశాల కాంగ్రెసు ఆధ్వర్యంలోనే జరిగినా జిల్లాలో సోషలిస్టు భావాల వ్యాప్తికి బాగా దోహదపడింది. అనంతపురం నుండి విద్వాన్ విశ్వం, తరిమెల నాగిరెడ్డి ఈ పాఠశాల అధ్యాపకులుగా వచ్చారు. వీరితోపాటు జొన్నలగడ్డ రామలింగయ్యకూడా ఈ పాఠశాలలో మరో అధ్యాపకుడు. వీరు బోధించిన రష్యా విప్లవం, కమ్యూనిస్టు సిద్ధాంతాలు జిల్లాలోని అనేకమందిని కమ్యూనిస్టు భావాలవైపు ఆకర్షించాయి. దీనితో పాటు గా అనంతపురంలోని కమ్యూనిస్టు యువకులకు కర్నూలు జిల్లాలోని అతివాద యువకులకు సంబంధాలు ఏర్పడ్డాయి.

పత్తికొండ ప్రాంతంలో టీచరుగా పనిచేస్తున్న వారణాశి రామశాస్త్రి, తురిమెళ్ళ నాట్యసమాజం తరపున రాయలసీమ ప్రాంతంలో ప్రదర్శనలిస్తున్న దుపాకుల బసవయ్య మొదలగువారు ఈ కాలంలోనే సోషలిస్టు భావాలవైపు ఆకర్షితులయ్యారు. అనంతపురం జిల్లాలో ప్రదర్శనలిస్తున్న కాలంలో ఐదుకల్లు సదాశివన్

తరిమిల నాగిరెడ్డివంటి యువకులతో పరిచయాలు ఏర్పడి తుపాకుల బసవయ్య కమ్యూనిస్టు భావాలపైపు ఆకర్షితులయ్యారు. యుద్ధకాలంలో బహిరంగ సోషలిస్టు ప్రచారానికి అవరోధం ఏర్పడింది. పార్టీ పరిచయాలున్న కర్నూలు, ఆత్మకూరు, వెలుగోడు, తురిమెళ్ళ, ఆళ్లగడ్డ, నంద్యాల, నందికొట్కూరు మొదలగు ప్రాంతాలకు స్వతంత్ర్య భారత్ పత్రిక రహస్యంగా అందుతూఉండేది.[4] ఈ కాలంలో కామ్రేడ్ తిప్పారెడ్డి జిల్లా ఆర్గనైజింగ్ కార్యదర్శిగా బాధ్యతలు నిర్వహిస్తూ పార్టీ ప్రచారాన్ని రహస్యంగా కొనసాగించారు.

ఈ సామ్రాజ్యవాద యుద్ధ కాలంలోనే విద్యార్థులపై కూడా కమ్యూనిస్టుల ప్రభావం ఏర్పడింది. కర్నూలు హైస్కూలు విద్యార్థిగాఉన్న గుర్రం వెంకట్రామ రెడ్డి ఈ కాలంలోనే కమ్యూనిస్టు భావాలవైపు ఆకర్షితులయ్యారు. సామ్రాజ్యవాద యుద్ధ వ్యతిరేక పోరాటాన్ని సమిష్టి సత్యాగ్రహరూపంలో కొనసాగించాలని కమ్యూనిస్టు వాదించినా, కాంగ్రెసు నాయకత్వం మాత్రం వ్యక్తిగత సత్యాగ్రహానికే పిలుపు నిచ్చింది. ఈ పిలుపు నందుకుని అనేక మంది కాంగ్రెసు యువకులు వ్యక్తిగత సత్యాగ్రహంలో పాల్గొనసాగారు. దీనివల్ల జైళ్లు నింపడం తప్ప మరే విధమైన ప్రయోజనం ఉండబోదని క్రమంగా యువకులు గ్రహించసాగారు. అటువంటి యువకులలో జొహరాపురానికి చెందిన వి. వెంకట్రామప్ప కూడా ఉన్నారు.వీరు గొట్టిపాటి సుబ్బారాయుడు (అనంతపురంజిల్లా)తో పరిచయం ఏర్పడి ఆయన అందించిన అతివాద సాహిత్యం మూలంగా కమ్యూనిస్టు భావాల వైపు ఆకర్షితులయ్యారు. జిల్లాలో కమ్యూనిస్టు ప్రచారం రహస్యంగా సాగుతున్న ఈ కాలంలోనే (1941) మద్రాసు రాష్ట్రం గిండీ ఇంజనీరింగ్ కాలేజీలో చదువుతూ, చంద్ర పుల్లారెడ్డి పార్టీ సభ్యులయ్యారు. యుద్ధ వ్యతిరేక కార్యకలాపాల్లో పాల్గొన్నందుకు కాలేజీనుండి చంద్ర పుల్లారెడ్డిని బహిష్కరించారు. ఆ తరువాత పుల్లారెడ్డి కర్నూలుకు వచ్చి, 1941 చివరి కాలంలో జిల్లా కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శిగా బాధ్యతలు స్వీకంచారు. కమ్యూనిస్టు ప్రచారాన్ని తీవ్రతరం చేసి పార్టీకి నిర్మాణ రూపం ఇచ్చేందుకు ప్రయత్నించారు.

ప్రజాయుద్ధకాలంలో 1942 జూలై 26 న రాష్ట్రమంతటా ధరల కంట్రోల్ దినం జరుపబడింది. ఊరేగింపులు, బహిరంగ సభల ద్వారా, కరపత్రాలద్వారా పెద్దఎత్తున ప్రచారంచేస్తూ అధిక లాభాల దోపిడీని అరికట్టాలని ఎలుగెత్తి చాటారు.

నిత్యావసర వస్తువుల ధరలను కంట్రోలు చేయాలని, ప్రతిచోట ప్రభుత్వ చౌక డిపోలు తెరవాలని కోరుతూ 1500 మంది సంతకాలతో ఒక మెమోరాండంను ప్రభుత్వ అధికారులకు సమర్పించారు. అరెస్టుచేసిన జాతీయ నాయకుల్ని విడుదల

చేయాలని, తక్షణమే జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయాలని కోరుతూ కమ్యూనిస్టులు పెద్ద ఎత్తున ప్రచార కార్యక్రమం చేపట్టారు. ఫాసిస్టు యుద్ధం పట్ల తమ వైఖరిని వివరిస్తూ, ఫాసిస్టు శక్తులను ప్రజలంతా సమైక్యంగా ఎదుర్కొనాలని ప్రబోధిస్తూ వెయ్యి కరపత్రాలను కర్నూలు పట్టణంలో పంచారు. ప్రజా యుద్ధ విధానాన్ని ప్రజలకు వివరిస్తూ కర్నూలు, గిద్దలూరులలో ఆగష్టు 17, 18 న బహిరంగ సభలు నిర్వహించారు.[5]

ప్రజాసమస్యల పరిష్కారానికి ప్రభుత్వం ఒత్తిడిచేస్తూ ప్రజాయుద్ధ నినాదంతో పనిచేస్తున్న కమ్యూనిస్టుల కార్యక్రమాలు ప్రభుత్వాన్ని కలవరపెట్టాయి. రోజురోజుకు కమ్యూనిస్టు ప్రచారంపెరిగి జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పాట్లుచేయాలని, జాతీయనాయకుల్ని విడుదలచేయాలి అనేకోర్కెలు ప్రజల్ని చైతన్యవంతుల్నిచేసి ప్రభుత్వంపై ఒత్తిడిని పెంచాయి ధరలకంట్రోల్, రేషన్‌షాపులు మొదలగు తక్షణ సమస్యలపైకూడా కమ్యూనిస్టులు చేస్తున్న ప్రచారం రోజురోజుకి విస్తృతమై ప్రజల్ని ఆందోళనాస్థాయికి తీసుకువచ్చింది. కమ్యూనిస్టుల ప్రచారంతో భయపడిన ప్రభుత్వం 1942 ఆగష్టు ఘటనలు (క్విట్‌ఇండియా ఉద్యమం) ఆధారంగా చేసుకుని కమ్యూనిస్టులపై కూడా నిర్బంధవిధానాన్ని అమలుపరిచింది.

రహస్యసాహిత్యం కలిగియున్నారనే నెపంతో జిల్లాలోని కమ్యూనిస్టుల ఇళ్లను సోదాలుచేసి అరెస్టులుప్రారంభించింది. చంద్ర పుల్లారెడ్డి, బాపయ్య, కె వి. కృష్ణమూర్తి, తిప్పారెడ్డి ఇళ్లనుసోదాచేసి చంద్ర పుల్లారెడ్డి, బాపయ్యలను అరెస్టు చేసింది. ఫాసిస్టువ్యతిరేక ప్రచారంచేస్తున్న వి. రామశాస్త్రి, బెల్లంకొండ శాయన్నలనుకూడా 15-9-42 న అరెస్టుచేసారు.

బెల్లంకొండ శాయన్న, రామశాస్త్రి అరెస్టులపై తీర్పునిస్తూ ''ఫాసిజాన్ని ఓడించాలి, ప్రజాయుద్ధం జయించాలని వీరుచేసిన నినాదాలు నిరపాయమైనవేనని, కానీ, కాంగ్రెసునాయకులను విడుదలచేయాలి, జాతీయప్రభుత్వాన్ని ఏర్పాటుచేయాలని వీరుచేసిననినాదాలు ప్రభుత్వంపైన, వాని పాలసీపైన వ్యతిరేకభావం కలుగజేస్తున్నాయని పేర్కొంటూ రామశాస్త్రికి 6 నెలలు, శాయన్నకు 3 నెలలు, శిక్షవిధించారు.[6] రహస్యసాహిత్యం కల్గివున్నారని పుల్లారెడ్డికి 6 నెలలు, బాపయ్యకు ఒక సంవత్సరం కఠినశిక్షను విధించింది.

ప్రభుత్వనిర్బంధ విధానంవల్ల జిల్లాలోకమ్యూనిస్టుపార్టీ నిర్మాణానికి కొంత అవరోధంఏర్పడింది. ఈ అవరోధాలన్నీ, అధిగమించి జిల్లాలో కమ్యూనిస్టుపార్టీకి ఒక నిర్మాణరూపం కల్పించేందుకు 1943 ఆగష్టులో కోనేరు రాజగోపాలరావును జిల్లాఆర్గనైజరుగా రాష్ట్రపార్టీపంపింది. శైశవావస్థలో వున్న జిల్లా కమ్యూనిస్టు పార్టీకి ఒక నిర్మాణరూపంఇచ్చి అభివృద్ధిపరచటానికి రాజగోపాలరావు కొంత కృషిచేశారు.

కోనేటి రాజగోపాలరావు కార్యదర్శిగా కోడి నరసింహం, తిప్పారెడ్డి, రామ శాస్త్రులతో జిల్లాకమిటీ ఏర్పడింది.

జిల్లాలో ఉన్న కమ్యూనిస్టు కార్యకర్తలను సెల్స్‌గా ఏర్పాటు చేసి, తక్షణ ప్రజా సమస్యలపై ఆందోళనా కార్యక్రమాన్ని చేపడుతూ కమ్యూనిస్టు పార్టీ అభివృద్ధికి ఈ నూతన కమిటీ కృషి చేసింది.

1943 ఆగష్టు నాటికి జిల్లాలో ఉన్న కొంతమంది కమ్యూనిస్టు పార్టీ సభ్యుల వివరాలు.

కర్నూలు :- సి. పి. ఐ రామయ్య. కా॥ జమ్మన్న, కా॥ తిప్పారెడ్డి.

నంద్యాల :- కా. కోడి నరసింహం.

ప్రత్తికొండ :- కా. రామశాస్త్రి, ఎల్. వెంకటప్ప.

వెలుగోడు :- ఎమ్, సుబ్బారెడ్డి, ఎ. సుదర్శనం.

క్రిష్ణంశెట్టి పల్లె (గిద్దలూరు) :- కా. కృష్ణారెడ్డి, వి. నరసింహారావు.

తుర్విమెళ్ల :- బి. శాయన్న, బి. వెంకటరంగయ్య, తుపాకుల బసవయ్య.

## ఆధారాలు

1. దుర్భా కృష్ణమూర్తి 'స్మృతులు' పుస్తకం నుండి.
2. దుర్భా కృష్ణమూర్తి 'స్మృతులు' పుస్తకం నుండి.
3. ఆంధ్రపత్రిక 1937 నవంబరు 17, 9వ పేజీ.
4. పి. వెంకట్రామప్పతో ఇంటర్వ్యూ.
5. ప్రజాశక్తి 1942 ఆగష్టు సంచికలు.
6. ప్రజాశక్తి 14-10-42, 8 వ పేజీ.

# చిత్తూరు జిల్లాలో కమ్యూనిస్టు పార్టీ నిర్మాణం

వెంకటగిరి హైస్కూలులో విద్యార్థిగా ఉన్న రామాయణ మునిరత్నం జాతీయోద్యమంతో ప్రభావితుడైన వ్యక్తి. అక్కడి ప్రజా ఉద్యమాలపట్ల ఆసక్తి కల్గివున్నాడు. అదే కాలంలో వెంకటగిరి ప్రాంతంలో కమ్యూనిస్టు కార్యకర్తగా పనిచేస్తున్న బీరం రామనాథంతో పరిచయం ఏర్పడింది. వీరి ద్వారా సోషలిస్టు రాజకీయాల పట్ల ఆకర్షితులయ్యారు వీరి పరిచయం ద్వారా 1937 కొత్తపట్నం రాజకీయ పాఠశాలకు విద్యార్థిగా హాజరై కమ్యూనిస్టు భావాల వైపు ఆకర్షించబడ్డారు.

పాఠశాల నుంచి తిరిగి వచ్చిన తరువాత చిత్తూరు జిల్లాలో కమ్యూనిస్టు ప్రచారానికి పూనుకున్నారు. ఇదే సమయంలో వార్ధా ఆశ్రమం నుండి వచ్చిన ఎ.పి. వజ్రవేలు శెట్టి కూడా వీరికి తోడయ్యారు. వజ్రవేలు శెట్టి వార్ధా ఆశ్రమంలో ఉన్న కాలంలో అక్కడ ఉన్న లూయాఫిషర్ (జర్మను దేశస్థుడు) ద్వారా మార్క్సిస్టు భావాలవైపు ఆకర్షితులయ్యారు.

1937-38 కాలంలో రంగాగారి రైతాంగ విద్యాలయం కూడా జిల్లాలో సోషలిస్టు భావాల వ్యాప్తికి దోహదపడింది. రంగా అనుకూలురుగా వున్న డి. సీతారామయ్య రాసకొండ నరసింహారెడ్డి కూడా జిల్లా రైతాంగంలో సోషలిస్టు భావాల వ్యాప్తికి, రైతాంగం సమైక్యమవడానికి దోహదపడ్డారు.

1938 మధ్య కాలానికి ఎస్. నారాయణ రాజు కమ్యూనిస్టు భావాలతో చిత్తూరు జిల్లాకు తిరిగి వచ్చారు. భగవద్గీతను చదవటానికి పశ్చిమ గోదావరి జిల్లా వెళ్ళిన ఎస్. నారాయణ రాజు అక్కడి కమ్యూనిస్టు కార్యకర్తలతో పరిచయం కల్గి మంతెనవారిపాలెం రాజకీయ పాఠశాలకు హాజరయ్యారు. పాఠశాల ప్రభావంతో కమ్యూనిస్టు భావాలవైపు ఆకర్షితులై చిత్తూరు జిల్లాలో కమ్యూనిస్టు పార్టీ నిర్మాణానికి పూనుకున్నారు.

జిల్లాలోని కమ్యూనిస్టు పార్టీని నిర్మించేందుకు 1938 చివరికాలంలో పుచ్చలపల్లి సుందరయ్య, మునిరత్నం, కరకంబాడి రంగాచారి జిల్లా అంతటా పర్యటించి పార్టీ నిర్మాణానికి బీజాలు వేశారు. తిరుపతి చుట్టుప్రక్కల గ్రామాలలో రాత్రి పాఠశాలలు నిర్వహించి గ్రామాలలో రైతు వ్యవసాయ కూలీలను సంఘ

టితం చేయడానికి ప్రయత్నించారు. ఈ ప్రయత్నాల ఫలితంగా సోషలిస్టు భావాలు కల్గిన యువకులతో తిరుపతిలో యువజన సంఘం ఏర్పాటైంది. అనేక గ్రామాలలో రైతు సంఘాలు ఏర్పడ్డాయి. 1939 నాటికి తిరుపతి, చిత్తూరు, మదనపల్లి, కార్వేటినగరం మొదలగు కేంద్రాలతో కమ్యూనిస్టు పార్టీకి సంబంధాలు ఏర్పడ్డాయి.

ఈ కాలంలోనే నెల్లూరు జిల్లాలో ఉధృతంగా ఉన్న వ్యవసాయ కూలీల పోరాట ప్రభావం చిత్తూరుజిల్లా వ్యవసాయ కూలీలపై కూడా పడింది. చంద్రగిరి తాలూకాలోని గ్రామాలలో వ్యవసాయ కూలీలు సంఘటితమై కూలిపెంపుకొరకు ఆందోళనలు ప్రారంభించారు. వ్యవసాయ కూలీల పోరాటాలలో ప్రధానమైంది వేదల్ల చెరువు వ్యవసాయ కూలీల సమ్మె.

1939-40 కాలంలో స్టూడెంట్ ఫెడరేషన్ కార్యక్రమాలు చిత్తూరు జిల్లాకు కూడా వ్యాప్తిచెందాయి. చిత్తూరు, తిరుపతి, కాళహస్తి మొదలగు చోట్ల స్టూడెంట్ ఫెడరేషన్ శాఖలు ఏర్పడ్డాయి. యుద్ధ వ్యతిరేక కార్యక్రమాలలో విద్యార్థులు ముందుభాగాన ఉండేవారు. స్టూడెంటు ఫెడరేషన్ కార్యక్రమాల ద్వారా కమ్యూనిస్టు భావాలవైపు ఆకర్షితులై ఖాసీం, దండే శ్రీనివాసుల శెట్టి, తిరుపతిలో వాసుదేవరెడ్డి, క్రిష్ణమనాయుడు, దశరథరావు, శివయ్య తదితర విద్యార్థులు పార్టీలోకి ఆకర్షించబడ్డారు.

రైతు సంఘ కార్యక్రమాలలో కూడా కమ్యూనిస్టుల ప్రభావం క్రమక్రమంగా పెరగసాగింది. తిరుత్తణి తాలూకాలోని పల్లెపట్లు మొదలైన గ్రామాలలో శెట్టినాడు భూస్వాములకు వ్యతిరేకంగా బలమైన రైతు సంఘాలు ఏర్పడ్డాయి. రైతులు రీసెటిల్‌మెంటు కొరకు, శిస్తు తగ్గింపుకొరకు ఆందోళన కార్యక్రమాలు ప్రారంభించారు. రైతు సంఘ కార్యక్రమాలలో కమ్యూనిస్టులు, కాంగ్రెస్‌వాదులు కలిసి పాల్గొంటూండేవారు. తిమ్మారెడ్డి వంటి రైతు నాయకులు రైతు సంఘ కార్యక్రమాలలో కమ్యూనిస్టులతోపాటే పనిచేసేవారు. రైతు సంఘ కార్యక్రమాలలో పాల్గొంటూ నగరిలోని బి. సుబ్రహ్మణ్యరెడ్డి, రామలింగారెడ్డి, పి. రామకృష్ణ నాయుడు, కమ్యూనిస్టు భావాలవైపు ఆకర్షితులై పార్టీ సభ్యులైనారు. పుత్తూరు తాలుకాలలో విస్తరిస్తూన్న రైతు ఉద్యమాన్ని సంఘటితపరచి నిర్మాణరూపం ఇచ్చేందుకు పుత్తూరు తాలుకా రైతు మహాసభను 1941లో వడుమాలపేట వద్ద ఎస్ పి. పురంలో నిర్వహించారు. ఆ మరు సంవత్సరమే కమ్మపల్లి గ్రామంలో మరో రైతు మహాసభను నిర్వహించారు. 5 వేలమంది రైతులు హాజరైన ఈ మహాసభకు కమ్యూనిస్టు నాయకులతోపాటుగా తిమ్మారెడ్డి, పాకాల వెంకటరామ నాయుడు నెల్లూరు వెంకటరామ నాయుడు (జమీన్ పత్రిక ఎడిటర్) మొదలైనవారు కూడా హాజరైనారు.

సామ్రాజ్యవాద యుద్ధకాలంలో రాయలసీమ ప్రాంతంలో కమ్యూనిస్టు పార్టీ ఆర్గనైజరుగా ఉన్న ఏటుకూరి బలరామమూర్తి చిత్తూరు జిల్లా కమ్యూనిస్టు పార్టీకి నిర్మాణరూపం ఇచ్చేందుకు ప్రయత్నించారు. విస్తరిస్తున్న పార్టీ కార్యక్రమాలను సమన్వయ పర్చుకుంటూ పార్టీ నిర్మాణాన్ని పెంపొందించేందుకు వీలుగా జిల్లా కమ్యూనిస్టు పార్టీ కన్వెన్షన్‌ను 1940 లో మదనపల్లిలో జరిగింది. ఈ కన్వెన్షన్‌లోనే జిల్లా ఆర్గనైజరింగు కమిటీ ఏర్పడింది. ఆర్. యమ్. మునిరత్నం కార్యదర్శిగా నారాయణరాజు, వజ్రవేలు శెట్టి, ఖాసిం, దండె శ్రీనివాసుల శెట్టి సభ్యులుగా ఈ ఆర్గనైజింగు కమిటీలో ఉన్నారు. వివిధ ప్రజా సంఘాలలో పనిచేస్తున్న పార్టీ కార్యకర్తలకి, పార్టీ సన్నిహితులుగా ఉన్నవారికి సిద్ధాంత అవగాహన పెంపొందించేందుకు, మార్క్సిస్టు రాజకీయ పాఠశాలను కప్పంలో నిర్వహించారు.

ప్రజాయుద్ధకాలంలో పార్టీ నిర్మాణాన్ని పెంపొందించి కార్యక్రమాలు విస్తృత పర్చటానికి వీలుగా 1942 చివరి కాలంలో కడియాల పరశురామయ్యని చిత్తూరు జిల్లా ఆర్గనైజరుగా రాష్ట్ర పార్టీ పంపింది. ఇదేకాలంలో రైల్వే వర్కర్సు యూనియన్ కార్యక్రమాలను నిర్వహిస్తున్న పెండ్యాల వెంకటేశ్వర్లు కూడా చిత్తూరు జిల్లాలో కమూనిస్టు పార్టీ అభివృద్ధికి దోహదపడ్డారు.

కమ్యూనిస్టు పార్టీ ప్రభావం క్రమంగా పెరుగుతుండటంతో ప్రభుత్వం కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తలు సానుభూతిపరులపై చిత్తూరు కుట్రకేసును బనాయించి 18 మందిని 1942 లో అరెస్టు చేసింది. ఎటువంటి ఆధారాలు లేక కేవలం అనుమానంతో బనాయించిన ఈ కుట్రకేసును ప్రభుత్వం రుజువు చేయలేక 1943 లో ఉపసంహరించుకుంది.

1943 నాటికి చిత్తూరు జిల్లాలో కమ్యూనిస్టు పార్టీ ప్రచారదశను దాటి నిర్మాణరూపం తీసుకుంటూ అన్ని ప్రజా సంఘాలలోనూ విస్తరిస్తూ కార్మిక కర్షక వ్యవసాయ కూలీ సమస్యలపై పోరాడే రాజకీయ శక్తిగా రూపుదిద్దుకుంది.

# తెలంగాణా ప్రాంతంలో కమ్యూనిస్టు పార్టీ నిర్మాణం

## హైదరాబాదు నగరం

కామ్రేడ్ మఖ్దుం మొహియుద్దీన్, ఆయనతో పాటు కామ్రేడ్స్ అసోసియేషన్‌లో పని చేసినవారిలో ఒక పెద్ద భాగం 1940 లో కమ్యూనిస్టు పార్టీ సభ్యులయ్యారు. మఖ్దుం, రాజబహదూర్ గౌడ్, గులాం హైదర్, హమీద్అలీ ఒక సెల్లులో ఉండేవారు. జవాద్ రజ్వీ, ఓంకార్ ప్రసాద్ గారితో కూడిన ఇతర సెల్లులు ఏర్పడ్డాయి.

హైదరాబాదులో మొదటగా సిటీ కమిటీ 1941 లో ఏర్పడింది. దీనికి కామ్రేడ్ మఖ్దుం మొహియుద్దీన్ కార్యదర్శి. రాజబహదూర్ గౌడ్ సహాయ కార్యదర్శి.[1] సిటీ కాలేజీలో ఉపాధ్యాయుడుగావున్న మఖ్దుం 1942 లో దానికి రాజీనామా చేసి పార్టీలో పూర్తికాలం పనిచేసే కార్యకర్తగా వచ్చారు. రాజబహదూర్ గౌడ్ 1943 లో తన యం బి బి యస్ పరీక్ష పూర్తిచేసిన తరువాత డాక్టర్ వృత్తిలోకి వెళ్ళక పార్టీలో పూర్తి కాలం పనిజేసే కార్యకర్తగా వచ్చారు. అదే సంవత్సరం గులాంహైదర్ ప్రభుత్వ ఉద్యోగానికి రాజీనామా చేసి పార్టీ పూర్తికాల కార్యకర్తగా వచ్చారు. రాజబహదూర్ గౌడ్, హైదర్‌హుస్సేన్, సాంబమూర్తి, శ్రీనివాసరావు, ఆలం, ఇబ్రహీం, జవాద్ రజ్వీ, గులాంహైదర్ ఈ విధంగా దాదాపు ఒక డజను మంది హైదరాబాదు, సికింద్రాబాదు జంట నగరాలలో పూర్తికాలం పనిచేసే కార్యకర్తలుగా వచ్చారు.[2]

హైదరాబాదులో మహిళా నవజీవన మండలి అనే మహిళా సంస్థ వుండేది. ఇందులో ఎక్కువగా గుజరాతీయులు, తెలుగువారు కాని ఇతర భాషా ప్రాంత మహిళలు వుండేవారు. ఆంధ్ర మహాసభ విభాగంగా ఆంధ్ర మహిళా సభ వుండేది. మహిళా నవజీవన మండలిలో పనిచేస్తున్న యశోదాబెన్, సర్జూబెన్, బ్రిజ్‌రాణి, ఆమె సోదరి రాంప్యారా (జవాద్‌రజ్వీ భార్య), ప్రమీలాతాయి, జమాలున్నీసా బేగం, నిమ్మగడ్డ సత్యవతి, రావి సీతాదేవి, పద్మాదేశ్‌పాండే, కాదంబరీ దేశ్‌ముఖ్ మొదలగువారు 1942, 1943 సంవత్సరాలలో పార్టీలోకి వచ్చారు.

హైద్రాబాద్ నగరంలో కమ్యూనిస్టు ఉద్యమం గురించి మరొక అధ్యాయంలో వివరించాం.

## వరంగల్ జిల్లాలో కార్యకలాపాలు

ప్రస్తుతం ఖమ్మం జిల్లాగావున్న ప్రాంతం అంతకుముందు వరంగల్లు జిల్లాలో భాగంగా వుండేది. ఖమ్మంజిల్లా కృష్ణాజిల్లాకు, తూర్పుగోదావరి ఏజెన్సీ ప్రాంతానికి ఆనుకొనివుంది. ఈ జిల్లా ప్రజలకు కృష్ణాజిల్లాతోనూ, విజయవాడ కేంద్రంతోనూ ఆర్థిక, రాజకీయ, సాంఘిక సంబంధాలు ఎక్కువగా ఉండేవి. కృష్ణాజిల్లాలోని రాజకీయాల ప్రభావం ఖమ్మంజిల్లా ప్రజలపై ఎక్కువగా పడేది.

1935 లో తెలంగాణా ఆంధ్ర మహాసభ తృతీయ మహాసభ ఖమ్మం పట్టణంలో జరిగింది. ఈ మహాసభ విజయానికి అక్కడి యువకులు విశేషించి కృషిచేసారు. సర్వ దేవభట్ల రామనాధంగారి కుటుంబాన్ని, చిర్రావూరి లక్ష్మి నరసయ్యగారి కుటుంబాన్ని ఆంధ్ర మహాసభ ఉద్యమంలో పాల్గొంటున్నందుకు సనాతన ధర్మోద్ధారకులు సాంఘిక బహిష్కరణకు గురిచేసారు.

1938 ఫిబ్రవరిలో జరిగిన హరిపురా కాంగ్రెసు మహాసభకు హైదరాబాదు సంస్థానంనుండి వెళ్ళిన 500 మంది యువకులలో ఖమ్మం పట్టణం నుండి వెళ్లినవారు 15 మంది వున్నారు. ఈ 15 మందిలో చిర్రావూరి లక్ష్మినరసయ్య ఒకరు.

1938 స్టేటు కాంగ్రెసు ఆధర్యాన జరిగిన సత్యాగ్రహం, విద్యార్థులు నిర్వహించిన వందేమాతరం ఉద్యమం ఇక్కడి యువకులను, విద్యార్థులను ఉత్తేజ పరిచాయి. మధిర కేంద్రంగా ఒక సత్యాగ్రహ శిబిరం నిర్వహించబడింది. అనేకమంది యువకులు సత్యాగ్రహం దళాలలో చేరి అరెస్టు అయ్యారు. వాసిరెడ్డి వెంకటపతి, వట్టికొండ నాగేశ్వరరావు మొదలైనవారు సత్యాగ్రహం చేసినవారిలో వున్నారు.

1938 సంవత్సరంలో ఖమ్మం పట్టణమందు రైతు సదస్సు జరిపి "నిజాం ఆంధ్ర రైతుసంఘం" ఏర్పాటు చేయబడింది. దీనికి చెర్కుమిల్లి హనుమయ్య అధ్యక్షులుగాను, అమ్మనమంచికామయ్య కార్యదర్శిగానూ, మరో ఎనిమిది మంది ప్రముఖ్యులు కార్యవర్గ సభ్యులుగానూ వున్నారు. సంఘం పేరుమీద కార్యక్రమాలు నిర్వహింపబడుతూ వచ్చాయి.

సంఘ సభ్యత్వం చేర్పించి, అఖిల భారత రైతుసంఘానికి హైదరాబాదు స్టేటు రైతుసంఘాన్ని అనుబంధించి, రుసుం చెల్లించబడింది. 1939 ఏప్రిల్ 9, 10 తేదీలలో గయలో జరిగిన 4 వ అఖిలభారత రైతు మహాసభలో కేంద్ర

కిసాన్ కమిటీకి హనుమయ్యగారు ప్రత్యామ్నాయ ప్రతినిధిగా తీసుకోబడ్డారు. కానీ అటుతరువాత దీనిని ప్రభుత్వం నిషేధించింది. అందువల్ల ఈ సంఘం తరువాత పనిచేయలేదు.[3]

విజయవాడనుండి 'నవశక్తి' వారపత్రిక. సోషలిస్టు సాహిత్యం ఈ జిల్లాకువస్తుండేది. తునికిపాడులో 1939 మేలో జరిగిన నైజాం ఆంధ్రరైతు పాఠశాలకు ఈ జిల్లానుండి 40 మందివరకు హాజరయ్యారు.

1936 లో బెజవాడనుంచి వచ్చిన మిల్లువర్కరు గర్రె సత్యనారాయణ 16 మందియువకులతో ఖమ్మంలో ఒక యవజనసంఘాన్ని ఏర్పాటుచేసాడు. ఈ సంఘం ఆశయం సోషలిజం. ఈ సంఘం 1939 లో రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభంకాగానే సామ్రాజ్యవాద వ్యతిరేకపోస్టర్లు ఖమ్మం జిల్లా అంతటా అతికించారు. ఇదిసామ్రాజ్యవాద 'వ్యతిరేకపోరాటానికి నాంది.

ఈ యువజనసంఘం వారు జాతీయఉద్యమాన్ని గురించిప్రచారంచేసారు. యుద్ధనిధివసూలును వ్యతిరేకించారు. రాత్రి పాఠశాలలు పెట్టారు. రెగ్యులరుగా రహస్య సమావేశాలు జరిగేవి.

'నవశక్తి' వారపత్రిక ఆగిపోయినతరువాత ఆంధ్ర కమ్యూనిస్టు కమిటీ ప్రకటిస్తున్న 'స్వతంత్ర్య భారత్' రహస్యపత్రిక, ఖమ్మంపట్టణానికి, జిల్లాలోని ఇతరకేంద్రాలకు వస్తూవుండేది. తిరుమలాయపాలెం, నేలకొండపల్లె, గోకినేపల్లి, రాయన్నపేట, అల్లీనగరం, మడుపల్లి, సిరిపురం మొదలగుగ్రామాలకు కొత్తగూడెం, తదితరప్రాంతాలకు స్వతంత్ర్యభారత్ పంపబడేవి.

ఖమ్మం దగ్గరలోని తల్లంపాడులో యుద్ధవ్యతిరేక పోస్టర్లు అతికించారని ఈ యువజనసంఘంలోని పల్లిచెన్న కృష్ణ, గోదేశి విరభద్రం, కొండపల్లి కష్ణయ్యలను మరో 13 మందిని అరెస్టుచేసారు. వీరినిస్పెషల్ కోర్టులోవిచారించి 1½ సంవత్సరం జైలుశిక్ష విధించారు ఒక సంవత్సరంపాటు విచారణజరిగింది. లాయరు నాగులపల్లి కోదండరామయ్య వీరితరపున వాదించారు. స్పెషల్కోర్టు విధించినశిక్షపై హైకోర్టుకు అప్పీలుచేయబడింది. హైకోర్టువీరికి 18 మాసాలు శిక్ష విధించింది.

వీరుస్థాపించిన లైబ్రరీకి డాంగే పేరుపెట్టారు. వీరుజాతీయ, అంతర్జాతీయ సమస్యలపైగోష్ఠులు నిర్వహించేవారు. కమ్యూనిస్టుపార్టీ ప్రచారాన్ని, యుద్ధ వ్యతిరేకప్రచారాన్ని చార్టులువ్రాసి కట్టేవారు. వాల్పోస్టర్లు, అంటించేవారు. తాలుకాలలో కూడా ఇట్టి యువజనసంఘాలేర్పడ్డాయి. ఈ యువకులే తునికిపాడు రైతాంగా విద్యాలయానికివెళ్లారు. ఈ స్కూలుకు వెళ్లిన వారిలో మత్సా వీరయ్యా తెలంగాణా పోరాటంలో చనిపోయారు. తునికిపాడు రైతాంగవిద్యాలయానికి హాజరైనవారిలో

వట్టికొండ నాగేశ్వరరావు, బోడెపూడి వెంకటేశ్వరరావు మొదలైన వారుకూడా వున్నారు.

ఈ యువజన ఉద్యమం కమ్యూనిస్టు పార్టీతో సంబంధం ఏర్పరచుకొని, కార్యకలాపాలను సమన్వయపరుచుకొంటూ వుండేది. ప్రజా యుద్ధకాలంలో వీరంతా విడుదలయ్యారు. అటుతరువాత వీరు కమ్యూనిస్టు పార్టీలో చేరారు.[3]

వందేమాతరం ఉద్యమంలో పాల్గొని నాగపూర్ వెళ్ళిన సర్వదేవభట్ల రామనాథం అక్కడ కమ్యూనిస్టుగా మారి 1940 కి ఖమ్మం తిరిగి వచ్చాడు. చిర్రావూరి లక్ష్మీనరసయ్యకూడ 1940 నాటికి పార్టీలోకి వచ్చాడు. వరంగల్‌లో సబ్ ఇన్‌స్పెక్టరుగా పనిచేస్తున్న పెరవలి వెంకట రమణయ్యకు స్టేటు కాంగ్రెసు సత్యాగ్రహం తరువాత చెలరేగిన మతకలహాల మూలంగా ఉద్యోగంపై విముఖత ఏర్పడింది. 1939 డిసెంబరులో దానికి రాజీనామా యిచ్చి చిర్రావూరి లక్ష్మీ నరసయ్య మొదలగు కమ్యూనిస్టులతో కాంట్రాక్టు ఏర్పరచుకొని, 1940 లో కమ్యూనిస్టు పార్టీ సభ్యుడయ్యాడు.

ఆవిధంగా 1940 నాటికి సర్వదేవ భట్ల రామనాథం, చిర్రావూరి లక్ష్మీ నరసయ్య, పెరవలి వెంకటరమణయ్య తరువాత దేవులపల్లి వెంకటేశ్వరరావు కమ్యూనిస్టు పార్టీ సభ్యులయారు. ఖమ్మం పట్టణంలో రామనాథం, పెరవలి వెంకట రమణయ్య, చిర్రావూరి లక్ష్మీనరసయ్యల రావెళ్ళ జానకి రామయ్యలతో ఒక సెల్ ఏర్పడింది.

1940 చివరకు పెండ్యాల సత్యనారాయణ. నేదునూరి జగన్నాథరావు పర్సా దుర్గాప్రసాదరావు, పబ్బరాజు రంగారావులు కూడా పార్టీలో సభ్యత్వం పొందారు. వీరందరూ ఆంధ్ర మహాసభలో పనిజేసేవారు.[4]

1940 చివర నాటికి అల్లీనగరం రామన్నపేట గ్రామాలకుకలిపి మధిర సెల్ ఏర్పడింది. ఇందులో వట్టికొండ నాగేశ్వరరావు వాసిరెడ్డి వెంకటపతి, పారుపల్లి రామయ్య నీరుకొండ అప్పారావు వాసిరెడ్డి సత్యనారాయణ వాసిరెడ్డి సూర్యనారాయణ, వెందుకూరి రాఘవయ్యలు వున్నారు.

41. చివరికి (కారేపల్లి గ్రామం) ఇల్లెందు సెల్ ఏర్పడింది. నేదునూరి జగన్నాథరావు, పర్చా దుర్గాప్రసాదరావు, నేదునూరి రాఘవరావులు ఇందులో వున్నారు.

1942 లో వరంగల్ జిల్లా కమిటీ పెరవలి వెంకట రమణయ్య, సర్వదేవ భట్ల రామనాథం, చిర్రావూరి లక్ష్మీనరసయ్య, పెండ్యాల సత్యనారాయణ, నేదునూరి జగనాథరావులలో ఏర్పడింది. రమణయ్య దీనికి కార్యదర్శి.

జిల్లా కమిటీ ఏర్పడకముందే మానుకోటలో పార్టీ సెల్ ఏర్పడింది. ఇందులో కన్నెకంటి శ్రీనివాసరావు, గోపాలరావు మరో ఇద్దరు వున్నారు.

1942 చివరకు వరంగల్ జిల్లాలో 100కి పైగా పార్టీ సభ్యులున్నారు.

1943 లో అజంజాహి మిల్లులో వర్కర్సు యూనియన్ ఏర్పడింది. 43 లో సమ్మె నిర్వహించబడ్డది. కార్మికులు హైదరాబాదు పట్టణానికి లాంగ్ మార్చ్ నిర్వహించారు.

1943 నాటికి ఖమ్మం తాలుకా చుట్టు గ్రామాలలో పార్టీ సెల్లులు ఏర్పడ్డాయి. పార్టీ సభ్యత్వం విస్తరించింది. 1943 చివరకు 100 మంది వరకు పార్టీ సభ్యులుగా వున్నారు.[5]

## నల్గొండ జిల్లా

నైజాం కర్కశ ఫ్యూడల్ వ్యతిరేక ఉద్యమానికి నాంది పల్కిన ఆంధ్ర మహాసభ కార్యక్రమాల ద్వారా ఉత్తేజితులైన అతివాద యువకులతో నల్గొండ జిల్లాలో కమ్యూనిస్టు పార్టీ ఏర్పడింది. 1940 నాటికే సూర్యాపేట, హుజూర్ నగర్ తాలుకాలు నైజాం వ్యతిరేక కార్యకలాపాల కేంద్రాలుగా వున్నాయి. రాష్ట్ర వ్యాపితంగా పెల్లుబికిన వందేమాతరం ఉద్యమ ప్రభావం నల్గొండ జిల్లా విద్యార్థులపై ప్రగాఢ ముద్రను వేసింది. ఈ ఉద్యమంలో భాగంగా నల్గొండ హైస్కూలు విద్యార్థులు 23 రోజుల పాటు సమ్మెచేసారు. సమ్మెకు నాయకత్వం వహించిన ధర్మభిక్షం వంటి విద్యార్థులనేకమంది ఈ సమ్మె ప్రభావంతో నైజాం వ్యతిరేక రాజకీయ కార్యకలాపాలవైపు ఆకర్షితులయ్యారు. ఈ వందేమాతరం ఉద్యమంలోనే పాల్గొని ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి బహిష్కరించబడిన దేవులపల్లి వెంకటేశ్వరరావు, నల్గొండ జిల్లావారే.

1940 లో కమ్యూనిస్టు పార్టీ సభ్యుడైన దేవులపల్లి వెంకటేశ్వరరావు జిల్లాలోని ఆంధ్ర మహాసభ కార్యకర్తలతో పరిచయాలు పెట్టుకుని వారిలో అతివాదులుగా ఉన్న వారిని కమ్యూనిస్టు భావాలవైపు ఆకర్షించారు. వీరి ద్వారా డి. సుబ్బారావు 1941 మధ్య కాలానికి కమ్యూనిస్టు పార్టీ సభ్యులయ్యారు. ఆ తరువాత కొద్ది నెలలకి భీమిరెడ్డి నరసింహారెడ్డి కూడా పార్టీ సభ్యత్వాన్ని పొందారు. వీరు ఆంధ్ర మహాసభలో కొనసాగుతూనే కమ్యూనిస్టు భావాల ప్రచారాన్ని రహస్యంగా కొనసాగించారు. డి. సుబ్బారావు తరచుగా హుజూర్‌నగర్ తాలుకాలో పర్యటించి ఆంధ్ర మహాసభ కార్యకర్తలలో కమ్యూనిస్టు భావాల పెంపుదలకు కృషిచేసారు. దీనితోపాటుగా ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ రహస్యంగా ముద్రిస్తున్న 'స్వతంత్ర్య భారత్' పత్రికను అతివాద ఆంధ్ర మహా

సభ కార్యకర్తలకు అందించేవారు. సూర్యాపేటలో అర్జున పుస్తక భాండాగారం నిర్వహిస్తున్న ధర్మభిక్షంతో పరిచయం పెంచుకుని వారిని కూడా కమ్యూనిస్టు భావాలవైపు ఆకర్షించినారు. అతివాద సాహిత్య పంపిణీకి, స్వతంత్ర్య భారత్ పంపిణీకి ఈ అర్జున పుస్తక భాండాగారం ఒక కేంద్రంగా పనిచేసేది.

ఇదే కాలంలో (41) హుజూర్‌నగర్ తాలుకా ఆంధ్ర మహాసభ ఆర్గనైజరుగా వెదిరె రాజిరెడ్డి వచ్చారు ఈయన అప్పటికే బద్దం ఎల్లారెడ్డి, రావి నారాయణరెడ్డి పరిచయంతో కమ్యూనిస్టు పార్టీ సభ్యులయ్యారు. డి. సుబ్బారావు, వెదిరె రాజిరెడ్డి ఆంధ్ర మహాసభ కార్యక్రమాలను తాలుకా అంతటా విస్తృతపరిచారు

1941 లో చిలుకూరులో జరిగిన 8వ ఆంధ్ర మహాసభ జిల్లాలోని రైతాంగానికి ఎంతో ఉత్తేజాన్ని ఇచ్చింది. ఈ మహాసభ సందర్భంగా సూర్యాపేటనుండి ధర్మబిక్షం, లింగారెడ్డి నాయకత్వంలో 1000 మంది వాలంటీర్లు ఒక ప్రభను కట్టుకుని గ్రామాగ్రామాన ప్రచారం చేసారు. "నీవు హలమును బట్టి నేలను దున్నకపోతే, రాజాధిరాజులకు రాలదొక్క గింజైనన్" అని పాడుతూ, "అన్యాయ కాలంబు దాపురించిందిపుడు, అందరూ మేల్కోవాలంటూ" ఆలాపిస్తూ గ్రామాల్లో ప్రచారంచేసి చిల్కూరు సభకు చేరింది ఈ ప్రచారదళం. భూమిపై రైతుకున్న హక్కులను నిర్ధారిస్తూ చట్టాలు చేయాలని కోరుతూ ఈ మహాసభలో తీర్మానాలు చేయబడ్డాయి. ప్రజా సమస్యలపై పోరాటానికి ఈ మహాసభ పిలుపునిచ్చింది.

ఈ మహా సభ తరువాత జిల్లాలోని ఆంధ్ర మహా సభ కార్యకర్తలలో కమ్యూనిస్టు భావాలు పెంపొందించటానికి ఒక రాజకీయ పాఠశాలను 1941 లో దేవులపల్లి వెంకటేశ్వరరావు నల్లగొండలో నిర్వహించారు. ఈ పాఠశాలకు రావి నారాయణరెడ్డి హాజరై ఒక క్లాసు తీసుకున్నారు. పోలీసు నిఘా ఉండడం వల్ల మరునాడే రావి నారాయణరెడ్డి అక్కడనుంచి వెళ్లిపోవలసివచ్చింది.

ఆంధ్ర మహా సభ కార్యక్రమాలలోనూ, అతివాద సాహిత్య పంపిణిలోనూ చురుకుగా పాల్గొంటూ, కమ్యూనిస్టు విధానాలతో ఏకీభవించిన ధర్మబిక్షం, డి. రాఘవేంద్రరావులు 1942 లో కమ్యూనిస్టుపార్టీ సభ్యత్వాన్నిపొందారు వీరితో పాటుగా డి. సీతారాములు (అర్జున పుస్తక భాండాగారంలో ఉన్న) కూడా పార్టీ క్యాండిడేటు సభ్యుడయ్యారు.

క్రమంగా 1942 మధ్య కాలానికి నల్గొండ జిల్లా పార్టీ యూనిట్ ఏర్పడింది. డి వి. సుబ్బారావు, భీమిరెడ్డి నర్సింహారెడ్డి, ధర్మబిక్షం, డి. రాఘవేంద్రరావులు ఈ జిల్లా యూనిట్ సభ్యులు డి. వి. సుబ్బారావు ఈ జిల్లా యూనిట్ కన్వీనర్‌గా పని చేసారు.

వీరు ఆంధ్ర మహా సభ కార్యక్రమాలలో చురుకుగా పాల్గొంటూ అతి వాదులుగావున్న యువకులకు రహస్యంగా కమ్యూనిస్టు సాహిత్యం అందించి వారిలో కమ్యూనిస్టు భావాలను పెంపొందించేవారు.

ఈ విధంగా వెదిరె రాజిరెడ్డి ద్వారా 1942 చివరి కాలంలో దొడ్డా నర్సయ్య కమ్యూనిస్టు పార్టీ సభ్యుడయ్యారు. ఆ తరువాత సంవత్సరంలో కోట నారాయణ కూడా కమ్యూనిస్టు పార్టీ సభ్యుడయ్యారు.

1942-43 కాలంలో ఆంధ్ర మహాసభ కార్యక్రమాలు సూర్యాపేట, హుజూర్‌నగర్ తాలుకా అంతటికీ వ్యాప్తిచెంది ఆంధ్ర మహాసభ పూర్తిగా బలపడింది. ఈ కాలంలోనే చకిలం తిరుమలరావు, సి. యాదగిరిరావు, దాయం రాజిరెడ్డి, కొండల్ రెడ్డి, స్వరాజ్యం, శశిరేఖ, మల్లు ప్రతాపరెడ్డి, ఎ. వెంకటరెడ్డి కట్కూరి రామచంద్రారెడ్డి మొదలైన యువకులు ఆంధ్రమహాసభ కార్యకర్తలుగా కమ్యూనిస్టు పార్టీ అభిమానులుగా సూర్యాపేట తాలుకాలో ముందుకొచ్చారు. తరువాత కాలంలో వీరంతా కమ్యూనిస్టు పార్టీ సభ్యులయ్యారు. 1943 నాటికి మిర్యాలగూడా తాలుకాకు కూడా కమ్యూనిస్టు భావ ప్రచారం వ్యాప్తి చెందింది. స్కూలు టీచర్‌గా ఉన్న చల్లా సీతారామిరెడ్డి కమ్యూనిస్టు పార్టీ సానుభూతి పరులుగా వుంటూ ఆంధ్ర మహాసభ కార్యక్రమాలను కమ్యూనిస్టు సిద్ధాంత ప్రచారాన్ని సాగించారు.

1943 చివరి నాటికి ఆంధ్ర మహాసభనే వేదికగా చేసుకుని నల్గొండ జిల్లాలోని కమ్యూనిస్టు కార్యకర్తలు ప్రజా సమస్యలపై ముఖ్యంగా రైతాంగ సమస్యలపై కేంద్రీకరించి పనిచేస్తూ నైజాం వ్యతిరేక ఉద్యమాన్ని పోరాట దిశగా మళ్ళించేందుకు కృషిచేసారు. సూర్యాపేట, తాలుకా కమ్యూనిస్టు పార్టీకి, ఆంధ్ర మహాసభకు బలమైన కేంద్రంగా రూపొందింది. ఆంధ్ర మహాసభ జిల్లా కార్యాలయం కూడా సూర్యాపేటలోనే ఉండేది. జిల్లాలోని వివిధ కేంద్రాలకు కమ్యూనిస్టు ఉద్యమాన్ని వ్యాప్తిచేయడానికి తగిన కార్యకర్తలను అందించే కేంద్రంగా సూర్యాపేట రూపొందింది. ఈ కాలంలోనే మునిపల్లె రామరావు సూర్యాపేట దగ్గర ఒక గ్రామంలో ట్యూటర్‌గా ఉంటూ జిల్లాలో కమ్యూనిస్టు సాహిత్య పంపిణీకి, యువకులలో అతివాద భావాల వ్యాప్తికి కృషిచేశారు.

## ఆదిలాబాదు ఉద్యమం

ఆదిలాబాదు జిల్లాలో ఆంధ్ర మహా సభ నిర్మాణానికి దాని వ్యాప్తికి పని చేసిన వారిలో రామకృష్ణ శాస్త్రి, దాజి శంకర్రావు, చల్లా శ్రీనివాసరావులు ముఖ్యులు.

1938 లో రామకృష్ణ శాస్త్రి నాందేడు జిల్లా మొయినాబాదులో ఉపాధ్యాయుడుగా పని చేస్తున్నాడు. దాజి శంకర్ తన చదువు కొనసాగిస్తున్నాడు. వీరిద్దరు అప్పటికే ఆదిలాబాదు పట్టణంలో ఏర్పడిన సోషలిస్టు లీగ్‌లో సభ్యులు.

1938 లో సాగిన స్టేట్ కాంగ్రెసు సత్యాగ్రహోద్యమంలో మొయినాబాదు కూడా నాందేడ్ జిల్లాలో సత్యాగ్రహుల రిక్రూటింగ్ కేంద్రము. దాజి శంకరు ఆదిలాబాదులో స్టేటు కాంగ్రెసు సత్యాగ్రహము ఏర్పాటు చేయుటకు నియమించబడ్డాడు. కాని ఆదిలాబాదు వెళ్లే ముందుగానే జిల్లా సరిహద్దులో అరెస్టు చేయబడి పోలీసుల చిత్రహింసలకు గురిచేయబడ్డాడు. అది తప్పించుకొని, రహస్యంగా వుంటూ, సత్యాగ్రహ పోరాటం విరమించిన తరువాతనే ఆయన బహిరంగంగా వచ్చారు.

1939 ప్రారంభములో సాగిన వందేమాతరం ఉద్యమంలో విద్యార్థుల కార్యనిర్వాహక వర్గ సభ్యులలో ఒకరైన చల్లా శ్రీనివాసరావు ఆదిలాబాదుకు చెందిన వాడే. రామకృష్ణ శాస్త్రి సోదరుడు గోవర్ధన్ శాస్త్రి, మరికొందరు ఆదిలాబాదు విద్యార్థులు వందేమాతరం ఉద్యమంలో పాల్గొని, అటు తరువాత నాగపూరు, జబల్‌పూరు, పట్టణాలకు వెళ్ళి తమ చదువులు కొనసాగించారు. దాజీ శంకరు, రామకృష్ణశాస్త్రి 1939 లో త్రిపురలో జరిగిన భారత జాతీయ కాంగ్రెసుకు హాజరయ్యారు.

1941 లో రామకృష్ణ శాస్త్రి, ఆర్. డి. దేశపాండే, జోక్రి కమ్యూనిస్టు పార్టీ సభ్యులయ్యారు. రాష్ట్ర కమిటీ ఆర్గనైజరుగా హైదరాబాదు వచ్చిన మునిపల్లి రామరావు వీరి సభ్యత్వాన్ని ధృవీకరించారు. దాజీ శంకర్ 1942 లో సభ్యత్వం పొందాడు.

1940 లో ఆసిఫాబాదు తాలూకా బాబేఝరీ గ్రామంలో గోండు ప్రజల తిరుగుబాటు జరిగింది. అటవీ భూములు సాగు చేసుకొనే సమసపై ఈ పోరాటం నడిచింది.నైజాం ప్రభుత్వ రెవిన్యూ, ఫారెస్టు, పోలీసు అధికారులంతా కుమ్మక్కై ఈ ఉద్యమాన్ని దారుణ రక్తకాండతో అణచి వేసారు. పోలీసు కాల్పులలో కొమరం భీముతో సహా 40 గోండు ప్రజలు ఆహుతి అయ్యారు.

ఈ ఘటన ఆదిలాబాదు జిల్లాలో పెద్ద సంచలాన్ని కలుగజేసింది. ఆంధ్ర మహాసభ నాయకులు రావి నారాయణ రెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, బద్దం ఎల్లారెడ్డి కాల్పులు జరిగిన బాబేఝరీకి వెళ్ళి గోండు ప్రజలను పరామర్శించారు. ఈ ఘటన వివరాలన్నింటిని వెలుగులోకి తీసుకువచ్చి ఆ ప్రజలు పోరాటానికి సహాయ పడ్డారు.

1940లో మహారాష్ట్ర పరిషత్తు మహాసభ నాందేడ్ జిల్లా ఉమ్రిలో జరిగింది. దీనికి రామకృష్ణశాస్త్రి, ఆర్.డి. దేశపాండేలు హాజరయ్యారు. ఆ మహాసభకు వచ్చిన రావి నారాయణరెడ్డి, ఆర్ డి. దేశపాండేను హైదరాబాదు వచ్చి, మహారాష్ట్ర పరిషత్తు కార్యాలయంలో పని చేయవలసిందిగానూ, రామకృష్ణశాస్త్రిని ఆదిలాబాదు వెళ్లి జిల్లాలో ఆంధ్ర మహాసభ నిర్మాణానికి పని చేయవలసిందిగాను చెప్పారు. వారిద్దరు అదేవిధంగా చేసారు.

అసిఫాబాదుకు చెందిన జి యస్. గుప్తా తనపైన పోలీసు వారంటు వున్నదని తెలుసుకొని మల్కాపురం ఆంధ్ర మహాసభ తరువాత నల్గొండ జిల్లా, చందుపట్ల కేంద్రంగా చేసుకొని ఆంధ్రమహాసభలో పనిచేసాడు. అక్కడ పనిచేస్తుండగా దేవులపల్లి వెంకటేశ్వరరావుతో పరిచయం ఏర్పడింది. 1941లో గుప్తా కమ్యూనిస్టు పార్టీ సభ్యుడయ్యాడు 1945 వరకు ఆయన అక్కడ పనిచేసి, తరువాత మెదక్ జిల్లా జోగిపేట కేంద్రంగా పెట్టుకొని మూడు సంవత్సరాలు అక్కడ పనిచేసాడు.

ఆదిలాబాదు తాలుకా కుచాత్‌పూర్ గ్రామం దాజీ శంకర్ స్వగ్రామం. ఈ గ్రామ పోలీసు పటేలు సాగిస్తున్న దారుణ హింసలకు దౌర్జన్యాలకు వ్యతిరేకంగా రైతాంగాన్ని సమీకరించి పోరాడటం జరిగింది.

చిలుకూరు ఆంధ్ర మహాసభ తరువాత సభ్యత్వ రుసుం 4 అణాలకు తగ్గించడంతో జిల్లాలో సభ్యత్వాన్ని ఎక్కువగా చేర్పించటం, తరువాత వరంగల్ జిల్లా ధర్మారంలో జరిగిన ఆంధ్ర మహాసభకు ఈ జిల్లా నుండి ఎక్కువమంది ప్రతినిధులను తీసుకు వెళ్ళడం జరిగింది.

ఆ ఏడాదే చల్లా శ్రీనివాసరావు ఆదిలాబాదు జిల్లా ఆంధ్ర మహాసభకు అధ్యక్షుడయ్యాడు.

రామకృష్ణ శాస్త్రికి, మొయినాబాదులో ఉన్నప్పుడు, అటు తరువాత కూడా రహస్యంగా పంచబడుతున్న కమ్యూనిస్టు సాహిత్యం వచ్చేది. ఆయన దానిని పంపకం చేసేవాడు.

ప్రజా యుద్ధ కాలంలో కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగిన తరువాత ప్రజా శక్తి వారపత్రిక కాపీలను తెప్పించి పంచేవారు.

రావి నారాయణ రెడ్డి, బద్దం ఎల్లారెడ్డి ఈ జిల్లాలో ఆంధ్ర మహాసభ పెరుగుదలకు, ఉద్యమం అభివృద్ధి చెందడానికి చాలా తోడ్పడ్డారు.[6]

# మహబూబ్‌నగర్ జిల్లా

నైజాం నిరంకుశ దోపిడీ విధానానికి జమీందార్ల భూస్వాముల పెత్తందారీ తనానికి వ్యతిరేకంగా ఆంధ్రమహాసభ కార్యక్రమాలు రూపుదిద్దుకుంటున్న కాలంలో మహబూబ్‌నగర్ జిల్లాలో కమ్యూనిస్టుపార్టీ ఉద్భవించింది. మహబూబ్‌నగర్ జిల్లా షాద్‌నగర్‌లో (1936) జరిగిన 5వ ఆంధ్రమహాసభ జిల్లాలోని జాతీయవాదులకు రైతాంగానికి ఎంతో ఉత్తేజాన్నిచ్చింది. ఈ మహాసభప్రేరణతో ఆంధ్రమహాసభ కార్యక్రమాలు జిల్లాఅంతటా విస్తరించాయి. 1939-40 నాటికి కొల్లాపురం, కల్వకుర్తి, అచ్చంపేట, మహబూబ్‌నగర్, వనపర్తి, మఖ్తల్, నారాయణపేట, గద్వాల్ తాలుకాలు ఆంధ్రమహాసభ కార్యక్రమాలకు కేంద్రాలుగా రూపొందాయి. రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి వంటి కమూనిస్టు నాయకులపరిచయంతో జిల్లాలో ఆంధ్రమహాసభ కార్యకర్తలుగా ఉన్న యువకులనేకమంది అతివాదభావాల వైపు ఆకర్షితులయ్యారు. సురవరం వెంకట్రామరెడ్డి, గంగు ధర్మారెడ్డి, అయితవోలు తిరుమలరావు, సి.ఆర్. శర్మ, అనంత రామచంద్రారెడ్డి మొదలగు యువ ఆంధ్రమహాసభ కార్యకర్తలు 1940 నాటికి కమ్యూనిస్టుభావాలవైపు ఆకర్షితులయ్యారు. మహబూబ్‌నగర్‌జిల్లా ఆంధ్రమహాసభలో కమ్యూనిస్టుభావాలు కల్గిన ఈ యువకులంతా ప్రధాన పాత్రవహిస్తూ నిజాంవ్యతిరేక ఉద్యమం బలపడటానికి కృషిచేశారు.[7]

మహబూబ్‌నగర్ జిల్లాకు చెందిన కె. గోపాలరావు హైదరాబాదు రెడ్డి హాస్టల్‌లో విద్యార్థిగాఉంటూ నిజాంవ్యతిరేక రాజకీయ కార్యకలాపాలవైపు ఆకర్షితులయ్యారు. 1939 లో రాష్ట్రంమొత్తంగా విద్యార్థిలోకాన్ని కుదిపివేసిన 'వందే మాతరం' ఉద్యమంలో పాల్గొని ఆ తరువాత రావి నారాయణరెడ్డి పరిచయంతో కమ్యూనిస్టుభావాలవైపు ఆకర్షితులయ్యారు. హైద్రాబాదులో ఉంటూనే 1941 లో పార్టీ సభ్యత్వాన్నిపొంది ఆ తరువాత కాలంలో జిల్లా ఆంధ్రమహాసభ కార్యక్రమాల లోనూ కమూనిస్టుపార్టీ అభివృద్ధికి కృషిచేశారు. ఇదేకాలంలో మహబూబ్‌నగర్ జిల్లాకుచెందిన కందాళం లక్ష్మణాచారి హైదరాబాదు మున్సిపల్ ట్రేడ్‌యూనియన్ కార్యక్రమాలలో పాల్గొంటూ కమ్యూనిస్టుభావాలవైపు ఆకర్షితులయ్యారు. ఆ తరువాతకాలంలో పార్టీ సభ్యత్వాన్నిపొంది జిల్లాపార్టీనిర్మాణ బాధ్యతలు చేపట్టారు.

సోవియట్ యూనియన్‌పై నాజీ హిట్లర్ దాడి జరగడం, ఫాసిస్టు ప్రమాదం తీవ్రతరం అవడంతో కమ్యూనిస్టుపార్టీ 1942 లో ప్రజా యుద్ధ నినాదాన్ని ఇచ్చింది. "ఏ జంగ్ హై జంగ్‌కీ ఆజాద్" అనే మఖ్దుం ఉర్దూపాటను పాడుతూ

కొనసాగించారు. ఆంధ్ర మహాసభలో కొనసాగుతూనే ప్రతి తాలుకాలోనూ సభలు నిర్వహిస్తూ ఫాసిస్టు ప్రమాదాన్ని ప్రజలకు తెలియచేసేవారు. పేరు ఆంధ్ర మహాసభ కార్యక్రమాలలో చురుకుగా పాల్గొంటూ యువ కార్యకర్తల్ని వామపక్ష భావాలవైపు ఆకర్షించేదుకు కృషి చేసారు. దీనివల్ల జిల్లాలో మితవాద వృద్ధ నాయకత్వం వామపక్ష యువనాయకత్వాన్ని వ్యతిరేకించడం ప్రారంభించింది.

1943 నాటికి మాహబూబ్ నగర్ జిల్లాలో సురవరం వెంకట్రామరెడ్డి, సి. ఆర్. శర్మ, గంగు ధర్మారెడ్డి, అయితవోలు తిరుమలరావు, ఆనంత రామచంద్రారెడ్డి, కర్రెన్న, సాంబమూర్తి మొదలగు వారంతా ప్రముఖ ఆంధ్ర మహాసభ కార్యకర్తలుగా కమ్యూనిస్టు పార్టీ సభ్యులుగా జిల్లాలో ప్రజా ఉద్యమాన్ని నిర్మించసాగారు. వీరితో పాటుగా నారాయణస్వామి వంటి అతివాద యువ కార్యకర్తలు కూడా కమ్యూనిస్టు పార్టీకి సన్నిహితంగా ఉండే ప్రజా ఉద్యమకారులుగా ముందుకొచ్చారు.

## ఆధారాలు


1. గులాం హైదర్-యాంటి నైజామ్ స్ట్రగుల్ పార్టిసిపేషన్ ఆఫ్ ముస్లిమ్స్. ది గోర్లియస్ తెలంగాణా ఆర్మ్డ్ స్ట్రగుల్ - 142వ పేజీ.
2. గులాం హైదర్-యాంటీ నైజామ్ స్ట్రగుల్ పార్టిసిపేషన్ ఆఫ్ ముస్లిమ్స్. ది గ్లోరియస్ తెలంగాణా ఆర్మ్డ్ స్ట్రగుల్ - 143వ పేజీ.
3. హిస్టరీ ఆఫ్ ఇండియా కిసాన్ సభ - రసూల్
4. పెరవల్లి వెంకటరమణయ్యతో ఇంటర్వ్యూ
5. చిరావూరి లక్ష్మీనరసయ్యతో ఇంటర్వ్యూ
6. రామాకృష్ణశాస్త్రి సమాచార పత్రం
7. సురవరం వెంకట్రామారెడ్డి సమాచార పత్రం



కారేపల్లి రాజకీయ పాఠశాల: తెలంగాణా ప్రాంతంలోని కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తలు
నేల మీద కూర్చున్నవారు.

ఎడమ నుంచి కుడికి: నేదునూరి జగన్నాథరావు, రంగారావు, సింగిరెడ్డి భూపతిరెడ్డి, భీమిరెడ్డి నరసింహారెడ్డి, ఆ పక్కనున్న వారి పేరు గుర్తించలేకపోయాం

కుర్చీల్లో కూర్చున్నవారు.

ఎడమ నుంచి కుడికి దేవులపల్లి వెంకటేశ్వరరావు, బద్దం యల్లారెడ్డి, రావి నారాయణరెడ్డి, ఆరుట్ల లక్ష్మీ నరసింహారెడ్డి చెరవల్లి వెంకట రమణయ్య, సర్వదేవభట్ల రామనాథం.

నిల్చున్నవారు

ఎడమ నుంచి కుడికి: రాంకిషన్ శాస్త్రి డి. సుబ్బారావు, చిర్రావూరి లక్ష్మీ నరసయ్య, దుర్గా ప్రసాదరావు, రావెళ్ల జానకి రామయ్య, ప్రభాకరరావు (కరీంనగర్).

చివరి వరస

ఎడమ నుంచి కుడికి: వాసిరెడ్డి వెంకటపతి, 2వ వారి పేరు గుర్తించలేక పోయాం ఆరుట్ల రామచంద్రారెడ్డి, 4వ పేరు గుర్తించలేక పోయాం, పెండ్యాల సత్యనారాయణ, దాజీ శంకరరావు



హైదరాబాద్ సంస్థానములో కమ్యూనిస్టు ఉద్యమ వ్యాప్తిలో [illegible] 'మఖ్దూమ్'



1938 డిసెంబర్‌లో తూర్పుగోదావరి జిల్లా విద్యార్థి మహాసభ సందర్భంగా కాకినాడలో విద్యార్థుల ఊరేగింపు



యుద్ధోన్మాదులైన హిట్లర్, ముస్సోలినీల పట్ల సంతృప్తి [illegible] విధానాన్ని అవలంభిస్తున్న బ్రిటిష్ ప్రభుత్వాన్ని దుయ్యబడ్తున్న 'నవశక్తి' కార్టూన్

ఇది బ్రిటిష్ సింహమా? గ్రామ సింహమా?

హిట్లర్, ముస్సోలినిలు ఎలాచెబితే అలా నడిచే బ్రిటిష్ ప్రధాని చాంబర్లేను

# రాజకీయ సిద్ధాంత పాఠశాలలు

## కొత్త పట్టణం ఆర్థిక రాజకీయ వేసంగి పాఠశాల, వాలంటీరు శిక్షణా శిబిరం

గుంటూరు జిల్లా ఒంగోలుకు 10 మైళ్ళ దూరంలో సముద్ర తీరంలో కొత్త పట్టణం వుంది. ఒకప్పుడు అది ఓడ రేవు 1937 మే 1 నుండి జూన్ 10 వ తేదీవరకు 40 రోజులు ఈ పాఠశాలను నిర్వహించాలని పార్టీ భావించింది. కాని మద్రాసు రాష్ట్ర మధ్యంతర మంత్రివర్గం పాఠశాలను నిషేధించి, మే 21 న విద్యార్థులపై లాఠీఛార్జీ చేసి కొందరిని అరెస్టు చేసింది. అందుచే పాఠశాల, వాలంటీరు శిక్షణ శిబిరం మధ్యలోనే ఆగిపోవలసి వచ్చింది.

మద్రాసు రాష్ట్రంలో కాంగ్రెస్ మంత్రివర్గం ఏర్పడిన తరువాత కూడ ఈ పాఠశాలపై నిషేధాన్ని రద్దు చేయక పోవడాన్ని విమర్శించుతూ 6-4-1938 న "నవశక్తి" వార పత్రిక (మద్దూరి అన్నపూర్ణయ్యగారు అప్పుడు ఈ పత్రికకు సంపాదకులు. కాంగ్రెస్ సోషలిస్టు పార్టీచే కొవ్వూరు రాజమండ్రినుండి నిర్వహించ బడుతూ వచ్చిందీ పత్రిక) సంపాదకీయంలో ఇలా రాసింది :

"ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ, యువజన సంఘాల యాజమాన్యాన క్రిందటి సంవత్సరం కొత్త పట్టణంలో ఆర్థిక, రాజకీయ వేసంగి పాఠశాల, వాలంటీరు శిక్షణా శిబిరం నెలకొల్పబడింది. ఆంధ్ర దేశ వివిధ ప్రాంతాలనుండి 180 మంది యువకులు యువతులు స్కూలుకు ఆకర్షింపబడ్డారు. యువజనులలో ప్రపంచ పరిస్థితులను తెలిసికోటానికి,అతి క్లిష్టంగావున్న సమస్యలను అర్థం చేసికొని, సమాజంలో నేడు వున్న లోపాలను రద్దు చేయడానికి, మానవ సౌభాగ్యానికి దారి తీయు మార్గాలను తెలిసికోవడానికి, భారత స్వాతంత్ర్య పోరాటం జయం పొందటానికి, ఇతర దేశాల స్వాతంత్ర్య పోరాట అనుభవాలనుండి మనం నేర్చుకోవలసిన పాఠాలను స్వీకరించడానికి, ఆంధ్ర యువజనుల యందున్న ఆతురత, అభిలాషలే అంతమంది ఆకర్షింప బడుటకు కారణం."

ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు సమితి మాస పత్రిక "కమ్యూనిజం" 1975 డిసెంబర్ సంచికను భారత కమ్యూనిస్టుపార్టీ స్వర్ణోత్సవ (1925-75) సంచికగా ప్రకటించింది. అందులో పి. వి. శివయ్య తన స్మృతులలో కొత్త పట్టణం రాజకీయ పాఠశాలను గురించి ఇలా తెలియజేశారు.

"రాష్ట్ర పార్టీ ఆదేశానుసారం గుంటూరు జిల్లా కమిటీ, ఒంగోలు తాలూకా కొత్తపట్నంలో రాజకీయ పాఠశాలను నడిపే బాధ్యత తీసుకుంది. పాఠశాలకు............కాలేజీ హైస్కూలు విద్యార్థులూ, గ్రామాల నుంచి కార్యకర్తలూ, విద్యార్థులుగా వచ్చారు. అర్ధశాస్త్రం, తత్వశాస్త్రం, జాతీయోద్యమ చరిత్రా, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ చరిత్రలపైనేనే పాఠ్యక్రమం తయారు చేశాను. విద్యార్థులను, తెలుగు, ఇంగ్లీషు విభాగాలుగా చేసి మొదటి వారం రోజులు సిలబస్ ప్రకారం రెండు సెక్షన్లకూ పాఠాలు చెప్పేవాడిని. రాత్రి క్యాంపులు తనిఖీ, రోజు 18 గంటల పని. తర్వాత కామ్రేడ్ (చండ్ర) రాజేశ్వరరావు వచ్చి మిలిటరీ డ్రిల్లు, క్యాంపు డిసిప్లిను, సర్వీసు వలంటీరు ఆధిపత్యమూ తీసుకున్నాడు. ఒక వారం పది రోజుల తర్వాత కామ్రేడ్ కంభంపాటి సీనియర్ సత్యనారాయణ పాఠ్యబోధన భారం సగం పంచుకొన్నారు."

కంభంపాటి సత్యనారాయణ (సీనియర్) ఇదే సంచికలో తన తొలినాటి అనుభవాలను ముచ్చటిస్తూ కొత్తపట్నం రాజకీయ పాఠశాలను గురించి ఇలా రాశారు.

"కామ్రేడ్స్ చండ్ర రాజేశ్వరరావు పి. వి. శివయ్య, నేను, పోలేపెద్ది నరసింహమూర్తి, జొన్నలగడ్డ రామలింగయ్య, మునుపల్లె రామారావు ప్రభృతులు అధ్యాపకులుగా వచ్చాము."

రష్యా విప్లవ చరిత్ర, మార్కిస్టు మూల సూత్రాలు, రాజ్యాంగ యంత్రం విప్లవం, సామ్రాజ్యవాదం మొదలైనవి పాఠ్యాంశాలు. భారత కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ సభ్యుడు సజ్జాద్ జహీర్ రెండు రోజులు వరుసగా రష్యా విప్లవ చరిత్రను వివరించారు. అఖిల భారత రైతు సంఘ నాయకులలో ఒకరైన ఎన్. జి. రంగా పాఠశాలకు శుభాకాంక్షలు తెలియజేశారు.[2]

( బ్రాకెట్లలో పేర్లను, ఇంటి పేర్లను సంపాదకులు పాఠకుల సౌకర్యార్థం చేర్చారు.)

ఇందులాల్ యాజ్ఞిక్ మహాత్మాగాంధీపైన, సజ్జాద్ జహీర్ ఫ్రెంచి విప్లవం యొక్క చారిత్రక, ఆర్థిక అంశాల గురించి ఉపన్యసించారని, కనిగిరి వకీలు యన్. వేంకటేశ్వరరావు, బి.ఎ.,బి.యల్. తెలియజేశారు.

ప్రపంచ భౌగోళిక పరిస్థితులు, వివిధ దేశాల రాజకీయ చరిత్రలు, అచ్చటి విప్లవాలు, వాటి పరిణామాలు, మార్క్సిజంయొక్క వివిధ దశలు,ఇతర దేశాలపై వాటి ప్రభావాలు, రష్యాపై పెట్టుబడిదార్ల అసత్య ఆరోపణలలోని అంతర్యం, పెట్టుబడిదారీ విధానం నిజ స్వరూపాలు – మొదలైనవి కూడా బోధించబడ్డాయి. పాఠశాలపై ప్రభుత్వ నిషేధం మూలంగా అర్ధ శాస్త్రం బోధన అర్థాంతరంగా ముగించవలసి వచ్చింది.

కంభంపాటి సత్యనారాయణ (సీనియర్) ఆంధ్రేతర నాయకుల ఉపన్యాసాలను తర్జుమా చేసి చెప్పేవారు.

1937 మే 1 వ తేదీన కొత్తపట్టణం వేసవి పాఠశాలను కేరళ కమ్యూనిస్టు నాయకులు పి. కృష్ణ పిళ్లే ప్రారంభించారు. కృష్ణ పిళ్లే కేరళ కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాతలలో ఒకరు. కేరళ "ప్రథమ కమ్యూనిస్టుగా" ఆయన ప్రసిద్ధి చెందారు. ఈ పాఠశాలను జయప్రకాశ్ నారాయణగారు ప్రారంభించుతారని అన్నాప్రగడ కామేశ్వరరావుగారు ఒక ప్రకటనలో పేర్కొన్న ఉపన్యాసకులలో బాట్లీవాలా, డాంగే, సజ్జాద్ జహీర్, దత్ ముజుందార్, స్వామీ సహజానంద, దినకర మెహతా, ఇందులాల్ యాజ్ఞిక్, బి పి. బేడే, యన్.జి. రంగాగారున్నారు. వీరిలో యస్. బాట్లీవాలా, ఇందులాల్ యాజ్ఞిక్, సజ్జాద్ జహీర్, హజరా బేగము, బి. శ్రీనివాసరావు, స్వామీ సహజానంద సరస్వతి, జయప్రకాశ్ నారాయణ, అచ్యుత పట్వర్ధన్ మున్నగువారు ఉపన్యాసకులుగా వచ్చారు.

## పాఠశాల నిర్వహణ

'అన్నాప్రగడ కామేశ్వరరావుది ప్రధానంగా డబ్బు వనరులు సమకూర్చే బాధ్యత.' అని పి.వి. శివయ్యగారు 1975 డిసెంబర్ "కమ్యూనిజం" పత్రికలో రాశారు. 'గుంటూరు జిల్లా కాంగ్రెస్ కమిటీకి చెందిన ముఖ్య నాయకులు పాఠశాలకు అన్ని ఏర్పాట్లుచేశారు.' అని కంభంపాటి సత్యనారాయణ (సీనియర్) గారు రాశారు.

జొన్నలగడ్డ రామలింగయ్యగారు 'ఆనాడు' అనే పేరిట రాసిన స్మృతులలో........'కమ్యూనిస్టు పార్టీ తమ సిద్ధాంతాలను వ్యాపింపజేయుటకు మొట్ట మొదటి సారిగా ఏర్పాటుచేసిన రాజకీయ పాఠశాల ఇదే. దానికి ముఖ్యంగా తోడ్పడినవారు సాగి విజయ రామరాజుగారు. వీరు 1930 నుంచి కాంగ్రెసులో పని చేస్తూ అనేకమార్లు జైలుకి వెళ్ళారు సామాన్య రైతు, కమ్యూనిస్టు పార్టీలో సభ్యత్వం లేక పోయినా అభివృద్ధిగల ఉద్యమాలన్నింటిని ప్రోత్సహించుటలో ముందుకు వచ్చారు. అందుచే కొత్త పట్నం వేసంగి పాఠశాలకు అండదండగా నిలబడ్డారు.''3

(సంఘం 1-9-1961, పేజీ. 357)

ఇదే విషయాన్ని ధృవపరుస్తూ సుప్రసిద్ధ స్వాతంత్ర్య సమర యోధులు రామచంద్రుని వెంకటప్ప ఇలా రాశారు!

".... శ్రీ గౌస్‌బేగ్‌సాహెబ్‌గారు వాలంటీరు దళాధిపతులు. చంద్ర రాజేశ్వరరావుగారు వాలంటీర్లకు డ్రిల్లు నేర్పేవారు. అన్నాప్రగడ కామేశ్వరరావుగారు వాలంటీర్లకు గెరిల్లా సమర చాతుర్యము, తుపాకులు ప్రేల్చుట మున్నగు

వానిలో శిక్షణ గరిపేవారు. (సాగి) విజయరామరాజుగారు కర్రకత్తి సామును నేర్పేవారు. డా॥ అమంచర్ల చలపతిరావుగారు వారికి ప్రథమ చికిత్సలో శిక్షణ నిచ్చారు. ఈ శిబిరము నిర్వహించుటకు అన్నాప్రగడ కామేశ్వరరావు, నేతి చలపతిరావు, సాగి విజయరామరాజు, అల్లూరి సత్యనారాయణరాజు, మద్దూరి అన్నపూర్ణయ్యగార్లు కమిటీగా ఏర్పడ్డారు. ఈ శిబిరంలో భోజనాది సౌకర్యాలు సమకూర్చడానికి కొత్తపట్నంలో వర్తకులు, ఆ చుట్టుప్రక్కల గ్రామస్థులు వస్తు రూపంలోనూ, నగదుగాను విరివిగా సరఫరాలు చేశారు. వంగవోలులోని వకీళ్లు ఉప్పలపాటి సుబ్రహ్మణ్యంగారు, స్వర్గీయ నేతి సుబ్రహ్మణ్యంగారు మున్నగు వారున్నూ కొంత ధనసహాయం చేశారు."[4]

మంతెన వెంకటరాజు, సూర్యనారాయణరాజు లాంటి రాష్ట్ర కాంగ్రెసు నాయకులు విరాళాలిచ్చారు. ఇలాంటి తోడ్పాటు ఉండటం వల్లనే విద్యార్థులకు భోజనపు ఖర్చులతో సహా రు. 7 మాత్రమేనని, విద్యార్థి యువజన, స్త్రీ, కార్మిక, కర్షక మొదలగు సంఘాలన్నింటికి ప్రత్యేకసౌకర్యాలు కలుగచేస్తామని దొడ్డవరపు కామేశ్వరరావుగారు ఒంగోలు నుండి 26-3-1937 న "జమీన్ రైతు"పత్రికలో ప్రకటనచేశారు.

ఈ పాఠశాలకు పబ్లిసిటీ ఆఫీసరుగా వాసిరెడ్డి శివలింగప్రసాద్, భోజన శాల స్టోర్‌కీపర్‌గా వి. రామకోటయ్య పనిచేశారు.

అధ్యాపకులుగాను, విద్యార్థులుగాను కొత్త పట్టణం వేసవిపాఠశాలకు వచ్చిన ఆంధ్రులలో ఈ క్రిందివారు నున్నారు. (సమగ్ర సమాచారం లభ్యం కాలేదు.)

1. పుచ్చలపల్లి సుందరయ్య
2. చంద్ర రాజేశ్వరరావు
3. పి. వి. శివయ్య
4. కంభంపాటి సత్యనారాయణ (సీనియర్)
5. జొన్నలగడ్డ రామలింగయ్య
6. కొల్లా వెంకయ్య
7. మాకినేని బసవపున్నయ్య
8. అన్నాప్రగడ కామేశ్వరరావు
9. మునిపల్లె రామారావు
10. పిడతల రంగారెడ్డిగారు
11. చీమకుర్తి నేతు/మాధవరావు
12. మాడభూషి వెంకటాచారి
13. కృష్ణమూర్తి (అమరవాది)
14. మద్దూరు అన్నపూర్ణయ్య
15. చాకిరి కృష్ణస్వామి
16. అల్లూరి సత్యనారాయణరాజు
17. వాసిరెడ్డి నారాయణరావు
18. కోడినరసింహం
19. కలిదిండి బంగారు రాజు
20. దాట్ల సూర్యనారాయణరాజు
21. మైలవరపు రామారావు
22. బీరం రమనాథం
23. కోట అబ్బయ్య శెట్టి
24. రావి ఆదిశేషయ్య

25. పూసపాటి నరసింహరాజు
26. బి. నరసింహాచార్య
27. శ్రీగిరిరాజు సత్యనారాయణ
28. చేగిరెడ్డి బాలిరెడ్డి
29. పుచ్చలపల్లి గోవిందమ్మ
30. బసవారెడ్డి శంకరయ్య
31. దొడ్డవరపు కామేశ్వరరావు
32. శాయన్న
33. అన్నం వెంకటసుబ్బయ్య
34. అల్లూరి అన్నపూర్ణమ్మ
35. అన్నాప్రగడ సరళాదేవి
36. కోసూరి సత్యవతి
37. యలమంచిలి (చంద్ర) సావిత్రి
38. వాసిరెడ్డి హనుమాయమ్మ
39. ఉద్దరాజు మాణిక్యమ్మ
40. జొన్నలగడ్డ అన్నపూర్ణమ్మ
41. తుమ్మల వెంకటరామయ్య
42. ఏటుకూరి బలరామమూర్తి
43. కడియాల గోపాలరావు
44. పోలేపెద్ది నరసింహమూర్తి
45. బసవారెడ్డి శ్రీదేవమ్మ
46. నూకలపాటి శంకరయ్య
47. దామినేని అక్కయ్య
48. సంకు అప్పారావు
49. యాళ్లబండి రంగనాయకులు
50. పి. రమణారెడ్డి
51. పాలిచర్ల కోదండ రామిరెడ్డి
52. కోట పెంచెలు
53. ఉద్దరాజు సూరపరాజు
54. కోసూరి సుబ్బరాజు
55. తిమ్మావఝుల నరసింహం
56. ఎ. వి. సుబ్బారావు
57. తడికమళ్ల రంగనాయకులు
58. సి. పి. ఎలాంగో

విద్యార్థులందరికీ జిల్లాలవారీగా బసలు ఏర్పాటుచేశారు.

15 రోజులు పాఠశాల జరిగేసరికి ప్రభుత్వానికి కన్నుకుట్టింది. పోలీసు అధికారులు పాఠశాలవ్యవహారాలలో జోక్యం కలుగజేసుకోడానికి ప్రయత్నించారు. తమకుకూడా క్లాసులలో ప్రవేశం కావాలని కోరారు. పాఠశాల నిర్వాహకులు అందుకు నిరాకరించినారు. పోలీసులు ప్రభుత్వానికి అనేక రిపోర్టులు పంపారు.

ఈ సందర్భంగా వి. రామకోటయ్య (ప్రస్తుతం అద్దంకి వాస్తవ్యులు) అని రాశారు.

"పాఠశాల జరుగుతూ ఉండగా 1937 మే 15 వ తేదీన అనుకొంటా స్పెషల్ బ్రాంచ్ సబ్ ఇన్‌స్పెక్టరు రామరాజు వెంకటేశ్వరరావు జబర్దస్తీగా క్లాసులో ప్రవేశించబోగా పాఠశాల ఆర్గనైజర్ అన్నాప్రగడ కామేశ్వరరావు గారు అభ్యంతర పెట్టారు. "........స్కూలులో జరిగే క్లాసులకు హాజరు అయ్యేందుకు అనుమతి ఇవ్వవలసిందిగా పోలీసులు కోరిన కోర్కె గురించి (అన్నాప్రగడ) కామేశ్వరరావు నన్ను సంప్రతించారు. క్లాసులు ప్రైవేటుగా జరుగుతున్నవని, అనుమతిని అంగీకరించబోమని మేము వాదించాము.'' అని, ఆంధ్ర కాంగ్రెస్

సోషలిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి మద్దూరి అన్నపూర్ణయ్య, కొత్త పట్టణం లాఠీ చార్జీని విచారించేందుకు నియమించబడిన అనధికార విచారణ కమిటీ ముందు సాక్ష్యమిచ్చారు. అతను వెళ్ళి మరోరోజే స్కూలును అన్‌లాపుల్ అసెంబ్లీ క్రింద డిక్లేర్ చేస్తూ గజెట్ ఎక్స్‌ట్రార్డినరీ ప్రచురింపజేశాడు.

పాఠశాలను నిషేధించినది అప్పుడు ఉమ్మడి మద్రాసు రాష్ట్రాన్ని పాలిస్తూన్న మధ్యంతర మంత్రివర్గం. దానినే నడమంత్రపు మంత్రివర్గంగా అపహాస్యం చేస్తూ రాజకీయనాయకులు, పత్రికలు పేరు పెట్టారు. ఆనాడు ఈ ప్రభుత్వం ఎలా ఏర్పాటైందో చూద్దాము.

1937 ఫిబ్రవరి నెలాఖరుకు మద్రాసు రాష్ట్ర శాసన సభ ఎన్నికలు ముగిసాయి. 146 జనరల్ సీట్లలో కాంగ్రెస్ 137 గెల్చింది. ప్రత్యేక సీట్లు 69 లో కాంగ్రెస్ 22 గెల్చింది. అంటే 215 స్థానాలలో 159 కాంగ్రెస్ గెల్చింది. ఆ రోజుల్లో ప్రభుత్వ భక్తిపరాయణులైన జస్టిస్ పార్టీ మొదలైన వారిని, జమీందార్లను ఓడించటానికి కాంగ్రెసును అతివాద పార్టీలు బలపరచాయి. ఇందులో ఆంధ్రలో జనరల్ సీట్లు 56 కాగా కాంగ్రెస్ 55 కి పోటీ చేసి 53 గెల్చింది. 1937-3-10 న శాసనసభ కాంగ్రెస్ పక్ష నాయకునిగా చక్రవర్తి రాజగోపాలాచారి (రాజాజీని) ని ఎన్నుకొన్నారు.

కాంగ్రెస్ వారు మంత్రి పదవులను స్వీకరించాలా వద్దా అనే విషయమై ఆ రోజుల్లో వాదోపవాదాలు జరుగుచుండేవి. అఖిల భారత కాంగ్రెస్ కమిటీ ఢిల్లీలో 1937 మార్చి 3 వ వారంలో సమావేశమై ఇలా తీర్మానించింది.

"మంత్రి వర్గం వారి రాజ్యాంగ సమ్మతమైన వ్యవహారాల విషయంలో గవర్నర్ తన ప్రత్యేకాధికారాలను వినియోగించడనీ, మంత్రుల సలహాలను త్రోసిపుచ్చడనీ కాంగ్రెస్ పార్టీ నాయకునికి నమ్మకం కలిగి ఆ విధమైన ప్రకటన బహిరంగంగా చేయగల్గిన కాని, కాంగ్రెస్ వారు మంత్రి పదవులను స్వీకరించ రాదు."

రాజాజీ ఈ తీర్మానం దృష్టిలో ఉంచుకొని మార్చి 25, 26, 27 తేదీలలో గవర్నర్‌తో సంప్రదించారు. కానీ తాము కోరిన వాగ్దాన మివ్వలేదని రాజాజీ మంత్రివర్గాన్ని ఏర్పరచడానికి నిరాకరించారు.

ఆపై శ్రీనివాసశాస్త్రిని మంత్రివర్గం ఏర్పరచవలసిందిగా గవర్నర్ కోరారు. కానీ ఆయన అందుకు నిరాకరించారు. అపుడు గవర్నర్, సర్ కూర్మా వెంకటరెడ్డి నాయుడుగారిని మంత్రి వర్గం ఏర్పరచవలసినదిగా కోరారు. ఆయన అంగీకరించి పన్నీరు సెల్వం, ముత్తయ్య చెట్టి, పాట్ యం.సి. రాజా, ఖాళీపుల్లా సాహెబ్‌లతో మంత్రివర్గాన్ని ఏర్పాటు చేశారు. దీనినే 'ఇంటెరిమ్' (మధ్యంతర)

మంత్రివర్గం అని పిలిచారు. నడిమి కాలంలో తాత్కాలికంగా ఏర్పాటైన మంత్రి వర్గం కనుక, దానిని 'నడమంత్రం' మంత్రి వర్గంగా జాతీయవాదులు, పత్రికలు దానికి ముద్దు పేరు పెట్టి అపహాస్యం చేశారు.

1937 ఏప్రిల్ 1 న ఏర్పడ్డ కె. వి. రెడ్డి నాయుడు మంత్రివర్గం 1937 జూలై 14 వరకు వుంది.

ఈ నడమంత్రపు మంత్రివర్గం చేసిన ఘనకార్యాలలో ఒకటి కొత్త పట్నం స్కూలును నిషేధించడం, ఆ నిషేదాజ్ఞను ధిక్కరించిన విద్యార్థులను, అధ్యాపకులను నిర్వాహకులను పాశవికంగా లాఠీ చార్జీ చేయడం.

పదిహేను రోజులు వేసవి పాఠశాల సాగిన తర్వాత, ఈ పాఠశాల శాంతి భద్రతలకు భంగకరమని చెబుతూ మే 15 వ తేదీన దానిని "అక్రమ సంఘంగా" ప్రకటించి నిషేధించింది. రంగాగారికి నెహ్రూకు రాసిన జాబులో మే 20 న నిషేధించినట్లు పేర్కొన్నారు. కాని 1937 మే 18 న నిషేధం ఉత్తర్వు జారీ అయింది.[5]

''మద్రాసు నుండి ఈ వార్తను మోసుకొని ఒక మిత్రుడు సైకిల్ మీద వచ్చి శిబిరంలో వాలాడు. ఆత్మగౌరవాభిమానధనులు, స్వాతంత్ర సమరయోధులు, పౌరసత్వ ధర్మ విధులు అయిన విద్యార్థులు హాజరులోనున్న అధ్యాపకులు ఈ అక్రమపుటుత్తర్వును ఉల్లంఘించడానికి నిర్ణయించుకొన్నారు'' (రామచంద్రుని వెంకటప్ప వ్యాసం)

ఈ నిషేధాన్ని అమలుపరచడానికి, 1937 మే 21 న జిల్లా కలెక్టర్ వెల్లోడి కొత్తపట్టణం వచ్చారు. రెండు వ్యానుల నుండి రిజర్వు పోలీసులు కూడా వున్నారు. మరో రెండు బస్సులనిండా స్థానిక పోలీసులున్నారు. డి.యస్ పి., యస్.ఐ. ఆంగ్లో ఇండియన్ సార్జంటు ఉన్నారు. ఆంగ్లో ఇండియన్ సార్జెంటు పేరు 'రాలీ' అని, అక్బరుసాహెబు (యస్ ఐ) లేక (హెడ్‌కానిస్టేబుల్) సి.ఐ.డి. ఇన్‌సెక్టరు దామరాజు వేంకటేశ్వరరావు కూడా ఉన్నారు.

కొత్తపట్నణం స్కూలు పబ్లిసిటీ ఆఫీసరుగా ఉన్న వాసిరెడ్డి శివలింగ ప్రసాద్‌ను రాజద్రోహకర ఉపన్యాసం ఉచ్చాడంటూ అరెస్టు చేసి ఒంగోలు సబ్ జైలుకు తీసుకువెళ్లారు

## లాఠీచార్జీ :

నిషేధాజ్ఞలను ఉల్లంఘించడమా లేదా అని 20వ తేదీ రాత్రి చర్చలు జరిగాయి. 'నడమంత్రపు మంత్రివర్గ'పు ఈ అమానుషపు ఉత్తర్వును ధిక్కరించాలని విద్యార్థులు నిశ్చయించారు.

''నిషేధాజ్ఞలను ఉల్లఘించిన వారిని పొలీసులు తీవ్రంగా కొట్టారు. 80 మందిని అరెస్టు చేశారు. 17 మందిని శిక్షించారు.'' (మరుసటి సంవత్సరం 6-4-1938 నవశక్తిలో ఈ లాఠీచార్జీ గురించిన ప్రస్తావనలో)

కొత్తపట్టణంలోని కొత్త సత్రం శ్రీరాం వెంకటరంగాగారి సత్రం వద్ద నిషేధాజ్ఞను శిబిర నిర్వాహకులు, విద్యార్థులు ధిక్కరించారు. అల్లూరి సత్యనారాయణరాజు ఉపన్యసించుతున్నారు.

అల్లూరి సతనారాయణరాజును ఒంగోలు సబ్ ఇన్‌స్పెక్టరు అరుగుపై నుండి క్రిందికి లాగాడు. డి యస్.పి. అయన్ని సార్జెంటువైపు నెట్టాడు. ఆంగ్లో ఇండియన్ సార్జెంటు సత్యనారాయణగారిని రొమ్ముపైన, ఇతరచోట్ల తీవ్రంగా పిడికిలితో గుద్దులు గుద్దాడు గుండెపైన, ముఖంపైన పొడిచాడు. 100 గజాల దూరంలో వున్న లారీలోకి లాక్కువెళ్ళేటపుడు కూడా తిరిగి కొట్టాడు.

అన్నాప్రగడ కామేశ్వర రావును కూడా ఈ సార్జెంటే తలమీద, మెడ మీద, భుజాల మీద లాఠీతో కొట్టాడు. లారీ వద్దకు ఈడ్చుకొని పోయాడు. ఒంగోలు పోలీసు స్టేషనుకు తీసుకువెళుతూ దోవలోనూ, స్టేషనులోనూ కూడా పోలీసులు దెబ్బలు కొట్టారు. చొక్కా చిరిగింది. భోజనానికి తీసుకువచ్చేటపుడు ఇద్దరు పట్టుకొని నడిపించాల్సి వచ్చింది.

మునిపల్లె రామరావును ఆంగ్లో - ఇండియన్ సార్జంటు ముక్కు మీద గ్రుద్దగా నెత్తురు ధారాళంగా కారింది వెల్లకిలపడిపోయాడు లేవదీసి మాళ్లా పిడికిలితో గ్రుద్దాడు. చంద్ర రాజేశ్వరరావు గారిపై కూడా ఇతగాడే చేయి చేసుకొన్నాడు రాజేశ్వరరావుగారి పెదవి చిట్లి రక్తం కారిది.

కంభంపాటి సత్యనారాయణ (సీనియర్) గారిని మొదట సబ్ ఇన్‌స్పెక్టరు కణతపై చేతితో మోదాడు తర్వాత లాఠీతో కొట్టాడు. గాయపడిన వారిలో సంకు అప్పారావు, యాళ్లబండి రంగనాయకులు, మైలవరపు రామరావు మొదలగు వారున్నారు. సి. పి. ఎలాంగో మొదలైన వారిని ముక్కువెంట రక్తం కారేదాకా కొట్టారు.

"...ఒక కళ్లజోడు పెట్టుకొన్న ఆడమనిషి అరుగుమీద నుంచుని ఏదో ఉపన్యాసం చెపుతోంది. గలాటాలో ఆమె ఏమి చెపుతున్నది వినపడలేదు. పోలీసు సార్జంటు అరుగెక్కి ఆమె నోరు మూసినాడు. ఆమె అతని చెయ్యి విదిలించి వేసింది. గుడ్లెర్ర చేసి కోపంతో ఏదో చెప్పింది..... ..'' అని ప్రత్యక్షసాక్షి గుడివాడ శ్రీరాములు కాంగ్రెసు విచారణ కమిటీకి తెలియజేశాడు.

స్త్రీలపై కూడా నిర్దాక్షిణ్యంగా లాఠీ చార్జి చేశారు. అనేక మంది స్త్రీలు స్పృహతప్పి పడిపోయారు. పడిపోయిన వారిపై గూడా, లాఠీ ప్రయోగాలు మాన లేదు. అరగంట సేపు విచ్చలవిడిగా ఈ బీభత్స కాండ కొనసాగింది.

నిషేధాజ్ఞను ధిక్కరించిన వారెవ్వరూ దౌర్జన్య చర్యలేమీ చేయలేదు. సత్యాగ్రహమువలె ప్రవర్తించారు "ఇంపీరియలిజం డౌన్ డౌన్''అని ఇంగ్లీషులో కొందరు ''సామ్రాజ్యవాద తత్వం నశించుగాక" అని కొందరూ నినాదాలిచ్చారు.

పోలీసులు స్కూలు విద్యార్థులనే గాక,లారీచార్జీ చేస్తున్న ఘోర దృశ్యాన్ని చూస్తున్న ప్రజలను కూడా లాఠీలతో మోదుతూ వెనక్కి నెట్టారు. కొందర్ని లాఠీలతో డొక్కలలో పొడిచారు.

పోలీసుల ఈ ఘోరకృత్యాలకు ప్రజలు ఉద్రిక్తులయ్యారు కొత్త పట్టణం సమీప గ్రామాలైన పాదర్తి, మొటుకులపాలెంల నుండి జనం వచ్చారు. కాని శిబిర నిర్వాహకులు,సత్యాగ్రహులు "మీరేమీ కలుగచేసుకోవద్దని'' విజ్ఞప్తి చేయగా శాంతించారు.

పది పదిహేను మంది నాయకులను మాత్రం పోలీసులు వ్యానులో ఒంగోలు తాలూకా ఆఫీసుకు తీసుకువెళ్లారు. మిగతా వారిని స్త్రీలను, పిల్లలను మే నెల మండుటెండలో కొత్తపట్టణం నుండి ఒంగోలుకు నడిపించుకు తీసుకువెళ్లారు. వ్యానులో తీసుకువెళ్ళే సమయంలోకూడ కొందరిపై పోలీసులు చేయిచేసుకొన్నట్లు ప్రత్యక్ష సాక్షులు కాంగ్రెస్‌చే నియమింపబడిన అనధికార విచారణ కమిటీకి తెలియ జేశారు. ఈ కమిటీ తరఫున క్రొవ్విడ లింగారాజు, కాట్రగడ్డ వెంకట నారాయణ రావు, యం. యల్. ఎ. గార్లు స్టేటుమెంట్లు తీసుకొన్నారు.

## ఒంగోలులో కూడ దౌర్జన్య కాండ :

పెద్దబొట్ల రామచంద్రరావు బి. ఎ., బి. యల్. గారు 30-5-37న, ఈ క్రింది స్టేట్‌మెంటును కాంగ్రెసు విచారణ కమిటీకి ఇచ్చారు

"విచారణలో నున్న ఖైదీలకు భోజనం సమకూర్చేందుకు గాను నేను 21-5-37న మధ్యాహ్నం పన్నెండు గంటలకు ఒంగోలు పోలీసుస్టేషన్ వద్ద ఉన్నాను. 'ఖైదీలు తమకు తగిలిన గాయాల గురించి నాతో చెబుతున్నారు ఒంగోలు సబ్ ఇన్‌స్పెక్టరు అక్కడికి వచ్చి, ఎవరూ రెచ్చగొట్టక పోయినా, పచ్చి బూతులు తిట్టడం మొదలు పెట్టాడు.

మహిళా ఖైదీలను పైన ఎలాంటి అచ్ఛాదన లేకుండా లారీలో పన్నెండు, ఒంటిగంట మధ్య తీసుకు వచ్చారు. సాయంత్రం మూడు గంటలప్పుడు నేను సబ్ మేజిస్ట్రేటు కోర్టులో ఉన్నాను. ఆనాటి జిల్లా కాంగ్రెస్ అధ్యక్షులు గౌస్‌బేగ్, నేతి చలపతిరావు జిల్లా కాంగ్రెస్ కమిటీ మాజీ కార్యదర్శి మంతెన వెంకట రాజు కోర్టుముందు నిలబడి వున్నారు. ఒక రిజర్వు కానిస్టేబుల్ గౌస్‌బేగును, వెంకట రాజును మెడవద్ద చొక్కా పట్టుకొని లాగాడు. గౌస్‌బేగ్ గడ్డంపైన పిడికిలితో గుద్దాడు. వెంకట రాజును కూడా గుద్దాడు."

గౌస్‌బేగ్‌ను ఎందుకు అలా కొడుతున్నావని వెంకట్రాజుగారు అడగగానే, ఆయన్ని కూడా రొమ్ముమీద గుద్దాడు. వారు మేజిస్ట్రేటుకు ఈ విషయాన్ని చెప్పగా, వ్రాతపూర్వకమైన చార్జి దాఖలు చేసుకొమ్మని చెప్పాడు.

అరెస్టయిన వారికి ప్రభుత్వ అధికారులు భోజన సౌకర్యం కూడా కల్గించ లేదు. కొందరు విద్యార్థి నాయకులు, యువజనసంఘ కార్యకర్తలు ఇంటింటికి తిరిగి "మధూకరం" లాగా భోజనం సేకరించుకు వచ్చారు. మరి కొందరు కాంగ్రెసువారు కూడా భోజనాలు వండించుకు వచ్చారు. తాలుకా ఆఫీసు వరండా లోనే దాదాపు రెండూ మూడు గంటల మధ్య ఖైదీలకు భోజనం పెట్టారు. ఆ రాత్రి కూడా అదే విధంగా భోజనం సమకూర్చారు. సుమారు పది మందిని ఒంగోలులో వుంచి మిగతా వారిని జిల్లాలోని వివిధ సబ్ జైళ్లకు పోలీసు అధి కారులు పంపారు. మరునాడు మిగతావారికి పోలీసులే భోజన ఏర్పాట్లు చేశారు.

దెబ్బలుతగిలిన వారికి డాక్టర్ ఆ మంచర్ల చలపతిరావుగారు వైద్యసహా యానికి పూనుకున్నారు. లాఠీచార్జీ జరిగినరోజునే ఒంగోలుకుచేరిన మిగతా విద్యార్థులు, ఒంగోలులోనిపెద్దలు పెద్దప్రదర్శన జరిపారు. జొన్నలగడ్డ రామ లింగయ్య విద్యార్థులను సమీకరించారు. ఒంగోలుకొండమీద దేవాలయంవద్ద బహి రంగసభ జరిగింది. తమిళనాడు కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ నాయకుడు బి. శ్రీనివాస రావు పోలీసుదమన నీతిని ఖండిస్తూ గంభీర ఉపన్యాసమిచ్చాడు (ఈయనప్రముఖ కమ్యూనిస్టుగా, రైతుఉద్యమ నాయకుడుగా కీర్తిచెందారు.) రామలింగయ్య ఆ ఉపన్యాసాన్ని అనువదించారు పోలీసులు ఇక్కడికికూడావచ్చి ఈ సభనుకూడా నిషేధించడానికి ప్రయత్నించుతున్నదని తెలిసి, సభను త్వరలోనే ముగించారు.

అవసరమైనమేరకే 'బలప్రయోగం' చేసిందట ప్రభుత్వం. నిషేధానికి అది చెప్పిన కుంటిసాకులు చూడండి.

"కొత్త పట్టణం వేసంగి పాఠశాలలో దౌర్జన్యపద్ధతులను ఉపదేశించుచుండె ననియు, మిలిటరీ కవాతును బహిరంగంగా చేయించుచుండిరనియు, తుపాకి కాల్చుట, బాంబులుచేయుటను రహస్యంగా నేర్పుచుండిరనియు ప్రభుత్వమువారు 30 వ తేదీ మే (1937) గావించిన ప్రకటనయందు గలదు."[6]

ఆ రోజుల్లో బొంబాయిలో "భారతీయ పౌరసత్వపుహక్కుల యూనియన్" ఏర్పడింది. దానికార్యదర్శి 19-6-37 న ముఖ్యమంత్రి (ఆ రోజుల్లో రాష్ట్ర ముఖ్యమంత్రిని ప్రధానమంత్రి అనిపిలిచేవారు.) సర్ కూర్మా వెంకటరెడ్డి నాయుడు గారికి ఒక లేఖరాశారు.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీ ఏర్పరచిన ముగ్గురు సభ్యులకమిటీ (మద్దూరి అన్నపూర్ణయ్య, క్రొవ్విడి లింగరాజు, కాట్రగడ్డ వెంకటనారాయణరావు

ఎం.ఎల్.ఎ.) సమర్పించినరిపోర్టు తమకందినదనీ, లాఠీచార్జి జరగలేదని మద్రాసు ప్రభుత్వంచేసిన ప్రకటన అందుకుభిన్నంగా వుందనీ ఆ లేఖలోతెలియచేశారు.

"మద్రాసుప్రభుత్వం తమప్రకటనలో చెదరిపో నిరాకరించినవారిని అరెస్టు చేయుటకు ఆ చోటునుండి తొలగించుటకు అవసరమైనదానికన్న హెచ్చుగా ఏమి బలప్రయోగాన్ని పోలీసువారు చేయలేదు. ఎవరూతీవ్రంగా గాయపడలేదు." అని గట్టిగా చెప్పింది. కాని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీ రిపోర్టులో "21 వ తేదీ ప్రొద్దున కొత్త పట్టణంలో లాఠీచార్జి జరిగిందని, అరెస్టు చేయబడిన వ్యక్తులపైన, ప్రేక్షకులపైన లాఠీలను ఉపయోగించారని, వారిని గాయపరచారని, ఈ సందర్భంగా అరెస్టు చేయడానికి ఏ విధమైన బలప్రయోగం చేయవలసిన అవసరం ఏ మాత్రం లేదని సాక్ష్యాధారాలవల్ల మేము నిర్ధారణకు వచ్చాము " అని వుంది. కాబట్టి వాస్తవం విశదమై, విశ్వాసం పునరుద్ధరించడానికి గాను కొత్త పట్టణంలో జరిగిన విషాదకర సంఘటనలను గూర్చి నిష్పక్షపాతంగా, స్వతంత్రంగా విచారించి రిపోర్టు తయారుచేయడానికి ఏర్పాట్లు జరగాలని భారతీయ పౌరసత్వ హక్కుల యూనియన్ వారు కోరుతున్నారు" అని ఆ లేఖలో యూనియన్ తెలియ చేసింది.[7]

## పత్రికల ఖండన :

1937 జూన్ "ఆంధ్ర భూమి" (మాసపత్రిక సంపాదకుడు శ్రీ ఆంధ్ర శేషగిరిరావు)

"కొత్త పట్టణమున లాఠీచార్జి, ప్రభుత్వము వారి పచ్చి అబద్ధము" అనే శీర్షికతో ఇలా రాసింది.

"కొత్త పట్టణమున నెలకొల్పబడిన ఆర్థిక, రాజకీయ పాఠశాలను నిషేధించిన పోలీసువారు కావించిన లాఠీచార్జి చాలా అక్రమమైనది. అరెస్టు కోరి నిలిచియున్న వారిపై బలప్రయోగము గావించుట, పశుబల ప్రదర్శనముగాని అన్యము కాదు. తిరుగబడిన వారిని అరెస్టుచేసినామని ప్రభుత్వమువారు పలుకుట పచ్చి అబద్ధమనక తీరదు. నడమంత్రపు మంత్రులకు ప్రజాహిత కాంక్షయేగాక సత్య ప్రియత్వము కూడా లేదని ఇందు మూలముగ స్పష్టమైంది. ప్రజకు బాధ్యులు కాని ఈ మంత్రులు ప్రజలపై బాధ్యత ఎరుగక ఇట్టి చర్య జరుపుట వింత కాదు.

28-5-37 న 'జమీన్ రైతు' (నెల్లూరు) ఉప సంపాదకీయంలో ఇలా రాసింది.

"కొత్త పట్టణం రాజకీయ, ఆర్థిక పాఠశాల క్రిమినల్ లా సవరణ చట్టం క్రింద అక్రమ సంస్థగా ప్రభుత్వము వారిచే నిషేధింపబడినదనియు విద్యార్థులందరు 24 గంటలలో వెడలిపోవలయునని పోలీసువారు ప్రకటించిన వెంటనే 138 మంది

వెళ్ళిపోయిరి. మిగతా 60 మంది శాంతముతో ప్రభుత్వ ఉత్తర్వును ఉల్లంఘించ నుండిరి. పోలీసువారు వచ్చినపుడు వారెలాటి దౌర్జన్యము చేసినటుల తెలుపబడ లేదు. ప్రకాశం, కాళేశ్వరరావు, లింగరాజు మొదలగు ప్రముఖులు గావించిన ప్రకటనలలో పోలీసువారు లాఠీచార్జి గావించి బలమైన దెబ్బలు కొట్టిరని తెలియు చున్నది. ప్రభుత్వము గావించిన ప్రకటనలో లాఠీచార్జి చేయబడలేదని, తిరగబడిన వారిని అరెస్టుచేసి తీసికొనిపోవుటకు అవసరమైన బలము మాత్రమే పోలీసువారు ఉపయోగించిరని సమర్థించుకొనబడెను.

ప్రభుత్వము వారి దృష్టిలోనూ, పోలీసు వారి కోడ్‌లోనూ అరెస్టు చేసిన వారిని తీసికొనిపోవుటకు "అవసరమైన బలము మాత్రమే" లాఠీఛార్జియని అర్థము కాబోలు.

"ధనాశచే గాని, అధికార వ్యామోహము చేత గాని ప్రజాభీష్టమునకు విరుద్ధంగా మంత్రి పదవులను అంగీకరించిన వారిపై క్రూరమైన కార్యమందు బాధ్యత లేకున్నచో వెంటనే రాజీనామా యొసంగుట వారి కనీస ధర్మము. కాంగ్రెసు వారు మొండిపట్టుచే మంత్రి పదవులను నిరాకరించి, తమ ధర్మమును తప్పినారను వారికి యీ లాఠీచార్జియే జవాబు చెప్పగలదు."

## నాయకుల ఖండన :

మే 22 వ తేదీకి అనేక మంది కాంగ్రెసు నాయకులు ఒంగోలు వచ్చారు. వేముల కూర్మయ్య, అయ్యదేవర కాళేశ్వరరావు, బులుసు సాంబమూర్తి, కల్లూరి చంద్రమౌళి, జనాబ్ షేక్ గౌస్ బేగ్, వనమంద్ర వెంకటప్పయ్య మొదలైన వారున్నారు.

ప్రకాశంగారి అధ్యక్షతన రాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గ సమావేశం జరిగింది. నిషేధాన్ని, అరెస్టులను, లాఠీఛార్జిని ఖండించింది. కాంగ్రెసు ఆఫీసులో యువజన కార్యకర్తల సమావేశం జరిగింది. లాఠీఛార్జి వివరాలను వారు సేకరించారు.

కాంగ్రెసు ఆఫీసు వద్ద మే 22 వ తేదీన పెద్ద బహిరంగ సభ జరిగింది. అంతకు ముందు సాయంత్రం మూడు గంటల నుండి పెద్ద 'ఊరేగింపు' జరిగింది. వందలాది యువకులు, కాంగ్రెసు నాయకులు పాల్గొన్నారు. కాంగ్రెసు పతాకాలు, ఎర్ర జండాలతో ఊరేగింపు సాగింది. ఊరేగింపు, సభ గురించి ఉదయం నుంచే ఇంటింటా ప్రచారం జరిగింది. సాయంత్రం 5 గంటలకు జరిగిన సభలో వక్తలు పోలీసు నిరంకుశ, పైశాచిక చర్యను ఖండించారు. ప్రకాశం, కాళేశ్వరరావు, మాగంటి బాపినీడు, గొట్టిపాటి బ్రహ్మయ్య గారలు నిషేధాన్ని, లాఠీ ఛార్జీని నిరసిస్తూ మాట్లాడారు. ఆనాటి సభకుకూడా పోలీసులు పెద్ద సంఖ్యలో వచ్చారు. కాని ఎవ్వరూ నోరు మెదపలేదు. కొండా వెంకటప్పయ్యగారు, ప్రకాశం పంతులు

గారూ పాఠశాల నిషేధాన్ని, దమన కాండనూ ఖండించారు. కేసులెత్తి వేయాలని ప్రకటించారు.

## తర్జన భర్జనలు :

రంగాగారు నెహ్రూకు రాసిన లేఖనుబట్టి కాంగ్రెస్ అధిష్ఠాన వర్గంలో, నిషేధాజ్ఞలను ఉల్లంఘించిన ఘటనపై తర్జన భర్జనలు జరిగినట్లు తెలుస్తూంది శాసన ఉల్లంఘనానికి ఎవరు పర్మిషన్ ఇచ్చారనీ, నిషేధాజ్ఞలను ఉల్లంఘించడానికి· కాంగ్రెస్ వారు ఎందుకు సలహా యివ్వలేదని అడిగినట్లు తెలుస్తూంది.

1937 జూన్ 15 న నిడుబ్రోలు నుండి పండిట్ నెహ్రూకు ప్రొఫెసర్ యన్. జి. రంగా రాసిన లేఖాంశాలు ఇలా వున్నాయి.

"ప్రియమైన పండిట్‌జీ,"

....కొత్త పట్టణం పాఠశాల మే 20 న నిషేధింపబడింది. నేనా రోజున అక్కడ ఉన్నాను. బ్రిటిషు సామ్రాజ్యవాదం విధించిన అన్యాయమైన ఉత్తర్వును ఎదుర్కొనేందుకు నిశ్చయించిన విద్యార్థుల సాహసాన్ని నేను మెచ్చుకొన్నాను.

"ఈ స్కూలు ఆంధ్ర యువజన సంఘం, కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలచే సంఘటితమై నిర్వహించబడింది. ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటీతో దానికి ప్రత్యక్ష సంబంధం లేదు. ప్రత్యేకంగా విధించిన నిషేధ ఉత్తర్వును ఉల్లంఘించాలనే విద్యార్థుల నిర్ణయానికి, ఏలాంటి సంబంధమూ లేదు. అందుచే ఈ విషయంలో స్థానిక కాంగ్రెస్ నాయకుల సలహా పొందవలసినదిగా విద్యార్థులకు సలహా యివ్వవలసిన అవసరం వుందని నేను భావించలేదు ..."

(యన్. జి. రంగా గారి "ఎగోనీ అండ్ సోలేస్" అనే గ్రంథంలోని లేఖాంశాలకు తెలుగు సేత.)

## నెహ్రూ ఖండన :

ఈ లేఖకు జవాబిస్తూ పండిట్ జవహర్‌లాల్‌నెహ్రూ కొత్తపట్టణం లాఠీ చార్జీని ఖండించారు. రంగాగారికి అలహాబాద్ నుండి 28-6-1937 న రాసిన జాబులో "..........నేనిదివరకే కొత్త పట్టణం స్కూలు సంఘటన గురించి రాశాను. దానిపై పబ్లిక్ ప్రకటన కూడ చేశాను ఇది అత్యంత నీచకృత్యం. (స్కేండాల్ ఆఫ్ ది ఫస్ట్ మ్యాగ్నిట్యూడ్) అన్నిటికన్నా ప్రభుత్వం యొక్క నిజస్వభావాన్ని ఇదే ఎక్కువ బయట పెట్టింది.

భవదీయుడు

జె. నెహ్రూ.

## జనశక్తి స్మృతులు :

1964 లో కమ్యూనిస్టు పార్టీ నుండి విడిపోయి కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ ఇండియా (మార్క్సిస్టు) ఏర్పరచిన తర్వాత అప్పటి వారి అధికార పత్రికగా ఉండిన ''జనశక్తి'' పత్రికలో 29-12-65న రాసిన ఒక వ్యాసంలో కొత్త పట్టణం స్కూలు ప్రస్తావన ఉంది. (ఈ వ్యాసం అచ్చయిన కొన్నాళ్ల తర్వాత ''జనశక్తి'' సి.పి.ఐ.యం. నుండి చీలిపోయిన తరిమెల నాగిరెడ్డి గ్రూపు చేతుల్లోకి మారిపోయింది ) పైన ఉదహరించిన వ్యాసంలో రచయిత పేరులేదు. కాని సంపాదకుని నోట్‌లో ఇలా అన్నారు.

''ఆంధ్రలోని కమ్యూనిస్టు పార్టీ సమగ్ర చరిత్రను వ్రాయడం అవసరం ఇందుకు పార్టీ చరిత్రలో ప్రధాన పాత్ర నిర్వహించిన ముఖ్యులు కొంత మంది పూనుకొనడం అవసరం. ఈ లోపున పార్టీ చరిత్రకు సంబంధించిన కొన్ని స్మృతులను పాఠకులకు అందజేస్తున్నాం-సం.''

కొత్తపట్టణం పాఠశాల గురించి ఆ వ్యాసంలోని అంశాలివి.

''ఈ కాలంలో గుంటూరు జిల్లా కొత్తపట్టణంలో పార్టీ నడిపిన వేసంగి పాఠశాల చరిత్రాత్మక పాత్రను నిర్వహించింది. ఈ పాఠశాలలో తర్ఫీదు ఇచ్చిన వారు రాష్ట్ర కమ్యూనిస్టు ఉద్యమంలో ప్రధానపాత్ర వహించారు. దినదిన ప్రవర్ధమానమవుతున్న ఈ కమ్యూనిస్టు ఉద్యమాన్ని దెబ్బకొట్టుటకే రెడ్డినాయుడు మధ్యంతర ప్రభుత్వం పాఠశాలను నిషేధించి విద్యార్థులపై తీవ్రమైన లాఠీచార్జి గావించి అనేకమందిని అరెస్టు గావించి కేసులు పెట్టింది. కాని ఈ లాయలిస్టులు తలచిన దానికి భిన్నంగా ఈ లాఠీచార్జి రాష్ట్రంలో ప్రభుత్వ వ్యతిరేకత వెల్లువడానికి దారితీసింది. రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులుగా ఉన్న ప్రకాశం పంతులు గారు సబ్ జైలులోని కమ్యూనిస్టులను కలుసుకొని కళ్లనీళ్లు పెట్టుకొన్నారంటే ఆ నాటికి కమ్యూనిస్టు పార్టీ సంపాదించుకొన్న స్థానాన్ని అర్థం చేసుకోవచ్చును.''

## 'కమ్యూనిస్టు' పత్రిక ఖండన :

అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థ శాఖ భారత కమ్యూనిస్టు పార్టీ కేంద్ర పత్రికగా "కమ్యూనిస్టు'' ఆ రోజుల్లో రహస్యంగా వెలువడేది. దీనిని సెక్లోస్టైల్ చేసి రహస్యంగా పంచేవారు. 1937 మే సంచికలో "కొత్త పట్టణం మార్గం. చూపుతోంది." అనే శీర్షికలో వివిధ రాష్ట్రాలలోని మధ్యంతర మంత్రి వర్గాలు సాగించిన నిర్బంధకాండను అది పేర్కొంది. వివిధ రాష్ట్రములలో రైతు, కార్మిక, విద్యార్థి ఉద్యమాలపైన సాగించిన హింసాకాండను వర్ణించింది. ''కమ్యూనిజం''ను అణచివేసేందుకై భారతదేశంలోకి "వరల్డ్ పాలిటిక్స్" 'లేబర్ మంత్లీ" "సెంట్రల్ న్యూస్ సర్వీస్'' లను లండన్ నుండి ఈ దేశంలోకి

రాకుండా నిషేధించడాన్ని పేర్కొంది. బెంగాల్‌లో లైబ్రరీలను కూడా ఎలా ధ్వంసం చేస్తున్నారో తెలియచేసింది. సోదాలు, కరపత్రాలు, పోస్టర్లు ఉన్నందుకు అరెస్టులు, పత్రికల ధరావతులను స్వాధీనపరచుకోడం, ప్రాతికేయులపై కేసులు దైనందిన వ్యవహారంగా మారిపోయింది. ప్రజాస్వామ్య హక్కులకై ఐక్య ప్రజా సంఘటన సాగించాలని ఉద్బోధించింది. అందుకు "కొత్తపట్టణం మార్గం చూపిం దని తెలియచేస్తూ ఇలా రాసింది.

"కొత్తపట్టణం ఆర్థిక, రాజకీయ పాఠశాలను ప్రజా శాంతి భద్రతలకు అపాయకరమంటూ ప్రభుత్వం నిషేధించింది. ఈ పాఠశాలను నడపడానికి కాంగ్రెసు వాదులు, సోషలిస్టులు, కమ్యూనిస్టులు సహకరించారు. 15 గురు మహి ళలతో సహా 180 మంది విద్యార్థులు హాజరై ఉపన్యాసాలు విన్నారు. ఈ అమా నుష ఉత్తరువును విని వారు దిగ్భ్రాంతి చెంది, క్రోధావేశపరులయ్యారు. నిషే ధాజ్ఞను ప్రతిఘటించ నిశ్చయించారు. బ్రిటిష సామ్రాజ్యపు "మధ్యంతర" ఏజంట్లు స్కూలు విద్యార్థులను చెదరగొట్టడానికి లాఠీలను ఉపయోగించారు. తలలు పగిలాయి. గాయాలు తగిలినవారిలో కాంగ్రెసువారు, కమ్యూనిస్టులుకూడా ఉన్నారు.

"అమలులో నున్న (పౌర) హక్కులను భగ్నం చేసే ప్రతి చర్యను నిరోధించాలనే విషయాన్ని ప్రజాతంత్ర హక్కులను సంపాదించడానికి ఐక్య సంఘటన పోరాటాన్ని సాగించవలసిన అవసరాన్ని కొత్త పట్టణంలో లాఠీ దెబ్బలు తిన్న ధీర యువకులు ప్రజల దృష్టికి తెచ్చారు. భారత దేశమంతటా నిరసన సభలు జరపాలని ఈ సంఘటన కోరుతోంది. కేవలం అసమ్మతి సభలు చాలవు. సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా రానున్న పోరాటంలో సమరశీల కార్య కర్తలకు రాజకీయ తర్ఫీదును ఇచ్చేందుకై భారతదేశంలోని ప్రతి ముఖ్య కేంద్రం లోనూ, కొత్తపట్టణంలాంటి స్కూళ్లు కావాలి. అలాంటి పాఠశాలలను, సెలవు రోజుల్లో నడిపే పాఠశాలలను ఏర్పాటుచేసి నిర్వహించుటలో కాంగ్రెసు వాదులు, సోషలిస్టులు, కమ్యూనిస్టులతో సహకరించాలి. కొత్త పట్టణంలో జరిగిన దుర్మార్గ చర్యకు జవాబు అదే."

## జైలు శిక్షలు

కొత్తపట్టణంలో లాఠీచార్జి జరగకముందురాత్రే వాసిరెడ్డి శివలింగప్రసాద్‌ను రాజద్రోహ నేరంక్రింద అరెస్టుచేసి, ఒంగోలులో పోలీసులాకప్‌లో వుంచారు. మరునాడు లాఠీచార్జికిగురియై సబ్‌జైలులోవుంచిన వారితో సంబంధంలేకుండా ఈయన్ని విడిగావుంచారు. తర్వాత మిగతావారిని తెనాలి, రేపల్లె సబ్‌జైళ్లకు మార్చారు. శివలింగప్రసాద్, అన్నాప్రగడ కామేశ్వరరావులపై ఒంగోలు సబ్

కలెక్టరువద్ద, మిగతావారిపై తెనాలికోర్టులోను విచారణ ప్రారంభమైంది. శివలింగ ప్రసాద్‌ను జామీనుపైవిడుదల చేశారు. ఒంగోలులో ఈయనకు ఒక సంవత్సరం శిక్షవిధించబడింది. వీరిపినతండ్రి తిరిగిజామీను తెప్పించారు. గుంటూరు సెషన్స్ కోర్టులో విచారణ వచ్చేసరికి కాంగ్రెసు మంత్రివర్గంఏర్పడి ఈయన్ని, ఇతరకొత్త పట్టణం ఖైదీలను విడుదలచేసింది.

కొత్తపట్నం లారీచార్జి అనంతరం అరెస్టుఅయినవారిని 8-6-37 న 56 మందిని వదిలివేసి, 16 మందిపై కేసుపెట్టారు.

| | | | |
|---|---|---|---|
| 1. | కంభంపాటి సత్యనారాయణ | 2. | అల్లూరి సత్యనారాయణ |
| 3. | మునిపల్లె రామారావు | 4. | మైలవరపు రామారావు |
| 5. | పి. ఎల్లాంగో (తమిళనాడు) | 6. | ఉద్దరాజు సూరపరాజు |
| 7. | రావి ఆదిశేషయ్య | 8. | చాకిరి కృష్ణస్వామి |
| 9. | బీరం రామనాథం | 10. | కోసూరి సుబ్బరాజు |
| 11. | పూసపాటి నరసింహరాజు | 12. | కలిదిండి బంగారురాజు |
| 13. | శ్రీ గిరిరాజు సత్యనారాయణ | 14. | కోట అబ్బయ్యశ్రేష్ఠి |
| 15. | తిమ్మావఝుల నరసింహం | 16. | వాసిరెడ్డి నారాయణరావు |

వీరిలో కంభంపాటి సత్యనారాయణ, అల్లూరి సత్యనారాయణ గార్లకు ఆరు నెలల కఠినశిక్ష, 200 రూపాయల చొప్పున జరిమానా విధించారు. మిగతావారికి 6 నెలలశిక్ష రు 100 జరిమానా విధించారు. తర్వాత జిల్లాకోర్టులో వారిశిక్ష తగ్గించబడింది. రెండు నెలలశిక్ష తగ్గించారు.

కొత్త పట్టణం కేసులో విడుదలైనవారు, కాంగ్రెస్‌వారు, సోషలిస్టులు, కమ్యూనిస్టులు, శిక్షింపబడినవారిని విడుదలచేయాలని ఊరేగింపులు, సభలు జరిపారు. కొత్త పట్టణం డిఫెన్సు కమిటీ ఏర్పరచి నిధి వసూలుచేశారు. ఈ నిధికి రు. 772-56 వసూలైంది. ఇందులో 672-26 డిఫెన్సుకు ఖర్చైంది. మిగతాది అప్పట్లో అరెస్టు అయిన బాట్లీవాలా డిఫెన్సు నిధికి ఇవ్వడానికి 16-10-37 న కొత్త పట్టణం డిఫెన్సు కమిటీ సమావేశం నిర్ణయించింది. ఈ కమిటీకి కార్యదర్శి మద్దూరి అన్నపూర్ణయ్య. కోశాధిపతి కాట్రగడ్డ వెంకట నారాయణరావు (ఎం.ఎల్.ఎ.)

ఈ నిధి వసూళ్ళలో యువజన సంఘాలు ప్రముఖ పాత్ర వహించాయి. కృష్ణా జిల్లాకు చెందిన చలసాని జగన్నాథరావు (అమరవీరుడు-భట్ల పెనుమర్రు) ఎక్కువ మొత్తాన్ని వసూలు చేశాడు. శ్రీయుతులు మాడభూషి వేదాంత నరసింహాచారి, యస్. వి. యల్. నరసింహం, వింజమూరి అనంతాచారి, పెద్ది బొట్ల రామచంద్రారావు డిఫెన్సుకై పనిచేశారు. ముఖ్య న్యాయవాదిగా మాడభూషి

వేదాంత నరసింహాచారిగారు పనిచేశారు. గుంటూరు జిల్లా కాంగ్రెస్, తెనాలి కాంగ్రెస్ కమిటీ, యువజన సంఘం, సోషలిస్టు పార్టీలు సహాయపడ్డారు.

గతంలో తన ప్రత్యేకాధికారాలను వినియోగించబోమని గవర్నర్ హామీ యివ్వాలని కాంగ్రెస్ వారు పట్టుపట్టారు. అలా ఇవ్వనిదే మంత్రివర్గం ఏర్పరచ బోమని కాంగ్రెస్ వారన్నారు. 1937 జూన్ 22 న పై ప్రాయి ఈ విషయమై నామ మాత్రపు హామీ యిచ్చారు. కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ 1937 జూలై 5-8 తేదీల మధ్య సమావేశమై మంత్రి వర్గాల ఏర్పాటుకు సమ్మతించింది. మద్రాసులో 1937 జూలై 14 న కాంగ్రెస్ మంత్రి వర్గం ఏర్పడింది. కాంగ్రెస్ మంత్రి వర్గం ఏర్పడిన తర్వాత కొత్త పట్టణం ఖైదీలను విడుదల చేసింది.

కొత్త పట్టణం ఖైదీలను విడుదల చేస్తూ కాంగ్రెస్ మంత్రి వర్గం ఒక హెచ్చరిక చేసింది. 28-7-37 న హిందూ పత్రిక రిపోర్టు ననుసరించి "ఏ ఆశయం కోసమైనా సంఘటిత లేక అసంఘటిత హింసను ఉపయోగించే అభిప్రాయాలను, వర్గ ద్వేషాన్ని పురిగొల్పి వ్యాప్తి నొందించడాన్ని, అరికట్టడానికి అవసరమైన అన్ని చర్యలను ప్రభుత్వం తీసుకొంటుందని, అది అలాంటి చర్యలను సహించబోదని" తెలియచేసింది.

ఈ ధోరణినే కట్టమంచి రామలింగారెడ్డిగారు బలపరచారు. 9-9-37 మద్రాసు శాసన మండలిలో ఆయన ఇలా ఉపన్యసించారు

"కొత్త పట్టణం వేసవి పాఠశాల ఖైదీలను, పశ్చిమ తీరమండలి మరి కొందరు రాజకీయ ఖైదీలను విడుదల చేయడానికి ఉత్తర్వులు జారీ చేసినపుడు ప్రభుత్వం వారు ఒక విషయాన్ని స్పష్టం చేయాలి. హింసామార్గాన్ని తమ లక్ష్యసాధనంగా గల ఏ సంస్థనూ సహించబోమని, తమ ఉదార వైఖరిని శాంతి భద్రతలు భంగపరచుటకు అనుమతిగా భావించరాదని ప్రభుత్వం స్పష్టం చేయుట సమంజసం."

ప్రభుత్వ ప్రకటనపై రామచంద్రుని వెంకటప్పగారు ఇలా వ్యాఖ్యానించారు. "ప్రభుత్వ ఉత్తర్వులోని ఈ భాగం ఖైదీలకు గాని, సానుభూతి పరులకుగాని నచ్చలేదు. గతంలో నడమంత్రపు మంత్రి వర్గం చేసిన లాఠీ చార్జి దెబ్బకన్నా, (ఇది) వారికి చాలా బాధ కలిగించింది." "విడుదలైన వాలంటీర్లు, వారి అభిమానులు లాఠీచార్జి చురుకుకన్నా ఈ అవమానపు హెచ్చరిక మరింత బాధాకరమని భావించారు. శిక్షా శిబిరం నడపడమా దుడుకు పని? సాము గరిడీలు నేర్పడమా? నిషేధపుటుత్తర్వును ఉల్లంఘించడమా ?"

ఇవేవీ దుడుకుపనులు కావని వెంకటప్పగారు సోదాహరణంగా నిరూపించారు. వారి వ్యాసంలోని అంశాలివి :

"సరిగా ఇదే రోజుల్లో మద్రాసు జిల్లా సంఘం వారు ఒక వేసవి పాఠశాలను ఏర్పాటు చేశారు. రాజాజీయే దానికి ప్రారంభోత్సవం చేశారు. గాంధీజీ జైలులో ఉండగా గయా కాంగ్రెసులో (1922 డిసెంబర్) రాజకీయాలలో మినహా ఆత్మ రక్షణకై దండ ప్రయోగం చేయవచ్చునని రాజాజీ ప్రవేశపెట్టిన తీర్మానం ఆమోదించబడింది. రాజాజీ మంత్రివర్గం రోజుల్లోనే బషీర్ అహమ్మద్ గారు నేషనల్ మిలిషియాను ఏర్పాటు చేయవలసిందిగా తీర్మానం తెచ్చారు. 'మిలీషియ' అంటే కేంద్ర అంశం అవుతుంది కాబట్టి వాలంటీరు దళమని మార్చవలసిందిగా రాజాజీయే సలహా ఇచ్చారు. జపాను ప్రమాదం రోజుల్లో ప్రజలు సురక్షితులై ఆత్మరక్షణ దేశ రక్షణ చేయాలని ప్రచురించారు. నేషనల్ వాలంటీరు దళాన్ని ఏర్పాటు చేయాలని శాసన సభ ఏకగ్రీవంగా సిఫార్సు చేసిందని రాజాజీ అంగీకరిస్తూ "పోలీసులు ఈర్ష్య పడతారని వెనుదీశాను గాని లేకపోతే ముందుకు దేశీయుల్ని నేనే తయారు చేసి యుండేవాడిని" అని కూడా బహిరంగ సభలో చెప్పుకొన్నారు.

"అందుచేత సాము గరిడీలు నేర్పుట, నేర్చుట దుందుడుకు పని ఎలా అవుతుంది ? ''ప్రభుత్వపు ఉత్తర్వును ఉల్లంఘించడమా'' అంటే మహాత్ముడు 17 సంవత్సరముల నుండి నేర్పిన విద్య అదే కదా ? అది ప్రజాప్రతినిధులను కాదని లేని పెత్తనం నెత్తిన వేసికొని ఊరేగే నడమంత్రపు మంత్రివర్గపు ఉత్తర్వును తుక్కు తూటాకు కన్న విలువ చేయని దానిని ఉల్లంఘించుట 'దుడుకు పనా'? బహుశా కొత్తగా పరిపాలనా బాధ్యత స్వీకరించిన శ్రీ రాజాజీ గారు తమ నీడ తాము చూచుకొని చకితులైనారేమో" అని వెంకటప్ప గారు విమర్శించారు.[8]

## నిషేధం కొనసాగింపు

కొత్తపట్టణం ఖైదీలను విడుదలచేసినా స్కూలుపై రాజాజీ మంత్రివర్గం నిషా తొలగించలేదు. మరుసటి సంవత్సరం తిరిగి కొత్తపట్టణంలోనే స్కూలు పెట్టాలని మొదట నిర్వాహకులు అనుకొన్నారు. కాని నిషేధం అడ్డువచ్చింది. అందుచే మంతెనవారి పాలెంలో పెట్టవలసివచ్చింది.

కొత్తపట్టణం స్కూలుపై నిషేధాన్ని గురించి కలకత్తాలో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ కమిటీలో చర్చకువచ్చింది. నిషేధం 1937 వేసవి కాలానికే వర్తించుతుంది కాబట్టి వేరే రద్దుచేయవలసిన పనిలేదంటూ మద్రాసు రాష్ట్ర ప్రధాన మంత్రి (ముఖ్యమంత్రి) కార్యదర్శి అయ్యదేవర కాళేశ్వరరావు గారు సమర్ధించుకో చూశారు. 6-4-38 నవశక్తి సంపాదకీయంలో ఈ నిషేధాన్ని రద్దు చేసేందుకు ఆందోళన జరపాలని రాసింది. "కాంగ్రెస్ అధ్యక్షులు సుభాష్‌చంద్ర బోస్‌గారు అధ్యక్ష ఉపన్యాసంలో వేసంగి రాజకీయ పాఠశాలల ఆవశ్యకతను

గురించి చెప్పారు. పలువురు చేరి విషయాలను చర్చించి విజ్ఞానం పొందుట సామాన్య పౌరసత్వపుహక్కు. కొత్తపట్నం నిషేధం అట్టి హక్కునరికట్టుతుంది. నిషేధాన్ని తొలగించుట కాంగ్రెస్ మంత్రుల విధి. పౌరసత్వ హక్కులకై పోరాడుట స్వాతంత్రం కాంక్షించేవారందరివిధి. ఏలయనగా సామాన్య హక్కులకొరకు జరుగు పోరాటమే స్వాతంత్ర్య పోరాటమును ముందుకు తీసుకుపోతూంది." అని ఆ సంపాదకీయంలో రాసింది.

## కొత్తపట్టణం ఘటనలపై జవహార్‌లాల్ నెహ్రూ

"కొత్తపట్టణం వేసవి రాజకీయ ఆర్థిక పాఠశాలను నిషేధించడం, 1937 మే 1 న ఆంధ్ర కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ ఆంధ్ర యువజన సంఘాలచే ప్రారంభించబడిన ఈ స్కూలును, కమ్యూనిస్టు, మరియు విప్లవ భావాలను వ్యాపింప చేయడానికి యత్నించిందనే ఆరోపణతో 1937 మే 19 న ప్రభుత్వం నిషేధించింది. కలకత్తాలో కమ్యూనిస్టులపై విచారణ లాంటి సిగ్గుమాలిన ఘటనలు ప్రజా మంత్రివర్గాలని చెప్పుకొనే వాటి ఆధ్వర్యాన్నే జరగడం ఎలా సంభవమో నాకు ఆశ్చర్యంగావుంది. సంస్కార విహీనమైన ఈ సంఘటనలను నేను సహించలేకున్నాను. మధ్యంతర మంత్రులు ఎంత పవిత్రవాక్యాలు జపిస్తున్నా, ఈ ఘటనలు నూతన రాజ్యాంగ సంస్కరణల నిజస్వరూపాన్ని తెలియచేస్తున్నాయి."[9]

కమ్యూనిస్టులు సిద్ధాంతాన్ని ప్రచారం చేయడానికి కుట్ర పన్నారనే నేరారోపణతో బసంత్‌కుమార జోష్ మరో 11 మంది కోర్టులో విచారింప బడ్డారు. (జవహర్‌లాల్ నెహ్రూ సెలెక్టడ్ వర్క్స్ (ఇంగ్లీషు) ఎనిమిదవ సంపుటి, 100వ పేజీనుండి పై ప్రకటన, అధో సూచికలను అనువదించి ఉటంకించబడ్డాయి. ఆంగ్ల గ్రంథంలో అధో సూచిక 3 గాను వున్నది. - తుమ్మల.)

## కొత్త పట్టణం వేసవి పాఠశాల నిషేధం పైన :

1937 జూన్ 17న అలహాబాద్‌లో పత్రికలకు జవహర్‌లాల్ నెహ్రూ ఇచ్చిన ప్రకటన.

"నేను మలయాలో ఉండగా, కొత్త పట్టణం వేసవి రాజకీయ పాఠశాలను మద్రాసు ప్రభుత్వం నిషేధించడం, ఆ తర్వాత విద్యార్థులపై లాఠీచార్జి చేయడం గురించి పత్రికలో క్లుప్త వార్తను చదివాను. శాసనోల్లంఘన ఉద్యమ సమయంలో సైతం అలాంటిచర్య ఆశ్చర్యకరమూ, నిందింప తగినదీఅయి వుండేది. ప్రస్తుత సమయంలో ఇది నాకు విభ్రాంతిని కలుగచేసింది. నేను (స్వదేశానికి) తిరిగి వచ్చాక, ఈ విషయాన్ని గురించి మరింత విచారించాను అయినా ఆశ్చర్యం, విభ్రాంతి ఏ మాత్రం తగ్గలేదు. పిడుగు పడినపుడు మెరుపు కాంతిలాగా, నూతన

రాజ్యాంగ నిజస్వరూపాన్ని ఈ సంఘటన వెలుగులోకి తెచ్చింది. ఈ చర్యలు తీసుకోడానికి వాస్తవంగా బాధ్యత మద్రాసు మంత్రి వర్గానిదే గనుక, ఈ మంత్రి వర్గం ఎలా పనిచేస్తుందో కూడా వెలుగులోకి తెచ్చింది. ఈ మంత్రివర్గం పూర్వవు ప్రభుత్వం లాగానే వాక్ సభా స్వాతంత్ర్య ప్రాథమిక హక్కులను అణచివేసే పోలీసు మంత్రివర్గమని మనం చూస్తున్నాం. ప్రజలకు ఈ నూతన చట్టం ఎలా అన్వయిస్తుందో దానిఅర్థం మనం చూస్తున్నాం. ఇదివరకటి సహింపరాని పరిస్థితియే కొనసాగుతూ వుంది. వాళ్ల మనకు విసిరిన మెత్తని మాటలు, పౌర హక్కును దారుణంగా అణచడాన్ని మన యువకుల శరీరాలపై లాఠీని ప్రయోగించడాన్ని ఆపలేవు. పూర్వం లాగానే ఇపుడు కూడా కొత్త మంత్రుల చేతుల్లో, లాఠీ ప్రభుత్వం యొక్క నిజమైన చిహ్నంగా ఉంటున్నది.

మరికొన్ని ఇతర ముఖ్య సమస్యలు కూడా తలెత్తుతున్నాయి. వేసవి పాఠశాలలోకి బలవంతంగా చొరబడాలని పోలీసు రిపోర్టర్లు ప్రయత్నించారు. మన బహిరంగ సభలలో పోలీసు రిపోర్టర్లకు సౌకర్యాలు ఇస్తున్నాం. కాని దీని అర్థం. భారతదేశంలో అనేక ప్రాంతాల్లో జరిగిన కమిటి మీటింగులకు, రాజకీయ, ఆర్థిక సమస్యలను బోధించే వేసవి పాఠశాలలకు అనుమతించే హక్కు పోలీసు రిపోర్టర్లకు ఇచ్చామని కాదు ఈ సవ్యమైన ఆనవాయితీ ఇకముందుకూడా కొనసాగుతుందని నేను నమ్ముతున్నాను. ఎందు చేతనంటే అధ్యయనం, చర్చల ద్వారానే మనం మన సమస్యలను అర్థం చేసుకోగలం. పరిష్కార మార్గాన్ని కనుగొనగలం.

అభ్యంతర కరమని తాము భావించిన ఉత్తర్వును శిరసా వహించడానికి ఒక వ్యక్తికి లేదా మురాకు గల హక్కుకు సంబంధించిన మరో సమస్య ఇక్కడ తలెత్తుతోంది శాసనోల్లంఘనం విరమించబడింది. కాబట్టి, ఉత్తర్వులను ఉల్లంఘించడం వాంఛనీయం కాదు.

అలాంటి అభ్యంతర కరమైన ఉత్తర్వులను ఇచ్చినప్పుడు, వెంటనే పై ఉన్నత కమిటీల సలహా కోసం ఈ విషయం నివేదించాలి కాని కొన్ని సమయాలలో తక్షణం నిర్ణయాలు చేయవలసిన సందర్భాలు వస్తాయి.

"తన స్వంత బాధ్యత పైన అట్టి ఉత్తర్వులను ఉల్లంఘించడం మంచిదని ఒక వ్యక్తి భావించినపుడు అలాంటి నిర్ణయాల భారాన్ని ఆ వ్యక్తిగాని, ఆ కాంగ్రెస్ కమిటీ గాని మోయాలి. దానికి శాసనోల్లంఘనానికి ఎట్టి సంబంధం లేదు. ఇది ఒక వ్యక్తికి స్వతహాగా ఉన్న హక్కు. మన దృష్టిలో ఉన్న బృహత్ ప్రయోజనానికి నష్టం కలిగించకుండా ఈ హక్కును, ఏమైనా, జాగ్రత్తగా ఉపయోగించుకోవాలి. సంస్థ తీర్పుకు తాను లోను గావలసి వస్తుందనే చిక్కు (రిస్క్) కు ఆ వ్యక్తి సిద్ధపడాలి."[10]

# కొత్త పట్టణం విద్యార్థుల క్రమ శిక్షణ గురించి రంగాగారి ప్రశంస

1939 జనవరి 28, 29 వ తేదీలలో బెజవాడలో జరిగిన రాష్ట్ర విద్యార్థి మహాసభకు ఆచార్యరంగా అధ్యక్షత వహించారు ఆయన అధ్యక్ష ఉపన్యాసంలో కొత్త పట్టణంలో విద్యార్థుల క్రమ శిక్షణ గురించి ప్రశంసించిన భాగాన్ని 1-2-1939 'నవశక్తి' (15 వ పేజీ) నుండి ఉటంకించుతున్నాం.

......"తరువాత రంగా గారు నిజమైన డిసిప్లిన్ ఎలా వుండాలో వివరించారు. కొత్త పట్టణంలో నిర్వహించబడిన ఆర్థిక, రాజకీయ పాఠశాలలో విద్యార్థులకు, ఉపాధ్యాయులకూ మధ్య తనకు కనపడిన డిసిప్లినే నిజమైన డిసిప్లిన్ అన్నారు కొత్త పట్టణమునకు తాను ఉపన్యాసకుడుగా వెళ్ళినపుడు అక్కడి విద్యార్థులు సల్పిన విమర్శనలు, చర్యలు ఎంత తీవ్ర స్వభావము కలిగి యున్నప్పటికీ, అక్కడ వారు చూపిన డిసిప్లిన్ తనకు ఆశ్చర్యం కలిగించింది అన్నారు. ఆ పాఠశాలను రెడ్డి మంత్రి వర్గం నిషేధించి నప్పుడు విద్యార్థులు, ఉపాధ్యాయులు నిషేధాజ్ఞను ధిక్కరించి లారీలకు, అరెస్టులకు గురికావడం వర్ణించి నప్పుడు హాలు అంతా చప్పట్లతో మారుమ్రోగింది.

అదే విధముగా మంతెనవారి పాలెం ఆర్థిక, రాజకీయ పాఠశాలకు ఎట్టి డిసిప్లినరీ రూల్సు, సెనేటు రెగ్యులేషన్లు, డి యి.ఓ. ల సర్క్యులర్లు, లేకపోయినా విద్యార్థులలోను, ఉపాధ్యాయులలోను కనపడిన అన్యోన్య సహకారము ప్రశంస నీయము అన్నారు"

# మంతెనవారి పాలెం వేసవి ఆర్థిక రాజకీయ పాఠశాల – 1938

1938 లో వేసవి ఆర్థిక రాజకీయ పాఠశాలను కొత్త పట్టణంలో తిరిగి నిర్వహించాలని మొదట ఆంధ్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీవారు భావించారు. కాని 1937 లో 'నడమంత్రపు' మంత్రివర్గం విధించిన నిషేధాన్ని కాంగ్రెసు మంత్రివర్గం కూడ రద్దు చేయకపోవడంతో ఆ ప్రయత్నాన్ని మానివేశారు. తర్వాత రాయలసీమలోని కర్నూల్ జిల్లా బుగ్గలో వేసవి పాఠశాలను నడపాలని అనుకొన్నారు. కాని బుగ్గలో ఎండలు తీవ్రంగా ఉండటంవల్ల, ఉత్తర దేశంనుండి వచ్చే అధ్యాపకులకు అసౌకర్యంగా ఉంటు-దని ఆ ప్రయత్నాన్ని విరమించారు. స్వల్ప కాలంలో ఈ పాఠశాలను నిర్వహించడానికి ఇతర జిల్లాలలో అవకాశం లేనందున, గుంటూరు జిల్లాలో సముద్రానికి దగ్గరగా వున్న మంతెనవారి పాలెంలో నిర్వహించాలని నిశ్చయించారు.

6-4-38 నవశక్తి పత్రిక ఉప సంపాదకీయంలో ఈ పాఠశాల రాష్ట్ర కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ, యువజన సంఘం, విద్యార్థి ఫెడరేషన్‌ల యాజమాన్యాన జరుపబడుతుందని తెలియచేసింది.

"క్రిందటి సంవత్సరంవలెనే యువతీ యువకులు ఉత్సాహంగా స్కూలుకు విద్యార్థులుగా వచ్చి వివిధ దేశాలు తమ స్వాతంత్ర్యాన్ని ఎలా సంపాదించాయో, ప్రస్తుతం సమాజంలో ప్రజల సుఖానికి అడ్డు వచ్చుచున్న ఉత్పత్తి, వినిమయ సాధనాలు వ్యక్తుల స్వాధీనం ఎందుకు కావాలో, తెలిసికొనవచ్చును. భారత స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనగోరు ప్రతి యువతీ యువకులకును చక్కని అవకాశం అనుభవజ్ఞుల ఉపన్యాసాలు వినడానికి లభిస్తుంది." అని ఈ సంపాద కీయంలో వివరించింది. "యువజనులు ఈ పాఠశాలను వినియోగించుకొని తాము విజ్ఞాన లాభంపొంది, పాఠశాల ఉద్దేశ్యం నెరవేరునటుల తోడ్పడగోరుచున్నాము" అని విజ్ఞప్తి చేసింది.

ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ కార్యదర్శిగా పుచ్చలపల్లి సుంద రయ్యగారు ఒక ప్రకటన చేస్తూ, గత సంవత్సరం కొత్తపట్టణం వేసవి పాఠశాలకు ఆర్గనైజరుగా ఉన్న అన్నాప్రగడ కామేశ్వరరావుగారినే పాఠశాలకు ఆర్గనైజరుగా పార్టీ నియమించిందని తెలియజేశారు. "వారికి పార్టీ సభ్యులు, సానుభూతిపరులు, ప్రజా సామాన్యము పూర్తిగా సాయం చేసెదరని ప్రార్థించుచున్నాను." అని ఈ ప్రకటనలో తెలియచేశారు.

కొత్తపట్టణం పాఠశాల పబ్లిసిటీ ఆఫీసరైన వాసిరెడ్డి శివలింగప్రసాద్ ఈ పాఠశాలకు కూడ పబ్లిసిటీ ఆఫీసర్‌గా వున్నారు. విద్యార్థులను 250 మందికన్న ఎక్కువ చేర్చుకోబడరని, పాఠశాలకు రాదలచినవారు ఆయా జిల్లాల యువజన కాంగ్రెసు సోషలిస్టు పార్టీ, కార్మిక, రైతు, విద్యార్థి, స్త్రీ, కాంగ్రెస్ సంఘముల లోని ఏదైనా ఒక సంఘ ధృవపత్రాన్ని పొంది, డబ్బుతో సహా దరఖాస్తు పంపా లని స్పష్టం చేశారు. మరీ అవసరమనుకొన్న విద్యార్థులకే ధృవపత్రాలను యివ్వ వలసిందిగా జిల్లా సోషలిస్టు పార్టీలను ఈ ప్రకటనలో సుందరయ్యగారు హెచ్చ రించారు.

కర్నూల్ జిల్లా బుగ్గలో వేసవి పాఠశాలను పెట్టనందుకు రాయలసీమ విద్యా ర్థులకు క్షమాపణ చెబుతూ ఆర్గనైజరు ఒక ప్రకటన చేశారు. రాయలసీమ నుండి వచ్చే 50 మంది విద్యార్థులకు రుసుము రు. 10 గాక, రు. 5 లకు తగ్గించబడిం దని కూడా ఆయన ప్రకటించారు. ఈ క్రింది వారిని ఉపన్యాసకులుగా ఆహ్వా నించినట్లు తెలియచేశారు.

డాక్టర్ అధికారి, డాంగే, డాక్టరు అష్రాఫ్, డాక్టర్ జడ్.ఎ. అహమ్మద్, పి సి. జోషి, అజయకుమార్ ఘోష్, సజ్జాద్ జహీర్, ప్రొఫెసరు యన్.జి. రంగా, డాక్టరు పట్టాభి సీతారామయ్య.

## గుంటూరు జిల్లా కాంగ్రెసు తోడ్పాటు :

మంతెనవారిపాలెం ఆర్థిక, రాజకీయ పాఠశాలకు, అన్ని విధాలా సహాయం చేయడానికి గుంటూరు జిల్లా కాంగ్రెస్ నిశ్చయించింది. ఈ పాఠశాల గురించి విచారించి వర్కింగ్‌కమిటీకి నివేదిక పంపడానికి ఈ క్రింది వారితో ఉప సంఘాన్ని నియమించింది.

1. రాపర్ల శివరామకృష్ణయ్య (ప్రధాన కార్యదర్శి గుంటూరు జిల్లా కాంగ్రెస్ సంఘం) 2. గౌస్‌బేగ్ సాహెబ్ 3. ధారా గోపాలశాస్త్రి 4. కల్లూరి చంద్రమౌళి 5. కాసు బ్రహ్మానందరెడ్డి 6. పాతూరు సుబ్బయ్యచౌదరి 7. మంతెన వెంకటరాజు.

పాఠశాల నిర్వహణకు తాత్కాలికంగా రు. 200 విరాళాన్ని కూడా జిల్లా కాంగ్రెస్ కమిటీ ప్రకటించింది.

మంతెనవారి పాలెం వేసవి పాఠశాలకు వచ్చి కనీసం 10 రోజులుండే అధ్యాపకుల పేర్లు 13-4-38 నవశక్తిలో ప్రచురింప బడ్డాయి. వారు

| | | | |
|---|---|---|---|
| 1. | డాంగే | 2. | జయప్రకాశ్ నారాయణ |
| 3. | బాట్లీవాలా | 4. | హజురాబేగం |
| 5. | స్వామి సహజానంద | 6. | డా॥ అష్రాఫ్ |
| 7. | సజ్జాద్ జహీర్ | 8. | డా॥ అహమ్మద్ |
| 9. | మెహరలీ | 10. | శాంతాగాంధీ |
| 11. | పి సి. జోషి | 12. | మిరాజ్‌కర్ |
| 13. | దేశపాండే | 14. | డా॥ అధికారి |
| 15. | దుత్తు మజుందార్ | 16. | బి. డి. యల్. బేడీ |
| 17. | నెర్గిస్ బాట్లీవాలా | 18. | అజయకుమార్ ఘోష్ |
| 19. | అశోక్ మెహతా | 20. | బుఖారీ |
| 21. | రణదివే | 22. | అచ్యుత పట్వర్ధన్ |
| 23. | కమలాదేవి | | |

గుంటూరు జిల్లా కాంగ్రెస్ సంఘం వారి సహకారానికి కృతజ్ఞతలు తెలియ జేస్తూ ఆర్గనైజర్, పాఠశాలలో చేర్చుకొనే విద్యార్థులకు సంబంధించిన కొన్ని నిబంధనలు ప్రకటించారు. అంతేగాక పాఠశాల ప్రారంభ ఉత్సవానికి పండిత జవహర్‌లాల్‌ను కోరినట్లు తెలియజేశారు.

నిబంధనావళిలో ముఖ్యాంశాలు 1. 250 మంది కంటే విద్యార్థులను చేర్చుకోరు.

2. కాంగ్రెస్, కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ, యువజన సంఘం, విద్యార్థి ఫెడరేషన్, మహిళా సంఘం, కార్మిక, కర్షక సంఘాలు-వీటిలో ఏదేని ఒక సంఘ అధ్యక్షో కార్యదర్శులలో ఒకరు సిఫారసు చేసిన వారినే విద్యార్థులుగా చేర్చుకొంటారు.

3. రెండుపూటలా భోజనం, రెండుపూటలా టిఫిన్ విద్యార్థులకు పెడతారు. సర్కార్ జిల్లా విద్యార్థులు పాఠశాల నిర్వహించబడే నెల రోజులకు రు. 10, రాయలసీమ విద్యార్థులు రు 5 చెల్లించాలి.

4. విద్యార్థులు, విద్యార్థినులు విలువైన వస్తువులు వెంట తీసుకొని రాకూడదు

5. విద్యార్థులు తెలుగుగాని, ఇంగ్లీషు గానిచదివి అర్థం చేసుకోగలిగి యుండాలి.

## రాయలసీమ విద్యార్థుల విజ్ఞప్తి

రాయలసీమ విద్యార్థులైన యం. గౌస్‌బేగ్, బి వేంకటేశ్వర్లు, జి. వెంకప్పనాయుడు, యన్. సుబ్బారాయుడు, యం. అబ్దుల్‌గని ఒక విజ్ఞప్తిచేస్తూ రాయలసీమ విద్యార్థులకు ఇచ్చిన ఫీజుసౌకర్యాన్ని వినియోగించుకొని పాఠశాలకు రావలసిందిగా విజ్ఞప్తిచేశారు "చాలా అనుభవజ్ఞులును, విదేశములకేగి బాగాచదువు కొన్న వారును అయిన నాయకులు, అధ్యాపకులుగా వస్తారు. ఈ తరుణాన్ని చక్కగా వినియోగించుకోవాలని మన సోదర విద్యార్థుల నందరిని ప్రార్థిస్తున్నాము" అని ఆ విజ్ఞప్తిలో అన్నారు.

## జిల్లాకాంగ్రెస్ అధ్యక్షుని విజ్ఞప్తి

గుంటూరుజిల్లా కాంగ్రెస్ అధ్యక్షులైన గౌస్‌బేగ్, మార్చి 31 న జిల్లా కాంగ్రెస్ కార్యనిర్వాహకవర్గం పాఠశాల ఆర్గనైజరుకు అన్నివిధాలా సహాయపడ వలసిందిగా చేసినతీర్మానాన్ని ప్రస్తావించి, జిల్లాలోపాఠశాల నిర్వహణకై చేసే నిధి వసూళ్లను జయప్రదంచేయాలని విజ్ఞప్తిచేశారు.

## యువజన సంఘం విజ్ఞప్తి

గుంటూరుజిల్లా యువజనసంఘ ఆర్గనైజరు అమరవాది కృష్ణమూర్తి యువజనులకు ఇలా విజ్ఞప్తిచేశారు. "ఈ పాఠశాల (విద్యార్థులకు) మంచిఅవ కాశము. ఈ పాఠశాలలో విషయాలన్నీ చక్కగా శాస్త్రీయదృక్పథంతో బోధింప బడతాయి. అన్నిశాస్త్రాలను బాగాచదివిన విజ్ఞానసంపన్నులైనవారు దేశంలోఅన్ని ప్రాంతాలనుంచి ఉపన్యాసకులువస్తారు. కనుక యువకులందరును త్వరపడమని నాహెచ్చరిక" పాఠశాల నిర్వహణకు రు. 3000 కావాలని, ధన, వస్తురూపంలో

చందాలు వసూలుచేయవచ్చునని చెప్పారు. వసూలుచేసినమొత్తం విలువను వారాని కోసారి జిల్లా ఆఫీసుకు లెక్కపంపాలని తెలియజేశారు. జిల్లాలోని స్థానికసోషలిస్టు పార్టీశాఖల, కాంగ్రెస్‌నాయకుల సహకారంతో ఈ నిధివసూళ్ళ కార్యక్రమం నిర్వర్తించాలని అన్నారు. ఇలాంటి కార్యక్రమంద్వారానే యువజన సంఘాలు ప్రజా సంఘాలలో పలుకుబడి గలవిగా గుర్తింప బడతాయని వీరుతమ విజ్ఞప్తిలో తెలియజేశారు.

రేపల్లె తాలుకా, కాంగ్రెసు సోషలిస్టు పార్టీ కార్యదర్శి కె. రామశాస్త్రిగారు కూడా ఒక విజ్ఞప్తి చేస్తూ, తమ తాలుకాలో జరుగుచున్న ఈ పాఠశాలను వినియో గించుకోవాలని యువజనులకు విజ్ఞప్తిచేశారు.

## ఏర్పాట్లు :

"వేసవి పాఠశాల విద్యార్థుల వసతి కోసం గ్రామస్థులు తాము నివసించే ఇళ్లను ఖాళీచేసి ఇచ్చారు. నీటి వసతి కోసం పంపులను దించారు. పట్టణంలో గిట్టుబాటు అయ్యే ధరలకే ఇక్కడ కూడా అమ్మేందుకు చిన్న దుకాణాన్ని ఏర్పాటు చేశారు. రీడింగ్ రూమ్ ఏర్పరచి అన్ని పత్రికలను తెప్పించుతున్నారు. స్త్రీలకు ప్రత్యేక ఏర్పాట్లు గావిస్తున్నారు. 60 మంది మహిళలు, విద్యార్థులు వస్తున్నట్లు అంచనావేశారు. వారికి ప్రత్యేకించి రెండు ఇళ్ళు ఏర్పాటు చేశారు. స్థానిక యువజన సంఘం వారి సహకారంతో ఏర్పాట్లు పూర్తి అవుతున్నాయి." అని ఆర్గనైజరు 30-4-38 'నవశక్తి'లో ఒక ప్రకటన చేశారు.

వేసవి రాజకీయ పాఠశాలలో తెలుగులో ఉత్తమ తరగతి విద్యార్థులకు, ఇంగ్లీషు తెలిసిన విద్యార్థులకు ఈ క్రింది సిలబస్ ప్రకారం పాఠాలను నిర్వహించు తారని తెలియచేయబడింది.

## రాజనీతిశాస్త్రం :

1. రాజనైతిక వ్యవస్థలు - వాటి రూపాలు - సిద్ధాంతాలు
2. పూర్వపు రాజకీయవ్యవస్థా రూపాలు
   ఎ) ప్లేటో రిపబ్లిక్
   బి) గ్రీక్ పట్టణ ప్రభుత్వం
   సి) ప్రభుత్వ పరిణామంలో రోమన్ ప్రసక్తి
3. మధ్యయుగం - మత వ్యవస్థ (చర్చి ప్రభుత్వం)
4. రిఫర్మేషన్-రాజుల దైవాంశము (డివైన్ రైట్ ఆఫ్ కింగ్స్) రిస్టోరేషన్ రాజకీయాలు 1688 ఆంగ్లేయ విప్లవం
5. 1789 ఫ్రెంచి విప్లవం-పార్లమెంటరీ ప్రజాతంత్ర - జాకోబానిజమ్ - బెన్ థామిజం

## మార్క్సిస్టు రాజనీతి :

6. ఉపయుక్తి వాదం (యుటిలిటేరియనిజమ్) - హెగిలియన్ వాదం - ప్రభుత్వానికి మార్క్సు యొక్క గతి తర్క నిర్వచనం
7. ప్రభుత్వం పుట్టుక - ప్రైవేటు ఆస్తి నుంచి,
8. ప్రభుత్వం-సంఘంలో ఉన్న ఆర్థిక వ్యవస్థా స్వరూపం.
9. వెనుకటి విప్లవాలకు వర్గపోరాట నిర్వచనం.
10. రాజకీయాలు-డార్వినిజం-అరాజక వాదం - రాజకీయ బహుత్వ వాదం. (ప్లూరలిజమ్) - సిండికలిజమ్ - సోషలిజమ్.
11. సామ్రాజ్య వాదం - ఇగ్లండులో నూత్న సామ్రాజ్యవాదం
12. ప్రపంచ మహా యుద్ధం - రష్యా విప్లవం
13. పెట్టుబడిదారీ సామ్రాజ్యవాద నియంతృత్వం - జాతీయతా సూత్రం
14. సోషల్ డెమక్రట్స్
15. కార్మిక నియంతృత్వం
16. సామ్యవాద ప్రభుత్వం
17. కమ్యూనిజం

## వేదాంత శాస్త్రం

1. వేదంతశాస్త్ర చరిత్ర
   ఎ) పూర్వయుగం బి) మధ్యయుగం సి) నవయుగం
2. కాంట్, హెగిల్, ఫ్యూయర్‌బావిధానం, మార్క్సు, సాంఖ్యముని, చార్వాకుడు
3. తాత్విక పద్ధతి - గతి తర్క పద్ధతి
4. ప్రపంచానికి గతి తర్క నిర్వచనం - ప్రకృతి యొక్క గతి తర్కం
5. చారిత్రక భౌతిక వాదం
6. ఉత్పత్తి సాధనాలనుబట్టి చారిత్రక పరిణామం కలుగుతుంది
7. వైరుధ్య సూత్రం
8. వైరుధ్య సంశ్లేషణ సూత్రం
9. స్థితిత్వ వాదం
10. ప్రమాణ గుణ సూత్రం
11. వైరుధ్య విరోధ సూత్రం

## అర్థశాస్త్రం

1. అర్థశాస్త్రం నేర్పేదేమిటి?
2. సంఘం, పెట్టుబడిదారి విధానంలోని కొచ్చిందెట్లా?

3. సరుకుల ఉత్పత్తి
4 పెట్టుబడిదారీ దోపిడీ విధానం
5. జీతాలు, అదనపు విలువ
6. కార్మికుల బీదతనమెందుకు ఎక్కువవుతుంది?
7. అదనపు విలువ పంపకం.
8. వ్యవసాయంలో పెట్టుబడిదారీ విదానం.
9. వలస రాజ్యాల్లో వ్యవసాయం.
10. పెట్టుబడిదారీ విధానంలో ఉత్పత్తి చక్రం, క్షోభ.
11. సామ్రాజ్యవాదం క్రింద అసమాభివృద్ధి - కార్మిక విప్లవం.
12. డంపింగ్.
13. సామ్రాజ్యవాదం - సామ్యవాద విప్లవ సమాజం.
14. పెట్టుబడిదారీ విధాన క్షీణత.
15. ప్రపంచ యుద్ధం - పెట్టుబడి సార్వజనిక క్షోభ.
16. నేటి ప్రపంచ క్షోభ - దాని విచిత్ర లక్షణాలు.
17. కొత్త యుద్ధాలు - కొత్త విప్లవాలు.

## ఇతర రాష్ట్రి నాయకులు చెప్పే పాఠాలు, జనరల్ ఉపన్యాసాలు :

1. హిందూ దేశ స్వరాజ్య పోరాటం.
2. హిందూ దేశ కార్మికోద్యమం.
3. బొంబాయి సమ్మె పోరాటాలు.
4. కాంగ్రెస్ వాదుల సోషలిస్టు వైఖరి, కాంగ్రెస్‌లో వారి పని.
5. కాన్పూరు సమ్మెలు.
6. సంస్థాన ప్రజలు - వారి ఉద్యమం.
7. బెంగాల్ కార్మికోద్యమం.
8. బెంగాల్ రాజనైతిక ప్రవాహాలు.
9. రైతు సంఘాలు-వాటి పని-అఖిల భారత రైతు సంఘం-రైతు శాసనాలు.
10. కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ-అభివృద్ధి-కమ్యూనిస్టులకు దానికుండే సంబంధ నిర్మాణ సమస్యలు.
11. హిందూ దేశంలో కార్మిక శాసనాలు.
12. జాతీయఐక్య సంఘటనా సమస్యలు.
13. హిందూదేశంలో వ్యక్తిగత దౌర్జన్యవాద ఉద్యమం.
14. కార్మిక యువజన సంఘం - దాని కార్యక్రమం- బొంబాయి కార్మికులలో అది చేసిన పని.

15. బీహారు రైతు పోరాటం.
16. నేటి ప్రపంచ పరిస్థితులు.
17. రష్యా విప్లవం.
18. చైనా విప్లవం
19. జపాన్ - చైనా
20. ఇటలీ
21. అమెరికా
22. ఫ్రాన్సు
23. ఇంగ్లాండ్
24. యుద్ధ వ్యతిరేక పోరాటం
25. రాయ్, మెక్సికో, చైనా-అతని పూర్వసిద్ధాంతాలు-యిప్పటి సిద్ధాంతాలు
26. గతితర్కం
27. సామ్యవాద సూత్రాలు
28. కార్మిక నియంతృత్వం
29. సోషలిస్టు నిర్మాణం
30. కమ్యూనిజం

## ప్రత్యేక విలేకరి కథనం :

మే 1 వ తేదీన ప్రారంభించవలసిన పాఠశాలను 4 వ తేదీకి వాయిదా వేశారు. విద్యార్థులు 3 వ తేదీ రాత్రికి కొందరు, 4 వ తేదీ ఉదయానికి చేరుకొన్నారు.

4 వ తేదీన బ్రహ్మాండమైన ఊరేగింపు జరిగింది. జాతీయ జండాలను, ఎర్ర జండాలను పట్టుకొని విద్యార్థులు, అధ్యాపకులు, అతిథులు, గ్రామస్థులు ఊరేగింపులో పాల్గొన్నారు.

సాయంత్రం జరిగిన బహిరంగసభలో కామ్రేడ్ జోగ్లేఖర్ ఉపన్యసించారు. ఈయన మీరట్ కుట్రకేసులో శిక్షించబడిన కమ్యూనిస్టు. సభకు అధ్యక్షత వహించిన కృష్ణరాజుగారు పాఠశాలను జయప్రదంచేయాలని విజ్ఞప్తిచేశారు. అఖిల భారత కాంగ్రెస్ నాయకులు, ఆంధ్ర నాయకులు పంపిన సందేశాలు చదివారు. రాత్రి తొమ్మిది గంటలకు సభ ముగిసింది.

ఆ రోజునే విద్యాలయంలో కామ్రేడ్స్ బాలిరెడ్డి, వెంకటమ్మగార్ల వివాహాన్ని జోగ్లేఖర్ జరిపించారు.

పాఠశాల ఆవరణలో 13, 14 క్యాంపులున్నాయి. జిల్లాలవారీగా విద్యార్థులకు 9, మహిళలకు 2, ఆంధ్రేతర నాయకులకు ఒకటి, ఆర్గనైజర్లకు ఒకటి ఉన్నాయి. పందిళ్ళూ పాకలూ పెళ్ళి ఇళ్ళను జ్ఞాపకం చేశాయి. పబ్లిసిటీ ఆఫీసు, పఠన మందిరం వేరే ఉన్నాయి.

విద్యార్థుల తరగతులను మూడుగా విభజించారు. మొదటిది ఇంగ్లీషులో బోధించే తరగతి. రెండవది కొంత అభివృద్ధి చెందిన తెలుగు విద్యార్థులకు.

మూడవది ప్రాథమిక పరిజ్ఞానం ఉన్నవారికి, మూడవ తరగతిని స్త్రీలకొకటి, పురుషులకొకటి రెండు సెక్షన్లుగా విభజించారు.

ఈ పాఠశాలకు 30-40 ఏండ్ల పైన వారు రావడమే గాక, మహిళలు 59 మంది దాకా వచ్చారు.

ఉదయం ఎడున్నర మొదలు పదిన్నర గంటలవరకు పాఠాలు. మధ్యాహ్నం విశ్రాంతి, సాయంత్రం అఖిలభారత నాయకుల ఉపన్యాసాలు. ఒకోసారి మధ్యాహ్నం విశ్రాంతి లేకుండానూ, రాత్రిపూటలు కూడా ఈ ఉపన్యాసాలు ఏర్పాటు చేయబడ్డాయి. కొంచెం కష్టమైనా, విద్యార్థులు నేర్చుకోవాలనే తహతహ ప్రదర్శించడంవల్ల ఆ ఇబ్బందిని అధిగమించగల్గారు. విద్యార్థుల స్థాయిని బట్టి ఆయా తరగతుల వారికి ఫిలాసఫీ, ఆర్థికశాస్త్రం, రాజకీయ శాస్త్రం పాఠాలను మార్చి చెపుతూ వచ్చారు.

పి.వి. శివయ్య, బి యస్.సి. ప్రిన్సిపాలుగా వ్యవహరించుతూ పాఠాలను భోదించేవారు కంభంపాటి సత్యనారాయణ యం.ఎ. (సీనియర్) కంభంపాటి సత్యనారాయణ బి.ఎ. (ఆనర్సు) బి.యల్. (జూనియర్), సి వి. కె. రావు, చంద్ర రాజేశ్వరరావు, మాడభూషి వెంకటాచారి యం.ఎ. అమరవాది కృష్ణమూర్తి జొన్నలగడ్డ రామలింగయ్యగార్లు పాఠాలను బోధించేవారు.

మొదటి కొద్దిరోజుల్లోనే డాంగే, జోషి, భరద్వాజ్, దేశపాండే, రణదివే, బుఖారీ, అజయ్‌కుమార్ ఘోష్, సోమనాథలహరీ, డాక్టర్‌అధికారి, పాట్కర్, యస్.వి. ఘాటే మొదలైనవారు ఉపన్యసించారు

సాయంత్రంపూట అప్పుడప్పుడూ బహిరంగసభలుండేవి. మైసూరు దినోత్సవంలాంటివి జరిగాయి.

నేషనల్‌ఫ్రంట్ సంపాదకుల ముఖ్యులు, నవశక్తి సంపాదకవర్గ సభ్యులంతా 11, 12 తేదీలలో ఇక్కడకన్పించారు. రైతు, కూలీ, సోషలిస్టు సంఘాలలో పనిచేసే కార్మేడ్సు ఎందరోవచ్చారు. 'నవశక్తి' పత్రికను సంపాదకవర్గ సభ్యులే అమ్ముతూ ఉండడం కన్పించింది.

## అజయ్‌కుమార్ ఘోష్ వ్యాసం

1938 జూన్ 12 వ తేదీ 'నేషనల్‌ఫ్రంట్' పత్రికలో అజయ్‌కుమార్ ఘోష్ "కారల్‌మార్క్స ఎట్ మంతెనవారిపాలెం" అని ఒక వ్యాసంరాశారు. ఈ పాఠశాలగురించి ఇంతకుముందు ప్రస్తావించని ఇతరఅంశాలను ఆ వ్యాసంలోని భాగాలను తెలియజేస్తున్నాం.

"కొత్తపట్టణం స్కూలుపైనిషేధం ఇంకా కొనసాగుతూనే వుందని ఆర్గనైజర్ కామేశ్వరరావుకు ప్రభుత్వం తెలియజేసింది. రాష్ట్రకాంగ్రెస్ కమిటీఅసలు

పాఠశాలనే రద్దుచేసుకోవలసిందిగా ఒత్తిడి తెచ్చింది. ఇవన్నీ విఫలమయ్యాక, కొత్తపట్టణంలోగాక మరెక్కడైనా పాఠాశాలను పెడితే అభ్యంతరంలేదని తెలియ జేసింది. అధికారరీత్యా గాకపోయినా పరోక్షంగా ఢిల్లును అనుమతించేది లేదని చెప్పింది.

"అందుచే ఆర్గనైజర్లు మంతెనవారి పాలెంను ఎన్నుకొన్నారు. 1930-32 ఉద్యమ కాలంలో ఈ గ్రామం బాగా పాల్గొన్నది. రెండు వేల జనాభాగల ఈ గ్రామంలో ఎక్కువమంది రైతులు జైళ్లకు వెళ్లారు.

"మే 4 వ తేదీన పాఠశాల ప్రారంభమై ఒక నెల రోజుల పాటు కొన సాగింది. ఈ దేశంలో ఇలాంటి పాఠశాల - ఇంతపెద్దది - ఇదే మొదటిది. ఆంధ్ర దేశంలోని 11 జిల్లాలోనూ 10 జిల్లాల నుండి విద్యార్థులు వచ్చారు. 280 మంది విద్యార్థులలో 41 మంది విద్యార్థినులున్నారు. పాఠశాలకు వచ్చిన వారిలో 70 మంది పట్టణాల నుండి మిగతావారు గ్రామాలనుండి వచ్చారు. 80 మందికి ఇంగ్లీషు వచ్చు. విద్యార్థులు గాక ఉపాధ్యాయులు 20 మంది దాకా వచ్చారు. విద్యార్థులు, ఉపాధ్యాయులు, అందరూ కాంగ్రెస్ సభ్యులే.

ఈ అంకెలు పాఠశాలకు గల ప్రజాదరణనే గాక, రైతు కుటుంబాల నుండి ఎక్కువ పాల్గొన్న విషయం కూడా తెలియచేస్తున్నది. గ్రామీణ ప్రాంతాల నుండి వచ్చిన విద్యార్థులంతా రైతు సంఘాల, కాంగ్రెస్ సంఘాల కార్యకర్తలు.

"పాఠశాలకు దాదాపు రు 5000 ఖర్చయింది. విద్యార్థుల నుండి, ఉపా ధ్యాయుల నుండి గుంటూరు జిల్లాలోని సానుభూతి పరులనుండి ఈ మొత్తం వసూలు చేయబడింది. తాలుకా కాంగ్రెస్ కమిటీ కూడా సహాయపడింది. గ్రామ స్థులు తమ ఇండ్లను విద్యార్థులకు వసతిగా ఇవ్వడమే గాక, ఆహార పదార్థాలను, ధాన్యాన్ని యిచ్చారు. వారు చురుకుగా సహాయం చేసియుండక పోయినట్లైతే ఈ పాఠశాల నిర్వహణ జయప్రదమయ్యేది కాదు.

## నాల్గు తరగతులు

"పాఠశాలకు వచ్చిన విద్యార్థుల సిద్ధాంత చైతన్యం ఒకే దశలో లేదు. కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ సభ్యులు, కాలేజీ విద్యార్థులు ఇతరులకన్నా రాజకీయంగా అభివృద్ధి చెందినవారు. అంతేగాక భాషా సమస్యకూడా ఒకటి వుంది. తక్కువ అభివృద్ధి చెందిన విద్యార్థులకు, వీరికీ ఒకే రకమైనపాఠాలు చెప్పివుంటే, పాఠ శాల ఉపయోగపడి వుండేదికాదు. అందుకని ఇంగ్లీషు, కొంత అభివృద్ధి చెందిన తెలుగు విద్యార్థులు, మూడవది తెలుగులో ప్రాథమికపరిజ్ఞానం వున్నవారు. మరొకటి తెలుగులో ప్రాథమిక పరిజ్ఞానం వున్న విద్యార్థినులు.

"ఉదయం 7-30 నుండి 10-30 వరకు ప్రత్యేక తరగతులు బోధించే వారు. సాయంత్రం 4 నుండి 6 వరకు రాజకీయ విషయాలపై ఉపన్యాసాలుండేవి ఇంగ్లీషు ఉపన్యాసాలను అప్పటికప్పుడే అనువదించి విద్యార్థులకు చెప్పేవారు. మార్క్సిజంలో సిద్ధాంతం ఆచరణలకు సంబంధించిన ప్రాథమిక పాఠాలు, భారత దేశంలోనూ, ఇతరదేశాలలోని రాజకీయఉద్యమం, ట్రేడ్‌యూనియన్, కిసాన్ ఉద్యమాల గురించిన పాఠ్యాంశాలు వుండేవి.

ఈ ఉపన్యాసాలేగాక ప్రతిరోజూ రాత్రిపూట ఐదు స్టడీ సర్కిల్స్ నడిచేవి. ఆ రోజు జరిగిన ఉపన్యాసాలలోని విషయంపైన చర్చలు జరిగేవి. ఈ క్యాంపులకు ఉపాధ్యాయులు గ్రూపుల వారీగా హాజరయ్యేవారు.

## సభలు - ప్రదర్శనలు

ప్రతిరోజు సాయంత్రం సభలు జరిగేవి. ఈ సభలు 15 రోజుల పాటు జరిగాయి. వీటికి మంతెనవారి పాలెం దాని చుట్టు ప్రక్కన గల గ్రామాల నుండి రైతులు వచ్చేవారు. (మైసూరు సంస్థాన ప్రజా ఉద్యమాన్ని బలపరచే) మైసూరు దినోత్సవం మే 8 న జరిగింది. 2 వేల మందికి పైగా రైతులు పాల్గొన్నారు.

కామ్రేడ్సు టెండూల్కర్, నాయుడు సోవియట్ పోస్టర్ల ప్రదర్శనను ఏర్పాటు చేశారు. ఇది బాగా విజయవంతమైంది. ఈ ప్రదర్శనలను ఆ గ్రామ పాఠశాల హాలులో ఏర్పాటు చేశారు. హాలు చాలా చిన్నది. అయినా మంచి కళా కారుడైన టెండూల్కర్ ఈ ప్రదర్శనను అద్భుతంగా చేశాడు. చాపలు, ఎర్ర గుడ్డ ముక్కలపైన పోస్టర్లను ఏర్పాటు చేసి మంచి ఫలితాలను సాధించాడు. చుట్టు ప్రక్కల గ్రామాలనుండి రైతులు వాటిని చూడటానికి ఎగబడ్డారు. అంతకు ముందు వారు సోవియట్ యూనియన్‌గురించి విన్నవి అస్పష్టమైనవిగా వుండేవి. అక్కడ కార్మిక, కర్షక రాజ్యం నెలకొల్పబడిందని సోషలిస్టులు వారికి చెప్పేవారు. కార్మిక, కర్షక రాజ్యమంటే ఏమిటో బొమ్మలద్వారా మొట్టమొదటిసారిగా వారు తెలుసుకొన్నారు. షావుకార్లు, జమీందార్లు లేని దోపిడీ పీడలు లేని అద్భుతమైన ఆ దేశం గురించి వినడానికి వృద్ధ పురుషులు, వృద్ధ స్త్రీలు సైతం గంటల కొలది వుండేవారు. అలాంటి రాజ్యమే ఈ దేశంలో కూడా నెలకొల్ప బడుతుందని చెబు తున్నప్పుడు వారు ఉత్సాహంతో ఉప్పొంగి పోయేవారు.

## గొప్ప విజయం

ఆర్గనైజర్లు, క్రీడలను, సాంస్కృతిక కార్యక్రమాలను-ఆటలు, నాటకాలు పాటలు వగైరాలను ఏర్పాటు చేయలేదు. ఆ నెలలో రెండవ పక్షంలో మాత్రం "కబాడీ" టోర్నమెంటు ఏర్పాటు చేశారు. కాని విద్యార్థులంతా పాల్గొనలేదు. ఇది పెద్ద లోపం. దీనిని నివారించి యుండవలసింది. సర్వతోముఖాభివృద్ధికి, పాఠ

శాలను ఉత్సాహంగా ఉంచడానికి అలాంటి కార్యకలాపాలు అవసరం. వాటిని ఉపేక్షించ వలసింది కాదు.

మొత్తంమీద స్కూలు గొప్ప విజయం. ఆర్గనైజరు కామేశ్వర రావు, అతని సహకార్యకర్తలు అద్భుతాన్ని సాధించారు. అలాంటి పెద్ద పాఠశాలను నిర్వహించగలిగే రాష్ట్రాలు బహు తక్కువ. పాఠశాల పట్ల గ్రామస్థులు ఉత్సాహాన్ని, గాఢమైన ఆసక్తిని కనపరిచారు. స్కూలుకు రైతుయువకులు ఎక్కువ మంది వచ్చారు. విద్యార్థులు ఉపన్యాసాలను చాలా శ్రద్ధతో విన్నారు. వారు తెలివైన ప్రశ్నలు వేశారు. ఇవన్నీ ఆంధ్రా కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ ప్రజానీకంలో లోతైన వేళ్లూనుతున్నదని తెలియజేసింది. రాష్ట్రంలోని కాంగ్రెస్, కిసాన్ కార్యకర్తలలో నిగ్గుదేలిన వారిని తనపతాక క్రిందకుకూడా గట్టినదని న్యాయంగానే అది చెప్పుకోవచ్చు. రాష్ట్రంలో సోషలిస్టు ఉద్యమ అభివృద్ధికి, కాంగ్రెస్ అనుయాయిలతో సోషలిస్టులకు గల సన్నిహిత సంబంధానికి ఇది నిర్దిష్ట నిదర్శనం. ఇతర రాష్ట్రాలు ఉత్తేజం పొంద వలసిన నమూన "మంతెనవారి పాలెం"

## తూర్పు గోదావరిజిల్లా ఆర్థిక రాజకీయ పాఠశాల రాజమండ్రి 1938 జూలై

తూర్పు గోదావరిజిల్లా రాజకీయ పాఠశాలకు శ్రీ కాకి ప్రభాకరరావుగారు దానవాయి పేటలోని 'అమరావతి' అనే తన భవనాన్ని విద్యార్థుల బసకు ఇచ్చారు. దీని ప్రక్కనే ఉన్న గృహాన్ని శ్రీ సోమ కామేశ్వరరావుగారు వంట, భోజనశాలకు ఇచ్చారు. దానవాయిపేటలోని ఉచిత పఠనమందిరాన్ని పాఠశాల నడుపుకో డానికి, శ్రీ వెన్నేటి సత్యనారాయణగారు అనుమతించారు.

పాఠశాల ప్రారంభోత్సవం జూలై 15, 1938 న జరిగింది. పురవీధుల గుండా ఊరేగింపు జరిగాక దానవాయి పేటలోని ఉచిత పఠనాలయానికి చేరింది. ఇక్కడే సాయంత్రం 4-30 గంటలకు నగరకాంగ్రెస్ అధ్యక్షులు దేవత శ్రీరామమూర్తిగారి అధ్యక్షత క్రింద బహిరంగసభ జరిగింది.

పాఠశాల ఆర్గనైజరు శ్రీ పుసులూరి కోదండ రామయ్య పాఠశాల ఆశయా లను వివరించారు. సభకు సి.ఐ డి.లు రావడం గురించి ప్రస్తావించుతూ దేవత శ్రీరామమూర్తిగారిలా అన్నారు.

"కాంగ్రెస్ హయాంలో బహిరంగసభలకు సి. ఐ. డి. లు హాజరుగావడం ఆశ్చర్యమనీ, కాంగ్రెస్ మంత్రిత్వంతో ఈ పీడ వదిలిందనుకొంటే, వదలలేదనీ, తాము లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో ఈ విషయంపై ప్రశ్న వేస్తామనీ, ప్రధాని



పామర్రు రాజకీయ పాఠశాలలో మిలటరీ కవాతు చేస్తున్న విద్యార్థులు



పల్లెకోన రాజకీయ పాఠశాల విద్యార్థులు



1943 జనవరిలో విజయవాడలో జరిగిన ప్రథమ మహిళా శిక్షణా తరగతులు - ఫోటో

క్రింద కూర్చున్నవారు
ఎడమ నుంచి కుడికి

పందిరి జగదాంబ, మహీధర సీతమ్మ, దుర్భా హనుమాయమ్మ.
కుర్చీలలో కూర్చున్నవారు.

ఎడమ నుంచి కుడికి
కొమ్మరాజు పద్మావతి, ముత్తేవి కోటమ్మ

చలసాని వాసుదేవరావు, మద్దుకూరి చంద్రశేఖర రావు, పుచ్చలపల్లి సుందరయ్య, చండ్ర రాజేశ్వర రావు (అధ్యాపకులు)

నిలబడినవారు ఎడమ నుంచి కుడికి

వెల్లరికి సక్కుబాయి, కడియాల రాజరత్నమ్మ, మాకినేని జగదాంబ, చండ్ర సావిత్రీదేవి, టి సావిత్రీదేవి,
గోపరాజు సీతాదేవి, వెల్లంకి అన్నపూర్ణా దేవి. యలమంచిలి కమల
చివరిగా నిలబడిన వరుస ఎడమ నుంచి కుడికి

మోటూరి ఉదయం, జ్యోస్యభట్ల సుబ్బమ్మ, పరకాల అహల్యాదేవి, ఇనుగంటి రామతులశమ్మ, పరుచూరి సూర్యాంబ, వి. విమ
కాట్రగడ్డ హనుమాయమ్మ, మానికొండ సూర్యావతి.

(ముఖ్యమంత్రి) వచ్చినప్పుడు ఈ విషయం మాట్లాడుతామనీ" చెప్పారు. దేశాభిమానులందరూ ఈ పాఠశాలను ప్రోత్సహించాలని చెప్పారు

"ఆర్థిక రాజకీయ పాఠశాలలో తయారైన యువకులు సలుపూంలా వందలాది జాతీయ వీరులను తయారు చేయాలని" అరవ ఆదినారాయణమూర్తి గారన్నారు.

పాఠశాల ప్రధాన అధ్యాపకులు శ్రీ సి. వి. కె. రావుగారు పాఠశాల ఆవశ్యకతను, కార్యక్రమాన్ని వివరించారు. కాంగ్రెస్ వారు మంత్రిపదవులను స్వాతంత్ర్య పోరాట అభివృద్ధికై ఉపయోగించుకోవాలనీ, అందుకు రాజకీయ విజ్ఞానం గల స్వాతంత్ర్య యోధులను తయారు చేయాలనీ అన్నారు.

సభలో సి. ఐ. డి. లను చూస్తుంటే కొత్త పట్టణం జ్ఞాపకం వస్తోందని క్రొవ్విడి లింగరాజుగారన్నారు. భారత రాజకీయాలను ప్రపంచ రాజకీయాల నుండి వేరుచేయజాలమని కనుక రాజకీయ విజ్ఞానం కలగడానికి ఇలాంటి పాఠశాలలు ప్రతి జిల్లాలో స్థాపించాలని అన్నారు.

సోషలిస్టులున్నారని రాజకీయ పాఠశాలను నిరుత్సాహపరచరాదని ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రిన్సిపాల్ విస్సా అప్పారావుగారన్నారు.

మద్దూరు అన్నపూర్ణయ్యగారు తమ ఉపన్యాసంలో "నాకు తెలిసినంత వరకు కొంత మంది సోషలిస్టులు వ్యక్తిగతంగా యిందు పాల్గొంటున్నా, దానికి (ఈ పాఠశాలకు) పార్టీ యాజమాన్యం లేదు" అని అన్నారు

"కొత్తపట్టణం, మంతెనవారిపాలెం పాఠశాలలు సోషలిస్టు పార్టీలో యాజమాన్యాన జరగడంవల్ల రాజమండ్రి పాఠశాల కూడ ఆ సంబంధమైనదేనని అభిప్రాయ పడుతున్నట్లు కనిపిస్తుంది. సి. ఐ. డి. రిపోర్టర్లు ఈ సభకు ఇంత తప్పనిసరిగా రావడానికి కారణమదే అనుకొంటాను" అని అన్నారు.

ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారు పాఠశాల విజయాన్ని కోరుతూ పంపిన సందేశాన్ని సభలో చదివారు.

శ్రీయుతులు వెన్నేటి సత్యనారాయణ, మార్ని సుబ్బారావు, న్యాపతి సుబ్బారావు పంతులు, చిలకమర్తి సత్యనారాయణచార్య గారలు ప్రసంగించారు.

పాఠశాల పబ్లిసిటీ సెక్రటరీ గారైన వెన్మత్స సూర్యనారాయణ జూలై 16 వ తేదీన ఒక ప్రకటన చేస్తూ అప్పటి వరకు 45 గురు విద్యార్థిని విద్యార్థులు వచ్చారని తెలియజేశారు. ప్రతిదినం సాయంత్రం 5 గంటల నుండి 7 గంటల వరకు కాంగ్రెస్ భవనంలో వివిధ విషయాలపై ఉపన్యాసాలు ఏర్పాటు చేస్తున్నట్లు చెప్పారు.

## పోలీసుల వేధింపు గురించి ఇలా ప్రకటించారు :

"పాఠశాల ప్రారంభమైన నాటి నుండి ఒక సి. ఐ. డి. సర్కిల్ ఇన్‌స్పెక్టరు, ఇద్దరు షార్ట్‌హాండ్ రిపోర్టర్లు, మరి కొందరు స్పెషల్ బ్రాంచి పోలీసులు హడావుడి చేస్తున్నారు. పాఠశాల తరపున జరిగే బహిరంగ సభలకు, పాఠశాల ఉద్యోగులు పాల్గొనే ప్రతి మీటింగుకూ వీరు హాజరవుతున్నారు. పాఠశాలలోకి రావడానికి వీరిని అనుమతించలేదు. అయినా ఎలాంటి సూచన లేకుండానే 24 వ తేదీ సాయంత్రం 4-30 గంటలకు సి. ఐ. డి. సర్కిల్ ఇన్‌స్పెక్టరు, సబ్-ఇన్‌స్పెక్టరు ముగ్గురు పోలీసులు లోపలికి జొరబడ్డారు. పాఠశాల భవనం ఎప్పుడు ఖాళీ అవుతుందని, అద్దె ఎంత ఇస్తున్నారని ప్రశ్నించారు. ఆర్గనైజర్ గారిని పిలిపించి ''కమ్యూనిస్టు కరపత్రము'' బోధించుతున్నట్లు తమకు తెలిసిందనీ, అది నిషేధింపబడిన పుస్తకం గనుక బోధించరాదని సూపరింటెండెంట్ 'మీకు వార్నింగ్ ఇచ్చి రమ్మన్నారనీ' తెలియజేశారు. కరపత్రాలలోను, పత్రికల లోనూ ప్రకటించిన విషయాలు తప్ప వేరే ఏమీ బోధించడం లేదని పాఠశాల ప్రధాన కార్యదర్శి స్పష్టం చేశారు. "మీరేమైనా విషయం తెలుసుకోవాలంటే వ్రాత మూలకంగానే అడగాలా ? నోటితో చెప్పరా?" అంటూ సి ఐ. డి. పోలీసులు వెళ్ళిపోయారు.

మద్రాసు రాష్ట్ర ప్రభుత్వ పార్లమెంటరీ కార్యదర్శి బి. సూర్యనారాయణ మూర్తి (బి. యస్. మూర్తి) 23 వ తేదీన పాఠశాలను సందర్శించి, పాఠశాల గురించి తమ సంతోషాన్ని వ్యక్తం చేశారు.

## పాఠ్యాంశాలు

ప్రతి రోజు ఈ క్రింది విషయాలను పాఠశాలలో బోధించారు.

1. భారతదేశ చరిత్ర 2. ప్రపంచ రాజకీయాలు 3. ఆర్థిక శాస్త్రం 4. హిందీ సంభాషణ.

ప్రతిదినం ఒక గంట వ్యాయామ క్రీడలు, ఉదయం మూడు గంటల పాఠాలు, మధ్యాహ్నం రెండు గంటలు పాఠాలు, సాయంత్రం ఆటలు, రాత్రిళ్ళు 1-30 గంటలు చదువుట - ఇది విద్యార్థుల కార్యక్రమం.

ప్రతిరోజు మధ్యాహ్నం పూట చర్చలు జరిగేవి. ఉదాహరణకు 'వర్గ సంఘాలు కాంగ్రెసును బలపరచునా?' 'ఆంధ్ర రాష్ట్రమునకై వెంటనే ఆందోళన అవసరమా?' అనే అంశాలపై చర్చలు జరిగాయి. ''సినిమాలను ఏదృష్టితో చూడాలి" చర్చ జరిగింది. 'ఇజ్జత్' సినిమా చూపించబడింది. పట్టణంలో వుండే ఉపాధ్యాయులు, విద్యార్థులు పాల్గొనేవారు.

పాఠశాల 1938 జులై 15 న ప్రారంభమై ఆగష్టు 13 న ముగిసింది. 44గురు విద్యార్థులు. వారిలో 30 మంది పాఠశాలలోనే బస, భోజనం చేశారు.

పాఠశాల కార్యక్రమాన్ని కార్యనిర్వాహకులు, విద్యార్థులతో గూడిన స్థాయి సంఘం, నిర్వహించేది. కార్యనిర్వాహక సంఘం, విద్యా సంఘం, ప్రచురణ సంఘం, భోజన ఏర్పాటు సంఘం. ఆర్థిక సంఘం, పఠన కమిటీ, ఆటల కమిటీ ఇలా వివిధ ఉపసంఘాలు ఏర్పడ్డాయి. వాటిలో విద్యార్థుల ప్రతినిధులుకూడా ఉన్నారు.

## ఆయా విషయాలపై పాఠాలు చెప్పిన వారి కొన్ని వివరాలు

| | |
|---|---|
| సి. పి. కె. రావు :- | 1. భారతదేశ చరిత్ర (కాంగ్రెస్ చరిత్ర) |
| | 2. ప్రపంచ రాజకీయాలు |
| పి. అనంతం :- | 1. ఆర్థిక శాస్త్రం |
| | 2. ఫెడరల్ రాజ్యాంగ విధానం |
| జొన్నలగడ్డ రామలింగయ్య:- | 1. యువజనోద్యమం |
| | 2. రైతు, కూలీ సమస్యలు, ఉద్యమాలు |
| | 3. 1935 ఇండియా చట్టం |
| గోపరాజు రామచంద్రరావు:- | జీవశాస్త్రం |
| పుచ్చలపల్లి సుందరయ్య:- | సోషలిస్టు, కార్మికోద్యమాలు |
| రెబ్బాప్రగడ మందేశ్వరశర్మ:- | జమీను రైతు సమస్య |
| పందిరి మల్లికార్జునరావు:- | రాజకీయ భూగోళం |
| నిడమర్తి అశ్వనీకుమార్‌దత్తు:- | 1. సాహిత్యం |
| | 2. విప్లవ సిద్ధాంతాలు |
| శనివారపు సుబ్బారావు :- | 1. వమోజనవిద్య, సామ్రాజ్యాలు, యుద్ధాలు |
| | 2. గ్రామ పరిపాలన |
| ఇవటూరి శరభరాజు :- | విద్యార్థి ఉద్యమం, విప్లవ సిద్ధాంతాలు |
| ఎం.వి.వి.కె. రంగాచార్యులు:- | తత్త్వశాస్త్రం |
| క్రొవ్విడి లింగరాజు :- | ఆధునిక రచన |
| పి. సూర్యనారాయణ :- | హిందీ |
| చె. (చెలికాని) రామారావు:- . | బర్మా కార్మికోద్యమం |
| కొరపాటి పట్టాభిరామయ్య:- | 1. భారత సైన్యం |
| | 2. మినహాయింపు ప్రాంతాలు |
| పుత్సల సత్యనారాయణ :- | మానసిక శాస్త్రం |
| ప్రతివాద భయంకరాచారి:- | చెరసాల సంస్కరణ |

ప్రతిరోజూ అరగంట కార్మిక, కర్షక గీతాలు పాడటం, డ్రిల్లు, ఆర్థిక, రాజకీయ సమస్యలపై ఉపన్యాసాలు చర్చలు, పత్రికా పఠనం, పఠన సమితిలో వివిధ సమస్యలపై సందేహ నివారణ, ఆటలు, వినోదాలుగాక ఒకసారి సినిమా చూపబడింది. "సమ్మె" అనే నాటకం ఆఖరురోజున ప్రదర్శించబడింది.

"పాఠశాల ప్రారంభం లగాయితు తుదివరకు అన్ని విషయములలోను జాతీయ ఐక్యసంఘటన అతి జాగరూకతతో ఆచరణలో పెట్టబడును. ఇట్టి ఐక్య సంఘటన జిల్లాలో జరుగుటకిదియే ప్రథమము." అని నిర్వాహకులు మొదట్లోనే స్పష్టం చేశారు.

## ఇచ్ఛాపురం వేసంగి ఆర్థిక రాజకీయ పాఠశాల 1939

ఆంధ్రరాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్, జిల్లా సోషలిస్టు పార్టీ, జిల్లా రైతు సంఘాల యాజమాన్యాన ఇచ్ఛాపురం (ఉత్తర విశాఖ జిల్లా) వేసంగి ఆర్థిక రాజకీయ పాఠశాల 1939 మే 1 నుండి మే 28 వరకు నిర్వహించబడింది. ఈ పాఠశాల నిర్వహణ గురించి మొదట ఆంధ్రరాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ కార్యదర్శి జి. రామకోటేశ్వరరావు 29-3-39 న ఒక ప్రకటన చేశారు. పై పాఠశాల ఆర్గనైజరుగా ఆయన చేసిన ప్రకటన ఇలా వుంది.

"స్వాతంత్ర్య పోరాటములో పాల్గొనుటను జాతీయ అంతర్జాతీయ సమస్యలను బాగుగా బోధచేసుకొని దేశములోని ప్రజాసామాన్యము మధ్య పనిచేయుటకును విద్యావంతులు ఐన యువజనులు వేలకు వేలు తయారుకావలసిన ఆవశ్యకత చాలా యున్నది. కేవలము మానసికాభివృద్ధియేగాక దానితోబాటు శారీరకముగా కూడ శిక్షణ పొందుటకూడా చాలా అవసరము. ఇట్టివారలను తయారుచేయుటకొరకే ఈ వేసంగి ఆర్థిక రాజకీయ పాఠశాల మే నెలలో నొకటి ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ వారి యాజమాన్యమున విశాఖపట్నం జిల్లాలోని ఇచ్ఛాపురంలో స్థాపించబడబోవుచున్నది.

విద్యార్థులకు చక్కని వసతిగృహం ఏర్పాటు, స్త్రీలకు ప్రత్యేక బసలు, కుటుంబాలతో వుండేవారికి కూడా ప్రత్యేక బసలు. చుట్టుపట్ల గ్రామాల్లో ప్రచారం చేయడానికి బస్సులు కూడా ఏర్పాటు చేయబడతాయనీ ముఖ్యమగు దినపత్రికలు, వారపత్రికలు, విద్యార్థులకు యిస్తామనీ, అన్నారు. స్కూలుకు చక్కని గ్రంథాలయముందనీ తెలియచేశారు.

అఖిల భారత కిసాన్ సంఘాధ్యక్షులు దేశభక్తులు సహజానంద సరస్వతిగారు ప్రారంభోత్సవం చేయడానికి దయతో అంగీకరించారనీ, ఈ క్రింది ప్రధాన విషయాల్లో శిక్షణ యివ్వబడునని ప్రకటించారు.

## బోధనా విషయాలు :

1. వివిధ రాజకీయ సిద్ధాంతాలు 2. రాజ్యాంగ నిర్మాణాలు 3. స్వాతంత్ర్యపోరాట చరిత్రలు 4. వాలంటీరు డ్రిల్లు 5. ఉపన్యాసాలిచ్చుట, చర్చలు చేయుట, వ్యాసరచన 6. కిసాన్, కార్మిక సమస్యలు.

మొదట్లో 'మిలిటరీ డ్రిల్లు' అనే పదం వాడబడింది. దానిస్థానే 'వాలంటీరు' డ్రిల్లు అన్నారు. అలాగే కార్మిక-కర్షకకు బదులుగా 'కిసాన్-కార్మిక' అనే పదం వాడారు.

5-4-39 'నవశక్తి'లో ఇచ్ఛాపురం ఆర్థిక రాజకీయ వేసంగి పాఠశాల గురించి ఈ పై ప్రకటన లాంటిదే చేస్తూ ' 1 దేశాభిమానులును ఉదారపంతులగు ప్రజలంతా ధనరూపంగా, వస్తురూపంగా అన్ని విధములా ఈ పాఠశాలకు తోడ్పడ ప్రార్థితులు." అని పజ్ఞప్తి చేశారు.

## జొన్నలగడ్డ రామలింగయ్య ప్రకటనలో :

స్వామి సహజానంద సరస్వతి, (అఖిల భారత కిసాన్ నాయకులు) ప్రారంభోత్సవం చేస్తారని, మాలతీ చౌదరి పతాకోత్సవం జరుపుతారనీ, ఆచార్య రంగా, డాంగే (బొంబాయి) సోమనాథ లహరి (కలకత్తా) ప్రొఫెసర్ ముఖర్జీ (కలకత్తా) భారతీదేవి, భారతీ రంగా (నిడుబ్రోలు) శనివారపు సుబ్బారావు (కొవ్వూరు) గోపరాజు రామచంద్రరావు గోరా (బందరు) విజయకుమార్ సిన్హా (కాన్పూరు) బటుకేశ్వర దత్తు ఇంకా ప్రముఖులు వస్తారని ప్రకంటించారు.

పాఠశాల మే 1 వ తేదీన ప్రారంభించబడినది. సుమారు 60 మంది విద్యార్థులు వచ్చారు జిల్లా కాంగ్రెసు కమిటీ అధ్యక్షులు గేదెల చంద్రయ్యగారు పాఠశాలకు కావలసిన సదుపాయాలన్నీ చేయడానికి ఆ కమిటీ సిద్ధంగా వున్నదని తెలియజేశారు. విద్యార్థులు క్రమశిక్షణగా మెలగాలని ఉపదేశించారు.

పాఠశాలకు ప్రిన్సిపాల్‌గా ఉన్న సి. సూర్యనారాయణ, ఆర్గనైజరు రామకోటేశ్వరరావుగార్లు పాఠశాల ఉద్దేశ్యాలను వివరించారు. గరిమెళ్ల వెంకట రమణమూర్తి, ఇతర కాంగ్రెసు, రైతు నాయకులు రాబోపు స్వాతంత్ర్య పోరాటంలో యువకుల కర్తవ్యాన్ని గురించి ఉపన్యసించారు. రెండువేల మంది ప్రజలు పట్టణ వీథుల గుండా బ్రహ్మాండమైన ఊరేగింపు సాగించారు. సాయంత్రం 5 గంటలకు బహిరంగ సభ జరిగింది.[11]

## సుభాష్‌చంద్ర బోస్ సందేశం

పై సభలో సుభాష్‌చంద్ర బోస్ ఇచ్చిన ఈ క్రింది సందేశాన్ని చదివారు.

"14 వ తేదీ గల తమ ఉత్తరము చూచితిని. కొద్ది దినముల క్రితం మీరు యిచ్చిన టెలిగ్రాములకు వందనములు. మీరు రైతాంగ విద్యాలయమును నిర్వహింప బూనుకొనుట నాకు సంతోషము. నేను నిన్నటి పత్రికలలో మీ పాఠశాల గూర్చి చూచితిని గాని ఎవరు నడుపుచున్నదీ తెలియలేదు. మీ కృషి సఫలమగు గాక ! సామాన్య ప్రజలకు విజ్ఞానం యిచ్చుటకు ముందు మనము మనవర్కర్లకు తగు తర్ఫీదు యిచ్చుట అవసరము. సక్రమ పద్ధతులతో మీరు కృషి సల్పెదరు."

ఆచార్య రంగా గారు విద్యాలయానికి ప్రారంభోత్సవం చేశారు.

పాఠశాల కార్యక్రమాల గురించి ది. 24-5-39 న 'నవశక్తి'లో వచ్చిన వార్త ఈ విధంగా ఉంది.

"పాఠశాల జయప్రదంగా సాగుతోంది. కామ్రేడ్ చున్నీ ముఖర్జీ (కలకత్తా) ప్రతి ఉదయము 5½ నుండి 6½ వరకూ, సాయంత్రము 6 నుండి 7 వరకూ విద్యార్థులకూ మిలిటరీ శిక్షణ ఇస్తున్నారు నిత్యము పాఠాలు నేర్పుటకు కామ్రేడ్సు సి. సూర్యనారాయణ, జొన్నలగడ్డ రామలింగయ్య గార్లు ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటున్నారు. బొంబాయి కార్మిక నాయకులైన కామ్రేడ్ ఖార్డీకర్ మానవ సంఘ పరిణామాన్ని గురించీ, పల్లెటూళ్ళలో చేయవలసిన ప్రచార పద్ధతుల గురించి విపులంగా ఉపన్యసించారు."

కార్మిక కర్షకులలో ఎలా చైతన్యం కలుగ చేయాలో విద్యార్థులకు ప్రత్యక్షంగా తెలియచేయడానికి 11వ తేదీన ఇచ్ఛాపురమునకు 6 మైళ్ళదూరంలో వున్న రాజపురం గ్రామానికి విద్యార్థులను తీసుకు వెళ్లారు. గ్రామస్తులు చాలా ఉత్సాహంతో ప్రచారకులను ఆహ్వానించారు. గ్రామ కాంగ్రెస్ అధ్యక్షులు విన్నింటి రామశర్మ గారు ఆతిధ్యం ఇచ్చారు. విద్యార్థులు గ్రామస్తుల ఆర్థిక స్థితి గతుల్ని గురించి విచారించి ఒక నివేదిక తయారు చేశారు. 5 వేల మంది జనాభాలో 500 మంది మాత్రమే సంతకం చేయగలరు. భూమి బొత్తిగాలేని కూలీ జనం మొత్తం 3000. 30 ఎకరాలకంటే ఎక్కువ భూవసతి గలవారు 4, 5 గురు కంటే లేరు అని గ్రామస్తుల సాక్ష్యాలవల్ల ప్రచారకులు తెలుసుకున్నారు.

ఇదేవిధంగా వెల్లుపడ, రత్తకన్న వగైరా గ్రామాలలో ప్రచారం జరిగింది.

## విజయకుమార్ సిన్హా సందేశం

భగత్ సింగ్ సహచరుడు లాహోర్ కుట్ర కేసులో శిక్షితుడు అయిన విజయకుమార్ సిన్హా కరాచీ నుండి ఈ క్రింది సందేశాన్ని పంపారు.

"సామ్రాజ్య వ్యతిరేక సంస్థయగు కాంగ్రెసు నేడు విషమావస్థలో చిక్కుకొని యున్నది. కాని మన మార్గమున కలుగు అడ్డంకులకు మనమెన్నడు

అధైర్యము చెందరాదు. ఈ విషమావస్థ నుండి దాటించు మహత్తర బాధ్యత నేటి రోజున అతివాద శక్తులపై యున్నది. ముందుకు రాదలచినచో దేశములో నున్న అతివాద పక్షములు వారి దైనందిన కార్యక్రమములో శాస్త్రీయ విచక్షణ అవసరం. స్వల్ప శిక్షణ గల సోదరులు, వారెంత మనశుద్ధి కలవారైనప్పటికీ మన ఉద్యమమునకు ఉపయోగపడరు. వారు వామపక్షేతర స్వభావ మార్గమున తప్పక ప్రవర్తించి జాతి భేదముల పుర్రెగొల్పు సంకుచిత దృక్పథమును ప్రదర్శించెదరు. అందుచేత ప్రజాసామాన్యములో పనిచేయు ప్రచారకులకు రాజకీయ పాఠశాలలు స్థాపించుట ప్రస్తుత పరిస్థితులలో అత్యవసరము. అందువలన మనవారు అల్ప శిక్షితులు కాకుండా జాతీయ-అంతర్జాతీయ రణరంగములయందు చేకూరిన అనుభవములచే నేర్పబడిన విప్లవ నాయకత్వ తంత్రములను నేర్చుకొందురు.

"మీ పాఠశాల విద్యార్థులకు నా విప్లవాశీస్సులు. ఆంధ్రదేశములో నా తోడి రాజకీయ ఖైదీలుగా నుండిన ఎవరి దర్శన భాగ్యము నాకు కలిగెనో అట్టి వారి మధ్య నుండ నోచుకొననందుకు నా అతివాద సంతాపమును మీ విద్యార్థులకు తెలియచేయుడు. మీ పాఠానుక్రమణిలో వామ పక్షీయుల ఐకమత్యమును ఒనగూర్చి జాతీయ ప్రాగ్భవమును దిట్టపరచు మన ఉద్యమముయొక్క ఎత్తుగడలకు ప్రాముఖ్యత యిత్తురని తలంచెదను. అతివాద శక్తులు వర్గ సంస్థల స్థాపనల యందు వలసినంత విజయమును పొందినవి గాని దేశీయ మహా జన సభ యొక్క అభివృద్ధితో బాటు జయము గాంచలేకపోయినది. ఒక సంరంభము యొక్క ఇట్టి ముఖ్యమైన ఆచరణీయ సమస్యలను మీరు తప్పకుండా చర్చించెదరని నమ్ముచున్నాను. మీకు జయము కలుగుగాక."[12]

## జిల్లా రాజకీయ ఆర్థిక వేసంగి పాఠశాల : ఇచ్ఛాపురం
## జిల్లా కాంగ్రెసు సోషలిస్టుపార్టీ ప్రకటన

సామ్రాజ్య ప్రతికూల పోరాటము బలపడవలెనంటే, సంపూర్ణ స్వాతంత్ర్యము సాధ్యమైనంత త్వరలో భారతదేశానికి చేకూరవలెనంటే, మనలను నేడు ఎదుర్కొనే వివిధ రాజకీయ, ఆర్థిక సమస్యలను శాస్త్రీయ పద్ధతిని మనము బోధ చేసుకోవాలి. ప్రజా సామాన్యములో ఏవిధముగా పనిచేయవలెనో, సిద్ధాంత రీత్యా, ఆచరణ రీత్యా కూడా స్పష్టం కావలెను.

అందుకొరకే తగు రాజకీయ వేత్తలను, స్వాతంత్ర్య యోధులను తయారు చేయుటకై విశాఖపట్టణం జిల్లా రాజకీయ, ఆర్థిక పాఠశాలను ఒకటి మే నెలలో ఆరోగ్యకరమైన తావులో స్థాపించబడును. పాఠశాల జయప్రదముగా సాగుటకై జిల్లా ప్రజలందరు సర్వ విధముల తోడ్పడ ప్రార్థితులు. యువజనులు విద్యార్థులు

ఈ అవకాశాన్ని ఉపయోగించుకొని తగు శిక్షణ పొందగలరని ఆశించుచున్నాను.
విశాఖపట్టణం.
31-1-39.

ఇట్లు
కొత్తమాసు సత్యనారాయణ
కార్యదర్శి
జిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ
(15-2-39. నవశక్తి)

విద్యార్థులకు ప్రతిరోజూ ఉదయం ఒక గంట డ్రిల్లు, రెండు గంటలు పాఠాలు ఉండేవి. సాయంత్రం రెండు గంటల పాఠాలు, ఒక గంట డ్రిల్లు వుండేది. రాత్రిళ్ల గంటన్నర వివిధ విషయాలపై చర్చలు, అధ్యయన తరగతులు జరిగేవి. ఇదేగాక వారాని కొకటి రెండుసార్లు విద్యార్థులు సమీప గ్రామాల్లో రాజకీయ ప్రచారం గావించేవారు.

## ఉపన్యాసకులు - విషయములు :

1. కామ్రేడ్ జి. రామకోటేశ్వరరావు - (ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ జనరల్ సెక్రటరీ) - ఆర్గనైజరు.
2 కామ్రేడ్ సి. సూర్యనారాయణ - (ప్రిన్సిపాల్) - యువజన విద్యార్థి ఉద్యమాలు కార్మిక సమస్యలు వివిధ జాతీయోద్యమాలు.
3. కామ్రేడ్ ఖాడ్డికర్ (బొంబాయి) - చారిత్రక భౌతికవాదము కాపిటలిజము, సోషలిజం, కమ్యూనిజం, రష్యను విప్లవం.
4. ఆచార్య రంగా — కార్మికకర్షక రాజ్యము పన్ను విధానము, ఆర్థిక విధానములో చేతి పరిశ్రమల స్థానం.
5. కామ్రేడ్ రామలింగయ్య - హిందూదేశ ప్రభుత్వ విధానము సంస్థానాల సమస్యలు స్వాతంత్ర్యోద్యమ చరిత్ర రాజకీయాలలో వివిధ పక్షముల సిద్ధాంతములు.
6. కామ్రేడ్ పుల్లెల శ్యామసుందరరావు - సహకారోద్యమము, రైతు సమస్యలు
7. కామ్రేడ్ చునీ ముఖర్జీ - వాలంటీరు శిక్షణ.

స్కూలుకు మొత్తం 35 మంది విద్యార్థులు వచ్చిరి. 10 మంది ఇతర జిల్లాల వారు. వీరందరును విద్యార్థి ఉద్యమములో పని చేయటానికి పూను

కొన్నారు. విశాఖ పట్నం జిల్లాలోని విద్యార్థులలో 8 మంది తాలూకా కొక్కరు. చొప్పున రాజకీయ ప్రచారకులుగా తమ సర్వకాలమును వినియోగించుటకు సిద్ధ పడినారు.

## తునికిపాడు పాఠశాల

కృష్ణాజిల్లా తిరువూరు తాలూకాలో తునికిపాడు చిన్న గ్రామం. దానికి ఉత్తరాన నిజాం సంస్థానం సరిహద్దుగా ఉండేది. ఆ గ్రామస్తుల బంధువులు, అనేకమంది నిజాం సంస్థానంలో ఉండేవారు. ఆ గ్రామం సరిహద్దున ఉన్న నైజాం ప్రజల బాధలు వర్ణించ వీలులేనివి. ప్రజల సభలు, ఉత్సవాలు స్వతంత్రించి చేసుకోరాదు. వీటికి ప్రభుత్వ అనుమతి ఉండాలి. సంస్థానేతర ప్రాంతాల నుండి బంధువులు వచ్చినా అక్కడ ఉండటానికి ప్రభుత్వ అనుమతి కావాలి. పంటల్ని మించిన పన్నులు, శాయిరీ (కస్టమ్స్) పన్నులు, అధికార్ల జులుములు, లంచగొండితనం విపరీతం. కాంగ్రెస్ పేరు తలపడానికి వీలులేదు.

ఈ గ్రామం జమీందారీ పీడనకు గురికాకుండా స్వేచ్ఛననుభవించుతున్న గ్రామం. సుప్రసిద్ధ అతివాద కాంగ్రెసు నాయకులు కీ.శే. పేట బాపయ్యగారి కృషి వల్ల జమిందారీ పీడనకు ఈ గ్రామం గురి కాలేదు. 1937 ఫిబ్రవరిలో మద్రాసు రాష్ట్ర అసెంబ్లీకి ద్విసభ్య నియోజక వర్గం నుండి కాంగ్రెస్ అభ్యర్థులుగా జయంతిపురం రాజా వాసిరెడ్డి సదాశివేశ్వర ప్రసాద్, స్వాతంత్ర సమర యోధులు కాట్రగడ్డ వెంకట నారాయణరావు విజయం పొందారు. వీరి విజయానికి కృషి చేసిన వారిలో కాంగ్రెస్, కాంగ్రెస్ సోషలిస్టు (కమ్యూనిస్టు) కార్యకర్తలు ఉన్నారు. ఎన్నికల ప్రచార సమయంలోనే గాక, అనంతరం కూడా జమీందారీ విధానానికి నలిగిపోయిన ప్రజలకు సేవ చేయాలనే సంకల్పంతో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ కార్యకర్తలు ఈ గ్రామంలో పని చేయసాగారు. అంతేగాక పొరుగున నిజాం సంస్థాన ప్రాంతంలో జరుగుతున్న నిజాం వ్యతిరేక పోరాటాలకు తునికిపాడులాంటి సరిహద్దు గ్రామాలు ఎంతగానో తోడ్పడ్డాయి. 1938 లో నైజాంలో స్టేట్ సత్యాగ్రహ ఉద్యమం సాగినపుడు, ఈ సరిహద్దు గ్రామాలలో సభలు జరిపి సంస్థాన సత్యాగ్రహులకు సంఘీభావం తెలియచేసే వారు. ఇలాంటి సభలలో ఆచార్యరంగా, ఇందులాల్ యాజ్ఞిక్ లాంటి రైతు నాయకులు, పలువురు రాష్ట్ర కాంగ్రెస్ నాయకులు ఉపన్యసించేవారు. తునికిపాడులో స్టేట్ సత్యాగ్రహ శిబిరం నెలకొల్పాలనే ప్రయత్నం జరిగింది. కాని ఫలించ లేదు. స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహం విరమించబడిన తర్వాత శ్రీయుతులు జమలా పురం కేశవరావు, వాసిరెడ్డి వెంకటపతి, వట్టికొండ నాగేశ్వరరావు, వట్టికొండ

రామకోటయ్య, వట్టికొండ కాంతయ్య, పైడిపల్లి లింగయ్య మొదలగు సత్యాగ్రహులను ఆహ్వానించి ఈ గ్రామంలో సన్మానించారు.

ఇలాంటి వాతావరణం ప్రాతిపదికగా తునికిపాడులో 1939 మే-జూన్‌లలో 20 రోజులపాటు "నిజాం ఆంధ్ర రైతాంగ విద్యాలయం" (రాజకీయ శిక్షణా శిబిరం) జరిగింది. మే 25 నుండి జూన్ 13 వరకు కొనసాగింది. ఈ విద్యాలయానికి ఆంధ్ర తెలంగాణా ప్రాంతాల నుండి సుమారు 50 మంది విద్యార్థులు హాజరయ్యారు. విద్యార్థుల రుసుము 5 రూపాయలు. విద్యార్థులకు ఉచిత భోజన సౌకర్యము కలుగ జేయబడింది. ఎక్కువమంది తెలంగాణా యువకులు. అంతేగాక చుట్టుప్రక్కల గ్రామాలనుండి ప్రతిరోజూ కొంత మంది ఈ పాఠశాలకు వచ్చేవారు. ఈ పాఠశాల ప్రారంభోత్సవానికి గోల్కొండ పత్రికా సంపాదకులు సురవరం ప్రతాపరెడ్డి గారిని ఆహ్వానించారు. వారు రాజాలనందున తమ సందేశాన్ని పంపారు. "నవశక్తి" సంపాదకుడు మద్దుకూరి చంద్ర శేఖర రావుగారు ప్రారంభోత్సవం చేశారు. పేట బాపయ్య గారు పతాకోత్సవం గావించారు. సుభాష్‌చంద్రబోస్, పండిట్ జవహర్‌లాల్ నెహ్రూలు ఈ పాఠశాల జయప్రదం కావాలని సందేశాలను పంపారు. ఆచార్య రంగా ప్రిన్సిపాల్‌గా వ్యవహరించారు. సుంకర వీరభద్రరావు గారు ఆర్గనైజింగ్ కార్యదర్శి. ప్రస్తుత రాజకీయ పరిస్థితుల నర్థము చేసుకొని అన్నిటి సారాంశమును ప్రజా సామాన్యానికి తెలుపగల్గు ప్రచారకులు కావలెను. వారికి తర్ఫీదు అవసరం గదా! ఆ తర్ఫీదులో ఆర్థిక, రాజకీయ శాస్త్ర సూత్ర పరిగ్రహణమొక ముఖ్యావసరము.... .......... ... అద్దానిని నైజాం, నందిగామ, తిరువూరు, యింకా రైతు కూలీ యువకుల కొరకై తునికిపాడులో సుప్రసిద్ధ రైతు సేవక నాయకులైన శ్రీ పేట బాపయ్య, సుంకర వీరభద్రరావు, ముల్లుకుట్ల వెంకటప్పయ్య........... ప్రభృతులు ప్రయత్నించి స్థాపించు చున్నారు. అత్యవసరమైన అలాంటి విద్యాలయానికి ప్రధాన పండితుడుగా వచ్చుట కంటే నాకు కోరుకొనదగిన గౌరవ మేమి? అని ఆచార్య రంగా గారు వ్రాశారు.[13]

పత్రికా ముఖంగా విద్యాలయం గురించి తెలుసుకొని రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి గార్లు ఈ విద్యాలయానికి వచ్చారు. శ్రీయుతులు పేట బాపయ్య, గద్దె రంగయ్య నాయుడు, పిడికిటి రామకోటయ్య, కాట్రగడ్డ వెంకట నారాయణ రావు (యం.యల్.ఎ) పాఠశాలను సందర్శించి సందేశాలిచ్చారు.

### విద్యార్థుల్లో కొందరు :

పటికొండ నాగేశ్వరరావు, వాసిరెడ్డి వెంకటపతి, వాసిరెడ్డి సత్యనారాయణ సీరుకొండ అప్పారావు, వట్టికొండ కాంతయ్య, వాసిరెడ్డి సూర్యనారాయణ,

పైడిపల్లి హనుమయ్య, పారుపల్లి రామయ్య, కర్నాటి సాంబయ్య, హనుమారెడ్డి, చావా కొండయ్య, వెరవళ్ళ వెంకటరమణ, పెండ్యాల సత్యనారాయణ, ఎ. బోధాయన, గద్దె ప్రభాకర రావు, పులుకుట్ల వెంకటప్పయ్య, పాటిబండ్ల సత్యనారాయణ, జవ్వాజి అప్పయ్య, బోడెపూడి సత్యనారాయణ, వాసిరెడ్డి రాధాకృష్ణ, సుంకర శివరామయ్య, రావెళ్ళ జానకి రామయ్య, బోడెపూడి లక్ష్మీ నారాయణ, కాళోజి నారాయణ రావు, పోల్కంపల్లి వెంకట రామారావు, బండి తిరుపతయ్య, గురవారెడ్డి, రావెళ్ళ జానకి రామయ్య, గుర్రం వెంకటరెడ్డి, సూరావఝుల జానకి రామయ్య.

ఈ శిబిరంలో శిక్షణ పొందిన మత్సావీరయ్య ఆ తర్వాత తెలంగాణా పోరాటంలో వీర మరణం చెందాడు

అల్లీనగరం, రామన్నపేట, కిన్నెవీడు, ఖమ్మం, ఊటకూరు, ముష్టికుంట్ల, తిరువూరు, శనగపాడు, కొణతమాత్మకూరు, వీరుళ్లపాడు, విజయవాడ, నేలకొండపల్లి, నాగారపాడు మొదలగు గ్రామాల నుండి విద్యార్థులు వచ్చారు.

రామన్నపేట, రాపల్లె, బ్రాహ్మణపల్లి, అల్లీనగరం, దెందుకూరు, మడుపల్లి గ్రామాల రైతులు విరాళాలిచ్చారు. ఊటకూరు గ్రామస్థులు వంటపాత్రలు సప్లై చేశారు. విద్యాలయాన్ని అలంకరించుట, ఫోటోల బాధ్యత ఎ బోధాయన నిర్వహించారు.

విద్యాలయం ముగింపు సందర్భంగా ఆచార్య రంగాను మేళతాళాలతో ఊరేగించారు. ఊరేగింపులో 10 వేలమంది ప్రజలు పాల్గొన్నారని అంచనా.

ప్రతినిత్యం ఉదయం, సాయంత్రం మునిపల్లె, రామారావుగారు విద్యార్థులకు సైనిక కవాతు నేర్పారు. మధ్య మధ్య చుట్టుప్రక్క గ్రామాలకు ఈ విద్యార్థులు వెళ్లికవాతు చేసేవారు. ప్రజలకు ధైర్యం, ఉత్సాహాన్ని ఈ విధంగా పురికొల్పారు.

విద్యార్థులు ఉదయం 4-30 నుండి 5 వరకు వ్యాయామం చేసేవారు తర్వాత 5 నుండి 6 వరకు డ్రిల్లు చేసేవారు. 7-30 నుండి 11 వరకు క్లాసులు తిరిగి సాయంత్రం 4 నుండి 6 వరకు క్లాసు. 6 నుండి 7 వరకు డ్రిల్లు. రాత్రి 8 నుండి 10 వరకు క్లాసుగాని, గోష్ఠి గాని ఉండేది.

ఈ పాఠశాలలో ఆయా ఉపన్యాసకులు బోధించిన విషయాల వివరాలు.

1. ఆచార్య రంగా :- చరిత్ర పరిణామ వాదం, హిందూదేశ చరిత్ర, స్వదేశ సంస్థానాలు, జమీందారీ విధానం, భారత జాతీయ ఋణం, షారిశ్రామికాభివృద్ధి వ్యవసాయ కూలీ-రైతు ఉద్యమం

2 మద్దుకూరి చంద్రశేఖరరావు :- రష్యా విప్లవం
3. కంభంపాటి సత్యనారాయణ :- భారత స్వాతంత్ర్య పోరాటాలు
4. గద్దె రంగయ్య నాయుడు (యమ్ యల్.సి.) - జమీందారీ దురంతాలు
5. బద్దం ఎల్లారెడ్డి, రావినారాయణ రెడ్డి :- హైదరాబాదు సంస్థాన సమస్యలు
6 మునిపల్లె రామారావు :- యువజనులు క్రమశిక్షణ, రాష్ట్ర సమస్యలు, సామ్యవాద సిద్ధాంతాలు
7. కాశీనాధుని పూర్ణమల్లిఖార్జునుడు (యమ్.యల్.సి.) - ఋణ నివారణ చట్టం
8. రాచకొండ నరసింహారెడ్డి :- ఫెడరేషన్ - అంతర్జాతీయ సమస్యలు
9. శెట్టిపల్లి వెంకట రత్నం :- సాహిత్యం, ప్రజానీకం
10. డి సీతారామయ్య :- కో ఆపరేటివ్ ఉద్యమం
11. డా॥ యేలెళ్ల శ్రీరాములు :- పశువైద్యం
12. యస్. శ్రీ రామశర్మ, బి.ఎ.,ఐ.సి.యస్. ఉద్యోగీయ వర్గం

ఇవిగాక అపుడపుడూ బహిరంగ సభలు జరిగేవి.

10-6-39 న జరిగిన బహిరంగ సభలో ఈ క్రింది అంశాలను వక్తలు వివరించారు 1. రైతు పోరాటం - కాంగ్రెస్, 2. రైతు ఉద్యమ సామరస్యం, 3. మహిళా ఉద్యమం, 4 సంస్థాన పోరాటం.

11-6-39 న మునిపల్లె రామారావుగారి అధ్యక్షతను మునగాల రైతు సత్యాగ్రహ దినోత్సవం జరుపబడింది. అదే రోజు రాత్రి పేట బాపయ్యగారి అధ్యక్షతను శ్రీ సీతారామరాజు గ్రంథాలయ ప్రథమ వార్షికోత్సవం జరిగింది.

ఇవిగాక గోష్ఠిలో చర్చించిన వివిధ అంశాలు యిలా వున్నాయి.

1. ఫెడరేషను ప్రతిఘటించాలి.
2 రాబోయే ప్రపంచ సంగ్రామంలో భారతదేశం పాల్గొనగూడదు.
3. సంస్థానాలను పూర్తిగా రద్దు చేస్తేనే భారతదేశానికి సంపూర్ణ స్వరాజ్యం అనుభవంలోకి వచ్చును.
4. "స్వరాజ్య పోరాటం బలపడవలెనంటే రైతు, కార్మికులకు రక్షణ కలుగవలెనంటే, సంస్థానాలలోని జాగీర్దారీ విధానం, బ్రిటిషు ప్రాంతంలోని జమీందారీ విధానం, సత్వరం రద్దు కావాలి".
5. "బీదవాండ్లె వరి మీద శిస్తు వేయకుండా ధనవంతుల మీదనే శిస్తు వేస్తే బాధ్యత లేకుండా బీదలు ప్రవర్తించుకొని కార్మిక, కర్షకులకు చెందుచున్న

ప్రభుత్వమును దివాళా తీయిస్తారు గనుక యిప్పటి శిస్తు విధానాన్ని యిక ముందు కూడా శిస్తులువేసి ప్రజోపయోగ కార్యములు సాగించుట మంచిది".

6. "కార్మిక కర్షక రాజ్యం త్వరితంగా స్థాపితం కావలెనంటే ఈనాడు మన దేశంలో పెరుగుచున్న పెట్టుబడిదారీ విధానాన్ని, అందువల్లనే కలుగుచున్న దనబడు పరిశ్రమాభివృద్ధిని ఆపుచేయుట మంచిది".

**వీడ్కోలు :**

జూన్ 12 న విద్యార్థులకు వీడ్కోలు సభ జరిగింది. విద్యార్థులకు సర్టిఫికెట్లు ఇచ్చారు. సుంకర వీరభద్రరావు అధ్యక్షత వహించిరి సభలో గ్రామస్థులు, విద్యార్థులు పాల్గొన్నారు.

## ఆంధ్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ తీర్మాన భాగం

వాలంటీరు శిబిరాలు, వేసంగి పాఠశాలలను ఎలా నిర్వహించాలో, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ తీర్మానం 5 వ సెషన్ (ఈ సమావేశం ఏ తేదీన జరిగిందో వివరాలు లభ్యం కాలేదు.) తెలియ చేస్తుంది 22-3-39 నవశక్తి, 5 వ పేజీలో ప్రచురించిన తీర్మాన భాగలను ఉటకించుతున్నాము.సం.

ఈ స్కూలులో చెప్పవలసిన విషయాలు:-

## వాలంటీరు శిబిరాలు - వేసంగి పాఠశాలలు

ఈ స్కూలులో చెప్పవలసిన విషయాలు :-

1857 నుండి నేటి వరకు భారత స్వాతంత్ర్య పోరాటపు విషయాలు మాత్రము తెలియజేయాలి. ఈ ఘటనలు, దశలకు వెనుకనున్న రాజకీయ వ్యాఖ్యానంగాని, రాజకీయ తత్వం గాని చెప్పనవసరము లేదు. కార్మిక పోరాటాలు,కర్షక పోరాటాలు, ఏవిధంగా స్వాతంత్ర్య పోరాటాములో ఒక భాగమో చెప్పాలి. అంటే వాని మూలంగా బ్రిటిషు ప్రభుత్వానికి ఏ రీతిగా దెబ్బో చెప్పాలి. అంతర్జాతీయంగా కొన్ని ప్రాథమిక విషయాలు కూడా చెప్పవచ్చును.

భారత స్వాతంత్ర్య పోరాటం గూర్చి తెలిపిన పిదప ప్రస్తుతం కాంగ్రెస్ కార్యక్రమం, కరాచీ,ఫెయిజ్‌పూర్, 1937 ఫిబ్రవరి వార్ధా వర్కింగ్ కమిటీల కార్యక్రమం. ఈ కార్యక్రమములో ఏయే అంశాలు ఏయే గ్రామాలలో ఏవిధంగా అచరణలో పెట్టడానికి అవకాశముండునో. ఏ విధంగా పెట్టలో ఒక్కొక్క వ్యక్తి, అతని గ్రామమును తీసుకుచెప్పాలి. ఈ వక్తల చేత వారి గ్రామ పరిస్థితులను, అందరి సమక్షాన తెలియచేయాలి. ఆ పరిస్థితులలో బ్రిటిషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా కాంగ్రెసు కార్యక్రమము ఏవిధంగా అచరణలో పెట్టడానికి సాధ్య

మగునో మనం సూచనల నివ్వాలి. ఆ సూచనలను అచ్చట సమావేశమైన వారందరూ చర్చించాలి, అంతేగాక, ఆరీతినే మిగిలిన వారి గ్రామాలలో ఏ విధంగా చేయాలని ఉంటుందో వారే ఆలోచించుకొని రమ్మని చెప్పాలి. ఇట్టి సమస్యాపరిష్కారము, వారి ఉత్సాహ (ఇన్‌షియేటివ్) శక్తిని, ఉపన్యాస శక్తిని వృద్ధి చేయును.

సిద్ధాంత చర్చలకు ఎక్కువగా దిగకుండాజాగ్రత్త పడాలి. రాబోవు పోరాటంలో ఏ విధంగా కాంగ్రెస్ కార్యక్రమన్ని అవలంభించడానికి, అంటే పోరాటన్ని అవలంబించడానికి వీరు తమ గ్రామాలలో పూనుకోవాలో తెలియజేయాలి. ఈ పోరాటాలు ఆరంభమైన పిదప తదుపరి సమస్యలను వారి సందేహాలను పరిష్కరించడానికి సలహాలివ్వడానికి పార్టీనిర్మాణము వారితో సంబధముంచుకో గల్గియుండాలి.

ఈ సందేహములను నివారించినపుడు వారి రాజకీయ చైతన్యాన్ని, వారి అనుభవము మీదనే పెంపొందించెదము. గాంధీవాదము, తదితర వాదాలకు మధ్య గల భేదాలు మొదలగునవి, ఈ పోరాటాల అనుభవము నుండి వారు నేర్చుకొనేటట్లు చేయుగల్గుదము.

కాని ఆరంభముననే కొంత మందికి ఇట్టి సిద్ధాంతాలు సందేహాలు కలిగిన వారు, అంటే అంతర్జాతీయ చైతన్యము కలిగినవారు ఉన్నచో వారితో ఈ విషయమై కొద్దిగా చర్చించ వచ్చును. కాని వారికి కూడ ప్రాథమిక పోరాటాలను నడుపుటకు మనము తయారుచేయు యోధుల సందేహాలనుతీర్చి, కార్యరంగములో పనిచేయించు విధానము, పద్ధతుల గూర్చే ప్రధానముగా చెప్పాలి. అంటే వారి రాజకీయ చైతన్యాభివృద్ధిని, ఆచరణలో మిగిలిన వారిని కార్యరంగమునకు దింపునట్లు చేయుటకు ఉపయోగించాలి.

ఇట్టి తాలూకా శిబిరాలు నడపడానికి కావలసిన వర్కర్లను తయారు చేయడానికి ఈ క్రింది జిల్లాలలో ప్రత్యేక వేసంగి పాఠశాలలు నెలకొల్పబడవలయును.

నెల్లూరు : మే నుండి 16 జూన్ వరకు

చిత్తూరు, కడప నుండి కూడ విద్యార్థులను తీసుకొనెదరు.

రాయలసీమ :- కర్నూలు, కడప, అనంతపురం, బళ్ళారి 100 మందికి మించకూడదు.

విశాఖపట్టణము :- నూరు మందికి మించకూడదు. ఉభయగోదావరి, కృష్ణా, గుంటూరులలో ఇట్టి స్కూల్సు ఏర్పాటు చేయక పోయినను, వాలంటీరు శిబిరాలను, తాలుకా వారీగా ఏర్పరచడానికి తగినంత మంది సభ్యులు తర్ఫీదు చెందినవారు యున్నారని ఒకవేళ ఈ జిల్లాలలో కూడ అట్టి స్కూల్సు వారు

ఏర్పాటు చేసుకొంటే రాష్ట్ర పార్టీకి అభ్యంతరము లేదు. కాని, వారికి ప్రత్యేకంగా రాష్ట్ర పార్టీ ఎట్టి సహాయం చేయజాలదు.

ఈ విద్యార్థులలో ప్రధానంగా ఇచ్చట శిక్షణ పూర్తి కాగానే వెంటనే తాలు కాల వారీగా శిబిరాలు ఏర్పరచడానికి, యాక్టివ్‌గా రాజకీయాలలో పాల్గొన డానికి తయారైన వారిని ఈ వరకే రాజకీయాలలో కొంత సంబంధమున్న వారిని మాత్రము తీసుకోవాలి.

ఈ విద్యాలయాలలో అధ్యయనమునకు, నిర్మాణసమస్యలలోని అధ్యయన తరగతులలోని విషయాలు :-

కొంత మిలిటరీ డ్రిల్లు శిక్షణ కూడ ఇవ్వబడును. ఈ శిక్షణలో ప్రాథమిక శిక్షణ తాలుకాశిబిరాలలోని వారికి నేర్పుటకుకూడ వీరినందరిని తయారుచెయ్యాలి.

(ఈ వివిధ స్కూల్సుకు ఇతర రాష్ట్రాలనుండి ఎట్టి ఉపన్యాసకుడుగాని, ప్రత్యేకముగారారు. ఎవరైనా వచ్చినచో ఒక స్కూలు నుండి మరియొక స్కూలుకు ప్రయాణము చేయుదురు.

## పల్లెకోన రాజకీయ పాఠశాల

గుంటూరు జిల్లా రేపల్లె తాలూకా పల్లెకోనలో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ తీర్మానం ప్రకారం డివిజనల్ ఫిర్కా రాజకీయ పాఠశాలలలో మొట్టమొదటిదిగా పల్లెకోన ఆర్థిక రాజకీయ వేసంగి పాఠశాల నిర్వహించబడింది. 1939 మే 1 న ప్రారంభమై 15 రోజులపాటు ఈ పాఠశాల జరిగింది. తెనాలి రేపల్లె తాలుకాలోని స్వాతంత్ర్య పిపాస గల ఉత్సాహవంతులైన యువకులకు శిక్షణ ఇవ్వడానికి రేపల్లె తాలుకా కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ బాధ్యత వహించింది. ఈ పాఠశాలను నడుపడానికి గ్రామ పంచాయితీ బోర్డు అధ్యక్షులైన దేశభక్తులని రామచంద్రయ్యగారు తమ ఇల్లు ఇచ్చారు.

జిల్లా కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులు మంతెన వెంకట రాజుగారు అధ్యక్షత వహించగా జిల్లా బోర్డు అధ్యక్షుడు కల్లూరి చంద్రమౌళి (యం. యల్. ఎ. కాంగ్రెస్ నాయకులు) మే దినోత్సవాన పాఠశాలను ప్రారంభించారు. రాబోవు స్వాతంత్ర్య సమరానికి తయారు కావాలంటే ఇలాంటి రాజకీయ పాఠశాలలు అవసరం అన్నారు.

సుమారు 25 మంది విద్యార్థులు వచ్చారు. కాలేజీలలోను, హైస్కూళ్ళ లోను చదువుచున్న స్వాతంత్ర్యేచ్ఛ గలిగిన విద్యార్థి యువకులు, గ్రామంలోని బీద ప్రజల మధ్య జీవిస్తూ శ్రామిక జీవులకోసం పాటుబడే ఉద్దేశ్యం కలిగిన రైతు కూలీ యువకులు ఈ విద్యార్థులు స్వాతంత్ర్య పోరాటానికి అవసరమైన

ఆర్థిక రాజకీయ విజ్ఞానం, స్వరాజ్య సంపాదనకు ప్రధానమైన విషయాల గురించి అనుభవజ్ఞులైన ఈ క్రింది అధ్యాపకులు బోధించారు.

| అధ్యాపకులు | బోధించిన విషయాలు. |
| --- | --- |
| 1. ఓంభంపాటి సత్యనారాయణ (జూనియర్) ఎం.ఎ.,బి.ఎల్. | 1. కాంగ్రెస్ పుట్టుక పరిణామం, పోరాటాల చరిత్ర. |
| | 2. ఫెడరేషను వ్యతిరేక పోరాటం. |
| | 3. రాష్ట్ర స్వపరిపాలన-పరిశీలన. |
| | 4. త్రిపుర కాంగ్రెస్. |
| | 5. జాతీయ వాంఛా తీర్మానం. |
| | 6. అంతర్జాతీయ రాజకీయాలు. |
| 1. వావిలాల గోపాల కృష్ణయ్య | 1. రైతు ఉద్యమం-కాంగ్రెస్. |
| | 2. స్వదేశీ సంస్థానాలు-ఫెడరేషన్. |
| 3. పి. ఎ. శివయ్య | 1. అంతర్జాతీయ కార్మికోద్యమం. |
| 4. పోలెపెద్ది నరసింహమూర్తి | 1. భారతీయ కార్మికోద్యమం - కాంగ్రెస్. |
| 5. మహీధర రామమోహనరావు | 1. 1857 స్వాతంత్ర్య పోరాటం. |

ఇవిగాక మార్క్సు, లెనిన్ జీవితాలు, వారి సిద్ధాంతాలు గురించి ఉపన్యాసాలిచ్చారు. అమరవాది కృష్ణమూర్తి గారు కూడా అధ్యాపకులుగా ఉన్నారు.

పాఠశాల జరిగిన 15 రోజులు ప్రతి రోజు సాయంకాలం రాత్రులందు చుట్టుప్రక్కల గ్రామములందు, రైతు కూలీ ఉద్యమములను గురించి బహిరంగ సభలు జరుపబడెను. పాఠశాల విద్యార్థులందరు ఇతర గ్రామ యువకులతో కలిసి రైతు, కూలీ పాటలతోనూ, జాతీయ గీతములతోనూ, స్వాతంత్ర్య పోరాట నినాదములతోనూ, ఎర్రజండా జాతీయజండాలతోను ఊరేగింపులు జరిపారు. ఉపన్యాసాలు, పాటలు గ్రామాల్లోని కష్ట జీవులైన బీద రైతుల, కూలీల హృదయాలను ఆకర్షించాయి.

భారతదేశంలోని వ్యవసాయ పద్ధతులు, అభివృద్ధికి సూచలను గురించి వాడపల్లి మురహరిరావుగారు ఉపన్యసించారు.

పి. వి. కె. మూర్తి గారు డ్రిల్లు, వాలంటీరు శిక్షణనిచ్చారు.

ఈ పాఠశాలకు ఆర్గనైజింగ్ కమిటీగా పోలేపెద్ది నరసంహమూర్తి, కంఠంనేని వెంకట రత్నం, చదలవాడ పిచ్చయ్య వ్యవహరించారు.

## పామర్రు రాజకీయ వేసంగి పాఠశాల

ఈ పాఠశాల 1939 మే నెల 5 వ తారీఖున అఖిల భారత రైతు సంఘ కార్యదర్శి అయిన కామ్రేడ్ చలసాని వాసుదేవరావు గారిచే ప్రారంభించబడింది.

24 వ తేదీ వరకు కొనసాగింది. స్కూలుకు 30 మంది విద్యార్థులు, ఆరుగురు విద్యార్థినులు వచ్చారు. క్లాసులో ప్రతి రోజూ ఉదయం సాయంత్రం మొత్తం 5 గంటలు బోధించేవారు. ఉదయం 5-30 నుంచి 6-30 వరకూ కామ్రేడ్ మునుపల్లె రామారావు గారు వాలంటీరు శిక్షణ యిచ్చారు.

## పాఠ్య క్రమం :-

విద్యార్థులకు ఈ క్రింది కార్యక్రమం ప్రకారం పాఠాలు బోధించ బడ్డాయి.

1. భారత జాతీయ పోరాటాలు-కామ్రేడ్ కంభం పాటి సత్యనారాయణ గారు.
2. సంస్థానాలలో ప్రజా ఉద్యమం - కామ్రేడ్ యం. వెంకటాచారి. ఎం ఎ.
3. భారత కార్మికోద్యమం - కామ్రేడ్ తుమ్మల వెంకట్రామయ్య.
4. నాస్తికత్వము - పరిణామ వాదం - శ్రీ జి. (గోరా) రామచంద్ర రావుగారు ఎం. ఎ.
5. ఫెడరేషన్ - కామ్రేడ్ మునుపల్లె రామారావు బి. ఎ, యల్.యల్ బి.
6. కాంగ్రెసు - కిసాన్ సంఘాలు-కొమ్మారెడ్డి సత్యనారాయణ మూర్తిగారు.
7. ఫాసిస్టు, బూర్జువా, శ్రామిక, నియంతృత్వాలు - టి. గంగయ్య గారు బి.ఎ., బి.యల్.
8. 1857 స్వాతంత్ర్య పోరాటం - మహీధర రామమోహనరావుగారు.
9. సామ్యవాద సిద్ధాంతాలు-కామ్రేడ్ కె.యల్. నరసింహం. బి.ఎ.
10. రాజకీయ భూగోళ శాస్త్రం-కామ్రేడ్ ప్రతాప రామ సుబ్బయ్య.
11. రైతు ఉద్యమం - కామ్రేడ్ చలసాని వాసుదేవరావు గారు.
12. భౌతిక వాదం - కామ్రేడ్ చండ్ర రాజేశ్వర రావు.
13. రష్యా విప్లవం - యం బసవయ్య.
14. ప్రపంచ యుద్ధానంతరం రాజకీయ సంఘటనలు - టి.కె. రామస్వామి. బి.ఎ., బి.యి.డి.

ఈ పాఠశాలకు ప్రిన్సిపాల్‌గా (గద్దె) లింగయ్యగారు వ్యవహరించారు

## కాల్వబుగ్గ ఆర్థిక రాజకీయ పాఠశాల

1939 మే 20 వ తేదీ నుండి జూన్ 20 వ తేదీ వరకు కర్నూల్ జిల్లా 'కాల్వబుగ్గ' వేసంగి రాజకీయ పాఠశాల నెలరోజుల పాటు జరిగింది. కర్నూల్ జిల్లా కాంగ్రెస్, కాంగ్రెస్ సోషలిస్టు పార్టీల యాజమాన్యాన ఈ పాఠశాల నిర్వహింపబడింది. శ్రీ గాడిచర్ల హరి సర్వోత్తమరావు ప్రిన్సిపాల్‌గా వ్యవహరించారు. పాఠశాలకు చివరి వరకు హాజరైన విద్యార్థులు 64 మంది వరకు ఉన్నారు.

మద్రాసు రాష్ట్ర ప్రభుత్వ ప్రచురణ శాఖ పార్లమెంటరీ కార్యదర్శి శ్రీ మాగంటి బాపినీడు పాఠశాలకు ప్రారంభోత్సవం చేశారు.

ప్రిన్సిపాల్‌తో సహా మొత్తం 24 మంది అధ్యాపకులుగా పని చేశారు. కాంగ్రెస్ నాయకులు తదితర అధ్యాపకులుగాక, అప్పుడే వారణాశి నుండి వచ్చి సోషలిస్టు సిద్ధాంతాలను అధ్యయనం చేసిన తరిమిల నాగిరెడ్డి, విద్వాన్ విశ్వంగార్లు కూడా పాఠాలను చెప్పారు. శ్రీ తరిమిల నాగిరెడ్డి, జాతీయ మహాసభ చరిత్ర, వివిధ దేశరాజ్యాంగాలు, కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ చరిత్ర రష్యా సంస్థలు గురించి బోధించారు. విద్వాన్ విశ్వం రష్యా విప్లవ చరిత్ర, సోవియట్ రష్యా రాజ్యాంగం, అభివృద్ధి గురించి బోధించారు. ప్రముఖ కమ్యూనిస్టు నాయకులు శ్రీ యం ఖాడ్కికర్ శాస్త్రీయ సోషలిజం' చారిత్రిక, భౌతిక వాదం గురించి చెప్పారు. జలాలుద్దీన్ బుఖారీ భారతరైతు ఉద్యమం, భారత కార్మికోద్యమం, కాంగ్రెస్ - ముస్లిములు అనే వేషయాలపై ప్రసంగించారు. శ్రీ జొన్నలగడ్డ రామలింగయ్య భారతీయువజనోద్యమం, విద్యార్థి ఉద్యమం, సంస్థాన ప్రజా ఉద్యమం చైనా విప్లవ చరిత్రలను బోధించారు. శ్రీ రఘురామ గుప్త డ్రిల్లు నేర్పారు.

స్వామి వెంకటాచలం చెట్టి (కేంద్ర యం. యల్. ఎ) టేకూరు సుబ్రమణ్యం, మాగంటి బాపినీడు, పాఠశాలను సందర్శించి కొన్ని క్లాసులు తీసుకొన్నారు.

ఈ పాఠశాలలో విద్యార్థులకు చేతి పనులు గూడా నేర్పటం ఒక విశేషం. ఇచ్చటిదే దేవాలయం తోట (టెంపుల్ గార్డన్)లో చెట్లు అంటుగట్టు విధానం చూపారు. అపుడే శిక్షణ పొందిన కోడి నరసింహంగారు సబ్బుచేయు పద్ధతిని ప్రదర్శించారు.

.... ఒక రిఫరెన్సు గ్రంథాలయం అక్కడే ఏర్పరచారు. విద్యార్థులకు వక్తృత్వ పోటీలు నిర్వహించారు. వార్తాపత్రికల పఠనం ఉండేది.

....''నెల రోజుల పాటు జరిగిన ఈ వేసంగి పాఠశాల చక్కని ఫలితాన్నిచ్చింది. ఇచ్చట తయారైన యువకులే; తర్వాత రాయలసీమ జిల్లాలలో రాజకీయ సాంఘిక సేవకులై వివిధ ప్రజోద్యమాలలో హెచ్చుగా కృషి చేయుటకు పూనుకున్నారు. కాంగ్రెసు - కమ్యూనిస్టు భేదాలేమీ పాటించక, సామరస్య పూర్వకంగా ఈ వేసంగి పాఠశాలను నిర్వహించడం జరిగింది. మొత్తం మీద ఈ పాఠశాల రాయలసీమ జిల్లాలో విజ్ఞాన వ్యాప్తికిని రాజకీయ కార్య ఉత్సాహమును పెంపొందించుటకు చాలా తోడ్పడిందనవచ్చును.''

మంత్రి బెజవాడ గోపాలరెడ్డి గారు స్నాతకోపన్యాసం యిచ్చారు.

## రాజకీయ పాఠశాల హిందూపురం

5-5-39 నుండి అనంతపురం జిల్లా యువజన సంఘ యాజమాన్యమున హిందూపురంలో మరొక పాఠశాల నడుపబడింది. హిందుస్థానీ సేవాదళ పద్ధతిపై యువజనులకు శిక్షణ గూడా యివ్వబడింది. ఆచార్యరంగా, పి. సుందరయ్యలతో బాటు హరి సర్వోత్తమ రావుగారు వెళ్ళి పాఠాలు, క్లాసులు తీసుకొన్నారు. 'ఆంధ్ర ప్రభ' అప్పటి సంపాదకులైన న్యాపతి నారాయణ మూర్తిగారు ఈ తరగతులకు ప్రారంభోత్సవం గావించారు. పాఠశాల అనంతరం జరిగిన జిల్లా యువజన మహాసభలో గూడా రావుగారు పాల్గొన్నారు.

## సత్తెనపల్లి తాలుకా రాజకీయ పాఠశాల
## 11-1-1939

పై పాఠశాల గురించి దాట్ల గురవరాజు (ఆర్గనైజరు), మాదాల వీరభద్ర రావు (కార్యదర్శి) తాళ్లూరు (కోనూరు పోస్టు) ఈ క్రింది ప్రకటనను 11-1-39 నవశక్తిలో (పే. 21) ప్రచురించారు.

"మన తాలుకాలో రాజకీయ ఉద్యమంలో పని చేయుచున్న యువకులకు, పనిచేయు ఉత్సాహముగల వారికి అవసరమైన రాజకీయ విజ్ఞానమును కలుగ జేయుటే ఈ పాఠశాల నేర్పరచు యుద్దేశ్యము. మన దేశీయులు సుఖపడాలంటే బ్రిటీషు ప్రభుత్వ పరిపాలన మొదట అంతమొందాలి. నేడు స్వాతంత్ర్య ఉద్యమంలో పనిచేయుచున్న వారందరూ ప్రజా ఉద్యమాన్ని ఎలా నడిపారో, మన దేశము యొక్క ప్రత్యేక పరిస్థితులేమిటో, నేడు తారుమారగుచున్న ప్రపంచ పరిస్థితులేమిటో, నేడు తారుమారగుచున్న ప్రపంచ పరిస్థితులతో మన స్వాతంత్రోద్యమమునకు గల సంబంధమేమో, విపులంగా తెలుసుకోవాలి. మన ఉద్యమం ఏ పరిస్థితులలో ఆరంభమై నేడెంతవరకు అభివృద్ధి చెందింది, ప్రస్తుతం మనల నెదుర్కొంటున్న క్లిష్ట సమస్యలు వీటిపై మన దేశంలోని వివిధ రాజకీయ పక్షముల అభిప్రాయములు మనకు బాగా తెలియాలి.

ఇంతేగాక ప్రస్తుతం నూటికి 90 మంది ఎన్నో బాధలు పడుచున్న ఈ సమాజమునకు మారుగా ప్రజలందరు ఏకొరత లేకుండా సౌఖ్యంగా జీవితము గడపాలి; అనే ఆశయం గలిగిన సహచరులందరము సంఘం ఈ పరిస్థితికి ఎలా పరిణమించిందో, అంతా సౌఖ్య పడాలంటే, సమాజమెట్లా మారాలో, తెలిసికొని వీటి విషయమై యున్న వేర్వేరు అభిప్రాయాలు చర్చించి ఒక నిర్ణయమునకు రావాలి. అపుడే మనకందరకు ఉద్యమంలో పనిచేయుటకు అవసరమైన ప్రత్యేక దృష్టి అలవడుతుంది. ప్రజా ఉద్యమాన్ని జయప్రదంగా నడపాలంటే ఉద్యమ

పంథాను ముందుగా చూడగల్గి యుండాలి. ఈ కొలదీ రోజులలో యిందుకవసర జ్ఞానాన్ని సాధ్యమైనంత చక్కగా కలుగజేయు సుద్దేశ్యముతో ఈ క్రింది పాఠ్య క్రమమును ఏర్పరచడమైనది.

**సిలబస్ :**

1. మనదేశం బ్రిటీషు సామ్రాజ్యవాదుల దాస్యమునకు ఎలా లోనుగావలసి వచ్చిందో, ఆర్థికంగానూ, రాజకీయంగానూ భారతదేశం పొందిన మార్పులు.
2. కాంగ్రెసు పుట్టుక, జాతీయోద్యమ పరిణామము, దీనికి సంబంధించిన నిర్మాణ సమస్యలు.
3. 1857 సం॥ మొదలు నేటి వరకు ఇండియా రాజ్యాంగ విధానం యొక్క పరిణామం. 1858 ఇండియా ఆక్టు. 1861 ఇండియన్ కౌన్సిల్సు యాక్టు. 1909 మింటో మార్లే సంస్కరణలు. 1935 ఇండియా గవర్నమెంటు యాక్టు.
4. హిందూ దేశ పారిశ్రామికాభివృద్ధి.
5. కార్మికోద్యమం, అఖిల భారత ట్రేడ్ యూనియన్, ట్రేడ్ యూనియన్ ఫెడరేషన్ సంయుక్త ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్, కార్మికోద్యమము ఎడల కాంగ్రెస్ నాయకత్వం వైఖరి, కార్మికోద్యమానికి జాతీయోద్యమానికి సంబంధము.
6. అఖిల భారత రైతు ఉద్యమము. వివిధ రాష్ట్ర ఉద్యమ కేంద్రీకరణము. కాంగ్రెసు నాయకత్వ వైఖరి.
7. అఖిల భారత విద్యార్థి ఉద్యమం - జాతీయోద్యమంలో దాని భాగము.
8. వివిధ రాష్ట్రములలో వ్యవసాయ కూలీ ఉద్యమం, రైతు - వ్యవసాయ కూలీ సంయుక్త నిర్మాణ సమస్యలు.
9. యువజనోద్యమం - ప్రస్తుతం యువజన సంఘాలు చేయవలసిన పని.
10. అఖిల భారత మహిళా ఉద్యమం - వివిధ దేశాలలోని మహిళా సంఘాలు.
11. అఖిల భారత కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ పుట్టుక - కాంగ్రెస్ అతివాదులు, నేటి సోషలిస్టు ఉద్యమం.
12. సామ్రాజ్య ప్రతికూల సంయుక్త సంఘటన (యునైటెడ్ ఫ్రంట్).
13. సంస్థానములు. 1857 సం॥ పూర్వం, తర్వాత వీటి స్థితిగతులు, బ్రిటీషు సామ్రాజ్య ప్రభుత్వమునకు-సంస్థానాధీశులకు గల సంబంధం. సంస్థాపన ప్రజా ఉద్యమ విజృంభణ. కాంగ్రెస్ నాయకత్వ వైఖరి.
14. సంఘం అనాది నుంచి ప్రస్తుత పరిస్థితులకు ఎలా పరిణామం చెందింది ?

15. నేడు, ప్రజల దాస్యమునకు మూల కారణమైన సామ్రాజ్యవాదం యొక్క లక్షణాలు.

16. ప్రభుత్వం-దాని పుట్టుక. వేర్వేరు సాంఘిక వ్యవస్థలలో ప్రభుత్వముచేస్తూ వచ్చెడి పనులు. పెట్టుబడిదారీ పద్ధతిలో ప్రభుత్వం చేస్తున్న పని. సోషలిస్టు సమాజంలో ప్రభుత్వం యొక్క పని. కమ్యూనిస్టు సమాజంలో ప్రభుత్వం ఎలా కృశించిపోతుండి.

17. సంఘం యొక్క మానసిక అభివృద్ధికి, ఆర్థిక పరిస్థితులకును గల సంబంధము దానిపై కారల్ మార్క్సు అభిప్రాయములు.

18. జాతీయత - దాని లక్షణములు - యూరప్‌లోని ప్రజాతంత్రము, జాతీయ ఉద్యమాలు.

19. రష్యా వారు ప్రభుత్వ పరిపాలన - 1917 బోల్షివిక్ విప్లవం - పంచవర్ష ప్రణాళికలు, ప్రస్తుత రాజ్యాంగ విధానం, కుట్రలు - ప్రభుత్వ శిక్షలు - సోవియట్ యూనియన్ అంతర్జాతీయ వైఖరి.

20. స్పెయిన్, చైనా, పాలస్థియాన్ దేశాల ప్రజా పోరాటాలు - ఫాసిస్టు - సామ్రాజ్య వాదుల దుండగాలు.

21. ఆయాదేశ పటముల సహాయంతో ప్రపంచమందలి వివిధదేశాల రాజ్యాంగ విధానాలు - విస్తీర్ణములు. ఆర్థిక సంపత్తి, వీటి నైసర్గిక స్వరూపములు. రైళ్లు, ఓడలు మొదలైన రాకపోకల సౌకర్యాలు.

22. రైత్వారీ పద్ధతి - జమీందారీ పద్ధతి : యు. పి. బీహార్, బొంబాయి, పంజాబు, బెంగాలు, మద్రాసు రాష్ట్రములలోని ఇటీవల టెనన్సీ బిల్లులు. ప్రకాశం కమిటీ రిపోర్టు.

23. భూమి శిస్తు విధానం.

24. రాష్ట్ర స్వపరిపాలనా - కాంగ్రెసు మంత్రిత్వాలు.

25. కాంగ్రెసు మంత్రి పదవులు స్వీకరించిన వివిధ రాష్ట్రములలో మంత్రులు అసెంబ్లీ ఎన్నికల ప్రణాళికను ఎంతవరకు ఆచరణలో పెట్టగలిగారు.

26. ఫెడరేషన్ లోపాలు - దీనిని భగ్నము చేయడమెలా ?

27. భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన - ఆంధ్ర రాష్ట్ర ఉద్యమం

28. గ్రంథాలయ ఉద్యమం - వివిధ దేశ గ్రంథాలయ సంఘాలు.

29. సహకారోద్యమము.

30. పయోజన విద్య.

31. గ్రామ పంచాయతీ విధానం.

## అమరావతి వేసంగి పాఠశాల

గుంటూరు జిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ యాజమాన్యాన గుంటూరు సత్తెనపల్లి రెవెన్యూ డివిజను వేసంగి రాజకీయ పాఠశాల మే నెల 18 వ తేదీ నుంచి జూన్ 2 వ తేదీ వరకు అమరావతిలో జరిగింది.

## తూర్పు గోదావరి జిల్లా ఆర్థిక రాజకీయ పాఠశాల రాజోలు

రాజోలు డివిజన్ కాంగ్రెసు సోషలిస్టు పార్టీ యాజమాన్యమున 16 జూన్ లగాయతు 30 జూన్ వరకు 15 దినములు రాజోలు గ్రామములో జిల్లా ఆర్థికరాజకీయ పాఠశాల నడుపబడెను. అందు కామ్రేడ్స్ సి. వి. కృష్ణారావు, పి. అనంతం, సి. సూర్యనారాయణ, జి రామలింగయ్య మొదలగు వారు అధ్యాపకులుగా నున్నారు. మిలిటరీ డ్రిల్లు కూడా నేర్పబడెను.

## ఆర్థిక రాజకీయ విజ్ఞాన సంఘం

జిల్లాలో ఇలాంటి పాఠశాలలు నడుపడానికి ఈ క్రింది వారిని ''ఆర్థిక రాజకీయ విజ్ఞాన సంఘం''గా ఏర్పాటు చేశారు.

సి వి. కె రావు (కార్యదర్శి)
పుసులూరి కోదండ రామయ్య
కొరపాటి పట్టాభిరామయ్య
వెన్మత్స సూర్యనారాయణ
పి. అనంతం
రావు వెంకట జగ్గారావు
పుత్సల సత్యనారాయణ

## పామర్రు రాజకీయ వేసంగి పాఠశాల

కృష్ణా జిల్లా పామర్రు పాఠశాలకు ప్రిన్సిపాలుగా గద్దె లింగయ్య గారు వ్యవహరించారు. పాఠశాల 1939 మే నెల 6 వ తేదీన అఖిల భారత రైతు సంఘ కార్యదర్శి కామ్రేడ్ చలసాని వాసుదేవరావుగారు ప్రారంభించారు. మే 24 వ తేదీ వరకు జరిగిన ఈ పాఠశాలకు 30 మంది విద్యార్థులు, 6 గురు విద్యార్థినులు వచ్చారు. రోజుకు 5 గంటలు పాఠ్యాంశాలను బోధించేవారు. కామ్రేడ్ మునుపల్లె రామారావుగారు వాలంటీరు శిక్షణ యిచ్చారు.

## ఆధారాలు

1. 1975 డిసెంబరు కమ్యూనిజం, పేజీలు 102 - 103
2. 1975 డిసెంబరు కమ్యూనిజం, పేజీలు 44

3. సంఘం 1-9-61 పేజీలు 357
4. గుళ్లపల్లి ఆదినారాయణ పంతులు గారి షష్టిపూర్తి సన్మాన సంచిక 1972, పేజీలు 136-140
5. జి. ఓ. నెం. 955-6-5 పబ్లిక్ డిపార్టుమెంట్ 18-5-37 స్టేట్ ఆర్కైవ్స్ పత్రం.
6. జమీన్ రైతు 2-7-37
7. హిందూ 20-6-37
8. గుళ్లపల్లి ఆదినారాయణ షష్టిపూర్తి సంచిక
9. 16-7-37 హిందూస్థాన్ టయిమ్స్
10 18-7-37 బొంబాయి క్రానికల్, జవహర్‌లాల్ నెహ్రూ సెలెక్టడ్ వర్క్స్ 8వ సంపుటి 249-250 పేజీలు
11. నవశక్తి 10-5-39
12. నవశక్తి 7-6-39
13. నవశక్తి 17-5-39
14. శ్రీ సర్వోత్తమ జీవితము - మాదాల వీరభద్రరావు, పేజీ 157

# నవశక్తి

నవశక్తి వారపత్రిక మొదటి సంచిక 1937 డిసెంబర్ 15 న వెలువడింది. సంపాదకులు మద్దూరి అన్నపూర్ణయ్యగారు. కారల్ మార్క్స్ ముఖ చిత్రంతో వెలువడిన మొదటి సంచికల్లో సుత్తీ కత్తీ హత్తిన జండాపై నవశక్తి పత్రిక పేరూ, ఆ బ్లాక్ క్రింద "కార్మిక కర్షకులారా! ఏకము గండు!!" అనే నినాదం వున్నాయి. పత్రికకు స్వాగతం పలికిన వారిలో అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షుడు జవహర్ లాల్ నెహ్రూ, అఖిల భారత కాంగ్రెసు సోషలిస్టు పార్టీ కార్యదర్శి జయప్రకాశ్‌నారాయణ, అఖిల భారత కిసాన్ సంఘాధ్యక్షుడు ఆచార్య రంగా, కాంగ్రెసు సోషలిస్టు నాయకురాలు కమలాదేవి ఛటోపాధ్యాయ, ఆంధ్ర కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ కార్యదర్శి పుచ్చలపల్లి సుందరయ్య, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘం సంయుక్త కార్యదర్శి, ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘం అధ్యక్షులైన కొమ్మారెడ్డి సత్యనారాయణ, ఆంధ్ర యువజన సంఘ కార్యదర్శి అల్లూరి సత్యనారాయణ, రాజమండ్రి తాలూకా కాంగ్రెసు అధ్యక్షులు మార్ని సుబ్బారావు, డాక్టరు కొమర్రాజు అచ్చమాంబ, తూర్పు కృష్ణా జిల్లా మహిళా సంఘాధ్యక్షురాలు వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ ప్రజాబంధు - చిత్రగుప్త సంపాదకులు యన్.జి. ఆచార్య ఉన్నారు.

మద్దూరి అన్నపూర్ణయ్యగారి సంతకంతో వెలువడిన సంపాదకీయంలో పత్రిక ఉద్దేశ్యాలను ఇలా వివరించారు.

"నవశక్తి యొక్క ఉద్దేశ్యం నవశక్తిని రేకెత్తించడమే. స్తబ్దుల్లాగ పడియున్న జనానికి చైతన్యం కల్పించడానికి నడుము కడుతుంది. సోషలిస్టు విధానాన్ని ఆమోదిస్తుంది. కాంగ్రెసుయొక్క స్వాతంత్ర్య పోరాటాన్ని బలపరుస్తుంది. సామ్రాజ్యవాదాన్ని చీల్చి చెండాడ యత్నించు సకల ప్రయత్నాలకు సాయపడుతుంది. కాంగ్రెసు మహా సంస్థను బలపరచడానికి, కాంగ్రెసు కార్యక్రమాన్ని తీవ్రతరం చేయడానికి కంకణం కట్టుకుంది.

"స్వాతంత్ర్యాన్ని సంపాదించాలంటే విప్లవ శక్తులు, కార్మిక, కర్షక, స్త్రీ, విద్యార్థి యువజనంబులే విప్లవ శక్తులకు మూర్తులు."

పత్రిక లక్ష్యాలను ఇలా వివరించిన తర్వాత కాంగ్రెసు మంత్రివర్గాలపట్ల వైఖరిని అన్నపూర్ణయ్యగారిలా వివరించారు:

"కాంగ్రెసు పార్లమెంటరీ కార్యక్రమానికి మేము విరోధులము కాము. మంత్రి పదవి స్వీకారాన్ని మేము ప్రతిఘటించినా కాంగ్రెసు మహాసభ యొక్క నిర్ణయానికి బద్ధులము. మంత్రివర్గముల కార్యకలాపాన్ని కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికను బట్టియే కాంగ్రెసు మంత్రి వర్గాలను బలపరచడమే మా యుద్దేశము కాని కాంగ్రెసు ఎన్నికల కరపత్రమునకు విరుద్ధముగా వారు వెళ్ళి వక్ర మార్గము బట్టినపుడు స్నేహపూర్వక విమర్శచే వారిని దిద్దుటకు వెనుదీయము. అట్లు వెనుదీయుట భావదాస్యమనిపించుకొనును. భావదాస్యము కంటే వేరు పురుగు లేదని మా విశ్వాసము."

నవశక్తి పత్రికకు అన్నపూర్ణయ్యగారు వ్యక్తిగత హోదాలో డిక్లరేషన్ తీసుకొన్నారు. దానిని ఆనాటి కాంగ్రెసు సోషలిస్టు పార్టీ అధికార పత్రికగా నడపాలని నిర్ణయానికి వచ్చి అన్నపూర్ణయ్యగారితో అవగాహనకు వచ్చింది పార్టీ. సుందరయ్యగారు పంపిన సందేశ వాక్యాలలో అది స్పష్టమవుతుంది. ఆయన ఇలా రాశారు.

.... "కూలీల యొక్క రైతుల యొక్క ఆర్థిక రాజకీయ హక్కుల కొరకు జరిగే పోరాటాలను, మన స్వాతంత్ర్య పోరాట భాగములేననియు మన పౌరసత్వ హక్కులకు జరిగే పోరాటపు భాగములేననియు ప్రతి సోషలిస్టు పత్రిక ప్రజలకు తెలియజేయాలి. దాని కొరకు సంయుక్త పోరాటము, ఏ విధంగా అభివృద్ధి చెందుతూ ఉన్నదో పత్రిక చిత్రిస్తూ వుండాలి. కార్మిక కర్షకులను, వారి పోరాటముల ద్వారా, జాతీయ పోరాటములో పాల్గొనుటకు దారి చూపాలి. ప్రజాతంత్ర జాతీయ దృక్పథాలతో పాల్గొనే తదితర వర్గాలకు కార్మిక కర్షక పోరాటాలలో పాల్గొనుటకు దారి చూపాలి

"ఈ విధంగా ఐక్య సంఘటనను కాంగ్రెసును జాతీయ ఐక్య సంఘటనగా మార్చటానికి కావలసిన విధానమును పోరాటాన్ని చూపిస్తూ కార్మిక కర్షక వర్గములోని పురోగాములకు రాజకీయ ప్రబోధము రాజకీయ చైతన్యం కల్గిస్తూ వారి నాయకత్వమును ధృఢతరము మొనర్చడానికి నవశక్తి నూతన పంథాను ఆంధ్ర రాష్ట్రమున చూపుగాక! ఈ మార్గమును త్రొక్కినప్పుడు నేడు కాంగ్రెస్ నాయకత్వంలోని మితవాద ధోరణిని అతివాదులపైన సోషలిస్టులపైన దాడిని నిర్భయంగా నిర్మొహమాటంగా ఎత్తి చూపుగాక!

"ఆంధ్ర దేశానికి సమభావాలను, నవ్యమార్గాలను చూపే నవశక్తిని యువజనులు, విద్యార్థులు, కార్మిక, కర్షకులు తగిన ఆదరణ అభిమానము చూపాలి

"నవశక్తి మన జాతీయ ఆర్థిక పోరాటాన్ని వృద్ధినొందించుగాక"

కొమ్మారెడ్డి సత్యనారాయణ మూర్తిగారు కూడ "నేటి ప్రధాన రాజకీయ నినాదమైన జాతీయైక్యసంఘటనకై 'నవశక్తి' పాటుబడును గాక!" అని సందేశ మిచ్చారు.

14-12-33 న నవశక్తి రెండవ సంవత్సరములో అడుగు పెట్టింది. ఆనాడు వెలువడిన రెండవ సంపుటి మొదటి సంచికలో "స్వవిషయం" పేర రాసిన సంపాదకీయంలో సంవత్సర కాలం "నవశక్తి"ని నడిపిన తీరును సింహావలోకనం గావించింది.

మొదటి 6 నెలల్లో స్త్రీ సమస్యలు, విద్యార్థి పోరాటాలు, కార్మిక కర్షక సమస్యలు, విదేశాలలోని పరిస్థితులను గురించి ముఖ్యంగా రష్యా, స్పెయిన్, చైనా, జపానుల గురించిన వ్యాసాలు అందజేశామని సంపాదకీయం తెలియజేసింది. అలాగే పత్రిక ఆరంభం నుండి "నేటి ప్రపంచం" ద్వారా వారం వారం ప్రపంచ పరిణామాన్ని తెలియచేయడానికి ప్రత్యేక కృషిచేసి సఫలీకృతమైనట్లు తెలియజేసింది. అయితే, వివిధ రంగాలలోని పోరాటాలను, దేశంలోని రాజకీయ వాతావరణాన్ని ఘటనలను సమగ్రంగా నవశక్తి ప్రతిబింబించలేకపోయిందని, దానికి కారణం తగినంత స్థలం లేకపోవడమనీ, అందుచేతనే పత్రికను 16 నుండి 24 పేజీలకు పెంచామనీ సంపాదకీయం తెలియ చేసింది.

పార్టీ దృక్పథాన్ని తెలియజేస్తూ, చిన్న వ్యాఖ్యలతో మిళితంచేసి "కార్మిక సమస్యలు", "రైతు లోకం" "నేటి ప్రపంచం" అనే శీర్షికలు, అలాగే వివిధ సంఘాల వార్తలకు ఒక పేజీ, లేఖలకు ఒకే పేజీ ఇస్తూ వచ్చినా కార్మిక కర్షక పోరాటాలను గూర్చి, సమస్యలను గూర్చి ఘటనలకు తగినన్ని ప్రత్యేక వ్యాసాలు ప్రకటించలేదనీ, వివిధ రంగాలలో పని చేసేవారు రిపోర్టులు ఇంకా ఎక్కువ పంపితే ఈ లోపం తొలగించబడుతుందని సంపాదకీయం తెలియచేసింది.

రెండో 6 నెలల కాలంలో పత్రికను సమీక్షిస్తూ సంపాదకీయం ఇలా తెలియజేసింది. విద్యార్థి సమస్యలపై నెలకొక వ్యాసం చొప్పున ప్రకటించబడింది. స్త్రీ సమస్యలు, ఉద్యమం గురించి ఏమీ ప్రకటించలేదనే చెప్పాలి. స్వదేశ సంస్థానాల ప్రజా పోరాటం విజృంభించిన కొలదీ ప్రతి వారం ఒకటి రెండు పేజీలు ప్రత్యేకించబడ్డాయి కథ తప్పకుండా ప్రచురించబడింది. కొంతవరకు వర్గ దృక్పథంతో కూడిన విమర్శనలతో గ్రంథావలోకనం వచ్చింది.

ప్రజా రంగాల్లో పనిచేసేవారు తమ అనుభవాలు తెలియచేస్తేగాని సమకాలీన ఘటనల గురించిన వ్యాసాలు, రాజకీయ వ్యాసాలు తగినంతగా రాని లోపం తీరదని సంపాదకీయం రాసింది. వివిధ రంగాలలో జాతీయ, అంతర్జాతీయ రాజకీయాలకు తామెలా స్పందించేదీ కార్యకర్తలు రాయాలని పేర్కొంది.

పత్రికను మరింత ఆకర్షవంతం చేయడానికి వీరుల చరిత్రలివ్వడానికి ప్రయత్నించినా విఫలమయ్యామని సంపాదకీయం రాసింది. రష్యాను గురించి సమగ్రంగా తెలియచేసే రష్యా సంచికను ప్రకటించిన విషయం తెలియజేసింది.

ఫోటోల విషయంలో వ్యక్తులవి చాలా వేసినా, ప్రజా సంరంభం, ప్రజా పోరాట దృశ్యాల గురించి వేయడం లేదని, అలా వేసినవి కూడ ఇతర రాష్ట్రాలవని, తెలియజేసింది. విదేశీ రాజకీయాల పైన, అఖిల భారత సమస్యల పైన ఇతర పత్రికల నుండి సేకరించిన కార్టూన్‌లను వేశాం కాని ఆంధ్రా సమస్యలపై కార్టూన్లను వేయలేక పోయామని, మ్యాపులు కూడ విరివిగా వేయనందున విదేశీ రాజకీయాల గురించి రాసిన వ్యాసాలు పాఠకులకు పూర్తి లాభం కల్గించలేక పోయాయని సంపాదకీయం రాసింది.

కాంగ్రెస్‌లో వున్న కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ నాయకులపై డిస్ప్లినరీ చర్యలు, కాశిపట్టణ రైతు సమస్య, పౌరసత్యా హక్కులుగురించి మినహా పత్రిక ఆందోళనకుగాని పోరాటానికి గాని అంకురార్పణ చేయలేదనీ, పెంపొందించ లేదనీ ఆత్మవిమర్శ చేసుకుంది "పార్టీ పత్రిక ప్రజా పోరాటాలకు, ఆందోళనకు, అంకురార్పణ చేయాలి. వానిని ప్రతిబింబింప జేయాలి. పెంపొందించాలి. నడపాలి. పార్టీ పత్రికకు ఉండవలసిన ఈ ప్రధానలక్ష్యము నవశక్తికి వచ్చినదా అంటే ఇంకనూ రాలేదనియే చెప్పాలి.''

పత్రికాభివృద్ధికి పాఠకులు వ్యాసాలు, రిపోర్టులు మాత్రమే గాక విమర్శనలు కూడా పంపాలని సంపాదకీయం కోరింది.

నవశక్తి వారపత్రిక అయినా దిన పత్రికవలె వార్తలను తెలియజేసే పత్రికగా కూడా ఉండవలసి వస్తుందని చెబుతూ "నవశక్తి కేవలం వార్తా పత్రికగా ఉండజాలదు. కేవలం కార్మికుల పత్రికగా ఉండజాలదు. ఈ రెండు పత్రికల లక్షణాలు కలిగి, పార్టీ పత్రికగాకూడా ఉండవలసి వస్తున్నది''అని కర్తవ్యభారాన్ని తెలియజేసింది. ''కార్మిక కర్షక వార్తల రెంటిని వార్తాపత్రికవలె సమగ్రంగా ఇస్తూ రాజకీయ వ్యాసాలనుకూడా విరివిగా ఉండాలంటే ఒక వారపత్రికకు అలవికాని పని'' అని స్పష్టంచేసింది.

''అందుచే నవశక్తి ఒక వారపత్రికకు అలవికాని పని చేయవలసివస్తున్నదని గత సంవత్సరం రెండు వేల రూపాయలు ఖర్చయిందనీ, పత్రిక తన ఆదర్శాన్ని చేరగల్గుటకు కావలసినంత మరింత హెచ్చు సాయమునుకూడా పాఠకులు, పార్టీ సభ్యులు చేస్తారని ఆశిస్తూ సంపాదకీయం ముగించబడింది.

''నవశక్తి'' మొదటి సంవత్సరం 48 సంచికలు వెలువడ్డాయి. 1939 లో 38 సంచికలు వెలువడ్డాయి. యుద్ధం రావడంతో 1939 సెప్టెంబరు 6 వ సంచిక తర్వాత పత్రిక నిలిపివేయబడింది.

1943 జూలై 8 నుండి 15 వ తేదీవరకు జరిగిన ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీ 3 వ మహాసభ (బెజవాడ) ఆమోదించిన రిపోర్టులు - తీర్మానాలలో "నవశక్తి" గురించిన ప్రస్తావన ఉంది. జాతీయ ఐక్య సంఘటన రోజులు (1939 కాన్ఫరెన్సు) వరకు చేసిన సమీక్ష తీర్మానంలో ''నవశక్తి'' గురించి రాసిన విషయాలు ఇలా ఉన్నాయి.

"1937 డిసెంబరులో నవశక్తి పార్టీ పత్రికగా స్థాపించబడింది. పార్టీ చరిత్రలో ఇది ముఖ్య ఘట్టం. వివిధ రంగాలలో అభివృద్ధి అవుతూ వున్న ప్రజా ఉద్యమాలను ఎప్పటికప్పుడు నడుపుట, జాతీయైక్య సంఘటనా నినాదాలను రాష్ట్ర పరిస్థితులకు అన్వయింప జేసి, వాటి ననుసరించి కామ్రేడ్స్ చేత ప్రజా రంగాల్లో పని జేయించుట, పార్టీ సభ్యుల మార్క్సిస్టు సిద్ధాంత పరిజ్ఞానమును దృఢపర్చుట- ఈ సమస్యలు పార్టీని ఎదుర్కొన్నాయి. వీటిని పరిష్కరించడానికి "నవశక్తి" స్థాపించబడింది. 2000, 2500 ప్రతులు అచ్చు వేయబడుతూ వుండేది.''

జాతీయైక్య సంఘటన రోజులు (1938 నాటి పార్టీ కాన్ఫరెన్సు నుండి సామ్రాజ్యవాద యుద్ధ ప్రారంభం వరకు) అనే శీర్షిక క్రింద ''నవశక్తి''ని గురించి ఇలా వుంది.

''నవశక్తి ప్రచారం:- జాతీయైక్య సంఘటనా నినాదాలను రాష్ట్ర పరిస్థితులకు అన్వయింప జేస్తూ అంతర్జాతీయ, జాతీయ పరిస్థితులను ఎప్పటికప్పుడు పార్టీ సభ్యులకు విశదీకరించుతూ వుండడం వలన "నవశక్తి" పార్టీ సభ్యులలో రాజకీయ ఐక్యత నెలకొల్పగల్గింది. కమ్యూనిస్టు దృక్పథంతో పత్రిక నడుప బడుట వలన పార్టీ సభ్యులలో ప్రారంభం నుండి సరియైన జాతీయ, అంతర్జాతీయ దృక్పథం పార్టీ సభ్యులకు అలవడింది. దీని వలన త్రిపుర కాంగ్రెస్ అప్పుడు అతివాద జాతీయ దృక్పథానికి లోబడి పోలేదు. అందువలన ఫార్వర్డు బ్లాకు నిర్మాణమునకు రాష్ట్రంలో అవకాశం లేకుండా పోయింది. కాని బోస్ చేసే విచ్ఛిన్న ప్రయత్నాలను కేంద్ర పార్టీ వ్యతిరేకించేటప్పుడు పార్టీ సభ్యులలో చాలా అసంతృప్తి వచ్చింది. అందుకు కారణం మనలో యింకా తీవ్ర జాతీయ వాద చిహ్నాలు దాగి వుండడమే. అయినప్పటికి పార్టీ ఎడల వుండే భక్తి ఎట్టి చీలికలు కలుగకుండా ఆపగల్గింది. అంతర్జాతీయ దృక్పథం బాగా అబ్బడం వలన సోవియట్ యూనియన్ అంటేను, ప్రపంచ ప్రజల స్వాతంత్ర్య పోరాటమంటేను, అకుంఠిత విశ్వాసం ఏర్పడింది. ముఖ్యంగా ఫాసిస్టు వ్యతిరేకతత్వం బాగా ఏర్పడింది.

పార్టీ సభ్యుల సిద్ధాంత పరిజ్ఞానం పెంపొందించడానికి కూడా ''నవశక్తి'' ప్రత్యేక కృషి చేసింది. నవంబరు సంచిక, త్రిపురీ, మేడే సంచికలు యిప్పటికి గూడా పార్టీ సభ్యులకు రెఫరెన్సు పుస్తకాలుగా వున్నాయి.

పార్టీ సభ్యులలోనే గాక, జనరల్‌గా యువకుల్లో అతివాద భావాలు, సోష లిస్టు భావాలు తీవ్ర మవడానికి ఎంతేని "నవశక్తి" తోడ్పడింది. రాష్ట్రంలోని యువకులలో రాజకీయ స్థాయి పెచ్చించడానికి బాగా తోడ్పడింది.

పార్టీ నిర్మాతగా మాత్రం "నవశక్తి" విఫలమైంది. ప్రజా ఉద్యమాన్ని నిర్మించడానికి అభివృద్ధి పరచడానికి, తోడ్పడజాలక పోయింది.''

మార్క్సిస్టు కమ్యూనిస్టు పార్టీ (సి. పి. యమ్) ఇటీవలి కాలంలో ప్రచు రిస్తూ వచ్చిన "ప్రజాశక్తి" 1972 ఆగస్టు 15 వ తేదీ సంచికలో "తెలుగు దేశంలో కమ్యూనిస్టు పార్టీ నిర్వహించిన పత్రికల పుట్టు పూర్వోత్తరాలు" అనే వ్యాసంలోని ''నవశక్తి''కి సంబంధించిన భాగాలను పొందు పరుస్తున్నాము.

''....కమ్యూనిస్టు పత్రికగా ఆంధ్ర దేశంలో మొట్టమొదటి సారిగా ప్రచు రింపబడిన పత్రిక నవశక్తి. ఆకాలంలో కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలో అంతర్గతమై వుండేది 1937 డిసెంబరు 15 వ తేదీన రాజమండ్రి నుండి నవశక్తి వారపత్రిక ప్రచురణ ప్రారంభమైంది. కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ నాయకులలో ఒకరైన మద్దూరి అన్నపూర్ణయ్యగారు సంపాదకులుగా డిక్లరేషన్ తీసుకొన్న ఈ పత్రికను కమ్యూనిస్టు పార్టీ ఆధ్వర్యాన నడుపుకోడానికి ఆయన అంగీకరించారు.''

"కొన్నాళ్లు రాజమండ్రి నుండి నడిచిన తర్వాత నవశక్తి వారపత్రిక విజయవాడ నుండి వెలువడటం ప్రారంభమైంది. ద్వితీయ ప్రపంచ యుద్ధం వరకూ ఈ పత్రిక నిర్విఘ్నంగా నడిచింది. రాజమండ్రిలో వుండగా ఈ సంపాద కత్వ బాధ్యతను శ్రీ మద్దుకూరి చంద్రశేఖర రావు, శ్రీ తుమ్మల వెంకట్రామయ్య నిర్వహించారు.

''నవశక్తి ఆంధ్ర దేశంలో కమ్యూనిస్టు ఉద్యమాన్ని నిర్మించడంలో ప్రముఖమైన పాత్రను నిర్వహించింది. లెనిన్ మహాశయుని మాటల్లో చెప్పాలంటే ఆనాడు 'నవశక్తి' ఉద్యమ నిర్మాతగా వ్యవహరించ గలిగినదంటే అతిశయోక్తి కాదు. పేరుకు కాంగ్రెసు సోషలిస్టు పార్టీ అయినా వాస్తవంలో అది కమ్యూనిస్టు పార్టీగానే పని చేసినందున అది అచ్చంగా కమ్యూనిస్టు పత్రికగానే నడిచింది. పత్రికకు సంపాదక వర్గంగా మద్దుకూరి చంద్రశేఖరరావు (సంపాదకుడు) కంభం పాటి సత్యనారాయణ, పుచ్చలపల్లి సుందరయ్య, తుమ్మల వెంకట్రామయ్యగార్లు వుండేవారు.

''మొదటి తెలుగు కమ్యూనిస్టు పత్రికగా 'నవశక్తి' ఆంధ్రదేశంలో యువజనులను కమ్యూనిస్టు భావాల వైపుకు ఆకర్షించడంలోనూ, కార్మిక, కర్షక, ఉద్యమాలను నిర్మించి, నిర్వహించడంలోనూ గణనీయమైన పాత్ర నిర్వహిం

చించి. 'నవశక్తి' త్రిపురీ కాంగ్రెసు సంచిక భారత జాతీయోద్యమాన్ని మార్క్సిస్టు దృక్పథంతో సింహావలోకనం చేసింది. అలాగే నవశక్తి రష్యా సంచిక ప్రథమ సోషలిస్టు రాజ్యమైన సోవియట్ యూనియన్ వివిధ రంగాల్లో సాధించిన రాజకీయాలను వివరించిన అనేక వ్యాసాలను ప్రచురించి సోషలిస్టు రాజ్యంలో ప్రజలు ఎలా అభివృద్ధి చెందుతారో తెలుగు ప్రజలకు తెలపడంలో ఎంతగానో ఉపయోగపడింది.

నవశక్తి ప్రచురించిన ఈ రెండు సంచికలు ఆశేష ప్రజల ప్రశంసలను పొందాయి.

## ప్లాను ప్రకారం నిలిపివేత

"ఆనాడు పార్టీతీసుకొన్న సామ్రాజ్యవాద యుద్ధ వ్యతిరేక పాలసీ దృష్ట్యా యుద్ధం ఆరంభం కాగానే ఇంక పత్రికను ప్రభుత్వం సహించదన్న విషయం పార్టీ నాయకత్వం గ్రహించింది. అందువలన యుద్ధం ప్రారంభం కాగానే ప్రజలు నిర్వహించవలసిన కర్తవ్యాలను ప్రబోధించుతూ ఆఖరి సంచికను ప్రచురించి పత్రిక ప్రచురణను నిలిపి వేశారు. పార్టీనాయకులతో సహా పత్రికా సంపాదకులు కూడా అజ్ఞాతవాసానికి వెళ్ళి పోయారు. ఆవిధంగా పత్రికను నిషేధించే అవకాశం ప్రభుత్వానికి యివ్వకుండా జాగ్రత్త పడ్డారు. పత్రికకు సంబంధించిన ప్రెస్ వగైరాలను వశపరచుకోకుండా ముందు జాగ్రత్త పడ్డారు. ఆనాడు ఉమ్మడి మద్రాసు ముఖ్యమంత్రిగా వున్న పచ్చి కమ్యూనిస్టు వ్యతిరేకి శ్రీ రాజగోపాలా చారి నవశక్తిపై చర్యతీసుకోడానికి తనకు అవకాశం చిక్కలేదనే అక్కసుతో "సుందరయ్య నన్ను బోల్తా కొట్టించాడు" అని సన్నిహితుల వద్ద రిమార్కు చేశాడు.

## నవశక్తి–రష్యా సంచికకు ప్రశంసలు

1938 లో ప్రచురించిన "రష్యా సంచిక"ను పలు పత్రికలు ప్రశంసించాయి. వాటిని ఇక్కడ పొందుపరుస్తున్నాము:-

**ఆంధ్ర వారపత్రిక :-** రష్యా సాహిత్యమంతా ఈ ఒక్క సంచికలో సంగ్రహ రూపంలోనే అయినా సమగ్రంగా నిరూపింపబడింది. ఆ ఉద్యమ చరిత్రను ప్రజల్లో ప్రబోధం చేయడానికి రచయితలందరూ తమ సర్వశక్తులూ వినియోగించి చక్కటి వ్యాసాలు ప్రచురించినారు.... కొత్తవారికి కూడా ఇది చాలా ఉపకరిస్తూందనడానికి ఆక్షేపణ లేదు. సంపాదకుల శ్రమ ఏవిధంగానూ వృధాకాలేదు. అందుకు వారిని అభినందిస్తున్నాము.

**ప్రజాబంధు :-** ఈ రష్యా సంచిక ద్వారా ఆంధ్ర పాఠకలోకానికి, ఆంధ్ర పారిశ్రామిక లోకానికి నవశక్తి సేవ చేస్తున్నది. దానితో .... చక్కని

వ్యాసాలేగాక రష్యాలో స్వయంగా పర్యటన చేసివచ్చిన లక్ష్మణరావు దంపతుల ఉత్తమోత్తమ వ్యాసాలు కూడా వున్నాయి. ఇన్ని పేజీలు వేసి, ప్రముఖుల వ్యాసాలను ఇన్నింటినీ నాల్గు అణాలకే ఆంధ్రులకు సమర్పించి సందులకు కామ్రేడ్లుకు అభివందనాలు.

వాహిని :- నవశక్తి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సోషలిస్టు పార్టీపత్రికగా ప్రజానీకంలో అద్భుత ప్రచారాన్ని చేస్తూవుంది. సరిగా సంవత్సరమైనా కాలేదు. కొన్ని సంవత్సరాలనుండీ వస్తూ ఉన్న పత్రికలాగా ప్రత్యేక సంచికను ప్రచురించారు.

సంచిక చక్కగా ఉన్నది "100 పేజీలు" వేస్తాం అని వారు ప్రకటించినప్పుడే ఆశ్చర్యం కల్గింది. సామ్యవాద పత్రికలకు ప్రకటనలు కూడా ఇవ్వరే అని భయం మాకు కల్గింది. 156 పేజీలు చూచేసరికి నిర్వాహకులను ఎలా అభినందించాలో కూడా తెలియదు. ఇందులోని వ్యాసాలు రష్యా జీవితాన్ని ప్రతిబింబింప చేస్తూ ఉన్నవి. రష్యాను గురించి తెలుసుకోవాలంటే ఈ సంచిక చదివితే చాలు.

ప్రజామిత్ర :- ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ పక్షాన్న అపూర్వ ప్రచారమూ, ఆ విధంగా దేశసేవ చేస్తూ వున్న నవశక్తి పత్రిక అమూల్యమైన ఈ ప్రత్యేక సంచికను ప్రకటించడం ఆంధ్రావనికి గొప్ప ఉపకారము. ..

ఈ రష్యా సంచిక రాజకీయ ప్రియులకు మంచి పరిపుష్టి నివ్వడంలోనూ, యువజనాళిని ఉద్రూతలూగించడంలోనూ సందేహంలేదు.

## జోషి సందేశం

త్రిపురీ సంచికకు ఆనాటి భారత కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి పి.సి. జోషి సందేశమిస్తూ "నవశక్తి"ని గురించి ఇలా ప్రశంసించారు.

"ఆర్థిక సహాయం ఏమీ లేకుండానే మీరు నవశక్తిని తీసుకువచ్చారు. మీ మీ చుట్టూవున్న ప్రజల విశ్వాసాన్ని మీరు సంపాదించుట చేత 'నవశక్తి' బ్రతకగల్గింది. మీ వికాసం, వృద్ధి అవుతున్న పరిపక్వతా, నవశక్తిని గొప్ప సోషలిస్టు వార పత్రికలలో ఒకటిగా కావించింది. ఉదాహరణకు మీ "రష్యా సంచిక" ఉన్నత శ్రేణిలో చేరుతుంది. నవశక్తి బాగావుంది. మేం కోరేదేమంటే అది తన రికార్డును తానే మించి, ఇంకా బాగా కావాలని "నవశక్తి" సోషలిస్టు పార్టీ పత్రిక. ఇది పార్టీని సంఘటిత పరిచేదిగాను, బోధించేదిగాను తయారు కావాలి. నవశక్తి ప్రతి ఒక్క కామ్రేడునూ ఉత్సాహపరచాలి." (1-3-39) (త్రిపురీ సంచిక 8-3-39 న వెలువడింది.)

# రష్యా సంచిక విశేషాలు

రష్యా సంచిక విశేషాలేమిటి? రష్యన్ విప్లవానంతరం రెండు దశాబ్దాలలో సోవియట్ యూనియన్ వివిధ రంగాలలో సాధించిన ప్రగతిని ప్రముఖ రచయితలు తమ వ్యాసాలలో సమీక్షించారు. "రష్యా విప్లవ చరిత్ర" గురించి "చంద్రం" (మద్దుకూరి చంద్రశేఖరరావు) సమిష్టి వ్యవసాయ క్షేత్రం గురించి డాక్టర్ ఉప్పల లక్ష్మణరావు, మెల్లీ షోలింగర్ లక్ష్మణరావు సోవియట్ యూనియన్‌లో వివిధ జాతుల సమ్మేళనం గురించి పుచ్చలపల్లి సుందరయ్య కర్షకుడు నాడు - నేడు గురించి కంభంపాటి సత్యనారాయణ, ఎం.ఎ. (సీనియర్) ఆదర్శ ప్రాయమైన విద్యా విధానం గురించి చలసాని వాసుదేవ రావు, సోవియట్ యువ జనోద్యమం గురించి చండ్ర రాజేశ్వరరావు, సోవియట్ యూనియన్‌లో పారిశ్రామికాభివృద్ధిని గురించి పి. (పోలేపెద్ది) నరసింహమూర్తి, రెడ్ ఆర్మీని గురించి కంభంపాటి సత్యనారాయణ, సోవియట్ సైనిక బలగం గురించి డా॥ ఉప్పల లక్ష్మణరావు, మెల్లీ షోలింగర్ లక్ష్మణరావు, సోవియట్ మహిళామణులు గురించి గారపాటి సత్యనారాయణ, సోవియట్ విదేశ రాజనీతి, ప్రపంచ శాంతి గురించి కంభంపాటి సత్యనారాయణ, బి. ఎ. (ఆనర్స్) బి. యల్. (జూనియర్) సోవియట్‌లో ఆరోగ్య రక్షణ గురించి పి. అనంతం, కాళరాత్రి అనే రష్యన్ కథ (మైకేల్ జెజోష్‌ంకో) రష్యా కమ్యూనిస్టు పార్టీ చరిత్ర, సోవియట్ రాజ్యాంగ నిర్మాణం, (ఈ రెండింటి వ్యాసకర్తల పేర్లు లేవు. సంపాదక వర్గ సభ్యులు రాశారు. తు॥ నెం. సోవియట్ కోర్టులు జైళ్ళు గురించి దర్శి చెంచయ్య, సైన్సు విజ్ఞానము గురించి కె.యల్. నరసింహం బి.ఎ. పబ్లిక్ ఫైనాన్సు, కరెన్సీ గురించి నండూరి ప్రసాదరావు సోవియట్ సోషలిస్టు ఆర్థిక నిర్మాణం గురించి తనికెళ్ళ వెంకట చలపతి, లలిత కళల గురించి కొండేపూడి లక్ష్మీనారాయణ, కార్మికోద్యమం గురించి పిల్లలమర్రి వెంకటేశ్వర్లు, ప్రపంచానికి వెలుగునిచ్చే సోవియట్ సాహిత్యం గురించి తుమ్మల వెంకటరామయ్య సందేహాలు- సమాధానాలు శీర్షికతో పి వి. శివయ్య. బి.యన్.సి. గార్ల వ్యాసాలున్నాయి.

"ఇదిగో అధికారం! స్వీకరించండి" అంటూ ప్రజలను ఉద్బోధిస్తున్న లెనిన్, "నూతన రాజ్యాంగ ప్రతిష్ఠాంత స్టాలిన్" అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి డిమిట్రావ్ ఫొటోలే గాక వివిధ రిపబ్లిక్‌ల చిత్రాలు (వీటిలో ఆ రిపబ్లిక్ లోని ప్రజలను, రాజధానిని సూచించే పటము ఉన్నాయి.) బెలాయుయిట్స్ చిత్రించిన పారిస్ కమ్యూన్ చిత్రం, వివిధ రిపబ్లికుల జెండాలు, ఆయా వ్యాసాలకు సంబంధించిన ఫోటోలు ఉన్నాయి. ఈ సంచిక 1938 నవంబరు 7 న వెలువడింది.

## త్రిపురీ సంచిక విశేషాలు

1939 మార్చి 8 న వెలువడ్డ 'త్రిపురీ సంచిక'కు అంతా సంపాదక వర్గ సభ్యులే వ్యాసాలు సమకూర్చారు. వ్యాస రచయితల పేరు వేసికి వెయ్యలేదు. భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రను ఈ సంచిక ప్రతిబింబించుతుంది సుభాష్ చంద్రబోస్ జీవితం, పి.సి. జోషి సందేశం తర్వాత ఈ క్రింది వ్యాసాలున్నాయి.

1. ప్రథమ భారత స్వాతంత్ర్య సమరము. 2. భారతీయ పెట్టుబడి కాభివృద్ధి భారత జాతీయ కాంగ్రెసు. 3. టెర్రరిస్టు ఉద్యమ ప్రారంభము 4. యుద్ధ కాలంలో భారత విప్లవోద్యమం. 5. రైతుల తిరుగుబాట్లు: సంఘటిత రైతు ఉద్యమ ప్రారంభ దశ. 6. ప్రథమ సత్యాగ్రహోద్యమం. 7. హిందూ స్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీ. 8. బెంగాల్ టెర్రరిస్టు ఉద్యమ పునః విజృంభణ. 9. భారత కార్మికోద్యమ చరిత్ర. 10. ద్వితీయ సత్యాగ్రహో ద్యమం. 11. సంఘటిత సోషలిస్టు ఉద్యమం. 12. వివిధ రాష్ట్రాలలో కాంగ్రెసు మంత్రుల పాలన. 13. కార్మికోద్యమ విజృంభణ. 14. చైతన్యమందుతున్న కర్షకోద్యమం. 15. స్వదేశ సంస్థానోద్యమం. 16 సింహావలోకనం (1857 నుండి త్రిపురీ కాంగ్రెస్ వరకు చరిత్రను సంక్షిప్తంగా సంహావలోకనం చేసిన వ్యాసం.

కార్మిక కర్షకులు, యువతీ యువకులు స్వాతంత్ర్య ప్రతిన చేస్తున్న ముఖ చిత్రంతో త్రిపురీ సంచిక ప్రారంభమైంది. ఇందులో వివిధ విప్లవ వీరుల ఫోటోలు, మీరట్ కుట్రకేసు ఖైదీల ఫోటోలు మొదలైనవి ఉన్నవి. ఇది కూడా పాఠకులచే విశేషంగా ఆదరించబడింది. (దీనిపై పత్రికాభిప్రాయాలు లభించలేదు)

భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రకు సంబంధించిన వివిధ ఉద్యమా లను తెలియజేసే వ్యాసాలను ప్రచురించిన ప్రత్యేక సంచిక తెలుగులో బహుశా ఇదే మొదటిదై ఉంటుంది.

## నవశక్తి 'మే డే' సంచికలు

1938 మే డేన, 1939 లోను 'నవశక్తి 'మేడే' సంచికలను వెలువ రించింది. 1938 సంచికలో శ్రీ శ్రీ సుప్రసిద్ధ గేయం "దేశ చరిత్రలు" ప్రచురించబడింది. మేడే చరిత్ర ప్రస్తావించి భారత దేశంలోని నాటి పరిస్థితులను సమీక్షించిన వ్యాసం ఒకటి ఇందులో వుంది. అఖిల భారత కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ సమావేశం గురించి 'ఒక ప్రతినిధి' రిపోర్టు, ఆ సమావేశ తీర్మానాలు, జాతీయైక్య సంఘటన ప్రాముఖ్యాన్ని వివరించే పోతేపెద్ది నరసింహామూర్తిగారి వ్యాసాలు, పొన్నలూరి రాధాకృష్ణ మూర్తిగారు రాసిన 1922-మన్యంలో తిరుగు బాటు (అల్లూరి సీతారామరాజు) చరిత్ర గురించిన సుదీర్ఘ సమీక్ష, చీరాల కాల్వు

లపై కె.యల్. నరసింహం గారి వ్యాసం, కొండేపూడి లక్ష్మీనారాయణ గారి 'చైనా విజయ పరంపరలకు కల కారణం" అనే వ్యాసం "ప్రపంచ శాంతికై భంగకరమైన ఫాసిజం" అనే కంభం పాటి సత్యనారాయణ గారి వ్యాసం, 'బ్రిటిష సామ్రాజ్య వాదం : మినహాయింపు ప్రదేశాలు" అనే పుసులూరి కోదండ రామయ్య గారి వ్యాసం, అఖిల భారత కర్షకోద్యమం గురించి స్వామీ సహజానంద సరస్వతిగారి వ్యాసం మొదలైన వ్యాసాలున్నాయి.

## 1939 మే డే సంచిక

1939 మే 3 న 'నవశక్తి' మేడే సంచిక ప్రచురించింది. ప. ఖా. రచించిన ముఖ చిత్రంలో శ్రమ జీవి కార్మికుడూ, నేపథ్యంలో ఫ్యాక్టరీ, పొలం దున్నే రైతూ, చైతన్య స్రవంతి రూపంలో ఉన్న జండాపై పంచకోణ నక్షత్రంపై ఎత్తిన సుత్తి కొడవలి ఉన్నాయి. పుచ్చలపల్లి సుందరయ్యగారు రచించిన 'మేడే' వ్యాసంలో మేడే చరిత్రను క్లుప్తంగా ప్రస్తావించి, జాతీయ అంతర్జాతీయ ఘటనలను సమీక్షించారు. ఇంకా ఈ సంచికలో సోవియట్ పంచవర్ష ప్రణాళికలు, సోవియట్ కమ్యూనిస్టు 18 వ కాంగ్రెస్ స్టాలిన్ ప్రసంగ పూర్తి పాఠం, అదే కాంగ్రెసులో పార్టీని ఎలా బలపరచాలని స్టాలిన్ గావించిన ప్రసంగం, కొండేపూడి లక్ష్మీనారాయణ రచించిన "స్పానిష్ రిపబ్లిక్ ఎట్లు విచ్ఛిన్నమైంది. అనే వ్యాసం, అమెరికా కార్మికోద్యమ ప్రముఖుడు స్మిత్ రాసిన "అమెరికా ప్రభుత్వం-కార్మికోద్యమ విజృంభణ" పూయెన్ రచించిన చైనా కథ "నిష్క్రమణ", ఆనాటి అమెరికన్ కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి ఎరల్ బ్రేడర్ రాసిన "నేటి అమెరికాలో కోటి మందికి కూడు లేదు". ఆగ్నిస్ స్మెడ్లీ రాసిన "జయించిన చైనాలో జపాను చేసే రాక్షస కృత్యాలు'' అనే వ్యాసం ఉన్నాయి. ఇవి గాక శరత్‌బాబు నవల పరిణీత ధారావాహిక, సుభాష్ చంద్రబోస్ కాంగ్రెస్ అధ్యక్ష పదవికి రాజీనామా చేయడం బాబూ రాజేంద్రప్రసాద్‌కు అధ్యక్ష పదవి గురించిన వ్యాసాలున్నాయి. స్పెయిన్ దురవస్థను తెలిపే కళాత్మక చిత్రాలు, పారిస్ కమ్యూన్ చరిత్ర తెలిపే చిత్రాలు, అంతర్జాతీయ కమ్యూనిస్టు నాయకుల, భారతదేశంలోని సోషలిస్టు కమ్యూనిస్టు నాయకుల, చిత్రాలు ఈ సంచికకు వన్నె తెచ్చాయి.

## స్వతంత్ర్య భారత్

1939 సెప్టెంబర్‌లో రెండో ప్రపంచ యుద్ధం ఆరంభమైంది. భారత కమ్యూనిస్టుపార్టీ, ఆంధ్ర రాష్ట్ర కమిటీ "నవశక్తి" వారపత్రికను మూసివేయాలని రాష్ట్ర కమిటీ నిర్ణయించింది. 6-9-39 "నవశక్తి" వెలువడిన తర్వాత ఆపివేయబడింది.

ఈ సందర్భంగా "స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర 1940" జుడీషియల్ రిపోర్టులో ఇలావుంది. (ఇక్కడ ఉల్లేఖించే భాగాలు ఇంగ్లీషులో ఉన్న మాతృకకు తెలుగు అనువాదం అని పాఠకులు గ్రహించాలి-సం)

"నవశక్తి" తెలుగు వారపత్రిక బెజవాడ నుండి ప్రచురింపబడుతోంది. 'ప్రపంచ యుద్ధం - మన కర్తవ్యం' అనే వ్యాసాన్ని అది ప్రచురించింది. (6-9-39 న-సం) ఈవ్యాసం ప్రభుత్వానికి అభ్యంతర కరమైనది. యుద్ధాన్ని జయప్రదంగా నిర్వహించకుండేందుకు అది దురభిప్రాయాన్ని కల్గించుతుంది. అందుచేత ఆ వార్తాపత్రిక కాపీలను స్వాధీన పరచుకోవలసిందిగా, ప్రెస్ ఆక్టు సెక్షన్ 4 (1) (డి) (యఫ్) క్రింద ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది.

మద్రాసు రాష్ట్ర ప్రభుత్వ కార్యదర్శి కేంద్ర ప్రభుత్వ హోమ్ డిపార్టు మెంటుకుచెందిన స్మిత్‌కు పంపిన 1939 సెప్టెంబర్ రెండవ పక్షం రిపోర్టులో నవశక్తి గురించి యిలా వుంది.

"....అగష్టు 16, అగష్టు 23, సెప్టెంబరు 6 తేదీల "నవశక్తి" పత్రిక సంచికలు ఇండియన్ ప్రెస్ ఎమర్జన్సీ యాక్టు క్రింద నిషేధింప బడ్డాయి. ముఖ్యంగా యుద్ధాన్ని వ్యతిరేకిస్తూ, విప్లవాన్ని కోరుతూ, టెర్రరిస్టులను పొగుడుతూ రాసిన వ్యాసాలకు గాను నిషేధింపబడ్డాయి. పబ్లిషర్, ప్రింటర్ నుండి సెక్యూరిటీ కోరబడింద. కాని పత్రిక నిలిపివేయబడినట్లు వార్త వచ్చింది"....

(అప్పుడు పబ్లిషర్‌గా ముద్దుకూరి చంద్రశేఖరరావు, ప్రింటర్‌గా తుమ్మల వెంకట రామయ్య ఉండేవారు - సం)

(ప్రభుత్వ నిర్బంధ చర్యకు పత్రిక ఆస్తులు గురికాకుండాచేసిన కమ్యూనిస్టు నాయకుల చాతుర్యాన్ని ఆనాటి రాష్ట్ర ప్రధాన ముఖ్యమంత్రి రాజాజీ కూడా మెచ్చుకోక తప్పలేదు. "వాళ్లు నన్ను, బోల్తా కొట్టించారు." (దేహావ్ ఔట్ విట్టేడ్ మి) అని ఆంతరంగిక మిత్రులతో అన్నట్లు ఆనాడు వినికిడి - సం)

"నవశక్తి" పత్రికను మూసివేసిన తర్వాత ముఖ్యమైన రాష్ట్ర నాయకులు రహస్య జీవితం గడపసాగారు. "స్వతంత్ర్య భారత్" అనే రహస్య మాస పత్రికను నడపాలని నిర్ణయించబడింది. "నవశక్తి" ఆగిపోయిన తర్వాత దాదాపు కొద్ది కాలానికే "స్వతంత్ర్య భారత్" ప్రచురణ ప్రారంభమైంది. వెంటనే ప్రభుత్వ దృష్టికి కూడా గురియైంది. మద్రాసు రాష్ట్ర ప్రభుత్వ కార్యదర్శి కేంద్ర హోం మంత్రిత్వ శాఖకు పంపిన గూఢచారి నివేదికవల్ల ఈ విషయం వెల్లడైంది. సి. స్మిత్‌కు 1939 నవంబర్ రెండవ పక్షంలో పంపిన నివేదికలో ఇలా వుంది.

" ...ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీచే ప్రచురించబడి, రహస్యంగా సైక్లోస్టైల్ చేసిన "స్వతంత్ర్య భారత్" పత్రిక కాపీలు, కృష్ణా, అనంతపురం జిల్లాలో చిన్న స్థాయిలో పంచిపెట్టబడ్డాయి ..."

భారత కమ్యూనిస్టు పార్టీ రహస్యంగా నిర్వహించుతూ ఇంగ్లీషులో వెలువడుతూ వచ్చిన "కమ్యూనిస్టు" అనే సైక్లోస్టయిల్డ్ మాస పత్రికలో "ఆంధ్ర కామ్రేడ్స్ ఫోర్ట్‌ఏహెడ్" అనే శీర్షికతో 1940 జనవరిలో ప్రస్తావించింది. అదే పత్రిక, **1939** అక్టోబర్‌లో "స్వతంత్ర్య భారత్" ప్రారంభమైనట్లు రాసింది.

ఆ విధంగా లీగల్ పత్రిక "నవశక్తి" లేని కొరతను 'ఇల్లీగల్' పత్రిక "స్వతంత్ర్య భారత్" తీర్చడానికి ప్రయత్నించింది. సెప్టెంబరులో "నవశక్తి"ని మూసివేసి, అక్టోబరులోనే రహస్య పత్రికను తీసుకురాగల్గడం నిర్మాణదక్షతకు తార్కాణం.

మొదట్లో స్వతంత్ర్య భారత్‌ను సైక్లోస్టయిల్ చేసి రాష్ట్రమంతటా పంచేవారు కామ్రేడ్స్ పుచ్చలపల్లి సుందరయ్య,మద్దుకూరి చంద్రశేఖరరావు,కొండేపూడి లక్ష్మీనారాయణగార్లు ఈ బాధ్యతను నిర్వర్తించారు గన్నవరం (కృష్ణా జిల్లా) సమీపంలోని కేసరపల్లిపద్ద ఒక తోటలోని ఒక చిన్ని నేలబారు గుడిసెలోకి సైక్లోస్టయిల్ యంత్రాన్ని, సామగ్రినీ స్థానిక కామ్రేడ్సు సహాయంతో చేర్చారు. కామ్రేడ్ చంద్రం (మద్దుకూరి చంద్రశేఖరరావు) కొండేపూడి లక్ష్మీనారాయణ అక్కడే వండుకు తింటూ పత్రికను తీసుకువచ్చేవారు. పత్రిక తయారయ్యాక సుందరయ్య, లక్ష్మీనారాయణ సైకిళ్ళమీద ప్రతులను తీసుకొని జిల్లాలవారీగా విభజించి, మనుష్యులద్వారా పంపేవారు.

సైక్లోస్టయిల్ పత్రిక వల్ల సాధక బాధకాలు ఎక్కువ కావడంతో రెండు మూడు సంచికలతర్వాత పత్రికను అచ్చు వేయించాలనే ఆలోచన వచ్చింది.

ఈ సందర్భంగా కొండేపూడి లక్ష్మీనారాయణ తన అనుభవాల్ని ఇలా చెప్పారు "ప్రారంభ సంచికల నాటి అనుభవం సర్దాగానూ, చిత్రంగాను వుంది. ఒకనాటి రాత్రి కుంభవృష్టిగా వాన కురిసింది. క్రింది నుంచి పాకలోకి నీళ్ళు వచ్చాయి సైక్లోస్టయిల్ యంత్రం, స్టాక్ చేసిన తెల్ల కాగితాలు అన్నీ తడిసి పోయేటట్లు ఉన్నాయి. తెల్లవార్లూ వాటిని ఒళ్ళో పెట్టుకొని కూర్చుని తడవకుండా కాపాడవలసి వచ్చింది."

పై అనుభవం తర్వాత రహస్యంగా "స్వతంత్ర్య భారత్" ను అచ్చు వేయించడానికి వివిధ జిల్లాలలోని సానుభూతి పరుల ప్రెస్‌ల కోసం వేట ప్రారంభమైంది సానుభూతి వున్నా ఒకటి రెండు సంచికల కన్నా ఎక్కువ ఆ ప్రెస్‌ల వారు ముద్రించలేక పోయేవారు. అందు చేత పత్రిక ప్రచురణ ఒక చోట

నుండి గాక వివిధస్థలాల నుండి వచ్చేది. పోలీసులదృష్టి పడకుండా ఉండటానికి ఇది కొంత ఉపయోగించినా పంపిణిదార్లకు కష్టంగా వుండేది.

ప్రారంభంలో అచ్చు పత్రిక ముద్రణ ఏర్పాటు బెజవాడలోనే జరిగింది. 'విప్లవయుగం' పేరిట విప్లవ వాదుల జీవిత చరిత్రలను రాసి ప్రచురించిన గద్దెలింగయ్య అందుకు అంగీకరిచారు. ఆ పుస్తకంప్రచురించిన ప్రెస్‌లోనే "స్వతంత్ర్య భారత్" ముద్రణకు ఏర్పాటు చేశారు. రెండు సంచికలు మాత్రం ప్రచురించారు.

'విప్లవ యుగం' ప్రభుత్వ నిషేధానికి గురి అయింది. లింగయ్యగారు రహస్యంగా ఉంటూనే "విప్లవ యుగాన్ని" పంచుతూ వుండేవారు. 1-10-40 నుండి ఆయన పోలీసులను తప్పించుకు తిరుగుతున్నాడు. లింగయ్యగారికి తన ఇంట్లో దాచి రక్షణ కల్పించుతూ ఉన్నాడని పిడికిటి మాధవరావు గారి ఇంటిపై 29-4-41 ఉదయం 4-30 గంటలకు పోలీసులు దాడి చేశారు. అక్కడ గద్దె లింగయ్య గారిని పోలీసులు అరెస్టు చేశారు. 1937 ఫిబ్రవరి,1940అక్టోబర్ "కమ్యూనిస్టు" (రహస్యంగా ఇంగ్లీషులో భారత కమ్యూనిస్టు పార్టీ కేంద్రం నుండి వెలువరచే పత్రిక), 6-9-39 నాటి నవశక్తి ఆయన వద్ద దొరకాయి. ఈసందర్భంగా మాధవరావు గారికి 9 నెలల శిక్ష విధించబడింది.

1941 ఏప్రిల్ 29 నుండి 7 రోజుల వరకు లింగయ్య గారిని గుడివాడలో రిమాండులో ఉంచవలసిందిగా కృష్ణా డి.యస్.పి.కోరారు. 20-5-41 మద్రాసు రాష్ట్ర గవర్నర్ ఉత్తర్వు మేరకు లింగయ్య గారు డిటైన్ చేయబడ్డారు.

ఆ తర్వాత 25-6-41 నుండి 27-11-1941 వరకు నెల్లూరు జైలులో డిటెన్యూగా ఉన్నారు.

(వివరాలకు జి ఓ.నెం. 1061) యస్-32 (పబ్లిక్ జనరల్ డిపార్టుమెంటు 20-5-41, జి.ఓ. నెం. 2363 పబ్లిక్) జనరల్ (డిపార్టుమెంటు 25-10-41ను చూడండి).

మరో ప్రెస్ కోసం అన్వేషణ ప్రారంభమైంది. ఉద్ధరాజు రామంగారి ద్వారా పశ్చిమ గోదావరి జిల్లాకు చెందిన వెలగల రామిరెడ్డిగారు పత్రికను అచ్చు వేయడానికి అంగీకరించారు. వారు పార్టీ సానుభూతిపరులు, సత్తా రామేశ్వరంలో స్వంత ప్రెస్ వుంది. అక్కడే కొన్నాళ్లు కాపురం. తర్వాత ఈయన తన ప్రెస్‌ను మారుపేరుకు మార్చారు. యు.యస్. ప్రింటర్సు అని దాని పేరు. ఈయన రెండు సంచికల కంటే ఎక్కువ ముద్రించి ఇవ్వలేనని అన్నారు. కాని మూడు నాల్గు సంచికల వరకు ముద్రించి ఇచ్చాడు.

అచ్చువేయవలసినదంతా స్వయంగా తీసుకువెళ్లి, అచ్చు వేయించి, అచ్చయిన ప్రతులను స్వయంగా సైకిల్ పై తన ఇంటికి చేర్చి, ఆ తర్వాత కబురు పెట్టేవాడు. వాటిని జిల్లాల వారీగా కొండేపూడి పంపకం చేసేవాడు. ఉద్ధరాజు రామంగారి పనిలో కొండేపూడికి తోడ్పడేవారు. ఇక్కడ స్వతంత్ర్య భారత్ ముద్రింపబడుతున్నదన్న వార్త పొక్కడంతో, ఆ పని నిలుపు చేయబడింది.

తర్వాత తూర్పు గోదావరి జిల్లా రాజోలులో "స్వతంత్ర్య భారత్" అచ్చు అవుతుండేది. తూర్పు గోదావరి జిల్లా ముంగండ సమీపంలో ముంజవరపు కొట్టు గ్రామ వాస్తవ్యులైన గోవిందవరుల వెంకట రామశర్మగారిది ఆ ప్రెస్. దాని పేరు "శ్రీ కృష్ణా ప్రెస్" అని జ్ఞాపకం. దీన్ని ముళ్లపూడి సూర్యనారాయణగారు తెలియజేశారు. దానిని మల్లాది కృష్ణమూర్తిగారు అనే ఆయన అద్దెకు తీసుకొని నిర్వహించుతూ వుండేవారు. ముళ్లపూడి సోదరులకు కృష్ణమూర్తిగారు బావగారు. ముంగండ వాస్తవ్యులైన సరస్వతుల సోమేశ్వరరావుగారితో ఉన్న పరిచయంవల్ల, కృష్ణమూర్తిగారు "స్వతంత్ర్య భారత్"ను అచ్చువేయడానికి అంగీకరించారు కొన్ని నెలలపాటు పని సాఫీగా జరిగింది. (సుమారు ఆరు సంచికలు అచ్చు అయ్యాయని ముళ్లపూడి సూర్యనారాయణగారికి జ్ఞాపకం) కొంత కాలం సోమేశ్వరరావు గారు మద్రాసు ప్రెస్ వర్కర్స్ యూనియన్‌లో పని చేశారు. అప్పుడప్పుడు ఆయన ఈ ప్రెస్‌కు వస్తూ పోతూ వుండేవాడు కొండేపూడి లక్ష్మీనారాయణ అచ్చు కావలసిన వ్యాసాలను తీసుకు వెళ్లేవాడు సోమేశ్వరరావు స్వయంగా అచ్చుపని చేయించేవాడు. కొండేపూడి లక్ష్మీనారాయణ ఈ పనిని తనిఖీ చేసేవాడు.

అచ్చయిన కట్టలను రాజోలు రేవులో అందజేసేవారు. అవి రేవు ద్వారా పశ్చిమ గోదావరి జిల్లా చించినాడ చేరేవి. అక్కడ నుంచి వివిధ జిల్లాలకు 'కొరియర్ల' ద్వారా పంపకం చేసేవారు. ఈ పనిలో 16 ఏళ్ళ బాలుడైన ముళ్లపూడి సూర్యనారాయణ, పశ్చిమ గోదావరిలో ఉద్ధరాజు రామంగారు మరి కొందరు గీత కార్మికులు సహాయ పడేవారు. కూరగాయలు, పళ్లు గల తాటాకు బుట్టలలో ఈ కట్టలు వేసి పైన కూరగాయలు వేసి ఈ బుట్టల్ని తరలించేవారు

ముంజవరపు కొట్టు నుంచి వచ్చిన కొణమర్తి బ్రహ్మదేవ శాస్త్రి (ఇసుకపూడి) ద్వారా యజమానికి ఈ విషయం తెలిసింది. ఆయన గాభరా పడి పోలీసులకు తెలియజేశాడు. పోలీసులు దాడిచేసి ప్రెస్‌లోనుంచి ఎవరినీ బయటికిపోకుండా కట్టుదిట్టం చేశారు. ఈ విషయం తెలియని సోమేశ్వరరావు గారు లోపలికి రాగానే అరెస్టు చేశారు. కొండేపూడి లక్ష్మీనారాయణగారు గూడా ఆనాడు పట్టుబడే వారే. త్రుటిలో తప్పిపోయింది. ఆలస్యంగా ఆ గ్రామానికి చేరిన ఆయనకు ఈ వార్త తెలిసి తప్పించుకు పోయాడు. ప్రెస్‌లో "స్వతంత్ర్య భారత్"కు సంబంధించిన

మేటరు దొరికింది. మల్లాది కృష్ణమూర్తిగారి పైన, సోమేశ్వరరావుగారి పైన కేసు పెట్టారు. అమలాపురం ఆర్.డి.ఓ. రెండుసంవత్సరాలు శిక్ష విధించారు. అప్పీలులో సంవత్సరానికి శిక్ష తగ్గించబడింది. శిక్ష పూర్తి అయ్యాకకూడా సోమేశ్వరరావును ప్రభుత్వం డిటైన్ చేసింది. వారిపై కేసులో 16 ఏళ్ళ వయసులో ఉన్న ఆనాడు పార్టీ సభ్యుడుకాని ముళ్లపూడి సూర్యనారాయణను ఆయనను అడగకుండానే తమ సాక్షిగా పోలీసులు వేసుకొని, తమకనుకూలంగా సాక్ష్యం రాబట్టాలని ప్రయత్నించి విఫలమయ్యారు. తమ కనుకూలంగా సాక్ష్యం చెప్పనందుకు సర్కిల్ ఇన్‌స్పెక్టర్ జగ్గారావు ఆయన్ని బెదరించాడు.

రహస్య "కమ్యూనిస్టు" (ఇంగ్లీషు) పత్రిక 1940 డిసెంబరు సంచికలో, రాజోలు ప్రెస్‌పై దాడిని పేర్కొంది. 1940 జూన్ వరకు స్వతంత్ర్య భారత్ పది సంచికలు నిరాటంకంగా వచ్చినట్లు తెలియజేసింది.

రాజోలు ఘటన తర్వాత, ఇతర, ప్రెస్సులలో అచ్చువేయడం సాధ్యం కాదని, స్వంత ప్రెస్ ఏర్పాటుచేసుకోవాలని, పార్టీ నిర్ణయించింది.

మొదట ఒక పాతట్రెడిల్ సంపాదించి టైపు సమకూర్చి కొల్లేరు తీర గ్రామంలో ప్రెస్ ఏర్పాటుచేశారు. కాకుమాను నారాయణారావు ఈ పనిలో బాగా తోడ్పడ్డారు. (నారాయణరావు తెనాలిలో ప్రెస్ వర్కర్‌గా జీవితం ప్రారంభించి మంచి మెకానిక్‌గా తయారయ్యాడు. తెనాలిలో పార్టీలో ఉద్యమ ప్రారంభకాలం నుండి పనిచేస్తూ వచ్చాడు. తర్వాత మద్రాసు బి.ఎన్.కె. ప్రెస్‌లో మెకానిక్‌గా పనిచేసి చనిపోయారు.) అయితే మొదటి పాఠం అచ్చువేస్తుండగానే ట్రెడిల్ విరిగి పోయింది. నమ్మకమైన ఒక కమ్మరి ద్వారా దీనిని బాగు చేయడానికి ప్రయత్నించినా లాభం లేక పోయింది.

తర్వాత బందరులో రహస్య ప్రెస్ ఏర్పాటు చేయాలని పథకం వేయబడింది. ట్రెడిల్ వల్ల శబ్దం వస్తుంది కాబట్టి, అలా శబ్దం రాని "చిలకాప్రెస్" ఏర్పాటు చేయబడింది. ఈ నిశ్శబ్ద యంత్రమే గాక, ప్రెస్‌కు కావలసిన టైపు వగైరా సమకూర్చబడింది. ఈ పనికి, ఆ తర్వాత అచ్చులో సహాయపడేందుకు తీసుకు వచ్చిన ఒక కంపోజిటర్‌ను కారణాంతరాలవల్ల తిరిగి పంపించవలసి వచ్చింది.

తర్వాత బందరులో ఒక మారుమూల ఒశందపాలెంలో పెంకుటిల్లు, ముందర రెండు డాబా గదులున్న ఇంటిలో ప్రెస్ ఏర్పాటుచేయబడింది. ఏలూరు నుంచి లంక జోగారావును కంపోజింగ్‌కు తీసుకువచ్చారు. 1936-37 సంవత్సరాల కాలంలో ఏలూరు ప్రెస్ వర్కర్సుతో యూనియన్ నిర్మాణ కార్యక్రమంలో జోగారావుతో కొండేపూడికి పరిచయం ఏర్పడింది. ఆయనకి ఈ పని గురించి చెప్ప

గానే ఉత్సాహంతో అంగీకరించారు. ప్రెస్ పనేగాక అచ్చయిన వాటిని ఇతర చోట్లకు తరలించే కార్యక్రమంలో, పంపిణీ చేయడంలో కూడా జోగారావు పాల్గొనేవాడు. ఆయనకు పంపిణీలో కృష్ణాజిల్లాకు చెందిన పొట్లూరి సీతారామయ్య కూడా ఈ కేంద్రం నుండి సహాయపడేవాడు.

సంపాదక కార్యకలాపాలకు తోడ్పడేందుకు తుమ్మల వెంకటరామయ్య వచ్చాడు. సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ (బోల్షివిక్) చరిత్రను అనువదించి ఈ రహస్య ప్రెస్‌లోనే అచ్చు చేయాలని పార్టీ నిర్ణయం. అనువాద కార్యక్రమం తుమ్మలచేపట్టాడు కొండేపూడితో సహా నలుగురూ ఒకే ఇంట్లో ఉండేవారు. అందరూ ఒకే ఇంట్లో ఉండటం మంచిది కాదని మరొక ఇల్లు తీసుకొని రెండు చోట్ల ఉండటం మొదలుపెట్టారు. అనుమానం లేకుండా ఉండేందుకు రెండు చోట్ల రెండు కాపురాలు సహాయంగా ఉండేవి. ఒక చోట తుమ్మల స్వతంత్ర్య భారత్ సంపాదక రచనలకు సహాయపడటం, అచ్చుకివ్వడం, ప్రూఫ్‌లుచూడటం చేసేవాడు. విదేశ వ్యవహారాలు, యుద్ధ సమీక్షలు రాసేవారు. అదే సమయాన సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ (బోల్షివిక్) చరిత్ర అనువదించేవాడు. ఈయనతో పాటు పాలకొల్లునుంచి నెక్కలపూడి రామారావు, ఆయన భార్య సుబ్బాయమ్మ ఉండేవారు. రెండవచోట జోగారావు, పశ్చిమ గోదావరి జిల్లాకు చెందిన మరో కుటుంబం ఉండేది. ఈ రెండిళ్లలోని కార్యకలాపాల సమన్వయం కొండేపూడి చూసేవాడు. బోల్షివిక్ పార్టీ చరిత్రతో పాటు, రెడ్ ఆర్మీ మొదలైన పుస్తకాలు కూడా అచ్చయ్యేవి.

బందరులో ఏదో ఉద్యోగం చేసుకొంటున్న పెదమద్దాలి వాస్తవ్యుడైన ఈడ్పుగంటి శ్రీరాములు ఈ ప్రెస్‌కు కావలసిన తెల్లకాగితం, ముద్రణ, సిరా వగైరా కొని ఉంచేవాడు. వాటిని రహస్యంగా ప్రెస్‌కు తరలించే వాళ్ళు.

స్వతంత్ర్య భారత్ ప్రెస్ బందరులోని చల్ల బజారు సమీపంలో ఒక పెంకుటిల్లులో ఉండేది. అక్కడ అచ్చయిన స్వతంత్ర భారత్ పత్రికలూ, సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ (బోల్షివిక్) చరిత్ర ఫారాలూ కొండేపూడి, లక్ష్మీనారాయణ, జోగారావుగార్లు సైకిళ్లపై వేరే చోటికి తరలించేవారు.

గుడివాడ సమీపంలోని నూజెళ్ల గ్రామంలో అమరవీరుడు చలసాని జగన్నాథరావు అక్క, బావగారైన పిన్నమనేని సూర్యావతి, కుటుంబరావుగార్ల ఇంట్లోకి చేర్చేవారు. చలసాని జగన్నాథరావు, వారి కుటుంబసభ్యుల సహాయంతో జిల్లాలవారీగా మడిచి కట్టలు కట్టి పంపించేవారు. అదేవిధంగా బెజవాడలో బెల్లపు వెంకటరామయ్యగారు ఇల్లు ఒక పంపిణీ కేంద్రంగా వుండేది. వెంకట్రామయ్య గారు సత్యనారాయణపురం రైల్వే స్టేషను సమీపంలో కట్టెల అడితీలో గల

ఇంట్లో ఉండేవారు. అక్కడికి కొండేపూడి స్వతంత్ర్య భారత్ పత్రికలను, ప్రచురణలను చేర్పించేవాడు.

వాటిని ఆయా జిల్లాలకు పంచే ముఖ్యమైన కొరియర్‌గా పశ్చిమ గోదావరి జిల్లా నవుడూరుకు చెందిన యాళ్లబండి రంగనాయకుల్ని అరెస్టు చేయడానికి ప్రయత్నించారు. ఆయన గోడదూకి పారిపోయాడు. పోలీసు ఇన్‌స్పెక్టరుకూడా గోడ దూకబోయి బురదగుంటలో పడ్డాడు. దానినే మద్దుకూరి చంద్రశేఖరరావు గారు ''పంది బురద మెచ్చు'' అనే శీర్షికతో చమత్కరించారు.

ఈ వార్తను పంపగా స్వతంత్ర్య భారత్‌లో అచ్చుపడి విశేష ప్రాచుర్యం పొందింది.

సొంత ప్రెస్ ఏర్పాటు చేశాక దాదాపు సంవత్సరంపాటు "స్వతంత్ర్య భారత్" నిరాఘాటంగా నడిచింది. సర్క్యులేషన్ కూడా పెరిగింది. రెండు నుంచి మూడు వేలు ముద్రించేవారు. ఒకోసారి నాలుగువేలదాకా ముద్రించేవారు. అడిగినన్ని సప్లైచేయలేని కొన్ని సందర్భాలలో ఆ పత్రికలను తిరిగి సైక్లోస్టైల్ చేసుకొనేవారు స్థానిక కమ్యూనిస్టులు.

మద్రాసు రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి, భారత ప్రభుత్వ హోం డిపార్టుమెంటు కార్యదర్శికి 15 రోజుల కొకసారి పంపిన రహస్య నివేదికలనుచూస్తే "స్వతంత్ర్య భారత్" పట్ల ప్రభుత్వం ఎంత ఆందోళన చెందిందో స్పష్టమవు తుంది.

ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీ ప్రచురించిన "స్వతంత్ర్య భారత్" కృష్ణా, అనంతపురం జిల్లాలలో కొద్ది స్థాయిలో పంచిపెట్టబడుతూందని 1939 నవంబర్ రెండవ పక్ష రిపోర్టులో తెలియచేయబడింది. 1939 డిసెంబర్ మొదటి పక్షం నివేదికలో, "స్వతంత్ర్య భారత్" సంచికలు ప్రచురింపబడ్డాయని, పేర్కొంది. రహస్య అభ్యంతరకర కమ్యూనిస్టు ప్రచారం సాహిత్యం కృష్ణాజిల్లాలో గమనించ దగినంతగా తగు స్థాయిలో పంచిపెట్టబడుతోందనీ, అందులో చాలా ముఖ్యమైనది "స్వతంత్ర్య భారత్" అనీ ఆ నివేదిక పేర్కొంది. 1939 డిసెంబరు రెండవ పక్షం నివేదిక అనంతపురంజిల్లాలో స్వతంత్ర్య భారత్ పత్రికలు పంచి పెట్టుబడినట్లు తెలియచేసింది 1940 జనవరి రెండవ పక్షం నివేదికలో, అనంతపురం కాంగ్రెస్ ఆఫీసులో సోదా చేయగా "స్వతంత్ర్య భారత్" మూడు సంచికలు పట్టుబడినట్లు తెలియచేయబడింది. అనంతపురంలోనూ, ఆ జిల్లాలోని ఇతర ఫిర్కాలలోను "స్వతంత్ర్య భారత్" నాల్గవ సంచిక పంచి పెట్టబడినట్లు కూడా తెలియజేసింది. 1940 మార్చి మొదటి పక్షంలో అనంతపురం, తూర్పు గోదావరి జిల్లాలలో కమ్యూనిస్టు సాహిత్యం ముఖ్యంగా "స్వతంత్ర్య భారత్"ను

పంచిపెట్టారని, తూర్పు గోదావరి జిల్లాలలో అనేకమందిని అరెస్టు చేసినట్లు తెలియ చేసింది. "స్వతంత్ర్య భారత్" ఇపుడు 6 వ సంచిక వెలువడినట్లు, దానిని పంచి పెడుతుండగా ఇద్దరిని అరెస్టు చేసినట్లు, గుంటూరులో స్టూడెంటు ఎంపోరియంను సోదా చేయగా స్వతంత్ర్య భారత్‌తో సహా నిషిద్ధ సాహిత్యం లభించిందని ఈ నివేదిక తెలియ చేసింది. 1940 మార్చి రెండవ పక్షం రిపోర్టులో గుంటూరులో మోటూరి హనుమంతరావు స్వతంత్ర్య భారంత్‌ను పంచుతున్నందుకు ప్రభుత్వం తగు చర్య తీసుకొందని తెలియజేసింది. 1940 మే రెండవ పక్షం రిపోర్టులో "స్వతంత్ర్య భారత్" 8 వ సంచిక గురించి ప్రస్తావించబడింది. కృష్ణా జిల్లాలో "స్వతంత్ర్య భారత్" 9 వ సంచికను కనుగొన్నట్లు 1940 జూలై మొదటి పక్షం రిపోర్టులో వుంది. 1940 సెప్టెంబర్ 2 వ పక్షంలో పంపిన రిపోర్టులో ఇలా వుంది.

కృష్ణా జిల్లాలో స్వతంత్ర్యభారత్" చదువుతున్న ఒక మురాను అక్కడ కక్కడ రాత్రిపూట పట్టుకొన్నాము. ఈ చట్టవిరుద్ధ కమ్యూనిస్టు పత్రిక గుటప్ చిగజారుతున్నా ఇంకా వస్తూనేవుంది.

ఇవి కొన్ని ఉదాహరణలు మాత్రమే. స్వతంత్ర్య భారత్, కల్గియున్నందుకు, పంచిపెడుతున్నందుకు అరెస్టుచేసి డిటెన్ చేసినవారిని గురించి కూడా ఆ రిపోర్టు లలో మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం వివరించింది."

"స్వతంత్ర భారత్" రహస్య ముద్రణ, పంపిణీ ఇలా నిర్విఘ్నంగా కొనసాగుతుండగా ఉన్నట్టుండి ఒక ప్రమాదం జరిగింది. సైకిళ్ళపై స్వతంత్ర్య భారత్ పత్రికలనూ, అచ్చయిన బోల్షివిక్ పార్టీ చరిత్ర పాఠాలను సైకిళ్ళపై మూటెళ్ళ తీసుకువెళుతూ ఉండగా, బందరు చల్లబజారులో కొండేపూడి లక్ష్మీ నారాయణ, లంక జోగారావుగార్లను పోలీసులు అనుమానించి అరెస్టు చేశారు. ఇద్దర్ని బందరు నెం 2వ పోలీసుస్టేషన్ అయిన ఇనకుదురు స్టేషన్‌లో నిర్బంధిం చారు. ప్రతిరోజూ ఉదయం, సాయంకాలం నలుగురైదుగురు పోలీసులు, ఇన్‌స్పె క్టర్లూ వారిని చిత్రహింసలు పెట్టారు ఇలా వారం గడచినా వారి నోటినుండి ఒక్క రహస్యం కూడా బయటికి రాలేదు. ఒకనాటి రాత్రి పూడిబైటకి జీపులో తీసుకుపోయి, గోనెసంచులలో పెట్టి మూటకట్టి కాల్వలో పారేస్తామని బెదరించారు. వారికి గోనె సంచులు తొడిగి భయపెట్టారు. అయినా లాభం లేకపోయింది.

రాష్ట్ర స్పెషల్ బ్రాంచి పోలీసు సూపరింటెండెంటు, అతి క్రూరుడని పేరు గాంచిన డప్పుల సుబ్బారావు వచ్చాడు. (శాసనోల్లంఘన ఉద్యమకాలంలో కాంగ్రెస్ సభలను చెడగొట్టడానికి డప్పులు వాయింపచేసేవాడు ఈయన. అందుకే ఈ పేరు వచ్చింది. అంతేగాని 'డప్పుల' అనేది ఇంటిపేరు కాదు. (చూడు-అను

బంధం 1) వారిద్దరినీ అనేక ప్రశ్నలువేసి వేధించాడు. సమాధానం రాకపోయే సరికి ఇంకా చిత్రహింసలు పెట్టవలసిందిగా క్రింది పోలీసు అధికారులకు చెప్పి వెళ్ళాడు.

ఒకరోజు అర్థరాత్రి ఒకే సమయంలో కృష్ణాజిల్లాలోని 80 గ్రామాలను చుట్టుముట్టి దాడులు జరిపారు. అయినా వారికి ఎక్కడా "స్వతంత్ర్య భారత్" ఆచూకీ దొరకలేదు. 1941 సెప్టెంబర్‌లో ఈ ఘటన జరిగింది. బందరు సబ్ కలెక్టరు కోర్టులో కేసు 3 నెలలు సాగిన తర్వాత కొండేపూడి లక్ష్మీనారాయణ, లంక జోగారావుగార్లకు 9 నెలల కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రి, అల్లీ పురం (బళ్ళారి) క్యాంప్ జైలు, బళ్ళారి సెంట్రల్‌జైళ్ళలో వారాశిక్షను అనుభ వించారు. 1942 లో విడుదలయ్యారు.

వీరిద్దరూ బందరులో అరెస్టయిన తర్వాత, పైన ఉదహరించిన "స్వతంత్ర్య భారత్" నిర్వహణకు తీసుకొన్న ఇళ్ళను ఖాళీచేశారు. తుమ్మల వెంకటరామయ్య తన స్థావరం నుండి తప్పుకొని రహస్యంగా కాలినడకను సుమారు ఇరవై మైళ్ళు దూరంలోని గ్రామం చేరుకోగా, ఆ తెల్లవారు జామునే ఒకేసారి 80 గ్రామాల సోదాలో భాగంగా ఈ గ్రామాన్ని కూడా పోలీసులు చుట్టుముట్టారు. అక్కడి నుండి తప్పించుకొని, ప్రక్కనున్న గుంటూరు జిల్లాలో తలదాచుకొని కొన్నాళ్ళకు తిరిగి రాష్ట్ర రహస్య కేంద్రంతో సంబంధాలు నెలకొల్పుకోగలిగాడు. బందరు లోని రహస్య ముద్రణాలయాన్ని ఆ తర్వాత నెమ్మదిగా మరొక చోటికి తరలిం చారు. రెండు కుటుంబాల వారు కూడా సురక్షితంగా తప్పుకొన్నారు. చండ్ర రాజేశ్వరరావు గారి పర్యవేక్షణలో ఈ ముద్రణాలయాన్ని తరలించడం జరిగిం దని వినికిడి.

"స్వతంత్ర్య భారత్"ను అంచెలంచెలుగా ఇతర జిల్లాలకు, గ్రామాలకు చేరేవి. ఒక్కోసారి ఇవి పంచుతూ ఉండగా కొందరు అరెస్టయిన సంఘటన లున్నాయి. ముంగండ కాపరస్తులు సుసర్ల సూర్యనారాయణ 1940 ఆగష్టులో రాజమండ్రిలో అరెస్టయ్యారు. "స్వతంత్ర్య భారత్" పత్రిక కల్గి యున్నారని. కమ్యూనిస్టు సాహిత్యం కల్గి వున్నారని కడుపు రాములుగారిని 1940లో అరెస్టు చేసి 9 నెలలు శిక్షవిధించారు. ఏలూరులోనే డిమాణిక్యాల రావును ఒకే కేసులో జామీను యిచ్చి తిరిగి నిషేధ పత్రాలున్నాయని అరెస్టు చేశారు 6 నెలల కఠిన శిక్ష, 50 రూపాయలు జరిమానా విధించారు.

బొంబాయి నుండి కమ్యూనిస్టు కరపత్రాల బంగీలు పుచ్చుకుంటున్నారని పశ్చిమ గోదావరి జిల్లా బోర్డు గుమాస్తా మునిరాజును అరెస్టుచేసి శిక్షించారు. జిల్లా కాంగ్రెసు కార్యదర్శి సత్తిరాజు రామమూర్తి, ఎ. వేంకటేశ్వరరావు, కె. విజయ్య

రామయ్య, రెడ్డయ్య, సీతారామయ్య గార్లనును హెచ్చరించి వదిలివేశారు. సోములు అనే వి రామమూర్తి మాత్రం ఆ బంగీలలో కమ్యూనిస్టు కరపత్రాలున్నాయని తనకు తెలియునని అంగీకరించారు.

గుడివాడలో సూరపనేని శేషగిరిరావు ఇల్లు సోదాచేసి కొన్ని కాగితాలు పట్టుకొని ఆయన్ని అరెస్టు చేశారు. మరికొంతమంది పై కూడ కేసు పెట్టారు. వీరిలో సూరపనేని రామశేషగిరి, జోస్యభట్ల సత్యనారాయణ, తమ్మారెడ్డి సత్యనారాయణ గార్లను మినహా మొదట్లోనే కొందరిని విడుదల చేశారు "స్వతంత్ర్య భారత్" పత్రికలు దొరికాయని, యుద్ధ. ప్రతికూల ప్రచారంచేస్తున్నారని వీరిపై కేసు పెట్టారు.

1940 నవంబరు 15 వ తేదీన తీర్పు యిస్తూ గుడివాడ మేజిస్ట్రేట్ అజరతుల్లా ఖాన్ ప్రాసిక్యూషన్ సాక్ష్యం కల్పన అని, నమ్మడానికి వీలు లేదని, కొట్టి వేస్తూ తీర్పుచెప్పారు. తాపీ ధర్మారావు గారి సంపాదకత్వాన వెలువడుతున్న "కాగడా" వార పత్రిక, కేసు నుండి బయటపడ్డ ఈ యువకులను అభినందించింది.

1940 జనవరిలో రహస్య "కమ్యూనిస్టు" పత్రిక (కేంద్ర పార్టీ ఆధ్వర్యాన ఇంగ్లీషులో వెలువడేది) "ఆంధ్ర కామ్రేడ్స్ ఫోర్జ్ ఎహెడ్" అనే శీర్షికలో స్వతంత్ర్య భారత్ గురించిన వాక్యాలు గమనించ దగ్గవి.

'1200 గ్రామాలు, పట్టణాలలో (స్వతంత్ర భారత్) పంచిపెట్ట బడుతుంది. కొత్తగా ఇవి చదివి యువకులు పార్టీవైపు వస్తున్నారు. స్వతంత్ర్య భారత్ సర్క్యులేషన్ 4 వేలకు పెరిగింది.'' ఆగస్టు మాసపు 'కమ్యూనిస్టు'లో మరి కొన్ని వివరాలివి. స్వతంత్ర్య భారత్ సర్క్యులేషన్ 3,000. 1000 గ్రామాలకు పైగా చేరుతుంది.

1941 జూలైలో కూడా దాని సర్క్యులేషను 3 వేలు అని రాసింది. "యుద్ధ వ్యతిరేక వార్తల కోసం, దాని సమరశీల జాతీయ విధానాన్ని ఇంకా సమర శీలిగా కొనసాగాలని అనుకొనే ప్రతి రాజకీయ కార్యకర్త హర్షించుతున్నాడు. వ్యక్తుల ద్వారా ప్రతిజిల్లాకు దాదాపు అన్ని ముఖ్య గ్రామాలకు ఈ పత్రిక చేరుతూంది. ఇదెలా సాధ్యం? ఇక్కడ జరుగుతున్నదేమిటో క్లుప్తంగా ఈ క్రింది ఘటనల వల్ల తెలుస్తుంది. పోలీసులు (స్వ.భా) అచ్చువేసే యంత్రాన్ని పట్టుకోలేక పోయారు. ఆ పత్రికను ఎలా పంచిపెడుతున్నారో ఆ లింకుల్ని కనిపెట్టలేక పోయారు. సాయుధ పోలీసు లారీలు గ్రామ సీమల్లో దూసుకు పోయాయి. వేలాది రూపాయలు లంచాలు పెట్టారు. వందలాది సి. ఐ. డి. లు తిరుగుతున్నారు. అయినా వ్యర్థం, ఇదంతా మా కామ్రేడ్సు పట్ల పార్టీ పట్ల గ్రామీణ ప్రజలకు గల గౌరవాన్ని ఇనుమడింప జేసింది.''

స్వతంత్ర్య భారత్ సంబంధం ఉన్నదనుకొనే కమ్యూనిస్టులను అనేక మందిని మొదట ఆయాగ్రామాల్లో ఇంటరన్ చేసి, తర్వాత డిఫెన్ కెసింటిన్ ప్రభుత్వం. విచిత్రమైన ఉదాహరణ ఖండవల్లి కృష్ణారావు గారి డిటెన్షన్. ఆయన డిటెన్షన్‌కు ప్రభుత్వం చూపిన కుంటిసాకు 'స్వతంత్ర్య భారత్' ప్రచురణకు సహాయపడుతున్నాడనీ, బ్యాంకు కార్యదర్శియైన ఆయన కమ్యూనిస్టులకు డబ్బు సహాయం చేస్తున్నాడనీ. ప్రభుత్వ ప్రకటన చూస్తే, బ్యాంకి డబ్బంతా కమ్యూనిస్టులకు యిస్తున్నాడనే భావం కలుగుతుంది.

1940 డిసెంబరు 'కమ్యూనిస్టు' పత్రికలో ''స్వతంత్ర్య భారత్'' రెండవ సంవత్సరంలో అడుగు పెట్టడాన్ని పేర్కొన్నది. 1939 అక్టోబరులో ప్రారంభమైందనీ, 10వ సంచిక ముద్రణలో వుండగా ప్రెస్‌పై దాడి జరిగిందనీ, మరో ప్రత్యామ్నాయ ప్రెస్‌లో రెండవ సంపుటిలోని మొదటి రెండు సంచికలూ 1940 సెప్టెంబరు నాటికి వచ్చాయని తెలియజేసింది. ఏయే శీర్షికలకు ఎన్ని పేజీలు కేటాయించబడ్డవో తెలియజేసింది. 2 పేజీలు సంపాదకీయం, జాతీయ రాజకీయాలు ఉండేవి. యుద్ధ సమీక్ష రెండు పేజీలు. ఇతర పేజీలలో సెన్సార్ చేయని వార్తలు (సెన్సార్‌కు గురియై లీగల్ పత్రికల్లో రాని వార్తలు) రిపోర్టులు, మందసా కాల్పులు లాంటి నిరసన ప్రదర్శన వార్తలు వగైరా ఇతర రాష్ట్రాలలోని పోరాట వార్తలు కూడా ప్రచురించేది. ఒకప్పుడు 4,000 పత్రికలు ముద్రించబడినా, డబ్బు వసూలు కాకపోవడంవల్ల 3 వేలకు తగ్గింపబడిందని తెలియజేసింది. 1940 జూన్‌వరకు క్రమబద్ధంగా స్వతంత్ర్య భారత్ వచ్చింది. పిదప సంచిక ముద్రణలో ఉండగా పోలీసులు ప్రెస్‌పై దాడిచేసి స్వాధీనపరచుకొన్నారు. ప్రెస్సు కంట్రాక్టు తీసుకొన్న వ్యక్తికీ, కంపోజిటరుకు రెండేళ్ళ కఠిన శిక్ష విధింపబడింది. (రాజోలు ప్రెస్‌కు సంబంధించిన ఈ విషయం ఇంతకు ముందే వివరించబడింది.)

స్వతంత్ర్య భారత్ పాఠకుల్ని గ్రూపులుగా ఏర్పరచి, వారిలో నుండి పార్టీకి రిక్రూట్ చేసేవారు.

రెండవ సంవత్సరం 4 పేజీల (ఫుల్ స్కేప్,) తో 'స్వతంత్ర్య భారత్' వెలువడింది. అందులో అంతర్జాతీయ వార్తలు 1 పేజీ, సెన్సారు కాని వార్తలు 1 పేజీ, జాతీయ రాజకీయాలపై సంపాదకీయం 2 పేజీలు ఉండేవి

1940 జనవరి ''కమ్యూనిస్టు'' పత్రికలో ''స్వతంత్ర్య భారత్'' గురించి ఇలా ప్రచురింపబడింది.

''స్వతంత్ర్య భారత్'', స్థానిక పార్టీ పత్రిక ఆంధ్ర దేశమంతటా 1200 గ్రామాలలో, పట్టణాలలో పంచిపెట్టబడుతోంది. ప్రతి చోటా దాన్ని చదువు

తున్నారు. యువకులలో క్రొత్తవారు, యువ కాంగ్రెస్ వాదులు కమ్యూనిస్టుల వైపు ఆకర్షించబడుతున్నారు. మా కామ్రేడ్సు తమ కృషి ద్వారా కాంగ్రెసు అనుయాయులలోని మంచి వ్యక్తులనందరినీ చిత్తశుద్ధిగల కాంగ్రెస్ ప్రజానీకాన్ని తమ వైపు సమీకరించుతున్నారు. ఈ నాటి జాతీయ 'స్తబ్ధత'ను బ్రద్దలు కొట్ట డానికి ఇదే మార్గం. ''స్వతంత్ర భారత్'' ఇపుడు 4 వేలు అచ్చవుతున్నది.

1940 ఆగస్టు 'కమ్యూనిస్టు'లో స్వతంత్ర్య భారత్ గురించి ఇలా వ్రాశారు.

1939 డిసెంబర్ ప్రారంభంలో స్వతంత్ర్య భారత్‌తో సంబంధమున్నదని అనుమానించిన కమ్యూనిస్టులను గ్రామాలలో ఇంటరన్ చేయడం ప్రారంభించింది. మాడభూషి వెంకటాచారి (గుంటూరు జిల్లా) అల్లూరి సత్యనారాయణ (పశ్చిమ గోదావరి జిల్లా కాంగ్రెసు కమిటీ మాజీ అధ్యక్షుడు) కంభంపాటి సత్యనారాయణ (తుని - తూర్పు గోదావరి జిల్లా) లను ఇంటరన్ చేసింది.

మార్చి 18 ప్రభుత్వ ప్రకటన తర్వాత ఇంటర్న్‌మెంటులను ఎక్కువ చేశారు. ఏప్రిల్ 6 తర్వాత విశాఖ పట్టణంలో పని చేస్తున్న జొన్నలగడ్డ రామ లింగయ్యను గుంటూరు జిల్లాలోని ఆయన స్వగ్రామంలో ఇంటరన్ చేశారు. కె. బంగారురాజు, తణికెళ్ల వెంకట చలపతి (పశ్చిమ గోదావరి జిల్లా కాంగ్రెసు కమిటీ మెంబరు) కృత్తివెంటి వేంకటేశ్వరరావు (భీమవరం తాలూకా కాంగ్రెసు కమిటీ కార్యదర్శి) పి. వి. శివయ్య (గుంటూరు జిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ కార్యదర్శి) అన్నాప్రగడ కామేశ్వరరావు, దుర్భా కృష్ణమూర్తి (గుంటూరు) వాసిరెడ్డి శివలింగ ప్రసాద్ (ఆల్ ఇండియా కిసాన్ సభ సంయుక్త కార్యదర్శి) వెల్లంకి విశ్వేశ్వరరావు (కృష్ణా జిల్లా రైతు సంఘ కార్యదర్శి) బి. శంకరయ్య (నెల్లూరు జిల్లా రైతు సంఘ కార్యదర్శి, నెల్లూరు జిల్లా కాంగ్రెసు కమిటీ సహాయ కార్యదర్శి) అ రంగయ్య, రావి ఆదిశేషయ్యలను వారి వారి గ్రామాలలో ఇంటరన్ చేసింది ప్రభుత్వం.

ఇదే సంచికలో మరొక చోట ఆ పత్రిక యిలా రాసింది.

''స్వతంత్ర్య భారత్'' క్రమబద్ధంగా వస్తున్నది. ప్రభుత్వం ఇంటరన్ చేయాలనీ లేదా డిటైన్ చేయాలని తలపెట్టిన అనేక మంది కామ్రేడ్సు తప్పించు కున్నారు దానితో ప్రభుత్వానికి మతిపోయింది. ఇంటరన్ చేసిన కామ్రేడ్సును నెల్లూరు సెంట్రల్‌జైలులో డిటైన్ చేయడం ప్రారంభించింది. నెల్లూరులో ఇంటరన్ చేసిన కామ్రేడ్సు అందరినీ, ఏలూరుకు చెందిన గారపాటి సత్యనారాయణనూ నెల్లూరు జిల్లా కో-ఆపరేటివ్ బ్యాంక్‌కు చెందిన ఖండవల్లి కృష్ణారావునూ డిటైన్ చేసింది. ''స్వతంత్ర్య భారత్'' ముద్రణకు సహాయపడుతున్నాడనే కుంటి సాకు

-చొప్పించి, బ్యాంక్ కార్యదర్శి అవడం మూలాన తన పదవినుపయోగించుకొని కమ్యూనిస్టులకు ధన సహాయం చేస్తున్నాడని చెప్పింది. (బ్యాంక్ డబ్బు్నంతా ఆయన కమ్యూనిస్టులకు ఇచ్చి వేస్తున్నాడనే భావాన్ని ప్రభుత్వ ప్రకటన కలుగ జేస్తోంది.)

కమ్యూనిస్టు పత్రాలను, స్వతంత్ర్య భారత్ పత్రికలను కల్గియున్నారని అనేకమంది కామ్రేడ్సును ప్రభుత్వం అరెస్టు చేసింది. రాజమండ్రి రైల్వే వర్కర్ డి. సుబ్బారావు, కాలనాధభట్ల కామేశ్వరరావు, ఆర్ బి. పెండ్యాల, కంభంపాటి సత్యనారాయణ (నవశక్తి సంపాదకులలో ఒకరు) తూర్పు గోదావరిజిల్లా రైతు సంఘ కార్యదర్శి సూర్యనారాయణరాజు, గుంటూరులో ఇద్దరు ప్రెస్ కార్మికులు, అనంతపురం వాస్తవ్యులు వెంకటసుబ్బయ్య, డి. మాణిక్యాలరావు, కడుపు రాములు, డి. లాజరన్స్, యస్ సోమేశ్వరరావు, ఎ. రాములు, కె. శ్రీరామ మూర్తి, వై. నరసింహారావు, డి. సత్యనారాయణ (ఫార్వర్డు బ్లాకు సభ్యులు) ఉపన్యాసాలిచ్చినందుకు అరెస్టు చేయబడ్డారు. నరసింహారావుకు సంవత్సరం కఠిన శిక్ష విధింపడింది.'' సత్యనారాయణకు 18 నెలల కఠిన శిక్షవిధింపబడింది.

''స్వతంత్ర్య భారత్'' పత్రికలున్నందుకు ఈ క్రింది వారికి శిక్షలు విధించ బడ్డాయి. ప్రభుత్వ రహస్య నివేదికలలో వారిని గురించి రాసిన వివరాలివి :

## అన్నె వెంకటేశ్వరరావు :

ఈయన ఏలూరు తాలుకా సత్రంపాడుకు చెందినవాడు కొద్ది ఎకరాల భూమి వుంది. ఏలూరు తాలూకా రైతు సంఘ కార్యదర్శి. జైలుకు వెళ్లకముందు కాంగ్రెస్ కమిటీ కార్యదర్శి.

కమ్యూనిస్టు పార్టీ ప్రచురించిన....చట్టవిరుద్ధమైన అత్యంత విప్లవకరమైన కరపత్రం ''స్వతంత్ర్య భారత్'' ఏలూరు తాలూకాలోని గ్రామాల్లో పంచిపెట్ట డానికి అన్నె వెంకటేశ్వరరావు బాధ్యుడు.

.... 3-10-40 న గవర్నర్ ఏలూరును సందర్శించినవుడు చట్టవిరుద్ధ మైన ''స్వతంత్ర్య భారత్'' వెంకటేశ్వరరావు వద్ద వుంది.

పై కారణాలవల్ల, యుద్ధ వ్యతిరేక కలాపాలను మరికొన్నింటిని ఆయన సాగించినందునా, ఆయన జైలుశిక్ష ముగిసిన తర్వాత కూడా మరో సంవత్సరం డిటెన్ చేయవలసిందిగా పశ్చిమ గోదావరిజిల్లా డి.యస్.పి రికమెండ్ చేశాడు. 1942 ఫిబ్రవరి 8న విడుదల కావలసిన అన్నె వెంకటేశ్వరరావును మరో సంవత్సరం డిటెన్ చేయవలసిందిగా రికమెండు చేస్తున్నాను అని జిల్లా మేజిస్ట్రేట్ మద్రాసు ప్రభుత్వ ముఖ్య కార్యదర్శికి 3-4-42 న జాబు రాశారు. (ఆర్ ఓ. సి.సి. 670/14-39).

పశ్చిమ గోదావరి జిల్లా మేజిస్ట్రేట్ ఏలూరు నుండి మద్రాసు ప్రభుత్వ కార్యదర్శి (పబ్లిక్ డిపార్టుమెంటు) పంపిన రిపోర్టు.

ఆన్నె వెంకటేశ్వరరావు కమ్యూనిస్టు అనీ, గారపాటి సత్యనారాయణ, ఎ. వి. చలపతి, పేటేటి వెంకటరత్నం గార్ల సన్నిహితుడని కూడా ఇదే సమాచారంలో తెలియజేశారు

వెంకటేశ చెట్టి : "స్వతంత్ర్య భారత్" తనవద్ద ఉన్నందుకు ఇతనిపై డి. ఐ. ఆర్. 39 వ నిబంధన క్రింద నెల్లూరులో కేసు పెట్టబడింది. ప్రభుత్వ వ్యతిరేక కార్యకలాపాలలో నిమగ్నమైన వారిని నిరుత్సాహపరిచేందుకు ఈ చర్య అవసరమైంది.

(మద్రాసు ప్రభుత్వం నుండి భారత ప్రభుత్వ హోం డిపార్టుమెంటు కార్యదర్శికి 1940 జనవరి రెండవ పక్షంలో పంపిన రిపోర్టు.)

## కోటిపల్లి అప్పన్న :

పశ్చిమ గోదావరి జిల్లా తణుకు తాలుకా మల్లేశ్వరం గ్రామానికి చెందిన కోటిపల్లి అప్పన్న ...రహస్యంగా "స్వతంత్ర్య భారత్"ను తణుకు తాలుకాలో పంచుతున్నాడు. 29-4-41 న అతని ఇల్లు సోదాచేయబడింది. తణుకు తాలుకాలో 58 గ్రామాలలో 112 మందికి "స్వతంత్ర్య భారత్ను" రహస్యంగా పంచేందుకు అతను బాధ్యుడు. క్రియాశీల కార్యకర్త. జిల్లా కమ్యూనిస్టు పార్టీకి నిధుల్ని సేకరిస్తున్నాడు. 4-6-41 న పెరవల్లిలో అరెస్టయ్యాడు. 18-6-41 న అతణ్ణి వెల్లూరు సెంట్రల్ జైలులో డిటెన్ చేయవలసిందిగా (1327 యస్. 92 - బి 18, 1641 ప్రకారం) ప్రభుత్వం ఉత్తర్వు జారీ చేసింది.

(1940 జూలై లో మద్రాసు ప్రభుత్వం భారత ప్రభుత్వం హోం డిపార్టుమెంటు కార్యదర్శికి పంపిన మొదటి పక్షం రిపోర్టు నుండి)

జి ఓ. నెం. 1327 (యస్-92) పబ్లిక్ (జనరల్) 18-6-41 జిల్లా పోలీస్ సూపరింటెండెంటు ఆఫీసు, పశ్చిమ గోదావరి జిల్లా నుండి 7-6-41 న పంపిన సమాచారం).

## ప్రముఖ కమ్యూనిస్టు :

పశ్చిమగోదావరి జిల్లాలో స్వతంత్ర్య భారత్ సంచికలు కలిగియున్నందుకు ఒక ప్రముఖ కమ్యూనిస్టు నాయకుడు అరెస్టయ్యాడు. ..

(1940 అక్టోబర్ మొదటి పక్షంలో మద్రాసు ప్రభుత్వం, భారత ప్రభుత్వ హోం డిపార్టుమెంట్కు పంపిన రిపోర్టు నుండి).

## హరి దక్షిణామూర్తి

హరి దక్షిణామూర్తి పాలకొల్లు వాస్తవ్యుడు .. 9-5-41 న పెనుగొండలో అతని సంచిని పోలీసులు సోదా చేశారు.. ...... అతని వద్ద పట్టుబడిన వాటిలో అత్యంత అభ్యంతరకరమైన విప్లవ వార్తాపత్రిక "స్వతంత్ర్య భారత్" కూడా వుంది. నర్సాపూర్ జాయింట్ మేజిస్ట్రేట్ ఇతనికి ఒక సంవత్సరం కఠిన శిక్ష విధించాడు. (5-9-41 జి ఓ నెం.1949 పబ్లిక్ (జనరల్) డిపార్టుమెంటు)

### జాలాది దశరథ రామరావు :

ఇతను బెజవాడలో కాంపౌండర్. తన సోదరుడు పార్థసారథికి రహస్యంగా కమ్యూనిస్టు సాహిత్యం చేరేందుకు, దానిని పంచేందుకు సహాయపడుతున్నాడని మద్రాసు స్పెషల్ బ్రాంచి డిప్యూటీ సూపరింటెండుకు నమ్మకమైన వార్త తెలిసింది. 1-8-41 న అతని ఇంట్లో సోదా చేయగా భారత కమ్యూనిస్టు పార్టీ సెంట్రల్ కమిటీ, ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీల తాలూకు తీవ్ర అభ్యంతరకరమైన, చట్టవిరుద్ధమైన కమ్యూనిస్టు సాహిత్యం దొరికింది. అందులో ఇంగ్లీషులో వెలువడ్డ ''కమ్యూనిస్టు'' పత్రికలు, ''స్వతంత్ర్య భారత్'' పత్రికలు ఉన్నాయి .... ముద్దాయి నేరం అంగీకరించాడు. 18 నెలల పాటు, రు. 500 బాండ్లపై ఇద్దరు జామీను యివ్వగా అతనిని విడుదల చేశారు. (జి.ఓ. నెం,2022, పబ్లిక్ (జనరల్) డిపార్టుమెంటు 16-8-41)

### పిడికిటి మాధవరావు:

....స్వతంత్ర్య భారత్ పత్రికను, కృష్ణా జిల్లా కమ్యూనిస్టుపార్టీ ప్రచురించిన సైక్లోస్టైల్డ్ కరపత్రాలు (నంబర్ 1 నుండి నంబరు 9 వరకు) పంపిణీ చేయడానికి బాధ్యుడని తగిన అనుమానం వుంది.

... ఆయన ఇంటిని సోదా చేయగా, 1940 అక్టోబర్ 'కమ్యూనిస్టు', 1937 ఫిబ్రవరి 'కమ్యూనిస్టు', 6-9-39 నవశక్తి కన్పించాయి. ఇతను మద్దుకూరి చంద్రశేఖరరావు, గద్దె లింగయ్య గార్లకు సన్నిహితుడు. 'విప్లవ యుగం' (నిషేదింపబడిన గ్రంథం) అమ్ముతున్నాడు. మంతెనవారిపాలెం ఆర్థిక రాజకీయ పాఠశాలలో భార్యతో సహా పాల్గొన్నాడు. ధనవంతుడు. కమ్యూనిస్టు పార్టీకి బాగా డబ్బిస్తున్నాడు. ఈయన ఇంట్లో సోదా జరిగినపుడు, పరారీలో వున్న గద్దె లింగయ్య దొరికాడు. గుడివాడ సబ్ మేజిస్ట్రేట్ క్షమాపణ కోరినా కూడా ఈయనకు 9 నెలల కఠిన శిక్ష విధించాడు.

(1941 మే 8 న పోలీసు సూపరింటెంటు పంపిన రిపోర్టు లెటర్ నుంచి. జి. ఓ. నెం. 2363 పబ్లిక్ (జనరల్) డిపార్టుమెంటు (25-10-41).

జి.ఓ. నెం.1061 (యస్-32) పబ్లిక్ (జనరల్) డిపార్టుమెంటు-20-5-41)

## గద్దె లింగయ్య :

మద్రాసు ప్రభుత్వం, యలమర్రు వాస్తవ్యుడు గద్దె రామయ్య కుమారుడు లింగయ్య (వయస్సు 30).... డిఫెన్సు ఆఫ్ ఇండియా రూల్సు క్రింద ఈ ఉత్తర్వు రద్దు చేయబడేంతవరకు డిటైన్ చేయవలసిందిగా కోరుతున్నది.

యలమర్రుకు చెందిన గద్దె లింగయ్య అరెస్టు గురించి కృష్ణా జిల్లా స్పెషల్ బ్రాంచి సబ్ ఇన్‌స్పెక్టరు రిపోర్టుపై 1941 మార్చి 18 వ తేదీ జి. ఓ. 566 తో కలిపి డిఫెన్సు ఆఫ్ ఇండియా రూల్సు 129 (2) క్రింద కృష్ణా జిల్లా పోలీసు సూపరింటెండెంటు జారీచేసిన ఉత్తర్వు కాపీ.

"యలమర్రుకు చెందిన గద్దె లింగయ్య చురుకైన కమ్యూనిస్టు ఆర్గనైజరు మద్రాసు ప్రభుత్వ అనుమానించిన వ్యక్తుల స్టార్ లిస్టులో ఉన్నాడు (ప్రభుత్వం నిఘావుంచిన వ్యక్తులకు నక్షత్రాల గుర్తులు తమపైళ్ళలో ఉంచేవారు ఒక నక్షత్రం ఉంటే ప్రమాదకర వ్యక్తి. ఇలా నక్షత్రాలు పెరిగినకొద్దీ అతను ఎంత ప్రమాద కారుడో తెలుస్తూవుంటుంది.-సం) యలమర్రులోని ఆదర్శ గ్రంథ మండలికి ఆయన సంపాదకుడు. ఈ గ్రంథ మండలినుండి సోషలిస్టు కమ్యూనిస్టు విషయాలపైన అనేక ప్రచురణలు వెలువడ్డాయి. ఈ విషయాలపై ఆయన అనేక గ్రంథాలు రాశాడు. వాటిలో కొన్నింటిని నిషేధించారు. 1938 లో పామర్రులో జరిగిన ఆర్థిక రాజకీయ పాఠశాలకు ఆయన ప్రిన్సిపాల్. 1939, 1940 లలో కృష్ణా జిల్లా కమ్యూనిస్టు పార్టీ పేరుతో యుద్ధ వ్యతిరేక, బ్రిటిషు వ్యతిరేక సైక్లోస్టయిల్ కరపత్రాలు 1 వ నంబరునుండి 9 వ నంబరువరకు ప్రచురించుటలో ఈయన పాత్ర వుంది.

1940 సెప్టెంబర్‌లో ఆయన కనపడకుండా వెళ్ళాడు. అప్పటినుండి అండర్ గ్రౌండ్ కమ్యూనిస్టు కార్యకలాపాలను కొనసాగించుతున్నాడు. చాలా అభ్యంతరకరమైన పుస్తకం 'విప్లవ యుగం'ను రహస్యంగా ప్రచురించాడు. దీనిలో భారత దేశంలోని టెర్రరిస్టు ఉద్యమ చరిత్ర వుంది. ప్రముఖ టెర్రరిస్టుల జీవితాలను ఇందులో ప్రస్తుతిస్తూ ప్రచురించారు. వారి ఫోటోలు కూడా ప్రచురింపబడ్డాయి. తన సహచరుల ద్వారా ఈ పుస్తకాన్ని ఆయన అమ్మకొనసాగించాడు. ఆంధ్ర గ్రంథ మండలి కేటలాగులో ఎడ్వర్‌టైజుమెంటు నోటీసులను పెట్టాడు. పుస్తకాలను కొనవలసిందిగా కేన్వాసు చేస్తూ 350 అడ్రసులకు జాబులు రాశాడు. 29-4-41 న 4-30 తెల్లవారుజామున పిడికిటి మాధవరావుగారింట్లో సోదా చేయగా అరెస్టయ్యాడు. ఆయన ఇల్లు కూడా సోదాచేయగా నిషిద్ధ గ్రంథాలు దొరికాయి. గుడివాడలో 29-4-41 నుండి 7 రోజులు పోలీసు కస్టడీలో వుంచవలసిందిగా ఆదేశిస్తున్నాను. విచారణ చేసేందుకుగాను ఈ చర్య అవసరమైంది.

## మండవ వెంకట సుబ్బారావు :

ఇతను మూడేళ్ళుగా గుంటూరులో వుంటున్నాడు. 1938 లో మోటూరి హనుమంతరావు (ఇతని కజిన్) "స్టూడెంటు ఎంపోరియం"ను అరండల్ పేటలో స్థాపించాడు. నిందితుడు (మం. వె. సుబ్బారావు) అందులో క్లర్కుగా ఉన్నాడు. నిందుతుని సహాయంతో హనుమంతరావు రహస్యంగా కమ్యూనిస్టు ప్రచురణలను, మరీ ముఖ్యంగా చట్ట విరుద్ధ పత్రికయైన కమ్యూనిస్టు పార్టీ పత్రిక "స్వతంత్ర్య భారత్"ను జిల్లాలో పంచుతున్నాడు. 10-3-40 న స్టూడెంటు ఎంపోరియంను సోదా చేయగా అభ్యంతరకరమైన సాహిత్యం చాలా పట్టుబడింది. "స్వతంత్ర్య భారత్" కాపీలు కూడా పట్టుబడ్డాయి. ఆరోజు నుండి మోటూరి హనుమంతరావు కన్పడటంలేదు. స్టూడెంటు ఎంపోరియంను రంగయ్య నాయుడుకు అమ్మివేశారు. దాని పేరు "సిటిజెన్స్ ఎంపోరియం"గా మార్చివేశారు. దానిలో నిందితుడు క్లర్కుగా కొనసాగుతున్నాడు. పరారీలో వున్న మోటూరి హనుమంతరావును తన గదిలో దాస్తున్నాడనీ, గదికి బయట తాళం వేస్తున్నారనీ పోలీసులకు భోగట్టా వచ్చింది. పోలీసులు తాళం బద్దలుకొట్టి సోదా చేశారు. కాని హనుమంతరావు దొరకలేదు.

26-5-41 నాటి తాజా 'స్వతంత్ర భారత్' టేబుల్‌పైన వుంది. దానిని పోలీసులు స్వాధీనపరుచుకొన్నారు. కమ్యూనిజం, ఇంకా తత్సంబంధమైన విషయాలపై అనేక పుస్తకాలున్నాయి. "డౌన్ విత్ వార్" (యుద్ధం నశించాలి) "వై యాంటీ వార్" (ఎందుకు యుద్ధ వ్యతిరేకత) అనే కరపత్రాలను స్వాధీనపరచుకొన్నారు. పై కరపత్రాలు యం.యస్.వొ. (మద్రాసు విద్యార్థుల సంఘం) విశాఖపట్టణాలనుండి పై కరపత్రాలు వెలువడ్డాయి. అయితే నిందితుని బెనిఫిట్ ఆఫ్ డౌట్స్‌తో విడిచిపెట్టాడు గుంటూరు సెషన్స్ జడ్జి జి ఓ. నెం. 2371 పబ్లిక్ (జనరల్) డిపార్టుమెంటు 27-10-41).

## బి. సోమిరెడ్డి, కోడి నరసింహం :

మద్రాసు స్పెషల్ బ్రాంచి పోలీసు సూపరింటెండెంటు 30-7-41 న నంద్యాలకు చెందిన కోడి వరసింహం, నూనెపల్లికి చెందిన బి. సోమిరెడ్డిగార్ల ఇండ్లను సోదా చేయగా 30-12-40 వ తేదీ "స్వతంత్ర భారత్" మరికొన్ని గ్రంథాలు దొరికాయి.

(కర్నూలు జిల్లా మేజిస్ట్రేట్‌కు కర్నూల్ పోలీసు సూపరింటెండెంటు 25-8-41న పంపిన సమాచారం. ఆంధ్రప్రదేశ్‌లో స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర 1941 నుండి) కోడి నరసిహం వద్ద ఈ క్రింది సాహిత్యం దొరికింది.

1. పార్టీ లైబ్రరీ పుస్తకాల జాబితా, నిబంధనలు.
2. ఆంధ్రరాష్ట్ర ప్రెస్ వర్కర్ల తీర్మానం (19-11-39).
3. 1939 కాల్వబుగ్గలో జరిగిన రాజకీయ పాఠశాల రిపోర్టు.
4. కమ్యూనిస్టుపార్టీ పైన ఇతర సంస్థలపైన నిషేధం తొలగించవలసిందిగా కోరుతూ కోడి నరసింహం గారి దస్తూరితో వున్న తీర్మానాల రాతప్రతి.
5. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కమిటీకి సంబంధించిన నోట్సు.
6. సత్యాగ్రహం చేయబోతూన్నట్లు జిల్లా కలెక్టరుకు ఇవ్వదలచుకొన్న అచ్చు నోటీసులు (9 కాగితాలు)
7. 1939 రాజకీయ ఆర్థిక వేసవి పాఠశాల లక్ష్యాలు-ఉద్దేశ్యాలను వివరించు తున్న రాతప్రతి
8. బ్రిటిషు వస్తువులను బహిష్కరించాలనే సైక్లోస్టైల్డ్ కరపత్రం. ఇది గుంతకల్ కాంగ్రెస్ తయారు చేసింది.
9. కమ్యూనిస్టు పుస్తకాలతో సహా టైపు చేసిన పుస్తకాల జాబితా.
10. కోడి నరసింహం గారి దస్తూరితో ఉన్న బి. సోమిరెడ్డి పేరుతో సహా కొందరి పేర్ల జాబితా.
11. యం. (ముదిగంటి) జగనాథశాస్త్రి గారి బార్డోలి విజయం.
12. కలకత్తా నేషనల్ ఏజెన్సి వారి పుస్తకాల జాబితా.
13. ఎర్రటి రిబ్బన్‌తో సుత్తీ, కొడవలి ఉన్న కంచుబాడ్జి.
14. భగత్ సింగ్, రాజగురు, సుఖదేవ్‌ల ఫోటోలు

బి. సోమిరెడ్డి వద్ద దొరికిన పుస్తకాల జాబితా :-

1. 3-12-40 స్వతంత్ర భారత్.
2. భారత కమ్యూనిస్టు పార్టీచే 20-5-40 న జారీ చేయబడిన కమ్యూనిస్టు వార్తాలేఖ.

[జి. ఓ. నెం 1518 పబ్లిక్ (జనరల్) డిపార్టుమెంటు ఆగష్టు 1940/17 సెంట్ జార్జి]

3. ప్రెస్ పేరు, ప్రచురణ కర్తపేరు లేకుండా ప్రచురించిన తెలుగు పుస్తకం "కాంగ్రెసు సోషలిస్టు కాంగ్రెసా?"

## యాళ్లబండి రంగనాయకులు :

యాళ్లబండి రంగనాయకులు తణుకు తాలుకా పొలమూరు వాస్తవ్యుడు ... చట్టవిరుద్ధమైన కరపత్రం "స్వతంత్ర భారత్", ఇంకా అలాంటి అభ్యంతర కరమైన సాహిత్యాన్ని పంచిపెట్టేవారిలో ఒకడు. (రంగనాయకులు గారి యుద్ధ వ్యతిరేక కమ్యూనిస్టు కార్యకలపాలను ఈ సమాచారంలో వివరించాడు. పశ్చిమ

గోదావరి జిల్లా కలెక్టరు ఆయన్ని డిఫెన్స్ ఆఫ్ ఇండియా రూల్సు క్రింద అరెస్టు చేసి డిటైన్ చేయవలసిందిగా కలెక్టరు కోరాడు )

[పశ్చిమ గోదావరి జిల్లా కలెక్టరు నుండి మద్రాసు పబ్లిక్ డిపార్టుమెంటు (జనరల్) ప్రభుత్వ కార్యదర్శిగారికి 14-1-41 అందజేసిన సమాచారం.]

ఆర్.ఓ.సి నెం. 570 (యమ్ - 39)

## నండూరి ప్రసాదరావు :

........ 1941 జనవరి 8న మునగాల గ్రామం శివారులో అనుమానంపై ఈయన అరెస్టు చేయబడ్డాడు 1940 డిసెంబరు 3వ తేదీ గల అచ్చయిన "స్వతంత్ర భారత్" కాపీ ఆయన వద్ద ఉంది.

"కమ్యూనిస్టు పార్టీ నిబంధనావళి,పని" అనే పుస్తకం కూడా ఉంది. అందుచే ఆయన్ని డిఫెన్స్ ఆఫ్ ఇండియా రూల్స్ 24 వ నిబంధన క్రింద ప్రాసిక్యూట్ చేయవలసిందిగా కృష్ణా జిల్లా మేజిస్ట్రేట్, మద్రాసు ప్రభుత్వ పబ్లిక్ డిపార్టుమెంటు (జనరల్) ప్రధాన కార్యదర్శికి రాశాడు.

[జి.ఓ. నెం. 802 పబ్లిక్ డిపార్టుమెంటు (జనరల్) 22-4-41]

## బోయిన వెంకటప్ప :

అనంతపురం జిల్లా సింగనమల గ్రామస్థుడు .... . బెజవాడ రైల్వే స్టేషన్‌లో 1940 డిసెంబరు 2రన 10-35 గంటలకు అనుమానంపై ఇతడ్ని అరెస్టు చేసి సోదా చేయగా "స్వతంత్ర భారత్" పత్రికలు (5-3-40, 27-9-40, 24-10-40, 15-11-40 తేదీలవి.) కమ్యూనిస్టు పార్టీ జారీ చేసిన కరపత్రాలు దొరికాయి వీటిలో అభ్యంతరకరమైన రిపోర్టులు, యుద్ధ వ్యతిరేక ప్రచారం, రిక్రూట్‌మెంటు వ్యతిరేక ప్రచారం గల విషయాలున్నాయి. యుద్ధాన్ని, బ్రిటిషు ఇండియా సంరక్షణను సమర్ధవంతంగా నిర్వహించటానికి ఆటంకం కల్గించేవిగా ఉన్నాయి. ఇతనికి నాలుగు నెలల కఠిన శిక్ష విధించబడింది.

15-11-40 తేదీ గల "స్వతంత్ర భారత్"లో మొదటి పేజీలో ఇలా వుంది. (ఇంగ్లీషు నుండి తెలుగులోకి అనువాదం ఇది-సం.)

"జాతీయోద్యమాన్ని రక్షించాలంటే ఈ క్రింది కార్యక్రమాన్ని ఆమోదించాలి.

1. పోస్టర్లు, కరపత్రాల ద్వారా యుద్ధ వ్యతిరేక ప్రచారం, రిక్రూట్‌మెంటుకు యుద్ధ కృషికి ప్రతికూలంగా గుసగుసల ద్వారా ప్రచారం సాగించాలి.
2. యుద్ధంలో పాల్గొనడం వల్ల ఏర్పడ్డ అనేక విధాలైన కష్టాలను బహిర్గతం చేస్తూ ఆర్థిక హక్కుల కోసం బాధిత వర్గాలను పోరాడాలని రెచ్చగొడుతూ, సార్వత్రిక సమ్మెను సంఘటిత పరచాలి

3. ప్రతి కాంగ్రెస్ నాయకుని అరెస్టుకు నిరసనగా, నిర్బంధ విధానానికి వ్యతిరేకంగా ప్రదర్శనలు జరపాలి. ప్రజల ఐక్య బలంతో పోలీసు హింసా కాండను త్రిప్పికొట్టాలి. ప్రతి గ్రామంలోనూ, పట్టణంలోనూ హర్తాళ్లు జరపాలి.

4. స్వాతంత్ర్య పోరాటానికి కాంగ్రెస్ నాయకత్వం నష్టం కల్గించే విధంగా వుందని ప్రజలకు, ముఖ్యంగా కాంగ్రెస్‌వాదులకు బోధించాలి. నిజమైన పోరాటం సాగించితే, విజయం మనదే.

రెండవ పేజీలో ఇలా వుంది:-

"యుద్ధ నిధి వసూళ్ల పేరుతో బ్రిటిషు అధికారులు ప్రజలను నిర్బంధించి భయపెట్టి దోపిడీ చేస్తున్నా విషయాన్ని అందరూ గమనించుతూ ఉన్నారు.

(జి. ఓ. నెం. 222 పబ్లిక్ డిపార్టుమెంటు (జనరల్) 1-2-41)

## సూరపనేని రామశేషగిరిరావు తదితరులు :

19-9-40 రాత్రి సూరపనేని రామశేషగిరిరావు ఇంట్లో కొందరు యాక్టివ్ కమ్యూనిస్టులు కలుసుకొంటారని, యుద్ధ వ్యతిరేక ప్రచారం, కమ్యూనిస్టు ప్రచారం కోసం చేయవలసిన పనులను కేంద్రీకరించేందుకు వీరు సమావేశమౌతున్నారని, వారివద్ద అభ్యంతరకర రిపోర్టులున్నాయని గుడివాడ సబ్ ఇన్‌స్పెక్టరు తెలుసుకొన్నారు. అతని ఇంటిని సోదా చేయడానికి వారంట్ పొందాడు. అదే రోజు రాత్రికి కొంతమంది మధ్యవర్తులతో కలసి అక్కడికి వెళ్లాడు. కిటికీలోంచి చూడగా సూరపనేని రామశేషగిరిరావు, జోస్యభట్ల సత్యనారాయణ కొన్ని పత్రాలను చదువుతున్నారు. తమ్మారెడ్డి సత్యనారాయణ, మరో ఆరుగురు పార్టీ సభ్యులకు వాటిని వివరించుతున్నారు. ఈ విషయం వారు చర్చిస్తూన్నారు. మరుసటి రోజు ఉదయం ప్రచారం కోసం ప్రక్క గ్రామాలకు వెళతామని కొందరు చెప్పడం వినిపించింది.

ఈ స్థితిలో సబ్ ఇన్‌స్పెక్టరు గదిలో ప్రవేశించాడు. ఆంధ్రి కమ్యూనిస్టు పార్టీ ప్రచురించుతున్న చట్ట వ్యతిరేక వార్తా పత్రిక "స్వతంత్ర భారత్" 3-9-40 తేదీ ప్రతులు రెండు అచ్చయినవి సూరపనేని రామశేషగిరిరావు, జోస్యభట్ల సత్యనారాయణ గార్ల చేతులలో ఉన్నాయి.

ఈ ముగ్గురికినీ తగిన స్వతంత్ర సాక్ష్యం లేదనే కారణంతో విడుదలచేస్తూ కేసు కొట్టివేయబడింది.

21-2-41 తేదీగల జి. ఓ. నెం. 367 పబ్లిక్ డిపార్టుమెంటు (జనరల్) గుడివాడ 116/40 పోలీసుస్టేషన్ చార్జిషీటు కాపీ

(యుద్ధవ్యతిరేక కరపత్రాలు పంచుతూన్నందుకు డిఫెన్సు ఆఫ్ ఇండియా చట్టం క్రింద ప్రాసిక్యూట్ చేయవలసిందిగా ఉత్తర్వు చేసినట్లు 1940 అక్టోబరు మొదటి సక్రమ రిపోర్టులో ఉంది.)

## సరస్వతుల సోమేశ్వరరావు :

సరస్వతుల సోమేశ్వరరావు (మునుగోడు ముంగడ) మల్లాది కృష్ణమూర్తి (రాజోలు) కమ్యూనిస్టు సాహిత్యం 'స్వతంత్ర భారత్'ను పంచుతున్నందుకు ప్రాసిక్యూట్ చేయవలసిందిగా ఆర్డరు ఇవ్వడమైనది.

(1940 జూలై రెండవ పక్షంలో కేంద్ర ప్రభుత్వ హోం శాఖా కార్యదర్శికి పంపిన సమాచారం.)

మద్రాసు ప్రభుత్వ పబ్లిక్ డిపార్టుమెంటు ప్రెస్ నోట్ 63 2-7-1940.

ప్రస్తుతం నెల్లూరు సెంట్రల్ జైలులోని ప్రత్యేక ఆవరణలో 12 మంది డిటైన్ చేయబడి వున్నారు వారి క్లుప్త సమాచారం.

ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీలో ప్రముఖ సభ్యుడు. తీవ్రంగా ఉపన్యసించే వ్యక్తి. ఆందోళనకారునిగా దీర్ఘ చరిత్ర గల వ్యక్తి .... జిల్లా మేజిస్ట్రేట్ హెచ్చరించాడు. ఆ తర్వాత రహస్య జీవితం సాగించుతున్నాడు. చట్టవిరుద్ధమైన హింసాత్మకమైన, యుద్ధ వ్యతిరేక విప్లవ వార్తాపత్రికలు ''స్వతంత్ర భారత్'' "ఫార్వర్డ్'' పత్రికలను ఇతర పత్రికలను రహస్యంగా తయారు చేయుటలోనూ పంచుటలోనూ సంబంధం కల్గి వున్నాడు

వై. సూర్యారావు
టి. అప్పలసామి
కె. కామేశ్వరరావు
} అభ్యంతరకరమైన పత్రాలు, యుద్ధ వ్యతిరేక పోస్టరు వారి వద్ద ఉన్నందున వీరిపై చర్య తీసుకోవలసివుంది.

## 1940 మార్చి 2వ పక్షం రిపోర్టు :

"....చట్టవిరుద్ధ సాహిత్యాన్ని ఉత్పత్తి చేయడంలో బహుశా అతిముఖ్యమైన జిల్లా తూర్పు గోదావరి జిల్లాలో, చట్టవిరుద్ధమైన వార్తాపత్రిక (న్యూస్‌షీట్) ను అచ్చు వేస్తున్న ప్రెస్‌ను పోలీసులు కనుగొన్నారు. అయితే దురదృష్టవశాత్తు ఆ వార్తాపత్రికలో అభ్యంతరకరమైన రిపోర్టు లేదు అందుచే దానికి సంబంధించిన వ్యక్తులను 18 ప్రెస్ ఆక్ట్ (ఎమర్జన్సీ) సెక్షన్ క్రింద ఆ పత్రాలను పంచిన వారిని ప్రాసిక్యూట్ చేయడానికి వీలవుతుంది

## కృష్ణాజిల్లా

కృష్ణాజిల్లాలో "స్వతంత్ర భారత్" చదువుతున్న ఒక ముఠాను రాత్రి పూట సోదాలో అక్కడికక్కడ పట్టుకొన్నాము. ఈ చట్టవిరుద్ధమైన కమ్యూనిస్టు పత్రిక-దాని గెటప్ దిగజారుతున్నా-వస్తూనేవుంది.

(1940 సెప్టంబర్ రెండవ పక్షం సమాచారం)

....... ఈ పక్షంలో కమ్యూనిస్టు సాహిత్యం తగినంత పట్టుబడింది. గుంటూరులో ఒక విచిత్ర ఘటన జరిగింది. పోలీసులు గదిలోకి వచ్చినపుడు ఆరుగురు విద్యార్థులు "స్వతంత్ర భారత్" తో సహా కమ్యూనిస్టు సాహిత్యాన్ని తగులవేయడానికి ప్రయత్నించారు. కాని పోలీసులు ఆర్పివేసి చాలావరకు కాల కుండా ఆపగలిగారు

కేంద్రం హోం మంత్రిత్వ శాఖా కార్యదర్శికి మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం పంపిన 1941 ఆగష్టు మొదటి పక్షం రిపోర్టు.

## "స్వతంత్ర భారత్" రచనలు ఎలా ఉండేవి?

ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీ పత్రిక "స్వతంత్ర భారత్" పత్రిక ఒక సంచికలో ఇలా రాసింది :

"యుద్ధం ప్రారంభమై ఇంకా రెండు నెలలు కాకపోయినా, ఒక లక్ష మంది జర్మన్లు, నాలుగు లేక ఐదు లక్షల పోలండ్ వాసులు, యుద్ధ రంగంలో బలి పెట్టబడ్డారు. యుద్ధ రంగంలో బలిపెట్టడానికిగాను బ్రిటిషు ప్రభుత్వం ఇప్పటికే 30 వేల భారతీయుల్ని సైన్యంలోకి చేర్చుకొంది. రోజుకు 1000 మంది చొప్పున ఆహుతి చేయడానికిగాను బ్రిటీషు సైనికాధికారులు వారిని ఆకర్షించారు. మరొక 25 వేలు మందిని చేర్చుకోబోతున్నామని వారు ప్రకటించారు. భారతీయుల రక్తం ఈ విధంగా ఆహుతి కావల్సిందేనా? . ... . . ఇంగ్లాండు, జర్మనీలు పరస్పరం వారివారి స్వాధీనంలో వున్న వలస దేశాల దోచుకొనేందుకే సృష్టించిన యుద్ధంలో భారతీయుల రక్తం రణరంగంలో ప్రవహించవలసిందేనా? ఎన్నటికీ అలా కారాదు. ఈ యుద్ధాన్ని మేము వ్యతిరేకించుతాము. మేము సంపూర్ణ స్వాతంత్ర్యానికై పోరాడుతాము. ఇంగ్లీషు సైన్యంలోకి ఒక్క మనుష్యుడు కూడా చేరకూడదు. బ్రిటిషు సామ్రాజ్యానికి ఒక్క పైసా కూడా ఇవ్వరాదు. భారత దేశ స్వాతంత్ర్యానికై తీర్మానించిన కాంగ్రెస్, ఇలాంటి సమయంలో పోరాడటంలో విఫలమవడం విచారకరం ....... సత్యాగ్రహం కొనసాగించాలి"

(జి. ఓ. నెం. 1225 పబ్లిక్ (జనరల్) డిపార్టుమెంటు, 24-6-1940 నుండి ఈ పైభాగం ఇంగ్లీషు నుండి అనువదించబడింది.)

ది ఫ్రీడమ్ స్ట్రగుల్ ఇన్ ఆంధ్రప్రదేశ్ (ఆంధ్ర) వాల్యూమ్ 4 పేజీలు 121, 122) 15-11-40 స్వతంత్ర భారత్ నుండి ఉల్లేఖనలు.

1వ పేజీః- జాతీయ ఉద్యమాన్ని సంరక్షించేందుకు ఈ క్రింది కార్యక్రమాన్ని అవలంబించాలి.

1. పోస్టర్లు, కరపత్రాలు ద్వారా రహస్య యుద్ధవ్యతిరేక ప్రచారం, రిక్రూట్‌మెంటుకు యుద్ధ కృషికి వ్యతిరేకంగా ప్రచారం.
2. నిర్బంధ విధానానికి వ్యతిరేకంగా ప్రతి గ్రామంలో పట్టణంలోనూ ప్రదర్శనలు, హర్తాళ్లు జరపడంగాక కాంగ్రెస్ నాయకుని ప్రతి అరెస్టుకు నిరసనగా ప్రతి చోటా అసమ్మతి సభలు జరపాలి. ప్రజలు సమిష్టి బలం ద్వారా పోలీసుల హింసాకాండను ఎదుర్కొనాలి.
3. స్వాతంత్ర్య పోరాటానికి కాంగ్రెస్ నాయకత్వం హానికరంగా ఉందని ప్రజలకు ముఖ్యంగా కాంగ్రెస్‌వాదులకు బోధించాలి. నిజమైన పోరాటాన్ని ప్రారంభించితే విజయం మనదే. ఇవన్నీ చేయాలి.

2వ పేజీః- యుద్ధ నిధి వసూళ్ల మిషతో బ్రిటిషు అధికారులు, నిర్బంధం ద్వారా భయపెట్టి ప్రజలను దోపిడీ చేస్తున్న విషయాన్ని అందరూ చూస్తూనే వున్నారు.

24-10-40 స్వతంత్ర భారత్

1వ పేజీః- "ఈ సమయంలో మన కర్తవ్యం ఏమిటి?"

1. గాంధీజీ ప్రారంభించిన పోరాటం నిజమైన పోరాటం కాదు. పెట్టుబడి దారుల రక్షణ కోసం ఉద్దేశించబడింది. విప్లవం అంటే భయపడి జాతీయ పోరాటానికి తీవ్రమైన హాని కల్గిస్తున్నారు. ఈ విషయాన్ని వివరించాలి
2. స్థానిక కాంగ్రెస్ వాదుల సహాయంతో యుద్ధ వ్యతిరేక రహస్య ప్రచారాన్ని ప్రతి గ్రామంలోనూ, ఫ్యాక్టరీలోనూ, మార్కెట్‌లోనూ సాగించాలి. యుద్ధ నిధికి ఒక్క పైసా కూడా వసూలు కాకుండా చూడాలి. సైన్యంలో కూడా ఒక సిపాయీ కూడా చేరకుండా చూడాలి.

## స్వతంత్ర భారత్ 27-9-40

ఆకలి యాత్రలు:- అలాంటి ప్రదర్శనలు యావదాంధ్ర దేశంలోనూ జరపాలి యుద్ధ నిధి పేరుతో లక్షలాది రూపాయలను ఎగుమతి చేస్తున్న బ్రిటిషు ప్రభుత్వం పై ఒత్తిడి తేవాలి. అది మనదేశంలోని లక్షలాది ప్రజల బాధలను గుర్తించే విధంగా ఒత్తిడి తేవాలి.

5-3-40 వ సంచిక కూడా బ్రిటిషు ప్రభుత్వమునకు వ్యతిరేకంగా యుద్ధ ప్రయత్నాలకు వ్యతిరేకంగా ద్వేషాన్ని రెచ్చగొట్టే వ్యాసాలున్నాయి.

15-11-40 స్వతంత్ర భారత్ 3వ పేజీ, బ్రిటిష ప్రభుత్వం అణచి పెట్టిన విషయాలు - అనే శీర్షిక క్రింద, బ్రిటిష ప్రభుత్వంపైన సాగించిన కొన్ని తిరుగుబాట్లను గురించిన వార్తలున్నాయి.

## డప్పుల సుబ్బారాయుడును గురించి
## రామచంద్రుని వెంకటప్ప

.......... ''ఈ సుబ్బారాయుడు రాజమహేంద్రవరంవాడు. మెరక వీధి తెలగ, గోదావరి జిల్లాలో రచయితకు పోలీసు ఆఫీసరుగా పరిచయుడైనవాడు. ఉప్పు సత్యాగ్రహం రోజుల్లో దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు గారు కాకినాడలో ఉపన్యసిస్తుండగా వారి ఉపన్యాసం సభవారికి వినపడకుండా జేయ దానికి డప్పులవాండ్లను పిలిపించి డప్పులు వాయిపించాడు. దానిపై కాకినాడ వాస్తవ్యులైన కాంగ్రెస్ నాయకులు స్వర్గీయ మండపాక రంగయ్య నాయుడు గారు 'డప్పుల సుబ్బారావు' అని నామకరణం చేశారు. దానికి బహు ప్రచారం కల్పించినవారు ఈ రచయిత స్వర్గీయ కోడేటి రంగాచార్లు. 1930లో పెద్దాపురం తోట విందులో దగ్గర వుండి కోడేటి రంగాచార్యులుగారి చేయి విరగకొట్టించాడు. దానితో ఆయన నలిసి నలిసి మరణించాడు. రచయిత అతని కంట పడలేదు. అంచేత యింకా జీవించియుండి యిది వ్రాస్తున్నాడు. 'కంట పడలేదు' అంటే దాగడానికి కాని, పారిపోయాడని కాని తరుస్తారేమో, లేదు. తాపీగానే నడుస్తూ సుమారు ఒక వంద దెబ్బలు దాకా తిని మామూలు దారిన తోట దాటి వచ్చేశాడు. ఆ! ఈ డప్పుల సుబ్బారావు బహు కూృరుడు. బి కామేశ్వరమ్మ గారిని అసహ్య కరంగా ఆ తోటలో అపహాస్యం చేసిన నీచుడు. తన విద్యాభివృద్ధిని ఉద్యోగానికి మూలమైన స్వర్గీయ బారిష్టర్ కందుల వీరాస్వామి, నాయుడుగారి మీద పై అధికారి 'వద్దు వద్దంటున్నా' ఆయన్ను ''నీవీ ఉద్యోగానికి తగవు''అంటూ గద్దించి స్వయంగా చేయి చేసుకొని లాఠీ విసిరిన కృతఘ్నుడు. మూర్తీభవించిన స్వార్థం రాజభక్తి ముసుగు మాత్రమే. కాకినాడ సభలో సాంబమూర్తి ఎవరు? అని అడిగిన జిల్లా సూపరింటెండెంటుకు 'వీడు' అని చూపి, లాఠీ దెబ్బలకు ఆ మహా నీయుడు స్పృహ తప్పిపడి వుండగా ఆయన గుండెలపై బూటుకాలితో తన్నిన పరమతుంటరి. కాకినాడ ప్రజా బాహుళ్యమునకే గాక మండల వాసులందరికి అభిమాన పాత్రుడు, నాడు మున్సిపల్ వైస్ చైర్మన్ అయిన స్వర్గీయ మండ పాక రంగయ్య గారిని వ్యక్తి సత్యాగ్రహ మొనర్చగా అరెస్టు చేసి పిలక పట్టు కొని లాగుచు లాకప్‌లో త్రోసిన తులవ, పలవ."

కడియాల యానాదయ్య (వెల్లంపల్లి అప్పటి బంగోలు తాలుకా వాస్తవ్యులు) కాంగ్రెస్ అభిమాని. 1936 వెల్లంపల్లిలో బాబూ రాజేంద్రప్రసాద్‌ను ఆహ్వా

నించి 116 రూ. సమర్పించాడు. 1936 కాంగ్రెస్ తరఫున జిల్లా బోర్డు అభ్యర్థిగా గెలిచాడు.

ఈయనను ఒంగోలు బాంబు కేసులో అనుమానించి డప్పుల సుబ్బారావు అరెస్టు చేసి గుంటూరు తీసుకెళ్లి తిరిగి అదే రాత్రి ఒంగోలుకు తీసుకువచ్చి డప్పుల సుబ్బారావు దూషిస్తుండగా ఆయన నిరసించాడు. చిత్తుగా తాగిన సుబ్బారావు యానాదయ్య బీజాలపై బూటుకాళ్లతో తన్నగా చనిపోయాడు. శవాన్ని బావిలో పారవేసి "ఆత్మహత్య" చేసుకొన్నాడని కథ అల్లి ప్రకటించారు.

"కడియాల యానాదయ్య బాంబు కేసు సందర్భంగా ప్రశ్నింప బడటానికి పోలీసు డిప్యూటీ సూపరింటెండెంటు బి. సుబ్బారాయుడి అధీనంలో వుండగా బెల్లంపల్లి వద్ద బావిలో పడి ఆత్మహత్య చేసుకొని మరణించాడు" అన్న వార్త పత్రికలలో పడింది.

దీనిపై "అందుచేత ఇట్టి రాక్షసుని అధీనంలో వుండగా యానాదయ్య ఎలా మరణించి వుంటాడో ఊహించుకొని ఒక కన్నీటిబొట్టు వదిలాడు ఈ రచయిత" అని రాశారు, రామచంద్రుని వెంకటప్ప గారు.

గల్లపల్లి ఆది నారాయణ పంతులుగారి
షష్ట్యబ్ది పూర్తి సన్మాన సంచిక,
1972 నవంబర్ (153, 154, 155, పేజీలు)

## ప్రజాశక్తి

1941 జూన్ 22న హిట్లర్ సోవియట్ యూనియన్‌పై దాడి చేసారు. 1941 డిసెంబరు 7న జపాన్ అగ్ర రాజ్యాల పక్షాన యుద్ధంలో దిగి ఫిలిప్పైన్ దీవులు, ఈస్టు ఇండీస్, మలయా, బర్మా దేశాలు ఆక్రమించింది. మన దేశానికి జపాన్ దాడిప్రమాదం హెచ్చింది. ప్రపంచ యుద్ధస్వభావంలో వచ్చిన మార్పు ఆ సంవత్సరం చివరివరకు పార్టీ సభ్యులకు అర్థం కాలేదు. కేంద్ర కమిటీ నిర్ణయం కూడా ఆలస్యంగానే వచ్చింది. పార్టీ విధానంలో వచ్చిన మార్పు తరువాత పార్టీపై నిర్బంధ విధానం కొంత సడలింది. 1942 ఏప్రియల్‌లో కాకినాడ విశాఖపట్నాలపై జపాన్ యుద్ధ విమానాలు దాడి చేసి బాంబులు వేసాయి. పార్టీ సభ్యులలోనూ, ప్రజలలోనూ ప్రజా యుద్ధ పాలసీని గురించి, ఫాసిస్టు శక్తుల ప్రమాదాన్ని గురించి, జపాన్ దాడి ప్రమాదం గురించి పార్టీ ప్రచారం చేసింది.

అజ్ఞాతవాసంనుండి బయటికివచ్చిన కొందరు కామ్రేడ్సు 1942 ఏప్రియల్ నెలలో ఫాసిస్టు వ్యతిరేక పోరాట కార్యాలయాన్ని బెజవాడలో తెరిచారు. కామ్రేడ్ చలసాని వాసుదేవరావు గారు దీనికి ప్రారంభోత్సవం చేసారు. మే నెలలో అరెస్టు అయిన కామ్రేడ్సు కొందరు విడుదలయ్యారు. (తుమ్మల జ్ఞాపకాలు, కమ్యూనిజం)

పార్టీ విధానాన్ని ప్రజానీకంలోకి విస్తృతంగా తీసుకెళ్లవలసిన అవసరం ఏర్పడింది. ఇందుకు పత్రిక అవసరం ఎంతేని వుంది. ఈ కర్తవ్య నిర్వహణకు గానూ ప్రజాశక్తి 1942 జూన్ 17న పార్టీ లీగల్ పత్రికగా వెలువడింది.

ప్రజాశక్తి మొదటి సంచిక మొదటి పేజీ పై భాగంలో రాజకీయ వార పత్రిక అని వ్రాయబడింది. సంపాదకవర్గం సభ్యులుగా కాట్రగడ్డ రాజగోపాల రావు, చలసాని వాసుదేవరావు, తుమ్మల వెంకట్రామయ్య, కొండేపూడి లక్ష్మీ నారాయణ వున్నారు.

రెండవ సంచిక నుండి 6వ సంచికవరకు కాట్రగడ్డ రాజగోపాలరావు సంపాదకుడుగానూ, సంపాదక వర్గ సభ్యులుగా చలసాని వాసుదేవరావు, తుమ్మల వెంకట్రామయ్య, కొండేపూడి లక్ష్మీనారాయణ వున్నారు.

సంపుటి 1 సంచిక7లో సంపాదక వర్గంలో మార్పులు వచ్చాయి. సంపాదక వర్గంలో మద్దుకూరి చంద్రశేఖరరావు (సంపాదకుడు) కంభంపాటి సత్యనారాయణ, తుమ్మల వెంకట్రామయ్య, చలసాని వాసుదేవరావు వున్నారు. ఇంతేకాదు. ఈ సంచిక మొదటి పేజీలో అంతవరకు రాజకీయ పత్రిక అని వున్న ముఖ శీర్షికను మార్చి "అంతర్జాతీయ పార్టీ శాఖ, భారత కమ్యూనిస్టు పార్టీ ఆంధ్ర కమిటీ పత్రిక" అని పేర్కొనబడింది.

ఆ మరు సంచికలో సంపాదక వర్గంలో మరొక మార్పు జరిగింది. సంపాదక వర్గ సభ్యులుగా పుచ్చలపల్లి సుందరయ్యగారు కూడ చేరారు. సంపాదక వర్గం క్రింది విధంగా ప్రకటించబడింది. మద్దుకూరి చంద్రశేఖరరావు (సంపాదకుడు) కంభంపాటి సత్యనారాయణ, పుచ్చలపల్లి సుందరయ్య, తుమ్మల వెంకట్రామయ్య, చలసాని వాసుదేవరావు.

## మొదటి సంచికలోని శీర్షికలు, వ్యాసాలు :

ప్రజాశక్తి మొదటి సంచిక 8 పేజీలతో వెలువడింది. ప్రింటర్ అండ్ పబ్లిషర్‌గా కాట్రగడ్డ రాజగోపాలరావు వున్నాడు. బెజవాడలోని 'పాపులర్ ప్రింటర్సు' లో ఇది అచ్చు అయింది.

మొదటి సంచికలోని మొదటి పేజీలో 'బళ్లారి జైలు కామ్రేడ్సు సందేశం', మైనారిటీల సమస్య: పాకిస్తాన్‌ను గురించిన వ్యాసం వున్నాయి. రెండవ పేజీలో గుంటూరు జిల్లా ఫాసిస్టు వ్యతిరేక ప్రజా శిబిరం, బెజవాడ ప్రజా రక్షణ శిబిరం, గుంటూరు జిల్లా ఫాసిస్టు వ్యతిరేక కేంద్రము డైరెక్టరు గారి విజ్ఞప్తి వున్నాయి. మూడవ పేజీలో సంపాదకీయం, స్త్రీల వైజ్ఞానిక శిక్షణా శిబిరం, బెజవాడ వార్త వున్నాయి. 4వ పేజీలో 'ఆంగ్లో- సోవియట్ ఒడంబడిక లోని అంతరార్థం' పై వ్యాసం వుంది. 5వ పేజీలో 'మన రాజకీయాలు' 8వ పేజీలో అఖిల భారత

విద్యార్థి కన్వెన్షన్ : జాతీయ రక్షణ మహా సభను గురించిన వ్యాసం వున్నాయి. 6,7 పేజీలలో "జూన్ 22న రష్యన్ విజయోత్సవాలు జరవండి" అనే పిలుపు, కృష్ణాజిల్లాలో ఫాసిస్టువ్యతిరేక ప్రచార విధానంపై వివరణ, రాజమండ్రిలో ప్రజా రక్షణ శిక్షణా శిబిరం, రైల్వే కార్మిక సమస్యలు మొదలగు విషయాలున్నాయి.

## పత్రిక లక్ష్యాలు :

మొదటి సంచిక సంపాదకీయంలో ఈ విధంగా పత్రిక కర్తవ్యాన్ని చెప్పటం జరిగింది.

ఇది ప్రపంచ ప్రజల యుద్ధం. జర్మన్, జపాన్, ఇటలీ ఫాసిస్టు దుండగీడుల దురాక్రమణ బారి నుండి విముక్తి పొందుటకు ప్రపంచ ప్రజలు సాగించు తున్న పవిత్ర స్వాతంత్ర్య యుద్ధమిది. నాజీ జర్మన్ ఆధ్వర్యాన ప్రపంచ సామ్రాజ్యవాద మొక ప్రక్క, సోవియట్ యూనియన్ నాయకత్వాన ప్రపంచ ప్రజలు మరొకప్రక్క పోరాడుతున్నారు. ఈ యుద్ధ ఫలితం పైననే ప్రపంచ భవిష్యత్తు ఆధారపడి వుంది. ప్రజా పక్షం జయించితే ప్రపంచ ప్రజలందరికీ స్వేచ్ఛ, స్వాతంత్ర్యం లభిస్తుంది. ఫాసిస్టులే జయించితే ప్రపంచమంతా నీచాతి నీచమైన బానిసత్వం పాలపడుతుంది. అనగా దుర్భర బానిసత్వమా! లేక స్వాతంత్ర్యమా! అనే సమస్య నేడు ప్రపంచ ప్రజలనందరిని ఎదుర్కొంటోంది.

"ఈ యుద్ధంలో విజయం, ప్రపంచ ప్రజలందరికే విజయం. ప్రపంచ ప్రజా విజయంలోనే, భారత ప్రజల విజయం కూడా అంతర్భూతమై వుంది. అట్టి ప్రజా ప్రతిఘటనలో ప్రజా యుద్ధంలో భారతీయ ప్రజలు తమ యావచ్ఛక్తిని ఉపయోగించి ఫాసిస్టు శత్రువులను ఓడించిన నాడే, ఓడించుట ద్వారానే తమ స్వాతంత్ర్యాన్ని సంపాదించుకోగల్గుతారు."

మన స్వాతంత్ర్యాన్ని స్వాతంత్ర్య ఉద్యమ పునాదినే ఎగురగొట్టి, మన మాతృభూమిపై దాడి సల్పి, మన, ధన, మాన, ప్రాణాలకు నష్టం కల్గించనున్న జపానును ఎదిరించడం అంటే, మన స్వాతంత్ర్యం కోసం పోరాడటమే, మన స్వాతంత్ర్యం కోసం సామ్రాజ్యవాదులు పోరాడజాలరు. మన పవిత్రభూమిని, మన జాతీయ గౌరవాన్ని, సాంప్రదాయాన్ని రక్షించుకోవలసినది మనమే. జపాన్ దుండగీడులు మలయా, బర్మాలను ఆక్రమించి భారతదేశ సరిహద్దులకు వచ్చారు. గత ఏప్రియల్ నెలలోనే తెలుగు భూమిపైన-కాకినాడ, విశాఖపట్టణములపై విమానదాడి జరిగింది అస్సామ్ పట్టణాలపైన, గ్రామాలపైన చిట్టగాంగ్ బాంబులు వేయబడ్డాయి. జపాను దాడి ప్రమాదం మన దేశానికి ముఖ్యంగా మన

రాష్ట్రానికి నానాటికి హెచ్చింది. ఈ జపాను ఫాసిస్టు ప్రమాదాన్ని ఎదిరించుట ద్వారానే మన స్వాతంత్ర్యాన్ని సంపాదించుకోగల్గుతాం. ప్రపంచ ప్రజలు యిప్పుడు గావిస్తున్న పవిత్ర ప్రజా యుద్ధానికి తద్వారా ప్రపంచ ప్రజల విముక్తికి తోడ్పడిన వారమౌతాము. ప్రజా యుద్ధంలో పాల్గొని జపాను ఫాసిజాన్ని ఎదుర్కొనడమంటే అర్థమిదే.

జపాను దురాక్రమణను జయప్రదంగా నిరోధించుటకు అందుకు వలయు జాతీయైక్యతను, ప్రజా సమీకరణను సాధించి జపాను దుండగీడుల ఓటమికి "ప్రజాశక్తి" తీవ్రంగా పాటుబడుతుంది.

చైనా, సోవియట్ ప్రజలు దురాక్రమణకు వ్యతిరేకంగా చరిత్రాత్మకమైన ప్రతిఘటన జరుపుతున్నారు. భారత ప్రజలలో ఐక్యతను నిర్మించి, ప్రజలలో ఉత్సాహం కల్గించి ప్రజాయుద్ధ కృషిని తీవ్రపరచగలిగే జాతీయ ప్రభుత్వ నిర్మాణం కోసం 'ప్రజాశక్తి' పాటుపడుతుందని స్పష్టీకరించబడింది.

జపాను భారతదేశాన్ని జయించితే దుర్భర బానిసత్వం తప్పదని ప్రజలలో ప్రచారం చేసి, వారిలో ఆత్మ విశ్వాసాన్ని రేకెత్తించి, దురాక్రమణను ఎదిరించడానికి ప్రజా శక్తులను "ప్రజాశక్తి" సమీకరిస్తుందని చెప్పటం జరిగింది.

"యుద్ధ ఫలితంగా రవాణా సౌకర్యాలు లేక, ప్రజల కవసరమైన వస్తువులు కొరవడినాయి. మన దేశంలోనే వాటిని ఉత్పత్తి చేయడానికి ప్రయత్నించాలి. రైతులు పండించే వస్తువులను ప్రభుత్వమే కొని అవసర ప్రాంతాలకు పంపి, లాభాలు లేకుండా బీద ప్రజలకు అందజేయాలి. యుద్ధావసరాలను, ప్రజా అవసరాలను తీర్చడానికి అవసరమైన పరిశ్రమలను ప్రభుత్వం స్థాపించాలి. స్థాపించే వారికి దోహదమివ్వాలి జీవితావసర వస్తువుల ఖరీదులు హెచ్చుటచేత, కార్మికుల జీతాలను హెచ్చించాలి అదనపు పనికి రెట్టింపు జీతమివ్వాలి. సమ్మె హక్కును కార్మిక సంఘాలను గుర్తించాలి. ఈ హక్కులన్నిటి కొరకు "ప్రజా శక్తి" ఆందోళన చేస్తుంది. తద్వారా యుద్ధ కృషికి ప్రజలు మరింత సాయపడునట్లు చేస్తుంది" అని ప్రకటించబడింది.

'ధైర్యవంతునికి ఒకే చావు, పిరికిపందకు నిత్యమూ చావే' అన్న సూత్రాన్ని గ్రహించి ఈ ధర్మయుద్ధంలో పాల్గొని జయించి ప్రపంచ ప్రజా స్వాతంత్ర్యాన్ని, భారత స్వాతంత్ర్యాన్ని స్థాపించి తమ కర్తవ్యాన్ని భారత ప్రజలు నెరవేర్చడానికిగాను "ప్రజాశక్తి" పాటుబడుతుంది అని సంపాదకీయం ముగింపులో చెప్పబడింది.

సంపాదకీయం చివరిలో క్రింది రెండు నినాదాలు యివ్వబడ్డాయి.

"ప్రజా యుద్ధాన్ని ప్రజలే జయించాలి."

"జాతీయ ప్రభుత్వానికి, జాతీయైక్యతే మార్గం"

## రెగ్యులర్‌గా నిర్వహించబడ్డ శీర్షికలు :

"మన రాజకీయాలు". "ప్రపంచ యుద్ధ సమీక్ష"

"రైతు లోకం", "కార్మిక సమస్యలు"

అన్న శీర్షికలు ప్రతి సంచికలోనూ దాదాపు రెగ్యులర్‌గా నిర్వహించబడ్డాయి.

17 జూన్ 1942 నుంచి 30 డిసెంబరు 1942 వరకు మొత్తం 29 సంచికలు వెలువడ్డాయి.

రష్యా - జర్మనీ యుద్ధం సంవత్సరం పూర్తి అయిన సందర్భంగా "జూన్ 22"అనే సంపాదకీయము, రెండవ సంచికలో వ్రాయబడింది. జూలై 1 న వెలువడ్డ మూడవ సంచికలో కమ్యూనిస్టు డిటెన్యూలను విడుదల చేయడంలో అనుసరిస్తున్న విధానాన్ని, అజ్ఞాతవాసంలో నున్న పుచ్చలపల్లి సుందరయ్య, చంద్ర రాజేశ్వరరావు, మద్దుకూరి చంద్రశేఖరరావు మొదలగు వారిపై వారంట్లు రద్దు చేయనందుకు మద్రాసు ప్రభుత్వాన్ని విమర్శిస్తూ "కమ్యూనిస్టుల విడుదల-ప్రభుత్వ వైఖరి" అన్న శీర్షికతో సంపాదకీయం వ్రాయడం జరిగింది.

మూడవ సంచికలో ప్రజాశక్తి పత్రికకు అఖిల భారత విద్యార్థి సంఘ కార్యదర్శిని పెరిన్ బరుచా, అఖిల భారత సోవియట్ మిత్ర మండలి కార్యదర్శి హిరేన్ ముఖర్జీ పంపిన సందేశాలు ప్రకటించబడ్డాయి. జూలై 8న వెలువడ్డ ప్రజాశక్తిలో మంగళాపురం గ్రామంలోని భూములను జమీందారు దౌర్జన్యంగా ఆక్రమించ బూనుకోగా దానిని ప్రతిఘటించిన సందర్భంగా జరిగిన అరెస్టులను ఖండిస్తూ "చల్లపల్లి అరెస్టులు" అన్న శీర్షికతో సంపాదకీయం వెలువడింది.

ఇదే సంచికలో "ప్రజా సమీకరణకు బందీలను విడువాలి. జూలై 12న ఆందోళన చేయండి" అనే శీర్షికతో అఖిల భారత కిసాన్ సభ అధ్యక్షులు ఇందులాల్ యాజ్ఞిక్, హిందూదేశ కమ్యూనిస్టుల తరపున పి. సి. జోషి, అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్ కార్యదర్శిని పెరిన్ బరుచా పిలుపు ప్రకటించబడింది.

'గాంధీజీతో నేనెందుకు విడిపోయాను' అనే శీర్షికతో సర్దారు పృథ్వీసింగ్ చేసిన ప్రకటన కూడా ఇదే సంచికలో వుంది.

జూలై 15న వెలువడ్డ 5వ సంచికలో సంపాదకీయం "కమ్యూనిస్టుల పాలసీ" పై వుంది. ఇది పీపుల్సువార్ పత్రిక నుండి గ్రహించబడింది. బిహటాలో జరిగిన అఖిల భారత కిసాన్ మహాసభపై పి సి. జోషి వ్యాసం ఇదే సంచికలో వుంది. జూలై 22 సంచికలో వార్ధాలో సమావేశమైన కాంగ్రెసు వర్కింగ్ కమిటీ చేసిన సుదీర్ఘ తీర్మానంపై "కాంగ్రెసు వర్కింగ్ కమిటీ తీర్మానం" అన్న శీర్షికతో సంపాదకీయం వ్రాయబడింది.

ఏడవ సంచికలో వర్కింగ్ కమిటీకి భారత కమ్యూనిస్టు పార్టీ వ్రాసిన బహిరంగ లేఖ మొదటి పేజీలో ప్రకటించబడింది. సంపాదకీయం "కమ్యూనిస్టులు - కాంగ్రెసు" అనే శీర్షికతో వెలువడింది.

ఆగష్టు 5 న వెలువడ్డ ప్రజాశక్తి సంచికలో "జాతీయ వాంఛ; ఆగష్టు 6 వ తేదీ సభలు జరపండి" అనే విషయంపై సంపాదకీయం వ్రాయబడింది. ఆగష్టు 12 న వెలువడ్డ ప్రజాశక్తిలో సంపాదకీయం "కాంగ్రెసుపై ప్రభుత్వ దాడి" అనే శీర్షికతో వుంది. దీనిలో ప్రభుత్వం అతి దారుణంగా జరిపిన నిర్బంధ కాండను తీవ్రంగా ఖండించి, జాతీయ నాయకులను తక్షణం విడుదల చేయాలని కోరింది. దీనికై ఆందోళనకు పిలుపు యిచ్చింది. జాతీయ ప్రభుత్వం అంగీకరించాలని, జాతీయ ప్రభుత్వాన్ని తక్షణమే నెలకొల్పాలని కోరింది.

'10 వ సంచికలో నూతన పరిస్థితిపై పొలిట్ బ్యూరో తీర్మానం మొదటి పేజీలో ప్రకటించబడింది. "ప్రభుత్వ పన్నాగం, ప్రజల కర్తవ్యం" అనే శీర్షికతో సంపాదకీయం వ్రాయబడింది.

కాంగ్రెసు నాయకులను విడుదల చేయాలని భారత కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి పి.సి. జోషీ చేసిన ప్రకటన కూడా ఇదే సంచికలో ప్రకటించబడింది. ఆగష్టు 26 న వెలువడ్డ 11 వ సంచికలో 'సందేహాలు-సమాధానాలు' అనే శీర్షికతో సంపాదకీయం వెలువడింది దీనిలో వివిధ దశలలో యుద్ధము ఎడల కాంగ్రెసు అనుసరించిన వైఖరిపై వివరిస్తూ, జాతీయైక్యత కొరకు ప్రతి భారతీయుడు కృషి చేయాలని వివరించబడింది ఇదే సంచికలో "జాతీయైక్యతను ఎలా సాధించాలి" అనే వ్యాసము, సోవియట్ వీరబాల 'వీరా' అనే వ్యాసములు ఉన్నాయి. సెప్టెంబరు 2 ప్రజాశక్తిలో "దేశభక్తుల కర్తవ్యం పైన, సంపాదకీయం వెలువడింది. ఇదే సంచికలో ఇండియాకు పామీదత్తు సందేశం ప్రకటించబడింది. సెప్టెంబరు 9 సంచికలో ఆహార పదార్థాల సమస్య, ప్రభుత్వ కర్తవ్యంపై సంపాదకీయం వ్రాయబడ్డది. సెప్టెంబరు 23 ప్రజాశక్తిలో "నిర్బంధ విధాన నిరసన దినం"పై సంపాదకీయం వెలువడ్డది.

అక్టోబరు 18 న వెలువడిన 18 వ సంచికలో 'భారతీయులకు కమ్యూనిస్టు పార్టీ విజ్ఞప్తి' మొదటి పేజీలో ప్రకటించబడింది. ఆంధ్రలో పలు ప్రదేశాలలో కమ్యూనిస్టుల ఇండ్లు సోదాచేసి, అరెస్టులు సాగిస్తున్న ప్రభుత్వ ఉద్యోగుల చర్యలను ఖండిస్తూ 'అధికార దుర్వినియోగం' అనే శీర్షికతో సంపాదకీయం వ్రాయబడింది.

ఇదే సంచికలో "బోల్షివిక్ పోటీ" అనే శీర్షికను 'ప్రజాశక్తి' 'పీపుల్సువార్' పత్రికల చందాలు ఏయే జిల్లా కమిటీలు ఎంతవరకు పెంచినది, 1943

జనవరి 23 లెనిన్ డే నాటికి ఎంత పెంచనున్నదీ వివరాలు పట్టిక రూపంలో ప్రకటించబడ్డాయి.

అక్టోబరు 21 ప్రజాశక్తి సంపాదకీయం "జాతీయ నాయకులను విడుదల చేయాలి" అనే అంశంపై వ్రాయబడింది.

ఇదే సంచికలో నవంబరు 1 నుండి 8 వరకు జాతీయైక్యతా వారం జరప మని పి. సి. జోషీ చేసిన ప్రకటన వుంది.

అక్టోబరు 28 సంచికలో 'ధరల కంట్రోలు సమస్య' పై సంపాదకీయం వెలువడింది.

నవంబరు 4 ప్రజాశక్తిలో 'జాతీయైక్యతకు కదలిరండు' అనే శీర్షికతో సంపాదకీయం వ్రాయబడింది.

ఇదే సంచికలో 'ప్రపంచాధిపత్యం కలలుగన్న ఫాసిస్టులకు బలివేదిక రష్యా" అన్న శీర్షికతో 16 మాసాల యుద్ధ సమీక్ష చేయబడింది.

ఇదే సంచికలో 'ఇండియాను రక్షిస్తున్నది సోవియట్ సైన్యం" అన్న వ్యాసం వున్నది.

సంచిక 22లో 'సోవియట్ యుద్ధ ఆశయాలపై' సంపాదకీయం వ్రాయ బడింది.

ఇదే సంచికలో 'శత్రువు అంత్యదశ సమీపించుతోంది' అన్న స్టాలిన్ ఉపన్యాసం ప్రకటించబడింది.

ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘంలో ముఖ్య పదవులు మెజారిటీ చేజిక్కించు కొన్న రంగా ముఠా నవంబరు 7, 8 తేదీలలో సమావేశమైన రాష్ట్ర రైతు సంఘ కార్యవర్గం నిబంధనావళిని రద్దు చేసి, తమ అనుయాయులైన వారిని రాష్ట్ర,జిల్లా సంఘాలకు ఏజెంట్లుగా నియమించింది.

నవంబరు 18 వ తేదీ ప్రజాశక్తిలో ఈ విషయంపై "అస్త్ర సన్యాసం" అనే శీర్షికతో సంపాదకీయాన్ని వ్రాయటం జరిగింది. దీనిలో రంగా ముఠా చర్యను ఖండించి, రైతు సంఘాల అవసరాన్ని నొక్కి చెప్పటం జరిగింది.

భారత స్వాతంత్ర్య పేరిట భారత కమ్యూనిస్టు పార్టీ రెండు లక్షల నిధికి యిచ్చిన విజ్ఞప్తి ఈ సంచికలో ప్రచురించబడింది.

పార్టీ నిధికి ఆంధ్ర మహిళల త్యాగదీక్ష అనే వ్యాసం కూడా ఇదే సంచి కలో వుంది. ఆంధ్ర రాష్ట్రంలో జాతీయ సమైక్యతా వారోత్సవ అనుభవాలు, మహజర్లపై సేకరించిన జిల్లా వారీ సంతకాలు వివరాలు బర్మాగతి భారతదేశానికి పట్టకూడదు అన్న వ్యాసం ఇదే సంచికలో వున్నాయి.

25-11-1942 న వెలువడిన 24 వ సంచికలో "ప్రజలు ఏకం కావాలి. సమరం సాగించాలి. స్వాతంత్ర్యం పొందాలి'' అనే పి.సి. జోషీ వ్యాసం మొదటి పేజీలో ప్రచురించబడింది.

"చైనాలో జపాను రాక్షసులచే శిశు హత్యలు, స్త్రీ వధలూ, దోపిడీలు, అగ్నిజ్వాలలు" అను వ్యాసం, "అక్ష రాజ్యాల బండి బోల్తాపడుతోంది", "హిందూ - ముస్లిం ఏక్ హో" అనే వ్యాసాలు, పార్టీ ఫండు జిల్లాలవారీ వసూళ్ళ వివరాల పట్టిక, 'స్వపూ సూచినిస్తున్న అతుకుల బొంత' అనే వ్యాసము ఇదే సంచికలో వున్నాయి.

25 వ సంచికలో "విధ్వంసక చర్యలు మానండి. ఐక్యత నిర్మించండి" అన్న పి.సి. జోషీ వ్యాసం మొదటి పేజీలో వుంది. "విధ్వంసక చర్యలు అరికట్టండి" అనే సంపాదకీయము, జోయా వీరగాథ, "సోవియట్ అడకత్తెరలో మూడు లక్షల శత్రు సైన్యం" అనే యుద్ధ సమీక్ష ఉన్నాయి.

26 వ సంచికలో 'రాయలసీమలో క్షామం'పై సంపాదకీయం విమాన దాడి జాగ్రత్తలు, ప్రభుత్వ విధానం, ప్రజల కర్తవ్యం' అన్న వ్యాసము, "ఐక్యతా ఉద్యమం, ఆంధ్ర రాష్ట్రం అగ్రగామి" అన్న వ్యాసం, "ప్రతి భారత నారీ - ఒక జోయాగా మారాలి" అన్న వ్యాసము వున్నాయి.

27 వ సంచికలో "అధిక ధరలు, ప్రభుత్వ కర్తవ్యం" పై సంపాద కీయం ప్రోగ్రెసివ్ రైటర్సు అసోసియేషన్" ఆంధ్ర శాఖ ప్రణాళిక, "రోమెల్ పలాయనం చిత్రగించుతున్నాను" అన్న వ్యాసం వున్నాయి.

28 వ సంచికలో "వైస్రాయి విందుకు ప్లేటు మార్చుతున్నాడు" అన్న వ్యాసము, "ఇకమీదట" అన్న సంపాదకీయం 'విజయ సాధనకు భారతదేశ విముక్తి అవసరం' అన్న పామీదత్తు వ్యాసము ఐక్యతా ఉద్యమం - దానిని ఎవరాపగలరు" అన్న వ్యాసము వున్నాయి.

డిసెంబరు 30 న వెలువడ్డ 29 వ సంచికలో "జపాను బాంబుల ఉద్దేశం ఏమిటి?" అన్న వ్యాసం, "మద్రాసు కార్మిక తగదాల బిల్లు" అన్న సంపాద కీయం, "మిత్ర రాజ్య విజయాలు - ఎవరికి సాయం చేస్తాయి? సామ్రాజ్య వాదులకా - ప్రజలకా" అన్న పి సి. జోషీ వ్యాసము "ఎటు జూచినా సోవియట్ విజయాలే" అన్న వ్యాసం వున్నాయి.

## పత్రిక సర్క్యులేషన్ :

ప్రజాశక్తి వారపత్రిక 1942 జూన్ 17 న 2000 ప్రతులతో అచ్చు అయింది. వివిధ జిల్లా కమిటీలు, కామ్రేడ్సు బోల్షివిక్ దీక్షతో పత్రిక సర్క్యులేషన్ పెంచడానికి చేసిన కృషి వల్ల దీని కాపీలు ఆగస్టు 9 నాటికి 3,000 లకు, 1942 అక్టోబరు నాటికి 4,000 లకు, నవంబరు 1 కి 5,000 లకు, 1942 డిసెంబరు 1 నాటికి 7,000 లకు, 1943 జనవరి 1 నాటికి 8,000 ల కాపీలకు పెరిగింది.

# సిద్ధాంత, సాహిత్య సాంస్కృతిక రంగాలు

కమ్యూనిస్టు సిద్ధాంతాల వ్యాప్తికి, సాహిత్య, సాంస్కృతిక పునరుజ్జీవనానికి కమ్యూనిస్టు పార్టీ మొదట నుండి కృషి చేస్తూనే ఉంది

నవశక్తి పత్రిక మొదటిసారిగా శరత్‌బాబు రచించిన దేవదాసు అనువాదాన్ని ప్రచురించింది. ప్రసిద్ధ రచయిత చక్రపాణి చేసిన ఈ అనువాదం నాడు తెనుగు పాఠకులలో ఎంతో ప్రభావాన్ని కలిగించింది. బడదీదీ మొదలైన మరి కొన్ని శరత్ రచనలను కూడా నవశక్తి ప్రచురించింది.

ఈ కృషిలో భాగంగా మార్క్సిస్టు సిద్ధాంత గ్రంథాల ప్రచురణను పార్టీ చేపట్టింది. పార్టీ మిత్రులు పెక్కుమంది ఈ కృషిలో తోడ్పడ్డారు

## ప్రచురణాలయాలు

ఆంధ్ర దేశంలో వామపక్ష సోషలిస్టు సాహిత్యాన్ని ప్రచురించే సంస్థలు 1934 నాటికే ఏర్పడ్డాయి వీనిలో ఎలమర్రులో, గద్దె లింగయ్య గారు ప్రారంభించిన ఆదర్శ గ్రంథ మండలి మొట్టమొదటిది.

తూర్పు గోదావరి జిల్లా ముంగండ నుండి మహీధర జగన్మోహన్, రామమోహన్ సోదరులు 1935 లో విశ్వ సాహిత్యమాలను స్థాపించి పెక్కు సోషలిస్టు గ్రంథాలు వెలువరించారు.

గుంటూరు నుండి అన్నాప్రగడ కామేశ్వర రావుగారు, అతివాద గ్రంథ మండలిని, పశ్చిమ గోదావరి జిల్లా నిడమర్రులో అశ్వనీ కుమార్‌దత్తు గారు ప్రగతి ప్రచురణలు, అనంతపురంలో విద్వాన్ విశ్వం, నవ్య సాహిత్య మాల స్థాపించారు.

ఇవికాక భీమవరం నుండి, ప్రొలిటేరియన్ సీరీస్ పేర దర్బా శ్రీరామమూర్తిగారు, కృష్ణా జిల్లా పెడసనగల్లు నుండి నవయుగ ప్రచురణాలయం వారు కూడ సోషలిస్టు సాహిత్యాన్ని ప్రచురించారు.

శ్రీ సుందరయ్యగారి ఆధ్వర్యంలో కమ్యూనిస్టు కరపత్రం ఎంగెల్సు రచన సామ్యవాద సిద్ధాంతాలు, లెనిన్ రచన 'సామ్రాజ్యవాదం' ప్రచురించబడినాయి. కాని ఇవి దాదాపు వెన్వెంటనే నిషేధానికి గురి అయ్యాయి.

ఆదర్శ గ్రంథ మండలివారు క్రొవ్విడి లింగరాజుగారి అనువాదం 'అమ్మ' ప్రచురించారు. నాటినుండి నేటి వరకు ప్రసిద్ధిగాంచిన నవల ఇది. ప్రఖ్యాత రష్యన్ నవలాకారుడు, విప్లవవాది అయిన మాక్సిం గోర్కీ రచన.

అంతకు ముందే 1934-35 ప్రాంతాలలో 'అమ్మ' నవలను సంక్షిప్త రూపంలో శ్రీ తుమ్మల వెంకటరామయ్యగారు అనువదించి ప్రచురించారు.

అదే కాలంలో డిమిట్రాప్ జీవిత చరిత్రను కూడా శ్రీ తుమ్మల వెంకట్రామయ్యగారు ప్రచురించారు

ఆదర్శ గ్రంథ మండలివారు ప్రచురించిన ఇతర ముఖ్య గ్రంథాలు వలస దేశాల సమస్య, ప్రపంచ రాజకీయాలపై సోషలిస్టు దృక్పథం, పెట్టుబడిదారీ విధానం, మాప్లా తిరుగుబాటు మొదలైనవి.

1935 లో మంగళగిరిలో ప్రారంభమైన విశ్వ సాహిత్య మాల ప్రచురించిన గ్రంథాలలో ముఖ్యమైనవి ఎంగెల్సు రచన, నరుడు - వానరుడు, లెనిన్ రచన రాజ్యాంగ యంత్రం, మావో రచన ఆచరణ, పామీదత్తు రచన లెనిన్ ఉపదేశాలు, ప్రపంచ కార్మికోద్యమ చరిత్ర.

ఇవి కాక నా రష్యాయాత్ర, రష్యా విప్లవం (1905), సోవియట్ కమ్యూనిజం లాంటి పెక్కు గ్రంథాలను, పెక్కు రష్యన్ నవలలనూ వీరు ప్రచురించారు. 1950 తర్వాత కూడా వీరు కొన్ని ప్రచురణలు వెలువరించారు.

పశ్చిమ గోదావరి జిల్లాలో నిడమర్రులో స్థాపితమైన ప్రగతి ప్రచురణాలయం వారు చైనా ఎర్ర సైన్యం, అన్నా-అను సుప్రసిద్ధ గ్రంథాలను ప్రచురించారు. బారికేడ్స్ ఇన్ బెర్లిన్ అను గ్రంథానికి అనువాదం అన్నా. ఇవిగాక వీరు మరికొన్ని సాహిత్యపరమైన గ్రంథాలు కూడా ప్రచురించారు

గుంటూరులో అన్నాప్రగడ కామేశ్వరరావుగారు స్థాపించిన అతివాద గ్రంథమండలి, మస్కో 1937, విలువ, ఖరీదు, లాభం, స్టాలిన్ ఉపన్యాసం, రష్యా నూతన రాజ్యాంగ ప్రణాళిక లాంటి పెక్కు గ్రంథాలను ప్రచురించారు.

కాకినాడకు చెందిన కొమండూరి శఠకోపాచార్యలు సుభాష్ బోస్ జీవితం, ఉపన్యాసాలు, జవహర్‌లాల్ల జీవిత కథ - లను ప్రచురించారు. పెడసనగల్లు నుండి నవయుగ ప్రచురణాలయంవారు, ఆస్ట్రియా ఆక్రమణ, స్వదేశ సంస్థానాలు అను గ్రంథాలను ప్రచురించారు. స్వదేశ సంస్థానాలు, ప్రసిద్ధ పత్రికా రచయిత నార్ల వెంకటేశ్వరరావుగారి రచన.

అనంతపురంలోని నవ్యసాహిత్యమాల, ఫాసిజం, లెనిన్ అను రెండు గ్రంథాలను ప్రచురించింది. ఈ రెంటి అనువాదం విద్వాన్ విశ్వం. అదే ప్రచురణాలయం వారు, తరిమెల నాగిరెడ్డి రచించిన 'ఆస్ట్రియా' అను గ్రంథాన్ని కూడా ప్రచురించారు.

ఈ ప్రచురణాలయాలన్నీ సోషలిస్టు భావాల వ్యాప్తికి ఆ కాలంలో అపారమైన సేవ చేశాయి.

ఇదే కాలంలో సోషలిస్టు లిటరేచర్ పబ్లిషింగ్ కంపెనీ గోకుల్‌పురా ఆగ్రా వారు, పెక్కు ఇంగ్లీషు గ్రంథాలను ప్రచురించారు. ఈ సోషలిస్టు సాహిత్యాన్ని స్వయంగా విక్రయిస్తు కృష్ణస్వామి అనే ప్రచారకులు, సన్యాసి వేషంలో ఆంధ్ర దేశంలోని పెక్కు పట్టణాలు సందర్శించారు.

త్రిపురి కాంగ్రెసు మహాసభ సందర్భంలో, నవశక్తి పత్రిక 1939 మార్చి 8న, ప్రత్యేక సంచికను ప్రచురించింది. ఇదొక ప్రామాణిక గ్రంథ స్థాయిని పొందింది. అదే విధంగా నవశక్తి ప్రచురించిన రష్యా ప్రత్యేక సంచిక కూడా పెక్కు వ్యాసాలతో రష్యాను గురించి సమగ్ర సమాచారాన్నిచ్చే గ్రంథంగా గుర్తింపు పొందింది.

1939లో ఆదర్శ గ్రంథ మండలి వారు, కాంగ్రెసు కమ్యూనిస్టులు - కాంగ్రెసు అను గ్రంథాన్ని, అకలి మంటలు అను శెట్టిపల్లి వెంకటరత్నంగారి గేయాలను ప్రచురించారు.

1941 తర్వాత మొదట్లో అర్ధ బహిరంగంగానూ, నిషేధం తొలగిన తర్వాత పూర్తి బహిరంగంగానూ కమ్యూనిస్టు పార్టీ పని చేయసాగింది.

ఈ కాలంలో ప్రజాశక్తి ప్రచురణలు ప్రారంభమై 1943 జులై నాటికి (మూడవ ఆంధ్ర కమ్యూనిస్టు మహాసభ) సుమారు 32 గ్రంథాలను ప్రచురించింది. దీనిలో ముఖ్యమైనవి 1. ప్రపంచ ప్రజాయుద్ధమే భారత స్వాతంత్ర్య యుద్ధం 2) మన లెనిన్ 3) అంతర్జాతీయ పార్టీ పంథా 4) సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ చరిత్ర 5) నేటి భారతదేశం 6) లెనిన్-పల్లెటూరి పేదలకు మొదలైనవి.

ఇవికాక అనేకమైన ఫాసిస్టు వ్యతిరేక గేయాలు, విమానదాడి, మన కర్తవ్యం-లాంటి రచనలు కూడా వెలువరించింది. ప్రతి పుస్తకం కనీసం వెయ్యి కాపీలకు తక్కువ గాకుండా ప్రచురించింది. రాష్ట్ర వ్యాపితంగా, సోషలిస్టు కమ్యూనిస్టు సాహిత్య సృష్టికి, ప్రజాశక్తి ప్రచురణాలయం ఎనలేని సేవచేసింది.

## వైజ్ఞానిక దళాలు

యుద్ధ స్వభావంలో మార్పు వచ్చి, ఫాసిస్టు వ్యతిరేకతను మారుమూల గ్రామాలకు సైతం తీసుకువెళ్ళ వలసిన ఆవశ్యకత ఏర్పడ్డది. 1941 చివర నుండే వైజ్ఞానిక ప్రచార పద్ధతులైన, బుర్రకథ, ఫ్యాన్సీ డ్రెస్సులద్వారా, గుంటూరు, కృష్ణా జిల్లాలలో రాజకీయ ప్రచారం విస్తారంగా జరిగింది. పాత కళా రూపాలలో నూతన రాజకీయ సారాన్ని ప్రవేశపెట్టిన ఈ పద్ధతి బహుళ జనాదరణ పొందింది.

1943 జనవరిలో బొంబాయిలో అఖిల భారత కమ్యూనిస్టు పార్టీ మహా సభ జరిగింది. ఆ సభకు ఆంధ్రదేశం తరఫున ఒక వైజ్ఞానిక దళం హాజరై ఆంధ్ర జాతీయ కళా రూపాలను ప్రదర్శించి గొప్ప మన్ననలను పొందింది.

## సాంస్కృతిక రంగం

బొంబాయిలో కమ్యూనిస్టుపార్టీ ప్రథమ కాంగ్రెసు మహాసభలో వివిధ రాష్ట్రాల వైజ్ఞానిక దళాలు ప్రదర్శనలిచ్చాయి. వారిలో ఆంధ్ర వైజ్ఞానిక దళం అత్యుత్తమంగా గుర్తించబడి ఎర్రజెండా బహుకృతి పొందింది.

ఈ దళానికి శ్రీ ముక్కామల నాగభూషణంగారు నాయకులు. వీరు గాయకుడు, నటుడు మాత్రమే కాక ప్రముఖ రైతు నాయకుడు, సాహితీవేత్త కూడా

ఆంధ్ర వైజ్ఞానిక దళం ప్రదర్శించిన కళారూపాలు, 1) భజనలు, కోలాటాలు లాంటి సమిష్టి నృత్యాలు 2) బుర్రకథ, పిచ్చి గుంటల కథలాంటి జానపద రూపాలు 3) బైరాగి, కోయ, గొల్ల, మాదిగ వేషాలు - ఉన్నాయి.

భజనలలో సుంకర సత్యనారాయణ రచించిన, "మిట్టిపడే హిట్లరయ్యా, ఏటికే ఎదురీదుచుంటివి" అనే పాట అశేష హర్షధ్వానాలు పొందిది.

కోలాటంలో కాట్రగడ్డ హనుమాయమ్మ ఎంతో లాలిత్యాన్ని ప్రదర్శించారు.

బుర్రకథలోని కథావస్తువు జపాన్ ఫాసిస్టులను నమ్మరాదు సుమా అనే హెచ్చరిక. భాషా సంబంధమైన ప్రతిబంధకంవల్ల ఇతర రష్ట్రాలవారు ఇందులోని కథను పూర్తిగా గ్రహించలేకపోయినా, కళారూపాన్ని ఎంతో అభినందించారు.

కోయవాని వేషంలో కోగంటి గోపాల కృష్ణయ్య అత్యద్భుత ప్రతిభ ప్రదర్శించారు భాషావరోధాన్ని అధిగమించి, వారి అభినయం యావన్మంది ప్రేక్షకులను ఆకట్టుకున్నది.

ఆహార సమస్యను వస్తువుగా, పిచ్చిగుంటులవాని కళారూపంలో కోసూరి పున్నయ్య ప్రదర్శించారు.

ఉర్దూలో క్వామేడ్ మఖ్దుం రచించిన 'జంగ్ హై జంగ్ ఆజాద్' అనే పాటను మహారాష్ట్రకు చెందిన మామావరేర్కర్ బృందం పాడింది. స్టాలిన్ పిలుపు అనే రష్యన్ గేయానికి మఖ్దుం చేసిన ఉర్దూ అనువాదం కూడా విశేషాదరణ పొందింది.

ఆంధ్ర వైజ్ఞానిక దళంలో ఈ క్రింది వారు పాల్గొన్నారు

ముక్కామల నాగభూషణం, కోగంటి గోపాలకృష్ణయ్య, కోసూరు పున్నయ్య, సి. సుబ్బారావు, యస్.వి.కె. ప్రసాద్, డాక్టర్ రాజారావు, మన్నె నాగభూషణం, కొండేపూడి లక్ష్మినారాయణ, తమ్మారెడ్డి సత్యనారాయణ, మానికొండ సూర్యావతి,

కాట్రగడ్డ హనుమాయమ్మ, టి. సావిత్రి, సి. సావిత్రి, యం. శారద, వి. అన్నపూర్ణమ్మ, బాబు. మిక్కిలినేని, మాచినేని, చదలవాడ, వెరుమాళ్ళ, కోసూరు పున్నయ్య లాంటివారు ఈ శిబిరంలో శిక్షణపొందారు. బొంబాయి మహాసభలో ప్రదర్శనలిచ్చి అప్పటికే ప్రసిద్ధిచెందిన కోగంటి గోపాల కృష్ణయ్య, కోసూరు పున్నయ్యగారలు యువకులకు వివిధ కళారూపాలలో శిక్షణ ఇచ్చారు.

1943 జూలైలో విజయవాడలో జరిగిన ఆంధ్ర కమ్యూనిస్టుపార్టీ మూడవ మహాసభ సందర్భంలో జింఘానా గ్రౌండ్స్‌లో పెద్ద బహిరంగసభ జరిగింది.

ఆ మహాసభలో కృష్ణాజిల్లా ప్రజా నాట్యమండలి పెక్కు కళారూపాలను ప్రదర్శించింది. గుంటూరుకు చెందిన నాజర్, మొట్ట మొదటిసారిగా ఆ మహాసభ లోనే, 'మాస్కో పొలిమేరలోన మారణ యంత్రాలు నిలిపి' అను గేయాన్ని ఉత్తేజకరంగా ఆలపించారు. ఆ పిమ్మట నాజర్ సుప్రసిద్ధ బుర్ర కథాకారుడుగా రూపొందారు.

ఆ తర్వాత కాలంలో ఆంధ్ర ప్రజా నాట్యమండలి, ఫాసిస్టు వ్యతిరేక ప్రచారంలో ప్రముఖ పాత్రను వహిస్తూ కళను ప్రజాసేవకు వినియోగించే నూతన సాంప్రదాయాన్ని ప్రవేశపెట్టడం ద్వారా, ఆంధ్ర నాటక రంగంలోనే ఒకమూల మలుపును ప్రవేశపెట్టింది.

1941 తర్వాత ఏర్పడిన బహిరంగ ప్రచార అవకాశాలను వినియోగించు కొని, గ్రామాలలోనూ పట్టణాలలోనూ అభ్యుదయ రచయిత సంఘాల నేర్పరచే కర్తవ్యాన్ని కమ్యూనిస్టు పార్టీ చేపట్టింది.

1943 ఫిబ్రవరి 13, 14 తేదీలలో తెనాలిలో జరిగిన ప్రథమ ఆంధ్ర అభ్యుదయ రచయితల మహాసభ తర్వాత ఆంధ్రదేశంలో అభ్యుదయ రచయితల ఉద్యమం మహోత్సాహంగా ముందుకు సాగింది.

వైజ్ఞానిక ప్రచారం, అభ్యుదయ సాహిత్య వ్యాప్తి లాంటివి ఆనాడు విద్యార్థి యువజన వేదికల నుండి సాగుతూ ఉండేవి.

ఈ కృషిని ముందుకు కొనిపోతూ అదే సంవత్సరం ఆంధ్ర ప్రజానాట్య మండలి ఏర్పడ్డది అంతకు ముందు 1943 మార్చిలో కృష్ణా జిల్లా యువజన సంఘ ఆధ్వర్యాన దివి తాలూకా. కొడాలిలో ఫాసిస్టు వ్యతిరేక శిక్షణా శిబిరం జరిగింది.

(యువజన, విద్యార్థి వేదికలపై సాంస్కృతిక కార్యక్రమాలు ఆయా భాగాలలో చూడవచ్చును.)

# 1940-43 మధ్య కాలంలో తొలి అభ్యుదయ రచనలు - రచయితలు

"అభ్యుదయ రచయితల సంఘం నిర్మాణయుతంగా ఏర్పడక పూర్వం 1940-43 మధ్య కాలంలో కమ్యూనిస్టు రచయితలు ప్రజాశక్తి వార పత్రికలో అభ్యుదయ రచనలు ప్రచురించుతూ వచ్చారు. 1942 జూన్ 17 వ తేదీ ప్రజాశక్తి పత్రికల్లో "అన్యాయాన్ని ఎదిరిస్తాం - స్వాతంత్ర్యం సంపాదిస్తాం, విప్లవ వీరులమూ, భారత పుత్రులమూ, సమధికోత్సాహబలమూ, శాంతి - సభ్యతల నంతం చేసే, రాక్షస దౌర్జన్యం - ప్రపంచమంతయు భస్మం చేసే హిట్లర్ ఫాసిజము ధ్వంసం చేస్తాం, దగ్ధం చేస్తాం, గోరీ కడతాం, హిట్లరును" అనే కవిత "హితైషి" అనే వారు రచించారు. వీరెవరో ప్రముఖ రాజకీయ నాయకులే. అప్పటి యిలాంటి రచనలలో కవితా గుణాత్మకత తక్కువగా ఉన్నప్పటికీ, సారళ్యమూ, స్పష్టతా, నవీన కాంతి ధావళ్యమూ మెండుగా కనిపిస్తాయి

అదే పత్రిక 1942 జూలై 1 వ తేది సంచికలో జి. కోటయ్య అనేవారు "ఫాసిస్టు ప్రళయాగ్ని ప్రజ్వరిల్లిందండి - ప్రజలందరము మేలుకోవాలి, తూర్పు దీవుల మధ్య తలలెత్తిన జ్వాల - కాలాగ్ని కీలయై నాలుకలు చాచినది. కను మూసితే మోసమోయీ, మనమిపుడు కలిసి పనిచేయవలెనోయీ" అనే పాట రచించారు. తెలుగు ఏలపాట బాణీలో సాగిన, జానపద గేయానికి సన్నిహితంగా ఉన్నదీ గేయం.

1942 జూలై 4 వ తేదీ ప్రజాశక్తిలో కామ్రేడ్ కంభంపాటి సత్యనారాయణ ఎమ్. ఎ. అనే పూర్తి పేరుతో సీనియర్ గారు ఒక బుర్ర కథ రచించారు. దీనికి వీరు బొబ్బిలి పాట వరుస అంటూ బ్రాకెట్లో సూచించారు. అభ్యుదయ సాహిత్యోద్యమ తొలి రోజులలో తెలుగులో వచ్చిన మొట్టమొదటి బుర్రకథ యిదేనని చెప్పవచ్చు. కంభంపాటి వారు రచించిన మకుటం మన యావత్తు బుర్రకథల ప్రక్రియనూ, యిప్పటికి విడువక పోవడం గమనార్హమైన సంగతి. "జయము, జయము, మన ప్రజాశక్తులకు జయము, దిగ్విజయము, ఈ పల్లవి తదుపరి కాలంలో, సుంకర సత్యనారాయణ గారు విరివిగా పరిపోషించిన బుర్రకథ ప్రక్రియలన్నింటికీ ఉపయుక్తం కావడం విశేషం, సుంకర వారి కష్టజీవి, అల్లూరి సీతారామరాజు, కందుకూరి వీరేశలింగం, రాణి రుద్రమ వంటి బుర్రకథలు ఈ ప్రక్రియలో శిఖరాయమానమనదగిన క్లాసిక్స్"! ప్రచార గేయంగా మార్గదర్శకమైందనడంలో సందేహం లేదు. ఈ శాఖను సుంకర వారు అభివృద్ధి చేయగా, ప్రజా నాట్యమండలి కళాకారులు నాజర్,

మిక్కిలినేని, కర్ణాట లక్ష్మీనరసయ్య ప్రభృతులు విశేష ప్రచారం కల్గించగా, నేటి జాతీయ జీవనాధారంలో బుర్రకథ ఒక ప్రధాన సాంస్కృతిక రూపంగా నిలిచిపోయింది.

1942 జూలై 29 వ తేదీ ప్రజాశక్తిలో కామ్రేడ్ మహీధరరామమోహన రావు "ప్రబోధము" అనే మార్నింగ్ సాంగ్ రచించారు "ముందు నడూ, వేగ నడూ మృత్యు భీతి వదలవోయ్! క్రూర ఫాసిస్టు మూక ఊరికి వచ్చు చున్న దోయ్" అనే పల్లవితో పాతిక పదాల వరకు సాగిన చక్కని పాట యిది

అలాగే 1942 ఆగష్టు 5 వ తేదీ ప్రజాశక్తిలో శ్రీ అయ్యాపు వెంకట కృష్ణయ్య "రారా తమ్ముడా రణరంగానికి - రాక్షసత్వమును నిర్మూలింపగ" అనే మకుటంతో చక్కని గేయం ప్రచురించారు. కాకినాడ, విశాఖలపై జపాను ఫాసిస్టులు బాంబులు కురిపించడాన్ని ప్రస్తావించారు.

కామ్రేడ్ కె.వి. కొండలరావు "శ్రీ రంగ రంగ రంగా" అనే పాట మాదిరి పాట ఒకటి ప్రచురించారు.

ఇవన్నీ ఉత్తమ అభ్యుదయ గేయ రచన కోసం చేసిన అన్వేషణా ప్రయత్నాలనీ, 1943 నుండి సంఘటిత శక్తిగా రూపొందిన, అభ్యుదయ రచయితల సంఘంలోని ప్రముఖ కవులు సలిపిన కవితా కృషికి కరదీపాలవంటివనీ స్పష్టంగా చెప్పుకోవచ్చు.... చారిత్రిక అవసరాన్ని సచేతనంగా నెరవేర్చిన క్రియాశీల పురోగమనాన్ని మనమీ తొలి నాటి రచనల ద్వారా పోల్చుకోగలుగుతాం.

1940 దశకంలో అభ్యుదయ కవులుగా ప్రఖ్యాతులైన వారు, అనిసెట్టి సుబ్బారావు, ఏల్చూరి సుబ్రహ్మణ్యం, బెల్లకొండ రామదాసు, కుందుర్తి ఆంజనేయులు, ఆంజనేయ ప్రసాద్, ధనకుదరం వెంకటాచారి, మాడభూషి వెంకటాచారి, పులుపుల వెంకట శివయ్య, తుమ్మల వెంకటరామయ్య, ప్రయాగ కోదండరామశాస్త్రి, చదలవాడ పిచ్చయ్య, సుంకర సత్యనారాయణ, కోగంటి గోపాలకృష్ణ, ఆరుద్ర, ఆవంత్స సోమసుందర్, కె వి. రమణారెడ్డి, రెంటాల గోపాలకృష్ణ, నార్ల చిరంజీవి, గంగినేని వెంకటేశ్వరరావు ప్రభృతులు ఎందరో ఉన్నారు. (ఆవంత్స సోమసుందర్ స్మృతులు)

ఆ కాలంలో ప్రసిద్ధిపొందిన శ్రీ శ్రీ గేయం "లే లే లే రష్యా" 4-11-1942వ తేదీ ప్రజాశక్తిలో ప్రచురింపబడింది. ఫాసిజంపై సోవియట్ సాధిస్తున్న విజయానికి ప్రపంచ ప్రజలందరూ హర్షిస్తున్న, ఆహ్వానిస్తున్న అంశాన్ని యిది వివరించింది

1943 ఫిబ్రవరి, 13,14 తేదీలలో తెనాలిలో మొదటి ఆంధ్ర రాష్ట్ర అభ్యుదయ రచయితల మహాసభ జరుపడానికి అనాడు సాహిత్య రంగంలో

అభివృద్ధికర భావాలు కల్గిన రచయితలందరి తోడ్పాటుతో సన్నాహక సంఘం సమావేశం జరిగింది.

ఈ సంఘంలో శ్రీ చదలవాడ పిచ్చయ్య, శ్రీ రంగం శ్రీనివాసరావు, శ్రీ తుమ్మల వెంకట్రామయ్య, శ్రీ తాపీ మోహన్‌రావుగార్లు కన్వీనర్లుగా నియమించబడ్డారు.

1942 డిసెంబరు 4వ తేదీన తెనాలిలో మహాసభ ఆహ్వాన సంఘం ఏర్పర్చడానికి సన్నాహక సమావేశం జరిగింది. శ్రీ జి.వి. కృష్ణరావుగారి అధ్యక్షతను జరిగిన ఈ సన్నాహక సమావేశంలో శ్రీ పిల్లలమర్రి బాలకృష్ణ శాస్త్రి, త్రిపురనేని గోపిచంద్ మొదలైన వారితో ఆహ్వాన సంఘం ఏర్పడింది.

అప్పటికింకా అభ్యుదయ రచయిత - అభ్యుదయ రచయితల సంఘం అనే మాటలు రూపుదిద్దుకోలేదు ప్రజాశక్తిలో ప్రచురించబడిన వార్తలో (ప్రోగ్రెసివ్ రైటర్స్) మహాసభ అనే ఇంగ్లీసు పదమే వాడబడింది. ఆ సన్నాహక సమావేశం ఆమోదించిన ప్రణాళికలో అభివృద్ధికర రచయితలు అనే మాట వాడారు. ఈ ప్రణాళిక ఆ తర్వాత రాష్ట్ర అభ్యుదయ రచయితల సంఘ నిర్మాణానికి, ఆశయాల నిర్వచనకు ప్రాతిపదిక వేసింది. తెనాలి సన్నాహక సంఘ సమావేశ వివరాలు యివి:

## రాష్ట్ర అభ్యుదయ రచయితల మహాసభ సన్నాహాలు

అఖిల భారత ప్రోగ్రెసివ్ రైటర్సు ఎసోసియేషన్ వారిచే ఆంధ్ర శాఖ ఏర్పరచుటకు కన్వీనరుగా నియమించబడిన వారిచే మహాసభ తెనాలిలో జరుపుటకు నిర్ణయించబడి 4-12-1942 న తెనాలిలో జి.వి. కృష్ణరావుగారి అధ్యక్షతను జరుపబడిన సమావేశంలో ఈ క్రింది తీర్మానములు అమోదించబడినవి.

1. ఆంధ్ర రాష్ట్ర ప్రోగ్రెసివ్ రైటర్స్ మహాసభ తెనాలిలో 1943 జనవరి రెండవ వారంలో జరుపుటకు నిర్ణయించారు తరువాత ఫిబ్రవరికి మార్చబడింది. ఈ క్రింది వారిని ఆహ్వాన సంఘ కార్యనిర్వాహక వర్గ సభ్యులుగా ఎన్నుకుంటూ మరి కొందరిని చేర్చుకొనే అధికారం యిచ్చారు

1. పిల్లలమర్రి బాలకృష్ణ శాస్త్రి (అధ్యక్షులు) 2. రావి అమ్మయ్య (ఉపాధ్యక్షులు) 3. చదలవాడ పిచ్చయ్య (కార్యదర్శి) 4. త్రిపురనేని గోపీచంద్ (సహాయక కార్యదర్శి) 5. సోమయాజుల నీరజరావుగార్లు

ఆహ్వాన సంఘ సభ్యత్వ రుసుం రూపాయికి తక్కువ లేకుండా ఉండాలి. మహాసభ నానాటికి ప్రోగ్రెసివ్ రచనలను ఒక సంపుటంగా ఆహ్వాన సంఘం తరపున ప్రకటించాలని తీర్మానించారు.

ఈ సందర్భంలోనే ప్రకటించిన ప్రణాళికలో ఆశయాలను ఇలా తెలిపారు.

# ప్రణాళిక

"భారతీయ సామాజిక జీవితంలో తీవ్రమైన మార్పులు జరుగుతున్నవి. అభివృద్ధి నిరోధకత్వం, క్షీణించి అవసాన దశలో ఉన్నప్పటికీ పూర్తిగా నశించ లేదు. పై పెచ్చు తన అస్థిత్వాన్ని నిలబెట్టుకోవడానికి విశ్వ ప్రయత్నాలు చేస్తూ వుంది. పౌరాణిక సంస్కృతీ కాలం గడిచిన తరువాత భారతీయ సారస్వతం, యదార్థ జీవితాల నుంచి తప్పించుకొని పోయి వినాశకరమైన ధోరణి అవలంభించింది. తర్వాత సాహిత్యం వాస్తవిక సంఘటనలను విసర్జించి నిరాధార మైన ఆధ్యాత్మిక వాదం, ఊహాజనిత ఆదర్శ వాదాన్ని పట్టుకొని వేళ్ళాడింది. తత్ఫలితంగా భారతీయ సారస్వతం శుష్కించి, నీరసించి, కడకు చాదస్తాల తోనూ, తప్పుడు ఆదర్శాలతోనూ నిండిపోయింది.

"మన సమాజంలో జరుగుతున్న మార్పుల్ని గుర్తించి వాటి అభివృద్ధిని ప్రతిబింబింపజేసే సాహిత్యాన్ని సృష్టించడం భారతీయ రచయితల విధి. సారస్వతంలో శాస్త్రీయమైన హేతువాదాన్ని చొప్పించి దేశంలో ఉన్న అభివృద్ధికర శక్తులకు చేయూత ఇవ్వాలి కుటుంబ జీవితం, సమాజము, మతం, సెక్యులరిజం, యుద్ధం మొదలైన సమస్యల మీద వ్రాయబడ్డ రచనలో కనబడే అభివృద్ధి నిరోధకత్వాన్ని అరికట్టాలి కుల, మత కక్షలు, జాతి విద్వేషం, వర్గ దోపిడీ ... వీటిని పురిగొల్పే వ్రాతల్ని ప్రతిఘటించాలి. ఈ బాధ్యతను నిర్వర్తించడానికి భారతీయ రచయితలు, సాహిత్య విమర్శనా దృష్టిని అలవరచుకొని పెంపొం దించుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

నేటివరకు సారస్వతం, తదితర కళలు ఛాందస వర్గాల చేతులలో నలిగి మలినమవుతున్నవి. వాటిని వారి ఆధిపత్యం నుండి తప్పించడం, ప్రజా సముదాయానికి సన్నిహిత పరచడం, జీవిత యదార్థ్యాన్ని ఉన్నదున్నట్లుగా కనబరిచే శక్తివంతమైన సాధనాలుగా జేయడం ఇవి ఈ సంఘం యొక్క ప్రధానోద్దేశ్యాలు.

భారతీయ నాగరికతలోని ఉత్తమ సాంప్రదాయాలకు వారసులమని నొక్కి చెబుతూ, మన దేశంలోని అభివృద్ధి నిరోధకత్వాన్ని అన్ని విధాలా విమర్శిస్తాము మన దేశం ఒక నూతన జీవితాన్ని లక్ష్యంగా పెట్టుకొని పాటు బడుతూ వుంది అందుకు తోడ్పడే ప్రతీ విషయాన్ని వెలిబుచ్చడం ద్వారానూ, నూతన రచనల ద్వారానూ ప్రోత్సహిస్తాము ఇందుకు వలసిన దేశీయ, విదేశీయ, విజ్ఞాన సంపదను వినియోగించుకుంటాము. మన భారతీయ సారస్వతం ఆకలి, దారిద్ర్యం, రాజకీయ బానిసత్వం హెచ్చుగా వెనుకబడటం మొదలైన జీవిత ప్రధాన సమస్యల్ని చర్చించాలని విశ్వసిస్తున్నాము.

ఆచారాన్ని, వ్యవస్థల్ని, హేతువాదంతో పరిశీలించడానికిన్ని, కార్యాచరణకు ప్రోత్సహించి, సంఘటనా శక్తిని అలవరిచి మార్పులు తేవడానికిన్ని తోడ్పడే విమర్శనా భావాన్ని మనలో ఉత్తేజింప చేసే ప్రతి వ్రాతను అభివృద్ధికరమైనదిగా భావిస్తూ, దానిని స్వీకరిస్తున్నాము.

## ఆశయాలు

1. వివిధ ప్రాంతాలలో రచయితల సంఘాల్ని స్థాపించడం, సమావేశాల ద్వారానూ, సాహిత్య ప్రచురణ ద్వారానూ, వివిధ సంఘాల పనిని సమన్వయించడం, రాష్ట్ర సంఘానికి, స్థానిక సంఘాలకు మధ్య సన్నిహిత సంబంధాలను ఏర్పరచడం, ఈ సంఘంయొక్క ప్రధాన లక్ష్యాలకు, ఆదర్శాలకు హాని కలుగకుండా వుండే లక్ష్యాలు గల యితర సంస్థలతో సహకారం చేయడం.
2. మన రాష్ట్రంలోని అన్ని ముఖ్య నగరాలలోనూ, జిల్లాలవారీగానూ ఈ సంఘం యొక్క శాఖలను ఏర్పరచడం.
3. అభివృద్ధికర సాహిత్యాన్ని ప్రచురించడం, ఈ విధంగా భారతీయ స్వాతంత్ర్యోద్యమానికి, నూతన సమాజాభివృద్ధికి పాటుపడటం.
4. అభ్యుదయాభివృద్ధికర రచయితల లాభ, క్షేమాలను కాపాడటం.
5. ఆలోచనా స్వాతంత్ర్యం అభిప్రాయ స్వాతంత్ర్యం, స్వేచ్ఛా ప్రచార హక్కును రక్షించడానికి పోరాడటం.
6. రచన మనమాశించే దివ్య భవిష్యత్తుకు దారి తీసేదిగా చేయడం

ఆంధ్ర శాఖ కన్వీనర్సు: - (1) చదలవాడ పిచ్చయ్య (2) శ్రీరంగం శ్రీనివాసరావు, (3) తుమ్మల వెంకట రామయ్య, (4) తాపీ మోహనరావు.

— ప్రజాశక్తి వారపత్రిక, 16-12-1942.

## రాష్ట్ర అభ్యుదయ రచయితల ప్రథమ మహాసభ

1943, ఫిబ్రవరి 13, 14 తేదీలలో ప్రథమ ఆంధ్ర అభ్యుదయ రచయితల మహాసభ తెనాలిలో జరిగింది

సుప్రసిద్ధ సాహితీవేత్త పరిశోధకులు అయిన కీ. శే. తాపీ ధర్మారావుగారు సభకు అధ్యక్షత వహించారు. ఉత్తేజకరమైన తమ ప్రసంగంలో వారిలా అన్నారు.

"పూర్వ కవులు తమ రొట్టెమీద నేతిబొట్టులేదే అని ఏడ్చారు ...అష్టైశ్వర్యాలతో తులతూగే విలాస పురుషులను గురించి రాశారు........ఈనాడు ప్రజా స్వామ్యం మహాశక్తి........ప్రపంచంలో ఎటు చూసినా భిన్న భిన్న శక్తులకు పోరాటం కనబడుతున్నది. శతాబ్దంలో రావలసిన మార్పు ఒక్క క్షణంలో కనబడుతున్నది...."

మహాసభకు వివిధ జిల్లాల నుండి ప్రతినిధులు వచ్చారు. పెక్కుమంది యువ రచయితలు, శ్రీ ముక్కామల నాగభూషణం, సెట్టి ఈశ్వరరావు, చావలి రామచంద్రరావు. వట్టికొండ విశాలక్షి, పరకాల పట్టాభిరామారావు ప్రభృతులు తమ గేయాలు చదివి వినిపించారు

సాంప్రదాయ కవిపండితులైన ఏటుకూరి వెంకట నరసయ్య, జమ్మలమడక మాధవరామశర్మలాంటివారు సభలకు హాజరై శుభ సందేశాలు ఇచ్చారు.

ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం, ఈ మహాసభ అనంతరం ఏర్పడ్డది. శ్రీ చదలవాడ పిచ్చయ్య కార్యదర్శిగా, ప్రచురణల సంపాదకవర్గంగా, తాపీ ధర్మారావు, తుమ్మల వెంకట్రామయ్య, చదలవాడ పిచ్చయ్యగారలు ఎన్నికయ్యారు.

ఫాసిజాన్ని ఓడించి, ప్రపంచవ్యాపితంగా ప్రజాతంత్రశక్తులు విజయం పొందాలని, అప్పుడు ఉపవాసవ్రతంలో ఉన్న గాంధీజీని బ్రిటిషు ప్రభుత్వం వెంటనే విడుదలచేసి, జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పరచవలసిందిగా బ్రిటిషు ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తూ తీర్మానాలు ఆమోదించారు.

అభ్యుదయ సారస్వత ఉత్పత్తికి తగిన కాగితం సౌకర్యాలు కలిగించవలసిందిగా ప్రభుత్వాన్ని మహాసభ కోరింది. రాష్ట్రమంతటా జిల్లా అభ్యుదయ రచయితల సంఘాలు ఏర్పరచాలని తీర్మానించింది.

ఆంధ్రలో అభ్యుదయ రచయితల ఉద్యమం ఈ మహాసభ అనంతరం ఉత్సాహంతో ముందుకు సాగింది.

(ప్రజాశక్తి 24-2-1943 సంచికలో తాపీ మోహనరావుగారి వ్యాసం ఆధారంగా)

## సాంస్కృతిక ప్రదర్శనలకు శిక్షణ

1942 లో జపాన్ దాడి ప్రమాదం ఏర్పడిన దృష్ట్యా రాష్ట్రంలో ఈ ప్రమాదాన్ని ఎదుర్కొడానికి, దేశ స్వాతంత్ర్యం నిలబెట్టుకోవడానికి ప్రజలకు తర్ఫీదు యిచ్చేందుకు ప్రజా సేవకులను తయారు చేసే కార్యక్రమాన్ని కమ్యూనిస్టు పార్టీ తలపెట్టింది యువజన, విద్యార్థి సంఘాల ద్వారా ప్రజా రక్షణ శిక్షణా శిబిరాలను నడిపింది. 1942 మే, జూన్ నలల్లో ఇటువంటి శిక్షణా శిబిరాలు కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి జిల్లాల్లో జరిగాయి. ఈ శిక్షణా శిబిరాలలోనే సాంస్కృతిక ప్రదర్శనలు ద్వారా ప్రజలకు ఈ సందేశాన్ని అందజేయడానికి తొలి ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి.

తొలిసారిగా రాష్ట్రంలో కృష్ణాజిల్లా గండిగుంటలో జరిగిన శిబిరంలో పాటలు, బుర్రకథలు, నాటకాలు, విచిత్ర వేషాలు (ఫ్యాన్సీ డ్రెస్సులు) మున్నగు

ప్రచార పద్ధతులలో జయప్రదంగా శిక్షణ యిచ్చారు. శిబిరానికి వచ్చిన విద్యార్థులు వారంతట వారే పాటలు, బుర్రకథలు, వ్రాసుకొని సమిష్టిగా నేర్చుకొన్నారు. దీని ఫలితంగా 15 సెంటర్లలో ప్రజానురంజకంగా ఫాసిస్టు వ్యతిరేక ప్రచారం కొనసాగించారు. పైన పేర్కొన్న విచిత్ర వేషాలలో మాదిగ వేషం, గొల్ల సుద్దులు మొదలైనవి కూడా రూపొందించడానికి వీరు కృషి చేస్తున్నారు. బిచ్చగాళ్ళు, అన్నా-చెల్లెలు, కోయవాడు, బుడబుక్కల, పకీరులు మొదలైన విచిత్ర వేషాలను రూపొందించడం జరిగింది.

గుంటూరు జిల్లా మహిళా వైజ్ఞానిక శిబిరంలో కూడా సమిష్టిగా పాటలు పాడటం నేర్చుకున్నారు.

కృష్ణా జిల్లా యువజన విజ్ఞాన ప్రచారదళం విజయవాడ తాలూకా ముస్తాబాదులో విజ్ఞాన శిక్షణా శిబిరం నెలకొల్పారు. 1942 జూన్ 15వ తేదీన జరిగిన బహిరంగ సభలో ''అజేయ చైనా'' ''మాతృ భూమి'' అనే నాటకాలు ప్రదర్శించారు. గొల్ల చాకలి మున్నగు విచిత్ర వేషాల ద్వారా జపాన్ వ్యతిరేక ప్రచారం చేశారు మూడవ ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు మహాసభ జూలై 8-15 తేదీలలో (8 రోజులు) విజయవాడలో జరిగింది. ఈ సభలో వివిధ జిల్లాల వైజ్ఞానిక దళాలమధ్య పోటీప్రదర్శనలు జరిగాయి అప్పటికే వివిధ జిల్లా కమ్యూనిస్టు పార్టీ మహాసభలు జరిగాయి ఈ సభలో మొదటగా వైజ్ఞానిక ప్రదర్శనలు యిచ్చారు. రాష్ట్ర మహాసభకు బాగా తర్ఫీదు పొంది వచ్చారు.

కృష్ణా జిల్లా కమ్యూనిస్టు పార్టీ ద్వితీయ మహాసభ బెజవాడలో 1942 జూన్ 28, 29, 30 తేదీలలో జరిగింది. ఈ సభ నాటికే వైజ్ఞానిక ప్రదర్శనలలో బాగా తర్ఫీదు పొంది ప్రదర్శనలు యిచ్చారు.

పశ్చిమ గోదావరిజిల్లా కమ్యూనిస్టు మహాసభ 1942 జూలై 1, 2, 3, తేదీలలో ఏలూరులో జరిగింది. 3 వ తేదీన వైజ్ఞానిక ప్రదర్శనలలో 30 మంది కమ్యూనిస్టు యువతీ యువకులు పాల్గొన్నారు బుర్రకథ, ఫకీరు, కోయ తదితర వేషాల ద్వారా ఆహార సమస్య, జపాన్ దాడి ప్రమాదం తదితర సమస్యలపై ఈ విచిత్ర వేషాలువేసి ఎంతగానో ఆకర్షించారు.

గుంటూరుజిల్లా కమ్యూనిస్టు మహాసభ జూలై 1, 2, 3 తేదీలలో తెనాలిలో జరిగింది. 6,000 మంది హాజరైన బహిరంగ సభలో రాత్రి 11 గంటల నుండి తెల్లవారుజాము 3½ గంటల వరకు వైజ్ఞానిక ప్రదర్శనలు జరిగాయి. మరువరాని దృశ్యం కాకుమాను - చింతల సెట్టి వారి బుర్రకథ ''చూక్కాని కాడమో జోషి బాబుండాడు'' అనే పడవ పాట "జాయంగే కయ్యూరు జాయంగే'' కోలాటం ఆహార సమస్యా పరిష్కారాన్ని చూపే అన్నా చెల్లెలు పాట (బ్రహ్మ పట్నం

పోదామంటే చీకటేమిర అన్నయ్య ! వరుస) చైనా యోదుల బుర్రకథ (లక్ష్మీ కాంతారావు ఇది లక్ష్మీకాంత మోహన్ అయి ఉండాలి ) మహిళామణులచే టాన్యా బుర్రకథ,చింతలసోది, నాజిర్ గొల్లసుద్దులు, కామ్రేడ్ మహబూబ్ ఫకీరు వేషంలో చెప్పిన రష్యా- జర్మని యుద్ధము ప్రజలను పరమానంద పరవశులను చేశాయి. కళాకారులకు అప్పటికప్పుడు అనేక బహుమతులు ప్రేక్షకుల నుండి వచ్చాయి.

బెజవాడలో జరిగిన రాష్ట్ర కమ్యూనిస్టు మహాసభలో కృష్ణా - గుంటూరు జిల్లాల వైజ్ఞానిక దళాలు పోటా పోటీలుగా వైజ్ఞానిక ప్రదర్శనలు యిచ్చాయి.

మహాసభ ప్రారంభంలో ''వేగరావోయ్ కార్మిక ! వేగరావోయ్ కర్షక ! కలసి మెలసి పలుకవోయ్ ! అరుణ పతాకకు జై'' అనే సమిష్టిగానం ఉత్తేజ కరంగా ప్రదర్శించారు. ఈ సభలో ఆ తరువాత వివిధ జిల్లా దళాలు యిచ్చిన వైజ్ఞానిక ప్రదర్శనలు చూచి మహాసభకు సౌహార్ద్ర ప్రతినిధులుగా వచ్చిన మల బార కామ్రేడ్ తిరువంబయ్యియారు! ''మీరు ప్రదర్శించిన వైజ్ఞానిక కార్యక్రమం నుండి ప్రతి రాష్ట్ర పార్టీ నేర్చుకోవలసిన విషయాలెన్నో ఉన్నాయి అన్నారు" శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్యగారు తమ సందేశంలో ''11 వ తేదీన పార్టీ ఆధ్వర్యాన ర్యాలీ, వైజ్ఞానిక ప్రదర్శనలు చూసి, కమ్యూనిస్టుపార్టీ ప్రజల విశ్వా సాన్ని ఎలా చూరగొన్నదో చూసి ఉప్పొంగి పోయాను. అవి నా జీవితానికి ఉత్సాహాన్నిచ్చాయి" అన్నారు.

## అభ్యుదయ రచయితల ఉద్యమ వ్యాప్తి

తెనాలి ప్రథమ రాష్ట్ర మహాసభ అనంతరం రాష్ట్రంలో వివిధ చోట్ల అభ్యుదయ రచయితల సంఘాలు ఏర్పడ్డాయి.

1943 ఏప్రిల్ 18 వ తేదీన ఏలూరులో స్థానిక అభ్యుదయ రచయితల సంఘం ఆధ్వర్యాన బహిరంగ సభ జరిగింది. అనేకమంది రచయితలు పుర ప్రముఖులు వచ్చారు. మొట్టమొదట సెట్టి ఈశ్వరరావుగారు (విజయనగరం) ఉపన్యసిస్తూ వీరేశలింగం, గిడుగు, గురజాడ వారల ఆశయాలను పైకి మననం చేస్తూ కొందరు పెడదోవలు త్రొక్కి దేశ కాలపాత్రలతో సంబంధం లేకుండా నేటి మన సాహిత్య రంగంలో ఉష్ట్రపక్షి విధానాన్ననుసరించుతున్నారని విమర్శిం చారు. అభివృద్ధి నిరోధక సాహిత్యాన్ని తిరస్కరించాలనీ, అభ్యుదయ సాహిత్యాన్ని ప్రోత్సహించడం మన విధి అని అన్నారు

తరువాత ఒక స్థానిక రచయిత సిపాయి మీద, హిట్లరిజం మున్నగు విషయాలమీద, సభికుల హృదయాలను పూగించే రచనలను చదివి వినిపించారు శ్రీ జి. కోటయ్య, శ్రీ పరకాల పట్టాభి రామారావుగార్లు తమ రచనలను ఎంతో ఉత్తేజంగా చదివి వినిపించారు.

శ్రీ అత్తలూరి సర్వేశ్వరరావు ఉపన్యసిస్తూ సాహిత్యం, సంఘం నుండి ఉత్పత్తి అయ్యేదేనని, అభ్యుదయ రచయితల నమ్మిక అన్నారు. గత ప్రపంచ యుద్ధం తరువాత అభ్యుదయ రచయితలు తమ సాహిత్య కృషిలో సాధ్యమైనంత వరకు ప్రజా సన్నిహితంగా ఉండాలని ప్రయత్నిస్తున్నారని చెప్పారు. వీరిలో గొప్ప రచయితలు లేకపోవచ్చుగాని నవ్య కవులకంటే వీరి దృక్పథం ఎంతో విశాలమైందని అన్నారు. తరువాత శ్రీ తాపీ మోహనరావు ఉపన్యసిస్తూ సమాజ ఉపయోగం కోసమే సాహిత్యాది కళలు పుట్టాయి. అభ్యుదయ రచయితలు సమాజాభివృద్ధికి, దివ్య భవిష్యత్తుకు దారి తీయడానికి సారస్వతాన్ని ఒక ముఖ్య సాధనంగా తయారుచేయ సమకట్టారని అన్నారు. శ్రీ చదలవాడ పిచ్చయ్యగారు మాట్లాడుతూ ఇరవై సంవత్సరాలకు పూర్వం, ఆంధ్ర సారస్వత సంఘం, పూర్వ గ్రాంథిక భాష. నేటి గ్రంధాలలో కూడా ఉండాలనే వాదిస్తున్నారనీ, సభ్య సాహిత్య పరిషత్తు, భావానికి అనుకూలమైన వ్యవహారిక భాషను బలపరచి కొత్తదారి తొక్కిందని అన్నారు మానవ సంఘంలో ఒడిదుడుకులను సామాన్య భాషలో ప్రతిబింబింపజేయాలనీ అదే సాహిత్య కళ, సంఘోన్నతికై తోడ్పడే ఉత్తమ కళ అన్నారు

మరునాడు మధ్యాహ్నము, సాయంత్రమూ, రచయితల గోష్ఠి జరిగింది. శ్రీ సింగరాచార్య, శ్రీ సామవేదం జానకిరామశర్మ మొదలైనవారు తమ రచనలను చదివి వినిపించారు. వీరిద్దరూ సభ్యులుగా చేరారు

**వీరులపాడు** :- 1942 ఏప్రిల్ 22వతేదీ రాత్రి వీరులపాడు గ్రామంలో నందిగామ తాలూకా అభ్యుదయ రచయితల సంఘ యాజమాన్యాన బహిరంగ సభ జరిగింది. సభకు శ్రీ వాసిరెడ్డి భాస్కరరావుగారు అధ్యక్షత వహించారు. వట్టికొండ రామకోటయ్యగారు తాము రచించిన "కరువు" అన్న గేయం చదివి వినిపించారు. చావ రామలింగయ్య, సుంకిర సత్యనారాయణ, ఎన్.వి. సుబ్బారావు శ్రీమతి వట్టికొండ విశాలాక్షిగార్లు తమ గీతాలను ఎంతో ఉత్తేజకరంగా చదివి వినిపించారు. శ్రీ సెట్టి ఈశ్వరరావు, పి.వి. శివయ్య, చదలవాడ పిచ్చయ్యగార్లు సారస్వతం విధులు, ఇంతవరకు తెలుగు సారస్వతం ఏయే పోకడలు పోయిందీ చెప్పారు. తమ చుట్టూఉన్న సమాజాన్ని విడిచి కవి ఎక్కడకోపోతే తన ధర్మాన్ని మరచిన వాడవుతాడనీ, కవి ఎప్పుడూ, సమాజం ముందుండి మార్గదర్శకుడుగా ఉండాలనీ, ఆ ఆశయంతోనే అభ్యుదయ రచయితల సంఘం పని చేస్తుందని అన్నారు.

ఏలూరులోనూ, వీరులపాడులోను జరిగిన సభలు వానిలో కనబడిన ఉత్సాహం అభ్యుదయ రచయితల ఉద్యమానికి గొప్ప భవిష్యత్తును తెలుపుతుంది.

అంతకు ముందు 4-4-43 వ తేదీన నందిగామ తాలూకా అభ్యుదయ రచయితల ప్రథమ సమావేశం కొణత మాత్మకూరులో శ్రీ వట్టికొండ రంగయ్య గారి అధ్యక్షతన జరిగింది. మొత్తం 20 మంది సభ్యులలో 17 గురు హాజరయ్యారు. ఈ సంవత్సరానికి చావ రామలింగయ్య కార్యదర్శి, సుంకర సత్యనారాయణ, వట్టికొండ రామకోటయ్య, వాసిరెడ్డి భాస్కరరావు, చావ నారాయణరావు గారలు కార్యవర్గ సభ్యులుగా ఎన్నుకోబడ్డారు శ్రీ వట్టికొండ రంగయ్య, చావ రామలింగయ్య సంపాదకత్వంలో లిఖిత మాస పత్రికను నడుప నిశ్చయించారు.

రాజమండ్రిలో ఆంధ్ర అభ్యుదయ రచయితల ప్రథమ సమావేశం శ్రీ శివరావుగారి అధ్యక్షతను జరిగింది. శివరావు, కామేశ్వర భట్టు, మామిడి అప్పారావు గార్లు తమ రచనలు చదివి వినిపించారు. స్థానిక అభ్యుదయ రచయితల సంఘానికి శ్రీ మామిడి అప్పారావును అధ్యక్షులుగా, అయ్యగారి నరసింహారావును కార్యదర్శిగా ఎన్నుకొన్నారు లిఖిత పత్రికను నడుపుటకు తీర్మానించారు.

## అఖిల భారత అభ్యుదయ రచయితల మహాసభ

అఖిల భారత అభ్యుదయ రచయితల మహాసభ బొంబాయిలో 1943 మే 22 వ తేదీ నుండి 25 వ తేదీ వరకు జరిగింది. దేశమంతట నుండి 150 మంది ప్రతినిధులు వచ్చారు. ఆంధ్ర నుండి ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘ కార్యదర్శి శ్రీచదలవాడ పిచ్చయ్య, సెట్టి ఈశ్వరరావు, వట్టికొండ రంగయ్య, బాలగంగాధర తిలక్, ముక్కామల నాగభూషణం మొదలైనవారు హాజరయ్యారు. తెలుగు భాషాశాఖ అధ్యక్షులుగా శ్రీ తాపీ ధర్మారావుగారు, ప్రజానాట్యమండలి ప్రతినిధిగా డాక్టరు రాజారావు సభలో పాల్గొన్నారు.

మహా సభను శ్రీ హరీంద్రనాథ్ చటోపాధ్యాయ ప్రారంభించారు. ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ కె.ఎ. అబ్బాస్ స్వాగతోపన్యాసం చేశారు. మహారాష్ట్ర అభ్యుదయ రచయితల సంఘాధ్యక్షులు కామ్రేడ్ ఎస్.ఎ. డాంగే, ఉర్దూ భాషా శాఖ అధ్యక్షుడు జోష్ మలిహాబాదీ, కన్నడ శాఖ అధ్యక్షులు జితుభాయ్ మెహతా, సత్యేంద్రనాథ్ మజుందార్ (ఆనంద బజార్ పత్రిక మాజీసంపాదకుడు) ప్రొఫెసరు జాగీర్ తమ తమ భాషలలో అభ్యుదయ సాహిత్యాలు, అభివృద్ధి నిరోధక సాహిత్యంతో ఎలా ఘర్షణకు వచ్చాయో వివరిస్తూ, సాహిత్యం అభ్యుదయ సంప్రదాయాన్ని స్వీకరించవలసిన ఆవశ్యకతను వివరించారు.

తెలుగు భాషా శాఖాధ్యక్షుడు శ్రీ తాపీ ధర్మారావుగారు తమ అధ్యక్షోపన్యాసంలో ఆంధ్రభాషా చరిత్ర ఆరంభమైన నాటి నుండి నేటి వరకు అభ్యుదయకరమైన పోకడలకు ఆటంకాలు ఎలా కలిగాయో వివరించారు. పాత విషయాల పట్ల మూఢ విశ్వాసం, స్వార్థం మొదలైన గుణాలు సాహిత్యంలో అభివృద్ధిని ఎలా నిరోధిస్తాయో చెప్పారు.

25వ తేదీ రాత్రి కవితా గోష్ఠి జరిగింది. మలిహాబాది, సాగర్, సజామీ, సుజాజ్, నరేంద్ర శర్మ, మగ్దుం మొహిద్దీన్ మొదలైన ప్రఖ్యాత కవులు పాల్గొన్నారు.

అఖిల భారత అభ్యుదయ రచయితల మహాసభతో పాటు, భారత ప్రజా నాటకరంగం వారు కూడా బొంబాయిలో తమ సమావేశాన్ని జరిపారు. బెంగాలీ ఇంగ్లీషు, మరాఠీ, హిందూస్థానీ భాషల్లో చక్కని ఏకాంక నాటకాలు ప్రదర్శించారు. ఆంధ్ర శాఖ నిర్మించడానికి సమర్థుడైన యువనటుడు డాక్టర్ రాజారావును నియమించారు.

అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘ ప్రధాన కార్యదర్శిగా శ్రీ సజ్జాద్ జహీర్, సహాయ కార్యదర్శులుగా విష్ణుదేవ్ (బెంగాల్) కె.ఎ. అబ్బాస్ (బొంబాయి) కోశాధికారి మామావారేర్కర్ (బొంబాయి) కార్యవర్గంలో హిరెన్ ముఖర్జీ, ఎస్ కె. ఆచార్య, ఆర్.ఎ. బకులేశ, ఎస్.ఎ. డాంగే, రాంబిలాస్ శర్మ నరేంద్ర శర్మ, మగ్దుం, డాక్టరు అబ్దుల్ అలీం, అనంత కనేకర్ భోగలాల్ గాంధీ, చదలవాడ పిచ్చయ్య, ప్రొఫెసరు జాగీర్దార్, శక్తిదాసన్, సుబ్రహ్మణ్యం, డాక్టర్ జాన్ సింగ్ ఎన్నుకోబడినారు.

(ప్రజాశక్తి 9-6-1943)

## ఆంధ్ర అభ్యుదయ రచయితల మహాసభ సంచిక

తెనాలిలో జరిగిన ప్రథమ ఆంధ్ర అభ్యుదయ రచయితల మహాసభ అనంతరం - మహాసభ ఆహ్వాన సంఘం, కన్వీనర్స్ సమిష్టి సంపాదకత్వాన మహాసభ ప్రత్యేక సంచిక ప్రచురింపబడింది. మహాసభ అధ్యక్షుల, ఆహ్వాన సంఘ కార్యదర్శుల ఉపన్యాసాలు, మహాసభ తీర్మానాలు, సంఘ ప్రణాళిక, సంఘ నిర్మాణ సూత్రాలు ఈ సంచికలో ఉన్నాయి.

అభ్యుదయ సారస్వతం ఎలా వుండాలి ? సారస్వత సమాలోచన, ఫాసిస్టు ప్రతికూల సాహిత్యం అనే వ్యాసాలు, పునఃప్రతిష్ట, కవి-సంస్కృతి విప్లవం, ఓ కవీ! నవ కవి, కవి కర్తవ్యం అనే గేయాలు, ప్రస్తుత సమాజానికి

అభ్యుదయ మార్గాన్ని చూపాలంటే సారస్వతం ఎలాంటి పాత్ర నిర్వహించాలి? మున్నగు విషయాలు విపులంగా తెలియజేస్తూ ఆంధ్ర సారస్వత రంగానికి ఒక నూతన పంథాను తెలియజేస్తున్నాయి. సంచిక కావలసినవారు ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘ కార్యాలయం, తెనాలి అని వ్రాయాలని ఈ సంచికపై ప్రజా శక్తి సమీక్షలో తెలుపబడింది.

(17-3-43 ప్రజా శక్తి)

## అభ్యుదయ రచయితల సంఘ రాష్ట్ర కార్యవర్గం

ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘ కార్య నిర్వాహక వర్గ సమావేశం బెజవాడలో 1943 జూన్ 25 వ తేదీన జరిగింది. మహీధర జగన్మోహనరావు అధ్యక్షత వహించారు. గత సమావేశం నేటి సమావేశానికి మధ్య జరిగిన కృషి గురించి సభ్యులు రిపోర్టు యిచ్చారు. ఆ తరువాత బొంబాయిలో జరిగిన అఖిల భారత అభ్యుదయ రచయితల మహాసభ తీర్మానాలను, ప్రణాళికను చర్చించి అంగీకరించారు.

రాష్ట్ర సంఘం పని చురుకుగా జరుగడానికి రాష్ట్ర సంఘం ఆఫీసును తెనాలి నుండి బెజవాడకు మార్చడానికి నిర్ణయించారు. స్థానిక, రాష్ట్ర కమిటీల మధ్య జిల్లా కమిటీలను రద్దు చేస్తూ స్థానిక, స్థానిక కమిటీకి, సరాసరి రాష్ట్ర కమిటీతో సంబంధం పెట్టుకోవాలని తీర్మానం జరిగింది. సభ్యత్వ రుసుము అర్థ రూపాయికి తగ్గించారు. ఆగష్టు మొదటి వారంలో అభ్యుదయ రచనల సంపుటిని ప్రకటించడానికి నిశ్చయించారు.

**బెజవాడ :** పట్టణ అభ్యుదయ రచయితలు 1943 జూన్ 30 వ తేదీన శ్రీ పిళ్ళా వెంకటరత్నం గారి అధ్యక్షతను సమావేశమైనారు. చదలవాడ పిచ్చయ్య, జీవన ప్రభాత్, కరవెంకట సత్యానారాయణ, నాగభైరవ శివరామ కృష్ణ, కొమఱ్రాజు వినాయక రావు మొదలైన రచయితలు అనేకులు సభలో పాల్గొన్నారు. తరువాత పట్టణ సంఘ కార్యవర్గాన్ని ఎన్నుకున్నారు. శ్రీ కొమఱ్రాజు వినాయకరావు కార్యదర్శి, నాగభైరవ శివరామ కృష్ణయ్య సహాయ కార్యదర్శి.

సంపాదక వర్గం :- వినాయక రావు, శివరామ కృష్ణయ్య, పాటిబండ్ల మాధవశర్మ, వేలూరి సహజానంద్, పిళ్ళా వెంకటరత్నం గార్లు.

జాతియ నాయకులను, జైళ్ళలో ఉన్న అభ్యుదయ రచయితలను విడుదల చేయాలని ఒక తీర్మానం చేశారు. కాగితం కరువు వల్ల సారస్వత కృషికి భంగం కల్గుతుంది గనుక ఈ కరువు నివారించే ఏర్పాటు ప్రభుత్వం చేయాలని మరో తీర్మానం జరిగింది.

# కార్మికోద్యమం

1934 - 35 సంవత్సరాలలో కమ్యూనిస్టులు కార్మికులను సంఘటిత పరచి, కార్మిక సంఘాల్ని ఏర్పరచి, కార్మికోద్యమాన్ని ప్రారంభించారు. ఆనాటి ఉమ్మడి రాష్ట్రమైన మద్రాసు రాష్ట్రంలోని ఆంధ్ర జిల్లాలలో ప్రధానంగా పని చేశారు. కమ్యూనిస్టు పార్టీ నిషేధింపబడినందున కాంగ్రెసులో అతివాదులు (వామ పక్ష సభ్యులు) గా ఉండేవారు. కూలీ రక్షణ సమితులను (లేబర్ ప్రొటెక్షన్ లీగ్‌లను) ఏర్పరచారు. కాంగ్రెస్ సోషలిస్టు ఏర్పడిన తర్వాత ఆ పార్టీ సభ్యులుగా కూడా కమ్యూనిస్టులు కార్మికోద్యమంలో పనిచేశారు.

1934 జూలైలో కమ్యూనిస్టు పార్టీ దాని శాఖలు నిషేధింప బడ్డాయి. అమీర్ హైదర్ ఖాన్ 1932 లో మద్రాసులో స్థాపించిన మద్రాసు యంగ్ వర్కర్స్ కూడా 1934 సెప్టెంబరులో నిషేధింపబడింది. ఈ పరిస్థితులలో కార్మికుల మధ్య పని చేయడానికి ఒక వేదిక అవసరం అయింది. అందుచేత ఏలూరు, బెజవాడ పట్టణాలలో 1935 లో కూలీ రక్షణ సమితులు ఏర్పడ్డాయి.

1935 మార్చిలో గుంటూరులో, జూలై 1 న నెల్లూరు, బందరులలో జూలై 19 న మద్రాసులో, ఆగస్టులో తెనాలిలోనూ, అక్టోబరు 10 న బెజవాడలోనూ కూలీ సంరక్షణ సమితులు ఏర్పడ్డాయి. వీటి అన్నిటిని సమన్వయపరచే మద్రాసు రాష్ట్ర కూలీ రక్షణ సమితి ఆగస్టు 18 న ఏర్పడింది. 1936 ఫిబ్రవరి 4 న ఏలూరులోనూ, ఇదే మాసంలో భీమవరంలోనూ కూలీ రక్షణ సమితులు ఏర్పడ్డాయి.

కూలీ రక్షణ సమితులను స్థాపించిన వారిలో కమ్యూనిస్టు పార్టీ సభ్యులే గాక, అస్పష్టమైన సోషలిస్టు భావాలు కలవారు కూడా వున్నారు.

గుంటూరులో కూలీ రక్షణ సమితి 1935 లో ప్రెస్ వర్కర్స్ యూనియన్, జట్కా బండివాళ్ళ సంఘాలను స్థాపించింది. గుంటూరు జూట్‌మిల్ కార్మికుల సమ్మెను బలపరచి, యూనియన్‌ను ఏర్పరచింది. లాగుడు బండ్ల కార్మికులలో కూడా పనిచేసింది. ఈ సమితి ఆధ్వర్యాన ప్రచురించిన 12 కరపత్రాలలో రెండింటిపై ప్రెస్ యాక్టు క్రింద నేరమారోపించి, జొన్నలగడ్డ రామలింగయ్య, దర్బా కృష్ణమూర్తి, ప్రతాప రామసుబ్బయ్య గార్లకు శిక్ష విధించింది ప్రభుత్వం. జిల్లాలో వ్యవసాయ కార్మిక సంఘం కూడా దీని ఆధ్వర్యంలోనే ఏర్పడింది.

గుంటూరులో కొందరు మహిళలకు, పురుషులకు అధ్యయన తరగతులను ఇది నిర్వహించింది.

1935 లో మద్రాసులో కల్లుగీత పనివారి సంఘాన్ని ఏర్పరచింది

నెల్లూరు కూలీ రక్షణ సమితి తన లక్ష్యాలను ఇలా వివరించింది.

1. కార్మికుల, సాధారణంగా బీదల హక్కుల రక్షించుట 2. భారత కార్మికోద్యమం గురించి, ప్రపంచ కార్మిక సమస్యల గురించి కార్మికులకు బోధించుట.

నెల్లూరు కూలీ రక్షణ సమితి తన కార్యక్రమంలో ఈ క్రింది అంశాలను పేర్కొంది :

1. కార్మిక సంఘాలు ప్రారంభించుట
2. వీధి సభలు, బహిరంగ సభలు, ఊరేగింపులు, సమ్మెలు నిర్వహించుట
3. కార్మిక క్లబ్బులను ప్రారంభించుట
4. కార్మికులకు సహకార దుకాణాలను ఏర్పరచుట
5. కార్మిక దినోత్సవ సందర్భంగా ఊరేగింపులు జరుపుట
6. కార్మిక పత్రిక నడపుట
7. ప్రతి సంవత్సరం కార్మిక మహా సభ జరుపుట

నెల్లూరు కూలీ రక్షణ సమితికి కార్యదర్శిగా రావి ఆదిశేషయ్య ఉండేవారు. దాని సంస్థాపక సభ్యుల్లో పుచ్చలపల్లి సుందరయ్యగారొకరు.

1935 డిసెంబరులో నెల్లూరు కూలీ రక్షణ సమితిచేసిన తీర్మానంలో, ఈ సమితిలోని సమర్థులైన సభ్యులు కాంగ్రెసు సోషలిస్టులను అతివాద కాంగ్రెసు వాదులను తమవైపు త్రిప్పుకోడానికి గాను కాంగ్రెస్‌లో చేరాలని తీర్మానించింది తద్వారా మితవాద కాంగ్రెసువారి నిందలను బట్టబయలు చేయాలనీ, కార్మిక ప్రయోజనాలను కాపాడాలనీ తీర్మానించింది.

1935 అక్టోబరు 10 న బెజవాడ కూలీ రక్షణ సమితి ఏర్పడింది. పిల్లలమర్రి వేంకటేశ్వర్లు కార్యదర్శి బెజవాడలో కూలీ రక్షణ సమితి ఆధ్వర్యాన మున్సిపల్ స్కావెంజర్లను సంఘటిత పరచే ప్రయత్నం జరిగింది. కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ, యువజన సంఘాల సహకారంతో సామ్రాజ్యవాద వ్యతిరేక దినాలు, కార్మిక దినోత్సవాలు జరిపింది రైల్వే ఎంప్లాయీస్ యూనియన్ బెజవాడ బ్రాంచికి ఆర్గనైజరుగా పిల్లలమర్రి వెంకటేశ్వర్లు నియమింపబడ్డారు.

బెజవాడ కూలీ రక్షణ సమితి రాజకీయ కార్యకలాపాలు కూడా చురుకుగా ఉండేవి. ఒకసారి ఈ సమితి కార్యాలయాన్ని సోదా చేసినపుడు కమ్యూనిస్టు సాహిత్యం దొరికింది. కాంగ్రెస్ అధ్యక్షులు బాబూ రాజేంద్రప్రసాద్, విజయవాడ

వచ్చినపుడు, కూలీ రక్షణ సమితి సభ్యులు నల్లజెండా ప్రదర్శనలు జరిపారు. బెజవాడ కూలీ రక్షణ సమితి రాజకీయ అధ్యయన తరగతులు కూడా నిర్వహించింది.

ఏలూరు కూలీ రక్షణ సమితికి కార్యదర్శి తాడి అప్పలస్వామి. భీమవరం కూలీ రక్షణ సమితికి కార్యదర్శి తణికెళ్ళ వెంకటచలపతి. భీమవరం రైల్వే గాంగ్ కూలీలను యం యస్ యం. రైల్వే ఎంప్లాయీస్ యూనియన్ శాఖలో చేర్పించడానికి భీమవరం కూలీ రక్షణ సమితి చేసిన ప్రయత్నం సఫలం కాలేదు. హరిజన, వ్యవసాయ కార్మికుల్లో ఈ సమితి పనిచేసింది. హరిజనులకు దేవాలయ ప్రవేశం లాంటి సంఘ సంస్కరణలకు కృషి చేసింది. రైసుమిల్లు కార్మికులలోనూ, ప్రెస్ వర్కర్సులోను, పనిచేసింది యువజన సంఘంతో కలిసి సామ్రాజ్య వ్యతిరేకదినం, కార్మిక దినోత్సవాలు జరిపింది.

ఈ నేపథ్యంలో ప్రారంభమైన కార్మికోద్యమంలో ప్రెస్ వర్కర్సు ఉద్యమం ఒక ముఖ్య భాగం.

1934 నుండి దేశ వ్యాప్తంగా ఉన్న ప్రెస్ వర్కర్స్ యూనియన్లతో అఖిలభారత సంస్థ ఏర్పాటుకు కృషి జరిగింది. 1934 డిసెంబరులో లక్నోలో ఆలిండియా ప్రెస్ వర్కర్స్ మహాసభ జరిగింది. ఆలిండియా ప్రెస్ వర్కర్స్ ఫెడరేషన్ ఏర్పడింది. 1935 నవంబరు 2, 3 తేదీలలో బొంబాయిలో ఫెడరేషన్ ద్వితీయ మహాసభ జరిగింది. దీనికి పుచ్చపల్లి సుందరయ్య, మద్రాసు యంగ్ వర్కర్స్ లీగ్ సభ్యుడైన పి మాణిక్యం (కంపోజిటర్) హాజరయ్యారు సుందరయ్యగారి ఆహ్వానంపై 1936 జనవరి 5 న మద్రాసులో ప్రెస్ కార్మికుల అఖిల భారత మహాసభ జరిగింది. వారణాసికి చెందిన రామన్న అధ్యక్షత వహించాడు.

బొంబాయి, కలకత్తా, లాహోర్‌ల నుండి కార్మిక నాయకులూ, కమ్యూనిస్టు నాయకులు హాజరయ్యారు. వారిలో మీరట్ కుట్ర కేసులో విడుదలై, బొంబాయి నుండి ప్రభుత్వంచే బహిష్కరించబడిన యస్ వి. ఘాటే కూడా ఉన్నాడు.

పి. జీవానందం ఎర్రజండాను ఎగుర వేశాడు. తమిళనాడు ప్రెస్‌కు చెందిన శివజ్ఞానం మహాసభను ప్రారంభించాడు. ప్రెస్ వర్కర్ పి. రాజ వడివేలు స్వాగతం పల్కాడు.

ఈ మహాసభతో మద్రాసుకు అఖిల భారత ప్రెస్ వర్కర్స్ కార్యాలయం మారింది. ప్రధాన కార్యదర్శిగా పి మాణిక్యం ఎన్నికయాడు. టి.జి. శఠగోపన్ యస్. వి ఘాటే (మద్రాసు) కార్యవర్గ సభ్యులుగా ఎన్నుకోబడ్డారు.

1935 ఏప్రిల్ 5 న మద్రాసులోని జార్జిటౌన ప్రాంతంలోని ప్రెస్ కార్మికులు 30 మంది యూనియన్‌గా ఏర్పడ్డారు. ఆగస్టులో ఈ ఫెడరేషన్‌కు అనుబంధించారు. దీనికి ఎ.యస్.కె. అయ్యంగారు అధ్యక్షుడు. ఈ యూనియన్‌లో తెలుగు, తమిళనాడు, కార్మికులుండేవారు. ఈ యూనియన్ ఆధ్వర్యాన ఏప్రిల్, మే, జూన్‌లలో సభలు జరిగాయి.

తమ జీవితాలను సక్రమంగా చెల్లించాలని ప్రెస్ కార్మికులు కోరినప్పుడు వారిలో కొందర్ని యజమానులు తొలగించారు. ఈ సమస్యను తీసికొని యూనియన్, వారిని తిరిగి పనిలో ప్రవేశ పెట్టుకోవాలని ఆందోళన చేసింది.

1935 మే మొదటి వారంలో 'ఆంధ్ర పత్రిక' ప్రెస్ (మద్రాసు) లో మూడు రోజులు సమ్మె జరిగింది. కార్మికులు పికెటింగు చేసినపుడు యూనియన్ సభ్యులు తోడ్పడ్డారు వీరిపై పోలీసులు కేసు పెట్టారు. ఈ సమ్మె కూలీ రక్షణ సమితి యాజమాన్యాన జరిగింది.

ప్రెస్ వర్కర్సు యూనియన్, తదితర కార్మిక సంఘాలు 1935 మే దినోత్సవాన్ని మద్రాసు పీపుల్సు పార్కులో జరిపాయి. ప్రెస్ కార్మికుల, తదితర కార్మికుల రాజకీయ చైతన్యానికి ఉదాహరణగా ఆనాడు చేసిన తీర్మానాలు పేర్కొనవచ్చు. ఒక తీర్మానంలో సోవియట్ యూనియన్‌కు అభినందనలు తెలియచేయబడింది. యుద్ధం ప్రారంభమయ్యే పక్షంలో బ్రిటన్‌కు సహాయం చేయరాదనీ, ఆ సమయంలో భారతదేశంలో కార్మిక కర్షక రాజ్యాన్ని ఏర్పరచుకోడానికి ఆ అవకాశాన్ని వినియోగించుకోవాలనీ ఆ సభలో వక్తలు ఉద్బోధించారు.

## గుంటూరు

1935 మే 26 న గుంటూరులో ప్రెస్ వర్కర్ల సమావేశం జరిగింది కూలీ రక్షణ సమితి ప్రచురించిన "ధనికులు చేసే మోసాలు" అనే కరపత్రాన్ని కూలీ రక్షణ సమితిసభ్యులు ఇందులో వివరించారు ముగ్గురు ప్రెస్‌వర్కర్సుతో ఒక ఆర్గనైజింగు కమిటీ ఏర్పడింది. ఆ తర్వాత 1935 జూన్ 2 వ గుంటూరు ప్రెస్ వర్కర్సు యూనియన్ ఏర్పడింది. దానికి అధ్యక్షులుగా గద్దె వెంకట్రాయుడు, కార్యదర్శులుగా ఉదయగిరి సుబ్బారావు, పి. పరమేశ్వర రావుగార్లు ఎన్నుకోబడ్డారు మరో పదకొండు మందితో కోశాధిపతిని కార్యవర్గాన్ని ఎన్నుకొన్నారు.

1935 జూన్ 30 న జరిగిన సభలో కూలీ రక్షణ సమితి ప్రచురించిన "ధన ప్రభావం" అనే కరపత్రాన్ని జొన్నలగడ్డ రామలింగయ్య చదివాడు సమ్మె చేస్తున్న లాగుడు బండ్ల కార్మికులకు సానుభూతి తెలియచేయవలసిందిగా

విజ్ఞప్తి చేశాడు. రామలింగయ్య మొదలైన వారు జూలై 31 న అరెస్టు కావడంతో ఈ యూనియన్ కార్యకలాపాలు మందగించాయని ప్రభుత్వ సమాచారం ఆంధ్ర రాష్ట్ర ప్రెస్ వర్కర్సు మహాసభ 1936 ఏప్రిల్ 26 న తెనాలిలో జరిగినపుడు గుంటూరు ప్రెస్ వర్కర్సు యూనియన్ అధ్యక్షులూ, కార్యవర్గ సభ్యులొకరూ, రాష్ట్ర కార్యవర్గంలోకి ఎన్నుకోబడ్డారు.

1938 జూన్‌లో గుంటూరులోని ఓంకార్ ప్రెస్ పనివారికి యజమానులకు వివాదం వచ్చింది. జీతం ఒక్కసారిగా ఇవ్వక దఫదఫాలుగా జూలై 28 నాటికి సరిపెట్టారు. జూలై నెల జీతం ఒక్కసారిగా ఆగష్టు 1 నాటికి ఇవ్వాలని ప్రెస్ కార్మికులు కోరారు కాని యజమానులు అలా ఇవ్వక తలా ఐదు రూపాయలివ్వ డానికి ప్రయత్నించగా కార్మికులు నిరాకరించి 4 వ తేదీ మధ్యాహ్నం పనిలోనికి వెళ్ళ నిరాకరించారు. 5 వ తేదీన ప్రెస్ మూసి వేయబడింది.

1939 జనవరి 18 న గుంటూరు ప్రెస్ వర్కర్స్ యూనియన్ పునరుద్ధ రించబడింది. కోటంరాజు కృష్ణమూర్తి అధ్యక్షుడు పి వి సుబ్బారావు కార్యదర్శి.

## తె నా లి

కూలీ రక్షణ సమితి ఏర్పడే నాటికి తెనాలిలో ప్రెస్ యాజమానులు కొందరు ఫ్యాక్టరీ యాక్టును అమలుపరచవలసిన పరిస్థితి రాకుండా జాగ్రత్త పడుతూ వచ్చారు. 20 మంది కార్మికులు విద్యుచ్ఛక్తితో నడిపే ప్రెస్‌లో పని చేస్తే, వారికి ఫ్యాక్టరీ యాక్టు వర్తిస్తుంది. అందుకని 19 మంది కన్నా ఎక్కువ మందిని పెట్టుకోకుండా యాజమానులు తంటాలు పడ్డారు ఇక్కడి పరిస్థితులు ఎంత దుర్భరంగా వుండేవంటే, 1939 లో జానకిరాం ప్రెస్‌లో కంట్రాక్టు పద్ధతిని పని చేసే ట్రెడిల్‌మన్ రత్తయ్య చేతివేళ్ళు తెగిపోతే ఎలాంటి సహాయం గాని, నష్ట పరిహారంగాని ఇవ్వలేదు.

1938 ఏప్రిల్‌లో బైండింగు షాపుల ప్రెస్ కార్మికులు సమ్మె చేశారు. ఆనాటికి తెనాలిలో రెండు బైండింగు షాపులున్నాయి. 40 మంది పని చేసేవారు. రోజుకు 10, 12 గంటలు పని చేయించేవారు. నెలకు రూపాయి మొదలు 18 రూపాయలు వివిధ తరగతుల వారీగా జీతాలుండేవి. మేస్త్రీ జీతం రూ. 35. అదనపు పనికి కూడా రోజువారీ జీతమే ఇచ్చేవారు. జబ్బు చేస్తే సెలవు లేదు శని, సోమవారాల్లో పనికి రాకపోతే ఆదివారం కూడా నాగాయే అర్జెంటు పని చేయించుకొని కూడా అదనపు జీతం ఇచ్చేవారు కాదు.

ఈ పరిస్థితిలో అదనపు పని చేయ నిరాకరించిన ఇద్దరిని యజమానులు పని నుండి తొలగించారు. సమ్మె చేయవలసిన పరిస్థితి ఏర్పడుతుందని కార్మికులు

హెచ్చరించారు. 12 మందికి మాత్రం యజమానులు జీతాలిచ్చారు. కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ నాయకులు, మున్సిపల్ చైర్మన్ కలుగజేసుకొని రాజీ చేశారు. అయితే నోటీసు లేకుండా సమ్మె చేసినందుకు కార్మికులు పశ్చాత్తాపం వెలిబుచ్చిన తర్వాతనే వీరిని పనిలోనికి తీసుకొన్నారు. 8-4-38 న సమ్మె విరమించబడింది. బైండింగు పనివారు జరిపిన ఊరేగింపులో బండ్లుతోలే కార్మికులు కూడా సంఘీభావం తెల్పుతూ పాల్గొన్నారు.

తెనాలి రామకృష్ణా ప్రెస్ కార్మికులకు రెండు మూడు నెలలుగా జీతాలు రానందున 21-8-38 న ప్రెస్ కార్మికులు సమావేశమయ్యారు. 40 మంది హాజరయ్యారు. సకాలంలో జీతాలివ్వకపోతే సమ్మె చేయవలసి వస్తుందని హెచ్చరించారు.

18-9-38 న తెనాలిలో ప్రెస్ వర్కర్సు సభ జరిగింది. (ఇది స్థానిక యూనియన్ వార్షిక మహాసభ-సం) సభకు కొడాలి ఆంజనేయులుగారు అధ్యక్షత వహించారు. సభానంతరం పెద్ద ఊరేగింపు జరిగింది.

ఈ సభలో ప్రెస్ వర్కర్లు ఈ క్రింది కనీస కోర్కెలకై ఆందోళన చేయాలని తీర్మానించబడింది.

**కోర్కెలు :**

6 నెలల అప్రెంటీస్ తర్వాత నెలకు పది రూపాయలు జీతం ఇవ్వాలి. సంవత్సరం తర్వాత పదిహేను రూపాయలు, ఇపుడు 15 రూపాయలు జీతం తీసుకొనే వారికి మరో రెండు రూపాయలు అదనంగా ఇవ్వాలి. ప్రెస్ వర్కర్స్ యూనియన్‌ను గుర్తించాలి. సంవత్సరానికి 15 రోజుల పూర్తి జీతంతో సెలవు ఇవ్వాలి ప్రతి నెల ఏడో తేదిలోపు జీతం ఇవ్వాలి.

ప్రభుత్వం రాజాంగంలో ఫెడరేషన్ ఏర్పరచాలనే ప్రయత్నాన్ని వ్యతిరేకించుతూ మరో తీర్మానం చేశారు

తెనాలి ప్రెస్ వర్కర్స్ యూనియన్ 3 వ వార్షిక మహాసభ 30-7-39 న జరిగింది. రాష్ట్ర ప్రెస్ వర్కర్స్ యూనియన్ సహాయ కార్యదర్శి యం. మల్లిఖార్జునరెడ్డి అధ్యక్షత వహించారు. పోలేపెద్ది నరసింహమూర్తి జాతీయ జండాను, ఎర్రజండాను ఆవిష్కరించాడు కాకుమాను సుబ్బారావు ప్రసంగించాడు. ఊరేగింపు అనంతరం సభ జరిగింది.

ఈ వార్షిక మహాసభ క్రింది తీర్మానాలు చేసింది :

ప్రభుత్వం తలపెట్టిన కార్మిక శాసనాన్ని రాష్ట్ర ట్రేడ్ యూనియన్ సంఘాల సలహా తీసుకొని చేయవలసిందిగా సభవారు కోరుతున్నారు.

—ఎక్కడైనా కార్మికులు సమ్మె చేస్తున్నప్పుడు, వారిని ఆదుకొనేందుకు ప్రతి యూనియన్ సభ్యుడూ తన జీతాన్ని బట్టి కొంత మొత్తాన్ని విరాళంగా ఇవ్వాలని రాష్ట్ర యూనియన్ తీర్మానించుతోంది.

తెనాలిలో సుదీర్ఘమైన పోరాటం సాగించినది లక్ష్మీ ప్రెస్ కార్మికులు. తెనాలిలో లక్ష్మీ ప్రెస్ ఫ్యాక్టరీ యాక్టు క్రింద రిజిస్టర్ చేయబడింది. అయినా ఆ ప్రెస్ యాజమానులు 1939 మార్చిలో ఫ్యాక్టరీ యాక్టుకు విరుద్ధంగా 11 షరతులను తయారుచేసి, వాటిపై సంతకాలు చేయవలసిందిగా కార్మికుల్ని కోరారు. పనివారల కోర్కెలకు విరుద్ధమైన ఈ నిబంధనలపై సంతకం చేయడానికి కార్మికులు నిరాకరించారు. దీనితో మార్చి 11 న 40 మందిని యజమాలు ప్రెస్ నుండి తొలగించారు కార్మికులు సమ్మె చేశారు.

యజమానుల కొన్ని షరతులను పరిశీలించండి :

1. ఇతరచోట్ల అదనపు పనికి 4 లేక 5 గంటల పనిని రోజుగా లెక్కగడుతున్నారు కాని వీరు అదనపు 7 గంటలకు ఒక రోజుగా పరిగణిస్తామన్నారు. ఫ్యాక్టరీ యాక్టులో గూడా 6 గంటల అదనపు పనిని రోజుగా పరిగణించాలని వుంది. పగలు 8 గంటలు పనిచేసే కార్మికుడు రాత్రి పనిచేసినపుడు అదనపు 4 గంటలకు ఒక రోజుగా లెక్కించడం న్యాయమని కార్మికుల వాదన.

2. గతంలో ఉదయం 15 నిముషాలు, సాయంత్రం 15 నిమిషాలు ఇచ్చే విశ్రాంతి కాలాన్ని ఉదయం 5 నిముషాలకు సాయంత్రం 5 నిముషాలకు యజమానులు తగ్గించారు.

3. ఆలస్యంగా వచ్చేవారు రాత పూర్వకంగా సంజాయిషీ ఇవ్వాలి.

4. ఇంత నిక్కచ్చిగా ఉన్న యజమానులు ప్రెస్ కార్మికులచేత, టైమ్ అయిపోయిన తర్వాత కూడా అరగంట, గంట పని చేయించుకొనే సందర్భాలు చాలా వున్నాయి. మరికొన్ని సందర్భాలలో ఈ పని ఊరికే చేయాలి. సెలవు కావలసిన కార్మికులు రాత పూర్వకంగా ఫోర్మన్ సంతకంతో సెలవు చీటి రాసి, యజమానుల నుండి సెలవు పొందాలి. అలా సెలవు పొందక హాజరు కాని రోజులకు రెట్టింపు గైర్ హాజరుగా లెక్క గడ్తారు.

5. ప్రతి కార్మికుడు ఫోర్మన్‌కు విధేయుడై వుండాలి. అలా లేని వారికి ఫోర్మన్ సిఫార్సుపై జరిమానా విధించబడుతుంది. మూడు పర్యాయాలు జరిమానాకు గురియైన కార్మికుల్ని నోటీసు లేకుండానే యజమానులు తొలగించవచ్చు

6. ఆఫీసుల్లో అనవసరపు ప్రసంగాలు చేసినా, పరికరాలు పాడు చేసినా జరిమానా విధించబడుతుంది.

7. వారంలో మూడు రోజులు నాగ పడితే, వారాంతంలో వచ్చే ఆదివారం సెలవు తగ్గించబడుతుంది.

ఈ షరతుల మూలంగా కార్మికులు అనేక విధాల నష్టపోతారు. ఫోర్మన్ రికమెండేషన్ ద్వారా సెలవు మంజూరు చేయడం వల్ల కార్మికుల మధ్య ద్వేషాలు, చీలికలు ఏర్పడతాయి. తనకు ఇష్టమొచ్చిన వారికే సెలవు మంజూరు చేయాలని ఫోర్మన్ సలహా యివ్వవచ్చు. సాధారణంగా కార్మికులు సెలవు ముందుగా తీసుకొంటారు. అత్యవసర పరిస్థితులలోనే తర్వాత తీసుకొంటారు. సెలవు రోజులకు గతంలో ఈ ప్రెస్‌లో, సగం జీతంగాని, పూర్తి జీతంగాని బిగబట్టే వారు. ఇప్పుడు రోజు సెలవుకు రెండు రోజుల జీతం బిగబట్టడం అన్యాయమే గాక, ఫ్యాక్టరీ చట్టానికి వ్యతిరేకం.

ఏదో సాకు జూపి జరిమానా వేయడం, జరిమానాల ద్వారా స్వల్ప జీతాలనుకూడా దిగమింగడానికి పైన చెప్పిన కొన్ని షరతులవల్ల యజమానులకు అవకాశం కల్గుతోంది. పనిముట్లు పాతవై చెడిపోవచ్చు. ఏదైనా అవసరమైనప్పుడు కార్మికులు పరస్పరం సంప్రతించుకోవలసిన అవసరం వస్తుంది. కాని ఏదో మిషతో ఈ షరతులద్వారా "అనవసర ప్రసంగం" చేశారంటూ నింద మోపి కార్మికుణ్ణి శిక్షించే అవకాశం కల్గుతుంది.

అందుచేత కార్మికుల వాదన ఏమంటే ఏరోజు కారోజు నాగా కట్టాలి. సెలవుల్ని అవసరాన్నిబట్టి ఎన్ని రోజులైనా తీసుకోవచ్చు. సెలవు పొందినపుడు నాగా సమస్య లేదు. సిక్‌లీవ్‌గాని, క్యాజువల్ లీవ్‌గాని ఇవ్వని యజమానులు, మూడు రోజులు నాగాపడ్డ వారికి ఆదివారం సెలవు రద్దు చేయడం దారుణం.

లక్ష్మీ ప్రెస్ కార్మికులు యజమానుల షరతులను ప్రతిఘటించినారు. ఆ షరతులపై సంతకాలు చేయ నిరాకరించారు. మార్చి 11 న 40 మందిని ప్రెస్ యజమానులు తొలగించారు. 40 మందిని తిరిగి పనికి తీసుకోవాలని లాకౌట్ సమయంలో కూడా జీతం ఇవ్వాలనీ, పగ సాధింపు ఉండరాదనీ, పని వారలతో పాటుగా యజమానులు కూడా సంతకాలు పెట్టాలనీ కార్మికులు కోరారు.

ఈ సందర్భంగా మార్చి 12 న తెనాలి ప్రెస్ వర్కర్స్ 'ఊరేగింపు సభ' జరిపారు. మాదాసు కోటయ్య అధ్యక్షత వహించిన ఈ సభలో ముత్తేవి మాధవాచార్య, కాకుమాను సుబ్బారావు, గుడిపల్లి వెంకటప్పయ్య శాస్త్రి (ఆంధ్ర పత్రికా విలేఖరి, కాంగ్రెస్ వాది) కార్మికుల కోర్కెల్ని బలపరుస్తూ, యజమానుల చర్యల్ని ఖండిస్తూ మాట్లాడారు. కార్మికులు పికెటింగు చేశారు. సమ్మెకు సానుభూతిగా విజయనగరం, బెజవాడలలో సభలు జరిగాయి. గుంటూరు, బెజవాడలలో విరాళాలు పోగుచేశారు. 28 రోజులకు పైగా సమ్మె కొనసాగిన

సందర్భంలో లక్ష్మీ ప్రెస్ కార్మికులకు సంఘీభావంగా తెనాలిలోని ఇతర ప్రెస్‌లలోని కార్మికులంతా ఒక రోజు సెమ్మె చేశారు

స్థానిక సోషలిస్టు పార్టీ ప్రెస్ వర్కర్సు యూనియన్‌ల తరపున బహిరంగ సభ జరిగినపుడు బ్లాక్ లెగ్ (దొంగ కూలి) దిష్టి బొమ్మను వీధుల్లో ఊరేగించి తగుల పెట్టారు. సమ్మెకాలంలో కొంతకాలానికి నల్గురైదుగురు పనిలో చేరినా, తిరిగి వారు సమ్మెలో చేరారు.

ఆంధ్ర రాష్ట్ర ప్రెస్ వర్కర్స్ యూనియన్ కార్యవర్గం తెనాలిలో సమావేశమై లక్ష్మీ ప్రెస్ కార్మికుల్ని అభినందించి, సమ్మె విచ్ఛిన్నం కాకుండా తోడ్పడాలని కోరింది. రాష్ట్రంలోని వివిధ ప్రెస్ కార్మికుల యూనియన్లు ప్రతీది కనీసం 5 రూపాయలు విరాళంగా పంపాలని తీర్మానించింది.

మార్చి 29 న గుంటూరు జిల్లా సోషలిస్టు పార్టీ మహాసభ సమావేశమై తెనాలి లక్ష్మీ ప్రెస్ యజమానుల లాకౌట్‌ను ఖండించింది యజమానుల అన్యాయ చర్యలను ప్రతిఘటించాలని కార్మికులను కోరింది.

గుంటూరు జిల్లా కాంగ్రెస్ సంఘం వద్దకు ప్రెస్ వర్కర్సు తరపున ఆర్గురితో కూడిన ఒక ప్రతినిధి వర్గం వెళ్లింది. జిల్లా కాంగ్రెస్ సమావేశంలో కొడాలి ఆంజనేయులుగారు ప్రెస్ కార్మికుల కోర్కెలను బలపర్చుతూ ఉపన్యసించారు. ఆ మరునాడు జరిగిన బహిరంగసభలో అన్ని ప్రెస్‌ల తాలూకు కార్మికులు పాల్గొన్నారు. పి. వి. శివయ్య అధ్యక్షతను జరిగిన సభలో ముక్తేవి మాధవాచార్య, కాకుమాను సుబ్బారావు, పోలేపెద్ది నరసింహమూర్తి, పి. లోకనాథం, వెంకటయ్య మొదలగువారు మాట్లాడి లక్ష్మీ ప్రెస్ కార్మికులకు సానుభూతి తెలియజేశారు.

## బె జ వా డ

బెజవాడ కూలీ రక్షణ సమితి, ప్రెస్ వర్కర్సు, మున్సిపల్ వర్కర్సు, రైల్వే కార్మికుల మధ్య పనిచేయ ప్రారంభించింది.

1935 అక్టోబర్ 9 న వాణీ ప్రెస్సులో సమ్మె జరిగింది. ఈ సందర్భంగా ప్రెస్ వర్కర్స్ యూనియన్ ఏర్పడింది. సమ్మె చేస్తున్న కార్మికుల స్థానే క్రొత్త వారిని తీసుకొని, మేనేజర్ సమ్మెను విఫలం చేశాడు.

ఆంధ్ర గ్రంథాలయ ప్రెస్‌ను 1937 నవంబరు మొదటి వారంలో మూసి వేశారు. పని వారిని కొందరిని తొలగించగా కార్మికులు సమ్మె చేశారు. రాష్ట్ర కార్మిక శాఖామంత్రి వి.వి. గిరిగారు మధ్యవర్తిత్వం వహించి, తొలగించిన వారి నందరినీ పనిలో పెట్టుకోవాలని సూచించారు. రాజీ జరిగింది. కాని రాజీని అమలు పరచలేదు యజమానులు. పనివారిచే ఎక్కువ గంటలు పని చేయించుకో

నారంభించారు. నెల జీతాల బదులుగా రోజు కూలీ ఇవ్వడం ప్రారంభించారు. దీనివల్ల ఆదివారాలకు వచ్చే జీతం నష్టపోయారు కార్మికులు.

1938 జనవరి 23 న బెజవాడ ప్రెస్ వర్కర్ల సర్వసభ్య సమావేశం జరిగింది. దాసరి అప్పలస్వామి అధ్యక్షుడుగా, చొక్కాపు కృష్ణమ్మ కార్యదర్శిగా, ఆఫీసు కార్యదర్శిగా మున్నంగి మల్లిఖార్జునరెడ్డిగారు ఎన్నికయ్యారు. ఎనిమిది మందితో కార్యవర్గం ఏర్పడింది. జీతాలు సక్రమంగా ఇవ్వాలని ప్రెస్ యజమానులను కోరుతూ సభ జరిగింది.

బెజవాడలో ప్రెస్ వర్కర్స్ యూనియన్ ఏర్పడక పూర్వం కార్మికుల పరిస్థితి ఘోరంగా ఉండేది. ఉదాహరణకు : 1936 డిసెంబరులో కామేశ్వర అండ్ కో వారి ప్రెస్‌లో పని చేస్తున్న ఒక కుర్రవాడి చేయి ట్రెడిల్‌లో పడింది. అతనికి వైద్య సహాయం చేయక పోగా, ఇంటికి వెళ్ళడానికి కూడా డబ్బివ్వలేదు. అతడు మందు కోసం తీసుకొన్న రూపాయిని కూడా జీతంలోను మినహాయించు కొన్నాడు యజమాని చివరకు అతడు మృత్యువు వాత పడ్డాడు ఇదే ప్రెస్‌లో సయ్యద్ నబీ అనే కుర్రవాడి చేతి వేళ్లు ట్రెడిల్ లో పడి నలిగి పోయాయి. ఇతనికి యజమాని ఎలాంటి వైద్య సహాయం కాని, ధన సహాయం కాని చేయలేదు ఇందుకు ప్రెస్ వర్కర్స్ యూనియన్ నిరసించింది.

1938 జూన్‌లో చిత్తరంజన్ ప్రెస్‌లో బంగారు అనే కార్మికుని విషయమై వివాదం వచ్చింది ఇతడు మొదట ఈ ప్రెస్‌లో పని చేసి తర్వాత "వాణి ప్రెస్"లో పని చేశాడు ఇతనిని తమ ప్రెస్‌కు రప్పించి ఆరేడు నెలల తర్వాత తొలగించడానికి చిత్తరంజన్ ప్రెస్ యాజమాన్యం సిద్ధమైంది. దానిపై వివాదం రాగా, మూడునెలలు అట్టిపెట్టుకొని తర్వాత తీసివేస్తామని నోటీసిచ్చారు. ఇందుకు కారణం పనిలేదని సాకు చూపారు. కార్మికులు దానిని తిరస్కరించి, పని ఉన్నదీ లేనిదీ విచారించేందుకు ఒక కమిటీ వేయాలని యూనియన్‌ను కోరింది.

1939 జనవరిలో ఇదే ప్రెస్ స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంగా కార్మికులకు సెలవు ఇవ్వ నిరాకరించింది. పనికిరాని వారిని తీసి వేస్తామని యాజమాన్యం బెదిరించినా ఎవరూ దానిని ఖాతరు చేయలేదు. కార్మికులు సాతంత్ర్య దినోత్సవంలో పాల్గొన్నారు. యజమానులు కిమ్మన లేదు.

కామేశ్వరి అండ్‌కో ప్రెస్‌లో 1938 జూలైలో 20 రోజులకు పైగా ప్రెస్ కార్మికుల సమ్మె కొనసాగింది. జాతీయ జండాలు, ఎర్ర జెండాలు పట్టుకొని కార్మికులు ఊరేగింపు జరిపారు. సమ్మెదార్ల కోర్కెలను బలపరుస్తూ తీర్మానించారు.

రాష్ట్ర ప్రెస్ వర్కర్స్ యూనియన్ ఆమోదించిన ప్రెస్ కార్మికుల కనీస కోర్కెలను బెజవాడ ప్రెస్ వర్కర్స్ యూనియన్ కూడా 1938లో యజమానులకు పంపారు. ఈ విషయమై జూన్‌లో కాంగ్రెస్, కార్మిక నాయకులు చర్చించారు. కాని యజమానులు తగిన సమాధానం ఇవ్వలేదు. ప్రెస్ కార్మికులు ప్రతిపాదించిన కనీస కోర్కె లివి.

1. ఆరు నెలలు అప్రెంటిస్ చేసినవారికి నెలకు కనీసం పది రూపాయలు, సంవత్సరం పైగా చేసినవారికి నెలకు కనీసం 15 రూపాయలు, 15 రూపాయలు తీసుకొంటున్న వారికి రెండు రూపాయలు పెంచాలి

2. రోజుకు 8 గంటలకన్నా పని మించరాదు.

3. యూనియన్‌ను యజమానులు గుర్తించాలి.

4. సంవత్సరానికి 15 రోజులు కాజువల్ లీవ్ ఇవ్వాలి.

5. 7వ తేదీలోగా జీతాలివ్వాలి.

1938 ఆగష్టు 14న బెజవాడ ప్రెస్ వర్కర్స్ యూనియన్ సమావేశమై పైన ఉదాహరించిన కోర్కెల సాధనకు ప్రజా సంఘాల సహకారంతో ఆందోళన చేయాలని తీర్మానించింది. వివిధ పట్టణాల్లో ప్రెస్ కార్మికులు చేస్తున్న సమ్మెల్ని భగ్నపరచడానికి యజమానులు మద్రాసు నుంచి ప్రెస్ కార్మికుల్ని తీసుకు వస్తున్నారనీ, వారిని రాకుండా మద్రాసు ప్రెస్ వర్కర్స్ యూనియన్ కృషి చేయాలనీ ఈ సమావేశం తీర్మానించింది.

బెజవాడ ప్రెస్ వర్కర్సు కేవలం తమ వర్గ కోర్కెలకు మాత్రమే గాక, రాజకీయంగా కూడా స్పందించేవారు. 1939లో ప్రభుత్వం వివిధ ఫ్యాక్టరీ యజమానులకు పంపిన వర్తమానాన్ని ప్రెస్ కార్మికులకు కూడా వర్తింప జేయాలని 15-1-39న ఆవిషయాన్ని చర్చించాలనీ బెజవాడ ప్రెస్ వర్కర్సు యూనియన్ కార్యనిర్వాహక వర్గ సమావేశం నిశ్చయించింది.

బెజవాడ చిత్తరంజన్ ప్రెస్‌లోని కార్మికులకు దొంగతనం ఆరోపించి, ఆ దొంగల్ని కార్మికులే పట్టి ఇవ్వాలంటూ యజమానులు కోరారు. దొంగతనం ఋజువైతే శిక్షించవచ్చని కార్మికులు జవాబు చెప్పారు. అయినా కార్మికుల్ని యాజమాన్యం 1-9-39 నుండి తొలగించ నారంభించింది. ఒక క్రిమినల్ కేసులో తమ కనుకూలంగా దొంగసాక్ష్యం చెప్ప నిరాకరించి నందుకు ఒక కార్మికుణ్ణి తొలగించారు. 1-9-39 నుండి కార్మికులు పికెటింగు జరిపారు. యజమానుల ఆరోపణలపై నిష్పాక్షి విచారణ జరపాలనీ, అకారణంగా పని నుండి తొలగించిన కార్మికులకు సమ్మె కాలంలో జీతం ఇవ్వాలనీ కార్మికులు కోరారు.

ఇంతేగాక జనవరి 26న స్వతంత్ర్య దినోత్సవాన అన్ని ప్రెస్‌లు మధ్యాహ్నం సెలవు ఇస్తే, చిత్తరంజన్ ప్రెస్ సెలవు ఇవ్వక, పని మానేసిన వారిని తొలగిస్తామని బెదరించారు. అయినా బెదరింపు లెక్క చేయక స్వతంత్ర్య దినోత్సవంలో పాల్గొన్నారు.

''యజమానుల బెదరింపులకు లోనై కొందరు యూనియన్ తమ అభివృద్ధికి తోడ్పడలేదని రాసిచ్చారు. ఇలాంటి చర్య తమ వ్యక్తిగత హక్కులకేగాక, యావత్ ప్రెస్ వర్కర్లకు హానికరమనీ, సంతకాలు చేసినవారు ఉపసంహరించు కోవాలనీ కార్యవర్గం తీర్మానించింది ఏలూరు ప్రెస్ వర్కర్స్ యూనియన్ అధ్యక్షుడు మహజరుపై సంతకం చేసి యజమానులకు అనుకూలంగా ప్రవర్తించి నందున ఆయన్ని అధ్యక్ష పదవినుండి తొలగించవలసిందిగా కార్యవర్గం కోరింది.

4-8-1938 న బెజవాడ ప్రెస్ వర్కర్స్ ఆధ్వర్యాన ఊరేగింపు జరిగింది. ''కార్మికుల హక్కులను కాపాడాలి, ఏలూరు ప్రెస్ యజమానుల నిరంకుశత్వం నశించాలి'' అనే నినాదాలిచ్చారు. కార్మిక పురంలో గంగరాజు అధ్యక్షతను జరిగిన సభలో, ఏలూరు ప్రెస్ యజమానుల సంఘ దాడిని ఖండించారు. ప్రెస్ కార్మికుల సక్రమ హక్కులను భగ్నం చేయాలనే దురుద్దేశ్యంతోనే యజమానుల సంఘం ఏర్పడిందనీ, యజమానుల దాడిని ధైర్యంతోనూ, పట్టుదలతోనూ ఎదుర్కొనాలనీ సభలో తీర్మానించారు.

పశ్చిమ గోదావరి జిల్లా కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ఆగస్టు 26, 27 తేదీలలో పొలమూరులో గారపాటి సత్యనారాయణ అధ్యక్షతను సమావేశమై, ప్రెస్ యజమానుల చర్యలను ఖండించింది. పనివారు పట్టుదలతో ధైర్యంతో యజమానుల చర్యలను ఎదుర్కోవాలనీ, వారి ఎత్తులకు మోసపోరాదనీ తీర్మానించింది.

రాష్ట్ర ప్రెస్ వర్కర్స్ యూనియన్ సూచించిన కనీస కోర్కెలనే ఆమోదించాలని ఇతర పట్టణాల్లోని ప్రెస్ వర్కర్స్ యూనియన్లుకూడా తీర్మా నించాయి. 1938 ఫిబ్రవరి 12న బందరులోనూ, 18-9-1938 న తెనాలిలోనూ, ఇలాంటి తీర్మానాలే చేశారు. 1934 విజయనగరంలో కూడా ఇలాంటి తీర్మానాలే చేశారు.

## విజయనగరం

1939 నాటికి విజయనగరంలో 6 ప్రెస్సులున్నాయి. 95 మంది పని చేస్తున్నారు. ప్రెస్ కార్మికులలో ఎక్కువ మంది బాలురు. కార్మిక చట్టాన్ని యజమానులు తమ ప్రెస్సులకు వర్తింప చేయడం లేదు. కార్మికులకు నిర్ణీతమైన పని ఇవ్వకుండా ఒక రోజున కంపోజిటర్‌గా, మరో రోజున బైండర్‌గా పని

చేయించుతూ, తమ కనుకూలమైన పద్ధతిలో జీతాలిస్తున్నారు. జీతాల స్కేళ్ళు లేవు. ఖచ్చితంగా ఫలాని తేదీన జీతాలిస్తారనే పద్ధతి లేదు. అడ్వాన్సులిస్తూ, నెల జీతాలను ఆలస్యం చేస్తారు, గెజిటెడ్ సెలవులు కూడా ఇవ్వడం లేదు ఆదివారం ఒకపూట సెలవు ఇచ్చినా, పని చేయిస్తూనే వుంటారు. కాజువల్ లీవు, ప్రివిలేజ్ లీవులు లేవు పనికి కాలపరిమితి లేదు 7 నుంచి 9 గంటల దాకా పని చేయిస్తుంటారు. ఓవర్ టైమ్‌కు డబ్బివ్వరు. పిల్లలచేత కూడా ఓవర్ టైమ్ చేయిస్తుంటారు. ఫ్యాక్టరీ యాక్టు ప్రకారం పిల్లలు 5 గంటలు మాత్రమే పని చేయాలి. ఈ పరిస్థితులను వివరిస్తూ కార్మిక నాయకులు, యూనియన్‌ను గుర్తించాలనీ, ప్రతి నెలా ఏడవ తేదీలోగా జీతాలివ్వాలని, ఓవర్‌టైమ్‌కు రెట్టింపు జీతం ఇవ్వాలనీ సూచిస్తూ ఆందోళన సాగించారు

## ఏ లూ రు

ఏలూరులో మంజువాణి ప్రెస్‌లో 3 నెలలుగా జీతాలివ్వనందున 12-7-38 నుండి సమ్మె ప్రారంభమైంది. సకాలంలో జీతాలివ్వాలని అడిగిన వారిని యజమానులు పని నుండి తొలగించారు. 0 మంది సమ్మెలో పాల్గొన్నారు. యజమానులు తమ ప్రెస్‌లో అచ్చుకు తీసుకొన్న పనిని ఇతర ప్రెస్సులలో అచ్చు వేయించడానికి ప్రయత్నించితే కార్మికులు నిరాకరించారు. ఊరేగింపులు, సభలు, కరపత్రాల ద్వారా యూనియన్ ఆందోళన చేసింది. వారికి సానుభూతిగా ఇతర పట్టణాలలో సభలు జరిగాయి. ఉదాహరణకు బెజవాడలో జరిగిన బహిరంగ సభలో పట్టణ కాంగ్రెస్ సంఘ కార్యదర్శి ఇంటూరి వేంకటేశ్వరరావు ఉపన్యసించారు. 14-8-38 న బెజవాడ ప్రెస్ వర్కర్స్ జనరల్ బాడీలులో మంజువాణిని అభినందించుతూ, యజమానుల చర్యలను ఖండించుతూ మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం జోక్యం చేసుకొని కార్మికులకు న్యాయం చేకూర్చాలని తీర్మానించారు తెనాలి ప్రెస్ వర్కర్సు మంజువాణి ప్రెస్ కార్మికులకు 5 రూపాయల విరాళాన్ని పంపారు. సమ్మె ప్రారంభంలో మొదటి వారంలోనే ఏలూరు పట్టణ కాంగ్రెస్ సమస్యను విచారించడానికి ఒక కమిటీని నిశ్చయించింది. పట్టణ కాంగ్రెస్ అధ్యక్షుడు మోతే నారాయణరావుగారు సమ్మె పరిష్కారానికి ప్రయత్నించారు. ప్రెస్ యజమానులు మద్రాసు నుండి నలుగురు కార్మికుల్ని తీసుకువచ్చి ప్రెస్ ఆవరణలోనే భోజన సదుపాయం కల్గించి తుదకు సమ్మెను విచ్ఛినం చేయగల్గారు.

**ఏలూరులో యజమానుల దాడి :**

ఏలూరులో ప్రెస్‌కార్మికుల సంఘీభావాన్ని అణచివేయడానికి **24-8-38** న "ప్రింటర్స్ అసోసియేషన్"ను స్థాపించారు; ప్రెస్ యజమానులు. వారుచేసిన తీర్మానాల సారాంశ మిది :-

1 ఒక ఆఫీసులో పనివానిని తీసివేస్తే, అతనిని ఆ ఆఫీసు యజమాని అనుమతి లేందే ఇంకో ఆఫీసులో పెట్టుకోరాదు.

2. ఒక ఆఫీసులో ఏ కారణంచేతనైనా ఇబ్బంది కల్గితే మిగతా ఆఫీసు వారు ఆ పని పూర్తిచేసి పరస్పర సహాయం చేసుకోవాలి.

3. రాతపూర్వకమైన సెలవు లేకపోతే, నాగాపడిన రోజులకు రోజుకు రెండు రోజుల చొప్పున జీతం మినహాయించాలి.

4. యజమానికిగాని, ఫోర్మన్‌కిగాని ఏ మాత్రం అవిధేయత ప్రవర్తించినా, వారిని వెంటనే పనినుండి తీసివేయాలి.

5 ఏ ప్రెస్‌లోనైనా పనివారికి - యజమానికి తగాదా వస్తే యజమాని తీర్పే ఆఖరు పరిష్కారంగా ఎంచాలి.

6. పనివాండ్రను చేర్చుకోవడం, తీసివేయడం మొదలైన విషయంలో ఆయా ప్రెస్‌లలో ఉన్న నిబంధనలనే ఉమలు పరచాలి.

7. పనివారికి ప్రతినెలా జీతాన్ని ఆ మరుసటి నెలాఖరులోగా ఇవ్వాలి (అంటే ఒక నెల ఆలస్యం చేయవచ్చని అర్థం - సం) సమ్మె చేసినపుడు యజమానులంతా కలిసి కష్ట నష్టాల కోర్చి పరస్పర సహాయం చేసుకోవాలి.

యజమానుల దాడిలో భాగంగా తమ షరతులకు అంగీకరించవలసిందిగా కార్మికులచే సంతకాలు చేయించుకో మొదలు పెట్టారు వెంకట్రామా ప్రెస్‌లో 37 మంది సంతకాలు చేశారు ముగ్గురు నిరాకరించగా వారిని 8-9-38 న పని నుండి తొలగించారు. వీరికి సానుభూతిగా సంతకాలు చేసిన వారిలో తొమ్మిది మంది సమ్మెచేశారు. ఇలాంటి ఒత్తిడి ఇతర ప్రెస్సులలోకూడా ప్రారంభమైంది. పట్టాభిరామా ప్రెస్, సీతారామాంజనేయ ప్రెస్‌లలో కూడా సంతకాలు పెట్టించారు నిర్బంధంగా. అయితే పాండురంగ ప్రెస్ మాత్రం యజమానుల సంఘం నుండి విడిపోయింది.

ఆంధ్ర రాష్ట్ర ప్రెస్ వర్కర్స్ యూనియన్ కార్యవర్గం 18-9-38న సమావేశమైంది. ప్రింటర్స్ అసోసియేషన్ షరతులు, కార్మికుల యూనియన్‌ను గుర్తించకపోగా, వారి ప్రాథమిక హక్కులకు భంగం కల్గించేవిగా యున్నాయని కార్యవర్గం ఆ షరతులను ఖండించింది. కాంగ్రెస్ సంస్థ కార్మిక విధానానికి కూడా ఇది వ్యతిరేకమనీ, ఈ విషయంలో కార్మికమంత్రి గిరిగారు జోక్యం చేసుకోవాలని కార్యవర్గం కోరింది.

## ఆంధ్ర ప్రభ సమ్మె

1930 దశకంలో మద్రాసు నుండి రామనాథ గోయింకా యాజమాన్యాన "ఆంధ్రప్రభ", "దినమణి", "ఇండియన్ ఎక్స్‌ప్రెస్" ప్రతికలు వెలువడు

తుండేవి. 1939 జూన్ 27 నుండి ఈ గ్రూపు పత్రికలలో సమ్మె ప్రారంభమైంది. తతిమ్మా పత్రికలలో సమ్మె కొద్ది దినాలలోనే విఫలమైనా, ఆంధ్ర ప్రభ సమ్మె మాత్రం నెలరోజులు జరిగింది.

ఇది మద్రాసులో జరిగిన సమ్మె అయినా, ఆనాడు ఉమ్మడి రాష్ట్రానికి మద్రాసు రాజధాని గనుక దీనికి ప్రాముఖ్యం వుంది. అంతేగాక ఆనాడు కాంగ్రెస్ మంత్రివర్గం అధికారంలో వుంది. ఆంధ్రుడు వి.వి. గిరి కార్మిక మంత్రిగా వున్నాడు. ఆంధ్ర ప్రభ సంపాదక బాధ్యతలు నిర్వర్తిస్తున్నవారు అతివాద భావాలు కలవారు. యాజమాన్యాన్ని, వృత్తిపరంగా సంపాదకీయాలు రాస్తున్న వీరిని ఒకే గాటను కట్టవలసిన పని లేకున్నా, వీరు తమ తమ రాతలలో సమ్మెను బలపరుస్తున్న వారిని, కార్మికుల్ని బలపరచిన "నవశక్తి" పత్రికనూ అవహేళన చేసి, తిరిగి అవహేళనకు గురి అయినారు. ఇంతేగాక మద్రాసులో సమ్మెను భగ్నం చేయడానికి ఆంధ్ర ప్రాంతంలోని పత్రికల నుండి ప్రెస్ వర్కర్స్‌ను తీసుకుపోయారు. దీనికి ఆ ప్రాంతాలలో ప్రతిఘటన ఏర్పడింది

అసలు సమ్మెకు కారణం గోయింకా గ్రూపు పత్రికలోని "దినమణిలో" ఆర్గురిని సస్పెండ్ చేయడం. అంతేగాక ఈ గ్రూపు పత్రికలు మూడింటిలో పని చేసే ప్రెస్ వర్కర్స్ ఎవ్వరూ మద్రాసు ప్రెస్ లేబర్ యూనియన్‌లో చేరరాదని యజమాని అభ్యంతరం పెట్టడం పోటీగా మరో యూనియన్ ఏర్పాటుకు ప్రయత్నించడం.

సమ్మె ప్రారంభమైన నాటి నుండే దమన కాండ ప్రారంభమైంది పికెటింగ్ చేసినందుకు 42 మందికి శిక్షలు విధింపబడ్డాయి. 100 మంది కార్మికులలో 42 మందిని మొదటి రోజునే శిక్షించారు కొందరికి 5 రూపాయల జరిమానా, మరి కొందరికి కోర్టు లేచు వరకు శిక్ష, పైగా ఆరు నెలల వరకు 200 రూపాయలు, సత్ప్రవర్తనకు పూచీకత్తు ఇవ్వాలనీ తీర్పు ఇచ్చారు. పికెటింగ్ చేయబోమని హామీ యిస్తే వదలి వేస్తామని అధికారులు తెల్పినా కార్మికులు నిరాకరించారు. పికెటింగు చేయడం తమ హక్కని కార్మికులు తెలిపారు.

1939 మే 24 నుండి జూన్ 13 లోగా ముగ్గురిని డిస్మిస్ చేశారు. తర్వాత గోయింకాగారి గృహంలోనే మద్రాసు కార్మిక నాయకులు ఎ.యస్.కె అయ్యంగార్, పి రామమూర్తిగార్లు రాజీకి చేసిన ప్రయత్నాలను యాజమాన్యం భగ్నం చేసింది. కొత్తగా నలుగురిని చేర్చుకొని మరో యూనియన్ ఏర్పాటుకు ప్రయత్నించింది. జూన్ 24న మరో ముగ్గురిని (సైకిల్ ప్యూన్లన్) డిస్మిస్ చేశారు. వారి విషయమై గిరిగారి వద్దకు అయ్యంగారు రాయబారం వెళ్ళారు యూనియన్ కరపత్రాలను సైకిలుప్యూన్లు ఆఫీసులో పంచిపెట్టారని యాజమాన్యం

వారిని నోటీసు లేకుండానే బయటికి పంపింది. వారు క్షమాపణ ఇచ్చినా చేర్చుకోలేదు. మొదట డిస్మిస్ చేయబడిన కార్మికులలో ఏడుమలై ఒకడు. అతడు పనికి సరిగా రాలేదని ఆరోపణ. రెండు వారాల సస్పెన్షన్‌లో ఉన్న ఏడుమలైని అంతటితో శిక్షమాని పనిలో చేర్చుకోవాలని కార్మిక నాయకులు కోరారు. పెరుమాళ్ అనే అతను పెళ్లికి ఒకరోజు సెలవుపెట్టి మరి రెండు రోజులు రాలేదు. సైకిల్ ప్యూన్ రామన్ నంబియార్‌ను మేనేజరు కొట్టాడు అందుచే ఈ ముగ్గురిలో పనికి సరిగారాని, సెలవు లేకుండా పని మానిన ఇద్దరూ క్షమాపణ పత్రాలతో ఆఫీసుకు వెళ్లారు. కాని ఓసుకోలేదు రామనాథ గోయింకాతో కార్మిక నాయకులు చర్చించినపుడు పై ఇద్దరు పశ్చాత్తాపం వెలుబుచ్చాలని, దెబ్బలు తిన్న నంబియార్ పశ్చాత్తాపం వెలిబుచ్చనక్కర్లేదని గోయింకా అంగీకరించాడు. కాని దీనిని తర్వాత నిరాకరించాడు. కారణం పోటీ యూనియన్‌లో తమ కార్యాలయంలో పనివారు చేరకపోవడమే. వారిపై కోపాన్ని ఈ విధంగా ఏడుమలై మొదలైన వారిపై తీర్చుకొంది యాజమాన్యం. రాజీ ప్రయత్నాలు విఫలమయ్యాక జూన్ 19న యూనియన్ సమ్మె నోటీసిచ్చింది. దీనిపై ఎ.యస్.కె అయ్యంగారికి గోయింకా ఒక లేఖ రాస్తూ, కార్మిక మంత్రి గిరిగారి లేక లేబర్ కమీషనర్ మధ్యవర్తిత్వానికి సిద్ధమని జాబు రాశారు. మధ్యవర్తిత్వానికి తాము సిద్ధమేనని, కార్మిక మంత్రికి ఇరుపార్టీలు కలసి దరఖాస్తు పంపాలా లేదా అనే విషయం తెలియ చేయవలసిందిగా యూనియన్ కోరింది. దానికి గోయింకాగారి నుండి జవాబు రాలేదు. జూన్ 24, 25. 26 తేదీలలో గిరిగారికి పరిస్థితులన్నీ అయ్యంగారు వివరించారు. తర్వాత మంత్రిగారి ఇంట్లో యూనియన్ ప్రతినిధులు, పత్రికా యాజమాన్యం తరపున గోయింకా, సుబ్బారావుగార్లు పాల్గొన్నారు. డిస్మిస్ చేయబడిన ఆర్గురి విషయం సంతృప్తికరంగా పరిష్కారం జరిగితే సమ్మె మానడానికి కార్మికులు సిద్ధంగా వున్నారని యూనియన్ ప్రతినిధులు చెప్పారు. సమ్మెలో పాల్గొన్నందుకు కార్మికులను శిక్షించరాదని వారన్నారు. గోయింకా, సమ్మె చేసిన వారిని శిక్షించలేకుండా ఉండనని చెప్పారు. పైగా తాను 28 మందిని కొత్తవారిని చేర్చుకున్నానని, వారిని తీసివేయలేనని అన్నారు. చివరకు యాజమాన్యం తేల్చినదేమంటె, 28 మందిని కొత్తవారిని చేర్చుకొన్నాం గనుక పాతవారిని 28 మందిని డిస్మిస్ చేయగూడదా అని మధ్యవర్తి పరిష్కారానికి పంపుతామన్నారు. యూనియన్ ఇందుకు అంగీకరించలేదు. 28 మందిని డిస్మిస్ చేసే హక్కు తమకు కలదనే విషయాన్ని మధ్యవర్తుల పరిష్కారానికి కోరుతున్నారు గాని డిస్మిస్ చేసిన 6 గురి విషయం కాదు. కొత్తగా మరో 22 మందిని కూడా యాజమాన్యం బర్తరఫ్‌చేసే హక్కుకు యూనియన్ అంగీకరించ

లేదు. రాజీ అంటే సమ్మెకు పూర్వ పరిస్థితిని పునరుద్ధరించి, సమ్మెకు గల కారణాలను మధ్యవర్తిత్వ పరిష్కారానికి వదలాలి. కాని అందుకు యాజమాన్యం అంగీకరించలేదు.

ఈ క్రింది షరతులను మాత్రమే యాజమాన్యం అంగీకరించినట్లు లేబర్ కమీషనర్ ద్వారా

1. ఏదుమలై అనే కార్మికుని తిరిగి పనిలో పెట్టుకోరు.

2. రామన్ నంబియార్ అనే కార్మికునికి 6 నెలల జీతం నెలల వారీగా చెల్లిస్తారు.

3 అధికారులకు తృప్తికరమైన క్షమాపణ యిస్తే పెరుమాళ్‌ను, మరో ముగ్గురు సైకిల్ బంట్రోతులను పనిలో చేర్చుకుంటారు

4. తెలుగు శాఖలో 29 మందిలో 15 మంది కంపోజిటర్లను మాత్రమే తిరిగి పనిలోకి తీసుకుంటారు.

5. తమిళ శాఖలో 33 మందికి 8 మంది కంపోజిటర్లను మాత్రమే తిరిగి చేర్చుకొంటారు. దీనికి కారణం ఆపరేటర్లను నియమించుకున్నారుట.

6. మెషిన్ డిపార్టుమెంటులో 11 మందికి ముగ్గురిని మాత్రం తీసుకొంటారు.

7. తతిమ్మావారిని ఖాళీ వచ్చినపుడు తీసుకొంటారు.

8. పనివారంతా "ఫ్రీ ప్రెస్ ఆఫ్ ఇండియా లిమిటెడ్ కంపెనీ" విధించే తీర్మానాలకు విధేయులై పని చేయాలి.

ఆంధ్ర ప్రభ గ్రూపు పత్రికలలో దినమణి, ఇండియన్ ఎక్స్‌ప్రెస్ పత్రికలలో సమ్మె జయప్రదం కాలేదు దానికి కారణం మద్రాసులో ఉన్న 7 వేల మంది అచ్చు పనివారిలో 1000 మంది నిరుద్యోగులున్నారు వారిలో కొందరిని పనిలో పెట్టుకొని పబ్బం గడుపుకోగల్గింది యాజమాన్యం; ఆంధ్ర ప్రభ ఆగిపోయింది. ఆంధ్ర ప్రభకు కూడా తెలుగు కంపోజిటర్లను ఆంధ్ర జిల్లాలలోని పత్రికల నుండి తీసుకురాడానికి ప్రయత్నించారు నెల్లూరు నుండి "జమీన్ రైతు" పత్రికాధిపతులు ముగ్గురిని మద్రాసు పంపారు. మద్రాసు వెళ్ళి పని చేయకుంటే పని నుండి తీసి వేస్తామని బెదరించారు అయితే జమీన్ రైతు సంపాదకుని చర్యను ఖండించుతూ నెల్లూరు ప్రెస్ వర్కర్స్ యూనియన్ తీర్మానించింది. అలా వెళ్ళిన కార్మికులను యూనియన్ నుండి తొలగించి తగిన సంజాయిషీ ఇవ్వనిదే తిరిగి యూనియన్‌లో చేర్చుకోమని తీర్మానించారు. ఆంధ్ర ప్రభ సమ్మె ముగిసే వరకు జమీన్ రైతు ప్రెస్‌లో పని చేయరాదని నిశ్చయించారు. బెజవాడ, కాకినాడలలలో ఆంధ్రప్రభ సమ్మెకు సానుభూతి సభలు జరిగాయి. దీనితో జమీన్ రైతు ప్రొప్రైటర్ తమ కార్మికులను మద్రాసు నుండి రప్పించడంవల్ల 7-7-39 న జమీన్‌రైతు ప్రెస్‌లో

సమ్మె విరమించబడింది. తిరుపతిలో "రాయలసీమ" పత్రికలో పని చేసే వారిని మద్రాసు తీసుకు వెళ్ళడానికి 2-7-39 న "ఆంధ్ర ప్రభ" కార్యాలయం నుండి కొందరు తిరుపతికి వచ్చారు. కొంతమందిని ప్రయాణానికి సిద్ధం చేశారు. కాని వారు వెళ్ళలేదు. హెడ్ కంపోజిటర్ ఒక్కడే వెళ్ళడానికి సిద్ధమై స్వంతకారణాల వల్ల చివరి క్షణంలో మాని వేశాడు. అందుచేత పత్రిక నిరాటంకంగా వెలువడు తోంది అంటూ "రాయలసీమ" పత్రిక మేనేజర్ 9-7-39 న ప్రకటించాడు.

జూలై 16 న మద్రాసులోని వివిధ సంఘాల కార్మికులు, ఆంధ్ర ప్రభ గూర్ఖిప్ పత్రికల సమ్మెదార్లకు మద్దతుగా సమ్మె జరిపారు.

ఒక వైపు రాయబారాలు జరుగుతున్న సమయంలోనే నిర్బంధ విధానం కూడా ఎక్కువైంది. అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సభ్యులు, తమిళనాడు కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ కార్యదర్శి బి. శ్రీనివాసరావుకు పికెటింగు సందర్భంగా నలరోజులు శిక్ష విధించబడింది మద్రాసు ప్రెస్ వర్కర్స్ యూనియన్ కార్య దర్శి ఎ. యస్. కె. అయ్యంగారిపై కేసు నడిచింది. మొత్తం 85 మందికి శిక్షలు విధించబడ్డాయి. నెల రోజులు తీవ్ర కష్ట నష్టాలను ఎదురొడ్డి నిల్చిన వర్కర్లు, సమ్మె ఇక కొనసాగించ జాలని పరిస్థితిలో జూలై 27 న సమ్మె విరమించారు. బేషరతుగా సమ్మె విరమించాలని యూనియన్ నిర్ణయించింది.

యూనియన్ సూత్రబద్ధమైన పోరాటాన్ని సాగించింది కొందరి కార్మికుల్ని తొలగించి వారిస్థానే కొత్త వారిని చేర్చుకొన్న అంశాన్ని కూడా మధ్యవర్తిత్వ పరిష్కార అంశంగా చేర్చాలన్న యజమానుల కోర్కెను తిరస్కరించింది. సమ్మెకు దారితీసిన వివాదాలనే మధ్యవర్తి పరిష్కారాంశాలుగా ఉండాలని కోరింది

యజమానుల మొండి వైఖరి, ప్రభుత్వ ఉదాసీనత, పోలీసుల నిర్బంధ విధానం దీర్ఘకాలం ఆకలికి అలమటించిన దుర్భర పరిస్థితులు సమ్మె విరమణకు దారి తీశాయి.

## బందరు

బందరు లక్ష్మి ప్రెస్‌లో 1938 డిసెంబరు 13 నుండి సమ్మె ప్రారంభ మైంది. ఇతర పట్టణాలలో వలెనే బందరు ప్రెస్ కార్మికులు క్రింది కనీస కోర్కెలను యజమానుల ముందుంచి ఆందోళన చేశారు.

1. సంవత్సరానికి 15 రోజులు క్యాజువల్ లీవ్.
2. పని గంటల తర్వాత అదనపు పనికి రెట్టింపు జీతం.
3. పండుగలకు, ప్రభుత్వ సెలవులకు జీతంతో సెలవు ఇవ్వాలి.
4. సంవత్సరం పైన పని చేసిన కుర్రవాడికి పది రూపాయల జీతం ఇవ్వాలి.

5. ప్రతి నెలా జీతం 7 వ తేదీలోగా ఇవ్వాలి.

6. తుఫాను వల్ల పనిలోకి రాలేకపోయిన వారికి గైర్‌హాజర్ వేయరాదు

7. ఓవర్ టైము 6 గంటల నుండి 4 గంటలకు తగ్గించి రెట్టింపు జీతం ఇవ్వాలి.

ఇతర ప్రెస్సులలో తుఫాను రోజులలో గైరు హాజరు వేయకుండా ఉండడానికి, ఓవర్ టైము 4 గంటలుగా మార్చడానికి యజమానులు అంగీకరించారు కాని లక్ష్మి ప్రెస్ అంగీకరించ లేదు. ముస్తఫా అనే కార్మికుణ్ణి 12-12-38 రాత్రి ఓవర్ టైము పనిచేయడానికి పిలువగా నిరాకరించాడు మరునాడు పనికి వెళ్ళగా యజమాని అతనిని పనినుండి తొలగించి, తన మాట వినని వారినందరినీ పనినుండి వెళ్ళిపొమ్మన్నాడు. దీనితో 13 వ తేదీ నుండి సమ్మె ప్రారంభమైంది.

కార్మికుల హక్కులను అంగీకరించిన తర్వాత 22 వ తేదీన సమ్మె విరమింపబడింది.

**రాజీషరతులు :**

1. సంఘాన్ని గుర్తించుట.
2. ఓవర్ టైము పనిని 4 గంటలను రోజుగా గుర్తించుట.
3. 10 వ తేదీ లోగా జీతాలిచ్చుట.
4. సంవత్సరానికి 15 రోజుల క్యాజువల్ లీవ్.
5. తుఫాను రోజులలో వేసిన నాగాను రద్దు చేయుట.
6. బేషరతుగా పని వారందరిని చేర్చుకొనుట.

సమ్మె కాలంలో జీతం గురించి సంఘ కార్యదర్శి ఇల్లూరి తాతయ్యకూ, యజమానికీ తర్జన భర్జన జరిగింది. సమ్మె కాలంలో సగం రోజులకైనా జీతం ఇవ్వడానికి చివరికి 23 వ తేదీన అంగీకరించాడు. 1939 లో కూడ లక్ష్మి ప్రెస్‌లో ఒక కుర్రవాణ్ణి పని నుండి తొలగించగా $4\frac{1}{2}$ గంటలు బైఠాయింపు సమ్మె జరిపి తిరిగి అతనిని పనిలో పెట్టుకొనేటట్లూ చేసి విజయం సాధించారు.

## కా కి నా డ

కాకినాడ రంగా అండ్ కో ప్రెస్‌లో 1939 జూన్ 16 నుండి వివాదం తలెత్తింది. 17 రోజుల సమ్మె తర్వాత కార్మికులు విజయం సాధించారు. యజమానులు సమ్మెను విచ్ఛిన్నం చేయడానికి ప్రయత్నాలన్నిటినీ కార్మికులు త్రిప్పికొట్టారు. ప్రతిరోజూ బహిరంగ సభలు జరిపి యజమానుల చర్యలను బట్టబయలు చేశారు. కార్మికుల కోర్కెలు 1. రోజుకు 8 గంటల పని, 2. ఆది

వారం పూర్తి సెలవు, 3. ప్రతి నెల మొదటి వారంలో జీతాలు 4. ప్రతి నెల 20 వ తేదీ లోపల అడ్వాన్సులివ్వాలి.

చివరకు 8-7-39 వ లేబర్ తహసీల్‌గారి ఎదుట సమ్మె పరిష్కారమైంది జీతాల పాత బకాయీలు ఇచ్చేందుకు, ఆదివారం బదులు శుక్రవారం సెలవు ఇచ్చేందుకు, తగి కారణం లేకుండా కార్మికుల్ని పని నుండి తొలగించకుండా ఉండేందుకు యజమానులు అంగీకరించారు. ఉభయ పక్షాల ప్రతినిధులు ఒడంబడిక పత్రంపై సంతకాలు చేసిన తర్వాత జయజయ ధ్వానాలతో కార్మికులు ఊరేగింపు జరిపారు. అంతకుముందు ఈ సమ్మెకు సానుభూతిగా కాకినాడలో ప్రెస్ వర్కర్సు ఊరేగింపు జరిపారు. అన్ని ప్రెస్‌లలో సానుభూతి సమ్మె జరుపాలని నిశ్చయించారు.

## కర్నూల్

కర్నూల్‌లో 1939 లో ప్రెస్ వర్కర్సు యూనియన్ స్థాపనకు కృషి జరిగింది. పట్టణంలో తొమ్మిది ప్రెస్సులున్నాయి. వీటిలో ఆరు ప్రెస్సులలోని కార్మికులు 1939 జూలై 2 న సమావేశమయ్యారు. 1935 నుండి రాష్ట్రంలో ప్రెస్ వర్కర్సు తమ కనీస కోర్కెలకోసం చేసిన సమావేశంలో వివరించారు. రాష్ట్ర ప్రభుత్వం కార్మిక శాసనం చేయనున్నందుకు అభినందించుతూ, రాష్ట్ర ట్రేడ్ యూనియన్ చేసిన సూచనలను పొందుపరచాలని ప్రభుత్వాన్ని సమావేశం కోరింది.

అయితే కార్మికుల సంఘటిత శక్తిని దెబ్బగొట్టడానికి ప్రెస్ యజమానులు, పుస్తక వ్యాపారులు ప్రచురణ కర్తలు కలిసి యాజమాన్యం అధీనంలో ఉండే ప్రెస్ వర్కర్సు సంఘాన్ని ఏర్పరచడానికి ప్రయత్నించారు. 16-8-39 న కర్నూల్ ప్రెస్ వర్కర్సు యూనియన్ సమావేశమై, ఆ ప్రయత్నాన్ని విఫలం చేయాలని తీర్మానించింది.

## అనంతపురం

1939 ఆగష్టు 16 న అనంతపురంలో కె.వి. రామకృష్ణ యం.ఎ.బి.యల్. అధ్యక్షులుగా వీరయ్యనాయుడు కార్యదర్శిగా ప్రెస్ వర్కర్స్ యూనియన్ స్థాపించబడింది

## నెల్లూరు

కూలీ రక్షణ సమితి ఏర్పడిన నాటినుండి పనిచేస్తున్న నెల్లూరు ప్రెస్ వర్కర్స్ యూనియన్ తిరిగి 1939 జనవరి 29 న జి. రామయ్య అధ్యక్షతను సమావేశమై నూతన కార్యవర్గాన్ని ఎన్నుకొంది. ఆకే హరికేశవులు అధ్యక్షులుగా, ఆర్ బాలాజీ సింగ్ ఉపాధ్యక్షులుగా, రావి ఆదిశేషయ్య ప్రధాన కార్యదర్శిగా,

జి. రామయ్య సంయుక్త కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు. కేంద్ర శాసన సభలో రంగాగారు తెస్తున్న కార్మిక బిల్లు మద్దతును ఈ సమావేశం ప్రకటించింది. ఇతర కార్మిక సంఘాలతో కలిసి ఊరేగింపులో పాల్గొంది.

## కార్మికోద్యమం

ఆంధ్ర రాష్ట్ర ప్రెస్ వర్కర్స్ యూనియన్ మూడవ మహా సభ 30-10-38 న ఏలూరులో ఆచార్య రంగా అధ్యక్షతన జరిగింది. వివిధ జిల్లాల నుండి 70 మంది ప్రతినిధులు హాజరయ్యారు. పదిమంది సభ్యులకు ఒక సభ్యుని చొప్పున ప్రతినిధిగా పంపాలని అంతకు ముందు రాష్ట్ర ప్రెస్ వర్కర్స్ యూనియన్ విజ్ఞప్తి చేసింది

మహా సభ ఈ క్రింది తీర్మానాలను చేసింది :-

1. అంతర్జాతీయ కార్మిక సంఘం (ఐ యల్. ఓ) సూచనల ప్రకారం, మద్రాసు మంత్రి వర్గం, కార్మిక శాసనం చేయాలి.

2. దేశంలో వివిధ ట్రేడ్ యూనియన్ల మధ్య ఐక్యతపట్ల సంతోషాన్ని వ్యక్తం చేస్తూ వుంది.

3. అంతర్జాతీయ కార్మిక సంఘాలను ఐక్య పరిచేందుకు సోవియట్ యూనియన్ చేస్తున్న కృషికి అభివందనాలు. ఈ కృషి ఫలించేటట్లు చేయడానికి కార్మిక నాయకులంతా ప్రయత్నించాలి.,

4. ప్రతి ప్రాంతంలో "ప్రెస్ కమిటీ"లు ఏర్పరచి, ఆయా ప్రెస్‌లలోని కార్మికుల కష్ట నివారణకు కృషి చేయాలి.

5. ప్రతి నెలా ఒక బహిరంగ సభ, ఊరేగింపు జరిపి ప్రెస్ కార్మికుల కష్టాలను ప్రజలకు తెలియజేయాలి

6. ప్రతి ( ప్రెస్ వర్కర్స్ యూనియన్ ) ఆఫీసుకు "నవశక్తి", "వాహిని", "కార్మిక" పత్రికలను తెప్పించాలి. (నవశక్తి బెజవాడ నుండి వాహిని మద్రాసు నుండి, కార్మిక విజయనగరం నుండి వెలువడ్డాయి.)

7. డిమిట్రాఫ్ జన్మదినోత్సవాన్ని (జూన్ 18) "ప్రెస్ వర్కర్స్ డే"గా జరపాలి

8. ప్రెస్ కార్మికుల్ని పని నుండి తొలగించినపుడు సమగ్ర విచారణ జరిపి తగు చర్య తీసుకోవాలి.

9. ప్రెస్ వర్కర్సు తరపున లేబర్ వలంటీరు దళాలను ఏర్పరచాలి. అదివరకే ఉంటే వాటిలో చేరాలి.

10. ప్రతి నెలా రాష్ట్ర సంఘానికి స్థానిక సంఘాలు రిపోర్టు పంపాలి

11. ప్రెస్ వర్కర్స్ యూనియన్లు, కార్మిక, మహిళ, విద్యార్థి, యువజన, కాంగ్రెస్ మొదలగు ప్రజా సంఘాల ఉద్యమాలకు సహకరించాలి.

12. ఒక ప్రాంతం నుండి మరో ప్రాంతానికి వెళ్ళే కార్మికులు, అక్కడి యూనియన్ ఆఫీసుకు రాసి వివరాలు తెలుసుకొని వెళ్లాలి.

కార్యవర్గం :-

| | | |
|---|---|---|
| గౌరవాధ్యక్షులు | : | ఆచార్య యన్. జి. రంగా |
| అధ్యక్షులు | : | 1. ఇల్లూరి తాతయ్య |
| | | 2. లక్కరాజు వెంకట్రావు |
| ప్రధాన కార్యదర్శి | : | పిల్లలమర్రి వెంకటేశ్వర్లు |
| సహాయ కార్యదర్శులు | : | 1. మున్నంగి మల్లిఖార్జునరెడ్డి |
| | | 2. బనిశెట్టి అప్పారావు |
| కోశాధికారి | : | చాపల వెంకటేశ్వరరావు |
| కార్యనిర్వాహక వర్గ సభ్యులు | : | చొక్కాపు కృష్ణమ్మ |
| | | యన్. పరమేశ్వరరావు |
| | | హెచ్. కోటయ్య |
| | | ఐ. వి. చలపతిరావు |
| | | ఆర్. వెంకట్రావు |
| | | సి. హెచ్. గంగరాజు |
| | | కరణం సింహాచలం |

## ''బ్లాక్ బిల్''కు నిరసన

బొంబాయి శాసన సభలో కార్మిక హక్కులకు భంగం కల్గించే ఒక బిల్లును (బ్లాక్ బిల్లును) ప్రవేశపెట్టినపుడు దానిని ఉపసంహరించుకోవాలని బొంబాయి రాష్ట్ర ట్రేడ్ యూనియన్ కోరింది.

ఆ బిలుకు నిరసనగా 1938 అక్టోబర్ 17 న సార్వత్రిక సమ్మె జరుపాలని నిర్ణయించింది దానికి మద్దతుగా కార్మిక సంఘాలు ఊరేగింపులు, బహిరంగ సభలు జరుపాలని రాష్ట్ర ప్రెస్ వర్కర్స్ యూనియన్ విజ్ఞప్తి చేసింది. వివిధ పట్టణాల్లోని ప్రెస్ వర్కర్లు ఇతర కార్మికులతో కలిసి తమ నిరసనను తెలియజేశారు.

ఈ బిల్లు చట్టమైనపుడు నవంబర్ 7 న బొంబాయి రాష్ట్రమంతటా నిరసన సభలు ప్రదర్శనలు చేశారు. ఈ సందర్భాన లాఠీ ఛార్జీలు, కాల్పులు జరిగాయి. దీనిని ఖండించుతూ 22-1-1939 న బెజవాడలో రైల్వే పనివారల సంఘం, ప్రెస్ వర్కర్స్ యూనియన్ ఊరేగింపు జరిపాయి. షేక్ రహీంతుల్లా అధ్యక్షతను జరిగిన సభలో స్వాతంత్ర్య సమర యోధుడు, తోట నర్సయ్య రైల్వే కార్మిక నాయకుడు కె. యల్. నర్సింహం ఉపన్యసించారు.

## డిమిట్రాఫ్ జన్మదినోత్సవం

రాష్ట్ర ప్రెస్ వర్కర్సు యూనియన్ మహాసభ సూచననుసరించి డిమిట్రాఫ్ జన్మదినోత్సవాన్ని 1939 జూన్ 18 న బెజవాడ, ఏలూరు, అంతర్వేదిపాలెంలో జరిపారు. ఆరోజు ప్రెస్ కార్మికుల దినోత్సవంగా పరిగణించారు. అంతర్జాతీయ కమ్యూనిస్టు నాయకుడైన డిమిట్రాఫ్ ప్రెస్ కంపోజిటర్‌గా జీవితం ప్రారంభించిన విషయం పాఠకులకు గుర్తుచేయవలసిన అవసరంలేదు.

## రంగాగారి కార్మిక బిల్లు

కేంద్ర శాసనసభలో రంగాగారు ప్రవేశపెట్టిన బిల్లును బలపర్చుతూ రాష్ట్ర ప్రెస్ వర్కర్సు యూనియన్, వివిధ పట్టణాల్లోని ప్రెస్ వర్కర్సు సంఘాలు తీర్మానించాయి. ఎన్నికల ప్రణాళికలో కాంగ్రెస్ ప్రచురించిన కార్మిక హక్కులతోకూడిన కార్మిక శాసనాన్ని చేయవలసిందిగా కూడా రాష్ట్ర ప్రెస్ వర్కర్సు యూనియన్ కోరింది.

1945 జూన్ 9-10 తేదీలలో రాష్ట్రంలోని ఆంధ్ర ప్రాంతాల ప్రథమ ట్రేడ్ యూనియన్ మహాసభ జరిగింది. ఈ మహాసభకు వచ్చిన వివిధ వృత్తులకు చెందిన 266 మంది ప్రతినిధులలో ప్రెస్ వర్కర్సు ప్రతినిధులు పదిమంది వున్నారు. ఈ మహాసభ సమీక్షలో ప్రెస్ వర్కర్సు ఉద్యమం గురించిన ప్రస్తావనావుంది. 1937 - 38 లలో కాంగ్రెస్ శాసనసభ ఎన్నికలలో పాల్గొని మంత్రి పదవులు స్వీకరించిన తర్వాత కార్మికోద్యమం సుస్థిరమైన పునాదులపై అభివృద్ధి చెందినదని పేర్కొంది.

"బెజవాడ, ఏలూరు, బందరు, తెనాలి పట్టణాలలో అనేక సమ్మెలు చేశారు. సంఘం నిర్మాణ యుక్తంగా బలపడివుండడంవల్ల చాలా భాగం సమ్మెలు విజయవంతమైనాయి. ఈ ప్రభావం ఆంధ్రదేశంలోని ప్రెస్ వర్కర్సు అందరిపై ప్రసరించుట వల్ల విశాఖ, విజయనగరం, తిరుపతి, నంద్యాల పట్టణాలందు కూడా రాష్ట్ర ప్రెస్ వర్కర్సు యూనియన్ వ్యాపించింది.

"ఈ కాలంలోనే ఏలూరు, బెజవాడ, రాజమండ్రి కార్మికులు సంఘాలు స్థాపించుకొని సమ్మెలు చేశారు. తాత్కాలికంగా సమ్మెలు విజయవంతమైనప్పటికీ యజమానులు లాకౌట్ చేసి పనివారలలో నిస్పృహ, నిరుత్సాహం కల్పించి సంఘాన్ని విచ్ఛిన్నం చేయగలిగారు"

యుద్ధ కాలంలో ప్రెస్ వర్కర్సు యూనియన్లు రాష్ట్ర ప్రెస్ వర్కర్సు యూనియన్ సుస్థిర రూపం దాల్చాయని కూడా ఈ సమీక్షలో వుంది.

ప్రాథమిక దశలో ప్రెస్ వర్కర్సు యూనియన్లను, ఇతర కార్మిక సంఘాలను ఏర్పరచేటప్పుడు ఎలాంటి కష్టాలను ఎదుర్కొనవలసి వస్తుందో ఈ క్రింది ఉదాహరణ ఒక్కటి చాలు.

బందరు హిందూ కాలేజీలో మీరు పిళ్ళ అప్పుల స్వామిని, మరో ఇద్దరు ఓద్యార్థులను కళాశాలలో విద్యార్థుల సమ్మెలో పాల్గొన్నారని, ప్రెస్ కార్మికులతో చురుకుగా పనిచేశారని, కాలేజీ నుండి వెళ్ళ గొట్టారు అప్పుల స్వామికి కాండక్టు సర్టిఫికెటు కూడా ఇవ్వ నిరాకరించారు మూడేండ్లుగా సగం జీతం స్కాలర్ షిప్ పొందుతున్నాడని రాయడానికి కూడా నిరాకరించారు.

ఇతర కార్మిక సంఘాలలోవలెనే మొదట లేబర్ ప్రొటెక్షన్ లీగ్‌ద్వారాను సెక్టేరియన్ ధోరణి ముగిసి ఐక్య సంఘటన పంథాను అవలంబించిన తర్వాత కాంగ్రెస్, కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలద్వారాను కమ్యూనిస్టులు ప్రెస్ కార్మికులలో పనిచేశారు. అందుచే 1934-36 వరకు ఒక దశగా, కాంగ్రెస్ మంత్రి వర్గాలు ఏర్పడేవరకు ఒక దశగా, ఆ తర్వాత ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో ప్రజా యుద్ధ దశవరకు ఒక దశగా కమ్యూనిస్టులు కార్మికులలో పనిచేశారు. ఇదే ప్రెస్ వర్కర్సుకు కూడా వర్తించుతుంది.

1938 జూలైలో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ, ట్రేడ్ యూనియన్ ఉద్యమంపై చేసిన తీర్మానంలో ఫ్యాక్టరీ కార్మికులు, తోళ్ళ పనివారు, ప్రెస్ వర్కర్లు, మున్సిపల్ వర్కర్లకు సంబంధించిన సంఘాలు రాజకీయ శక్తిగా పెంపొందుతున్నాయని పేర్కొంది

1939 ఫిబ్రవరి 8 నవశక్తిలో "ఆంధ్ర కార్మికోద్యమ కేంద్రీకరణము" అనే వ్యాసంలో కార్మిక నాయకుడు కె యల్. నరసింహం ప్రెస్ వర్కర్సు యూనియన్ గురించి ఇలా రాశారు.

"ప్రతి పట్టణములో ప్రెస్ వర్కర్సు యూనియన్లు ఏర్పడినవి. ప్రతి ప్రెస్ ఫ్యాక్టరీయాక్టు క్రిందకు వచ్చేటట్లుగా చేయాలి అని ఆంధ్ర రాష్ట్ర ప్రెస్ వర్కర్సు యూనియన్ ఆందోళన చేసింది. కాని ప్రభుత్వం పెడచెవిని పెట్టింది. వారితోపాటు ఇతర ట్రేడ్ యూనియన్లు కూడా కలిసి ఆందోళన సాగించితే ప్రభుత్వం కార్మిక శక్తికి లొంగక తప్పదు".

## చీరాల పొగాకు కార్మికులపై కాల్పులు

గుంటూరు జిల్లా పుగాకుకు ప్రసిద్ధి దేశీయులు ఉపయోగించే పుగాకును నాటు పొగాకు అనీ, విదేశీయుల ఉపయోగం కోసం ఎగుమతిచేసే పుగాకును 'దొర పుగాకు' అని పిలుస్తారు. భూసారాన్ని పరీక్షించి, ప్రత్యేకంగా ఎన్నికచేసిన పొలాల్లో 'దొరపుగాకు' వేయడానికి ప్రోత్సహించే వాళ్లు బ్రిటీషు కంపెనీల దొరలు. అలాంటి కంపెనీలలో ఇండియన్ లీఫ్ టుబాకో డెవలప్‌మెంటు కంపెనీ (ఐ యల్.టి డి.) కంపెనీ ఒకటి.

ఇలాంటి కంపెనీలు రైతుల నుండి పుగాకు కొనుగోలు చేసేటప్పుడు దారుణంగా దోపిడీచేసేవి. వాటికి తోడుగా మధ్య దళారీల దోపిడీ ఉండనే వుంది. ఇక పుగాకును శుభ్రపరచి, వివిధ తరగతులుగా విభజించి, ఎగుమతికి సిద్ధం చేసేందుకు నియమించబడ్డ కార్మికుల్ని కూడా ఈ కంపెనీలు విపరీతంగా దోపిడీ చేసేవి. అలాంటి కంపెనీలలో ఒకటైన చీరాల ఐ.యల్.టి.డి. కంపెనీలో 1938 ఫిబ్రవరిలో కార్మికులపై కాల్పులు జరిగాయి. కాల్పులకు దారితీసిన సంఘటనలు, ఆ తర్వాతి పరిణామాలు తెలిసికొనే ముందు అక్కడి కార్మికుల పరిస్థితి గురించి గుంటూరు పట్టణ యువజన సంఘం 16-3-38 "నవశక్తిలో" ప్రకటించిన వివరాలు ఆసక్తిదాయకంగా ఉన్నాయి.

1920 లో గుంటూరు జిల్లాలో వర్జీనియా పుగాకు సాగుబడి ప్రారంభమైంది. 1928 నాటికి రెండు వేల బేరన్ కూడా లేదు. కాని 1936 నాటికి రెండు వేల బేరన్లు ఉన్నాయి 18 పుగాకు ఆరబెట్టే మరలు ఏర్పడ్డాయి. 1935-36లో ప్రపంచంలో ఉత్పత్తి అయిన పుగాకు ఉత్పత్తిలో భారతదేశం నూటికి 24.1 వంతున పండించుతోంది. అందులోనూ దక్షిణ భారతదేశం దాదాపు పండించుతోంది. దక్షిణ భారతదేశంలో కూడా ఇతర చోట కన్న ఆంధ్రదేశంలోనిదే సిగరెటులకు అనుకూలంగా వుండటంవల్ల ఎగుమతి అవుతోంది

కొనుగోలు సమయంలో రైతుల దోపిడీ అలా వుంచి, కార్మికుల పరిస్థితి ఏమిటి, పుగాకు కంపెనీలలో పనిచేసే కూలీలకు రోజు కూలి పావలా, దాదాపు 10 గంటలు పనిచేయాలి. సెలవులుండవు. కూలీలలో ఎక్కువ మంది స్త్రీలు. కానుపు వచ్చినా, నాగా కట్టుకొంటారు. స్త్రీలేగాక పిల్లలు కూడా పనిచేస్తారు. తిండి తిప్పలు లేకుండా నిద్ర సరిగా లేక, విష వాయువు పీలుస్తూ రాత్రిళ్ళు పనిచేశారు. పుగాకు కంపెనీలకు వచ్చే కూలీలు చుట్టుపక్కల గ్రామాల నుండి అన్నం మూటలు కట్టుకొని, డొక్కలో నొప్పి పుట్టేటట్లు పరుగెత్తుతూ, ఇంటి వద్ద విడిచిపెట్టిన చంటి బిడ్డల్ని తలపోస్తూ చాకిరిచేసే ఈ ఆడ కూలీలకు రోజుకు పావలా ఇస్తారు.

అయితే ఇదే కంపెనీలో చీరాల ఐ.యల్.టి డి. మేనేజరుకు రోజుకు 100 రూపాయలకు పైగా జీతం. సంవత్సరంలో మూడు నెలలు మాత్రం ఉండే పనికోసం కూలీలు ఇంత అవస్థ పడుతున్నారు.

చీరాల ఐ.యల్.టి.డి. కంపెనీలో సుమారు 6 వేల మంది పని చేస్తుంటారు. పొగాకు సీజన్లో ఇతర సమయాలలో 1000 మంది దాకా పని చేస్తూ ఉంటారు. 1937 లో మాల్లాది యజ్ఞనారాయణగారి నాయకత్వాన పొగాకు కార్మికుల యూనియన్ ఏర్పడింది. 3000 మంది సభ్యులుగా చేరారు.

1938 ఫిబ్రవరి 8 వ తేదీన ఐ యల్.టి.డి. కంపెనీలో సమ్మె ప్రారంభమైంది. కార్మికులు తమ ఇబ్బందుల గురించి మాత్రమే గాక, యూనియన్ గుర్తించాలనీ కూడా డిమాండ్ చేస్తూ వచ్చారు. యూనియన్ అధ్యక్షుడు కార్మికుడే అయి వుండాలి గాని, బయటివారు వుండరాదంటూ యాజమాన్యం పేచీ పెట్టి తిరస్కరించింది. ఇది ఇలా వుండగా సరిగ్గా పనిచేయడం లేదంటూ ఇద్దరు కార్మికుల్ని యాజమాన్యం పని నుండి తొలగించింది. ఈ ఇద్దరికి సానుభూతిగా తక్కిన కార్మికులు సమ్మె చేశారు. మేనేజిమెంటు కంపెనీని మూసివేసింది.

ఫిబ్రవరి 10 వ తేదీన తిరిగి కంపెనీని తెరచారు. కొందరు కార్మికులు పనికి వెళ్ళారు ఈ తగాదాను పరిష్కరించే నిమిత్తం మద్రాసు కార్మిక శాఖా మంత్రి చీరాల వచ్చాడు. కాని రాజీ జరుగలేదు. ఫిబ్రవరి 14 న కొంతమంది కార్మికులు పనిలోకి వెళ్ళారు. శాంతియుతంగా పికెటింగు జరుగుతోంది. సబ్ డివిజనల్ మేజిస్ట్రేట్ కొంతమంది రిజర్వు పోలీసుతో హాజరయ్యాడు. బయట జనం గుమిగూడారు. సుమారు మధ్యాహ్నం ఒంటిగంటన్నరకు పోలీసు రక్షణతో ఐదారు వందల మంది పనిలోకి వెళ్ళారు. బయట గుమిగూడిన ప్రజల్ని చెదరగొట్టడానికి పోలీసులు ప్రయత్నించగా వాళ్ళు రాళ్ళు రువ్వారనీ, ఆత్మరక్షణకై పోలీసులు రెండుసార్లు కాల్పులు సాగించారనీ, ఆరు రౌండ్లు కాల్చగా ఇద్దరు మరణించారనీ ప్రభుత్వ సమాచార కథనం. ఈ లోగా క్రిమినల్ ట్రైబ్స్ సెటిల్మెంటుకు చెందిన ఎరుకలు 1000 మంది వచ్చి కత్తులు చూపి బెదిరించారట. ఎలాగైతే నాయంత్రం ఐదున్నరకు పనికి వెళ్ళిన వాళ్ళు ఇండ్లకు భద్రంగా వెళ్ళారనీ, రాత్రంతా సాయుధ పోలీసులు గస్తీ తిరిగారనీ ఈ కథనం.[3]

కాని వాస్తవంగా పోలీసులు పికెటింగు చేస్తున్నావారిపై నాల్గయిదుసార్లు లాఠీచార్జీ చేసి కాల్పులు సాగించారు. ఈ ఘటన గురించి "నవశక్తి" 23-2-38న వ్యాఖ్యలు శీర్షిక క్రింద ఇలా రాసింది.

"చీరాల పొగాకు ఫ్యాక్టరీలో పని చేయుచున్న కార్మికులు సమ్మె చేయుటయు, సమ్మె దారులపై పోలీసులు తుపాకులు పేల్చుటచే ముగ్గురు చనిపోవుట, అనేకమంది గాయపడుట జరిగింది. శాసనసభ్యులు అచటికి వెళ్ళి విచారించి కాల్పులు అక్రమంగా జరిగినవని ప్రకటించిరి."

కాల్పులు జరిగిన మరుసటి రోజున భీతావహ పరిస్థితులలో సమ్మె విరమించబడింది. మూడు వేలమంది పనికి హాజరైనట్లు కథనం.

సమ్మెకు పూర్వం ఉన్న వారందరినీ చేర్చుకొంటామనీ, కూలి పెంచడం, బోనస్, యూనియన్ను గుర్తించడం వగైరా విచారణ సంఘానికి నివేదించుతామనీ యజమానులు తెలిపారు.

అదే నవశక్తి సంచికి చీరాల కాల్పులపై ఇలా వ్యాఖ్యానించింది.

"ఈ కాల్పుల వలన మరణించిన కుటుంబాలకు నష్టపరిహారం యజమానుల ఖర్చుపై యిప్పించవలెను. కాంగ్రెస్ మంత్రులు కాల్పులకు కారకులైన అధికారులపై చర్య తీసుకొని ఇకముందు 'లా' ఆర్డరుల పేరుతో ప్రజల ప్రాణాలు బలిగొను అవకాశం లేకుండా చేయుట ధర్మం.''

చీరాల కాల్పులకు ఒంగోలు, గుంటూరు, తెనాలి, బెజవాడ, ఇందుపూరు, రాజమండ్రి మొదలైన చోట్ల అసమ్మతి సభలు జరిగాయి. రాజమండ్రిలో వి. నరసింహం (యం యల్.ఎ) సత్యనారాయణాచారి, మహీధర రామమోహన రావు మొదలైనవారు మాట్లాడారు. చీరాల కాల్పులపై తిరిగి 2-3-38 న "నవశక్తి" వ్యాఖ్యల శీర్షికలో ఇలా రాసింది.

"చీరాల కాల్పులు దేశమునంతను గగ్గోలు పరచినవి. గుంటూరు కాంగ్రెసు నాయకులు విచారణ సల్పి పోలీసు అధికారుల దుండగములను బయటపెట్టిరి. కూలీలు రాళ్ళువేశారు. ఆత్మరక్షణకై అధికారులు తుపాకులు ప్రేల్చారు అను మామూలు కథను జిల్లా మేజిస్ట్రేటు పంపినాడు. న్యాయ శాఖాధికారిని మరిద్దరు అధికారులను పంపి 'విచారణ చేయించవలెనని కాంగ్రెస్ నాయకులు గవర్నమెంటును కోరినారు. కాని రాజాజీ ప్రభుత్వంవారు సివిలియన్‌ను విచారణ కర్తగా నియమించారు అన్నమడిగిన వానికి సున్నమిచ్చినట్లు జరిగింది దేశభక్త కొండ వెంకటపయ్యగారికి మదరాసు మంత్రివర్గంవారి చర్యపై మిక్కుటమగు ఆగ్రహం కల్గి తంతినిచ్చారు రాజాజీకి. మిగతా గుంటూరు కాంగ్రెసు నాయకులు పత్రికలకు స్టేటుమెంటు నిచ్చుచూ మంత్రివర్గంవారిట్లు ప్రజాభిప్రాయాన్ని త్రోసి రాజని రూథర్ ఫోర్టుగారిని విచారణ కర్తగా నియమించుటను తీవ్రముగా నిరసించారు. ఈ తెలివి తక్కువ ఆర్డరును రద్దు చేసికొనకపోతే ఆ విచారణను బహిష్కరించ వలసి వస్తుందని కూడా బెదరించారు. దేశభక్త వెంకటప్పయ్యగారు ఇతర గుంటూరు కాంగ్రెసు నాయకులు చూపిన గట్టితనానికి మా హృదయపూర్వక అభివందనములు. నిరుడు కొత్తపట్నంఘోరం ఈ యేడు చీరాల దుండగం గుంటూరు జిల్లాలోనే జరిగాయి. ఇతరఆంధ్ర నాయకులిదే అదను అక్కసు తీర్చుకోడానికని సామ్యవాదులను అడిపోస్తే గుంటూరు నాయకులు మాత్రం కొత్తపట్నం విషయంలో అద్భుతంగా ఆదుకొన్నారు.

"చీరాల విషయంలో వారు చూపుచున్న పట్టుదలకు దేశభక్తునకును, గుంటూరు మండల నాయకులకును మా జేజేలు. గుంటూరు జిల్లా బోర్డుకూడా మంత్రివర్గం వారి చర్యను నిరసించింది. గుంటూరు జిల్లాలో పెదనందిపాడు ఫిర్కాలో 1921 వ సంవత్సరం పన్నుల నిరాకరణ సందర్భంలో అనేక

అత్యాచారాలు గావించిన రూథర్ ఫోర్డుని ఆ జిల్లాలోనే చీరాల దురంతాలను విచారించడానికి మన మంత్రివర్గం పంపిందంటే ఎంత హాస్యాస్పదమో వేరుగ చెప్పనక్కరలేదు."

"రాజాజీ ప్రభుత్వం వారు ప్రతిష్ఠకై పెనుగులాడక ప్రజాభిప్రాయాన్ని గౌరవించి రూథర్ ఫోర్డుగారిని వెనుకకు రప్పించి న్యాయమైన అనధికార విచారణ సంఘాన్ని నియమింతురుగాక యని కోరుచున్నాము."

దేశభక్త కొండ వెంకటప్పయ్య లాంటి కాంగ్రెస్ నాయకులే విచారణను బహిష్కరించుతామని బెదరించడంతో రాజాజీ ప్రభుత్వం రూథర్ఫోర్డు స్థానే మద్రాసు హైకోర్టు జడ్జి హార్విల్‌ను విచారణ కర్తగా నియమించింది

అయితే విచారణను నిర్వీర్యం చేయడానికి ప్రభుత్వం దమనకాండ ప్రారంభించింది. కూలీలను జట్లు జట్లుగా అరెస్టు చేసి బాపట్ల జైల్లో పెట్టినారు అధికారులు. మార్చి 16 వ తేదీ నాటికి ముగ్గురు మహిళలతో సహా 38 మందిని అరెస్టుచేశారు విచారణ కమిటీ ముందు సాక్ష్యం యివ్వకుండా చేయడానికే ఈ అరెస్టులు చేశారు. ఇంతేగాక 30 మంది రిజర్వుపోలీసులు తుపాకులు, లాఠీలు, సున్నీలతో ప్రదర్శన చేస్తున్నారు లారీ ఎక్కి ఊళ్లో తిరుగుతున్నారు. రిజర్వుపోలీసుల ఈ ప్రదర్శన కార్మికుల్ని భయపెడుతోంది

కాల్పుల అనంతరం కార్మికులకు, యాజమాన్యానికి కలక్టర్ చేసిన నామాప్రకారం కార్మికులందర్ని పనిలోకి తీసుకోవాలి. కాని 25 మందిని పనిలోకి తీసుకోకుండా మినహాయించారు యజమానులు.

సాక్ష్యమిచ్చినవారిపై ఎట్టిచర్య తీసుకోబోమని మంత్రులు ఒక ప్రక్క హామీ యిస్తూనే ఈవిధమైన దమననీతికి అధికారులు పూనుకుంటూంటే మంత్రులు ఏంచేస్తున్నట్లు? పైగా కూలీలపై కేసులు ఉపసంహరించుకోవాలని కార్మిక సంఘం, పురజనులు కోరారు. కాని ఫలితం శూన్యం. అరెస్టు చేసినవారిని విడుదల చేసేదిలేదని ప్రభుత్వం ప్రకటించింది.

ఏప్రిల్ 5 వ తేదీన గుంటూరుజిల్లా కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ సమావేశమై చీరాల కార్మికుల అరెస్టును ఖండించింది. వెంటనే వారిని విడుదల చేసి విచారణలో తమ అభిప్రాయాలు వెలిబుచ్చుతూ సాక్ష్యం ఇచ్చే అవకాశం కల్పించాలని కోరింది.

చీరాల కాల్పులపై ప్రభుత్వ పార్లమెంటరీ కార్యదర్శి బి. యస్. మూర్తి ఒక రిపోర్టు తయారుచేశాడు. కాని ఆ రిపోర్టును బుట్టదాఖలా చేసింది ప్రభుత్వం. జస్టిస్ హార్విల్‌ను, విచారించవలసిందిగా కోరింది.

# హార్విల్ రిపోర్టు

చీరాల కాల్పులపై జస్టిస్ హార్విల్ రిపోర్టును 1938 ఏప్రిల్ 19న "హిందూ'' పత్రిక ప్రచురించింది. హార్వెల్ విచారించవలసిన విషయాలను ప్రభుత్వం ఇలా పేర్కొంది 1. అలజడులకు కారణాలు 2. వాటిని ఎదుర్కొడానికి స్థానిక అధికారులు తీసుకొన్న చర్యలు, సమర్థనీయత.

జస్టిస్ హార్విల్ తన రిపోర్టులో ఇలా పేర్కొన్నాడు.

"గుంపును చెదరగొట్టడం పోలీసులకు అవసరమైందనీ, నేను భావిస్తున్నాను. గుంపు చెదిరిపోడానికి నిరాకరించింది. ముందు రంగం విస్తృతం కావడంలో లాఠీ చార్జీ రానురాను నిష్ప్రయోజనమైపోయింది. గుంపును చెదరగొట్టడానికీ, వారిని అడ్డుకోవడానికీ ఏకైక మార్గం కాల్పులు సాగించడమే".

హార్విల్ రిపోరును అంగీకరించి సమర్థించుతూ ఈ రిపోర్టుతో పాటే ఒక ప్రకటన చేసింది ప్రభుత్వం. "కొద్దిమంది పోలీసులకు ఇంతకన్నా మరోమార్గం లేదు. కాని చీరాలలో జరిగిన దురదృష్ట సంఘటన నుండి నేర్చుకోవలసిన పాఠాలు ఏమిటంటే కాల్పులు జరపకుండా, బాష్ప వాయువు ఉపయోగించవచ్చు. లేదా అలాంటి ఇతర పద్ధతులను అవలంబించవచ్చు. కాల్పులు మితిమీరి చేసినట్లు అనుకోరాదు. పోలీసులు ఈ విషయంలో తీవ్రంగా వ్యవహరిస్తున్నారని గుంపు తెలుసుకొనేటట్లు చేయవలసి వచ్చింది. ఇక రెండవ విషయం తీవ్రమైన ఘర్షణకు, లాఠీ చార్జీకి, కాల్పులకు దారి తీసే పరిస్థితిని ఇరు పక్షాలు సృష్టించకుండా అన్ని విధాలా ముందు ప్రయత్నం చేయాలని ప్రభుత్వం నొక్కి చెబుతూంది.

"వివాదంపై ఏదో ఒకరకమైన సంప్రతింపులు జరుగుతూండగా ప్రమాదకరమైన సంఘర్షణలను తెచ్చి పెట్టే పరిస్థితులలో ఫ్యాక్టరీలను పని చేయనీయకుండా ఉండే అలాంటి బలపరీక్షలను నిరోధించవలసి వుంటుంది.

"అదే సమయంలో, సంప్రతింపుల వల్ల ఒక పరిష్కారం కుదరనప్పుడు ఫ్యాక్టరీలు నిరవధికంగా మూసివేయబడజాలవు. పరిష్కారం కుదరకుండా ఒక ప్రక్క ఫ్యాక్టరీలు తెరచినప్పుడు మరో ప్రక్క సమ్మెదారులు తోటి కార్మికులను ఫ్యాక్టరీకి వెళ్ళవద్దని కోరుతున్నప్పుడు, శాంతి ప్రయోజనం దృష్ట్యా రెండు పక్షాలకూ న్యాయమైన పరిస్థితులను నెలకొల్పాలి."

హార్విల్ ఈ కాల్పులపై విచారణ జరుపుతున్న సమయంలో కార్మికుల గుడిసెల్ని సందర్శించాడు. అపుడొక కార్మికుడు పూసగుచ్చినట్లు కాల్పుల సంఘటనలను చెప్పడం మొదలెట్టాడు. "ఇవన్నీ కోర్టులో చెప్పరాదా" అని హార్విల్ అన్నాడు. "సాక్ష్యమిస్తే తమ సానుకూల పరిస్థితులు పోతాయని భయం" అని ఆ కార్మికుడు జవాబు చెప్పాడు. ఈ ఒక్క ఘటన చాలు హార్విల్ విచారం ఎలా

జరిగిందోచెప్పడానికి. విచారణ పొగాకు కంపెనీ దొరల సమక్షంలోనే జరగడం వల్ల కార్మికులు ధైర్యంగా జవాబీయలేకపోయారు విచారణ జరిగే రోజున కూడా కార్మికులు పని చేస్తూనే వున్నారు. ఇక కలెక్టరు దర్యాప్తులో మెమొరాండంలోని విషయాల గూర్చి తెలుసుకోడానికి ప్రయత్నించలేదు. దొరలు పని వారిని కొడుతున్నారా ? తిడుతున్నారా ? అన్న విషయంపై కేంద్రీకరించారు. 70 మంది సాక్ష్యం యిచ్చారు.

యూనియన్‌లో చేరినందువలననే తమను తొలగించారని కార్మికులు చెప్పారు. నిర్బంధంగా యూనియన్‌కు రాజీనామా చేయాలని ఒత్తిడి తెచ్చినట్లు మరి కొందరు చెప్పారు.

పది పన్నెండేళ్ళ సర్వీసు ఉన్న వారిని తొలిగించారు విచారణ సమయంలో ముగ్గురిని తొలగించారు. ఇలా పని నుండి తొలగించబడిన వారికి ఎలాంటి బాక్ మార్కు లేదు. తక్కువ సర్వీసు గల వారిని, లాకౌట్ సమయంలో పని చేసిన వారిని ఉద్యోగంలో నిలిపి వుంచారు.

యూనియన్ తరపున విచారణ పూర్తి అయిన తర్వాత యజమానులకు 20 రోజుల వ్యవధి దొరికింది దీనిని ఆధారం చేసుకొని యజమానులు గుమాస్తాలపై ఒత్తిడి తెచ్చి దొంగ సాక్ష్యాలిప్పించారు.

యూనియన్ అధ్యక్షునిపై, మరో నల్గురి కార్మికుల పైన తనను కొట్టి వచ్చారంటూ ఒక కార్మికుని చేత కేసు పెట్టించారు. కంపెని తరపున సాక్ష్యమిచ్చిన వారిలో మేనేజర్లు, ముగ్గురు గుమాస్తాలు, ముగ్గురు కూలీలున్నారు. కూలీలలో ఇద్దరు లాకౌట్ సమయంలో పని చేసిన బాపతు.

"శాంతి భద్రతల" కోసం పోలీసులు కాల్పులు అవసరమయ్యాయని కాంగ్రెస్ ప్రభుత్వం హార్విల్ రిపోర్టును ఆమోదించడాన్ని కాంగ్రెస్ వాదులే నిరసించారు. 1938 మేడే "నవశక్తి" సంచికలో కె. యల్. నరసింహారావు రాసిన వ్యాస భాగాలను ఇక్కడ ఉదాహరించుతున్నాం.

"......గుంటూరు జిల్లా గ్రామ గ్రామమందలి కాంగ్రెస్ కమిటీలు, కాంగ్రెస్ ఎం.ఎల్.ఎ లు, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘం, అన్ని జిల్లా తాలుకా కాంగ్రెస్ కమిటీలు, వేయేల ఆంధ్ర దేశమందలి ప్రజాభిప్రాయాన్ని వెల్లడించగల అన్ని సంస్థలు, జరిగిన చర్యలను నిరసించి బాధ్యులైన ఉద్యోగులపై చర్య గైకొనవలెనని ప్రభుత్వాన్ని కోరారు. ప్రభుత్వం కాంగ్రెస్ ఎం ఎల్.ఎ.ల రిపోర్టుపైనే చర్య తీసుకోవలసింది.

"ఎంతో ఆందోళనపై ఒక ఐ.సి యస్ (రూథర్‌ఫోర్డు)ను మార్చి ఇంకో ఐ.సి యస్. జస్టిస్ హార్విల్‌ను నియమించింది ప్రభుత్వం. విచారణకు ముందు

గానే ఖబర్దారీ కొరకు అధికారులు 38 మంది కార్మికుల్ని అరెస్టు చేశారు. కార్మిక సంఘం విచారణలో పాల్గొనలేదు. పోలీసు సాక్షులను క్రాస్ పరీక్ష చేయనివ్వ లేదు. అట్టి విచారణ ఫలితం ఎంత న్యాయంగా ఉంటుందో వేరే చెప్పాలా?

గాయపడిన వారిలో వెనుకవైపు నుంచి తగలిన దెబ్బలున్నాయనీ, పారి పోతున్న వారిపై కాల్పులు జరిగాయని డాక్టర్ సిమ్సన్ సాక్ష్యమిస్తే అది సరి గాదని హార్విల్ రిపోర్టు చెప్పడాన్ని ఈ వ్యాసకర్త ఖండించాడు.

కార్మిక సంఘం కోర్కెలు సబబైనవేనని, సంఘంలో కార్మికేతరులున్నా రని దాన్ని గుర్తించకపోవడం తప్పేనని రిపోర్టు అంగీకరించినట్లు వ్యాసకర్త తెలియచేశారు. అనధికార విచారణ కమిటీని ఏర్పరచాలనీ, పార్లమెంటరీ సెక్రటరీ బి.యస్. మూర్తి రిపోర్టును ప్రకటించాలనీ, అరెస్టు చేసిన వారిని విడుదల చెయాలనీ, చనిపోయిన వారి కుటుంబాలకు, గాయపడిన వారికి యజమానులచే నష్టపరిహారం యిప్పించాలనీ వ్యాస కర్త కోరాడు.

హార్విల్ రిపోర్టును ప్రభుత్వం ఆమోదించిన తర్వాత, చీరాల పుగాకు కార్మికులకు జరిగిన అన్యాయాలు తొలగించడానికి, కాంగ్రెస్ సంఘాలు, కార్మిక సంఘాలు, కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ తీవ్ర ఆందోళన సాగించాయి. 9-7-38 న చీరాల కార్మిక యూనియన్ తమ కనీస కోర్కెలను వివరిస్తూ ఒక మెమొరాండంను ప్రభుత్వానికి పంపింది. యూనియన్ అధ్యక్షులు మల్లాది యజ్ఞనారాయణగారు కార్మిక మంత్రి వి.వి. గిరి గారిని కలుసుకొని, మెమొరాండంలోని విషయాల్ని వివరించారు. ఈ మెమొరాండంలోని విషయాలను విచారించవలసినదిగా జిల్లా కలెక్టరును ప్రభుత్వం కోరింది. హార్విల్ రిపోర్టుపై రాజాజీ ఆంధ్ర పర్యటన సందర్భంగా కాంగ్రెస్ వాదులు, సోషలిస్టులు అనేక ప్రశ్నలు కురిపించారు.

యూనియన్ సమర్పించిన మెమొరాండంలో రోజు కూలీ గతంలో ఇచ్చే విధంగా ఆరణాలు గాక, ఎనిమిదణాలుండాలి నాగాలు లేకుండా పని చేసే వారికి బహుమానం (బొంటీ) ఇస్తామని యజమానులు ప్రకటించారు. ఇది మంచి పద్ధతి కాదు. బహుమానంతో కలిపి రోజుకు అర్థ రూపాయి కూలీ ఇవ్వాలనీ యూనియన్ కోరింది. యూనియన్ అనుమతి లేనిదే బొంటీ తీసుకోరాదని కార్మికులు పట్టుబట్టారు.

## మెమొరాండంలోని ఇతర అంశాలివి :

1. యూనియన్‌ను యజమానులు గుర్తించాలి.

2. లాకౌట్ అనంతరం పనిలో చేర్చుకొనని వారిని వెంటనే పనిలోకి తీసుకోవాలి. కాల్పుల అనంతరం తొలగించిన వారిని కూడా పనిలో పెట్టుకోవాలి.

3. లాకౌట్ రోజులకు పని వారికి జీతాలివ్వాలి.

4. కాల్పుల్లో చనిపోయిన వారి కుటుంబాలకు నష్టపరిహారం యివ్వాలి.

5. రోజుకు అర్ధ రూపాయి కూలీగా నిశ్చయించి 1930 వరకు అమలులో నున్న బోనసును తిరిగి యిప్పించాలి

6. సమ్మెచేసిన కార్మికులను శిక్షించరాదు.

7. జిల్లా మేజిస్ట్రేటు కాక, గతంలో కుదిర్చిన ఒడంబడిక ప్రకారం కార్మికుల్ని గౌరవంగా చూడాలి.

8. పని గంటలు 8 కి తగ్గించాలి.

9. బి.సి. క్లాసు పని వారికి ఫ్యాక్టరీ సెలవు రోజులకు జీతాలివ్వాలి.

10. సంవత్సరానికి నెలరోజులు ప్రివిలేజు లీవు, అవసరమైనపుడు ఉపయోగించుకోవటానికి కొన్ని రోజులు ఇవ్వాలి. జబ్బుగా ఉన్నప్పుడు జీతం మీద సెలవు, పూర్వం మాదిరిగానే అన్ని తరగతుల వారికే ఇవ్వాలి.

11. వరుసగా రెండు సీజన్లలో పని చేసిన వారికి ఉద్యోగాలు ఖాయ పర్చాలి. మూడు సీజన్లలో ప్రమోషన్ ఇవ్వాలి.

12. పూర్వం పని చేసిన వారికి కొత్త సీజన్‌లో అవకాశమివ్వాలి

ఈ మెమొరాండంపై కలక్టర్ విచారణ సాగించాడు. పుగాకు కంపెనీని తనిఖీచేశాడు. కంపెనీ కార్మికులు యూనియన్ అధ్యక్ష కార్యదర్శుల నాయకత్వాన ఊరేగింపుగా కలెక్టరుమకాంకు వెళ్లారు. ఆగష్టు 17వ తేదీతో విచారణ ముగిసింది. కాని మెమొరాండంలోని ముఖ్య విషయాలపై సమగ్ర విచారణ జరుగలేదు.

ఈ లోగా మల్లాది యజ్ఞనారాయణ అధక్ష పదవికి రాజీనామా యిస్తే యూనియన్‌ను గుర్తించుతామని యాజమాన్యం సూచించుతూ వచ్చింది. కలెక్టరు కూడా ఇదే సూచించాడు.

ప్రధాని (ముఖ్యమంత్రి) రాజాజీ గుంటూరు వచ్చినపుడు చీరాల కాల్పుల విషయమై హార్విల్ రిపోర్టుని గురించి అనేకమంది ప్రశ్నించారు. దానిని ఇదివరకే ప్రభుత్వం ఆమోదించి అర్డర్లు జారీ చేసినందున తాను దాని విషయం మాట్లాడ ననీ మాట్లాడటం తప్పనీ రాజాజీ అన్నారు

దానిపై "ఇండియన్ ఎక్స్‌ప్రెస్" ఇలా రాసింది.

"గుంటూరులో హార్విల్ రిపోర్టు ఎడల ప్రజలు కనపరిచిన అసంతృప్తిని గురించి ప్రధాన మంత్రి చెప్పిన మాటలు సంతోషమును కలుగజేయ జాలవు. ఒప్పించుట అసలే చేయలేవు. ప్రతిష్ఠను కాపాడుకొనవలెనను దృక్పథము లేకుండా, పై అభిప్రాయములను ఆయన సవరణ చేసుకొనవలసి యున్నది.

1938 మే దినోత్సవం సందర్భంగా ఊరేగింపులు, సభలు జరిగాయి. వాటిలో చీరాల కాల్పులను ఖండించాయి. హార్విల్ రిపోర్టును ప్రభుత్వం ఆమో

ఓంచడాన్ని కూడా ఖండించారు. మద్రాసు, తెనాలి, గుంటూరు, మచిలీపట్నం, ఎలమర్రు, ఏలూరు, అమ్మిగుంట, పొలమూరు, మల్లిపూడి, ఆచంట, నాగాయితిప్ప, ఈమని, రాజమండ్రి, కాకినాడ, శ్రీకాకుళం మొదలైన చోట్ల జరిగిన సభలలో పై విధంగా తీర్మానించాయి.

1938 మే 11వ తేదీన "చీరాల కాల్పులు - ప్రభుత్వ ఉత్తర్వు" అనే శీర్షికతో 'నవశక్తి' వ్యాఖ్యలు శీర్షికలో, రాజాజీ మంత్రివర్గ చర్యను ఇలా ఖండించింది

"చీరాల కాల్పులను దేశమంతయు ఏకగ్రీవంగా నిరసించినది. కాల్పులు జరిగినప్పుడు ప్రజలు ఏకగ్రీవంగా నిరసించుటయు ప్రభుత్వం వారు దానిని మసిపూసి మారేడు కాయ చేయుచుండుటయు చిరకాలం నుండి పరిపాటియైనది. కాని కాంగ్రెసు మంత్రి వర్గాలు దేశంలో ఏర్పడిన పిదప సాంప్రదాయం మారునని తలంచితిమి. కాని రాజాజీ ప్రభుత్వం వారు హార్విల్ రిపోర్టును పూర్తిగా అంగీకరించి కాల్పులను సమర్థించిరి. మద్రాసు కాంగ్రెసు ప్రభుత్వం క్రింద మనుష్యుల ప్రాణాలింత చౌకయై పోయినందులకు కాంగ్రెసు శ్రేయాదాయకులెల్లరు చాలా విచారించుచున్నారు హార్విలు విచారణ పూర్తియైన పిమ్మట ఇంకా ఆ రిపోర్టు వెలువడక ముందు అందుపై ప్రభుత్వ అభిప్రాయం ప్రకటితం కాక ముందు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు వర్కింగు కమిటీవారు సమావేశమై విచారణ యందలి లోపములను వెల్లడి చేసి విచారణ బొత్తిగా "అసంతృప్తికరము"గా నున్నదని తీర్మానించిరి. వేరొక విచారణ సంఘమును కూడా నియమింపవలెనని కోరిరి. కాని వారి తీర్మానము రాజాజీ ప్రభుత్వం బుద్ధిపూర్వకముగా బుట్టదాఖలు చేసెను. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు వారి తీర్మానాలను బుట్టదాఖలు చేయుట కిది మొదటిసారి కాదు. 1937 ఆగష్టులోనే ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘం వారు కొత్త పట్నం స్కూలుపై నిషేధమును తొలగించవలెనని కోరియున్నారు.

కాని అంతవరకు రాజాజీ ప్రభుత్వంవారు దానిని గడ్డిపరకగా జూచినారు. తమ ఆజ్ఞను మంత్రివర్గంచే శిరసావహింప జేసుకొనే సత్తా సంఘాధికారులకు లేకుండా ఉన్నది. తమ తీర్మానాల వెనుక తగినంత ప్రజాభిప్రాయపు ఒత్తిడిని వారు తెచ్చుకొనలేకున్నారు. అట్టి ప్రజాందోళనాన్ని రేకెత్తించు విప్లవ శక్తుల నణగ గొట్టుటకు యత్నించుచున్నారు. ఈమధ్య తుంగభద్రలో, చీరాల కాల్పుల విషయమై ప్రభుత్వంవారు గావించిన ఉత్తర్వును ఖండించినారు. ఆలిండియా పార్లమెంటరీ సబ్ కమిటీకిని అప్పీలు చేయ తీర్మానించియున్నారు. స్వతంత్ర విచారణ సంఘాన్ని నియమింపవలెనని కోరియున్నారు. ఆంధ్ర రాష్ట్ర మహా సభాధ్యక్షులగు శ్రీ కల్లూరి సుబ్బారావు యం.యల్.ఎ. గారు మధ్య రాష్ట్రము మంత్రి

విషయమై జరుగుచున్న విచారణ మాదిరి యీ విచారణ మంత్రివర్గంపై కూడా జరుగవలెనని కోరియున్నారు. సంతోషము. ఈ మారైనను ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు అధికారులు చీరాల కాల్పుల విషయమై ధైర్యముగా, దృఢముగా నిలబడి చీరాల కాల్పుల రాక్షసత్వమును, వాటిని సమర్థించుటలోని సామ్రాజ్య తత్వాభిమానమును, వెల్లడించెదరు కాకయని కోరుచున్నాము. ఆంధ్ర దేశంలోని అన్ని సామ్రాజ్య వాద వ్యతిరేక శక్తులు రాష్ట్ర సంఘాధికారుల కండయై నిల్చునని నమ్ముచున్నాము."

మరొకసారి 20-7-38 న 'నవశక్తి' సంపాదకీయంలో "కాంగ్రెసు రాజ్యంలో ఒక ఏడాది" అనే శీర్షికతో ఇలా రాసింది.

"కాల్పులలో చనిపోయిన వారి కుటుంబాలకు నష్ట పరిహారమైనా మైసూరు ప్రభుత్వం యిచ్చింది. కాని చీరాల బాధితులకు కాస్త పరిహారమైనా యివ్వలేదు మన మద్రాసు ప్రభుత్వం. మైసూరు ప్రభుత్వంవారు కాల్పులకు బాధ్యులైన ఉద్యోగస్థులను ట్రాన్స్‌ఫరైనా చేసింది. కాని రాజాజీ ప్రభుత్వం ప్రజలు కోరినా వానిని ట్రాన్స్‌ఫర్ చెయలేదు సరికదా కాల్పించిన ఒంగోలు సబ్ కలెక్టరును జిల్లా కలక్టరుగా ప్రమోషను ఇప్పించారు "రాళ్ళ దెబ్బలకు గుండు దెబ్బలే సరియైన జవాబు" అను సిద్ధాంతమును ప్రకటించి, పంజాబు దురంతముల సందర్భమున పోలీసులను సమర్థించిన అనిబిసెంటమ్మకు రాజకీయ రంగంలో స్థానం లేకపోయింది. అదే సిద్ధాంతాన్ని బహిరంగంగా చీరాల కాల్పుల సందర్భంలో సమర్థించిన రాజాజీని తన దృక్పథాన్ని మార్చుకొనేటట్లు చేయలేక పోయింది దేశం."

చీరాల కార్మికులపై కాల్పులను ఖండించుతూ, హార్వెల్ రిపోర్టును రద్దు చేసి పునర్విచారణ చేయాలంటూ ఆందోళన కొనసాగుతూనే వచ్చింది. 16-7-38 న రాజాజి గుంటూరు వచ్చినపుడు విద్యార్థి, యువజన, కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ముస్లిం మాస్ కాంటాక్టు సంఘాల తరపున పెద్ద ఊరేగింపు జరిగింది. "హార్వెల్ రిపోర్టును రద్దు పరచాలి", "చీరాల కార్మికులు పునర్విచారణను కోరుతున్నారు" "పౌరసత్వ వాక్కులను వృద్ధి చేయాలి'' అని నినాదాలు రాసిన అట్టలను కట్టుకొని ప్రదర్శకులు ఊరేగారు. నేతి వెంకటాచలపతి, వింజమూరి అనంతాచార్యులు, మాకినేని బసవపున్నయ్య దుర్భ కృష్ణమూర్తి ఉపన్యసించారు.

1938 అక్టోబరు 17 వ తేదీన గుంటూరు జిల్లాలో పుగాకు పనివారల సంఘ దినోత్సవాన్ని జయప్రదంగా జరపాలని గుంటూరు జిల్లా కాంగ్రెస్ కమిటీ, జిల్లా రైతు సంఘం; జిల్లా వ్యవసాయ కూలీ సంఘం, జిల్లా క్రిమినల్ ట్రైబ్స్

సంఘం, జిల్లా విద్యార్థి ఫెడరేషన్, జిల్లా సోషలిస్టు పార్టీలు సంయుక్తంగా విజ్ఞప్తి చేశాయి.

## చీరాల పొగాకు కంపెనీల కార్మికుల నాయకత్వం

కాల్పుల దరిమిలా మల్లాది యజ్ఞ నారాయణగారి నాయకత్వాన్ని ఎలాగైనా ఊడగొట్టాలని కంపెనీ ప్రయత్నిస్తూ వుంది. హార్విల్ రిపోర్టు కూడా అందుకు తోడ్పడింది. కాల్పుల అనంతరం యూనియన్ వర్కింగ్ కమిటీ, కంపెనీ కుమ్మక్కైంది. 1938 నవంబరు 7 వ తేదీన వర్కింగ్ కమిటీ సమావేశంలో యజ్ఞ నారాయణపై విశ్వాస రాహిత్య తీర్మానం ప్రతిపాదించింది. ఆయన వెంటనే రాజీనామా చేశారు. తర్వాత కొండా వెంకటప్పయ్య గారిని యూనియన్ అధ్యక్షుడనీ, కార్యవర్గాన్ని సూచించవలసిందిగా వర్కింగ్ కమిటీ కోరింది. ఈ మధ్యవర్తి తతంగం కూడా విచిత్రంగా జరిగింది. మొదట జిల్లా కాంగ్రెస్ వర్కింగ్ కమిటీని ఈ విషయమై పేరు సూచించవలసిందిగా కోరారు. వారి నుండి జవాబు రాకముందే కొండా వెంకటప్పయ్య పంతులుగారిని కోరారు. మొదట ప్రెసిడెంటు పేరును సూచించవలసిందిగా కోరారు తర్వాత వర్కింగ్ కమిటీనంతటినీ సూచించమని అన్నారు. "మీరు సూచించిన పేర్లన్నీ మేం తప్పకుండా పెట్టుకోవాలా" అని అడిగారు. "నేను సూచిస్తాను. తర్వాత మీ ఇష్టం" అన్నారు వెంకటప్పయ్య పంతులుగారు.

ఈ తతంగానికంతా ఈ దశలో కార్యదర్శిగావున్న బూతరాజు నరసింహారావేనని కార్మికులలో అసంతృప్తి వుంది. కంపెనీ పనినుండి తొలగించిన ఒక కార్మికుడు గుంటూరు వెళ్ళి పి.వి. శివయ్యగారిని కలుసుకొని చీరాల రావలసిందిగా కోరాడు. ఆయన 18 వ తారీఖున వెళ్ళి వివిధ కార్మిక ముఠా నాయకుల్ని కలిశాడు. మాధవ పెద్ది కాళిదాసుగారిని అధ్యక్షులుగాను, బూదరాజు నర్సింహారావు గారిని కార్యదర్శిగానూ వెంకటప్పయ్య పంతులు గారు సూచిస్తారని కార్మికులకు తెలిసింది. పూర్వపు అధ్యక్షునిచే రాజీనామా చేయించేటట్లు ఒత్తిడి తెచ్చిన నరసింహారావుపై కార్మికులకు విశ్వాసం లేదు.

21 తేదీ సాయంత్రం కొండా వెంకటప్పయ్య పంతులు గారు కంపెనీ గేటు వద్ద మీటింగు పెట్టి 'నాలో నమ్మకం ఉన్న వాళ్ళు చేతులెత్తండి' అని వారి కిష్టమున్నా లేకున్నా పెద్దవాడనే అభిప్రాయంతో ఆమోదం పొందారు. ఇదే ధోరణిలో ఆ రాత్రి పొద్దు పోయే దాకా పాకలు, గుడిసెలు వద్ద కార్మికుల్ని కలుసుకొన్నారు. 22 వ తేదీ సాయంత్రం సభలో "యజ్ఞ నారాయణ గారు మీకు అధ్యక్షుడిగా ఉండి చాలా సేవ చేశారు. ఇప్పుడు ఆయన లేకుంటే యూనియన్‌కు కొన్ని హక్కులిస్తామని, రికగ్నైజ్ చేస్తామని అధికారులు చెప్పటం

వల్ల, ఇంకా ఇతర కారణాలవల్ల ఆయనగారు అధ్యక్షపదవి నుంచి విరమించు కొన్నారు. ఆయన గారి సేవను కొనియాడుతూ తీర్మానం వుంది.'' అంటూ తను చెప్పిన వారిని ఎన్నుకోమని కొన్ని పేర్లు చదివారు. ఈ సభకు మాజీ వైస్ ప్రెసిడెంటు నల్లపరెడ్డి శ్రీరామమూర్తి అధ్యక్షత వహించాడు.

మాధవపెద్ది కాళిదాసు గారిని అధ్యక్షులుగా, వెలగపూడి కృష్ణమూర్తి గారిని ఉపాధ్యక్షులుగా కొందరు ఏవేవో అభ్యంతరాలు తెలిపినా, ఎన్నికైనారు. కార్యదర్శిని వదలిపెట్టి సహాయ కార్యదర్శులుగా సుందర రామశాస్త్రి, మారుపు ఆనందరావుగార్ల పేర్లు సూచించగా ఎన్నికైనారు. సుందర రామాశాస్త్రి గారు ఉపసంహరించుకొంటానన్నా అంగీకరించలేదు. తర్వాత ప్రధాన కార్యదర్శిగా బూదరాజు నరసింహారావుగారి పేరు ప్రస్తావించగా చాలా మంది అయిష్టత వ్యక్తం చేశారు. పంతులుగారు కంపెనీ గుమాస్తా మునిపల్లె వెంకటేశ్వర్లు గారిని సూచించగా పదిమంది కూడా చేతులెత్తలేదు. ఇంతలో ఒకరు లేచి పి వి. శివయ్య గారి పేరు సూచించారు. ''మాకు శివయ్యగారే కావాలి'' అంటూ ఆయన్ని లాక్కుపోయి పంతులు గారి ప్రక్కన నిలబెట్టారు. జయజయ ధ్వానాల మధ్య శివయ్య గారికే చేతులెత్తారు. కాని గుమాస్తాలు కొందరు అభ్యంతరం చెప్పారు. పంతులుగారు సభను వాయిదా వేశారు. మరుసటి రోజున శివయ్యకంటే పంతులు గారు నరసింహారావుకే ఓట్లు ఎక్కువ వచ్చినవన్నారు. ''యూనియన్‌లో సోషలిస్టులు ఉండటం ఇష్టం లేదు" అని పంతులుగారు తమ అభిప్రాయాన్ని కొందరి ముందు వెలిబుచ్చారు.

కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ట్రేడ్ యూనియన్ ఉద్యమంపై 20-7-38 న చేసిన తీర్మానంలో "గుంటూరు జిల్లాలో పుగాకు కార్మికుల మధ్య కొద్ది నెలలుగా పని ప్రారంభించాము. చీరాల యూనియన్‌లో కూడ స్థానం సంపాదించాము." అని పేర్కొన్న విషయంపైన వివరించిన ఎన్నికల వ్యవహారంలో స్పష్టమైంది.

దీని పర్యవసానంగా నూతన ప్రధాన కార్యదర్శిని ఎన్నుకొనే వరకు ఉపాధ్యక్షుడే ప్రధాన కార్యాదర్శిగా వ్యవహరించాలని 1938 డిసెంబరు 26న సమావేశమైన పుగాకు పనివారల సంఘ కార్యవర్గం నిర్ణయించిది.

యజమానులు కొన్ని షరతులతో యూనియన్‌ను గుర్తించారు. బేషరతుగా గుర్తించాలని ఆందోళన చేయాలని నిశ్చయించింది. 8-2-39 నవశక్తిలో "ఆంధ్ర కార్మికోద్యమ కేంద్రీకరణము" అనే వ్యాసంలో కె.యల్. నరసింహం ఇలా రాశారు.

"చీరాల పొగాకు కంపెనీలో పనిచేసే కార్మికులు ఎక్కువ కూలీలకు, తక్కువ గంటల పనికి, ప్రావిడెంటు ఫండు కొరకు గొప్ప పోరాటం సాగించారు.

నాయకత్వపు లోటు వల్ల, పోలీసులు కార్మికులపై తుపాకులు పేల్చటం చేత, మద్రాసు ప్రభుత్వపు ధోరణి కార్మిక హక్కులకు భంగకరమగుటచేత కార్మికులు ఓడిపోయారు. స్థానికంగా వుండి కార్మికులు రోజు రోజు కష్టాలలో పాల్గొనకపోవుట చేత సోషలిస్టు ఆ పోరాటమునకు నాయకత్వం వహించలేక పోయారు. పోలీసు కాల్పులను మద్రాసు కాంగ్రెసు ప్రభుత్వం సమర్థించి యజమానులు, అనగా బ్రిటిషు పెట్టుబడిదారులు కార్మికుల పైన తీసుకు వచ్చిన ఒత్తిడికి సహాయపడినది. ఆ పరిస్థితులలో ఆంధ్ర కార్మిక వర్గం ప్రభుత్వ పరమైన, తగినంత ఒత్తిడి తీసుకొని రాలేకపోయింది. కనీసం యజమానులకు, కార్మికులకు వచ్చిన తగాదాను పరిష్కరించుటకు కోర్ట్ ఆఫ్ ఎంక్వైరీ అయినా ఏర్పాటు చేయించలేక పోయింది."

## చిట్టివలస జూట్ కార్మికుల సమ్మె

ఆంధ్రలో చిట్టివలస, నెల్లిమర జూట్ మిల్లులు ముఖ్యమైనవి. చిట్టివలస జూట్ మిల్లు "మిలియాడ్ అండ్ కో" అనే బ్రిటిషు వాళ్ళ యాజమాన్యం క్రింద వున్న కంపెనీ 1939 లో చిట్టి వలస కార్మికుల సమ్మె దీర్ఘకాలం సాగింది. ఈ సమ్మె ఉజ్జ్వల చరిత్ర సృష్టించింది. ప్రభుత్వ నివేదికలలో ఈ సమ్మె గురించిన వ్యాఖ్య గమనార్హం.

"వామపక్షం వారు సాగించిన ఫలితంగా అనేక సమ్మెలు జరిగాయి. హింసకు పాల్పడిన గ్రూపులను చెదరగొట్టడానికై కొన్నిచోట్ల పోలీసులు కాల్పులు సాగించవలసివచ్చింది. ప్రజలను ఎక్కువ ఆకర్షించిన సమ్మెలలో ఐ. యల్. టి. డి. కంపెనీ సమ్మె (1938 ఫిబ్రవరి), విశాఖపట్టణం జిల్లాకు చెందిన చిట్టి వలస జూట్ మిల్లు కార్మికుల సమ్మె (1939 ఫిబ్రవరి) కాకినాడలో జరిగిన పీచు కార్మికుల, ఉప్పు కార్మికుల సమ్మె (1939 ఏప్రిల్) ఉన్నాయి.[4]

1937 శాసనసభ ఎన్నికలలో విశాఖపట్టణం గోదావరి జిల్లాల కార్మిక నియోజక వర్గస్థానానికి కరుణాకరం సుబ్బారావుగారు పోటీ చేసి ఎన్నికయ్యారు. కార్మికులంతా కాంగ్రెస్‌కే ఓటు చేశారు. ఆ రోజుల్లో జరిగిన ప్రచారం, సుబ్బారావుగారి కృషివల్ల 1937 లో చిట్టి వలస జూట్ కార్మిక సంఘం ఏర్పడింది.

అంతకుముందు 1932లో నెల్లిమర్లలోనూ, చిట్టివలసలో 1928లో డి. వి. రామస్వామి గారి అధ్యక్షతను జూట్ కార్మికుల యూనియన్ ఏర్పడినా నామ మాత్రంగా వుండేవి.

దీనిని చిట్టివలస కాంగ్రెస్ లేబర్ యూనియన్ అని పిలిచేవారు. ఆనాటి నుండి కార్మికులు తమ ఇబ్బందుల్ని మిల్లు యజమానులకు, ప్రభుత్వానికి 'అర్జీ'ల ద్వారా విన్నవించుకొనేవారు. కార్మిక సంఘంలోచేరి, కార్మిక హక్కుల గురించి

శ్రద్ధ వహించుకున్నారనే కోపంతో 260 మంది కార్మికులను యాజమాన్యం తొలగించింది. దీనితో 1938 ఏప్రిల్ 28 న జూట్ మిల్లులో సమ్మె ప్రారంభ మైంది. సమ్మెలో 3200 మంది పాల్గొన్నారు.

చుట్టుప్రక్కల గ్రామాలలో సభలుజరిపి, కార్మికుల స్థితిగతులను తెలియ పరచి, కార్మిక నాయకులు గ్రామీణ ప్రజల సానుభూతిని పొందారు. యూనియన్ నాయకులు కరుణాకరం సుబ్బారావు, కార్యదర్శి డి. గణపతిరావు మంత్రివర్గం వద్దకు రాయబారం వెళ్ళారు. అప్పటికే చాలాకాలంగా సమ్మె సాగుతున్నందున కొన్ని రాజీ ప్రతిపాదనలు చేశారు. ఆర్బిట్రేటర్ (మధ్యవర్తి పరిష్కర్త) నియ మించాలని కోరారు. పనివారందరినీ పనిలోకి తీసుకుంటే, పని గంటలు తగ్గిస్తే జీతాల్లో తగ్గింపునకు ఒప్పుకొంటామని గణపతి చెప్పాడు. కార్మికుల సమాధాన ధోరణి చూసిన కొలదీ యజమానులు బిగబిగిసారు. అయినా కార్మికులు పట్టు వదలక ప్రచారం సాగించారు. 200 మంది కార్మికులు విజయనగరం మీదుగా విశాఖకు యాత్ర జరిపారు. అన్ని చోట్లా ప్రజలు సానుభూతిని తెలియచేశారు. ఊరేగింపులు, సభలు జరిపారు. సమ్మె రెండు నెలలు సాగిన పరిస్థితులలో కరుణాకరం సుబ్బారావు, కార్మిక నాయకుడు వి.వి. నరసింహం, కాంగ్రెసు నాయకులు డా॥ పట్టాభి చిట్టివలస వెళ్ళి సమ్మె పరిస్థితిని గమనించారు.

దీర్ఘకాలం సమ్మె జరిగాక, ఐ.సి.యస్. ఉద్యోగి ఎస్.వి. రామ్మూర్తిని మద్రాసు ప్రభుత్వం తగాదా పరిష్కారానికి పంపింది. కానీ రాజీ కుదరలేదు.

సమ్మె ఆపితే విచారణ కమిటీ వేస్తామని ప్రభుత్వం 1938 ఆగష్టు 8 న ప్రకటించింది 1938 అక్టోబరులో కార్మికులు సమ్మె విరమించి పనిలోకి వెళ్ళారు. 12 వ తేదీన మద్రాసు కలెక్టర్ జవాద్ హుస్సేన్‌ను సమ్మె పరిస్థితు లను విచారించడానికి ప్రభుత్వం నియమించింది. ఈయన ఏవేవో చిన్న చిన్న సూచనలు చేశాడు. కార్మికులకు ఇవి సంతృప్తికరంగా లేకపోయినా అంగీకరిం చారు. కాని యజమానులు మాత్రం ఆ సూచనలను ఆచరణలో పెట్టలేదు.

## కార్మికోద్యమం :

సమ్మె చేసినందుకు కార్మికులపై కక్ష సాధింపు చర్యలను యాజమాన్యం ప్రారంభించింది. పని తక్కువగా చేస్తున్నారని 1939 ఫిబ్రవరి 5 న వంద మంది కార్మికులకు హెచ్చరికలు జారీచేశారు. దానికి తగిన సమాధానం ఇచ్చినందుకు అప్పన్న అనే కార్మికుణ్ణి స్థాయి తగ్గించి వేశారు. దీనికి నిరసన తెలియచేసినందుకు అతనిని పనినుండి తొలగించారు. ''నేర్చుకునే వాడి''గా చేయటానికి సిద్ధమైతేనే పనిలో తీసుకుంటామని యాజమాన్యం చెప్పింది. అప్పన్నపై యాజమాన్యం అనుసరిస్తున్న కక్షసాధింపు చర్యలకు నిరసనగా ఫిబ్రవరి 14 వ

తేదీన కార్మికులు సమ్మె ప్రారంభించారు. అతనిని తొలగించిన కార్మికుణ్ణి తిరిగి పనిలోకి తీసుకొనే వరకు మిల్లును వదిలిపోయేది లేదని ప్రకటించి మిల్లులోనే బైటాయింపు సమ్మె ప్రారంభించారు. సమ్మె ప్రారంభమైన 2 గంటలకే రిజర్వ్ పోలీసులు, తాహసీల్దారు, ఆర్.డి.ఓ.లు హుటాహుటిన వచ్చారు. సమ్మె చేయ దల్చుకుంటే ఇంటికిపోయి భోజనాలు చేసి వచ్చి సమ్మెచేయండి అని 50 మంది కార్మికులను పంపించివేశారు. తిరిగి ఆ కార్మికులు 10 గంటలకు మిల్లులో ప్రవేశిస్తుంటే వారిపై లాఠీచార్జీ చేశారు. ఏ కారణం లేకుండానే ఎటువంటి హెచ్చరిక చేయకుండానే రాత్రి 12-30 గంటలకు లైట్లు ఆర్పి మిల్లులో ఉన్న కార్మికులపై లాఠీఛార్జీ ప్రారంభించారు. కార్మికులు తప్పించుకోవటానికి వీలులేకుండా ఒక్క గేటును మాత్రమే తెరిచి మిగిలిన గేట్లను మూసివేశారు. ఇది చాలదన్నట్లు చీకట్లో ఆగేటుగుండా పారిపోతున్న కూలీలపై 10 రౌండ్లు కాల్పులు జరిపారు. కాల్పులలో వందమందికి పైగా గాయాలు తగిలాయి. 20 మంది తీవ్రంగా గాయపడ్డారు. ఒక వ్యక్తి బులెట్ల గాయాలతో చనిపోయాడు. ఈ అమానుషకాండ జరుగుతున్న సమయంలో జిల్లా కలెక్టర్ మిల్ ఏజెంట్ అక్కడనే ఉన్నారు. ఈ అమానుష ఘటనపై ప్రభుత్వ వక్రీకరణ ఈ విధంగా ఉంది.

"చిట్టివలస జూట్ మిల్లులో ఒక పర్మినెంటు నేత కార్మికుని తొలగించగా 2000 మంది మిల్లు నుండి బయటికి పోవనిరాకరించారు. రిజర్వ్ పోలీసులు, జిల్లా మేజిస్ట్రేటు వచ్చారు. కార్మికుల్ని బయటికి పంపడానికి ప్రయత్నించగా కార్మికులు నూలు కండెలు, రాళ్లు విసిరారు. పోలీసులు 4 సార్లు కాల్చారు లాఠీచార్జీ చేసి మిల్లును ఖాళీ చేశారు. సీలమండలో గాయపడ్డ కార్మికుణ్ణి హాస్పిటలులో చేర్చారు.

"మున్ముందు విచారణలో ఏమి తెలిసినా, జరిగిన ఈ విషాద ఘటనలకు ప్రభుత్వం విచారం తెలియజేస్తుంది. స్టే ఇన్‌స్ట్రైక్‌ను తీవ్రంగా నిరసించుతోంది. ఇలాంటివి అసలు సమ్మెలే కావు. అపాయకరమైన క్రిమినల్ నేరాలు. ప్రాణ నష్టానికి దారి తీసి శాంతి భద్రతలకు నష్టం కల్గిస్తాయి. వాటిని ప్రభుత్వం సహించజాలదు. వాటిని తీవ్ర పద్ధతులతో అణచివేస్తాము. అనే దారుణ ఫలితాలకు ఇవి దారి తీస్తాయి.

22-2-38 నవశక్తి సంపాదకీయంలో ఈ ఘటనలపై ప్రభుత్వ చర్యను తీవ్రంగా విమర్శించింది.

"చిట్టి వలసలో వున్నది సివిల్ గవర్నమెంటేనా అని ప్రశ్నిస్తాము. అర్థరాత్రివేళ కాల్పులు జరుపవలసిన అసాధారణ పరిస్థితులేమిటి? కార్మికుల ప్రాణాలు యజమానుల, యీ ప్రభుత్వోద్యోగుల దృష్టిలో అంతచవుకయా? జరిగిన యీ ఘోరాన్ని మదరాసు ప్రభుత్వ ప్రకటన మరింత విషాదకరము

చేస్తోంది. పోలీసులపై నూలు కండెలు ఇంకా ఏమేమో విసిరారట, అందుచే కాల్చవలసి వచ్చిందని కాల్పుల వార్తతోపాటే వెలువడింది ప్రభుత్వ ప్రకటన. ఇది కాంగ్రెసు మంత్రుల ప్రకటనయేనా? తాము విచారించలేదు. కాంగ్రెసు యం.యల్.ఎ. అధ్యక్షుడుగా వున్న కార్మిక సంఘ అభిప్రాయాన్ని కనుగొనలేదు. మనుష్య జీవితాన్ని బలిగొన్న ఉద్యోగుల చర్యను సమర్థించుటకు వారికింత ఆతురత యేల?"

చిట్టివలసలో కాల్పులకు గురియైన కార్మికులకు సానుభూతిగా ఆంధ్ర దేశమంతటా అన్ని ముఖ్యపట్టణాలలో సభలు జరిగాయి. ఆంధ్ర కాంగ్రెస్ కమిటీ బసవరాజు రంగశాయి గారిని విచారణకు పంపింది. మద్రాసు ప్రభుత్వం డిపార్టు మెంటల్ విచారణకు ఉత్తర్వు చేసింది కాని బహిరంగ విచారణకు అంగీకరించ లేదు. రంగసాయి తన నివేదికను రాష్ట్ర కాంగ్రెసు కమిటీకి సమర్పించారు.

కార్మిక యూనియన్ అధ్యక్షులు కరుణాకరం సుబ్బారావుగార్ని, కార్మి కుల్ని కార్మికులకు చికిత్స చేసిన డా॥ వెంకయ్యని మరో వందమందిని రంగ సాయి విచారించి నివేదిక తయారు చేశారు.

రంగసాయిగారి నివేదికలో అనేక నిగూఢ విషయాలు బయట పడ్డాయి. మిల్లు మేనేజర్ జేమ్సుకూడా కార్మికులపై పిస్తోలు ఉపయోగించి కార్మికుల్ని గాయపర్చినట్లు బయటపడింది. మిల్లులో నిద్రపోతున్న కార్మికులపై ఎటువంటి హెచ్చరికలు లేకుండానే హఠాత్తుగా లైట్లు ఆర్పి కాల్పులు జరిపినట్లు గోడదూకి పారిపోతున్న కార్మికుల్ని కూడా లాఠీలతో తుపాకులతో తరిమినట్లు రంగసాయి గారి నివేదిక పేర్కొంది. కాల్పులు లాఠీచార్జీతో గాయపడిన కార్మికులకి కనీస ప్రాథమిక చిక్సిత చేయలేదని పైపెచ్చు చికిత్సకోసం భీమునిపట్నం తీసుకు వెళ్ళిన కార్మికులకి డాక్టర్ సేవలు అందనీయకుండా ఆర్.డి.ఓ. డాక్టరును ఎక్కడికో తీసుకుపోయినట్లు రంగసాయి నివేదిక పేర్కొంది. రెండుకాళ్ళు స్వాధీ నంలో లేని కార్మికుల్ని సహితం ఆస్పత్రిలో చేర్చుకున్నట్లే చేర్చుకుని 5 రోజుల లోనే పంపివేశారు.

కార్మికులపై జరిగిన కాల్పులు అమానుషమని అన్యాయమైనవని రంగ సాయి నివేదిక స్పష్టంగా తేల్చి చెప్పింది.

చిట్టివలస కాల్పులను వివిధ కార్మిక ప్రజా సంఘాలు ఖండించాయి. అంతే గాక గుంటూరు జిల్లా కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ మహాసభ 29-3-39 న, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ 16-2-39 న, ఆంధ్ర రాష్ట్ర ప్రెస్ వర్కర్స్ యూనియన్ తెనాలి సమావేశంలో కాల్పులను ఖండించారు. పోలీసు కాల్పులను సమర్థించిన కాంగ్రెస్ మంత్రివర్గ చర్య తగని పని అనీ, రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ

ద్వారా విచారణ జరుపాలని ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ తీర్మా నించింది

చిట్టివలస జూట్ మిల్లు పనివారి సమ్మె 100 రోజుల తర్వాత ముగిసినట్లు 7-6-39న నవశక్తి ప్రకటించింది. కార్మిక సంఘానికి మిల్లు యజమానులకు కుదిరిన ఒడంబడికలు ఈ క్రింది షరతులున్నాయి.

1. ఫిబ్రవరి 14 వ తేదీనాటికి మిల్లులో పని చేస్తున్న ప్రతి కార్మికుని పనిలో చేర్చుకొనుట.

2. కార్మికునకు 10 రోజుల సెలవుతో జీతం యిచ్చుట.

3. ఉద్యోగం నుండి విరమించుట గాని, తీసివేయుట గాని జరుపవలసి వస్తే 15 రోజులు ముందుగా నోటీసివ్వాలి.

4. మిల్లులో ఉద్యోగాలకు ఖాళీ వచ్చినపుడు ఇదివరకు పనిచేసిన కార్మికు లకే ఇవ్వాలి. ముఖ్యంగా 1938 మే లో తీసివేసిన కార్మికులకే ప్రాధాన్యం యివ్వాలి.

5. కొద్ది షరతులతో కార్మిక సంఘం గుర్తింపబడుతుంది. ఆ షరతులలో భాగంగా ఇపుడున్న కార్మిక సంఘ ఎన్నికలు నెలరోజుల్లో జరగాలి. అపుడు సంఘాన్ని యాజమాన్యం గుర్తించుతుంది.

మే 23 వ తేదీన జరిగిన కార్మిక సమావేశంలో ఈ షరతులు అంగీక రింప బడ్డాయి.

1938 ఏప్రిల్‌లో ప్రారంభమై, 1939 ఫిబ్రవరిలో కాల్పులకు దారితీసిన ఈ సమ్మె ఆ విధంగా సుధీర్ఘకాలం సాగి, ఉజ్జ్వల చరిత్ర సృష్టించింది.

## రైల్వే రంగం

ఆంధ్ర ప్రాంత రైల్వే కార్మికోద్యమ నిర్మాణ బాధ్యతను 1936-37 ప్రాంతంలో ఆనాటి రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి పోలేపెద్ది నరసింహ మూర్తి వహించారు. రైల్వే లైను వెంబడి తిరుగుతూ కార్మికులతో సంబంధాలు పెట్టుకొని, వారిలో చైతన్యం కల్గించుతూ, కార్యకర్తలను తయారు చేశారు. విజయవాడ బ్రాంచి రైల్వే కార్మిక సంఘానికి ప్రధాన కార్యదర్శిగా పనిచేశారు.

1926 ట్రేడ్ యూనియన్ చట్టం ప్రకారం రైల్వే కార్మికులు సంఘాలు ఏర్పరచుకోవచ్చు. అయినా యజమానులు కార్మిక సంఘాలేర్పడటం నిషేధ విషయంగా భావించేవారు. కార్మిక సంఘాలు ఏర్పడకుండా నిరోధించ ప్రయత్నించేవారు. యూనియన్‌లో ప్రధాన పాత్ర వహించే వారి పనుల నుండి తొలగించేవారు. కార్మికులలో చీలికలు తెచ్చి పోటీ సంఘాలు పెట్టేవారు. 1937 ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో శాసన సభలకు ఎన్నికలు జరిగాయి. అపుడు కార్మిక నియోజక వర్గాలుగా విశాఖపట్టణం, చీరాలలను కేటాయించారు.

చీరాల నుండి కార్మిక నాయకుడు రైల్వే ఫిట్టర్ వి.వి. నరసింహం యునైటెడ్ ఫ్రంట్ అభ్యర్థిగా ఎన్నికయ్యారు. కార్మికోద్యమానికి ప్రత్యేకించి రైల్వే కార్మికోద్యమానికి ఈ ఎన్నిక ఎంతో ప్రోత్సాహాన్నిచ్చింది.

20-7-38 నవశక్తి పత్రిక ఆంధ్ర రాష్ట్ర ట్రేడ్ యూనియన్ ఉద్యమంపై కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ తీర్మానం ప్రకటించబడింది. అందులో రైల్వే కార్మికులకు సంబంధించిన భాగాలు గమనించదగ్గవి.

1. "…. …ముఖ్యమైన పరిశ్రమ రైల్వే దాదాపు 20,000 మంది కార్మికులు పని చేస్తున్నారు. రైల్వే వర్క్ షాపులు రాజమండ్రి, బెజవాడ, బిట్రగుంట, దొనకొండ, గుంతకల్లులలో ఉన్నవి.… …."

2. "…. ….యం. యస్. యం. రైల్వే పని వారల యూనియను బ్రాంచి 1929 సంవత్సరాన బెజవాడలో ఏర్పాటు గాబడి పనిచేయుచున్నది. యూనియన్‌లో సభ్యత్వం ఎక్కువగా ఉన్నప్పటికీ 1932 లో జరిగిన సమ్మె విఫలం అయినందున యూనియన్ బలహీనపడింది. 1936 నుండి అభివృద్ధి చెందుతూ వచ్చి 1938లో రాజమండ్రి, బిట్రగుంటలలో కూడ బ్రాంచీలు ఏర్పాటు చేయగల్గింది. సభ్యత్వం 2500.… …."

3. " … … . రైల్వే యూనియన్ సంస్కరణవాదుల చేతుల్లో ఉన్నా, పార్టీ సభ్యులు పని చేశారు. యూనియన్ అభివృద్ధి చెందింది. రాజకీయ చైతన్యం తగినంత వృద్ధిగాక పోయినా, ట్రేడ్ యూనియన్ చైతన్యం వృద్ధి చెందింది "

1937 ప్రాంతాల కార్మికుల యూనియన్లను ఏర్పరచడమే ఎంత కష్టంగా ఉండేదో తెలుసుకోవాలంటే ఒక ఉదాహరణ చాలు. 1937 డిసెంబరు 26న భీమవరం రైల్వే స్టేషన్ వద్ద అయ్యగారి సుబ్బారాయుడి గారి అధ్యక్షతను సభ జరిగింది. కైకలూరు సెక్షన్ కార్మికులు అధికారులకు భయపడుతున్నారనీ, వారు ధైర్యంగా ఉండి సభలకు హాజరై యూనియన్ బలపరచుకో వలసిందిగా సుబ్బారాయుడు గారు ఉద్బోధించారు.

గుంతకల్‌లో కూడా పోలీసులు యూనియన్‌లో చేరిన వారెని బెదరించారు. సర్కిల్ ఇన్‌స్పెక్టరు ఆజ్ఞ ప్రకారమే తాము అలా చేస్తున్నామని వారంటున్నారు

ఇలాంటి పరిస్థితులే చాలా ఉండేవి. అయినా వీటిని ఎదుర్కొంటూ బెజవాడ, రాజమండ్రి, గుంతకల్లు, బిట్రగుంట కేంద్రాలలో రైల్వే కార్మికులను సంఘటిత పరచి వారి సమస్యల పరిష్కారానికి ప్రచారం ఆందోళనా కార్యక్రమాలు నిర్వహిస్తూ కమ్యూనిస్టు కార్యకర్తలు ముందంజ వేసారు. వివిధ కేంద్రాలలోని పరిస్థితులు వాటిని ఎదుర్కొని రైల్వే కార్మికోద్యమం ఏవిధంగా అభివృద్ధి చెందింది వివరంగా తెలియచేస్తున్నాం.

## బెజవాడ :

బెజవాడ బ్రాంచిలో టింకర్, క్యారేజి క్లీనర్ ఉద్యోగుల ప్రమోషన్లలో చాలా అన్యాయాలు జరుగుతున్నాయి. సర్వీస్ లెక్కచేయకుండా ఇంగ్లీషు చదువునూ, పనితనం చూసి ఇస్తున్నామని అధికారులు అంటున్నారు. ఇంగ్లీషు వచ్చిన ఇంజన్ క్లీనర్ల గురించి పట్టించుకోవడం లేదు. ఈ విధంగా ప్రమోషన్లు దొరల దయా దాక్షిణ్యంపై ఆధారపడివుంది. ఇది 1938 జూలైలో పరిస్థితి.

యన్. జి. రంగాగారు కేంద్ర శాసనసభలో ప్రవేశపెట్టిన కార్మిక బిల్లుకు మద్దతుగా, బెజవాడ రైల్వే వర్కర్సు యూనియన్, ప్రెస్ వర్కర్సుయూనియన్ కలిసి 1938 జూలై 17న పెద్ద ఊరేగింపు జరిపారు. మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం కూడా కార్మిక శాసనం చేయాలని తీర్మానించారు. ఏలూరు, బందరులలో కూడా ఇలాంటి సభలు జరిగాయి. 12-8-38 న కూడా బెజవాడలో యమ్.యస్.యమ్. రైల్వే పనివారలు వి. వి. నరసింహంగారి అధ్యక్షతను సమావేశమై రంగాగారి బిల్లును సమర్థించుతూ ఆందోళన చేయాలని తీర్మానించారు.

హమాలీలు :- ఈ సభలో హమాలీల కష్టాల గురించి వివరించారు. ట్రావెలింగ్ హమాలీల కష్టాలు ఎక్కువయ్యాయి. జీతం కొద్ది, క్వార్టర్సు లేవు. ట్రావెలింగు ఎలవెన్సు లేదు. బయట ఊళ్ళు వచ్చినపుడు పడుకునేందుకు సదుపాయాలు లేవు రాత్రింబగళ్ళు కుటుంబాలను వదలి గూడ్సు బళ్ళలో ప్రయాణం చేస్తూ కాలం గడపాలి. అధికారులకు చెప్పినా లెక్క చేయడం లేదు. ఇతర రైల్వేలలో యిచ్చే కొద్ది సౌకర్యాలు కూడా వారికి ఇక్కడ ఇవ్వడం లేదు.

8-9-38 న శాసన సభ్యులు వి. వి. నరసింహంగారి అధ్యక్షతను రైల్వే కార్మికుల సభ జరిగింది. జొన్నలగడ్డ రామలింగయ్య తదితర వక్తలు కార్మిక సంఘాన్ని బలపర్చుకోవలసిందిగా ఉపన్యసించారు. రాజకీయ పోరాటంలో కార్మికులుకూడా పాల్గొనాలని చెప్పారు. రైల్వే సమ్మెలో తొలగించబడిన వారిని తిరిగి చేర్చుకోవాలని కోరుతూ తీర్మానం చేశారు. కార్మికులను తొలగించిన అధికారుల చర్యలను గర్హించారు

1938 జూలైలో బెజవాడ జిల్లా (రైల్వే జిల్లా) కలెక్టర్లకు కొందరు అధికారులు సంజాయిషీ నోటీసు లిచ్చారు. టికెట్ లేని వారిని పట్టుకొని డబ్బు వసూలు చేయడం లేదని, అదనపు లగేజీకి చార్జి చేయడం లేదని వారిపై ఆరోపణ. వీరి ఒత్తిడికి లొంగి ప్రయాణీకులపై చర్య తీసుకుంటుంటే వారు డి. టి. యస్. కు తమను ఇబ్బంది పెడుతున్నట్లు ఫిర్యాదు చేశారు. ఆయన తిరిగి టికెట్ కలెక్టర్లపై కఠిన చర్యలు తీసుకోవడం, తరచు బదలీలు చేయడం ప్రారంభించాడు. దీనితో వీరిలో అసంతృప్తి పెరిగింది.

22-1-39 న యం.యస్.యం. రైల్వే బెజవాడ శాఖ రైల్వే వర్కర్లు, ప్రెస్ కార్మికుల యాజమాన్యాన బొంబాయి కార్మిక చట్టానికి నిరసన దినం పాటించబడింది. ప్రెస్ వర్కర్సు యూనియన్ ఆఫీసు నుండి ఎర్ర జండాలతో ఊరేగింపు జరిగింది. "బొంబాయి కార్మిక చట్టం నశించాలి" అంటూ నినాదాలతో వీధులలో తిరిగి, రైల్వేమైదానికి వచ్చారు. తర్వాత షేక్ రహీంతుల్లా అధ్యక్షతను బహిరంగ సభ జరిగింది. ఆర్. వి. సుబ్రమణ్యం, కె. ఎల్. నరసింహం, తోట నర్సయ్య, జె అప్పలస్వామి గార్లు ఉపన్యసించారు.

యం యస్.యం. రైల్వే బెజవాడ శాఖ వార్షిక సమావేశం 1939 మార్చి 29, 30 తేదీలలో బెజవాడలో జరిగింది. 29 వ తేదీన 'లేబర్ ర్యాలీ' జరిగింది. వి వి. నరసింహం గారు (శాసన సభ్యులు) కార్మిక జండాను ఎగుర వేశారు ఆర్. వి. సుబ్రహ్మణ్యం ప్రతినిధులను ఆహ్వానించారు. యం. పున్నారెడ్డి గారు అధ్యక్షత వహించారు. వై. వి గోపాల్‌గారు వార్షిక నివేదికను సమర్పించారు. ఆ నివేదికలోని అంశాలు :

నెలకొకసారి కార్యనిర్వాహకవర్గం సమావేశమవుతూ వచ్చింది. రైల్వే పనివారల ఇబ్బందులను చర్చించి వాటి నివారణకు కార్యక్రమం రూపొందించేది. ప్రమోషన్లలో అన్యాయాలు జరిగినపుడు బహిరంగ సభల ద్వారా యూనియన్ ఆందోళన చేసింది. మొబైల్ గ్యాంగ్‌మెన్ నియామకానికి అసమ్మతిని తెలియ చేసింది. రైల్వే పనివారల కష్టాలను పై అధికారులకు విన్నవించింది. ఈ సంవత్సరం మొత్తం మీద 12 కార్యనిర్వాహక వర్గ సమావేశాలు జరిగాయి. 25 బహిరంగ సభలు జరిపారు ఇందులో 18 రైల్వే పనివారల ఇబ్బందులకు సంబంధించినవి. ఇవిగాక, మేడే, యుద్ధ ప్రతికూలదినం, బొంబాయి కార్మిక తగాదా చట్టానికి అసమ్మతి, మద్రాసు రాష్ట్ర కార్మిక శాసనం గురించి సభలు జరిగాయి.

ప్రతి సెక్షన్‌కు ఆర్గనైజర్లను పంపి ప్రచారం సాగించింది. కరపత్రాలను విరివిగా పంచింది. 4 పేజీల బులెటిన్ ప్రతి నెలా వెలువడింది. ఇందులో రైల్వే పనివారి ఇబ్బందులు, వారికి సంబంధించిన రూల్సును వివరించబడేవి. ప్రమాదకరమైన గాయాలు తగిలిన నల్గురికి సుమారు రూ. 600 చొప్పున నష్ట పరిహారం ఇప్పించింది. ఆఫీసులో ప్రతిరోజు అప్లికేషన్లూ, సంజాయిషీలు రాసి పెట్టి కార్మికులకు సహాయపడింది. కార్మికులు జబ్బుబడినపుడు స్టాఫ్ బెనిఫిట్ ఫండ్‌కు రాసి కొంత సహాయం ఇప్పించింది. అధ్యయన తరగతుల ద్వారా ఆర్థిక రాజకీయ పరిజ్ఞానాన్ని వృద్ధి చేసింది.

ఈ బ్రాంచి సభ్యత్వం 1127.

అధ్యక్షులు యం. పున్నారెడ్డిగారి ఉపన్యాసంలో కొన్ని ఆసక్తి కర విషయాలు వెల్లడించారు. అవి :-

"బ్రిటీషు వాళ్ళు మన దేశ రైల్వేలపై 800 కోట్ల రూపాయలు పెట్టుబడి పెట్టారు. దానికి వడ్డీ గ్యారంటీ వుంది. ఇక రైల్వే పరిశ్రమలోని 1800 మంది ఆఫీసర్ల జీతాలకు సాలీనా 3 కోట్ల రూపాయలు ఖర్చు పెడుతున్నారు. మిలిటరీ రైల్వేలకు మరో 3 కోట్ల రూపాయలు వెచ్చిస్తున్నారు. రైల్వే ఆదాయంలో ఈ ఖర్చులు పోనూ మిగతా దానిలో రైల్వే పని వారికి జీతాలిస్తున్నారు. ఆదాయం తగ్గిందనే నెపంతో వసతులు తగ్గించడమేగాక రిట్రెంచ్‌మెంటుకూడా చేస్తున్నారు. 1928లో ఉచిత గృహవసతి తగ్గించారు. 1935లో లక్షా 16 వేల మందిని పని నుండి తగ్గించారు. 8,17,000 నుండి 7,01,000కి తగ్గించారు జీతాలను నాల్గవ వంతుతగ్గించారు. ఈ సంవత్సర కాలంలో 1500 మైళ్ల రైల్వేలైనును అదనంగా వేశారు. ఫెడరల్ రైల్వే అథారిటీని. అమల్లోకి తేబోతున్నామని ప్రకటించారు. 1939 - 40 లో 2 కోట్ల 13 లక్షల రూపాయలు ఎక్కువ ఆదాయం వస్తుందని అంచనా వేసినా, కార్మికుల పరిస్థితి మెరుగుపరచలేదు. ఇరవై రూపాయలలోపు జీతం వచ్చే కార్మికులకు 100కి 97 మందికి ప్రావిడెంటు ఫండు లేదు.

నూటికి నూరు మందిని యూనియన్ సభ్యులుగా చేర్చాలని, అఖిల భారత రైల్వే పనివారల సమాఖ్యను బలపరచాలని అధ్యక్షులు ఉద్బోధించారు.

24-6-39 న యం యస్ యం. రైల్వే పని వారల యస్. రాజ గోపాలయ్యర్ అధ్యక్షతను సమావేశమై గ్యాంగ్ పనివారలపై జరుగుచున్న దౌర్జన్యాలను ఖండించింది. ప్రత్యేకించి భీమవరం పి డబ్ల్యు. ఇన్‌స్పెక్టరు గ్యాంగ్ పనివాళ్ళను కొట్టుట, బూతుల తిట్టుట, ఆబ్సెంటు మార్కు వేయుట, పనిలోకి రానీయకుండా నిరాకరించుట - మొదలైన దౌర్జన్యాలు సాగించుతూ వచ్చాడు. ఇతనిని బదిలీ చేయాలని ఈ సమావేశం కోరింది.

మద్రాసులో కార్మిక శాసనాన్ని రూపొందించుతున్న కాంగ్రెస్ మంత్రి వర్గాన్ని అభినందించుతూ మరో తీర్మానం చేసింది. మద్రాసు రాష్ట్ర ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ సూచనలను ఈ శాసనంలో ఇమడ్చాలనీ, ఆగస్టులో శాసనాన్ని తీసుకురావాలని సమావేశం కోరింది.

1939 జూలై 22 న యం. యస్. యం. రైల్వే కార్మికుల యూనియన్ బెజవాడ శాఖ ఆధ్వర్యాన బహిరంగ సభ జరిగింది. నారాయణ సింగ్ అధ్యక్షత వహించారు.

పి. సుబ్బరామయ్యగారు, 20-7-39 న రైల్వే బోర్డుకు ఆలిండియా రైల్వే ఫెడరేషన్‌కు జరిగిన సమావేశం గురించి పత్రికలలో వచ్చిన వార్తలను సభ్యులకు వివరించారు. ఫెడరేషన్ న్యాయమైన కోర్కెలను రైల్వే బోర్డు తిరస్కరించిందన్నారు. కొద్ది జీతాల వారికి ప్రావిడెంటు ఫండ్ సౌకర్యం లేకుండా చేయడాన్ని విమర్శించారు.

రహింతుల్లాగారు మాటాడుతూ కొత్తగా ఉద్యోగాల్లో తీసుకొనే వారికి సంబంధించిన రూల్సు, ప్రమోషన్ రూల్సు పొరపాట్లుగా ఉన్నాయని, సవరించాలనీ అన్నారు. మరికొందరు మాట్లాడిన తర్వాత క్రింది తీర్మానాలు ఆమోదించబడ్డాయి:—

1. బెజవాడలో తక్కువ జీతపు పనివారి విషయంలో, ముఖ్యంగా బొగ్గు కూలీల విషయంలో - కొత్త వారిని పనిలో పెట్టుకొనే సందర్భంలోనూ, ప్రమోషన్‌కూ సంబంధించి అమలు పరచే రూల్సును ఈ సమావేశం నిరసించుతుంది. ఇకనైనా అధికారులు తమ పద్ధతులు మార్చుకోవాలి. అలా మార్చుకొండని పనివారికి, యజమానులకు శ్రేయస్కరమని ఈ సభ వారు భావిస్తున్నారు

2. కొత్త వారిని చేర్చుకొనే విషయంలో రైల్వే పనివారల కొడుకులకు ఏ విధమైన ప్రాధాన్యం ఇవ్వలేదు. రిక్రూట్‌మెంటు రూల్సు చాలా వ్యత్యాసంతో ఉన్నాయి. ఆ వ్యత్యాసాన్ని పోగొట్టాలి. తద్వారా కాలుష్యం లేకుండా చేయాలి. అలా రూల్సును రూపొందించ వలసిందిగా ఏజెంటును ఈ సభవారు కోరుతున్నారు

3. పెడనలో చనిపోయిన ఒక కార్మికుని బదులు మరొకరిని నియమించలేదు. ఈ కారణంవల్ల ఆ శాఖ (పంపు పనివారు) లోని మిగతా వారిచే ఎక్కువ పని చేయిస్తున్నారు వారి ప్యాన్‌లు సరిగా ఇవ్వడం లేదు. వారి ఇబ్బందులను నివారించవలసిందిగా చీఫ్ ఇంజనీర్‌ను ఈ సభవారు కోరుతున్నారు.

రైల్వే కార్మికులలో కొందరికి ప్రావిడెంటు ఫండు సౌకర్యం కల్గించనందుకు నిరసనగా 21-8-39 న బెజవాడలోని యం. యస్. యం రైల్వే పనివారల ఆఫీసు నుండి ఊరేగింపు జరిగింది. "ప్రావిడెంటు ఫండు కావాలి". ''హెచ్చు జీతాలు కావాలి'' అనే నినాదాలతో రైల్వే కాలనీ అంతా తిరిగి రైల్వే మైదానంలో సభ జరిపారు. శాసన సభ్యులు వి.వి. నరసింహం గారు అధ్యక్షత వహించారు. కె. యల్. నరసింహం గారు అఖిల భారత రైల్వే పనివారల ఫెడరేషన్ ప్రావిడెంటు ఫండు రాబట్టేందుకు చేసిన కృషి వివరించారు.

పి సుబ్బరామయ్య మాట్లాడుతూ భారతదేశంలో 5,65,000 మంది రైల్వే ఉద్యోగులకు ప్రావిడెంటు ఫండు వసతి లేదన్నారు. దానికి సాలీనా 54 లక్షల రూపాయలు ఖర్చవుతుందని రైల్వే బోర్డు వాదన. 1 00 మంది ఆఫీసర్లకు సాలీనా 28 లక్షల రూపాయలు ఒక ప్రక్క ఖర్చుపెడుతూ మరో ప్రక్క 5,65,000 మందికి ఆ వసతి లేకుండా రైల్వే బోర్డు నిరాకరించు తున్నదని అన్నారు

బెజవాడ బ్రాంచి కార్యదర్శి ఆర్ వి. సుబ్రహ్మణ్యముగారు రైల్వే బోర్డు చర్యలను విమర్శించారు. తమ పెట్టుబడి క్రింద వడ్డీ రూపేణా 26 కోట్ల రూపాయలు, అరుగుదలకు 10 కోట్ల రూపాయలు, ఆఫీసర్ల జీతాలకు 3 కోట్ల రూపాయలు వెచ్చిస్తున్నారు. మిలిటరీ వారికి తక్కువ చార్జీల వల్ల కొంత తగ్గుతోంది. కాని రైల్వే కార్మికులు రిటైరు అయ్యేసరికి తిన తిండిలేని గతి పడుతోంది అని అన్నారు.

"ప్రావిడెంటు ఫండు వసతి కలుగజేయక పోతే పరిశ్రమలో శాంతి ఉండదనీ, అఖిల భారత రైల్వే పనివారల సమాఖ్య నిర్ణయించిన విధంగా ఎట్టి త్యాగాలకైనా కార్మికులు సంసిద్ధం కావాలని సభ వారు తీర్మానించారు.

## రా జ మ ం డ్రి

యం. యస్. యం రైల్వే కార్యస్థానం బెజవాడ తర్వాత రాజమండ్రిదే. ఇక్కడ 800 మంది కార్మికులు పని చేస్తుండేవారు. 1938 ఫిబ్రవరి నాటికి, ఇందులో 100 మంది డ్రైవర్లు, ఫోర్‌మెన్, క్లీనర్లు ఉన్నారు. ఈ ఉద్యోగాల్లో ఎక్కువమంది ఆంగ్లో-ఇండియన్లు, బాయిలర్ మేకర్సు, ఫిట్టరు, ఫిట్టర్ కూలీలు మేస్త్రీలు, క్లర్కులు కలిసి 500 మంది దాకా ఉంటారు. వారందరికి రోజువారీ కూలీ ఇస్తారు. ఆదివారం జీతం ఉండదు. సర్వీసు ఖాయంకాదు. జీతం పూచీ లేదు. ఎనిమిది గంటలు పని అయినా వోవర్ టైం చేయిస్తారు ఇందుకు నామ మాత్రం అలవెన్సు ఇస్తారు నెలకు 40 రూపాయలలోపు జీతం ముడుతుంది. పని శాతం ఇంటి అద్దె మినహా యిస్తారు చాలామంది టౌన్‌లోని అద్దె ఇళ్ళల్లో ఉంటున్నారు. క్వార్టర్సులోని బ్లాక్‌లలో ఒక్కొక్క బ్లాకుకు 12 కుటుంబాల చొప్పున మొత్తం 16 కుటుంబాలు నివసించుతూవుండేవి. రోజువారీ కూలీ చేసే కుటుంబాలకు ఒక గది, చిన్న వరండా ఉంటాయి ఆ గదిలో రెండు మంచాలు పట్టవు వరండాలో వంట చుట్టూ పిట్టగోడ, ముందు ఒక ద్వారం. బ్లాకు బ్లాకుల మధ్య పాయఖానా దొడ్లు ఇళ్ళు నేల మట్టానికి ఉన్నాయి. లోపల గచ్చుగాని రాయిగానిలేదు. వర్షాకాలం నీళ్ళు నిలిచి చెమ్మగా వుంటుంది. ఒకో కుటుంబంలో సభ్యులు 6 నుండి 10 మంది దాకా వార్ధక్యం వచ్చినవారు, విధవలై తల్లి తండ్రుల వద్దకు వచ్చిన వారి అవస్థ వేరే చెప్పనక్కర్లేదు.

రైల్వే క్వార్టర్సులో పరిశుభ్రత శూన్యం. బ్లాకుకూ బ్లాకుకూ మధ్యనున్న పాయిఖానాలు రోజు కొక్కసారి మాత్రం శుభ్రం చేస్తారు. కొన్ని బ్లాకుల వారికి పడక గదులకు ప్రక్కనే ఈ పాయిఖానాలున్నవి.

నీళ్ళు కూడా కొరతే. 161 మంది కుటుంబాలున్నాయి. సుమారు 1000 మంది జనాభా వుంటారు. అయినా వీరందరికి నాల్గు కొళాయిలు - అర అంగుళం ధార వచ్చేవి వున్నాయి.

రైల్వే కార్మికుల బిడ్డలకు అందుబాటులో ఎలిమెంటరీ స్కూల్సు లేవు. రైలు ఇంజన్లు వస్తూ పోతూ ఉండే రైల్వే లైన్ల మీదుగా పెద్ద స్టేషన్ వద్దనున్న మున్సిపల్ స్కూలుకు పోవాలి.

యం. యస్. యం. రైల్వే పనివారల రాజమండ్రి శాఖ రెండవ వార్షిక సమావేశం 26-4-39 న జరిగింది. యం. పున్నారెడ్డి అధ్యక్షత వహించారు. క్రొవ్విడి లింగరాజుగారు సభను ప్రారంభించారు. సంఘ కార్యదర్శి నివేదికను అనుసరించి 1937-38 లో సభ్యత్వం 720. 1938-39 సభ్యత్వం 793. లైన్ ఆర్గనైజరుగా వెంకట రమణయ్య పని చేశారు.

కార్మికుల కష్టాల గురించి యూనియన్ అర్జీల ద్వారా అధికారులకు తెలియ చేశాయి. ఈ సంవత్సరం 8 కమిటీ మీటింగులు, అత్యవసర సమావేశాలు జరిగాయి రైల్వే లైనులోని పలు కేంద్రాలలో చాలా సభలు జరిగాయి. బ్రాంచి ఆఫీసు నుండి కొంతకాలం బులెటిన్లు ప్రకటించబడ్డాయి. కాని, తర్వాత నిలిపివేయబడ్డాయి. తిరిగి బులెటిన్ ప్రచురించాలని కార్యదర్శి నివేదికలో సూచించాడు 1-4-39 నాటికి యూనియన్ వద్ద రూ. 122.7 3. నిల్వవుంది.

తుని ట్రాలీమెన్ ఒకరిని అసిస్టెంటు ఇంజనీరు ఇంట్లో జరిగిన దొంగ తనంలో అనుమానించి అతనిని బాధలు పెట్టగా అతడు యూనియన్‌కు లేఖ రాశాడు. విచారించి జోక్యం కలుగజేసుకునేందుకు ఒక కమిటీని సమావేశం నిర్ణయించింది.

## గుంతకల్లు

1938 జనవరి నాటికి గుంతకల్లు రైల్వే కార్మికుల పరిస్థితి అధ్వాన్నంగా వుంది. వారి మొరల్ని పై అధికారులు వినిపించుకోవడం లేదు ఇంజన్ షెడ్‌లో పనిచేసే స్వల్ప జీతగాండ్ర ప్రమోషన్ విషయంలో అనేక అన్యాయాలు జరుగు తున్నాయి. ఎనిమిది మంది కాల్ బాయ్సులోని ఇద్దరిని ఆఫీసులో పని చేయిస్తున్నారు. ఫిట్టరు కూలీలలో చాల మందికి ఇంగ్లీషు వచ్చినా, ముఖ్య బాధ్యతల్ని నెరవేరుస్తున్నా, వారికి ప్రమోషన్సు లేవు ఫిట్టరు అప్రెంటిస్‌లను కొత్తవారిని తీసుకుంటున్నారు. ఇంజన్ క్లీనర్ల పరిస్థితి ఘోరం. డి.యల్ ఒ. ఏ పూరైనా

వెళితే పెట్టెలు మోయాలి 8 గంటలు పని చేయాల్సి వుండగా 12 గంటలు పని చేయిస్తున్నారు. కాల్‌బాయ్స్‌గా, లైటర్స్‌గా పని చేయిస్తున్నారు ఇంజనీరింగు డిపార్టుమెంటులోని ఆర్టిజాన్ కూలీలకు బయట ఊళ్ళకు వెళ్ళితే అలవెన్సు ఇవ్వడం లేదు. సెలవులు ఫ్యాక్టరీ ఆఫ్ కూడా సరిగా ఇవ్వడం లేదు. రైల్వే పనివారల బ్రాంచి ఏర్పాటుకై కె యల్. నరసింహం 15 రోజులుండి మీటింగులు జరిపేవారు బ్రాంచి ఏర్పడింది సుమారు 100 మంది సభ్యులు చేరారు. 7-1-1938న జరిగిన 500 మంది హాజరైన సభలో జి. కృష్ణమూర్తి, కె యల్. నరసింహంగార్లు వర్గపోరాటం, వెడ్జివుడ్ రిపోర్టు, ఫెడరల్ అథారిటీ గురించి మాట్లాడారు గ్యాంగ్ తదితర కూలీలకు ప్రావిడెంటు ఫండ్ సెలవులు, ప్యాస్‌లు ఇవ్వాలని కోరారు. యూనియన్‌లో చేరిన వారిని పోలీసులు బెదరించు తున్నారు ఈ చర్యను వక్తలు విమర్శించారు. శాసన సభలో కార్మిక అనుకూల శాసనాలు చేయాలనీ. కాంగ్రెస్ సబ్ కమిటీ నిర్ణయించిన విధంగా శాసనాలు చేయించడానికి ప్రయత్నించుతానని కృష్ణమూర్తిగారన్నారు.

అఖిల భారత కార్మిక ఫెడరేషన్, రైల్వే బోర్డుతో సంవత్సరానికి రెండు సార్లు కలిసి కార్మికుల కష్టాల గురించి వివరించుతుంది. అయినా పాత ఉద్యోగులకు కొత్త జీతాల పద్ధతిని రైల్వే బోర్డు అన్వయించలేదు. రైల్వే ఉద్యోగులకు ప్యాస్‌లను తగ్గించినందుకు, ఆ విషయమై ఆందోళన చేయాలన్నారు. ఇంగ్లాండ్, కెనడాలో రైల్వే కార్మికులకున్న సౌకర్యాలను గురించి వివరించారు.

పాకాల, ధర్మవరం, రేణిగుంటలలో కార్మిక నాయకులు కార్మికులను యూనియన్‌లో చేరవలసిందిగా ప్రబోధించారు. అధికారుల స్టాఫ్ కమిటీలు, కార్మికుల ఐకమత్యం చెడగొట్టడానికి పనికి వస్తున్నాయిగాని కార్మికుల కష్ట నివారణకు తోడ్పటం లేదని అన్నారు.

## బిట్రగుంట

1938 జూలైలో బిట్రగుంటలో కార్మికుల పరిస్థితి శోచనీయంగా వుంది. రైల్వే కార్మికులకు సెలవులు దొరకడం కష్టం. ఫైర్‌మెన్, ఆగ్‌వాలకు అసలు సెలవులు ఇవ్వడం లేదు అగ్‌వాలాకు ఒకతనికి పెళ్ళికి కూడా సెలవీయ లేదు. తక్కువ మంది పనివాళ్ళున్న చోట్ల ఎక్కువ పని చేయించుతున్నారు. డ్రైవర్ ఆగ్‌వాలాను కొట్టిన లాంటి ఘటనలను రిపోర్టిచ్చినా విచారించే నాథుడు లేడు.

1939 ఆగష్టు 21 లో బిట్రగుంటలో ఊరేగింపు అనంతరం బహిరంగ సభ జరిగింది. రైల్వే కార్మికులందరికీ ప్రావిడెంటు హక్కును ఇవ్వాలనీ, 1931 తర్వాత పని నుండి తొలగించిన వారిని తిరిగి పనిలోనికి తీసుకోవాలనీ తీర్మానించారు. బిట్రగుంట రైల్వే షెడ్‌లో సెలవుల విషయంలో జవాబులే ఇవ్వడం లేదు.

కార్మికుల్ని కొట్టుట, తిట్టుట జరుగుతున్నదని ఈ విషయాలను విచారించి కార్మికుల కష్టాలను తొలగించాలని తీర్మానించారు.

1939 ఆగష్టు 28 న బి. వెంకటకృష్ణయ్య అధ్యక్షతన యం.యస్.యం. రైల్వే ఉద్యోగుల బహిరంగ సభ బిట్రగుంటలో జరిగింది. 17-8-39 న బొంబాయి కార్మిక నాయకులు డాంగే, మిరాజ్‌కర్, బోగ్లే, భిసే, పాట్కర్ మొదలైన వారిని అరెస్టు చేసినందుకు ఖండించుతూ, వారిపై మోపిన కేసును ఉపసంహరించుకోవాలని కోరారు. ఫోనిక్సు మిలు యజమానులపై ఒత్తిడి తెచ్చి, లాకౌట్ ఉపసంహరించుకొనేటటు చేయాలని కోరారు.

## విశాఖ హార్బర్ కార్మిక ఉద్యమం

1938 సెప్టెంబర్ నాటికే విశాఖపట్టణంలో డాక్ కార్మికుల సంఘం ఏర్పడింది. ఐనా తగినంత బలంగా లేదు. విశాఖ హార్బర్ కార్మికులు సుమారు 2000 మంది దాకా ఉంటారు.

విశాఖ హార్బర్‌లో 1938 నాటికి 10 ఏళ్ళనుండి మహమ్మద్ తురాబుద్దీన్ పనిచేస్తున్నాడు. క్రేన్‌లో ఆయిల్ వేయడం, డ్రైవ్ చేయడం వగైరా పనులన్నీ ఒకడే చూసుకోవాలి. 23-7-38 న అతడు ప్రమాదానికి గురి అయ్యాడు. తల క్రేను మధ్య పడి నలిగిపోయింది. చనిపోయాడు. 20 అడుగుల దూరంలో ఉన్న ఫైర్‌మెన్ ఈ దృశ్యంచూసి మూర్ఛపోయాడు. 25 వ తేదీన యూనియన్ సానుభూతి ప్రకటించింది. 3-8-38 న విశాఖ హార్బర్ కార్మిక సంఘ కార్యవర్గం సమావేశమై అతని కుటుంబానికి సహాయపడాలని తీర్మానించింది. ''ఇ'' చార్జి క్రేను పనిచేసేటపుడు బ్రేకులు సర్దుకొనుట చాలా కష్టం గనుక దానికి వేరే సిబ్బందిని పెట్టాలని యజమానుల్ని కోరినా వారందుకు సిద్ధపడలేదు. దానికి కార్యవర్గ సమావేశం అసమ్మతి తెలియచేసింది.

ఇ. ఇ. సెక్షన్ పనిలోని ఆరుగురు గేట్‌మెన్‌కు, నల్గురు ట్రాలీ మెన్‌కు ప్రతి సంవత్సరం ఇచ్చే యూనిఫారం (రెండు తల గుడ్డలు, రెండు చొక్కాలు) ఇవ్వలేదు. నాల్గు నెలలు జాప్యం చేసి చివరకు రెండు సంవత్సరాల కొకసారి ఇస్తామని చెప్పారు. ఓవర్ టైమ్ పనివ్వడం లేదు. గేట్‌మెన్ అని డిజిగ్నేషన్ ఉన్నా, గ్యాంగ్ పనికి పంపుతున్నారు.

1937 డిసెంబర్ 24 వ తేదీ సాయంత్రం హార్బర్ కార్మికులు, మాంగనీస్ కూలీలు, బస్తాలు మోసే కూలీలు దాదాపు 1500 మంది వర్క్‌షాప్ వద్ద చేరారు. ఎర్రజండాలు చేబూనారు. ''హార్బర్, పోర్టు కార్మిక సంఘానికి జై'' అంటూ నినాదాలిచ్చారు. మిలిటరీ బ్యాండ్ వాద్యాలతో ఊరేగింపు జరిపారు

మెడికల్ లీవ్ లేదని, ప్రివిలేజ్ లీవ్ లేదని, జీతాలు తగ్గాయని, 10-15 ఏళ్ళు చాకిరిచేసినా పర్మనెంటు చేయడం లేదనీ వారు నినాదాల ద్వారా తెలియచేసారు. 17 మందిని తొలగిస్తూన్నట్లు ఇటీవల నోటీసిచ్చారు. "రిట్రెంచ్‌మెంటు పోవాలి. నిరుద్యోగం పోవాలి. ధనిక వాదం నశించాలి. ఎర్ర జెండాకు జై" కూలీ సంఘానికి జై" అంటూ నినాదాలిచ్చారు "ఊరేగింపు అనంతరం బీచి ఒడ్డున సభ జరిగింది. తొలగించిన 17 మందిని తిరిగి తీసుకోవాలనీ, లేనిచో సమ్మెకు సిద్ధం కావాలనీ వక్తలు ఉద్బోధించారు.

1939 జనవరి నాటికి విశాఖ హార్బర్ సివిల్ ఇంజనీరింగ్ డిపార్టుమెంటులో 40 మంది మగవారు, 20 మంది ఆడవారు, 15 మంది పిల్లలు కార్మికులుగా పని చేస్తున్నారు. దాదాపు 8 సంవత్సరాలనుండి పనిచేస్తున్నా రోజు కూలీ రూ. 0-4-0 మాత్రమే. పర్మినెంటు కూలీలకు కూడా పబ్లిక్ సెలవులు, ఆదివారం సెలవులు లేవు. ప్రివిలేజ్ సెలవు మాత్రం 15 రోజులుంది కార్మికులు సెలవు పెడితే అధికారులు మంజూరు చేయడంలేదు. క్రిస్మస్‌కి హార్బర్ కార్మికులందరికీ ఆరు రోజులు సెలవులిచ్చినా పైన చెప్పిన కార్మికులకు నాగా వేశారు. ఇది తెలిసి 1938 డిసెంబర్ 28 వ తేదీన పోర్టు ఇంజనీరు వద్దకు వెళ్ళి, నాగా వేయవద్దనీ, ప్రివిలేజ్ లీవు క్రింద సెలవిమ్మనీ ఒక అర్జీని అందచేశారు. శని, సోమవారాలు ఈ సెలవులకు బదులుగా పని చేయాలని పోర్టు ఇంజనీరు అన్నాడు.

హార్బర్‌లో 15 సంవత్సరాలనుండి పనిచేస్తున్నా, ఒక సంవత్సరం క్రితమే పర్మనెంటు స్కేళ్లు అమలుపరచారు. కొందరు పనివాళ్లను తీసివేయడానికి, కొందరి జీతాలు తగ్గించడానికి పర్మనెంటు పథకాన్ని అవకాశంగా తీసుకొన్నారు. పర్మనెంటు స్కేళ్లు ఇవ్వడానికి డాక్టర్ పరీక్ష వుంటుంది. ఆయన "అన్‌ఫిట్" అని రాసేస్తే, పర్మనెంటు కాడు. బోర్డు ఇచ్చిన లిస్టు ప్రకారంగా డాక్టరు. కొందరిని అన్‌ఫిట్ అని రాస్తాడు. ఇదివరలో రు. 25 తెచ్చుకొనేవారు. పర్మనెంటు అయ్యాక రు. 20.0.0 ఇస్తున్నారు. 15 ఏళ్ల సర్వీసు ఉన్నా ఇటీవలే పనిలో చేరినట్లు సంతకాలు పెట్టించుకొంటున్నారు కొన్ని సెక్షన్ల వాళ్లు తెలియక సంతకాలుపెట్టారు. "స్టోర్‌వెన్" కార్మికులు మోసం గ్రహించి 200 మంది సంతకం పెట్ట నిరాకరించారు. హార్బర్ అధికార్లకు ఈ విషయం యూనియన్ రాసింది దానిపై సంబంధిత ఉద్యోగులను అధికారులు సంజాయిషీ అడిగారు.

1939 నూతన సంవత్సరంలో విశాఖ హార్బర్, పోర్టు కార్మిక సంఘానికి అధికారులు నూతన సంవత్సర శుభాకాంక్షలు పంపారు. ఎన్నడూ లేని దయ ఎందుకో వారు అన్ని సెక్షన్లలోను అంటించిన నోటీసులే తెలియ చేస్తున్నాయి. "మికెవ్వరికి రిట్రెంచిమెంటులేదు. నష్టపరిహారాలకై బయటివారి సహాయం

కోరకండి. మీ డబ్బు వృధాగా ఖర్చుచేయకండి, యూనియన్ చందా చెల్లించ కండి, ఈ సంవత్సరంలో మీ జీవితం అభివృద్ధి చెందుతుంది."

ఈ నోటీసు ద్వారా కార్మికులు యూనియన్‌లో చేరకుండా ఉండేందుకు అధికారులు ప్రయత్నించారు. జనవరి ఆరవ తేదీన యూనియన్ సమావేశమైంది. అన్ని సెక్షన్లలోని కార్మికులు పవర్ హౌస్ వద్ద చేరారు. బ్రహ్మాండమైన ఊరేగింపు సాగించారు. ఈ నెలలోనే యూనియన్ సభ్యత్వం చందా అందరూ చెల్లించాలని తీర్మానించారు. తర్వాత అలాగే చెల్లించి అధికారుల ఎత్తుగడలను ప్రతిఘటించారు.

## కాకినాడ రేవు కార్మికులు

కాకినాడలో హార్బర్ లేదు. అయినా తీరం వెంట ఓడలు వస్తూ పోతూ ఇక్కడ ఆగుతాయి ఇక్కడ స్టీమర్లలో పనిచేసే కార్మికులు సుమారు 2,000 మందిదాకా ఉన్నారు. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ కార్యవర్గం 1938 అక్టోబర్ 2, 3, 4 తేదీలలో సమావేశమైనపుడు ఈ కార్మికులను సంఘటితపరచి, యూనియన్‌లోచేర్చి వారి ఇబ్బందుల నివారణకై కృషి చేసేందుకు ఒక కమిటీని నియమించింది.

అయితే ఓడరేవు వద్ద ఎగుమతి, దిగుమతి కార్యక్రమాల్లో పాల్గొనే కార్మికుల సంఖ్య క్రమంగా 3,000 దాకా పెరిగింది. 1938 నవంబరులో వీరి జీత బత్తాలిలా వున్నాయి. పగలు పన్నెండు గంటలు పనిచేసే 8½ అణాలు, రాత్రి 12 అణాలు కూలి యిచ్చేవారు. తండేలుకు పగలు 10 అణాలు రాత్రి 1½ రూపాయి ఇచ్చేవారు. అనేక విధాల జీతాల్లో కోత ఉండేది.

కార్మికులకు ప్రమాదం జరిగినా నష్టపరిహారం ఇచ్చేవారు కాదు. ఒక కార్మికునికి కాలిమడుమ విరిగింది. మరో కార్మికుని వేలు తెగిపోయింది. అయినా వారికి నష్ట పరిహారం ఇవ్వలేదు.

1938 అక్టోబరు 26వ తేదీన కాకినాడ కార్మికులు సుమారు 1000 మంది యూనియన్ ఏర్పరచుకొన్నారు తమ కనీసకోర్కెల్ని ఈ విధంగా ప్రకటించారు.

1. కాకినాడ సముద్రం ఒడ్డు నుంచి, లోన స్టీమర్ వరకు వెళ్ళే పడవలలో, ప్రభుత్వం నిర్దేశించిన మేరకే కార్మికులను ఎక్కించి తీసుకువెళ్ళాలి. పడవల్ని శుభ్రంగా ఉంచాలి. పడవ కేవును కూలీల కూలినించి మినహాయించ కుండా కేవు కంపెనీ భరించాలి.

2. కాకినాడ ఒడ్డు వదలి తిరిగి ఒడ్డు చేరేలోగా కార్మికులకు ఆరోగ్యకర మైన చాలినంత భోజనం పెట్టాలి. వంటచేసే స్థలం, భోజనాలు చేసే స్థలం, విశ్రాంతి స్థలం శుభ్రంగా వుంచాలి. స్నానానికి సరియైన వసతి చూపాలి. అన్ని

వేళలా మంచి నీటి సప్లై ఉండాలి. ఉదయం భోజన సమయానికి ఒక గంట, మధ్యాహ్నం భోజన సమయానికీ విశ్రాంతికి రెండు గంటలు సెలవివ్వాలి. ప్రతి స్టీమరుకు అనుభవం గల డాక్టర్ ఉండాలి. జబ్బుచేసినా ప్రమాదం జరిగినా కంపెనీలే వైద్య సహాయం చేయాలి. ఆ కాలంలో అవే ఆహారం సప్లై చేయాలి.

3. ప్రమాదం జరిగినపుడు "వర్క్స్‌మెన్స్ కంపెన్‌జేషన్ యాక్టు" ప్రకారం నష్టపరిహారం యివ్వాలి.

4. ఇతర రేవులలో కంపెనీలు ఇస్తున్న కూలికి తక్కువ గాకుండా ఇక్కడ కూలి హెచ్చించాలి. దుబాష్ కంపెనీలకు,దుబాషీలకుగాని,తండేళ్ళకుగాని మరి యే ఇతర మధ్య వర్తులకుగాని కూలీల జీతాన్ని యివ్వరాదు.నిర్ణయించబడిన కూలీ నుండి ఎట్టి అక్రమ వసూళ్ళు చేయరాదు. పని పూర్తి కాగానే సరాసరి కరెనీ ఉద్యోగులే ఏ కూలీ యొక్క కూలీని అతనికే పూర్తిగా ఇవ్వాలి. క్రేన్ డ్రైవింగ్ మొదలైన కష్టమైన పనులకు రెట్టింపు కూలీ యివ్వాలి. క్రేన్ డ్రైవింగులాంటి కష్టమైన పనులకు రెట్టింపు కూలి యివ్వాలి. పగలు 8 గంటలకు మించి పనిచేసిన కాలాన్ని, రాత్రి కాలాన్ని ఓవర్ టైమ్‌గా లెక్కించి, రెట్టింపు కూలీ యివ్వాలి. వంట, మంచినీటి సప్లై మొదలైన పనులకు ప్రత్యేకంగా మనుష్యుల్ని కేటాయించాలి. వారికి కూలీలతో సమానంగా కూలీ యివ్వాలి.

5. కాకినాడ ఒడ్డు నుంచి స్టీమర్ చేరేవరకు, పని పూర్తి అయిన తర్వాత స్టీమర్ నుండి తిరిగి ఒడ్డు చేరేవరకుగల సమయంలో, స్టీమర్ ఆలస్యంగా వస్తే, ఆలస్యమైన కాలానికి కూడా సగటు రేటు కూలీ యివ్వాలి రోజుకి పగలు 8 గంటలు మాత్రమే పనిచేయాలి. పగటి కూలీ రూ. 0-12-0 గాను, రాత్రి కూలీ రూ. 1-8-0 గానూ ఉండాలి.

6. కూలీ సంఘాన్ని కంపెనీ యజమానులు గుర్తించాలి.

## ప్ర మా దా లు

29-12-38 న 'ఓడలో ఒక కార్మికుని చేతులు నలిగిపోయి హాస్పిటలులో చేర్చబడ్డాడు. బి.ఎ. కంపెనీ ఓడలో స్లింగ్ మీద పడి పక్క ఎముక జారిన ఒక కార్మికుని ఇదివరలో ప్రమాదంలో దెబ్బతిన్న బోని అప్పలస్వామికి నష్ట పరిహారం కోసం యూనియన్ కృషి చేసింది. గాడిశెట్టి నూకయ్య పై రెండు బస్తాలు పడి ఎడమ కాలికి దెబ్బ తగిలింది.

కృష్ణ అనే యువకుని కుడిచేయి మధ్యవేలు ప్రమాదంలో కమిలిపోయింది. ఓడ డాక్టర్ నిర్లక్ష్యం చేస్తే ఆ కార్మికుడు "నేను యూనియన్ సభ్యుణ్ణి. నాకు చికిత్స చేయాలి" అని గట్టిగా అరచి, డాక్టరు చికిత్స చేసేటట్లు ఒత్తిడి పెట్టాడు. యస్. కృపానందం, ఎద్దు రాములు, బోని పద్దయ్యలకు దెబ్బలు తగులగా లేబర్

కమీషనర్ రిపోర్టు కేసు లేకుండానే నష్టపరిహార వ్యవహారం పరిష్కరించబడింది. తప్పిపోయిన పులవకొరు స్వామి అనే కార్మికుణ్ణి, లర్వీ కంపెనీకి టెలిగ్రామ్ ఇచ్చి రప్పించారు.

23-12-38 న 'రిండా' అనే ఓడపై 1938 నవంబరు 1 న హేచ్ వద్ద ప్రమాదం జరిగింది. చీకటిలో 12 గజాల ఎత్తునుండి పడి రావాడ రామస్వామి అనే కార్మికుడు ప్రమాదానికి గురై మరణించాడు. రాయ్ అండ్ చటర్జీ కంపెనీలో ఇతడు పని చేస్తూండేవాడు. 26 వ తేదీన శవంపై ఎర్రజండా చుట్టి 200 మంది స్త్రీ పురుషులు మౌనంగా ఊరేగారు. ఇదివరలో ఇలా ఎవరూ ప్రదర్శన జరుప లేదు. ఈయన కుటుంబానికి నష్టపరిహారం కోసం కంపెనీతోనూ, కంపెనీ హెడ్ ఆఫీసుతోనూ, ట్రేడ్ యూనియన్ కమీషనర్‌తోనూ ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపింది యూనియన్.

1939 జనవరిలో లరీవ్ కంపెనీలో యజమానులకు, కూలీలకు 5 గంటల కూలీ విషయం పేచీ వచ్చింది. ఐక్యమత్యంతో కార్మికులు తమ కూలీని రాబట్టు కొన్నాయి. రోజుకి 14 అణాల కూలీని రూ. 1-8-0 కి యాజమానులు పెంచారు. 20 శేర్లు బియ్యం కూడా శాంక్షన్ చేశారు.

యూనియన్ తమ సభ్యులకు సభ్యత్వ వివరాలుగల ఎర్రని టికెటు పంచి పెట్టింది. అందులో సభ్యుని పేరు, చేరిన తేదీ, ఏ నెలలో ఎంత చందా చెల్లించినది కార్యదర్శి సంతకంతో వివరాలున్నాయి. 3 నెలలకు సరి పోతుందీ టికెట్టు. ఈ విధంగా యూనియన్‌లో సభ్యత్వం చేర్పించుటలో ప్రోత్సాహం కలిగించింది. స్టీమర్‌లో పని చేసే ట్రాలీ గుమాస్తాలను, సూపర్‌వైజర్లను ఇతరులను సభ్యులుగా చేర్చుకోడానికి, ఓడలు రాని రోజున మీటింగు పెట్టి సభ్యుల్ని చేర్చుకోవాలని నిర్ణయించింది.

ఇలా కార్మికులు యూనియన్‌ను బలపర్చుకుంటూ వుండగా, చటర్జీ దుబాష్ కంపెనీ, పాత మేస్త్రీలను కొందర్ని తొలగించి, కొత్తవారిని పెట్టుకొంది. పాత వారిని పనిలో పెట్టుకోవాలని తక్కిన మేస్త్రీలు ఆందోళనా చేశారు. కొత్తగా చేరిన వారు కూడా యూనియన్‌లో చేరి, పాత మేస్త్రీలు, కొత్త మేస్త్రీలు కలిసి వంతుల వారిగా పని చేయాలని పాత మేస్త్రీలు కోరుతున్నారు. యూనియన్‌లో చీలికలకు కంపెనీ ప్రయత్నించుతోంది.

## కాకినాడ స్టీవ్‌డోర్ కార్మికుల సమ్మె

1939 జనవరి 30 నుండి కాకినాడలో స్టీవ్‌డోర్ కంపెనీకి చెందిన 2,000 మంది కార్మికులు సమ్మె చేశారు. కాకినాడ స్టీమర్ బోట్ కార్మిక సంఘం తమ ఇబ్బందులను తీర్చవలసిందిగా 1938 నవంబరు 16 న యజమానులకు తెలియ

జేశారు. నవంబరు 30 న మరొక రిమైండర్ పంపారు. అయినా సమాధానం లేదు. అందుచే కార్మిక సంఘ సర్వ సభ్య సమావేశం ఈ క్రింది కోర్కెలను తెలియ చేస్తూ తీర్మానించింది.

1. రోజుకి రూపాయి కూలీ గతంలో రూ. 0-8-6 ఇచ్చేవారు. రాత్రిళ్ళు రెండు రూపాయలు ఇవ్వాలి. లేదా రాత్రిళ్ళు గంటకు రెండణాలు యివ్వాలి.

2. తండేళ్ళు, వాచ్‌మెన్, గాంగ్‌బాయిన్ రోజుకు రూపాయన్న, రాత్రిళ్ళు మూడణాలు కూలీ యివ్వాలి.

3. ఒడ్డు విడిచినది లగాయతు తిరిగి కూలీ ఒడ్డు చేరేవరకు మధ్య కాలాని కంతకు ఈ రేటు చొప్పున కూలీ ఇవ్వాలి.

4. బియ్యంగాక ఇతర సామాగ్రి కింద రేషన్‌కు రూ. 1-4-0 ఇవ్వాలి. మేస్త్రీలు ఈ సామాగ్రిని కొంత అపహరిస్తున్నారు. ఈ పద్ధతిని అరికట్టాలి. త్రాగే నీరు సప్లయి చేయాలి.

5. భోజన కాలానికి విశ్రాంతి గంట ఓవర్‌టైమివ్వాలి.

6. యూనియన్‌ను యజమానులు గుర్తించాలి.

7. స్టివ్‌డోర్ కంపెనీ ఏంజట్లు, మేస్త్రీలు కార్మికుల కూలీని కొంత అపహరిస్తున్నారు. ఈ పద్ధతిని రద్దు చేయాలి.

8. ఓడమీదికి కూలీలను తీసుకు వెళ్ళేటపుడు, తీసుకువచ్చేటపుడు బోటుగాకుండా స్టీమ్ లాంచి మీదనే కార్మికుల్ని తీసుకు వెళ్ళాలి.

9. ప్రతి గ్యాంగ్‌కీ 20 మందికి తక్కువ గాకుండా వుండాలి.

ఈ పై కోర్కెల్ని యజమానులు అంగీకరించనందున సమ్మె జరిగింది.

సమ్మె చెడగొట్టడానికి కంపెనీలు చేసిన నీచ ప్రయత్నాలు అన్నీ వ్యర్థమయ్యాయి. పేటల్లో సారాబుడ్లను పంపినా లాభం లేకపోయింది. ప్రతి పేటకు సమ్మె కమిటీ ఏర్పడింది. ఇలా ఇరవై సమ్మె కమిటీ లేర్పడ్డాయి. వందమందితో వలంటీరు దళం ఏర్పడింది. తండేళ్ళు మేస్త్రీలుతో సహా సమ్మెలో చేరారు. మొదటి రోజు రెండు వేలమంది సమ్మె చేశారు. జనవరి 31 న కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ నాయకత్వాన పెద్ద ఊరేగింపు జరిగింది. "హెచ్చు కూలీ కావాలి" "ఆకలి మంటలు తీరాలి" "సమ్మెలో చేరాలి"అనే నినాదాలతో ఎర్రజండాలతో ఊరేగారు. కాకినాడ నగరమంతా చైతన్యంతో ఉర్రూతలూగింది. "సమ్మె జరపండి జయిస్తారు" అని అన్ని శాఖల కూలీలు భరోసా యిచ్చారు. ప్రతి కూలీ పేటకు ఊరేగింపు వెళ్ళింది. వీధి మూలల్లో మీటింగులు జరిగాయి. సి.వి.కె. రావు, కొరపాటి, యస్.వి. రత్నం, వీరయ్య, పి. వెంకటేశ్వర రావు సభలలో ప్రసంగించారు. వలంటీర్లు ప్రతి రేవు దగ్గరా, పల్లె దగ్గరా

కాపలా కాస్తూ వున్నారు. రెండవ రోజు మరో 1000 మంది మగ కూలీలు, 800 మంది కార్మిక స్త్రీలు సమ్మెలో చేరి ఊరేగారు. యూనియన్ కరపత్రాలు పంచిపెట్టింది.

''లరీవ్'' కంపెనీ భీమునిపట్నంనుండి మాయచేసి 125 మంది కూలీల్ని తెప్పించింది. తమ కోట్లలో ఖైదీలవలె నిర్బంధించింది. విశాఖ హార్బర్ పనివారి యూనియన్‌కు వారిని రాకుండా తప్పించవలసిందిగా కాకినాడ యూనియన్ కోరింది. కాని ఈ వార్త అందక పూర్వమే వారు వచ్చేశారు అయితే ఒక కర పత్రం అచ్చువేసి వారున్న ఓడమీదికి కంపెనీ పెట్టే ఆటంకాలను అధిగమించి కార్మికులు పంచిపెట్టారు. భీమునిపట్నం కార్మికులు తాము తెలియకవచ్చామని అన్నారు. 2 వ తారీఖున వారిని ఓడమీదినుంచి రప్పించి కంపెనీవారు గుర్రపు శాలలో దాచి పోలీసు కాపలా పెట్టారు. 1 వ తేదీన 6,000 మంది ఆడ, మగ కూలీలు లేచర్ల పేటనుండి, చెంకిపేటనుండి మెయిన్‌రోడు మీదుగా ఏటి వారగా రేవుదగ్గర ఒక మైలు పొడవున బారులు దీరి కూర్చున్నారు. మరుసటి రోజుకూడా ప్రదర్శన జరిపారు. లరీవ్ కంపెనీ దగ్గర ఆడ కూలీలు ''అన్నం పెట్టండి'' అంటూ నినాదాలిచ్చారు. తల్లుల చంకల్లోని పిల్లలు ఆకలితో గోలపెట్టారు.

కంపెనీ వాళ్ళు 144 సెక్షన్ విధించవలసిందిగా కలెక్టరును అడిగారు. సమ్మె శాంతంగా జరుగుతోంది, అవసరం లేదని కలెక్టరు జవాబిచ్చాడు శాంతి యుతంగా పికెట్ చేసుకోడానికి కలెక్టరు అనుమతించినా, భీమునిపట్టణం కూలీలకు పోలీసులు కాపలా ఉన్నారు. సమ్మె చేసే మహిళా కార్మికులను తుపాకులతో కాలుస్తామని బెదిరించారు. గుర్రపు శాలలో దాచిన ఈ కార్మికులకు పోలీసులు కాపలా కాచారు. అయినా భీమునిపట్టణం వచ్చిన గ్యాంగ్‌మెన్ కూలీలు కొందరు సమ్మెదార్లతో కలిసిపోయారు. ఇలాగే కోరమాండల్ కంపెనీ కూడ ఒడ్ర కూలీలను ఓడమీద తీసుకు వచ్చింది. పికెట్ చేస్తున్న తెలుగు కూలీల భాష తెలిస్తే మనస్సు ద్రవించి వెళ్ళిపోతారని, ఒడ్ర కూలీలను తెచ్చింది. సమ్మె చేస్తున్న కార్మికుల పట్టుదల ముందు రాయ్ చటర్జీ కంపెనీ ఆటలు సాగ లేదు. సారాసీసాలతో తిరిగినా కూలీలు దొరకలేదు. రెండవ తేదీ రాత్రి యూనియన్‌కు కబురు చేసి పగలు రు. 0-12-0 చొప్పున రాత్రి రు. 1-00 చొప్పున కూలీ ఇస్తామని తెలియజేసింది. యూనియన్ అంగీకరించలేదు. చివరకు యూనియన్ షరతులన్నింటినీ అంగీకరిస్తూ, రాత మూలకంగా కలెక్టరు సమక్షంలో సమ్మె పరిష్కరించుకొన్నారు. చిట్టచివరి వరకు సమ్మెను భగ్నం చేయటానికి యజమానులు విశ్వ ప్రయత్నం చేశారు. సమ్మె ముగియకముందే కంపెనీ ఏజంట్లు ప్రక్క గ్రామాలకు వెళ్ళి, ''సమ్మె ముగిసింది. ఎక్కువ

మంద కావాలి" అంటూ దొంగ కూలీలను రిక్రూట్ చేయడానికి చేసిన ప్రయత్నాన్ని కార్మిక వాలంటీర్లు నిరోధించారు. వారిని రాకుండా ఆపు చేశారు. పేటలలో కుల కక్షలు రేపితే సోషలిస్టులు (కమ్యూనిస్టులు) వివరించి ఐకమత్యం సాధించారు.

కంపెనీలోని ఇతర కార్మికులను పని చేయాలని ఒత్తిడి చేసి బెదిరించినా, సమ్మె చేసే కార్మికులకు కూడా విషయాన్ని వివరించి ఐకమత్యం సాధించారు.

కంపెనీ ఏజంట్లు, ఓడలు రాకముందు రెండు మూడు రోజుల ముందే వేరే పనులకని పిలిపించి రహస్యంగా బంధించగా, వారి ఆచూకి తెలుసుకొని వారి కుటుంబాలకు తెలుపగా ఏజంట్ల ఇండ్లకు వారు వెళ్ళి మొరపెట్టుకొన్నారు

బంధింపబడిన గృహాలలోని నౌకర్లు చాకర్ల ద్వారా సమ్మె విషయాలు వారికి తెలిసేది. కొందరు పారిపోయారు. కొందరు గోల పెట్టారు. మాయ మాటలు చెప్పి కొందర్ని ఓడలు ఎక్కించబోగా కార్మిక వలంటీర్లు తోవకు అడ్డంగా పడుకొన్నారు. పోలీసులు వారిని ఈడ్చి వేయగా నల్గురు గాయపడ్డారు. 100 మంది కూలీ స్త్రీలు తమ పిల్లలతో రోడ్లపై పడుకొన్నారు.

యూనియన్ మాటలు వినవద్దని యజమానులు వేసిన కరపత్రాల వల్ల ఏమీ ఫలితం కల్గలేదు.

రంగూన్ పాసింజర్ ఓడలో సమ్మెదార్ల కరపత్రాలు పంచగా మెరైన్ పోలీసులు ఒకరిని అరెస్టు చేసి సంకెళ్ళు వేశారు. ప్యాసింజర్లు 400 మంది దిగి పోతామని హెచ్చరించారు. దానితో అతనిని విడిచిపెట్టి, కరపత్రాలను పంచుకో నిచ్చారు.

ఎన్నోసార్లు రాజీ ప్రయత్నాలు జరిగినా విఫలమయ్యాయి. చివరకు జిల్లా కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడు మల్లిపూడి పళ్ళంరాజు అధ్యక్షతను జిల్లా బోర్డు ఆఫీసులో సమావేశమై రాజీకి వచ్చారు కంపెనీల యజమానుల సంఘం తరపున ముగ్గురు, కార్మిక సంఘాల తరపున ముగ్గురు, గవర్నమెంటు ఉద్యోగులు కొందరు హాజరై సమ్మె పరిష్కరించారు.

## రాజీ షరతులు :

1. పగలు కూలీకి తొమ్మిది అణాల నుండి 11 అణాలకు, రాత్రి 12 అణాల నుండి రూపాయికి పెరిగింది. తండేలుకు 11 అణాల నుండి $13\frac{1}{2}$ అణాలకు రాత్రి 15 అణాల నుండి రు. 1-3-0 కు పెంచారు.

2. భోజన సామాగ్రి క్రింద ఇచ్చే 0-2-6 బదులు పావలా ఇవ్వడానికి అంగీకరించారు.

3. ఇదివరలో పనిచేసిన గంటలకి జీతం ఇచ్చేవారు. ఇపుడు ఓడమీద బోయే ప్రయాణ కాలానికి కూడా ఇవ్వడానికి అంగీకరించారు.

4. గ్యాంగ్‌కి ఇదివరలో 16 నుంచి 18 మందినే తీసుకొనేవారు. ఇరవై మందిని తీసుకోడానికి అంగీకరించారు.

5. భోజన సమయంలో ఒక గంట సెలవు.

6. సంఘాన్ని గుర్తించుట.

7. సమ్మె చేసిన వారిపై ప్రతీకార చర్య తీసుకోగూడదు.

8. సమ్మెను ముగించుట.

సమ్మె కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ (కమ్యూనిస్టు) నాయకత్వాన జరిగింది.

లరీబ్ కంపెనీ, ఇతర యూరోపియన్ ఏజంట్లు ఆ ఒడంబడికను నిరాకరించమని ఒత్తిడిచేశారు. అప్పటికే యూనియన్ కూలీలు ఓడ ఎక్కి ఒప్పందం ప్రకారం కూలీ ఇవ్వకపోతే దిగబోమని చెప్పారు. రాయ్ చటర్జీ కంపెనీ ఇంకో విధంగా ఏమీ చెయ్యలేక పోయింది. విశాఖపట్టణం కూలీలను పంపివేసింది. రాయ్ చటర్జీ కంపెనీ సమ్మె ముగిసినా ఇతర కంపెనీలలో సమ్మె మరికొన్నాళ్ళు కొనసాగింది. తర్వాత కొన్నాళ్ళకు సమ్మె విజయవంతమైంది.

## కళింగపట్నం పోర్టు కార్మికుల సమ్మె

కళింగపట్నం పోర్టు కార్మికుల జీతాన్ని రు. 2-4-0 నుండి రు. 1-12-0లకు తగ్గించినందున ఓడవచ్చే రోజు అయిన 6-12-38 న పోర్టు కార్మికులు సమ్మె చేశారు. అంతకు నెల రోజుల క్రితం వీరి సంఘం ఏర్పాటు చేయబడింది. సంఘాధ్యక్షులు కార్మికుల ఇబ్బందులను గురించి మద్రాసు రాష్ట్ర ప్రభుత్వానికి తెలియచేశారు. భీమునిపట్నం నుండి కార్మికులును తీసుకువచ్చి పని చేయించారు. సమ్మె జరిగిన రోజునే పోలీసు అధికారులు తమ సిబ్బందితో కాపలాకై హాజరయ్యారు. సమ్మె దీర్ఘకాలం జరిగింది. జిల్లా కాంగ్రెస్ కార్యదర్శి టి. కృష్ణారావును కాంగ్రెస్ విచారణకు ప్రభుత్వం పంపింది. ప్రభుత్వం కూడా ఒకరిని విచారణకు పంపింది. చివరకు రు. 1-12-9 రేటుకు కార్మికులు అంగీకరించారు. 1937-38 సంవత్సరానికి ఈ రేటు వర్తించుతుంది. కార్మికులకు అదనంగా రావలసిన సొమ్ము ఇవ్వడానికి యజమానులు అంగీకరించారు. సమ్మె విరమించబడినట్లు 8-2-39 నవశక్తి ప్రకటించింది. కళింగ పట్టణంలో కార్మిక సంఘాన్ని స్థాపించి పోర్టు వర్కర్సు సమ్మెలో కార్మికులకు అన్ని విధాలా తోడ్పడిన పింటి నారాయణరెడ్డి 1939 జూలై 12 వ తేదీన మరణించాడు.

# పీచు కార్మికుల సమ్మె

కాకినాడలో నార పరిశ్రమ ముఖ్య పరిశ్రమలలో ఒకటి. తాటినారను పరిశుభ్రపరచి ఇతర దేశాలకు కూడా ఎగుమతిచేసేవారు వర్తకులు. ఇక్కడ సమ్మె ప్రారంభం కాకముందు వర్తకులు 112 పౌనులకి రూపాయిన్నర నుంచి మూడు రూపాయల దాకా కూలీ ఇచ్చేవారు. 1935 ప్రాంతంలో తాటినార వర్తకులు సంఘం ఏర్పరచుకొని కార్మికులికిచ్చే కూలీని 4 నుండి 5 వంతులు దాకా తగ్గించారు. కుటుంబం అంతా రెక్కలు ముక్కలు చేసుకున్నా భుక్తి గడవడంలేదు. మనిషికి అణాకన్నా కూలీ ముట్టడంలేదు. వర్తకుల ఈ దోపిడీని సహించలేని కార్మికులు 1939 లో తమ సంఘాన్ని ఏర్పరచుకొన్నారు. ఫిబ్రవరి 24 న వీరి సంఘ సర్వ సభ్య సమావేశం జరిగింది. ఈ క్రింది కోర్కెలు గల ప్రతులను ప్రతి కంపెనీ నార వర్తకునికే ఫిబ్రవరి 25 న పంపింది.

## కనీస కోర్కెలు

నారను దువ్వి, మోపువేసి, ఎండబెట్టి, సైజులువారీగా కట్టలు కడతారు. ఇందులో అనేక రకాలుంటాయి. ఆయా రకాలకు చెందిన నారనుబట్టి 112 పౌనులకు ఇవ్వవలసిన కూలీరేటును ఈ కోర్కెలలో తెలియచేశారు.

పీచుపనివారి సంఘాధ్యక్షుడు మార్చి 1 న వర్తక సంఘాన్ని కలిసికొని పై కోర్కెలకు జవాబు ఇవ్వవలసిందిగా కోరాడు వర్తక సంఘం ఇవాళ రేపు అంటూ తాత్సారం చేసింది. లాభం లేక చివరకు 1939 మార్చి, 8 వ తేదీన 12 గంటల నుండి సమ్మె ప్రారంభించారు. 1000 మంది స్త్రీ పురుష కార్మికులు సమ్మెలో పాల్గొన్నారు కూలీ పేటలో ప్రతి దినం సభలు జరిగాయి. కరపత్రాలు పంచారు. మహిళా కార్మికులు సభలలో ఉపన్యసించారు. చుట్టుప్రక్కల పల్లెలకు పోయి సమ్మెకు తోడ్పాటు కోరారు. సమ్మెను భగ్నం చేసేందుకు వర్తకులు చేసే ప్రయత్నానికి తోడ్పడవద్దని చెప్పారు తుని సమీపంలోని భీమవరపు కోట, మాకార పాలెంలలో పీచు - పనివారలు కాకినాడకు వచ్చి సమ్మె భగ్నం చేయకుండా తగు కట్టుదిట్టం చేశారు స్థానిక నాయకులు. సమ్మె కమిటీలను, వాలంటీరు దళాల్ని ఏర్పాటు చేశారు. ప్రతి కంపెనీ వద్ద పికెటింగు జోరుగా సాగింది. ఎర్ర జండాలతో, ప్లే కార్డ్సుతో కంపెనీ ముందు ప్రదర్శనలు జరిగాయి.

వర్తక సంఘంలో మొత్తం సుమారు 25 మంది వుండేవారు. వారిలో ఐదుగురు మాత్రమే పెద్ద వర్తకులు. పేరి రామారావు అనే వర్తకుడు కూలీ సంఘం కోర్కెల్ని అంగీకరించాడు. కార్మికులు చేసే ఊరేగింపులు వెంట పోలీసులు ఉండేవారు. ప్రతి కొట్టు దగ్గర పోలీసుల కాపలా వుండేది. పీచు కార్మికుల వలంటీరు దళాల్లో 44 గురు స్త్రీలు (30 మంది అని మరొక కథనం).

40 మంది పురుషులు వుండేవారు పగటి పూట మహిళా వలంటీర్లు కాపలా వుండి దొంగ కూలీలు (బ్లాక్‌లెగ్స్) రాకుండా చూసేవారు.

విశాఖపట్టణం జిల్లా యలమంచిలి, అనకాపల్లి మొదలైన చోట్ల, కాకినాడ వర్తకులు పీచుపని చేయించడానికి ప్రయత్నించగా అక్కడ సోషలిస్టులు ప్రచారం చేసి సమ్మె విషయం వివరించారు. అక్కడ కార్మికులుకూడా సమ్మెకు సంసిద్ధమయ్యారు.

సమ్మెలో మహిళా కార్మికుల పాత్ర గర్వించదగ్గది. పీచు కార్మికులలో 100 కి 75 మంది మహిళలే. కాకినాడలో స్టీవ్‌డోర్ కార్మికుల విజయం వారిని ఉత్సాహపరిచింది. వందలు వేలు నష్టం వచ్చినా భరించడానికి సిద్ధమైన యజమానులు ఆకలితో అలమటించుతూ, జీర్ణ వస్త్రాలతో పడి వున్న మహిళా కార్మికుల స్థితిగతులు యజమానులలో మార్పు తెప్పించలేదు. సమ్మె చేస్తున్న కార్మిక స్త్రీలకు గోర్కీ నవల అమ్మ మొదలైనవి చదివి చెప్పేవారు సోషలిస్టులు. దానితో వారిలో మరింత పట్టుదల హెచ్చింది. వర్తకులు రహస్యంగా దొంగ కూలీలను తీసుకురాకుండా మహిళా వాలంటీర్లు అతి చాకచక్యంగా ఆచూకి తీస్తూ వచ్చారు. వర్తకులు రౌడీలకు తాగబోయించి సోషలిస్టులను కొట్టించడానికి ప్రయత్నిస్తే వారిని ధైర్యంగా చుట్టుముట్టి మహిళలు ఆ ప్రయత్నాన్ని వృధా చేశారు. ఏప్రిల్ 3 వ తేదీన పికెటింగులో 100 మంది పురుషులతో పాటు 150 మంది మహిళలు పాల్గొన్నారు. చంటి పిల్లలు వృద్ధులు కూడా పాల్గొన్నారు. 4 వ తేదీన డిప్యూటీ కలెక్టరు, పోలీసు ఉద్యోగులు 50 మంది సాయుధ రిజర్వు పోలీసులు పికెటింగు చేస్తున్న వారిని తొలగి పోవలసిందిగా కోరారు. మహిళా కార్మికులు తిరస్కరించరు సోషలిస్టు నాయకులను అరెస్టు చేసి, కూలీ స్త్రీలను, వృద్ధులను, పిల్లలను విచక్షణా రహితంగా లాఠీచార్జీ చేశారు. అరెస్టు చేసిన నాయకులను తీసుకువెళ్ళుతున్న లారీల వెంట పరుగెత్తుతూ మహిళా కార్మికులు నినాదాలిచ్చారు స్టేషన్ వద్ద కూడ మరోసారి లాఠీచార్జీ జరిగింది. పది దినాల క్రితం భర్త చనిపోయిన ఒక స్త్రీ కూడా ఈ లాఠీ చార్జీలో దెబ్బతింది.

ఏప్రిల్ 6 వ తేదీన జిల్లా కాంగ్రెస్ కమిటీ సమావేశంలో సోషలిస్టు సభ్యుడొకరు ప్రవేశ పెట్టారు. సుమారు 500 మంది కార్మికులు ఆ తీర్మానంపై చర్చ వినడానికి ఉద్యుక్తులయారు. జిల్లా కాంగ్రెస్ కమిటీ ఎన్నికలు జరుగక ముందే ఆ తీర్మానం ప్రవేశపెట్టాలని 500 మంది కార్మిక స్త్రీ పురుషులు రాత్రి

12 గంటలదాకా ఘెరావ్ చేశారు కార్మికుల చర్య "సక్రమం, శాంతియుతం' అని ఒప్పుకోకపోయినా లాఠీచార్జీని జిల్లా కాంగ్రెస్ ఖండించింది

1939 ఏప్రిల్ 10 వ తేదీన మద్రాసు నుంచి లేబర్ కమీషనర్ ఈ సమ్మె గురించి విచారించడానికి వచ్చారు. వర్తక ప్రతినిధులు, సమ్మె చేసే కార్మికుల నాయకులు, కాంగ్రెస్ నాయకులు, జిల్లా కలెక్టరు హాజరయ్యారు. రోజుకు సగటున రెండణాలకంటె ఎక్కువ కూలీ ఇవ్వడం లేదని సమ్మెదార్ల ప్రతినిధులు ఋజువు చేశారు రోజుకు 12 అణాలిస్తున్నామని వర్తకులు బుకాయించారు. సగటు అర్ధరూపాయ ఇస్తున్నామని వర్తకులు బుకాయించినా, ఖాతా పుస్తకాల్లో చూస్తే ఆరణాలకన్న ఎక్కువ ఇచ్చినట్లు కనపడలేదు. గ్రామ సీమల్లోనే రోజుకు నాలుగు లేక ఐదు అణాలిచ్చే సందర్భంలో కాకినాడలో రెండణాలకంటే ఎక్కువ ఇవ్వాలని కమీషనర్ అభిప్రాయపడ్డాడు కాంగ్రెస్ సోషలిస్టు పార్టీని వర్తకులు దుమ్మెత్తి పోస్తే, సహనం వహించాలని కమీషనర్ బోధించాడు. రేటు ఎంత పెంచుతారని వర్తకుల్ని అడిగారు సమ్మె విరమిస్తే తర్వాత ఆలోచిస్తామని జవాబిచ్చారు శాంతికి భంగం కల్గిస్తున్న వర్తకులపై చర్య తీసుకోవాలని కలెక్టరుకు సూచించారు కాని అందుకు విరుద్ధంగా సబ్ డివిజనల్ మేజిస్ట్రేటు కార్మికులపైన, వారి నాయకులపైన 144 వ సెక్షన్ విధించాడు. సోషలిస్టు పార్టీ సభ్యులందరికీ వర్తించేటట్టు ఉన్న ఈ నిషేధాజ్ఞ ఒక రకంగా ఆంధ్రలోని కాంగ్రెస్ సోషలిస్టు పార్టీపైనే నిషేధం విధించడం ఇదే ప్రథమం. ఆ నాటి రాత్రి కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ఆఫీసులో సమావేశమైన 144 సెక్షన్ని ఖాతరు చేయకుండా పికెటింగు కొనసాగించాలని నిశ్చయించారు.

ఏప్రిల్ 11 న పికెటింగు ప్రారంభమైంది. 5 గురికి మించి ఒక్కొక్క జట్టులో వుండేవారు. 8 జట్లుల్ని పోలీసులు అరెస్టు చేశారు అరెస్టయిన 45 మందిలో 25 మంది స్త్రీలు సాయంత్రం కొందరిని విడిచి పెట్టారు. కాని పార్టీ సభ్యులు కొందరి పైన కేసులు పెట్టారు. సమ్మెదార్లు ఊరేగింపులు, పికెటింగుల సందర్భాన "ఆకలి బాధ నివారించాలి", "కూలి హెచ్చించాలి", "144వ సెక్షన్ రద్దు చేయాలి" అని నినాదా లిచ్చారు 12 వ తేదీన 50 మంది బాలబాలికలు "ఎగరాలి ఎగరాలి మన ఎర్ర జండా" పాటతో ఊరేగారు. వారిని అరెస్టు చేసి ఒక గంట పోలీసు స్టేషన్‌లో ఉంచి విడిచి పెట్టారు. 8 జట్లుగా పికెటింగు చేసిన స్త్రీలను సాయంత్రం వరకూ పోలీసు స్టేషన్‌లో వుంచి నోటికి వచ్చినట్లు బండ బూతులు తిట్టి, ఆ తర్వాత విడుదల చేశారు.

కళా వెంకట్రావుగారు మధ్యవర్తిత్వం వహించి రాయబారాలు సాగించారు. అందుచే 13 న పికెటింగు జరుగలేదు. హండ్రడ్ వెయిట్‌కి అణా చొప్పున రేటు

పెంచడానికి వర్తకులు అంగీకరించగా, రెండణాలు హెచ్చించాలని కార్మికుల తరపున సి.వి.కె రావుగారు కోరారు.

రెండు సంవత్సరాల క్రితం ఉన్నా రేట్లు ఇవ్వాలని మొదట్లో సమ్మెదారులు కోరినా ఒకరికి రోజుకు రు 0-2-0 ఇవ్వాలని రాజీ మార్గంగా సూచించారు.

1939 ఏప్రిల్ 14 న వర్తకులపైన 144 సెక్షన్ రద్దు చేశాడు కలెక్టర్. కాని కార్మికులపైన అదే విధంగా రద్దు చేయలేదు. అయినా లెక్క చేయకుండా 15 వ తేదీ నుండి జట్లు జట్లుగా కార్మికులు పికెటింగు ప్రారంభించారు. 150 మందిని అరెస్టు చేసి 12 మంది మినహా తక్కిన వారిని సాయంత్రానికి విడిచి పెట్టారు. ఈ పన్నెండు మంది కార్మిక నాయకులు. ఇందులో మహిళలు కూడా ఉన్నారు 16 వ తేదీన కూడా జట్లు జట్లుగా పికెటింగు జరిగింది.

15 వ తేదీన అరెస్టయిన మరికొందరి పైన రకరకాల కేసులు పెట్టారు. ఆ విధంగా మొత్తం సుమారు 250 మందిని అరెస్టు చేసి, 30 మందిపై కేసులు పెట్టి, తక్కిన వారిని విడిచి పెట్టారు.

నెం. 1 టౌన్ స్టేషన్‌లో పోలీసు బలగం అంతా వర్తకుల ఏజంట్లులాగా ప్రవర్తించారు.

సమ్మె సందర్భంగా అరెస్టు చేయబడిన తూర్పు గోదావరిజిల్లా వ్యవసాయ కూలీ సంఘ ప్రధాన కార్యదర్శి, జిల్లా బోర్డు మెంబరు, జిల్లా కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ కార్యవర్గ సభ్యురాలైన గెడ్డం మహాలక్ష్మి, నంబూరి శ్రీనివాసరావు (తూర్పు గోదావరి జిలా వ్యవసాయ సంఘ సంయుక్తకార్యదర్శి) జిల్లాకాంగ్రెస్ సభ్యులైన ఆర్. వి. జగ్గారావు, రామాయణం సత్యనారాయణ గార్లకు ఆరేసి నెలల కఠిన శిక్ష విధించబడింది. అరుగుల గురవయ్య అనే కార్మికునికి మూడు మాసాల శిక్షవిధించ బడింది.

కార్మిక మంత్రి గిరిగారు వర్తకుల ప్రతినిధులను, కార్మికుల ప్రతినిధులను పిలిపించి మాట్లాడారు. తగాదాను పరిష్కరించి తుది నిర్ణయం చేయడానికి లేబర్ కమీషనర్ శొంఠి రామమూర్తిగారిని మధ్యవర్తిగా (ఆర్బిట్రేటరుగా) నియమించారు. అందుచే సమ్మె విరమించబడింది.

ఈ సందర్భంగా 21.4.39 న మద్రాసు మంత్రి వర్గం సమ్మె కాలంలో అరెస్టుచేసిన కార్మిక నాయకులను విడుదల చేస్తానని హామీ యిచ్చింది. శిక్ష విధించిన వారిలో ఒక రోగ పీడితుడు, భార్య ఎనిమిది మాసాలు గర్భిణీ ఉండీ మరో దిక్కులేని ఒక కార్మికుడు, సమ్మెకు సంబంధం లేని ఒక బ్రోకరు కూడా ఉన్నారు.

4-4-39 న అరెస్టయి జామీన్‌పై విడుదలైన కార్మిక నాయకులు జామీన్ ఉపసంహరించుకొని 6 వ తేదీ సబ్ జైలులో ప్రవేశించి నిరసన వ్రతం సాగించారు నిరసన వ్రతానికి సానుభూతిగా కాకినాడలోని వివిధ వర్గాల కార్మికులు 8 వ తేదీన సమ్మె చేశారు. 9 వ తేదీన 5 వేల మంది, 10 వ తేదీన 10 వేల మంది సమ్మె చేశారు. మున్సిపల్ కమీషనర్ స్కావెంజర్లను రివాల్వర్‌తో బెదిరించినా లెక్కచేయక సమ్మెలోచేరారు. ప్రభుత్వం, కాంగ్రెస్ నాయకుల ఒత్తిడితో కళ్ళు తెరిచి కార్మిక నాయకులను మే 25న విడుదల చేసింది. అలా విడుదలైన వారు. :- 1. రావు వెంకట జగ్గారావు (పిఠాపురం తాలూకా) కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ కార్యదర్శి 2 చిన్న 3. గెడ్డం మహాలక్ష్మి 4. రామాయణం సత్యనారాయణ 5. నంబూరి శ్రీనివాసరావు మరో 5 గురిని విడుదల చేశారు నెల్లూరు జైలు నుండి మహిళలు కూడా విడుదలయ్యారు. శొంఠి రామమూర్తిగారు (లేబర్ కమీషనర్) సాక్ష్యాలన్నీ విచారించి ఈ క్రింది విధంగా తీర్పు ఇచ్చారు.

1. మామూలు (జపాను) రకం పీచు ఎండబెట్టడం, విడదీయడం, కట్టలు కట్టడం మొదలైన పనులకు 112 పేనులకు 10 అణాలు.

2. మామూలు (జపాను) రకం పీచు నానబెట్టడం, విడదీయడం, ఎండబెట్టడం, కట్టకట్టడం, 112 పేనులకు 11 అణాలు.

3. మంచి రకం పీచు నానబెట్టి ఎండబెట్టి విడదీసి కట్టలు కట్టడానికి 112 పేనులకు 12 అణాలు.

4. ఇంకా మంచి రకం పీచు అదే పనికి 112 పేనులకు 14 అణాలు.

పీచుసంబంధం తక్కిన పనులు చేసేవారికి మగవారికి ఆరణాలున్నూ, ఆడవారికి 4 అణాల 6 పైసలున్నూ కూలీ యివ్వాలి. రోజుకు 9 గంటల పని వుండాలి. పేమెంట్ ఆఫ్ వేజెస్ చట్టంలో ఉన్న మినహా యింపులు ఈ కూలీలు చేయకూడదు.

జయప్రదంగా ఈ సమ్మె ముగిసినా జూలైలో ఒక వర్తకుడు పని వారిని తొలగించ ప్రయత్నించగా కార్మికులు సమ్మె చేశారు. 3-7-39న తహసీల్దార్ ఆసమ్మెను పరిష్కరించారు.

## నెల్లిమర్ల జూట్ వర్కర్స్ యూనియన్

1932 లో నెల్లిమర్ల జూట్ కార్మిక సంఘం ఏర్పడింది. 500 మంది సభ్యులుండేవారు. 1936 ప్రాంతంలో 1000 మంది సభ్యులుగా ఉండేవారు. 1939 లో కాంగ్రెస్ ట్రేడ్ యూనియన్ నాయకుడు పెమ్మరాజు వెంకట్రావు నెల్లిమర్లలో రాష్ట్ర ట్రేడ్ యూనియన్ మహాసభ ఏర్పాటు చేశాడు. కాని రాష్ట్రంలో ఎక్కువ బలమున్న ఎ.ఐ.టి.యు.సి. నాయకులతో చర్చించలేదు.

కార్మిక మంత్రి వి.వి. గిరి గారిని ప్రారంభకులుగా ఆహ్వానించారు. ఇతర కార్మిక సంఘాలను సంప్రతించకుండా ఈ సభను ఏర్పాటు చేసిన విషయాన్ని శాసన సభ్యుడు వి. వి. నరసింహంగారికి చెప్పగా ఆయన ఆ సభకు వెళ్ళలేదు. నెల్లిమర్లలో మహాసభలో ఎ. ఐ. టి యు. సి. కార్మిక నాయకుల తీవ్ర విమర్శ ఫలితంగా సభ వాయిదావేసి కె. యల్. నరసింహం కన్వీనరుగా ఒక ఆర్గనైజింగు కమిటీని ఏర్పరచారు. సభ ముగిసే సమయానికి వచ్చిన గిరిగారు ఆ నిర్ణయాలకు ఆమోదం తెలిపి, సందేశం ఇచ్చి వెళ్ళిపోయారు. 1939 సెప్టెంబరులో యుద్ధం ప్రారంభం కావడంతో ఈ మహాసభ జరుగలేదు.

రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమయ్యేనాటికే నెల్లిమర్ల జూట్ మిల్లు వర్కర్సు యూనియన్ ఏర్పడి బలంగా పని చేస్తున్నది.

ఈ నేపథ్యంలో నెల్లిమర్ల కార్మికోద్యమాన్ని పరిశీలిద్దాం.

1938 జనవరి 3 న పెమ్మరాజు వెంకట్రావు అధ్యక్షతన జరిగిన నెల్లిమర్ల కార్మిక సంఘ సమావేశంలో కార్మికుల పరిస్థితులను వివరించారు. మద్రాసు రాష్ట్ర కార్మిక సమావేశంలో, అఖిల భారత ట్రేడ్ ఫెడరేషన్‌లోనూ ఆమోదింపబడిన తీర్మానాలను వివరించారు. కార్మికులు రాజకీయ నిధి, సమ్మె నిధి ఏర్పరచుకొని తమ పరిస్థితుల మెరుగుదలకు కృషి చేయాలని చెప్పారు.

1939 ఆగష్టు 10 న పెమ్మరాజు వెంకటరావు అధ్యక్షతన నెల్లిమర్ల జూట్‌మిల్లు కార్మిక సంఘ మహాసభ జరిగింది 1000 మంది హాజరయ్యారు. ఆ సభలో వెంకట్రావు చెప్పిన అంశాలివి :

"జూట్‌మిల్లు యజమానులు బలమైన సంఘాన్ని ఏర్పరచుకొన్నారు. (దేశవ్యాపితంగా) 9700 మగ్గాలను తీసివేయడానికి నిర్ణయించుకొన్నారు. దీనివల్ల 40 వేల మంది నిరుద్యోగులవుతారు. ఒక్క బెంగాల్‌లో మాత్రం కార్మికుల పని గంటలు తగ్గించి, పనివారిని తొలగించకుండా ఉండే పద్ధతికి అంగీకరించారు. వారానికి 40 గంటలు మాత్రమే పనివుంటుంది. (తదనుగుణంగా జీతాలు తగ్గుతాయన్నమాట) అయినా 8 వేల మందిని తొలగించడానికి యజమానులు సిద్ధమయ్యారు.''

నెల్లిమర్ల జూట్ మిల్లులోని 200 మంది కార్మికులకు పనిపోయే పరిస్థితి ఏర్పడింది. ఈ పరిస్థితులను గమనించిన కార్మిక సంఘం ఎట్టి పరిస్థితులలోను కార్మికులను పనినుండి తొలగించరాదనే ప్రధాన నినాదంతో ప్రచార కార్యక్రమం ప్రారంభించింది. కార్మికుల కోర్కెలను మన్నించనట్లయితే ఆందోళనా మార్గాలను చేపట్టవలసి వస్తుందని యజమానులను హెచ్చరించింది. కార్మికుల ఐక్యతను గుర్తించిన యాజమాన్యం చివరికి కార్మిక సంఘంతో చర్చించి ఒక ఒడంబడిక

చేసుకున్నారు. ఆ ఒడంబడిక ప్రకారం కార్మికుల ఈ క్రింది కోర్కెలను యాజమాన్యం అంగీకరించింది.

1. మిల్లులో పనిచేసే ఏ కార్మికుణ్ణి తొలగించరాదు.

2. మగ్గాల డిపార్టుమెంటు మినహా మిగతా ఏ డిపార్టుమెంటు లోనూ పని గంటలు తగ్గించడంగాని, జీతం తగ్గించడంగాని ఉండదు.

3. మగ్గాల డిపార్టుమెంటులో పని గంటలు వారానికి 48.

4. గంటల తగ్గింపువల్ల కార్మికులకు వచ్చే నష్టాన్ని భర్తీ చేసేందుకు ప్రొడక్షన్ బోనస్ పెంచాలి. ఉత్పత్తి ఎక్కువ చేయడానికి ఏర్పాటు చేయాలి.

5. గతంలో రిట్రెంచి చేసి ఇంతవరకు పనిలోకి తీసుకోనని 30 మందికి తిరిగి ఉద్యోగం ఇవ్వాలి.

## కాకినాడ రెండు ఎడ్లబండ్ల వారి సంఘం – సమ్మె

ఆ రోజుల్లో కాకినాడలో రెండు ఎడబండ్లు, ఒంటెద్దుబండ్లు ప్రయాణానికి ముఖ్య సాధనాలు. ఈ బండ్ల వాళ్ళు ఒక విధంగా కార్మికులు, మరొక విధంగా యజమానులు కూడా బండ్లు తోలుకుంటూ తద్వారా వచ్చిన కూలీతో జీవనం గడిపేవారు. కాకినాడలో ఉన్న బండ్ల కార్మికులు, ఎక్కువగా ఫ్రైజర్ పేటలో ఉండేవారు. అదే పేటలో ఉన్న కమ్యూనిస్టు కార్యకర్త రామాయణం సత్యనారాయణ వీరిని సంఘటిత పరచటానికి కృషి చేశారు. బళ్ళ కార్మికులకు ప్రోత్సాహమిచ్చి బళ్ళవాళ్ళ సంఘం ఏర్పాటు చేయించారు. 1938 లో ఏర్పడిన బళ్ళ కార్మికుల సంఘానికి పయిండా వెంకట నారాయణ, రామాయణం సత్యనారాయణ అధ్యక్ష, కార్యదర్శులు. డా॥ వీరయ్య, పర్వతనేని వెంకటేశ్వరరావులు కమిటీ సభ్యులు.

1938 లో కాకినాడ మున్సిపాలిటి వారు రెండెడ్ల బండ్లపై అదనపు పన్ను వేశారు. అతికష్టం మీద జీవనం సాగిస్తున్న బళ్ళ వాళ్ళు ఈ పన్ను చెల్లించటానికి ఒప్పుకోలేదు. దానితో పోలీసువారి సహాయంతో మున్సిపాలిటి వారు బళ్ళ కార్మికులపై దౌర్జన్యం చేయసాగారు పన్ను చెల్లించని రెండెడ్ల బళ్ళవారిపై పోలీసులు రెండణాల మొదలు కొని నాలుగణాల వరకు జరిమానాలు విధించడం ప్రారంభించారు. ఈ పరిస్థితిలో అదనపు పన్నుకు, పోలీసుల దౌర్జన్యానికి వ్యతిరేకంగా బళ్ళవాళ్ళ సంఘం సమ్మె ప్రారంభించింది. అదనపు పన్నును తగ్గించాలని, పోలీసుల దౌర్జన్యం తొలగాలని కోరుతూ మున్సిపల్ ఛైర్మన్‌కి కలెక్టరుకి విజ్ఞప్తి చేశారు. అయినా ఫలితం లేకపోవడంతో అక్టోబరు 1 నుంచి సమ్మె ప్రారంభించారు. సమ్మె ప్రారంభిస్తే నిర్బంధ విధానాన్ని అమలు చేస్తామని

ప్రభుత్వం బెదిరించింది. "బళ్ళు తోలే పని మానుకున్నాం" అని యుక్తిగా కార్మికులు సమాధానం చెప్పారే కాని సమ్మె మాత్రం విరమించలేదు.

కార్మికులను ప్రోత్సహిస్తూ రాయాయణం సత్యనారాయణ, డాక్టర్ వీరయ్య, పర్వతనేని వెంకటేశ్వరరావు, పయిండా వెంకిట నారాయణ మొదలగు వారు కార్మికులకు నిబ్బరం కలుగచేశారు సమ్మెచేస్తున్న బళ్ళవాళ్ళకు సానుభూతిగా కాకినాడిలోని ఇతర కార్మికులు కూడ సమ్మెలో కలిశారు. బళ్ళే ప్రధాన సాధనాలు అవ్వటం మూలంగా ప్రజలు ఇబ్బందులకు గురి అయ్యారు. ప్రభుత్వ బెదరింపులకు లొంగక కార్మికులంతా బళ్ళ కార్మికుల కోర్కెలు అంగీకరించాలని పట్టుబట్టారు.

చిట్టచివరికి బళ్ళ కార్మికుల కోర్కెలను అంగీకరించటానికి మునిసిపల్ ఛైర్మన్ సంసిద్ధత వ్యక్తం చేశాడు. గేటు పన్ను, ఆ సంవత్సరానికి వసూలు చెయనని కంట్రాక్టర్ అంగీకరించాడు. లైసెన్సు ఫీజు రూపాయి తగ్గించాలని ప్రభుత్వానికి రికమెండ్ చేయటానికి, లైసెన్సు వసూలుచేసే గడువు రెండునెలలు పెంచటానికి ఛైర్మన్ అంగీకరించాడు.

అక్టోబరు 6 న కార్మికులు సమ్మె విరమించారు. కాకినాడలో కార్మికుల సమైక్యతకు సంఘటిత శక్తికి బళ్ళ కార్మికుల సమ్మె ఒక నిదర్శనం. ఈ సమ్మె విజయవంత మవడంతో కాకినాడలో కార్మికుల సమ్మెల వెల్లువ ప్రారంభ మయింది. తరువాత వెంట వెంటనే స్టీవిడార్, ఉప్పుమాల్, పీచుకార్మికుల సమ్మెలు ప్రారంభమవడానికి ఈ బళ్ళ కార్మికుల సమ్మె మార్గదర్శక మయింది.

## సామర్లకోట పంచదార కార్మికుల సమ్మె

1937 నాటికి పూర్వమే సామర్లకోటలోని పంచదార కార్మికులు సంఘటిత మయ్యారు. మద్రాసు మేయరైన బాసుదేవ్ 1936 లో సామర్లకోట లో డి.యస్ ఎ. అండ్-కో (దక్కన్ సుగర్ అండ్ అబ్కారీ కంపెనీ ప్యారి కంపెనీ) వర్కర్సు యూనియన్‌ను స్థాపించాడు. ఇది ఆ కంపెనీ అధిపతులైన ఇంగ్లీషు వాళ్ళ చెప్పు చేతుల్లోనిది. 1937 లో చిట్టివలస కార్మిక స్థానానికి కాంగ్రెస్ అభ్యర్థిగా కరుణాకరం సుబ్బారావు గారు పోటీ చేసి గెలుపొందారు సోషలిస్టులు కమ్యూనిస్టులు ఆ రోజుల్లో తాము పోటీచేయని చోట కాంగ్రెసు అభ్యర్థుల పక్షాన వున్నారు సామర్లకోట వర్కర్సు యూనియన్‌కు పోటీచేసిన బాసుదేవ్‌పై కరుణాకరం సుబ్బారావుగారు గెలిచారు. బాసుదేవ్ జస్టిస్ పార్టీ అభ్యర్థి. ఓడిపోయిన బాసుదేవ్ సామర్ల కోటకు దూరమయ్యాడు. చిట్టివలస జనపనార మిల్లు కార్మిక సంఘంతో పాటు ఇది నిర్మాణయుతమైన కార్మిక సంఘం. ఒక దశలో సి.వి.కె. రావు, దామిశెట్టి పార్థసారధి గారలు ఈ సంఘానికి అధ్యక్ష, కార్యదర్శులు.

ప్యారీ కంపెనీ వాళ్ళకు సామర్లకోట, రాణిపేట, నెల్లికుప్పం మొదలైన చోట్ల పంచదార ఫ్యాక్టరీలుండేవి 1937 లో సున్నపు కల్లు గీతవారు తాటిబెల్లం ధరను హెచ్చించాలంటూ సమ్మె చేశారు. యజమానులు మూర్ఖంగా పట్టుబట్టినా కార్మిక మంత్రి గిరిగారి జోక్యంవల్ల పుట్టి ఒకటికి ఒక అర్ధ రూపాయి పెంచేటట్లు చేయగల్గారు. 1938 జూలై 25 నుండి సుమారు 736 మంది కార్మికులు సమ్మె చేశారు వీరిలో చాలామంది రిజిస్టరైన పై యూనియన్‌లో సభ్యులు. కార్మికులు క్రింద ఉదాహరించిన కోర్కెలపై సమ్మె చేశారు. ఆనాటి కార్మిక మంత్రికి మెమొరాండం ద్వారా ఈ కోర్కెలను కాంగ్రెసు సోషలిస్టు పార్టీ నాయకుల ద్వారా సమర్పించారు కార్మికుల కోర్కెలివి :

1. సంవత్సరానికి ఒక నెల జీతం గ్రాట్యుటీగా యివ్వాలి.
2. ఉద్యోగ విరమణ తర్వాత పెన్షన్ యివ్వాలి.
3. ప్రావిడెంటు ఫండు వసతి కలుగ జేయాలి.
4. జబ్బు చేసినపుడు సెలవు లివ్వాలి.
5. కొంతకాలం మాత్రమే పని ఉండే కార్మికులకు - ఉదాహరణకు నెల విడిచి మరో నెలలో పని చేసే కార్మికులకు నిరుద్యోగకాలంలో అలవెన్సు ఇవ్వాలి.
6 కంట్రాక్టు పద్ధతి రద్దు చేయాలి.
7. జీతాలలో జనరల్ ఇంక్రిమెంటు ఉండాలి.
8 సంచులు కుట్టు కూలీలను సర్వీసులోకి తీసుకోవాలి.
9. కార్మిక సంఘాన్ని గుర్తించాలి.

కార్మిక మంత్రి గిరిగారికి 26-6-38 న ఒకసారి, 8-7-38 న ఒకసారి విజ్ఞప్తులు చేశారు అంతకు ముందు కంపెనీ అధికారులతోనూ, ప్రభుత్వంతోనూ శాసన సభ్యులు కరుణాకరం సుబ్బారావుగారు మాట్లాడినా లాభం లేక పోయింది. యూనియన్ ఉపాధ్యక్షుడు దద్దపూడి సత్యనారాయణ, బి.యస్. లక్ష్మణ్ స్వామి గార్లు గిరిగారిని కల్సుకొని మెమొరాండం సమర్పించారు. గిరిగారి సిఫార్సుతో కార్మిక ప్రతినిధులు మేనేజింగు డైరెక్టరును కల్సుకొన్నా ఫలితం కలుగ లేదు. జూలై 23 రాజమండ్రి వచ్చిన కార్మిక శాఖా కార్యదర్శి బి. యస్. మూర్తిగారిని కల్సి పరిస్థితులను వివరించారు.

24 వ తేదీన జరిగిన యూనియన్ సర్వసభ్య సమావేశం సమ్మెకు నిశ్చయించి తంతి ద్వారా కార్మికమంత్రికి, మేనేజింగు డైరెక్టరుకు ఆ విషయం తెలియ జేశారు జిల్లాకలెక్టరు కంపెనీ మేనేజరు కెల్సుకు రాజీ చేసుకోమని సలహాఇచ్చాడు. అతను ఖాతరు చేయలేదు. కార్మిక ప్రతినిధులను పిలిపించి మాట్లాడతానని కలెక్టరుతో చెప్పినా వారిని పిలిపించలేదు. కార్మిక ప్రతినిధులు వెళ్ళి మాట్లాడారు.

తాను కొన్నిసూచనలు, సిఫార్సులు మద్రాసులోని మేనేజింగు డైరెక్టరుకు చేస్తానని కంపెనీ మానేజరు అన్నాడు. కలెక్టరు రెండు వారాలు వేచి చూడాల్సిందిగా సలహా ఇచ్చారు. కార్మిక మంత్రిగిరిగారు కార్మికుల్ని పనిలో చేరవలసిందిగా తంతి ద్వారా తెలియజేశారు. రాయబారం విఫలమైతే ప్రభుత్వానికి తెలియజేయవలసిందిగా కోరారు. 26 న కలెక్టరు కూడా కార్మికుల్ని పనిలో చేరాల్సిందిగా సలహా యిచ్చాడు. మద్రాసులో రాయబారం గతంలోనే వ్యర్థమైనందున సమ్మె కొనసాగించాలని కార్మికులు నిశ్చయించుకొన్నారు.

కలెక్టరు, డి. యస్. పి. 50 మంది రిజర్వు పోలీసులు 25 మంది మామూలు పోలీసులు ఫ్యాక్టరీ వద్ద మకాం వేశారు. 20 మంది మాత్రం పనికి వెళ్ళారు. సమ్మెదార్లు శాంతంగా పికెటింగు చేశారు. ఉన్న నాలుగు డిపార్టుమెంటులలో మూడు మూతపడ్డాయి. గుమాస్తాల సాయంతో నాల్గు డిపార్టుమెంటులలో పాక్షికంగా నడిచింది. నైపుణ్యంలేని మామూలు కార్మికుల్నిని కొందరిని పనిలో పెట్టగా ఫ్యాక్టరీ ఇన్‌స్పెక్టర్‌కి సమ్మె కమిటీ రిపోర్టు చేసింది.

జిల్లా కాంగ్రెస్ కార్యదర్శి మండపాక రంగయ్య నాయుడు రాజీ సంప్రతింపులు ప్రారంభించి కార్మికుల కోర్కెలను నాల్గు కోర్కెలకు కుదించారు. అవి:-

1. కంట్రాక్టు పద్ధతి రద్దు చేయడం
2. కూలీ రేటు పెంచడం
3. నెల విడిచి నెల పని చేసే వారికి అలవెన్సు
4. సంచులు కుట్టే వారిని సర్వీసులోకి తీసుకోవడం

ఇందులో మొదటి కోర్కెను మేనేజరు ఒప్పుకొన్నాడు. రెండవ కోర్కెలో కార్మికులు అర్థణా పెంచమంటే కానీ పెంచుతామన్నాడు. అది కూడా నెల జీతగాళ్ళకే, మూడో కోర్కెలో సంవత్సరంలో పని లేని 6 నెలలకు 2 నెలలఅలవెన్సు కావాలని కార్మికులు కోరగా ఒక్క నెల ఇస్తామని మేనేజరు అన్నాడు. అయితే తానంగీకరించిన విషయాలన్నీ మేనేజింగు డైరెక్టరు అంగీకరించితేనే అమలులోకి వస్తాయనీ 31-7-38 నాటికి అమలులోకి వస్తాయనీ 31-7-38 నాటికి జవాబు వస్తుందనీ అన్నాడు. ఈ లోగా కంపెనీ అధికార్ల వాగ్దానాల ఆధారంగా మద్రాసు కార్మిక శాఖ కార్యదర్శి బి. యస్. మూర్తిగారు అగష్టు 1 సామర్లకోట వచ్చారు. సమ్మెను విరమించవలసిందిగా సలహా యిచ్చారు. రెండవ తేదీన సమ్మె విరమించబడింది.

1938లో జరిగిన ఒప్పందంలో సామర్లకోట పంచదార ఫ్యాక్టరీ కార్మికులకు ఇచ్చిన కొన్ని సౌకర్యాలు కూడా 1939 మే నాటికి రద్దయాయి.

కంట్రాక్టు పద్ధతిలో కొంత భాగం మాత్రమే రద్దుచేయబడింది. బొగ్గు ఏరే కార్మికుల విషయంలో కంట్రాక్టు పద్ధతి రద్దు పరచకపోగా 12 మందిని తొలగించారు.

దానితో నెల్లికుప్పం, రాణిపేట, సామర్లకోట ఫ్యాక్టరీలలో పని చేస్తున్న కూలీలు ఏకమై మూడు సంఘాల ప్రతినిధులతో ఒక జాయింట్ కమిటీ ఏర్పరచి దాని నాయకత్వాన సమ్మె ప్రారంభించారు. ప్రధాన మంత్రి రాజగోపాలాచారి విజ్ఞప్తిని అనుసరించి నెల్లికుప్పం, రాణిపేట కార్మికుల సమ్మె విరమించారు.

ప్రివిలేజ్ లీవ్, యూనియన్‌ను గుర్తించుట మొదలైన కోర్కెలను డిసెంబరు 21 న ఫెడరల్ కమిటీ యజమానులకు తెలియచేసింది. వీటిని అంగీకరించని పక్షంలో సమ్మె చేస్తామని నోటీసిచ్చింది. ఫిబ్రవరి 3 న లేబర్ కమీషనర్ పనివారల సంఘ ప్రతినిధులతో చర్చించారు. ఆ తరుణంలో కోర్కెలు కోరడం సమంజసం కాదని లేబర్ కమీషనర్ అన్నారు.

కార్మిక మంత్రి గిరిగారితో ఫెడరల్ కమిటీ కార్యదర్శి చర్చించిన పిమ్మట సమ్మె నోటీసును తాత్కాలికంగా విరమించుకొన్నారు. అయినా ఈ కోర్కెలను యజమానులు తీర్చలేదు. అందుచేత వారం లోపల తమ కోర్కెలు తీర్చకపోతే సమ్మె చేస్తామని తిరిగి ఏప్రిల్ 1 న నోటీసు ఇచ్చారు. కార్మిక సంఘం వారు 25 వ తేదీ వరకు వేచి యున్నారు. 24 వ తేదీన యజమానులు పని వారలకు (సంఘానికి కాదు) వారి సవ్యమైన కోర్కెల్ని చర్చిస్తామని జవాబు ఇచ్చారు.

గత్యంతరం లేక 26 వ తేదీ నుండి సామర్లకోట, రాణిపేట, నెల్లికుప్పం కార్మికులు సమ్మె చేశారు. రాష్ట్రంలో ఒకే పరిశ్రమలోని కార్మికులంతా జనరల్ స్ట్రయిక్ చేయడం ఇదే మొదటిసారి. సమ్మెలో సుమారు 3000 మంది పాల్గొన్నారు.

మంత్రివర్గం యజమానుల మీదకన్నా పనివారలపై ఒత్తిడి తెస్తూ సమ్మెను విరమింప చేయాలని ప్రయత్నించింది. రాజాజీ ఎ. ఐ. సి. సి. నుండి తిరిగి వచ్చే వరకు సమ్మె ఆపు చేయాలని కోరారు. కార్మిక సభలో కార్మిక మంత్రి మాట్లాడతారని సభను ఏర్పాటు చేయవలసిందిగా కడలూరు కాంగ్రెస్ కమిటీకి తంతి పంపారు. ఆయా జిల్లా మేజిస్ట్రేటులకు, సంఘ ప్రతినిధులతో సంప్రదించి మే 1 లోగా కార్మికులు పనిలోకి వెళ్ళేటట్లు చూడాలని కోరారు. కాని పనివారి కోర్కెల విషయం ఏమీ ప్రస్తావించలేదు. కనీసం విచారణ కమీషన్ నియమిస్తామని హామీ యివ్వలేదు. గిరిగారి ప్రసంగం కూడా కార్మికులకు సంతృప్తి కలిగించలేదు. సమ్మె కొనసాగించారు. సామర్లకోట కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులు కార్మికులకు సంపూర్ణ సహకారాన్ని అందజేశారు.

6వ తేదిన నెల్లికుప్పంకు 5 మైళ్ళ ఆవరణలోపు సభలు, ఊరేగింపులు నెలరోజుల వరకు జరపరాదని నిషేధించారు. నెల్లికుప్పం లేబర్ యూనియన్ అధ్యక్ష, ఉపాధ్యక్ష, కార్యదర్శులపై ఈ నిషేధ ఉత్తర్వు జారీ చేశారు.

కార్మికులు 7వ తేదిన ఈ ఉత్తర్వును ఉల్లంఘించారు. 150 మందితో ఊరేగింపు జరిపారు. పోలీసులు లాఠీ చార్జి చేశారు. అనేక మంది కార్మికులు గాయపడ్డారు. యూనియన్ అధ్యక్ష, కార్యదర్శులను అరెస్టుచేశారు.

రాణిపేట కార్మిక సంఘాధ్యక్షునిపై నెల్లికుప్పంను 6 గంటలలో వదిలి పెట్టి వెళ్ళాలని, నెలరోజుల వరకు నెల్లికుప్పంలోని 5 మైళ్ళ ఆవరణలోకి రాకూడదనీ ఎక్స్టర్న్మెంటు ఆర్డర్ జారీ చేయబడింది. కాంగ్రెస్‌మంత్రి వర్గం అధికారంలోకి వచ్చిన తర్వాత ఇలాంటి ఉత్తరు లివ్వడం ఇదే తొలిసారి

రాణిపేటలో కూడా కార్మికులపైన, కార్మిక నాయకులపైన 2 నెలల వరకు సభలు జరుపరాదని 144వ సెక్షన్ క్రింద ఉత్తర్వులు జారీ చేశారు.

నెల్లికుప్పంలో పికెటింగు చేసినందుకు 38 మందిని అరెస్టు చేశారు. 13 గురికి శిక్ష విధించారు.

సమ్మె మే 25వ తేదిన ముగిసినట్లు దుద్దుంపాడి సత్యనారాయణగారు తెలియచేశారు.

## కాకినాడ రిక్షా కార్మికుల సమ్మె

కాకినాడ రిక్షా కార్మికులు 1939 అగస్టు-సెప్టెంబరులలో సమ్మె చేశారు. రిక్షా యజమానుల అద్దె 5 అణాల నుండి 4 అణాలకు తగ్గించాలని, రిక్షాలో ఇద్దరు ఎక్కి వారి సామాన్లు పెట్టుకొనేందుకు అనువుగా రిక్షాలుండాలనీ, రిక్షాకు రాత్రిళ్ళు ఒక లైటు మాత్రం ఉంటే చాలుననీ, పోలీసు దౌర్జన్యాలు నశించాలనీ కోరుతూ ఈ సమ్మె జరిగింది.

ఇదే కాలంలో కాకినాడ పడవ పనివారి సమ్మె కుడా 15 రోజులకు పైగా సాగింది.

## కాకినాడ బి. ఓ. సి. కార్మిక సంఘం

కాకినాడ బర్మాషెల్ ఆయిల్ కర్పోరేజ్ అండ్ డిస్ట్రిబ్యూటింగు కంపెనీలో 224 మంది పనిచేస్తూ వుండేవారు. 1939 లో వారిని కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ సంఘటితపరచి జూన్ 15 న సంఘం ఏర్పరచింది. పనిలోకి వెళ్ళేముందు రోజూ ఉదయం 15 నిమిషాలు ఈ కార్మికుల సమావేశాలుండేవి. కంపెనీ టైముకు అర గంట ముందుగానే ఈ సమావేశాలలో హాజరయ్యేందుకుగాను కార్మికులు వచ్చి కూర్చుండేవారు. తర్వాత సి. ఐ. డిలు కూడా వచ్చి కూర్చునేవారు. ఒక మాసం

ఇలా గడిచిన తర్వాత సి ఐ. డి. లు షార్ట్‌హాండ్ రిపోర్టు తీసుకొనేవారు. ఈ బెదరింపులకు కార్మికులు లొంగలేదు. 3-8-39 నాటికి 180 మంది సంఘంలో చేరారు. సర్వసభ్య సమావేశం జరిగిందానాడు. కంపెనీ తన ఏంజట్లను ఈ సభకు పంపింది. కాని ఇది గమనించిన కార్యకర్తలు వారిని బయటికి పంపారు. ఈ జిల్లా ట్రేడ్ యూనియన్ కౌన్సిల్‌కు అనుబంధించాలని తీర్మానించారు. సి. వి. కె. రావు అధ్యక్షులు కె. శేషగిరిరావు ఉపాధ్యక్షులుగా పర్వతనేని వెంకటేశ్వరరావు కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు.

## మున్సిపల్ కార్మిక రంగం

మున్సిపల్ కార్మికులను సమీకరించి వారిని సంఘటితంచేయటంలో కమ్యూనిస్టు కార్యకర్తలు జరిపిన కృషిమూలంగా కాకినాడ, గుడివాడ, గుంటూరు, ఏలూరు, తెనాలి, బెజవాడ, బందరు, నెల్లూరు పట్టణాలలో మున్సిపల్ కార్మిక సంఘాలు 1939-40 నాటికి నిర్మాణరూపం దాల్చాయి. 1941 నాటికి ఆంధ్రరాష్ట్ర మున్సిపల్ కార్మికసంఘం ఏర్పడింది. కమ్యూనిస్టు పార్టీ ఆధ్వర్యంలో పనిచేసే బలమైన కార్మిక సంఘాలలో ఒకటిగా మున్సిపల్ కార్మిక సంఘం రూపు దిద్దుకుంది.

### పారిశుధ్య కార్మికులు

మున్సిపల్ కార్మికులలో సాంఘికంగా, ఆర్థికంగా తక్కువ స్థాయిలో ఉన్నది పారిశుధ్య కార్మికులే. ఆరోజుల్లో ప్రతి మున్సిపాలిటీలోను పారిశుధ్య కార్మికులు ఒక ముఖ్య భాగంగా ఉండేవారు. పారిశుధ్య కార్మికులను సంఘటిత పరచడానికి, వారి సమస్యల పరిష్కారానికి 1936 వరకు పెద్దగా ప్రయత్నమేమీ జరగలేదనే చెప్పాలి.

కార్మిక ఐక్యతకు కార్మిక సంఘాల నిర్మాణానికి కృషి చేస్తూన్న కమ్యూనిస్టు కార్యకర్తలు 1936 నుండి వివిధ పట్టణాల్లో ఉన్న పారిశుధ్య కార్మికులను సమైక్యపరిచే ప్రయత్నాలను ప్రారంభించారు. పారిశుధ్య కార్మికుల సమస్యల పరిష్కారానికి చేసే సమ్మెలకు ఇతర రంగాలలో ఉన్న కార్మికుల సహాయ సానుభూతులను కూడా అందింప చేయగలిగారు. అదేవిధంగా ఇతర రంగాల్లోని కార్మికుల సమ్మెలకు పారిశుధ్య కార్మికుల సమీకరించి, పారిశుద్ధ్య కార్మికులలో సంఘీభావ దృక్పథమును పెంపొందించ గలిగారు.

వివిధ పట్టణాల్లో పారిశుధ్య కార్మికుల సమస్యపై జరిగిన ఆందోళన, సంఘ నిర్మాణ కార్యక్రమాలను విపులంగా ఇస్తున్నాం.

### కాకినాడ :

కాకినాడలో పీచు కార్మికుల సమ్మె జరిగిన సందర్భంగా పారిశుధ్య కార్మికులు (స్కావెంజర్స్) ఒక రోజు సానుభూతి సమ్మె చేశారు. దానికి శిక్షగా

ఆ రోజు నాగా కట్టారు. కొంతమందిని తీసివేశారు. దీనిపై యూనియన్, మున్సి పల్ అధికారులకు జాబు రాయగా ప్రతీకార చర్య కొంత ఆపుదల చేశారు.

వీరి నెలసరి జీతాలు 6 రూపాయల నుండి 12 రూపాయల వరకు ఉంటుంది. వాటిలో నాగాల క్రింద కొంత కోశారు. మస్తరుకు హాజరవడం ఆలస్యమైనా నాగా వేసేవారు.

గర్భవతులైన స్త్రీలకు రెండు మాసాలు సెలవుపై జీతం ఇవ్వాలి కాని దీనిని సరిగా అమలుపరచలేదు. వేరే సెలవులంటూ పారిశుధ్య కార్మికులకు లేవు. శానిటరీ ఇన్‌స్పెక్టర్లు వారిపై చేసే దౌర్జన్యం, హడావిడీ అధికం. వారి జీతాల నష్టాలకు కారకులు కొంతవరకు వీరే.

1939 ఆగస్టు 1 న ఎక్కువ పని చేసిన పారిశుధ్య కార్మికునికి తక్కువ జీతం ఇవ్వజూచారు. అతను జీతం తీసుకోకుండా వెళ్ళిపోయాడు.

## కర్నూలు:

1936 లో కర్నూల్‌లో రోజుకు ఒక పూట 40 పాయిఖానా దొడ్లు బాగు చేస్తే నెలకు 13 రూపాయలు జీతం ఉండేది. 1938లో 80 దొడ్లు రెండుపూటలా బాగుచేస్తే నెలకు 9 రూపాయలు మాత్రం ఇస్తున్నారు. అది కూడా నెలజీతాలుగా గాక, రోజుకూలీ ప్రకారం లెక్కగట్టి ఇస్తున్నారు. కర్నూలు పారిశుధ్యకార్మికుల పరిస్థితులను మెరుగుపరిచేందుకు ఏర్పరచిన సభలలో కందుల ఓబుల్‌రెడ్డి, పి. తిమ్మారెడ్డి పాల్గొనేవారు.

## నంద్యాల :

జూన్ 30 న మున్సిపల్ స్వీపర్స్ అండ్ స్కావెంజర్స్ యూనియన్ సమావేశం కోడి నర్సింహం గారి అధ్యక్షతన జరిగింది. మున్సిపల్ ఆఫీసులోని ఎద్దుల డిపోలో ఎలాంటి అలవెన్సు లేకుండా తమ డ్యూటీకి తోడుగా రాత్రిళ్ళు పడుకొని కాపలా కాయాలని మున్సిపల్ అధికారులు నిర్ణయించారు. ఈ నిర్ణయాన్ని రద్దు చేయాలని కమీషనర్, ఛైర్మన్‌గార్లను కోరుతూ ఈ సమావేశం కోరింది.

దినభత్యం నాల్గణాల నుండి ఐదణాలకు హెచ్చించాలనీ, టైమరీపికరీ శాఖలో పనిచేసే వారికి నోటికి ముక్కుకు కావలసిన గుడ్డలు సప్లయి చేయాలని, పాయిఖానా దొడ్లను పరిశుభ్రంగా కట్టించాలని కూడా ఈ సమావేశం తీర్మా నించింది. అధికార్లతో ప్రధాన కార్యదర్శి బూచరాజు నర్సింహారావు ఈ కోర్కెల విషయమై సంప్రతించారు. పై అధికారులకు రాసి తగు చర్యలు తీసు కొంటామని అధికారులు హామీ ఇచ్చారు.

## తెనాలి :

1939లో తెనాలిలో పెంటకుప్పల బళ్లు తోలే వారికి నెలకు 10 రూపాయ లిచ్చేవారు. తర్వాత ఎడ్ల యజమానులైన కంట్రాక్టర్లు వారి జీతాలను 9 రూపా యలకు తగ్గించారు. 1939 ఏప్రిల్ 3వ తేదీన తమకు 10 రూపాయల జీతా లివ్వాలని కోరగా కంట్రాక్టర్లు, శానిటరీ ఇన్‌స్పెక్టర్లు నిరాకరించారు. బళ్ళవాళ్లు సమ్మె చేసారు. 10 రూపాయలు చెల్లించడానికి కాంట్రాక్టర్లు అంగీకరించిన తరు వాత సమ్మె విరమింపబడింది.

## గుడివాడ :

12-12-38న గుడివాడ పారిశుధ్య కార్మికులు సమావేశమై శెట్టిపల్లి వెంకటరత్నం గారిని అధ్యక్షులుగా, వడ్డాది చలమయ్యను కార్యదర్శిగా మరో ౮ మందిని కార్యనిర్వాహక వర్గాన్ని ఎన్నుకొన్నారు. మున్సిపాలిటీ వారు ఈ క్రింది కోర్కెలను తీర్చవలసిందిగా కోరారు.

1. గూడెంలో రెండు ఎలక్ట్రిక్ దీపాలు వేయాలి.

2. సినిమా హాలు ముందున్న నూతిని బాగు చేయించాలి.

3. సినిమా హాలు నుండి వచ్చే మురుగు నీరుపోవడానికి సైడుకాల్వ త్రవ్వించాలి.

4. నగరంలో ఉన్న 6 పాకీ దొడ్లకు 6 గురిని ఏర్పరచాలి.

5. పాకీ పని వారికి రు. 12 కన్న ఎక్కువ జీతం ఇవ్వరాదనే జి.ఓ.ను రద్దుచేసి నెలకు రు 20/- ప్రతి ఒక్కరికి ఇవ్వాలి.

6. ప్రావిడెంటు ఫండు, పెన్షన్లు, గర్భిణీ స్త్రీలకు 2 నెలల జీతంతో సెలవు, చిన్న పిల్లలకు ఉచిత విద్య, పెద్దవారికి రాత్రి పాఠశాల, పాకీ పని వారికి చెప్పులు, చంటి పిల్లలకు క్రెచీలు, క్యాజువల్ లీవ్, ప్రివిలేజ్ లీవ్ 1 నెల, వర్షాకాలంలో కోట్లు, ఇళ్ళు లేని వారికి ఇళ్ళు ఏర్పాటు చేయాలి.

సంఘ నిర్మాణాన్ని పటిష్టం చేసుకుని తక్షణ కోర్కెలను సాధించు కోవాలనే భావం కార్మికులలో క్రమంగా బలపడింది. కార్మిక సంఘం ప్రతి పాదించిన కోర్కెలు కార్మికులలో విస్తృత ప్రచారమయ్యాయి. పారిశుధ్య కార్మికులు సంఘంగా ఏర్పడి సమైక్య మవుతున్న ఈ కాలంలోనే మున్సిపల్ కమీషనర్ మరో కొత్త ఉత్తర్వు జారీ చేశాడు. గొడ్లు లాగే చెత్త బళ్ళను కూడా కార్మికులే లాగాలని 1939 లో కమీషనర్ ఆజ్ఞలు జారీ చేశాడు. పారిశుధ్య కార్మికులను కించపరిచే విధంగా కమీషనర్ జారీ చేసిన ఉత్తర్వులను అమలు పరచడానికి కార్మికులు నిరాకరించారు. ఈ ఉత్తర్వును వెంటనే రద్దు చేయాలని,

కార్మిక సంఘం నివేదించిన కోర్కెలను అమలు చేయాలని కోరుతూ 1939 ఏప్రియల్ ఒకటి నుండి గుడివాడ పారిశుధ్య కార్మికులు సమ్మె ప్రారంభించారు.

సమ్మె చేసిన కార్మికుల ప్రధాన కోర్కెలు ఈ విధంగా ఉన్నాయి:

1. గొడ్లు లాగే పెంట బళ్ళను పనివారిని లాగమనకూడదు.

2. స్త్రీలకు ప్రసూతి సెలవు ప్రసవానికి ముందు ఒకనెల, తరువాత ఒక నెల జీతంతో ఇవ్వాలి,

3. సంవత్సరానికి 15 రోజులు క్యాజువల్ సెలవు ఇవ్వాలి.

4. పాకీపనికి ఇళ్ళ పన్ను, పెంట బళ్ళ పన్ను తీసి వేయాలి.

5. దొడ్ల పని చేసేవారికి ఇతర పనులు చెప్పకూడదు.

6. తగిన కారణాలతో నిరూపించకుండా జరిమానాలు వేయరాదు.

7. స్త్రీ పురుష మునిసిపల్ ఉద్యోగుల్ని తిట్టుట, కొట్టుట మానాలి

8. 6 మాసాల కొకసారి పని వారల పనులు మార్చాలి.

9. గ్రామాలలో పాకీ పనివారిలో నిరుద్యోగులుండగా పని వారిని ఇతర గ్రామాల నుండి తేరాదు. ఉద్యోగాలు స్త్రీ పురుషులకు సమానంగా ఇవ్వాలి.

10. ఇతర మున్సిపాలిటీలలో ఇచ్చే జీతాలను ఇక్కడ కూడా యివ్వాలి.

11. ఇళ్ళముందు సినిమా హాల్సు నుండి వచ్చే మురుగును తొలగించాలి.

12. నూతిని ఆనుకొని యున్న మురికి కాలువలను తొలగించి, ఆ నూతికి పళ్ళెం కట్టి యివ్వాలి.

13. మా ఇండ్ల వద్ద దీపాలు వేయాలి.

14. సంఘాన్ని గుర్తించాలి.

—సమ్మె జయప్రదంగా సాగింది. మున్సిపాలిటీ వారు సమావేశమై వారి కోర్కెలు నెరవేర్చడానికి వాగ్దానం చేశారు. మనుష్యులు బండ్లు లాగుట తొలగించారు.

—2, 3, 4 కోర్కెల విషయంలో, (2) ప్రభుత్వ ఉత్తర్వు ప్రకారం 1 నెల సెలవు ఇస్తామని అన్నారు. (3, 4) కోర్కెల విషయం ప్రభుత్వంతో సంప్రతించుతామని అన్నారు.

2-4-39 నుండి పాకీ పనివారు తిరిగి పని ప్రారంభించారు.

## గుంటూరు :

1938 జనవరి నెలాఖరున గుంటూరు సిటీ మున్సిపల్ స్కావెంజర్సు 200 మంది ప్రభల కృష్ణమూర్తి గారి అధ్యక్షతను సమావేశమయ్యారు. సంఘ ఆవశ్యకతను గురించి కొందరు మాట్లాడిన తర్వాత ప్రభల కృష్ణమూర్తి గారు

అధ్యక్షులుగా, చెన్నా కనకయ్య కార్యదర్శిగా, మరో 13 మందితో కార్య నిర్వాహక వర్గాన్ని సమావేశం ఎన్నుకొంది.

మద్రాసు (ఉమ్మడి) రాష్ట్ర ప్రధాని (ముఖ్యమంత్రి) గుంటూరులో పర్యటించినపుడు ఆయనకు ఈ క్రింది కోర్కెలతో ఒక మెమొరాండాన్ని యూనియన్ సమర్పించింది.

1. కనీస జీతం నెలకు 15 రూపాయలుండాలి.

2. రోజుకు 8 గంటల పని.

3. జబ్బు చేసినపుడు సెలవు, సంవత్సరానికి నెల రోజుల జీతంతో సెలవు, గర్భిణీ స్త్రీలకు జీతంతో 2 నెలలు సెలవు. ఆదివారం సెలవు ఇవ్వాలి.

4. ఉచితంగా జత దుస్తు లివ్వాలి.

5. ఉచిత వైద్య సదుపాయం కలిగించాలి.

6. ఉద్యోగాలను ఖాయపరచాలి.

7. లంచగొండితనం మాన్పించాలి.

8. పరిశుభ్ర పరచవలసిన దొడ్ల సంఖ్యను తగ్గించి, ఒక్కొక్కరికి 35 చొప్పున ఉంచాలి.

## నెల్లూరు :

మద్రాసు రాష్ట్ర ప్రధాని (ముఖ్యమంత్రి) ఆంధ్ర దేశ పర్యటన సందర్భంగా నెల్లూరు మున్సిపల్ స్కావెంజర్ల సంఘాధ్యక్షుడు రావి ఆదిశేషయ్యగారు పారిశుధ్య కార్మికుల కోర్కెలను తెలియజేస్తూ 1-7-38 న ఒక విజ్ఞప్తి పత్రాన్ని సమర్పించారు.

1. స్కావెంజర్లను ఖాయపు నౌకర్లుగా చేయాలి.

2. రోజుకు 8 గంటల పని.

3. సంవత్సరానికి జీతంపై 15 రోజుల సెలవు, ఒకనెల ప్రివిలేజ్ సెలవు.

4. రు. 15/- తక్కువ గాకుండా జీతం.

5. సర్వీసును బట్టి జీతం హెచ్చించాలి.

6. రెండు నెలల మెడికల్ సెలవు.

7. స్త్రీలకు ప్రసవ సమయంలో నెల రోజుల జీతంతో సెలవు.

8. ప్రావిడెంటు ఫండు ఏర్పరచాలి.

9. చెప్పులు, యూనిఫారం డ్రెస్ ఇవ్వాలి

10. శుభ్రమైన వసతి గృహం కట్టించి ఇవ్వాలి.

ఈ పై కోర్కెలను అమలులోకి వచ్చే విధంగా స్థానిక సంఘాలు ఆందోళన చేయాలని ఆదిశేషయ్యగారు విజ్ఞప్తి చేశారు. తమ కోర్కెలను వెంటనే

అమలుపరచాలని కోరుతూ మున్సిపల్ కమీషనర్‌కు విజ్ఞప్తి చేసారు. కోర్కెల అమలుకు ఆందోళనను చేపట్టగలమని కార్మిక సంఘం హెచ్చరించింది. కార్మికుల కోర్కెలలో కొన్నిటిని అంగీకరించటానికి కమీషనర్ సిద్ధపడ్డాడు. 1938 నవంబరు 13 న పారిశుధ్య కార్మికులతో రాజీ కుదుర్చుకుని వారికి యూనిఫారం అందివ్వడం, మొదలగు కోర్కెలను అమలు చేస్తామని మున్సిపల్ అధికారులు హామీ ఇచ్చారు.

నెల్లూరు మున్సిపల్ వర్కర్స్ యూనియన్ వార్షిక సభ 27-8-39 న మున్సిపల్ కౌన్సిలర్ యం. హనుమంతరావు అధ్యక్షతను జరిగింది. కార్యదర్శి నివేదికలో ఈ క్రింది అంశాలు తెలియజేశారు.

* పనివారిచే ఎక్కువ కాలం పనిచేయిస్తున్నారు.
* ఒళ్ళు లాగే పని అదనం అయినప్పటికీ దానికి కూలి ఇవ్వడం లేదు.
* సమ్మె అనంతరం చేసుకొన్న రాజీ షరతుల్ని ముఖ్యమైన వాటిని వేటినీ అమలు పరచడం లేదు.

అధ్యక్షులు రావి ఆదిశేషయ్య, మున్సిపల్ కౌన్సిలర్ గోపాలరావు గార్లు సంఘావశ్యకతను గురించి చెప్పిన తర్వాత ఈ క్రింది తీర్మానాలు ఆమోదించబడ్డాయి :-

1. మీనియల్స్‌కు రూ. 12 కంటే ఎక్కువ ఇవ్వకూడదనే 10-2-37 తేదీగల 646 నెం. జి. ఒ. ను (ఇది నడుమంత్రపు మంత్రి వర్గం చేసింది.) కాంగ్రెస్ మంత్రివర్గం రద్దు చేయనందుకు విచారం వెలిబుచ్చుతూ తక్షణం రద్దు చేయాలని కోరుతున్నారు.

2. అన్ని డిపార్టుమెంటుల ఉద్యోగుల లాగానే మున్సిపల్ కూలీలందరి ఉద్యోగాలను ఖాయం చేయాలి. సిక్ లీవు, కాజువల్ లీవ్, ప్రావిడెంటు ఫండు వగైరా ఏర్పాటు చేయాలి. జీతం కనీసం నెలకి రూ. 15 గా నిర్ణయించే చట్టాన్ని సాధ్యమైనంత త్వరగా చేయాలని కాంగ్రెస్ మంత్రి వర్గాన్ని కోరుతున్నారు.

3. రెండు సంవత్సరాలు పని వారిచే (ఎద్దులకు బదులు) బండ్లు లాగించే పద్ధతిని తీసివేయాలని కోరుతున్నప్పటికీ తీసివేయలేదు. 13-11-38 రాజీ ప్రకారం కూడా తీసివేయవలసి ఉన్నా అలా తీసివేయలేదు ఈ పద్ధతిని తీసివేయవలసిందిగా మున్సిపాలిటీని కోరుతూ, ఈ పద్ధతి రద్దయే వరకు యూనియన్ తీవ్రంగా కృషి చేస్తుందని తీర్మానించబడింది

4. ఒక్కొక్క స్కావెంజర్ 40 ఇండ్లలో శుభ్ర పరచవలసి వుండగా 100 ఇండ్లలో పని చేయవలసి వస్తోంది. ఇది అక్రమమని ఈ పద్ధతిని రద్దు చేయాలని మున్సిపాలిటీని కోరడమైనది.

5. సంవత్సరం సర్వీస్‌పై బడ్డ పనివారందరికీ రూ. 12 జీతం ఇవ్వాలి. స్త్రీలకు కూడా పురుషులతో సమానంగా జీతం ఇవ్వాలి అని మున్సిపాలిటీని కోరడమైంది.

6. క్రమేణా స్త్రీలను పనినుండి తీసివేసే పద్ధతిని రద్దు చేయవలసిందిగా కమీషనర్‌ను కోరుతున్నారు.

7. పనివాండ్ల గూడేలు చాలా అనారోగ్యంగా వున్నాయి. అక్కడ రోడ్లు లైట్లు, నీటి వసతి కలుగజేయవలసిందిగా మున్సిపాలిటీని కోరుచున్నారు.

8. పని వాండ్లు తమ బిడ్డలకు జబ్బు వచ్చినపుడు (సకాలంలో) ఆస్పత్రిలకు తీసుకొనివెళ్ళలేక పోతున్నారు. కావున గూడెములకు అప్పుడప్పుడు డాక్టరును పంపవలసిందిగా కోరుతున్నారు.

9. చట్టరీత్యా పనివారికి సాలీనా రెండు జతలు బట్టలివ్వాలి. 13-11-38 రాజీ ప్రకారం సాలీనా రూ. 6-0-0 బట్టలివ్వాలి. కాని ఈ రాజీని అమలు పరచనందుకు నిరసన తెలియజేస్తున్నారు.

## మోటారు కార్మికులు :

మోటారు బస్ సర్వీసు దుస్థితి ఎలా ఉండేదో 1938 జనవరిలో జరిగిన సంఘటన తెలియజేస్తుంది. ఏలూరు నుండి గుడివాడ వెళ్ళే కె. వి. యం. రావు బ్రదర్స్ మోటారు సర్వీస్‌కు చెందిన బస్ స్టాండ్‌లో వుంది. సర్కిల్ ఇన్‌స్పెక్టరుగారికి 4 టిక్కెట్లు కావాలి అంటూ రైటర్ వచ్చి కండక్టరును అడిగాడు ఒకటి మాత్రం ఫ్రీగా ఇస్తామని అతడు ఇచ్చాడు రైటర్ పట్టణ సబ్ ఇన్‌స్పెక్టరును తీసుకొచ్చాడు. అతను టిక్కెట్లు ఎందుకివ్వవని దబాయించాడు. యజమాని పర్మిషన్ కావాలని చెబుతున్నా "నిన్ను ఏం చేస్తానో చూడు రాస్కెల్, నీ లైసెన్సు కాన్సిల్ చేయిస్తాను. ఉద్యోగం తీయించివేస్తాను. పోలీసువాళ్ళంటే ఇంత నిర్లక్ష్యమా అంటూ, నల్గురు ప్రయాణీకుల్ని దింపి బలవంతంగా బస్సును సర్కిల్‌గారింటికి తీసుకువెళ్ళి వారి తాలుకు నల్గురిని ఎక్కించారు. కండక్టర్ జిల్లా కలెక్టరుకు, సూపర్నెంటుకు పిటీషన్ పెట్టాడు. విచారణ జరిగి డ్రైవర్‌వద్ద స్టేటుమెంటు తీసుకొన్నారు. మోటారు సర్వీసులో పనిచేసేవారిపై యజమానుల దోపిడీతోపాటు పోలీసుల దౌర్జన్యం ఎక్కువగా ఉండేది.

ఇలాంటి దౌర్జన్యాలు జరుపుతున్నందుకు 3-3-39న తెనాలి తాలుకా మోటార్లు కారు డ్రైవర్ల సంఘం, స్థానిక సబ్ ఇన్‌స్పెక్టరు చేస్తున్న దౌర్జన్యాలను ఖండించింది.

బస్సులను పోలీసు అధికారుల ఇండ్లకు స్టేషన్లకు తీసుకువెళుతూ చట్టాన్ని ఉల్లంఘించుతున్న అధికారులపై తగు చర్య తీసుకోవాలని కోరింది. డ్రైవర్

లైసెన్సు రెన్యూయల్ రుసుం 3 రూపాయల నుండి రెండు రూపాయలకు తగ్గించాలని కోరింది.

1938 డిసెంబరు ప్రాంతంలో తెనాలి-గుంటూరు బస్ సర్వీస్‌లో 12 మంది డ్రైవర్లు ఉదయగిరి గోపాలరావు అధ్యక్షతను సంఘం ఏర్పరచుకొని రిజిస్టరు చేయించుకొన్నారు. సంఘం ఏర్పడిన తర్వాత డ్రైవర్లను చీటికి మాటికి తీసివేయడం జరిమానాలు విధించడం తగ్గిపోయింది. రూ. 25 నుండి రూ. 30/- లకు జీతం పెరిగింది. 4 రూపాయలు బేటా, నెలకు ఒక రోజు సెలవు లభించాయి. యజమానులు సంఘాన్ని విచ్ఛిన్నం చేయడానికి 4 గురిని చీల్చారు. సూపర్‌వైజర్ ఆపమన్న చోట బస్సు ఆపలేదని వంకబెట్టి వాసిరెడ్డి వెంకటాద్రిని పని నుండి తొలగించడానికి యత్నించారు. జిల్లా కాంగ్రెస్ నాయకులు జోక్యం కలుగ జేసుకొని తాము డ్రైవర్ తప్పు చేసిందీ లేనిదీ విచారిస్తామని ఈలోగా డ్రైవర్ జీతంనుండి 2 రూపాయలు మినహాయించుకోవాలని తీర్పు చెప్పారు.

## ఏలూరు :

ఓవర్ లోడ్ చేయరాదనే నిబంధనలో మోటారు పని వారలు తమ సంఘాన్ని ఏలూరులో ఏర్పరచుకున్నారు. తర్వాత పశ్చిమ గోదావరి జిల్లా మోటారు సంఘం ఏర్పడింది. ఆంధ్ర రాష్ట్రంలోని అన్ని జిల్లాలలోనూ జిల్లా సంఘాలు డివిజన్ సంఘాలు జరిపి రాష్ట్ర మోటారు ఫెడరేషన్ జరపాలని 1938 జూలైలో సన్నాహాలు చేశారు.

## రాజమండ్రి :

తూర్పు గోదావరి జిల్లా మోటారు బస్సు డ్రైవర్ల ప్రథమ మహాసభ 23-7-38 న జరిగింది. కాంగ్రెస్ నాయకులు దేవత శ్రీరామమూర్తి అధ్యక్షత వహించారు. జి.యస్. మూర్తిగారు సభను ప్రారంభించారు. 1000 మంది సభకు వచ్చారు. జాతీయ పతాకను, ఎర్రజండాను ప్రతివాద భయంకర వెంకటాచార్యులు గారు ఎగురవేశారు. సభను ప్రారంభించిన బి ఎస్. మూర్తి సంఘటితమవుతున్న కార్మికులను ప్రోత్సహిస్తూ "కాంగ్రెస్ మంత్రులు అధికారంలో వచ్చాక 70 సమ్మెలు జరిగాయి. అందులో 69 జయప్రదంగా పరిష్కరింపబడ్డాయి. .. తీర్మానాలు, ప్రభుత్వానికి విజ్ఞాపనలు, పత్రికా ప్రకటనలు - వీటితోనే సంతృప్తిపడక, మీ తీర్మానాలను మీరైన అమలుపరచండి. కాంగ్రెస్ ప్రభుత్వం చేయవలసిన సహాయం చేస్తుంది. బస్సు వర్కర్ల లోపాలను సర్దుకోవాలి". అని ఉద్బోధించారు.

## ఈ మహాసభలో ఆమోదించిన తీర్మానాలు :

—రోడ్లు త్వరగా బాగు చేయించాలి.

—లైసెన్సులు తగ్గించాలి.

—సాక్ష్యం లేకుండా కేసులు పెట్టరాదు.

—పరిమిట్ విషయంలో సస్పెండ్‌చేసే అధికారం కలెక్టరుకు మాత్రమే ఉండాలి.

—స్పీడ్ (ఎక్కువగా స్పీడ్‌తో తోలుతున్నారని) కేసులు తీసివేయాలి.

—బస్‌స్టాండులలోనే కార్యాలయాలను ఏర్పాటు చేయాలి.

బారిష్టర్ కె. శేషగిరిరావు అధ్యక్షులు, చిలకమర్రి సత్యనారాయణాచారి ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు ప. గోదావరి, కృష్ణాజిల్లాల నుండి కూడా డ్రైవర్లు సభకు హాజరయ్యారు.

సింగరాయకొండ బస్ సర్వీసుకు చెందిన డ్రైవర్లు, కండక్టర్లు, క్లీనర్లు 40 మంది జూలై 1 న (సంవత్సరం) సమ్మె చేశారు.

జీతాలు తగ్గింపు, జీతాలలో పక్షపాత ధోరణి, వేర్వేరు సెక్షన్లకు వర్కర్లను మార్చి ఇబ్బంది పెట్టుట సమ్మెకు కారణాలు. మేనేజ్‌మెంటు వారి ఇబ్బందులు విషయం పరిశీలిస్తామని హామీ యివ్వడంతో సమ్మె విరమించబడింది.

**విశాఖ :**

ఉత్తర విశాఖజిల్లా బస్సు పనివారు 1939 ఏప్రిల్ 30 న శ్రీకాకుళంలో సమావేశమై సంఘాన్ని ఏర్పరచుకొన్నారు

## బియ్యపు మిల్లుల కార్మికులు

ఆ రోజుల్లో బియ్యం మిల్లు కార్మికుల పరిస్థితులు ఏవిధంగా ఉండేవో తరిగొప్పుల రైసుమిల్లు కార్మికులే ఒక ఉదాహరణ. కృష్ణా జిల్లా గుడివాడ తాలూకా తరిగొప్పుల రైస్ ఫ్యాక్టరీలో కార్మికులను ఫ్యాక్టరీ రూల్సుకు విరుద్ధంగా పనిచేయించే వారు. పని సమయం ఒక నిర్ణీత పద్ధతిలో లేదు. కార్మిక స్త్రీలకు 4 గంటల పనికి 4 అణాలిస్తున్నట్లు రాసి, రెండణాలే ఇచ్చేవారు. కాటా కూలీలకు బస్తాకు కానీ చొప్పున ఇస్తూ ఉచితంగా రాత్రిళ్ళు కాపలా కాయించుకొంటూ వుండేవారు. బస్తాలలో తరుగు వచ్చిందని చెప్పి వారి వద్ద నిర్బంధంగా కొంత డబ్బు వసూలు చేస్తుండేవారు. రాత్రి కాపలాకు జీతాలు ఇస్తున్నట్లు దొంగ లెక్కలు రాసేవారు. పనివారలు చుట్టుపక్కల గ్రామాలనుంచి రావాలి.

లాభాలు లేవనీ, ధరలు పెరిగాక ఎక్కువ జీతాలిస్తామని హామీ ఇచ్చి కూడా అలా ఇవ్వలేదు. కార్మికులు ఏజంట్ల, గుమాస్తాల ఇండ్లవద్ద వెట్టి చేయాలి. నాల్గయిదు మైళ్ళ దూరాన గ్రామాలలో కాటా వేసినా బస్తాకు కానీ చొప్పునే

కూలి ఇస్తూ వేరే భత్యం ఇచ్చేవారు కారు. గుమాస్తాలకు, బెజవాడలోని కాటా మేస్త్రీలకు, డ్రైవర్లకు సామాన్య కూలీల జీతంనుండి కొంత మినహాయించేవారు. "నెట్టు" (వరస పేర్చడం) కట్టే కూలీలకు అణన్నర ఇచ్చేవారు. మనిషి ఎత్తుకు మించి పది పన్నెండు వరసల ఎత్తున నెట్టుకట్టడం మూలంగా పనిసాగక అణన్నర కూలీ గిట్టుబాటు అయ్యేది కాదు.

## గుడివాడ :

1938 డిసెంబరులో గుడివాడ రైస్ ఫ్యాక్టరీ కార్మిక సంఘం ఏర్పాటు చేసిన ఉపసంఘం మిల్లు యజమానులను కలుసుకొని ఆదివారం సెలవు ఇవ్వవలసిందిగా కోరింది.

గుడివాడలో మొత్తం 10 రైసు మిల్లులున్నాయి. మొత్తం 1000 మంది పనిచేసేవారు ఇందులో 120 మంది ఇంజన్ల పనితో సంబంధం వున్నవారు. కార్మికుల పరిస్థితులిలా వున్నాయి.

—రోజుకు 16 గంటల పని, ఉదయం 8 గంటల మొదలు రాత్రి 8 వరకు.

—వారానికి కనీసం రెండు రోజులైనా 20 గంటల చొప్పున పని వుంటుంది.

—కూలి మాత్రం 3 లేక 4 అణాలు మాత్రమే గిడుతోంది

—ఇంజన్‌కు మరమ్మత్తు వస్తే, అది బాగుపడేవరకు, యింజన్ కూలీలకు పని ఖాళీయే.

—జబ్బుచేస్తే కూలీలకు ఎలాంటి సౌకర్యాలు లేవు. వారం రోజులు జ్వరంతో ఒకతను పని చేస్తున్న ఘటన ఉంది. మరో మిల్లులో ప్రమాదంతో మోచేయివరకు తీసివేశారు. మొదట్లో ఏదోకొంత ఆశ జూపినా తర్వాత ఎగనామం పెట్టారు.

—ఏదో వంకతో పని వారిని బండబూతులు తిడతారు. ఇంటి పనులు కూడా చేయించుకొంటారు.

—ఫ్యాక్టరీ ఆవరణలో మంచినీళ్లగాని పాకీదొడ్లుగాని లేవు. ఈ విధంగా ఫ్యాక్టరీ ఆక్టును యజమానులు ఉల్లంఘించుతున్నారు. ఒకమిల్లు యజమాని మినహా అందరూ అంగీకరించారు. 4-12-38 ఆదివారం నాడు కార్మికులు మీటింగుకు వెళ్ళకూడదని దుర్గా నాగేశ్వర రైసు యజమానులు ఆపివేశారు. శ్రీ సీతారామాంజనేయ రైస్‌మిల్లు కూలీలు మీటింగుకు వెళ్లారనే కారణంతో 5 వ తేదీన పనిలోనికి రావద్దని కొంతసేపు ఆపారు. తర్వాత పనిలోకి రానిచ్చారు. ఉదయం 4 గంటల నుండి రాత్రి 8 గంటలవరకు కూలీలు గుడివాడ రెసుమిల్లులలో పని చేస్తూ ఉండేవారు ఈకాలంలో.

## తెనాలి :

1938 జనవరిలో తెనాలి శాంతి రైస్‌మిల్లులో తోట లక్ష్మయ్య అనే కార్మికుడు ప్రమాదానికి గురియై ప్రయివేటు ఆస్పత్రిలో చికిత్స పొందాడు. యజమానులలో లోభితనం నిర్లక్ష్యం వల్ల రోగి పరిస్థితి అధ్వాన్నమవుతున్న స్థితిలో, అరవేటి రామయ్య అధ్యక్షతను జనవరి 30 న బహిరంగ సభ జరిగింది. పోతేపెద్ది నరసింహమూర్తిగారు యజమానుల అశ్రద్ధను నిరసించుతూ ఉపన్యసించారు. ఎక్స్‌రేలో లక్ష్మయ్య ఎముకలు విరిగినట్లు తేలిందని చెప్పారు. ఫ్యాక్టరీ చట్టంలో పనివారలకున్న వసతులను కూడ వివరించి వాటిని యజమానులు అమలు పరచడం లేదన్నారు. పి. కృష్ణమూర్తి కూడా పనివారల సంఘ ఆవశ్యకతను, హక్కులకై ఆందోళన చేయవలసిన అవసరాన్ని వివరించారు.

తెనాలి రామలింగేశ్వర ఫ్యాక్టరీలో నిప్పు, ఊకవేసే కార్మికుల్ని ఇద్దర్ని 28-6-39 న తొలగించారు తమకు రావలసిన కూలి డబ్బులలో కొంత మినహాయించినందుకు వారు అభ్యంతరం చెప్పగా తొలగించారు. ఇదే పనిచేస్తున్న మరో 8 మంది కార్మికులు, తొలగించబడిన కార్మికులను పనిలోకి తీసుకోపోతే తామూ పనిమాని వేస్తామని సమ్మెచేశారు. ఈ విషయం తెలిసి 29 న కార్మిక స్త్రీలు కూడా పనికి రాలేదు. మొత్తం 22 మంది సమ్మెచేశారు. 29 న ఫ్యాక్టరీ మూసివేశారు. 30 న ఈ విషయం చెప్పకుండా కొందరిచే నిప్పు వేయించి సైరన్ కూయించారు. కాని ఎవరూ పనిలోకి రాలేదు స్థానిక సోషలిస్టుల ఒత్తిడితో పనివారందరినీ పనిలో పెట్టుకోడానికి అంగీకరించినందున 30 వ తేదీ మధ్యాహ్నం ఒంటిగంటకు సమ్మె ముగిసింది.

## తాడేపల్లి గూడెం :

1938 నవంబరు నాటికి తాడేపల్లి గూడెంలో రైస్‌మిల్లుల కార్మికుల సంఘం ఏర్పడింది. ఇక్కడ ఒకే యజమానికి 6 రైస్ మిల్లులున్నాయి. కొందరిని పని నుండి యజమాని తొలగించగా కొందరు కార్మికులు కలుగజేసుకొని తగాదాను పరిష్కరించారు. అక్టోబరులో తమ కార్యకలాపాలను సంఘం కొనసాగించుతూండగా ఎలాంటి నోటీసు లేకుండానే 20 మంది నెల జీతగాండ్రను, 300 మంది కూలీలను తొలగించారు. మిల్లు సామాన్లు అపహరించుకు పోయారని ఆరోపణ చేశారు. ఈ సమస్య కార్మికులంతా సమైక్యమై సమ్మెచేశారు. చిట్టచివరకు పని నుండి తొలగించినవారిని తిరిగి పనిలోకి తీసుకోవడానికి అంగీకరించిన తరువాత సమ్మె విరమించారు.

**విశాఖ :**

రాలీ బ్రదర్స్ కంపెనీలో సమ్మె.

1939 జూన్ 13 వ తేదీ నుండి రాలీ బ్రదర్స్ కంపెనీలో బస్తాలు మోసే కూలీలు 200 మంది సమ్మె చేశారు. కార్మికులు హుక్ నుపయోగించి బస్తాలు ఎత్తి, చేరవేసేవారు. రోజుకు 100 బస్తాలదాకా మోసేవారు. అయినా వారికి రోజు కూలీ రూపాయి మాత్రమే గిట్టుబాటయ్యేది.

అవిసె గింజల బస్తాలను మోస్తుండగా 'హుక్'ను ఉపయోగించరాదన్నారు యజమానులు. హుక్‌ను ఉపయోగించకపోతే రోజుకు పావలా కంటే గిట్టుబాటు కాదని కార్మికుల వాదన.

భీముని పట్నం నుండి 100 మంది కార్మికులను యజమానులు రప్పించి, పని చేయించుకో మొదలు బెట్టారు. విశాఖ పట్టణం హార్బర్ కార్మిక సంఘం జోక్యంతో 25 మంది తిరిగి వెనక్కి వెళ్ళిపోయారు.

18 వ తేదీన హుక్‌ను ఉపయోగించడానికి యజమానులు అంగీకరించి నందున సమ్మె విరమించబడింది.

**బెజవాడ :**

బెజవాడకు రెండు మైళ్ళ దూరంలో మాచారంలో లోకల్ ఫండ్ వర్క్ షాప్ వుంది. రోడ్లు బాగుచేసే ఇంజన్లలో పని చేసే క్లీనర్లు, డ్రైవర్లు, కమ్మర్లు, గాంగ్ పనివారు ఇందులో పనిచేసే వారు. 5 సంవత్సరాలకు పైగా తాత్కాలిక సర్వీసుతో పని చేస్తున్నవారు 28 మంది వరకూ ఉన్నారు. గ్యాంగ్ మేస్త్రీకి 15 సంవత్సరాల సర్వీస్ వుంది. వీరి పరిస్థితి బాగాలేదు. 3 నెలలు జరిగినా జీతాలు ఇవ్వరు. సంవత్సరానికి ఒకటి రెండు నెలలు పనిచేసే వారికి స్వల్ప జీతాలు. అవైనా నెలనెలకు సక్రమంగా ఇవ్వరు. సకాలంలో జీతాలివ్వాలని అడిగితే పని నుండి తీసివేస్తారేమోనని కార్మికులు భయపడుతుండేవారు. వారి పరిస్థితిని మంత్రి గిరి గారికి కార్మిక నాయకులు వివరించారు.

"9 మంది పనిచేసే ప్రతి కర్మాగారానికి ఫ్యాక్టరీ యాక్టు వర్తించుతుంది, దానిని మంత్రి వర్గం అమలు పరచాలి.

జీతాల చెల్లింపు చట్టాన్ని అమలు పరచి ప్రతి నెలా 7 వ తేదీకి జీతాలు వచ్చేటట్లు చూడాలి'' అని కార్మిక నాయకులు కోరారు.

**బెజవాడ :**

పి. డబ్లు. డి. వర్క్‌షాపులో ఇదరిని పనినుండి తీసివేసిన సందర్భంగా 9-3-38న ఆనకట్టవద్ద సభజరిగింది. యూనియన్ ఆవశ్యకతను వివరించి, యూనియన్ ప్రణాళికను చదివివినిపించారు కార్మిక నాయకులు. యూనియన్‌ను ఏర్పాటు

చేసుకొనేందుకు నిర్ణయం తీసుకొన్నారు కార్మికులు. 11వ తేదీన సభలో శ్రీ జయరామ ప్రసాద్ అధ్యక్షతను కె.యల్ నరసింహంగారు ఉపన్యసించారు. హక్కులకోసం ఆందోళనచేసి సంఘాన్ని బలపర్చుకోవలసిందిగా కోరారు. శ్రీ జయరామప్రసాద్ అధ్యక్షుడుగా, ఫిట్టర్ కె. వెంకటస్వామి కార్యదర్శిగా, మరో 11 మంది కార్యనిర్వాహక సభ్యులుగా ఎన్నుకోబడ్డారు.

## రాజమండ్రి :

1933-34 ప్రాంతంలో రాజమండ్రిలో వాటర్ వర్క్సు స్థాపించబడింది. పురపాలకసంఘమే దీనిని నిర్వహించుతూ వుండేది. మున్సిపల్ ఇంజనీరు, తర్వాత వాటర్ వర్క్సు సూపరెండెంట్ దీని నిర్వహణకు బాధ్యులు.

ఇక్కడ పనివారెవ్వరికీ (కార్మికులకు) జీతంమీద సెలవుగాని, అనారోగ్య కారణంగా సెలవుగాని, ఆదివారం సెలవుగాని లేవు. రాత్రి, పగలు అనే విచక్షణ లేకుండా 8 గంటల పనిచేయించేవారు.

1938 ఫిబ్రవరిలో మిషన్లు క్లీనుచేసే కార్మికులను గోదావరిలో ఉండే నుయ్యినుండి మట్టితీసి బాగుచేయవలసిందిగా కోరారు. ''గత నాల్గేండ్లలో ఎప్పుడూ ఇలా జరుగలేదు. కూలి ఇచ్చి ఇతరులచేత చేయించేవారు'' అని జవాబిచ్చినందుకు గాను మున్సిపల్ కమీషనర్ డిస్మిస్ చేశారు. ఆ సమయంలో మున్సిపల్ ఇంజనీరు ఊళ్లోలేరు. ఆయన వచ్చిన తర్వాత రాజీచేశారు. రెండు దినాలు మాత్రం నాగా కట్టి మళ్ళా వారిని పనిలోకి చేర్చుకొనేటట్లు చేశారు.

## ధవళేశ్వరం :

ధవళేశ్వరం పి. డబ్లు. డి. పని వారల సంఘం 1937 డిసెంబరులో ఏర్పడింది. మద్రాసు పి. డబ్లు. డి. శాఖ అధ్యక్షులు పి ఆర్. కె. శర్మ ఈ సంఘాన్ని స్థాపించారు. డిసెంబరు 22 రాత్రి జరిగిన బహిరంగ సభలో ఆయన ఉపన్యసించారు మద్రాసు, బెజవాడ, రాజమండ్రిలలో పి. డబ్లు డి. వర్క్‌షాపులను నిర్వహించుతుందని తెలియచేశారు. బెజవాడ, మద్రాసులలో దినానికి 8 గంటల పని, సంవత్సరానికి 10 రోజులు క్యాజువల్ లీవ్, సంవత్సరానికి 15 రోజులు జీతం గ్రాట్యుయిటీగా ఇస్తున్నారని చెప్పారు. ధవళేశ్వరంలో పని ఖాయం చేయకం లేదు అందుచే కార్మికులు పని లేకుండా గడపవలసి వస్తోంది. పని వారలందరినీ ఒక రకంగా గాక వ్యత్యాసంతో చూస్తున్నారు. ఎదురు తిరిగిన వారిని ఉద్యోగం నుంచి తీసివేస్తున్నారు ఫ్యాక్టరీ రూల్సుకు విరుద్ధంగా ఇక్కడ 9 గంటలు పని చేయించుకొంటున్నారు. సి. సత్యనారాయణ

చారి, గోవిందస్వామిగార్లు కూడా మాట్లాడారు. ఎర్ర జండాలతో కార్మికులు పురవీధుల్లో ఊరేగారు.

ఈ యూనియన్‌లో కంట్రాక్టర్ల క్రింద పనిచేసే కార్మికులను కూడా చేర్చుకొన్న సందర్భంలో పని వాండ్రను కంట్రాక్టర్లు దూషించారు. యూనియన్ లాభం లేదని ప్రచారం చేశారు

మంత్రి గిరి గారికి యూనియన్ తమ ఇబ్బందులను తెలియచేసింది. యూనియన్ కృషి ఫలితంగా సంవత్సరానికి 15 రోజుల సెలవు, పది సంవత్స రాల తర్వాత పెన్షన్ ఏర్పాటుకు అంగీకరించినా అమలు జరుపలేదు.

జాబ్‌వర్క్ పద్ధతి పైననే పీస్ వర్క్సు కూడా ఉండాలని కోరుతూ ఒక సందర్భంలో కార్మికులు సమ్మె చేశారు. పీస్‌వర్క్ పద్ధతిని రద్దు చేయాలని మద్రాసు శాఖాధ్యక్షులు మంత్రిగారికి తెలియ చేశారు.

## కృష్ణా సిమెంటు కార్మికుల సమ్మె

ఎసోసియేటెడ్ సిమెంటు కంపెనీ లిమిటెడ్ (ఎ.సి.సి ) క్రింద 14 సిమెంటు కంపెనీలున్నాయి. వాటిలో 'కృష్ణా సిమెంట్ వర్క్సు' తాడేపల్లి ఒకటి. 1937 లో దీని నిర్మాణం ప్రారంభమైంది. పై తరగతి పనివారంతా గుజరాత్, రాజస్థాన్‌ల నుండి వచ్చినవారు. పార్శీలు, సిక్కులు కూడా ఉన్నారు. గుమాస్తాలు, మామూలు కార్మికులు ఆంధ్రులే. సుమారు 1000 మంది పని చేస్తున్నారు. బూతులు తిట్టడం, కొరడాతో కొట్టడం మామూలు దినచర్య. రాష్ట్ర-రాష్ట్రేతరుల తగాదాగా ఇది తయారైంది. యజమానులు, పై అధికారులు ఆంధ్రు లను నీచంగా చూడటం పరిపాటయింది. పై అధికారుల ఈ నిరంకుశ చర్యలను ఎదుర్కొనేందుకు పని వారలలో ఐకమత్యం ప్రబలింది.

—కంట్రాక్టు పని వారలలోని ఒక కార్మికుడిని కొట్టినందుకు అక్టోబరు 15, 16 తేదీలలో కాంట్రాక్టు కూలీలు సమ్మె చేశారు. సమ్మె 1½ రోజులు సాగింది. కొందరి కృత్రిమ చర్యలవల్ల సమ్మె భగ్నం అయింది.

—పనివారల అసంతృప్తిని గ్రహించిన యజమానులు 14-11-38 న కంపెనీ మేనేజ్‌మెంటు ముమ్మందు భావాలలో ఆంధ్రుల్ని తీసుకొంటామని నోటీసు ప్రకటించింది. అయితే ఇది వట్టి బూటకమని పనివారు గ్రహించారు.

—18-11-38 న సిమెంటు కంపెనీవారు బొంబాయి కార్యాలయానికి ఒక విజ్ఞప్తి పత్రం పంపించారు. అందులో ఆఫీసు సూపర్నెంటు పనివారల్ని చాలా విధాల హింసిస్తున్నాడని ఆంధ్రుల్ని అవమానపరుస్తున్నారని, హెడ్ టైంకీపర్‌ను వెంటనే ట్రాన్స్‌ఫర్ చేయాలని చేరారు.

ఫలితం లేక గిరిగారికి మహజరు ద్వారాను, ప్రకాశంగారి వద్దకు స్వయంగా వెళ్ళి ఇవే కోర్కెలను వెలిబుచ్చారు.

17-12-38 న ఆఫీసు అటెండర్ లక్ష్మీపతిని సస్పెండ్‌చేశారు. వెంటనే పనిమాని కార్మికులు బయటికి వచ్చారు. సమ్మె శాంతియుతంగా సాగింది. లక్ష్మీపతి గారిని పనిలోకి తీసుకొని తక్కిన వారిని పనిలోకి రమ్మని కోరారు.

పని వారంతా తమ కనీస కోర్కెలను కూడా యజమానులందరికీ అంద చేశారు.

## కనీస కోర్కెలు :

1. రోజుకు 8 గంటల పని

2. మగకూలీలకు రోజుకు రూ. 0-7-0, ఆడకూలీలకు రూ. 0-5-0 కూలి ఇవ్వాలి.

3. స్కిల్డ్ లేబరుకు కనీస వేతనం రూ. 1-4-0 ఉండాలి.

4. గుమాస్తాలకు కనీస జీతం రూ. 30 వుండాలి. పనితనం, అనుభవం బట్టి గ్రేడ్‌లు ఉండాలి.

5. యజమానుల వాగ్దానం మేరకు ఆంధ్రులనే పనిలోకి తీసుకోవాలి.

6. ఆంధ్రుల్ని అవమాన పరచిన ఆఫీసర్లను వెంటనే మార్చాలి.

7. యూనియన్ సభ్యులైనందుకు ఎవరినీ పనినుండి తొలగించరాదు. ఏ విధంగాను బాధించకూడదు.

8. సి.ఐ.డి. లను ఏర్పాటు చేయడం మానాలి. ఇక్కడి మాటలు అక్కడ చెప్పడం, పనివారిలో చీలికలు తేప్రయత్నించడం మానాలి.

9. పనివారలను ఏ విధంగానూ అవమానించగూడదు.

10. సమ్మెచేసే రోజులకు జీతం యివ్వాలి.

—ఈ కోర్కెల గురించి బొంబాయి ఆఫీసు వారితో చర్చించి, క్రిస్టమస్ తర్వాత తెలియచేస్తామని అన్నారు.

తమ హక్కుల రక్షణకు, కోర్కెల సాధనకు సంఘటితమై ఉండాల్సిన ఆవశ్యకతను గుర్తించిన కార్మికులు, సంఘాన్ని ఏర్పాటు చేసుకున్నారు.

కృష్ణా సిమెంటు వర్కర్స్ లేబర్ యూనియన్ సమావేశం 29-1-39 న పుబుపుల శివయ్యగారి అధ్యక్షతను జరిగింది. ఈ క్రింది వారితో కార్యవర్గం ఏర్పడింది.

| | | |
|---|---|---|
| అధ్యక్షులు | : | యస్. వి. యల్. నరసింహం, బి. ఎ., బి. యల్.- (గుంటూరు) |
| ఉపాధ్యక్షులు | : | మేకా కోటిరెడ్డి, బాబురావు |

ప్రధాన కార్యదర్శి : పి. అమరేశ్వరరావు
సహాయ కార్యదర్శులు : పులుపుల శివయ్య, కర్రా జానకి రామయ్య మరి కొందరు కార్యనిర్వాహక సభ్యులతో కార్యవర్గం ఏర్పడింది.

## ఏలూరు తోళ్ళ కార్మికుల సమ్మె :

తోళ్ళ పరిశ్రమకు ఏలూరు బహు ప్రసిద్ధి చెందినది. ఏలూరులో బాగు చేసిన తోళ్ళకు లండన్‌లో సైతం ప్రశంస వుండేది. ఏలూరులో 1938 నాటికి 13 తోళ్ళ షాపులు వుండేవి. యజమానులు వేల రూపాయలలో లాభాలు గడించే వారు. కార్మికుల పరిస్థితే దుర్భరంగా ఉండేవి. 2000 లకు పైగా తోళ్ళ కార్మికులు ఉండేవారు. కార్మికులకు పని సమయం ఇన్ని గంటలని లేదు రాత్రింబవళ్ళు పని చేయించేవారు. దుర్భరమైన వాసన వచ్చే తోళ్ళ మధ్య కార్మికులు పనిచేయవలసి వచ్చేది. సున్నపు తొట్లలో (తోళ్ళు శుభ్రం చేసేది వీటిల్లోనే) పనిచేసే వాళ్ళ వేళ్ళు తూట్లు పడేవి. సున్నం తొట్లల్లో పనిచేసిన తరువాత నాలుగు రోజులవరకు చేతులు స్వాధీనం అయ్యేవి కావు. భార్యా, పిల్లలో నోటికి అన్నం అందించాల్సి వచ్చేది. పనిచురుగ్గా చేయడంలేదని కార్మికులను కొరడాలతోనూ, బెత్తాలతోనూ కొట్టేవారు దీనికి తోడు యజమానులు వెట్టిచాకిరీ కూడా చేయించుకునేవారు.

అతిహీనమైన పరిస్థితులలోఉన్న తోళ్ళ కార్మికులను సంఘటిత పర్చడానికి గారపాటి సత్యనారాయణ, రంభా వెంకటప్పయ్య, తాడి అప్పల స్వామి కృషి చేశారు. 1938 ప్రారంభ కాలంలో దండుపాటి అప్పల రాజు కార్యదర్శిగా తోళ్ళ కార్మిక సంఘం ఏర్పడింది.

కార్మికులను మరింత ఇబ్బందుల పాలు చేయడానికి యజమానులు సిద్ధమయ్యారు. కార్మికులకు ఇచ్చే కూలీని తగ్గించి వేసారు.

100 మేక చర్మాలకిచ్చే 4 అణాల కూలిని 3 అణాల మూడు పైసలు చేసారు. 300 చర్మాలు తిప్పితే ఇచ్చే కూలిని 400 చర్మాలు తిప్పితే కాని ఇవ్వమన్నారు. అన్ని రకాలుగా కార్మికులకు ఇచ్చే కూలిలో కోతపెట్టి పనిభారం అధికం చేసారు.

కొత్త షరతులకు లోబడి పనిచేయడానికి కార్మికులు నిరాకరించారు. నిరాకరించినందుకుగాను ఆర్గురు కార్మికులను పనినుండి తొలగించారు.

1938 ఏప్రియల్ 3 నుండి కార్మికులు సమ్మె ప్రారంభించారు. అదనంగా విధించిన పనిభారం తొలగించాలని, రేట్లను పెంచాలని, పిడిత కట్నం పేరుతో

కూలీల నుండి వసూలుచేసే 9 అణాలను తొలగించి దానిని యజమానులే చెల్లించాలని కోరుతూ కార్మికులు సమ్మె ప్రారంభించారు.

కార్మిక ఐక్యతను విచ్ఛిన్నం చేయడానికి యజమానులు సర్వవిధాలుగా ప్రయత్నించారు. కొంతమంది కార్మికులకు డబ్బు ఆశ చూపారు. పోలీసుల చేత బెదిరించారు. మోతే నారాయణ రావుచేత చెప్పించారు. అయినా కార్మికులు దృఢంగా నిలబడ్డారు.

కార్మికుల కోర్కెలను అంగీకరిస్తూ ఏప్రియల్ 8 న యజమానులు రాజీకుదుర్చుకున్న తరువాతనే సమ్మె విరమింప బడింది.

## పిడత కట్నం కోసం పోరాటం

సమైక్యంగా నిలిచి కార్మికులు సాధించుకున్న విజయాన్ని వమ్ము చేయటానికి యజమానులు అదనుకోసం వేచి వున్నారు. డిమాండ్ చేసి కూలీ హెచ్చింపచేసుకున్నారనే కక్షతో పిడత కట్నం ఇవ్వటానికి నిరాకరించారు. పిడత కట్నమంటే ఎవరైనా కార్మికుడు చనిపోతే దహన సంస్కారానికి ఇచ్చే డబ్బు.

1940 లో ప్రభుత్వ నిర్బంధ విధానం జోరుగా సాగుతున్న కాలాన్ని అదనుగా చేసుకుని యజమానులు బిర్ర బిగిసారు. రాజీ షరతుల ప్రకారం యజమానులే పిడిత కట్నం ఇవ్వాలని కార్మికులు పట్టుబట్టారు. యజమానులు నిరాకరించటంతో సమ్మె ప్రారంభించారు. ఎర్రజెండాలతో ఊరేగుతూ సభలు నిర్వహించారు. పోలీసులు విధించిన 144 వ సెక్షన్‌ను ధిక్కరించి ఊరేగింపు నిర్వహించారు. లాఠీచార్జి జరిగినా కార్మికులు సమ్మె విరమించలేదు. సమ్మెచేస్తున్న తోళ్ళ కార్మికులకు అండగా పట్టణంలోని చేనేత కార్మికులు ముందుకువచ్చారు. తోళ్ళ కార్మికులకు బియ్యం ఆహారపదార్థాలు అందించి ఆదుకున్నారు. పిడత కట్నం చెల్లించడానికి అంగీకరించిన పిదప సమ్మె విరమించారు.

## మైకా గని కార్మికులు

1938 నవంబరు నాటికి నెల్లూరు జిల్లాలో 30 మైకా గనులున్నాయి. 6,000 మంది వాటిల్లో పని చేస్తుండేవారు. ఉదయం 8½ గంటల నుంచి సాయంత్రం 7 గంటల వరకు పని వుండేది. భోజనానికి ఒక గంట విశ్రాంతి ఉండదు. రోజుకు 5 అణాల కంటే ఎక్కువ కూలి గిట్టదు. గని అడుగు భాగం నుంచి రెండు ఫర్లాంగులు పైకి తీసుకువస్తే రూ. 0-1-6 మొదలు రూ. 0-5-0 వరకు డిపోలో చేరవేసే కార్మికులకు కూలిగిడుతుంది.

ముడిసరుకును శుభ్రపరచి, యజమానులు ఇచ్చే నమూనాల ప్రకారం కత్తిరించే ఆడ కూలీలు 12 నుండి 20 పౌనులుదాకా తయారు చేసేవారు.

అయినా తప్పుడు తూనికలతో కార్మికుల్ని మోసగించేవారు. సకాలంలో కూలీ ఇవ్వరు. ఇచ్చేవారు కాదు. రెండు మూడు నెలలకొకసారి ఇచ్చేవారు. ప్రతి గని వద్ద దుకాణాలను పెట్టి, రెట్టింపు ధరలకు సరకులను అమ్మించేవారు. కార్మికులకు నివాస సౌకర్యాలు లేవు. 100 మందికి 15 తాటాకు ఇళ్ళుకూడా లేవు. ఉన్న ఇళ్ళకు మరమ్మత్తులు లేవు. కార్మికులకు జబ్బు చేస్తే 10 మైళ్ళ దూరంలో గాని ఆస్పత్రి లేదు. ప్రమాదాలు జరిగినా, చికిత్స సదుపాయాలు లేవు. కార్మికులను తిట్టడం పరిపాటి. స్త్రీలను అనేక విధాల అవమానించేవారు. ప్రభుత్వ చట్టాలు అమలు జరిపేవారు కాదు. 1939 నుండి మైకాగని కార్మికులను సమీకరించి సంఘటితం చేయడానికి కృషి ప్రారంభమైంది. 1942 లో గూడూరు డివిజన్ మైకాగని కార్మిక సంఘం ఏర్పడింది. కాని యజమానులు దీనిని గుర్తించ నిరాకరించారు. 1942 సెప్టెంబర్ 20న జరిగిన గూడూరు డివిజన్ మైకాగని కార్మికుల సభలో కార్మిక సంఘాన్ని గుర్తించాలని, పగటిపని 8 గంటలకన్నా ఎక్కువ ఉండరాదని, ప్రతి పగటిగంటకు అణా కూలీ ఇవ్వాలని, ప్రతి అదనపు గంటకు రెట్టింపు కూలీ ఇవ్వాలని, కరువుభత్యం అణాకు నాలుగు పైసలు హెచ్చించాలని, స్త్రీ కూలీలను రాత్రిపూట పని చేయించరాదని తీర్మానించారు. తురిమెళ్ళ గ్రామంలో జరిగిన ఈ సభకు కాటూరు రాజగోపాలరెడ్డి అధ్యక్షత వహించారు. ఖండవల్లి కృష్ణారావు కూలీల కర్తవ్యాన్ని గురించి ఉపన్యసించారు.

## సమగ్ర కార్మిక శాసనం కోసం కృషి

ఆంధ్ర ప్రాంతంలో 1930 దశక ప్రారంభ కాలంలో మొదలైన పారిశ్రామికాభివృద్ధి క్రమంగా వేగం పుంజుకుంది. పరిశ్రమల సంఖ్యతోపాటుగా కార్మికుల సంఖ్య త్వరితగతిని పెరిగింది. అయితే కార్మికుల రక్షణకు సమగ్రమైన చట్టాలేవీ రూపొందింపబడలేదు. ఫ్యాక్టరీ యాక్టు వంటి చట్టాలు అరా కొరా ఉన్నప్పటికీ యజమానులు వాటిని అమలు పరిచేవారు కాదు. కార్మికులను సంఘటితం చేసి, వారి హక్కుల రక్షణకై కమ్యూనిస్టు కృషి చేయడం ప్రారంభమైన తరువాత సమగ్ర కార్మిక శాసనంలేని లోటు కొట్టొచ్చినట్లు కనపడింది. సమగ్ర కార్మిక శాసనం లేని పరిస్థితిని ఆసరా చేసుకుని యజమానులు చిత్తం వచ్చినట్లు ప్రవర్తించే వారు. కార్మిక సంఘ నిర్మాణానికి కృషి చేస్తున్న వారిని, సంఘాల్లో చేరినవారిని యజమానులు నానా రకాల ఇబ్బందులకు గురిచేసేవారు. యజమానుల అకృత్యాలకు పోలీసు యంత్రాంగం సదా తోడ్పడేది. కనీస అవసరాల కోసం, భద్రతకోసం ఆందోళన చేసిన కార్మికులను నేరస్తులుగా చిత్రీకరించి నిర్బంధించేవారు. ఈ పరిస్థితులను అధిగమించి కార్మిక భద్రతకు, కనీస సౌకర్యాలు, హక్కులు కార్మికులకు శాసనరూపంలో కల్పించాలనే కోరిక సర్వత్రా వెల్లడైంది.

కార్మికులకు ఉద్యోగ భద్రతా, పని గంటల నిర్ణయం, పని చేసేందుకు తగిన పరిస్థితులు, కార్మిక సంఘాల ఏర్పరుచుకునే హక్కు కల్పించాలని తగిన శాసనం రూపొందాలని కమ్యూనిస్టు కార్యకర్తలు ప్రథమం నుండి కోరుతూ వచ్చారు.

1937 లో మద్రాసు రాష్ట్రంలో అధికారంలోనికి వచ్చిన కాంగ్రెసు మంత్రివర్గం కార్మిక సమస్యలపై తన ఉద్దేశ్యాలను తెలియచేస్తూ అక్టోబరు 22 న (1937) ఒక ప్రకటన చేసింది.

"కార్మిక తగాదాల సందర్భాన ఇరు పక్షాల మధ్య రాజీ కుదర్చడానికి ప్రభుత్వం ప్రయత్నించుతుంది.

కార్మికుల కష్ట నిష్ఠూరాలను ముందు తెలియపరచి, కొంత సంప్రదింపులు జరిపిన తరువాత గాని ప్రత్యక్ష ప్రతిక్రియకు దిగకూడదని.

రాజీ కుదరని పక్షంలో ప్రభుత్వం పరిష్కారానికి శక్తి వంచన లేకుండా కృషి చేస్తుంది".

అని కార్మికమంత్రి వి.వి. గిరి ప్రకటించారు. కాంగ్రెసు ప్రభుత్వంచేసిన ఈ విధాన ప్రకటన కార్మిక సమస్యలను తొలగించలేకపోయింది. చట్టపరంగా అన్ని రకాల కార్మికులకు వర్తించే విధంగా సమగ్ర శాసనం రూపొందించాలని కమ్యూనిస్టు కార్యకర్తలు విస్తృత ప్రచారం చేశారు. కాంగ్రెసు ప్రభుత్వం చేసిన విధాన ప్రకటనను యజమానులు ఆచరణలో సాధ్యం కానీయడంలేదు. ప్రభుత్వ సూచనలనుకూడా ఖాతరు చేయకుండా కార్మికులను దోపిడీ చేసేందుకే ప్రయత్నించారు. కొన్ని ప్రాంతాలలో కార్మిక సంఘాలను కనీసం గుర్తించటానికి కూడా నిరాకరించారు.

కార్మికుల ఆందోళనలు నానాటికి తీవ్రమౌతూండటంతో కార్మిక శాసనం రూపొందించటానికి మద్రాసు ప్రభుత్వం సిద్ధమయింది. ఈ పరిస్థితులలో రాష్ట్రంలోని వివిధ కార్మిక సంఘాల ప్రతినిధులు చర్చించుకుని విశాల ప్రాతిపదికపై సమిష్టి సూత్రాల ఆధారంతో ఒకనివేదికను రూపొందించారు. ప్రభుత్వం రూపొందించబోయే కార్మిక శాసనం సమగ్రంగా రూపొందేందుకు నివేదికలోని అంశాలను చేర్చాలని, కార్మిక నాయకులు కోరారు. 1939 మే 12 న మద్రాసు రాష్ట్ర ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు ప్రతినిధులు కార్మిక మంత్రి వి. వి. గిరిని కలుసుకొని ఈ నివేదికను అందచేసారు.

ఈ నివేదికలో ప్రభుత్వానికి కార్మికులు తెలియచేసిన అంశాలు, సూచనలు, కోర్కెలు.

—తగాదాలు పరిష్కారం కాకపోవడానికి కార్మిక సంఘాలను యజమానులు గుర్తించకపోవడం. దీని వల్ల సాధికారంగా యజమానులతో కార్మికులు రాయబారం సాగించలేక పోతున్నారు.

—పరిశ్రమ లేక వ్యాపార సంస్థలో పని చేసే కార్మికులలో 10 శాతం తగ్గని సభ్యులు గల రిజిస్టర్డ్ (కుల తత్వానికి దూరమైన) కార్మిక సంఘాలను నిర్బంధంగా గుర్తించేటట్లు మీ సమగ్ర కార్మిక శాసనంలో ఒక నిబంధన ప్రవేశ పెట్టాలి.

—అలా రిజిష్టరై గుర్తించబడ్డ కార్మిక సంఘాలు వార్తా పత్రికలను, గ్రంథాలను తెప్పించుకొనే అధికారం ఉండాలి.

—కార్మిక సంరక్షణ నింబధనలను కొన్నింటిని శాసనంలో చేర్చాలి.

—కార్మిక నిబంధనలను ఎలా అమలు పరచేదీ తెలుసుకొనేందుకు కార్మిక సంఘాధికారులకు సౌకర్యం కల్పించాలి,

—కార్మిక సంఘానికి కావలసిన రాబడి సొమ్మును వసూలు చేసే అధికారం శాసనపూర్వకంగా కార్మిక సంఘానికి ఇవ్వాలి.

—పని చేసే ఆవరణలో అనుకూలమైన నిర్ణీత స్థలంలో, కార్మికులకు పుస్తకాలను ప్రకటనలనూ పంచిపెట్టుటకు కార్మిక సంఘాధికారులకు వీలు కల్గించాలి. విశ్రాంతి స్థలాల్లో కార్మికులతో సంభాషణలు జరుపుకోవడానికి అవకాశం ఇవ్వాలి.

—కార్మికులందరినీ, లేక ఒక కార్మికునికి నష్టపరచే నిబంధనల సవరణ, కొత్తగా ప్రవేశపెట్టదలిస్తే, యజమానులు ముందుగా ఆ మార్పులు గురించి కార్మిక సంఘాధికారులతో సంప్రతించాలి.

—కార్మిక సంఘ రాయబారులకు యజమానులు సహేతుకమైన వ్రాత పూర్వక ప్రత్యుత్తరం ఇచ్చేలాగు శాసనం చేయాలి.

—రాజీ కుదర్చలేక పోయిన కార్మిక సంఘానికి, అది అప్లికేషన్ పెట్టిన మీదట సహాయపడి, ప్రభుత్వం పరిష్కారం సంఘాన్ని ఏర్పాటు చేయాలి.

—అప్లికేషన్ దాఖలు చేసిన తేదీనుండి 4 వారాలలో పరిష్కార సంఘం వారు విచారణ ముగించి తీర్పు చెప్పాలి. ఉభయ పక్షాలు అంగీకరించితే గాని విచారణ వాయిదా వేయరాదు.

—పరిష్కార పద్ధతులన్నీ విఫలమై కార్మికులు సమ్మె చేసినపుడు బ్లాక్ లెగ్స్‌ను యజమానులు పెట్టకుండా శాసనం ద్వారా ప్రభుత్వం అరికట్టాలి ఈ శాసనాన్ని యజమానులు ధిక్కరించితే, రిజస్టర్డ్ కార్మిక సంఘాలు ఫిర్యాదు చేస్తే ప్రభుత్వం తీవ్రమైన చర్య తీసుకోవాలి.

—కార్మిక, యజమానుల మధ్య ఒడంబడికలు వ్యక్తిగతంగా చేసుకోరాదు. సాధికార కార్మిక సంఘాలు, యజమానులు చేసుకోడానికి ప్రభుత్వం అంగీకరించాలి. ప్రత్యేక వృత్తి నిపుణుల విషయంలో పై నిబంధన అవసరం లేదు.

—రిజిస్టర్డ్ కార్మిక సంఘాలు లేని చోట్ల ప్రభుత్వ పరిష్కర్త అలాంటి ఒడంబడికలు చేసి రిజిస్టర్ చేయవచ్చు.

—రాజీ షరతులను ఏ పక్షమైనా భంగపరచినా, భంగపరచారని ఆరోపణ వచ్చినా, న్యాయస్థానానికి చెందిన ఒక అధికారిని లేదా అధికారులు గల స్వతంత్ర్య విచారణ సంఘాన్ని నెలకొల్పాలి.

—కార్మిక తగాదాల సందర్భంలో పోలీసు శాఖ ప్రవర్తన ఎలా ఉండాలో శాసనంతో స్పష్టం చేయాలి.

—నిరుద్యోగ భీమా అన్ని పారిశ్రామిక సంస్థల కార్మిక సంఘాలకు వర్తింప చేయాలి.

—గుర్తింపబడి సాధికారమై కార్మిక సంఘాధికారులతో సంప్రతించి వారి సలహా తీసుకోకుండా యజమానులు రిట్రెంచ్‌మెంటు అమలు పరచరాదు. ఆ విధంగా కార్మిక శాసనంలో ఒక నిబంధన ప్రవేశపెట్టాలి.

—కార్మికులను తగ్గించి వేయడానికి ఆర్థిక కారణాలను, నైపుణ్యానికి సంబంధించిన కారణాలను యజమానులు ప్రభుత్వానికి తెలియ చేయాలి.

—నెలకు 20 రూపాయలకన్నా తక్కువ జీతం పొందుతున్న కార్మికుల నుంచి నిరుద్యోగ భీమా కోసం వసూలు చేసే మొత్తాన్ని సగానికి తగ్గించాలి.

—నెలకు 10 రూపాయల కన్నా తక్కువ జీతం పొందే కార్మికుల నుండి ఏమీ తీసుకోరాదు. వాటివల్ల నిరుద్యోగ భీమాకు ఏర్పడే కొరతను ప్రభుత్వమే భరించాలి

—పని చేసిన రోజున కార్మికులు మూడు దమ్మిడీలు ఇవ్వడానికి అంగీకరించుతున్నారు.

—కార్మికులు సమ్మె చేస్తున్నప్పుడు, ఆ సమ్మెకు వ్యతిరేకంగా ఫ్యాక్టరీలో పని చేయకపోయినా, డిసిమిస్ అయినా, రాజీనామా పెట్టినా, యజమానులు కార్మికులకు న్యాయంగా రావలసిన సొమ్ము ఇవ్వడానికి నిరాకరించకుండా నిబంధన కల్పించాలి.

—ఈ సందర్భంలో ప్రభుత్వమూ, యజమానులూ ఇంగ్లీషు వారి సాంప్రదాయాన్ని అనుసరించాలి.

— క్రింది అంశాలపై తక్షణం శాసనం తేవాలి.

* 8 గంటల పనిదినం.

* వృద్ధాప్యానికీ, అనారోగ్యానికీ, అనాథ స్థితిలోనున్న వారి జీవనోపాధికి ఏర్పాట్లు చేయాలి.

* పరిశ్రమలలో పని చేయదలచుకొన్న కార్మికుల పని షరతులను నిర్ధారించాలి.

* పని గంటలను నిక్కచ్చిగా నిర్ణయించాలి. షాపు, అసిస్టెంటు సర్వీసు షరతులను న్యాయ సమ్మతంగా అమలు పరచాలి.

ఎటువంటి కార్మిక శాసనం రూపొందించకుండానే 1939 లో కాంగ్రెసు మంత్రివర్గం (యుద్ధం వల్ల) రాజీనామా చేసింది.

## సామ్రాజ్యవాద యుద్ధ దశలో కార్మికోద్యమం :

1939 సెప్టెంబరులో రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభము అవడంతోనే ప్రజా ఉద్యమాల పైన, కమ్యూనిస్టు కార్యకర్తల పైన బ్రిటిషు సామ్రాజ్యవాద ప్రభుత్వం తీవ్ర నిర్బంధ విధానంతో విరుచుకు పడింది. ప్రచార ఆందోళన దశనుదాటి పోరాడుదశకు మరలుతున్న కార్మికోద్యమాన్ని క్రూర దమనకాండతో అణచివేసేందుకు ప్రయత్నించింది. కార్మికోద్యమాన్ని అభివృద్ధి చేస్తూ వచ్చిన ప్రతి కార్యకర్తపైన అరెస్టు వారెంటులు జారీ చేయడం, డిటెయిన్ చేయడం, ఇంటెర్నె చేయడం పెద్ద ఎత్తున సాగించింది.

పిల్లల మర్రి వెంకటేశ్వర్లు, కె.ఎల్. నరసింహం, సి.వి.కె. రావు మొదలైన వారందరు జైళ్ళలో నిర్బంధింపబడ్డారు. అనేకమంది ప్రభుత్వ నిర్బంధాన్ని తప్పించుకుని రహస్య జీవితం ప్రారంభించారు. యుద్ధం పేరుతో ప్రజా ఉద్యమాలను కాలరాయాలని బ్రిటిషు ప్రభుత్వం చేసిన ప్రయత్నాలని వమ్ము చేయడానికి కమ్యూనిస్టు కార్యకర్తలు ప్రయత్నించారు. కార్మిక హక్కులను కాపాడటానికి, వారిలో రాజకీయ చైతన్యం కలుగచేయడానికి, జాతీయ స్వాతంత్ర్య పోరాటంలో భాగంగా కార్మికోద్యమాన్ని అభివృద్ధి చేయడానికి రహస్య జీవితం గడుపుతున్న కార్యకర్తలు ప్రయత్నించారు.

సామ్రాజ్యవాదుల మధ్య జరుగుతున్న యుద్ధానికి భారతీయు లెవరూ సహాయపడకూడదనే ప్రధాన నినాదం కార్మికులలో ప్రచారమయ్యేందుకు కృషి చేసారు. యుద్ధవ్యతిరేక కరపత్రాలు, స్వతంత్ర భారత్ కార్మికులకు అందచేసి వారిని రాజకీయంగా చైతన్యం చేయడానికి ప్రయత్నించారు.

విశాఖపట్టణంలో పోర్టు కార్మికులలో, రైల్వే కార్మికులలో, చిట్టివలస కార్మికులలో యుద్ధ వ్యతిరేక ప్రచారాన్ని రహస్యంగా కొనసాగించడంలో పార్టీ కార్యకర్తలు ముందంజ వేశారు. చిట్టివలస కార్మికుల కాలనీలో రాత్రిళ్ళు అధ్యయన తరగతులు నిర్వహిస్తూ మిల్లులోకి సహితం, యుద్ధవ్యతిరేక కరపత్రాలు, 'స్వతంత్ర్య భారత్' పంపిణీ జరిగేటట్లు తగినరహస్య యంత్రాంగాన్ని పార్టీ

ఏర్పరుచుకుంది. 1940 లో చిట్టివలస కార్మికులలో పనిచేస్తున్న ఎం.వి. భద్రం కార్మికులలో పార్టీకి గట్టి పునాది ఏర్పడేందుకు కృషిచేశారు ఈ సంవత్సరంలోనే చిట్టివలస కార్మికులు మొట్టమొదటిసారిగా 'మేడే' సభను నిర్వహించారు. 1940 లోనే భీమునిపట్నంలో మున్సిపల్ వర్కర్స్ సమైక్యమై కార్మిక సంఘాన్ని ఏర్పరుచుకున్నారు.

కార్మిక పోరాటాలకు నిలయమైన కాకినాడ పట్టణంలో యుద్ధ వ్యతిరేక ప్రచారం విస్తృత స్థాయిలో జరిగింది. యుద్ధవ్యతిరేక కరపత్రాలు పట్టణంలోని ప్రతి కార్మిక వాడలో దర్శన మిచ్చాయి కొన్ని సందర్భాలలో కార్మికులే స్వయంగా యుద్ధ వ్యతిరేక కరపత్రాలు పంపకం చేశారు.

కమ్యూనిస్టు కార్యకర్తలు ప్రభుత్వ నిర్బంధానికి గురికాకుండా కాపాడ టానికి, వారికి రక్షణ కల్పించడానికి కార్మికులు తమంతట తాముగా ముందుకు వచ్చేవారు. దామిశెట్టి పార్థసారధిని పోలీసులు అరెస్టుచేయడానికి ప్రయత్నించి నపుడు కార్మికులే స్వయంగా కాపాడారు ఈ సంఘటనను గురించి దామిశెట్టి పార్థసారథి తన జ్ఞాపకాలలో "మరపురాని ఘటన" అని పేర్కొంటూ ఇలా తెలియ చేశారు.

"రాజమండ్రి పట్టణంలో సలుమూరి నరసింహ అప్పారావు ఇంటిపై ఒక మిట్ట మధ్యాహ్నం పోలీసులు దాడి చేశారు మరొక రక్షణ కేంద్రం దొరకనందున నేను (దామిశెట్టి పార్థసారథి) అక్కడనే ఉన్నాను. చాకచక్యంగా పోలీసుల కన్ను గప్పి నేను రోడ్డుమీదకు వచ్చి ఒక సందులోనికి చురుకుగా నడుస్తున్నాను. పోతరాజు అనే అల్యూమినియం కార్మికుడు కావడి బద్దతో నారక్షణకై నన్ను వెంబడిస్తున్న విషయం నేను గమనించనే లేదు. ఈ లోగా పోలీసులు ఆ దారిని రాకుండా అక్కడున్న వారు మార్గం తప్పించారు. నేను చురుకుగా నడవడం, నా వెనుక పోతరాజు సాయుధుడై వస్తుండటం గమనించి, ఏదో ప్రమాదం వచ్చి ఉంటుందని ఊహించి ప్రెస్సులో అక్షరాలు కూరుస్తున్న దుంగుల అప్పలసామి రోడ్డుపైకి వచ్చి ఏమీ మాట్లాడకుండానే నన్ను లోపలికి తీసుకుపోయి ఒక గదిలో ఉంచి తాళంవేశారు నేను ప్రమాదం నుంచి బయటపడ్డాను. ఆ రాత్రి మరో సురక్షిత ప్రాంతంలో నన్ను ఉంచారు. ఆ ప్రాంతమంతా వారం పదిరోజులు నిర్బంధకాండ సాగింది. నన్ను జాగ్రత్తగా కాపాడి సురక్షిత ప్రాంతానికి మార్చారు."

ఆ రోజుల్లో పార్టీ కార్యకర్తలను ప్రజలు కంటి పాపలా కాపాడుకునే వారనడానికి, పార్టీపట్ల కార్మికులకు వున్న వాత్సల్యానికి ఇది ఒక చిన్న ఉదాహరణ మాత్రమే. యుద్ధాన్ని వ్యతిరేకిస్తూ 'రెండవ సామ్రాజ్యవాద యుద్ధం'

(ది సెకండ్ ఇంపీరియలిస్ట్ వార్) అనే కరపత్రాన్ని కాకినాడ పట్టణంలోని కార్మికులకు పంపిణీ చేసారు. కాకినాడ టి.బి బంగళా వద్ద (1939 అక్టోబరులో) జరుగుతున్న సైనిక రిక్రూట్‌మెంటుకు వ్యతిరేకంగా కమ్యూనిస్టు కార్యకర్తలు కార్మికులు కలసి పికెటింగ్ నిర్వహించారు. ప్రభుత్వాధికారులు, పోలీసులు బెదరింపులు హెచ్చరికలు చేసినా యుద్ధ వ్యతిరేక నినాదాలు చేస్తూ పికెటింగు నిర్వహించారు.

## 1940 ఏలూరు జూట్ కార్మికుల సమ్మె :

1939 లో కార్మికుల వేతనాలను పెంచడానికి మిల్లు యాజమాన్యం అంగీకరించి కార్మిక సంఘంతో ఒప్పందం కుదుర్చుకుంది. కాని ఒప్పందంలోని షరతులను అమలు పరచకుండా కుంటి సాకులతో కాలం వెళ్ళబుచ్చ సాగింది. కార్మిక సంఘం నుండి కార్మికులను విడదీయటానికి ప్రయత్నించసాగింది.

ఒప్పందంలో అంగీకరించిన వేతనాలు చెల్లించాలని కోరుతూ 1940 మార్చిలో జూట్ కార్మికులు సమ్మె ప్రారంభించారు. ఏప్రియల్ 1 న యజమానులు లాకౌటు ప్రకటించారు కార్మికులు యూనియన్‌తో సంబంధం వదులుకుంటే కాని పనిలో చేర్చుకోమని, మిల్లు తెరవమని ప్రకటించారు. న్యాయమైన హక్కులకు సమ్మెచేస్తున్న కార్మికులు యూనియన్‌ని వదలిపెట్టేది లేదని నిక్కచ్చిగా తేల్చి చెప్పారు ఒప్పందాన్ని అమలు పరచమని, కోరుతూ లేబర్ కమీషనర్‌కు పిటీషన్ పెట్టారు. వేతనాలు పెంచటానికి అంగీకరిస్తూ యాజమాన్యం మే 14 న లేబర్ కమీషనర్‌వద్ద ఒప్పందంపై సంతకాలు చేశారు. లాకౌటు ఎత్తివేశారు. కాని తిరిగి యూనియనతో సంబంధంలేకుండా వచ్చినట్లయితే అందరిని పనిలో చేర్చుకుంటామని యజమానులు టముకు వేయించారు. దీనికి అంగీకరించని కార్మికులు తిరిగి సమ్మె ప్రారంభించారు. మిల్లును నడిపేందుకు చిట్టివలసనుండి కార్మికులను తెప్పించింది యాజమాన్యం. సమ్మెచేస్తున్న 1100 మంది కార్మికులు మిల్లువద్ద పికెటింగ్‌ను ప్రారంభించారు దొంగ కూలీలను ప్రతిఘటిస్తూ స్త్రీలు సహితం పికెటింగ్‌లో చేరారు. సమ్మెను ధ్వంసం చేసేందుకు యాజమాన్యంతో కుమ్మక్కయిన పోలీసులు 144 వ సెక్షన్‌ను విధించారు. కార్మికులకు నాయకత్వం వహిస్తున్న రంభా వెంకటప్పయ్య, తాడి అప్పలస్వామి, బల్లింకి సూర్యనారాయణలను అరెస్టు చేసారు. శాంతియుతంగా ఊరేగింపు జరుపుతున్న కార్మికులపై లాఠీ ఛార్జీ చేసారు. పికెటింగ్ చేస్తున్న వారినికూడా క్రూరంగా కొట్టారు

నాయకులు అరెస్టు అయినా కార్మికులు ధైర్యంతో సమ్మెకొనసాగించారు. సమ్మెచేస్తున్న కార్మికులను ఆదుకోవటానికి పట్టణంలోని చేనేత, తోళ్ళ తదితర

కార్మికులంతా ముందుకు వచ్చారు కార్మికులకు సహాయపడేందుకు టాటా-కాలో బియ్యం, ఆహారపదార్థాలు వసూలు చేసి అందించారు సమ్మె ఆరునెలలు పాటు కొనసాగింది. చిట్టివలస నుండి వచ్చిన కార్మికులను వెనుకకు పంపేందుకు కార్మికుల జీతాలు పెంచేందుకు, అంగీకరించి, అమలు జరపడానికి యాజమాన్యం నిర్ణయించిన తరువాతనే 1940 ఆగస్టు చివరిలో సమ్మె విరమింపబడింది.

దుర్భిక్షను సహితం ఎదుర్కొంటూ ఆరునెలలపాటు జూట్ కార్మికులు సాగించిన ఈ సమ్మె కార్మికులలోని సమైక్యతను చాటిచెప్పింది. మిగిలిన రంగాల్లో పనిచేస్తున్న కార్మికులు కూడా సంఘటితమయ్యేందుకు దోహదపడింది. ప్రధానంగా షాపులలో పనిచేసే కార్మికులు షాపు ఎంప్లాయిస్ యూనియన్‌ను ఏర్పరుచుకున్నారు.

## బెజవాడ కార్మికుల సమ్మె :

బెజవాడలో చిట్టు, తవుడూ వ్యాపారం చేసే వర్తక దుకాణాల్లోని కార్మికులకు తగిన వేతనం కాని, పని గంటలకు పరిమితికాని లేదు 1940 లో కార్మికులు సమైక్యమై సంఘాన్ని ఏర్పరుచుకున్నారు. సంఘం ఏర్పడితే కార్మికులకు తగిన సౌకర్యాలు తప్పక కల్పించాల్సి వస్తుందని గ్రహించిన దుకాణాల యజమానులు సంఘాన్ని గుర్తించడానికి కూడా నిరాకరించారు. సంఘంలో చేరితే పనిలోంచి తీసివేయగలమని కూడా బెదిరించారు. సంఘాన్ని గుర్తించితీరాలని కార్మికులంతా పట్టుపట్టారు. 1940 ఫిబ్రవరి 20 నుండి 800 మంది కార్మికులు దుకాణాల ఎదుట పికెటింగు ప్రారంభించారు దుకాణాలలోంచి సరుకులు బయటకు పోకుండా అడ్డుకున్నారు

కార్మికుల సమైక్యతను విచ్ఛిన్నం చేసి, సంఘ నిర్మాణాన్ని దెబ్బతీయడానికి పికెటింగు చేస్తున్న కార్మికులపై లాఠీచార్జీ జరిపారు. మార్చి 3 న జరిగిన లాఠీచార్జీ, 144 వ సెక్షన్ కార్మికులను అధైర్యపరచలేక పోయాయి. యజమానులు సంఘాన్ని గుర్తించడానికి అంగీకరించిన తరువాత కార్మికులు పనిలోకి వెళ్ళారు.

కార్మిక సంఘ నిర్మాణానికి, హక్కులకోసం పోరాటానికి కమ్యూనిస్టు కార్యకర్తలు సాగించిన ప్రచార ఆందోళనలు కార్మికులపై బలమైన ప్రభావాన్ని కలుగచేసాయి. యుద్ధకాలంలో ప్రముఖ కార్మిక నాయకులు, కార్యకర్తలు నిర్బంధింపబడినా కార్మికులు సంఘ నిర్మాణం విచ్ఛిన్నమవకుండా కాపాడుకోగలిగిగారు రహస్యజీవితం గడుపుతున్న కార్యకర్తలు కార్మికులకు ఉత్తేజాన్నిస్తూ వారిలో రాజకీయ చైతన్యం కలుగచేయడానికి ప్రయత్నించారు ఈ కాలంలోనే ఆంధ్ర రాష్ట్ర మున్సిపల్ కార్మికసంఘ ఏర్పడింది. తేలప్రోలు

వెంకట సుబ్బారావు, ఎల్.వి. రత్నం ఈ సంఘానికి అధ్యక్ష, కార్యదర్శులుగా ఎన్నికయ్యారు.

## ప్రజాయుద్ధ దశలో కార్మికోద్యమం :

1942 నాటికి ఫాసిస్టు శక్తుల ప్రమాదం తీవ్రమయింది. ప్రపంచాధిపత్యం కోసం హిట్లరు మూకలు సాగిస్తున్న ప్రమాదకర యుద్ధం భారతదేశపు అంచులకు వచ్చింది. ఈ పరిస్థితులలో కమ్యూనిస్టు పార్టీ ప్రజాయుద్ధ నినాదాన్ని ఇచ్చింది. 1942 జూలై 23 న కమ్యూనిస్టు పార్టీపై నిషేధాన్ని ప్రభుత్వం తొలగించింది. కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తలు బహిరంగంగా ప్రజా ఉద్యమాల్లో పనిచేసేందుకు అవకాశం ఏర్పడింది.

ప్రజాయుద్ధ నినాదంతో పార్టీ కార్యకర్తలు ముందుకు వచ్చినా ప్రభుత్వం మాత్రం నిర్బంధ విధానాన్ని పూర్తిగా సడలించలేదు. కార్మికోద్యమాన్ని అభివృద్ధిచేస్తూ వచ్చిన ప్రధాన కార్యకర్తలను జైళ్ళనుంచి విడుదల చేయలేదు. పిల్లల మర్రి వెంకటేశ్వర్లు వంటి కార్మిక నాయకులను జైళ్ళలోనే ఉంచింది.

యుద్ధ పరిస్థితులను ఆసరా చేసుకొని వ్యాపారస్తులు నిత్యావసర వస్తువుల ధరలను విపరీతంగా పెంచి బ్లాకు మార్కెట్‌లో అమ్మసాగారు. ప్రభుత్వం ప్రకటించిన యుద్ధ అలవెన్సులను కార్మికులకు అందకుండా అధికారులు అడ్డుపడ సాగారు.

కార్మికులకు యుద్ధ అలవెన్సులు అందివ్వాలని, చౌక డిపోలుద్వారా నిత్యావసరవస్తువులు లభింపచేయాలనే ప్రధాన కోర్కెలతో కమ్యూనిస్టు పార్టీ ఆందోళనలు చేపట్టింది.

ప్రభుత్వం ప్రకటించిన యుద్ధ అలవెన్సులను మున్సిపల్ కార్మికులందరికి అందించాలని కోరుతూ 1942 ఆగస్టులో బెజవాడ మున్సిపల్ కార్మికులు ఆందోళన ప్రారంభించారు. బెజవాడ మున్సిపల్ కార్మికులకు అండగా ఏలూరు, రాజమండ్రి, తెనాలి, కాకినాడ, బందరు, గుడివాడ మున్సిపల్ కార్మికులు తమ మద్దతును ప్రకటించారు చివరికి అధికారులు రూపాయికి పావలా అలవెన్సు చెల్లించడానికి అంగీకరించారు.

1942 ఆగస్టు 8, 9 తేదీలలో జరిగిన ఆంధ్ర రాష్ట్ర మున్సిపల్ కార్మిక సంఘ జనరల్ కౌన్సిల్ సమావేశంలో మున్సిపల్ కార్మికుల కోర్కెల అమలుకు ఆందోళనా కార్యక్రమాలను రూపొందించారు. మున్సిపల్ కార్మికుల కోర్కెలవారం నిర్వహించాలని నిర్ణయించారు. కార్మికులకు 5 రూపాయలు యుద్ధ అలవెన్సు చెల్లించాలనే కోర్కెపై ఊరేగింపులు సభలు మూడు రోజులు నిర్వహించాలని రాష్ట్ర

సంఘ నిర్ణయించింది రాష్ట్రంలోని అన్ని మున్సిపల్ కార్మిక సంఘాలు ఈ ఆందోళనా కార్యక్రమానికి సంసిద్ధమయ్యాయి.

ప్రభుత్వం దమనకాండతో తిరిగి విరుచుకు పడింది. రాష్ట్ర సంఘ అధ్యక్షుడు తేలప్రోలు వెంకట సుబ్బారావు, తెనాలి మున్సిపల్ కార్మిక సంఘ సెక్రటరీ పి కృష్ణమూర్తి, ఏలూరు మున్సిపల్ సంఘ కార్యదర్శి ఏ వి. సుబ్బారావులను ప్రభుత్వం నిర్బంధించింది. ప్రభుత్వం సాగించిన ఈ దమనకాండను రాష్ట్ర లోని మున్సిపల్ కార్మికులంతా ఖండించారు బేషరతుగా కార్మిక నాయకులను విడుదల చేయాలని యుద్ధ అలవెన్సు చెల్లించాలని కార్మికులు కోరసాగారు. చివరికి ప్రభుత్వం 4-8-0 పైసలు అలవెన్సుగా చెల్లించడానికి అంగీకరించింది ఆరెస్టు చేసిన నాయకులను విడుదల చేసింది.

## ద్వితీయ ఆంధ్ర రాష్ట్ర మున్సిపల్ కార్మిక మహాసభ :

ప్రజా యుద్ధ కాలంలో నూతన పరిస్థితులకు అనుగుణంగా మున్సిపల్ కార్మికోద్యమాన్ని అభివృద్ధి చేసి, సంఘ నిర్మాణాన్ని మరింతగా సుస్థిర పరచడానికి రెండవ ఆంధ్ర రాష్ట్ర మున్సిపల్ కార్మిక మహాసభను 1943లో నిర్వహించారు. మార్చి 15న బెజవాడలో ఈ మహాసభ జరిగింది. ఈ మహాసభ నాటికి ఆంధ్ర రాష్ట్రంలో మున్సిపల్ కార్మిక సంఘానికి 17 శాఖలు వున్నాయి. నాలుగువేల రెండువందలమంది కార్మికులు సంఘ సభ్యులుగా వున్నారు. ఈ మహాసభలో ఆమోదించిన తీర్మానాలు మున్సిపల్ కార్మికుల రాజకీయ చైతన్యాన్ని ప్రతిబింబిస్తున్నాయి. ఒక తీర్మానంలో "రాజకీయ ప్రతిష్టంబన యెడల, ఆహార పదార్థాల సమస్య ఎడల ప్రభుత్వం నేడవలంభిస్తున్న విధానం చూస్తే. మనదేశానికి ఫాసిస్టు దాడి తొలిగిపోలేదని, సంపూర్ణమైన జాతీయ ఐక్యతద్వారా పై సమస్యలు పరిష్కరించుకోవచ్చని" ఈ మహాసభ సూచించింది. జాతీయ నాయకులను విడుదల చేయాలని, మున్సిపల్ కార్మికులందరికి ఏ. ఆర్ వి. శిక్షణను ఇవ్వాలని కోరుతూ ఈ మహాసభ తీర్మానాలు చేసింది వీటితోపాటుగా ఆర్థికాంశాలపై మహాసభ కొన్ని తీర్మానాలు చేసింది. "పేద ప్రజలకు అందుబాటులో వుండేటట్లు చౌక డిపోలను విరివిరిగా స్థాపించాలని మున్సిపల్ కార్మికులకు యుద్ధ అలవెన్సు క్రింద నెలకు 12 రూపాయలు చెల్లించాలని ఆహార వస్తువుల ధరలను బట్టి నెల జీతం 16 నుండి 25 రూపాయలు చెల్లించాలని" కోరుతూ మహాసభ తీర్మానించింది

ఈ మహాసభలో ఆంధ్ర రాష్ట్ర మున్సిపల్ కార్మిక సంఘానికి నూతన కార్యవర్గం ఎన్నికయింది. అధ్యక్షుడిగా సి.వి.కె రావు, కార్యదర్శిగా ఎల్. వి. రత్నం, ఉపాధ్యక్షుడిగా తేలప్రోలు వెంకట సుబ్బారావు, సహాయ కార్యదర్శిగా డి. సూర్యనారాయణ, కోశాధికారిగా ఎం. అప్పల స్వామి ఎన్నికయ్యారు.

## 1943 నాటి కార్మికోద్యమం :

ప్రజాయుద్ధ కాలంలో యుద్ధ అలవెన్స్‌లు చౌకడిపోలు వేతనాల పెంపుదల మొదలగు ఆర్థిక హక్కుల కోసం పోరాటంతో పాటుగా కార్మికులను రాజకీయంగా చైతన్యవంతులను చేయడానికి కమ్యూనిస్టు పార్టీ ప్రయత్నించింది. ఫాసిస్టు వ్యతిరేక ర్యాలీలు నిర్వహించడంలో ఆంధ్ర రాష్ట్ర కార్మికులు పాల్గొన్నారు. జాతీయ ప్రభుత్వాన్ని నెలకొల్పాలని జాతీయ నాయకులను విడుదలచేయాలని కోర్కెల కోసం సాగే ఆందోళనలో ఆంధ్ర రాష్ట్ర కార్మిక లోకం పాల్గొంది. 1942 అక్టోబరు నెలలో నెల్లూరు మైకా గని కార్మికులు విశాఖ పోర్టు కార్మికులు వివిధ పట్టణాలలోని మున్సిపల్ కార్మికులు చిట్టివలస కార్మికులు తదితర కార్మికులంతా జాతీయ ప్రభుత్వం ఏర్పడాలని నాయకులను విడుదలచేయాలని కోరుతూ తీర్మానాలు చేసారు.

అఖిల భారత కార్మికోద్యమంలో ఆంధ్ర రాష్ట్ర కార్మికోద్యమాన్ని మిళితం చేసి వివిధ కార్మిక సంఘాల కార్యకలాపాలను సమన్వయంచేసి కేంద్రీకృతంగా నిర్వహించడానికి కమ్యూనిస్టు కార్యకర్తలు కృషిచేసారు. ఇందులో భాగంగానే ఆంధ్ర రాష్ట్రంలోని ప్రధాన కార్మిక సంఘాలన్నీ అఖిల భారత ట్రేడ్ యూనియన్‌కు అనుబంధ శాఖలుగా చేశారు.

1943 మే నెలలో, నాగపూరులో అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు మహాసభ (20వ) జరిగేనాటికి ఆంధ్ర రాష్ట్ర మున్సిపల్ అండ్ లోకల్ బోర్డు పని వారల సంఘం, ఆంధ్ర రాష్ట్ర ప్రెస్ పని వారల సంఘం, గూడూరు డివిజన్ మైకా వర్కర్స్ యూనియన్, చీరాల ఐ. ఎల్. టి. డి. పొగాకు వర్కర్ల సంఘం, బెజవాడ పి. డబ్ల్యూ. డి. వర్కర్ల యూనియన్, విశాఖపట్టణం పోర్టు హార్బర్ వర్కర్ల యూనియన్‌లు అఖిల భారత ట్రేడ్ యూనియన్‌కు అనుబంధ శాఖలుగా వున్నాయి.

ఆంధ్రరాష్ట్రంలోని రైల్వే, ప్రెస్, జూట్, మున్సిపల్, పొగాకు, హార్బర్ కార్మికులలో కమ్యూనిస్టు కార్యకర్తలు పని చేయసాగారు. తోళ్ళ కార్మికులు మొదలుకొని గని కార్మికుల వరకు సంఘటితం చేసి వారిని జాతీయ స్వాతంత్ర పోరాటంతో మిళితం చేసే బలమైన కార్మికోద్యమాన్ని నిర్మించడానికి కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తలు ప్రయత్నించారు. 1943 జనవరి నాటికి రైల్వే కార్మికులు 10,000 వేల మంది ఇతర రంగాలలో పని చేస్తున్న మరో 12,000 మంది కార్మికులు వివిధ కార్మిక సంఘాలలో సభ్యులుగా వున్నారు. 1943 జూలైలో తృతీయ ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ మహాసభ జరిగే నాటికి ఈ సంఖ్యా మొత్తం 24,000 కు చేరుకుంది.

# చేనేత కార్మికోద్యమం

ఆంధ్ర రాష్ట్రంలోని చేనేత పరిశ్రమ అతి ప్రాచీనమైనది. ఇతర పరిశ్రమల వలె పట్టణ ప్రాంతాలకు పరిమితం కాక, చేనేత పరిశ్రమ గ్రామీణ ప్రాంతాలలో ఎక్కువగా విస్తరించియున్నది. చేనేత పరిశ్రమలోని కార్మికులంతా ఆ పరిశ్రమను కులవృత్తిగా స్వీకరించి తరతరాలుగా అంటిపెట్టుకొని జీవిస్తూ వచ్చిన వారే. బ్రిటీషు సామ్రాజ్యవాద పాలనలోకి అనాదరణ, మిల్లు వస్త్రాల పోటీవల్ల చేనేత కార్మికుల పరిస్థితి నానాటికి దుర్భరమవుతూ వచ్చింది. కనీస జీవితావసరాలు తీరక దుర్భర దారిద్ర్యంలో మగ్గుతూ అతి హీనమైన జీవితాన్ని చేనేత కార్మికులు గడిపేవారు.

1935 నాటికి మద్రాసు రాష్ట్రంలో 2 లక్షల చేనేత మగ్గాలు ఉన్నాయి 10 లక్షల మందికి పైగా చేనేత కార్మికులు ఈ పరిశ్రమపై ఆధారపడి జీవించే వారు. ఇందులో అధిక భాగం ఆంధ్ర రాష్ట్రంలోనే కేంద్రీకృతమై ఉన్నారు. ప్రభుత్వం నుండి ఎటువంటి సహాయం లేనందువల్ల కార్మికులలో సంఘటితత్వం లేకపోవడం వల్ల అనేక విధాలుగా చేనేత కార్మికులు దోపిడికి గురి అయ్యేవారు. చేనేత కార్మికుల బలహీనతలను ఆధారం చేసుకుని మాస్టరు వీవర్లు సంపూర్ణంగా దోచుకునేవారు. అవసరమైన నూలు అందివ్వకపోవడం, ఇచ్చినా అధిక ధరలు వడ్డీలు వసూలు చేయడం, నేసిన వస్త్రాలకు తక్కువ వెలకట్టడం, వాసి తగ్గిందనో, ఫోగు సరిగా లేదనో, అంచులు వంకరగా వచ్చాయనో వెలలో కోత పెట్టడం మాస్టరు వీవర్ల దోపిడీ పద్ధతులు. మాస్టరు వీవర్లు సాగించే దోపిడికి వ్యతిరేకంగా చేనేత కార్మికులు సమ్మెలు చేసిన సందర్భాలు కూడా అనేకం ఉన్నాయి. తూర్పు గోదావరి జిల్లాలో 1922, 1927, 1931 సంవత్సరాలలో చేనేత కార్మికులు సమ్మెలు చేశారు. అక్కడక్కడా చేనేత కార్మికులు సమైక్యమై సంఘాలను స్థాపించుకున్నారు. కాని ఈ సంఘాలు వర్గ దృష్టితో ఏర్పడిన సంఘాలు కాకపోవడం మూలంగా విస్తృతమైన నిర్మాణ వ్యవస్థను ఏర్పాటు చేసుకోలేక పోయాయి. కొన్ని ప్రాంతాలలో కుల సంఘాలుగా పని చేయడం వల్ల పటిష్టమైన రూపాన్ని పొందలేదు. 1935 వరకు ఇదే పరిస్థితి కొనసాగుతూ వచ్చింది వర్గ ప్రాతిపదికపై కార్మిక రంగాన్ని సంఘటితం చేస్తున్న కమ్యూనిస్టు పార్టీ 1936 నుండి 'ఐక్య ప్రజా సంఘటనా' ఎత్తుగడతో పనిచేయడం ప్రారంభించింది. వివిధ రంగాలలో పనిచేస్తున్న కార్మికులను సంఘటిత పరిచి వారి సమస్యలపై ఆందోళనా పోరాట కార్యక్రమాలను చేపట్టసాగింది. కార్మికులను రాజకీయంగా చైతన్య వంతుల్ని చేసి, స్వాతంత్ర్య పోరాట స్రవంతిలో భాగంగా కార్మిక పోరాటాలను నిర్వహించడానికి పూనుకుంది.

ఈ దశలోనే చేనేత కార్మికులను సంఘటిత పరిచేందుకు కమ్యూనిస్టు కార్యకర్తలు కృషి చేసారు పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలోని ఉన్న కమ్యూనిస్టు కార్యకర్తలు చేనేత కార్మిక సంఘ నిర్మాణానికి పూనుకున్నారు. చేనేత కార్మికులలోని అభ్యుదయవాదులు, కాంగ్రెసు వాదులు కూడా కమ్యూనిస్టుల కృషికి తోడ్పడ్డారు. ప్రధానంగా తూర్పు గోదావరి జిల్లాలోని పుత్సల సత్యనారాయణ, పశ్చిమ గోదావరి జిల్లాలోని కడుపు రాములు, గుంటూరు జిల్లాలోని దొంతు నాగయ్య, బండ్ల గరటయ్య, కృష్ణాజిల్లా లోని యర్రా త్రిశూల పాణి మొదలగువారు వివిధ గ్రామాలలో ఉన్న చేనేత కార్మికులను సమైక్యపరిచేందుకు కృషిచేసారు. సంఘ నిర్మాణానికి ఉద్యమాభి వృద్ధికి కమ్యూనిస్టు కార్యకర్తలు చేస్తున్న కృషికి చేనేత కార్మికులు పెద్దఎత్తున స్పందించారు. జిల్లా సంఘాలు మొదలుకుని గ్రామస్థాయివరకు సంఘ నిర్మాణా నికి చేనేత కార్మికులు ముందుకు వచ్చారు. రాష్ట్రస్థాయిలో చేనేత కార్మికోద్యమా నికి నిర్మాణరూపం కల్పించేందుకు 1936 లో ప్రథమ మహాసభను నిర్వ హించారు. తూర్పు గోదావరి జిల్లా ఉప్పాడ గ్రామంలో జరిగిన ఈ మహాసభలో రాష్ట్ర చేనేత కార్మిక సంఘ నిర్మాణం జరిగింది. పుత్సల సత్యనారాయణ ప్రధాన కార్యదర్శిగా, కడుపు రాములు సహాయ కార్యదర్శిగా రాష్ట్ర చేనేత కార్మిక సంఘం ఏర్పడింది.

ఉప్పాడ మహాసభ ఆంధ్ర రాష్ట్ర చేనేత కార్మికోద్యమంలో నూతన శకా నికి నాంది పలికింది. చేనేత కార్మికులందరిని వర్గ ప్రాతిపదికపై ఒకే వేదిక దగ్గరకు తేవడంలో ఉప్పాడ మహాసభ చరిత్రాత్మకమైన పాత్రనిర్వహించింది. ఈ మహాసభ తరువాత చేనేత ఉద్యమం వివిధ ప్రాంతాలకు విస్తరించసాగింది. రాయలసీమ ప్రాంతంలోని చేనేత కార్మికులు సంఘటితం కావడానికి ఈ మహాసభ ఉత్తేజానిచ్చింది. కడప, కర్నూలు, అనంతపురం జిల్లాలలోని చేనేత కార్మికులు సమైక్యమై సంఘాలుగా ఏర్పడటం ప్రారంభించారు. రాయలసీమ ప్రాంతంలోని చేనేత కార్మికులకు ఉత్తేజాన్ని కలిగించి సంఘ నిర్మాణం పటిష్ఠం చేయడానికి ద్వితీయ ఆంధ్ర రాష్ట్ర చేనేత మహాసభను రాయలసీమలో నిర్వహించారు ఈ మహాసభ కర్నూలు జిల్లా నంద్యాలలో 1937 సంవత్సరంలో జరిగింది. ఈ మహాసభ తరువాత చేనేత కార్మిక సంఘ నిర్మాణ స్థాయి మరింతగా పెరిగింది. కార్మిక సంఘ నిర్మాణంతో పాటుగా చేనేత కార్మికులు ఎదుర్కొంటున్న సమస్యల పరిష్కారానికి నిర్మాణాత్మకమైన పద్ధతులలో కమ్యూనిస్టు కార్యకర్తలు కృషిచేసారు. ప్రధానంగా మాస్టరు వీవర్ల దోపిడీనుండి చేనేతకార్మికులను రక్షించ టానికి చేనేత సహకార సంఘాల ఏర్పాటుకు ప్రయత్నించారు. సహకార సంఘాల

స్థాపన ఫలితంగా చేనేతకార్మికులకు నూలు చౌకగా దొరకడంతోపాటు, చేసిన శ్రమకు అత్యధికమైన ప్రతిఫలం లభ్యమయ్యేది చేనేత కార్మికుల సంఘాల తరపున ఏర్పరచిన ఈ సహకార సంఘాలు మాస్టరు వీవర్ల బానిసత్వం నుండి కార్మికులను విముక్తి చేశాయి. కృష్ణా జిల్లాలో 5 సహకార సంఘాలు కమ్యూనిస్టుల ఆధ్వర్యంలో నిర్వహించబడ్డాయి. ఆదర్శవంతంగా నిర్వహించబడిన ఈ సహకార సంఘాలు ఇతర ప్రాంతాలలో సహకార సంఘాల నిర్మాణానికి కూడా ప్రోత్సాహకర మయ్యాయి. చేనేత కార్మికులు సహకార సంఘాలను స్థాపించుకుని మాస్టరు వీవర్ల పీడ నుండి విముక్తమవ్వడానికి సిద్ధమయ్యారు. తూర్పు గోదావరి జిల్లాలో 26, కృష్ణా జిల్లాలో 16 సొసైటీలు ఏర్పడి పని చేయసాగాయి. పశ్చిమ గోదావరి, గుంటూరు, అనంతపురం జిల్లాలో కూడా చేనేత సహకార సంఘాలు ఏర్పడి పని చేయసాగాయి. చేనేత కార్మికులు సహకార సంఘాలను స్థాపించు కుని, సక్రమంగా నిర్వహించుకోవడంలో కమ్యూనిస్టులు తమ పూర్తి సహాయ సహకారాలను అందించారు. సహకార సంఘాలను విచ్ఛిన్నం చేయడానికి మాస్టరు వీవర్లు పన్నిన కుట్రలను భగ్నం చేశారు. సహకార సంఘాలలో మాస్టరు వీవర్లను కాని, వారి ఏజంట్లు కాని ప్రవేశించకుండా కార్మికులను చైతన్యవంతుల్ని చేశారు.

## పెద్దాపురం సిల్కు చేనేత కార్మిక సమ్మె :

తూర్పు గోదావరి జిల్లాలోని పెద్దాపురం సిల్కు వస్త్రాలకు ప్రసిద్ధి చెందింది. పరిశ్రమ అంతా పెద్ద పెద్ద వ్యాపారస్థుల చేతుల్లోనే ఉండేది. చేనేత కార్మికులకు తక్కువ కూలీ ఇస్తూ అధిక లాభాలు ఆర్జించేవారు. చేనేత కార్మికు లకు జరిమానాలు కూడా విధించేవారు. 1938 లో పడుగుకి రెండు రూపాయల కూలి తగ్గించారు. దీని ఫలితంగా పెద్దాపురం, చుట్టుప్రక్కల 32 గ్రామాలలో ఉన్న 4 వేల మంది కార్మికుల పరిస్థితి దుర్భరమైంది. అంతకు పూర్వం అనేక సార్లు మజూరీలో కోత విధించబడినప్పుడు కార్మికులు సమ్మెలు చేసినా విజయం సాధించలేక పోయారు. దానికి ప్రధాన కారణం కార్మికులలో సంఘ బలం లేకపోవడమే.

1938 నాటికి పరిస్థితులలో పూర్తిగా మార్పు వచ్చింది. చేనేత కార్మిక సంఘం ఏర్పడి ఉంది. వ్యాపారస్తుల దోపిడీని ఎదిరించడానికి కార్మికులంతా సంసిద్ధులయ్యారు. తగ్గించిన కూలిని పెంచాలని, జరిమానాలు విధించడం మానుకోవాలని చేనేత కార్మికులను గౌరవంగా చూడాలని కార్మికులంతా డిమాండ్ చేశారు. కార్మికుల కోరికకు మద్దతుగా సమ్మె నిర్వహించేందుకు 14 మందితో కూడిన సమ్మె కమిటీ ఏర్పడింది. 1938 జనవరి 22 నుండి సమ్మె ప్రారంభ

మైంది. 11 వందల మగ్గాలపై పని చేస్తున్న 4 వేల మంది కార్మికులు సమ్మెలో పాల్గొన్నారు. తమ కోర్కెలు తీరేవరకూ సమ్మె కొనసాగించాలని తీర్మానించారు. ఊరేగింపులు, సభలు జరిపి కార్మికులను చైతన్యవంతుల్ని చేశారు. పోలీసుల సహాయంతో ఉద్యమాన్ని విచ్ఛిన్నంచేయాలని వ్యాపారస్థులు ప్రయత్నం చేసారు. కార్మికుల మధ్య చీలికలు తెచ్చేందుకు ప్రయత్నించారు. కాని చేనేత కార్మికులంతా ఐక్యంగా నిలిచి పోరాటం కొనసాగించడంతో వ్యాపారస్థులు దిగిరాక తప్పలేదు. కార్మికుల కోరికలు అంగీకరించబడటంతో సమ్మె విరమింపబడింది. ఆంధ్ర రాష్ట్ర చేనేత కార్మిక సంఘ చరిత్రలో పెద్దాపురం సమ్మె చరిత్రాత్మకమైన ఘటన. కార్మిక సంఘ నాయకత్వంలో నిర్వహించబడి, విజయవంతమైన మొట్ట మొదటి సమ్మె ఇది. ఈ సమ్మె విజయం సాధించడంతో చేనేత కార్మికులలో కార్మిక సంఘం పట్ల విశ్వాసం పెరిగింది కార్మికులకు ఆత్మ స్థైర్యం హెచ్చింది.

## చేనేత కార్మిక రక్షణయాత్ర :

వ్యాపారస్థులు కుట్రపన్ని నూలు ధరలను విపరీతంగా పెంచి సాధారణ మార్కెట్‌లో కార్మికులకు నూలు లభ్యం కాకుండా చేసారు. ఈ పరిస్థితి నుండి కార్మికులకు రక్షణ కల్పించేందుకు చేనేత సంఘం ముందుకు వచ్చింది కార్మికులను జాగృతం చేసి, వారి సమస్యలను ప్రభుత్వ దృష్టికి తెచ్చేందుకు చేనేత కార్మిక రక్షణయాత్రలను నిర్వహించింది. 1938 జూలై నెలలో నూలు కరవు యాత్రను బాపట్ల తాలూకాలో నిర్వహించింది. జూలై 9న బాపట్ల నుండి బయలుదేరిన ఈ రక్షణ యాత్ర వ్యాపారస్థుల దోపిడీ నశించాలని తక్కువధరలకే నూలును కార్మికులకు ప్రభుత్వం అందివ్వాలని కోరుతూ తాలూకాలోని అన్ని గ్రామాలలోనూ, జూలై 14 వరకు ప్రచారం చేసారు. చేనేత కార్మిక సమ్యస్యలను పరిష్కరించేందుకు ప్రభుత్వం తగిన చర్యలు చేపట్టాలని కోరుతూ మెమొరాండం సమర్పించారు. జూలై 15న గుంటూరు వచ్చిన ప్రధాన మంత్రి రాజగోపాలాచారికి ఈ మెమొరాండం సమర్పించారు

చేనేత కార్మిక సమస్యలను ప్రభుత్వ దృష్టికి తీసుకు రావడంలోనూ వ్యాపారస్థుల దోపిడీని సాధారణ ప్రజానీకానికి తెలియ చేయడంలోనూ ఈ రక్షణ యాత్ర ప్రముఖ పాత్ర వహించింది. బాపట్ల తాలుకాలో జరిగిన ఈ రక్షణ యాత్ర మిగిలిన ప్రాంతాలలోని చేనేత కార్మికులకు కూడా ఉత్తేజానిచ్చింది.

ఐక్య చేనేత కార్మికోద్యమం సాగుతున్న ఈ దశలో సంఘ నిర్మాణాన్ని మరింతగా బలపరచుకొని, రాష్ట్ర వ్యాపితంగా ఉన్న చేనేత కార్మిక సమస్యలను పరిష్కరించుకోవడానికి 3వ మహా సభను గుంటూరులో నిర్వహించారు. 1938

జూలై 15, 16వ తేదీలలో గాడిచర్ల హరి సర్వోత్తమరావు అధ్యక్షతను ఈ మహాసభ జరిగింది. ప్రధాన మంత్రిగా ఉన్న రాజగోపాలాచారి ఈ మహాసభకు ముఖ్య అతిథిగా వచ్చారు. చేనేత కార్మికులు ఎదుర్కొంటున్న సమస్యను పరిష్కరింప చేయటానికి కాంగ్రెసు మంత్రి వర్గం తగిన చర్యలు చేపట్టాలని ఈ మహాసభ డిమాండ్ చేసింది. ఈ మహాసభలో ఆంధ్ర రాష్ట్ర చేనేత కార్మిక సంఘ పరిధిని విస్తృతపరిచి చెన్నరాష్ట్ర చేనేత కార్మిక సంఘంగా రూపొందించారు స్వదేశీ, విదేశీ మిల్లుల పోటీ, స్థానికంగా ఉండే షావుకార్ల నిరంకుశత్వాలు, 1934 ఇండో జపాన్ యాక్టు నుండి చేనేత కార్మికులను రక్షించాలని ఈ మహాసభ కోరింది (ఇండో జపాన్ యాక్టు ఫలితంగా భారతదేశం నుండి జపాన్‌కు ప్రత్తి ఎగుమతి అవుతుంది. దీనికి ప్రతిఫలంగా జపాను నుండి మిల్లు వస్త్రాలు భారతదేశానికి దిగుమతి అవుతాయి).

చేనేత కార్మికుల రక్షణకు కాంగ్రెసు మంత్రి వర్గం తన పూర్తి సహాయ సహకారాలను అందివ్వగలదని కార్మికులంతా ఆశించారు. కాని కాంగ్రెసు మంత్రి వర్గం చేనేత కార్మికుల రక్షణకై ప్రత్యేక శ్రద్ధ వహించలేదు. మూడవ మహాసభకు హాజరైన రాజగోపాలాచారి బట్టల మిల్లులు, చేనేత కార్మికుల ఎడల తమకు గల వైఖరిని తెలియచేస్తూ ఈ విధంగా పేర్కొన్నారు.

"అటు మా మీదకు సింహం వస్తోంది. ఇటు చంటి పిల్లాడు ఆకలితో ఏడుస్తున్నాడు. పిల్లాడిని కాపాడాలంటే సింహం తినేస్తుంది. సింహాన్ని చంపేద్దామంటే పిల్లాడు ఆకలితో చచ్చిపోతాడు. కాబట్టి ఏమి చెయ్యాలో మీరే చెప్పండి" (17-8-38, నవశక్తి, 20 వ పేజీ)

పై వాక్యాలను విశ్లేషిస్తే కాంగ్రెసు మంత్రి వర్గం చేనేత కార్మికులను రక్షించేందుకు సిద్ధంగా లేదనే విషయం సుస్పష్టంగా అర్థం అవుతుంది. నిర్దిష్టమైన చర్యలు చేపట్టి తమని ఆదుకోమని చేనేత కార్మికులు కోరుతూంటే అస్పష్ట విధానాలతో తెప్పదాటు వైఖరిని కాంగ్రెసు మంత్రి వర్గం అనుసరించింది.

నిర్మాణాత్మకమైన పద్ధతులు అనుసరిస్తూ ప్రచార ఆందోళన కార్యక్రమాలను చేపడుతూ చేనేత కార్మికోద్యమాన్ని కమ్యూనిస్టు కార్యకర్తలు అభివృద్ధి చేస్తున్న ఈ దశలో రెండవ ప్రపంచ యుద్ధం సంభవించింది. కమ్యూనిస్టు కార్యకర్తలు తీవ్ర నిర్బంధానికి గురి అయ్యారు. అజ్ఞాతవాసంలో ఉంటూ ఉద్యమాన్ని రక్షించుకోవలసి వచ్చింది. చేనేత కార్మిక రంగంలో ఉన్న ప్రధాన కార్యకర్తలంతా అరెస్టు కావడమో రహస్య జీవితం గడపటమో జరిగింది. ఈ పరిస్థితులలో కూడా పుత్సల సత్యనారాయణ, కడుపు రాములు మొదలగువారు చేనేత కార్మికులలో యుద్ధ వ్యతిరేక ప్రచారం చేసారు. తూర్పు గోదావరి జిల్లాలో

గొల్లప్రోలు, కొత్తపల్లి, ఉప్పాడ, పిఠాపురం మొదలగు గ్రామాలలో 'స్వతంత్ర భారత్' కాపీలు రహస్యంగా పంచిపెడుతూ పుత్సల సత్యనారాయణ యుద్ధ వ్యతిరేక ప్రచారం చేసారు.

కమ్యూనిస్టు కార్యకర్తలపై 1942 వరకు ప్రభుత్వ నిర్బంధ విధానం తీవ్రస్థాయిలో కొనసాగుతూ వచ్చింది. 1942 లో ఫాసిస్టు వ్యతిరేక విధానంతో ప్రజా యుద్ధ నినాదాన్ని కమ్యూనిస్టు పార్టీ చేపట్టింది కమ్యూనిస్టులపై నిర్బంధ విధానాన్ని ప్రభుత్వం కొంతవరకు సడలించింది. జైళ్ళ నుండి, రహస్య జీవితం నుండి బయటకువచ్చిన కార్యకర్తలంతా చేనేత కార్మిక ఉద్యమాన్ని పునర్నిర్మించ డానికి పూనుకున్నారు

1939-42 కాలంలో యుద్ధ పరిస్థితిని ఆసరా చేసుకొని వ్యాపారస్తులు నూలు ధరలను విపరీతంగా పెంచి కార్మికులకు అందుబాటులో లేకుండా చేసారు ఆహార ధాన్యాల కరువుతో పాటు, వస్త్రాల కరువు కూడా దేశంలో తారస్థాయికి చేరుకుంది. వస్త్రాల ధరలను రెట్టింపు చేసుకుని షావుకార్లు అధిక లాభాలు గడించ సాగారు. ఈ పరిస్థితులలో చేనేత కార్మికులను రక్షించి, వస్త్రాల కరువు రూపు మాపడానికి కమ్యూనిస్టు పార్టీ ముందుకు వచ్చింది.

నూలు ధరలమీద కంట్రోలు విధించాలని రేషనింగు పద్ధతిలో కార్మికులకు నూలును అందివ్వాలని కమ్యూనిస్టు పార్టీ సూచించింది అధిక ధరలకు, చీకటి బజార్లలో నూలు విక్రయిస్తున్న వ్యాపారస్తులపై కఠిన చర్యలు చేపట్టాలని డిమాండ్ చేసింది. చేనేత కార్మికులను సమీకరించి, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా జిల్లాలలో నూలు కరువు యాత్రలు నిర్వహించింది. దొంగ చాటుగా వస్త్రాలను, నూలును దాట వేస్తున్న షావుకార్లను బట్టబయలు చేసింది. చేనేత కార్మిక సంఘాల నాయకత్వంలో కంట్రోలు ధరకు నూలు అందివ్వాలని, రేషనింగు అమలు జరగాలని పెద్ద ఎత్తున ఆందోళన లేవదీశారు. ప్రభుత్వాధి కారులు మహజర్లు సమర్పించడం, బహిరంగ సభలు, ఊరేగింపులు నిర్వహించడం చేనేత కార్మికులకు మద్దతుగా సామాన్య ప్రజానీకంలో ప్రచారం చేయడం మొద లైన కార్యక్రమాలు విస్తృత స్థాయిలో జరిగాయి. అఖిల భారత టెక్స్‌టైల్ బోర్డులో కార్మిక ప్రతినిధిగా ఉన్న కామ్రేడ్ మిరాజ్‌కర్ చేనేత కార్మికులకు న్యాయం చేకూరేందుకు గట్టి ప్రయత్నం చేశారు నూలు రేషనింగు అమలుపరిచే అధికారం రాష్ట్ర ప్రభుత్వాలకే ఉండాలని డిమాండ్ చేశారు. రాష్ట్రంలోని చేనేత కార్మికులంతా ఈ డిమాండ్ అంగీకరించాలని ప్రభుత్వాన్ని ఒత్తిడి చేసాయి మిల్లు యజమానులు ఎన్ని అడ్డంకులు కల్పించినా ప్రజాశక్తి ముందు ప్రభుత్వం తలవగ్గక తప్పలేదు. నూలు రేషనింగ్‌ను రాష్ట్ర ప్రభుత్వం చేపట్టింది

నూలు సక్రమంగా కార్మికులకే చేరేటట్లు చేయడానికి, వ్యాపారస్థుల చేతుల్లోకి నూలు పోకుండా అడ్డుకునేందుకు కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తలు కృషి చేశారు. జిల్లాలలో ఉన్న మగ్గాల లెక్కలు వ్రాయడం, రేషన్ కార్డులు పంచడం మొదలగు కార్యక్రమాలను కమ్యూనిస్టు కార్యకర్తలు స్వయంగా చేపట్టారు. తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా జిల్లాలలో కమ్యూనిస్టులు ఎక్కువగా చొరవ తీసుకుని నిర్మాణ యుక్తంగా పనిచేయడం చేత నూలు రేషనింగు కార్యక్రమం చక్కగా అమలు జరిగింది. కమ్యూనిస్టులు పనిచేసిన ప్రతి చోట నూలు కోటా కార్మికులందరికి సమానంగా అందింది. కమ్యూనిస్టుల ఆధ్వర్యంలో నూలు రేషన్ కార్డులు, చేనేత సంఘాల ద్వారా పంపకం చేయడం, సక్రమంగా నూలు అందడం మూలంగా సంఘాలపట్ల విశ్వాసం అభిమానం, కార్మికులలో పెంపొందింది. చేనేత సంఘ నిర్మాణ బలం వృద్ధి చెందింది.

చేనేత సంఘాలలో 1942 - 43 కాలంలో తూర్పు గోదావరి జిల్లాలో 10 వేలమంది, పశ్చిమ గోదావరి జిల్లాలో 4 వేలు, కృష్ణా జిల్లాలో 4 వేల మంది సభ్యులు చేరారు. గుంటూరు జిల్లాలో సంఘ నిర్మాణానికి అభివృద్ధి చేయడానికి ప్రయత్నిస్తున్న కమ్యూనిస్టు కార్యకర్తల కృషికి ప్రగడ కోటయ్యా మూలా అడ్డు తగిలింది. ఉద్యమాభివృద్ధికి కమ్యూనిస్టుల సహాయాన్ని తృణీకరించింది. అయినా కమ్యూనిస్టులు తమ స్వంత చొరవతోనే చేనేత కార్మికోద్యమాన్ని సంఘ నిర్మాణాన్ని పెంపొందించటానికి ప్రయత్నించారు. సంఘ సభ్యత్వాన్ని 2 వేలకు పెంచారు.

## ప్రగడ కోటయ్య వర్గ విచ్ఛిన్న కార్యక్రమాలు

గుంటూరు జిల్లాకు చెందిన ప్రగడ కోటయ్యా, ఆచార్య ఎన్.జి. రంగా భక్తులలో అగ్రగణ్యులు. చేనేత ఉద్యమంలో ప్రథమం నుండి పనిచేస్తూ, కార్మిక వ్యతిరేక చర్యలను ప్రోత్సహిస్తూ వచ్చేవాడు. చేనేత కార్మికుల మేలుకొరకు ఏర్పరచిన సహకార సంఘాలలో మాస్టరు వీవర్ల ప్రవేశానికి వత్తాసు పలికాడు. కమ్యూనిస్టుల ఆధ్వర్యంలో, నడుస్తున్న సహకార సంఘాలకు వ్యతిరేకంగా పోటీ సంఘాలను ప్రోత్సహించే ప్రయత్నం చేసాడు చేనేత కార్మిక సంఘంలో ఉంటూనే వ్యాపారస్థుల అనుకూల వైఖరిని అవలంభించేవాడు.

యుద్ధనిర్బంధ కాలంలో కమ్యూనిస్టులు లేని తరుణంలో చేనేత కార్మిక సంఘాలను తన అనుయాయులతో నింపివేసాడు. 1942 లో కమ్యూనిస్టులు తిరిగి రంగప్రవేశం చేయడంతో వారిని అడ్డుకోవడానికి శతవిధాల ప్రయత్నించాడు.

నూలు రేషన్‌కార్డులు కార్మిక సంఘాలద్వారా పంపిణీ చేయటానికి కమ్యూనిస్టులు ప్రయత్నిస్తే, కోటయ్య ముఠా వ్యాపారస్థులచేత పంపిణీ చేసేందుకు ప్రయత్నించారు. దీని ఫలితంగా కార్మికులకు అందాల్సిన నూలు వ్యాపారస్థుల చేతుల్లోకి పోయింది.

వస్త్రాల ధరలపై కంట్రోలు విధించాలని కమ్యూనిస్టు కార్యకర్తలు కోరితే కంట్రోలు విధించకూడదని ప్రగడ కోటయ్య వర్గం పట్టుపట్టింది. కంట్రోలు విధించడానికి వ్యతిరేకంగా చేనేత కార్మికులు సమ్మె చేయాలని వాదించసాగింది.

1942 లో కమ్యూనిస్టులకు, కాంగ్రెసువాదులకు మధ్య తలఎత్తిన రాజకీయ భేదాలను వాడుకుని చేనేత కార్మిక ఉద్యమం నుండి కమ్యూనిస్టులను తొలగించాలని ప్రగడ కోటయ్య వర్గం ప్రయత్నించింది. చేనేత కార్మికుల రక్షణ కోసం కృషిచేస్తున్న కమ్యూనిస్టు కార్యకర్తలను, జిల్లా సంఘాల నుండి తప్పించసాగారు. చేనేత కార్మిక ఉద్యమానికి నిజాయితీతో పనిచేసిన కార్యకర్తలందరిపైన దుష్ప్రచారం ప్రారంభించారు.

చేనేత కార్మిక శ్రేయస్సుకు పాటుపడినదెవరో, ఉద్యమాభివృద్ధికి నిజాయితీతో కృషి చేసినదేవరో కార్మికరంగం స్పష్టంగా గుర్తించింది. అహర్నిశలు శ్రమించి పనిచేస్తున్న కమ్యూనిస్టులకు అండగా చేనేత కార్మికులు నిలిచారు. ప్రగడ కోటయ్య ముఠా సాగించిన దుష్ప్రచారాన్ని కార్మిక రంగం తిప్పికొట్టింది.

ఉద్యమం నుండి కమ్యూనిస్టులను వేరుచేయాలని ప్రయత్నించిన ప్రగడ కోటయ్య వర్గం క్రమంగా చేనేత కార్మికుల నుండి వేరుపడసాగింది.

## ఆధారాలు :


1. తుమ్మల వెంకట్రామయ్య, భారతీయ కార్మికోద్యమ చరిత్ర 72-73 పేజీలు
2. నవశక్తి, 19-7-39, 5 వ పేజీ తప్పటడుగులు - వెక్కిరింతలు శీర్షిక
3. 23-2-38 న మద్రాసు ప్రభుత్వం డిల్లీ హోమ్ శాఖా మంత్రికి పంపిన ఫిబ్రవరి మొదటిపక్షం రిపోర్టు
4. మామిడిపూడి వెంకటరంగయ్య - ది ఫ్రీడమ్ స్ట్రగుల్ ఇన్ ఆంధ్రప్రదేశ్
5. నవశక్తి 22-3-39, 13 వ పేజీ

# అధ్యాయం - 8

# రైతు ఉద్యమం

# రైతు ఉద్యమం

ఆంధ్ర ప్రాంతములో ఈ శతాబ్దారంభం నుండి రైతు సంఘాల నిర్మాణం ప్రారంభమైంది. గ్రామ, ఫిర్కా, తాలుకా రైతు సంఘాలు, ఆటు తరువాత కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి జిల్లా సంఘాలు ఏర్పడ్డాయి. 1928 ఆగస్టు 1 వ తేదీన గుంటూరులో బిక్కిన వెంకటరత్నం అధ్యక్షులుగా, మాగంటి బాపినీడు, ఎన్. జి. రంగా, నరసింహదేవర సత్యనారాయణ గారలు కార్యదర్శులుగా ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘం ఏర్పడింది.

ఈ మహాసభ రైతాంగాన్నెదుర్కొంటున్న ఋణభారము తదితర సమస్యలపై తీర్మానములు చేయటంతోపాటు కృష్ణా, ఉభయ గోదావరి జిల్లాల రీసెటిల్‌మెంటు రిపోర్టు ఆధారంగా భూమిశిస్తు పెంచడాన్ని నిరసించింది. సైమన్ కమీషన్ రాకను బహిష్కరిస్తూ ఆందోళన తీవ్రతరం చేయాలని కూడా తీర్మానించింది. పెంచిన రీసెటిల్‌మెంటు రేట్లకు వ్యతిరేకంగా జరుగుతున్న బార్డోలీ రైతు సత్యాగ్రహానికి ఈ మహాసభ సానుభూతిని ప్రకటించింది.

1929 లో అమెరికాలో ప్రారంభమై, ఆటు తరువాత పెట్టుబడిదారీ ప్రపంచాన్నంతా అలముకొని, ప్రజానీకాన్ని అతలాకుతలం చేసిన ఆర్థిక మాంద్యం మన దేశ ఆర్థిక విధానంపై అశనిపాతంలాగా పడింది. పారిశ్రామిక సరుకుల ధరలు, వాటిని మించి వ్యవసాయ సరుకుల ధరలు బాగా పడిపోయాయి. 75 కేజీల బస్తా వడ్ల ధర రూ. 8-0-0 ల నుండి 2-8-0 లకు పడిపోయింది. భూముల ధరలు పడిపోయాయి. దీనితో ఋణభారం ఇబ్బడి ముబ్బడిగా పెరిగింది. అప్పులవాళ్ళు ఎగబడటం జరిగింది. సామాన్య రైతాంగ ఆర్థిక పరిస్థితి తలక్రిందులైంది భూస్వాములు, షాహుకార్లు రైతుల భూములను కారుచవుకగా అప్పుల క్రింద కట్టుకున్నారు. ప్రభుత్వానికి జమీందార్లకు చెల్లించవలసిన శిస్తులు భారమై రైతులు కట్టలేకపోయారు. తమవద్ద నున్న వెండి, బంగారు నగలను అమ్మవలసి వచ్చింది. శిస్తు బకాయిల క్రింద రైతుల భూములు వేలం వేయబడ్డాయి. జమీందార్లు శిస్తు బకాయిలకై రైతులపై ఎన్నో నిర్బంధాలు ప్రయోగించారు. భూముల నుండి వెళ్ళగొట్టారు. శిస్తులు తగ్గాలని, రైతుల ఋణాలపై మారటోరియం ప్రకటించాలని, అప్పులు రద్దు కావాలనే కోర్కెలు బాగా ముందుకు వచ్చాయి. ఈ పరిస్థితులన్నీ వ్యవసాయ సంక్షోభ తీవ్రతను వేనోళ్ళ చాటాయి.

వ్యవసాయ పంటల ధరలు పడిపోయి రైతాంగం గగ్గోలు చెందుతున్న ఈ తరుణంలోనే మద్రాసు ప్రభుత్వం రీసెటిల్‌మెంటులో పెంచిన రూపాయికి మూడు అణాల వంతున అదనపు పన్నును 1931 నుండి వసూలు చేయడానికి పూనుకున్నది. దీనికి వ్యతిరేకంగా పై 8 జిల్లాలలోనూ, రైతాంగం ఆందోళన పెద్ద ఎత్తున సాగింది. రీసెటిల్‌మెంటు వ్యతిరేక ఆందోళన సందర్భంగా ఈ జిల్లాలలో చాల రైతు సభలు జరిగాయి గ్రామ రైతు సంఘాల స్థాపన జరిగింది. 1931లో స్థాపించబడ్డ రైతు రక్షణ సంఘం ఆధ్వర్యాన ఈ ఆందోళన, శిస్తు నిరాకరణోద్యమం సాగాయి. వివిధ జిల్లాలలో రైతు నాయకులు అరెస్టు చేయబడ్డారు. నాయకులపై అనేక నిర్బంధాలు విధించబడ్డాయి.

1931 లోనే జమీందారీ రైతు సంఘాలు స్థాపించబడ్డాయి. 1932 లో జరిగిన శాసనోల్లంఘన ఉద్యమ సందర్భంగా రైతు సంఘాల నాయకులు, కార్యకర్తలు అరెస్టు కాబడి, జైళ్ళలో నిర్బంధించబడ్డారు. ఇందువల్ల అటు తరువాత రైతు సంఘాల కార్యకలాపాలు కొంత మందగించాయి. 1930-32లో జాతీయ కాంగ్రెసు నాయకత్వాన జరిగిన సత్యాగ్రహ పోరాటం విజయం సాధించకుండానే విరమించబడింది. దీనివల్ల ఆ పోరాటంలో పాల్గొన్న వారిలో నిస్పృహ, నిస్తబ్దత ఏర్పడింది. యువ కార్యకర్తలు సంఘటితంగా, క్రియాశీల పోరాటాలు ఎలా సాగించాలా అని తర్కించడం ప్రారంభించారు. జైళ్ళలో నిర్బంధించబడ్డ కాంగ్రెసు యువ కార్యకర్తలు విప్లవకారుల సహచర్యాల వల్ల విప్లవ భావాలతో విడుదలై వచ్చారు.

1934 లో ఆంధ్రలో కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ఏర్పడింది. ఆదే సంవత్సరం ఆంధ్రలో కమ్యూనిస్టు పార్టీ ఆర్గనైజింగ్ కమిటీ ఏర్పడింది. వర్గ సంఘాల నిర్మాణం ద్వారా రైతు, వ్యవసాయ కార్మిక ప్రజానీకాన్ని సమీకరించి వర్గ కోర్కెలపై పోరాటాల నిర్వహణతోపాటు జాతీయ విముక్తి పోరాటానికి బలం చేకూర్చాలన్న భావన అతివాదులైన వారిలో కలిగింది. గ్రామ స్థాయి నుండి స్వతంత్ర ప్రతిపత్తి కలిగిన రైతు సంఘాల స్థాపన ఆవశ్యకతను గుర్తించి, అందుకు పూనుకోవడం జరిగింది.

అతివాదులైన కాంగ్రెసు యువకులు, కాంగ్రెసు సోషలిస్టులు, కమ్యూనిస్టులు ఆచార్య యన్.జి. రంగా, వారి అనుయాయులు అందరూ కలిసి జిల్లా, రాష్ట్ర రైతు సంఘాల పునర్నిర్మాణానికి పూనుకున్నారు.

1935 లో కృష్ణా, పశ్చిమ గోదావరి జిల్లాల రైతు సంఘాలు పునర్నిర్మించబడ్డాయి అటు తరువాత క్రమంగా మిగతా జిల్లాలలో కూడ రైతు సంఘాల నిర్మాణం పునరుద్ధరించబడింది.

1934 డిసెంబరు విశాఖలో 4 వ ఆంధ్ర రాష్ట్ర రైతు మహాసభ జరిగింది. దీనిలో ఆచార్య రంగా అధ్యక్షులుగానూ, కొమ్మారెడ్డి సత్యనారాయణ మూర్తిగారు ప్రధాన కార్యదర్శిగానూ ఎన్నికయ్యారు. 1936 లో రాష్ట్ర రైతు సంఘం రిజిష్టరు అయింది. 1936 లో నిడుబ్రోలులో జరిగిన రైతు మహా సభలో తిరిగి ఆచార్య రంగా అధ్యక్షులుగానూ, కొమ్మారెడ్డి సత్యనారాయణ మూర్తిగారు ప్రధాన కార్యదర్శిగానూ, చలసాని వాసుదేవరావు, గండవరపు హనుమారెడ్డి సహాయ కార్యదర్శులుగానూ ఎన్నికయ్యారు.

సామాన్య రైతాంగంపై అప్పులను రద్దు చేయాలని, తక్షణం మారటోరియం ప్రకటించి షావుకార్ల వడ్డీ వ్యాపారస్థుల వాడినుండి రైతులను కాపాడాలని ఋణ విమోచన చట్టం తీసుకువచ్చి ఋణభారాన్ని తగ్గించాలని రైతు సంఘాలు ఈ కాలంలో ఆందోళన చేసాయి. అలాగే జమీందారీ విధానం రద్దు కావాలని, శిస్తు బకాయీలు రద్దుచేసి, శిస్తు రేట్లను తగ్గించాలనే కోర్కెలపై కూడా రైతాంగం సమీకరించబడింది.

1935 లో జరిగిన కొమింటరన్ 7 వ మహాసభ ఆమోదించిన తీర్మానంలో కమ్యూనిస్టులు జాతీయ విముక్తి ఉద్యమాలలో పాల్గొని దానిని బలపర్చాలని, ఐక్య సంఘటనా ఎత్తుగడల ద్వారా జాతీయ విముక్తి ఉద్యమాన్ని పటుతరం చేయాలని పేర్కొనబడింది. భారత కమ్యూనిస్టు పార్టీ రూపొందించిన మార్గ నిర్దేశిక సూత్రాలలో విశాలవర్గ సంఘాలను నిర్మించి, వాటిని జాతీయ విముక్తి ఉద్యమంలో భాగస్వాములుగా చేయాలని, జాతీయ కాంగ్రెసుతో ఆ ప్రజా సంస్థలు సామూహిక అనుబంధం కలిగి వుండాలని సూచించబడింది.

భారత కమ్యూనిస్టు పార్టీ నిర్దుష్టమైన జాతీయ ఐక్య సంఘటనా ఎత్తుగడలను రూపొందించి వివిధ రాష్ట్ర శాఖలకు పంపటం జరిగింది ఆంధ్రలో కూడా కమ్యూనిస్టులపై పత్రాల వెలుగులో రైతు, వ్యవసాయ కార్మిక మొదలగు గ్రామీణ వర్గ సంఘాల నిర్మాణానికి, పట్టణ కార్మిక సంఘాల నిర్మాణానికి పూనుకోవడం జరిగింది.

కాకినాడ ప్రథమ పార్టీ మహాసభ తరువాత కమ్యూనిస్టులు రైతు సంఘాలలో కేంద్రీకరించి పని చేయడం ప్రారంభించారు గ్రామీణ ప్రాంతాల నుంచి వచ్చిన పార్టీ సభ్యులంతా వీటిలో పని చేసారు. ఈ కాలంలో రైతు ఉద్యమం అనేక క్రొత్త జిల్లాలకు, ప్రాంతాలకు విస్తరించింది. తాలూకా, జిల్లా సంఘాలలో ప్రధాన కార్యకర్తల్లో ఎక్కువమంది కమ్యూనిస్టులే. రాష్ట్ర రైతు సంఘంలో కూడ కమ్యూనిస్టులు ప్రధాన పాత్ర వహించారు.

## 1937 ఎన్నికలు :

1935 భారత రాజ్యాంగ చట్టం క్రింద దేశంలోని వివిధ రాష్ట్రాలలో అసెంబ్లీ ఎన్నికలు 1937 జనవరి, ఫిబ్రవరి మాసాలలో జరిగాయి భారత జాతీయ కాంగ్రెసు 1936 లో జరిగిన ఫెయిజ్‌పూర్ కాంగ్రెసు మహాసభలో రైతు కోర్కెల పత్రాన్ని ఆమోదించింది. అటు తరువాత ప్రకటించబడిన ఎన్నికల ప్రణాళికలో పై రైతాంగ కోర్కెలు చాలవరకు పొందుపరచబడ్డాయి.

కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికలో రైతుల ఋణభారం, జమీందారీలలో శిస్తులు తగ్గిస్తామనే వాగ్దానాలతోపాటు రైతుల కనీస కోర్కెలు చాలావరకు చేర్చబడినందువల్ల రైతు ఉద్యమానికి అఖండమైన నైతిక బలం, ప్రచార అవకాశములు ఏర్పడినవి.

కమ్యూనిస్టు పార్టీ, రైతు సంఘము, ఇతర ప్రజా సంఘాలు 1937 ఎన్నికలలో భారత జాతీయ కాంగ్రెసును బలపర్చాయి. కమ్యూనిస్టు పార్టీ, రైతు సంఘ కార్యకర్తలు ఈ ఎన్నికల పోరాటంలో అహర్నిశలు కాంగ్రెసు విజయానికి కృషి చేశారు.

ఎన్నికలలో కాంగ్రెసులోని అతివాదులు, కాంగ్రెసు సోషలిస్టులు, ముఖ్యంగా కమ్యూనిస్టు కార్యకర్తలు ఊరూరా తిరిగి కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికను, ముఖ్యంగా రైతుల కోర్కెలను గురించిన భాగాలను విస్తృతంగా ప్రచారం చేసారు. రైతాంగం ఈ ప్రచారానికి స్పందించింది. జమీందారీ, ఫ్యూడల్ దోపిడి వర్గాల ఓటమికి పట్టుదలతో ముందుకు వచ్చింది.

మద్రాసు శాసన సభకు జరిగిన ఎన్నికలు ఆంధ్ర జిల్లాలలో గొప్ప సామ్రాజ్య వ్యతిరేక, ఫ్యూడల్ వ్యతిరేక వెల్లువకు తార్కాణంగా నిలిచాయి. జమీందారీ, ఫ్యూడల్ శక్తులకు ప్రాతినిధ్యం వహించే జస్టిస్ పార్టీ, పీపుల్స్ పార్టీలు చిత్తుగా ఓడిపోయాయి. భారత జాతీయ కాంగ్రెసు గొప్ప మెజారిటీతో గెలుపొందింది.

ఈ ఎన్నికలను, జమీందారీ భూస్వామ్య దోపిడీకి వ్యతిరేకంగా జరిగిన గొప్ప పోరాటంగా, తెలుగుదేశంలోని రైతాంగం అంతా భావించింది. చట్టబద్ధ భూస్వామ్య విధానాన్ని రద్దు చేసి, మౌలిక వ్యవసాయ సంస్కరణలు ప్రవేశ పెడతానని, కాంగ్రెసు ఎన్నికల ప్రణాళిక వాగ్దానం చేసింది. ఈ వాగ్దానాలు రైతులను ఉత్సాహ పరిచాయి ఫ్యూడల్ దోపిడీ నుండి తాము బైట పడగలమనే ఆశాభావాన్ని వారికి కలిగించాయి.

రైతు సామాన్యంలో వెల్లుబుకిన, ఈ బ్రహ్మాండమైన ఫ్యూడల్ వ్యతిరేక వెల్లువపై ఆధారపడి, కాంగ్రెసు మంత్రివర్గం ఆనాడు మద్రాసులో అధికారాన్ని కైవసం చేసుకున్నది.

ఆంధ్ర రాష్ట్రంలోని మారుమూల గ్రామాలకు కమ్యూనిస్టులు, రైతు సంఘ కార్యకర్తలు సామ్రాజ్య వ్యతిరేక, ఫ్యూడల్ వ్యతిరేక, జాతీయ పునరుజ్జీవన సందేశాన్ని తీసుకువెళ్ళారు. అన్ని స్థాయిలలోనూ కిసాన్ సభ ప్రాథమిక యూనిట్లను ఏర్పరచారు.

ఆంధ్ర రైతాంగంలో వ్యక్తమైన ఈ నూతన చైతన్యానికి ఒక నిర్మాణ స్వరూపం ఇవ్వటానికి, సంఘటిత పరచటానికి, వారిని ముమ్మందు నూతన పోరాటాలకు సమాయత్తం చేయటానికి, అదే సమయంలో రైతుల పరిస్థితుల పైన, స్థానిక సమస్యల పైన సమగ్ర నివేదిక నొకదానిని తయారు చేయడానికి, ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘం ఒక కొత్త తరహా రైతు సమీకరణ, సన్నాహక రూపాన్ని చేపట్టింది.

అదే చరిత్రాత్మకమైన ఆంధ్ర రాష్ట్ర రైతు రక్షణ యాత్ర. 1933 నుండి స్థానిక సమస్యలపైన, రాష్ట్ర వ్యాపిత సమస్యలపైన రైతు యాత్రలు ఆంధ్ర ప్రాంతములో రైతాంగాన్ని సమీకరించుటకు, వారిని చైతన్యపర్చుటకు బాగా తోడ్పడ్డాయి. అయితే రైతు రక్షణ యాత్ర రాష్ట్రంలోని ఒక మూలనుండి రెండవ మూలవరకు ఆసాంతము అనేక దినాలు కాలినడకను సాగింది.

ఆంధ్రప్రదేశ్ రైతు సంఘ అధ్యక్షులు కీ. శే. కొమ్మారెడ్డి సత్యనారాయణ మూర్తి, ప్రధాన కార్యదర్శి చలసాని వాసుదేవరావు గారలు, ఈ చరిత్రాత్మక యాత్రకు నాయకుడు, ఉపనాయకుడుగా నియమితులైనారు.

ఆంధ్ర దేశానికి ఈశాన్య కొసనఉన్న ఇచ్ఛాపురంనుండి, ఈ చరిత్రాత్మక యాత్ర కాలినడకన 130 రోజులు సాగి, 1938 మార్చి 27 వ తేదీన మద్రాసు చేరుకున్నది.

ఈ యాత్ర శ్రీకాకుళం (అప్పుడు ఉత్తర విశాఖ) విశాఖజిల్లా (అప్పుడు దక్షిణ విశాఖ) తూర్పుగోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాలను కాలినడకన 1512 మైళ్ళు, బస్సులపైన 152 మైళ్ళు ప్రయాణం చేసింది. ప్రతి జిల్లాలోనూ రైతుసంఘ కార్యకర్తలు దళాలు, దళాలుగా ఈ యాత్రలో చేరేవారు. తరువాత జిల్లా వచ్చేవరకు యాత్రలో పాల్గొనే వారు

ఈ మహాయాత్ర దాదాపు 520 గ్రామాలలో ప్రత్యక్షంగా అడుగు పెట్టింది. 25 వేల సంతకాలతో 800 నివేదిక పత్రాలను సేకరించింది. జమీందారీ వ్యవస్థను రద్దుచేయాలని మౌలిక వ్యవసాయ సంస్కరణలు జరగాలని పత్రాలు డిమాండ్ చేశాయి. తమ స్థానిక కోర్కెలను, ఇబ్బందులను తెలియజేస్తూ, దాదాపు 300 దరఖాస్తులు ఈ యాత్రా నాయకులకు సమర్పించబడ్డాయి. ఈ యాత్ర

సందర్భంలో 60 ఫిర్కా, తాలూకా రైతు మహాసభలు జరిగాయి. దాదాపు 4 లక్షల 50 వేల మంది రైతులు ఈ ప్రదర్శనలకు హాజరైనారు.

ఈ చరిత్రాత్మక యాత్రకు ఒక ప్రాధాన్యత ఉంది. తమ హక్కులను గురించి రైతులలో ఈ యాత్ర ఒక నూతన చైతన్యాన్ని కలిగించింది ముందుకు వచ్చి ఫ్యూడల్ దోపిడీకి వ్యతిరేకంగా నిలబడాలనే ఆత్మవిశ్వాసాన్ని, ధైర్యాన్ని కలిగించింది. తమ దుర్భర పరిస్థితులను గురించి రైతులు ఈ యాత్రకు సాక్ష్యాలు ఇచ్చారు. ఈ మహా చైతన్య యాత్రలోకి వెనుకబడిన ప్రాంతాల రైతులు సైతం ఆకర్షితులయ్యారు. మొట్టమొదటిసారిగా, రైతు సంఘం జండా క్రింద గిరిజన రైతులు కూడా కార్యాచరణలో ముందుకు వచ్చారు.

చాలామంది రైతు యువకులు ఈ యాత్రలో పాల్గొన్నారు. ఆ పిమ్మట వారు రైతు సంఘానికి క్రియాశీల కార్యకర్తలైనారు. ఈ మహా యాత్రలో చాలా మంది కాంగ్రెసువాదులు సైతం పాల్గొన్నారు. రైతు సంఘ కోర్కెలకు తమ తోడ్పాటు ప్రకటించారు. గ్రామ, తాలూకా స్థాయి కాంగ్రెసు కమిటీలు, తమ తమ ప్రాంతాలలో ఈ యాత్రను ఆహ్వానించి జయప్రదం చేయటానికి క్రియాశీల పాత్ర వహించాయి. రైతు రక్షణ యాత్ర ప్రధాన కోర్కెలను రాష్ట్ర కాంగ్రెసు సంఘం కూడా ఆమోదించింది. కాంగ్రెసు మంత్రివర్గం ఈ కోర్కెలను ఆమోదించాలని డిమాండు చేసింది

1938 మార్చి 27 న రైతు రక్షణ యాత్ర మద్రాసు చేరుకున్నది. రాష్ట్ర శాసన సభ స్పీకరు శ్రీ బులుసు సాంబమూర్తి గారికి ఒక నివేదిక సమర్పించింది. ఆ సంవత్సరం శీతాకాల సమావేశంలో ఈ నివేదిక చర్చకు వచ్చింది.

ఆ పిమ్మట, 1938-39 లో వచ్చిన జమీందారీ వ్యతిరేక పోరాటాలకు ఆంధ్ర రైతాంగాన్ని ఉత్తేజపరచటంలో, ఈ రైతు రక్షణ యాత్ర చరిత్రాత్మక పాత్రను నిర్వహించింది.

## మద్రాసు మంత్రి వర్గం :

1937న మద్రాసు అసెంబ్లీ ఎన్నికలలో కాంగ్రెసు విజయం సాధించింది. కాని వెనువెంటనే మంత్రి వర్గాలను ఏర్పరచలేదు. మంత్రివర్గం రోజువారీ వ్యవహారాలలో గవర్నరు జోక్యం వుండదని బ్రిటిషు ప్రభుత్వం హామీ యిచ్చిన తరువాతే రాష్ట్రాలలో కాంగ్రెసు, మంత్రివర్గాలను ఏర్పాటు చేసింది. మద్రాసు రాష్ట్రంలో శ్రీమాన్ రాజగోపాలాచారి ముఖ్యమంత్రిగా, టంగుటూరు ప్రకాశం పంతులు రెవెన్యూ మంత్రిగా కాంగ్రెసు మంత్రి వర్గం ఏర్పడింది. కాంగ్రెసు

మంత్రి వర్గం ఏర్పడిన తరువాత రైతాంగంలో నూతనోత్సాహం కలిగించి. రైతాంగ సమస్యల పరిష్కారానికి రైతులు ఉద్యమించారు

## ఋణ పరిష్కార చట్టం - రైతుల ఆందోళన :

ఆనాటి రైతులను పట్టి పీడించిన ప్రధాన సమస్యలలో ఋణ భారం ఒకటి. 1930 నాటి ఆర్థిక మాంద్యం రైతుల సాంఘిక, ఆర్థిక పరిస్థితిని పూర్తిగా దిగజార్చింది. తెచ్చిన అప్పుల భారం సంవత్సర, సంవత్సరానికి పెరిగి తడిసి మోపిడై రైతులను పూర్తిగా క్రుంగదీసింది. సత్యనాథన్ కమిటీ రిపోర్టు ప్రకారం మద్రాసు రాష్ట్రంలో రైతులు చెల్లించాల్సిన అప్పుల మొత్తం 206 కోట్ల రూపాయలుగా ఉన్నట్లు తేలింది.

రైతుల భూములను జప్తు చేయడం, స్థిరచరాస్తులను వేలం వేయడం సర్వ సామాన్య విషయంగా మారింది. శిస్తుల వసూళ్ళకు కూడా ప్రభుత్వ అధికారులు ఇదే నిర్బంధ విధానాన్ని చేపట్టారు. భూముల ధరలు నాలుగవ వంతు పడిపోయాయి. లక్షల ఎకరాల భూమి రైతులనుండి జమీందార్ల, వడ్డీ వా్యాపారస్తుల హస్తగతం అయింది సామాన్య రైతు లనేకమంది భూమిలేని నిరుపేదలుగా, వ్యవసాయ కూలీలుగా బజార్న పడవలసి వచ్చింది. నానాటికి పెచ్చు పెరుగుతున్న ఈ తీవ్ర సంక్షోభానికి వ్యతిరేకంగా ఆంధ్ర రైతాంగం ఆందోళనా కార్యక్రమాలను చేపట్టింది. ముఖ్యంగా 1935-36 లలో జిల్లా రాష్ట్ర రైతు సంఘాల నిర్మాణం పునరుద్ధరింపబడిన తరువాత ఋణ నివారణ సమస్యపై రైతుసంఘ కార్యకర్తలు నిర్దిష్టమైన ఆందోళనా కార్యక్రమాలు చేపట్టారు. అప్పులపై మారటోరియం ప్రకటించాలని, రుణ విమోచన చట్టం తీసుకురావాలని కోరుతూ రాష్ట్ర మహాసభ వేమవరపు రామదాసు పంతులు గారి అధ్యక్షతన జరిగింది.

వ్యవసాయ భూములపై శిస్తులు తగ్గించాలని, రైతుల అప్పులను రద్దు చేయాలని ఆంధ్ర రాష్ట్ర రైతాంగం కోరుతూ వచ్చింది. అఖిలభారత కాంగ్రెసు మహాసభ కూడా తన వ్యవసాయదారుల కార్యక్రమంలో మక్తాలు, శిస్తులు నూటికి 50 శాతం తగ్గించాలని, ఋణ నివారణోపాయాలు గావించాలని తీర్మానించింది. 1937 మద్రాసు రాష్ట్ర అసెంబ్లీ ఎన్నికల సందర్భంగా ప్రకటించిన కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికలో రైతుల ఋణబాధ నివారణ, శిస్తురేట్ల తగ్గింపు కార్యక్రమం ప్రధానాంశాలుగా వున్నాయి.

ఎన్నికలలో విజయం సాధించిన తరువాత ఏర్పడిన కాంగ్రెసు మంత్రి వర్గం రైతుల ఋణభారాన్ని సంపూర్ణంగా తొలగిస్తుందని రాష్ట్ర రైతాంగం ఎంతో ఆశపడింది. రైతాంగం నుండి పెద్దఎత్తున ఒత్తిడి రావడంతో 1937 డిసెంబరు 20 న మద్రాసు రాష్ట్ర శాసనసభలో వ్యవసాయదార్ల ఋణ పరి

ష్కార చట్టాన్ని కాంగ్రెసు ప్రభుత్వం ప్రవేశపెట్టింది. ఈ చట్టం ప్రకారం "1937 అక్టోబరు 1 నాటికి వ్యవసాయదార్ల ఋణములపై కట్టకుండా మిగిలి ఉన్న వడ్డీలు యావత్తు రద్దుచేయబడునని, అసలుగాని, అసలులో కట్టకుండా మిగిలివున్న భాగముగాని వ్యవసాయదారుడు చెల్లించవలసి వుంటుందని చెప్పబడింది.

ఒక ఋణముపై వడ్డీ నూటికి 9 రూపాయలు కంటే ఎక్కువ ఉన్నప్పుడు గాని, కాంపౌండు వడ్డీ ఉన్నప్పుడు గాని అసలుకు రెట్టింపు చెల్లించి యుండిన ఋణములన్ని రద్దగునని కూడా బిల్లులో పేర్కొనబడింది.

ఈ చట్టం ఆచరణలోకి వచ్చిన 15 మాసాలలోగా 1936, 37 సంవత్సరములకు సంబంధించిన శిస్తును రైతులు జమీందార్లకు చెల్లించిన ఎడల 1935 కి పూర్వం ఉన్న శిస్తుల బకాయిలన్నీ పూర్తిగా రద్దగునని లేదా 36, 37 సంవత్సరాల శిస్తులో ఎంత భాగం చెల్లిస్తే అంతమేరకు పాతబకాయిలు రద్దగునని ప్రకటించబడింది.

ఆర్థిక మాంద్యంవల్ల నిర్బంధ విధానాలవల్ల ఋణభారంతో తల్లడిల్లుతున్న ప్రజానీకాన్ని కాంగ్రెసు ప్రభుత్వం పూర్తిగా ఋణ విముక్తుల్ని చేస్తుందని ప్రజలంతా ఎదురు చూశారు. కానీ కంటి తుడుపుగా శాసనసభలో ప్రవేశపెట్టిన ఈ ఋణ పరిష్కార చట్టం ప్రజలని నిరాశకు గురిచేసింది ముఖ్యంగా సామాన్య రైతాంగానికి ఇది పెద్దమేలు కల్గించలేకపోయింది. రాష్ట్రంలో మొత్తం రైతు ఋణ భారం 206 కోట్ల రూపాయలలో ఈ బిల్లు మూలంగా రద్దు అయ్యేది కేవలం 80 కోట్ల రూపాయలు మాత్రమే. ఋణభారాన్ని చాలా భాగం రూపుమాపుతానని వాగ్దానం చేసిన 'కాంగ్రెసు' కేవలం నూటికి 39 వంతులు మాత్రమే రద్దు చేయటానికి సంకల్పించింది. అంతే కాకుండా ఈ ఋణ పరిష్కార చట్టం వ్యవసాయ కూలీలకు వర్తించదు చట్టం నిర్వచించిన 'వ్యవసాయదారుని' పరిధిలో వ్యవసాయం చేయని భూస్వాములు, జమీందార్లకు కూడా చట్టం వర్తిస్తుంది కానీ వ్యవసాయమే జీవనాధారంగా బ్రతుకుతున్న వ్యవసాయ కూలీలకు ఈ చట్టం వర్తించదు.

ప్రభుత్వం ప్రవేశపెట్టిన ఈ ఋణ నివారణ చట్టానికి అనేక సవరణలు ప్రతిపాదిస్తూ జిల్లా, రాష్ట్ర రైతు సంఘాలు అనేక తీర్మానాలు చేశాయి. ప్రధానంగా ఈ చట్టాన్ని వ్యవసాయ కూలీలకు కూడా వర్తింపచేయాలని, సహకార సంఘాల, బ్యాంకుల అప్పులకు కూడా ఇది వర్తించాలని, జమీందారీ మక్తా బకాయీలు రద్దుకావడానికి రెండు సంవత్సరాల శిస్తు చెల్లించాలన్న షరతు తొలగించాలని, అదే విధంగా అప్పులపై వడ్డీ పరిమితి 4 రూపాయలకు కుదించాలని జిల్లా,

రాష్ట్ర రైతు సంఘాలు కోరాయి. తమ కోర్కెలకు మద్దతుగా రాష్ట్రంలోని అనేక ప్రాంతాలలో సభలు, ఊరేగింపులు జరిపి ప్రభుత్వాధికారులకు డిప్యుటేషన్లు నిర్వహించారు. అంతేకాకుండా రాష్ట్ర రైతు సంఘం ఋణ నివారణ సమస్యపై రైతాంగాన్ని సమీకరించి ఆందోళనా కార్యక్రమాలను నిర్వహించడానికి 1938 జనవరి 17 నుంచి 24 వరకు ఋణ పరిష్కార వారం జరపాలని నిర్ణయించింది. ఈ ఋణ పరిష్కార వారంలో ప్రతి గ్రామంలోనూ సభలు నిర్వహించి, దళ యాత్రలు జరపాలని నిర్దిష్ట రూపంలో తమ కోర్కెలను తెలియచేస్తూ ప్రభుత్వాధి కారుల వద్దకు ఊరేగింపులు జరపాలని రాష్ట్ర రైతు సంఘం పిలుపు యిచ్చింది.

రైతు సంఘం ఇచ్చిన పిలుపు ననుసరించి ఆంధ్ర రాష్ట్రంలోని రైతాంగం పెద్ద ఎత్తున కదలి 'ఋణ పరిష్కార వారం' నిర్వహించింది. రాష్ట్రంలోని అనేక తాలుకాల్లో రైతు యాత్రలు, సభలు నిర్వహించబడ్డాయి. ఋణ పరిష్కార సమస్యతో పాటుగా జమీందారీ విధానం నశించాలని, మొఖాసాదారీ పద్ధతి పోవాలనే, కోర్కెలను కూడా జతపరచి ప్రభుత్వాధికారుల వద్దకు ఉరేగింపులు నిర్వహించబడ్డాయి ప్రధానమంత్రికి (రాజగోపాలాచారికి) మెమొరాండాలు యివ్వటం జరిగింది. 1938 జనవరి 25న పశ్చిమగోదావరి జిల్లా చింతలపూడి తాలుకాలో 3 వేల మంది రైతులు ఊరేగింపు చేసారు. "ఎక్కువ వడ్డీలుతగ్గాలి. ఋణ పరిష్కార చట్టం రైతుల కనుకూలంగా మారాలి. జమీందారీ పద్ధతి నశించాలి. మొఖాసాదారు పద్ధతి పోవాలి" అని వినాదాలు చేస్తూ 55 గ్రామాల నుండి వచ్చిన రైతులు ఈ ఉరేగింపులో పాల్గొన్నారు.

రైతులను చైతన్యవంతుల్ని చేసి, పోరాటోన్ముఖులను చేయడానికి గార పాటి సత్యనారాయణ, కడుపు రాములు, రంభా వెంకటప్పయ్య, పేటేటి వెంకట రత్నం జిల్లాకేంద్రం నుండి స్వయంగా చింతలపూడి వచ్చి ఉరేగింపులో పాల్గొన్నారు రైతు సంఘం ఆధ్వర్యంలో ఇంత పెద్ద ఎత్తున కదలి వచ్చిన రైతాంగాన్ని చూసి తహశీల్దారు ఆశ్చర్యపోయాడు.[2]

'ఋణ పరిష్కార వారం' సందర్భంగా భీమవరం తాలూకాలో నవుడూరు, గరగపర్రు మొదలగు 16 గ్రామాలలో రైతులు సభలు నిర్వహించి ఋణ పరిష్కార చట్టాన్ని రైతులకనుకూలంగా మార్చాలని కోరుతూ ప్రధానమంత్రికి మెమొరాండాలు పంపారు. ఇదే విధంగా ఆంధ్ర రాష్ట్రంలోని అనేక తాలూకాల్లో రైతు యాత్రలు, సభలు, ఉరేగింపులు నిర్వహించారు.

రైతులకు మేలు కలిగే విధంగా చట్టాన్ని సవరించమని రైతులు ఆందోళన చేస్తున్న ఈ దశలోనే సెలెక్టు కమిటీ మరికొన్ని దిగజారుడు సవరణలు చేసి, చట్టం రూపొందించింది. 1932 లోపల చేసిన బాకీలపై 6 1/4 వడ్డీ

అంగీకరించబడుతుందని సెలక్టు కమిటీ సవరించింది. రైతుల కష్టాలను తొలగిస్తానని వాగ్దానం చేసి ప్రభుత్వాధికారంలోకి వచ్చిన కాంగ్రెసు ఈ విధంగా చేయడం గర్హనీయమని ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘం పేర్కొన్నది. జమీందార్ల, వడ్డీ వ్యాపారస్థుల ఒత్తిడికి లొంగే కాంగ్రెసు ప్రభుత్వం ఈవిధంగా చేస్తోందని దీనికి వ్యతిరేకంగా రైతులంతా సమ్మైక్యంగా నిలిచి పోరాడాలని ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘం కోరింది. రైతులు ఎంత ఆందోళన చేసినప్పటికి, జమీందార్ల, వడ్డీ వ్యాపారస్థుల ఒత్తిడులకు లొంగిన రాజగోపాలచారి మంత్రి వర్గం రైతుల కోర్కెలను పెడచెవిన పెట్టింది.

ఋణ పరిష్కార చట్టం తేవడంలో రాజాజీ మంత్రి వర్గం అవలంభించిన తటాపటాయింపు, దిగజారుడు ధోరణి, రైతులకు ఎక్కువ మేలు కలుగ జేసే సవరణలకు మంత్రివర్గం వేసిన వెనుకడుగు, జమీందార్ల వడ్డీ వ్యాపారస్థుల పట్ల అవలంభించిన సానుకూల వైఖరి - రైతుల మేలు పట్ల రాజగోపాలాచారికి ఉన్న అవగాహనను బట్టబయలు చేశాయి.

## జమీందారీ విధానం రద్దుకై రైతాంగ పోరాటం :

భూమిపై హక్కు రైతుదా ? జమీందారుదా ? శిస్తు హెచ్చించే హక్కు జమీందారుకు వున్నదా అన్న పరిశీలనాంశాలలో జరగవలసిన మార్పును సూచించేందుకు శాసన సభలో తీర్మానం ఆమోదింపబడింది. ప్రకాశం గారి అధ్యక్షతన విచారణ కమిటీ ఏర్పాటు చేయబడింది. దీనినే 'జమీందారీ ఎంక్వయిరీ కమిటీ లేదా ప్రకాశం కమిటీ లేదా మద్రాసు ప్రభుత్వ ఎస్టేట్ లాండ్ యాక్టు కమిటీ (1937)' అని పిలిచేవారు. ఈ కమిటీ నియామకంతో రైతులకు ఎంతో ధైర్యం వచ్చింది. తమ హక్కులకై గట్టిగా నిలబడి పోరాడలనే సంకల్పం వారిలో పెరిగింది.

ఈ కమిటీ ఆంధ్ర ప్రాంత ఎస్టేటులకు సంబంధించిన విచారణను విశాఖపట్నం, రాజమండ్రి, మద్రాసు కేంద్రాలలో పూర్తి చేసింది.

1938 జనవరి 7 నుండి 13 వరకు విశాఖ పట్నంలోను, జనవరి 16 నుండి 22 వరకు రాజమండ్రిలోను ఈ విచారణ కమిటీ రైతుల నుండి సాక్ష్యాలు సేకరించింది.

విచారణ కమిటీ రాకను గురించి, సాక్ష్యాల కవసరమైన రికార్డుల గురించి. భయపడకుండా కమిటీ ఎదుట తమ బాధలు చెప్పినప్పుడే జమీందార్ల పీడ విరగడ అవుతుందని కమ్యూనిస్టు యువకులు ప్రచారం చేసారు. జమీందారీ ప్రాంతాల నుండి రైతులను స్వయంగా సమీకరించి, విచారణ కమిటీ ఎదుట సాక్ష్యాలను ఇప్పించారు. రాజమండ్రిలో ఉభయ గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలోని

జమీందారీలను గురించి విచారణ జరిపారు. సాక్ష్యం చెప్పడానికి వందల మైళ్ళ నుండి రైతులు కాలి యాత్రన వచ్చారు.

జనవరి 18న రాజమండ్రిలో జరిగిన విచారణకు తుని తాలూకా నుండి రైతులు, గొల్లలు, కోయలు కాలి నడకన 90 మైళ్ళు నడుచుకుంటూ కంభంపాటి సత్యనారాయణ నాయకత్వంలో ఊరేగింపుగా వచ్చారు. ఒక చోట నుండి కాదు, సుదూరంగా ఉన్న చల్లపల్లి మొదలుకొని ముక్త్యాల, తోటపల్లి, తేలప్రోలు, పిఠాపురం, శరభవరం అన్ని జమీందారీ ప్రాంతాల నుండి రైతులు వచ్చి సాక్ష్యాలు ఇచ్చారు. కొరపాటి పట్టాభిరామయ్య, కంభంపాటి సత్యనారాయణ, రైతు సంఘ నాయకులు, కార్యకర్తలుచేసిన ప్రచారం సత్ఫలితాలనిచ్చింది విచారణకమిటీలో మీర్జాపురం రాజావారు వేసిన తికమక ప్రశ్నలకు ఎస్టేటు దివాన్లు, ఉద్యోగస్తులు ఎంతమంది ఎదురుగా ఉన్న రైతులు జంకకుండా ధైర్యంగా సమాధానాలు చెప్పారు. దశాబ్దాలుగా రైతులలో అణగారిన ఆక్రోశం, ఆవేదన ఒక్కసారిగా బయటకు వచ్చింది.

ముక్త్యాల ఎస్టేటు రైతు జమీందారీ శిస్తుల గురించి జరుగుతున్న అన్యాయాల గురించి రికార్డులతో సహా సాక్ష్యం ఇచ్చాడు. రైతులు చెపుతున్న సాక్ష్యాలన్నింటిని కమ్యూనిస్టుల కుట్రగా కొట్టివేయడానికి మీర్జాపురం రాజా ఆ రైతులను అనేక ప్రశ్నలు వేసి తప్పుదారి పట్టించే ప్రయత్నం చేసినా ఆ రైతు భయపడకుండా సమాధానం చెప్పాడు. మీర్జాపురం జమీందారు ప్రశ్నలు-ఆ రైతు సమాధానం ఇలా ఉంది.[3]

* మీరు సోషలిస్టులా?
  కాదు.
* రైతుసంఘ సభ్యులా?
  కాదు.
* జమీందార్లు గురించి ఇంత చెపుతున్నారు, మీ ఆస్తి కూడా పంచి పెడ్తారా?
  ఎబ్బే మాది మాకు చాలితే కదండి.

మీర్జాపురం రాజా అడిగిన ప్రశ్నలకు మరో ముస్లిం రైతు ఇచ్చిన సమాధానాలు ఇలా ఉన్నాయి.

* మీరే సంఘం తరపున వచ్చారండీ?
  ఎవరితరపునో రావడం ఏమిటండీ, మా కష్టాలు చెప్పుకోడానికి ఇంకొకరి తరపు ఎందుకండీ.
* మీరంతా సంఘాలలో ఉన్నారు. మీ ఊళ్ళో అందరూ కలిసి ఉంటారా?
  జమీందార్లు మరి కలవనిస్తారటండీ.

విచారణ కమిటీ ఎదుట సాక్ష్యం చెప్పడానికి స్త్రీలు వందలమైళ్ళు నడుచుకుంటూ వచ్చారు. గంభీరంగా ప్రకాశం పంతులుగారు వేసిన ప్రశ్నలకు రైతులు నిర్భయంగానే సమాధానం చెప్పారు. ప్రకాశంగారి ప్రశ్నలకు చల్లపల్లి రైతు సమాధానాలు ఈ విధంగా ఉన్నాయి. మేము కలెక్టరుగారికి రైతు సంఘాలు ద్వారా పిటీషన్లు పెట్టుకున్నాం జవాబు రాలేదు.

* అయితే రైతు సంఘాలు ఏమి యాక్షన్ తీసుకున్నాయి?

ఏమి తీసుకోగలవండీ, అధికారం ఏముంది మాకు.

* మరేమి చేస్తావు ఇకముందు?

ఏమి చేయగలనండి, పన్నులు కట్టుకోలేం గనుక ఇవ్వం.

మీర్జాపురం జమీందారు భయోత్పాదక ప్రశ్నలతో ఎంత కలవర పెట్టాలని చూచినా, ప్రకాశంగారి గంభీర ప్రశ్నలకు రైతులు నిలకడగా నిర్భీతిగా జమీందార్ల చేతిలో తాము పడుతున్న బాధలు, 148 సంవత్సరాలుగా జమీందార్లు సాగిస్తున్న అక్రమ దోపిడీల గురించి స్పష్టంగా బయట పెట్టారు.

జమీందారీ విచారణ కమిటీ ఎదుట సాక్ష్యం చెప్పటానికి నాలుగు జిల్లాలలోని అన్ని జమీ ప్రాంతాల నుండి రైతులు వచ్చారు మొత్తం 5 వేల మంది రైతులు జమీందారీ విధానం నశించాలి, రైతు సంఘాలకీ జై, విప్లవం వర్ధిల్లాలి అంటూ నినాదాలు చేస్తూ రాజమండ్రి పట్టణంలో ఊరేగింపు జరిపి శ్రద్ధానంద ఘాట్‌లో జరిగిన బహిరంగ సభకు హాజరయ్యారు. విచారణ కమిటీ ఎదుట రైతులు సాక్ష్యం చెప్పటానికి ప్రోత్సహించి సమీకరించిన కమ్యూనిస్టు కార్యకర్తలు, రైతులతో జరిగిన ఊరేగింపూ, బహిరంగ సభ గురించి పేరొంటూ నవశక్తి పత్రిక ఇలా వ్రాసింది.

ఆ మహా రైతు సముదాయం రాజమండ్రి ఇరుకు సందుల గుండా ఉత్సవానికి బయలుదేరింది 8 మైళ్ళు నడచి వచ్చామే అని నిరుత్సాహం లేదు. అలసట లేదు. ఆ పీక్కుపోయిన కళ్ళలో ఏదో ఆనందం, ఆ ముడుతపడ్డ వదనాలపైన ఏదో ఆశారేఖ, 'జమీందారీ విధానం' అనగానే పోవాలి అంటూ 5 వేల ప్రజ ఐక్య కంఠంతో పలికింది. రైతు సంఘాలకు, కూలీ సంఘాలకు జై అంటే జై అని ప్రతిధ్వనించింది. ఆ ఉత్సవమంతా ఎర్రజండాలతో అలంకరించబడింది. విప్లవం వర్ధిల్లాలి, సామ్రాజ్య వాదం నశించుగాక అని నినాదాలు వ్రాసిన ఎర్ర గుడ్డలున్నాయి. జమీందారీ విధానం పోవాలి, లంచగొండితనం పోవాలి, స్వంత సేరీలు రద్దు కావాలి అంటూ అట్టల నిండా వ్రాసి ఉన్నాయి.

18 వ తేదీ సాయంత్రం జరిగిన బహిరంగ సభ కమ్యూనిస్టు నాయకులు రైతు సంఘ నాయకులు అయిన సుందరయ్య, మద్దూరి అన్నపూర్ణయ్య,

కొమ్మారెడ్డి సత్యనారాయణ, నెల్లూరు వెంకట్రామనాయుడు, ఎన్. జి. రంగా ప్రసంగించారు.

విచారణ కమిటీ రాష్ట్రమంతటా పర్యటించి 1938 మార్చి నాటికి నివేదికను పూర్తి చేసింది. కాని ఆ నివేదికను ప్రకటించటంలో ప్రభుత్వం అతి జాప్యం చేసింది. కాంగ్రెసు ప్రభుత్వం అనుసరిస్తున్న ఈ మెతక వైఖరిని ఆసరాగా చేసుకుని జమీందార్లు, ఈనాందార్లు రైతులపై విరుచుకుపడ్డారు. విచారణ కమిటీ ఎదుట సాక్ష్యం చెప్పిన రైతులపై కక్ష సాధింపు చర్యలకు, దౌర్జన్య కాండకు దిగారు. భూములు నుండి రైతులను వెడలగొట్టడం, దొంగపేర్లతో పట్టాలు సృష్టించడం, గుండాలు రౌడీ మూకలతో రైతులపై దాడులు చేయడం సాగించారు. కాశీపట్నం, మునగాల, ముక్త్యాల గంపలగూడెం, చిట్యాల, తిరువూరు నందిగామ, చల్లపల్లి, విజయనగరం ప్రాంతాలలో జమీందారు, మొఖాసాదార్లు రైతులపై పోరాటాలకు దిగారు. జమీందారీ బిల్లు రాకమునుపే సాధ్యమైనంత భూమిని ఆక్రమించుకుని, రైతులను భయభ్రాంతులను చేసి అణిచి వేయాలనే ఉద్దేశ్యంతో జమీందార్లు సాగిస్తున్న ఈ దౌర్జన్య కాండను కమ్యూనిస్టులు, రైతు సంఘ కార్యకర్తలు రైతులను సమైక్య పరిచి సంఘ బలంతో ఎదుర్కొసాగారు.

పశ్చిమ గోదావరి జిల్లాలో ఉద్దరాజు రామం, సంకు అప్పారావు, పేటేటి వెంకట రత్నం, కృష్ణా జిల్లాలో నండూరి ప్రసాదరావు, చండ్ర రాజేశ్వర రావు, వెల్లంకి విశ్వేశ్వర రావు, వాసిరెడ్డి శివలింగ ప్రసాద్ మొదలగు కమ్యూనిస్టు నాయకులు, రైతు సంఘ నాయకులు అనేకమంది అతివాద కాంగ్రెసు నాయకులు రైతులలో ప్రచారం చేస్తూ వారిని సమైక్య పరిచి జమీందార్ల దౌర్జన్యాలను ఎదుర్కొసాగారు. కాశీపట్నం, మునగాల, చల్లపల్లి మొదలగు ఎస్టేట్ల రైతుల పోరాటాలు విజృంభించాయి.

జమీందారీ విచారణ కమిటీ నివేదికను వెంటనే శాసన సభలో పెట్టాలని జమీందారీ విధానాన్ని రూపుమాపాలని కోరుతూ జిల్లా, రాష్ట్ర రైతు సంఘాలు ఆందోళన చేయసాగాయి. విచారణ కమిటీ రిపోర్టును తొక్కిపెట్టాలని రాజాజీ చేస్తున్న కుటిల ప్రయత్నాలను రైతు సంఘ నాయకులు సాగనివ్వలేదు. నానాటికి ఉధృతమవుతున్న జమీందారీ వ్యతిరేక ఉద్యమం మూలంగా రాజాజీకి విచారణ కమిటీ రిపోర్టును ఎక్కువ కాలం తొక్కిపెట్టడం సాధ్యం కాలేదు. 1938 నవంబరు 28 న ప్రకాశం కమిటీ రిపోర్టు శాసన సభ్యులకు అందజేయ బడింది. కమిటీ సభ్యులైన మీర్జాపురం రాజా ఎ. రంగస్వామి అయ్యంగార్, మహబూబ్ ఆలీబేగ్, బి. నారాయణస్వామి నాయుడులు, మిగిలిన 5 గురు

సభ్యులు రూపొందించిన రిపోర్టుతో ఏకీభవించక ప్రత్యేకంగా వారి వారి అభిప్రాయాలు సభకు నివేదించారు.

భూమిపైన, నీటిపైన హక్కు రైతుదేనని, పర్మనెంటు సెటిల్‌మెంటును బట్టివున్న శిస్తురేట్లను పెంచే హక్కు జమీందార్లకు ఏ మాత్రము లేదని, దీనికి భిన్నంగా అప్పటివరకు వచ్చిన తీర్పులు తప్పు అని ప్రకాశం కమిటీ నివేదికలో స్పష్టంగా పేర్కొనబడింది. జమీందారులలోని చిన్న పెద్ద జలాశయాలన్నింటిని ప్రభుత్వపరం చేయుటకు ఒక చిత్తు శాసనము ఎస్టేట్లలో శిస్తులు రైత్వారీ ప్రాంతాలలోని శిస్తు రేట్ల ప్రమాణానికి తగ్గిస్తూ మరో చిత్తు శాసనాన్ని ప్రకాశం కమిటీ తమ నివేదికతో పాటు జతపర్చడం జరిగింది అయితే ఈ కమిటీ జమీందారీ విధాన రద్దును సిఫార్సు చేయలేదన్న విషయాన్ని గమనించటం అవసరం కాగా ప్లీడ్ కమీషన్ (బెంగాలు) పర్మనెంటు సెటిల్‌మెంటు రద్దును సిపార్సు చేసింది. ప్రకాశం కమిటీ నివేదిక బయటపడకుండా చేయాలని జమీందారీ. వర్గాలు పెద్ద ప్రయత్నం చేశాయి. ప్రధానమంత్రి రాజగోపాలాచారి కూడా అదే అభిప్రాయాలలో వున్నారు. జమీందార్లు సర్దార్‌పటేలు వద్దకు ఈ విషయంలో రాయబారం వెళ్ళారు. రాజగోపాలచారితో ముందుగా సంప్రదించాలన్న సూచనలు త్రోసి వేసి ప్రకాశం పంతులు నివేదికను శాసనసభ స్పీకరుకు 1938 నవంబరులో సమర్పించారు.

ఈ నివేదిక శాసనసభలో చర్చకు రాకుండా చేయాలని తీవ్ర ప్రయత్నాలు జరిగాయి. ఈ విషయంలో ప్రధానమంత్రి రాష్ట్ర గవర్నరు సహాయాన్ని కోరాడు. ఎలాగయినా నివేదిక చర్చకు పెట్టవద్దని సాంబమూర్తికి నచ్చచెప్పాలని గవర్నరును కోరడం, ఆయన ఆవిధంగానే స్పీకరుతో చెప్పించాడుగాని సాంబమూర్తిగారు అలా ఆపడానికి వీలులేదని నిర్మొహమాటంగా గవర్నరుతో చెప్పారు చివరకు నివేదిక అసెంబ్లీలో చర్చకు పెట్టబడింది స్పీకరు అసెంబ్లీ వెలుపలచేరిన 10 వేల మందికి ప్రసంగాలు వినబడటానికి వీలుగా అసెంబ్లీ బయట లౌడు స్పీకర్లు పెట్టించారు. తన ప్రయత్నమంతా విఫలమయిన తరువాత, 3 రోజుల చర్చ తరువాత ఆఖరులో తన ఎత్తుగడ మార్చుకొని రాజగోపాలాచారి ప్రకాశం కన్నా విప్లవాత్మకమైన చిన్న ఉపన్యాసం చేసాడు ఇలా ప్రకాశం కమిటీ నివేదిక రెండు సభల్లోను ఆమోదించబడింది.

చిత్తు బిల్లులను అసెంబ్లీలో పెట్టడంలో చాలా జాప్యం జరిగింది.

ప్రకాశం కమిటీ రిపోర్టు భూమిపై సర్వ హక్కులు రైతులవేనని, జమీందారు కేవలం పన్ను వసూలుచేయు ఏజంటు మాత్రమేనని స్పష్టం చేసింది.

1802 కి పూర్వం రైతు ఎంత శిస్తు చెల్లించాడో అంతే శిస్తును జమీందారు వసూలు చేయాలని, భూమి శిస్తు మినహా మరే ఇతర శిస్తు వసూలుచేసే హక్కు జమీందారుకు లేదని నిక్కచ్చిగా చెప్పింది.

జలాధారలైన చెరువులు, కాలవలు మొదలగు నీటి వసతులు పైన, అడవులు, పోరంబోకులు మొదలగు వాటి పైన రైతులదే పూర్తి, హక్కని, జమీందార్లకు ఏ విధమైన అధికారాలు లేవని స్పష్టంగా పేర్కొంది.

జమీందారీ విధానాన్ని పూర్తిగా రూపుమాపక పోయినప్పటికీ రైతులకు మేలు కల్గించే ఈ విధమైన అంశాలతో కూడిన నివేదికతో పాటుగా, ఈ అంశాలను పొందుపరుస్తూ ఒక బిల్లును కూడా రిపోర్టుతో పాటు ప్రకాశం శాసన సభకు అందించారు.

ప్రకాశం కమిటీ నివేదిక వెలువడిన వెంటనే రాష్ట్ర రైతు సంఘం, కాంగ్రెసు సోషలిస్టు పార్టీ నాయకులు రైతులకు ఉపయోగపడే విధంగా రిపోర్టును, బిల్లు రూపొందించినందుకు ప్రకాశం పంతులును అభినందిస్తూ బిల్లులో ఉన్న అనేక లోపాలను ఎత్తి చూపుతూ వాటిని వెంటనే సవరించాలని పేర్కొన్నారు. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ కార్యదర్శిగా ఉన్న పి. సుందరయ్య జమీందారీ కమిటీ నివేదిక, బిల్లుపై సూచనలు చేస్తూ "ఎస్టేటు ల్యాండు ప్రకారం ఎస్టేట్లుగా నిర్వచించబడిన అన్ని ఎస్టేట్లుకు (ఈనాందారీ, అగ్రహారాలు కూడా) ఈ బిల్లు వర్తించేటట్లు చేయాలని కోరారు.

ఏ లాండు హోల్డరుకు 50 ఎకరములు కన్నా ఎక్కువ స్వంత భూమి ఉండరాదు అంతకు మించి హెచ్చు, సొంత భూమిగల జమీందార్లు అట్టిచర్యలు కౌలుదార్లకు జిరాయితీ హక్కులివ్వాలి స్వంత కమతములను పై షరతులకు లోబడి రద్దు చేయవలెను. రద్దు గావించిన స్వంత కమతము భూములను ప్రభుత్వం వశమొనర్చుకొని, సాగు నిమిత్తమై వ్యవసాయ వృత్తిగా గల పేద ప్రజలకు సహకార పద్ధతులపై సాగుచేయడానికి పంచిపెట్టాలని సూచించారు.

జలాధారములకు ప్రభుత్వమే పూర్తి బాధ్యత వహించాలని, రెమిషన్స్ సౌకర్యం కల్గించాలని కోరుతూ అనేక సూచనలు చేశారు. ఈ సూచనల అమలు కొరకు కాంగ్రెసు సంఘాలు, రైతు సంఘాలు, సోషలిస్టులు ఆందోళన సాగించాలని కూడా సుందరయ్య కోరారు

ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘం కూడా జమీందారీ కమిటీ నివేదిక వెలువడిన వెంటనే 4-12-38 న బెజవాడలో సమావేశమై కొన్ని సవరణలను ప్రతిపాదించింది. ప్రధానంగా "ఈనాం, అగ్రహారాలనుకూడా బిల్లులో చేర్చాలని, ఆవిధంగా చేయడానికి వీలుపడని సందర్భంలో, ఈనాం, అగ్రహారం రైతులకు కూడా

సమాన హక్కుల నిచ్చు వేరొక చట్టం, జమీందారీ చట్టం, అమలులోనికి వచ్చిన రోజునే, అమలు లోనికి వచ్చే విధంగా చేయాలని కోరటం జరిగింది.

రైతు సంఘ సూచనలతో జమీందారీ బిల్లు వెంటనే చట్టంగా రూపొందేటట్లు రైతులంతా ముఖ్యంగా జమీందారీ ప్రాంతంలోని రైతులంతా సభల ద్వారా, దినోత్సవముల ద్వారా, యాత్రల ద్వారా, పిటీషన్ల ద్వారా నిరంతర ఆందోళన చేయవలెనని రాష్ట్ర రైతు సంఘం కోరింది. చట్టం రూపొందేవరకూ రైతులు విశ్రమించకుండా ఆందోళన చేయాలని తీర్మానించింది.

గతంలో కాంగ్రెసు మంత్రివర్గం రూపొందిన ఋణ పరిష్కార చట్టం సందర్భంలో రైతాంగానికి ఎదురైన చేదు అనుభవాన్ని దృష్టిలో ఉంచుకొని ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘం జమీందారీ బిల్లుపట్ల ప్రత్యేక శ్రద్ధ వహించి ఆందోళనా కార్యక్రమాన్ని రూపొందించింది. ఋణ పరిష్కార చట్టం ప్రారంభంలో రైతుల కనుకూలంగా రూపొందించబడినప్పటికి, కాంగ్రెసు ప్రభుత్వం జమీందార్ల, వడ్డీ వ్యాపారస్తుల వత్తిడికి లొంగడం వల్ల చివరికది శాసనంగా రూపొందే నాటికి రైతులకు పెద్ద మేలు చేకూర్చలేక పోయింది.

గతంలో ఎదురైన విషమ పరిస్థితిని పునరావృతం కాకుండా చేయడానికి కాంగ్రెసు శాసన సభ్యులపైన, మంత్రి వర్గంపైన జమీందార్లు తెస్తున్న వత్తిడికి వారు లొంగకుండా చేయడానికి రాష్ట్ర వ్యాపితమైన ఉద్యమం జరుపవలసిందిగా రైతాంగానికి పిలుపు నిచ్చింది.

1939 జనవరి 12 నుండి 19 వరకు జమీన్ రైతు రక్షణ వారం జరుపమని, 20 వ తేదీన రైతు రక్షణ దినంగా ఆందోళన గావించాలని రైతాంగానికి పిలుపునిచ్చింది. రాష్ట్ర రైతు సంఘాధ్యక్షులుగా ఉన్న కొమ్మారెడ్డి సత్యనారాయణ మూర్తి 1938-39 డిసెంబరు, జనవరి మాసాలలో ఉత్తర విశాఖజిల్లా, దక్షిణ విశాఖ జిల్లా, తూర్పు, పశ్చిమగోదావరి జిల్లాలు, కృష్ణా, నెల్లూరు జిల్లాలు విస్తృతంగా పర్యటించి జమీందారీ బిల్లు గురించి, సవరణలలో దానిని శాసనం గావించవలసిన ఆవశ్యకత గురించి విస్తృతమైన ప్రచారం చేసి, జమీన్ రైతు రక్షణ వారం దిగ్విజయంగా జరపాలని రైతులను ఉత్తేజపరిచారు.

కాశీబుగ్గలో జనవరి 2 న జరిగిన ఉత్తర విశాఖ జిల్లా మహాసభకు రెబ్బాప్రగడ మందేశ్వర శర్మ, వాసిరెడ్డి శివలింగ ప్రసాద్, పుల్లెల శ్యాం సుందరారావు, గౌతులచ్చన్న వంటి రైతు నాయకులు హాజరై జమీందారీ బిల్లు గురించి పెద్ద ఎత్తున ప్రచారం చేసారు. చీకటి, తలతంపర, బారువా, మందసా, తర్ల, పాతపెక్కలి, నందిగాం, పర్లాకిమిడి, గోపాలపురం జమీందారీల నుండి 4

వేల మంది రైతులు హాజరైన ఈ మహాసభలో జమీందారీ బిల్లును వెంటనే శాసనం గావించాలని, రైతు సంఘ సూచనల ప్రకారం సవరణలు గావించాలని, ఈనాం రైతులకు కూడా శాసనం వర్తించేటట్లు చేయాలని తీర్మానించారు.

"జమీందారీ విచారణ కమిటీ వారి సలహా ప్రకారం అమలు చేయడంలో ఎట్టి ఆటంకములుగాని, ఆలస్యములుగాని జరిగిన దేశంలో అశాంతికి కారణ మగునని" సభవారు మర్యాద పూర్వకంగా హెచ్చరించారు [5]

పశ్చిమ గోదావరి జిల్లా రైతు సంఘ కార్యదర్శి పేటేటి వెంకటరత్నం, ఏలూరు తాలూకా రైతు సంఘ కార్యదర్శి గారపాటి సత్యనారాయణ మొదలగు వారు చింతలపూడి తాలుకాలో జనవరి మొదటి వారంలో విస్తృతంగా పర్యటించి మల్లాయిగూడెం, కాంతం గూడెం, రేచర్ల మొదలైన గ్రామాలలో జమీందారీ బిల్లుకు ప్రచారం చేసారు.

అల్లూరి సత్యనారాయణ, కలిదిండి బంగార్రాజులు కాళిపట్నం ప్రాంతంలో జమీందారీ చట్టం రూపొందేవరకు రైతులు ఆందోళన చేయాలని ఉద్బోధించారు.

తూర్పు గోదావరి జిల్లా పిఠాపురం తాలూకాలో కొరపాటి పట్టాభిరామయ్య జిల్లా రైతు సంఘకార్యదర్శి పెన్మెత్స సూర్యనారాయణ, చింతం సత్యనారాయణ జమీందారీ బిల్లు గురించి రైతులకు వివరించారు. డిసెంబరు 17 న మందపల్లి గ్రామంలో 800 మంది జమీన్ రైతులు సభ జరిపి జమీందారీ శాసనం వెంటనే రూపొందించాలని తీర్మానించారు. రామచంద్రాపురం తాలూకాలో కాంగ్రెసు సోషలిస్టు పార్టీ, రైతు సంఘం, కాంగ్రెసు సంఘం ఆధ్వర్యంలో డిసెంబరు 28 న చింతలూరు, గుమ్మిలేరు, నేలటూరు, నిడసనమెట్ట, పాలపోడు, మేడపాడు, చినద్వారపూడి, పందలపాక మొదలగు గ్రామాలలో రైతు యాత్రలు నిర్వహించి జమీందారీ శాసనం వెంటనే చేయాలని సభలు జరిపి తీర్మానించారు.

నెల్లూరు జిల్లాలో దామవరం, అనంతవరం, నారాయణపురం శ్రోత్రియ అగ్రహార రైతులు జనవరి 2 న సమావేశమై జమీందారీ విచారణ కమిటీ వారు అగ్రహారం, శ్రోత్రియందారీ, ఈనాందారీ రైతులను వదలి వేయడం చాలా అన్యాయమని జమీందారీ బిల్లులో వీరినికూడా చేర్చాలని కోరుతూ వెంటనే శాసనం రూపొందించాలని తీర్మానించారు.

చిత్తూరు జిల్లాలో జమీందారీ బిల్లుపై ప్రత్యేకంగా రైతులను సమాయత్త పరిచి ఆందోళనను తీవ్రతరం చేయడానికి జిల్లా జమీన్ రైతు మహాసభను జనవరి 13 న నిర్వహించారు. కృష్ణా జిల్లా రైతు నాయకుడైన కామినేని వెంకటప్పయ్య చిత్తూరు జిల్లాలో జమీందారీ బిల్లు గురించి రైతులలో విస్తృత ప్రచారం చేసారు.

జమీందారీ బిల్లు వెంటనే శాసనంగా రూపొందేందుకు పుత్తూరు తాలూకాలో రైతులను ఉత్తేజపరచి వారిని ఆందోళనకు సమాయత్తులను చేయటానికి ఆర్.ఎం. రత్నం, బస్వారెడ్డి శంకరయ్య, శ్రీనివాస విఠల్ మొదలగు నాయకులు విస్తృత ప్రచారం చేసారు. రేణిగుంట, కరకణం బాడు, కల్లూరు, వాదిరేడు, పూడి, నగరి, వేపగుంట, పుత్తూరు, మొదలగు ప్రాంతాలలో సభలు జరిపారు. రైతులు సమైక్యంగా ఉద్యమించి ఆదోళన చేసిన నాడే రైతుల కష్టాలు తీరుతాయని, జమీందారీ శాసనం రూపొందే వరకు రైతులు నిరంతర ఆందోళన కావించాలని రైతులకు ఉద్బోధించారు.

రాష్ట్రంలోని రైతాంగమంతా పెద్ద ఎత్తున కదలింది. జిల్లాల వారీగా జమీన్ రైతు మహాసభలు జరిగాయి. జమీందారీ విధానాన్ని ఖండిస్తూ, రైతు సంఘం చేసిన సూచనలతో వెంటనే జమీందారీ శాసనం చేయాలని కోరుతూ వేలాది మంది రైతులు ప్రదర్శనలు నిర్వహించారు. 1939 జనవరి 7 న సోంపేట తాలూకాలో 8 వేల మంది రైతులు, మందసా, బారువా, తలతంపర, జలంత్ర మొదలగు ప్రాంతాలను మరో 8 వేల మంది రైతులు కలిసి రైతు రక్షణ యాత్రగా సోంపేట తాలూకా ఆఫీస్‌కు వెళ్ళారు టెక్కలి, పాతపట్నం, నరసన్న పేట తాలూకాలలో వేలాదిమంది ఈనాందారీ రైతులు, కొండజాతి రైతులు ప్రదర్శనలు జరుపుతూ జమీందారీ శాసనం వెంటనే చేయాలని, ఈనాం దారీ రైతులకు కూడా దాన్ని వర్తింప చేయాలని కోరారు.

జనవరి 6 న జరిగిన తూర్పు గోదావరి జిల్లా జమీన్ రైతు మహాసభ జనవరి 8 న జరిగిన కృష్ణా జిల్లా జమీన్ రైతు మహాసభ, జనవరి 7 న జరిగిన పశ్చిమ గోదావరి జిల్లా జమీన్ రైతు మహాసభ జమీందారీ విధానాన్ని నిర్ద్వంద్వంగా ఖండించాయి. జమీందారీ శాసనాన్ని ఎట్టి ఆలస్యం చేయకుండా రూపొందించాలని ఏకగ్రీవంగా తీర్మానించాయి.

పశ్చిమ గోదావరి జిల్లా ధర్మాజీ గూడెంలో జరిగిన జమీన్ రైతు మహాసభలో కొమ్మారెడ్డి సత్యనారాయణ మూర్తి మాట్లాడుతూ "బిల్లు ఏ కారణం చేతనైనా పాసు కాక పోయినట్లయితే రైతులు సత్యాగ్రహం చేయవలసి ఉంటుందని హెచ్చరించారు."

బొబ్బిలి, మైలవరం, రావూరిపాలెం, గరికపర్రు, కుమ్మమూరు, కావలి, నందిగామ, రాజోలు, చల్లపల్లి, కాళహస్తి, తెనాలి, కోటనందూరు, దరిశి, ఒంగోలు, కోవూరు, గుడివాడ, రేపల్లె, చింతలపూడి, పోలవరం, మైలవరం, భీమవరం, వినుకొండ, కాశీపట్నం, మొదలగు అన్ని ప్రాంతాలలో వేలాది మంది రైతులు ప్రదర్శనలు, రైతు యాత్రలు, సభలు జరిపారు.

విశాఖపట్టణం జిల్లా మొదలుకొని చిత్తూరు జిల్లా వరకు ప్రతి తాలూకా లోనూ జమీన్ రైతు రక్షణ వారం, రైతు దినం కార్యక్రమాలలో లక్షలాది మంది రైతులు పాల్గొన్నారు. ఆంధ్ర రైతాంగమంతా ముక్తకంఠంతో, జమీందారీ శాసనాన్ని వెంటనే ఆమోదించాలని ఈనాందారీ, అగ్రహార రైతులకు కూడా దానిని వర్తింప జేయాలని కోరారు.

రాష్ట్ర రైతు సంఘం ప్రకటించిన 'ప్రజాసామాన్యం ఏమి చేయాలి', "యాత్రలు విజ్ఞప్తి', 'ప్రకాశం కమిటి నివేదిక' అనే కరపత్రాలు రాష్ట్రమంతటా పంచబడ్డాయి

రాష్ట్ర రైతాంగం, సోషలిస్టు, అతివాద కాంగ్రెసు వాదులు ముక్త కంఠంతో జమీందారీ శాసనం చేయాలి అని ఐక్యంగా నిలబడడంతో రాజగోపాలా చారి వంటి మితవాదికి కూడా ప్లేటు ఫిరాయించి జమీందారీ బిల్లును బలపరచక తప్పలేదు.

1939 జనవరి 28న జరిగిన అసెంబ్లీ చర్చలో మీర్జాపురం రాజాకి, లాంగే (యూనియన్ సభ్యుడు)కి వ్యతిరేకంగా మాట్లాడుతూ "జమీందారీలను తొలగించాలని ప్రజలు కోరడంలో విచిత్రమేమైనా ఉన్నదా? పరిస్థితులను ఈ విధంగానే సాగనిస్తే జమీందార్లకే వ్యవహారం శృతిమించి పోతుంది. వారి శ్రేయస్సుకొరకే వారి హక్కులను లాగివేయవలసి యుంది'' అని స్పష్టంగా జమీందారీ బిల్లును బలపరుస్తూ రాజగోపాలచారి ముందుకు వచ్చాడు.[6]

లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో జరిగిన చర్చలో కె.వి అర్. రెడ్డి నాయుడు "జమీందారీ బిల్లు కమ్యూనిస్టు ప్రయత్నమని, మాస్కోలో జరిగిందే మళ్ళ మన దేశంలో జరుగుతోందని అనేకమంది పస్తుండి ప్రాణత్యాగం చేయవలసి వస్తుందని నేరాలు పెరిగిపోతాయని'' అని వాపోతూ జమీందారీ బిల్లును అడ్డుకొనే ప్రయత్నం చేసాడు.

జమీందార్లు, బిల్లుకు ఎన్ని కుంటి కాళ్ళు అడ్డం పెట్టినా మెజారిటీ సభ్యులు దానికి అనుకూలంగానే ఉన్నారు.

బిల్లు శాససంగా రూపొందే దశలో ఉండగానే యుద్ధ పరిస్థితి తీవ్రమవడం, జాతీయ కాంగ్రెసు, బ్రిటిషు ప్రభుత్వం మధ్య ప్రతిష్టంభన ఏర్పడడం మూలంగా కాంగ్రెసు మంత్రి వర్గాలు రాజీనామా చేసాయి జమీందారీ బిల్లు శాసనంగా రూపొందకుండానే తాత్కాలికంగా మరుగున పడింది.

ఏమైనా జమీందారీ విధానం పట్ల రైతాంగానికి ఉన్న వ్యతిరేకత ఈ జమీందారీ వ్యతిరేక ఉద్యమంలో స్పష్టంగా బయటపడింది. తమను పట్టి




నవశక్తి 4-1-39

రాజాజీ,: జమీందారీ కమిటీ రిపోర్టు తీవ్రంగా ఉందంటాడే గాని, రైతులను మాడ్చే జమీందారీ విధానంలోని క్రౌర్యాన్ని గుర్తించరు



ప్రకాశం కమిటీ రిపోర్టు పట్ల రాజాజీ వ్యతిరేకతను తెలియచేస్తున్న నవశక్తి కార్టూన్.



మునగాల సత్యాగ్రహులు.

పీడుస్తున్న సమస్యలపై నిరక్షరాస్యులు, అయిన రైతాంగం సహితం పెద్ద ఎత్తున ఉద్యమించగలరని రుజువైంది.

ప్రపంచ యుద్ధాన్ని సాకుగా తీసుకొని ప్రజా ఉద్యమాలపై విరుచుకుపడ్డ బ్రిటీషు ప్రభుత్వ తీవ్ర నిర్బంధ విధానంవల్ల జమీందారీ వ్యతిరేక ఉద్యమం తాత్కాలికంగా కొంత వెనుకంజవేసినా తరువాత కాలంలో విప్లవోద్యమం విజృంభించి 1949 లో జమీందారీలను రద్దుచేసేవరకు కొనసాగింది.

## ఆందోళనా దశనుండి పోరాట దిశగా
## రైతు సంఘ కార్యక్రమాలు

ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘ కార్యక్రమాలలో కమ్యూనిస్టులు పనిచేయడం ప్రారంభమైన తరువాత రైతు సంఘ నిర్మాణంలోనూ, కార్యక్రమాలలోనూ మౌలికమైన మార్పు వచ్చింది. 1938 నాటికి ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘం నిర్మాణం విస్తృతమైంది. విశాఖ పట్టణం జిల్లా మొదలుకొని చిత్తూరు జిల్లావరకు తాలూకా, గ్రామ సంఘాల నిర్మాణం వరకు రైతు సంఘం అభివృద్ధి చెందింది. రాయలసీమ జిల్లాలలో కూడా ఆర్థిక పోరాటాల ద్వారా రైతాంగాన్ని చైతన్య మొనర్చి సంఘటితం చేయడంలో ముందంజ వేసింది. అంతే కాకుండా 1937 ఎన్నికలలో కాంగ్రెసు వారు ప్రవేశించని ప్రాంతాలకు (మునగాల పరగణా) సహితం రైతు సంఘం విస్తరించి రైతులను సంఘటితం చేయగలిగింది.

స్థానికంగా రైతులను పట్టి పీడిస్తున్న సమస్యలతో పాటుగా, యావత్తూ రైతాంగాన్ని నిర్వీర్యులుగావిస్తున్న ఋణ సమస్య, జమీందారీ విధానం మొదలగు సమస్యలపైన రాష్ట్ర వ్యాపిత ఉద్యమాలు నిర్వహించి రైతాంగాన్ని ప్రధానంగా సామాన్య రైతాంగాన్ని సంఘటితమొనర్చ గలిగింది. అంతేగాకుండా రైతాంగ సమస్యలపై పోరాడే సమిష్టి వేదికగా రైతు సంఘాన్ని తీర్చిదిద్దడంలో కూడా కమ్యూనిస్టులు కొంతవరకు కృతకృత్యులయ్యారు. రైతాంగ సమస్యల పై ఆందోళనా కార్యక్రమాలలో అతివాద కాంగ్రెసు వాదులను, ఇతర అభ్యుదయ వాదులను సమీకరించి ఐక్య రైతు సంఘ నిర్మాణానికి కూడా కమ్యూనిస్టులు పునాది వేయగలిగారు.

కొమ్మారెడ్డి సత్యనారాయణ, పుల్లెల శ్యాంసుందరరావు, ఎన్.జి. రంగా, గౌతు లచ్చన్న, నెల్లూరి వెంకట్రామనాయుడు, రెబ్బాప్రగడ మందేశ్వర శర్మ మొదలగు వారందరితోనూ కలిసి పని చేస్తూ ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘాన్ని ఒక ఐక్య రైతాంగ పోరాట వేదికగా చేయటానికి కమ్యూనిస్టు కార్యకర్తలు, నాయకులు ప్రయత్నించారు.

'ఐక్య సంఘటనా ఎత్తుగడ'తో పని చేస్తున్న కమ్యూనిస్టు పార్టీ దృక్పథాన్ని అర్థం చేసుకోవడంలో రైతు సంఘంలో పని చేస్తున్న కార్యకర్తలకు కొన్ని ఇబ్బందులు ఏర్పడక పోలేదు. రైతు సంఘం అంటే కేవలం రైతుల ఆర్థిక హక్కులకై పోరాడే సంస్థగానే కొంతమంది భావించసాగారు. మరి కొంతమంది కాంగ్రెసు వాదుల రైతు సంఘ కార్యక్రమాలు కాంగ్రెసుకు వ్యతిరేకమని, జాతీయోద్యమాన్ని బలహీనపరిచే విధంగా ఉన్నాయనే అపోహతో ఉన్నారు.

రైతు సంఘం కార్యక్రమాలు అప్పటి వరకు (1938) ప్రధానంగా ప్రచార, ఆందోళనా కార్యక్రమాలకే ఎక్కువ పరిమితమై ఉన్నాయి. జాతీయోద్యమ ప్రభావంతోనూ, రైతు సంఘ కార్యక్రమాల ద్వారా చైతన్యవంతులైన రైతాంగం రాష్ట్ర వ్యాపితంగా ముఖ్యంగా జమీందారీ ప్రాంతాలలో ప్రాణాలకు సహితం తెగించి పోరాడేందుకు సిద్ధమై ఉంది కొన్ని ప్రాంతాలలో జమీందార్లను ఎదిరించి తమ హక్కులకై రైతులు పోరాడసాగారు.

రాష్ట్ర వ్యాపితంగా విజృంభిస్తున్న రైతాంగ పోరాటాలకి ఒక నిర్దిష్టమైన కార్యక్రమాన్ని రూపొందిస్తూ, స్వాతంత్ర్య పోరాట స్రవంతిలో రైతాంగ పోరాటాలను మిళితం చేసి జాతీయోద్యమాన్ని ఐక్య ప్రజా ఉద్యమంగా రూపొందించేందుకు కమ్యూనిస్టులు కృషి చేశారు.

1938 జూన్‌లో జరిగిన ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ ద్వితీయ మహాసభ వివిధ ప్రజా సంఘాలలో కమ్యూనిస్టులు చేస్తున్న కృషిని, లోపాలను పూర్తిగా సమీక్షించింది. వివిధ ప్రజా సంఘాలలో కమ్యూనిస్టు పార్టీ సభ్యులు చేయవలసిన కర్తవ్యాలను నిర్దేశిస్తూ ప్రత్యేకంగా తీర్మానాలు చేసింది కమ్యూనిస్టు పార్టీ అప్పటికి రహస్యంగా పనిచేస్తూ ఉండడం మూలంగా ఆ తీర్మానాలన్నింటిని బహిరంగంలో కాంగ్రెసు సోషలిస్టు పార్టీ తీర్మానాలుగా ప్రకటించింది.

నిజానికి ఇవి కేవలం తీర్మానాలే కావు. ఆయా ఉద్యమాల్లో కమ్యూనిస్టుల దృక్పథం తెలియచేసే థీసిస్‌లు. రైతాంగ ఉద్యమంలో కమ్యూనిస్టు చేయవలసిన కర్తవ్యాలను నిర్దేశిస్తూ, రైతాంగ ఉద్యమం రైతు సంఘాల లక్ష్యాలను స్పష్టంగా తెలియచేస్తూ కమ్యూనిస్టు పార్టీ ఒక సవివరమైన తీర్మానాన్ని ఆమోదించింది. 1938 జూలై 13 న నవశక్తి పత్రికలో ప్రకటించిన ఈ తీర్మానం పూర్తి పాఠాన్ని అనుబంధంగా ఇస్తున్నాం.

రైతు సంఘాలలో పనిచేస్తున్న కార్యకర్తలకు పార్టీ దృక్పథాన్ని వివరిస్తూ "రైతు సంఘాల ద్వారా, రైతులందరిని వారి కష్టములను నివారించుకొనుటకు సంఘటిత పరచి ఒక శక్తిని చేయుటకును, కేవలం ఈ శక్తిని తమ వర్గ హక్కుల కొరకు పోరాడునట్లు చేయుటేగాక దేశ స్వాతంత్ర్యము కొరకు పోరాడి తద్వారా

తమకి విముక్తి కలుగచేయుటకును రైతు సంఘాలు పాటుపడునట్లు చేయుట" కమ్యూనిస్టు విధి అని స్పష్టంగా పేర్కొంది.

రైతాంగ ఉద్యమాన్ని ప్రచారాందోళనా దశను దాటించి పోరాట దిశగా మరల్చాలని తెలియచేస్తూ "మన పరిస్థితులు రోజు రోజుకి మారుచున్నవి, దరఖాస్తులు, రాయబారములతోనే కాలము గడుపక అన్ని ప్రాంతములలోను ముఖ్యంగా జమీందారీ ప్రాంతములలో రైతులలో కల్గిన చైతన్యము వలన పోరాటమును రైతులు సాగించుచున్నారు." ఇంతవరకు ఈ పోరాటముల విషయంలో నిర్దిష్టమైన కార్యక్రమాన్ని రూపొందించక చాలా అశ్రద్ధ చేయడమైందని ఆత్మవిమర్శను చేసుకుంటూ ఇక ముందు ఈ రైతు పోరాటములను ఆర్గనైజుచేసి సర్వతోముఖముగా అభివృద్ధి చేయవలయును. రైతు పోరాటములను నడుపుటకు సంసిద్ధులమై ఉండవలెను. అవసరమైతే ప్రత్యక్ష చర్యలకు కూడా కొన్ని ప్రదేశములలో పూనుకొనవలెను అని రైతు సంఘ భవిష్యత్తు కార్యక్రమాల గురించి కార్యకర్తలకు నిర్దేశించింది. రైతు సంఘాల కార్యక్రమాలు కాంగ్రెసు కార్యక్రమాలు రెండూ వేరు వేరు విషయాలు అనే భావం రానీయకుండా పని చేయాలని, కాంగ్రెసు ప్రజా సామాన్యాన్ని రైతు సంఘ కార్యక్రమాలలోనూ, అదే విధంగా కాంగ్రెసు కార్యక్రమాలలోనూ రైతు సంఘ కార్యకర్తలు పాల్గొనేటట్లు చేసి జాతీయోద్యమానికి రైతు ఉద్యమాన్ని అనుసంధానం చేయాలని అప్పుడే బలమైన ఐక్య ప్రజా ఉద్యమం ఏర్పడగలదని ఇందు కొరకే కమ్యూనిస్టుల పని చేయాలని పేర్కొంది.

రైతు సంఘ లక్ష్యాలు, ఐక్య ప్రజా ఉద్యమ నిర్మాణం మొదలైన విషయాలతోపాటుగా, రైతాంగ సమస్యలపై పోరాట కార్యక్రమాన్ని కూడా రూపొందించింది.

1. ఎస్టేటు ల్యాండు యాక్టు సవరణ గురించి ఆందోళన.

2. అడవుల ఇబ్బందులు.

3. మైనరు ఇరిగేషన్ ప్రాజెక్టుల నిర్మాణం.

4. లంచగొండితనం నిర్మూలన.

5. జమీందారీ ప్రదేశాలలో జరుగు అన్యాయాలను దౌర్జన్యాలను ఆపుటకు ఆందోళన.

6. పరపతి సౌకర్యములను కలుగచేయుటకు ఆందోళన.

7. రైతు సమావేశములు తరచుగా ఏర్పాటుచేసి వాటిలో కాంగ్రెసు సంఘములు కూడా పాల్గొనేటట్లు చేయుట.

8. కౌలుదార్ల హక్కులను కాపాడుట.

మొదలగు సమస్యలపై రైతు సంఘ కార్యకర్తలు కేంద్రీకరించి పని చేయాలని దానితోపాటుగా నిర్మాణ బలాన్ని ఆధారంగా చేసుకుని ఆందోళనా దశలును రూపొందించుకోవాలని ఈ తీర్మానం తెలియచేసింది.

రాష్ట్ర మహాసభ చేసిన సూచనలు ఇచ్చిన కార్యక్రమం ఆధారంగా కార్యకర్తలు రైతు ఉద్యమాన్ని ముందుకు నడిపించారు. జమీందారీ ప్రాంతాలలో రైతుల ప్రత్యక్ష పోరాటాలకు నాయకత్వం వహించి జమీందార్ల దౌర్జన్యాలను దాడులను అడ్డుకున్నారు. ఇంతకు ముందెన్నడూ లేని విధంగా జమీందారీ ప్రాంతాలలో రైతు పోరాటాలు విజృంభించాయి. కాళీపట్నం, మునగాల, చల్లపల్లి, రైతుల పోరాట కేంద్రాలుగా రూపొందాయి. కమ్యూనిస్టు కార్యకర్తలు, ఇతర అభ్యుదయ రైతు నాయకుల నాయకత్వంలో రైతాంగం ఒక సంఘటిత శక్తిగా నిలిచి జమీందార్లను ఎదిరించి పోరాడసాగారు. ఆంధ్ర రైతాంగ ఉద్యమం ప్రచారాందోళనా దశనుదాటి పోరాట దిశగా పయనించింది.

## కాళీపట్నం రైతాంగ పోరాటం

కమ్యూనిస్టుల ఆధ్వర్యాన 1936-42 కాలంలో, జంమీందార్లు దురాగతాలకు వ్యతిరేకంగా జరిగిన రైతాంగ పోరాటాలలో కాళీపట్నం పోరాటం ఒకటి. అధిక శిస్తులు, అక్రమ వసూళ్లు అన్యాక్రాంతాలు నాటి జమీందార్లు సర్వ సాధారణ పీడనా లక్షణాలు. అనేక మంది జమీందార్లకన్న కాళీపట్నం జమీందారు రెండాకులు ఎక్కువ చదివాడు. అటు ప్రభుత్వాన్ని ఇటు అమాయక రైతాంగాన్ని మోసం చేసి ఎవరో ధర్మాత్ముడు దానం చేసిన భూమిని తన వశం చేసుకోవాలని చూసాడు.

పశ్చిమ గోదావరి జిల్లా నర్సాపురం తాలుకాలోని కాళీపట్నం ప్రాంతంలో 7,500 ఎకరాల భూమి వుంది. ఇందులో 3500 ఎకరాలు అడవి. మిగిలినది పర్ర. ఈ పర్రభూమిని 1777 లో కలిదిండి తిరుపతి రాజు అనే ఆయన ధర్మ సత్రం నిమిత్తం దానం చేశాడు. పర్ర భూమి కావడంవల ప్రభుత్వం పట్టించుకోక వదలి వేసింది. 1920 ప్రాంతాలలో సత్రం పోషణార్థం జమీందారు కొంత భూమిని తన పేర మార్చుకున్నాడు. అయినా సాగుకు లాయికీ కానందువల్ల వదలి వేసాడు. పర్ర భూమిలో మడులు కట్టుకుని చేపల్ని పెంచుకుంటూ 700 కుటుంబాలు తమ జీవనాన్ని వెళ్ళదీస్తూ వచ్చాయి. ఇరిగేషన్ ప్రాజెక్టు నిర్మాణం కోసం జమీందారు అనేక మార్లు ప్రయత్నించి విఫలమయ్యాడు. ఒకరిద్దరి ప్రయోజనార్థం ప్రాజెక్టు ప్రసక్తి లేదని ప్రభుత్వం తిరస్కరిస్తూ వచ్చింది. ప్రాజెక్టు నిర్మాణం జరిగితే రైతులకు జీవనభృతి కలుగుతుందని, తాను ఆ

భూమిని రైతులకే వదలివేస్తానని చెప్పి అమాయక రైతులను మభ్యపెట్టాడు. జమీదారు వాగ్దానాలను నమ్మిన రైతాంగం ప్రాజెక్టు నిర్మాణం చేపట్టవలసిందిగా ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసింది.

ప్రాజెక్టు నిర్మాణం చేపట్టవలసిందిగా కోరుతూ జమిందారు కూడ లేబర్ కమీషనర్‌కు 1928లో ఒక పిటిషన్ దాఖలు చేసారు. ప్రాజెక్టు నిర్మాణం జరిగినట్లయితే 800 ఎకరాల భూమిని రైతుల పరం చేయగలనని ఆపిటిషన్‌లో జమీందారు హామీ యిచ్చాడు. వందల మంది రైతులకు లాభం చేకూరుతుందనే ఉద్దేశ్యంతో ప్రభుత్వం ప్రాజెక్టు నిర్మాణానికి సిద్ధమయింది. 1938 నాటికి ప్రాజెక్టు నిర్మాణం జరిగి కాలువలు పూర్తి అయిన తరువాత జమీందారు ప్లేటు ఫిరాయించాడు. మొత్తం భూమిపై హక్కు తనదేనని చెపుతూ భూములను అమ్మివేసేందుకు ప్రయత్నించాడు. అనాదిగా పర్ర భూమిలో చేపలు పట్టుకుంటూ జీవిస్తున్న రైతులను భూముల నుండి వెళ్ళగొట్ట సాగాడు.

జమీందారుచేస్తున్న అన్యాయాన్ని రైతులు శాంతియుతంగానే ఎదరించటానికి ప్రయత్నించారు. జిల్లా రైతుసంఘం, నర్సాపురం తాలుకా కాంగ్రెసు సోషలిస్టుపార్టీ తాలూకా కాంగ్రెసు సంఘం రైతులకు అండగా నిలిచాయి. రైతులను సమైక్య పరచి వారి న్యాయమైన హక్కుల రక్షణకోసం ప్రచార కార్యక్రమం ప్రారంభించాయి. జిల్లారైతు సంఘాధ్యక్షుడుగా ఉన్న భూపతిరాజు లక్ష్మీనరసరాజు, సంకు అప్పారావు తాలూకా కాంగ్రెసు అధ్యక్షుడు ఉద్ధరాజు రామం, అల్లూరి సత్యనారాయణ, కలిదిండి బంగార్రాజు, ఉద్ధరాజు సూరపరాజు మొదలగు వారంతా కాళీపట్నం రైతులను సమీకరించి సమస్య పరిష్కారానికి ప్రయత్నాలు ప్రారంభించారు. అనాదిగా భూములపై బ్రతుకున్న రైతులకే భూములు చెందేటట్లు చేయమని కోరుతూ ప్రభుత్వాధికారులకు విజ్ఞప్తులు చేశారు. జిల్లా, తాలుకా పోలీసు అధికారులను సమస్యను శాంతియుతంగా పరిష్కరించమని కోరారు. ప్రభుత్వాధికారులు పోలీసులు హామీలు ఇచ్చినప్పటికీ సమస్యను మాత్రం పరిష్కరించలేదు.

ఈ పరిస్థితులలో, రాష్ట్రకాంగ్రెసు సోషలిస్టుపార్టీ కాళీపట్నం రైతాంగ ఉద్యమానికి మద్దతుగా జొన్నలగడ్డ రామలింగయ్యను ఆ ప్రాంతానికి 1938 మధ్య కాలంలో పంపింది. కాళీపట్నం రైతులకు అండగా తాలుకాలోని రైతాంగాన్ని సమీకరించి, అక్రమంగా భూములను అమ్మజూస్తున్న జమీందారును ఎదుర్కోవటానికి ఒక వాలంటీరు శిబిరాన్ని ఏర్పాటుచేసారు. 1938 ఆగష్టు నెలలో జిల్లా కాంగ్రెసు సోషలిస్టుపార్టీ, జిల్లా రైతుసంఘం, తాలుకా కాంగ్రెసు సంఘం అధ్వర్యంలో ఈ శిబిరం నెలకొల్పబడింది. కాళీపట్నంలో నెలకొల్పిన ఈ శిబిరానికి అల్లూరి సత్యనారాయణ, కలిదిండి బంగార్రాజు, ఉద్ధరాజు సూరప

రాజు, జొన్నలగడ్డ రామలింగయ్యలు ముఖ్య నిర్వాహకులుగా పనిచేసారు. వామ పక్ష భావాలుకలగిన కాంగ్రెసు వాదులు, రైతుసంఘ కార్యకర్తలు కాళిపట్నం శిబిరంలో చేరారు. శిబిరం ఆధ్వర్యంలో తాలుకాలోని అనేక గ్రామాలల్లో విస్తృత ప్రచార కార్యక్రమం చేపట్టారు. జమీందారు సాగిస్తున్న అన్యాయాల్ని ఖండిస్తూ, రైతుల న్యాయమైన హక్కులను రక్షించాలని ప్రబోధిస్తూ ప్రతి రోజూ ఒక గ్రామంలో సభలు, ఊరేగింపులు నిర్వహించారు.

కాళిపట్నం, గొల్లపాలెం, పాతపాడు గ్రామాలలో వరుసగా సభలు ఊరేగింపులు నిర్వహించారు. ఆగష్టు 12 కాళిపట్నంలో జరిగిన సభకు 2 వేల మంది రైతులు హాజరయ్యారు. ఈ సభకు హాజరైన ప్రజలంతా తరతరాల నుండి తామనుభవించుచున్న హక్కులను తమ ప్రాణంపోయినా వదలిపెట్ట మనియూ, జమీందారు తమను ఎన్ని ఇబ్బందులుపెట్టినా ధైర్యముతో చివరివరకూ నిలబడి శాంతియుతంగా పోరాటాన్ని జయప్రదంగా సాగించుటకు తాము సిద్ధముగా ఉన్నామని ప్రకటిస్తూ హక్కుల రక్షణపట్ల తమ వైఖరిని స్పష్టంగా తెలియచేశారు. (17-8-38 నవశక్తి, 22 వ పేజీ) నానాటికి రైతాంగ ఉద్యమం బలపడ సాగింది. భూములపై న్యాయమైన హక్కు రైతులదేనని అభిప్రాయాన్ని తాలూకాలోని రైతాంగమంతా బలపర్చింది.

కుట్రపన్ని, రైతుల హక్కులను కాలరాచి, ఉద్యమాన్ని అణచివేయడానికి జమీందారు కొత్త ఎత్తులు వేసాడు. రైతులు దౌర్జన్యానికి పూనుకుంటున్నారని, అక్రమంగా తన భూములను ఆక్రమించు కుంటున్నారని పక్క గ్రామస్థుల సహాయంతో దొమ్మికి దిగుతున్నారని పోలీసులకు ఫిర్యాదు చేసాడు.

జమీందార్లకు వంతపాడే ప్రభుత్వ యంత్రాంగం రైతులపై క్రూర నిర్బంధ విధానాన్ని అమలు పరిచింది. 1939 ఫిబ్రవరి 11న కాళిపట్నం గ్రామంలో 144వ సెక్షన్‌ను విధించారు. కాళీపట్నం, పాతపాడు గ్రామాలకు చెందిన గ్రామస్థులు ముఖ్యంగా 60 మంది రైతులు, కాళిపట్నం భూముల మీదకు వెళ్ళకూడదని ఆజ్ఞలు జారీ చేసారు. రైతులకు అండగా నిలిచిన ముఖ్య కార్యకర్తలపై 107వ సెక్షన్ క్రింది చర్యల తీసుకోవటానికి జిల్లా మెజిస్ట్రేటు ఆజ్ఞలు జారీ చేసారు. ఉద్దరాజ రామం, తనికెళ్ళ వెంకట చలపతి, కృత్తివెంటి వెంకటేశ్వరరావు, ఓబిలిశెట్టి మాణిక్యాలరావు, నెక్కలపు రామారావు, ప్రేరేపు మృత్యుంజయుడులపై 107 సెక్షన్ అమలుజరిపారు. జొన్నలగడ్డ రామలింగయ్య, అల్లూరి సత్యనారాయణ, కలిదిండి బంగార్రాజులు శాంతి భద్రతలకు ముప్పు వాటిల్లి చేస్తున్నారని చెప్పి మార్చి 3 న కోర్టుకు హాజరవ్వ వలసిందిగా ఆజ్ఞాపించారు. కోర్టుకువెళ్ళిన కలిదిండి బంగార్రాజును అరెస్టుచేశారు. నిర్బంధ విధానంతో

ప్రభుత్వ యంత్రాంగం రైతులను అణచివేస్తున్న ఈ సమయాన్ని అదనుగా తీసుకుని జమీందారు తన అన్యాయాల్ని యథేచ్ఛగా కొనసాగించాలని చూసాడు. భూములను అమ్మకానికి పెట్టి కొలతలు వేయించటానికి పూనుకున్నాడు.

**శాంతియుత ప్రతిఘటన :-** పోలీసులను అడ్డుపెట్టుకొని జమీందారు చేస్తున్న అన్యాయాన్ని రైతులు శాంతియుతంగానే ప్రతిఘటించారు. మార్చి 7 న జమీందారు 20 మంది రిజర్వు పోలీసులు 20 మంది సాధారణ పోలీసులు ఇద్దరు సబ్ ఇన్‌స్పెక్టర్లు, డిప్యూటీ సూపరింటెండెంటు సహాయంతో భూముల కొలతలను ప్రారంభించాడు. భూపతిరాజు లక్ష్మీ నరసరాజు, సంకు అప్పారావుల నాయకత్వంలో రైతులంతా సమైక్యంగా ఈ దారుణాన్ని ప్రతిఘటించారు. 300 మంది రైతులు కొలతలను సాగనిచ్చేది లేదంటూ భూములలో కూర్చొని శాంతి యుతంగా సత్యాగ్రహం చేసారు ఇందులో 50 మంది స్త్రీలు కూడా ఉన్నారు. శాంతియుతంగా సత్యాగ్రహం చేస్తున్న రైతులను పోలీసులు బలవంతంగా నెట్టివేసి భూపతిరాజు, లక్ష్మీనరసరాజు, సంకు అప్పారావుతో సహా 32 మందిని అరెస్టుచేసారు. అయిన రైతాంగం మాత్రం వెనుకంజ వేయలేదు. సత్యాగ్రహం చేయడానికి ముందుకొచ్చారు.

మార్చి 8వ తేదీన సత్యాగ్రహం చేస్తున్న రైతాంగంపై పోలీసులు విచక్షణారహితంగా లాఠీచార్జీ చేశారు. స్త్రీలు, ముసలివాళ్ళను కూడా రక్తం వచ్చి స్పృహతప్పేవరకు కొట్టి అరెస్టుచేశారు. లాఠీచార్జీలు, అరెస్టులు రైతులను భయపెట్టలేక పోయాయి. 9వ తేదీన ఉద్దరాజు మాణిక్యాంబ, అల్లూరి అన్నపూర్ణాదేవి నాయకత్వంలో 400 మంది రైతులు సత్యాగ్రహ పోరాటాన్ని కొనసాగించారు. అన్నపూర్ణాదేవి, మాణిక్యాంబలతో సహా 40 మందిని పోలీసులు నిర్బంధించారు. అయినా 10వ తేదీనకూడా సత్యాగ్రహం కొనసాగింది. 20 మంది స్త్రీలను అరెస్టుచేసారు.

పోలీసుల నిర్బంధ విధానం తీవ్రమైన కొలది రైతాంగం మరింతగా సంఘటితమై ముందుకు కొనసాగింది. నాయకులు, కార్యకర్తలు అరెస్టు అయినా స్త్రీలపై అమానుష దౌర్జన్యకాండ జరిగినా రైతాంగం సంఘటితంగా నిలబడి సత్యాగ్రహ పోరాటాన్ని ఉధృతం చేయడానికి సిద్ధమయ్యారు.

ఈ దశలో రాష్ట్ర కాంగ్రెసు నాయకత్వం రాజగోపాలాచారి మంత్రివర్గం సమస్యను పరిష్కరిస్తారని హామీ యిచ్చారు. త్రిపుర కాంగ్రెసు మహాసభ నుండీ సత్యాగ్రహాన్ని నిలిపివేయమని కోరుతూ కాంగ్రెసు నాయకులు టెలిగ్రాం పంపారు. రెవిన్యూమంత్రి ప్రకాశం పంతులు మార్చి 13న కాళిపట్నం వచ్చి రైతులను విచారించి వెళ్ళారు. కలెక్టరుచేత విచారణ చేయించి రైతులకు న్యాయం

చేయగలనని హామీ ఇచ్చారు. ప్రభుత్వ హామీతో రైతాంగం సత్యాగ్రహాన్ని విరమించింది. అరెస్టయిన కార్యకర్తలను విడుదలచేయాలని రైతాంగం డిమాండ్ చేసింది. కాళీపట్నం రైతులకు న్యాయం చేకూర్చాలని రాష్ట్ర రైతాంగం ముక్త కంఠంతో కోరింది.

## అఖిల భారత రైతు నాయకుల మద్దతు :

తమ హక్కుల రక్షణ కోసం కాళీపట్నం రైతాంగం సాగిస్తున్న పోరాటాన్ని అఖిల భారత రైతు నాయకులు అభినందించారు. త్రిపురీ కాంగ్రెసు మహాసభలో పాల్గొంటున్న స్వామీ సహజానంద సరస్వతీ, ఇందులాల్ యాజ్ఞిక్, యన్ జి రంగా, బంకిం ముఖర్జీ, బి.పి.యల్. బేడీ, అవధేశ్వరప్రసాద్ సిన్హాలు, కాళీపట్నం రైతుల పోరాటం న్యాయబద్ధమైనదని ప్రకటించారు. 1939 మార్చి 12 న త్రిపుర నుండి ఒక ప్రకటన చేస్తూ కాళీపట్నం రైతులకు తమ తోడ్పాటును తెలియజేశారు.

"రైతులు క్రమశిక్షణతోనూ, శాంతియుతంగానూ, ధైర్యమైన పోరాటాన్ని కొనసాగిస్తున్నందుకు మేము సంతోషిస్తున్నాము. ముఖ్యంగా రైతు స్త్రీలు తమ హక్కుల్ని కాపాడుకోవడానికి, పోలీసు దౌర్జన్యాన్ని ఎదుర్కోడానికి స్థిర నిశ్చయం చేసుకొన్నందుకు వారిని అభినందిస్తున్నాం. బాధపడే రైతులు ధైర్యంగా తమ హక్కుల్ని రక్షించుకొంటున్నందుకు వారికి అభినందనలు. ఆంధ్ర రాష్ట్రమందలి రైతులు, కాంగ్రెసు వారి సహాయార్థం ముందుకి దుముక వలసిందని కోరుతున్నాం." అని రైతు నాయకుల పోరాటానికి తమ సౌహార్ద్రతను తెలియజేశారు. కాంగ్రెసు ప్రభుత్వం సాగిస్తున్న నిర్బంధ విధానాన్ని గర్హిస్తూ, ప్రభుత్వాన్ని ఈ విధంగా హెచ్చరించారు. "కాళీపట్నం జమీందారు యొక్క, స్థానిక ప్రభుత్వోద్యోగుల యొక్క నిరంకుశ విధానాన్ని ఆపు చేయవలసినదని రైతులు మద్రాసు ప్రభుత్వానికి ఎన్ని విన్నపాలు చేసుకున్నప్పటికీ, తటస్థంగా ఊరుకొని, ఇప్పుడు జమీందారుకి ప్రోత్సాహమిచ్చి అతడు భూమిని స్వాధీన పర్చుకునే ప్రయత్నంలో ఎందుకు సహాయపడవలసి వచ్చిందని మేము ప్రశ్నిస్తున్నాం. కాంగ్రెసు ప్రభుత్వం రైతుల ఎడ నిర్వర్తించ వలసిన కర్తవ్యాన్ని మరచిపోయిందని మేము భావించాలేమో తెలియకుండా వుంది. అపవిత్రమైన ఈ నిర్బంధ విధానాన్ని ఇప్పటికైనా కట్టిపెట్టి రైతులు అనాదిగా అనుభవిస్తున్న హక్కుల్ని కాపాడవలసిందని తక్షణమే స్థానిక ప్రభుత్వోద్యోగులకు ఉత్తర్వులు జారీచేసి, అరెస్టు చేయబడినట్టిగాని, శిక్ష విధించబడినట్టి గాని, వ్యక్తుల నందరిని విడుదల చేయవలసిందని మేము మద్రాసు ప్రభుత్వాన్ని హెచ్చరిస్తున్నాం."[7]

## జిల్లా కాంగ్రెసు సంఘం మద్దతు :

శాంతియుతంగా సాగుతున్న కాశీపట్నం రైతు సత్యాగ్రహంపై పోలీసులు జరిపిన తీవ్ర దమన కాండను జిల్లా కాంగ్రెసు గర్హించింది. కాశీపట్నం రైతుల హక్కుల గురించి సవివరమైన సమాచారం స్వీకరించి రైతులకు సహాయపడేందుకు వీలుగా జిల్లా కాంగ్రెసు సంఘం ఒక విచారణ కమిటీని ఏర్పాటు చేసింది. దండు నారాయణరాజు, ముదుగంటి జగ్గన్నశాస్త్రి, టి పేర్రాజు, కె. సూర్యనారాయణలు సభ్యులుగా ఉన్న ఈ విచారణ కమిటీ కాశీపట్నం రైతుల హక్కుల గురించి, జమీందార్లు చేస్తున్న అన్యాయాల గురించి నివేదికను తయారు చేసింది. కాశీపట్నం భూముల పూర్వాపరాలు జమీందారు చేసిన వాగ్దానాలు, ఉల్లంఘనలు మొదలగు విషయాలపై పూర్తి సమాచారాన్ని అందిస్తూ దండు నారాయణరాజు, గొట్టు ముక్కల వెంకన్నలు ప్రత్యేకంగా ఒక మెమొరాండాన్ని రెవిన్యూ మంత్రికి అందజేశారు. ఈ మెమొరాండంలో భూములపై హక్కు కాశీపట్నపు రైతులదేనని స్పష్టంగా సాక్ష్యాధార పత్రాలతో ఋజువు చేశారు.[8]

## పోలీసు దమన కాండపై నిరసన వెల్లువ :

న్యాయమైన హక్కుల కోసం సత్యాగ్రహ మార్గంలో పోరాడుతున్న కాశీపట్నం రైతాంగంపై విచక్షణా రహితంగా విరుచుకుపడ్డ పోలీసుల చర్యలకు వ్యతిరేకంగా ఆంధ్ర రాష్ట్రమంతా నిరసన వెల్లువ చెలరేగింది. బెజవాడ, విజయ నగరం, మల్లిపూడి, కొండేపాడు, మట్లపాలెం, నెలమూరు, యండగండి, సాలూరు మొదలగు ప్రాంతాలలో రైతు సంఘ కార్యకర్తలు, కాంగ్రెసు వాదులు సభలు జరిపి పోలీసుల దమనకాండను ఖండించారు. పోరాడుతున్న రైతులకు తమ సానుభూతిని తెలియజేస్తూ, వారి పోరాటానికి సహాయంగా విరాళాలు సేకరించి పంపారు.

## కాశీపట్టణం రైతు దినోత్సవం :

ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘం, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీలు కాశీపట్నం పోరాటానికి మద్దతుగా ఆంధ్ర రాష్ట్ర ప్రజానీకాన్ని సమీకరించేందుకు ప్రయత్నించాయి. పోలీసు జులుంను ఖండిస్తూ, పోరాడుతున్న రైతులకు మద్దతుగా రాష్ట్రం నలుమూలల నుండి ప్రజాభిప్రాయాన్ని సేకరిచేందుకు 1939 మార్చి 25 న కాశీపట్నం రైతు దినోత్సవం జరుపవలెనని కొమ్మారెడ్డి సత్యనారాయణ, పుచ్చలపల్లి సుందరయ్యలు పిలుపునిచ్చారు.

ఆంధ్ర రాష్ట్రంలోని రైతాంగమంతా కాశీపట్టణ రైతు దినోత్సవాన్ని పెద్ద ఎత్తున నిర్వహించారు. మార్చి 25న చిత్తూరు జిల్లాలోని ద్వొడ్డమిట్ట గ్రామం

మొదలుకొని విజయనగరం వరకు అనేక గ్రామాలలో రైతులు, సోషలిస్టులు సభలు జరిపి కాశీపట్నం రైతుల పోరాటానికి తమ మద్దతును తెలియజేసారు. నెల్లూరు, చిరువూరు, వాసిలి, ఆత్మకూరు, బెజవాడ, తెనాలి, గుడివాడ, విజయనగరం, పల్లెకోన, కురుమద్దాలి, పాములపాడు, జిన్నూరు, నవుడూరు, బ్రాహ్మణగూడెం, కలవలపల్లి, నాగాయితిప్ప, కాటూరు, కొడమంచలి, పెద్దాపురం (నందిగామ తాలుకా)కారకంబాడు(చంద్రగిరి) తాలుకా మొదలగు అనేక గ్రామాల్లో సభలు జరిగాయి. ఈ సభలన్నిటిలోనూ "కాశీపట్నం రైతుల సత్యాగ్రహ పోరాటాన్ని అణచుటకు పోలీసు అధికారులు చేసిన దుండగాలను ఖండిస్తూ, వాటిని గురించి మద్రాసు ప్రభుత్వం వారు న్యాయమైన విచారణ జరిపి రైతుల హక్కులను కాపాడవలెనని ప్రభుత్వాన్ని హెచ్చరిస్తూ" రైతులు తీర్మానాలు చేసారు.

## రాష్ట్ర కాంగ్రెసు దురహంకార వైఖరి :

మితవాద రాష్ట్ర కాంగ్రెసు నాయకత్వం మాత్రం ఇందుకు భిన్న వైఖరిని చేపట్టింది. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు వర్కింగు కమిటీ "కాశీపట్నం రైతు పోరాటం చెడు సలహా పైనను, తొందరపాటుతోనూ చేయబడిందని తీర్మానించింది." కాశీపట్నం రైతు పోరాటంపై రాష్ట్ర వర్కింగ్ కమిటీ చేసిన తీర్మానంతో" ముందుగా రాష్ట్ర కాంగ్రెసు కమిటీ యొక్క అనుమతిగాని, సలహా గాని సంప్రదింపు లేకుండా ఇకముందెన్నడూ ఇట్టి అధికార రహితమైన సత్యాగ్రహాలు చేయకూడదని వార్నింగు ఇవ్వబడింది.

"ఈ సత్యాగ్రహంలో పాల్గొన్న బాధ్యత గల కాంగ్రెసు వాదులందరి నుండి సంజాయిషీ తీసుకోవలసిందిగా రాష్ట్ర కార్యదర్శికి అధికారం ఇవ్వబడింది."

రైతు ఉద్యమాల పట్లగల సహజ వ్యతిరేకతతో మితవాద రాష్ట్ర కాంగ్రెసు నాయకత్వం కాశీపట్నం పోరాటాన్ని అదనుగా తీసుకుంది ఈ పోరాటాన్ని నిర్వహించి బలపరిచిన పశ్చిమ గోదావరిజిల్లా, నర్సాపురం తాలూకా కాంగ్రెసు అతివాద నాయకులను కాంగ్రెసునుండి బయటకు నెట్టేయాలని ప్రయత్నించింది. అల్లూరి సత్యనారాయణ, ఉద్ధరాజు రామం, సంకు అప్పారావు మొదలగు వారందరికీ సంజాయిషీ నోటీసులు జారీచేసింది.

సమస్యను పరిష్కరిస్తాం, పోరాటం ఆపండి అని త్రిపుర మహాసభ నుండి ఆదేశించిన రాష్ట్ర కాంగ్రెసు నాయకులు అనుసరించిన వైఖరి ఇది. రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడుగా ఉన్న భోగరాజు పట్టాభి సీతారామయ్య కనీసం కాశీపట్నం వెళ్ళనైనా వెళ్ళలేదు. పైపెచ్చు "తాను కాశీపట్నంవస్తే రైతులకు బలం చేకూరుతుంది కాబట్టి అక్కడికి వెళ్ళలేదని పట్టాభిగారు స్పష్టంగా నర్సాపురం

తాలుకా కాంగ్రెసు కమిటీఅధ్యక్షుడు, ఉద్ధరాజు రామంతో అన్నారు. అక్కడి రైతుల పోరాటం వ్యక్తిగత ఆస్తులను నాశనం చేసే పోరాటంతప్ప మరొకటి కాదని తన అభిప్రాయమును చెప్పారు."9

తాలుకా కాంగ్రెసు నాయకులు హింసను, దౌర్జన్యాన్ని ప్రబోధిస్తూ, రైతులను ప్రేరేపిస్తున్నట్లుగా మహాత్మాగాంధీకి పట్టాభి ఫిర్యాదు చేశారు.

న్యాయమైన పోరాటం పట్ల దుష్ప్రచారంచేస్తూ, తప్పుదోవ పట్టించాలని చూస్తున్న రాష్ట్రకాంగ్రెసు వైఖరిని, ఆంధ్రరాష్ట్ర రైతుసంఘం, కాంగ్రెసు సోషలిస్టు పార్టీలు నిర్ద్వంద్వంగా ఖండించాయి. 1939 మార్చి 28న కొమ్మారెడ్డి సత్యనారాయణ, పుచ్చలపల్లి సుందరయ్యలు ప్రజా పోరాటాల పట్ల తమ వైఖరిని స్పష్టపరుస్తూ ఈ విధంగా పేర్కొన్నారు.

"రైతుల న్యాయమైన కోర్కెలను తీర్చడానికి కాంగ్రెసు కమిటీలు, కాంగ్రెసు మంత్రులు పూనుకొనునట్లు ప్రయత్నిస్తాము. కాంగ్రెసు కమిటీలు కాని, కాంగ్రెసు మంత్రులు ఈ విషయంలో కలిగించుకోని పక్షాన, రైతులు, రైతు సంఘాలుచేయు ప్రత్యక్ష పోరాటాన్ని బలపరుస్తాము. వారి న్యాయమైన కోర్కెలకై జరిగేపోరాటాలకు సహాయంచేయడం వలననే రైతులు కాంగ్రెసు సంస్థలోనికి స్వరాజ్య పోరాటంలోకి వస్తారని మావంటి కాంగ్రెసు వాదుల దృఢవిశ్వాసం. రాష్ట్రకాంగ్రెసు కమిటీని మేము సంప్రదించి తీరుతాము. సలహాలు పుచ్చుకుంటాము కాని సత్యాగ్రహం ప్రారంభించడానికి రాష్ట్రకాంగ్రెసు కమిటీ అనుమతి కావాలనే షరతును మేము అంగీకరించం."

"కాంగ్రెసు నాయకులు మమ్మల్ని డిసిప్లెనరీ చర్యలతో బెదిరించినప్పటికీ పోరాటాల్ని సాగించే రైతుల్ని కాని, కార్మికులను కాని మేము విడిచిపెట్టజాలం. విడిచిపెట్టకూడదు. ఎందువల్ల అంటే, రైతు-కార్మికుల నిత్యపోరాటాలను విడిచి పెట్టడం అంటే అర్థం కాంగ్రెసు సంస్థను బలహీనపర్చడం మాత్రమేకాక, కాంగ్రెసును భారతజాతీయ స్వాతంత్ర్య పోరాటసంస్థగా లేకుండా చేయడమని మాదృఢ విశ్వాసం. మేము కాంగ్రెసు సంస్థను, ప్రేమిస్తున్నాం కనుక, స్వరాజ్య పోరాటానికే ఎక్కువ విలువ ఇస్తాం. న్యాయం ధర్మం ఉన్నప్పుడు ప్రజా సామాన్య పోరాటాలతో సంబంధం ఉంచుకోవద్దని కొన్ని కాంగ్రెసు కమిటీలు చెప్పినా, వీనిని అనుసరింపజాలం."

"రైతు కూలీల ఆర్థిక రాజకీయ దాస్య విమోచనం కొరకు పోరాటాలను సాగించ గల శక్తి మన జాతీయ పోరాటానికి లాభకరం. కాంగ్రెసు సంస్థకు బలం అని మేము గట్టిగా నమ్ముతున్నాం"

ఇదే అభిప్రాయంతో సోషలిస్టు భావాలు కలిగిన యువకులంతా కాళీపట్నం రైతాంగ పోరాటాన్ని కొనసాగించడానికే ముందుకు వచ్చారు. కాళీపట్నం ఉదంతంలో మితవాద రాష్ట్ర కాంగ్రెసు నాయకత్వం అనుసరించిన వైఖరి ప్రజా పోరాటాలపట్ల వారికి గల వ్యతిరేకతను బట్టయలు చేసింది. ప్రకాశం పంతులు హామీ ప్రకారం నిర్వహించిన కలెక్టరు విచారణా వివరాలను బయటపెట్టాలని, రైతులకు న్యాయం చేకూర్చాలని, రైతు సంఘం కాంగ్రెసు సోషలిస్టు పార్టీ డిమాండు చేశాయి. రెండవ ప్రపంచ యుద్ధం రావడం, కాంగ్రెసు మంత్రివర్గాలు రాజీనామా చేయడంతో బ్రిటిషు సామ్రాజ్యవాద ప్రభుత్వ తీవ్రనిర్బంధ విధానం చేపట్టింది.

కాళీపట్నం రైతాంగ సమస్య ఆవిధంగా అపరిష్కృతంగా మిగిలింది.

## మునగాల పరగణాలో రైతు పోరాటం

ఆంధ్ర ప్రాంతంలోని జమీందారీలలో కెల్లా మునగాల ఎస్టేటు చాలప్రత్యేక మైంది. మునగాల పరగణా గ్రామాల చుట్టూ నిరంకుశ నైజాం సంస్థానంవుంది. జమీందారు నాయని వెంకట రంగారావు అటు బ్రిటీషు సామ్రాజ్య వాదులకి ఇటు కాంగెస్సు పెద్దలకి కూడా సన్నిహిత మిత్రుడు. జమీందారు బృందంలో అయ్య దేవర కాళేశ్వరరావు, భోగరాజు పట్టాభి సీతారామయ్య వంటి కాంగ్రెసు పెద్దలు కూడా ఉన్నారు.

ఆంధ్ర ప్రాంతంలో జమీందారులు చేసే జులుం, నైజాం సంస్థానంలో ఉండే అమానుష 'వెట్టి' విధానాన్ని కూడ జమీందారు తూచ తప్పక అమలు జరిపేవాడు. శిస్తు వసూళ్ళకు జమీందారు అవలంభించే పద్ధతులు అతి క్రూరంగా ఉండేవి. "శిస్తు ఇవ్వకపోతే రైతు వాకిట్లో, దొడ్లో రేగు కంప కొట్టేవారు. లోపలి మనిషి బయటికి పోకుండా, బయట మనిషి లోపలికి పోవడానికి వీలు లేకుండా. శిస్తు ఇవ్వని రైతు మెడకు పలుపు వేసి కపిల దూలానికి (మోట దూలానికి) కట్టి వేస్తారు. శిస్తు ఇచ్చేదాకా రైతుని ఎర్రని ఎండలో వంగబెట్టి బండల నెత్తేవారు.[10] శిస్తు వసూలుకు జమీందారు చేసే కొన్ని క్రూరమైన పద్ధతులు ఇవి. ఇక జమీందారు జులుం ప్రదర్శించి, ప్రజల చేత బలవంతంగా చేయించుకునే 'వెట్టి' పద్ధతులు మరీ దారుణంగా ఉండేవి.

నడిగూడెం (మునగాల ముఖ్య కేంద్రం) చుట్టు ప్రక్కల గ్రామాల నుండి మాన్యం దారులు వంతుల ప్రకారం నడిగూడెం వచ్చి సాయంకాలం దాకా పనిచేసి ఉత్త చేతులతో ఇంటికి పోవాలి. పచ్చగడ్డి కోసి మోపులు తీసుకువచ్చి దివాణంలో అప్పగించాలి. కూలీ అడిగితే, జుట్టు చింత చెట్టుకు కట్టి వ్రేలాడదీశారు.[11] పర

గణాలో పన్ను కట్టని వారి భూములను వేలం వేయడం, జప్తు చేసుకోవడం, ఫలవంతమైన భూములను ఆక్రమించుకోవడం, ఎదురు తిరిగిన రైతులపై దాడులు, దౌర్జన్యాలు సాగించడం, మొదలైన వెన్నో జమీందారు చేసే సర్వ సాధారణ కార్యక్రమాలు.

జమీన్ రైతుల హక్కుల రక్షణ కోసం ఏర్పడ్డ ఆంధ్ర రాష్ట్ర జమీన్ రైతు సంఘం మునగాల పరగణాలో ప్రవేశించ గలిగిందే కాని జమీందారుని వంచగలిగిన ప్రజా ఉద్యమాన్ని నిర్మించలేక పోయింది. 1930 లో ప్రకాశం పంతులు గారు ప్రారంభోత్సవంతో మొదలైన మునగాల జమీన్ రైతు సంఘంపై జమీందారు కర్కశ దమనకాండతో విరుచుకు పడ్డాడు. రైతు సంఘం అధ్యక్ష కార్యదర్శులుగా ఉన్న ఇమ్మడి పాపయ్య, గెల్లికొనయ్యల భూములను జమీందారు ఆక్రమించుకున్నాడు. సంఘంలో చేరిన రైతులను కొట్టించడం, జరిమానాలు విధించడం, వారి భూములను జప్తు చేసుకోవడం, సివిల్ క్రిమినల్ కేసులు పెట్టి గ్రామాల నుండి వెళ్ళ గొట్టించడం, గట్టిగా సంఘం తరపున నిలబడ్డ రైతులను హత్య చేయించడం, రైతులను చావచితక కొట్టి సంఘంలో చేరనని హామీ పత్రాలు వ్రాయించుకోవడం వంటి దౌర్జన్య కార్యక్రమాలతో జమీన్ రైతు సంఘాన్ని అణచి వేసేందుకు ప్రయత్నించాడు. జమీన్ రైతు సంఘం తరపున 1933 లో విచారణ చేయడానికి వచ్చిన నెల్లూరి వెంకట్రామ నాయుడికి పరగణాలో ఆశ్రయం దొరక నీయకుండా చేసి, హత్య చేయించడానికి కూడా జమీందారు ప్రయత్నించాడు. దాదాపుగా 1937 వరకు పరిస్థితి ఇదే విధంగా కొనసాగింది. మునగాల జమీందారుతో ఉన్న ప్రత్యేకమైన ఆత్మీయత వల్లనో, లేక జమీందార్లపై సహజంగానే ఉన్న అభిమానం వల్లనో కాంగ్రెసు పెద్దలు మునగాల ప్రజల ఇక్కట్లు గురించి అంతగా పట్టించుకోలేదు. 1937 రాష్ట్ర అసెంబ్లీ ఎన్నికల సందర్భంలోకూడా మునగాల పరగణాలో ప్రచారంచేసేందుకు సహితం కాంగ్రెసు పెద్దలు పూనుకోలేదు. పైపెచ్చు జమీందారుతో ఒప్పందం ఏర్పరచుకుని కాంగ్రెసు అభ్యర్థిని జమీందారు బలపరిచేటట్లు, పరగణాలో కాంగ్రెసు ప్రచారం చేయకుండా ఉండేటట్లు ఏర్పాటు చేసుకున్నారు. అంతేకాని మునగాల జమీందారు దోపిడి, దౌర్జన్యములను ఎదిరించి ప్రజా ఉద్యమాన్ని నిర్మించేందుకు మాత్రం ప్రయత్నాలు చేయలేదు.

జమీందారు దురంతాలను అంతమొందించటానికి సంఘటిత ప్రజా ఉద్యమమొక్కటే సరియైన మార్గమని కమ్యూనిస్టులు గ్రహించారు. 1937 ఎన్నికలలో అతివాద భావాలు కలిగిన కాట్రగడ్డ వెంకట నారాయణ ఎం.ఎల్.ఎ. గా ఎన్నిక

కావడం, పశ్చిమ కృష్ణా జిల్లా కాంగ్రెసు సంఘం అతివాదుల ఆధీనంలోకి రావడం, కమ్యూనిస్టుల కార్యక్రమాలకు బలం చేకూర్చాయి. ఎన్నికల అనంతరం చంద్ర రాజేశ్వర రావు, వెల్లంకి విశ్వేశ్వరరావులు మునగాల పరగణాలో రహస్యంగా పర్యటించారు. జమీందారు సాగిస్తున్న అక్రమాలగురించి స్వయంగా తెలుసుకొని అక్రమాల గురించి తెలుసుకో వలసిందిగా కాట్రగడ్డ వెంకట నారాయణను కోరారు. ఎస్టేట్ గ్రామాల్లో విస్తృతంగా పర్యటించిన కాట్రగడ్డ వెంకట నారాయణ, జమీందారు సాగిస్తున్న నిరంకుశ దోపిడీ పద్ధతులు గురించి, వెట్టి విధానంగురించి సవివరమైన సమాచారం సేకరించారు. తాడువాయి, రేపాల, మునగాల, కరివిరాల, శిరిపురం, రామాపురం, నడిగూడెం మొదలగు గ్రామాల్లో పర్యటించిన వెంకట నారాయణ జమీందారు సాగిస్తున్న అక్రమాలను ఎదిరించమని, జమీందారుకు వెట్టి చేయవలసిన పనిలేదని ప్రభోదిస్తూ వెట్టిని వ్యతిరేకించమని రైతాంగానికి పిలుపునిచ్చారు.

మునగాల జమీందారు అక్రమాలపై సవివరమైన విచారణ చేయవలసిందిగా కాంగ్రెసు సంఘాన్ని కోరారు. కాంగ్రెసులోని మితవాదులు దీనికి సుముఖ గా లేక పోయినప్పటికి పశ్చిమ కృష్ణా జిలా కాంగ్రెసు సంఘంలోని కమ్యూనిస్టులు, అతివాదుల కృషి మూలంగా మునగాల పరగణాలో జమీందారు సాగిస్తున్న నిరంకుశ దోపిడీ పద్ధతులపై విచారణ జరిపేందుకు కాంగ్రెసు సంఘం నిర్ణయించింది. ఈ నిర్ణయం మేరకు 1938 జూలై మాసంలో కాకాని వెంకట రత్నం, పేట బాపయ్య, అన్నే అంజయ్య, వెనిగళ్ళ వెంకటరత్నం, నండూరి ప్రసాదరావు, అనుమల రామగోవింద శర్మలతో కూడిన విచారణ సంఘం మునగాల పరగణాలో విస్తృతంగా పర్యటించింది. జమీందారు చేస్తున్న అక్రమ వసూళ్ళు, భూ ఆక్రమణలు, రైతులపై దౌర్జన్యాల గురించి వివిధ గ్రామాలలోని రైతుల నుండి సమగ్రమైన సమాచారం సేకరించింది. జమీందారు దురంతాల గురించి చంద్ర రాజేశ్వరరావు, వెల్లంకి విశ్వేశ్వరరావులు, కాట్రగడ్డ వెంకట నారాయణలు తెలియచేసిన విషయాలు అక్షర సత్యాలని విచారణ సంఘం నివేదిక ఋజువుచేసింది. ఈ నివేదికను జిల్లా కాంగ్రెసు కమిటీలో చర్చించి ఆమోదించటానికి సహితం జమీందారు మిత్రులైన కాంగ్రెసు మితవాదులు అడ్డుపడ్డారు. కొణకంచిలో జరిగిన జిల్లా కమిటీ సమావేశంలో "అయ్యదేవర కాళేశ్వరరావు, మసునిళ్ళచిట్టి, జొన్నవిత్తుల కుటుంబరావు వగైరాలు రిపోర్టును వ్యతిరేకించారు. రిపోర్టు కాపీని అందరికీ అందచేయకుండా ఒక పర్యాయం చదివినంత మాత్రాన చర్చించడానికి వీలులేదన్న కారణం చూపి నివేదికను తోసివేయడానికి ప్రయత్నించారు"[12]

కాని కాంగ్రెసు కమిటీలో ఉన్న అతివాద యువకులు నివేదిక ఆమోదం పొందేందుకు గట్టిగా నిలబడ్డారు. నివేదిక ఆమోదించిన తరువాత దానిని అచ్చువేసి జిల్లా అంతటా పంచిపెట్టి మునగాల జమీందారు సాగిస్తున్న దౌర్జన్యాల గురించి విస్తృతంగా ప్రచారం చేసారు.

## జిల్లా కాంగ్రెసు విచారణ సంఘం నివేదికలోని కొన్ని ముఖ్యాంశాలు :

1932 తరువాత జమీందారు దౌర్జన్యాలు మితిమీరిపోయాయి. ఎస్టేటులో జమీందారు సర్వాధికారి. సివిల్ క్రిమినల్ పవర్సు ఆయన చేతిలో ఉండేవి. పోలీసు సబ్ ఇన్స్పెక్టరు కన్నా జమీందారు కొత్వాలు ఎక్కువ అధికారం చెలాయించేవారు. ఎస్టేట్ దివాణంలోకి రమ్మని ఎవరికైనా కబురు వచ్చిందంటే అతడికి జరిమానా పడటమో, లేదా అతడి వీపు పగలడమో జరిగేది. రైతుల జిరాయితీ భూముల్లోని చెట్టుకొట్టినా, కొమ్మ నరికినా జమీందారుకు జరిమానా చెల్లించాల్సిందే. అన్ని కులాలవారు అన్ని వృత్తులవారు జమీందారుకు వెట్టిచాకిరీ చేయాల్సిందే. ఎదిరించినవాళ్ళని కొట్టడం, హింసించడం, జరిమానాలు వసూలు చేయడం, దొంగ ప్రోనోట్లు రాయించుకోవడం వంటివి సాగించాడు. అనేకమంది ఆస్తులను జమీందారు దౌర్జన్యంగా లాక్కున్నాడు. భూమి శిస్తులు మెరక ఎకరం 1కి రూ. 1-25 నుండి రూ. 3-8-0కి పెంచాడు. పల్లం శిస్తు ఎకరం 1కి మొదటి పంటకు 10 రూపాయలు రెండవ పంటకు 5 రూపాయలు. స్వంతబావుల క్రింది రైతుల సేద్యం చేసుకున్నా ఎకరం 1కి రూ. 10లు శిస్తు చెల్లించాల్సిందే.

శాసనసభ్యులు కాట్రగడ్డ వెంకటనారాయణరావు, కరివిరాల చెన్నకేశవ స్వామి గుడికి వెళ్ళగా అక్కడి అర్చకుడు గుంటూరు లక్ష్మణాచార్యులు ఆయనకు తీర్థప్రసాదాలు ఇచ్చారు. ఈ విషయం తెలిసి జమీందారు అర్చకుని జీతం ఆ నెల నుంచి ఆపుచేశారు [13]

## రైతుసంఘ పునర్నిర్మాణం - కమ్యూనిస్టుల కృషి

ఒకవైపు జమీందారీ దురంతాలకు పెద్దఎత్తున వ్యతిరేక ప్రచారం కావిస్తూనే మరోవైపు సంఘ నిర్మాణానికి కూడా ప్రయత్నాలు ప్రారంభించారు. రైతులలో ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించి వారిని సంఘటితపరిచేందుకు వీలుగా అఖిల భారత రైతునాయకులు, రాష్ట్ర జిల్లా రైతునాయకులు మునగాల పరగణాలో విస్తృతంగా పర్యటించారు.

1938 జూలైలో ఇందులాల్ యాజ్ఞిక్, యన్.జి. రంగాలు మునగాల పరగణాలోని నడిగూడెం వంటి అనేక గ్రామాలలో బహిరంగ సభలు పెట్టి రైతు

లను ఉత్సాహపరిచారు చలసాని వాసుదేవరావు, కామినేని వెంకటప్పయ్య, జోస్యభట్ల సత్యనారాయణ వంటి రాష్ట్ర జిల్లా రైతు నాయకులు జమీందారీ దౌర్జన్యాలను ఖండిస్తూ అనేక గ్రామాలలో మీటింగులు పెట్టి రైతులను ఉత్తేజపరిచారు.

రైతు నాయకులు, సోషలిస్టు యువకులు ఇచ్చిన ప్రోత్సాహం రైతులలో ధైర్య సాహసాలను రేకెత్తించాయి. జమీందారు క్రూర దమనకాండతో అణచి వేసిన జమీన్ రైతు సంఘాన్ని పునరుద్ధరించుకోవడానికి రైతులు ముందుకు వచ్చారు. ప్రజలందరిని సంఘటిత పరిచి నిర్మాణయుతమైన ఉద్యమం ద్వారానే జమీందారుని ఎదిరించాలని కమ్యూనిస్టు పార్టీ నిర్ణయించింది. నండూరి ప్రసాద రావు, వేములపల్లి హనుమంతరావు, మోటూరి పరంధామయ్యలను మునగాల పరగణాలో ప్రజా ఉద్యమ నిర్మాణానికి పంపింది.

వీరు గ్రామాలన్నిటా పర్యటిస్తూ, కాంగ్రెసు సభ్యత్వాన్ని చేర్పిస్తూ, జమీందారీ వ్యతిరేక ఉద్యమాన్ని నిర్మించారు. స్థానిక రైతు కార్యకర్తలు నల్లపాటి వెంకట్రామ నర్సయ్య, ఉప్పలపాటి కోదండరామయ్య మొదలగు వారి నాయకత్వంలో మునగాల జమీన్ రైతు సంఘం పునర్నిర్మించబడింది. 4 వేల మంది రైతులు సంఘ సభ్యులుగా చేరారు. 'మాకొద్దీ జమీందార్ల పొందు' అనే పాట మునగాల పరగణాలో మార్మోగింది. గ్రామ గ్రామాన రైతు సంఘాలు ఏర్పడ్డాయి. రైతు సంఘ కార్యకర్తలు దళాలుగా ఏర్పడి జమీందారీ వ్యతిరేక ప్రచారం చేయడం ప్రారంభించారు. కమ్యూనిస్టు యువకుల ప్రేరణతో జమీన్ రైతు సంఘ కార్యకర్తలు చేస్తున్న ఈ ప్రచార ఉద్యమం మూలంగా ప్రజలలో చైతన్యం వెల్లువలా పొంగింది. రైతులు, వ్యవసాయ కూలీలు, చిన్న వ్యాపారస్థులు జమీందారీ వ్యతిరేక పోరాటానికి సంసిద్ధులయ్యారు. జిల్లా కాంగ్రెసు విచారణ సంఘం నివేదిక ఆధారంగా కాంగ్రెసు ప్రభుత్వం తగిన చర్యలు చేపట్టాలనే కోరిక నానాటికి పెచ్చు పెరిగింది.

ప్రజలలో ఉప్పొంగుతున్న చైతన్యం మొట్టమొదటిసారిగా 1938 డిసెంబరులో జరిగిన కలుకోవ వ్యవసాయ కూలీల సమ్మెతో బహిరంగంగా ప్రదర్శితమైంది. భయపెట్టి సమ్మెను విచ్ఛిన్నం చేయాలని జమీందారు చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. న్యాయమైన కూలీ కోసం కలువకోవ కూలీలు సాగిస్తున్న పోరాటాన్ని రైతు సంఘం, ప్రజలు అంతా బలపరిచారు. కూలీలు విజయం సాధించారు. సబ్ కలెక్టరు స్వయంగా వచ్చి జమీందారు పొలం నుండి సరియైన కూలీ ఇప్పించాడు.

## బ్రహ్మయ్య అవార్డు :

కలుకోవ సమ్మె విజయం రాష్ట్ర కాంగ్రెసు నాయకులకు కనువిప్పు కలిగించింది. జమీందారుకు ప్రజలలో ఉన్న వ్యతిరేకత పెంపొంది పోరాట రూపం దాల్చుతోందని గ్రహించిన కాంగ్రెసు ప్రభుత్వం రైతులకు జమీందార్లు రాజీ కుదిర్చేందుకు ప్రయత్నించారు. రాష్ట్ర కాంగ్రెసు సంఘం ప్రధాన కార్యదర్శిగా ఉన్న గొట్టిపాటి బ్రహ్మయ్యగారి మధ్యవర్తిత్వంలో జమీందారుకు, రైతులకు మధ్యనున్న అనేక సమస్యలపై పరిష్కారం కుదర్చడానికి ప్రయత్నాలు జరిగాయి.

రైతులకు జమీందార్లకు మధ్య జరిగిన రాజీ ఒప్పందమే గొట్టిపాటి బ్రహ్మయ్య అవార్డు. 1939 జనవరి 10న జరిగిన ఈ ఒప్పందం రైతు సంఘానికి ఒక పెద్ద విజయమే. రైతుల కోరికలు అనేకం అంగీకరించబడ్డాయి. ''జమీందారు దౌర్జన్యంగా లాక్కున్న భూములు, వ్రాయించుకున్న బినామీ ప్రోనోట్లు ఇచ్చి వేస్తానని అంగీకరించాడు. చెట్లపై రైతుల హక్కులను గుర్తించాడు. భూములను సర్వే చేయించడానికి, పట్టాలను సరిగా మార్చడానికి, వెట్టిచాకిరిని మానుకొని, నౌకర్లను పెట్టుకుంటానికి, అక్రమాలను వదిలివేయడానికి, అక్రమ శిస్తులు వసూలు చేయకుండా ఉండటానికి, ఈనాములన్నిటికీ పట్టాలివ్వడానికి జమీందారు అంగీకరించాడు. రైతులు శిస్తులు చెల్లించుటకు సాంఘిక బహిష్కరణను ఉపసంహరించుటకూ, అంగీకరించారు. (ఆంధ్రలో రైతు ఉద్యమం, నండూరి ప్రసాదరావు)

సంఘబలంతో రైతులు సాధించిన మొదటి విజయం బ్రహ్మయ్య అవార్డు. అయితే రైతులు మాత్రమే ఒప్పందాన్ని అమలు పరచేందుకు ప్రయత్నించారు. జమీందారు మాత్రం ఒప్పందాన్ని ఎలా భగ్నం చేయాలా అనే ప్రయత్నాలలోనే ఉన్నాడు. ఏదోవిధంగా రైతు సంఘ నిర్మాణాన్ని విచ్ఛిన్నం చేసి ఒప్పందానికి ఎగనామం పెట్టాలని జమీందారు ప్రయత్నించాడు. రైతులకు అండగా నిలిచి వారిని సంఘటిత మొనర్చిన వేములపల్లి హనుమంతరావు, మోటూరి పరంధామయ్యలను పరగణా నుండి పంపించి వేయాలని పట్టుబట్టాడు. అడుగడుగునా కుంటిసాకులు చూపెడుతూ ఒప్పందం అమలు కాకుండా అడ్డుపడ్డాడు. రైతులు శిస్తులు పూర్తిగా చెల్లిస్తే కాని ఒప్పందం అమలు జరిపేది లేదని పట్టుబట్టారు. శిస్తు రూపాయికి 0-4-0 రెమిషన్ ఇస్తానని చెప్పి చివరికి 0-2-0 మాత్రమే రెమిషన్ ఇస్తానన్నాడు

## ఒప్పందం అమలుకోసం రైతుల పోరాటం :

జమీందారు మొండిధోరణి రైతులను పోరాట దిశకు మరల్చింది. గ్రామ గ్రామాన రైతులు సభలు పెట్టి జమీందారు ఒప్పందపు షరతులను అమలు పరచాలని ఆందోళన చేయసాగారు. ఒప్పందం అమలు జరగడానికి గొట్టిపాటి బ్రహ్మయ్య, ఎర్నేని సుబ్రహ్మణ్యం, చేసిన ప్రయత్నాలను జమీందారు తిప్పి కొట్టాడు ఫిబ్రవరి మార్చి మాసాలలో కాట్రగడ్డ వెంకట నారాయణ, జామినేని వెంకటప్పయ్య, పుల్లెల శ్యాంసుందర్రావు, పేట బాపయ్య, సుంకర సూర్య నారాయణ, పామిరెడ్డి సుబ్బారావురెడ్డి మొదలగు రాష్ట్ర జిల్లా నాయకులు మునగాల పరగణాలోని గ్రామాలలో పర్యటించారు రైతులు సమైక్యమే నిలిచినచో మీ జమీందారు లొంగి వస్తాడని, హక్కుల కోసం మునగాల రైతులు జరిపే ప్రతి ఘటనకు తమ అండదండలుంటాయని వారు రైతులను ఉత్తేజపరిచారు.

## రైతు దళాల ప్రచారం :

బ్రహ్మయ్య అవార్డును అమలు పరచాలని రైతు సంఘ కార్యకర్తలు విస్తృత ప్రచార కార్యక్రమం చేపట్టారు. షరతులను ఉల్లంఘిస్తున్న జమీందారును బట్టబయలు చేస్తూ, అవార్డును యధాతథంగా అమలు పెట్టాలని కోరూతూ రైతు దళాలు ప్రచారం చేయడం ప్రారంభించాయి. వెల్లంకి విశ్వేశ్వరరావు, ఉప్పల రామయ్య, జీడిమెట్ల సీతారాంరెడ్డి, కందుల రామం, సుంకర మెగ్గయ్యల దళం 1939 ఏప్రిల్ 5 నుండి ప్రచారం ప్రారంభించింది ఈ దళ ఆధ్వర్యంలో మునగాల, తాడువాయి. గణపవరం, తిమ్మారెడ్డి పాలెం, కొక్కిరేణి, ముకుందా పురం, ఆకుపాముల, చాకిరాల మొదలగు గ్రామాలలో ప్రచారం జరిగింది.

మరోవైపున నంబూరి ప్రసాదరావు, చిట్టాల గోపిరెడ్డి, గట్టు గోపాల కృష్ణయ్య, కొల్లు రామకోటయ్యలతో కూడిన రెండవ దళం కూడా ప్రచార కార్యక్రమాలలో పాల్గొంది. నడిగూడెం, నక్కలకోన. రామ సముద్రం, మాధవరం, సీతారాంపురం, రేపాల జగన్నాథపురం, నరసింహులగూడెం, రామచంద్రాపురం, కరివిరేల, సిరిపురం, కేశవాపురం మొదలగు గ్రామాలలో నంబూరి ప్రసాదరావు దళం ప్రచారం చేసింది.

ఈ దళ ప్రచార ఫలితంగా మారుమూల గ్రామాలలోని రైతాంగం సహితం జమీందారు చేస్తున్న కుట్రను స్పష్టంగా గ్రహించారు. బ్రహ్మయ్య అవార్డు అమలు జరగాలనే నినాదం మునగాల పరగణాలో మార్మోగింది రైతాంగం తమ హక్కుల రక్షణకై సమాయత్తమైంది.

## పోరాటోన్ముఖమైన రైతాంగం :

షరతులను ఉల్లంఘించిన జమీందారులను, ఐక్య ప్రజా బలంతో ఎదిరించ టానికి, రైతు పోరాట కార్యక్రమాన్ని నిర్ణయించడానికి మునగాల జమీన్ రైతు

సంఘం సమావేశం జరిగింది. రైతాంగాన్ని ఉత్తేజ పరచి పోరాటోన్ముఖులను చేయడానికి రాష్ట్ర, జిల్లా రైతు నాయకులంతా ఈ సమావేశానికి హాజరయ్యారు. 1939 ఏప్రియల్ 23 న మునగాలలో జరిగిన ఈ సమావేశానికి 3,000 మంది రైతులు హాజరై పోరాటానికి తమ సంసిద్ధతను వ్యక్తం చేసారు. ఈ సమావేశానికి హాజరైన పుల్లెల శ్యాంసుందర్రావు పోరాటానికి రైతులను ఉత్తేజపరుస్తూ "జమీందారు రాజీ షరతులను ఉల్లంఘించినచో రైతులు తమ సంఘ ఆశయముల ప్రకారం నడచుటకు సిద్ధముగా ఉండవలెననియు, రైతులు జరుపు న్యాయబద్ధమైన పోరాటమునకు తాము ఎప్పుడూ సహాయముగా నుందుమని'' పేర్కొన్నారు.14

జమీందారు సాగిస్తున్న అన్యాయాలను ఎదిరించి తమ హక్కులను కాపాడుకోవటానికి పోరాటం మినహా మరో మార్గం లేదని రైతాంగం నిశ్చయించింది. రాజీ భగ్నమైనందువల్ల రైతులకు పోరాటం తప్పని సరి అయిందని మునగాల జమీన్ రైతు సంఘం పేర్కొంది. ఏప్రియల్ 30 న జరిగిన రైతు సంఘ కార్య నిర్వాహక వర్గ సమావేశంలో రైతాంగ పోరాటానికి పిలుపు యివ్వబడింది. రైతులపై బనాయించిన అక్రమ కేసులను వెంటనే రద్దు చేయాలని, పంటల నష్టానికి రెమిషన్ కావాలని మొదలగు 30 కోర్కెలను జమీందారు అంగీకరించని పక్షంలో రైతులు శాంతియుతంగా సత్యాగ్రహ పోరాటం చేయుదురని రైతుసంఘం అల్టిమేటం ఇచ్చింది. రైతు పోరాటాన్ని నిర్వహించడానికి నండూరి ప్రసాదరావు అధ్యక్షతన సత్యాగ్రహ కమిటీ ఏర్పాటైంది.

రేపాల, నడగూడెం, మునగాల గ్రామాలలోని రైతు శిబిరాలు ఏర్పాటు చేశారు. నండూరి ప్రసాదరావు, జోస్యభట్ల సత్యనారాయణ, మోటూరి పరంధామయ్యలు ఈ శిబిరాలలో రైతాంగానికి క్రమశిక్షణా యుతమైన పోరాటంలో శిక్షణ ఇచ్చారు. పరగణాలోని 1100 మంది ఈ శిబిరాలలో శిక్షణ పొందారు. రైతులతోపాటు సామాన్య ప్రజానీకమంతా సత్యాగ్రహ పోరాటానికి సంసిద్ధమైంది. చాకలి, మంగలి, చర్మ వృత్తులు చేసుకునేవారు మొదలుకొని కోమట్లు, కరణాల వరకు జమీందారుని ఎదిరించటానికి ముందుకు వచ్చారు.

## సత్యాగ్రహ సమరం :

రైతు సంఘం ఇచ్చిన నెలరోజుల గడువులో రైతుల కోర్కెలు తీర్చడానికి జమీందారు సుముఖత వ్యక్తపరచలేదు. ఈ పరిస్థితులలో 1939 జూన్ 2 నుండి సత్యాగ్రహ పోరాటాన్ని రైతుసంఘం చేపట్టింది. అక్రమంగా జమీందారు దఖలు పరుచుకున్న ఇమ్మడి పాపయ్య భూమిలోనే రైతు సత్యాగ్రహం ప్రారంభమైంది. (రైతులను సమైక్యపరచటానికి పూనుకున్న ఇమ్మడి పాపయ్య భూమిని 1930లో జమీందారు ఆక్రమించుకున్నాడు)

భూమిపై హక్కు రైతులదేనని తెలియచేస్తూ నాగళ్లతో రైతులు భూమిని దున్నటం ప్రారంభించారు. పోలీసుల అండతో సత్యాగ్రహ సమరాన్ని అణచి వేయాలని జమీందారు ప్రయత్నించాడు. సత్యాగ్రహానికి వచ్చినవారిని వచ్చి నట్లు అరెస్టు చేయడం ప్రారంభించారు. మొదటి 4 రోజులలోనే 113 మందిని అరెస్టుచేశారు.

ప్రజలను భయ భ్రాంతులను చేసి భీభత్సం సృష్టించేందుకు క్రూర దమన కాండను ప్రయోగించారు సత్యాగ్రహం చేయటానికి వచ్చిన రైతులపై విచక్షణా రహితంగా లాఠీచార్జిచేసి చావ చితకకొట్టారు. రైతులతో పాటు నాగళ్లను ఎద్దులను కూడా అరెస్టు చేశారు.

అమానుషమైన రీతిలో పోలీసులు రైతాంగాన్ని హింసిస్తున్నా రైతాంగం వెనుకంజ వేయలేదు. అరెస్టులు సాగుతున్న, పోలీసులు చావబాదుతున్నా రైతాంగం సత్యాగ్రహ పోరాటాన్ని కొనసాగించింది. రైతాంగాన్ని ఉత్తేజపరిచి పోరాటోన్ముఖులను చేసిన నండూరి ప్రసాదరావు, జోస్యభట్ల సత్యనారాయణ, వేములపల్లి హనుమంతరావు, మోటూరి పరంధామయ్య మొదలగు ముఖ్య కార్యకర్తలందరిని నిర్బంధించారు. నాయకులు లేకపోయినా రైతాంగం సత్యాగ్రహ సమరాన్ని కొనసాగించింది.

## మునగాల పోరాటానికి అండగా ఆంధ్ర రైతాంగం :

న్యాయమైన హక్కుల కోసం మునగాల రైతులు సాగిస్తున్న శాంతియుత పోరాటాన్ని ఆంధ్ర రాష్ట్ర రైతాంగం బలపరిచింది. మునగాల రైతాంగంపై జరుగుతున్న అమానుష దమనకాండకు తమ వ్యతిరేకతను తెలియ చేశారు.

మునగాల పోరాటం రైతులపోరాటం మాత్రమే కాదని; పరగణాలోని ప్రజలంతా జమీందారీ దౌర్జన్యాలకు వ్యతిరేకంగా జరుపుతున్న పోరాటమని ఆంధ్ర రాష్ట్రంలోని అభ్యుదయ వాదులంతా గ్రహించారు. మునగాల రైతులపై సాగుతున్న దౌర్జన్యాన్ని ఖండించి వారి పోరాటాన్ని బలపరచ వలసిందిగా ఆంధ్రరాష్ట్ర రైతుసంఘ అధ్యక్షులుగా ఉన్న కొమ్మారెడ్డి సత్యనారాయణ పిలుపునిచ్చారు.

జమీందారీ దౌర్జన్యాలకు వ్యతిరేకంగా మునగాల రైతాంగం జరుపుతున్న పోరాటం, ఆంధ్ర జమీందారీ రైతులకు మార్గదీపకమని, అటువంటి పోరాటాన్ని బలపరచి విజయవంతం చేయవల్సిన బాధ్యత ఆంధ్ర రైతాంగంపై ఉందని కొమ్మారెడ్డి సత్యనారాయణ తెలియజేశారు. పోరాటరైతులకు అండగా తమ సౌహార్ద్రతను తెలియచేస్తూ పోలీసు దౌర్జన్యాలను ఖండిస్తూ జూన్ 11 న "మునగాల దినం" జరపమని ఆంధ్ర రైతాంగానికి పిలుపునిచ్చారు.

ఆంధ్రరాష్ట్రంలోని రైతుసంఘ కార్యకర్తలు, కాంగ్రెసు సోషలిస్టులు ఇతర అభ్యుదయవాదులు మునగాల రైతుదినాన్ని రాష్ట్రమంతటా జరిపారు. రాజోలు,పిఠాపురం, కొండపల్లి, అంగలూరు, కొత్తపల్లి, కొరుప్రోలు, శ్రీకాకుళం, కాటూరు, కురుమద్దాలి, గరికపర్రు, కాశీపట్నం, పాతపాడు, కొణకంచి, ఒంగోలు చల్లపల్లి మొదలగు అనేక వందల గ్రామాలలో సభల జరిపి మునగాల పోరాటాన్ని ప్రజలు బలపరిచారు.

## దిగివచ్చిన ప్రభుత్వం :

నిర్బంధ విధానంతో మునగాల రైతులను జమీందారు అణచలేక పోయాడు. జూన్ 2న ప్రారంభమైన సత్యాగ్రహం నిరంతరంగా కొనసాగుతూనే ఉంది. 300 మందిని అరెస్టు చేసినా సత్యాగ్రహం చేయటానికి రైతులు ముందుకు వస్తూనేవున్నారు. మునగాల రైతులపై సాగుతున్న దౌర్జన్యానికి ఆంధ్రరాష్ట్రం అంతటా నిరశన పెద్దఎత్తున వ్యక్తమయింది. అఖిలభారత రైతుసంఘ కార్యదర్శి స్వామీ సహజానంద సరస్వతి పోరాటం సాగిస్తున్న రైతులను అభినందిస్తూ పోలీసు దమనకాండను నిరసించారు. కాంగ్రెసు ఎం.ఎల్.ఏ. లుగా ఉన్న కాట్రగడ్డ నారాయణరావు, పుల్లెల శ్యాంసుందరరావులు ప్రభుత్వం వెంటనే పరిష్కరించాలని ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చారు. కాంగ్రెసులో ఉన్న అభ్యుదయ వాదులు రైతుపోరాటాన్ని బలపర్చారు. ప్రజాందోళన తీవ్రస్థాయికి చేరుకుంది.

ఈ దశలో రెవిన్యూ మంత్రిగా ఉన్న ప్రకాశం పంతులు జూన్ 17న మునగాల సందర్శించారు. రైతు సమస్య పరిష్కరించటానికి ప్రభుత్వం పూనుకుంటుందని సత్యాగ్రహం విరమించి శాంతియుతంగా ఉండవలసిందగా రైతులకు విజ్ఞప్తి చేశారు.

ప్రభుత్వ హామీ పై ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘం, కృష్ణా జిల్లా రైతు సంఘం సత్యాగ్రహ పోరాటం తాత్కాలికంగా విరమిస్తున్నట్లు ప్రకటించాయి.

మునగాల రైతులు జూన్ 18న సత్యాగ్రహ సమరాన్ని విరమించారు. అరెస్టు కాబడిన రైతులను వెంటనే విడుదల చేయాలని, బ్రహ్మయ్య అవార్డును అమలుపరిచి, రైతాంగ కోర్కెలను తీర్చాలని రైతు సంఘం డిమాండ్ చేసింది లేదా సత్యాగ్రహసమరాన్ని తిరిగి ప్రారంభించ గలమని ప్రభుత్వాన్ని హెచ్చరించిది.

రైతాంగ పోరాటనికి నాయకత్వం వహించిన ముఖ్య నాయకులను మినహా యించి మిగిలిన వారందరిని ప్రభుత్వం విడుదల చేసింది. నండూరి ప్రసాదరావు, వేములపల్లి హనుమంతరావు, మోటూరి పరంధామయ్య, జోస్యభట్ల సత్య

నారాయణంను మాత్రం విడుదల చేయలేదు. 1942 వరకు వీరు నిర్బంధింపబడే ఉన్నారు.

రైతాంగ సమస్యలను పరిష్కరిస్తానని హామీ ఇచ్చిన ప్రభుత్వం మంద కొడిగా కూర్చుంది. సత్యాగ్రహం చేసిన ఇమ్మడి పాపయ్య పొలాన్ని ఆ రైతుకే వదలివేశారు.

1939 సెప్టెంబరులో రెండవ ప్రపంచయుద్ధం రావడంతో కాంగ్రెసు మంత్రివర్గం రాజీనామా చేసింది. బ్రిటిషు సామ్రాజ్యవాద ప్రభుత్వం కమ్యూనిస్టులపై, రైతు సంఘ కార్యకర్తలపైన విరుచుకు పడింది. బహిరంగంగా జమీందారుపై పోరాటం నిర్వహించేందుకు రైతులకు వీలు లేక పోయింది.

## చల్లపల్లి జమీందారీ వ్యతిరేక రైతు ఉద్యమం

కమ్యూనిస్టుల నేతృత్వంలో సాగిన జమీందారీ వ్యతిరేక పోరాటాల్లో చల్లపల్లి జమీందారీలో సాగిన ఉద్యమం ప్రధానమైంది. నీచమైన పద్ధతులతో రైతుల భూములను ఆక్రమించడంలోనూ క్రూరమైన పద్ధతులతో రైతులను దోపిడి చేయడంలోను చల్లపల్లి జమీందారు బహు ప్రసిద్ధి చెందినవాడు. గ్రామాల్లోని సాముదాయక భూములు, ధర్మవనాలు మొదలుకుని స్మశాన వాటికలవరకు అన్ని భూములను ఆక్రమించుకున్నాడు. పన్నులు కట్టలేని రైతుల భూములు జమీందారు పరమే అయ్యేవి. వరదలు, ఉప్పెనలులో చనిపోయిన వారి భూములు, వారసులు లేకుండా చనిపోయిన వారి భూములు జమీందారు పేరున మారి పోయేవి. కుటిల ఉపాయాలతో రెవిన్యూ అధికారులను ప్రలోభపెట్టి గో భూములను, స్వంత కమతంలో కలుపుకోవడంలో చల్లపల్లి జమీందారుది అందె వేసిన చేయి.

అధిక పన్నులు, అక్రమ శిస్తులు వసూలు చేయడంలో చల్లపల్లి జమీందారు బహు దిట్ట. కరణాలకు చెల్లించాల్సిన జీతభత్యాలను కూడా రైతుల నుండీ వసూలు చేసేవాడు. 'కంణం శరగ' పేరుతో ప్రతి 17 ఎకరాలకు 2 రూపాయల పన్ను వసూలు చేసేవాడు. ఇదిగాక అమ్మవారి రుసుం పేరుతో (2 రూ.లు) బాజాఖర్చు పేరున (2 రూ.లు) ఆటగాళ్ళకి, జమీందారీ ఉద్యోగులకి అయ్యే ఖర్చును కూడా రైతులనుండి వసూలు చేసేవాడు. ఇదికాక తాళ్ళశిస్తు తాటి, ఈత చెట్లపై పన్నును కూడా రైతులనుండి వసూలు చేసేవాడు. మొత్తం చల్లపల్లి జమీందారీపై బ్రిటిషు ప్రభుత్వం విధించిన పేష్కస్ 78,076 రూపాయలే. కాని రైతులనుండి భూమిశిస్తు పేరుతో వసూలు చేసే మొత్తం 3,51,230 రూపాయలు. దీనినిబట్టి జమీందారు వసూలు చేసే అధిక శిస్తు ఏంతో మనకు అర్థమవుతుంది. ఈ అధిక పన్నుల భారం భరించలేక అనేక వేలమంది రైతులు తమ స్వంత

భూములను రాజావారి పరంచేసి అదే భూములలో కౌలుదార్లుగా మారిపోయారు. చివరకు ఆ కౌలును కూడా చెల్లించలేక వ్యవసాయ కూలీలుగా మారిపోయినవారు అనేక వందల మంది ఉన్నారు. జమీందారు సాగించే అన్యాయాలను సహించలేక రైతులు అక్కడక్కడా అప్పుడప్పుడు ప్రతిఘటించే వారు.

1908 లో ఎస్టేట్ ల్యాండ్ యాక్టు ప్రవేశపెట్టిన తరుణంలో వక్కలగడ్డ చిన్నాపురం, ఘంటసాల, భోగిరెడ్డి పల్లి మొదలగు గ్రామాలలోని రైతులు జమీందార్ని ప్రతిఘటించారు. రైతాంగం సాగించిన ఈ ప్రతిఘటనలలో కొన్నింటిలో తాత్కాలికంగా విజయం సాధించినా, రైతులలో చీలికలు తెచ్చి, కోర్టుల కీడ్చి రైతులను యమయాతనలు పెట్టి ఉద్యమాన్ని దౌర్జన్యంగా అణచి వేసేవారు.

రైతులను సమైక్యపరిచి సంఘటిత పోరాటం నిర్వహించేందుకు సరిఅయిన నాయకత్వం కాని, రైతు సంఘం కాని ఏర్పడకపోవటంవల్ల జమీందారు కుట్రలు సాగుతూ వచ్చాయి. 1930 లో జరిగిన రీసెటిల్‌మెంటు ఆందోళన, జాతియ స్వాతంత్ర్య పోరాట ప్రభావం చల్లపలి, రైతాంగంలో చైతన్యాన్ని కల్గించింది. 1931 లో దివి తాలూకాలో జమీన్ రైతు సంఘం ఏర్పడింది క్రమంగా రైతాంగం సమైక్య మవసాగింది. గొర్రెపాటి వెంకట సుబ్బయ్య, కొల్లి శేషయ్య, కావూరి కోదండ రామయ్య, కొర్రపాటి రాజేశ్వరరావు మొదలగువారు రైతు సంఘం బలపడటానికి కృషి సల్పారు.

1936 నాటికి కాంగ్రెసు వాదుల నాయకత్వంలో రైతు సంఘం నిర్మాణ రూపం తీసుకునే దశలోనే ఉంది. జమీందారుకు వ్యతిరేకంగా పోరాటం నిర్వహించడంలో స్పష్టమైన వైఖరిని అవలంభించలేకపోయింది. ఐక్య ప్రజా సంఘటనా ఎత్తుగడలతో 1936 నుండి కమ్యూనిస్టు పార్టీ పనిచేయడం ప్రారంభించింది. స్పష్టమైన జమీందారీ వ్యతిరేక విధానంతో రైతాంగాన్ని సమీకరించ డానికి కమ్యూనిస్టు కార్యకర్తలు ప్రయత్నించారు.

చలసాని జగన్నాథరావు, చల్లపల్లి నారాయణరావు, కోనేరు రాజగోపాలరావు, మాలెంపాటి సీతారామయ్య, సనకా బుచ్చికోటయ్య, మోదుమూడి శ్రీహరిరావు మొదలగు యువ కమ్యూనిస్టు కార్యకర్తలనేక మంది జమీందారుకు వ్యతిరేకంగా రైతాంగాన్ని సమైక్యపర్చడానికి కృషిచేసారు.

## నజరానా వ్యతిరేక పోరాటం 1937

రైతాంగం ఎన్నో ఏళ్ళుగా అర్థిస్తూ వచ్చిన కృష్ణా బ్యాంకు కాలువ నిర్మాణం జరిగి పులిగడ్డ ఆక్విడక్టు కట్టడంతో దివి తాలూకాలోని 40 వేల ఎకరాల భూమికి 1937 లో నీటివసతి ఏర్పడింది. కొత్తగా నీటి వసతి ఏర్పడిన ప్రతి

ఎకరానికి 25 రూపాయలు చెల్లించాలని జమీందారు పట్టుబట్టాడు. రైతులను నజరానాలు చెల్లించమని తాఖీదులు జారీ చేశారు. న్యాయమైన హక్కుకై అక్రమంగా ధనం గుంజాలని చూస్తున్న జమీందారుకు వ్యతిరేకంగా రైతాంగాన్ని సమీకరించి పోరాటాన్ని చేపట్టడానికి కమ్యూనిస్టు కార్యకర్తలు పూనుకున్నారు కాని కాంగ్రెసు మితవాదులు అర్జీలు, విన్నపాలుద్వారా సమస్యను పరిష్కరించుకోవాలే తప్ప పోరాట మార్గాన్ని చేపట్టాల్సిన అవసరం లేదని వాదించసాగారు.

నజరానాల వ్యతిరేకంగా జరిగిన రైతు సభలో చలసాని జగన్నాథరావు, కోనేరు రాజగోపాలరావు పోరాట మార్గాన్ని చేపట్టవల్సిన అవశ్యకతను రైతాంగానికి విశదపరిచారు. ఈ సభలో కమ్యూనిస్టులు తీర్మానాన్ని రైతాంగమంతా బలపరిచింది నజరానాను చెల్లించటాన్ని రైతాంగం తిరస్కరించింది. పెద్ద ఎత్తున ఉద్యమం సాగించటానికి రైతాంగం సమాయత్తమయింది.

చల్లపల్లి జమీందారుతో రైతులు పడుతున్న ఇక్కట్ల గురించి, నజరానావల్ల రైతుల బాధలు రెట్టింపు అవుతాయని ప్రభుత్వానికి తెలియచేస్తూ వెంటనే 'నజరానా'ని విరమించాలని రైతాంగం కోరింది.

మద్రాసు ప్రభుత్వ రెవిన్యూ మంత్రికి రైతులు సమర్పించిన మెమొరాండంలోని విషయాలు పరిశీలిస్తే చల్లపల్లి రైతుల సమస్యలు మనకి స్పష్టంగా అర్థమవుతాయి. 29-6-38 నవశక్తి సంచికలో చల్లపల్లి రైతులు సమర్పించిన మెమొరాండంలోని అంశాలు ఈ విధంగా ఉన్నాయి.

1. ఈ తాలూకాలో ఈస్టు బ్యాంకు కెనాలు క్రింద 42,000 ఎకరములు ఆయకట్టులో చేరినది. దానికి ఎకరా 1 కి 25 రూపాయలు నజరానా విధించి ఇప్పుడు వసూలు చేయుటకు నిశ్చయించినటుల తెలియుచున్నది.

మేము ఈ కొత్తగా చేయు సాగు ఖర్చులకే డబ్బు లేక తహతహలాడు. రోజులలో నజరానా మా పేద రైతుల నెత్తిన వేయుట చాలా అన్యాయం. చెల్లించుట చాలా దుర్లభము. సదరు భూమిని మెట్టనుండి మాగాణి చేయవలెనన్న లెవెల్ చేయించుటకు అయ్యే ఖర్చు ఎకరా 1కి 25 రూపాయలున్నూ, నీటి తీరువా రూ. 6-4-0 యున్నూ, మెట్ట శిస్తు రూ.3-8-0 యున్నూ సెస్సులు రూ. 1-0-0 యున్నూ నజరానా కిస్తీ రూ.5-0-0 లున్నూ వ్యవసాయ ఖర్చులు అనగా నాటు, కల్పులు, కోత వగైరా ఖర్చులు రూ. 25-0-0 లున్నూ ఎరువులు వగైరా సుమారు రూ. 15-0-0 లున్నూ వెరసి ఎకరా 1 కి రూ. 81-0-0 లు ఖర్చు పెట్టవలసి వచ్చుచున్నది. ఇంత మొత్తం ఈ రోజులలో అప్పు పుట్టుటయే బహు దుర్లభముగాన నజరానాను పూర్తిగా తొలగించి రైతుల నుద్ధరించమని మా ప్రార్థన.

2. ఈ భూములు 5 సంవత్సరముల వరకూ ఎకరా 1 కి 3-4 బస్తాల కంటె ఎక్కువ పండకపోవుటయే గాక వర్షాకాలములో కోతకు వచ్చుటచే పైరు వగైరా ఆధారములేని ఈ రైతుల కష్టము లీడేర్చుటకు బ్యాంకుల ద్వారా అప్పుల నిప్పించి సౌకర్యము కలిగించవలెను.

3. షార్టు క్రాపుగా మార్చబడిన 42 వేల ఎకరములకూ, పంట తక్కువ పండుట ఆ కాలములో కోతకు వచ్చిన పైరులు వగైరా ఆదాయం లేని ఈ భూములకు లాంగు క్రాపుకు విధించవలసిన తీరువా విధించుట చాలా అన్యాయ మనియూ, లాంగ్ క్రాపుకు సరిపడు నీరు సప్లయి చేయించుటకు స్కీము నాలోచించి మా రైతుల నుద్ధరించెదరని ప్రార్థన.

4. ఆయకట్టు మధ్య భాగంలో యుండి విధిగా సాగు చేయవలసిన భూములకు మంజూరీ ఆర్డరుల నివ్వక దానిపై విధించు రెట్టి తీరువాలను తీసి వేయించుచూ, మురుగునీటి క్రింద సాగుచేయుచున్న భూములకు కూడ ఇట్టి తీరువాలను తీసివేయించుచూ మురుగునీటి తీరువా వసూలు చేయించవలసినది.

5. ఆయకట్టు భూములకు దాపులో మెరక పేరుతో ఉండి ఫలితము లభించనందుచే విధిగా సాగుచేయించుట అవసరము గావున వాటికి మంజూరీ ఇప్పించకపోయినచో రైతులు తినుటకన్నము గూడ లేని వారగుదురు గాన మంజూరీ ఆర్డరులు ఇప్పించగలందులకు మా ప్రార్థన.

6. లంక భూములకు సర్వేలేక పోవుట ఎరిగి వీట్లో కలసిన భూములకు శిస్తు వసూలు చేసిననూ ఆ భూమి తిరిగి మెరక వేసినపుడు సేద్యము చేసికొన్న దానిపై అపరాధపు పన్ను విధించుట వలన రైతులకు చాలా అన్యాయము గలుగు చున్నది గాన సదరు లంకల విషయములో తగిన చర్యతీసికొని మేలు కలుగచేయ గలందులకు మా విన్నపము.

7. అడవి భూములకు దాపులో ఉండి అందు కట్టె కలప పశువుల మేత గూడ తెచ్చుకొనుటకు హక్కులేని రైతులకు హక్కుల నిప్పించుచు సదరు అడవి ప్రదేశమును చల్లపల్లి రాజాగారు అమ్మచున్నారు. గావున దానిపై ఎవరికిని అమ్మకొనుటకు ఎట్టి హక్కులేకుండా చేసి సదరు అడవి భూమిని ఆయా గ్రామ పంచాయతీ బోర్డులకు స్వాధీనపరిచి ప్రజలకుపయోగపడునట్లు చేసికొని 1900 సంవత్సరం సర్వే ల్యాండు రిజిస్టరీ దాఖలా రైతు భూములను పెద కళ్ళేపల్లి వగైరా గ్రామాదులలో చల్లపల్లి ఎస్టేటు వారు ఆక్రమించుకొనుచున్నారు. కాని సదరు విషయంలో మీరు చర్య తీసుకొని ఆయా రైతుల ఇక్కట్లు నీడేర్చెదరని మా మనవి.

1938 ఆగష్టు 10 న చల్లపల్లిలో సమావేశమైన దివితాలూకా రైతు సంఘం రైతులను నజరానాని చెల్లించవద్దని తీర్మానించింది. ఈ తీర్మానాన్ని అమలులో పెట్టడానికి చలసాని వాసుదేవరావు, గొర్రెపాటి వెంకట సుబ్బరావు, కావూరు కోదండ రామయ్య, కాకర్ల చంద్రశేఖర రావు, గుత్తికొండ కోదండ రామయ్యలతో కూడిన ఉపసంఘాన్ని నియమించింది. రైతు లెవరూ నజరానాని చెల్లించడానికి సిద్ధపడలేదు.

నజరానాకు రైతాంగ వ్యతిరేకతను గ్రహించిన రాజగోపాలాచారి మంత్రి వర్గం ఆ ఉత్తర్వును రద్దు చేస్తున్నట్లు ప్రకటించింది.

కమ్యూనిస్టుల నాయకత్వంలో రైతాంగం సాధించిన మొట్ట మొదటి విజయం ఇదే.

ఈ విజయంతో ఉత్తేజం పొందిన రైతాంగంలో సంఘం పట్ల విశ్వాసం, కమ్యూనిస్టులపై అభిమానం పెరిగింది. రైతాంగాన్ని ఆర్థికంగా రక్షించి అప్పులతో జమీందారు బారిపడకుండా గ్రామాలలో కో-ఆపరేటివ్ సంఘాలను నిర్మించడంలో కూడా కమ్యూనిస్టు కార్యకర్తలు విశేషించి కృషి చేశారు. కో.ఆపరేటివ్ సంఘాలను సక్రమంగా పని చేయించడంలో పార్టీ కార్యకర్తలు చేసిన కృషి ఫలితంగా ఈడ్పుగంటి పరమేశ్వరరావు కృష్ణా కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు డైరెక్టర్‌గా ఎన్నుకోబడ్డారు. 1940 నాటికి తాలూకా కో-ఆపరేటివ్ సంఘం పార్టీ అధీనంలోకి వచ్చింది

కాంగ్రెసు వారు సహితం పార్టీ ఆఫీసు పెట్టుకోలేని చల్లపల్లి జమీందారీలో కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ఆఫీస్‌ను స్థాపించ గలిగారు. రైతులలో పార్టీ పట్ల ఉన్న అభిమానానికి ఇది నిదర్శనం.

1939 - 42 మధ్య కాలంలో కమ్యూనిస్టు పార్టీ నిర్వహించిన యుద్ధ వ్యతిరేక కార్యక్రమాలలో ఆకలియాత్రలలో రైతాంగం పెద్ద ఎత్తున పాల్గొంది. రహస్య కాలంలో 1940 జమీందారు తోటలోనే యుద్ధ వ్యతిరేక సభను నిర్వహించి రైతాంగం తమ ధైర్య సాహసాలను ప్రదర్శించింది.

కమ్యూనిస్టు నేతృత్వంలో 1942 నాటికి చల్లపల్లి రైతాంగ ఉద్యమం స్పష్టమైన జమీందారీ వ్యతిరేకంగా సమైక్య ప్రజా ఉద్యమంగా రూపొందించ టానికి మంగళాపురం కూలీల పోరాటమే నిదర్శనం. సక్రమంగా శిస్తు చెల్లిస్తూ భూములను సాగు చేసుకుంటున్న ముదిరాజు కూలీలను భూముల నుండి వెళ్ళ గొట్టాలని జమీందారు చేసిన ప్రయత్నాన్ని రైతులు, వ్యవసాయ కూలీలు సమైక్యంగా ఎదిరించారు. 1942లో సాగిన ఈ మంగళాపుర పోరాటాల్ని చంద్ర రాజేశ్వరరావు,చల్లపల్లి నారాయణరావు, గుంటూరు బాపయ్య నేతృత్వంలో

సాగింది. మంగళాపురం పోరాటం తాలూకాలోని రైతాంగానికి యావత్తూ ప్రజానీకానికి ఎంతో ఉత్తేజాన్ని స్ఫూర్తిని ఇచ్చింది.

కమ్యూనిస్టు కార్యకర్తలు చేసిన ప్రచార, ఆందోళనా ఫలితంగా చల్లపల్లిలో బలమైన జమీందారీ వ్యతిరేకోద్యమం నిర్మితమైంది. తరువాత కాలంలో పటిష్ఠమైన ప్రజా ఉద్యమంగా రైతు ఉద్యమం అభివృద్ధి చెందింది. జమీందార్లు అంతమయ్యే వరకూ, చల్లపల్లి జమీందారు భూముల పంపకం సాగేవరకు ఇది కొనసాగింది.

## రైతు ఉద్యమం :

భూములనుండి ముదిరాజు కూలీలను ఏదో విధంగా పారద్రోలేందుకు జమీందారు విశ్వ ప్రయత్నం చేశాడు. రౌడీలతో సాధ్యంకాక జమీందారు పోలీసుల సహాయం తీసుకున్నాడు. 1942 జూలై 1, 2. తేదీలలో చల్లపల్లి మంగళాపురం గ్రామాలలో 30 మంది వ్యవసాయ కూలీలను పోలీసులు అరెస్టుచేశారు. అరెస్టు అయిన వారిలో చల్లపల్లి నారాయణరావు కూడా ఉన్నారు. ఇది చాలవన్నట్లు జూలై 17 న 48 మంది మస్తాసులను భూమిలోకి ప్రవేశించకుండా 144వ సెక్షన్ జారీచేశారు. జూలై 20వ తారీకున 300 మంది జమీందారీ మనుషులు పోలీసుల సహాయంతో భూములలోకి ప్రవేశించారు ఎన్నో సంవత్సరాలుగా తాము సాగుచేసుకుంటున్న భూములలోకి జమీందారు మనుషులు ఈ విధంగా దౌర్జన్యంగా ప్రవేశించడాన్ని మస్తాసులు ప్రతిఘటించారు. న్యాయమైన హక్కుకోసం ప్రతిఘటిస్తున్న కూలీలపై పోలీసులు లాఠీచార్జీ చేశారు. గుర్రాలను కూడా తోలించారు. 70 మంది కూలీలను ఇతరులను అరెస్టుచేశారు. అరెస్టు అయిన వారిలో చండ్ర రాజేశ్వరరావు, గుంటూరు బాపనయ్య, కాకర్ల వెంకటేశ్వరరావు, కొల్లి సీతారామయ్య మొదలగువారు ఉన్నారు.

కూలీల మొరపై డిప్యూటీ కలెక్టరు వెంటనే వెళ్ళి తగిన సమాచారం సేకరించి ఇవ్వవలసిందిగా తాసీల్దారుకు ఆజ్ఞాపించారు. అయినా తాసీల్దారు ఆ పని చేయలేదు. ఈ సందర్భంలో పెట్టిన అనేక కేసులలో అవనిగడ్డ బందరు కోర్టులకు రాజేశ్వరరావు, నారాయణరావులతోసహా ముద్దాయిలందరూ అన్నంమూటలు కట్టుకొని ఎఱ్ఱ జెండాలతో రైతు కూలీ పాటలు పాడుకుంటూ ఊరేగింపుగా కోర్టుకు వెళ్ళేవారు. ఇది త్రోవలో ఉన్న గ్రామాల ప్రజలను ఉత్తేజపర్చింది. రాజేశ్వరరావు, నారాయణరావు, బాపనయ్యలతోపాటు మరికొంత మంది కూలీలకు 3 మాసముల నుండి 6 మాసాలవరకుకు శిక్ష విధించారు. ఇది జమీందారుకు తాత్కాలికంగా సంతోషము కలిగించినా తరువాత జరిగిన మహోన్నత జమీందారీ రద్దు పోరాటానికి నాంది పల్కింది.

## రైతుపోరాటాలు-కాంగ్రెసు-మంత్రివర్గ వైఖరి

రైతుఉద్యమం, రైతుపోరాటాల పట్ల కాంగ్రెసు వైఖరి మొదటి నుంచి అస్పష్టంగానే ఉంటూవచ్చింది. ప్రత్యేకంగా రైతులను సమీకరించి సంఘటితం చేయడంలోనూ వారి సమస్యలపై ఆందోళన గావించడంలోనూ కాంగ్రెసులో భిన్నాభిప్రాయాలు వ్యక్తమవుతూ వచ్చాయి. సంపూర్ణ స్వాతంత్ర్యం కోసం పోరాటం సాగుతున్న దశలో ప్రత్యేకంగా రైతుసంఘాలను నిర్మించి ఆందోళన చేయడం అంటే స్వాతంత్ర్య ఉద్యమానికి హాని కలిగించడమేనని సర్దార్‌పటేల్, బాబురాజేంద్రప్రసాద్, పట్టాభిసీతారామయ్య మొదలగు కాంగ్రెసు నాయకులు అభిప్రాయ పడుతూ వచ్చారు. ముందుగా స్వాతంత్ర్యాన్ని పొందాలి ఆ తరువాతే ప్రజా సమస్యలపై ఆందోళన అనే వైఖరినే ఈ కాంగ్రెసు వాదులు బలపరుస్తూ వచ్చారు. ప్రజాసంఘాలు, ప్రజా సమస్యలపై ఆందోళన చేయడం అంటే స్వాతంత్ర్య ఉద్యమాన్ని బలహీన పరిచేదిగాను, వ్యతిరేకమైనవిగాను, ఈ కాంగ్రెసు వాదులు ఊహించేవారు. రైతు సంఘాలను నిర్మించి పోరాటాలు నిర్వహించడమంటే జాతీయపోరాట స్రవంతి నుండి రైతాంగాన్ని మళ్ళించడమేనని ఈ కాంగ్రెసువాదుల అభిప్రాయం. 1934-35 వరకు కాంగ్రెసులోని అత్యధికులు ఇదే అభిప్రాయంతో కొనసాగారు. రైతుసమస్యలపై ఆందోళనలు సాగినా రైతు సంఘాలు అక్కడక్కడ నిర్మితమై పనిచేస్తున్నా కాంగ్రెసు ఉద్యమంలో భాగంగా పెనవేసుకుని మాత్రం జరుగలేదు.

రైతుల సమస్యలపై పనిచేస్తూ ఆందోళనా కార్యక్రమాలను నిర్వహించిన కొంతమంది కాంగ్రెసువాదులు, కాంగ్రెసు కార్యక్రమాలకు అనుగుణంగా వాటిని నిలుపుదల చేసిన సందర్భాలు కూడా అనేకం ఉన్నాయి. ఉధృతంగా సాగుతున్న రైతుఉద్యమాల్ని కాంగ్రెసు నాయకుల కోరిక మేరకు వెనక్కికొట్టిన సంఘటనలు కూడా లేకపోలేదు.

రైతుఉద్యమాన్ని, స్వాతంత్ర్య పోరాటంలో అంతర్భాగంగా చూడక రెండిటినీ పరస్పర విరుద్ధమైన ఉద్యమాలు అనే అవగాహన కలిగి ఉండడం వలన ఈ విధంగా జరుగుతూ వచ్చింది.

అతివాద భావాలు కలిగిన యువకులు, సోషలిస్టులు కాంగ్రెసులో చేరి పని చేయడం ప్రారంభించిన తరువాత రైతుఉద్యమం పట్ల కాంగ్రెసు విధానంలో కొంత మార్పువచ్చింది. ఐక్యసంఘటనా ఎత్తుగడలతో కమ్యూనిస్టు పార్టీ 1936 నుండి జాతీయ కాంగ్రెసుతో కలిసి పనిచేయడం ప్రారంభించింది. సంపూర్ణ స్వాతంత్ర్య సాధనకు ఐక్య ప్రజాఉద్యమమే సరి అయిన మార్గమనే దృక్పథంతో కమ్యూనిస్టులు పనిచేయడం ప్రారంభించారు. కార్మిక, కర్షక, జనసామా

న్యాని సంఘటితం చేసి వారి సమస్యలపై పోరాటాలను నిర్వహిస్తూ ఉద్యమించడం. ద్వారానే స్వాతంత్ర్య పోరాటాన్ని పటిష్ఠవంతంగా నిర్వహించగలమని కమ్యూనిస్టుపార్టీ విశ్వసించింది. ప్రజాసంఘాల నిర్మాణం, ప్రజా సమస్యలపై పోరాటం అనేవి స్వాతంత్ర్య పోరాటాన్ని బలహీనపరచవని, ఈ రెండు ప్రవంతులు పరస్పర విరుద్ధమైనవి కావని, కమ్యూనిస్టుపార్టీ అభిప్రాయం. పటిష్ఠమైన ప్రజా సంఘాల నిర్మాణంజరిగి, ఉధృతమైన ఉద్యమాలు నిర్వహించడం అంటే జాతీయపోరాట ప్రవంతిలో సామాన్య ప్రజానీకాన్ని సమ్మిశితం చేయడమేనని తద్వారా సంపూర్ణ స్వాతంత్ర్య పోరాటం మరింత బలాన్ని పుంజుకుంటుందని అదే స్వాతంత్ర్య సాధనకు సరియైన మార్గమని కమ్యూనిస్టుల విశ్వాసం.

ఈ విధమైన అభిప్రాయాన్ని ప్రచారం చేస్తూనే అటు కాంగ్రెసు సంఘాలలోనూ, ఇటు రైతు సంఘాలలోనూ కమ్యూనిస్టులు పనిచేయడం ప్రారంభించారు. 1936 లక్నో కాంగ్రెసు తరువాత కాంగ్రెసులో అతివాదుల ప్రభావం క్రమంగా పెంపొందడంతో రైతు సంఘాలు, రైతు ఉద్యమాల పట్ల కాంగ్రెసు వైఖరి కొంత మారసాగింది. మితవాద పోకడ కొంతవరకు వెనుక ముఖం పట్టింది.

1937 ఎన్నికల సందర్భంలో రైతులపట్ల కాంగ్రెసు పూర్తి అనుకూల వైఖరినే అవలంభించింది. ఋణభారం, జమీందారీ సమస్య, అధిక శిస్తులు మొదలైన విషయాలలో రైతులకు అనుకూలమైన వాగ్దానాలెన్నిటినో కాంగ్రెసు ఎన్నికల ప్రణాళిక చేసింది. జాతీయ పోరాటానికి నాయకత్వం వహిస్తున్న కాంగ్రెసు చేసిన ఈ వాగ్దానాలు రైతాంగాన్ని వెన్నుతట్టి లేపాయి. మారు మూల గ్రామాలలోని రైతులు సహితం ముందుకొచ్చి కాంగ్రెసు ప్రచారంలో పాల్గొన్నారు. దశాబ్దాల తరబడి సామ్రాజ్యవాదుల పాలనలో అణగారుతున్న రైతాంగం కొండంత ఆశతో కాంగ్రెసు విజయానికి కృషి చేసింది. జమీందార్లు జస్టిస్ పార్టీవారు ఎన్ని బెదిరింపులు చేసినా భయపడక కష్టనష్టాలకు గురి అయి, కాంగ్రెస్‌కు అఖండ విజయం చేకూర్చిపెట్టారు.

కాంగ్రెసు విజయంతో ఆంధ్ర రైతాంగంలో నూతనోత్సాహం వెల్లివిరిసింది, రైతు సంఘ నిర్మాణంలోనూ, కార్యక్రమాలలో కొత్త వూపు వచ్చింది. తమ సమస్యల పరిష్కారానికి కాంగ్రెసు మంత్రివర్గం తగినంతగా తోడ్పడగలదనే విశ్వాసం రైతాంగంలో బలంగా ఏర్పడింది. స్థానికంగా రాష్ట్ర వ్యాపితంగా ఉన్న సమస్యలను ప్రభుత్వ దృష్టికి తెచ్చినట్లయితే పరిష్కరింపబడగలవనే నమ్మకంతో రైతాంగం ముందుకొచ్చింది.

ఋణ నివారణ, జమీందారీ సమస్య మొదలైన విషయాలలో కాంగ్రెసు మంత్రి వర్గం శాసనరూపంలో రైతులకు సహాయపడుతుందని ఆశించారు.

కాని రైతులు ఆశించిన స్థాయిలో కాంగ్రెసు మంత్రి వర్గం ముందుకు రాలేదు. రైతుల నుండి వత్తిడి ప్రారంభమైన తరువాత మాత్రమే వారి సమస్యల నెరవేర్చేందుకు ప్రయత్నాలు ప్రారంభించింది. ఈ ప్రయత్నాలు కూడా కేవలం 'కంటి తుడుపు' వ్యవహారంగా తయారయింది. ఋణపరిష్కార చట్టం విషయంలో కాంగ్రెసు మంత్రి వర్గం అనుసరించిన వైఖరే ఇందుకు నిదర్శనం.

ప్రారంభంలో రైతులకు కొంతవరకు మేలు కలిగించే విధంగా రూపొందించిన ఋణ పరిష్కార చట్టం సెలెక్టు కమిటీ దశలో అనేక సవరణలకు గురి అయింది. రైతులకు మరింత అనుకూలంగా చట్టం తయారు కావాలని రైతు సంఘాలు కోరాయి. జమీందార్లు, వడ్డీ వ్యాపారస్థులు ఆ చట్టాన్ని తమ కనుకూలంగా మార్చుకునేందుకు మంత్రి వర్గంపై వత్తిడి తెచ్చారు. రైతులకు మేలు కలిగించేందుకు రూపొందించిన ఋణ పరిష్కార బిల్లులో చిట్టచివరకు శాసనరూపం దాల్చేసరికి ఋణ దాతలకు అనుకూలమైన పలుమార్పులు జరిగాయి. రైతు సంఘాల కోర్కెలను పెడచెవిన పెట్టిన కాంగ్రెసు మంత్రివర్గం, జమీందార్లు వడ్డీ వ్యాపారస్థులకు అనుకూలంగా ఆ చట్టాన్ని తయారుచేసింది. ఋణ పరిష్కార మార్గాలను చూపించడంలో ప్రభుత్వం పూర్తిగా విఫలమైంది. ప్రభుత్వం జమీందార్ల వడ్డీ వ్యాపారస్థులకు మాత్రం లొంగిందే కాని రైతుల మొరను ఆలకించలేదు.

రైతు ఉద్యమాలు ప్రజాందోళనలు పట్ల సామ్రాజ్యవాద ప్రభుత్వం ఏ వైఖరి అవలంభించిందో కాంగ్రెసు మంత్రివర్గం కూడా అదే వైఖరిని అవలంభించింది. రైతు సంఘం నాయకులపైన, రైతు ఆందోళనలపైన పోలీసు నిఘాలను కొనిసాగించింది. రైతు, కార్మిక పోరాటాలన్నిటినీ క్రిమినల్ చర్యల క్రిందే జమకట్టింది. సామ్రాజ్యవాదులు రైతు ఆందోళనలపై ఏ విధమైన చర్యలను తీసుకున్నారో కాంగ్రెసు మంత్రివర్గం కూడా కుడీ, ఎడమగా అదే వరుసలో నడిచింది. రైతు ఉద్యమాలపట్ల ప్రభుత్వాధికారుల దురహంకార పూరిత వైఖరిని కాంగ్రెసు మంత్రి వర్గం పూర్తిగా సమర్థించింది. కాళిపట్నం రైతులపై 144 వ సెక్షన్ విధించటం, మునగాల రైతులను అరెస్టు చేయడం, మొదలైన అన్ని విషయాలలో కూడ కాంగ్రెసు మంత్రివర్గం, రైతాంగ వ్యతిరేక పద్ధతులనే అవలంభించింది.

ప్రజా ఆందోళనల పట్ల కాంగ్రెసు మంత్రివర్గం అనుసరిస్తున్న ఈ వైఖరిని కాంగ్రెసు సోషలిస్టు పార్టీ మొదటి నుంచి నిర్ద్వంద్వంగా ఖండిస్తూ

వచ్చింది. 1938 సెప్టెంబరులో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ, ప్రజా ఉద్యమాల పట్ల ప్రభుత్వ వైఖరిని ఖండిస్తూ ఈ విధంగా పేర్కొంది. ''మద్రాసు ప్రభుత్వం వారు ప్రకటించిన పోలీసు రిపోర్టులో రైతు కార్మిక పోరాటాలను క్రిమినల్ శాఖలో చేర్చుట ప్రభుత్వపు అధికార దురహంకారాన్ని తెలియ చేస్తున్నది. కాంగ్రెసు మంత్రుల హయాంలో కూడా ఉద్యోగుల మనస్తత్వములో మార్పు రాలేదని పై సంగతి ఋజువు చేస్తుంది. ప్రజాందోళన, ప్రజా చైతన్యమే బలముగా కలిగిన కాంగ్రెసు మంత్రులు, రైతు, కార్మికుల ఉద్యమాలను క్రిమినల్ చర్యలలో చేర్చుటకు అవకాశమిచ్చినందులకు విచార పడుతూ వెంటనే అట్టి పొరపాటులను రానివ్వకుండా జాగ్రత్త పడవలసిందిగా హెచ్చరించుచున్నారు."[15]

ఎన్నికల సమయంలో రైతు సమస్యల పరిష్కారానికి కృషి చేస్తామని వాగ్దానం చేసిన కాంగ్రెసు తీరా అధికారంలోకి వచ్చిన తరువాత వాగ్దానాలను అమలు చేయకపోగా, రైతు సమస్యల పరిష్కారం కోసం ఆందోళన చేస్తున్న వారిపై చర్యలు తీసుకోవడం ప్రారంభించింది. రైతు ఉద్యమాలు తీవ్ర మవుతున్న కొలదీ కాంగ్రెసు కమిటీలలోనూ, కాంగ్రెసు మంత్రివర్గం లోనూ మార్పు రాసాగింది. తప్పనిసరి పరిస్థితులలో తమ హక్కుల రక్షణ కోసం ఆందోళన సాగిస్తున్న రైతులను, కాంగ్రెసు మంత్రివర్గం తన ప్రభుత్వ అధికార బలంతో అణచివేయాలని చూసింది. కొల్వాబుగ్గ వేసవి రైతాంగ పాఠశాల స్నాతకోపన్యాసముతో, ప్రభుత్వ వైఖరిని తెలియచేస్తూ మంత్రిగా ఉన్న కాంగ్రెసు నాయకుడు బెజవాడ గోపాలరెడ్డి ఇలా తెలియచేసారు. "పోలీసు వారిని నిందించి లాభం లేదు . .....

సమాజాభ్యుదయం కోసరం అవసరము కల్గిన లాఠీచార్జి, బాయినెట్ చార్జీ తుపాకీ కాల్పులకు బూనవలసినదేగాని సంఘ శ్రేయమును విడనాడి మూల కూర్చొను. అధికారమున నుండునంతకాలము దేశము శాంతి భద్రతలు గుర్తెరిగి పాలించినచో రాబోవు ఎన్నికలలో తీరుగా మమ్ములను ఎన్నుకొనక పోయినను ఆలోచింపవలసిన పనిలేదు". అని స్పష్టంగా తేల్చి చెప్పాడు.[16]

ప్రజా సమస్యలు, హక్కులకన్నా శాంతి భద్రతల పరిరక్షణే ప్రాధాన్యంగా పెట్టుకుని కాంగ్రెసు మంత్రివర్గం వ్యవహరించిందనటానికి గోపాలరెడ్డి వాఖ్యలే ప్రబల నిదర్శనం.

రైతు ఉద్యమాలపట్ల, వాటిని ముందుకు నడిపిస్తున్న అతివాద యువకుల పట్ల రాష్ట్ర కాంగ్రెసు నాయకత్వంలో ఉన్న మితవాదులు శతృత్వ వైఖరినే అవలంభించారు. అయ్యదేవర కాళేశ్వరరావు, పట్టాభి సీతారామయ్య, గొట్టిపాటి

బ్రహ్మయ్య వంటి నాయకులు కాంగ్రెసులోనున్న రైతు ఉద్యమాలు నిర్వహిస్తున్న అతివాదులను కాంగ్రెసు నుండి బయటకు పంపేందుకు ప్రయత్నాలు చేసారు.

కాళీపట్నం రైతుల పోరాటానికి అండగా నిలిచిన అతివాద యువకులందరి పైన క్రమశిక్షణా చర్యలు తీసుకునేందుకు రాష్ట్ర కాంగ్రెసు నాయకత్వం ప్రయత్నం చేసింది. పై కమిటీల అనుమతి లేకుండా రైతుల హక్కుల రక్షణ కొరకు సత్యాగ్రహం చేసారు అనే నెపంతో తాలుకా, జిల్లా కాంగ్రెసు నాయకులపై రాష్ట్ర కాంగ్రెసు సంఘం సంజాయిషీ నోటీసులు ఇచ్చింది. తమ హక్కుల రక్షణకై శాంతియుతంగా సత్యాగ్రహం సాగించిన కాళీపట్నం రైతులపై దౌర్జన్య చర్యలకు పాల్పడుతున్నారని, హింసాత్మక పద్ధతులు అవలంభిస్తున్నారని చెపుతూ రాష్ట్ర కాంగ్రెసు నాయకుడు పట్టాభి సీతారామయ్య, మహాత్మాగాంధీకి ఫిర్యాదు చేసారు

కాళీపట్నం రైతు పోరాటం జరుగుతున్న సమయంలో మహాత్మాగాంధీ 1938 సెప్టెంబరులో 'హరిజన్' పత్రికలో ఒక వ్యాసం వ్రాస్తూ పోరాటాన్ని నడిపిన నర్సాపురం తాలుకా కాంగ్రెసు సంఘాన్ని విమర్శించాడు.

"హింసను గురించి నేను వ్రాసిన నాటనుండి, నా ప్రకటనను బలపర్చుచూ ఇండియాలోని అన్ని ప్రాంతలనుండి సాక్ష్యము లభించుతూంది. అందులో అన్నిటి కన్నా విచారకరమైన విషయం ఒకటుంది. అది ఒక జమీందారు భూములను రైతులు స్వాధీనపరుచుకొన వలెనని ఒక కాంగ్రెసు కమిటీ ప్రోత్సహించుట. ఈ దోపిడీ చర్యకు ముందు కాంగ్రెసువారు హింసాపూరిత ఉపన్యాసాలు ఇచ్చారు. విచారించమని నేను, డాక్టర్ పట్టాభి సీతారామయ్య గారికి కాగితాలు పంపాను. నా విలేఖరి గావించిన ఫిర్యాదులన్నీ సామాన్యముగా నిజమేనని ఆయన ఒప్పు కొన్నాడు. జిల్లాసంఘం కాని, రాష్ట్రసంఘం కాని ఈ తప్పిదాన్ని సవరిస్తుందని ఆశించుచున్నాను. అలా చేయకపోతే రాజాజీ ప్రభుత్వం దీనిని పరిష్కరించవలసి ఉంటుంది." అని మహాత్మాగాంధీ అన్యాపదేశంగా కాళీపట్నం పోరాటాన్ని నడిపిన అతివాదులపై చర్యలు తీసుకోవలసిందిగా ఆదేశించారు.

అతివాదులను కాంగ్రెసు నుండి బయటకు పంపాలని ప్రయత్నిస్తున్న మితవాద రాష్ట్ర కాంగ్రెసు నాయకత్వం కాళీపట్నం సత్యాగ్రహాన్ని అదనుగా తీసుకుంది. రాష్ట్ర కాంగ్రెసు సంఘం అనుమతి లేకుండా సత్యాగ్రహం చేసారని, ప్రోత్సహించారనే నెపంమీద ఉద్ధరాజు రామం, పేటేటి వెంకటరత్నం, అల్లూరి సత్యనారాయణ, భూపతిరాజు లక్ష్మీనరిసింహరాజు, సంకు అప్పారావు, ప్రేరేపు మృత్యుంజయుడు, చేకూరి అచ్యుత రామరాజు, ఉద్ధరాజు సూరపరాజు, నెక్కలపూడి రామారావు, కృత్తివెంటి వెంకటేశ్వరరావు, దర్భా శ్రీరామమూర్తి,

గొట్టుముక్కల వెంకట్రామ రాజు, శ్రీమతి అల్లూరి అన్నపూర్ణా దేవిలకు క్రమశిక్షణా చర్యల క్రింద నోటీసులు జారీ చేసింది. రాష్ట్ర కాంగ్రెసు సంఘం అనుసరిస్తున్న ఈ అనుచిత వైఖరిని రాష్ట్ర, జిల్లా రైతు సంఘాలు తీవ్రంగా ఖండించాయి. రాష్ట్ర కాంగ్రెసు నాయకత్వం చేపడుతున్న చర్యలు స్వాతంత్ర్య పోరాటాన్ని రైతు ఉద్యమాన్ని దెబ్బతీసే విధంగా ఉన్నాయని కాంగ్రెసులోని అతివాద భావాలు కలిగిన వారంతా గర్హించారు.

రాష్ట్ర కాంగ్రెసు నాయకత్వం జారీ చేసిన సంజాయిషీ నోటీసులకు సమాధానం ఇస్తూ తాము కాంగ్రెసు ధర్మాన్నే నెరవేర్చామని, రైతుల హక్కుల కోసం పోరాటం చేయడం కాంగ్రెసుకు వ్యతిరేకమైన చర్య కాదని కాళీపట్నం పోరాట నాయకులంతా స్పష్టంగా తెలియచేసారు. రైతు పోరాటంలో పాల్గొనడమంటే కాంగ్రెసు పోరాటంలో పాల్గొనడమేనని చెపుతూ "మేము రైతుల నుండి వచ్చిన వారము కాంగ్రెసులో చాలా సంవత్సరములుగా పాల్గొనుచున్నాం, కాంగ్రెసు, రైతుల హక్కులను కాపాడే స్వరాజ్యాన్ని తెస్తుందనే పూర్ణ విశ్వాసంతోనే మేము దీనిలో పనిచేస్తున్నాము. రైతు హక్కులను కాపాడక, రైతు పోరాటాల నుండి దూరంగా కాంగ్రెసు గాని, కాంగ్రెసు వాదులుగాని ఉండగలరనుట మేము ఊహించజాలక పోయాము. కాంగ్రెసులోని ఎవరో కొంతమంది అలా ఉండగలుగుదురని ఇప్పుడిప్పుడే మేము గ్రహించసాగాము. కాని అలా ఉండడము పూర్తిగా తప్పని కాంగ్రెసును బలపరుస్తుందని మా విశ్వాసము. అందుచే మేము, రైతుల పొలాలను జమీందారు పోలీసుల సహాయంతో వశపరుచుకోవడానికి పోయినప్పుడు దానికి రైతులు అడ్డుతగులుట న్యాయమని అనుకున్నాము. దానిని బలపర్చాలి. దానిలో పాల్గొనాలి. ఇకముందు కూడా అలా పాల్గొనదము.

ఈ విధముగా రైతు పోరాటాలలో పాల్గొని కాంగ్రెసు సంస్థయందు వారి విశ్వాసము కాపాడి కాంగ్రెసుసంస్థను బలపరిచిన మా మీద సంజాయిషి నోటీసులు రైతు పొలాలను జమీందారు లాక్కోడానికి పోలీసుల సాయము పంపినందులకు క్రింది ఉద్యోగస్థులపై ఎట్టి చర్యతీసుకొననందుకు కాంగ్రెసుమంత్రులకు అభినందనములు. ఇట్టి పరిస్థితులు కాంగ్రెసును బలహీనపరుస్తాయని మేము వేరే వ్రాయనవసరం లేదు" (28-6-39, నవశక్తి 9 వ పేజీ) అని రాష్ట్ర కాంగ్రెసు సంఘానికి తెలియజేసారు.

కాంగ్రెసులోని మితవాద నాయకత్వం క్రమశిక్షణా చర్య పరిధిని విస్తృతం చేయడానికి వీలుగా అఖిలభారత కాంగ్రెసు కమిటీ సమావేశంలో ఇందు కొరకు ప్రత్యేకమైన తీర్మానం చేసారు. బాబు రాజేంద్రప్రసాద్ అధ్యక్షతను జరిగిన ఈ సమావేశం రాష్ట్ర కాంగ్రెసు కమిటీ అనుమతి లేనిదే ఏ కాంగ్రెసు

వాది సత్యాగ్రహం చేయరాదని, "కాంగ్రెసు మంత్రుల చర్యలను బహిరంగంగా విమర్శించరాదని" తీర్మానాలు చేసారు.

ఆంధ్ర ప్రాంతంలోనూ, దేశంలోని ఇతర ప్రాంతాలలోను కాంగ్రెసు అతివాదుల నాయకత్వంలో విజృంభిస్తున్న రైతాంగ ఉద్యమాన్ని ప్రత్యక్షంగా దెబ్బతీయడానికే మితవాద కాంగ్రెసు నాయకత్వం ఈ తీర్మానాలు చేసింది. మునగాల, కాళీపట్నం, రైతు ఆందోళనలో భాగంగా సత్యాగ్రహ కార్యక్రమాన్ని చేపట్టిన అతివాద కాంగ్రెసు యువకులను బయటకు నెట్టివేయడానికి ఉద్దేశించిన తీర్మానాలే ఇవి. రైతు పోరాటాలలో పాల్గొంటున్న కాంగ్రెసు యువకులను నిరోధించి రైతాంగ ఉద్యమాన్ని బలహీనపర్చడానికే మితవాద కాంగ్రెసు నాయకత్వం ఈ చర్యకు పూనుకుంది.

అఖిలభారత కాంగ్రెసు కమిటీ చేసిన తీర్మానాలను నిరసిస్తూ అతివాదులంతా తమ వ్యతిరేకతను తెలియచేసారు. "కాంగ్రెసు మంత్రులు గావించిన మంచి పనులు కూడా ప్రజలకు అందాలన్ననూ ప్రజలనేక పర్యాయములు సత్యాగ్రహం సాగించక తప్పదు. ఇట్టి సత్యాగ్రహ పోరాటాలనేకం దేశమంతటా జరుగుతున్నప్పుడే మంత్రులకు అడ్డము రావడానికి గవర్నరు భయపడతాడు. ఇట్టి సత్యాగ్రహ పోరాటాలను బలపరుచుటవలననే సత్యాగ్రహ పోరాటం బలపడగలదని" కాంగ్రెసులోని అతివాద యువకులు అభిప్రాయపడ్డారు.[17]

అఖిల భారత కాంగ్రెసు కమిటి చేసిన తీర్మానాలను మార్పు చేయవలసిన అవసరం గురించి ప్రజలకు తెలియజేయటానికి, వీలుగా 1939 జూలై 9 దేశం యావత్తూ సభలు జరపాలని కాంగ్రెసులోని అతివాదులు నిర్ణయించారు. ఫార్వర్డ్ బ్లాకు, కాంగ్రెసు సోషలిస్టు పార్టీ, రైతు సంఘ నాయకులు, కమ్యూనిస్టులు, రాయిస్టులతో కూడిన అతివాదుల ఐక్య సంఘం (లెఫ్ట్ కన్సాలిడేషన్ కమిటీ) ఈ మేరకు ఒక పిలుపునిచ్చింది ఆంధ్ర రాష్ట్రంలో నెల్లూరు, గుంటూరు, పశ్చిమ గోదావరి జిల్లాలలో జరిగిన అనేక సభలలో కాంగ్రెసు తీర్మానాలను రైతు నాయకులు, అతివాద కాంగ్రెసు యువకులు అనేక మంది ఖండించారు. ఈ పాటి నిరసనను కూడా మితవాద రాష్ట్ర కాంగ్రెసు నాయకత్వం సహించలేక పోయింది. సుభాష్ చంద్రబోసు పిలుపుమేరకు సభలు జరిపారని కాంగ్రెసుకు వ్యతిరేకంగా ప్రజలను ప్రోత్సహించారని చెబుతూ కొంతమంది అతివాద యువకులకు రాష్ట్ర కాంగ్రెసు సంఘం సంజాయిషీ నోటీసులు జారీ చేసింది.

పుచ్చలపల్లి సుందరయ్య, మద్దూరి అన్నపూర్ణయ్య, ముత్తేవి మాధవాచార్య, చింతల సూర్యనారాయణ, ఆరవేటి రామయ్య, ఉద్ధరాజు సూరపరాజు,

భూపతిరాజు బాపిరాజు మొదలైనవారికి ఈ సంజాయిషీ నోటీసు జారీ చేశారు.[19] (26-7-1939 నవశక్తి, 5 వ పేజి.)

జమీందార్లకు వ్యతిరేకంగా రైతులను సంఘటితం చేసి పోరాటోన్ముఖులను చేసిన అతివాదులందరిని కాంగ్రెసు నుండి తరిమివేయడానికి "క్రమశిక్షణా అంకుశాన్ని" మితవాద కాంగ్రెసులు ఉపయోగించసాగారు. మరోవైపు, ఎన్నో కష్టనష్టాలను ఎదుర్కొంటూ జమీందారీ ప్రాంతాలలో అతివాదులు చేర్పించిన కాంగ్రెసు సభ్యత్వాన్నే, ఏకంగా రద్దు చేయటానికి మితవాద రాష్ట్ర కాంగ్రెసు నాయకత్వం పూనుకుంది.

జమీందార్ల దౌర్జన్యాలకి, దౌష్ట్యానికి మారుపేరుగా ఉన్న పశ్చిమ కృష్ణా జిల్లాలో అతివాద కాంగ్రెసు యువకులు ఎన్నో దాడులు సహితం ఎదుర్కొంటూ కాంగ్రెసు సభ్యత్వాన్ని పెంపొందించారు రైతు పోరాటాలకి అండగా నిలిచి కాంగ్రెసు పట్ల రైతులలో విశ్వాసం కలిగించి కాంగ్రెసు ప్రభుత్వాన్ని పెంచారు. మహా మహులైన కాంగ్రెసు నాయకులు సహితం అడుగుపెట్టని మునగాల పరగణాలో ప్రాణాలను సహితం లెక్కచేయక రైతు ఉద్యమాన్ని నిర్మించి తద్వారా కాంగ్రెసు సంఘాలను, సభ్యత్వాన్ని ఏర్పరచగలిగారు. ఒక్క మునగాల పరగణాలోనే 3000 మంది కాంగ్రెసు సభ్యులను చేర్పించారు. ఈ కృషి మూలంగానే పశ్చిమ కృష్ణా జిల్లా కాంగెసు సంఘం అతివాదుల ప్రాబల్యంలో ఉంది. ప్రతిరైతు పోరాటాన్ని ప్రత్యేకించి మునగాల రైతాంగ పోరాటాన్ని జిల్లా కాంగ్రెసు సంఘం బలపరుస్తూ వచ్చింది.

రైతాంగ పోరాటాలకి వ్యతిరేకమూ, జమీందార్లతో సాన్నిహిత్యం కలిగిన మితవాద రాష్ట్ర నాయకత్వం ఇది సహించలేకపోయింది. అతివాదుల ప్రాబల్యం తగ్గించాలని ఎన్నో ప్రయత్నాలు చేసింది. 1938 ప్రారంభంలో రాష్ట్ర కాంగ్రెస్ సంఘ ఎన్నికలకు పశ్చిమ కృష్ణా నుండి ఏకగ్రీవంగా ఎన్నికైన 20 మంది ప్రతినిధుల ఎన్నిక చెల్లనేరదని కొట్టివేసింది. ఎన్నికలలో అవకతవకలు జరిగాయని ఆరోపించింది. ఆరోపణలు ఋజువు చేసుకోలేక గత్యంతరం లేని పరిస్థితులలో ఆ తప్పును తిరిగి సరిదిద్దుకుంది.

తిరిగి 1938 చివరిలో కాంగ్రెసు సభ్యత్వం చేర్పించే విషయంలో అతివాదులకు ఎన్నో చిక్కులను ఏర్పరిచింది. వీటన్నిటిని అధిగమిస్తూ అతివాదులు 35,732 మందిని కాంగ్రెసు సభ్యులుగా చేర్పించారు. రైతాంగానికి వెన్నంటి ఉంటూ అతివాద యువకులు సాధించిన ఈ విజయాన్ని రాష్ట్ర కాంగ్రెసు సంఘం ఓర్వలేకపోయింది. పట్టాభిసీతారామయ్య, గొట్టిపాటి బ్రహ్మయ్య అధ్యక్ష, కార్యదర్శులుగా ఉన్న రాష్ట్ర కాంగ్రెసు సంఘం ఈ సభ్యత్వం మొత్తాన్ని కొట్టి

హారేసింది. 35, 372 మంది సభ్యులు చెల్లరని జిల్లా కాంగ్రెసుకు ఒక తాఖీదు ఇచ్చింది.

1937 ప్రారంభంలో రైతులపట్ల కాంగ్రెసు వారు అనుసరించిన వైఖరి 1939 చివరకు పూర్తిగా మారిపోయింది కాంగ్రెసు చేసిన వాగ్దానాలతో ఉత్సాహం పొంది కాంగ్రెసు విజయంతో స్ఫూర్తి పొంది ఉద్యమాల నిర్వహించిన రైతాంగానికి అనేక అడ్డంకులు, నిర్బంధాలు ఎదురయ్యాయి. వాస్తవానికి రైతు ఉద్యమం తీవ్రమవుతున్న కొద్దీ మంత్రి వర్గ వైఖరే మారిపోయింది.

రాష్ట్ర కాంగ్రెసు నాయకత్వంలో ఉన్న మితవాదులు రైతు ఉద్యమాల్ని నీరు కార్చేందుకు అతివాదులందరినీ కాంగ్రెసు నుండి బయటకు పంపే ప్రయత్నాలు చేసింది.

ఈ పరిస్థితులలో రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభం కావడం మూలంగా కాంగ్రెసు మంత్రి వర్గాలు రాజీనామా చేశాయి. బ్రిటీషు సామ్రాజ్యవాద ప్రభుత్వం ప్రజా ఉద్యమ నాయకులపైన, కార్యకర్తలపైన నిర్బంధ విధానాన్ని అమలు జరిపింది.

## రెండవ ప్రపంచయుద్ధం నాటికి రైతుసంఘ నిర్మాణం

ఆంధ్ర రాష్ట్రంలో 1935-36 లలో జరిగిన రైతుసంఘ పునరుద్ధరణ తరువాత రాష్ట్రస్థాయిలోను, జిల్లాలస్థాయిలోను, రైతు సంఘానికి క్రమబద్ధమైన నిర్మాణం ఏర్పడింది. కమ్యూనిస్టులు, కాంగ్రెసు సోషలిస్టులు, వామపక్ష కాంగ్రెసు వాదులు కలసి గ్రామస్థాయినుండి స్వతంత్ర ప్రతిపత్తి కలిగిన రైతుసంఘాల నిర్మాణానికై కృషిచేశారు వివిధ స్థాయిలలో రైతుసంఘాలు ఏర్పరచటం, పాత సంఘాలను పునరుద్ధరించడం పనిచేయకుండా ఉన్న తాలూకా, జిల్లాసంఘాలను పని చేయించడం లక్ష్యంగా చేపట్టారు. అంతకు ముందు లేనిచోట్ల తాలూకా జిల్లా సంఘాలను ఏర్పరచారు. 1936 నుండి జిల్లా సంఘాలు క్రమబద్ధంగా సమావేశమవుతూ రైతు కోర్కెలపై ప్రచార ఆందోళన కార్యక్రమాలు చేపట్టాయి. రైతులలో రాజకీయ చైతన్యాన్ని పెంచి వారిని పోరాటోన్ముఖులను చేశాయి.

1935 లో గుంటూరు, కృష్ణా, పశ్చిమగోదావరి, తూర్పుగోదావరి జిల్లాలకు పరిమితమైఉన్న రైతుసంఘ నిర్మాణం 1939 చివరినాటికి విశాఖ, చిత్తూరు, నెల్లూరు జిల్లాలకు విస్తరించింది. ఆనాటికి అనంతపురం, కడప, కర్నూలు జిల్లాలలో రైతుసంఘ నిర్మాణం శైశవ దశలోఉంది.

1936లో ఆంధ్ర రాష్ట్ర రైతుసంఘం రిజిష్టరైన తరువాత క్రమం తప్పకుండా ప్రతి సంవత్సరం మహాసభలు జరుపుకుంటూ వచ్చింది. 1936లో 3వ ఆంధ్రరాష్ట్ర రైతు మహాసభ నిడుబ్రోలులో జరిగింది. ఈ మహాసభలో ఎన్ జి.

రంగా అధ్యక్షులుగాను, కొమ్మారెడ్డి సత్యనారాయణ ప్రధాన కార్యదర్శిగాను ఎన్నికైనారు.

6వ ఆంధ్రరాష్ట్ర రైతు మహాసభ 1937లో నిడుబ్రోలు లోనే జరిగింది. ఈ మహాసభలో కొమ్మారెడ్డి సత్యనారాయణ అధ్యక్షులుగానూ, చలసాని వాసుదేవ రావు ప్రధాన కార్యదర్శిగాను ఎన్నికైనారు. వీరి నేతృత్వంలో రైతాంగఉద్యమం అంచలంచలుగా అభివృద్ధిచెంది, పటిష్టమైన నిర్మాణం ఏర్పడింది. 1938 లో ఏడవ ఆంధ్రరాష్ట్ర మహాసభ జరిగేనాటికి 56,000 మంది రైతులు సంఘసభ్యులుగా చేరారు. 1938 సెప్టెంబరు 3, 4 తేదీలలో కృష్ణా జిల్లా వీరపల్లి గ్రామంలో ఏడవ ఆంధ్ర రాష్ట్ర రైతు మహాసభ జరిగింది. ఈ మహాసభలో ఆమోదించిన తీర్మానాలను పరిశీలిస్తే రైతులలో రాజకీయ చైతన్యం పెంపొందించటానికి రైతాంగ సమస్యలు పరిష్కరించటానికి రైతు సంఘం చేసిన కృషి మనకు అర్థమవుతుంది.

కాంగ్రెసు రైతు సంఘాలు అనే అంశంపై ఒక తీర్మానం ఆమోదించింది. ఈ తీర్మానంలో కాంగ్రెసు సంస్థను జాతీయ ఐక్య సంఘటన యొక్క పునాదిగా భావించి కాంగ్రెసుద్వారా ఏర్పడిన జాతీయ ఐక్యతను బలపరచి జాతీయ పోరాటమును ముందుకు తీసుకొని పోవుటకును కాంగ్రెసుచే అంగీకరింపబడిన కార్యక్రమమును కాంగ్రెసు ఆచరణలో పెట్టునట్లు చేయుటకును రైతుసంఘం కృషి చేయవలెను. కాంగ్రెసు ఎక్కువగా ప్రజాసామాన్య ప్రతినిధి అగుటకును దైనందిన పోరాటములలో పాల్గొనునట్లు చేయుటకును, రైతుసంఘ సభ్యులు కాంగ్రెసులో చేరవలయును. కాంగ్రెసు సంఘములకు, రైతుసంఘములకు మధ్య పరస్పర సహకార సామరస్యములు పెంపొందించేటట్లు రైతులు పనిచేయాలని ఈ మహాసభ తీర్మానించింది.

రైతు సంఘాలు - వ్యవసాయ కూలీలు అనే అంశంపై మరొక తీర్మానం ఆమోదించారు. రైతులు వ్యవసాయ కూలీల మధ్య స్నేహపూర్వక సహకార భావం పెంపొందించేందుకు ఈ తీర్మానంలో కొన్ని సూచనలు చేశారు

రైతాంగ సమస్యలపై పోరాటలు నిర్వహించవలసిన ఆవశ్యకతను తెలియచేస్తూ మరొక తీర్మానం చేశారు. రైతు ఉద్యమాన్ని ధ్వంసం చేయుటకు బ్రిటిషు ప్రభుత్వం, జమీందారులు, షావుకారులు తీవ్రంగా ప్రయత్నించుచున్నందున స్థానిక రైతు పోరాటాలను బలపరచుటకు వారి వారి సమస్యలపై రైతులను సమావేశపరచుట, ఆందోళన సాగించుట ప్రభుత్వానికి, స్థానిక అధికారులకు తెలియచేయుట, అవసరమైనచో ప్రత్యక్ష పోరాటాన్ని సాగించుట - ఈ

విధులు ప్రతి రైతు సేవకుడును కాంగ్రెసు కమిటీల సహాయంతో నెరవేర్చవలెనని ఈ తీర్మానంలో పేర్కొన్నారు.

సామ్రాజ్యవాద యుద్ధాలలో రైతులు పాల్గొనరాదని, ఫెడరేషన్ రాకుండా చేయుటకు అవసరమైన ప్రత్యక్ష పోరాటానికి సిద్ధపడవలసిందని, కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగించాలని, ఈ మహాసభ ప్రత్యేక తీర్మానం చేసింది. రైతు ఉద్యమాన్ని నేరముల శీర్షికలో మద్రాసు ప్రభుత్వం చేర్చటాన్ని, జమీందారీ ప్రాంతాలలో రైతులపై సాగుతున్న దౌర్జన్యాన్ని ఈ మహాసభ ఖండించింది. ఋణ పరిష్కార చట్టం రైతులకనుకూలంగా మార్చాలని, జమీందారీ పద్ధతి రద్దు చేయాలని ఈ మహాసభ ప్రత్యేక తీర్మానాలు చేసింది.

ఈ మహాసభలో ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘ అధ్యక్షునిగా కొమ్మారెడ్డి సత్యనారాయణ, ప్రధాన కార్యదర్శిగా చలసాని వాసుదేవరావు ఎన్నికైనారు.

ఎనిమిదవ రాష్ట్ర రైతు మహాసభ 1939 లో నిర్వహించబడింది. విజయవాడలో జరిగిన ఈ మహాసభలో కొమ్మారెడ్డి సత్యనారాయణ మూర్తి అధ్యక్షునిగాను, చలసాని వాసుదేవరావు కార్యదర్శిగాను ఎన్నికయినారు. అనారోగ్య కారణాలవల్ల చలసాని వాసుదేవరావు కార్యదర్శి బాధ్యతలను నిర్వహించలేని పరిస్థితులలో 1939 అక్టోబరు నుండి డి.యన్. వల్లభరావు రాష్ట్ర రైతు సంఘ ప్రధాన కార్యదర్శిగా వ్యవహరించారు.

1939 సెప్టెంబరులో రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమవడంతోనే ప్రజా ఉద్యమాలలో బ్రిటిషు సామ్రాజ్యవాద ప్రభుత్వం తీవ్ర నిర్బంధ విధానంతో విరుచుకుపడింది. అభివృద్ధి చెందుతున్న రైతు సంఘ నిర్మాణానికి అవరోధం ఏర్పడింది.

## సామ్రాజ్య వాద యుద్ధ కాలంలో

భారతీయుల అనుమతి లేకుండానే రెండవ ప్రపంచ యుద్ధంలోకి భారత దేశం ఈడ్వబడింది. ప్రపంచ యుద్ధాన్ని అడ్డు పెట్టుకుని బ్రిటిషు సామ్రాజ్య వాద ప్రభుత్వం ప్రజా ఉద్యమాలన్నింటిని అణచివేయాలని చూసింది. రైతు సంఘ నాయకులు కార్యకర్తలపైన క్రూర నిర్బంధ విధానాన్ని అమలు పరిచింది.

వామపక్ష భావాలతో రైతు ఉద్యమాలను నిర్వహిస్తున్న వారందరి పైన ప్రభుత్వం అరెస్టు వారంటులు జారీ చేసింది. ఉచ్చస్థాయిలో కొనసాగుతున్న రైతాంగ ఉద్యమాన్ని విచ్ఛినం చేయడానికి తీవ్ర దమన కాండకు పూనుకుంది. 1940 ఏప్రియల్‌లో జరిగిన మందసా కాల్పులు ప్రభుత్వ విధానానికి ప్రత్యక్ష సాక్ష్యం. ప్రచార దశను దాటి పోరాట దశకు చేరుకుంటున్న రైతాంగ

ఉద్యమాన్ని రక్షించుకోవటానికి రైతు సంఘ కార్యకర్తలు ఎన్నో కష్ట నష్టాలకు గురి కావాల్సి వచ్చింది.

ప్రముఖ రైతు సంఘ నాయకులుగా ఉన్న అనేక మంది డిటెయిన్ చేయబడ్డారు. భూపతిరాజు లక్ష్మీనరసరాజు, చింతం సత్యనారాయణదాసు, సంపూరి ప్రసాదరావు, బస్వారెడ్డి శంకరయ్య, తదితరులంతా జైళ్ళలో నిర్బంధించబడ్డారు నిర్బంధాన్ని తప్పించుకుని రైతు ఉద్యమాన్ని రక్షించుకోటానికి చలసాని వాసుదేవరావు మొదలగు నాయకులంతా రహస్య జీవితాన్ని ప్రారంభించారు. నిర్బంధ విధానము నుండి రైతు సంఘ నిర్మాణాన్ని కాపాడుకుంటూ ఉద్యమాన్ని పెంపొందించే కర్తవ్యాన్ని కమూనిస్టులు చాకచక్యంతో నిర్వహించారు.

యుద్ధ ప్రారంభమవడంతోనే ప్రభుత్వ దోపిడీ విధానాలు మరింత పెచ్చు పెరిగాయి. యుద్ధబాండ్లు సేకరణ పేరుతో లక్షలాది రూపాయలు రైతాంగం నుండి వసూలు చేయడానికి నిర్బంధ లెవీ పేరుతో రైతుల నుండి ధాన్యాన్ని బలవంతంగా తీసుకోవటానికి ప్రభుత్వం పూనుకొన్నది. ప్రభుత్వం చేపట్టిన ఈ రెండు కార్యక్రమాలు గ్రామీణ పేద రైతాంగాన్ని ఇబ్బందుల పాలు చేశాయి. నిర్బంధ విధానం ఎంత తీవ్రంగా ఉన్నప్పటికి రైతు సంఘ కార్యక్రమాలను నిర్వహించడంలో కమ్యూనిస్టు యువకులు అగ్ర భాగాన నిలిచారు. యుద్ధబాండ్లకు వ్యతిరేకంగా రైతాంగాన్ని సమీకరించి ప్రదర్శనలు నిర్వహించారు. నిర్బంధ లెవీ వసూలు నుండి పేద రైతాంగాన్ని మినహాయించాలనే ప్రధాన కోర్కెపై అనేక గ్రామాల్లోని రైతాంగాన్ని సంఘటితపరచి ఉద్యమాన్ని కొనసాగించ గలిగారు. రహస్య జీవితం గడుపుతూనే ముఖ్య నాయకులంతా రైతాంగ ఉద్యమాన్ని అభివృద్ధి చేయటానికి కృషి చేశారు. ఆకలి యాత్రల పేరుతో రైతాంగాన్ని వ్యవసాయ కూలీల్ని సమీకరించి రాష్ట్రంలోని రైతాంగ, కూలీల సమస్యలపై ఉద్యమాన్ని నిర్వహించారు. ప్రభుత్వ అధికారులు యుద్ధ బాండ్లు సేకరణ కోసం పల్లెలకువెళ్ళే ముందుగానే, వాటిని ఇవ్వవలసిన అవసరం లేదని తెలియజేస్తూ గ్రామాలలో విస్తృత ప్రచారం చేశారు. యుద్ధ వ్యతిరేక ప్రచారాన్ని మారు మూల గ్రామాలకు సైతం తీసుకువెళ్ళి "సైనిక రిక్రూట్‌మెంటు" జరుగకుండా రైతాంగాన్ని ఉత్తేజ పరిచారు. స్వతంత్ర భారత్ గ్రామీణ ప్రాంతాలకు సహితం చేర్చి ప్రజలకు చదివి వినిపించేవారు. చల్లపల్లి, మునగాల, కాళీపట్నం, ముక్త్యాల, వెంకటగిరి మొదలగు జమీందారీ ప్రాంతాలలో యుద్ధ వ్యతిరేక కార్యక్రమాలను రైతాంగ సమస్యలతో మిళితం చేసి ఉద్యమం పటిష్టవంతంగా కొనసాగేందుకు కృషి చేశారు. యుద్ధంవల్ల కలిగే నష్టాలను, నిర్బంధలెవీ, యుద్ధ బాండ్లు భారాన్ని విశదీకరిస్తూ గ్రామీణ ప్రాంతాలలో రహస్య బహిరంగ

సభలను నిర్వహించారు. 1940 జనవరి 26 న పాటించిన యుద్ధ వ్యతిరేక దినంలో గుడివాడ, చల్లపల్లి, ఏలూరు, తాడేపల్లిగూడెం, భీమవరం, మొదలగు ప్రాంతాలలో వేలాది మంది రైతులు సమీకరించబడ్డారు.

పలాసాలో (ప్రస్తుతం శ్రీకాకుళం జిల్లాలోనిది) జరిగిన అఖిల భారత రైతు మహాసభ విజయవంతం కావడానికి రహస్య జీవితం గడుపుతున్న కమ్యూనిస్టు కార్యకర్తలంతా కృషి చేశారు.

1940 మార్చి 27, 28 లలో జరిగిన ఈ పలాసా మహాసభకు జొన్నలగడ్డ రామలింగయ్యా హాజరై రైతులను ఉత్తేజపరిచే విధంగా ఉపన్యసించారు.

ఈ సభలో మాట్లాడినందుకే జొన్నలగడ్డ రామలింగయ్యను ప్రభుత్వం డిటెయిన్ చేసింది.

ప్రభుత్వ నిర్బంధ విధానం సాగుతున్న రైతాంగ సమస్యలపై ఆందోళనలు మాత్రం వెనుకంజ వేయలేదు. కౌలుదారీ రైతుల సమస్యలపై పశ్చిమ గోదావరి జిల్లా మెంటేపూడిలో పెద్ద ఉద్యమం సాగింది.

## మెంటేపూడి రైతాంగ పోరాటం :

భీమవరం తాలూకాలోని మెంటేపూడి గ్రామంలో 450 ఎకరాలలో కేవలం 35 ఎకరాలే రైతులది. మిగిలిన భూములన్నీ పొరుగూరు భూస్వాములవి. గ్రామంలోని రైతాంగమంతా భూస్వాముల పొలాన్ని కౌలుకు తీసుకుని సాగు చేసుకునేవారు. హెచ్చు కౌలు రేట్లతోను, నాముల పేరుతోనూ, అధిక వడ్డీలు, అప్పులతోను రైతాంగాన్ని భూస్వాములు పీడించేవారు. కౌలు రేట్లు విపరీతంగా పెంచుతూ, రైతులను తరచు మారుస్తూ విపరీతమైన బాధలకు గురి చేసేవారు. 1940 లో, పంటకొచ్చిన భూములను భూస్వాములు వేరొకరికి అమ్మ చూపారు. సంవత్సరం పొడుగునా తాము సాగు చేయడం వల్ల భూములలో పంటలు పండాయని, ఆ పంటలో తమ కౌలు వాటా తమకు చెందాలని రైతులు పట్టుబట్టారు. భూములను పంటతో సహా అమ్మజూస్తున్న భూస్వాములను రైతాంగం ప్రతిఘటించింది. జిల్లా రైతు సంఘం కౌలుదార్లకు అండగా నిలిచింది. యాళ్ళ బండి పోలిశెట్టి, కొల్లా వెంకటరత్నం, కొల్లా సూర్యారావు, బోడపాటి నాయుడు మొదలగు వారు రైతాంగానికి నాయకత్వం వహించి భూస్వాములను ఎదుర్కొన్నారు. కోర్టు దావాలతో పోలీసు కేసులతో రైతాంగాన్ని అణచాలని భూస్వాములు ప్రయత్నించారు. మొత్తం 70 మంది రైతులను నిర్బంధించారు. రైతులు మాత్రం తమ ప్రతిఘటనను మానుకోలేదు. భూస్వాములు కోర్టుతో రిసీవర్‌ను వేయించినా తమ వాటా పంటను రైతులు కోసుకు తెచ్చుకున్నారు.

# రంగా విచ్ఛిన్నకర చర్యలు-ఐక్య రైతాంగ ఉద్యమంలో చీలిక

యుద్ధ తీవ్రతలో రైతు సంఘ నిర్మాణం దెబ్బ తినకుండా ఉద్యమం కొనసాగే విధంగా కమ్యూనిస్టులు ప్రయత్నం చేశారు 1942 నాటికి రైతు రంగంలో పని చేస్తున్న కమ్యూనిస్టు కార్యకర్తలలో అత్యధిక భాగం ప్రభుత్వ నిర్బంధానికి గురి అయ్యారు. రైతాంగ ఉద్యమంలో ఉన్న అతివాదులను కాంగ్రెసు సంఘం అప్పటికే వెలివేసినట్లు చూడడం ప్రారంభించింది. రైతులను సంఘటితం చేసి నిర్మాణయుతమైన పోరాట శక్తి రూపొందించడంలో కమ్యూనిస్టులకు అండగా నిలుస్తూ వచ్చిన కొమ్మారెడ్డి సత్యనారాయణ 1940 ఏప్రియల్‌లో మరణించారు. ఆంధ్ర రాష్ట్ర రైతాంగ ఉద్యమ అగ్రనాయకులలో ఒకరుగా ఉంటూ వచ్చిన కొమ్మారెడ్డి సత్యనారాయణ అకాల మరణంతో, రైతు ఉద్యమానికి తీవ్ర నష్టం వాటిల్లింది. అతివాద భావాలతో పనిచేస్తున్న పుల్లెల శ్యాంసుందర్రావు కూడా 1940 మధ్య కాలంలో మరణించారు.

కమ్యూనిస్టులు జైళ్ళలో ఉండటం, రైతాంగ ఉద్యమ నాయకత్వంలో లోటు ఏర్పడటం వీటన్నిటిని ఆచార్య ఎన్.జి రంగాగారు చక్కటి అవకాశంగా ఎంచుకున్నారు. రాష్ట్ర రైతు సంఘ నాయకత్వాన్ని పూర్తిగా తన అనుయాయులతో నింపివేసాడు. అవకాశ వాద రాజకీయాన్ని లక్ష్యంగా పెట్టుకున్న ఎన్. జి రంగా గ్రూపు రైతు సంఘ విచ్ఛిన్నతకు పూనుకున్నది. 1941-42 కాలంలో ఏర్పడిన రాజకీయ పరిస్థితులను అదనుగా తీసుకుని రైతు సంఘ ఐక్యతను భగ్నం చేయటానికి పూనుకున్నారు. జిల్లా సంఘాలలో పనిచేస్తున్న కమ్యూనిస్టులను పూర్తిగా తరిమి వేయటానికి ప్రయత్నాలు చేసారు. ప్రభుత్వ నిర్బంధం నుండి రక్షించుకుంటూ, రైతు ఉద్యమాన్ని అభివృద్ధిచేస్తూ వచ్చిన నిజాయితీగల రైతు సంఘ కార్యకర్తలను తప్పించడానికి కృషి చేశారు.

గుంటూరు జిల్లా రైతు సంఘం కమ్యూనిస్టుల నాయకత్వంలో అభ్యుదయ రైతాంగాన్ని కలుపుకొని పనిచేస్తూ వుంది. కొల్లా వెంకయ్య, చదలవాడ పిచ్చయ్య అధ్యక్ష, కార్యదర్శులుగా నిర్బంధ కాలంలో కూడా రైతాంగ సమస్యలపై ఆందోళనలు గావిస్తూ 9000 మంది సభ్యులను కలిగి ఉంది. రైతు కూలీ ఐక్యతను సాధించి ఉద్యమం ప్రవర్ధమానమవుతూ వుంది. కూలీలకు కనీస కూలీ అర్ధ రూపాయి ఇవ్వాలని రైతులందరిలోనూ ప్రచారం చేసి అమలు జరిగేట్లు చూసింది. ధనిక రైతాంగ పక్షం వహించే రంగా గ్రూపుకు ఇది మింగుడు పడలేదు. రైతు సంఘానికి ఈ విషయంలో ఎటువంటి సంబంధం లేదని

దుష్ప్రచారం ప్రారంభించారు. కమ్యూనిస్టు నాయకత్వంలో ఉన్నా జిల్లా రైతు సంఘం ఈ దుష్ప్రచారాన్ని తీవ్రంగా ఖండించింది.

ఐక్యంగా సాగుతున్న రైతాంగ ఉద్యమంలో చిచ్చు రగిల్చి విచ్ఛిన్నం చేయటానికి రంగా గ్రూపు నిశ్చయించింది 1941 జూలై 6 న నిడుబ్రోలులో జిల్లా కార్యవర్గ ఎన్నికలను హడావుడిగా నిర్వహించింది. లావు అంకమ్మ, బాచిన సుబ్బారావులను అధ్యక్ష, కార్యదర్శులుగా ఎన్నుకొన్నట్లు ప్రకటించింది. వక్రబుద్ధితో ఐక్య ఉద్యమాన్ని చీల్చటానికి రంగా గ్రూపు నిర్వహిస్తున్న విచ్ఛిన్నకర చర్యలను కమ్యూనిస్టులు ప్రతిఘటించారు. వేలూరు (చిలుకలూరి పేట తాలూకా)లో జిల్లా మహాసభ జరగవలసి ఉండగా ఈవిధంగా మధ్యంతరంగా ఎన్నికలు నిర్వహించడం, రైతు ఉద్యమానికి హానికల్గించడమేనని కమ్యూనిస్టులు అభిప్రాయపడ్డారు. రంగా గ్రూపు విచ్ఛిన్నకర చర్యలు గురించి అఖిల భారత రైతు సంఘానికి ఫిర్యాదు చేసారు. గుంటూరు జిల్లా రైతు సంఘంలో ఏర్పడిన వివాదంపై పూర్తిగా విచారిస్తామని అంతవరకు పాత జిల్లా సంఘమే కొనసాగాలని అఖిల భారత రైతు సంఘం నిర్ణయించింది. రాష్ట్ర రైతు సంఘ నాయకత్వంలో ఉన్న రంగా ముఠా జిల్లా రైతు సంఘంలో ఉన్న విచ్ఛిన్నకారులు తమ వైఖరిని విడనాడలేదు. ఈ పరిస్థితులలో కొల్లా వెంకయ్య, చదలవాడ పిచ్చయ్య తదితర రైతు సంఘ నాయకులు, ఉద్యమ రక్షణకై పూనుకున్నారు. అభ్యుదయకర పంథాలో రైతాంగాన్ని నడిపించి, సంఘ నిర్మాణాన్ని కాపాడారు. రంగా ముఠా విచ్ఛిన్న చర్యలు ఫలితంగా ఐక్య రైతాంగ ఉద్యమానికి గండిపడింది. దీని దుష్ప్రభావం జిల్లాలోని రైతాంగంపై ఎక్కువ కాలం పని చేయలేదు. సంఘ నిర్మాణానికి, ఉద్యమాభివృద్ధికి కమ్యూనిస్టులు ఇతర అభ్యుదయకర శక్తులుచేస్తున్న కృషిలో సామాన్య రైతాంగమంతా పాలుపంచుకున్నారు. ఆందోళనా పోరాట కార్యక్రమాలతో రైతాంగాన్ని సమీకరిస్తూ పటిష్టవంతమైన రైతు సంఘ నిర్మాణానికి కమ్యూనిస్టులు కృషి చేశారు.

రంగా గ్రూపు విచ్ఛిన్నకర చర్యలు ఒక్క గుంటూరు జిల్లాకే పరిమితం కాలేదు. కమ్యూనిస్టులు నాయకత్వంలో ఉన్న ప్రతి జిల్లా రైతు సంఘాన్ని చీల్చ డానికి, రద్దు చేయడానికి పూనుకున్నారు. జిల్లా సంఘాలకు సభ్యత్వ పుస్తకాలు అందివ్వకపోవడం, చేర్పించిన సభ్యత్వాన్ని అంగీకరించకపోవడం మొదలగు విచ్ఛిన్నకర పద్ధతులను అవలంభించసాగారు. పసల కృష్ణమూర్తి, యాళ్ళబండి రంగనాయకులు అధ్యక్ష, కార్యదర్శులుగా ఉన్న పశ్చిమ గోదావరిజిల్లా రైతు సంఘాన్ని 1942 జూన్‌లో రద్దుచేసారు. జిల్లా రైతు సంఘం పని చేయడం లేదని అందువల్ల నూతన ఆర్గనైజింగు కమిటీని ఏర్పరుస్తున్నామని 1942 జూన్ 25న

ప్రకటించారు. జిల్లా రైతాంగ ఉద్యమంతో ఎటువంటి సంబంధం లేని సామవేదం సత్యనారాయణ, ఆత్మూరి అమ్మి రాజులను జిల్లా ఆర్గనైజింగు కమిటీ అధ్యక్ష, కార్యదర్శులుగా నియమించారు. నిర్బంధ కాలంలో కూడా మెంచేపూడి రైతాంగ పోరాటాన్ని నిర్వహించిన జిల్లా రైతు సంఘాన్ని పని చేయలేదనడం దాని స్థానంలో రైతులకు సంబంధం లేనివారితో ఆర్గనైజింగు కమిటీ ఏర్పర్చడం, ఆచార్య రంగా గ్రూపు విచ్ఛిన్నకర చర్యలకు ఒక చక్కటి నిదర్శనం.

రంగా గ్రూపు అనుసరిస్తున్న విధానాలు రైతాంగ ఉద్యమాన్ని తీవ్రంగా నష్టపరిచే దశకు చేరుకున్నాయి. రాజకీయ భేదాలను అడ్డు పెట్టుకుని ఐక్య ఉద్యమ విచ్ఛిన్నానికి పూనుకున్నారు రైతు ఉద్యమంలో పనిచేస్తున్న అభ్యుదయ వాదులకు, కమ్యూనిస్టులకు ఈ విచ్ఛిన్నకర చర్యలను ప్రతిఘటించక తప్పలేదు.

గుంటూరు జిల్లా రైతు సంఘ చీలికపై ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘ సభ్యుడుగా ఉన్న కనగాల కుటుంబరావు రంగా గ్రూపు నిర్వహిస్తున్న చర్యలను నిశితంగా విమర్శించారు. 1941 జూన్ 11 సంచికలో "గుంటూరు జిల్లా రైతు సంఘ రాజకీయాలు - బాధ్యత గల పెద్దలు వింత వైఖరి" అనే శీర్షికతో వ్రాసిన వ్యాసంలో రంగా గ్రూపు చేస్తున్న చర్యలను తూర్పార బట్టారు.

అందులోని కొన్ని భాగాలు "గుంటూరు జిల్లా రైతు సంఘం పై వాహిని (రంగా గ్రూపు వారి పత్రిక) కత్తి కట్టింది. రైతు సంఘ బాధ్యులైన అధ్యక్ష, కార్యదర్శులను దుమ్మెత్తి పోసింది, పోస్తోంది. అసలు జిల్లా రైతు సంఘంలో పని చేస్తున్న రంగా గ్రూపు వారికి ఇతర రైతు వర్కర్లకు కార్యక్రమంలో ఉన్న భేదాభిప్రాయాలే, జిల్లా రైతు ఉద్యమంలోనూ, రాష్ట్ర రైతు ఉద్యమంలోను చీలికలకు కారణం. ముఖ్యమైన కార్య విధానపు పోరాటాన్ని వదలి లేని పోని నిందల్ని మోపుతూ, రాష్ట్ర సంఘం చేతిలో ఉంది కదా అని ఎన్నికల్లో రేయిం బగళ్ళు పనిచేస్తున్న వర్కర్లపై దాడికి వెడలారు. (రంగా గ్రూపు వారు) ఈ దాడి అతి నీచంగా సాగుతోంది."

"రాష్ట్ర పెత్తనం చేతికి చిక్కింది కదా యని జిల్లాల వారీగా యువక వర్కర్లపై వ్యతిరేక ప్రచారం ప్రారంభించారు. ఈ యువకులు కమ్యూనిస్టులనీ, విప్లవకారులని, వ్యవసాయ కూలీలకు ఎక్కువ కూలి ఇమ్మంటున్నారని, కూలీల రాజ్యం కోసం పాటుపడతారని, కూలీల రాజ్యం రైతుల అభివృద్ధికి వ్యతిరేకమని ప్రచారం చేస్తున్నారు." (రంగా గ్రూపు వారు)

ఉద్యమ శ్రేయస్సు కోరే రైతు కార్యకర్తలంతా రంగా గ్రూపు విధానాలను ఎదిరించసాగారు. కృష్ణా, నెల్లూరు, కర్నూలు జిల్లా రైతు సంఘాలు ఐక్య రైతాంగ ఉద్యమానికే పట్టుబట్టాయి. రంగా అనుయాయులు సాగిస్తున్న కార్య

క్రమాలను గట్టిగా ప్రతిఘటించారు. అఖిల భారత రైతు సంఘానికి రంగా మురా సాగిస్తున్న విచ్ఛిన్న కార్యక్రమాలను గురించి నివేదించారు.

రాజకీయ భేదాల ముసుగులో రంగా అనుయాయులు చేస్తున్న అవకాశవాద ప్రచారం రైతాంగాన్ని మోసపుచ్చలేక పోయిది. రైతు సంఘ కార్యకర్తలు జిల్లా సంఘాలు రంగాముఠా విధానాలను ప్రతిఘటించారు. ప్రతిఘటన తీవ్రమైన కొలదీ రంగా గ్రూపు అధికార వ్యామోహం, అవకాశవాద తత్వం బట్టబయలు కాసాగింది. రాష్ట్ర రైతు సంఘం కూడా తమ చేతుల్లోంచి జారిపోగలరనే భయం వారికి పట్టుకుంది. ఈ భయంతోనే రాష్ట్ర రైతు సంఘాన్ని రద్దుచేసి అఖిలభారత రైతు సంఘం నుండి విడపోయినట్లు ప్రకటించారు. 1942 నవంబరు 7, 8 తేదీలలో గోగినేని లక్ష్మీనారాయణ (రంగా సోదరుడు) అధ్యక్షతన సమావేశమై రాజకీయ భేదాభిప్రాయాలవల్ల అఖిలభారత రైతు సంఘం నుండి విడిపోయినట్లు తీర్మానించారు.

"రాష్ట్ర వర్కింగ్ కమిటీ ప్రస్తుత అసాధారణ జాతీయ సంక్షోభం వల్లను ఎట్టి పౌరసత్వ హక్కులు లేకపోవడం వల్లనూ కిసాన్ సభ కానిస్టిట్యూషన్ అంతటినీ రద్దుచేయాలనే నిర్ణయానికి వచ్చింది. నెల్లూరు వెంకట్రామ నాయుడు గారిని రాష్ట్ర ఏజెంటుగా నియమించింది. అవసరమైనచోట జిల్లా ఏజంటు, తన తరువాత రాష్ట్ర ఏజంటును నియమించడానికి వారికి అధికారమివ్వబడింది"

తీవ్ర యుద్ధ పరిస్థితులలో రైతాంగమంతా సమస్యల వలయంలో చిక్కుకుని కొట్టుమిట్టాడుతోంది. ప్రభుత్వ నిర్బంధం కొనసాగుతూనే ఉంది. రాయల సీమ ప్రాంతంలో కరువు వ్యాపించింది. కిరసనాయిలు మొదలుకొని అగ్గిపెట్టవరకు నిత్య జీవితావసర వస్తువులేవి కూడా రైతాంగానికి అందుబాటులో లేకుండా పోయినాయి. ఇటువంటి పరిస్థితులలో రైతుల కష్టాల నివారణకు సంఘ నిర్మాణం అత్యవసరం ఇందుకు భిన్నంగా రాష్ట్ర రైతు సంఘాన్ని రద్దుచేసిన రంగా ముఠా చర్యలను రైతాంగం సహించలేకపోయింది. ఈ చర్యపై ఆంధ్ర రాష్ట్రం నలుమూలల నుండి తీవ్ర వ్యతిరేకత బయలుదేరింది. రంగా గ్రూపు చేపట్టిన చర్య ఆత్మహత్యాకరమైందని ఇది అస్త్ర సన్యాసం తప్ప ఆయుధ ధారణ కాదని కమ్యూనిస్టు పార్టీ నిశితంగా విమర్శించింది. 1942 నవంబరు 18 ప్రజాశక్తి పత్రికలో 'అస్త్ర సన్యాసం' అన్న సంపాదకీయంలో రంగా అనుయాయుల చర్యలను నిర్ద్వంద్వంగా ఖండించింది. రైతు సంఘ నిర్మాణానికి, ఉద్యమాభివృద్ధికి కృషి చేయవలసిందిగా రైతాంగానికి విజ్ఞప్తి చేసింది. ఆ సంపాదకీయంలో "ఆంధ్ర దేశంలో రైతు ఉద్యమాభిలాషులకు మా మనవి ఏమంటే, ఆంధ్ర రైతు ఉద్యమాన్ని ఈ విధ్వంసక ప్రయత్నాలనుంచి కాపాడండి. అనేకమంది

త్యాగ ఫలితంగా నిర్మింపబడి, అఖిలభారత కిసాన్ సభకు ఒక శాఖగా ప్రకాశించిన రైతు ఉద్యమాన్ని, దాని జెండాను ఎప్పటివలె దేదీప్యమానంగా కొనసాగించుటకు ప్రతినబూనండి రైతు ఉద్యమాలను చీల్చడం, ఈ క్లిష్టసమయంలో రైతు సంఘాన్ని రద్దుచేయడం, రైతాంగ శ్రేయస్సుకు భంగకరమని ఎలుగెత్తి చాటండి" అని రైతాంగానికి పిలుపునిచ్చింది.

ఆంధ్ర రాష్ట్ర రైతాంగ ఉద్యమానికి వెన్నుపోటు పొడిచి, కష్టించి పనిచేయవలసిన సమయంలో ఉద్యమాన్ని నిర్వీర్యం గావించేందుకు రంగా గ్రూపు చేపట్టిన వినాశకర కార్యక్రమాన్ని, కమ్యూనిస్టు కార్యకర్తలంతా ప్రతిఘటించారు. కడు దీక్షతో సంఘ నిర్మాణానికి పూనుకున్నారు. అహర్నిశలు కృషి చేస్తూ రైతు సంఘాల పునర్నిర్మాణానికి, ఉద్యమ వ్యాప్తికి తోడ్పడ్డారు. అఖిల భారత రైతు సంఘం ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘానికి పలు సంవత్సరాలు కార్యదర్శిగా పనిచేసిన చలసాని వాసుదేవరావును రాష్ట్ర ఆర్గనైజరుగా నియమించి సంఘ బాధ్యతలు నెరవేర్చమని ఆదేశించింది. వాసుదేవరావు రాష్ట్ర సంఘ ఆర్గనైజరుగా యావత్ రైతాంగాన్ని సమీకరించి తక్షణ సమస్యలపై ఆందోళన కార్యక్రమాన్ని రూపొందించారు. వివిధ జిల్లాలలో అధ్యక్ష కార్యదర్శులుగా ఉన్నవారు ఆర్గనైజరు బాధ్యతలు స్వీకరించి రైతు సంఘ పునర్నిర్మాణానికి పూనుకున్నారు. అఖిల భారత రైతు సంఘ కార్యక్రమాన్ని అమలు పరుస్తూ, రైతాంగ సమస్యల పరిష్కారానికి సంఘటితమైన ఉద్యమ నిర్మాణానికి కమ్యూనిస్టు కార్యకర్తలు పనిచేసారు. రైతుల శ్రేయస్సుకై నిజాయితీతో పోరాడే నిజమైన కార్యకర్తలెవ్వరో ఆంధ్ర రైతాంగం గుర్తించింది. సమైక్య రైతు ఉద్యమానికి కమ్యూనిస్టులు చేస్తున్న కృషికి ఆంధ్ర రైతాంగం అండంగా నిలిచింది. 1943 నాటికి ఆంధ్ర రాష్ట్రంలోని వివిధ జిల్లాలో రైతాంగం సంఘటితం చేయబడ్డది. 1943 లెనిన్ డే (జనవరి 23) నాటికి 1720 గ్రామాల్లో 1484 ప్రాథమిక రైతు సంఘాలు స్థాపించ బడ్డాయి. రాష్ట్రం మొత్తం మీద 65,559 మంది రైతులు ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘ సభ్యులుగా చేరారు. 1943 జనవరి 15 నాటికి వివిధ జిల్లాలో ఉన్న రైతు సంఘ సభ్యత్వం ఈ విధంగా ఉంది.

## రైతు ఉద్యమం

| జిల్లా | సభ్యత్వము |
|---|---|
| విశాఖ జిల్లా | 567 |
| తూర్పు గోదావరి జిల్లా | 3,000 |
| పశ్చిమ గోదావరి జిల్లా | 4,291 |

| | |
|---|---|
| కృష్ణా జిల్లా | 24,689 |
| గుంటూరు జిల్లా | 11,616 |
| నెల్లూరు జిల్లా | 5,481 |
| చిత్తూరు జిల్లా | 2,560 |
| కడప జిల్లా | 1,280 |
| కర్నూలు జిల్లా | 1,475 |
| అనంతపురం జిల్లా | 600 |
| మొత్తం | 55,559 |

సంఘ నిర్మాణంతో పాటుగా కార్యకర్తలు ఉద్యమ వ్యాప్తికి కూడా కష్టించి పని చేశారు. రైతాంగ సమస్యలపై ప్రచార ఆందోళనలను గావించిరి. ప్రజా యుద్ధ కాలంలో అరాచక చర్యలు దేశ స్వాతంత్ర్య మార్గం కాదని శత్రువుకు మాత్రమే ఉపకరిస్తాయని రైతులు గుర్తించేటట్లు చేయబడింది. సాముదాయక జరిమానాలు రద్దుకు విశేష కృషి చేశారు. కిరోసిన్, అగ్గిపెట్టెలు, పంచదార, బండి పట్టాలు మొదలగు వస్తువులు కంట్రోలు ధరలకు లభ్యమయ్యే టట్లు తీవ్ర కృషి సల్పారు. దొంగ మార్కెట్లు నిరోధించడంలో స్థానిక సంఘాలు అశేష ధైర్య సాహసాలు ప్రదర్శించాయి. రాయలసీమ ప్రజలను ఆకలి చావులకు గురి చేస్తున్న మహమ్మారి కరువును నిరోధించటానికి ఆంధ్ర రైతాంగ దృష్టిని, మళ్ళించారు. వాలంటీర్లను పంపి కరువు శిబిరాలలో సామాన్య ప్రజానీకానికి ముఖ్యంగా కూలీలకు అన్యాయం జరుగకుండా చేశారు. కరువు నివారణ, అధికోత్పత్తులకై ఇరిగేషన్ ప్రాజెక్టులను చేపట్టాలని ఆందోళన చేశారు. అప్పాపురం, బుడమేరు మొదలగు ప్రాజెక్టులకై రైతాంగాన్ని కదిలించి ఉద్యమాల్ని ప్రారంభించారు. ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘం జమీందారీ చెర్వుల మరమ్మత్తుకై ఆందోళన చేసి ప్రభుత్వ శాసనం రూపొందించేటట్లు చేయగల్గింది. దేశంలో ఏర్పడిన విపత్కర పరిస్థితులను ఎదుర్కొని ఫాసిస్టు దుష్టశక్తులను ఎదిరించి పోరాడటానికి రైతాంగాన్ని సమీకరించింది. యుద్ధ కాలంలో ఆహార వస్తువుల ధరలు పెరగకుండా చేయడానికి కరువు నిరోధానికి బంజరు భూములు సాగును చేపట్టాలని ప్రభుత్వాన్ని ఒప్పించింది. జమీందారీ ప్రాంతంలోని బంజరు భూములను కూడా సాగుకు ఇవ్వాలని ఆందోళన గావించి విజయం సాధించింది.

రైతు కూలీ సామరస్యాన్ని సాధించి, ఐక్య ప్రజా ఉద్యమం కొనసాగేటట్టు చేయగల్గింది. ప్రభుత్వ అధికారుల లంచగొండితనాన్ని ఎదిరించటానికి ప్రజా సమీకరణ గావించింది. నిర్బంధంగా యుద్ధ బాండ్ల వసూలుకు వ్యతిరేకంగా రైతాంగాన్ని కూడగట్టింది.

రైతాంగ సమస్యలన్నిటి పైన ఆందోళనలు గావిస్తూ సంఘ నిర్మాణాన్ని అభివృద్ధిపరిచారు 1943 మార్చినాటికి 9 జిల్లాల రైతు సంఘాలని పూర్తిగా పునర్నిర్మించారు. ఎన్నికలు నిర్వహించి ప్రజాస్వామిక పద్ధతిలో నూతన జిల్లా రాష్ట్ర సంఘాలను ఏర్పరిచారు. ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ మూడవ మహాసభ జరిగే నాటికి రాష్ట్ర మొత్తం మీద 1700 ప్రాథమిక రైతు సంఘాలు పని చేస్తున్నాయి. 70,000 మంది రైతులు సంఘ సభ్యులుగా ఉన్నారు.[19]

## తూర్పు గోదావరి జిల్లా :

1943 మార్చి 10 వ తేదీన జిల్లా రైతు సంఘ సాధారణ సమావేశం జరిగింది. చొప్పెల్లలో జరిగిన ఈ సమావేశంలో నూతన జిల్లా కమిటీని ఎన్నుకున్నారు. ఈ జిల్లా కమిటీకీ చిట్టూరి వెంకట దుర్గా ప్రసాద్ అధ్యక్షులుగా, చింతం సత్యనారాయణ దాసు కార్యదర్శిగా, పెన్మెత్స సూర్యానారాయణ రాజు, దోనెపూడి ధర్మారావులు సంయుక్త కార్యదర్శులుగా ఎన్నుకోబడ్డారు. దామిశెట్టి పార్థసారధి, అప్పారావు, అల్లూరి సోమరాజు, రాకుర్తి రామమూర్తి, పాలచర్ల అమ్మన్న, తరిగొప్పుల వెంకట తమ్మయ్య పంతులు, నండూరి వెంకట సూర్య సాంబశివరావు, పిల్లాలోపరాజు జిల్లా రైతు సంఘ కార్యవర్గ సభ్యులుగా ఎన్నికయ్యారు

## పశ్చిమ గోదావరి జిల్లా:

నిడమర్రులో జరిగిన జిల్లా రైతు సాధారణ సమావేశంలో నూతన జిల్లా కమిటీని ఎన్నుకున్నారు. 1943 ఫిబ్రవరి 27న జరిగిన ఈ సమావేశంలో పేటేటి వెంకటరత్నం అధ్యక్షులుగా, కృత్తివెంటి వెంకటేశ్వరరావు కార్యదర్శిగా, నిడమర్తి అశ్వనీ కుమారదత్తు సహాయ కార్యదర్శిగా ఎన్నికయ్యారు. కె. రామకృష్ణారెడ్డి, సింహాద్రి అప్పారావు, నండిపల్లి సోమరాజు, కలిదిండి సూర్యనారాయణరాజు, జి. సాంబమూర్తి, పెనుమత్స వెంకట సోమరాజు జిల్లా రైతు సంఘ సభ్యులుగా ఎన్నికయ్యారు.

## కృష్ణా జిల్లా:

బెజవాడలో 1943 ఫిబ్రవరి 20న జరిగిన జిల్లా రైతు సంఘ సాధారణ సభ్యుల సమావేశంలో నూతన కమిటీ ఎన్నికైంది. ముక్కామల నాగభూషణం

అధ్యక్షుడుగాను, అనువర్లపూడి సీతారామారావు కార్యదర్శిగాను, రామినేని పిచ్చయ్య, కొల్లి సీతారామయ్యలు సహాయకార్యదర్శులుగా ఎన్నికయ్యారు.

జిల్లా కార్యవర్గానికి జాలాది రామకోటయ్య, వంగపాటి రంగారెడ్డి, కంఠంనేని గోపాలరావు, కంచర్ల వెంకట్రామయ్య, మహంకాళి పానకాలయ్య, పేట రామరావు, చలసాని రాజగోపాలరావు, పడమట కోటేశ్వరరావు, సూరపనేని వెంకటరత్నం, వాసిరెడ్డి రామరావు, కనకమేడల మాధవ రావులు ఎన్నికయ్యారు.

## గుంటూరు జిల్లా:

1943 ఫిబ్రవరి 20న తెనాలిలో జరిగిన జిల్లా రైతు సంఘ సాధారణ సభ్యుల సమావేశంలో నూతన జిల్లా కమిటీ ఎన్నికైంది. జిల్లా రైతు సంఘ అధ్యక్షులుగా కొల్లా వెంకయ్య, కార్యదర్శిగా కనగాల కుటుంబరావు, సహాయ కార్యదర్శులుగా అచ్చే సీతారామయ్య, నెలకుదిటి నాగేశ్వర్రావులు ఎన్నికయారు. జిల్లా కార్యవర్గ సభ్యులుగా యలపర్తి వెంకట్రాయుడు, పొన్నపల్లి లక్ష్మీ నారాయణ, వలివేటి నరసింహారావు, దూదేకుల ఖాసింసాహెబ్, వావిలాల గోపాల కష్ణయ్య, కిరణం రంగారావు, మెట్ల వెంకట సుబ్బారావు, మోర్తం అమరారెడ్డి, టి. కోటేశ్వరరావులు ఎన్నికయ్యారు.

## నెల్లూరు జిల్లా:

నెల్లూరులో 1943 ఫిబ్రవరి 20న జరిగిన జిల్లా రైతు సంఘ సాధారణ సభ్యుల సమావేశంలో నూతన జిల్లా కమిటీ ఏర్పాటైంది. కాకుటూరు సీతారామిరెడ్డి అధ్యక్షులుగానూ, బస్వారెడ్డి శంకరయ్య కార్యదర్శిగా, వకుళాభరణ అప్పలాచారి, బి శేషయ్య సంయుక్త కార్యదర్శులుగా ఎన్నికయ్యారు.

బీరం రామనాథం, కె. కాశప్ప, పి.సి. సుబ్బయ్య, యర్రం రెడ్డి రంగా రెడ్డి, టి. చంద్రశేఖర రెడ్డి, జొన్నా వెంకటశెట్టి, బి.వి. కృష్ణయ్య, పి.వి. సుబ్బారావులు జిల్లా కార్యవర్గానికి ఎన్నికయ్యారు.

## చిత్తూరుజిల్లా :

పుంగనూరులో 1943 ఫిబ్రవరి 16న జిల్లా రైతుసంఘ సభ్యులు సమావేశమై నూతన జిల్లాకమిటీని ఎన్నుకున్నారు. అధ్యక్షుడిగా ఆర్. నరసింహా రెడ్డి కార్యదర్శిగా ఆర్.యమ్. రత్నం, సహాయ కార్యదర్శిగా సి. శ్రీనివాసరావులు ఎన్నికయ్యారు. జిల్లా రైతుసంఘ కార్యవర్గ సభ్యులుగా ఇ. గోవిందప్పనాయుడు, పి. గోవిందరెడ్డి, కె. సుబ్బారావు, కె. పరుశురామయ్య, బి. వెంకటరమణ, యం. వాసుదేవరెడ్డిలు ఎన్నుకోబడ్డారు.

## కర్నూలు జిల్లా :

1943 ఫిబ్రవరి 14న కృష్ణంశెట్టి పల్లిలో జరిగిన జిల్లారైతు సంఘవర్కర్ల సమావేశంలో జిల్లా రైతుసంఘ ఆర్గనైజింగ్ కమిటీని ఏర్పరచారు. కార్యదర్శిగా వి. రామశాస్త్రి, కమిటీ సభ్యులుగా జయరామిరెడ్డి, ఎ. సుదర్శన వర్మ, బెల్లంకొండ వెంకటరంగయ్య, షేక్ మస్తాన్ సాహెబ్‌లతో కూడిన జిల్లా రైతు సంఘ ఆర్గనైజింగ్ కమిటీ ఏర్పడింది.

## అనంతపురం జిల్లా :

అనంతపురంలో 1943 ఫిబ్రవరి 14 న జరిగిన జిల్లా రైతుసంఘ సాధారణ సభ్యుల సమావేశంలో నూతన కమిటీని ఎన్నుకున్నారు. బి. ఎరుస్వామి అధ్యక్షులుగా, ఐదుకల్లు సదాశివన్ కార్యదర్శిగా ఎన్నికయ్యారు. జిల్లాకమిటీ సభ్యులుగా పి. లక్ష్మయ్య, యం.కె దాసప్ప, గొట్టిపాటి సుబ్బారాయుడు, వి. ఆది నారాయణ రెడ్డి, కొండూరి నారాయణ, యన్ గణేశ్ నాయక్‌లు ఎన్నికయ్యారు.

జిల్లా రైతుసంఘాల పునర్నిర్మాణం పూర్తిచేసి, రాష్ట్రరైతు సంఘ నిర్మాణాన్ని పటిష్టం చేయడానికి, కమ్యూనిస్టు కార్యకర్తలు కృషిచేసారు. నూతన పరిస్థితులలో రైతాంగ సమస్యలపై పోరాట కర్తవ్యాలను నిర్ణయించడానికి రైతాంగ ఉద్యమాన్ని మరింత శక్తివంతమైన ఉద్యమంగా తీర్చిదిద్దేందుకు ఆంధ్ర రాష్ట్ర రైతుసంఘ సమావేశాన్ని బెజవాడలో నిర్వహించారు. 1943 మార్చి 15 నుండి 19 వరకు జరిగిన ఈ సమావేశానికి రాష్ట్ర సంఘంలోని 108 మంది సభ్యులలో 79 మంది హాజరయ్యారు. కడప జిల్లా మినహా మిగిలిన అన్ని జిల్లాల నుండి ప్రతినిధులు హాజరయ్యారు.

ఈ సమావేశంలో రానున్న కాలంలో రైతు సంఘాలు నిర్వహించవలసిన బాధ్యతల్ని కార్యక్రమాన్ని నిర్ణయించారు.

రైతు సంఘ సభ్యులకు రాష్ట్ర రైతు సంఘ సమావేశం నిర్దేశించిన బాధ్యతలు :

* గాంధీజీ విడుదలకు ఆంధ్ర రైతాంగాన్ని ఐక్యం చేయాలి.
* ఆహార సమస్య పరిష్కారానికి అన్ని పార్టీలను ప్రజలను ఐక్యపరిచి, గ్రామ గ్రామాన్ని రైతులు, కూలీలు, చిన్న దుకాణదార్లతో కూడిన ఆహార కమిటీలు, వాలంటీరు దళాలు ఏర్పరచాలి.
* ఆహార కొరతను నిర్మూలించటానికి అధికాహారోత్పత్తి విధానాన్ని అమలుపరచాలి.

* దేశాన్ని ఫాసిస్టుల బారి పడకుండా కాపాడటానికి రైతు కూలీ సామరస్యాన్ని ఏర్పరచాలి.
* రైతు ఉద్యమంలో ప్రస్తుతమున్న చీలికలను పోగొట్టి, రైతు శ్రేయాభిలాషులందరిని రాష్ట్ర రైతు సంఘ జండా క్రిందకు తీసుకురావాలి
* రాయలసీమలో క్షామ నివారణకై కృషి చేయాలి.
* రైతు ఉద్యమంలో ప్రస్తుతమున్న నిర్మాణ బలహీనతను పోగొట్ట డానికి స్కూళ్ళు పెట్టి రైతు వర్కర్లకు తర్ఫీదు ఇవ్వాలి.[20]

రంగా గ్రూపు విచ్ఛిన్నకర చర్యల మూలంగా రైతులలో ఏర్పడిన సందిగ్ధతను తొలగించడంలో ఈ రాష్ట్ర స్థాయి సమావేశం విజయం సాధించింది. ఈ సమావేశంలో రాష్ట్ర రైతాంగ ఉద్యమాన్ని నిర్వహించడానికి నూతన రాష్ట్ర కమిటీని ఎన్నుకున్నారు.

ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘ అధ్యక్షుడిగా కడియాల గోపాలరావు, కార్యదర్శిగా నండూరి ప్రసాదరావు, సంయుక్త కార్యదర్శులుగా రాటకొండ నరసింహారెడ్డి, ముక్కామల నాగభూషణం ఎన్నికయ్యారు.

రాష్ట్ర కమిటీ సభ్యులుగా జొన్నలగడ్డ రామలింగయ్య, చింతం సత్యనారాయణ దాసు, పేటేటి వెంకటరత్నం, అనుమర్లపూడి సీతారామారావు, కొల్లా వెంకయ్య, వావిలాల గోపాలకృష్ణయ్య, బస్వారెడ్డి శంకరయ్య, ఏటుకూరి బలరామమూర్తి, ఐదుకల్లు సదాశివన్, వి. రామశాస్త్రి, పి. వెంకట్రామప్ప ఎన్నికయ్యారు

ప్రజాయుద్ధ కాలంలో రైతాంగ సమస్యలు పరిష్కారానికి, జాతీయ పోరాటంలో రాష్ట్ర రైతాంగం ఒక బలమైన ప్రజాశక్తిగా రూపొందడానికి నూతన రాష్ట్ర కమిటీ కృషి చేయడం ప్రారంభించింది. రైతాంగ సమస్యలపై పోరాడే నిజమైన రైతు సంఘంగా ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘాన్ని తీర్చి దిద్దడంలో ఈ సమావేశం అతి కీలకమైన పాత్ర వహించింది . కమ్యూనిస్టు కార్యకర్తల కృషితో ఆంధ్ర రైతాంగం నూతన ఉత్సాహంతో, ఉత్తేజంతో ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘాన్ని బలమైన ప్రజా సంఘం రూపొందించేందుకు ముందుకు వచ్చారు.

## రైతు ఉద్యమం - ఆధారాలు


| | | | |
|---|---|---|---|
| 1. | నవశక్తి. | 15-12-37. | 10 వ పేజీ. |
| 2. | నవశక్తి. | 2-2-38. | 12 వ పేజీ. |
| 3. | నవశక్తి. | 19-1-38. | 7 వ పేజీ. |
| 4 | నవశక్తి. | 7-12-38. | 14 వ పేజీ. |

| | | | |
|---|---|---|---|
| 5. | నవశక్తి. | 11-1-39. | 6 వ పేజీ. |
| 6. | నవశక్తి. | 1-2-39. | 21 వ సంచిక. |
| 7. | నవశక్తి. | 22-3-39. | 18 వ పేజీ. |
| 8. | నవశక్తి. | 29-3-39. | 10 వ పేజీ. |
| 9. | నవశక్తి. | 5-4-39. | 5 వ పేజీ. |
| 10. | మునగాల పరగణా ప్రజా ఉద్యమ చరిత్ర. | | 24 వ పేజీ. |
| 11. | మునగాల పరగణా ప్రజా ఉద్యమ చరిత్ర. | | 25 వ పేజీ. |
| 12. | ఆంధ్రలో రైతు ఉద్యమం - నండూరి ప్రసాదరావు. | | |
| 13. | స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర. కృష్ణా జిల్లా మూడవ భాగం. | | 60, 61 వ పేజీలు. |
| 14. | నవశక్తి. | 19-5-39 | 14 వ పేజీ. |
| 15. | నవశక్తి. | 17-9-38. | 8 వ పేజీ. |
| 16. | నవశక్తి. | 28-6-39. | 5 వ పేజీ. |
| 17. | రాష్ట్ర కాంగ్రెసు కమిటీకి సుందరయ్యగారి సమాధానం నవశక్తి | 26-7-39. | 5 వ పేజీ. |
| 18. | నవశక్తి. | 26-7-39. | 5 వ పేజీ. |
| 19. | ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ 3వ మహాసభ నివేదిక | | 46 వ పేజీ. |
| 20. | ప్రజాశక్తి | 24-3-43. | 8 వ పేజీ. |

కాలీపట్నంలో సత్యాగ్రహం సాగించిన రైతులు

1939 పశ్చిమ గోదావరి జిల్లా ప్రథమ విద్యార్థి మహాసభ మహాసభను ప్రారంభించిన కాట్రగడ్డ రాజ గోపాలరావు, మునిపల్లి రామారావు, విద్యార్థులు



నవశక్తి ముద్రించిన హిట్లర్ కార్టూన్



18-1-39 నవశక్తి

జమీన్దారీ రైతుల గగ్గోలు

ప్రకాశం కమిటీ సూచనల ప్రకారం శాసనసభలో పెట్టిన బిల్లు జమీందారీ రైతాంగానికి
చేయాలనే ప్రజాభిప్రాయాన్ని తెలియ చేస్తున్న నవశక్తి కార్టూన్

# విద్యార్థి ఉద్యమం

## సంక్షిప్త చరిత్ర

1936 లో అఖిలభారత విద్యార్థి ఫెడరేషన్ ఏర్పడింది. విద్యార్థుల సర్వ సాధారణమైన కనీస హక్కుల ప్రణాళిక రూపొందించబడింది. విద్యార్థి సంఘాలు ఏర్పడటానికి, పనిచేయడానికి ఈ కనీస హక్కుల ప్రణాళిక తోడ్పడింది. 1937 నవంబరు 20, 21, 22 తేదీలలో పాలకొల్లులో జరిగిన రాష్ట్ర సోషలిస్టు పార్టీ మూడవ మహాసభ విద్యార్థుల కోర్కెలను బలపరుస్తూ తీర్మానాలు చేసింది. మహాసభ అనంతరం 1938 జూలైలో విద్యార్థి ఉద్యమంపై సోషలిస్టు పార్టీ ఒక తీర్మానం చేసింది: అందులోని ముఖ్యాంశాలు;

## ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఉద్యమ ప్రారంభదశ

### మొదటి దశ

"1920-21 సహాయ నిరాకరణోద్యమంలో విద్యార్థులను, పాశ్చాత్య విద్య నేర్పే పాఠశాలలను బహిష్కరించవలసిందని, కాంగ్రెస్ ఆదేశించింది. దానికి కారణాలు :-

1 ఈ బ్రిటిషు విద్యా విధానం జాతీయతకు వ్యతిరేకం; రాజభక్తి భావాలను పురిగొల్పుతుంది.

2. భరించరాని ఖర్చుతో కూడుకొని వుంది

3 వృత్తివిద్య లేకపోవడం వల్ల నిరుద్యోగ నివారణకు ఉపయోగపడటం లేదు.

విద్యార్థి ఉద్యమం - కాంగ్రెస్ ప్రారంభించిన సామ్రాజ్య వ్యతిరేక పోరాట ఫలితంగా ఉద్భవించింది. కాని 1922 నాటికి కాంగ్రెస్ ప్రత్యక్ష పోరాటాన్ని విరమించింది.

1920-21లో విద్యార్థులలో ఏర్పడిన జాతీయ భావాలు, సామ్రాజ్య వ్యతిరేక పోరాట ఉత్సాహము 1924లో ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభలో ప్రదర్శితమయ్యాయి. ఎంత అనిశ్చితమైనప్పటికీ, విద్యార్థి ఉద్యమం ఇంతటితో ఒక సంఘటనా రూపం పొందిందని చెప్పవచ్చు. కాని అప్పటి కాంగ్రెసు వల్లె, మితవాద ధోరణిలో నడిచింది. ఏదో కొన్ని తీర్మానాలు చేయడం విందులు,

వినోదాలు జరుపడంతో 1938 నాటికి 13 మహాసభలు గడిచాయి కాపపోతే కొంత స్పష్టంగా జాతీయ భావాలు వెల్లడించింది. ఇది మొదటి దశ.

## రెండవ దశ

1929-32లో ఏర్పడి ఆర్థిక మాంద్యం, 1930-31, 32-33 సత్యాగ్రహ ఉద్యమాలు; ఆర్థికంగానూ, రాజకీయంగానూ, సాంఘికంగానూ హిందూ దేశంలో బ్రిటిషు సామ్రాజ్యవాద విద్యావిధానం యొక్క నిజస్వరూపాన్ని ఎక్కువ బాగా విశదపరిచాయి. ఉద్యమాలలో జైళ్ళకు పోయిన విద్యార్థులు, యువకులు, విద్యకై ఉత్తర హిందూస్థానానికి పోయిన కొందరు విద్యార్థు సోషలిజంతో పరిచయానికి వచ్చారు.

1935 మధ్యకాలానికి, జాతీయైక్య సంఘటన, నిర్మించాలనే భావాలు (కార్మికులు, కర్షకులు, విద్యార్థులు, స్త్రీలు మొదలైన పీడిత ప్రజా సామాన్యాన్ని సామ్రాజ్య వ్యతిరేక పోరాటంలోకి తీసుకురావాలనే అభిప్రాయాలు) అంతర్జాతీయంగా ఫాసిజానికి, యుద్ధానికి వ్యతిరేకంగా పీపుల్సు ఫ్రంటు ఏర్పరచాలనే భావాలు మన దేశంలోని సోషలిస్టులలో కలిగాయి.

ఈ ఉద్దేశ్యంతో విద్యార్థుల అధ్యయన తరగతులు, ఎక్కువగా సోషలిస్టులు పెట్టారు. వారి కనీస ఆర్థిక, రాజకీయ హక్కుల గురించి ప్రచారం చేశారు. స్థానిక విద్యార్థి సంఘాలు ఏర్పడటం మొదలుపెట్టినవి

1936 లో అఖిల భారత విద్యార్థి సంఘం ఏర్పడింది. విద్యార్థుల సర్వసాధారణమైన కనీస హక్కుల ప్రణాళిక రూపొందించబడింది. 1937లో అసెంబ్లీ ఎన్నికలలో విద్యార్థులు చురుకుగా పాల్గొన్నారు. దీనివల్ల విద్యార్థి సంఘాలు ప్రత్యేకంగా ఏర్పడడానికి అవకాశం కల్గింది.

1937 మే నెలలో విశాఖపట్నం విద్యార్థులు కొందరు ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి సంఘం ఏర్పరచి దానిని అఖిల భారత విద్యార్థి సంఘానికి అనుబంధించాలనుకున్నారు.

1937 లో కొత్తపట్నం రాజకీయ పాఠశాలకు ఆంధ్ర దేశమంతటి నుంచి కాలేజీ, హైస్కూళ్ళ విద్యార్థులు వచ్చి హాజరయ్యారు. వీరిలో చాలామంది నిషేధాజ్ఞలను ఉల్లఘించి జైలుకు పోయారు. తెనాలిలో విడుదలైన వెంటనే (వీరిలో చాలామంది సోషలిస్టులు) గుంటూరులో ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభ జరుప నిశ్చయించారు కనీస హక్కుల ప్రణాళికతో గూడిన విజ్ఞప్తి పత్రాలను విరివిగా పంచిపెట్టడం జరిగింది.

ఈ లోపల, అంతకు ముందు ఉన్నదా? లేదా? అన్నట్లు నడుస్తున్న పాత విద్యార్థి ఫెడరేషన్, గుంటూరులో జరుగబోయే దానిని 14వ మహాసభగా

పరిగణించి రికార్డు పంపారు. ముందు ప్రథమ సభగా జరపాలనుకొని, తరువాత 14 వ సభగానే జరిపారు.

## మూడవ దశ

1937 ఆగష్టు 28, 29 తేదీలలో గుంటూరులో ఆంధ్ర విద్యార్థి ఫెడరేషన్ 14 వ మహాసభ జరిగింది. ఆంధ్ర రాష్ట్ర విద్యార్థులకు సంబంధించిన కనీస హక్కులను గురించి నిశ్చయమైన తీర్మానాలు చేయబడినాయి. హక్కుల ప్రణాళిక, నియమావళి తయారైంది. విద్యార్థి ఉద్యమం ఈ మహాసభతో మూడవ దశలో ప్రవేశించిందని పై తీర్మానం పేర్కొంది. అనగా సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయైక్య సంఘటనలో భాగంగా దేశ స్వాతంత్ర్య సమరంలో అంతర్భాగంగా సంఘటిత విద్యార్థి ఉద్యమం ఆంధ్ర దేశంలో ప్రారంభమైంది. అఖిల భారత ఉద్యమంలో కూడా అనుబంధం ఏర్పడింది.

—విద్యార్థి ఉద్యమంపై సోషలిస్టుల తీర్మానం 1938 జూలై.

## 14 వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ మహాసభ

1937 ఆగష్టు 28, 29 తేదీలలో గుంటూరులో జరిగిన 14 వ రాష్ట్ర విద్యార్థి మహాసభ విశేషాలను చాలా వివరంగా ఆనాటి ఆంధ్ర పత్రిక సెప్టెంబరు 1, 2 తేదీ సంచికలలో ప్రచురించారు. మహాసభకు 15 రోజులు ముందే మహాసభకు అధ్యక్షత వహించిన కామ్రేడ్ ఎన్. ఎస్. బాట్లీవాలా ఆంధ్ర దేశమంతటా పర్యటించి విద్యార్థులలో గొప్ప ప్రబోధం, సంచలనం కల్గించారు. సభను ప్రారంభించిన హిజ్రా బేగంకూడా రాష్ట్రంలో పర్యటించారు. స్థానిక సంఘాలు కొత్తవి ఏర్పడ్డాయి. పాతవి చురుకుగా పనిచేయ నారంభించాయి. మహాసభ ఆమోదించిన కోర్కెల ప్రణాళిక సామ్రాజ్యవాద వలస బానిస విద్యా విధానంపై విద్యార్థులు ప్రకటించిన పోరాట కార్యక్రమం అని చెప్పవచ్చు.

విశ్వవిద్యాలయాలపై ప్రభుత్వాధికారాన్ని తొలగించి, సెనేటును ప్రజాస్వామ్య పద్ధతిపై ఏర్పరచాలని ఛాన్సలర్, వైస్ ఛాన్సలర్‌ను ఎన్నుకోనాలని, విద్యార్థులకు సెనేటులో ప్రాతినిధ్యం ఉండాలనీ, నిర్బంధ ఉచిత ప్రాథమిక విద్య, విద్యార్థి సంఘాల గుర్తింపు, విద్యా వ్యయం తగ్గింపు, గుమాస్తాగిరి చదువులు కాక వృత్తి విద్యలు, పారిశ్రామిక విద్యలు ప్రవేశ పెట్టాలనీ, సైనిక విద్య నేర్పాలనీ, మొదలైన కోర్కెలు ఇందులో ఉన్నాయి.

విద్యా రంగంలో సామ్రాజ్య వాద తత్వాన్ని, వలస బానిసత్వాన్ని అంతరింప చేయాలన్నదే ఈ కోర్కెలు ప్రణాళిక లక్ష్యం అని స్పష్టం.

మహాసభ ఆమోదించిన తీర్మానాలను బట్టి దేశంలో వివిధ ప్రాంతాలలో జరుగుతున్న విద్యార్థి పోరాటాలకు సంఘీభావం, విద్యార్థి సంఘాల నిర్మించు

కొంటున్న సందర్భాలలో అధికారులు అమలు జరుపుతున్న నిర్బంధ విధాన ఖండన, అండమాన్ ఖైదీల కోర్కెల పట్ల సానుభూతి. చైనా, జపాన్ విద్యార్థుల ఫాసిస్టు వ్యతిరేక ప్రదర్శనలకు సంఘీభావం ప్రదర్శించు విద్యార్థులకు జాతీయ, అంతర్జాతీయ రాజకీయ దృక్పథం, చైతన్యం పెంపొందించిందని స్పష్టమవుతుంది.

అప్పటికింకా "స్వాతంత్ర్యం, శాంతి, అభ్యుదయం" అన్న విద్యార్థి జండా ఏర్పడలేదు. ఎర్రజండాపై పుస్తకం గుర్తు - జండాగా వుంది . మాకినేని బసవపున్నయ్యను రాష్ట్ర కార్యదర్శిగా ఎన్నుకున్నారు.

మహాసభ వార్తలను కోర్కెల ప్రణాళికను సవివరంగా ప్రకటించిన ఆంధ్రపత్రిక, మహాసభ నిర్ణయాలపై సంపాదకీయం వ్రాస్తూ, విద్యార్థులు కోరిన విద్యా సంస్కరణలను అమలు జరుపాలని కోరింది. రాయలసీమ విద్యార్థులు ఆంధ్రా విశ్వవిద్యాలయం క్రిందకు రావాలనీ (మద్రాసు యూనివర్సిటీ నుండి), ప్రత్యేకాంధ్ర రాష్ట్రం కావాలనీ, మహాసభ చేసిన తీర్మానాలను అభినందించింది. మహాసభ కార్యకలాపాలు మాతృభాషలో కాక ఇంగ్లీషులో జరిపినందుకు ఆక్షేపించింది.

## రాష్ట్రమంతటా విద్యార్థి పోరాటాలు-సమ్మెలు

గుంటూరులో 14వ మహాసభ యిచ్చిన ఉత్తేజంతోనూ, కోర్కెల ప్రణాళికతోనూ రాష్ట్రమంతటా విద్యార్థులు ఆందోళనలు, సమ్మె పోరాటాలు ప్రారంభించారు. ఎక్కడికక్కడ విద్యార్థి సంఘాలు ఏర్పాటు చేసుకొన్నారు ముఖ్యంగా మెకాలె బానిస విద్యావిధానం పైన, అందులోని వడపోతు పరీక్షా విధానం, డిటెన్షన్ విధానంపై అనేక పోరాటాలు ప్రారంభమైనాయి. స్థానిక కోర్కెలు కూడా ఇందులో జోడించబడ్డాయి.

ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఆంధ్ర ప్రాంతం విద్యార్థులకు జరుగుతున్న అన్యాయానికి నిదర్శనంగా ఆనాటి విశాఖపట్నంలోని ఆంధ్ర మెడికల్ కాలేజీకి తగిన భవనాలు, లెబరేటరీలు, ఆస్పత్రి అవకాశాలు లేకపోవడంతో మెడికల్ డిగ్రీలను ఆలిండియా మెడికల్ కౌన్సిల్ వారు గుర్తించ నిరాకరించడం, మద్రాసు ప్రభుత్వ సవతితల్లి ప్రేమకు వ్యతిరేకంగా విశాఖ మెడికల్‌కాలేజీ విద్యార్థులు కాక, రాష్ట్ర విద్యార్థులందరూ ఆందోళన చేయడం జరిగింది. విశాఖ మెడికల్‌కాలేజీ విద్యార్థులు సమ్మెచేశారు. గుంటూరు మహాసభ నాటికే జరుగుతున్న ఈ ఆందోళన తరువాత కూడా కొనసాగింది. ఆంధ్రయూనివర్శిటీ బి.కామ్. విద్యార్థులు కూడా తమ డిగ్రీలను గుర్తించాలని సమ్మెచేశారు. (1938 ఫిబ్రవరి)

1937 నవంబరులోనే తెనాలి హైస్కూలు విద్యార్థులు సమ్మెచేశారు. విద్యార్థుల న్యాయమైన కోర్కెలను పట్టణ కాంగ్రెస్ వారు, పురప్రముఖులు బలపరిచారు. సమ్మె జయప్రదమైంది.

గుంటూరు ఎ.సి. కాలేజీ విద్యార్థులు 1937 డిసెంబరులో 10 రోజులు డిటెన్షన్‌లకు వ్యతిరేకంగా చరిత్రాత్మకమైన సమ్మెచేసి విజయం సాధించారు. ఇది ఆంధ్రదేశంలో డిటెన్షనులకు వ్యతిరేకంగా జరిగిన మొట్టమొదటి సమ్మె. ఈ సమ్మె ఆ తరువాత అనేక సమ్మెలకు ప్రోత్సాహం యిచ్చింది. 1938 ఫిబ్రవరి 7వ తేదీన బందరు హిందూ కాలేజీ విద్యార్థులు తమ కోర్కెలకోసం సమ్మెచేసి విజయం పొందారు. అలాగే కృష్ణాజిల్లా తాడంకి, పామర్రు, చల్లపల్లి, గన్నవరం, పునాదిపాడు, బెజవాడ, గుంటూరు జిల్లా కొల్లూరు, బాపట్ల, పొన్నూరు, పశ్చిమ గోదావరి జిల్లా ఉండి, తూర్పుగోదావరి జిల్లా, కాకినాడ, విశాఖపట్నం మొదలైన చోట్ల విద్యార్థులు అధికారుల నిరంకుశ విధానాలకు వ్యతిరేకంగానూ, సంఘాలు నిర్మించుకునే హక్కు కొరకు డిటెన్షన్ విధానానికి వ్యతిరేకంగా సమ్మెలు జరిపారు. ఆందోళనలు సాగించారు. కాంగ్రెస్ నాయకులు జిల్లా బోర్డు అధికారులు, పురప్రముఖులు కలుగజేసుకొని, రాజీ ప్రయత్నాలు జరిపి విద్యార్థుల కోర్కెలను అంగీకరింప జేయడంలో తోడ్పడ్డారు.

స్వాతంత్ర్య దినోత్సవం, ప్రత్యేకాంధ్ర రాష్ట్ర దినోత్సవం మున్నగు వాటిలో కూడా విద్యార్థులు పాల్గొన్నారు. రాజమండ్రి కాలేజి విద్యార్థులు స్వాతంత్ర్య దినోత్సవం రోజున సెలవు యివ్వనందుకు నిరసనగా సమ్మెచేశారు. కాకినాడ కాలేజీ విద్యార్థుల సంఘం పెట్టుకోవడానికి విద్యాలయాధికారులు నిరంకుశత్వాన్ని ఎదుర్కొని పోరాటం చేశారు.

## జిల్లా సంఘాల నిర్మాణం

కృష్ణా జిల్లా ప్రథమ విద్యార్థి మహాసభ 1937 నవంబరులోనే జరిగింది. నెల్లూరు జిల్లా విద్యార్థి మహాసభ 1938 జనవరిలో గుంటూరు జిల్లా విద్యార్థి మహాసభ 1938 ఫిబ్రవరిలోను, విశాఖపట్నం ప్రథమ విద్యార్థి సంఘ రెండవ వార్షికోత్సవం 1938 ఆగష్టులోను,తూర్పుగోదావరి జిల్లా ప్రథమ విద్యార్థి మహాసభ 1938 డిసెంబరులోను జరిగాయి. 1939 లో పశ్చిమ గోదావరి జిల్లా విద్యార్థి ప్రథమ మహాసభ జరిగింది. అనంతపురం జిల్లా విద్యార్థి సంఘం 1939 లో ఏర్పడింది

## కనీస కోర్కెలు :

ఆ రోజుల్లో విద్యార్థులకు పాఠశాలల్లో కనీస సౌకర్యాలు కూడా ఉండేవి కావు. సైకిల్ షెడ్డు నిర్మాణం, మంచినీళ్ళ వసతి, మధ్యాహ్నం భోజనానికి వసతి, హెచ్చించిన జీతాల తగ్గింపు, గేమ్సు కమిటీలో విద్యార్థులకు ప్రాతినిధ్యం, నామినేషన్ పద్ధతి రద్దుచేసి ఎన్నికలు జరిపించడం, బెత్తంతో గొట్టే పద్ధతి (కార్పొరల్ పనిష్‌మెంటు) రద్దుచేయడం, హాస్టలు వసతి, లైబ్రరీ ఫీజు సద్వినియోగం చేయడం, జాతీయ గ్రంథాలను లైబ్రరీలలో పెట్టడం, నవశక్తి

వాహిని, ప్రజాబంధు మున్నగు వామపక్ష అభివృద్ధికర పత్రికలను కూడా లైబ్రరీలకు తెప్పించడం, కాలేజీ మాగ్జయిన్లు సక్రమంగా ప్రింటు చేయడం (డబ్బు వసూలు చేసి మాగ్‌జైన్‌లు ప్రచురించకుండా ఉంటున్న పరిస్థితుల్లో) జరిమానాలు విధించే పద్ధతి రద్దు చేయాలని, కాలేజీ విద్యార్థి సంఘం జమాఖర్చులు తనిఖీ చేసే హక్కు యూనివర్సిటీ రూల్సు ననుసరించి విద్యార్థులకు యివ్వాలనీ, విద్యార్థి సంఘం స్థాపించుకొనే హక్కుకు భంగం కల్గించరాదనీ, అలా స్థాపించుకొన్నందుకు నిర్బంధ చర్యలు అవలంబించరాదనీ, మొదలైన కోర్కెల కోసం విద్యార్థులు పోరాడారు. అన్నింటిని మించి సెలెక్షన్ పరీక్షలు పెట్టి డిటైన్ చేసే వడపోత పద్ధతి రద్దు కావాలన్నది విద్యార్థుల ప్రధాన కోర్కెగా ప్రతి చోట పెట్టేవారు. ఈ కోర్కెలు న్యాయమైనవి. సమంజసమైనవి అని ప్రజలు రాజకీయ పక్షాల నాయకులు కూడా బలపర్చడం వలన విద్యార్థుల ఆందోళన, సమ్మెలకు బలం చేకూరేది. ప్రముఖుల తోడ్పాటు ఇంచుమించు అన్ని చోట్ల సోషలిస్టు పార్టీ (కమ్యూనిస్టు పార్టీ) నాయకులు, కాంగ్రెస్ నాయకులు వచ్చి విద్యాలయాధికారులతో రాయబారాలు సాగించి సమ్మెలు జయప్రదం చేయడానికి తోడ్పడేవారు. పశ్చిమ గోదావరి జిల్లా బోర్డు కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ ముళ్ళపూడి రంగయ్య, గుంటూరు జిల్లా బోర్డు అధ్యక్షుడు పాతూరి సుబ్బయ్య, ఒంగోలు జిల్లా బోర్డు అధ్యక్షుడు శ్రీ కాసుల బ్రహ్మానందరెడ్డి, పశ్చిమ గోదావరి జిల్లా బోర్డు ఉపాధ్యక్షుడు శ్రీ తటపర్తి కృష్ణమూర్తి, బెజవాడ మున్సిపల్ ఛైర్మన్ పోతిన గణపతిరావు, కొడాలి ఆంజనేయులు, ఇంటూరి వెంకటేశ్వరరావు మొదలైనవారు ఈ విధంగా రాయబారాలు, సమ్మె పరిష్కారాలకు తోడ్పడిన వారిలో ఉన్నారు.

ఆయా సందర్భాలలో జరిగిన సభలు, సమావేశాలలో ఆయా జిల్లా మహాసభలు, రాష్ట్ర మహాసభలలో పాల్గొన్న ప్రముఖులలో శ్రీ జయప్రకాశ్ నారాయణ, శ్రీ ఎస్ ఎస్. బాట్లీవాలా, ఆచార్య రంగా, మద్దూరి అన్నపూర్ణయ్య, అల్లూరి సత్యనారాయణ, హజ్రాబేగమ్, పుచ్చలపల్లి సుందరయ్య, చండ్ర రాజేశ్వరరావు, జొన్నగడ్డ రామలింగయ్య, మునిపల్లె రామారావు, ప్రభల కృష్ణమూర్తి, పుసులూరి కోదండరామయ్య, డాక్టర్ ఎమ్. వి. కృష్ణారావు, గోపరాజు రామచంద్రరావు (గోరా) కాశీపట్నం కొండయ్య, కంభంపాటి సత్యనారాయణ (సీనియర్) డాక్టర్ గోవిందరాజుల వెంకట సుబ్బారావు (ప్రముఖ నటకులు, తెనాలి) దేవులపల్లి కృష్ణశాస్త్రి (ప్రముఖ కవులు) అడవి బాపిరాజు (కవులు, చిత్రకారులు), విశ్వనాథ సత్యనారాయణ (ప్రముఖ కవులు), బెల్లంకొండ రాఘవరావు (రచయితలు) మున్నగు ప్రముఖ జాతీయ నాయకులు, సోషలిస్టు పార్టీ నాయకులు, కమ్యూనిస్టు నాయకులు, కవులు, కళాకారులు, సాహిత్యవేత్తలు విద్యార్థిసభలకు ఆహ్వానింపబడి

వచ్చి విద్యార్థులలో రాజకీయ చైతన్యాన్ని, సాహిత్యాభిలాషను, కళల పట్ల అభిమానాన్ని కల్గించేవారు విద్యార్థుల కోర్కెలను బలపరిచేవారు.

1939 జనవరిలో బెజవాడలో జరిగిన 15 వ రాష్ట్ర విద్యార్థి మహాసభకు కాంగ్రెస్ నాయకులు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు, డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్య, తమిళనాడు కాంగ్రెస్ నాయకుడు శ్రీ సత్యమూర్తి, శ్రీమతి విజయలక్ష్మి పండిట్, కె ఎస్. నారిమన్ మొదలైనవారు సందేశాలు పంపారు.

## ఆనాటి ప్రధాన రాజకీయ సమస్యలు విద్యార్థి సమస్యలు

బ్రిటిషు సామ్రాజవాద ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఆనాడు జరుగుతున్న జాతీయ స్వాతంత్ర్య సమరంలో విద్యార్థులు తాముకూడా అంతర్భాగమని ఆనాటి జాతీయసమస్యలమీద చేసిన తీర్మానాలు, ప్రచారం, ఆందోళనలద్వారా నిరూపించు కున్నారు. గుంటూరులో జరిగిన 14వ రాష్ట్రవిద్యార్థి మహాసభలో ఆంధ్రప్రాంతాన్ని ప్రత్యేక రాష్ట్రంగా చేయాలనీ, దత్తమండలంలోని విద్యాసంస్థలను ఆంధ్ర విశ్వవిద్యాలయం క్రిందకు తీసుకురావాలనీ, అండమాన్ ఖైదీల కోర్కెలు నెరవేర్చాలనే, కోరుతూ తీర్మానాలు చేశారు. జాతీయ భాషగా ఉండదగిన హిందీయే గనుక దానిని అభివృద్ధి చేయాలని, అదే సమయంలో మాతృ భాషకు అభివృద్ధి భంగం కలుగకుండా చూడాలనీ కోరారు.

తూర్పు గోదావరి జిల్లా ప్రథమ విద్యార్థి మహాసభలో (కాకినాడ - 1938 డిసెంబరు) ప్రత్యేకాంధ్ర నిర్మాణం విషయమై కాంగ్రెసు వర్కింగ్ కమిటీ చర్య ఆశాభంగం కల్గించేదిగా ఉందని నిరసించారు. ప్రపంచ శాంతికి భంగకరమైన మ్యూనిక్ ఒడంబడికను గావించిన దలాదీర్, ఛాంబర్లేనీల అవమానకర చర్యను ఖండించారు. కెమాల్ పాషా (టర్కీ నాయకుడు) పొకతాలే (భారత జాతీయ కాంగ్రెసు నాయకుడు) గార్ల మృతికి సంతాపం వెలిబుచ్చారు. బొంబాయి యూనివర్శిటీలోవలె న్యాయశాస్త్ర పరీక్షకు ఇంటర్మీడియట్ ప్రాతిపదికగా తీసుకొని ఆంధ్ర విశ్వ విద్యాలయంలో కోర్సు ప్రవేశపెట్టాలని, ఎమ్. ఎ. కోర్సు కూడా ప్రవేశపెట్టాలని, ప్రభుత్వోద్యోగాలుగాని, విద్యాలయాలలో సీట్లుగాని కులమునుబట్టిగాక అర్హతలనుబట్టి యివ్వాలనీ కోరారు.

## విద్యార్థి ఉద్యమంపై ప్రభుత్వ దాడి

ఎప్పుడైతే విద్యార్థి ఉద్యమం సంఘటితమై విద్యా సమస్యతోబాటు ఆనాటి రాజకీయ సమస్యలపై విద్యార్థులను చైతన్య పరచసాగిందో, వామపక్ష భావాలు విద్యార్థులలో వ్యాపింపసాగాయో, నాటి కాంగ్రెసు మంత్రి వర్గం కూడా (బ్రిటిషు సామ్రాజ్యవాద ప్రభుత్వంతోబాటు) కలవరపడసాగింది. విద్యార్థి ఉద్యమాన్ని అణచివేయడానికి, మద్రాసు ప్రభుత్వం డిసిప్లినరీ రెగ్యులేషన్స్ 8 వ అధ్యాయం

పేకిట విద్యార్థులపై ఆర్డినెన్సు జారీచేసింది. రాజకీయాలలో విద్యార్థులు పాల్గొన కుండా చేయడమే ఈ రెగ్యులేషన్సు ప్రధాన ఉద్దేశ్యం.

మద్రాసు ప్రభుత్వం జారీచేసిన ఈ ఆర్డినెన్సును 1938 జూన్‌లో మంతెన వారి పాలెం రాజకీయ పాఠశాల సందర్భంలో జరిగిన రాష్ట్ర విద్యార్థి సంఘ కార్యవర్గం ఖండించుతూ "విద్యార్థులు రాజకీయాలలో పాల్గొనరాదనీ మద్రాసు కాంగ్రెస్ మంత్రివర్గం ప్రకటించడం శోచనీయమనీ, కాంగ్రెసువాదులు మంత్రి పదవులు స్వీకరించక పూర్వం విద్యార్థులు రాజకీయాలలో పాల్గొనుటకు అనుకూలురై ఉండి, అధికారంలోకి వచ్చిన తరువాత ఈ విధంగా నిర్ణయించడం అసమంజసమని ఇందుకు వ్యతిరేకంగా రాష్ట్రమంతటా విద్యార్థులు ఆందోళన చేయాలని" విజ్ఞప్తి చేశారు.

మద్రాసు విద్యార్థి సంఘం (ఎమ్. ఎస్. ఓ.) కూడా ఈ డిసిప్లినరీ రెగ్యులేషన్స్‌ను ఖండించుతూ తీర్మానించింది. రాష్ట్రంలోని అన్ని విద్యార్థి సంఘాలు ఐక్య కార్యాచరణకు పూనుకోవాలని, ఇందుకు ప్రెసిడెన్సీ విద్యార్థి ఫెడరేషనును ఏర్పరచాలనీ కూడా విజ్ఞప్తి చేసింది.

1938 జులై 20వ తేదీన నవశక్తి పత్రిక ఒక సంపాదకీయం వ్రాస్తూ విద్యార్థులు రాజకీయాలలో పాల్గొనకూడదనే జి ఓ ను రద్దు పరచాలనీ కోరింది. (కాంగ్రెసు రాజ్యంలో ఒక ఏడాది అన్న శీర్షికతో) విద్యార్థి నాయకులు కూడా ఈ ఆర్డినెన్సులను ఖండిస్తూ అనేక వ్యాసాలు, ప్రకటనలు చేశారు. ఆంధ్ర విశ్వ విద్యాలయ విద్యార్థులు కూడా ఇందుపై తీవ్ర ఆందోళన చేశారు.

## ఆంధ్ర యూనివర్శిటీ ఆర్డినెన్సులు

మద్రాసు ప్రభుత్వం వలెనే, ఆంధ్ర యూనివర్శిటీ కూడా 1938 డిసెంబరులో క్రొత్త డిసిప్లినరీ రూల్సు జారీచేసింది. విద్యాలయాధికారుల అనుమతి లేనిదే యూనివర్శిటీ వెలుపల ఏ యితర విద్యార్థి సంఘంలోనూ విద్యార్థులు జేరకూడదని; "విద్యార్థులు రాజకీయ సభలకు వెళ్ళకుండా విద్యాలయాధికారులు నిషేధించవచ్చు. సమ్మెలను నిషేధించవచ్చు. సమ్మెలు చేస్తే హాస్టళ్ళ నుండి వెళ్ళగొట్టవచ్చు." మొదలైన అనేక కఠినమైన నిబంధనలు జారీచేశారు.

ఈ ఆర్డినెన్సులకు వ్యతిరేకంగా మద్రాసు రాష్ట్ర మంతటా ఆంధ్ర ప్రాంతంలోనూ విద్యార్థులు తీవ్ర ఆందోళన చేశారు. విద్యార్థులను దేశ స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనకుండా అడ్డం కొట్టాలన్నదే ఈ కొత్త రెగ్యులేషన్సు ప్రధానోద్దేశ్యం అని బహిర్గతం చేశారు.

# ఆంధ్రదేశంలో రాజాజీ పర్యటన : విద్యార్థుల ఆందోళన విజ్ఞప్తి పత్రాలు

మద్రాసు ప్రధాని (ముఖ్యమంత్రి) శ్రీ రాజగోపాలాచారి 1938 జూలై నెలలో ఆంధ్ర జిల్లాల్లో పర్యటించారు. ఈ అవకాశాన్ని వినియోగించుకొని విద్యార్థి సమస్యలపై మెమొరాండములు సమర్పించాలనీ, విశాఖపట్నం మెడికల్ కాలేజీ డిగ్రీలు గుర్తించాలనీ, ఆంధ్ర యూనివర్శిటీ బి. కామ్. డిగ్రీలను యితర డిగ్రీలతో బాటు గుర్తించాలని, విద్యార్థులు రాజకీయాలలో పాల్గొనరాదనే నిబంధనలు తొలగించాలనీ, విద్యార్థుల సంతకాలు ప్రజల సంతకాలతో మహజర్లు కూడా సమర్పించాలనీ రాష్ట్ర విద్యార్థి సంఘం విద్యార్థులకు విజ్ఞప్తి చేసింది. అందుకు తగు కార్యక్రమం యిచ్చింది.

ఈ విజ్ఞప్తి ప్రకారం గుంటూరు, బందరు, ఏలూరు, కాకినాడ, విశాఖపట్నం మొదలైన చోట్ల విద్యార్థులు ఊరేగింపుగా వెళ్ళి ముఖ్యమంత్రికి విజ్ఞప్తి పత్రాలు సమర్పించారు. ప్రత్యేకాంధ్ర రాష్ట్రం ఏర్పరచాలన్నది కూడా మెమొరాండములో ఒక ముఖ్యాంశంగా ఉంది. విశాఖపట్నం మెడికల్ కాలేజి విద్యార్థులు తమకు జరుగుతున్న అన్యాయాన్ని, పక్షపాత ధోరణిని తీవ్రంగా ఎదుర్కొని రాజాజీని నిలవేశారు. గుంటూరు మొదలైన చోట్ల తీవ్ర నిరసన ప్రదర్శనలు కూడా జరిగాయి. ఆంధ్ర యూనివర్శిటీ జారీ చేసిన ఆర్డినెన్సుకు వ్యతిరేకంగా పౌర సభలు కూడా జరిగాయి.

1938 డిసెంబరు 31 వ తేదీన బందరులో రాష్ట్ర కాంగ్రెస్ కార్యవర్గ సమావేశం జరుగుతున్న సందర్భంలో రాష్ట్ర విద్యార్థి సంఘం తరపున రాయబారం వెళ్ళి విద్యార్థుల ప్రధాన సమస్యలపైన, యూనివర్శిటీ ఆర్డినెన్సుల పైన, డిటెన్షన్ పద్ధతి రద్దు చేయడం పైన కాంగ్రెస్ నాయకులు, యూనివర్శిటీ సిండికేటులోని కాంగ్రెస్ సభ్యులు జోక్యం కలుగజేసుకోవాలని కోరారు.

డిటెన్షను పద్ధతికి వ్యతిరేకంగా విద్యార్థులు తమ ఆందోళనను కొనసాగించారు. అనేక చోట్ల సమ్మెలు జరిగాయి. బెజవాడ విద్యార్థి సంఘంవారు 1938 డిసెంబర్ 20 న ప్రచార యాత్ర జరిపి విజయవాడ, పునాదిపాడు, తాడంకి, పామర్రు, బందరు మొదలైన చోట్ల హైస్కూళ్ళు, కాలేజీలలో సభలు, సమావేశాలు జరిపారు. బెజవాడ, ఏలూరు, కాకినాడ మొదలైన చోట్ల సమ్మెలు జరిగాయి. రాష్ట్ర విద్యామంత్రి శ్రీ వార్కీ ఆంధ్ర దేశ పర్యటనకు వచ్చినప్పుడు కూడా అనేక చోట్ల రాయబారాలు జరిపి విజ్ఞప్తులు అందజేశారు.

రాష్ట్రమంతటా కాలేజీలలో, హైస్కూళ్ళలో డిటెన్షను విధానానికి వ్యతిరేకంగా సమ్మెలు జరిపి విద్యార్థి ఫెడరేషను 1937, 38, 39 సంవత్సరాలలో

తీవ్ర ఆందోళన జరిపిన ఫలితంగా ప్రజలలో కూడా ఈ ఆందోళన పట్ల సానుభూతి ప్రదర్శితం కావడంతో ప్రభుత్వం వెనుకంజ వేయక తప్పలేదు. 1939 జూలై 20 వ తేదీన రాష్ట్ర వ్యాపితంగా డిటెన్షను వ్యతిరేకదినం జరుప వలసిందిగా రాష్ట్ర విద్యార్థి సంఘం పిలుపు యిచ్చింది. ఇదే సందర్భంలో విద్యామంత్రి శ్రీ వార్కీ ఆంధ్ర పర్యటనకు వచ్చారు. గుటూరు విద్యార్థి సంఘం తరఫున ఆయన వద్దకు రాయబారం వెళ్ళారు. మంత్రివర్యులు దీనికి సమాధానం చెబుతూ డిటెన్షనులు చిన్న తరగతులలోనే కాని, కాలేజీ, స్కూలు ఫైనలు క్లాసులలో ఇకనుంచి ఉండవనీ, కొద్ది కాలంలోనే ఈ విషయమై ప్రకటన చేస్తామనీ వాగ్దానం చేశారు. ఇందుకై వార్కీగారిని అభినందిస్తూ జూలై 20 తేదీ డిటెన్షను వ్యతిరేక దినం జరుప నవసరం లేదని రాష్ట్ర విద్యార్థి సంఘ కార్యదర్శి శ్రీ జి. రామకోటేశ్వరరావుగారు ప్రకటించారు. ఇది విద్యార్థి ఉద్యమం సాగించిన పెద్ద విజయమని చెప్పవచ్చు.

## వయోజనవిద్యా ప్రచార కార్యక్రమం

జాతీయోద్యమంలో భాగంగా ప్రజలలో నిరక్షరాస్యతను పోగొట్టడానికి విద్యార్థి ఉద్యమం వయోజనవిద్యా ప్రచారాన్ని ఒక ప్రధాన నిర్మాణ కార్యక్రమంగా చేపట్టినది. గత రెండేళ్ళుగా విద్యార్థులలో ఐక్యత, చైతన్యం కల్గింది. కేవలం ఆందోళనలు, సమ్మెలే కాక నిర్మాణయుత కార్యక్రమం కూడా చేపట్టాలనీ, విద్యార్థులు సామాన్య ప్రజలలోకి వెళ్లి వారి జీవిత సమస్యలను, గ్రామీణ సమస్యలను అర్థం చేసుకొని వారిలో జాతీయ చైతన్యం కల్గించాలనీ నిర్ణయించుకొన్నారు.

1939 జనవరి 8,9 తేదీలలో జరుప తలపెట్టిన మద్రాసు విద్యార్థి మహా సభతో బాటు వారం రోజులు వయోజన విద్యా శిక్షణా శిబిరం నడిపారు. ఇందుకు సవివరంగా సిలబస్ తయారుజేశారు చదువనూ, వ్రాయనూ సులభ పద్ధతులలో నేర్పు పద్ధతులను అవలంభించడమే కాక, ఆరోగ్యం, పారిశుధ్యం, ప్రథమచికిత్స, అంటువ్యాధుల నివారణ, ఆర్థిక, రాజకీయ సమస్యలు, ప్రభుత్వ చట్టాలు మున్నగు విషయాలను కూడా నేర్పారు. జాతీయ గీతాలు పాడారు. నాటకాలు, ఆటలు, పాటలు ప్రదర్శించారు రాత్రిబడులు ఆ తరువాత కూడా కొనసాగేటట్లు చేశారు.

అఖిల భారత విద్యార్థి ఫెడరేషను తీసుకున్న ఈ వేసవి వయోజన విద్యా కార్యక్రమం నిమిత్తం విశాఖజిల్లా భోగాపురంలో నెల రోజులపాటు వయోజన విద్యాప్రచార శిబిరం జరిగించి. కాకినాడలో ఉభయ గోదావరి జిల్లాలకు 1940 ఏప్రిల్ 25 నుండి 10 రోజులపాటు 50 మందికి వయోజన విద్యాశిక్షణా శిబిరం నడిపారు. కాకినాడలో వేసవి కాలమంతా కార్మిక పేటల్లో రాత్రిబడులు, మేజిక్

లాంతరన్ ప్రదర్శనలు జరిగాయి. లాబక్ చార్ట్‌తో సులభ పద్ధతి అక్షరాలు నేర్పారు. విశాఖపట్నంలో సంవత్సరాల తరబడి జాలరులకు, రేవు కార్మికులకు రాత్రి బడులు నడిపారు కృష్ణా, గుంటూరు జిల్లాల్లో కూడా ఈ వయోజన విద్యా ప్రచార శిబిరాలు కార్యక్రమాలు జరిపారు. యువజన సంఘాలు కూడా ఈ కార్యక్రమంలో కలిసి పనిచేశాయి.

విద్యార్థులు ఈ విధంగా కార్మిక, కర్షక ప్రజలలోకి వెళ్ళి వారికి విద్యా, విజ్ఞానాలు, రాజకీయ చైతన్యం కల్గించడం చూసి ప్రభుత్వం గాబరా పడింది. 1941 జూన్‌లో వయోజన విద్యా పాఠశాలలను నిషేధించింది. అనుమతి లేనిదే వేసవి వయోజన శిక్షణా శిబిరాలను నడుపరాదని ఆజ్ఞలను జారీ చేసింది. అనేక చోట్ల అనుమతి యివ్వలేదు.

## 1938 జూలైలో రాష్ట్ర పార్టీ సమీక్ష

1937 ఆగస్టులో గుంటూరులో 14 వ రాష్ట్ర విద్యార్థి మహాసభ లగాయతు 1938 జూలై వరకు విద్యార్థి కార్యకలాపాలను ఆనాడు సోషలిస్టు పార్టీగా వ్యవహరించుతున్న కమ్యూనిస్టు పార్టీ సమీక్షించుతూ ఒక తీర్మానం చేసింది. అంతవరకు విద్యార్థి ఉద్యమం సాధించిన విజయాలను, లోపాలను సమీక్షించింది. విద్యార్థి సంఘాలు ఇంకా సెక్టేరియన్ ధోరణిలోనే నడుపబడు తున్నాయని, ఇంకా విశాల ప్రాతిపదికపై నిర్మించాలనీ, ఐక్య సంఘటన కార్యక్రమాన్ని ఇంకా జాగ్రత్తగా అమలు జరపాలనీ, ఆటలు, పాటలు, (స్పోర్ట్స్, కల్చరల్ కార్యక్రమాలు) కార్యక్రమం అమలు జరపాలనీ, విద్యార్థులకు మరింత రాజకీయ సిద్ధాంత చైతన్యం కల్గించాలనీ తెలియజేసింది.

1939 జనవరి బెజవాడలో 15 వ రాష్ట్ర విద్యార్థి మహాసభ జరిగే సమయానికి ఈ లోపాలను సరిదిద్దుకోవడానికి విద్యార్థి ఫెడరేషన్ కృషి చేసింది.

## 15 వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభ

1939 జనవరి 28, 29 తేదీలలో బెజవాడలో 15 వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభ ఆచార్య రంగాగారి అధ్యక్షతన జరిగింది ఎస్. వి. ఎల్. నరసింహంగారు ప్రారంభించారు. రాష్ట్ర కార్యదర్శి మాకినేని బసవపున్నయ్య సాంవత్సరిక నివేదిక సమర్పించారు. వేర్వేరు జిల్లాల్లో జరిగిన సమ్మెలు, వాటికి కారణాలు, మద్రాసు ప్రభుత్వానికి, కాంగ్రెస్ కమిటీలకు సమర్పించిన మెమొరాండాలు, మంతెనవారిపాలెం రాజకీయ పాఠశాల తదితర విషయాల గురించి నివేదికలో తెలిపారు. విద్యార్థి సంఘాలకు - యితర సామ్రాజ్యవాద వ్యతిరేక సంస్థలకు మధ్య ఉండవలసిన సంబంధాల గురించి చర్చించారు సభకు వివిధ జిల్లాల నుండి 100 మంది డెలిగేట్లు వచ్చారు.

1935 ఇండియా ప్రభుత్వ రాజ్యాంగ చట్టం ప్రకారం భారతదేశం మీద బ్రిటీషు ప్రభుత్వం రుద్దదలచిన 'ఫెడరేషన్‌ను' ఖండించుతూనూ, డిటెన్షను పద్ధతికి వ్యతిరేకంగానూ, విద్యార్థి ఫెడరేషన్‌ను గుర్తించాలని కోరుతూనూ, విద్యార్థుల కోర్కెలపై రాష్ట్ర వ్యాపిత జనరల్ సమ్మె చేయాలనీ ఆదేశిస్తునూ, విద్యార్థుల ప్రాథమిక హక్కులు పునరుద్ధావించుతూనూ, ఫెడరేషన్‌కు ప్రతికూలంగా పని చేసేవారినే త్రిపుర కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నుకోవాలనీ, ప్రతి ఏడాది జనవరి 26 స్వాతంత్ర్య దినోత్సవం నాడు పబ్లిక్ సెలవుగా ప్రకటించాలనీ తీర్మానాలు చేశారు.

మహాసభ అనంతరం జరిగిన నూతన కార్యవర్గం వై. వి. కృష్ణారావు అధ్యక్షతన సమావేశమై విద్యార్థి సంఘాల నిర్మాణాన్ని పటిష్ఠ మొనరించడానికి, కార్యాలయాలు తెరచి దైనందిన కార్యకలాపాలను సమన్వయం చేయడానికి అవసరమైన చర్చలను గురించి ముఖ్యమైన నిర్ణయాలు చేసారు.

రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్‌పై ఏ ఒక రాజకీయ పార్టీకో అనుబంధ సంస్థ కాదనీ, స్వాతంత్ర్యం, శాంతి, అభ్యుదయము ఆశయాలకు కట్టుబడిన వారందరికీ ఇందులో స్థానం ఉందనీ, యిందుకు విరుద్ధంగా విద్యార్థి ఫెడరేషన్‌పై జరుగుతున్న దుష్ప్రచారానికి ఖండిస్తూ ఏ రాజకీయాభిప్రాయాలు కలిగినప్పటికీ సంఘంలో చేరవచ్చుననీ, విశదంచేస్తూనూ రాష్ట్ర సంఘం తరపున సహాయ కార్యదర్శి శ్రీ వై.వి. కృష్ణారావు, కార్యవర్గ సభ్యులు చలపతిరావు, తదితరులు ఒక ప్రకటన చేశారు.

## తెలంగాణా విద్యార్థి ఉద్యమానికి సంఘీభావ ఉద్యమం

హైదరాబాదు స్వదేశ సంస్థానం. నైజాం నిరంకుశపాలన క్రింద అణగారి పోయి ఉంది. కనీస ప్రజా తంత్ర హక్కులు, పౌర హక్కులు లేవు విద్యార్థి విజ్ఞానాలు కూడా మృగ్యం. 1938 నవంబరులో నైజాం ప్రభుత్వం ఉస్మానియా యూనివర్శిటీ విద్యార్థులు 'వందేమాతరం' గేయం పాడకూడదని నిషేధించింది. కాని విద్యార్థులు ఆ ఆజ్ఞలను ఉల్లంఘించి వందేమాతరం గేయం పాడటంతో హైద్రాబాదు, వరంగల్, గుల్‌బర్గా, ఔరంగాబాదు తదితర ప్రాంతాలకు చెందిన వందలాది విద్యార్థులను విద్యాలయాలనుండి వెళ్ళగొట్టారు. వారిలో ఎక్కువమంది నాగపూర్ యూనివర్శిటీకి వలస వెళ్ళి అక్కడ చదువుకోవలసి వచ్చింది. హైద్రాబాదు విద్యార్థి ఉద్యమానికి ఈ వందేమాతరం ఉద్యమం పెద్ద ప్రేరణ, ఉత్తేజం కల్గించింది.

అప్పుడు నైజాం సంస్థాన ప్రభుత్వానికి రైట్ ఆనరబుల్ సర్ అక్బర్ హైదరీ కార్యనిర్వాహక అధ్యక్షుడుగా ఉన్నాడు. వందేమాతరం ఉద్యమాన్ని

అణచడానికి ఉత్తర్వు జారీచేసిన ఈ బ్రిటీషు తాబేదారును వాల్తేరులోని ఆంధ్ర యూనివర్సిటీ స్నాతకోత్సవానికి, (1940) చాన్సలర్ మద్రాసు గవర్నరు సర్ ఆర్థర్ హోప్ ఆహ్వానించాడు. అట్టి పరిస్థితుల్లో అక్బర్ హైదరీని ఆంధ్ర యూనివర్శిటీ స్నాతకోత్సవానికి రానీయ కూడదని స్నాతకోత్సవాన్ని బహిష్కరించాలని ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ నిర్ణయించింది. రాష్ట్ర మంతటా నిరసన సభలు ఆందోళన చెలరేగటంతో అక్బర్ హైదర్ తోకముడిచాడు. ఆయన స్థానంలో రతన్ సర్కార్‌ను వచ్చాడు. అప్పుడు స్నాతకోత్సవాన్ని బహిష్కరించ నవసరం లేదని విద్యార్థి సంఘం ప్రకటించింది. అయితే వందేమాతరం గేయంపై హైదాబాదు ప్రభుత్వం నిషేధం కొనసాగినంతవరకు అందుకు వ్యతిరేకంగా ఆందోళన సాగిస్తామని ప్రకటించింది. తెలంగాణా ప్రాంతం విద్యార్థి ఉద్యమం పట్ల ఆంధ్ర ప్రాంతం విద్యార్థులు సాగించిన మొట్ట మొదటి సంఘీభావ ఉద్యమంగా దీనిని పేర్కొనవచ్చు.

## 9 నెలలకే 16 వ రాష్ట్ర విద్యార్థి మహాసభ

బెజవాడలో 1939 జనవరిలో 15 వ మహాసభ జరిగిన తొమ్మిది నెలలకే కాకినాడలో 1939 సెప్టెంబరులో 16 వ రాష్ట్ర విద్యార్థి మహాసభ జరిగింది. సంవత్సరం నిండకుండానే రాష్ట్ర మహాసభ జరుగడానికి ఆనాటి తీవ్ర అంతర్జాతీయ, జాతీయ పరిణామాలే కారణం. రెండవ ప్రపంచ యుద్ధం ముంచుకు వస్తూంది. ఇదే సమయంలో భారత స్వాతంత్ర్య సమరాన్ని కూడా జరుపాలనే కాంగ్రెస్‌లోని అతివాద శక్తులు, సోషలిస్టులు, కమ్యూనిస్టులు అభిప్రాయ పడుతున్నారు. కాంగ్రెస్‌లో అతివాదుల, మితవాదులమధ్య ఘర్షణ, సుభాష్‌చంద్ర బోసు కాంగ్రెస్ అధ్యక్ష పదవికి ఎన్నుకోబడటంతో (త్రిపుర కాంగ్రెస్ మహాసభకు) తీవ్రతరమైంది. అందుచే 9 నెలల్లోనే రాష్ట్ర విద్యార్థి మహాసభ జరుప వలసి వచ్చింది.

రాష్ట్ర విద్యార్థి సంఘ ప్రముఖులలో ఒకరైన డాక్టర్ కె. సోమయ్య, బెజవాడ - కాకినాడ సభల మధ్య రాష్ట్ర విద్యార్థి సఘ కార్యకలాపాలను సమీక్షించారు. (1939 ఆగష్టు 30 వ తేదీ నవశక్తి) విద్యార్థి ఫెడరేషన్ సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటానికి ఎంతవరకు సహాయపడ గల్గిందీ, బెజవాడ సభ తీర్మానాలు ఎంతవరకు అమలు జరిగాయి; స్వాతంత్ర్య పోరాటానికి ఎలా సాయపడినాయి? అన్న ప్రశ్నలకు ఈ నివేదిక సమాధానాలు యిచ్చింది. సాధించిన విజయాలతోపాటు లోపాలు తెలిపింది. స్పోర్ట్సు, ఆటలు, కల్చరల్ కార్యక్రమం లేకపోవుటచే విద్యార్థులను మరింత విస్తృత ప్రాతిపదికపై సంఘాలలోకి ఆకర్షించ

లేక పోయామని నివేదిక తెల్పింది. అలాగే వయోజన విద్య ప్రచారాన్ని మరింత విరివిగా సాగించాలని తెలిపింది.

కాకినాడ మహాసభకు జాతీయోద్యమ ప్రముఖులు, అతివాద నాయకులు అయిన సుభాష్ చంద్రబోస్ ప్రారంభోత్సవం జరిపారు. రాష్ట్ర సోషలిస్టు నాయకులు శ్రీ జొన్నలగడ్డ రామలింగయ్యగారు అధ్యక్షత వహించారు. (వారి ఉపన్యాసాలు తరువాత వివరంగా యివ్వబడ్డాయి.) మహాసభ జరుగుతుండగానే రెండవ ప్రపంచ యుద్ధం (సెప్టెంబరు 3వ తేదీన) సంభవించింది. సామ్రాజ్యవాద యుద్ధానికి వ్యతిరేకంగా విద్యార్థులు పోరాటాలని, స్వాతంత్ర్య సమరం సాగించాలనీ మహాసభ పిలుపు యిచ్చింది.

మహాసభ అనంతరం దేశంలో రాష్ట్రంలో పరిస్థితులు త్వరితగతికి మారిపోయాయి. వైస్రాయి యుద్ధ ఆర్డినెన్సు ప్రకటించారు. పౌరసత్వ హక్కులపై దాడి మొదలైంది. నిర్బంధ విధానం ప్రారంభమైంది.

పార్టీ పత్రిక నవశక్తి 1939 సెప్టెంబరు 6వ తేదీన "ప్రపంచ యుద్ధం మన కర్తవ్యం" అను పేరుతో 16 పాయింట్ల యుద్ధ వ్యతిరేక కార్యక్రమం ప్రకటించింది. (ఆ మరునాటి నుండి ప్రచురణ నిలిపి వేసింది)

1940 జనవరి 7 వ తేదీన కాకినాడ విద్యార్థులు బ్రహ్మాండమైన యుద్ధ వ్యతిరేక సమ్మె చేశారు. ఇతర చోట్ల కూడా విద్యార్థులు అనేక యుద్ధ వ్యతిరేక ప్రదర్శనలు జరిగాయి.

దీనితో విద్యార్థి నాయకులపై సి. ఐ. డి. ల నిఘాలు, అరెస్టులు, అజ్ఞాతవాసాలు ప్రారంభమయ్యాయి. 1940 నవంబరులో రాష్ట్రకార్యదర్శి శ్రీ పి.ఎస్. శర్మ అరెస్టు చేయబడ్డారు. 1941 జూలైలో అజ్ఞాతవాసంలో ఉన్న కామ్రేడ్ పర్వతనేని వెంకటేశ్వరరావును పోలీసులు తరుముకొని వస్తూండగా బావిలోపడి మృతిచెందాడు. శ్రీ మోటూరి హనుమంతరావు, (గుంటూరు జిల్లా) శ్రీ వై. విజయకుమార్ (విశాఖ) పరకాల పట్టాభిరామారావు, (తూర్పుగోదావరి) ఇంకా అనేక మంది విద్యార్థినాయకులు అజ్ఞాతవాసంలోకి వెళ్ళారు.

1940 నవంబరు 10, 11 తేదీలలో ఈ నిర్బంధకాలంలోనే గుంటూరులో 17 వ ఆంధ్రరాష్ట్ర విద్యార్థి మహాసభ జరిగింది. నెల్లూరు విద్యార్థి నాయకుడు ఆమంచర్ల గంగాధరరావు రాష్ట్ర ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకోబడాడ్డు.

1941 ఆగష్టు 14వ తేదీన రాష్ట్ర విద్యార్థిసంఘ కార్యదర్శి శ్రీ ఆమంచర్ల గంగాధర రావును పోలీసులు గూడూరులో అరెస్టు చేశారు.

18వ రాష్ట్ర విద్యార్థి వైజ్ఞానిక సభలు 1941 నవంబరు 8, 9, 10 తేదీలలో బెజవాడలో జరిగాయి. శ్రీ గంగాధరరావు అరెస్టు అవడం వలన శ్రీ చెరుకూరి

వెంకటేశ్వరరావు తాత్కాలిక కార్యనిర్వహణ బాధ్యతలు వహించారు తరువాత శ్రీ మోటూరు రాధాకృష్ణ ప్రధానకార్యదర్శి బాధ్యతలు స్వీకరించారు.

1939 సెప్టెంబరు నుండి 1941 జూన్ వరకు సామ్రాజ్యవాద యుద్ధ దశ (సోవియట్ యూనియన్‌పై దండయాత్ర వరకు) సోవియట్‌పై నాజీజర్మనీ దండయాత్ర తరువాత ఫాసిస్టు వ్యతిరేక ప్రజా యుద్ధ దశగా మార్పు - గురించి విద్యార్థి ఫెడరేషన్‌లో కూడా తర్జనభర్జనలు జరిగాయి. 1940 డిసెంబరులో నాగపూర్‌లో జరిగిన అఖిలభారత విద్యార్థి మహాసభలో చీలికలు కూడా సంభవించాయి.

1941 డిసెంబరు 25-31 తేదీలలో పాట్నాలో జరిగిన 7వ అఖిల భారత విద్యార్థి మహాసభ "సోవియట్‌పై నాజీ జర్మనీ దండెత్తిన తరువాత యుద్ధ స్వభావంలో మార్పు వచ్చిందనీ, ఫాసిజాన్ని ఓడించడం ప్రధాన కర్తవ్యంగా మారిందనీ యుద్ధ సన్నాహాలకు సంపూర్ణ సహకారం చేయాలనీ" తీర్మానించింది. ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషను ఈ పాట్నా మహాసభా తీర్మానాన్ని ఆమోదిస్తూ ప్రకటన చేసింది.

1942 మే నెల 15వ తేదీన అఖిలభారత విద్యార్థి ఫెడరేషన్ ఆధ్వర్యాన ఢిల్లీలో జరిగిన సదస్సు ఫాసిస్టు వ్యతిరేక ప్రజాయుద్ధ నినాదాన్ని అమలులో పెట్టడానికి తగు కార్యక్రమం తీసుకుంది. (విమాన దాడుల నుండి రక్షణ, అగ్ని మాపకదళాలు, ప్రథమ చికిత్స మున్నగు కార్యక్రమాలు).

1939 సెప్టెంబరులో యుద్ధ ప్రారంభం అయినప్పటినుండి విద్యార్థి ఉద్యమంపై ప్రభుత్వం సాగించిన నిర్బంధ విధానం, అరెస్టులతోబాటు విద్యార్థి వలంటీరు దళ నిర్మాణాన్ని, శిక్షణను కూడా ప్రభుత్వం నిషేధించింది. 1941 జూన్‌లో వయోజన విద్యా ప్రచారాన్ని ప్రభుత్వం నిషేధించింది. 1942 నవంబరులో పశ్చిమ గోదావరి జిల్లా విద్యార్థి సంఘాన్ని జిల్లా మెజిస్ట్రేటు నిషేధించాడు. ఈ జిల్లాలో పలువురు కమ్యూనిస్టు నాయకులను ఇదే సమయంలో డిటెయిన్ చేశారు జిల్లా విద్యార్థి సంఘ ఆర్గనైజరు పరకాల పట్టాభిరామారావుపై దేశరక్షణ చట్టం క్రింద అరెస్టు వారంట్లు విధించి రెండుచోట్ల ఒకే పర్యాయం దాడిచేసి నిర్బంధించాలని ప్రయత్నించారు. అలాగే అనేక జిల్లాలో విద్యార్థి నాయకులు నిర్బంధాలకు గురి అయ్యారు

1942 మేలో పశ్చిమ గోదావరిజిల్లా విద్యార్థి వైజ్ఞానిక దళాన్ని (7 గురిని) అరెస్టుచేసి 6 నెలలు విచారణ జరిపి 6 నెలలు కఠినశిక్ష విధించారు. 1942 సెప్టెంబరులో అనంతపురంలో కెమిస్ట్రి లేబొరేటరీ తగుల బెట్టారని ఆరోపణతో వి కె ఆదినారాయణరెడ్డి మొదలైన విద్యార్థి నాయకులను అరెస్టుచేసి 3 నెలలు

జైలులో ఉంచి తరువాత కేసు కొట్టివేయడంతో విడుదల చేశారు. నీలం రాజశేఖర రెడ్డి (బెనారస్ విద్యార్థి)ని కూడ కేసులో యిరికించారు.

## ఆయా జిల్లాల్లో విద్యార్థి నాయకత్వం - పార్టీకేడరు

1938 జూలైలో రాష్ట్రపార్టీ విద్యార్థి ఉద్యమంపై చేసిన తీర్మానంలో ''బాగా చురుకుగా పనిచేసే విద్యార్థి సోదరులను, సోషలిజంలో నమ్మిన వారిని పార్టీలో చేర్చుకొని వారికి యితర రంగాలలో జరిగే పోరాటాన్ని పరిచయం చేయాలి. జాతీయ ఐక్యసంఘటన విధానాన్ని బాగా బోధించాలి. అధ్యయన తరగతుల ద్వారా సిద్ధాంత పరిజ్ఞానం ఎక్కువచేయాలి" అని యిచ్చిన ఆదేశాన్ని అనుసరించి మార్క్సిస్టు సిద్ధాంతాలను అంగీకరించిన వారితో పార్టీ సెల్లుల నిర్మాణం పార్టీ పంక్షనింగ్ కూడా జరుగుతుండేవి. యించుమించు వీరందరూ ఆ రోజులల్లో కాంగ్రెస్ సభ్యులుగా కూడా ఉండేవారు. మార్క్సిస్టు భావాలులేని, ఇతర రాజకీయ అభిప్రాయాలుకల్గిన వారుకూడా ఉద్యమంలోకలిసి పనిచేశారు.

ఆరోజుల్లో ఆంధ్రదేశంలో బలమైన విద్యార్థి ఉద్యమానికి 4 కేంద్రాలు ఉండేవి. అవి గుంటూరు, బందరు, కాకినాడ, విశాఖపట్నం.

గుంటూరులో మాకినేని బసవపున్నయ్య, పై వి. కృష్ణారావు, మోటూరు హనుమంతరావు, వేములపల్లి శ్రీకృష్ణ, నాళం నరసింహారావు, డి.వి. అప్పారావు, ఏటుకూరు బలరామమూర్తి, టి. వెంకటేశ్వరావు, తుమ్మల వెంకటసుబ్బయ్య, లావు బాల గంగాధర రావు మొదలైనవారు పార్టీలోకి వచ్చి ఆ తరువాత కమ్యూనిస్టు ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించారు.

అలాగే విశాఖపట్నంలో డాక్టర్ కుప్పా వెంకట్రామశాస్త్రి, గద్దె రామకోటేశ్వరరావు, కె. సోమయ్య, సి. సూర్యనారాయణ, చలపతి నాయుడు, డాక్టర్ జె.వి. లక్ష్మి మొదలగువారు మెడికల్ కాలేజీ నుండి అశ్వనీ కుమారదత్తు, జి.వి. కె. వల్లభరావు మొదలైనవారు యూనివర్శిటీ కాలేజీ నుంచి పై. విజయ కూమార్ కె. గోవిందరావు మొదలైనవారు విజయనగరం నుండి పార్టీలోకి వచ్చారు.

కాకినాడ నుండి పర్వతనేని వెంకటేశ్వరావు, పి ఎస్. శర్మ, పరకాల పట్టాభిరామారావు, జి ఎస్. బాలాజీదాస్, రాజమండ్రి నుండి దోనెపూడి ధర్మారావు, చిట్టూరి ప్రభాకర చౌదరి, రామచంద్రపురం నుండి మేకా పట్టాభిరామయ్య మున్నగువారు పార్టీలోకి వచ్చారు.

పశ్చిమ గోదావరి జిల్లాలో అత్తులూరి సర్వేశ్వరరావు, మారెళ్ళ నరసింహారావు, నిడమర్తి ఉమారాజేశ్వర రావు తరువాత దశలో వంకా సత్యనారాయణ, భూపతిరాజు సుబ్బరాజు, పరకాల రమణరావు మొదలైనవారు పార్టీలోకివచ్చారు.

కృష్ణాజిల్లాలో కాట్రగడ్డ రాజగోపాలరావు, నూతక్కి రంగారావు, కాట్రాగడ్డ వెంకట్రాయుడు, తమ్మారెడ్డి సత్యనారాయణ, వల్లభనేని దాసు, మొదలైనవారు వచ్చారు.

నెల్లూరుజిల్లా నుండి ఆమంచర్ల గంగాధరరావు మొదలైనవారు పార్టీలోకి వచ్చారు. అనంతపురం జిల్లా నుండి వి.కె. ఆదినారాయణరెడ్డి తదితరులు వచ్చారు. తరిమెల నాగిరెడ్డి, నీలం రాజశేఖరరెడ్డి మున్నగువారు బెనారెస్ నుండి వచ్చారు.

1942 జూలైలో కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగించబడింది. అప్పటి నుండి విద్యార్థి ఫెడరేషన్ బహిరంగ కార్యకలాపాలకు అవకాశం ఏర్పడింది. 1936 నుండి 1939 జూన్ వరకు పార్టీ అమలు జరిపిన సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ ఐక్య సంఘటన కార్యక్రమాన్ని, ఆ తరువాత ఫాసిస్టు వ్యతిరేక ప్రజా యుద్ధ నినాదాన్ని విద్యార్థి రంగంలో అమలు జరుపడంతో రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్, అందులోని పార్టీ కార్యకర్తలు తమ కర్తవ్యాన్ని నిర్వహించి రాష్ట్రంలో విద్యార్థి ఉద్యమాన్ని ఈ దశలో ఒక గణనీయమైన రాజకీయ శక్తిగా రూపొందించగల్గారని చెప్పవచ్చు.

1937-42 మధ్య కాలంలో విద్యార్థి ఉద్యమ నాయకులుగా ముందుకు వచ్చిన వారిలో అత్యధికులు కమ్యూనిస్టు భావాలు కల్గిన వారైనప్పటికీ జాతీయ భావాలు కల్గినవారు, దేశభక్తులైన వారు చాలా మంది ఇతరులు కూడా ఉన్నారు. ఆతరువాత వీరు వివిధ రాజకీయ పార్టీలలోకి, ముఖ్యంగా 1942 ఆగష్టు ఉద్యమంపై వచ్చిన భిన్నాభిప్రాయాలలో విద్యార్థి కాంగ్రెస్ ఏర్పరచి కాంగ్రెస్ వైపు వెళ్ళారు.

## 1936-1942 మధ్య జరిగిన రాష్ట్ర విద్యార్థి మహాసభలు

| మహాసభ | జరిగినచోటు | తేదీలు | ప్రధాన కార్యదర్శి |
|---|---|---|---|
| 14 వ మహాసభ | గుంటూరు | 1937 ఆగస్టు 28, 29 | మాకినేని బసవపున్నయ్య |
| 15 వ మహాసభ | బెజవాడ | 1939 జనవరి 28, 29 | జి. రామకోటేశ్వరరావు |
| 16 వ మహాసభ | కాకినాడ | 1939 సెప్టెంబరు 1, 2, 3 | పి. ఎస్. శర్మ |
| 17 వ మహాసభ | గుంటూరు | 1940 నవంబరు 10, 11 | ఆమంచర్ల గంగాధరరావు |
| 18 వ మహాసభ | బెజవాడ | 1941 నవంబరు 8, 9, 10 | చెరుకూరి వెంకటేశ్వరరావు, మోటూరి రాధాకృష్ణ |

| | | | |
|---|---|---|---|
| 19 వ మహాసభ | గుంటూరు | 1943 నవంబరు 12, 13, 14 | తమ్మారెడ్డి సత్యనారాయణ |

## కొన్ని ముఖ్య జిల్లా విద్యార్థి మహాసభలు

| | | | | |
|---|---|---|---|---|
| 1. | కృష్ణా జిల్లా | ప్రథమ విద్యార్థిసభ | బందరు | 1937 నవంబరు 15, 16 తేదీలు |
| 2. | నెల్లూరు జిల్లా | ప్రథమ విద్యార్థి మహాసభ | నెల్లూరు | 1938 జనవరి 29, 30 తేదీలు |
| 3. | కష్ణా జిల్లా | ద్వితీయ విద్యార్థిసభ | గన్నవరం | 1938 నవంబరు 5, 6 తేదీలు |
| 4. | విశాఖపట్నం | ద్వితీయ విద్యార్థి మహాసభ | విశాఖ | 1938 ఆగస్టు 7 వ తేదీ |
| 5. | గుంటూరు జిల్లా | విద్యార్థి మహాసభ | నర్సారావుపేట | 1938ఫిబ్రవరి 11 వ తేదీ |
| 6. | తూ. గోదావరి | ప్రథమ విద్యార్థి మహాసభ | కాకినాడ | 1938 డిసెంబరు 10, 11 తేదీలు |
| 7. | ప. గోదావరి | ప్రథమ విద్యార్థి మహాసభ | పాలకొల్లు | 1939 ఏప్రిల్ 1, 2 తేదీలు |
| 8. | ప. గోదావరి | ద్వితీయ విద్యార్థి మహాసభ | ఉండి | 1940 జనవరి 21 తేదీ |
| 9. | గుంటూరు | విద్యార్థి 5వ మహాసభ | రేపల్లె | 1941 సెప్టెంబరు 30, 31 తేదీలు |

## డిటెన్షన్‌లు తదితర సమస్యలపై రాష్ట్రంలో తొలి విద్యార్థి సమస్యలు

| | | |
|---|---|---|
| తెనాలి | : | 17-11-1937 |
| గుంటూరు | : | 22-12-1937 |
| తాడంకి | : | 5-1-1938 |
| పొన్నూరు | : | 10-1-1938 |
| పునాదిపాడు | : | 12-1-1938 |
| కొల్లూరు | : | 18-1-1938 |
| బాపట్ల | : | 20-1-1938 |
| బందరు | : | 7-2-1938 |
| విశాఖపట్నం | : | 7-2-1938 |

| | | |
|---|---|---|
| నెల్లూరు | : | 18-2-1938 |
| బెజవాడ | : | 13-12-1938 |
| ఉండి | : | 1939 |
| ఏలూరు | : | 19-12-1939 |
| కాకినాడ | : | 20-12-1939 |

## ప్రధాన చారిత్రిక ఘటనలు (1936 - 1942)

ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఉద్యమ సంక్షిప్త చరిత్రను మొదటి ప్రకరణంలో చూశాం. రాష్ట్రంలో విద్యార్థి ఉద్యమం ఎలా వ్యాప్తి చెందిందో, పార్టీ దానిని ఎలా పెంపొందించిందో సమాచారం లభించినంతవరకు ప్రధాన చారిత్రిక ఘటనలను యిపుడు చూద్దాం. ఆనాటి జాతీయ దినపత్రికయైన "ఆంధ్ర పత్రిక" స్వాతంత్ర్య పోరాటంలో ఒక భాగంగా విద్యార్థి ఉద్యమాన్ని ఎంచి అందుకు సంబంధించిన వార్తలను విరివిగానూ, వివరంగానూ కూడా ప్రకటించేది. 1937 చివరి భాగంలో పార్టీ పత్రిక "నవశక్తి" ప్రారంభమైనప్పటినుండి ఆ పత్రిక విద్యార్థి ఉద్యమాన్ని పూర్తిగా ప్రతిబింబించుతూ వ్యాసాలు, వార్తలు, సమీక్షలు, తీర్మానాలు ప్రకటించుతూ వచ్చింది. అలాగే 1939 నుండి మద్రాసు నుండి ప్రచురింపబడిన శ్రీ తాపీ ధర్మారావుగారు, వారి కుమారుడు శ్రీ మోహనరావు నిర్వహించిన పత్రిక "కాగడా" విద్యార్థి, యువజనోద్యమ ప్రధాన సంఘటనలను ప్రచురించుతూండేది. అలాగే రాష్ట్ర కమ్యూనిస్టు నాయకులు, కామ్రేడ్ వై. వి. కృష్ణారావు విద్యార్థి ఉద్యమ నాయకునిగా వ్రాసిన స్మృతులు, ఈ రచయిత లోగడ వ్రాసిన వ్యాసాలు, డైరీలు, కామ్రేడ్ కంభంపాటి సత్యనారాయణగారు వ్రాసిన ''ఆంధ్ర ప్రదేశ్‌లో కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర" మొదటి సంపుటంలో విద్యార్థి ఉద్యమానికి సంబంధించిన కొంత సమాచారం కూడా ఇందుకు తోడ్పడింది.

అలాగే తెలంగాణా విద్యార్థి ఉద్యమం గురించి "హైద్రాబాదు సంస్థానంలో రాజకీయ చైతన్యం, విద్యార్థి యువజనుల పాత్ర'' అని కామ్రేడ్ ఎన్. ఎమ్. జవాద్ రజ్వీ వ్రాసిన గ్రంథం తోడ్పడింది. స్థానిక విద్యార్థి సంఘాల నిర్మాణం, కార్యకలాపాలు, జిల్లా రాష్ట్ర మహాసభలు, వివిధ ఆందోళనలు, పోరాట ఘట్టాలు, లభించినంతవరకు తేదీల వివరాలతోసహా ఉదాహరించబడినవి.

## 14 వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభ (గుంటూరు - 1937 ఆగష్టు 28, 29 తేదీలు)

1937 ఆగష్టు 28, 29 తేదీలలో 14 వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభ గుంటూరులో జరిగింది. మహాసభను కామ్రేడ్ హిజ్రాబేగం ప్రారంభించారు. కామ్రేడ్ ఎన్ ఎస్. బాట్లీవాలా అధ్యక్షత వహించారు. శ్రీ నాళం నరసింహారావు

కార్యదర్శిగా ఆహ్వాన సంఘం ఏర్పడింది. మహాసభకు 15 రోజులు ముందే కా|| మేడ్ బాట్లీవాలా ఆంధ్ర దేశం వచ్చి రాష్ట్రమంతటా పర్యటించి విద్యార్థులలో తీవ్ర సంచలనం కల్గించారు. స్థానిక విద్యార్థి సంఘాలు అనేకం ఏర్పడి పని చేయ నారంభించాయి. మహాసభ అనంతరం సోషలిస్టు పార్టీ యువజన విద్యార్థి సంఘాల ఆధ్వర్యాన కా|| మేడ్ బాట్లీవాలా ఆంధ్ర దేశంలో అనేక చోట్ల పర్యటించి ఉత్తేజకరమైన ఉపన్యాసాలిచ్చారు. ఆ ఉపన్యాసాలలో బ్రిటీషు సామ్రాజ్యవాద ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాయుధ పోరాటాన్ని సాగించిన అల్లూరి సీతారామరాజు వలెనే అవసరమైతే ఆయుధాలు చేపట్టి పోరాడాలని చేసిన ఉపన్యాసం గురించి 'సి.ఐ.డి.లు పంపిన రిపోర్టు ఆధారంగా మద్రాసు కాంగ్రెస్ మంత్రివర్గం ఆయనపై రాజ్యద్రోహ నేరం మోపి అరెస్టు చేసి కేసు పెట్టారు. బాట్లీవాలా కాదు "బ్యాటిల్ వాలా" అని "ఫైర్ బ్రాండ్" అని ఆ రోజుల్లో మితవాద కాంగ్రెస్ నాయకులు ప్రచారం చేసేవారు. ఈ ప్రచారం విద్యార్థులను మరింత ఆకర్షించేది. నిజానికి ఆయన ఉపన్యాసాలు అంత ఉద్రేకపూరితంగానూ ఉండేవి.

## గుంటూరు మహాసభ గురించి లభించినంత వరకు సమాచారం యిది

మహాసభకు గుంటూరు పట్టణం, విశాఖపట్టణం, విజయనగరం, కాకినాడ, పాలకొల్లు, రాజమహేంద్రవరం, ఉండి, మచిలీపట్టణం, బెజవాడ, చల్లపల్లి, పామర్రు, చిట్టిగూడూరు, తెనాలి, బాపట్ల, ఒంగోలు, నెల్లూరు, పునాదిపాడు మున్నగు చోట్ల నుండి ప్రతినిధులు వచ్చారు. అంటే ఆయాచోట్ల మహాసభ నాటికే స్థానిక విద్యార్థి సంఘాలు ఏర్పడటంగాని, లేక రాజకీయ చైతన్యం కల్గిన విద్యార్థి గ్రూపులు పని చేస్తూండటం గాని జరిగి ఉండాలి.

మహాసభను శ్రీమతి హజ్రాబేగమ్ ప్రారంభించారు. మహాసభ రెండవ రోజున ఈ దిగువ సమగ్రమైన కోర్కెల ప్రణాళిక తీర్మానాలు ఆమోదించబడి నాయి.

## చార్టర్ ఆఫ్ డిమాండు :

1. విశ్వవిద్యాలయాల పైన దొరతనము వారికెట్టి అధికారం ఉండ కూడదు. సెనేటులో ప్రజా సత్తాక పద్ధతి ఉండవలెను. చాన్సలర్‌ను, వైస్ చాన్సలర్‌ను ఎన్నుకోవాలి. సెనేటుకు విద్యార్థులు తమ ప్రతినిధులను కొందరిని ఎన్నుకొనే అవకాశం యివ్వాలి. అఫిలియేటెడ్, ఓరియంటల్ కాలేజీల గ్రాడ్యుయేటులకును, మెట్రిక్యులేటులకును కూడా ఓటింగు అధికారం ఉండాలి. ఈ రీతిగా ఒక కొత్త చట్టం చేయాలి.

2. సెకండరీ పాఠశాలలను విశ్వవిద్యాలయములకు వశపరుపవలెను. వాటిపై దొరతనము వారికి అధికారం ఉండకూడదు.

3. ప్రతీ గ్రామంలోనూ బాలికలకు, బాలురకును, జాతి, మత విచక్షణ లేకుండా ప్రారంభ విద్యను ఉచితముగానూ, నిర్బంధముగానూ బోధించాలి. అందులకు ప్రతీ గ్రామంలోనూ ఒక పాఠశాల అయినా ఉండాలి.

4. జాతీయతకును, ప్రజా స్వామ్యానికి విరుద్ధములగు విషయాలు గల పుస్తకాలు పఠనీయ గ్రంథాలుగా ఉండకూడదు. ప్రతీ విశ్వ విద్యాలయమును పఠనీయ గ్రంథాలను స్వయంగా ప్రకటించాలి. అందువలన లాభం గడించకూడదు.

5. విశ్వవిద్యాలయములలోనూ, బయట సంఘముల ఏర్పాటు చేసుకోడానికి, మాట్లాడడానికి విద్యార్థులకు స్వాతంత్ర్యం ఉండాలి. విద్యార్థి సంఘాలను గుర్తించవలెను.

6. టర్మ్ ఫీజు, ఎగ్జామినేషన్ ఫీజు - వీటిలో కనీసం 100కి 50 శాతం తగ్గించాలి.

7. విద్య నేర్చుకొనగోరు వారికి వ్యయమును తగ్గించవలయును.

8. ఏ ఆఫీసరుకును రూ. 500/- కంటే హెచ్చు జీతములియ్యకూడదు.

9. పరీక్షలను శీతాకాలమందే జరుపవలెను.

10. విద్యార్థులు తమ యిష్టము వచ్చిన గ్రంథములను చదువుటకును, అభిప్రాయములను కల్గియుండుటకును, స్వేచ్ఛయుండవలెను.

11. ఇప్పుడు నేర్చుకున్న [ఆర్ట్సు] విషయములతోబాటు వృత్తి విద్యలను కూడా నేర్పవలెను.

12. చదువుకొన్న నిరుద్యోగుల లెక్కలు తయారు చేయాలి. వారికి ఉద్యోగాలు, పనులు సమకూర్చుటకు సంఘాలుండాలి.

13. విదేశాలలోని విద్యా సంస్థలకు ఆధిక్యమియ్యకూడదు

14. ఇండియాలోనూ, విదేశాలలోనూ గల అన్ని విశ్వవిద్యాలయాలలోనూ, విద్యార్థులను చేర్చుకొనడానికి ఏర్పాట్లు జరగాలి.

15. గౌరవప్రదంగా జీవించడానికి అనుకూలంగా జీతాలను ఉపాధ్యాయు అందరికి యివ్వాలి.

16. మానసిక విషయాలలోనూ, బోధనా విషయాలలోనూ పరిశోధనలు జరగాలి.

17. విద్యార్థి సంఘాలలో మత సాంఘిక దురభిమానాలు ప్రబలకుండా చేయాలి.

18. పాఠశాలల్లో శారీరక పరిశ్రమను, కళాశాలల్లో సైనిక విద్యను నిర్బంధ పూర్వకంగా అమలు పరచాలి. కాని ఇలా అభ్యసించిన వారు, యుద్ధ సమయాలలో దొరతనం వారి ఆజ్ఞల ప్రకారం, యుద్ధ చేయాలనే నిర్బంధం ఉండకూడదు.

19. ఇండియన్ మెడికల్ కౌన్సిల్ వారు విశాఖపట్టణం మెడికల్ కాలేజీ డిగ్రీలను రికగ్నైజు చేయాలి.

20. వెంటనే అచట (విశాఖపట్టణంలో) లా కాలేజీని, ఇంజనీరింగ్ కాలేజీని ఏర్పాటు చేయవలెను.

21. దత్తమండలము ఆంధ్ర విశ్వవిద్యాలయం క్రిందకు వచ్చుటకు తగిన ఏర్పాట్లు జరగాలి.

22. ఆంధ్ర దేశమును ప్రత్యేక రాష్ట్రముగా చేయాలి

23. ప్రతీ పాఠశాలకు, ప్రతీ కళాశాలకు, పఠన మందిరాలు, గ్రంథాలయాలు, ఆటల స్థలాలు, ఆటల సామాగ్రులు మున్నగునవి ఉండాలి. దీనిని విద్యార్థులందరికి ఉచితంగా యివ్వాలి.

24. పాఠశాలల్లోను, కళాశాలల్లోను స్వపరిపాలన ఉండాలి

25. నిబంధనలను ఉల్లంఘించిన వారిపై చర్యలు తీసుకోడానికి విద్యార్థులు ఎన్నుకొన్న ఆనరరీ కోర్టులు ఏర్పరచాలి.

26. విద్యార్థుల ఆత్మగౌరవానికి భంగం కల్గించే శిక్షలన్నింటిని రద్దు చేయాలి. విద్యార్థి సంఘాలతో ఆలోచించి సరియైన శిక్షలను ఏర్పరచాలి.

27. కాలమాన పరిస్థితిని బట్టి తరగతుల వేళలు నిర్ణయించాలి.

28. ఉన్నత విద్య నభ్యసించగోరు వారికి ప్రతి మండలంలో అవకాశం కల్గించాలి.

29. గైడ్స్, స్కౌటు ఉద్యమాలను జాతీయ పద్ధతిలో ఏర్పరచాలి. బేడెన్ పౌల్ ఉద్యమంతో దీనికి ఎట్టి సంబంధం ఉండకూడదు.

30. గుంటూరులో వైద్య కళాశాల ఏర్పచాలి.

31. విద్యార్థులకు జరిమానాలు వేయకూడదు.

32. విద్యా విషయాలలో తగు మార్పులు చేయడానికి అందుపై విచారణ జరుపడానికి విద్యార్థులు-ఉపాధ్యాయులు గల ఒక సంఘాన్ని ఏర్పాటు చేయాలి.

33. జాతీయ భాషగా ఉండదగినది హిందీయే గనుక దీనిని అభివృద్ధి చేయాలి. అయితే మాతృ భాషల అభివృద్ధికి భంగం కలుగకుండా చూడాలి.

34. కాకినాడ, విశాఖపట్టణం, గుడివాడ, ఉండి, బెజవాడ మున్నగు స్థలాలల్లో విద్యార్థుల సంఘాలు ఏర్పరచుకున్న సందర్భాలలో అధికారులు

ఆటంకాలు, నిర్బంధాలు కల్గించడం జరుగుతూంది. ఇది అనుచితం. ఈ సంఘాల పట్ల సభ వారు తమ సంఘీభావాన్ని తెలియజేశారు.

35. చీనా, జపాన్ దేశాలతో సాంఘిక న్యాయం, ఆర్థిక స్వాతంత్ర్యం నిలబెట్టుకొనడానికి విద్యార్థుల సామ్రాజ్య వ్యతిరేక, ఫాసిస్టు వ్యతిరేక ప్రదర్శనలను నిర్భయంగా జరుపుతున్నందుకు సభ వారు వారిని ప్రశంసించుతున్నారు.

36. బెంగాల్‌లో విద్యార్థులకు ఆనవాలు కార్డులు, (ఐడెంటిఫికేషన్ కార్డులు) నిర్బంధపు ఉత్తర్వులు, ప్రవాసపుటుత్తర్వులు అమలు జరుపుట అక్రమం. వీటిన్నిటిని రద్దు చేయాలి.

37. అండమాన్ ఖైదీల కోర్కెలను ప్రభుత్వం నెరవేర్చాలి.

38. కలకత్తాలో విద్యార్థులు శాంతముగా ఊరేగింపులు జరుపుతూండగా హిక్ మంత్రి వర్గం వారు, వారిపై లాఠీచార్జీ జరిపినందుకు సభ వారు ఖండించుతున్నారు.

39. అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్ సిద్ధపరచిన హక్కుల ప్రకటనను (చార్టర్ ఆఫ్ రైట్స్) ఈ సభవారు ఆమోదించుకున్నారు.

40 1938 ఆగష్టులో సభను బెజవాడలో జరుపాలని వచ్చిన ఆహ్వానాన్ని సభ వారు అంగీకరించారు.

41. ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్‌ను ఏర్పరచి దానిని అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్‌తో అనుబంధించడానికి నిర్ణయించుతున్నారు.

42 అఖిల భారత విద్యార్థి ఫెడరేషనుకు సంబంధించిన విద్యార్థి సంఘాలకు పుస్తకము చిహ్నముగా గల ఎర్రజెండా ఉండాలని నిర్ణయించారు.

శ్రీ మాకినేని బసవపున్నయ్యను రాష్ట్ర ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకొన్నారు. శ్రీ వై. వి. కృష్ణారావు, శ్రీ కాట్రగడ్డ రాజగోపాలరావు, విశాఖ నుండి మరొకరు సంయుక్త కార్యదర్శులుగా ఎన్నుకోబడ్డారు.

మహాసభ ఆమోదించిన ఈ కోర్కెల ప్రణాళిక, తీర్మానాలు, విద్యార్థి ఉద్యమానికి ఒక స్పష్టమైన సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటానికి, వలస బానిస విద్యా విధానానికి వ్యతిరేకంగా నిర్దిష్ట పోరాట కార్యక్రమానికి మార్గం చూపించింది. ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్‌ను పునర్వ్యవస్థీకరించి అఖిల భారత విద్యార్థి ఫెడరేషనుతో అనుబంధించడానికి కూడా నిర్ణయించడం జరిగింది.

విద్యార్థి సంఘ జండా, ఎర్రజండాపై పుస్తకం గుర్తుగా నిర్ణయించారు. అప్పటికింకా ఎర్రజండాపై - స్వాతంత్ర్యం, శాంతి, అభ్యుదయము అన్న అక్షరాలతో కూడిన జండా ఆవిర్భవించలేదు.

ఆవిధంగా 1937 లో జరిగిన గుంటూరు మహాసభతోనే స్పష్టమైన సామ్రాజ్యవాద వ్యతిరేక; స్వాతంత్ర్య పోరాట, ప్రజాస్వామ్య, సోషలిస్టు భావాలతో; బానిస విద్యా విధానంపై రాజీలేని తిరుగుబాటు జండా ఎగురవేసిన క్రియాశీల రాష్ట్ర విద్యార్థి ఉద్యమం నిజంగా ప్రారంభ మైందని చెప్పవచ్చు. అంతకు ముందు 1937 మే నెలలో విశాఖపట్నం విద్యార్థులు కొందరు ఏర్పరచిన ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి సంఘం-ఒక ప్రారంభ ప్రయత్నం మాత్రమేనని స్పష్టం.

## ఆంధ్ర పత్రిక సంపాదకీయం

గుంటూరులో జరిగిన ఆంధ్ర రాష్ట్రవిద్యార్థి మహాసభ గురించి, తీర్మానాలను గురించి 1937 సెప్టెంబరు 2 వ తేదీన ఆంధ్ర పత్రిక ఒక సంపాదకీయం వ్రాస్తూ విద్యార్థి సభ కోరిన విద్యా సంస్కరణలు అమలు జరపడం మంచిది అని తెలియజేసింది. బాట్లీవాలా గారి రాకవలన, వారి సంచారమువలన విద్యార్థి లోకంలో సంచలనము కల్గిందనీ, ఈ సభకు ఉపాధ్యాయుల సహకారం ఉండటం గొప్ప విశేషమనీ, విద్యార్థి సంఘాలను ఏర్పరచు కొన్నప్పుడు అధికారులు ప్రాతికూల్యం వహించుట తగదని విమర్శించింది. రాయలసీమ విద్యార్థులు ఆంధ్ర విశ్వ విద్యాలయం క్రిందకు రావాలనీ, ప్రత్యేకాంధ్ర రాష్ట్రం కావాలనీ విద్యార్థులుచేసిన తీర్మానాలను అభినందించింది. అయితే మహాసభ కార్యకలాపాలు, తీర్మానాలు ఇంగ్లీషులో జరిగాయనీ, ఆంధ్ర దేశంలో జరుపుకునే ఆంధ్రవిద్యార్థుల సభ - చర్చలు ఆంధ్ర భాషలో జరిపి యుండవలసిందని ఆక్షేపించి-ఇక ముందు ఈ లోపం జరగకుండా చూడాలని తెలిపింది. విద్యా సంస్కరణల గురించి చేసిన తీర్మానములు సాధ్యమైనంత త్వరలో అమలు జేయుట మంచిదని తెలిపింది. ఈ తీర్మానములు (కోర్కెల ప్రణాళిక) స్వాతంత్ర్య భావమును ప్రస్ఫుటింప జేస్తున్నదని ప్రశంసించింది.

ఆనాడు జాతీయ స్వాతంత్ర్య సంపాదన ప్రధాన లక్ష్యంగా నడుపబడు తున్న జాతీయ ప్రతికలు విద్యార్థి ఉద్యమం పట్ల, ఎంత సానుకూల భావంతో ఉండేవో ఆంధ్ర పత్రిక సంపాదకీయం బట్టి తెలుసుకోవచ్చును.

## మహాసభ ఇచ్చిన ఉత్తేజం - రాష్ట్రమంతటా విద్యార్థి పోరాటాలు

మహాసభ ఇచ్చిన ఉత్తేజంతోనూ, నిర్దిష్ట కార్యక్రమంతోనూ ఆ తరువాత రాష్ట్రంలో అనేకచోట్ల విద్యార్థి సంఘాలు ఏర్పడి, అనేక సమస్యలపై ముఖ్యంగా గుమాస్తాలను తయారుచేసే వలస బానిస విద్యావిధానానికి వ్యతిరేకంగా, డిటెన్షను

వడపోతపద్ధతికి వ్యతిరేకంగా అనేకపోరాటాలు విజృంభించాయి. స్థానిక కోర్కెలు కూడా జోడించబడ్డాయి.

## విశాఖపట్నం వైద్య కళాశాల డిగ్రీలు - గుర్తింపు సమస్య

మహాసభ జరిగే సమయానికే విశాఖపట్నం ఆంధ్ర మెడికల్‌కాలేజి విద్యార్థులు తమ డిగ్రీలను మెడికల్ కౌన్సిల్ వారు గుర్తించనందుకు నిరసనగా ఆందోళన జరుపుతున్నారు. కాలేజీకి తగిన భవనాలు, లేబోరేటరీలు, శిక్షణావకాశాలు లేవనే కారణంతో ఈ కాలేజీ డిగ్రీలను ఇండియన్ మెడికల్ కౌన్సిల్ వారు గుర్తించ నిరాకరించారు. ఈ విషయంలో మద్రాసు ప్రభుత్వం, ఆంధ్ర మెడికల్ కాలేజీ పట్ల చూపుతున్న ఉపేక్షపట్ల, వివక్షత పట్ల విద్యార్థులలోను, ఆంధ్ర ప్రాంతం ప్రజలలోను తీవ్ర నిరసన వ్యక్తమైంది.

ఈ సమస్యను విద్యార్థి ఫెడరేషన్ తీసుకొని రాష్ట్రమంతటా ఆందోళన జరిపింది.

1937 ఆగష్టు 17 వ తేదీన విశాఖపట్నం వైద్య కళాశాల విద్యార్థుల సంఘ సాధారణ సమావేశం జరిగింది. 14 వ తేదీన ఈ విషయమై మద్రాసు ప్రభుత్వం చేసిన ప్రకటనపై ఒక తీర్మానాన్ని ఏకగ్రీవంగా ఆమోదించారు.

"వైద్యకళాశాల ఎత్తి వేయబోమని ప్రభుత్వం వాగ్దానం చేసింది. అయితే విద్యార్థుల డిగ్రీలు ఇండియన్ మెడికల్ కౌన్సిల్ వారు గుర్తించుటకు కావలసిన సదుపాయాలన్నీ చేయడం న్యాయం కాబట్టి అలాంటి చర్యను తీసుకోవాలి. రాబోవు బడ్జెటు సమావేశంలో కాలేజీ అభివృద్ధికొరకు గ్రాంటు యివ్వాలి. ఆ విధంగా బడ్జెటులో కేటాయించినట్లు ఇండియన్ మెడికల్ కౌన్సిల్‌కు 24 వ తేదీలోగా తెలియజేయాలని "సమావేశం వారు కోరుతున్నారు."

## మెడికల్ కాలేజీ ఆందోళన - పూర్వ చరిత్ర

దాదాపు 10 సంవత్సరాల నుండి ప్రభుత్వం ఆంధ్ర మెడికల్ కాలేజీ విషయమై జరుపుతూన్న ఉపేక్షగురించి ఆనాటి నవశక్తి పత్రికలో (13-7-38) ఆనాటి రాష్ట్ర విద్యార్థి నాయకులలో ఒకరైన శ్రీ యర్రమిల్లి నరసింహారావు వ్రాసిన వ్యాసం ద్వారా తెలుస్తూంది

విశాఖపట్నం మెడికల్ కాలేజీలో ప్యాసైన వారికి మద్రాసు విశ్వవిద్యాలయం నుండి రికగ్నైజ్‌డ్ డిగ్రీలు ఇవ్వబడుతాయని 1923లో మెడికల్ కాలేజీ స్థాపించబడింది. తరువాత దీనిని ఆంధ్ర యూనివర్సిటీకి అనుబంధించారు. ఇండియన్ కౌన్సిల్ వారు వచ్చి, చూసి, సరియైన భవనాలు లేవని డిగ్రీలు రికగ్నయిజు చేయ నిరాకరించారు (1934లో). 1937 జనవరిలో మళ్ళి ఇండియన్ మెడికల్ కౌన్సిల్ వారు వచ్చిచూసి, అవే లోపాలు ఉన్నందున డిగ్రీలు రికగ్నయిజు చేయబోమని

అన్నారు. దీనికి కారణం సరియైన బడ్జెటు కేటాయింపులు చేయలేదు. అందువలన మెడికల్ కాలేజీ విద్యార్థులు సమ్మె చేశారు. డిగ్రీలు రికగ్నయిజు కాకపోతే ఇతర ప్రాంతాలలో, విదేశాలలో ఉన్నత విద్య చదవడానికి వీలులేదు. ఉద్యోగార్హత లేదు

సమ్మెచేసిన ఫలితంగా రాష్ట్రప్రభుత్వం భవన నిర్మాణానికి బడ్జెటు కేటాయింపులు చేస్తామని వాగ్దానం చేశారు కాని భవన నిర్మాణం ప్రారంభం కాలేదు. ఈ విషయమై మద్రాసు, విశాఖపట్నం విద్యార్థి సంఘాల వారు మద్రాసు ఆరోగ్యశాఖా మంత్రి డాక్టరు రాజన్‌గారి వద్దకు రాయబారం వెడితే ఆయన విద్యార్థి ప్రతినిధి వర్గాన్ని చూడను పొమ్మన్నారు

మద్రాసు ప్రధాని (ఆరోజుల్లో ముఖ్యమంత్రినే ప్రధాని అని పిలిచేవారు) రాజాజీ ఆంధ్రప్రదేశ్ పర్యటనకు వచ్చినపుడు ఈ అవకాశాన్ని ఆంధ్ర విద్యార్థులు వినియోగించుకొని వారికి విజ్ఞప్తులు సమర్పించాలనీ, సభలు జరుపాలనీ విశాఖ మెడికల్ కాలేజీ డిగ్రీలను, బి.కాం. డిగ్రీలను గుర్తించాలని ఆందోళన చేయాలనీ ఈ వ్యాసంలో కోరారు.

## సమ్మె పోరాటలు

తెనాలి, గుంటూరుజిల్లా తెనాలి హైస్కూలు విద్యార్థులు 1937 నవంబరు 17 నుండి 23 వరకు సమ్మె జరిపారు. ఈ కాలంలో ఇది రాష్ట్రంలో మొదటి విద్యార్థిసమ్మె అని చెప్పవచ్చు విద్యార్థి సంఘాన్ని స్థాపించుకోవడానికి అనుమతి, సైకిల్‌షెడ్డు నిర్మాణం, గేమ్సు కమిటీలో విద్యార్థులకు ప్రాతినిధ్యం, నామినేషన్లు రద్దుచేసి ఎన్నికలు; మధ్యాహ్నం భోజనం చేయడానికి వసతి, సమర్థులైన ఉపాధ్యాయుల నియామకం, విద్యార్థులను మనుష్య మాత్రులుగా (కార్పోరల్ శిక్షలు లేకుండా) చూడాలి మొదలైన కోర్కెలకోసం ఈ సమ్మె జరిగింది.

నవంబరు 22న విద్యార్థుల కోర్కెలన్నీ ఆమోదింపబడటంలో సమ్మె జయప్రదంగా ముగిసింది. సాయంత్రం జరిగిన సభకు శ్రీ పిల్లలమర్రి ఆంజనేయులు గారు (కాంగ్రెస్ నాయకులు) అధ్యక్షత వహించారు. ఎమ్. హనుమంతరావు (మోటూరు), ఎమ్. కృష్ణమూర్తి, ప్రభల కృష్ణమూర్తి, ఉపద్రష్ట వెంకట్రామయ్య, డాక్టర్ గోవిందరాజుల వెంకటసుబ్బారావు మరికొందరు మాట్లాడారు. ఈ సమ్మె ఆంధ్రరాష్ట్ర విద్యార్థి ఉద్యమం సాగించిన సమ్మె పోరాటాలకు నాంది పలికింది. ఆనాటి కాంగ్రెస్ నాయకులు సోషలిస్టుపార్టీ నాయకులు, పురప్రముఖులు సమ్మె పోరాటాన్ని బలపరిచి జయప్రదం చేయడానికి తోడ్పడ్డారని బహిరంగ సభావిశేషాలనుబట్టి తెలుస్తుంది.

## ఆంధ్ర రాష్ట్ర దీక్షా దినం

జాతీయోద్యమంలో భాగంగా భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు కోసం ప్రత్యేకాంధ్ర రాష్ట్రం కోసం ఆనాడు జరుగుతున్న ఆందోళనలో విద్యార్థులు కూడా పాల్గొనడం జరిగింది.

1937 నవంబరు 14వ తేదీన పశ్చిమ గోదావరి జిల్లా తణుకు విద్యార్థి సంఘం వారు ఆంధ్ర రాష్ట్ర దీక్షా దినం జరిపారు. 1000 మంది విద్యార్థులు పెద్ద ఊరేగింపు జరిపారు. బహిరంగ సభకు శ్రీ పోతాప్రగడ శ్రీ రామరావుగారు అధ్యక్షత వహించారు కాంగ్రెస్ నాయకులు శ్రీయుతులు కొవ్వలి గోపాలరావు, శ్రీ ముదిగంటి జగ్గన్నశాస్త్రి, పెమ్మరాజు గోపాలం, విద్యార్థి ప్రతినిధులు కోటిపల్లి అప్పన్న, దేవరకొండ బాలగంగాధర తిలక్ (తరువాత సుప్రసిద్ధ కవిగా పేరొందారు) శ్రీ మహబూబ్ ఆలీఖాన్, ముళ్ళపూడి హరిశ్చంద్రప్రసాద్ (ఆ తరువాత ప్రసిద్ధ పారిశ్రామికవేత్త) మున్నగు వారు ఆంధ్ర రాష్ట్రం వెంటనే ఏర్పరచాలని కోరుతూ ప్రసంగించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో చేరడానికి రాయలసీమ విద్యార్థులు అంగీకరించినందుకు అభినందించుతూ, ప్రత్యేకాంధ్ర రాష్ట్ర నిర్మాణం చేపట్ట వీరు అదే సానుకూల వైఖరిని అవలంభించాలని కోరుతూ తీర్మానాలు చేశారు. ఆంధ్రోద్యమం పట్ల హిందూ పత్రిక అవలంభిస్తున్న వైఖరిని నిరసించుతూ తీర్మానించారు.

## ప్రథమ కృష్ణా జిల్లా విద్యార్థి మహాసభ

ప్రథమ కృష్ణా జిల్లా విద్యార్థి మహాసభ మచిలీపట్నంలో 1937 నవంబరు 15, 16 తేదీలలో పురమందిరంలో జరిగింది. కామ్రేడ్ మద్దూర్తి అన్నపూర్ణయ్య గారు (రాష్ట్ర సోషలిస్టు పార్టీ నాయకులు) అధ్యక్షత వహించారు. కామ్రేడ్ జయప్రకాశ్ నారాయణ ప్రారంభోత్సవం చేశారు ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ సి. రామనాథబాబు (కాజ) స్వాగతోపన్యాసం చేశారు.

శ్రీ జయప్రకాశ్ నారాయణ తమ ప్రారంభోపన్యాసంలో, విద్యార్థులు గత జాతీయ స్వాతంత్ర్య సంగ్రామంలో (1930-32) పాల్గొని యిప్పుడు నిద్రావస్థలో ఉన్నారని తాను భావిస్తున్నాననీ చైనా, ఈజిప్టులలో విద్యార్థులు జాతీయోద్యమంలో పాల్గొన్నారనీ వారిని ఆదర్శంగా పెట్టుకొని విద్యార్థులు మేల్కొని జాతీయ సంగ్రామంలో పాల్గొనాలనీ కోరారు బెంగాల్, మద్రాసు రాష్ట్రాలలో విద్యార్థులు (పరీక్షలు ప్యాసు కాలేనందుకు) ఆత్మహత్యలు చేసుకుంటున్నట్లు పత్రికల ద్వారా వింటున్నామనీ, పరీక్షలు ప్యాసవడం, పెద్ద ఉద్యోగాలు సంపాదించాలనీ ఉద్దేశించుట తాము నేర్చుకున్న చదువులకే అప్రతిష్ఠ తేవడమేనని అన్నారు "ఉద్యోగప్రయత్నమే ప్రధానంగా పెట్టుకొనుట శోచనీయం

దేశసేవకు విద్యార్థులు వెనుకంజ వేయడానికి కారణం ప్రస్తుత విద్యా విధానమే. విద్యార్థులు స్టడీ సర్కిల్స్, సంచార లైబ్రరీలు నెలకొల్పుకోవాలన్నారు. సి.ఐ.డి శాఖను తీసివేయాలి రాబోవు స్వాతంత్ర్య సంగ్రామంలో విద్యార్థులు పాల్గొనాలన్నారు.

మద్దూరి అన్నపూర్ణయ్యగారు అధ్యక్షోపన్యాసం యిస్తూ, కొత్తపట్నం వేసవి పాఠశాలను నిషేధించినందుకు ప్రభుత్వాన్ని నిరసించారు. విద్యార్థి సంఘాలను కళాశాల అధికారులు వ్యతిరేకిస్తూన్నందుకు ఖండించారు. ఇంగ్లాండులో వలె విద్యార్థులు మిలిటరీ ట్రైనింగు నేర్చుకోవాలన్నారు. బాట్లీవాలా అరెస్టును ఖండించారు. ప్రత్యేకాంధ్ర రాష్ట్రంకోసం ఆందోళన జరపాలని, విద్యార్థులు ప్రజలలోకి వెళ్ళి వారిలో చైతన్యం కల్గించాలని ఉద్బోధించారు.

## తీర్మానాలు

మహాసభలో దిగువ తీర్మానాలు ఆమోదించారు.

ప్రత్యేకాంధ్ర రాష్ట్రం ఏర్పరచాలి. భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన గురించిన కాంగ్రెస్ సిద్ధాంతాలను రాజాజీ, రాజన్, సాంబమూర్తి, రాముని మీనన్ గారు పాటించనందుకు నిరసించారు. కలకత్తా ఎ. ఐ. సి. సి తీర్మానాన్ని వీరు అనుసరించాలి ఆంధ్ర రాష్ట్ర విభజనకు ప్రభుత్వం అంగీకరించనిచో ఆంధ్ర శాసన సభ్యులు రాజీనామా యివ్వడానికి సిద్ధంగా ఉండాలి కొత్తపట్నం రాజకీయ పాఠశాలపై నిషేధం తొలగించాలి.

రాయలసీమ కళాశాలలను, ఆంధ్ర విశ్వవిద్యాలయంలో చేర్చాలని ఈ సభ వారు రాయలసీమ వారిని కోరుతున్నారు. వేసవిలో మరల రాజకీయ పాఠశాల నడపాలని రాష్ట్ర యువజన సంఘాన్ని రాష్ట్ర సోషలిస్టు పార్టీని కోరారు.

జిల్లా విద్యార్థి ఫెడరేషన్‌ను రాష్ట్ర ఫెడరేషన్‌తో అనుబంధించడానికి నిర్ణయించారు. నాల్గవ ఫారములోనే పబ్లిక్ పరీక్షపెట్టే సూచన విద్యాభివృద్ధికి భంగకరమని నిరసించారు. బెంగుళూరు విద్యార్థులపై ఇటీవల జరిపిన దౌర్జన్యాన్ని ఖండించారు. రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ వారు తయారు చేసిన కనీస కోర్కెలను బలపరుస్తూ, స్కూలు ఫైనల్ పరీక్షా కేంద్రాలను ప్రతీ హైస్కూలులో ఏర్పాటు చేయాలని కోరుతూ, విద్యార్థి సభలకు సి. ఐ డి. లను పంపుతున్నందుకు ఖండించుతూ తీర్మానించారు.

- ఆంధ్రపత్రిక 1937 నవంబరు 17

## ఆనాటి విద్యాసంస్థలలో పరిస్థితులు

ఆంధ్రరాష్ట్రంలో 1937 నాటికి కాలేజీలు, హైస్కూళ్ళు చాలా తక్కువ. కొన్ని జిల్లాల్లో కాలేజీలే లేవు. [ఉదా-పశ్చిమ గోదావరి, శ్రీకాకుళం వగైరా]

విశాఖపట్నంలో ఆంధ్ర యూనివర్శిటీ ఆర్ట్స్ అండ్ సైన్సు కళాశాల, మెడికల్ కాలేజీ, ఎ వి ఎన్. కళాశాల

విజయనగరం :- విజయనగరం మహారాజ కళాశాల

కాకినాడ :- పిఠాపురం మహారాజ కళాశాల

రాజమండ్రిలో :- గవర్నమెంటు ఆర్ట్స్ కళాశాల

బందరులో :- హిందూ కళాశాల, నోబుల్ కళాశాల [1938 వరకు మాత్రమే]

గుంటూరులో :- ఆంధ్ర క్రిస్టియన్ కళాశాల, హిందూ కళాశాల

నెల్లూరులో :- వి. ఆర్. కాలేజీ

అనంతపురంలో :- గవర్నమెంటు కాలేజీ (మద్రాసు యూనివర్శిటీకి అనుబంధించబడింది)

ఆంధ్ర యూనివర్శిటీలోని సైన్సు అండ్ ఆర్ట్స్ కాలేజీ, రాజమండ్రి, అనంతపురం కాలేజీలు మాత్రమే ప్రభుత్వ కళాశాలలు. మిగిలినవన్నీ ప్రైవేటు యాజమాన్యంలో వుండేవి. ఆనాటి విద్యా సంస్థలలో పరిస్థితి చూస్తే కమిటీవారు తేనిపోని నెపాలమీద విపరీత జరిమానాలు విధించేవారు. సస్పెండు చేసేవారు. విద్యార్థి సంఘాలను ఏర్పరచుకుంటే దౌర్జన్యంగా అణచివేసేవారు. క్రూరంగా వత్తిడి చేసి క్షమాపణ పత్రాలు తీసుకోవడం నిరంకుశమైన నియమాలు పెట్టి తమ కష్టాలు అధికారులకు, సంఘం ద్వారా కాక వ్యక్తిగతంగా, నేరుగా కాకుండా లెక్చరర్ల ద్వారా, వ్రాతమూలకంగా కాక, మాట ద్వారా చెప్పుకోమనేవారు. విద్యార్థి సంఘాలు ఏర్పడకుండా చేయడం మొదలైన నిరంకుశ చర్యలకు పాలక బృందం పాల్పడేది. విద్యార్థులు కాలేజీలలో చేరేటప్పుడు కాలేజీ పరిపాలకులచే నియమించబడిన ఒక కమిటీ సిఫార్సు లేనిదే చేర్చుకొనేవారుకాదు విద్యార్థులు యింకా కొన్ని కఠినమైన నిబంధనలకు లోను కావలసి వచ్చేది.

— వై. వి కృష్ణరావు స్మృతులు
"కమ్యూనిజం" పత్రిక

## సమ్మెల వెల్లువ

1937 ఆగష్టు గుంటూరులో జరిగిన 14వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహా సభ యిచ్చిన నిర్దిష్ట కార్యక్రమం, కనీస కోర్కెల ప్రణాళిక, సామ్రాజ్యవాద వ్యతిరేకపోరాటలక్ష్యం వెలుగులో రాష్ట్రమంతటా విద్యార్థి సమ్మె విజృంభించాయి ఎక్కడికక్కడ విద్యార్థి సంఘాలు నిర్మించబడ్డాయి.

ఆంధ్ర యూనివర్శిటీ బి కామ్. విద్యార్థులు తమ డిగ్రీల రికగ్నిషన్ కొరకు 1938 ఫిబ్రవరి 7 వ తేదీ నుండి సమ్మె చేశారు. వీరికి సానుభూతిగా

ఆర్ట్స్, సైన్సు, టెక్నాలజీ విద్యార్థులు, మిసెస్ ఎ. వి ఎన్. కాలేజీ విద్యార్థులు కూడా సమ్మె చేశారు.

## చారిత్రాత్మకమైన ఎ.సి. కాలేజీ విద్యార్థి సమ్మె

పబ్లిక్ పరీక్షలలో వడపోత - డిటెన్షన్ విధానం - ఆరోజున బ్రిటీషు సామ్రాజ్యవాద బానిస విద్యా విధానంలో ఒక ప్రధానాంశం. ఎక్కువ మంది గుమాస్తాలు తయారైతే నిరుద్యోగ సమస్య ఏర్పడుతుంది. అందుచేత నూటికి 30 మందిని ప్యాసుచేసి మిగిలిన వారిని ఫెయిల్ చేసేవారు. సెలెక్షన్ పరీక్షలు పెట్టి పరీక్షలకు వెళ్ళకుండా డిటెయిన్ చేసేవారు. ఇది ఆనాడు విద్యార్థుల పాలిట పెనుభూతంగా ఉండేది.

1937 డిసెంబరులో గుంటూరు ఎ.సి కాలేజీ అధికారులు ఇంటర్, బి. ఎ సీనియర్ క్లాసు విద్యార్థులకు సెలెక్షన్ పరీక్ష పెట్టారు అందులో కొందరిని డిటెయిన్ చేసి మరికొందరిని పబ్లిక్‌పరీక్షలకు సెలెక్టు అయినట్లుగా నోటీసుబోర్డులో పేర్ల జాబితాను ప్రకటించారు.

ఆ ఏడాది దాదాపు ఆంధ్ర విశ్వవిద్యాలయ అనుబంధ కళాశాలల్లో మొత్తం 1000 మంది విద్యార్థుల వరకు డిటెయిన్ చేయబడ్డట్లు అంచనా

ఎ సి. కాలేజీ విద్యార్థి సంఘం ఈ డిటెన్షను విధానాన్ని ప్రతిఘటించడానికి నిర్ణయించింది. కాలేజీకి సంబంధించిన యితర కోర్కెలను కూడ దీనికి చేర్చి కోర్కెలపత్రం తయారుచేయబడింది ఈ కోర్కెల పత్రాన్ని ప్రిన్సిపాల్‌కు అందజేశారు. కాలేజీ అధికారులు ఈ కోర్కెల పత్రాన్ని అంగీకరించనందున డిసెంబరులో సమ్మె ప్రారంభమైంది. ఆంధ్ర రాష్ట్రంలో డిటెన్షనులు పోవాలని జరిగిన మొట్టమొదటి చారిత్రాత్మక సమ్మె యిది. సమ్మె జయప్రదంగా నిర్వహించడానికి కార్యాచరణ కమిటీ ఒకటి ఏర్పరచబడింది. కాలేజీ సమ్మె 10 రోజులు జరిగింది. కాలేజీ విద్యార్థులలో ఎక్కువ మంది సమ్మెను హృదయ పూర్వకంగా బలపరిచారు. అది క్రిష్టియన్ కాలేజీ; క్రిష్టియన్ విద్యార్థులు సమ్మెలో జేరడం సులువైన విషయం కాదు. సమ్మెను బలపరచని మరి కొందరు విద్యార్థులు. కాలేజీకి హాజరు కాకుండా నివారించడానికి కాలేజీకి ఉన్న రెండు గేట్ల వద్ద సమ్మె చేస్తున్న విద్యార్థులు పికెటింగు చేసేవారు. కాలేజీ ప్రిన్సిపాల్ (యూరోపియన్) సైప్స్ ఈ సమ్మెను భగ్నం చేయడానికి అన్ని విధాలా ప్రయత్నించాడు. ఎవరూ లోపలికి పోకుండా నివారించడానికి గేట్లకు అడ్డంగా విద్యార్థులు పడుకునేవారు.

కమ్మ హాస్టలు విద్యార్థులు ఎ. సి. కాలేజీ సమ్మెలో ప్రధాన పాత్ర వహించారు. ఒక రోజున సైప్సు కారుమీద వచ్చి - గేటు దగ్గర పడుకున్న విద్యార్థుల మీదకు నడిపాడు కారు బంపర్ దెబ్బ కామ్రేడ్ వై. వి. కృష్ణారావుకు

తగ్గించి. అయినా ఎవరూ చలించలేదు. విద్యార్థి సమూహాలకు బై ' సైమన్స్ గో బ్యాక్ అనే నినాదాలు మిన్నుముట్టాయి దానితో సైమన్స్ తోక ముడిచాడు సమ్మె గుంటూరు పట్టణంలోని అన్ని వర్గాల ప్రజలలోనూ, రాష్ట్రంలోని విద్యార్థు లందరిలోనూ పెద్ద సంచలనం కలిగించింది. కొందరు కాంగ్రెస్ వాదులు పట్టణ ప్రముఖులు సమ్మెను బలపరిచారు. గుంటూరులోని హిందూ కాలేజీ, హిందూ హైస్కూలు విద్యార్థులు ఎ. సి. కాలేజీ విద్యార్థులకు సానుభూతిగా సమ్మె చేశారు. పట్టణ ప్రజానీక మంతా సానుభూతి చూపారు. చివరకు కాలేజీ అధికారులు దిగివచ్చి విద్యార్థుల కోర్కెలన్నీ ఆమోదించారు. డిటెయిన్ చేసిన విద్యార్థులందరిని పబ్లిక్ పరీక్షకు పంపడానికి అంగీకరించారు. ఆ విధంగా సమ్మె దిగ్విజయంగా ముగిసింది. ఈ సమ్మె రాష్ట్రంలోని విద్యార్థులందరిని ఎంతో ఉత్తేజపరిచింది. ఆ తరువాత అనేక కాలేజీలలో హైస్కూల్లో డిటెన్షన్ వ్యతిరేక సమ్మెలు జరిగాయి.

గుంటూరు సమ్మెకు రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ ప్రధాన కార్యదర్శిగా ఉన్న శ్రీ మాకినేని బసవపున్నయ్య, జాయింటు కార్యదర్శి శ్రీ వై.వి. కృష్ణారావు విద్యార్థి నాయకులు శ్రీ డి. వి. అప్పారావు, శ్రీ నాళం నరిసింహారావు మున్నగు వారు నాయకత్వం వహించారు

## కమ్మ హాస్టల్ దినోత్సవం

గుంటూరులోని కమ్మ హాస్టల్ విద్యార్థి ఉద్యమానికి కేంద్రంగా ఉండేది. పార్టీ నాయకులు ఎవరు వచ్చినా అతిథి గృహంగా కూడా ఉండేది. ఈ నాడు భారత కమ్యూనిస్టు పార్టీలోనూ, మార్క్సిస్టు పార్టీలోనూ ఉన్న అనేక మంది ప్రముఖులు వామపక్ష రాజకీయాలకు కేంద్రంగా ఉన్న కమ్మ హాస్టలు నుండే తయారయ్యారు నేటి సి.పి.ఎమ్ నాయకులు కామ్రేడ్స్ మాకినేని బసవపున్నయ్య, మోటూరు హనుమంతరావు, లావు బాల గంగాధరరావు, కమ్యూనిస్టు నాయకులు వై.వి కృష్ణారావు, వేములపల్లి శ్రీ కృష్ణ, టి. వెంకటేశ్వర రావు తదితరులు, ఇంకా కొల్లా వెంకయ్య, మాదాల నారాయణ స్వామి మొదలైన వారంతా యిక్కడ ఉండేవారు. కామ్రేడ్ వై. బలరామమూర్తి హాస్టలు ప్రక్కనవున్న వారి యింట్లో ఉంటూ హాస్టలుకు తరచు వచ్చేవారు. అది ఆంధ్ర హాస్టలులో కూడా పలువురు విద్యార్థి కార్యకర్తలు ఉండేవారు.

1938 కమ్మ హాస్టలు వార్షికోత్సవాల సందర్భంలో కలెక్టరు హాస్టలు విద్యుద్దీపాల ప్రారంభోత్సవానికి వచ్చినపుడు ఆ ఉత్సవాన్ని విప్లవ రాజకీయ భావాలు గల నాటకాలు సాంస్కృతిక కార్యక్రమాలతో జరిపారు విద్యార్థుల సమ్మెకు ద్రోహం చేసిన ప్రొఫెసర్సుపై "ప్రొఫెసర్సు పెరాక్సైజం" అను

మోనోపొలీ క్యాపిటలిజమ్‌, హిట్లర్, ముసోలినీ, బోజో ఫాసిస్టు పాలనలను పండిట్ నెహ్రూ బహిర్గతం చేయడం ఇతివృత్తంగా గల నాటికను, కన్యాశుల్కంలోని కొన్ని భాగాలను ప్రదర్శించారు. జస్టిస్ పార్టీకి చెందిన హాస్టల్ నిర్వాహకులకు యిది కంటగింపుగా ఉన్నప్పటికీ దానిని లెక్క జేయకుండా హాస్టలు ఒక రాజకీయ అధ్యయన కేంద్రంగా, మార్క్సిస్టు అధ్యయన కేంద్రంగా నడుప బడుతూ ఉండేది. శ్రీయుతులు పి. వి. శివయ్య, మాడభూషి వెంకటాచారి, ప్రభల కృష్ణమూర్తి మున్నగువారు ఆనాడు అధ్యయన తరగతులు నడిపారు.

## బందరు హిందూ కళాశాల విద్యార్థుల సమ్మె

1938 ఫిబ్రవరి 7 వ తేదీన బందరు హిందూ కళాశాల విద్యార్థులు 380 మందికి 370 మంది తమ కనీస కోర్కెలకోసం సమ్మె చేశారు. విద్యార్థి ప్రతినిధి వర్గాన్ని ప్రిన్సిపాల్ అగౌరవ పరచినందుకు నిరసనగా కూడా సమ్మె ప్రారంభించారు. సమ్మె 12 వ తేదీ వరకు సాగింది. లైబ్రరీ ఫీజు సద్వినియోగం చేయాలనీ హిందూ, ఆంధ్ర పత్రికలతో బాటు నవశక్తి, వాహిని, ప్రజాబంధు మున్నగు వామపక్ష, అభివృద్ధికర భావాలు కల్గిన పత్రికలు తెప్పించాలనీ, గేమ్సు కమిటీ ఏర్పర్చాలని, కాలేజీ మ్యాగజయిన్ ప్రింటు చేయాలనీ, జరిమానాలు విధించరాదనీ, మంచినీటి వసతి కల్పించాలని విద్యార్థులు కోరారు.

సమ్మె ప్రారంభించిన తరువాత ప్రిన్సిపాల్‌గారు విద్యార్థి ప్రతినిధి వర్గాన్ని సంభాషణలకు పిలిచారు. అందులో నోబుల్ కాలేజీ విద్యార్థి ఎమ్. కట్టయ్య కూడా ఉన్నారు. ఇతర కాలేజీ విద్యార్థులు ప్రతినిధి వర్గంలో ఉండకూడదని, హిందూ కాలెజీ విద్యార్థులే ఉండాలనీ అన్నారు. కట్టయ్యగారు లేనిదే తాము మాట్లాడేది లేదని విద్యార్థి ప్రతినిధులు అన్నారు. సంప్రదింపులు విఫలమయ్యాయి. ఫిబ్రవరి 10 వ తేదీన కాలేజీ గేటు వద్ద పికెటింగు జరిపారు. ఈ సందర్భంలో జరిగిన బహిరంగ సభలో టి. కె. విశ్వనాథం, బి ఎ బి ఎల్., టి.కె. రామస్వామి, బి.ఎ., బి.యిడి. రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ కార్యదర్శి మాకినేని బసవపున్నయ్య, శ్రీ ఎన్. నరసింహారావు మున్నగు వారు మాట్లాడారు. ఆవేళ హిందూ కాలేజీ హైస్కూలు విద్యార్థులు కూడా సమ్మె చేశారు.

చివరకు డి.ఎస్.పి., డిప్యూటీ కలెక్టరు వచ్చి సమ్మె పరిష్కారానికి రాజీ యత్నాలు చేశారు. ప్రిన్సిపాల్ విద్యార్థుల కోర్కెలను అంగీకరించారు. అంగీకరించబడిన కోర్కెలు :- 1. మాగ్జయిన్ కొరకు తీసుకొన్న డబ్బు తిరిగి యిచ్చి వేస్తారు. 2. యూనియన్‌లో పాల్గొన్నందుకు ఎవరిపై ఎట్టి క్రమశిక్షణా చర్య తీసుకోరు. 3. ఆధునిక పత్రికలు (వామపక్ష పత్రికలు) నవశక్తి,

ప్రజాసంఘ వాహిని, న్యూఏజ్, స్టూడెంటు మొదలైన పత్రికలు విచారించి తెప్పించడానికి అంగీకరించారు. 4. గేమ్సు కమిటీలో విద్యార్థుల ప్రతినిధులు యిద్దరు ఫిజికల్ డైరెక్టరు ప్రిన్సిపాల్, స్టాఫ్‌లోని ఒకరు కలిపి ఆదాయ వ్యయాలను సరిచూస్తారు. 5. యూనివర్శిటీ రూల్సు ననుసరించి కాలేజీ విద్యార్థిసంఘం యొక్క ఆదాయ వ్యయాలను చూచుటకు విద్యార్థి ప్రతినిధులకు అధికారం యివ్వబడును. 6. సైకిల్‌షెడ్డు వీలైనంత త్వరలో నిర్మిస్తారు. 7. సీనియర్ క్లాసు విద్యార్థులందరూ పరీక్షలకు పంపబడుదురు. 8. మంచినీళ్ళ సదుపాయాలు వీలైనంత త్వరలో సరిచేయబడుతుంది. 9. లోగడ విధించిన సమిష్టి జరిమానాలను తిరిగి యిచ్చివేస్తారు. 10. సమ్మెలో పాల్గొన్న విద్యార్థులపై ఎట్టి క్రమశిక్షణా చర్యతీసుకోరు. 11. అటెండెన్సు చాలనివారికి వర్కింగ్‌రోజులు ఎక్కువ చేస్తారు. సమ్మె జయప్రదంగా ముగిసింది.

ఇదే సమయంలో కృష్ణాజిల్లా తాడంకి, పామర్రు, చలపల్లి, గన్నవరం, పునాదిపాడు, విజయవాడ, గుంటూరుజిల్లా, కొల్లూరు, బాపట్ల, పొన్నూరు, పశ్చిమ గోదావరిజిల్లా పాలకొల్లు, ఉండి, మార్టేరు, తూర్పు గోదావరిజిల్లా కాకినాడ, విశాఖపట్నం జిల్లా విశాఖపట్నం తదితర అనేక చోట్ల విద్యార్థిసంఘాలు ఏర్పడి విద్యార్థికోర్కెల కోసం పోరాటాలు ప్రారంభించారు. విద్యాలయాధికారుల నిర్బంధ విధానాన్ని ఎదుర్కొని సంఘాలు నిర్మించుకోవడం, డిటెన్షన్ విధానానికి వ్యతిరేకంగా పోరాడటం జరిగింది.

**తాడంకి :-** 1938 జనవరి 12న తాండకిలో తాండకి బోర్డు హైస్కూలు విద్యార్థిసంఘం ఏర్పరచుకొని అఖిలభారత, రాష్ట్ర, జిల్లా విద్యార్థి ఫెడరేషన్‌కు అనుబంధిచారు. హెడ్మాష్టరుగారు సంఘాన్ని విచ్ఛిన్నం చేయడానికి పూనుకొన్నారు. 1937 డిసెంబరు 17న కోర్కెల పత్రం సమర్పించినా - సమాధానం యివ్వలేదు. ఫిర్కా, జిల్లా బోర్డు మెంబరు శ్రీ ఉమామహేశ్వర రావుగారు చెప్పినా వినలేదు. విద్యార్థిసంఘం స్థాపించుకున్నందుకు కొడతామని, కాండక్టు సర్టిఫికెటులో "వెరీబ్యాడ్" అని వ్రాస్తామని బెదరించారు. సంఘం పెట్టుకోవడం విద్యార్థులకు నష్టదాయకమనీ, డిసిప్లిన్‌కు భంగకరమని, జరిమానాలు విధిస్తామని, స్కూలు ఫైనల్‌లో డిటెయిన్ చేస్తామని బెదరించారు. విద్యార్థిసంఘాన్ని రికగ్నయిజు చేయలెదు. సంఘ సమావేశాలు స్కూలు ఆవరణలో జరుపుకోనీయలేదు. గేమ్సు ఫీజు, లైబ్రరీఫీజు వసూలు చేస్తున్నప్పటికి ఆటవస్తువులు, పుస్తకాలు యివ్వడంలేదు. ఇందుపై తాడంకి విద్యార్థులు 5-1-1938 న సమ్మెచేశారు. సమ్మెలో ప్రధానకోర్కె డిటెన్షన్‌లు రద్దు చేయాలన్నదే. సమ్మె ఫలితంగా స్కూలు హెడ్మాష్టరు దిగివచ్చారు. పబ్లిక్ పరీక్షకు విద్యార్థులందరిని పంపడానికి

అంగీకరించారు. మిగతా కోర్కెలను కూడా హెడ్మాష్టరు అంగీకరించారు 14 రోజుల సమ్మె అనంతరం 19-1-39 న సమ్మె జయప్రదంగా ముగిసిందని విద్యార్థిసంఘ కార్యదర్శి కాట్రగడ్డ వెంకట్రాయుడు ప్రకటించారు.

పామర్రు :- పామర్రు హైస్కూలు విద్యార్థి సంఘం వారు సమావేశమై విద్యార్థుల పురోభివృద్ధికి ఆటంకంగా ఉన్న డిటెన్షన్ విధానాన్ని రద్దు చేయాలని కోరారు. ఈ విజ్ఞప్తిని ముందు హెడ్మాష్టరు అంగీకరించలేదు. కాని తరువాత స్కూలు ఫైనల్ క్లాసు టీచర్లు అయిదు మంది, విద్యార్థి ప్రతినిధులు 5 గురు కలిసి అధిక సంఖ్యాకుల అభిప్రాయం ప్రకారం డిటెన్షన్ పద్ధతి లేకుండా అందరినీ పరీక్షలకు పంపడానికి రాజీ పరిష్కారం జరిగింది

ఆనాటి 'నవశక్తి' పత్రికలో శ్రీ వల్లభనేని నారాయణ దాసు ''దేశానికి మేమూ పాటుపడతాం'' అని ఒక వ్యాసం వ్రాస్తూ విద్యార్థి ఉద్యమానికి ఆటంకాలు ఎందుకు? అని ప్రశ్నించారు. ఆనాటి విద్యార్థి సంఘాలపై సి.ఐ.డి ల నిఘాను నిరసించారు.

పునాదిపాడు :- పునాదిపాడు హైస్కూళ్ళలో స్కూలు ఫైనల్ విద్యార్థులందరినీ పరీక్షకు పంపడానికి హెడ్మాష్టరు అంగీకరించారు ఇతర కోర్కెలు కూడా అంగీకరించారు. 12-1-1938న విద్యా శాఖ మంత్రి పునాదిపాడు ఉన్నత పాఠశాలకు వచ్చారు. జిల్లా విద్యార్థి సంఘం తరపున రాయబారం వెళ్ళారు. కాని మంత్రి సంతృప్తికరమైన సమాధానం యివ్వలేదు. అయినప్పటికీ డిటెన్షన్ విధానాన్ని స్కూలులో రద్దు చేయడం వల్ల సమ్మె చేయవలసిన అవసరం లేకపోయింది.

**కొల్లూరు :-** గుంటూరు జిల్లా, కొల్లూరు జిల్లా బోర్డు హైస్కూలు హెడ్మాష్టరు కందాళం హనుమంతరావుగారు జనవరి 17, 1938 వ తేదీవరకు డిటెన్షన్‌లు ఉండవని చెబుతూ 18 వ తేదీన 36 మంది స్కూలు ఫైనల్ విద్యార్థులలో 12 మందిని పరీక్షకు పంపడము లేదని తెలిపారు. అందులో 6గురు రెండవ సంవత్సరం విద్యార్థులు. ఆ సాయంకాలం నుండి స్కూలు విద్యార్థులు సమ్మె ప్రారంభించారు. రాజీ ప్రయత్నాలు విఫలమయ్యాయి. జిల్లా బోర్డు సభ్యులు శ్రీ కాసరవేని అంకినీడు కూడా రాజీ సంభాషణలకు ప్రయత్నించారు. రాష్ట్ర సహాయ సమ్మె కమిటీ కార్యదర్శి శ్రీ వై. వి. కృష్ణారావు వెళ్ళి హెడ్ మాస్టరుతో మాట్లాడినా లాభంలేకపోయింది. అప్పుడు కృష్ణారావుగారు రేపల్లె వెళ్ళి గుంటూరు జిల్లా బోర్డు ప్రెసిడెంటు శ్రీ పాతూరి సుబ్బయ్యగారికి ఈ సమ్మె విషయం విచారించి, వారు వచ్చి సమ్మెను పరిష్కరించాలని అభ్యర్థించాడు. వై.వి. కృష్ణారావు, ప్రెసిడెంటు వెంకట సుబ్బయ్యగారిని కొల్లూరుకు తీసుకు

రావడం జరిగింది. సుబ్బయ్యగారు వచ్చి అందరిని పరీక్షకు పంపునట్లు చేశారు సమ్మె జయప్రదంగా ముగిసిందని సమ్మె కమిటీ కార్యదర్శి శ్రీ వై. వి. కృష్ణారావు ప్రకటించారు.

**బాపట్ల :-** బాపట్ల హైస్కూలు విద్యార్థి సంఘం 1938 జనవరి 19వ తేదీన సమావేశమై డిటెన్షన్ పద్ధతి విద్యార్థుల పురోభివృద్ధికి ఆటంకం గనుక దీనిని రద్దుచేయాలని హెడ్మాష్టరును కోరారు. విద్యార్థులు పంపిన విజ్ఞప్తిని హెడ్మాష్టరు తిరస్కరించారు. అందువలన విద్యార్థులు జనవరి 20 నుండి సమ్మె ప్రారంభించారు. 600 మందికి 550 మంది సమ్మెలో పాల్గొన్నారు. గుంటూరు ఎ. సి. కాలేజీ విద్యార్థి సంఘ నాయకులు వచ్చి సమ్మెను జయప్రదంగా నడిపారు. ఆరోజు సాయంత్రం ఊరేగింపు బహిరంగసభ జరిగాయి. కొడాలి ఆంజనేయులు, ఎమ్. రాధాకృష్ణ (మోటూరి) మున్నగువారు ఉపన్యసించారు. 21 వ తేదీన సేవాసమితి సభ్యులు మునిపల్లె రామరావు, హెడ్మాష్టరుతో మాట్లాడి సమ్మె ముగింపు జేశారు. స్కూలు ఫైనల్ విద్యార్థులందరిని పరీక్షకు పంపిస్తామని, అన్ని క్లాసులకు వచ్చి హెడ్మాష్టరుగారు ప్రకటించారు బహిరంగ సభతో సమ్మె పోరాటం జయప్రదంగా ముగిసింది.

**పొన్నూరు :-** పొన్నూరు బోర్డు హైస్కూలులో స్కూలు ఫైనల్ విద్యార్థులు, సెలెక్షన్ పరీక్షలో ఫలితాలు తెలుపవలసిందని కోరుతూ మహజరు సమర్పించారు. హెడ్మాష్టరు కోపంతో దానిని చింపివేశారు. విద్యార్థి సంఘ కార్యదర్శిని విద్యార్థులను డిస్మిస్‌చేస్తానని బెదరించారు దీనితో విద్యార్థులు 10-1-38న సమ్మెచేశారు. 16 వ తేదీన రాజీ సంభాషణలు జరిగాయి కాని విఫలమయ్యాయి. జిల్లా బోర్డు ప్రెసిడెంటు కాసు బ్రహ్మానందరెడ్డిగారు విద్యార్థి సంఘ నాయకులను పిలిచి సంభాషణలు జరిపారు. మునిపల్లె రామరావు, తూములూరి సత్యనారాయణ మొదలగువారు రాయబారములో పాల్గొన్నారు. శ్రీ బ్రహ్మానందరెడ్డి స్కూలు ఫైనల్ విద్యార్థులందరిని పరీక్షకు పంపేటట్లుచేసి ఆమేరకు ప్రకటన చేయించి సమ్మె విరమింపజేశారు. యితర కోర్కెలు త్వరలోనే నెరవేరుస్తామన్నారు.

**నెల్లూరు :-** నెల్లూరు విద్యార్థులు 1938 ఫిబ్రవరి రెండవ వారంలో సమ్మెచేశారు. కొన్ని షరతులు అంగీకరించడంతో సమ్మె విరమించారు.

**విశాఖపట్నం :-** ఆంధ్ర విశ్వవిద్యాలయం కామర్సు విద్యార్థులు తమ డిగ్రీలను రికగ్నయిజు చేయనందుకు నిరసనగా 1938 ఫిబ్రవరిలో సమ్మెచేశారు. యూనివర్శిటీ కాలేజీలో ఉన్న 275 మంది విద్యార్థుల్లోనూ 140 మంది కామర్సు విద్యార్థులే. ఎన్నిసార్లు మొరపెట్టుకున్నా అధికారులు ప్రభుత్వం పెడచెవిని పెట్టారు. పట్టా ప్రదానోత్సవమునకు మద్రాసు ప్రధాని రాజాజీ వచ్చినప్పుడు

వారికి మొరపెట్టుకున్నా లాభం లేకపోయింది. ఆయన సమ్మెను వ్యతిరేకించారు. ఈ డిగ్రీ గుర్తించాలని విశ్వవిద్యాలయంవారు ప్రభుత్వానికి దరఖాస్తు పంపారు. రాజాజీ సమ్మెను విరమించవలసిందిగా విద్యార్థులను కోరారు. విద్యార్థులు రాజాజీ హామీపై సమ్మె విరమించారు.

**బెజవాడ :-** డిటెన్షన్‌లు రద్దు చేయాలని కోరుతూ 1938 డిసెంబరు 13న బెజవాడ హిందూ హైస్కూళ్ళలో 1000 మంది విద్యార్థులలో 30 మంది మినహా మిగిలిన అందరూ సమ్మెచేశారు. పికెటింగు జరిపి పరీక్షలను కూడా బహిష్కరించారు. చివరకు పరీక్షలు వాయిదావేశారు. డిటెన్షన్‌లు రద్దుచేస్తే స్కూలు రికగ్నిషన్‌రద్దు చేస్తామని డి.ఇ.ఓ. బెదరించారు. మున్సిపల్ చైర్మన్ శ్రీ పోతిన గణపతిరావు, టౌన్ కాంగ్రెస్ కార్యదర్శి శ్రీ ఇంటూరి వెంకటేశ్వరరావుగార్లు సమ్మె పరిష్కారానికి తోడ్పడ్డారు.

**రాజమండ్రి :-** 26-1-1938 న స్వాతంత్ర్య దినోత్సవం రోజున సెలవు యివ్వనందున రాజమండ్రి విద్యార్థులు సమ్మెచేసి ఉత్సవంలో పాల్గొన్నారు. శ్రద్ధానంద ఘాట్‌లో సభకు ముందు శ్రీ క్రొవ్విడి లింగరాజుగారు పతాకోత్సవం జరిపారు. వెన్నేటి సత్యనారాయణ, యర్రమిల్లి జగన్నశాస్త్రి, పందిరి మల్లిఖార్జున రావు, రామచంద్రుని వెంకటప్పగార్లు స్వాతంత్ర్య దినం గురించి మాట్లాడారు. ఆర్ట్స్ కాలేజీ విద్యార్థులు సెలవు అడిగారు. సెలవు నిరాకరించడంతో సమ్మె చేశారు. కామ్రేడ్ చిలకమర్రి సత్యనారాయణాచారి అధ్యక్షత క్రింద కాంగ్రెస్ భవనంలో సభ జరిగింది కాంగ్రెస్ అధ్యక్షులు అరువ ఆదినారాయణమూర్తిగారు విద్యార్థుల సమ్మెను ప్రశంసించారు.

29 వ తేదీన కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ నాయకులు శ్రీమతి కమలాదేవి చటోపాధ్యాయ రాజమండ్రి వచ్చినప్పుడు విద్యార్థుల సభలో మాట్లాడారు. సాయంత్రం శ్రద్ధానంద ఘాట్‌లో సభ జరిగింది. కమలాదేవి ఛటోపాధ్యాయగారు పెట్టుబడిదారీ విధానంవల్ల చెడుగులను గురించి, భారతదేశంలో సోషలిస్టు పార్టీ స్థాపన గురించి మాట్లాడారు.

**కాకినాడ :-** కాకినాడ పట్టణ విద్యార్థి సంఘం 1937 సెప్టెంబరులో స్థాపించుకొన్నారు. పట్టణానికి వచ్చే ప్రముఖ రాజకీయ నాయకులందరిని ఆహ్వానించి సభలు జరుపడం, కాంగ్రెస్ విజ్ఞప్తి ననుసరించి చైనా సహాయ నిధికి విరాళాలు వసూలుచేయడం మున్నగు కార్యక్రమాలను సాగించారు. (చైనాపై జపాన్ దురాక్రమణ జరిగినప్పుడు) కాని కాకినాడ పిఠాపురం మహారాజ కళాశాల ప్రిన్సిపాల్ (సుప్రసిద్ధ బ్రహ్మ సమాజ మతస్థులు) శ్రీ పెద్దాడ రామస్వామిగారు, విద్యార్థి సంఘ కార్యదర్శిని పిలిపించి యూనియన్‌ను రద్దుచేసుకోవలసిందని అలా

చేయని పక్షంలో కాలేజీలలోని ఇతర అన్ని సంఘాలను రద్దు చేస్తామనీ బెదిరించారు. కాని విద్యార్థులు పట్టుదలతో నిలబడ్డారు. తమ సంఘాన్ని రద్దు చేసుకోలేదు. ఈ విధంగా సంఘాన్ని ఏర్పరచుకొనే హక్కు కోసం కాకినాడ విద్యార్థులు తొలిదశలో పోరాడవలసి వచ్చింది. విద్యార్థులపై ఎంత నిర్బంధ విధానం ఆ రోజుల్లో అమలు జరిగిందంటే "పురవాసి" అనే మారు పేరుతో (16-3-1938) విద్యార్థులు తమ కష్టాల గురించి ఆనాటి సోషలిస్టు పార్టీ పత్రిక నవశక్తి (రాజమండ్రి) పత్రికలో ఒక బహిరంగ లేఖ వ్రాయవలసి వచ్చింది. రాజమండ్రి విద్యార్థులు స్వాతంత్ర్య దినోత్సవం జరుపుకొనడానికి సమ్మెచేసినా విద్యార్థులపై ఎవరూ ఎట్టి చర్యతీసుకోలేదు. ఆంధ్రదేశంలో అనేకచోట్ల విద్యార్థులు సమ్మె పోరాటాలు సాగిస్తున్నారు. అయినప్పటికి వారిపై ఎట్టి నిర్బంధ విధానం లేదు కాని కాకినాడలో విద్యార్థులు సంఘంపెట్టుకొన్న నేరానికే కాలేజీ ప్రిన్సిపాల్ విద్యార్థులపై దాడి చేస్తున్నారు. ప్రిన్సిపాల్ ఇదే విధంగా దాడి కొనసాగిస్తే విద్యార్థులు తమ హక్కు నిలబెట్టుకోవడానికి పోరాడతారని ఈ బహిరంగ లేఖలో తెలియచేశారు.

ఈ బహిరంగ లేఖలో ఉన్న విషయాలు చూస్తే ఆనాడు విద్యార్థులు ఎదుర్కొన్న నిర్బంధ విధానం స్వరూపం తెస్తుంది. కనీస హక్కులు కూడా ఎలా నిరాకరించేవారో తెలుస్తుంది. ప్రిన్సిపాల్, వార్డెన్ గార్ల నిరంకుశ వైఖరికి నిరసనగా హాస్టల్ సలహాసంఘంనుండి విద్యార్థులు రాజీనామా యిచ్చారు హాస్టలు వార్షికోత్సవానికి ఆనాడు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ప్రముఖులు, నవశక్తి సంపాదకులు అయిన శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్య గారిని అధ్యక్షులుగా ఆహ్వానించినప్పుడు ప్రిన్సిపాల్ నిరాకరించారు. హాస్టలు విద్యార్థులతో పాటు విద్యార్థినులు కూడా ఫొటోలో కూచుంటామంటే దానికి కూడా నిరాకరించారు. విశాఖపట్నం నుండి వెలువడుతున్న విద్యార్థి పత్రిక 'స్టూడెంట్ వాయిస్'ను కాలేజీ హాస్టలుకు తెప్పించుకోవడానికి ప్రిన్సిపాల్ నిరాకరించారు. హాస్టలు విద్యార్థులు, విద్యార్థినులు హాస్టలులో పడుతున్న యిబ్బందులను అధికారులకు విన్నవించడం ఒక అపరాధంగా ప్రిన్సిపాల్ తదితర అధికారులు భావించారు. ఆ రోజుల్లో స్పెయిన్ అంతర్యుద్ధం జరుగుతూంది. స్పెయిన్ ప్రజాతంత్ర శక్తులను సహాయంగా విద్యార్థులు విరాళాలు వసూలు చేస్తూ, హాస్టలు విద్యార్థులు వసూలు చేసిన నిధినుండి కొంత మొత్తం విరాళంగా యివ్వడానికి తీర్మానించారు. అలాగే చైనా నిధికి కూడా యివ్వ నిర్ణయించారు కాని ఈ విరాళాలు వసూలు చేయడానికి, యివ్వడానికి హాస్టలు వార్డెన్ వీలులేదని అడ్డం కొట్టారు. జవహర్‌లాల్ నెహ్రూ కాకినాడవచ్చారు. ఆయన సభకు వెళ్ళడానికి కాలేజీ విద్యార్థినులు అనుమతి

కోరితే ప్రిన్సిపాల్ నిరాకరించారు. హాస్టలు సంఘాన్ని ఈ అన్ని కారణాలు చూపి పని చేయించకుండా మూలబెట్టారు. అంత క్రితం సంవత్సరం కాలేజీ విద్యార్థి సంఘాన్ని పనిచేయనీయకుండా నిర్బంధంగా ఆపుచేశారు. ఈ విషయా లన్నీ బహిరంగ లేఖల్లో ఉల్లేఖించారు.

1938 ఆగష్టు 28, 29 తేదీలలో గుంటూరులో జరిగిన ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభకు వెళ్ళారన్న సాకుతో కొందరు విద్యార్థులకు ప్రిన్సిపాల్ జరిమానాలు విధించారు. సెలవు దరఖాస్తులు నిరాకరించారు. ప్రిన్సిపాల్ శ్రీ పెద్దాడ రామస్వామి సకాలంలో క్లాసుకురాక, రాత్రి 10 గంటల వరకు ప్రైవేటు క్లాసులు పెడుతూండటం మొదలైన అంశాలన్నీ ఈ బహిరంగ లేఖలో బహిర్గతం చేశారు. ఉదారవాదులైన బ్రహ్మ సమాజ మతస్థులైనప్పటికీ ఆనాడు కాలేజీ ప్రిన్సిపాల్ అయిన పెద్దాడ రామాస్వామిగారు జాతీయ ఉద్యమం వైపు, దేశ భక్తి వైపు మొగ్గుతున్న విద్యార్థులను ఎలా ఆటంకపరిచేవారో అర్థమవు తుంది. విద్యార్థులు ఈ నిర్బంధాలనన్నింటిని ఎదుర్కొని పోరాడి ఆనాడు జాతీయ ఉద్యమ ప్రవాహంలోకి వచ్చిన వైనం తెలుస్తుంది.

**పాలకొల్లు :-** 1938 సెప్టెంబరు 1 వ తేదీన పాలకొల్లు హైస్కూలు విద్యార్థి బహిరంగసభ మున్సిపల్ కమీషనర్ జె. సాంబయ్య చౌదరి అధ్యక్షతన జరిగింది. విద్యార్థి సంఘ ఆవశ్యకత గురించి కార్యదర్శి శ్రీ మహీధర సీతారామ శాస్త్రి మాట్లాడారు. శ్రీ ఈరంకి నారాయణమూర్తి స్కూలులో మంచినీటి కుళాయి ఆవశ్యకత గురించి మాట్లాడారు. పాలకొల్లు మున్సిపల్ హైస్కూలులో పరీక్షా కేంద్రం తీసివేసినందుకు నిరసించుతూ మళ్ళీ పునరుద్ధరించవలసిందిగా కోరారు. 1937లో గుంటూరులో జరిగిన రాష్ట్ర విద్యార్థి మహాసభ నాటికే విద్యార్థి సంఘం ఏర్పడింది. ప్రతినిధులను పంపారు.

**మారుటేరు :-** 1930 - 32 ఉప్పు సత్యాగ్రహోద్యమంలో పాల్గొన్న యువకాంగ్రెసువాది శ్రీ ఇవటూరి శరభరాజు ప్రోత్సాహంతో పశ్చిమ గోదావరి జిల్లా పరకాల పట్టాభిరామారావు కార్యదర్శిగా 1936లో విద్యార్థిసంఘంఏర్పడింది. లక్నో కాంగ్రెస్ అధ్యక్ష ఉపన్యాసంలో పండిట్ నెహ్రూ తొలిసారిగా సోషలిజం గురించి మాట్లాడిన భాగాలను "షుదర్ ఇండియా" పేరుతో అచ్చువేసిన కరపత్రం భగత్‌సింగ్, వినాయక సావర్కార్ జీవితచరిత్రలు మొదలైన దేశభక్తి గ్రంథాలు విద్యార్థులచే చదివించడం, డిబేటింగు సొసైటీ స్థాపన వగైరా కార్యక్రమాలతో విద్యార్థి సంఘం విద్యార్థులలో రాజకీయ చైతన్యం కల్గించింది. 1937 నవంబరులో పాలకొల్లులో రాష్ట్ర కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ మహాసభ జరిగిన సందర్భంలో శ్రీ జయప్రకాశ్‌నారాయణగారి బహిరంగ సభ ఏర్పాటు, పాలకొల్లు మహాసభకు

పరిపూర్ణంగా కృషి, హెడ్మాష్టరు నిర్బంధ విధానాన్ని ఎదుర్కొనడం, తద్వారా విద్యార్థి సంఘం విద్యార్థులను స్వాతంత్ర్య ఉద్యమానికి సన్నిహితులను చేసింది. తరువాత స్థానిక సమస్యలపై ఆందోళన సాగించింది.

ఉండి :- 1937 ఆగష్టు గుంటూరు రాష్ట్ర విద్యార్థి మహాసభ నాటికే విద్యార్థి సంఘం ఏర్పడి పని చేస్తూంది. హిందీ పండిట్ శ్రీ గుత్తా ఆంజనేయులు గారు విద్యార్థులలో రాజకీయ చైతన్యం కల్గించారు. నిడమర్తి ఉమా రాజేశ్వర రావు, మారెళ్ళ నరసింహారావు ముఖ్య కార్యకర్తలుగా డిటెన్షన్లు మున్నగు విద్యార్థి సమస్యలపై ఆందోళన సాగించారు. రహస్యంగా స్టడీ సర్కిల్ నడుపుతూ, గోర్కీ అమ్మ వగైరా పుస్తకాలు చదివించుతూ విద్యార్థులలో రాజకీయ చైతన్యం కల్గించారు. డ. ఇ. ఓ. ఉండి హైస్కూలు సందర్శిస్తున్న సందర్భంలో (1939) స్వాగతం బ్యానర్ తయారుచేసి అందుపై విద్యార్థిసంఘఆశయాలైన 'సాతంత్ర్యం, శాంతి, అభ్యుదయం' అన్న పదాలు వ్రాసి ఒక ప్రక్క జాతీయ జండా మరో ప్రక్క సుత్తి, కొడవలి జండా చిత్రించారు. స్కూలు ప్రక్క భవనంపై జాతీయ జండా అలంకరించారు. మరునాడు హెడ్మాస్టరు పిల్లి మార్టిన్ లూథర్ ఆ బ్యానర్ పీకించివేశారు దీనికి నిరసనగా విద్యార్థులు సమ్మె చేశారు. హెడ్మాష్టరు జాతీయ జండా పీకివేయించాడని ఉండి గ్రామమంతా విద్యార్థులు ప్రచారం లేవదీసి అలజడి కల్గించారు.

డి.ఇ ఓ వచ్చేసరికి క్లాసులన్నీ ఖాళీగా ఉన్నాయి డిటెన్షన్ విధానం రద్దు చేయాలి. ఉండి హైస్కూలులో పరీక్షా కేంద్రం పెట్టాలి విద్యార్థినులకు వెయిటింగు రూమ్ ఏర్పరచాలి అన్న నినాదాలతో సమ్మె సాగింది. రాత్రికి రాత్రి భీమవరం వెళ్ళి 22 డిమాండ్లతో నిడమర్తి రాజేశ్వరరావు, మారెళ్ళ నరసింహారావులు కరపత్రాలు వేయించి తెచ్చి విరివిగా పంచారు. చుట్టుపట్ల హైస్కూళ్ళకు కూడా పంపారు. జిల్లా బోర్డు కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ మాల్పూరి రంగయ్య వచ్చి రాజీ సంభాషణలు జరిపించారు. డి.ఇ.ఓ. తల్లిదండ్రులను విద్యార్థి నాయకులను పిలిపించి పేరెంట్సు అసోసియేషన్ ఏర్పరిచారు. సమ్మె దిగ్విజయం అయింది.

విద్యామంత్రి శ్రీ వార్కీ భీమవరం వచ్చినప్పుడు విద్యార్థి ప్రతినిధి వర్గం వారిని కలిసి డిటెన్షన్ విధానాన్ని రద్దు చేయాలని, ఉండిలో స్కూలు ఫైనల్ పరీక్షా కేంద్రం పెట్టాలని, లైబ్రరీలో జాతీయ ఉద్యమం గురించిన గ్రంథాలు పెట్టాలని కోరారు. స్కూలు ఫైనల్ పరీక్షా కేంద్రం పెట్టించ వలసిందిగా మంత్రి డి.ఇ.ఓ. ను ఆదేశించారు.

విద్యార్థి నాయకుల పై కక్షగట్టి హెడ్మాస్టరు శ్రీ లూథర్ నిడమర్తి, మారెళ్ళలను సస్పెండు చేశారు. జాతీయాభిమానులైన పేరెంట్లు టీచర్లు కలుగ జేసుకొని సస్పెన్షన్‌లు రద్దు చేయించారు. హాస్టలు భోజన శాలలో కులాల వారి గదుల విభజనను (తడికలను) తీయించి వేయగల్గారు.

— నిడమర్తి ఉమా రాజేశ్వరరావు
స్మృతులు.

ఏలూరు :- ఏలూరు పట్టణంలో విద్యార్థి సంఘం 1937 నవంబరు నాటికే ఏర్పడి పని చేస్తూంది. అఖిల భారత కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి శ్రీ జయప్రకాశ్ నారాయణ 1937 నవంబరులో ఆంధ్ర దేశ పర్యటన సందర్భంలో ఏలూరు వచ్చినపుడు మున్సిపల్ హైస్కూలులో విద్యార్థుల సభ జరిగింది. శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్య,శ్రీ గారపాటి సత్యనారాయణ(జిల్లా కాంగ్రెస్ కార్యదర్శి) కూడా ఆయన వెంట సభకు వచ్చారు. సభకు శ్రీ దండు నారాయణ రాజుగారు అధ్యక్షత వహించారు. హైస్కూలు విద్యార్థి సంఘం తరపున శ్రీ అత్తలూరి సర్వేశ్వరరావు. జయప్రకాశ్ నారాయణగారికి సన్మాన పత్రం సమర్పించారు శ్రీ జయప్రకాశ్ నారాయణ తమ ప్రసంగంలో నేటి విద్యా విధానాన్ని విమర్శించారు. విద్యార్థులు, గుమాస్తా పదవులనే ఆదర్శంగా పెట్టుకోక మంచి పౌరులై, దేశ సేవా పరాయణులు కావాలని హితవు చెప్పారు.

ఇదే పర్యటన సందర్భంలో మార్టేరు హైస్కూలు విద్యార్థి సంఘం అధ్వర్యాన 1937 నవంబరు 20 వ తేదీన జయప్రకాశ్ నారాయణ బహిరంగ సభ జరిగింది. విద్యార్థి సంఘ కార్యదర్శి పరకాల పట్టాభి రామారావు స్వాగతం చెప్పారు. ఆ రోజు విద్యార్థులు క్లాసు ఎగగొట్టి సభకు హాజరయ్యారు. అల్లూరి సత్యనారాయణగారు సభకు అధ్యక్షత వహించారు. శ్రీ సుందరయ్య జయప్రకాశ్ ప్రసంగాన్ని అనువదించారు. శ్రీ జయప్రకాశ్ నారాయణ విద్యార్థులు దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడాలని, బానిస విద్యావిధానాన్ని ఎదుర్కొని పోరాడా లని ఉద్బోధించారు. మార్టేరు హైస్కూలు హెడ్మాష్టరు శ్రీ బి.వి. నారాయణ, విద్యార్థులు సంఘం పెట్టుకొన్నందుకు వారిపై నిర్బంధ విధానం అమలు జరుపుతు న్నారని శ్రీ జయప్రకాశ్ నారాయణకు శ్రీ ఇవటూరి శరభరాజు, పట్టాభి రామా రావు తెలియజేయగా "ఈ హెడ్మాష్టరు ఈ శతాబ్దంలో ఉండతగిన వాడు కాదు. పదహారవ శతాబ్దంలో ఉండతగిన వాడు" అని తీవ్రంగా విమర్శించారు సభ అనంతరం ఈ మాట హెడ్మాష్టరుకు తెలిసింది మధ్యాహ్నం మూడు పిరియడ్‌లు స్కూలు ఫైనల్ విద్యార్థులందరిని నిలబెట్టి, హెడ్మాష్టరు వారిని చెడామడా తిట్టి

ఎస్ ఎస్.ఎల్.సి. సర్టిఫికెటులను రస్టికేట్ చేస్తామని ప్రకటించారు అయినా విద్యార్థులు ధైర్యంగా నిలబడ్డారు. ఇటువంటి నిర్బంధకాండలను ఎదుర్కొని ఆ రోజుల్లో విద్యార్థిసంఘాలను నడుపవలసి వచ్చేది.

**గన్నవరం :-** 1938 ఆగష్టు 7వ తేదీన కృష్ణాజిల్లా గన్నవరం విద్యార్థి సంఘ ఆధ్వర్యాన హైస్కూలు ఆవరణలో గొప్పబహిరంగ సభ జరిగింది. సభకు పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెస్ ఆధ్యక్షుడు శ్రీ పేట బాపయ్యగారు అధ్యక్షత వహించారు. విద్యార్థిసంఘాల అవశ్యకత గురించి కర్తవ్యాలను గురించి శ్రీ కాట్రగడ్డ నారాయణరావు గారు, జిల్లా విద్యార్థిసంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ కాట్రగడ్డ రాజగోపాలరావుగారు, గన్నవరం హైస్కూలు ప్రధాన ఉపాధ్యాయులు శ్రీ జోసెఫ్ గారు ఉపన్యసించారు. అక్టోబరు చివరి వారంలో జిల్లా మహాసభలు గన్నవరంలో జరుపుటకు సభవారు నిశ్చయించారు.

**వెంకటగిరి :-** నెల్లూరు జిల్లా వెంకటగిరిలో 1938 డిసెంబరు 23వ తేదీన విద్యార్థి సమితి సమావేశం జరిగింది విద్యార్థి సంఘాల ఆవశ్యకత గురించి ఇ. జాన్, జె. ఈశ్వరదాస్, పి సుబ్బరామయ్యగారు ఉపన్యసించారు.

**పిఠాపురం :-** 1939 ఏప్రిల్ 22వ తేదీన పిఠాపురం ఉన్నత పాఠశాల విద్యార్థుల సంఘ ప్రథమ వార్షికోత్సవం శ్రీ మల్యాల మాధవరావు, బి. ఎ గారి అధ్యక్షతను, కవి శ్రీ ఉమర్ ఆలీషా గారి తోటలో జరిగింది వందమంది విద్యార్థులు హాజరయ్యారు. కార్యదర్శి శ్రీ మొహియుద్దీన్ భాషా గారు నివేదిక సమర్పించారు తదనంతరం జి.ఎస్. బాలాజీదాస్‌గారు మాట్లాడుతూ విద్యార్థుల ద్వారానే స్వాతంత్ర్యం రావాలని అన్నారు. కొత్త సంవత్సరానికి మొహిద్దీన్ కార్యదర్శిగా పి. హెచ్ వీరభద్రరావుగారు సహాయ కార్యదర్శిగా ఎన్నుకున్నారు స్కూలు జీతాలు తగ్గించాలని, లైబ్రరీకి విజ్ఞానాభివృద్ధి కల్గించే గ్రంథాలు తెప్పించాలనీ, స్కూలుకు తెప్పించే పత్రికలు విద్యార్థులు కూడా చదువుకోడానికి అవకాశం కల్పించాలనీ, పాత టైపు మిషన్‌లు తీసివేసి కొత్త టైప్ మిషనులు తెప్పించి ఎక్కువ మంది విద్యార్థులు టైపు నేర్చుకోవడానికి అవకాశం కల్పించాలని విద్యార్థి సంఘ సమావేశాలకు స్కూలు ఆవరణలో అవకాశం కల్గించాలని పంచమ విద్యార్థులకు (పంచములు-అంటే అయిదవ కులము అంటే అనర్హులు అస్పృశ్యులు-షెడ్యూలు కులాలు) ఆశ్రమములను తీసివేసి, సంవత్సరం జీతములు పంచములు కూడా కట్టవలసిందని చెప్పిన అధికారుల చర్యలను ఖండించుతూ తీర్మానాలు చేశారు.

**చల్లపల్లి :-** చల్లపల్లి రాజా హైస్కూలు విద్యార్థి సంఘం అధ్యాపకుల కొరత గురించి 1938 సెప్టెంబరులో ఆందోళన సాగించింది. హెడ్మాష్టరుకు

ఒక బహిరంగ లేఖ వ్రాస్తూ తగినంత మంది టీచర్లు లేక పాఠాలు సకాలంలో మొదలుపెట్టక, వేసవి సెలవులలో కూడా ప్రైవేటు క్లాసులు పెట్టి విద్యార్థులనూ, టీచర్లనూ యిబ్బంది పాల్జేస్తున్నారని, అవనిగడ్డ మొదలైన చోట్ల సకాలంలో పాఠాలు మొదలుపెడుతున్నారని విద్యార్థి సంఘం తెలిపింది.

**అనంతపురం :-** అనంతపురం జిల్లాలో విద్యార్థి యువజనోద్యమాలకు 1938 వేసవిలో హిందూపురంలో రాజకీయ పాఠశాల పునాది వేసింది. ఈ పాఠశాలకు అధ్యాపకులు శ్రీ నీలం రాజశేఖర రెడ్డి, తరిమెల నాగిరెడ్డి, సదాశివన్, విద్వాన్ విశ్వం, కొందరు కాంగ్రెస్ నాయకులు. అప్పటికి రాజశేఖర రెడ్డి, నాగిరెడ్డి బెనారస్ విద్యార్థులు, 1939 ఆఖరులో వి. కె. ఆదినారాయణ రెడ్డి అధ్యక్షుడుగా జిల్లా విద్యార్థి ఫెడరేషన్ స్థాపించబడింది. 1940 లో గాంధీజీ ప్రారంభించిన వ్యక్తిగత సత్యాగ్రహంలో ఆదినారాయణ రెడ్డి పాల్గొన్నారు.

## స్పెయిన్ పోరాటం - విద్యార్థుల సంఘీభావం

సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా, ఫాసిజానికి వ్యతిరేకంగా ఆనాడు జరుగుతున్న చైనా, స్పెయిన్ ప్రజల పోరాటాలు భారత విద్యార్థి ఉద్యమాన్ని ఎంతగానో ఉత్తేజపరిచాయి. 1938 ఫిబ్రవరి 2 వ తేదీ నవశక్తి వారపత్రికలో శ్రీ కంభంపాటి సత్యనారాయణ (జూనియర్) ఒక వ్యాసం వ్రాశారు. స్పెయిన్ రిపబ్లిక్‌ను కూలద్రోసిన నియంత జనరల్ ఫ్రాంకో విద్రోహక తిరుగుబాటుకు వ్యతిరేకంగా స్పెయిన్ విద్యార్థులు వీరోచితంగా పోరాడుతున్నారని, ఫాసిజానికి వ్యతిరేకంగా పోరాడుతున్న స్పెయిన్ విద్యార్థులకు భారత విద్యార్థులు తోడ్పడాలని ఈ వ్యాసంలో తెలియజేశారు.

ఇట్టి వ్యాసాలు విద్యార్థులకు ఉత్తేజం కల్గించేవి స్పెయిన్, చైనాలకు విరాళాలు వసూలు చేయడానికి ఉత్సాహంగా విద్యార్థులు అనేకచోట్ల కృషిచేశారు. అనేక సభలలో తీర్మానాలు చేశారు.

## విద్యార్థి ఉద్యమంపై ప్రభుత్వ దాడి

ప్రభుత్వానికి కావలసిన గుమాస్తాలను తయారు చేయడానికి రూపొందించ బడిన ఆనాటి బానిస వలస, విద్యా విధానానికి, అందులో విద్యార్థులను వడపోసే డిటెన్షను విధానానికి వ్యతిరేకంగానూ, విద్యాలయాలలో కనీస ప్రజాతంత్ర విధానాలు, హక్కులు, స్వపరిపాలనా పద్ధతులు, ఆటలు, లైబ్రరీలు, ప్రగతిశీల పత్రికలు మున్నగు వాటికోసం విద్యార్థి ఉద్యమం ఎప్పుడైతే పోరాటానికి ఉప క్రమించి విద్యార్థులను కదిలించి సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయైక్య సంఘ టనలు భాగంగా సమీకరించడానికి పూనుకొన్నదో అప్పుడు బ్రిటిషు ప్రభుత్వం

విద్యార్థులను రాజకీయ ఉద్యమానికి, స్వాతంత్ర్యోద్యమానికి దూరంగా ఉంచడానికి యూనివర్శిటీ ఆర్డినెన్సులు ప్రకటించింది.

## డిసిప్లినరీ రెగ్యులేషన్స్ పేరిట జారీ చేసిన ఆర్డినెన్సులు

మద్రాసు ప్రభుత్వ ఎడ్యుకేషనల్ రూల్సులో "డిసిప్లినరీ రెగ్యులేషన్స్" అన్న పేర 1938 లో జారీ చేసిన ఆర్డినెన్సు 8 వ అధ్యాయం విద్యార్థుల స్వాతంత్ర్యాన్ని పూర్తిగా హరించుటకు ఉద్దేశించబడింది. కాంగ్రెసు మంత్రివర్గం అధికారంలో ఉండగా ఈ మద్రాసు యూనివర్శిటీ డిసిప్లినరీ రెగ్యులేషన్స్ కత్తి ఝళిపించడం అంటే - విద్యార్థులు రాజకీయాల్లో పాల్గొనకుండా, అంటే స్వాతంత్ర్యోద్యమంలో విద్యార్థులు ప్రముఖ పాత్ర వహించడానికి కాంగ్రెసు మితవాద వర్గాలు వ్యతిరేకంగా ఉన్నాయని స్పష్టం. రాజకీయాలను వామపక్ష దిశగా, తీసుకుపోవడానికి, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని తీవ్రతరం చేయడానికి కమ్యూనిస్టు పార్టీ సోషలిస్టులు చేస్తున్న ప్రయత్నాన్ని అడ్డం కొట్టడానికి కాంగ్రెస్‌మితవాద వర్గాలు - ఆనాటి మంత్రివర్గ అధికారాన్ని కూడా ప్రయోగించడానికి తలపడ్డారని చెప్పవచ్చు.

ఈ డిసిప్లినరీ రెగ్యులేషన్స్ నిబంధనలను చూస్తే ఈ విషయం విదితమవుతుంది. 8 వ అధ్యాయంలో ఉన్న నిబంధనలు :-

1. ప్రభుత్వ వ్యతిరేక ఉద్యమంలో శిక్షించబడిన ఏ విద్యార్థి కూడా ప్రభుత్వ అనుమతి లేనిదే కళాశాలలో చేర్చుకో కూడదు.

2. రాజకీయాందోళనలో పాల్గొన్న గ్రాడ్యుయేట్లు, అండర్ గ్రాడ్యుయేట్లు కాలేజీ (రిజిష్టరు)లో చేర్చుకోకూడదు.

3. విద్యార్థి దశలో ఉన్నవారు సంబంధముంచుకోదగినట్టి ఏ ప్రజా ఉద్యమంలో కూడా ప్రముఖంగా పాల్గొనుటను ప్రధానోపాధ్యాయులు వారి ఇష్ట ప్రకారం నిషేధించవచ్చును.

4. రాజకీయాందోళనలో పాల్గొన్న విద్యార్థులను హెడ్మాస్టరు సస్పెండు చేయవచ్చును.

5. హాస్టల్ విద్యార్థులపై కూడా డిసిప్లినరీ చర్యలు తీసుకోవచ్చును.

6. ఉపాధ్యాయులు మేనేజిమెంటు వారు దుష్ప్రవర్తనకు (ప్రభుత్వ వ్యతిరేక కార్యకలాపాలలో పాల్గొనుట) లోనైతే స్కూలు రికగ్నిషన్ రద్దు చేయవచ్చును. లేదా గ్రాంటు నిలిపివేయవచ్చును.

హాస్టలు విద్యార్థులపై జరిమానాలు విధించుట, స్కాలర్‌షిప్పుల రద్దు అటెండెన్సు తగ్గింపు, సర్టిఫికెట్లు బిగపట్టుట, తాత్కాలికంగా వెళ్ళగొట్టుట, శాశ్వతంగా వెళ్ళగొట్టుట, ఉపాధ్యాయులు, లెక్చరర్లు విద్యార్థులను రెచ్చగొట్టు

వారు విద్యార్థులను రాజకీయాలలో పాల్గొనేటట్లు చేసేవారు వారు కూడా శిక్షార్హులే.

మద్రాసు ప్రభుత్వం జారీ చేసిన ఈ ఆర్డినెన్సులు రద్దు చేయాలని ఆనాడు విద్యార్థి సంఘాలు తీవ్ర ఆందోళన సాగించాయి. ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి సంఘ కార్యవర్గం 1938 జూన్ 1 వ తేదీన మంతెనవారి పాలెంలో సమావేశమై ఒక తీర్మానాన్ని చేస్తూ "విద్యార్థులు రాజకీయాలలో పాల్గొనరాదని మద్రాసు కాంగ్రెస్ మంత్రివర్గం ప్రకటించడం శోచనీయం. కాంగ్రెస్ వాదులు మంత్రి పదవులు స్వీకరించక పూర్వం విద్యార్థులు రాజకీయాలలో పాల్గొనుటకు అనుకూలురై ఉండి, గత సత్యాగ్రహోద్యమంలో విద్యార్థులచే విద్యాలయాలు బహిష్కరింప జేసి, మంత్రి పదవుల నధిష్టించిన తరువాత ఈ విధంగా నిర్ణయించడం చాలా అసమంజసం. ఈ క్రొత్త దృక్పథాన్ని కాంగ్రెస్ మంత్రాంగం వారు మార్చు కోవాలి అని హెచ్చరించారు. రాష్ట్రమంతటా విద్యార్థులు ఈ నూతన రెగ్యు లేషన్సుకు వ్యతిరేకంగా ఆందోళన చేయాలని విజ్ఞప్తి చేశారు.

## మద్రాసు విద్యార్థి సంఘ తీర్మానం

మద్రాసు ప్రభుత్వం, విద్యార్థులు రాజకీయాల్లో పాల్గొనడాన్ని, నిషేధిం చుతూ ఆ విధంగా వారిని స్వాతంత్ర్యోద్యమానికి దూరంగా ఉంచాలని చేసిన ప్రయత్నానికి వ్యతిరేకంగా మద్రాసు రాష్ట్రంలోని అన్ని విద్యార్థి సంఘాలు ఐక్య కార్యాచరణకు పూనుకోవాలని, అందుకు ప్రెసిడెన్సీ విద్యార్థి ఫెడరేషన్‌ను కూడా ఏర్పరచాలని విజ్ఞప్తి చేసింది. 1938 జూన్ 22 వ తేదీన ఈ విషయమై మద్రాసు విద్యార్థి సంఘం (ఎమ్.ఎస్.ఓ.) ఇలా తీర్మానం చేసింది.

"విద్యార్థి ఉద్యమంయొక్క ముఖ్యాశయం విద్యార్థుల కోర్కెలు, సామ్రాజ్య వ్యతిరేక పోరాటానికి సంబంధించినవి. అనగా మనకు పూర్తిగా జాతీయ స్వాతంత్ర్యం రానిదే అవి ఏ మాత్రం నెరవేరే అవకాశం లేదు విద్యాలయాలలో డిసిప్లిన్‌కు సంబంధించిన (మద్రాసు ప్రభుత్వం) షరతులను మార్పించాలన్నా, స్కూలు ఫైనల్ పరీక్షలలో (డిటెన్షన్ విధానాన్ని రద్దు చేసి) ఎక్కువ మంది ఉత్తీర్ణులవడానికి అవకాశం రావాలన్నా, రాష్ట్రంలోని విద్యార్థులందరూ ఐక్య కంఠంతో ఆందోళన చేస్తేగాని లాభం లేదు."

"కనుక రాష్ట్రంలో అన్ని విద్యార్థి సంఘాల పూర్తి సహకారంతో పని చేయవలసిన అవసరం ఉంది. అందుకుగానూ మద్రాసు రాష్ట్రంలోని విద్యార్థి సంఘాలన్నీ కలిపి ఒక రాష్ట్ర సంఘంగా (ప్రెసిడెన్సీ ఫెడరేషన్) ఏర్పరచుట అవసరమని ఈ సంఘం వారు అభిప్రాయపడుతున్నారు. అందుకు ఒక కమిటీని

ఆంధ్ర నుండి ముగ్గురు సభ్యులు, కేరళ - 3, రాయలసీమ - 3, తమిళనాడు-3, మద్రాసు - 2 సభ్యులతో ఏర్పరచాలని తీర్మానిస్తున్నారు "

అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్ ఏర్పడినప్పటికి మద్రాసు రాష్ట్రంలో ఉన్న ఆంధ్ర, తమిళనాడు, కేరళ, రాయలసీమ తదితర ప్రాంతాలలో విజృంభిస్తున్న విద్యార్థి ఉద్యమాన్ని మరింత సంఘటితపరచి - ఆనాడు ప్రభుత్వ నిర్బంధ విధానానికి, అణచివేత విధానానికి వ్యతిరేకంగా పోరాడాలని జరిగిన యత్నానికి మద్రాసు విద్యార్థి సంఘం చేసిన ఈ తీర్మానం ప్రతిబింబం.

## నవశక్తి సంపాదకీయం

1938 జూలై 20 వ తేదీన నవశక్తి వారపత్రిక మద్రాసు ప్రభుత్వం విద్యార్థులపై జారీ చేసిన ఆర్డినెన్సులను ఖండించుతూ "విద్యార్థులు రాజకీయాలలో పాల్గొన కూడదనే జి.ఓ. వెంటనే రద్దు కావాలని, అనేక పుస్తకాలపై (రష్యా విప్లవం మొ॥) విధించిన నిషేధాలను తొలగించాలని, ఇట్టి నిషేధాలను కాంగ్రెస్ ప్రభుత్వం విధించుట అన్యాయమని "కాంగ్రెస్ రాజ్యంలో ఒక ఏడు" అను సంపాదకీయంలో ఖండించింది.

"విద్యార్థులు - రాజకీయాలు మద్రాసు ప్రభుత్వ ప్రకటనలకు విద్యార్థుల అసమ్మతి" అను శీర్షికతో కాకినాడ విద్యార్థి సంఘ ప్రముఖుడు శ్రీ కస్పా వాసుదేవరావు వ్రాసిన వ్యాసాన్ని 22-6-1938 నవశక్తి ప్రకటించింది. "కాంగ్రెస్ మంత్రులు అధికారంలోకి వచ్చిన తరువాతకూడా యిటువంటి నిర్బంధాలు కఠినచర్యలు కొనసాగడం తీవ్ర అభ్యంతరకరమైన విషయం ఇది విద్యార్థుల స్వాతంత్ర్యానికి భంగకరం. ఇది ఇలా ఉండగా బాట్లీవాలాను అరెస్టు చేయడం, చీరాల పొగాకు కార్మికులపై కాల్పులను సమర్పించే హార్వెల్ రిపోర్టును అంగీకరించడం రాష్ట్ర ప్రధానమంత్రి శ్రీ రాజాజీ అనుసరించుతున్న మితవాద వైఖరికి నిదర్శనం. తీవ్ర రాజకీయాల్లో విద్యార్థులు పాల్గొనకూడదని వీరు అంటున్నారు. తీవ్ర రాజకీయాలంటే ఏమిటి? సభలలో ఉపన్యసించుటా? లేక సోషలిజం కమ్యూనిజం గురించి ప్రచారం చేయడమా? విద్యాలయాధికారులకుకూడా నిరంకుశాధికారాలు చేతికిచ్చి విద్యార్థులు స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనకుండా చేయడానికి కాంగ్రెస్ నాయకులు పూనుకోవడం శోచనీయం" అని ఈ వ్యాసంలో రచయిత నిరసన తెలియజేశారు.

అలాగే "ఎడ్యుకేషనల్ రూల్సులో 8వ ప్రకరణం ముగించేదాక నిద్రపోము" అన్న శీర్షికతో అంతకుముందు 1938 జనవరి 5 వ తేదీ నవశక్తిలో నాటి విద్యార్థి నాయకుడు శ్రీ కాట్రగడ్డ రాజ గోపాలరావు ఒక వ్యాసం వ్రాశారు.

## ఆంధ్ర విశ్వవిద్యాలయ విద్యార్థుల ఆందోళన

విద్యార్థులు రాజకీయాలలో పాల్గొనకూడదన్న మద్రాసు విద్యాశాఖ నిబంధనలలోని 8 వ అధ్యాయాన్ని తొలగించాలని ఆంధ్ర విశ్వవిద్యాలయ విద్యార్థులు తీవ్ర ఆందోళన చేస్తున్నారు. బొంబాయి ప్రభుత్వం వారు ఈ విద్యార్థుల ఆందోళనను గమనించి తమ నిబంధనలను సవరించుకొన్నారు. అయినా మద్రాసు ప్రభుత్వానికి యింకా చలనం కలుగలేదు అని రాష్ట్రంలోని విద్యార్థి సంఘాలు వివిధ సభలలో తీర్మానాలు జేస్తూ విమర్శించారు.

## ఆంధ్రదేశంలో రాజాజీ పర్యటన విద్యార్థుల ఆందోళన - ప్రదర్శనలు, విజ్ఞప్తి పత్రాలు

మద్రాసు ప్రధాని శ్రీ రాజగోపాలాచారి 1938 జూలై నెలలో ఆంధ్రదేశ పర్యటనకు వచ్చారు. ఈ అవకాశాన్ని వినియోగించుకొని విద్యార్థుల కోర్కెలను చాటాలనీ, ప్రధానికి ఎక్కడికక్కడ మెమొరాండాలు సమర్పించడానికి ఊరేగింపులుగా వెళ్ళాలని, విద్యార్థుల సంతకాలతో మహజర్లు సమర్పించాలనీ నిశ్చయించారు. మంతెనవారి పాలెంలో (వేసవి రాజకీయ పాఠశాల జరిగిన సందర్భంలో) జూన్ 1 వ తేదీన రాష్ట్ర విద్యార్థి సంఘ కార్యవర్గం ఈ మేరకు ఒక పిలుపు యివ్వడమే కాక విద్యార్థులకు ఈ విషయమై తగు కార్యక్రమం సూచనలు యిస్తూ పత్రికలలో వ్యాసాలు, ప్రకటనలు వెలువడ్డాయి.

రాష్ట్ర విద్యార్థి సంఘ నాయకులలో ఒకరు, కాకినాడ విద్యార్థి సంఘ కార్యదర్శి అయిన శ్రీ యర్రమిల్లి నరసింహారావు ఆంధ్ర పత్రికలో 1938 జూలై 11 వ తేదీన చేసిన ప్రకటన యిలా ఉంది.

"మద్రాసు ప్రధాని శ్రీ రాజగోపాలాచారి ఆంధ్ర దేశ పర్యటన సందర్భంలో విద్యార్థి సమస్యలపై మెమొరాండాలు సమర్పించాలి. "విశాఖపట్నం మెడికల్ కాలేజీ డిగ్రీలను రికగ్నయిజు చేసే విషయమై మెడికల్ కౌన్సిల్ వారి షరతులు నెరవేర్చాలి. బి.కామ్. డిగ్రీలను బి ఎ., బి ఎస్ సి డిగ్రీలతో సమాన స్థాయి అర్హత యివ్వాలి. విద్యార్థులు రాజకీయాలలో పాల్గొనే హక్కు యివ్వాలి. వేతనాలు హెచ్చింపు తగ్గించాలి" మొదలైన కోర్కెలను మెమొరాండంలో చేర్చాలి. విద్యార్థుల సంతకాలతో బాటు పౌరుల సంతకాలు కూడా చేయించాలి.

అలాగే జూలై 13 వ తేదీ నవశక్తి పత్రికలో శ్రీ యర్రమిల్లి నరసింహారావు వ్రాసిన వ్యాసంలో ఆనాటికి యింకా అపరిష్కృతంగానూ, తీవ్ర సమస్యగానూ ఉన్న విశాఖపట్నం మెడికల్ కాలేజీ డిగ్రీల రికగ్నిషన్ సమస్యపై విద్యార్థుల, రాష్ట్ర ప్రజల దృష్టిని కేంద్రీకరించడానికి ప్రయత్నించారు.

మెడికల్ కాలేజీ పుట్టుపూర్వోత్తరాలు, మద్రాసు ప్రభుత్వ సవతితల్లి ప్రేమ, మొదలైన వివరాలు తెల్పుతూ, కాలేజీ భవన నిర్మాణానికి బడ్జెట్టు కేటాయింపులు చేస్తామని వాగ్దానం చేసి, దానిని భంగం చేశారనీ, ఈ విషయమై, మద్రాసు విశాఖపట్నం విద్యార్థి సంఘాలవారు నాటి మద్రాసు ఆరోగ్య శాఖా మంత్రి డాక్టరు రాజన్‌గారి వద్దకు రాయబారం వెడితే చూడనూ పొమ్మన్నారనీ, అందుచేత యిప్పుడు రాజాజీ ఆంధ్ర దేశ పర్యటనకు వస్తున్నారు గనుక ఈ సదవకాశాన్ని ఆంధ్ర విద్యార్థులు ఉపయోగించుకొని తీవ్ర ఆందోళన చేయాలని వ్యాసకర్త విజ్ఞప్తి చేశారు. ఈ లోగా విరివిగా మీటింగులు జరపాలని కోరారు

ప్రధాని వచ్చిన ప్రతీచోటా మెమొరాండాలు సమర్పించాలని తెలిపారు. విద్యార్థులు రాజకీయాలలో పాల్గొనరాదనే చట్టం తొలగించాలన్నదికూడ ఒక ప్రధాన కోర్కెగా రచయిత ఈ వ్యాసంలో పేర్కొన్నారు.

## రాష్ట్ర విద్యార్థి సంఘం మహజరు

మద్రాసు ప్రధానమంత్రి శ్రీ రాజగోపాలాచారి ఆంధ్ర దేశంలో ర్యటించడానికి 1938 జులై నెలలో వచ్చినప్పుడు గుంటూరు, బందరు, ఏలూరు, కాకినాడ, విశాఖపట్నం మొదలైన చోట్ల విద్యార్థి సంఘాలు మహజర్లు సమర్పించి తమ కష్టాలు, సమస్యల గురించి తెలియజేశారు

ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి సంఘం తన మహాజరులో ఈ క్రింది విషయాలు తెలియజేసింది.

. కాలేజీలలో ఇంటర్, బి ఎ., బి ఎస్.సి., తరగతులకు జీతాలు ఎక్కువ చేశారు. వీటిని తగ్గించాలి

2. రాబోయే వార్థా స్కీములోని "స్వయం సహాయ పద్ధతిని" పునః పరిశీలించాలి.

3. కొత్తగా విద్యార్థులపై జారీచేసిన రాజకీయ నిర్బంధాలు, నిబంధనలు (డిసిప్లినరీ రూల్సు) రద్దు చేయాలి

4. విద్యార్థులను శిక్షించడానికి విద్యాలయాధికారులకు మరి కొన్ని అధికారాలు యిచ్చారు. వాటిని రద్దు చేయాలి.

5. ఆంధ్ర విశ్వవిద్యాలయం వారి మెడికల్, కామర్సు డిగ్రీలను గుర్తించాలి.

6. ప్రత్యేకాంధ్ర రాష్ట్రం నిర్మించాలి.

7. ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి సంఘాన్ని గుర్తించాలి.

8. పరీక్ష ఫీజులు కనీసం 25 శాతం తగ్గించాలి.

9. సెలెక్షన్ పరీక్షలు (డిటెన్షన్ విధానం) రద్దు చేయాలి.

10 నిరుద్యోగ నివారణ సంఘం (అన్ - ఎంప్లాయ్‌మెంటు బ్యూరో) స్థాపించాలి.

11 పౌరసత్వ హక్కులు కాపాడాలి.

"రాష్ట్రంలోని వివిధ విద్యార్థి సంఘాలు ఇటువంటి మహజర్లనే సమర్పించారు. కాని ప్రధానమంత్రిగారి వద్దనుండి అన్నింటికి సమాధానం రాలేదు. ఈ విషయమై రాష్ట్ర విద్యార్థి సంఘ నాయకులు ఇలా వ్యాఖ్యానించారు. "ఫీజులు ఎక్కువ చేయడానికి కారణం హరిజనులకు ఉచిత విద్యను యివ్వడానికేనని, ఉన్నతవిద్యలను తగ్గించడానికి కారణం కాదని రాజాజీ సమాధానం యిచ్చారు విద్యార్థులు రాజకీయాలలో పాల్గొనకూడదని మద్రాసు ప్రభుత్వం జారీ చేసిన "ఆర్డినెన్సులు" గురించి శ్రీ రాజాజీ కాకినాడలో చెబుతూ పూర్వం ఉన్న నిబంధనలన్నింటిని రద్దు చేశామనీ, ఇప్పుడు చేసిన మార్పు ప్రకారం, ఏ పార్టీ కార్య వర్గంలోనూ విద్యార్థి సభ్యుడుగా ఉండరాదని, విద్యార్థులెవరూ ఎన్నికల్లో పాల్గొనరాదనీ, తదితర విషయాలలో సంపూర్ణ స్వాతంత్ర్యంతో మెలగవచ్చునని చెప్పారు. ఆంధ్రరాష్ట్ర విద్యార్థి సంఘాన్ని గుర్తించే విషయమై మీకు ఏ కష్టాలు లేవని గుంటూరులో అన్నారు కాని కాకినాడలో కాలేజీ అధికారులు చర్యలు తెలిసికొని, రాష్ట్ర విద్యార్థి సంఘాన్ని గుర్తిస్తామని అన్నారు. అధికారులు అన్యాయంగా ప్రవర్తించినప్పుడు ప్రభుత్వానికి తెలియజేయాలన్నారు విశాఖపట్నంలో రాజాజీ చెప్పిన సమాధానం మరీ విపరీతంగాఉంది. డిగ్రీలను గుర్తించడం కోసం విద్యార్థులు తనతో పోట్లాడటం తెలివితక్కువనీ, ఇండియన్ మెడికల్ కౌన్సిల్ చాలా దుర్మార్గమైనదనీ, వాళ్ళంతా వైద్య విద్యార్థులను కష్టపెట్టడానికి ప్రయత్నిస్తున్నారనీ, కాబట్టి తనతోకలిసి, ఇండియన్ మెడికల్ కౌన్సిల్‌తో పోరాడాలని రాజాజీ చెప్పారు. ఈ ధోరణిమాస్తే విశాఖపట్నం మెడికల్ విద్యార్థులు ఏదోవిధంగా తప్పించుకోడానికి రాజాజీ యుక్తిగా మాట్లాడారని, విద్యార్థులు, పౌరులు భావించారు. ఇండియన్ మెడికల్ కౌన్సిల్‌తో యుద్ధం చేస్తున్నానని చెప్పడమే కాని ఇంతవరకు ప్రభుత్వం ఏమి చేస్తున్నదీ ఆయన తెలియజేయలేదు.

"ఇక మద్రాసు ఎడ్యుకేషనల్ రూల్సులో విద్యార్థుల కిచ్చిన రాజకీయ స్వాతంత్ర్యం ఏమిటో చెప్పబడలేదు. విద్యార్థులు తీవ్ర రాజకీయాలలో పాల్గొనకూడదని అందులో విధించబడింది. కావున ఆంధ్ర రాష్ట్ర విద్యార్థిసంఘం, మద్రాసు విద్యార్థి సంఘం కలిసి రాజాజీ పర్యటనలో చేసిన వాగ్దానాలు నేరవేర్చాలని ప్రభుత్వం దగ్గరకు డెప్యుటేషన్ వెళ్లాలి. రాజకీయ స్వాతంత్ర్యం గూర్చి రాజాజీ చెప్పిన కబుర్లు - ప్రభుత్వ ప్రకటన ద్వారా తెలియజేయని ఎడల విద్యార్థుల పరిస్థితులు పూర్వంవలెనే ఉండును. ఆంధ్ర రాష్ట్ర విద్యార్థిసంఘాన్ని

త్వరలో గుర్తిస్తామని రాజాజీ కాకినాడలో చేసిన వాగ్దానం త్వరలో సఫలమయే ట్లు చేయాలి."

## విశాఖపట్నంలో రాజాజీని నిలవేసిన విద్యార్థులు

1938 జూలై 23వ తేదీన మద్రాసు ప్రధాని రాజాజీ తమ విశాఖపట్నం పర్యటనలో వివిధ సభలలో పాల్గొన్నారు. మెడికల్ కాలేజీ విద్యార్థులు సమర్పించిన మెమొరాండంలో మద్రాసు ప్రభుత్వం ప్రదర్శిస్తున్న సవతితల్లి ప్రేమను బహిర్గతంచేస్తూ ఆయన నిలవేసి అడిగారు. "మెడికల్ కౌన్సిల్‌వారు ఆంధ్ర వైద్యకళాశాలకు, ఆస్పత్రికి సూచించిన అభివృద్ధి మంత్రివర్గం సొమ్మును నిరాకరించి, మరొకవైపున మద్రాసులో ఆకస్మికంగా కొత్త రెండవ మెడికల్ కాలేజీని ఏర్పరచడంలో చూపుతున్న పక్షపాతభావాన్ని, విపరీత వర్తనాన్ని" తీవ్రంగా విమర్శించారు. విద్యార్థుల మెమొరాండానికి ప్రధామంత్రి యిచ్చిన సమాధానం విద్యార్థులకు సంతృప్తి కల్గించలేదు. ఆంధ్ర వైద్య పట్టాలను మెడికల్ కౌన్సిల్ వారు అంగీకరించపోవడంవల్ల వారి పరిస్థితి దుర్భరంగా ఉందని విద్యార్థుల తరపున హిర్డింగు గారు చెప్పారు. (ఆంధ్ర పత్రిక 1938 జూలై 26)

## రాజాజీ పర్యటన - గుంటూరు సంఘటన

మద్రాసు ప్రధాని శ్రీ రాజాజీ గుంటూరు వచ్చినప్పుడు గుంటూరు పట్టణ విద్యార్థి సంఘం, యువజన సంఘాలు, కాంగ్రెస్ సోషలిస్టు పార్టీతో కలిపి రైలు స్టేషన్ వద్ద ప్రదర్శన జరిపారు. "చీరాల కాల్వలపై హిర్వెల్ రిపోర్టు రద్దు చేయాలి". "ఆంధ్ర రాష్ట్రం కావాలి". "చీరాల కార్మికుల సమస్యను పునరుద్ధరించాలి" అని నినాదాలు యిచ్చారు.

"రాజాజీ రైలు నుండి దిగగానే విద్యార్థులు నినాదాలతో ఆయనను చుట్టుముట్టి కారు ఎక్కకుండా చేశారు. ఇక లాభం లేదనుకొని కారు ఎక్కే ప్రయత్నం మానుకొని కాలినడకనే తాను బస చేయవలసిన ఎ.సి. కాలేజీ ప్రక్కగా ఉన్న జిల్లా బోర్డు బంగళాకు వెళ్ళడం ప్రారంభించాడు. రాజాజీ కాలిచెప్పు ఒకటి పోయింది. విద్యార్థులు దిక్కులు పిక్కటిల్లేటట్లు నినాదాలు చేస్తున్నారు. బంగళా వద్ద విద్యార్థులను ఉద్దేశించి మాట్లాడుతూ ప్రత్యేకాంధ్ర రాష్ట్రానికి తాను వ్యతిరేకిని కానని శకుంతలను అత్తవారింటికి పంపలేక పంపే కణ్వ మహర్షివలె ఉన్నానని పిట్టకథ చెప్పి తప్పించుకున్నారు. సాయంత్రం స్వరాజ్య పార్కులో జరిగిన బహిరంగ సభలో కూడా అదే కథ చెప్పి విద్యార్థుల కోర్కెలపైన, ప్రత్యేకాంధ్ర రాష్ట్ర కోర్కెపైన సూటిగా సమాధానం యివ్వకుండా తప్పించుకొన్నాడు. "ఈ వేళ నేనొక గారడి చేశాను. నేను పడ్డ శ్రమకు (యుక్తిగా తప్పించుకొనడం),

నా తల పగిలిపోయి ఉండవలసింది. నన్ను నేను అభినందించుకుంటున్నాను' అని తన ఉపన్యాసం ముగించాడు (వై. వి. కృష్ణారావు స్మృతులు నుండి)

ఈ ప్రదర్శన "కాంగ్రెస్ మంత్రివర్గ వ్యతిరేక ప్రదర్శనగా" హిందూ, ఎక్స్‌ప్రెస్ పత్రికలలో వార్తలు వచ్చాయి "ఇది పూర్తిగా అబద్ధం. ఆంధ్ర రాష్ట్రం యిస్తారా? రాజీనామా యిస్తారా? అని తాము నినాదాలు యివ్వలేదు" అని ఈ మూడు సంఘాలు తరఫున ఒక ప్రకటన చేయబడింది.

విద్యార్థులు తమ కోర్కెల పైననేగాక ప్రజాతంత్ర కోర్కెలకు ఏ విధంగా స్పందించాలో దీనినిబట్టి అర్థమవుతుంది. ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం సమస్యను కూడా విద్యార్థులు తీవ్ర సమస్యగా ఎంచి ఆ రోజుల్లో ఆందోళన చేసినట్లు విదితమవుతుంది.

## సి.ఆర్. రెడ్డిగారికి గుంటూరులో మెమొరాండం

ఆంధ్ర యూనివర్శిటీ వైస్‌ఛాన్సలర్ శ్రీ సి.ఆర్. రెడ్డి గుంటూరు ఎ. సి కాలేజీకి వచ్చిన సందర్భంలో కాలేజీ విద్యార్థి సంఘం వారు తమ కష్టాలను తెలుపుతూ ఒక మహజరు సమర్పించారు. విద్యార్థుల యిబ్బందుల గురించి చర్చించడానికి, వాటికి సమాధానం యివ్వడానికి బదులు శ్రీ సి.ఆర్ రెడ్డి విద్యార్థులపై ఎదురు దాడిచేస్తూ ఈ కష్టాలు తమకు ఉన్నట్లు యింతకుపూర్వమే తనకు తన్ను అమర్యాద గావించుటేనని సమాధానం యిచ్చి తప్పించుకున్నారు. "శ్రీ రామలింగారెడ్డిగారు వైస్‌చాన్సలర్‌గా రాగానే కమ్యూనిస్టు, సోషలిస్టులపై దాడి ప్రారంభించాడు. యూనివర్శిటీ గ్రంథాలయం నుండి మార్క్సిస్టు సాహిత్యాన్నంతా తొలగింపజేశారు మద్రాసు కాలేజీ విద్యార్థుల సభలో మాట్లాడుతూ 'కమ్యూనిస్టులు దేశభక్తులు కారు' అని నిర్ధారించాడు చైనాపై జపాను సామ్రాజ్యవాదులు చేసే దాడిని సమర్థించారు.

గుంటూరులో ఏ సి. కాలేజీ హాస్టల్ విద్యార్థుల సభలో మాట్లాడుతూ 'అమెరికన్ ప్రజాస్వామ్యం ప్రపంచంలోని రాజ్యాలన్నింటికంటే గొప్పదనీ, సోవియట్‌లోని రైతు కూలీ రాజ్యం నియంతృత్వ రాజ్యమనీ' అన్నారు ఈ సోవియట్ వ్యతిరేక ప్రచారాన్ని కామ్రేడ్ వై.వి. కృష్ణారావు ఆవేశపూరితంగా ఖండించి అమెరికా ప్రజాస్వామ్యం నూటికి 10 మందికనుకూల ప్రజాస్వామ్యమని, సోవియట్ ప్రజాస్వామ్యం ప్రజల ప్రజాస్వామ్యమని ఘాటైన సమాధానం యిచ్చారు. విద్యార్థులందరూ ఈ సి.ఆర్. రెడ్డికి సరియైన సమాధానం యిచ్చినందుకు హర్షించారు. విద్యార్థులు రాజకీయాలలో పాల్గొనకుండా యూనివర్శిటీ ఆర్డినెన్సులు పెట్టిన సి.ఆర్. రెడ్డిని గుంటూరు విద్యార్థులు గట్టిగా ఎదుర్కొన్న ఖ్యాతి లభించింది. (వై.వి. కృష్ణారావు స్మృతులు)

## రాజాజీ పర్యటనపై శ్రీ బసవపున్నయ్య ప్రకటన

"ఆంధ్ర విద్యార్థులకు ఏ కష్టాలు లేవు అని ఇటీవల గుంటూరులో మద్రాసు ప్రధాని రాజాజీ అన్నారు. విద్యార్థులకు కష్టాలు లేవా?" అని ప్రశ్నిస్తూ రాష్ట్ర విద్యార్థి సంఘ కార్యదర్శి శ్రీ మాకినేని బసవపున్నయ్య ఒక ప్రకటనలో ఆనాటి విద్యార్థుల కోర్కెలను నిర్దుష్టంగా తెలియజేశారు. (నవశక్తి 1938 ఆగష్టు 24)

1. యూనివర్శిటీ పరీక్షలు వేసవిలో కాక మరొక సీజనుకు మార్చాలి. దినమునకు ఒకే పరీక్షా ఉండాలి.

2. డిటెన్షను పద్ధతి రద్దుచేయాలి.

3. నూటికి 40-50 శాతం విద్యార్థులను మాత్రమే ఉత్తీర్ణులను చేయాలి.

4. పాఠ్య పుస్తకాల ధరలు తగ్గించాలి.

5. పరీక్ష ఫీజులు తగ్గించాలి.

6. ఇతర విశ్వవిద్యాలయాలలో ఉన్నట్లుగా ఆంధ్ర విశ్వవిద్యాలయంలో కూడా మిలిటరీ శిక్షణ ప్రవేశ పెట్టాలి.

7. విద్యార్థుల కష్టాలు విన్నవించుట కూడా తప్పుగా ఎంచే అధికారుల వైఖరి మార్చుకోవాలి. దీనిని 'చెడు ప్రవర్తన' (బ్యాడ్ కాండక్టు) గా భావించి సర్టిఫికెటులలో వ్రాయుట అన్యాయం.

## విశాఖపట్నం విద్యార్థుల ఆందోళన

1938 ఆగష్టు 7 వ తేదీన విశాఖపట్నం విద్యార్థి సంఘ ద్వితీయ వార్షిక సమావేశం పూర్ణ థియేటరులో మెడికల్ కాలేజీ విద్యార్థి ఆర్. జి. హిర్డింజ్ అధ్యక్షత క్రింద జరిగింది. వందేమాతరం గేయంతో సభ ప్రారంభమైంది. తరువాత కార్యదర్శి శ్రీ వెంకట్రామ శాస్త్రిగారు కార్యదర్శి నివేదిక చదివారు. హెచ్చించిన జీతాలు తగ్గించాలనీ, డిసిప్లినరీ రెగ్యులేషన్స్ రద్దు చేయాలనీ, రాజకీయాలలో విద్యార్థులు పాల్గొనడానికి వీలుగా నిబంధనలు మార్చాలనీ, మెడికల్ కాలేజీకి రికగ్నిషన్ వచ్చేటట్లు హాస్పిటలును అభివృద్ధి చేయాలనీ ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించారు.

పరీక్ష ఫీజు 40 శాతం తగ్గించాలని, పరీక్ష పత్రాలు రోజు కొకటి ఉండాలనీ, డిటెన్షన్ పద్ధతి రద్దు చేయాలనీ, ఎడ్మినిస్ట్రేటివ్ ఖర్చులు తగ్గించి విద్యా విషయమై ఎక్కువ ఖర్చు చేయాలనీ, సెనేటు మీటింగులకు, ప్రజలను విద్యార్థులను రానీయకుండా పెట్టిన అభ్యంతరాలను తొలగించాలని, యూనివర్శిటీ అధికారులను కోరుతూ తీర్మానించారు. స్పోర్ట్సు, హాస్టల్ మేనేజిమెంటును విద్యార్థులకే

ఇవ్వాలనీ, కొట్టుట (కార్పొరల్ పనిష్మెంటు) మొదలైనవి రద్దు చేయాలనీ కోరారు.

స్పెయిన్, చైనా విద్యార్థుల పోరాటాన్ని అభినందించుతూ, తిరువాన్కూర్ విద్యార్థులపై జరిగిన లాఠీ చార్జీలను ఖండించుతూ, సి. ఐ. డి. శాఖను తీసి వేయాలని కోరుతూ మరికొన్ని తీర్మానాలు చేశారు. విద్యార్థులపై ఆందోళనలతో డాక్టర్ పట్టాభిగారు ఇచ్చిన స్టేటుమెంటును ఖండిచుతూ మరో తీర్మానం చేశారు.

## ఆంధ్ర యూనివర్శిటీ - కొత్త ఆర్డినెన్సులు

మద్రాసు ప్రభుత్వం విద్యార్థులపై జారీ చేసిన కొత్త నిబంధనలను పురస్కరించుకొని ఆంధ్ర యూనివర్శిటీ కూడా విద్యార్థి సంఘాలలో చేరడాన్ని నిషేధించుతూ విద్యార్థులపై 1938 డిసెంబరు 3వ తేదీన కొత్త డిసిప్లినరీ నిబంధనలను జారీ చేసింది. శ్రీ సి ఆర్. రెడ్డి వైస్ చాన్సలర్‌గా ఉండగా జారీచేసిన ఈ ఆర్డినన్సులు ఇలా ఉన్నాయి.

1. అల్లరి జరుగుతుందని ప్రిన్సిపాల్‌కు తోచినప్పుడు విద్యార్థులు రాజకీయ సభలకు వెళ్లకూడదని ప్రిన్సిపాల్ ఆజ్ఞాపించవచ్చును.

2. రాజకీయ సభలవద్ద విద్యార్థులు సోషల్ వర్కులకు నియమించ కూడదు.

3. కాలేజీలో చదువుకొను విద్యార్థులు ఆ కాలేజీ సంబంధంలేని క్లబ్‌లలో గాని, సంఘములోగాని చేరదలచిన ఎడల అవి గవర్నమెంటుతో ఆమోదించ బడినవి కాకపోతే? అలా చేరడానికి ముందుగా ప్రిన్సిపాల్ అనుమతి పొందాలి. విద్యార్థి తండ్రిగాని, సంరక్షకుడుగాని వ్రాతమూలకంగా అనుమతి కోరితే ప్రిన్సిపాల్ సాధారణంగా తిరస్కరించడు.

4. సంస్థ ప్రయోజనంకోసం, విద్యార్థుల ప్రయోజనం కోసం విద్యార్థులకు జరిమానాలు వేయడం, అటెండెన్సు రద్దుచేయడం, టెరము సర్టిఫికెట్లు రద్దుచేయడం, సస్పెండుచేయడం, వెళ్లగొట్టడం మొదలైన శిక్షలను వేయడానికి ప్రిన్సిపాల్‌కు కళాశాల అధికారికి, హాస్టలు అధికారికి అధికార ముంటుంది.

5. విశ్వవిద్యాలయానికి సంబంధించిన కళాశాలలో చదువుతున్న విద్యార్థులెవరైనా, సమ్మె కట్టడం, మొదలైన నేరాలను చేస్తే వెంటనే వారి స్కాలర్ షిప్పులు, ఉచితభోజన సౌకర్యాలను, తక్కువఫీజు సదుపాయాలను రద్దుచేయాలి. పై అధికారుల అనుమతిలేకుండా ఈ సదుపాయాలను నేరం చేసిన విద్యార్థులకు తిరిగి యివ్వకూడదు. వారు 12 గంటలలోగా హాస్టలునుండి వెళ్ళిపోవాలని ఆజ్ఞాపించవచ్చును.

ఈ నిబంధనలను చూస్తే విద్యార్థి సంఘాలను పూర్తిగా నాశనం చేయడానికి, విద్యార్థులలో పెరుగుతున్న రాజకీయ చైతన్యాన్ని అరికట్టడానికి ఉద్దేశించబడినవని వేరె చెప్పనక్కరలెదు విశాఖపట్నంలో నానాటికీ విజృంభించుతున్న విద్యార్థి ఉద్యమాన్ని అణచివేయడానికి ఈ యూనివర్శిటీ ఆర్డినెన్సులు ప్రకటించారు.

ఆంధ్ర యూనివర్శిటీ జారీచేసిన ఈ నూతన ఆర్డినెన్సులకు వ్యతిరేకంగా యూనివర్శిటీ విద్యార్థులు వివిధ కాలేజీల విద్యార్థులు తీవ్ర ఆందోళన జరిగింది.

## యూనివర్శిటీ ఆర్డినెన్సులకు వ్యతిరేకంగా పౌర సభ

విశాఖపట్నం టౌను హాలులో 1938 డిసెంబరు 9 వ తేదీన శ్రీ భూపతిరాజు వెంకటపతి రాజుగారి అధ్యక్షతను పౌర సభ జరిగింది. యూనివర్శిటీ అధికారులు నూతనంగా జారీచేసిన ఆర్డినెన్సులు సహించి ఊరుకోరాదని, కాంగ్రెస్ గోత్రికులైన సెనేటు సభ్యులు కూడా ఈ ఆర్డినెన్సులకు ఆమోద ముద్ర వేయడం జాతీయ ఉద్యమానికి ద్రోహం చేయడమేననీ, శ్రీ కె బాపిరాజు, బి.ఎ., బి.ఎల్. లక్నో యూనివర్శిటీ ఫిజికల్ డైరెక్టర్, శ్రీ ఆర్.కె. నాయుడుగారు, శ్రీ కె. వెంకట్రామ శాస్త్రి, శ్రీ కె. వీరభద్రస్వామి ఉపన్యసించారు. వైస్ చాన్సలర్ వద్దకు ఈ విషయమై పౌరులు రాయబారం వెళ్ళడానికి కూడా నిశ్చయించుకొన్నారని ఈ సభలో ప్రకటించారు.

విశాఖపట్నంలో విద్యార్థి ఉద్యమం, యూనివర్శిటీ ఆర్డినెన్సులకు వ్యతిరేకంగా పౌరులను కూడా సమీకరించడంతో కృతకృత్యమైందని దీనిని బట్టి స్పష్టమవుతుంది.

## రాష్ట్ర కాంగ్రెసు వద్దకు రాయబారం

1938 డిసెంబరు 31 వ తేదీన బందరులో రాష్ట్రకాంగ్రెస్ కార్యనిర్వాహక వర్గ సమావేశం జరిగినప్పుడు ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి సంఘం తమ ప్రధాన సమస్యల పైన, యూనివర్శిటీ ఆర్డినెన్సులపైన వారికి విజ్ఞాపన పత్రం సమర్పించి చర్చించడానికి రాయబారం వెళ్ళారు. రాయబార వర్గంలో రాష్ట్ర సంఘ సహాయ కార్యదర్శి కాట్రగడ్డ రాజగోపాలరావు, కృష్ణా జిల్లా విద్యార్థి సంఘ ప్రధాన కార్యదర్శి పి. సత్యనారాయణ బి.ఎ. గారు అలాగే యూనివర్శిటీ ఆర్డినెన్సులను రద్దు చేయించుటకు తీవ్రంగా ప్రయత్నించాలని మెమొరాండంలో కోరారు. సిండికేటు సభ్యులు (మద్రాసు యూనివర్శిటీ) శ్రీ కడప కోటిరెడ్డి ఎం. ఎల్. ఎ గారిని విద్యార్థి రాయబార వర్గంలో మాట్లాడడానికి రాష్ట్ర కాంగ్రెస్ కార్యవర్గం వారు పంపారు. వారు చాలా సేపు చర్చించి విద్యార్థుల కోర్కెలు సమంజసమైనవని అంగీకరించారు. సిండికేటుద్వారా ఈ కోర్కెలు నెరవేర్చడానికి ప్రయత్నిస్తామని

అన్నారు. ఈ విషయమై సెనేటుకు ఒక నివేదిక తయారుచేసి యివ్వవలసిందిగా కార్యవర్గం వారు కోటిరెడ్డిగారిని ఆదేశించారు.

1938 లో గుంటూరు ఎ. సి. కాలేజీ విద్యార్థులు డిటెన్షన్ విధానానికి వ్యతిరేకంగా మరోసారి సమ్మె జేశారు.

## బెజవాడ విద్యార్థుల ప్రచార యాత్రాదళం

డిటెన్షన్ విధానాన్ని రద్దు చేయాలనీ, ఇతర కోర్కెలపైన ప్రచారం చేయ డానికి బెజవాడ విద్యార్థి సంఘం ఒక ప్రచార యాత్రాదళాన్ని ఏర్పాటు చేశారు. 1938 డిసెంబరు 20 వ తేదీన ఈ ప్రచార దళం విజయవాడలో బయలుదేరి పునాదిపాడు, తాడంకి, పామర్రు, బందరు మొదలైనచోట్ల హైస్కూళ్ళలో విద్యార్థు లను సమావేశపరచి డిటెన్షన్ వ్యతిరేక ప్రచారం చేశారు. ఆయా చోట్ల జరిగిన సభలకు పోలవరపు మధుసూదనరావు నాగిశెట్టి పున్నయ్య, వై. బసవయ్య, మునిపల్లె రామారావు మొదలైనవారు అధ్యక్షతలు వహించారు శ్రీ అడవికొలను సీతారామరావు, సిరిపూరపు కోటేశ్వరరావు, చేకూరి వెంకటరామారావు, జి. దుర్గా ప్రసాదరావు, పోలూరి ఆంజనేయ ప్రసాద్ మున్నగు వారు ఈ సభలలో మాట్లా డారు. డిటెన్షన్ విధానాన్ని నిరసిస్తూ తల్లితండ్రులచే ప్రభుత్వానికి ఉత్తరాలు, విజ్ఞాపనలు పంపించడానికి అన్ని చోట్ల కృషి చేశారు.

ఈ విధంగా విద్యార్థులు ప్రచార యాత్రా దళంగా ఏర్పడి ఒక చోట నుండి మరొక చోటకు వెడుతూ సమస్యలపై ఆందోళన నిర్వహించడం ఆ కాలంలో అపూర్వమైన విషయం. ఇది సహజంగానే విద్యార్థులలో ఉత్సాహాన్ని సంచలనాన్ని రేకెత్తించి ఉంటుందనడంలో సందేహం లేదు,

## బెజవాడ విద్యార్థుల తప్పు చర్యలకు ఖండన

డిటెన్షనులకు వ్యతిరేకంగా పోరాడుతూనే విద్యార్థులు పరీక్షలలో ఏదైనా అక్రమ పద్ధతులకు దిగితే వాటిని విద్యార్థి సంఘం సహించేది కాదనీ, అది తప్పు అని చెప్పి ఖండించే నైతిక శక్తి, ధైర్యం కల్గి ఉండేదని బెజవాడలో జరిగిన ఒక సంఘటనను బట్టి తెలుస్తుంది. బెజవాడ మున్సిపల్ హైస్కూలు విద్యార్థులు పరీక్ష సమయంలో కొన్ని అక్రమ పద్ధతులు అవలంబించారు. ఇందులో జిల్లా విద్యార్థి ఫెడరేషన్ కార్యదర్శి శ్రీ పి సత్యనారాయణ ఒక ప్రకటన చేస్తూ ఈ చర్యలు (కాపీలు చేయుట) అరాచకమైనవి, అభ్యంతరకరమైనవీ అనీ, ఇట్టి చర్య లను విద్యార్థి ఫెడరేషన్ ఆమోదించలేదనీ, అందుపై రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ జాయింటు కార్యదర్శిగారిని విచారించి నివేదిక సమర్పించ వలసిందిగా రాష్ట్ర సంఘం వారు తెలిపారనీ, క్రమ శిక్షణకు విరుద్ధమైన ఇట్టి చర్యలను విద్యార్థులు విడనాడాలనీ కోరారు.

# డిటెన్షనులపై పోరాటం కొనసాగింపు

1938 డిసెంబరు 23 వ తేదీన పామర్రులో కాట్రగడ్డ రాజగోపాలరావు గారి అధ్యక్షతన కృష్ణా జిల్లా విద్యార్థి సంఘ కార్యవర్గం సమావేశమై బెజవాడ విద్యార్థులు సమ్మె జరిపి డిటెన్షనులను తగ్గించేటట్లు చేసుకోవడంలో విజయం పొందినందుకు అభినందించారు. బెజవాడ సమ్మెను పురస్కరించుకొని డి.ఇ.ఓ. గారు జిల్లాలోని హెడ్మాస్టర్లకు డిటెన్షన్ చేయాలంటూ సర్క్యులర్ ఇన్‌స్ట్రక్షన్సు పంపి విద్యార్థులను డిటెయిన్ చేయించుతున్నందుకు నిరసించుతూనూ, ఈ డిటెన్షన్ విధానం ఒక్క మద్రాసు రాష్ట్రంలో తప్ప ఏ యితర రాష్ట్రంలోనూ లేదు కనుక ఈ రాష్ట్రంలో కూడా రద్దు చేయాలనీ కోరుతూనూ, ఆంధ్ర యూనివర్శిటీ రెగ్యులేషన్సు రద్దు చేయాలని కోరుతూనూ తీర్మానాలు చేశారు.

## ఏలూరులో

ఏలూరులో 1939 డిసెంబరు 12 వ తేదీన మున్సిపల్ హైస్కూలు, మిడిల్ స్కూలులో 2 నెలల జీతం వసూలు చేయడానికి నిర్ణయించినందుకు అసమ్మతిగా మున్సిపల్ హైస్కూలు విద్యార్థులు సమ్మె చేశారు. స్కూలు గేట్ల వద్ద విద్యార్థులు పికెటింగు చేశారు. 900 మంది విద్యార్థులకు 300 మంది మాత్రమే హాజరయ్యారు జీతాల హెచ్చింపునకు వ్యతిరేకంగా ప్రారంభమైన సమ్మె డిటెన్షన్‌కు వ్యతిరేకంగా సమ్మె మారింది. స్కూలు ఫైనల్ విద్యార్థు లందరు సమ్మె చేశారు.

## కాకినాడలో

కాకినాడ పి.ఆర్. కాలేజీ హైస్కూలు విద్యార్థులు 1939 డిసెంబరు 20 వ తేదీన డిటెన్షన్ విధానానికి వ్యతిరేకంగా సమ్మె చేశారు. అదనంగా ఒక నెల జీతం పెంచినందుకు, కఠినంగా విద్యార్థులను శిక్షించుతున్నందుకు కూడా నిరసనగా ఈ సమ్మె జరిగింది. 900 మంది విద్యార్థులకు 50 మంది మాత్రమే క్లాసులకు వెళ్ళారు.

డిసెంబరు 23 వ తేదీన సంప్రతింపుల ఫలితంగా విద్యార్థులు సమ్మె విరమించారు. విద్యార్థుల కోర్కెలు ఎంతవరకు సాధ్యమో అంతవరకు నెర వేర్చ్చదమని పి. ఆర్. కాలేజీ ప్రిన్సిపాల్ శ్రీ పెద్దాడ రామస్వామిగారు వాగ్దానం చేశారు. విద్యార్థులు తమ పతాకాలను ఎగురవేస్తూ జయ జయ ధ్వానాలతో విజయోత్సాహం జరిపారు.

10-1-39న కొల్లూరు విద్యార్థులు ఎమ్. రామదాసు అధ్యక్షతన సమావేశమై దిగువ తీర్మానాలు ఆమోదించారు.

విద్యార్థి సంఘాన్ని రికగ్నయిజు చేయాలనీ, జనవరి 26న స్వాతంత్ర్య దినోత్సవం జరుపుటకు కొల్గారు విద్యార్థి సంఘం తరపున నవశక్తి, ఆంధ్ర ప్రభ, ఇండియన్ ఎక్స్‌ప్రెస్, స్టూడెంట్సు కాల్ పత్రికలను తెప్పించాలనీ కోరుతూ తీర్మానాలు చేశారు. ఉస్మానియా, అన్నామలై, కృష్ణామండల విద్యార్థులలో తమ న్యాయమైన కోర్కెలకోసం సలుపుతున్న పోరాటాలను బలపరుస్తూ బొంబాయి, మద్రాసు, విద్యార్థుల వయోజన విద్యా శిక్షణ కార్యక్రమాన్ని అభినందించుతూ తీర్మానించారు.

## విజయవాడ విద్యార్థుల సమ్మె

1939 జనవరి 10, 11 తేదీలో హిందూ మున్సిపల్ హైస్కూలులో డిటెన్షన్ల రద్దు - ఇతర కోర్కెల కోసం విద్యార్థి సమ్మె జరిగింది. 17-1-39న జిల్లా కలెక్టరు పోలీసు సూపరింటెండెంటు పోలీసుతో మొదట మున్సిపల్ స్కూలుకు తరువాత హిందూ హైస్కూలుకు వచ్చి విద్యార్థి ప్రతినిధులతో సంప్రదింపులు జరిపి డిటెన్షనులు సాధ్యమైనంత తక్కువ ఉండేటట్టు చూస్తామని చెప్పిన మీదట అందు హైస్కూళ్లలో విద్యార్థులు సమ్మె విరమించారు. సాయంత్రం సబ్ కలెక్టరు ఆఫీసులో జరిగిన సంప్రతింపుల సమావేశంలో విద్యార్థి ప్రతినిధులు వి భాస్కరరావు సి హెచ్. బంగారురావు, పేట రామారావు, సత్యనారాయణ, సింగుగారు హిందూ హైస్కూలు హెడ్మాష్టరు శ్రీ ఆలపాటి కుటుంబరావు, వేణుగోపాలరావు పాల్గొన్నారు మున్సిపల్ హైస్కూలులో 191 మందికి 23 మందిని, హిందూ హైస్కూలులో 130 మందికి 12 మందిని డిటెయిన్ చేశారు. (నూటికి 10 మార్కులు వచ్చిన వారిని డిటెయిన్ చేశారు.) రెండుసార్లు సమ్మె చేసినా యింత ఎక్కువ మందిని డిటెయిన్ చేసినందుకు విద్యార్థులలో అసంతృప్తి ఎక్కువగా వుంది.

## స్వాతంత్ర్య దినోత్సవాన్ని సెలవు దినంగా ప్రకటించాలి

"లాహోర్ కాంగ్రెస్ జనవరి 26 స్వాతంత్ర్య దినోత్సవం జరుపాలని నిర్ణయించింది. ఆ రోజు సెలవు దినంగా ప్రకటించాలని మేము విద్యామంత్రిని కోరగా కొలది దినాలలో ఏ విషయం తెలియజేస్తా నన్నారు. సెలవు యివ్వక పోయిన ఆరోజు విద్యార్థులందరూ విద్యాలయాలు మానివేసి స్వాతంత్ర్య దినోత్సవం జరపాలి. ఎ.ఐ.ఎస్.ఎఫ్ కూడా ఆ రోజు సెలవు యివ్వకపోతే సమ్మె చేయాలని ప్రకటించింది అని మద్రాసు విద్యార్థి సంఘ కార్యదర్శి ప్రకటించారు. ఆంధ్ర దేశంలో కూడా ఆరోజున అనేకచోట్ల విద్యార్థులు సమ్మె చేశారు.

## విద్యార్థి ఉద్యమ ప్రధాన నిర్మాణ కార్యక్రమం- వయోజన విద్యా ప్రచారం

1937 ఆగష్టులో గుంటూరులో జరిగిన 14 వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభ ముందు, తరువాత కూడా రాష్ట్రమంతటా విద్యార్థి ఉద్యమం త్వరిత గతిని వ్యాపించి, అనేక విద్యార్థి సమస్యల పైన, రాజకీయ సమస్యల పైన పోరాడుతూ రెండు సంవత్సరాలు గడిచేసరికి బలమైన ఉద్యమంగా అభివృద్ధి చెందింది. విద్యార్థి ఉద్యమం సాధించిన ఈ సంఘటిత శక్తితో జాతీయ పోరాటంలో తన వంతు బాధ్యత నిర్వహించడానికి, ప్రజలను చైతన్య పరిచి వారిని స్వాతంత్ర్య పోరాటానికి సన్నద్ధులు చేయడానికి తగు కార్యక్రమం తీసుకోవాలని నిర్ణయించింది.

మద్రాసులో జరిగిన అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్ సమావేశం ఇందుకు సాధనంగా వయోజన విద్యా ప్రచార కార్యక్రమం చేపట్టాలని పిలుపు యిచ్చింది.

ఇందుకు మద్రాసు విద్యార్థి సంఘం (ఎమ్.ఎస్.జె ) ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ వేసవి విద్యార్థుల కార్యక్రమంగా వారు పల్లెటూళ్ళకు పోయి వయోజన విద్యా శిక్షణ కార్యక్రమాన్ని నిర్వహించడానికి పథకం సంసిద్ధం చేసింది.

## మద్రాసు విద్యార్థి సంఘం శిక్షణా శిబిరం

మద్రాసు విద్యార్థి సంఘం 1939 జనవరి 8, 9 తేదీలలో జరుప తలపెట్టిన మద్రాసు విద్యార్థి మహాసభతోపాటు వారం రోజులపాటు విద్యార్థి కార్యకర్తలకు వయోజన విద్యపై శిక్షణా శిబిరం నడిపింది. ఈ వయోజన విద్యా కార్యక్రమం ప్రాధాన్యత గురించి ఇలా ప్రకటించింది. (1938 డిసెంబరు 21 వ తేదీ నవశక్తి)

"గత 2 సంవత్సరాలుగా మన విద్యార్థి ఉద్యమం చాలా అభివృద్ధి చెందింది. ప్రాథమిక హక్కుల కొరకై తీవ్ర పోరాటాలు సాగించారు. అనేక చోట్ల విద్యార్థుల సమ్మెలు, ఆందోళనలు జరిగాయి వీటి ఫలితంగా విద్యార్థులలో ఒక విధమైన ఐక్య చైతన్యం కల్గింది. విద్యార్థి సంఘాలు బలపడ్డాయి. మన ప్రాథమిక హక్కుల కొరకై ఆందోళన చేస్తున్నప్పుడు, మన శక్తినంతా నిర్మాణ రహిత (అన్ కన్‌స్ట్రక్టివ్ ఎఫైర్స్) కార్యక్రమాలలో వృధా చేస్తున్నామని మన పెద్దలు మనలను విమర్శించారు. మనకిప్పుడు కొంత ఐక్యత, బలం చేకూరినది గనుక ఈ బలమును, ఐక్యతను మనల నెదుర్కొంటున్న జాతీయ సమస్య కొరకు ఉపయోగించి మన విమర్శకు పొరపాటు తెలియజేసే సమయం వచ్చింది.

"విద్యార్థుల దృక్పథమునుబట్టి మన జాతీయ సమస్యలో, జనసామాన్యపు విద్యాభివృద్ధి చాలా ముఖ్యమైనది. ప్రస్తుతం బ్రిటిషు ఇండియాలో చదువగల్గిన వారు 100క 10 మంది స్వదేశ సంస్థానములలో అంతకంటే తక్కువ గవర్న మెంటు ప్రయత్నం, నేటి విద్యావిధానం, జనసామాన్యపు విద్యాభివృద్ధి విషయములు

పూర్తిగా విఫలమైనవి. పైగా విద్యావిధానం అందుకు వ్యతిరేక ఫలితాలు కలుగ జేసింది. చదువుకొన్న కొద్దిమందిని, జనసామాన్యమునకు మధ్య ఒకపెద్ద అగాధం ఏర్పడింది. ఈ పద్ధతిని మార్పుచేసే సమయం వచ్చింది. జనసామాన్యం మధ్యకు వెళ్లి, వారితో కలిసిపోయి, వారిని పైకి తేవలిసిన బాధ్యత విద్యార్థులమీద ఉంది. ప్రాథమిక హక్కులపై విద్యార్థులు జరిపిన పోరాటాలవల్ల కల్గిన బలమును, ఐక్య ఈవిధంగా ఉపయోగించాలి. ఈ కార్యక్రమం విద్యార్థులను జన సామాన్యానికి దగ్గరగా తీసుకొనివచ్చి, జనసామాన్యంయొక్క ఆర్థిక, రాజకీయ పరిస్థితులను తెలియపరుస్తుంది.

"ఈ విద్యా వ్యాపక కార్యక్రమం, గట్టి నిర్మాణము, శిక్షణతో కూడు కొన్నది. మన విద్యావిధానం జన సామాన్యానికి, పనికివచ్చే విషయాలను ఏమాత్రం నేర్పుటలేదు. క్రిందటి సంవత్సరం బొంబాయి రాష్ట్రి విద్యార్థి సంఘం యొక్క విద్యా వ్యాపక కార్యక్రమాలువలన,సరియైన శిక్షణ, నిర్మాణంలేనిదే సరి యైన ఫలితం కలుగదని తెలిసింది. ఇందువలన మద్రాసులో జనవరి 8, 9 తేదీలలో జరుగు మద్రాసు విద్యార్థి సభతోపాటు, ఒక శిక్షణా శిబిరం (ట్రైనింగు సెంటరు) సాగించుటకు మద్రాసు విద్యార్థి సంఘం నిశ్చయించింది. శిబిరం జనవరి 1 నుండి 7 వరకు జరుగుతుంది.

## సిలబస్‌లోని ముఖ్యమైన విషయాలు

1. జన సామాన్యంలో అవిద్యకు కారణాలు
2. విద్యావ్యాపక పద్ధతులు, ప్రభుత్వం, రాజకీయ సంస్థలు, విద్యార్థుల స్థానం
3. వయోజన విద్య (అడల్ట్ ఎడ్యుకేషన్)
   ఎ. వయోజన విద్యలో ముఖ్య పద్ధతులు
   బి. ఏకాంక నాటకముల ప్రదర్శన - వాటి ఉపయోగం
   సి. గోడవార్తాపత్రిక (వాల్ న్యూస్ పేపరు)
   డి. చిన్న పిల్లలకు కిండర్‌గార్టెన్‌క్లాసులు నడుపుట
   ఇ. జాతీయగీతములు
   ఎఫ్ గ్రామీణ ఆటలు (రూరల్ స్పోర్ట్సు)
4. పబ్లిక్ హెల్త్ - హైజిన్
   ఎ. ప్రథమ చికిత్స
   బి. పారిశుద్ధ్యం (శానిటేషన్)
   సి. కలరా మొదలగు వ్యాధుల నరికట్టుటెట్లు?
   డి. మంచినీటి వసతి మొదలైనవి.

౫. ఆర్థిక, సాంఘిక సమస్యలు
ఎ. స్టాటిస్టిక్సు
బి రైతు సమస్యలు (కౌలుదారీ సమస్యలు)
సి జన సామాన్యపు ఆర్థిక పరిస్థితులు
౬. ప్రభుత్వం - పరిపాలన - వీటి నిర్మాణం
రైతుకు సంబంధించిన చట్టములు

ఈ శిబిరం ప్రస్తుతం జరుపుటలో ముఖ్య ఉద్దేశ్యం విద్యార్థి మహాసభకు వచ్చు ప్రతినిధులకు మంచి శిక్షణ ఇచ్చుట.

విద్యార్థి సంఘం లేక కాంగ్రెస్ సంఘ కార్యదర్శి సిఫారసు రు 3-6-0 ఫీజుతోసహా డిసెంబరు 20 లోగా దరఖాస్తులు పంపాలి. "స్టూడెంట్సు లిటరసీ క్యాంపు మద్రాసు విద్యార్థి సంఘం - (జయా మేన్షన్స్, పార్క్ టెర్రేస్ - మద్రాసు)" (నవశక్తి 21-12-1938)

మద్రాసు విద్యార్థి సంఘం ప్రకటన పూర్తి పాఠం చదివినప్పుడు, విద్యార్థి ఉద్యమం విద్యార్థులను సంఘటిత పరచడంతోబాటు ప్రజలలో, ప్రజల దైనందిన జీవితంలో సమస్యలతో వారికి సాన్నిహిత్యం ఏర్పడడానికి, వారిని సుశిక్షితులైన కార్యకర్తలుగా ప్రజలలో రాజకీయ, సాంఘిక చైతన్యాన్ని తీసుకొనివచ్చే విప్లవోద్యమ నిర్మాతలుగా తీర్చిదిద్దడానికి ఉద్దేశించబడిందని స్పష్టమవుతుంది. అంతేకాక బ్రిటిషు బానిస పరిపాలకులు, ప్రజలకు విద్యా, విజ్ఞానాలు లేకుండా వారిని అంధకారంలో, అజ్ఞానంలో ఉంచుతున్న పరిస్థితుల్లో వారిని వయోజన విద్యా విధానం, రాత్రి బడుల ద్వారా విద్యావంతులను చేసి, వారిని స్వాతంత్ర్యోద్యమంలోనికి తీసుకురావడానికి కూడా ఉద్దేశించబడింది విద్యార్థి సంఘాలే కాకుండా, కాంగ్రెస్ సంఘాలు కూడా ఈ విద్యార్థి వయోజన విద్యా శిక్షణా శిబిరానికి సిఫారసు చేసి విద్యార్థులను పంపించడం ఆ రోజుల్లో జరిగింది. జాతీయోద్యమానికి-విద్యార్థి ఉద్యమానికికూడా సన్నిహిత సంబంధాలు ఉండేవని కూడా దీనిని బట్టి స్పష్టమవుతుంది.

అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్ తీసుకున్న ఈ నిర్ణయం ప్రకారం మద్రాసు విద్యార్థి సంఘంతోబాటు, ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ కూడా విద్యార్థులకు వయోజనవిద్యా శిక్షణా కార్యక్రమాలు తీసుకుంది.

## ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ నిరక్షరాస్యత నిర్మూలన కార్యక్రమం

1939 జనవరి మొదటి వారంలో బెజవాడలో సమావేశమైన ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ వేసవి సెలవులలో మే 2 వ తేదీ నుండి నిరక్షరాస్యతా

నిర్మూలన కార్యక్రమం మొదలు పెట్టాలని తీర్మానించింది. 5 వారాల పాటు ఈ కార్యక్రమం సాగించడానికి నిర్ణయించారు. ఒక్కొక్క దళలో ఐదారుగురు శిక్షణ పొందిన విద్యార్థులు మరొక ఐదారుగురు యితర విద్యార్థులను తర్ఫీదు చేసి మొత్తం 10-12 మందితో దళం ఏర్పరచాలి ఒక్కొక్క దళం ఒక్కొక్క గ్రామాన్ని చూడాలి. ఒక్కొక్క దళ సభ్యుడు 20 మందికి విద్యా బోధన చేయాలి. ఈ 20 మంది పేర్ల జాబితా, వారి అభివృద్ధి పట్టిక తయారు చేయాలి. ఈ దళం గ్రామం వదలిపెట్టి వచ్చేటప్పుడు గ్రామ నివాసులైన యువకులకు ఈ కార్యక్రమం అప్పగించాలి. దళ నాయకుడు అటుపిమ్మట కూడా ఈ గ్రామంలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూ ఉండాలి.

చదువుట, వ్రాయుట ప్రధాన కార్యక్రమమైనప్పటికీ, ఈ పని విజయవంతంగా జరగడానికి గ్రామ కొలతలు (గణాంక వివరాలు) ప్రదర్శనలు, (సాంస్కృతిక) శరీర పరిశ్రమ, ఆటలు మొదలగు వాటిద్వారా భిన్న రుచులుగల వారందరినీ ఆకర్షించాలి.

గ్రామ లెక్కలు :- గుడిసె గుడిసెకు వెళ్ళి గ్రామస్థుల సాంఘిక, ఆర్థిక విద్యా విషయక పరిస్థితుల గురించి లెక్కలు తయారు చేయాలి. నేటి ఇంగ్లీషు విద్యా విధానం ద్వారా మనలో రేకెత్తుతున్న ఆధిక్య అహంభావాన్ని, చదువురాని కోటాను కోట్ల శ్రమ జీవుల ఎడల మనలో కల్గుతున్న నిర్లక్ష్య భావాన్ని ఈ కార్యక్రమం రూపుమాపగలదు.

ప్రదర్శనలు :- ప్రజల దైనందిన కష్టాల్ని సూచించే నాటకాలు, జాతీయ భావాన్ని పెంపొందించే హరికథలు ఏర్పాటు చేయాలి. గ్రామ్‌ఫోన్, రేడియోలు ఇందుకు ఉపయోగకరంగా ఉంటాయి. మాజిక్ లాంతరులో ఆరోగ్య విషయాలు, గ్రామ పునర్నిర్మాణం మొదలైన విషయాలు బోధించవచ్చు.

శరీర పరిశ్రమలు-ఆటలు .- ఆరోగ్య సూత్రాలను తెలుపడానికి, ఐక్యత ఏర్పడటానికి చెడుగుడు మొదలైన ఆటలు, డ్రిల్లు మొదలైనవి జరుపాలి. యువకులలో క్రమశిక్షణ కల్గించడానికి డ్రిల్లు ఉపయోగం.

వయోజన విద్య :- ఆరోగ్య సూత్రాలు, రోగాలకు కారణాలు, నిరోధక చర్యలు, అలాగే సాంఘిక సమస్యలు గురించి చెప్పాలి.

గ్రంథాలయాలు :- ప్రతి గ్రామంలోనూ ఒక ప్రచార గ్రంథాలయం కనీసం 500 పుస్తకాలతో నైనా ఏర్పరచాలి.

అన్ని కార్యక్రమాలు జయప్రదంగా నెరవేరాలంటే, ప్రతి దళలోనూ, ఒక వైద్య విద్యార్థి, చిత్రకారుడు, పాటగాడు, ఉపన్యాసకుడు, ఫోటోగ్రాఫర

ఒక స్త్రీ వలంటీరు ఉండేటట్లు చూడాలి (శ్రీ యర్రమిల్లి నరసింహారావు, నవశక్తి 15-3-39 వ్యాసం నుండి.)

1938 సెప్టెంబరు 21 విశాఖపట్నం విద్యార్థి సంఘం సెంట్రల్ కౌన్సిల్ సమావేశమై ఈ దిగువ అంశాలు చర్చించి తీర్మానాలు చేసింది

అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్ వారు మద్రాసులో సమావేశమై చేసిన తీర్మానాన్ని అనుసరించి ప్రజాసామాన్యంలో విద్యా విహీనత పోగొట్టుటకు రాత్రి పాఠశాలలను నిర్వహించాలి ఇందుకై జాలరులకు మొదట స్కూలు స్థాపించాలి. దీనికి జి. రామకోటేశ్వరరావు గారిని ఆర్గనైజరుగా నియమించారు.

విద్యార్థుల కష్టాలను తెలుసుకోడానికి ప్రశ్నావళిని తయారు చేయాలని తీర్మానించి అందుకు 5 గురితో స్టాటిస్టిక్స్ కమిటీని నియమించారు.

పట్టణ కాంగ్రెసు ఆఫీసులో ఒక భాగాన్ని విద్యార్థి సంఘ ఆఫీసుగా వాడు కోవడానికి అనుమతి కోరుతూ తీర్మానించారు. రాత్రి పాఠశాల నడుపడానికి ఎలి మెంటరీ స్కూలు భవనం యిచ్చినందుకు మున్సిపల్ చైర్మన్‌గారికి కృతజ్ఞత తెలియజేశారు.

కటక్ విద్యార్థులు సమ్మె చేస్తూండగా పోలీసులు వారిపై జరిపిన దౌర్జ న్యాన్ని నిరసించుతూ తీర్మానించారు.

## భోగాపురంలో వయోజన విద్యా ప్రచార శిబిరం :

ఈ సూచనలను అనుసరించి ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ ఆధ్వర్యాన విశాఖ జిల్లా భోగాపురంలో వయోజన విద్యా ప్రచార శిబిరం 1939 వేసవిలో నెలరోజులపాటు జరిగింది. 1939 ఫిబ్రవరిలో ఇందుకు రాష్ట్ర విద్యార్థి సంఘం ఒక ఉపసంఘాన్ని నియమించింది. నాల్గు వారాలలో ఎంతచదువనూ, వ్రాయనూ నేర్చుకోవడానికి వీలవుతుందో అంతగా నేర్పడానికి సులువైన పద్ధతి అవలంభించ బడింది. అక్షరాభ్యాసంతో బాటు చరిత్ర భూగోళం, ఆర్థిక విధానం, ఆరోగ్య సూత్రాలు నేర్పడానికి కూడా ఒక సిలబస్ ఆ స్కీములో చేర్చబడింది. నెల రోజుల శిబిరానికి శ్రీ పి వి. రమణ, డి.ఎ. నారాయణ గార్లు నాయకత్వం వహించి నడిపారు. అవి నాటి రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ ప్రధాన కార్యదర్శి జి. రామకోటేశ్వరరావుగారు తెలియజేశారు.

వివిధ జిల్లాల్లో కూడా విద్యార్థి సంఘాల ఆధ్వర్యాన వయోజన విద్యా ప్రచార కార్యక్రమాలు నిర్వహించబడ్డాయి.

## కాకినాడలో శిక్షణా శిబిరం

తూర్పు పశ్చిమ గోదావరి జిల్లాల విద్యార్థులకు కలిపి కాకినాడలో 1940 ఏప్రిల్ 25 నుండి 10 రోజులపాటు 50 మందితో వయోజనవిద్యా శిక్షణా

శిబిరం నిర్వహించబడింది. పట్టణ విద్యార్థి సంఘం జిల్లా విద్యార్థి సఘాల ఆధ్వర్యాన శిబిరం కోసం విరాళాల సేకరణ జరిగింది. కాకినాడ పట్టణంలోనూ, కాకినాడ సమీపంలోగల చొల్లంగిలో (చొల్లంగి అమావాస్య తీర్థం సందర్భంలో) విద్యార్థి కార్యకర్తలు వెళ్ళి డబ్బాలతో చందాలు వసూలు చేశారు. శ్రీ పి ఎస్. శర్మ, పర్వతనేని వెంకటేశ్వరరావు, పరకాల పట్టాభిరామారావు తదితరులు శిబిరాన్ని నిర్వహించారు. పశ్చిమ గోదావరి జిల్లా నుండి మారెళ్ళ నరసింహారావు తదితరులు హాజరయ్యారు.

శిక్షణా శిబిరం అనంతరం కాకినాడలో వివిధ కార్మిక పేటలలో విద్యార్థి కార్యకర్తలు రాత్రి పాఠశాలలను నిర్వహించారు. మున్సిపాలిటీ దగ్గర నుండి మాజిక్ లాంట్రన్ తీసుకొని, వివిధ అంటు వ్యాధులు తెచ్చే సూక్ష్మ జీవులు గురించి స్లైడ్సు తయారు చేసి ఆరోగ్యం, పారిశుధ్యం గురించి ప్రదర్శనలు యిచ్చారు. భూగోళ పటాలు ప్రదర్శించి ప్రపంచ రాజకీయాలు, వివిధ ఖండాలు, దేశాలు గురించి చెప్పారు. వార్తా పత్రిక పఠన జరిపారు. పరకాల పట్టాభి రామారావు, వేదాంతం చిదానందం, వేముగంటి నరసింహారావు తదితరులు వేసవి సెలవులంతా కాకినాడలో ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు. సులభంగా తెలుగు అక్షరాలు నేర్పడానికి "లాబక్ చార్ట్" పద్ధతిని అవలంభించారు. కార్మిక పేటలలోని విద్యార్థులు వెళ్ళడం ద్వారా వారి జీవన పరిస్థితుల అధ్యయనం విద్యార్థులలో రాజకీయ చైతన్యం పెంపొందడానికి తోడ్పడింది. కార్మిక యువకులలో రాజకీయ చైతన్యం కల్గించడానికి తోడ్పడింది.

## విశాఖపట్నంలో

విశాఖపట్నంలో మెడికల్ కాలేజీలో బలమైన విద్యార్థి సంఘం ఉండేది. మెడికల్ కాలేజీ గ్రూపులో ముఖ్యులు పి. సూర్యనారాయణ, కె. వెంకట్రామ శాస్త్రి, జి. రామకోటేశ్వరరావు, కి.శే. సోమయ్య, చలపతి నాయుడు, రంగయ్య మొదలైన వారు. వీరు ఇతర విద్యార్థి కార్యకలాపాలతో పాటు వయోజన విద్యా ప్రచారాన్ని కొనసాగించారు. జాలర్లకు రాత్రి పాఠశాలలు పెట్టి నడిపేవారు. హార్బర్ వర్కర్సుకు కూడా రాత్రి బడులు నడిపేవారు. అప్పుడు మెడికల్ విద్యార్థిగా ఉన్న నేటి భారత కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి కామ్రేడ్ చంద్ర రాజేశ్వరరావు, వారితోబాటు యూనివర్శిటీ విద్యార్థి నిడమర్తి అశ్వనీ కుమార దత్తు, హైస్కూలు విద్యార్థిగా ఉన్న నిడమర్తి ఉమారాజేశ్వర రావు పార్టీ ఆర్గ నైజరుగా విశాఖపట్నం వచ్చిన కొత్తమసు సత్యనారాయణ, ఎ.ఎల్. నరసింహా రావు, ఏటుకూరి బలరామమూర్తి మున్నగువారు ఈ కార్యక్రమాలను ఇతర రాజకీయ కార్యక్రమాలతో బాటు నిర్వహించుతూ ఉండేవారు.

విజయనగరంలో విద్యార్థిగా ఉన్న వై. విజయకుమార్ విజయనగరం, చిట్టివలస మున్నగు చోట్ల వయోజన విద్యా కార్యక్రమాలను నిర్వహించారు. ఆ తరువాత (1943-45) శ్రీ ఆరుద్ర కూడ వైజాగ్ హార్బరు కార్మికులకు ఇతర కార్మికులకు వయోజన విద్యా తరగతులు నిర్వహించిన వారిలో ఉన్నారు.

## కృష్ణాజిల్లాలో

29-1-39వ తేదీన బెజవాడలో సమావేశమైన రాష్ట్ర విద్యార్థి సంఘ నూతన కార్యవర్గం కృష్ణాజిల్లా విద్యార్థి యువజన సంఘాల తరపున మే 2 మొదలు 6 వారాలు జిల్లాలో వయోజనవిద్యా ప్రచారం గావించడానికి నిర్ణయించింది. జిల్లా యువజన సంఘం తరపున కాట్రగడ్డ రాజగోపాలరావు, జిల్లా విద్యార్థి సంఘం తరపున వై. నరసింహారావు, జి. దుర్గాప్రసాదు, ఎస్ వి. రంగారావు, వి. భాస్కర రావుగార్లు ట్రైనింగు క్యాంపు నడపాలని నిర్ణయించారు. ఏప్రిల్ 20 నుండి మే 1వ తేదీ వరకు ట్రైనింగు క్యాంప్ జరిగింది. ఇందుకైన ఖర్చు 100/-లలో చెరిసగం జిల్లా విద్యార్థి యువజన సంఘాలు భావించాయి.

## గుంటూరు జిల్లాలో

ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి సంఘ ఆదేశం ప్రకారం గుంటూరు జిల్లా విద్యార్థి సంఘ ఆధ్వర్యాన 1941 ఏప్రిల్ 10వ తేదీ నుండి కొల్లూరులో, వయోజన విద్యా ప్రచారానికి ఒక ట్రైనింగు క్యాంపు జరిగింది. తదనంతరం జిల్లాలో కొన్ని ప్రాంతాలలో వయోజన విద్యా ప్రచారాన్ని విద్యార్థులు సాగించారు. శ్రీ గోపరాజు రామచంద్రరావుగారు క్యాంపును ప్రారంభించి కొద్ది రోజులపాటు శిక్షణా శిబిరంలో విద్యార్థులకు శిక్షణ యిచ్చారని జిల్లా కార్యదర్శి శ్రీ ఎల్. బి. గంగాధరరావు తెలిపారు. (కాగడా 1941 మార్చి 5) 1939 వేసవిలో జిల్లాలో వయోజన విద్యా శిక్షణ కార్యక్రమాన్ని నిర్వహించారు.

గుంటూరు పట్టణ విద్యార్థి సంఘం తరపున కొరిటిపాడులో 1939 వయోజన రాత్రి పాఠశాల నిర్వహించబడింది. రాష్ట్ర విద్యార్థి నాయకుడు శ్రీ వై.వి. కృష్ణా రావు క్లాసులు నిర్వహించేవారు.

## కృష్ణా జిల్లాలో ఆటంకాలు - నిషేధాజ్ఞలు

1940 వేసవిలో కృష్ణా జిల్లా ముదునూరులో వయోజన విద్యా శిబిరం జరిగింది. 70 మంది హాజరయ్యారు. 1941 సంవత్సరంలో విజయవాడ సమీపంలో దీనిని రాష్ట్ర పాఠశాలగా జరుపుటకు నిశ్చయించగా జిల్లా మెజిస్ట్రేటు వద్ద పర్మిషన్ తీసుకోవాలని. ప్రభుత్వం ప్రకటించింది. (ప్రభుత్వం 1941 జూన్‌లో వయోజన విద్యా పాఠశాలను నిషేధించింది) అనుమతి కోసం దరఖాస్తు పెట్టినప్పటికీ (1941 అక్టోబరు వరకు) అనుమతి యివ్వలేదు. 1940 వేసవి

వయోజన శిబిరాన్ని శ్రీ గోపరాజు రామచంద్రరావుగారు నిర్వహించారు. వారు నాస్తికవాదులు, రాజకీయాలతో సంబంధంలేదు. ప్రభుత్వం ఇటువంటి నిర్బంధ పూర్వక వైఖరి అవలంభించినందుకు నిరసించుతూ ప్రముఖ కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ నాయకులు శ్రీ అన్నే అంజయ్యగారు ఒక ప్రకటన చేశారు

వయోజనవిద్యా ప్రచారం ద్వారా విద్యార్థులు, యువకులు, కాంగ్రెస్ సోషలిస్టు పార్టీవారు గ్రామసీమలకు వెళ్ళటం, పేద ప్రజానీకంలో విద్యా విజ్ఞానాలు, రాజకీయ చైతన్యం కల్గించడం ఆనాటి బ్రిటీషు ప్రభుత్వం సహించలేక పోయింది. దానితో ప్రభుత్వ నిర్బంధ విధానం సి.ఐ.డి.ల నిఘా ప్రారంభ మయ్యాయి. వయోజన విద్యా పాఠశాలలను నిషేధించడం మొదలుపెట్టింది.విద్యార్థి, యువజన సంఘాలు సాగించే వయోజనవిద్యా శిక్షణా శిబిరాలపైన, దాని నిర్వాహకులపైన ప్రభుత్వ నిఘా హెచ్చింది.

14-3-41వ తేదీ కృష్ణాజిల్లా స్పెషల్ బ్రాంచి పోలీసు సూపరింటెండెంటు మద్రాసు ప్రభుత్వానికి పంపిన రహస్యరిపోర్టులో బందరులో ఇంటర్న్ చేయబడిన రాష్ట్రవిద్యార్థి సంఘ ప్రముఖులలో ఒకరైన డాక్టర్ కె.వి.లక్ష్మి (కె.వి.వల్లభరావు సతీమణి) పశ్చిమ గోదావరిజిల్లా విద్యార్థి సంఘ ఆర్గనైజరుగా ఉన్న పరకాల పట్టాభి రామరావుల మధ్య వయోజనవిద్యా శిక్షణా కార్యక్రమాల గురించి ఇలా ఉంది. (రాష్ట్ర ప్రభుత్వ ఆర్కైవ్స్ నుండి సేకరణ)

జి.ఓ. నెం. 1970 పబ్లిక్ (జనరల్) డిపార్టుమెంటు 14-8-41 దుళ్ళ వెంకటలక్ష్మి గురించి కృష్ణాజిల్లా పోలీసు సూపరింటెండెంట్ స్పెషల్ బ్రాంచి సి.ఐ.డి. రిపోర్టు.

"మద్రాసు ప్రభుత్వంచే నిషేధించబడిన వయోజనవిద్యా పాఠశాలలను కృష్ణాజిల్లాలో ఈమె నిర్వహించుతూవుంది.పశ్చిమ గోదావరిజిల్లాలో వయోజనవిద్యా కార్యక్రమం ఆర్గనైజరుగా పరకాల పట్టాభిరామారావు (కమ్యూనిస్టు)తో వయోజన విద్యా శిక్షణా శిబిరాలకు మేజిక్ లాంట్రన్ స్లైడ్సు పంపే ఏర్పాటు చేయవలసిందిగా ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూవుంది."

విద్యార్థులు సాగించే వయోజన విద్యా ప్రచార కార్యక్రమాన్ని కూడా ఆనాడు బ్రిటీషు ప్రభుత్వం ఎంత ప్రమాదకరంగా భావించేదో దీనిని బట్టి స్పష్టమవుతుంది.

## వివిధ జిల్లాల్లో విద్యార్థి ఉద్యమ విస్తరణ మహాసభలు

1937 రెండవ అర్థభాగం నుండి రాష్ట్రంలో వివిధ జిల్లాల్లో విద్యార్థి ఉద్యమ నిర్మాణం ప్రారంభమైంది. 1937 నవంబరు 15, 16 తేదీలలో కృష్ణా జిల్లా విద్యార్థి ప్రథమ మహాసభ బందరులో జరిగింది.

కృష్ణాజిల్లా విద్యార్థి ద్వితీయ మహాసభ 1938 నవంబరు 5, 6 తేదీలలో గన్నవరంలో జరిగింది. రాష్ట్ర విద్యార్థి సంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ మాకినేని బసవపున్నయ్య అధ్యక్షత వహించారు. జిల్లాలోని వివిధ ప్రాంతాల నుండి వేయి మంది విద్యార్థులు వివిధ విద్యాలయాలనుండి పెక్కుమంది ప్రతినిధులు వచ్చారు. సభకు శ్రీ గోపరాజు రామచంద్రరావు (గోరా) కంభంపాటి సత్యనారాయణ (సీనియర్) చండ్ర రాజేశ్వరరావు, జిల్లా విద్యార్థి సంఘ ప్రధాన కార్యదర్శి కాట్రగడ్డ రాజగోపాలరావు, వి. మల్లికాంబ, ఎమ్. అన్నపూర్ణ, సి. మరుద్వతి, పి మనోరత్నం, కె. భారతీదేవి, ఎ. శ్రీకృష్ణ మరికొందరు స్త్రీ ప్రతినిధరాండ్రు, జిల్లా విద్యార్థి నాయకులు, యువజన నాయకులు హాజరయ్యారు.

5 వ తేదీ మధ్యాహ్నం ఊరేగింపు, తరువాత శ్రీ బసవపున్నయ్యగారి అధ్యక్షతన మహాసభ జరిగింది. ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ నర్రా రాంబ్రహ్మం గారు స్వాగతోపన్యాసం చేశారు. ఆచార్యరంగా, "స్టూడెంట్సు కాల్" (బొంబాయి) పత్రికా సంపాదకులు శ్రీ జి. ఎస్. పొహెకర్, విశాఖపట్నం విద్యార్థి నాయకులు శ్రీ జి రామకోటేశ్వరరావు, సి. సూర్యనారాయణ, కె. వెంకట్రామశాస్త్రిగార్ల సందేశాలను ప్రధాన కార్యదర్శి శ్రీ కాట్రగడ్డ రాజగోపాలరావు చదివారు.

అనంతరం సభాధ్యక్షులు శ్రీ మాకినేని బసవపున్నయ్య విద్యార్థి సంఘ ఆశయాల గురించి, విద్యార్థుల సామాన్య కోర్కెల గురించి, నేటి పరీక్షావిధానానికి సామ్రాజ్యవాదానికి ఉన్న సంబంధంగురించి, స్వాతంత్ర్యసమరంలో విద్యార్థులు తీసుకోవలసిన బాధ్యతగురించి, కాంగ్రెస్ ప్రభుత్వం విద్యార్థులకు చేయవలసిన లాభముల గురించి గంటన్నరసేపు గంభీరోపన్యాసం చేశారు. తరువాత నవశక్తి సంపాదకులు శ్రీ కంభంపాటి సత్యనారాయణగారు విద్యార్థులు రాజకీయాలు అను విషయం గురించి, హిందూ కాలేజీ లెక్చరరు శ్రీ గోపరాజు రామచంద్రారావు గారు శాస్త్రీయ విజ్ఞానం గురించి మాట్లాడారు.

## తూర్పుగోదావరి జిల్లా ప్రథమ విద్యార్థి సభ

తూర్పుగోదావరి జిల్లా ప్రథమ విద్యార్థి మహాసభ 1938 డిసెంబరు 10, 11 తేదీలలో కాకినాడలో జరిగింది. 350 మంది విద్యార్థులతో ఊరేగింపు జరిగింది. సిటీ కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ పైడా వెంకట నారాయణగారు టౌన్‌హాలు వద్ద జాతీయ పతాకాన్ని ఎగురవేశారు. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ సంయుక్త కార్యదర్శి కామ్రేడ్ జొన్నలగడ్డ రామలింగయ్యగారు విద్యార్థి పతాకాన్ని ఎగురవేశారు సభను ఆంధ్ర యూనివర్శిటీ సెనేటు సభ్యులు శ్రీ.ఎమ్‌వి. కృష్ణారావుగారు ప్రారంభించారు.

ఆంధ్ర యూనివర్సిటీవారు నూతనంగా ప్రవేశపెట్టిన హక్కులకు భంగం కల్గించే రెగ్యులేషన్స్ పట్ల అసమ్మతి తెలుపుతూ, ఈ రెగ్యులేషనులను ఉపసంహరించుకోవాలని మహాసభలో తీర్మానించారు. విద్యార్థులు తమ హక్కులకై సాగించుతున్న పోరాటాన్ని అణచివేయడానికి చేస్తున్న నిర్బంధ చర్యలను ఖండించారు.

బొంబాయి యూనివర్సిటీలో వలె న్యాయశాస్త్ర పరీక్షకు ఇంటర్‌మీడియట్ ప్రాతిపదికగా తీసుకొని ఆంధ్ర విశ్వవిద్యాలయంలో కోర్సును ప్రవేశపెట్టాలని, ఎమ్ ఎ. కోర్సుకూడా ప్రవేశపెట్టాలని రోజుకొక పరీక్ష పెట్టాలనీ, 15 సంవత్సరాలు లోపు వయస్సున్న వారినికూడా స్కూలు ఫైనల్ పరీక్షకు కూర్చోనివ్వాలనీ సెలెక్షన్ పరీక్షల్లో డిటెన్షను పద్ధతి ఉండరాదని, స్కూలు జీతాలు తగ్గించాలనీ, ప్రభుత్వోద్యోగాలుగాని, విద్యాలయాలలో సీట్లుగాని కులమును బట్టి గాక శక్తిని (అర్హతను) బట్టి యివ్వాలనీ, మద్రాసు ప్రభుత్వ ఎడ్యుకేషన్ రూల్సులో లోగడ గావించిన మార్పులు విద్యార్థిలోకానికి హానికరములు గావున ఉపసంహరించుకోవాలనీ, నిర్బంధోచిత ప్రాథమిక విద్య, సైనిక శిక్షణా విధానం ప్రవేశపెట్టాలనీ, కోరుతూ తీర్మానాలు చేశారు

కెమల్‌పాషా, షౌకత్‌ఆలీ గార్ల మృతికి సంతాపం తెల్పుతూ, కాశీ విశ్వవిద్యాలయ ఇంజనీరింగ్ విభాగంలో సమ్మెను, బెజవాడ విద్యార్థుల సమ్మెను బలపరుస్తూనూ, సి. ఐ. డీల వెంటబడుట జాతీయోద్యమానికి హానికరం గావున సి. ఐ. డి. లను తొలగించాలని ప్రభుత్వాన్ని కోరుతూనూ, ప్రత్యేకాంధ్రరాష్ట్ర విషయమై కాంగ్రెస్ వర్కింగ్ కమిటీచర్య ఆశాభంగకరంగా ఉంది కనుక ఈ విషయాన్ని వారు పునరాలోచించాలని కోరుతూనూ, ప్రపంచ శాంతికి భంగకరమైన మ్యూనిక్ ఒడంబడికలను గావించిన దలాదర్, ఛాంబర్లేన్‌ల అవమానకర చర్యను ఖండించుతూ కూడా తీర్మానాలు చేశారు.

11 వ తేదీ సాయంత్రం జరిగిన బహిరంగ సభలో జొన్నలగడ్డ రామలింగయ్య, ముదిగంటి జగ్గన్న శాస్త్రి, తుమ్మల వెంకట్రామయ్య, దేవులపల్లి కృష్ణశాస్త్రి, సి.వి.కె. రావు మున్నగువారు మాట్లాడారు. రెండు రోజులు సభలలోనూ విద్యార్థినులు కూడా ఉత్సాహంగా పాల్గొని తమ కష్ట నిష్ఠూరాలను వెలిబుచ్చి చర్చలలో పాల్గొని సభను జయప్రదం చేశారు.

శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు ఈ మహాసభకు ప్రత్యేకంగా "స్వాతంత్ర్యం శాంతి - అభ్యుదయం" అనే ఆశయాలు గల "యువ పతాకం" అను గేయం విద్యార్థి నాయకుల కోర్కెపై ప్రత్యేకంగా వ్రాశారు. వారి మేనకోడళ్ళు వింజమూరి

అనసూయ, సీతగార్లు వచ్చి ఈ గేయాన్ని సభలో పాడారు. కార్యదర్శిగా శ్రీ పాలెపు సత్యనారాయణశర్మ ఎన్నుకోఒడ్డారు. శ్రీ పర్వతనేని వెంకటేశ్వర రావు తదితరులు కార్యవర్గ సభ్యులుగా ఉన్నారు.

## తూర్పు గోదావరి జిల్లా ద్వితీయ విద్యార్థి మహాసభ

తూర్పు గోదావరి జిల్లా ద్వితీయ విద్యార్థి మహాసభ రాజమండ్రిలో 1940 ఫిబ్రవరి 4వ తేదీన జరిగింది. కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ నాయకులు శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్య, శ్రీ పుసులూరి కోదండరామయ్య తదితరులు సభకు వచ్చారు. రాష్ట్ర విద్యార్థి సంఘ కార్యదర్శి శ్రీ పి.ఎస్. శర్మ పతాకోత్సవం జరిపారు. పరకాల పట్టాభిరామారావు, శ్రీ జి. ఎస్. బాలాజీదాస్, ప్రభాకర చౌదరి, శ్రీ దొనెపూడి ధర్మారావు తదితరులు సభ నిర్వహణలో ప్రధాన బాధ్యతలు వహించారు

తృతీయ మహాసభ :- తూర్పు గోదావరి జిల్లా విద్యార్థి సంఘ తృతీయ మహాసభ 1941 ఫిబ్రవరి 7, 8,9 తేదీల్లో అమలాపురం హైస్కూలు ఆవరణలో జరిగింది. గుంటూరులో 1940 నవంబరు 10, 11 తేదీలలో జరిగిన ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ 17వ మహాసభలో ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకోబడిన శ్రీ ఆమంచర్ల గంగాధరరావు మహాసభకు ప్రారంభోత్సవం చేశారు. శ్రీ అడవి బాపిరాజుగారు విద్యార్థి వైజ్ఞానిక మహాసభకు అధ్యక్షత వహించారు జిల్లా విద్యార్థి సంఘ నాయకులు శ్రీ పరకాల పట్టాభిరామారావు, శ్రీ బాలాజీదాస్ తదితరులు మహాసభ ముఖ్య బాధ్యతలు నిర్వహించారు. శ్రీ పరానేని విశ్వేశ్వరరావు, మున్నగువారు పాల్గొన్నారు. జిల్లా కార్యదర్శిగా శ్రీ జి.ఎస్. బాలాజీదాస్ ఎన్నుకోబడ్డారు

జిల్లా అంతటా రాజోలు, కొత్తపేట, అమలాపురం, పిఠాపురం, సామర్ల కోట, పెద్దాపురం, తుని, రామచంద్రాపురం మొదలైన అన్నిచోట్లకు ఉద్యమం విస్తరించింది. శ్రీ పర్వతనేని వెంకటేశ్వరరావు, శ్రీ పి.ఎస్. శర్మ, శ్రీ పరకాల పట్టాభిరామరావు జిల్లాలో విద్యార్థి ఉద్యమ నిర్మాణానికి తొలిదశలో కృషి చేశారు. రెండవ దశలో కృషి చేసిన వారిలో శ్రీ జి. ఎస్. బాలాజీదాస్, శ్రీ చిట్టూరి ప్రభాకరచౌదరి, శ్రీ దొనెపూడి ధర్మారావు అటుపిమ్మట శ్రీ మేకా పట్టాభి రామయ్య, శ్రీ సురేంద్రనాథ్ చౌదరి, అటుపిమ్మట శ్రీ పి. వి. ఆర్. సుబ్ర మణ్యం, శ్రీ కపిల శ్రీరామమూర్తి, శ్రీ పి. వి. ఎన్. రాజు మున్నగువారు ఉన్నారు. చివరి ముగ్గురు డిటెన్షన్ వ్యతిరేక పోరాటాల్లో పి ఆర్. కాలేజీనుండి వెళ్ళగొట్టఒడ్డారు.

# పశ్చిమగోదావరి జిల్లాలో ద్వితీయ, తృతీయ మహాసభలు

పశ్చిమ గోదావరి జిల్లా విద్యార్థులు తమ ద్వితీయ మహాసభను 1940 జనవరి 24 వ తేదీన ఉండిలో జరుపుకున్నారు. ఉదయం 8 గంటలకు విద్యార్థులు కాంగ్రెస్ జెండాలతోనూ, విద్యార్థి జెండాలతోనూ జాతీయ గీతాలు పాడుకుంటూ గ్రామమంతా ఊరేగారు. మధ్యాహ్నం విద్యార్థి ప్రతినిధుల సమావేశం జి. బాపన్న గారి అధ్యక్షతన జరిగింది. ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ వారి కార్యక్రమం ప్రకారం వయోజన విద్యా ప్రచారం గావించాలనీ, జనవరి 26 స్వాతంత్ర్య దినోత్సవం జరపాలనీ తీర్మానించారు. ఉండి, మారుటేరు హైస్కూళ్ళ హెడ్మాష్టర్లు గారా జయంతి ఉత్సవాలలో పాల్గొనే విద్యార్థులపై తీసుకుంటున్న శిక్షణా చర్యలను నిరసించారు. డిటెన్షన్ పద్ధతి రద్దు చేయాలని కోరుతూ తీర్మానించారు

మహాసభకు అధ్యక్షత వహించడానికి వచ్చిన కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ నాయకులు శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్యగారిని, పశ్చిమ గోదావరి జిల్లా బోర్డు ఉపాధ్యక్షులైన తటవర్తి కృష్ణమూర్తిగారిని గ్రామమంతా ఊరేగించి క్లబ్ పద్దకు తీసుకొనివచ్చారు విద్యార్థి పతాకాన్ని శ్రీ తటవర్తి కృష్ణమూర్తిగారు ప్రతిష్ఠిస్తూ, విద్యార్థులు గాంధీ మహాత్ముని నాయకత్వం క్రింద ఉండవలెననీ, కాంగ్రెస్ శిక్షణకు లోబడి యుండవలసిందని అన్నారు. ఈ సమావేశంలో నాయకులైన అతివాదులు, మితవాదులలో ఒకరైన తమను ఆహ్వానించుటలోనే వారి యొక్క సహకార ఉద్దేశ్యం కనబడుతూంది గనుక దానిని అభినందిస్తున్నామని, అందరూ గాంధీజీ నాయకత్వాన నడుచుకోవాలనీ అన్నారు.

1939 ఏప్రియల్ 1, 2 తేదీలలో పశ్చిమ గోదావరి జిల్లా తృతీయ విద్యార్థి మహాసభ పాలకొల్లులో (దేవుని హాలులో) జరిగింది. జిల్లాలోని వివిధ ప్రాంతాల నుండి 60 మంది ప్రతినిధులు వచ్చారు "డిటెన్షన్ విధానం రద్దు కావాలి, హెచ్చు జీతాలు తగ్గించాలి, విద్యార్థి సంఘాలను గుర్తించాలి" మొదలైన నినాదాలతో ఊరేగింపు జరిగింది. కామ్రేడ్ అల్లూరి సత్యనారాయణగారు విద్యార్థి పతాకాన్ని, జాతీయ పతాకాన్ని ఆవిష్కరిస్తూ ఈ జాతీయ జెండా నాయకత్వాన విద్యార్థులు కాలేజీలు, స్కూళ్ళు వదలి జాతీయ స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్నారు. అనేక కష్టనష్టాలకు లోనయ్యారు. విద్యార్థులు రాబోవు స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనాలి. స్వాతంత్ర్యం, శాంతి, అభ్యుదయం అనే విద్యార్థి జెండా ఎగురవేయడానికి సంతోషిస్తున్నాను అని అన్నారు.

ఆహ్వాన సంఘాధ్యక్షులు స్వాగతోపన్యాసం చేస్తూ విద్యార్థులు ఎదుర్కొంటున్న కష్టాలను, సమస్యలను తెలియజేశారు. కామ్రేడ్ కాటగడ్డ రాజగోపాలరావు మహాసభను ప్రారంభిస్తూ, ప్రస్తుత విద్యా విధానంలోని అవకతవకలను వివరిం

చారు మహాసభకు అధ్యక్షత వహించిన రాష్ట్రవిద్యార్థి సంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ జి రామకోటేశ్వర రావుగారు మాట్లాడుతూ విద్యార్థులు - ఉపాధ్యాయులు సన్నిహిత సంబంధాలు కల్గియుండాలనీ, ఉపాధ్యాయులు విద్యార్థుల పట్ల తమ పాతధోరణి మానుకోవాలనీ, స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా విద్యార్థులు వయోజన విద్యా కార్యక్రమాలు చేపట్టాలనీ, విద్యార్థుల కోర్కెలపై జరిగే సమ్మెలతో జిల్లాలోని విద్యార్థులందరూ పాల్గొనాలనీ అన్నారు.

## గుంటూరు జిల్లా విద్యార్థి మహాసభ

గుంటూరు జిల్లా విద్యార్థి మహాసభ 1939 ఫిబ్రవరి 11 వ తేదీన నర్సారావు పేటలో జరిగింది. "ఫెడరేషన్ నశించాలి". సామ్రాజ్య వాదం నశించాలి. విద్యార్థి సంఘాలకు జై" అను నినాదాలతో ఊరేగింపు జరిగింది. మున్సిపల్ హైస్కూలు ఆవరణలో ఈ సభకు పట్టణంలోని విద్యార్థులు, పుర జనులు చాలా మంది వచ్చారు.

బెల్లంకొండ రాఘవరావు గారు మహాసభకు ప్రారంభోత్సవం చేశారు. కంభంపాటి సత్యనారాయణ ఎమ్.ఎ, బి.యల్. (ఆనర్స్) అధ్యక్షోప న్యాసంలో స్పెయిన్, చైనా, పాలస్టయిన్ మొదలగు దేశాలలో నేడు జరుగుతున్న యుద్ధ విషయాలన్నీ మనం తెలుసుకుంటున్నాం. ప్రతీచోటా విద్యార్థులు కళాశాలలు వదలివేసి యుద్ధ రంగాలకు వెడుతున్నారు. మన జాతీయ పోరాటం కూడా అభివృద్ధి చెందుతూంది. అఖిలభారత విద్యార్థి సంఘం ఈ పోరాటాన్ని బలపరుస్తూ జాతీయ సంస్థ కాంగ్రెస్‌కు తోడ్పడుతోంది. చాల మంది విద్యార్థులు ఇంతకు పూర్వం జాతియోద్యమంలో పాల్గొన్నారు విద్యార్థులు ప్రజలను చైతన్య పరచి వారిని జాతీయ పోరాటంలోకి తీసుకు రావాలని ఉద్బోధించారు.

ఆంధ్ర రాష్ట్ర యూనివర్శిటీ ఆర్డినెన్సులను ఖండిస్తూ రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ తరపున ప్రారంభించుతున్నా వయోజన విద్యా ప్రచారాన్ని ప్రోత్సహిం చుతూ గుంటూరుజిల్లా తరపున రు. 100/- యిచ్చుటకు అనుమతిస్తూ, విద్యార్థుల కష్టాల నివారణకు అవసరమైతే జనరల్ సమ్మె చేయుటకు సభలో తీర్మానాలు చేశారు.

జిల్లా ఫెడరేషన్ ఆఫీసు నర్సారావుపేటలో నెలకొల్పడానికి తీర్మానించారు. ఆఫీసు కార్యదర్శిగా రాజామణి గారిని ఎన్నుకున్నారు.

## విద్యార్థి సంఘంపై దుష్ప్రచారానికి రాష్ట్ర సంఘ సమాధానం

బెజవాడలో 1939 జనవరిలో విజయవంతంగా రాష్ట్ర విద్యార్థి మహాసభ జరగడం, విద్యార్థులు ఏకైక పోరాట సంస్థగా రూపొందడం, అందులో సోషలిస్టు

భావాలు కల్గిన విద్యార్థులు నాయకత్వ స్థానంలో ఉండటంతో కొంతమంది కాంగ్రెస్ వాదులు, ప్రత్యేకాంధ్ర రాష్ట్ర వాదులు ఈ సంఘం ఏదో ఒక పార్టీకి చెందిన సంస్థ అనీ చెప్పి వేరే పోటీ విద్యార్థి సంఘం ఒక దానిని లేవదీయాలని ప్రచారం మొదలుపెట్టారు. దీనికి రాష్ట్ర విద్యార్థి సంఘ నాయకులు సమాధానం యిస్తూ ఈ దుష్ప్రచారాన్ని ఖండించారు.

ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ జాయింటు సెక్రటరీ శ్రీ వై.వి. కృష్ణా రావు కార్యనిర్వాహక సభ్యుడు, ఎస్.వి. చలపతిరావు, గుంటూరు జిల్లా విద్యార్థి ఫెడరేషన్ కార్యదర్శి శ్రీ టి. వెంకటేశ్వరరావుగార్లు చేసిన సంయుక్త ప్రకటనలో ఇలా తెలియజేశారు.

ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్, ఏ యితర పార్టీ యొక్క, ఏ వ్యక్తి యొక్కగాని చెప్పుచేతలలో లేదు. కేవలం విద్యార్థుల యొక్క సమస్యా పరిష్కారానికై ఏర్పడ్డ సంస్థ యిది. స్వాతంత్ర్యం, శాంతి, అభివృద్ధి (అభ్యుదయం) అను ఆశయాన్ని అంగీకరించే ప్రతీ విద్యార్థికి, వ్యక్తిగతంగా తానే పార్టీకి చెందినా సరే, యీ సంస్థలో సభ్యత్వానికి అర్హత వుంది.

"ఆంధ్ర రాష్ట్రమందలి విద్యార్థుల దినదిన సమస్యలను పరిష్కరించేటందుకే ఈ సంస్థ కృషి చేస్తుంది. సంకుచితమైన రాష్ట్రాభిమానానికి యిది తావివ్వదు. ప్రంద్రంగి కేశవరావుగారు బెజవాడలో దీనిపై గావించిన ఆరోపణలు నిరాధారాలు. ప్రంద్రంగి కేశవరావుగారు ఆశించినట్లు ఆంధ్ర దేశంలో వేరొక రాష్ట్ర విద్యార్థి సంస్థకు తావులేదని ఆంధ్ర విద్యార్థులందరూ చాటాలి. వీరి నాయకత్వం మాకేమీ అక్కరలేదు. బెజవాడ ఆంధ్ర పార్లమెంటు రాజకీయాలను విద్యార్థులలోకి దిగుమతి చేయడం, ప్రంద్రంగి కేశవరావుగారు మానివేస్తే, పరువు దక్కుతుంది. ఒక దానిని కొత్తగా సృష్టించడానికి వీరు చేస్తున్న ప్రయత్నాన్ని విద్యార్థులందరూ ప్రతిఘటించి, దాని దరికి జేరవద్దని విద్యార్థులను హెచ్చరిస్తున్నాం". (నవశక్తి, 15-2-39).

## విద్యార్థుల హక్కుల దినం

1939 ఫిబ్రవరి 19 వ తేదీన రాష్ట్రమంతటా విద్యార్థి హక్కుల గురించి సభలు జరిపి, స్థానిక సెనేటు సభ్యుల వద్దకు, శాసనసభ్యుల వద్దకు, ప్రదర్శనలు జరిపి, ఈ విజ్ఞప్తులు సమర్పించాలని ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ ప్రధాన కార్యదర్శి శ్రీ జి. రామకోటేశ్వరరావు విజ్ఞప్తిచేశారు. ఆ విజ్ఞప్తి మేరకు రాష్ట్రంలో వివిధ ప్రాంతాలలో సభలు సమావేశాలు, ప్రదర్శనలు జరిగాయి. విద్యార్థుల కోర్కెలను ఈ సభలలో చాటారు.

## నూతన విద్యా సంవత్సర ప్రారంభంలో

అదేవిధంగా శ్రీ రామకోటేశ్వరరావు 1939 జూన్‌లో పాఠశాలలు తెరిచే సమయంలో ఒక ప్రకటనచేస్తూ స్థానిక విద్యార్థి సంఘాలు తీసుకోవలసిన కార్యక్రమాన్ని యిలా తెలియజేశారు.

"జూన్‌నెల ప్రవేశించింది. పాఠశాలలు తెరువ బడతాయి. విద్యార్థి ఉద్యమం విజృంభించాలంటే నూతన సంవత్సరానికి సరియైన కార్యక్రమం నిర్ణయించాలి. నిర్మాణ సమస్య, జనరల్ సమ్మె, వాలంటీరీ దళాలు, మున్నగు ముఖ్య సమస్యలను చర్చించాలి. బెజవాడ కమ్మ హాస్టలులో ఈ నెల 10వ తేదీన రాష్ట్ర కార్యవర్గ సమావేశం జరుగుతుంది. చర్చనీయాంశాలు 1) నిర్మాణ సమస్యలు 2) జనరల్ సమ్మె 3) వయోజన విద్య 4) వాలంటీరు దళాలు 5) రాజకీయ బాధితులు 6) స్టూడెంటుకాల్ 7) కాకినాడ సమావేశం (16 వ రాష్ట్ర విద్యార్థి మహాసభ సన్నాహాలు) 8) యితర విషయాలు.

## కార్యవర్గ సమావేశ విశేషాలు

నోటీసు ప్రకారం బెజవాడలో 10-6-1939 వ తేదీన రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ కార్యవర్గ సమావేశం జరిగింది. సమావేశానికి శ్రీ యర్రమిల్లి నరసింహా రావుగారు అధ్యక్షతవహించారు. విద్యావేత్తలు, సంస్కర్తలు శ్రీయుతులు రఘుపతి వెంకటరత్నం నాయుడు, చరిత్రకారులు శ్రీ చిలుకూరి వీరభద్రరావు, సోషలిస్టు పార్టీ సభ్యురాలు, మహిళాసంఘ కార్యకర్త కామ్రేడ్ గోవిందమ్మ (సుందరయ్య గారి సోదరి) గార్ల మృతికి సమావేశం వారు సంతాపంతెలిపారు. స్కూలు ఫైనల్ మోడరేషన్ బోర్డు వారు ఎక్కువ మందిని ఉత్తీర్ణులను చేయాలని, ఒక ఏడాది ఫెయిల్ అయినంత మాత్రాన సగం జీతం పొందకుండా చేయడం తగని పని అనీ, తీర్మానాలు ఆమోదించారు. అన్నామలై విద్యార్థి పోరాటాన్ని, కటక్ వైద్య విద్యార్థుల పోరాటాన్ని బలపరిచారు.

రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ కార్యవర్గానికి శ్రీ పాలెపు సత్యనారాయణ శర్మ, శ్రీ యర్రమిల్లి నరసింహారావులను సభ్యులుగా నియమించుతూ తీర్మానించారు. రాష్ట్రంలో కనీసం 10 చోట్ల వలంటీరు దళాలను స్థాపించాలని, అక్టోబరు 10 వ తేదీన వాల్తేరులో జరగనున్న ఆంధ్ర విశ్వవిద్యాలయ పట్టా ప్రధానోత్సవ సమరమాన హైదరాబాదు ప్రభుత్వ కార్యనిర్వాహక అధ్యక్షుడు సర్‌అక్బర్ హైదరీగారిస్నాతకోత్సవ ఉపన్యాసాన్ని ఆంధ్ర పట్టభద్రులు బహిష్కరించాలని తీర్మానించారు. చిట్టివలస జూట్‌మిల్లు సమ్మెలో కాల్పులకు గురి అయిన 70 మందిని పరీక్షించి, ఎంక్వయిరీ కమిటీ ముందు సాక్ష్యంచెప్పిన డాక్టర్ వెంకయ్య, పి. వి. సి. వి. సుబ్బారావుగార్లను అభినందించుతూ తీర్మానాలు చేశారు.

సమ్మె సంఘ సమావేశం :- బెజవాడలో జరిగిన 15 వ రాష్ట్ర విద్యార్థి మహాసభలో నియమించబడిన జనరల్ స్ట్రయిక్ సబ్ కమిటీ 1939 జూన్ 20వ తేదీన అద్వొ కమ్మహాస్టలులో సమావేశమై సమ్మె జరపడానికి ముందు విద్యా శాఖాధికారులవద్దకు రాయబారం నడుపాలని, ధనసేకరణ, సంచార కార్యక్రమాలు నిర్వహించాలనీ తీర్మానించింది.

## డిటెన్షన్ వ్యతిరేక పోరాటానికి విజయం

గత సంవత్సరం (1938) లో రాష్ట్రమంతటా డిటెన్షన్ విధానాన్ని ఎదుర్కొంటూ విద్యార్థులు అనేక చోట్ల సమ్మె చేశారు. కాని యింతవరకు డిటెన్షన్ విధానం రద్దు కాలేదు. పైగా డిటెన్షను వ్యతిరేకించబోమని విద్యార్థుల నుండి సంవత్సరారంభంలోనే విద్యార్థుల నుండి హామీ పత్రాలు పుచ్చుకుంటున్నారు. అధికారుల దౌర్జన్యాన్ని ఎదుర్కొడానికి ఇప్పటి నుండి రాష్ట్ర మంతటా విద్యార్థి సంఘాలు ఆందోళన చేయాలని, కనుక జూలై 30 వ తేదీన రాష్ట్రమంతటా డిటెన్షన్ వ్యతిరేకదినం పాటించాలని ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ ప్రధాన కార్యదర్శి శ్రీ జి. రామకోటేశ్వరరావు ప్రకటించారు. ఆ రోజున 1. అసమ్మతి సభలు జరపాలనీ, 2. ఊరేగింపులు జరుపాలనీ, 3 అధికారుల వద్దకు డెప్యుటేషను, 4. ఇతర ప్రజా సంస్థల సానుభూతి, సంఘీభావం సంపాదించుట చేయాలనీ తీర్మానాలను అధికారులకు పంపాలనీ కాపీలు రాష్ట్ర కార్యాలయానికి పంపాలనీ ఆయన కోరారు.

## విద్యార్థి ఆందోళనకు విజయం - విద్యామంత్రి హామీ

1939 జూలై 30 వ తేదీన రాష్ట్ర వ్యాపిత డిటెన్షన్ వ్యతిరేక ఆందోళనకు పిలుపు యిచ్చిన అనంతరం మద్రాసు రాష్ట్ర విద్యామంత్రి వార్కీగారు ఆంధ్ర రాష్ట్ర పర్యటనకు వచ్చారు. ఈ సందర్భంలో గుంటూరు విద్యార్థి సంఘం వారు ఆయన వద్దకు రాయబారం వెళ్ళడానికి సమాధానం చెబుతూ "డిటెన్షన్ చిన్న తరగతులలోనే కాని, కాలేజీ, స్కూలు ఫైనల్ క్లాసులలో ఇకనుంచి ఉండవనీ, కొద్ది కాలంలోనే ఈ విషయమై ప్రకటన చేస్తామని వాగ్దానం చేశారు. ఇందుకై వార్కీ గారిని అభినందిస్తూ, జూలై 30 డిటెన్షను దినం జరుపనవసరం లేదని రాష్ట్ర విద్యార్థి సంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ జి. రామకోటేశ్వరరావుగారు ప్రకటించారు.

మొత్తం మీద రెండు సంవత్సరాలు ఎడతెగకుండా రాష్ట్రమంతటా అనేక కాలేజీలు, హైస్కూళ్ళలో విద్యార్థులు, సమ్మెలు, ప్రదర్శనలు, జరిపి తీవ్ర ఆందోళన చేసిన దానికి ఫలితం దక్కింది. కాంగ్రెస్ వాదులలో ఒక భాగం

కూడా ఈ ఆందోళనకు తోడ్పడింది. అనేక చోట్ల ఉపాధ్యాయులు కూడా తోడ్పడ్డారు. గుంటూరు, బందరు, తెనాలి, కాకినాడ, బెజవాడ తదితర అనేక చోట్ల జరిగిన సమ్మెలు ఈ డిటెన్షను వ్యతిరేక పోరాటంలో మైలురాళ్ళుగా నిలిచాయి. బ్రిటిషు సామ్రాజ్యవాద ప్రభుత్వం ప్రవేశపెట్టిన బానిస విద్యా విధానాన్ని ఆనాటి ఆంధ్ర విద్యార్థులు ఢీకొని జాతీయ స్వాతంత్ర్య సమరాన్ని ఆ విధంగా విస్తృత పరిచారు. విద్యార్థులలో సామ్రాజ్యవాద వ్యతిరేక చైతన్యానికి ఇది దోహదం చేసింది.

## సర్ అక్బర్ హైదరీ స్నాతకోపన్యాసం బహిష్కరణ

ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఉద్యమం 1939-40లో (ఈ సంవత్సరంలో 1940 స్నాతకోత్సవానికి) సాగించిన మరొక చరిత్రాత్మక పోరాటం - ఆంధ్ర యూనివర్శిటీ స్నాతకోత్సవానికి ఆహ్వానించబడిన నైజాం ప్రభుత్వ పరిపాలకుడు, బ్రిటిషు తాబేదారు అయిన సర్ అక్బర్ హైదరీ రాకుండా జయప్రదంగా వెనక్కు కొట్టిన పోరాటం.

ఆంధ్ర దేశ విద్యార్థులు సాగించిన ఈ పోరాటం హైద్రాబాదు విద్యార్థులు ఆనాడు సాగిస్తున్న 'వందేమాతరం' పోరాటానికి సంఘీభావ సూచకంగా జరిపిన పోరాటం కూడా.

మద్రాసు గవర్నరు ఆర్థర్ హోప్ ఆంధ్ర యూనివర్శిటీ చాన్సులర్‌గా నాటి నైజాం ప్రభుత్వ కార్యనిర్వాహక అధ్యక్షులు, రైట్ ఆనరబుల్ సర్ అక్బర్ హైదరీని స్నాతకోపన్యాసం యివ్వవలసిందిగా ఆహ్వానించారు. హైద్రాబాదు ఉస్మానియా యూనివర్శిటీలో విద్యార్థులు ప్రార్థనా గేయంగా వందేమాతరం పాడరాదని నైజాం ప్రభుత్వం పాలకుడుగా సర్ అక్బర్ హైదరీ నిషేధించాడు దీనికి వ్యతిరేకంగా హైద్రాబాదు రాష్ట్రంలో పలుచోట్ల విద్యార్థులు ఆందోళన చేస్తున్నారు.

పైగా నైజాం నవాబు వర్ధిల్లాలనే గేయం నిర్బంధపూర్వకంగా అందరు పాడాలనికూడా నిర్బంధించారు తమకు యిష్టంవచ్చిన దేశభక్తి గేయం పాడుకొవడానికి అభ్యంతరం పెట్టరాదని విద్యార్థుల పోరాటం, సహజంగానే ఆనాటి స్టేటు కాంగ్రెస్, యితర దేశభక్తి వర్గాలు విద్యార్థుల పోరాటాన్ని బలపరిచాయి. (1938 నవంబరు 28 న రంజాన్ సెలవులతర్వాత యూనివర్శిటీ కాలేజీ తెరువగానే వందేమాతరం గేయాన్ని నిషేధించారు. ఈ గీతం రాజకీయంగా వివాదాస్పదమైందని, హిందూయేతర విద్యార్థుల భావాలను కించపరుస్తుందని సాకులు చూపి నిషేధించారు.)

విద్యార్థులు ఈ ఉత్తర్వు ఉల్లంఘించడంతో హైదరాబాదు, గుల్బర్గా, మహబూబ్‌నగర్, వరంగల్, ఔరంగాబాదు, బీహార్ తదితర ప్రాంతాలకు చెందిన అనేక వందలమంది విద్యార్థులను విద్యాలయాల నుండి బర్తరఫ్ చేశారు. వందలాది విద్యార్థులు నాగపూర్ వలస వెళ్ళి అక్కడ చదువుకోవలసి వచ్చింది.

అట్టి పరిస్థితుల్లో అక్బర్ హైదరీ స్నాతకోపన్యాసం ఆంధ్ర యూనివర్శిటీలో సాగనీయరాదని ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ పిలుపు యిచ్చింది. 10-6-39న బెజవాడలో జరిగిన రాష్ట్ర విద్యార్థి సంఘ కార్యవర్గ సమావేశం చేసిన తీర్మానాన్ని అనుసరించి రాష్ట్రంలో పలుచోట్ల విద్యార్థులు సభలు - సమావేశాలు జరిపి అక్బర్ హైదరీ రాకను వ్యతిరేకిస్తూ ఆందోళన చేశారు. దీని ఫలితంగా అక్బర్ హైదరీ తోకముడిచాడు. ఆయనస్థానంలో రతన్ సర్కార్‌ను స్నాతకోపన్యాసానికి ఆహ్వానించారు ఇది ఆంధ్ర విద్యార్థులు ముఖ్యంగా విశాఖపట్నం విద్యార్థి సంఘం సాధించిన విజయమనడంలో సందేహంలేదు.

అక్బర్ హైదరీ రావడంలేదని ప్రభుత్వం ప్రకటించిన దృష్ట్యా స్నాతకోత్సవాన్ని బహిష్కరించవలసిందిగా యిచ్చిన పిలుపును రాష్ట్ర విద్యార్థి సంఘం ఉపసంహరించుకుంటూ, స్నాతకోత్సవానికి యథాప్రకారంగా విద్యార్థులు హాజరు కావచ్చునని ప్రకటించింది. అయితే వందేమాతరం గేయంపై హైదరాబాదు ప్రభుత్వం నిషేధం విధించినంత వరకు అందుకు వ్యతిరేకంగా ఆందోళన కొనసాగిస్తూనే ఉంటామని తెలిపింది.

## 1937 ఆగష్టు గుంటూరు సభ నుండి 1939 జనవరి బెజవాడ సభ వరకు

ఈ విధంగా 1937 ఆగష్టులో గుంటూరులో 14 వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభ లగాయతు రాష్ట్రం నలుమూలలా విద్యార్థి ఉద్యమం వ్యాపించి ఒక బలమైన సంఘటిత ప్రజాతంత్ర ఉద్యమంగా రూపొంది విద్యార్థుల కోర్కెల ప్రాతిపదికపై వారిని సమీకరించగల్గడమే కాక, వారిని దేశభక్తియుత కార్యక్రమాలవైపు తీసుకొని రాగల్గింది. జాతీయోద్యమంలో ఒక అంతర్భాగంగా విద్యార్థులను రాజకీయంగా చైతన్యవంతమొనరించగల్గింది. దాదాపు సంవత్సరంన్నర కాలంలో రాష్ట్రవ్యాపిత ఉద్యమంగా అభివృద్ధి చెందింది. 1939 జనవరిలో 15వ రాష్ట్ర విద్యార్థి మహాసభ బెజవాడలో జరుపుకొని మరింత స్పష్టమైన సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ ఐక్యసంఘటనలో ప్రముఖస్థానం వహించగల్గింది.

వివిధ జిల్లాల మహాసభలు జరుపుకొని నిర్మాణ రీత్యాకూడా బలపడి, ఆయా జిల్లాల్లోని ఇంచుమించు అన్ని విద్యాలయాలకు విస్తరించగల్గింది.

విద్యార్థి ఉద్యమం ఇలా వ్యాప్తి చెందడానికి దానిని ఎప్పటికప్పుడు తగు సూచనలు యిచ్చి నడుపడానికి కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం, ఆనాటి రాష్ట్ర సోషలిస్టుపార్టీ వేదికనుండి కృషిచేస్తూ వచ్చింది. తప్పొప్పులను విమర్శించుతూ విద్యార్థులలో మార్క్సిస్టుభావాల వ్యాప్తికి పార్టీ నిర్మాణానికి కూడా ప్రయత్నించింది.

వివిధ జిల్లాల్లో జరిగిన మహాసభల గురించి జిల్లాల్లో ఉద్యమ నిర్మాణం గురించి చెప్పుకొనేముందు 1938 జూలై నాటికిగల విద్యార్థి ఉద్యమ నిర్మాణ పరిస్థితి, బలహీనతలు ముందు కర్తవ్యాల గురించి రాష్ట్ర పార్టీ నాయకత్వం చేసిన తీర్మానం ఒకసారి పరిశీలించుదాం ఆ తీర్మానం ఇలా వుంది.

## రాష్ట్ర పార్టీ సమీక్ష

"ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ ఏర్పడిన తరువాత విద్యార్థి ఉద్యమంలో సమ్మెలు తప్ప చెప్పుకోదగ్గ కార్యక్రమమేమీ జరుగలేదు. సమ్మెలలో పుట్టిన విప్లవ చైతన్యానికి ఫలితంగా మంతెనవారిపాలెం ఆర్థిక, రాజకీయ పాఠశాలకు 60 మందికి పైగా విద్యార్థులు వచ్చారు. మహాసభలో (గుంటూరులో జరిగిన 14వ రాష్ట్ర సభ) ప్యాసైన కనీస కోర్కెల ప్రణాళిక, కార్యక్రమం, తీర్మానాలు, నియమావళి అచ్చు వేయించి పంచిపెట్టబడలేదు. ఫెడరేషన్ కొక ఆఫీసుగాని, సభ్యుల లిస్టుగాని, ఉత్తరప్రత్యుత్తరాలుగాని లేవు. విప్లవ చైతన్యం ఎక్కువైనా సిద్ధాంత బలం బాగా కలుగలేదు. విద్యార్థి సోదరులకు, విద్యార్థి మహాసభలకు కాంగ్రెస్‌సంస్థలో ప్రాతినిధ్యమివ్వాలి. కాంగ్రెస్ పునాది మీద ఐక్యసంఘటన నిర్మించాలని మాటలు చెప్పారే కాని, కాంగ్రెస్ ప్రాథమిక సంఘాలకు గాని విద్యార్థి ప్రాథమిక సంఘాలకు గాని దైనందిన కార్యక్రమం లేకపోవడంతో దిన దిన సంబంధం లేకుండా పోయింది. ఏదో ఎలక్షన్‌లలో పాల్గొనడం జరిగింది. అక్కడక్కడ దినోత్సవాలు జరుపడంలో సోషలిస్టు పార్టీ యువజన సంఘాల జాబితాకు (విద్యార్థి సంఘాలు) తమ పేరు జేర్చడం మాత్రం జరిగింది. ఒక వేళ చురుకుగా ఉత్సవాలు జరిపినా, కాంగ్రెసు సంఘాలలో సంబంధం లేకుండా జరిగినవి. ఇది స్థానిక సోషలిస్టు పార్టీకి, కాంగ్రెసు సంఘానికి ఉన్న సంయుక్త సంఘటన (యం.యస్.యఫ్ ) కార్యక్రమాన్ని అనుసరించి ఉంటుంది. రాష్ట్రం మొత్తం మీద అన్ని విద్యార్థి సంఘాలు సోషలిస్టులు పలుకుబడి క్రింద ఉన్నవని చెప్పవచ్చును మొత్తం మీద విద్యార్థి ఉద్యమంలో "సెక్టేరియనిజం ఎక్కువగా అగుపడుతుంది (వక్కాణింపు నాది) దీనికి కారణం కాంగ్రెస్ సంఘాలలో కలిసి చేయగల దైనందిన కార్యక్రమం నిర్ణయించక

పోవడం విద్యార్థుల సమ్మె పోరాటంలో కాంగ్రెస్ నాయకులు గాని, సభ్యులు గాని జోక్యం పుచ్చుకోకపోవడం.

"రాష్ట్రంలో అధికారం వహించియున్న కాంగ్రెస్ మంత్రి వర్గం వారు సమ్మెలు జరుగుతున్నంత కాలం మాట్లాడకుండా వూరుకున్నా ఇటీవల రెండు కమ్యూనిక్కులు యిచ్చారు. వీటివల్ల కాలేజీ, హైస్కూలు అధికారుల చేతుల్లో నిరంకుశాధికారాలు పెట్టబడ్డాయి. బందరు, కాకినాడ కాలేజీల నుండి, సమ్మెలలో పాల్గొన్న వారినీ, విద్యార్థి సంఘాలను నడిపేవారిని, కొందరు విద్యార్థులను పంపివేశారు (వెళ్ళగొట్టారు). దాదాపు అన్నిచోట్ల పూర్వపు రాజీ ఒడంబడికలు ఉల్లంఘించబడుతున్నాయి. (గుంటూరు, బందరు, నెల్లూరు)

"ముందు కర్తవ్యం : అవసరంగా ఆఫీసులు నెలకొల్పాలి."

"విద్యార్థుల సాధారణ కనీస కోర్కెలను స్థానిక యిబ్బందులను గురించి ప్రచారం చేస్తూ స్థానిక సంఘాలను ఏర్పరచాలి సభ్యులను అలాగే చేర్పించాలి."

"స్థానిక సంఘాలు, పూర్వపు సమ్మెల సందర్భంలో జరిగిన రాజీ షరతులు ఆచరణలో ఎంతవరకు వచ్చినవో, విద్యార్థులకు స్కూలు అధికారులకు తెలియజేస్తూ ఉండాలి." (వ్రాత మూలకంగా)

"తల్లితండ్రులకోసం, ఇతర ప్రజలకోసం అర్థమయ్యేటట్లు ఈ విషయమై కరపత్రాలు వేయించి పంచిపెట్టాలి."

"ప్రతీవారం విద్యార్థి సంఘ సభ కూడాలి (సమావేశం జరపాలి.) (దీనికి సభ్యులు కాని, ఇతర విద్యార్థులు కూడా రావచ్చును. కాని ఓటింగు హక్కు ఉండదు.)"

## దిన దిన కార్యక్రమం

"జాతీయ అంతర్జాతీయ రాజకీయాల మీద అభివృద్ధికరమైన సారస్వతం మీద చర్చలు, ఉపన్యాసాలు.

"అప్పుడప్పుడు ఉపన్యాస పోటీ, వ్యాసరచన పోటీలు, ఆటలలో పోటీలు (సంఘంలో చేరకపోయినా) సంఘ ఆశయాన్ని ఒప్పుకొనే వారందరూ పోటీచేయ నర్హులుగా ఉండాలి.

"వలంటీరు దళాలు, రాత్రి పాఠశాలలు గణాంక లెక్కలు (స్టాటిస్టిక్స్) దీనిని గురించి విద్యార్థులు తెలుసుకోవాలి.

"నిరుద్యోగులు, విద్యావంతులు, విద్యలేనివారు, కార్మికులు, కుటుంబ ఖర్చులు, అప్పులు వగైరా.

## అధ్యయన తరగతులు

"విద్యార్థులలో పని చేసేవారు, మద్రాసు ఎడ్యుకేషనల్ రూల్సు, ఇతర రాష్ట్ర నిబంధనలతో పోల్చి చదవాలి."

జాతీయ, అంతర్జాతీయ విద్యార్థి ఉద్యమాలు కొన్ని విద్యా విధానాలు (వాటం విద్యా విధానం) జాతీయ ప్రజా విప్లవంలోనూ, సోషలిస్టు విప్లవంలోనూ ప్రత్యేకంగా విద్యార్థుల విభాగం దీనిని గూర్చి తెలుసుకోవాలి

"జాతీయ దినోత్సవాలు జరపాలి. రాష్ట్రమంతటా ఈ క్రింది వాటి విషయమై విద్యార్థి ఫెడరేషన్ ఆందోళన చేయాలి. రాష్ట్రం మొత్తం మీద ఉద్యమం లేవదీయాలి."

1. మద్రాసు విద్యా చట్టం 8 వ అధ్యాయం రద్దు చేయాలి.

2. గవర్నమెంటు, విద్యార్థులపైన ప్రకటించిన కమ్యూనిక్కులు రద్దు చేయాలి

3. హెచ్చించిన జీతాలను, పూర్వపు రేటుకు తగ్గించాలి.

4. విశాఖపట్నం మెడికల్ డిగ్రీల విషయమై ఆందోళన సాగించాలి.

## పార్టీ బాధ్యతలు

"బాగా చురుకుగా పని చేసే విద్యార్థి సోదరులను, సోషలిజంలో నమ్మిన వారిని పార్టీలో చేర్చుకొని, వారికి యితర రంగాలలో జరిగే పోరాటాన్ని పరిచయం చేయాలి. జాతీయైక్య సంఘటన విధానాన్ని బాగా బోధించాలి. స్థానిక, జిల్లా, రాష్ట్ర పార్టీలు స్థానిక, జిల్లా, విద్యార్థి సంఘం కార్యనిర్వాహక వర్గాలలోని పార్టీ సభ్యులను ఒకరినినొకరిని పరిచయం చేయాలి. ఇదివరకటికంటే అధ్యయన తరగతుల ద్వారా సిద్ధాంతబలం ఎక్కువ చేయాలి. ఇతర పుస్తకాలు చదివించాలి"

1938 జూలైలో రాష్ట్ర సోషలిస్టుపార్టీ చేసిన తీర్మానంలోని ఈ అంశాలను చూసినప్పుడు మనకు బోధపడేదేమిటి?

విద్యార్థి ఉద్యమం ఇంకా సెక్టేరియన్ పంథాలోనే నడుస్తూంది. కేవలం సమ్మె పోరాటాలే కాక బహుముఖ సాంఘిక, సాంస్కృతిక, శారీరక కార్యక్రమాలు, వయోజన విద్యా కార్యక్రమాలలో పాల్గొని, ఇంకా ఎక్కువగా విద్యార్థులను ఆకర్షించి విస్తృత ఉద్యమంగా పెంపొందించాలి. జాతీయైక్య సంఘటన కార్యక్రమాన్ని ఇంకా బాగా అర్థం చేసుకొని అమలు జరపాలి. జాతీయోద్యమంతోనూ, జాతీయ కాంగ్రెస్‌తోనూ, అన్ని స్థాయిల్లోనూ ఇంకా ఎక్కువ సంబంధాలు పెట్టుకోవాలి. అంతర్జాతీయ రాజకీయ అవగాహన, అంతర్జాతీయ విద్యార్థి, తదితర ప్రజాతంత్ర ఉద్యమాలలో మరింత సాన్నిహిత్యం, సంఘీభావం పెంపొందించుకోవాలి. విద్యార్థి రంగంలో పార్టీ నిర్మాణం - అనగా

పార్టీ కేడరును రిక్రూట్ చేసి వారికి మార్క్సిస్టు సిద్ధాంత పరిజ్ఞానం కల్గించాలి. అధ్యయన తరగతులద్వారా సిద్ధాంత పునాదిని పటిష్టం చేయాలి. నిర్మాణ రీత్యా విద్యార్థి ఉద్యమాన్ని మరింత పటిష్ఠ మొనరించడానికి రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్‌కు ఒక ఆఫీసు ఏర్పరచాలి. క్రింది సంఘాలతో ఉత్తర ప్రత్యుత్తరాలు మొదలైన నిత్య సంబంధాలు పెంపొందించాలి స్థానిక విద్యార్థి సంఘాలను మరింత పటిష్టం చేయాలి.

1939 జనవరిలో బెజవాడలో 15 వ రాష్ట్ర విద్యార్థి మహాసభ జరిగే నాటికి పార్టీ యిచ్చిన ఈ సూచనలను విద్యార్థి రంగంలో అమలు జరుపడానికి చాలా వరకు కృషి జరిగింది. అనేక జిల్లాల్లో జిల్లాసంఘాల, ప్రాథమిక సంఘాల నిర్మాణం జరిగిందనీ, ఆనాటి ప్రధాన జాతీయ సమస్యల అన్నింటిపైన విద్యార్థులలో ప్రచారం గావించబడిందనీ, బెజవాడ మహాసభ చర్చలు, ఉపన్యాసాలు, తీర్మానాల ద్వారాను, ఆ తరువాత కార్యవర్గ సమావేశం తీసుకున్న కార్యక్రమాన్ని బట్టి విదితమవుతుంది.

## 15 వ ఆంధ్రరాష్ట్ర విద్యార్థి మహాసభ
## (బెజవాడ 1939 జనవరి 28, 29 తేదీలు)

1939 జనవరి 28, 29 తేదీలలో బెజవాడలో 15వ ఆంధ్రరాష్ట్ర విద్యార్థి మహాసభ జరిగింది. ఆచార్య రంగా అధ్యక్షత వహించారు. మొదటిరోజు ఉదయం 500 మందితో ఊరేగింపు జరిగింది. డెటెన్షన్ పద్ధతి నశించాలి. బానిస విద్యావిధానం నశించాలి. స్వతంత్ర్య భారత్‌కి జై! విద్యార్థి సంఘాలకు జై! సామ్రాజ్యవాదం నశించాలి విప్లవం వర్థిల్లాలి. మొదలైన నినాదాలతో పట్టణ వీథులు ప్రతిధ్వనించాయి. ఫెడరల్ రాజ్యాంగం పాతెయ్యాలి అనికూడా నినాదం యిచ్చారు.

మధ్యాహ్నం దుర్గా కళామందిరంలో 1000 మంది విద్యార్థులతో సభ ప్రారంభమైంది. "కాంగ్రెస్ జయభేరి ధణా ధణా మ్రోగింది." "మమ్మేవ్వరాపగలరీవేళా" అనే గేయాలను రైతాంగ గాయకుడు కామ్రేడ్ అప్పారావు పాడారు.

ఆహ్వాన సంఘాధ్యక్షుడు శ్రీ జాస్తి నారాయణరావు స్వాగతం చెప్పారు. మహాసభను శ్రీ ఎస్. వి యల్. నరసింహం బి ఎ, బి.ఎల్.గారు ప్రారంభిస్తూ సామ్రాజ్యవాదులచే తయారు చేయబడ్డ నేటి మన బానిస విద్యావిధానంలో విద్యార్థుల పౌరసత్వహక్కులు ఏవిధంగా అరికట్టబడు తున్నాయో వివరించారు.

కాంగ్రెస్ నాయకులు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు, డాక్టర్ పట్టాభి సీతారామయ్య, సత్యమూర్తి, బాట్లివాలా, సరోజిని నాయుడు, విజయలక్ష్మి పండిట్, నారిమన్ బెజవాడ హైస్కూలు హెడ్మాష్టరుగారు పంపిన సందేశాలను

రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ ప్రధానకార్యదర్శి శ్రీ మాకినేని బసవపున్నయ్య చేదివారు. ఆతరువాత ఆయన సాంవత్సరిక రిపోర్టును ప్రవేశపెట్టారు. వేర్వేరు జిల్లాల్లో జరిగిన సమ్మెలు వాటి కారణాలు, వాటికిపూర్వం రాష్ట్ర విద్యార్థి సంఘం మద్రాసు ప్రభుత్వానికి, కాంగ్రెస్ కమిటీలకు పంపిన మెమొరాండాలు, తీసుకు వెళ్ళిన డెప్యుటేషన్‌లు, మంతెనవారిపాలెంలో నిర్వహించబడిన ఆర్థిక, రాజకీయ పాఠశాల మొదలైన అంశాలగురించి నివేదికలో శ్రీ బసవ పున్నయ్య తెలియ జేశారు. విద్యార్థి సంఘాలకు యితర సామ్రాజ్యవాద వ్యతిరేక సంస్థలకు మధ్య ఉండవలసిన సంబంధాన్నికూడా చర్చించారు. విద్యార్థుల కనీస కోర్కెల ఎడల కాంగ్రెస్ మంత్రివర్గం చూపుతున్న ప్రతికూల వైఖరిని వారు ఖండించారు.

ఆచార్యరంగా గారు గంటసేపు అధ్యక్షోపన్యాసం యిస్తూ, నేటి విద్యా విధానాన్ని ఖండిస్తూ, విద్యార్థుల కర్తవ్యాన్ని తెలియజేశారు. 1919 లో బయలు దేరిన జాతీయోద్యమంలో విద్యార్థులు విరివిగా పాల్గొనక పోవడానికి కారణం యిప్పటి నాయకులు విద్యార్థుల సమస్యల ఎడల మూకీభావం వహించడమే నన్నారు. పూర్వపు అనుభవాన్నిబట్టి యిప్పుడైనా, మన నాయకులు విద్యార్థుల విషయంలో తగిన శ్రద్ధ తీసుకోవాలని హెచ్చరించారు. త్వరలో రాబోయే స్వాతంత్ర్య యుద్ధంలో విద్యార్థుల్నే కాకుండా చంటి పిల్లలు కూడా ఆహుతి కావాలన్నారు. భారతదేశంలో ప్రజానీకం అనుభవిస్తున్న దుర్భర దారిద్ర్యాన్ని కళ్ళకు కట్టినట్లు వర్ణిస్తూ పట్టణాల్లో విద్యార్థుల విలాస జీవితాన్ని నిరసించారు. ప్రజలకు సంబంధించిన విద్య నేడు విద్యాలయాల్లో నేర్పబడటం లేదన్నారు. అది జరగాలంటే విద్యార్థులు జాతీయోద్యమంలో పాల్గొని తీరాలన్నారు. ఎందువల్లనంటే విదేశీ పాలన నశిస్తేగాని విద్యా విధానం పూర్తిగా మారదన్నారు. కొత్తపట్నం రాజకీయ పాఠశాలలో విద్యార్థులకు ఉపాధ్యాయులకు మధ్య కనబడిన డిసిప్లిన్ నిజమైన డిసిప్లిన్ అన్నారు. కొత్తపట్నం తాను ఉపన్యాసకుడుగా వెళ్ళినప్పుడు అక్కడి విద్యార్థులు సల్పిన విమర్శనలు చర్చలు ఎంత తీవ్ర స్వభావం కలిగినప్పటికీ అక్కడివారు చూపిన డిసిప్లిన్ తనకు ఆశ్చర్యం కల్గించిందన్నారు. ఆ పాఠశాలను రెడ్డి నాయుడు మంత్రివర్గం నిషేధించినప్పుడు విద్యార్థులు, ఉపాధ్యాయులు నిషేధాజ్ఞను ధిక్కరించి, లాఠీలకు, అరెస్టులకు గురి అయ్యారు. అదే విధంగా మంతెనవారిపాలెం ఆర్థిక, రాజకీయ పాఠశాలకు ఎట్టి డిసిప్లినరీ రూల్సు సెనేటు రెగ్యులేషన్సు డి.యి.ఒ. ల సర్క్యులర్లు లేకపోయినా విద్యార్థులలోనూ, ఉపాధ్యాయులలోనూ కనపడిన అన్యోన్య సహకారం ప్రశంసనీయమన్నారు. సాధారణంగా విద్యార్థులు గత్యంతరం లేనప్పుడే సమ్మెలు చేస్తున్నారని రంగా గారు చెప్పారు. వాటిని ఖండించడం కాంగ్రెస్ నాయకులకు తగనిపని అని ఖండించారు.

డిటెన్షన్‌ల పద్ధతిని నిర్మూలించడమే కాకుండా విద్యార్థులు పబ్లిక్ పరీక్షలలో నూటికి నూరు మందిని ప్యాసుచేసే పద్ధతి వచ్చేవరకు పోరాటం సాగించకపోతే మగవారు కాదని అన్నారు. తమ ఉపన్యాసాన్ని శ్రీ రంగా ముగిస్తూ భారతీయులు సంపూర్ణ స్వరాజ్యాన్ని పొందుటకు యిదే సరియైన అవకాశ మన్నారు. ఫెడరేషన్‌ను ఎదుర్కొనడానికి రేపు రాబోయే బ్రహ్మాండమైన ప్రజా పోరాటంలో విద్యార్థులు విరివిగా పాల్గొనాలని హెచ్చరించారు.

రాష్ట్రంలోని యించుమించు అన్ని జిల్లాల నుండి వచ్చిన సుమారు 100 మంది డెలిగేట్లు సాయంత్రం రామమోహన్ లైబ్రరీలో విజయ నిర్ణయ సభగా సమావేశమై అనేక తీర్మానాలను చేశారు.

ఫెడరేషన్ ఎదుర్కోవాలని చేసిన తీర్మానంలో 1935 సంవత్సరపు ఇండియా ప్రభుత్వ చట్టము, అందులో ముఖ్యంగా ఫెడరల్ విధానం (కుల మత విబేదాల ప్రాతిపదికపైన. స్వదేశ సంస్థానాలు బ్రిటీషు ఇండియా రాష్ట్రాలు కలిసి ఒక ఫెడరేషన్‌గా ఏర్పడే) పనికిరాదని, ప్రజా ప్రతినిధులతో కూడిన కాన్స్టిట్యుయంట్ ఎసెంబ్లీచే తయారుచేయబడి ఆమోదించబడిన రాజ్యాంగ విధానమే భారతదేశ శ్రేయస్సుకు పనికి వస్తుందనీ తెలిపారు. కొంతమంది కాంగ్రెస్‌వారు, కొన్ని మార్పులతో ఫెడరేషన్‌ను అంగీకరించుదామని చేసే ప్రచారంపట్ల అసమ్మతి ప్రకటించారు.

## జనరల్ స్ట్రయికు

డిటెన్షన్ పద్ధతి రద్దుచేయాలని విద్యార్థి ఫెడరేషన్‌ను గుర్తించాలని కోరుతూ రాష్ట్రమంతటా జనరల్ సమ్మె చేసేందుకు వివిధ పరిస్థితులను పరిశీలించి నిర్ణయించడానికి, ప్రభుత్వానికి అధికారులకు విద్యార్థుల కోర్కెలను నివేదించుటకు తగు ప్రచారం చేయడానికి నిర్ణయించారు. అందుకు కాట్రగడ్డ రాజగోపాలరావు, జి. నరహరి, రామకోటేశ్వరరావు, యమ్. రాఘవేంద్రరావు, పి. వెంకటేశ్వరరావు (పర్వతనేని)లతో ఒక ఉప సంఘాన్ని నియమించారు. మరో యిద్దరిని కోఆప్ట్ చేసుకోడానికి అధికారమిచ్చారు. సభలు జరిపి, కరపత్రాలను ప్రచురించి, విద్యార్థి హక్కుల ప్రాధాన్యతను అందరికి తెలియజేయాలి. ప్రాధమిక సంఘాలను సరియైన పరిస్థితులలో ఉంచుటకు "ఎన్ రోల్‌మెంటు" వారమును సాధ్యమైనంత త్వరలో ఏర్పరచాలి ఇన్‌ఫర్‌మేషన్ బ్యూరో ఒక దానిని స్థాపించాలి. సమ్మెల అవసరం గురించి విరివిగా ప్రచారం చేయాలి

## ప్రాథమిక హక్కులు

విద్యార్థుల ఈ క్రింది ప్రాథమిక హక్కులు నెరవేర్చవలసిందిగా మద్రాసు ప్రభుత్వం వారిని విశ్వవిద్యాలయాధికారులను సభ వారు కోరారు.

1 ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్‌కు అనుబంధించబడిన విద్యార్థి సంఘాలను గుర్తించుట.

2. జీతాలు, పరీక్ష రుసుము తగ్గించుట.

3. అభివృద్ధికరమైన టెక్స్టు పుస్తకాలు ప్రచురించి లాభము పొందకుండా తగ్గింపు ధరలకు విద్యార్థులకు సప్లయి చేయుట.

4. రోజుకు ఒకే పరీక్షా పత్రం.

5. ఆంధ్ర విశ్వవిద్యాలయం వారిచే కొత్తగా ప్రవేశ పెట్టబడిన ఆర్డినెన్సు లను తీసివేయుట.

6. పబ్లిక్ పరీక్షలలో నూటికి కనీసం 75 మందిని ప్యాస్ చేయుట.

7. రిజిస్ట్రేషన్ రుసుము లేకుండానే విశ్వవిద్యాలయ పట్టభద్రు లందరికీ సెనేటు ఎన్నికలలో ఓటింగు హక్కు.

8. ఎప్రెంటిస్ రుసుమును 'లా' చదివినవారికి రద్దుచేయుట.

9. యుద్ధములలో నిర్బంధముగా పాల్గొనే షరతు లేకుండా కోరిన హైస్కూలు విద్యార్థులకు ఉచిత వ్యాయామ శిక్షణ, కాలేజీ విద్యార్థులకు సైనిక శిక్షణ యివ్వాలి.

10 స్కూలు ఫైనల్ టైపు రైటింగు పరీక్షను లోయర్ గ్రేడ్ పరీక్షతో సమానంగా గుర్తించుట.

11. ప్రతీ హైస్కూలులోనూ, స్కూలు ఫైనల్ పరీక్ష సెంటరును ఏర్పరచుట.

12. డిటెన్షను పద్ధతిని తొలగించుట-టెక్స్టు బుక్కులను, ఉపాధ్యాయులను పదే, పదే మార్చకుండుట

13 సెనేటులో ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ వారికి కూడా ఒక సీటు ప్రత్యేకించుట.

14. ప్రవేశ పత్రములలో ఉన్న కులము, మతము తెలియజేయు కాలమును తీసివేయుట.

15. స్కూలు ఫైనల్‌లో వయస్సు నియమమును రద్దు చేయుట.

16 ఎస్. ఎస్. ఎల్. సి. యితర తరగతులలోనూ అనుమానము కల్గినప్పుడు పరీక్షా పత్రములను తిరిగి దిద్దించుటకు ఏర్పాటు చేయుట

## సమ్మెలు

గత 2 సంవత్సరాల నుండి రాష్ట్రమందు జరుగుతున్న విద్యార్థి సమ్మెలు, కొందరు ప్రజలచే అనవసరంగా విమర్శించబడి, పెక్కు అపోహలకు కారణ మైనవి. కాని నిర్వీర్యం. కేవలం నిరుపయోగము అయిన నేటి బానిస విద్యా విధా

నాన్ని ఎదుర్కోడానికే ఈ సమ్మెలు చేయబడినవి. కావున ప్రాథమిక హక్కుల కొరకు, విద్యాధికారుల నిరంకుశ చర్యలకు వెనుదీయక జయప్రదంగా సమ్మెలు జరిపిన రాష్ట్రము నందలి విద్యార్థులను సభ వారు అభినందించారు.

## ఇతర తీర్మానాలు

విద్యార్థుల సహజ వికాసానికి అడ్డులేనంత వరకు వారికి - ఉపాధ్యాయులకు సంఘర్షణ ఏమీలేదు. తమ హక్కులు పొందుటకు విద్యార్థులు చట్ట సమ్మతమైన పద్ధతులన్నిటి ద్వారా, అంటే రాయబారాలు మొదలైనవి ప్రయత్నించి, కోర్కెలు నెరవేరని ఎడల సమ్మెను తుది ఆయుధముగా ఉపయోగించాలి. సమ్మె చేసే ముందు ఆయా జిల్లా విద్యార్థి సంఘాల అనుమతి పొందాలి.

ఫెడరేషన్ ప్రతికూలుడైన సుభాష్ చంద్రబోస్‌నే కాంగ్రెస్ అధ్యక్షునిగా ఎన్నుకోవాలని ఒక విద్యార్థి ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. డాక్టరు పట్టాభి గారిని ఎన్నుకోవాలని కోరే విద్యార్థులు ఈ తీర్మానాన్ని ప్రవేశపెట్టడానికి అభ్యంతరం చెప్పారు. అది కలహంగా పరిణమించింది. అధ్యక్షస్థానంలో ఉన్న శ్రీ రంగా ఈ వివాదాన్ని చల్లార్చడానికి ప్రయత్నించారు. చివరకు రాత్రి పద్ధతిని పేర్లు పెట్టకుండా ఫెడరేషన్‌ను ఎవరు ఎక్కువ సమర్థతతో ఎదుర్కొంటారో వారిని త్రిపురీ కాంగ్రెస్ ప్రతినిధులు స్వబుద్ధితో నిర్ణయించుకోవాలని కోరుతూ తీర్మానించారు. మహాసభలో సి ఐ డి. రిపోర్టర్లు ఉండటాన్ని ఖండిస్తూ 123ఎ, 144 మొదలగు నిర్బంధ చట్టాలను మద్రాసు ప్రభుత్వం అమలు జరుపడాన్ని ఖండిస్తూనూ, ప్రతీ సంవత్సరం జనవరి 26 స్వాతంత్ర్య దినోత్సవం పబ్లిక్ సెలవుగా ప్రకటించాలని కోరుతూ, విశాఖపట్నం మెడికల్ డిగ్రీలను గుర్తించాలని కోరుతూ, ప్రజా సామాన్యంలో వయోజన విద్యను విద్యార్థులు ప్రచారం గావించాలని కోరుతూ తీర్మానాలు గావించబడినాయి.

## నూతన కార్య వర్గం

నూతన సంవత్సరానికి రాష్ట్ర విద్యార్థి సంఘ ప్రధాన కార్యదర్శిగా విశాఖ మెడికల్ విద్యార్థి శ్రీ గద్దె రామకోటేశ్వరరావు గారిని ఏకగ్రీవంగా ఎన్నుకొన్నారు. సహాయ కార్యదర్శులుగా వై. వి కృష్ణారావు (గుంటూరు), ఎస్.వి.రంగారావు (కృష్ణా), ఇ రాజగోపాలరెడ్డి (నెల్లూరు), సి హెచ్. వెంకటేశ్వర రావు (తూర్పు గోదావరి), యమ్. వి. రాఘవేంద్రరావు (పశ్చిమ గోదావరి), విశాఖ మెడికల్ విద్యార్థి కె. వెంకట్రామశాస్త్రి (కోశాధికారి) ఎన్నుకున్నారు.

29 వ తేదీ ఉదయం దుర్గ కళా మందిరంలో మహాసభ తిరిగి సమావేశమై పై తీర్మానాలన్నీ ఆమోదించారు. "అయిదు నిముషాలలో ఎట్లు ఉపన్యాసం

యివ్వాలి" అనే విషయమై శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు 5 నిముషాలు మాట్లాడి విద్యాశాఖ ప్రేక్షకులను ఆనందింపజేశారు.

## నూతన కార్య వర్గ సమావేశం

అదే రోజున బెజవాడ కమ్మ హాస్టలులో నూతన కార్యవర్గం కామ్రేడ్ వై.వి. కృష్ణారావు అధ్యక్షతను సమావేశమై దిగువ నిర్ణయాలు చేశారు.

ఆయా జిల్లాల్లో విద్యార్థి ఉద్యమం గురించి, ప్రాథమిక సభ్యుల పట్టికలు, చందాలు మొదలైన వాటి గురించి ఫిబ్రవరి 26 లోగా జనరల్ సెక్రటరీ కార్యాలయానికి జిల్లా కార్యదర్శులు పంపించాలి. ఇందుకు ఆయా జిల్లాల్లోని రాష్ట్ర సహాయ కార్యదర్శులు బాధ్యత వహించాలి. ఈ బాధ్యత నెరవేర్చకపోతే ఆ బాధ్యతలు తొలగించబడతాయి.

మహాసభ తాలూకు 93 గురు ప్రతినిధుల ప్రతినిధి రుసుములో సగం రూ 46-8-0 కోశాధికారికి అప్పగించడమైనది. 15 వ రాష్ట్ర మహాసభ జమాఖర్చులు జనరల్ సెక్రటరీ మే నెలలోగా ప్రచురించాలి ప్రాథమిక సభ్యుల చందాలో 1 కాని అఖిలభారత సంఘానికి, 2 కానులు రాష్ట్ర సంఘానికి, మిగిలిన మొత్తంలో 3 వ వంతు జిల్లా సంఘానికి, మూడింట రెండు వంతులు స్థానిక యూనిట్లకు చెందును కో-ఆప్టు చేసుకున్న సభ్యులను జనరల్ సెక్రటరీ జిల్లా సంఘాల సహకారంతో ఒక నెలలోపల యితర సభ్యులకు తెలియపరచి వారి ఆమోదం పొందాలి.

విద్యార్థి ఉద్యమం గురించి పత్రికలకు వ్యాసాలు వ్రాయు బాధ్యత వై. నరసింహారావు (బందరు), వి. భాస్కరరావు (బెజవాడ) గార్లకు ఈయబడినది.

## 1939 జనవరి బెజవాడ మహాసభ నుండి
## 1939 సెప్టెంబరు కాకినాడ సభ వరకు

బెజవాడలో ఆంధ్ర రాష్ట్రీం విద్యార్థి సంఘ 15 వ మహాసభ జరిగిన 9 నెలలకే కాకినాడలో 16 వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభ జరిగింది. సంవత్సరం నిండకుండానే 16 వ మహాసభ జరగడానికి కారణం ఏమిటి? జాతీయ స్వాతంత్ర్య సమరం తుది ఘట్టంలో పడే సూచనలు ఏర్పడ్డాయి. రెండవ ప్రపంచ యుద్ధ మేఘాలు కమ్ముకొంటున్నాయి. హిట్లర్ యూరోప్‌లో విజృంభిస్తూ రాజ్యాలను ఆక్రమిస్తున్నాడు. స్పెయినులో అంతర్యుద్ధం జరుగుతూంది. చైనా పై జపాన్ దండయాత్ర సాగుతోంది. ప్రపంచ యుద్ధం వస్తే బ్రిటీషు ప్రభుత్వం భారతదేశాన్ని యుద్ధంలోకి దించకుండా ఉండదు. ఈ పరి



16వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభ ఆహ్వాన సంఘం - కాకినాడ 1939

ఎడమ నుండి కుడికి కూర్చున్నవారు 1 కె రామచంద్ర రావు 2 బి హెచ్ సూర్యనారాయణరాజు 3 పరకాల పట్టాభి రామారావు (ఆహ్వాన సంఘం కార్యదర్శి) 4 జొన్నలగడ్డ రామలింగయ్య (మహాసభ అధ్యక్షులు) 5 శ్రీయుత సుభాష్ చంద్ర బోసు (మహాసభ ప్రారంభకులు) 6 ఎస్ ఎస్ లలితా నాగుబాయమ్మ 7 ఆర్.వి.జె స్వామి 8. వి.ఎస్ నరసింహారావు 9. ఎ వి రాఘవ రాజు

నుంచున్నవారు 1 బి కె నారాయణరావు 2 పి వి ఎల్ సుబ్రహ్మణ్యం 3 సి హెచ్ వెంకటేశ్వరావు 4 జి ఎస్ బాలాజీ దాస్ 5 పి సూర్యనారాయణ రాజు 6 ఎ ఎస్ వి జె రాజు 7 వరిగొండ వెంకట సుబ్రహ్మణ్య శర్మ 8. జి పున్నయ్య 9. పాలెపు సత్యనారాయణ శర్మ (నూతన రాష్ట్ర కార్యదర్శి)

నుంచున్నవారు (రెండవ వరుస) 1 పి బి శంకరశాస్త్రి 2 సి హెచ్. గోపాలరావు 3 పి మార్కండేయ రాజు 4. డి.వి ఆర్ ప్రసాదరావు 5 అయ్యగారి వీరేశ్వరరావు 6 కపిల శ్రీరామమూర్తి 7 ఎస్ ఎమ్ వి చంపతిరావు 8 ఎస్ సత్యనారాయణ మూర్తి 9 బి చిరంజీవి రాజు 10. జి వి శర్మ.

స్థితులలోనే భారత స్వాతంత్ర్యం కోసం అంతిమ పోరాటం సాగించాలని దేశంలో అతివాద శక్తులు, కాంగ్రెస్ సోషలిస్టులు కమ్యూనిస్టులు కాంగ్రెస్‌లోని వామ పక్షాలు అభిప్రాయపడుతున్నాయి. 1939 మార్చి త్రిపురీ కాంగ్రెస్ మహాసభకు కాంగ్రెస్ లోని అతివాదుల సమైక్యతకు చిహ్నంగా సుభాష్ చంద్రబోస్‌ను అధ్యక్షుడుగా ఎన్నుకున్నారు. జాతీయ సమర సన్నాహాలకు త్రిపురీ కాంగ్రెస్ పిలుపు యిచ్చింది. మితవాద కాంగ్రెస్ ప్రతినిధి డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య ఓడిపోయాడు. అంతిమ పోరాటానికి మితవాద వర్గాలు వ్యతిరేకం. మితవాదుల సహాయ నిరాకరణ వల్ల సుభాష్ చంద్రబోస్ కాంగ్రెస్ అధ్యక్ష స్థానానికి రాజీనామా యిచ్చారు. ఫార్వర్డ్ బ్లాక్ స్థాపించారు. కాంగ్రెస్ సోష లిస్టులు, కమ్యూనిస్టులు, ఫార్వర్డ్ బ్లాక్, రాయిస్టులు కలిసి అతివాద ఐక్య సంఘటనగా (లెఫ్ట్ కన్సాలిడేషన్) ఏర్పడ్డారు.

రెండవ ప్రపంచ యుద్ధ మేఘాలు అలుముకొంటున్న సమయంలో జాతీయ సమర సన్నాహాలకు ఏర్పడ్డ అనుకూల పరిస్థితుల పూర్వ రంగంలో అటు యుద్ధానికి వ్యతిరేకంగా, ఇటు స్వాతంత్ర్య సమరానికి విద్యార్థులను సమా యత్తం చేసే ప్రధాన లక్ష్యంతో కాకినాడలో 16 వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభ 9 నెలల వ్యవధిలోనే జరిగింది.

కాకినాడ పట్టణ విద్యార్థి సంఘం, తూర్పు గోదావరి జిల్లా విద్యార్థి సంఘం ఈ మహాసభకు అన్ని సన్నాహాలు చేశాయి. 1939 జూలై 11 వ తేదీన కాకినాడ టెంపుల్ స్ట్రీటులోని బాదం లాడ్జిలో జరిగిన పట్టణ విద్యార్థి సంఘ జనరల్ బాడీ సమావేశంలో ఆహ్వాన సంఘం ఏర్పరచబడింది. అధ్యక్షులుగా శ్రీ ఎస్. సూర్యేశ్వర శర్మ, ఉపాధ్యక్షురాలు శ్రీమతి లలితా నాగుబాయమ్మ, ప్రధాన కార్యదర్శి శ్రీ పరకాల పట్టాభి రామారావు (పట్టణ విద్యార్థి సంఘ కార్యదర్శి) కోశాధికారి సి హెచ్. వెంకటేశ్వర రావు, రాష్ట్ర ఒలింపిక్స్, వక్తృత్వ పోటీలు, వైజ్ఞానిక కార్యక్రమాలు జరుపుటకు నిర్ణయించారు. వలంటీరు దళ నిర్మాణానికి నిర్ణయించారు

రాష్ట్ర సంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ జి. రామకోటేశ్వరరావు కాకినాడలో ఆహ్వాన సంఘం ఏర్పడిన విషయం ప్రకటిస్తూ (26-7-39) సభ్యత్వం చేర్పించుటకు మరో 15 రోజులు గడువు పొడిగించామనీ, సభ్యత్వం నవశక్తి తాలుకు రాష్ట్ర రుసుము 0-0-6 (6 పైసలు) రాష్ట్ర కార్యాలయానికి ఆగష్టు 5 వ తేదీలోగా పంపాలనీ, మహాసభ ప్రతినిధులను ఎన్నుకొని రుసుము రూ.1-0-0 తో ఆగష్టు 5 లోగా పంపాలనీ తెలియజేశారు.

# రెండు సభల మధ్య కార్యకలాపాలు

రాష్ట్ర విద్యార్థి నాయకులలో ఒకరు, విశాఖ మెడికల్ కాలేజీ విద్యార్థి అయిన కామ్రేడ్ కె. సోమయ్య, బెజవాడ-కాకినాడ సభల మధ్య రాష్ట్ర విద్యార్థి సంఘ కార్యకలాపాలను సమీక్షించుతూ 30-8-1939 నవశక్తి సంచికలో ఒక వ్యాసం వ్రాశారు. అందులో ప్రధానాంశాలు :-

"బెజవాడ - కాకినాడ సమావేశాల మధ్య కాలంలో ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి సంఘం నిర్వహించిన కార్యక్రమ మేమిటి? అది సామ్రాజ్య వాద వ్యతిరేక పోరాటానికి ఎంత వరకు సహాయకారి అయినది? ఆమోదించబడిన తీర్మానాలు ఎంతవరకు ఆచరించబడినవి? అవి స్వాతంత్ర్య పోరాటానికి ఎలా సాయపడినవి? చేసిన పొరపాట్లు ఏమిటి ?

జనరల్ స్ట్రయిక్ నిమిత్తం ఏర్పరచిన కమిటీ తన కార్యక్రమం చురుకుగా లేకపోయిందని ఒప్పుకోవాలి. ప్రాథమిక హక్కుల గురించి విద్యార్థులలో ఎక్కువ ప్రచారం జరుగలేదు మన కోర్కెల ఎడ ప్రజాసానుభూతి సంపాదించుటకు మనమంతగా ప్రయత్నం చేయలేదు. (కారణం-కాలవ్యవధి తక్కువ అగుట, పరీక్షలు, సెలవులు వగైరా)

1. బెజవాడ సమావేశంలో వివరింపబడిన విద్యార్థి హక్కులు విశ్వవిద్యాలయాధికారులకు ప్రభుత్వానికి తెలుప బడినవి. కాని అధికారుల నుండి ప్రత్యుత్తరం లేదు.

2. డిటెన్షను విధానాన్ని గూర్చి పరీక్షలలో రోజుకొక్క పరీక్ష పెట్టాలని, యూనివర్శిటీ ఆర్డినెన్సుల గురించి గుంటూరు విద్యార్థులు విద్యా శాఖా మంత్రి వద్దకు డెప్యుటేషన్ తీసుకు వెళ్ళారు. క్రిందట నెలలో విద్యామంత్రి గారు (శ్రీవార్కి) ఈ సంవత్సరం నుండి స్కూలు ఫైనల్ క్లాసులలో డిటెన్షన్‌లు లేకుండునట్లు చేసెదమని, త్వరలో దీని గురించి సర్క్యులర్ పంపించెదమనీ తెలిపారు. యూనివర్శిటీకి సంబంధించిన మిగతా రెండు సమస్యలలో తాము జోక్యం కల్గించుకోడానికి వీలు లేదన్నారు.

3 రోజుకొక పరీక్షాపత్రం, డిటెన్షన్ విధానం కాలేజీ తరగతులలో తీసివేయుట, యూనివర్సిటీ ఆర్డినెన్సుల గురించి, విశ్వవిద్యాలయ సెనేటర్ల కందరికీ ఒక అప్పీలు పంపించబడింది. కాంగ్రెస్ సెనేటర్లు ముఖ్యంగా ఈ విషయమై తోడ్పడవలెనని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులకు విజ్ఞాపన పంపబడింది.

4. విద్యార్థి హక్కులదినం, డిటెన్షన్‌ల వ్యతిరేకదినం రాష్ట్రమంతటా జయప్రదంగా జరుపబడింది.

5. సెనేటు మీటింగు పై నెలలో జరుగునప్పుడు, విద్యార్థులు ఊరేగింపుగా వెళ్ళి సెనేటర్లను కలుసుకోవాలని విశాఖపట్నం విద్యార్థులు నిర్ణయించారు.

6. మొత్తం మీద జనరల్ స్ట్రయికు గురించి చేసిన సన్నాహాలు సరిపో లేదు. కాకినాడ సమావేశం జనరల్ స్ట్రయికు సాధ్యా, సాధ్యాల గురించి చర్చించి నిర్ణయించాలి

## వయోజన విద్య

"కాలేజీ ఉన్న దినాలలో రాత్రి పాఠశాలల ద్వారా వేసంగి సెలవులలో విద్యా ప్రచారం చేయుటకు దీనికై ఏప్రిల్ 25 నుండి 15వ తారీఖు వరకు ట్రైనింగు క్యాంపు జరుపుటకు బెజవాడ మహాసభలో తీర్మానించబడింది. ఇందుకై ఒక ఉపసంఘం నియమించింది. స్థానిక సంఘాలు ఈ ఉద్యమానికి ధన సహాయం, పాఠశాలల ఉపాధ్యాయులు తోడ్పడునట్లు చేయుటకు, టూరింగ్ రేడియోసెట్, మాజిక్ లాంతరు నిచ్చునట్లు ప్రభుత్వం వారిని కోరడమైనది.

"ఈ తీర్మానం ఎంతవరకు సత్వర స్వాతంత్ర్య సంపాదనకు తోడ్పడు తుంది " ?

"గతించిన మూడు స్వాతంత్ర్య పోరాటాలు భగ్నమైనవంటే కారణం జనబాహుళ్యంలో రాజకీయ చైతన్యం కలుగకపోవుటే.కార్మికులకు,కర్షకులకు వర్గ చైతన్యం కలుగలేదు దానికై కాంగ్రెస్ నాయకులచే రాబోవు పోరాటంలో దేశంలోని ప్రజలందరికీ రాజకీయ చైతన్యం కల్గించాలి. అందుకై వారికి విజ్ఞానం కల్గించాలి. ఇందుకు విద్యార్థులే సమర్థులు. ఏదేశంలోనైనా విద్యా వ్యాప్తి చేసింది విద్యార్థులే. చైనా దేశంలో స్వాతంత్ర్య పిపాస ప్రజలకు కలుగజేసింది విద్యార్థి బృందమే. ఇప్పుడు యుద్ధం జరుగుతున్నప్పటికీ, సాహిత్యం ధ్వంసమవు తున్నప్పటికీ చైనా విద్యార్థులు విద్యా ప్రచారం పల్లెటూళ్ళలో, యుద్ధరంగంలో కూడా కావించుతున్నారు.

అందుచేత ప్రజలలో రాజకీయ చైతన్యం పెంచుటకు విద్యార్థులు వయోజన విద్యా ప్రచారాన్ని చేపట్టాలి. ఈ కార్యక్రమం మూలాన కొత్త విద్యార్థులు పాల్గొంటారు. ప్రజా సానుభూతి హెచ్చుతుంది.

ఎంతవరకు మన మీ కార్యక్రమం ఆచరణలో పెట్టగల్గాం. మన లోపాలు ఏమిటి?

1. రాష్ట్ర సంఘంగా విశాఖపట్నంలో జాలరివాళ్ళకు ఒక రాత్రిపాఠశాల నడిపాము. ఇంకా తక్కినచోట్ల కొన్ని పాఠశాలలు విద్యార్థి సంఘములచే నడుప బడినవి. అనేక మంది కొత్త విద్యార్థులు పాల్గొన్నారిందులో. అనుభవం చాలా కల్గింది. దీని ఫలితమే వారు తయారు చేసిన విద్యా ప్రణాళిక. అక్షరాలు నేర్పు

టకు క్రొత్త పద్ధతి కనిపెట్టారు. జనరల్ లెక్చర్లు కూడా సూత్రప్రాయంగా సూచించారు. ఇదంతా పరీక్ష దశ. మోడులు సెంటరు అయిన విశాఖపట్నంలోనే నాల్గు పాఠశాలలు స్థాపించబడినవి. ఇంకా రెండు మూడు పాఠశాలలు ఈ నెలాఖరులోగా ప్రారంభించబడతాయి. ఈ పాఠశాలలో అన్ని తరగతుల శ్రామికులు చదువుతున్నారు. వారం చివర ఉపన్యాసం జరుగుతూంటుంది.

2. ఈ విద్యార్థిసంఘమే భోగాపురంలో వయోజన విద్యా కార్యక్రమం నడిపింది. ఇది జయప్రదంగా జరిగింది. రాబోవు సెలవులలో ద్రవ్య సహాయం ఉంటే బ్రహ్మాండమైన విద్యా ప్రచారం గావించవచ్చును.

3 రాష్ట్ర సంఘం, ప్రతీ స్థానిక సంఘం తప్పనిసరిగా కనీసం ఒక్క పాఠశాలనైనా స్థాపించి నడుప వలసిందిగా సర్క్యులర్ పంపడమైనది. గుంటూరులో టానరీ వర్కర్సుకు ఒక పాఠశాల నడుపుతున్నారు. చీరాలలో మూడు పాఠశాలలు జరుగుతున్నాయి.

4. ఇచ్ఛాపురంలో ఇతర సామ్రాజ్య వ్యతిరేక సంస్థలలో కలిసి రాజకీయార్థిక పాఠశాల ఒకటి నడుపబడింది. పూర్తిగా విద్యార్థులు నడిపిన మొదటి పాఠశాల యిదియే. 30 మంది విద్యార్థులు నెలరోజులు అన్ని విషయాలు, డ్రిల్లు మొదలైన వాటిలో శిక్షణ పొందారు. పరిసర గ్రామాల్లో రాజకీయ ప్రచారం జరిగింది. మొత్తంమీద జయప్రదమేనని చెప్పవచ్చు.

**లోపాలు :**

1. బెజవాడ మహాసభ తీర్మానంలో సూచించిన విధంగా కృష్ణాజిల్లాలో 50 గ్రామాలలోనూ ప్రచారం జరుగలేదు ట్రైనింగు క్యాంపు జరుగలేదు. దీనికి కారణం దేశంలోని ఒడుదుడుకు పరిస్థితులే.

2. ప్రభుత్వం మన ఉద్యమానికి సహాయపడలేదు. తగినంత రాయబారం జరుగలేదు (విద్యార్థుల వయోజన విద్యా ప్రచారాన్ని ప్రభుత్వం మొదటినుండి ప్రతికూల ధోరణితోనే ఉంది. తరువాత నిషేధించింది కూడా-రచయిత.)

3. విరాళాలు తగినంత వసూలు కాలేదు.

4. విద్యార్థులలో పల్లెటూరు ప్రచారానికై ఎక్కువ ఉత్సాహం కన్పించలేదు. వర్కర్సు తక్కువమంది అయ్యారు.

5. రాజకీయార్థిక పాఠశాల విద్యా ప్రచారం ఒకే జిల్లాలో జరుగుట మూలమున రెండవదానికి కొంత ఆటంకం కల్గింది.

6. విద్యార్థి సంఘాలు అన్నిచోట్ల లేవు. ఉన్న సంఘాలు కూడా రాష్ట్ర సంఘంతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుటలేదు.

7. సభ్యుల సంఖ్య ఇంకా హెచ్చు చేయవలసింది. సభ్యత్వ పట్టీ రాష్ట్రంతో ఎన్నోచోట్ల రావలసివుంది.

8. తీర్మానములో లలితకళలు ఆచరణలో పెట్టవలసివుంది.

ఈ కార్యక్రమం జయప్రదం చేయడానికి ఇంకా ఎక్కువ ప్రచారం చేయాలి. లిటరసీ దినం జరుపాలి. చందాలు బాగా వసూలు చేయాలి. అన్ని స్థానిక సంఘాలు విరాళాలు వసూలు చేయాలి. ప్రభుత్వం సహాయం కోసం ఆందోళన చేయాలి. విశ్వవిద్యాలయాధికారులతో సంప్రదించాలి. సుశిక్షితమైన వలంటీరు దళాన్ని తయారు చేయాలి. అధ్యయన తరగతుల అన్ని స్థలాల్లో సంవత్సరమంతా జరుపాలి.

అలాగే సభ్యత్వం చేర్పించుట, స్థానిక సంఘాలచే పని చేయించుట కామ్రేడ్సు తగిన శ్రద్ధ చూపలేదు."

నిర్మాణ పరిస్థితిని సమీక్షించుతూ, మూడుసార్లు కార్యవర్గం సమావేశ మైందనీ, 5,6 సార్లు సర్క్యులర్లు పంపడం జరిగిందనీ, సంఘ నివేదికలు పంపడానికి ప్రశ్నావళి స్థానిక సంఘాలకు పంపామనీ దీనికి చాలా సంఘాలు సమాధానాలు పంపాయనీ సమీక్షలో తెలిపారు. స్వాతంత్ర్య దినం, విద్యార్థులు ప్రాథమిక హక్కుల దినం, డిటెన్షన్ దినం రాష్ట్రమంతటా జయప్రదంగా జరిగాయని తెలిపారు

భావి కార్యక్రమం గురించి తెలుపుతూ ప్రతి జిల్లాకు విద్యార్థి సంఘ ఆర్గనైజరును నియమించాలని, విద్యార్థులనూ సంఘాలలో విరివిగా జేర్చడానికి లలితకళలు (సాంస్కృతిక కార్యక్రమాలు) ఆచరణలో పెట్టాలి. విద్యార్థి సంఘాలలో "కల్చరల్ సెక్షన్" పేరే పెట్టాలి. స్పోర్ట్సు, ఆటలు మన కార్య క్రమంలో లేకపోవుటచే వాటిలో అభిలాష కల్గిన విద్యార్థులు మన సంఘా లలో చేరుటలేదు. కనుక వీరి సానుభూతి సంపాదించుటకు ఒక "జిమ్నాజయం" స్థాపించాలి. కళాశాలలోని స్పోర్ట్సు సెక్రటరీల సానుభూతి సంపాదించాలి.

వలంటీరు దళాలను ఏర్పరచాలన్న తీర్మానం కూడా నెరవేరలేదు. కాకినాడ మహాసభ సందర్భంలో 50 మంది శిక్షణ పొందుతున్నారు. కామ్రేడ్ నరసింహారావుగారి ప్రోద్బలంతో ఆలమూరులో సుమారు 50 మంది శిక్షణ పొందుతున్నారు. విశాఖపట్నంలో 30, 40 మంది శిక్షణకు సిద్ధంగా ఉన్నారు. రాజమండ్రి, గుంటూరులలో ప్రయత్నాలు జరుగుతున్నాయి.

బెజవాడ - కాకినాడ సభల మధ్య జరిగిన కార్యక్రమాల సింహావలోకనం చూస్తే తేలిన రెండు విషయాలు స్పష్టమవుతాయి. 1) విద్యార్థి సంఘాలను

అభివృద్ధి పరచుటకై స్పోర్ట్సు లలితకళలతో కూడిన విశాలమైన కార్య క్రమం కావాలి. వాటి ద్వారా విద్యార్థులలో రాజకీయ చైతన్యం కల్గించుటకు పూనుకోవాలి ఇది నిర్మాణ సమస్యలలో ప్రధాన విషయం. 2) విద్యా ప్రచారం స్కూలు దినాల్లో సెలవు దినాలలో కూడావయోజనవిద్యా ప్రచారం జరపాలి. విద్యార్థులు ఊరేగింపులలో పాల్గొని, మీటింగులకు హాజరై వారి స్థితిని గుర్తించ గల్గితే సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటానికి ఎంత సహాయమో, ఎంత పునాదిని వేసినట్లు ఉంటుందో వేరే చెప్పనవసరం లేదు."

శ్రీ సోమయ్య జరిపిన ఈ కార్యాచరణ సమాలోచనను బట్టి - ఆనాడు విద్యార్థి సంఘాలు ఎంత విశాల ప్రాతిపదికపై నిర్మాణం చేయవలసి ఉంటుందో స్పష్టం చేసింది శారీరక క్రీడలు, సాంస్కృతిక కార్యక్రమాలు, వయోజన విద్యా ప్రచారం మున్నగు కార్యక్రమాలు పెద్ద ఎత్తున నిర్వహించుట ద్వారానే ఉద్యమం విస్తృతం కాగలదని స్పష్టం చేసింది. ఒక్క మాటలో కేవలం రాజకీయ చైతన్యం గల విద్యార్థులకే గాక, స్పోర్ట్సు కళలు మున్నగు వాటిలో అభిరుచి కల్గిన విద్యార్థులను ఆ కార్యక్రమాల ద్వారా ఉద్యమంలోకి తీసుకొని వచ్చి, వారిని దేశ భక్తియుత కార్యక్రమాల వైపు; ప్రజాసేవ, దేశసేవ, స్వాతంత్ర్యోద్యమం వైపు మరలించవలసి వుంటుందనినొక్కి చెప్పింది. ఆనాటికి ఇంకా మిగిలి ఉన్న సెక్టేరియన్ పోకడలను అధిగమించి సువిశాల ప్రాతిపదకపై ఉద్యమాన్ని నిర్మించి విస్తరింప జేయాలని సూచించింది.

## 16 వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభ

1939 సెప్టెంబరు 1, 2, 3 తేదీలలో కాకినాడలో 16 వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభ రెండవ ప్రపంచ యుద్ధ ప్రారంభ సమయంలో జరిగింది. మహాసభ వేదిక నుండే ప్రపంచ యుద్ధం ప్రారంభమైన విషయం ప్రకటించ బడింది. యుద్ధానికి వ్యతిరేకంగా విద్యార్థులను సమీకరించడానికి, స్వాతంత్ర్య సమరానికి విద్యార్థులను సమాయత్తం చేయడానికి మహాసభలో నిర్ణయాలు గైకొన బడినాయి. ఆనాటి బ్రిటిషు సామ్రాజ్యవాద ప్రభుత్వానికి వ్యతిరేకంగా విద్యార్థులు ఎలా పోరాడింది కూడ మహాసభ వ్యక్తం చేసింది.

మహాసభను జాతీయోద్యమ ప్రముఖులు శ్రీ సుభాష్‌చంద్రబోస్ ప్రారంభించారు రాష్ట్ర సోషలిస్టు (కమ్యూనిస్టు) నాయకులలో ఒకరైన శ్రీ జొన్నలగడ్డ రామలింగయ్యగారు అధ్యక్షత వహించారు.

కాకినాడ మహాసభకు శ్రీ సుభాష్ చంద్రబోస్‌ను ఆహ్వానించడానికి ఒక ప్రాధాన్యతవుంది ఆనాడు జాతీయ కాంగ్రెస్‌లో పోరాటవాదులకు-రాజీవాదులకు మధ్య తీవ్ర ఘర్షణ జరుగుతోంది. అంతర్జాతీయ పరిస్థితులు జాతీయ పోరాటాన్ని

ప్రారంభించడానికి అనువుగా ఉన్నాయని, అందుకు సన్నాహాలు చేయాలని కాంగ్రెస్‌లోని అతివాదులు, ఆనాడు కాంగ్రెస్‌లోనే అంతర్భాగంగా ఉన్న కమ్యూనిస్టులు, సోషలిస్టులు తదితరులు ప్రతిపాదించారు. మితవాద వర్గం అందుకు వ్యతిరేకంగా ఉంది. 1939 మార్చిలో జరిగిన త్రిపురీ కాంగ్రెస్ మహాసభ అధ్యక్షులుగా అతివాదుల ప్రతినిధిగా సుభాష్ చంద్రబోస్ ఎన్నికయ్యారు. త్రిపురీ కాంగ్రెస్ మహాసభ జాతీయ పోరాట సన్నాహాలకు పిలుపు యిచ్చింది. బోస్‌గారి ఫార్వర్డ్ బ్లాక్, కమ్యూనిస్టులు, సోషలిస్టులు, రాయిస్టులు కలిసి కాంగ్రెస్‌లో అతివాద ఐక్య సంఘటన (లెఫ్ట్ కన్సాలిడేషన్) కమిటీగా ఏర్పడ్డారు. ఈ కమిటీకి సుభాష్ చంద్రబోస్ కన్వీనరు.

సుభాష్ ఆంధ్ర దేశ పర్యటనకు బయలు దేరారు. బోస్‌ను ఎవరూ ఆహ్వానించరాదని ఆనాడు మితవాద ప్రాబల్యం గల ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ బహిష్కరణను జారీ చేసింది. కమ్యూనిస్టులు, సోషలిస్టులు కలిసి ఉన్న ఆంధ్ర కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ, బోస్‌కు ఏమైనా సరే స్వాగతం యివ్వాలని అవసరమైతే కాంగ్రెస్ బాధ్యతాయుత స్థానాల నుండి బహిష్కరణకు సంసిద్ధం కావాలని పిలుపు యిచ్చింది.

సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో ముందు శ్రేణిలో ఉన్న విద్యార్థి ఫెడరేషన్ సుభాష్ చంద్రబోసును అందుకే ఆహ్వానించింది.

కాకినాడ టెంపుల్ స్ట్రీట్‌లో ఉన్న బాదం లాడ్జిలో ఆహ్వాన సంఘ కార్యాలయంగా ఏర్పాటు చేశారు. 50 మందితో విద్యార్థి వాలంటీరు దళం నిర్మాణం, ఆటలు, వక్తృత్వ పోటీలు, సాంస్కృతిక ప్రదర్శనలు మొదలైనవి ఏర్పాటు చేయబడ్డాయి.

మహాసభ 1939 సెప్టెంబరు 1వ తేదీన స్థానిక కృష్ణా పిక్చర్‌ప్యాలెస్‌లో ప్రారంభమైంది వింజమూరి సోదరీమణులు సీత, అనసూయ, పరకాల పట్టాభిరామ రావు మొదలైన వారు విద్యార్థి గేయాలు జాతీయ గేయాలు పాడారు. విషయ నిర్ణయ సభలో జాతీయ నాయకత్వంలో చీలిక విద్యార్థి కార్యక్రమం మున్నగు విషయాలపై చర్చ జరిగింది.

## ఊరేగింపులో కార్మిక వర్గం

మధ్యాహ్నం యూనిఫారమ్‌లో వాలంటీర్లు, బ్యాండు మేళం తరువాత వందలాది విద్యార్థులు పాల్గొన్నారు. ఊరేగింపులో కాకినాడ కార్మిక వర్గం కూడా పాల్గొంది. "వందేమాతరం - మనదే రాజ్యం" "సామ్రాజ్యవాదం నశించాలి. ఆంధ్ర యూనివర్శిటీ ఆర్డినెన్సులు పోవాలి" అన్న విద్యార్థి నినాదాలతో యుద్ధ వ్యతిరేక నినాదాలతో, కార్మికులు తమ విప్లవ గేయాలతో నినాదాలు యిస్తుంటే

పట్టణమంతా ఊరేగింపుతో వూగిపోయింది సుభాష్ చంద్రబోసు ఉపన్యాసం విన డానికి పట్టణమంతా విరగబడింది. ఆయన ఉపన్యాసానికి పావలా (25 పైసలు) చొప్పున టిక్కెట్లు పెట్టడంతో హాలు నిండిపోయింది.

విద్యార్థి నాయకుల రాయబార ఫలితంగానూ విద్యార్థి ఉద్యమ ప్రభంజనం చూసి అంతక్రితం వరకు వ్యతిరేకంగా ఉన్న పి ఆర్. కాలేజి ప్రిన్సిపాల్ పెద్దాడ రామస్వామిగారు మధ్యాహ్నం కాలేజీకి సెలవు ప్రకటించారు బోస్ రాక అందుకు దోహదం చేసింది. కాలేజీ అధ్యాపకులందరూ బోస్ ప్రసంగం వినడానికి వచ్చారు.

అఖిల భారత కిసాన్ సభ నాయకులు స్వామి సహజానంద సరస్వతి, స్టూడెంటుకాల్ పత్రికా సంపాదకులు జి ఎస్. పౌహికర్ మున్నగు వారు పంపిన సందేశాలను ఆహ్వాన సంఘ కార్యదర్శి పరకాల పట్టాభిరామారావు, చదివి విని పించారు. ఆహ్వాన సంఘ అధ్యక్షులు సూర్యేశ్వర శర్మగారు స్వాగతోపన్యాసం చేశారు.

## సుభాష్ చంద్ర బోస్ ప్రసంగం

సుభాష్ చంద్రబోస్ తమ ప్రారంభోపన్యాసంలో ఇలా తెలిపారు.

"విద్యార్థి సమావేశాలను నేనెల్లప్పుడు అభిలషించు చుందును. విద్యార్థులు ముందు తరంలో నాయకులై దేశాన్ని నడిపించ వలసిన వారు. విద్యార్థులలో యిప్పుడు యిదివరలోకంటే అనేకరెట్లు చైతన్యం కల్గింది. అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్ క్రింద విద్యార్థులందరూ తయారగుచుండుట ముదావహం ఈ కాలంలో సమీకరణ చాలా అవసరం. విద్యార్థులకు అనేక సమస్యలిప్పుడు ఎదుర్కొన్నవి. ముఖ్యంగా వారి హక్కులు సంపాదించుకొనుట యొకటి బానిసత్వంలో యున్న హిందూ దేశానికి, ముక్తి సంపాదించుట రెండవది వీరి విధియై వున్నది. ఇతర స్వాతంత్ర్య దేశాలలో విద్యార్థులు తమ హక్కుల కోసం పోరాడనవసరం లేదు. ప్రభుత్వం విద్యార్థులకు కావలసిన హక్కులు ఒసంగియే యున్నారు. కాని ఈ దేశంలో విద్యాధికారులతో గూడా సంఘర్షణ విద్యార్థులకు తప్పుట లేదు. మీరేదైనా ఒక కాన్ఫరెన్సులో పాల్గొనాలంటే యూనివర్శిటీ వద్ద నుండి, ప్రభుత్వం నుంచి అనుమతి పొందవలసి వుంటుంది రాష్ట్ర స్వపరిపాలన వచ్చిందన్న మాటేగాని బ్రిటీషు నిరంకుశ అధికారం క్రిందనే యింకా మనమున్నట్లు ఉంది. ఈ నియమాలను (యూనివర్శిటీ ఆర్డినెన్సులను) ఎట్లు ఎదుర్కొనవలెనో విద్యార్థులే నిర్ణయించుకొందురు గాక.

ఎనిమిది రాష్ట్రాలలో ఎక్కువ ఆశలు పెట్టుకొని కాంగ్రెసు మంత్రి వర్గాలు అధికారం స్వీకరించినప్పటికీ తమ ఆశయాలను నెరవేర్చ లేకుండుట

హాస్యాస్పదంగా నున్నది. విద్యార్థులు మందగతిని వదలి ఐద్ధకం విడనాడి, సంపూర్ణ స్వాతంత్ర్యం సంపాదించుటకు పోరాటం తీవ్రంగా సాగించాలి. జాతీయ పోరాటానికి విద్యార్థి సంఘాలు తాలింఖానాలవంటివి

అంతర్జాతీయ విషమ పరిస్థితిని వివరించుతూ శ్రీ బోసు "ఈ సమయ మునసే కాంగ్రెస్ బలముగా ఉన్నది కనుక మన స్వతంత్ర్యం మాట బ్రిటీషు ప్రభుత్వం వారిని గట్టిగా అడిగి వారు నిరాకరించినట్లయితే దౌర్జన్య రాహిత్య శాసనోల్లంఘనం ప్రారంభించాలి" అని అన్నారు. యుద్ధ మేఘాలు ప్రపంచ మంతా కమ్ముకుంటున్నాయి. ఇట్టి పరిస్థితుల్లో మనం కళ్ళు మూసుకొని కూచుండుట విచారకరం అని కాంగ్రెస్ మితవాద నాయకత్వాన్ని విమర్శించారు.

మహాసభ రెండవ రోజున వక్తృత్వ పోటీలు జరిగాయి. "శాంతి అభ్యుదయం, స్వరాజ్యంతో సిద్ధించునా?" అన్నది విషయం. తరువాత విషయ నిర్ణయ సభ జరిగింది. జనరల్ సమ్మె తీర్మానం అన్నిటికంటే ముఖ్యమైనది.

సాయంత్రం పతాకోత్సవం జరిపిన అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్ సంయుక్త కార్యదర్శి కామ్రేడ్ రంగనేకర్ మాట్లాడుతూ "జర్మన్‌లో హిట్లర్ ప్రభుత్వం వచ్చినప్పటి నుండి, ఫాసిస్టులు విద్యార్థులను క్రూరంగా అణచివేయడం మొదలు పెట్టారు. ఈ ఫాసిస్టు హింసాకాండకు వ్యతిరేకంగా ప్రపంచమంతటా విద్యార్థులు చేసిన త్యాగానికి, ప్రాణాలర్పించిన దానికి చిహ్నంగా వారి రక్తంతో వ్రాయబడింది. బానిస దేశమగు మన దేశంలో "స్వాతంత్ర్యానికై విద్యార్థులు పోరాడవలసి ఉంది. ఈ విషయంలో యింకా పోరాడుతున్న చైనా విద్యార్థులు మనకు మార్గదర్శకులు అని అన్నారు".

## మహాసభ అధ్యక్షోపన్యాసం

మహాసభకు అధ్యక్షత వహించిన శ్రీ జొన్నలగడ్డ రామలింగయ్య గారు తమ ప్రసంగంలో యిలా అన్నారు.

"యవ్వనులు, నిష్కల్మష హృదయులు, ఉత్సాహవంతులు, సాహస వంతులు అగు విద్యావంతులే మత్తు వదిలి నడుములు బిగించి "ఇది మాదేశం, బీద ప్రజలను ఉద్ధరించుటకు మేము కంకణం కట్టుకొని యున్నాము. కరువులు, అంటువ్యాధులు, జాతి ద్వేషములు, భయంకర సామ్రాజ్యవాద యుద్ధాల నుండి, బానిసత్వం నుండి ప్రపంచమంతటా గత పీడుతులందరిని రక్షించుటకు ముందుకు సాగిపోతాము. స్వాతంత్ర్యం, శాంతి, అభ్యుదయం యివి మా పరమాదర్శములు" అని ఆకాశం బ్రద్దలగునట్లు నినాదాలు చేస్తుంటే సంతసించని వారెవరు? ఇది బ్రహ్మాండమైన నూతన శక్తి కాదా? ఈ ఉద్యమం నుండే త్యాగమూర్తులగు భావి దేశ నాయకులు ఉద్భవించేది. తీవ్రవాద రాజకీయాలు, సాధారణ రాజ

కీయాలు అని రెండు రకాల రాజకీయాలున్నాయనీ, విద్యార్థులు తీవ్రవాద రాజకీయాలలో పాల్గొనకూడదని కృత్రిమ విభజనలు చేస్తున్నారు

"ఆకలి మంటలచే దేశమంతటా కోట్లకొలది బీద కార్మిక, కర్షకులు ఆహాకారములు సల్పుతుంటే దేశ భక్తులు అనేకమంది చీకటి జైళ్ళలో మగ్గుతూంటే ప్రపంచమంతా, ఫాసిస్టు రాక్షస భయంతో, సామ్రాజ్య యుద్ధాలతో కంపించి పోతూంటే విద్యార్థులు చేతులు ముడుచుకొని రాజకీయాలకు దూరంగా ఉండగలరా ?

"సమయం వచ్చినప్పుడు విద్యార్థులు తీవ్ర రాజకీయ పోరాటానికి సిద్ధంగా ఉండాలి. మామూలు సమయంలో సమస్త రాజకీయ సిద్ధాంతాలను, జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులను చర్చించాలి. రాజకీయ బాధితులకు, ఉద్యమాలకు ధన సహాయం చేయాలి విద్యాలయాలలో సమస్త రాజకీయ గ్రంథాలు, పత్రికలు లైబ్రరీలలో ఉంచాలి. కాలేజీ, హైస్కూలు డిబేట్లు దేశ సంబంధమైనవిగానూ, రాజకీయ సిద్ధాంతాల మీద ఆధారపడేవిగానూ ఉండాలి జాతీయ ప్రతికూలమైన, అభివృద్ధికి ఆటంకమైన పఠన గ్రంథాలు, లైబ్రరీ పుస్తకాలు తొలగించాలి. విద్యార్థుల ప్రాథమిక హక్కులు అనగా వాక్స్వాతంత్ర్యం, పత్రికా స్వాతంత్ర్యాలు గుర్తించాలి. విద్యార్థుల స్వాతంత్ర్యాన్ని అరికట్టే ఆర్డినెన్సులు, జి ఓ లు రద్దు కావాలి. జాతీయ భావాలు కల్గిన వారినే ఉపాధ్యాయులుగా నియమించాలి. విద్యార్థి సభలకు, సమావేశాలకు, విద్యాలయాలను ఉపయోగించుకోడానికి అధికారాలుండాలి. కనీసం హైస్కూలు విద్య వరకు అయిననూ బీద విద్యార్థులకు ఉచితంగా గరపాలి.

"ఈ హక్కులకై విద్యార్థులు తమ సంఘాల ద్వారా తీవ్ర కృషి చేయాలి. సెలవు దినాలలో విద్యార్థులు విద్యరాని ప్రజలకు రాత్రి పాఠశాలలు మొదలైనవి స్థాపించి వయోజన విద్య గరపాలి."

"కార్మికులు-కర్షకులలో పనిచేసే నాబోటి వానిని మీ సభకు అధ్యక్షులుగా పిలిచారంటే, అది సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాట ప్రస్తుత దశనూ సూచిస్తుంది."

"నేటి విద్యార్థులు కుళ్ళిపోయిన ప్రస్తుత సంఘాన్ని తొలిగించి దోపిడీకి బానిసత్వాలకు, యుద్ధాలకు తావులేని నూతన సమాజాన్ని నిర్మించడానికి సంసిద్ధం కావాలి."

—ఆంధ్రపత్రిక, 1939 సెప్టెంబరు, 2,3 తేదీలు

మహాసభ 3 వ రోజున టౌను హాలులో జరిగిన సభలో యుద్ధం గురించిన తీర్మానం పైన చర్చ జరుగుతూంది. సెప్టెంబరు 1 వ తేదీన హిట్లర్ జర్మనీ

యుద్ధ ప్రకటన లేకుండా పోలెండుపై దాడి చేసింది. బ్రిటన్, ఫ్రాన్సులు ఎప్పుడు యుద్ధం ప్రకటన చేస్తాయా? అని అనుక్షణం ఎదురు చూస్తున్నారు. సెప్టెంబరు 3 వ తేదీన మధ్యాహ్నానికి బ్రిటన్, ఫ్రాన్సులు జర్మనీకి అల్టిమేటమ్ యిచ్చాయని వార్త. యుద్ధం ప్రకటన వార్త రానే వచ్చింది.

సభాధ్యక్షులు వేదిక పై నుండి రెండవ ప్రపంచ మహా యుద్ధం ప్రారంభ మైందన్న వార్త ప్రకటించడంతో సభలో తీవ్ర సంచలనం చెలరేగింది. యుద్ధ వ్యతిరేక నినాదాలు మిన్ను ముట్టాయి.

యుద్ధం వస్తే బ్రిటిషు సామ్రాజ్యవాదులు భారతదేశంలో నిర్బంధ విధానం ప్రారంభిస్తారు. యుద్ధ వ్యతిరేక ఉద్యమంలో విద్యార్థుల పాత్ర ఏమిటి? అన్న విషయమై కొంతసేపు చర్చ సాగింది. యుద్ధ వ్యతిరేక సమ్మెలు చేయాలనీ, యుద్ధ వ్యతిరేక సంఘాలు పెట్టాలనీ, యుద్ధ వ్యతిరేక నిధి వసూలు చేయాలనీ చాలా సూచనలు వచ్చాయి.

ఇక ఆ ఉద్రిక్త వాతావరణంలో సభ ముందుకు సాగలేదు. బహుశ ఈ మోస్తరుగా మళ్ళీ బహిరంగంగా సమావేశం అవడం ఎప్పటికి వీలవుతుందో అనుకుంటూ విద్యార్థి సంఘాలకు జై! సామ్రాజ్యవాద యుద్ధాన్ని ప్రతికూలించాలి అను నినాదాలతో సభ ముగిసింది.

తరువాత దేశంలోని, రాష్ట్రంలోనూ పరిస్థితులు క్షణక్షణానికి మారి పోయాయి. వైస్రాయి యుద్ధ ఆర్డినెన్సులు ప్రకటించారు. పౌరసత్వ హక్కుల పై దాడి మొదలైంది నిర్బంధ విధానం ప్రారంభమైంది.

ఈ మహాసభలో నూతన రాష్ట్ర కార్యదర్శిగా శ్రీ పాలెపు సత్యనారాయణ శర్మ ఎన్నుకోబడ్డారు.

## ప్రపంచ యుద్ధం – మన కర్తవ్యం

1939 సెప్టెంబరు 6 వ తేదీన కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ వారపత్రిక నవశక్తి పత్రిక "ప్రపంచ యుద్ధం-మన కర్తవ్యం" అను పేరిట 16 పాయింట్ల యుద్ధ వ్యతిరేక కార్యక్రమం ప్రకటించింది. యుద్ధానికి వ్యతిరేకంగా ఉద్యమం నడపాలని ఈ కార్యక్రమ సారాంశం. ఈ ప్రకటన చేసిన మరునాడు ఈ పత్రిక, ప్రెస్‌తోసహా అదృశ్యమై పోలీసుల దాడినుండి చాకచక్యంగా తప్పించుకుంది.

## కాకనాడ విద్యార్థుల యుద్ధ వ్యతిరేక సమ్మె

16వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభ ఆదేశానుసారం కాకినాడ విద్యార్థులు 1940 జనవరి 7వ తేదీన బ్రహ్మాండమైన యుద్ధ వ్యతిరేక సమ్మె చేశారు. సాయంత్రం పెద్ద ప్రదర్శన, బహిరంగసభ జరిగాయి. సమ్మె గురించి నిర్ణ యించడానికి రెండు రాత్రిళ్ళు బాదంలాడ్జి (కాకినాడ పట్టణ విద్యార్థి సంఘ కార్యా

లయంలో) జనరల్‌బాడీ సమావేశాలు జరిగాయి. చివరకు సమ్మె నిర్ణయం తీసు కున్నారు. యుద్ధానికి వ్యతిరేకంగా దేశంలో విద్యార్థులు జరిపిన మొదటి సమ్మె అవడంతో ఆ మరుసటి రోజు ఉదయం ఆలిండియా రేడియోలో కాకినాడ విద్యార్థుల సమ్మె వార్తను ప్రముఖంగా చెప్పారు. సమ్మెకు రాష్ట్ర విద్యార్థి సంఘ కార్యదర్శి శ్రీ పి. ఎస్. శర్మ, కాకినాడ పట్టణ విద్యార్థి సంఘ కార్యదర్శి వరకాల పట్టాభిరామారావు, జిల్లా విద్యార్థి నాయకులు పర్వతనేని వెంకటేశ్వర రావు తదితరులు నాయకత్వం వహించారు. ఆ తరువాత కాకినాడ విద్యార్థులు యుద్ధ వ్యతిరేక ప్రచారం ముమ్మరంగా సాగించారు. కాలేజీ గోడలనిండా యుద్ధ వ్యతిరేక నినాదాలు వ్రాశారు. యుద్ధ వ్యతిరేక వాల్‌పోస్టర్లను అంటించారు. సైన్యంలో చేరవద్దు, యుద్ధనిధి పైసా యివ్వవద్దు తదితర అంశాలతో 15,000 కరపత్రాలు పంచిపెట్టబడినాయి. కాంగ్రెస్ ఆఫీసులోని సైక్లోస్టయిలు యంత్రంతో కరపత్రాలు తీసి విరివిగా పంచడం జరిగింది.

**స్వాతంత్ర్య దినోత్సవం:-** 1939 జనవరి 26న కాకినాడలో కాంగ్రెస్ సంఘం, కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ, విద్యార్థి సంఘాల ఆధ్వర్యాన స్వాతంత్ర్య దినోత్సవం జరిగింది. ఉదయం పురమందిరంలో డాక్టర్ చెలికాని రామారావు గారు జాతీయ పతాకాన్ని ప్రతిష్ఠించారు. సాయంత్రం కార్మికులు, విద్యార్థులు పెద్ద ఊరేగింపు జరిపారు. టౌన్‌హాలులో జరిగిన సభకు కాంగ్రెస్ ప్రముఖులు శ్రీ వేదాంతం వెంకటకృష్ణయ్య అధ్యక్షత వహించారు. ఫెడరేషన్ దిష్టిబొమ్మను విద్యార్థులు ఊరేగించి సభానంతరము తగులబెట్టారు.

తూర్పు గోదావరి జిల్లాలో అనేకచోట్ల విద్యార్థులు స్వాతంత్ర్య దినోత్సవం జరిపారు.

**డిటెన్షను వ్యతిరేక దినం :-** 1939 ఆగష్టు 6 వ తేదీన రాష్ట్ర విద్యార్థి సంఘం ఆదేశానుసారం కాకినాడ విద్యార్థి సంఘం డిటెన్షను వ్యతిరేక దినం జరిపింది వరిగొండ వెంకట సుబ్రహ్మణ్య శర్మ అధ్యక్షత వహించారు.

**ప్రకాశం గారి సభ :-** 1939 నవంబరులో ఆంధ్రదేశంలో పెనుతుఫాన్ సంభవించి అపార నష్టం వాటిల్లింది. తుఫాన్ బీభత్సాన్ని చూడటానికి, సహాయ కార్యక్రమాలు చేపట్టడానికి టంగుటూరి ప్రకాశం పంతులుగారు కాకినాడ విచ్చేసిన సందర్భంలో విద్యార్థులు ఆహ్వానించి టౌను హాలులో ప్రత్యేక సభ జరిపారు. పట్టణ విద్యార్థి సంఘ కార్యదర్శి వరకాల పట్టాభి రామారావు స్వాగతం చెప్పారు. వింజమూరి సోదరీమణులు, సీత, అనసూయగార్లు, పట్టాభి రామారావు జాతీయ గీతాలు, విద్యార్థి గీతాలు పాడారు. శ్రీ ప్రకాశం పంతులుగారు మాట్లాడుతూ, విద్యార్థులు రానున్న స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనాలని, త్యాగాలకు సిద్ధంగా

ఉండాలని ఉద్బోధించారు. సభకు పెద్ద సంఖ్యలో విద్యార్థులు, లెక్చరర్లు హాజరయ్యారు.

## కాకినాడ విద్యార్థినుల మహాసభ

ఆ రోజుల్లో కాకినాడ పి.ఆర్. కాలేజీలోనే సహ విద్య (కో ఎడ్యుకేషన్) అవకాశం, విద్యార్థినులకు ప్రత్యేక హాస్టల్ వసతి ఉండేది. ఇతర కాలేజీలలో చాలా అరుదుగా ఉండేది ప్రత్యేక మహిళా కాలేజీలు అసలే ఉండేవి గావు. అందుచేత గుంటూరు, కృష్ణా, పశ్చిమ గోదావరి, తదితర జిల్లాల నుండి కూడా మహిళా విద్యార్థులు కాకినాడ పి ఆర్. కాలేజీలో వచ్చి చేరేవారు. కాకినాడ పట్టణ విద్యార్థి సంఘం స్త్రీ విద్యార్థినుల ప్రత్యేక కోర్కెల ప్రాతిపదికపై గరల్స్, స్టూడెంట్సు కాన్ఫరెన్సు జరిపింది విద్యార్థినులకు హాస్టలులో ఇబ్బందులు, యితర కోర్కెలపై తీర్మానాలుచేసి అధికారుల దృష్టికి తీసుకు వచ్చారు. కొత్త సుబ్రహ్మణ్యేశ్వరి, కొత్త సుగుణ, యామినీపూర్ణ తిలక్, జె. సుభద్ర మున్నగువారు ముఖ్య కార్యకర్తలుగా సభ నిర్వహణకు కృషి చేశారు. విద్యార్థినులకు విద్యార్థి ఉద్యమంలోకి తీసుకురావడానికి ఆవిధంగా కాకినాడ విద్యార్థి సంఘం ప్రత్యేక కృషి చేయడమేకాక విద్యార్థినులను అల్లరి చేసే కొంతమంది చెడు ప్రవర్తన గల విద్యార్థులను మందలించడం, గోడలమీద, బ్లాక్ బోర్డులమీద ఆడపిల్లలపై పేర్లు పెట్టి వ్రాసినవి చెరిపివేయడం, (ఈవ్ టీజింగ్) మున్నగు చెడు పద్ధతులను ధైర్యంగా ఎదుర్కొని విద్యార్థి సంఘ కార్యకర్తలు పోరాడేవారు.

ఆ రోజుల్లో ఇంకా అంతగా ఆడపిల్లలను స్కూళ్ళకు, కాలేజీలకు తల్లి దండ్రులు పంపేవారు కారు. అందున ఇతర ప్రాంతాలకు అసలే పంపేవారు కాదు. ఇట్టి పరిస్థితుల్లో కాకినాడలో చదువుకొనడానికి వచ్చిన విద్యార్థినుల పట్ల జరిగే అన్యాయాలకు, అక్రమ ప్రవర్తనల విషయంలో విద్యార్థి సంఘం కలుగ జేసుకొనడం వలన విద్యార్థినుల సానుభూతిని గౌరవాన్ని సంపాదించ గల్గింది. విద్యార్థి సంఘ కార్యకలాపాలలో విద్యార్థినులు కూడా వచ్చి పాల్గొనడం ఆ రోజులలో ఒక విశేషమని చెప్పవచ్చు. విద్యార్థి హాస్టలు వార్షికోత్సవాలలో విద్యార్థినులు కూడా వచ్చి సాంస్కృతిక ప్రదర్శనలలో పాల్గొంటూ ఉండేవారు.

## గుంటూరులో

గుంటూరు ఎ.సి. కాలేజీలో కూడా సహవిద్య అవకాశం ఉండేది. ఆడ పిల్లలను యిక్కడ కూడా వేధించుతూ, నిక్‌నేమ్స్ పెట్టడం, బ్లాక్‌బోర్డుల మీద ఆ మాదు పేర్లు వ్రాస్తూండటం వారు వెయిటింగు రూమ్సు నుండి క్లాసు రూమ్సుకు వచ్చి అవి చూసి బాధపడటం జరుగుతూండేది. విద్యార్థినుల వెంటబడి కొందరు ఆకతాయి విద్యార్థులు అల్లరి చేయడం కూడా జరిగేది. విద్యార్థి సంఘ నాయకులు

ఈ అల్లరి విద్యార్థులను ఎదుర్కోడానికి నిశ్చయించారు. ఒక రోజున లెక్చరర్ గారితో ముందే మాట్లాడి క్లాసురూమ్‌లో కామ్రేడ్ వై.వి. కృష్ణారావు, ఆడపిల్లలను ఇలా వేధించడం తప్పు అనీ, ఇకనుండి దీనిని నిలిపివేయకపోతే విద్యార్థి సంఘం దీని గురించి చర్య తీసుకుంటుందనీ హెచ్చరించారు ఈ హెచ్చరిక కూడా పని చేయలేదు. తదుపరి ఈ విధంగా అల్లరిచేసే విద్యార్థులున్న హేయర్ హాస్టలుకు వెళ్ళి విద్యార్థులను పోగుచేసి క్లాసులో జరుగుతున్న విషయమంతా చెప్పి ఈ అల్లరి చర్యలు నిలిపివేయాలని మళ్ళీ హెచ్చరించారు. దీనితో విద్యార్థులలో కొంత మార్పు వచ్చింది. బ్లాక్ బోర్డుపై వ్రాతలు తాత్కాలికంగానైనా ఆగిపోయాయి.

## ప్రభుత్వ నిర్బంధ విధానం

యుద్ధ వ్యతిరేక కార్యకలాపాలతో కాకినాడ విద్యార్థి నాయకులపైన, కార్మిక నాయకుల పైన ప్రభుత్వ నిర్బంధ విధానం, సి.ఐ.డిల నిఘా, అరెస్టులు ప్రారంభ మయ్యాయి. యుద్ధ వ్యతిరేక ఉపన్యాసాలను నిషేధిస్తూ ప్రభుత్వం నోటీసులు జారీ చేసింది. రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ కార్యదర్శి శ్రీ పి ఎస్. శర్మను ఇతర కార్మిక నాయకులతో కలిపి 1939 అక్టోబరులో అరెస్టుచేసి 108 సి. ఆర్. సి. సి. క్రింద కేసులు పెట్టి ఒక సంవత్సరం జైలుశిక్ష విధించారు ధరావతులు కడితే విడుదల చేస్తామన్నారు తీరాధరావతులు కడితే పోలీసుల వత్తిడిపై విడుదల చేయ నిరాకరించారు.

1940 ప్రారంభానికే నిర్బంధ విధానం ముమ్మరమైంది. పర్వతనేని వెంకటేశ్వర రావు, పరకాల పట్టాభిరామారావు మొదలైన విద్యార్థి నాయకులు చదువులకు స్వస్తిచెప్పి అజ్ఞాతవాసంలోకి వెళ్ళిపోవలసి వచ్చింది.

## ''మూగ ప్రదర్శన''

దేశరక్షణ చట్టం క్రింద యుద్ధ వ్యతిరేక ప్రసంగాలు చేయకూడదని ప్రభుత్వం నిషేధాజ్ఞాలు జారీ చేసింది. ఇందుకు నిరసనగా కాకినాడలో కార్మికులు, విద్యార్థులు కలిసి "దేశరక్షణ చట్టం" అని వ్రాసిన గుడ్డ పీలికలను నోటికి కట్టుకొని కాకినాడలో మూగ ప్రదర్శన జరిపారు. నోళ్ళు మూయించే నిషేధాజ్ఞలకు వ్యతిరేకంగా ఈ రూపంలో జరిపిన ప్రదర్శన అపూర్వంగా ఉండి పట్టంలోణ సంచలనం కల్గించింది.

యుద్ధ వ్యతిరేక కార్యక్రమంలో గుంటూరు విద్యార్థులు పెద్ద ఎత్తున పాల్గొన్నారు. గోడలపై యుద్ధ వ్యతిరేక నినాదాలు వ్రాశారు. యుద్ధ ఫండుకు ఒక పైసా యివ్వరాదని బ్రిటిషు సామ్రాజ్యవాద సైన్యంలో ఒక్క యువకుడు కూడా చేరరాదనీ ప్రచారం చేశారు. సైనికుల రిక్రూటింగు కేంద్రాలకు వెళ్ళి ఎవరూ సైన్యంలో చేరవద్దని ప్రబోధించారు

1939 అక్టోబరు 28న గుంటూరు పట్టణంలో 900 మంది విద్యార్థులు యుద్ధ వ్యతిరేక నినాదాలతో ప్రదర్శన జరిపారు. 1940 జనవరి 26న అంతకు ముందు సంవత్సరంలో వలెనే విద్యార్థి సమ్మెకు పిలుపు యివ్వబడింది. ఎ. సి. కాలేజీ, హిందూ కాలేజీ విద్యార్థులు సమ్మె చేశారు. ఆ రోజున అన్ని స్కూళ్ళను మూసివేయడం జరిగింది.

1939 నవంబరు 1న దేశ వ్యాపితంగా యుద్ధానికి నిరసనగా విద్యార్థులు సమ్మె చేయాలనీ నిర్ణయించబడింది. ఈ సమ్మెకు విద్యార్థులను తయారు చేసే సందర్భంగా రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ కార్యదర్శి శ్రీ పి. ఎస్. శర్మ అక్టోబరు నెలలో గుంటూరు వచ్చిన సందర్భంలో 400 మంది విద్యార్థులతో సభ జరిగింది.

1939 నవంబరు నెల ప్రారంభంలో గుంటూరు జిల్లా ప్రభుత్వ ఆస్పత్రి వద్ద (ఎ. సి. కాలేజీ ప్రక్కనున్న ప్రస్తుత ప్రభుత్వ ఆసుపత్రి ఉన్న స్థలమే) సైన్యంలోకి తీసుకొనేవారికి వైద్యపరీక్షకు యువకులు పెద్ద ఎత్తున గుమిగూడారు ఆ సందర్భంలో వై. వి. కృష్ణారావు, ప్రభల కృష్ణమూర్తి వగైరా విద్యార్థి నాయకులు, కమ్యూనిస్టు నాయకులు పెండ్యాల లోకనాథం, సారథి మరికొందరు వెళ్ళి సైన్యంలో ఎవరూ చేరవద్దనీ, సామ్రాజ్యవాదులకు తోడ్పడవద్దని ప్రచారం చేశారు. పోలీసులు వారిని బైటకి గెంటి వేశారు.

ఆ సాయంకాలం సామ్రాజ్యవాదం దిష్టి బొమ్మను పాడికట్టి ఊరేగింపుతో స్వరాజ్య పార్కుకు తీసుకువెళ్ళి దహనం చేశారు. బహిరంగసభ కూడా జరిగింది.

ఈ కార్యక్రమాల ఫలితంగా ప్రభుత్వ నిర్బంధ విధానం హెచ్చింది. కామ్రేడ్ మోటూరు హనుమంతరావు వగైరాలు అరెస్టులు తప్పించుకొని అజ్ఞాత వాసాలకు వెళ్ళారు.

రాష్ట్రంలో ఇంకా అనేక చోట్ల ఇదేవిధంగా విద్యార్థులు, యువకులు యుద్ధ వ్యతిరేక ప్రదర్శనలు జరిపారు.

## గంగాధరరావు అరెస్టు

ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి సంఘ ప్రధాన కార్యదర్శి, అఖిల భారత విద్యార్థి సంఘ కార్యవర్గ సభ్యులు అయిన శ్రీ ఆమంచర్ల గంగాధరరావు గారిని 1941 ఆగష్టు 14వ తేది రాత్రి 8-15 గంటలకు గూడూరు రైల్వే స్టేషనులో ఇండియా రక్షణ చట్టం క్రింద అరెస్టు చేశారు. తరువాత నెల్లూరు జిల్లా కలెక్టరు వద్ద హాజరు పరిచారు. తాను అరెస్టు అయినందున తన స్థానంలో సి. హెచ్. వెంకటేశ్వర రావు గారిని శ్రీ గంగాధరరావు నియమించారు.

## విజయకుమార్ పై అరెస్టు వారంటు

విజయనగరంలో బి. ఎస్. సి. చదువుతూ, విద్యార్థి ఉద్యమంలోను జాతీయోద్యమంలోనూ క్రియాశీల పాత్ర నిర్వహించు శ్రీ వై. విజయకుమార్ పై 1941లో అరెస్టు వారంటు జారీ అయింది అప్పుడు బి ఎస్ సి. ఫైనల్ ఇయర్ పరీక్షలు జరుగుతున్నాయి. విజయనగరం సైన్సు కళాశాల ప్రిన్సిపల్, అధ్యాపకుల అభ్యర్థన మేరకు పరీక్షలు పూర్తి అయ్యేదాకా పోలీసులు శ్రీ కుమార్‌ని అరెస్టు చేయలేదు. చివరి పరీక్ష రోజు అరెస్టు వారంటుతో కళాశాల ప్రాంగణంలో పోలీసులు సిద్ధంగా కూర్చున్నారు. ఇది గమనించి పరీక్ష పూర్తికాగానే కాలేజీ వెనుక గోడ దూకి తప్పించుక పోయిన కామ్రేడ్ విజయకుమార్ 1941-42 మధ్య కాలంలో సంవత్సరంపాటు అజ్ఞాతవాసంలో ఉన్నారు.

## పోలీసు నిర్బంధ విధానానికి
## పర్వతనేని వెంకటేశ్వరరావు బలి

తూర్పు గోదావరిజిల్లా విద్యార్థి ఉద్యమ నిర్మాణంలో ప్రముఖులు, కార్మిక నాయకులు అయిన పర్వతనేని వెంకటేశ్వరరావు గారు 1941 జూలై 3వ తేదీ రాత్రి (రహస్య జీవితం గడుపుతూ) పోలీసులు, సి.ఐ.డీలు చుట్టుముట్టి నప్పుడు రహస్య రికార్డుతో తప్పించుకొని పోతూ ప్రమాదవశాత్తు వరదనీటిలో మునిగి ఉన్న నేలబారుపాడు నూతిలో పడి అక్కడికక్కడే మృతి చెందారు.

వయోజన విద్యా ప్రచారం, వాలంటీరు దళాల నిర్మాణం మున్నగు కార్యక్రమాలు అన్నింటి మీద ప్రభుత్వం నిషేధాజ్ఞలు, నిర్బంధ విధానాలు ప్రారంభమయ్యాయి.

1941 ఏప్రిల్ 10 నుండి గుంటూరు జిల్లా కొల్లూరులో వయోజన విద్యా ప్రచార శిక్షణా శిబిరం జరపడానికి, తదనంతరం జిల్లాలో కొన్ని కేంద్రాలను నడపడానికి గుంటూరు జిల్లా విద్యార్థి సంఘం నిర్ణయించింది. కాని ఆ తరువాత ప్రభుత్వం 1941 జూన్‌లో వయోజన విద్యా ప్రచారంపై విధించిన నిషేధాజ్ఞల వలన అటు పిమ్మట యితర జిల్లాల్లో శిక్షణాశిబిరాలకు అవాంతరం ఏర్పడింది.

## వివిధ జిల్లాల్లో విద్యార్థి ఉద్యమ విస్తరణ

కాకినాడలో 1939 సెప్టెంబరులో జరిగిన 16వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభ యిచ్చిన ఉత్తేజంతో జిల్లాలో విద్యార్థి ఉద్యమం వ్యాప్తి చెందింది. కామ్రేడ్ పర్వతనేని వెంకటేశ్వరరావు జిల్లా విద్యార్థి సంఘ ఆర్గనైజరుగా జిల్లాలో అనేక హైస్కూళ్ళలో పర్యటించి విద్యార్థి సంఘాలు స్థాపించారు. 1939 నవంబరులో అమలాపురం, కొత్తపేట, రాజోలు, రామచంద్రాపురం, సామర్లకోట, పిఠాపురం, తుని హైస్కూళ్ళలో ఈ దశలోనే విద్యార్థి సంఘాల నిర్మాణం

జరిగింది. పరానేని విశ్వేశ్వరరావు, మేకా పట్టాభిరామయ్య మొదలైన వారు కార్యకర్తలుగా వచ్చారు

## ద్వితీయ, తృతీయ జిల్లా విద్యార్థి మహాసభలు

తూర్పుగోదావరి జిల్లా ద్వితీయ విద్యార్థి మహాసభ రాజమండ్రిలో 1940 ఫిబ్రవరి 4 వ తేదీన జరిగింది. శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్య, శ్రీ పుసులూరి కోదండరామయ్య గార్లు సభకు వచ్చి జాతీయ, అంతర్జాతీయ సమస్యలు విద్యార్థుల కర్తవ్యం గురించి మాట్లాడారు. రాష్ట్ర విద్యార్థి సంఘ కార్యదర్శి కామ్రేడ్ పి.యస్. శర్మ విద్యార్థి పతకాన్ని ప్రతిష్ఠించారు. కామ్రేడ్ పరకాల పట్టాభిరామరావు, జి. ఎస్. బాలాజిదాస్, చిట్టూరి ప్రభాకర చౌదరి, దోనెపూడి ధర్మరావు తదితరులు సభలో పాల్గొన్నారు.

## తృతీయ మహాసభ

తూర్పు గోదావరి జిల్లా తృతీయ విద్యార్థి మహాసభ 1941 ఫిబ్రవరి 7, 8, 9 తేదీలలో అమలాపురం హైస్కూలు ఆవరణలో జరిగింది. గుంటూరులో 1940 నవంబరు 10, 11 తేదీలలో జరిగిన 17 వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభలో రాష్ట్ర ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకోబడిన శ్రీ ఆమంచర్ల గంగాధర రావు మహాసభకు ప్రారంభోత్సవం చేశారు. శ్రీ అడవి బాపిరాజుగారు విద్యార్థి వైజ్ఞానిక మహాసభకు అధ్యక్షత వహించారు. జిల్లా విద్యార్థి సంఘ ఆర్గనైజరు పరకాల పట్టాభి రామారావు (సెమీలీగల్‌గా ఉంటూ) సభను నిర్వహించారు. కాకినాడ పట్టణ విద్యార్థి నాయకుడు జి.ఎస్. బాలాజీ దాస్, పరానేని విశ్వేశ్వర రావు తదితరులు హాజరయ్యారు. జిల్లా సంఘ కార్యదర్శిగా జి ఎస్. బాలాజీదాస్ ఎన్నుకోబడ్డారు.

## 17 వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభ

17 వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభలు గుంటూరులో 1940 నవంబర్ 10, 11 తేదీలలో జరిగాయి. శ్రీ ఆమంచర్ల గంగాధర రావు రాష్ట్ర ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు.

## గుంటూరు జిల్లా 5 వ విద్యార్థి మహాసభ

అయిదవ గుంటూరు జిల్లా విద్యార్థి మహాసభ రేపల్లెలో 1941 ఆగష్టు 30, 31 తేదీలలో శ్రీ ఎస్.వి.ఎల్. నరసింహం, బి. ఎ, బి. యల్. గారి అధ్యక్షతన జరిగింది. శ్రీ నారుమంచి సుబ్బారావు గారు సభను ప్రారంభించారు.

ఫాసిజాన్ని ఎదిరించి పోరాడుతున్న సోవియట్‌ను అభినందిస్తూ, ఈ యుద్ధంలో ఫాసిజం ఓటమికి స్వతంత్ర్య భారతదేశం మాత్రమే సరియైన పోరాటం చేయగలదు కనుక భారతదేశ స్వాతంత్ర్య పోరాటాన్ని ఉధృతంగా సాగించాలని,

కాంగ్రెస్ వారు సాగించే సత్యాగ్రహాలు నిరుపయోగమని, స్వాతంత్ర్య పోరాటాన్ని ఉధృతం చేయాలనీ తీర్మానం ఆమోదించారు.

పర్వతనేని వెంకటేశ్వరరావు మృతికి, రవీంద్రనాథ్ టాగూర్, ప్రముఖ పత్రికా సంపాదకులు చింతామణిగార్ల మృతికి సంతాపం వెలిబుచ్చారు. వయోజన విద్యా ప్రచారాన్ని నిషేధించుతూ ప్రభుత్వం జారీచేసిన ఉత్తర్వులను ఉపసంహరించుకోవాలని కోరారు.

విద్యార్థి నాయకులను, విద్యార్థులను అరెస్టు చేసినందుకు ఖండించారు.

లోగడ మద్రాసులో అరెస్టయిన విద్యార్థి డిటెన్యూలు తమ పరీక్షలకు హాజరు కావచ్చునని ప్రభుత్వం అనుమతించింది. ఆంధ్ర దేశంలో అరెస్టయిన విద్యార్థులకు కూడా ఆంధ్ర యూనివర్శిటీ వారు కూడా అటువంటి అవకాశం యివ్వనందుకు నిరసించారు.

వర్షాలు లేనందువలన కరవు ఏర్పడిన దృష్ట్యా రైతులకు శిస్తు రెమిషన్‌లు యివ్వాలని కోరారు.

విద్యార్థినులకు వేరే సంఘాల బదులు వారిని కూడా విద్యార్థి సంఘాల్లోనే చేర్చుకొని, వారి కోర్కెల కోసం పోరాడాలని, విద్యార్థి సభలను ప్రశాంతంగా జరుపడానికి స్కౌటు దళాల వంటివి ఏర్పాటు చేయాలనీ తీర్మానాలు చేశారు.

కొత్త సంవత్సరానికి శ్రీ జి. వెంకటేశ్వరులను కార్యదర్శిగా జె. వి. సుబ్బారావును సహాయ కార్యదర్శిగా ఎన్నుకున్నారు ౭వ మహాసభ గుంటూరులో జరుప నిర్ణయించారు.

## కృష్ణాజిల్లా 5 వ జిల్లా విద్యార్థి మహాసభ

1941 అక్టోబరులో 5 వ కృష్ణా జిల్లా విద్యార్థి మహాసభ జరిగింది. (ఎక్కడ అన్న వివరం లేదు) శ్రీ తాపీ మోహనరావుగారు అధ్యక్షత వహించారు. తుమ్మల వెంకట సుబ్బయ్యగారు ప్రారంభోత్సవం జరిపారు. జిల్లా అంతటి నుండి వంద మంది ప్రతినిధులు వచ్చారు.

ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి సంఘం వారు యిచ్చిన స్టేటుమెంటును (యుద్ధ ప్రతికూల వైఖరిని మార్చుకుంటూ, ఫాసిస్టు వ్యతిరేక ప్రజా పోరాటంలో పాల్గొనాలంటూ) విపులీకరించబడి ఆమోదించబడింది. నూతన సంవత్సరానికి ఎన్.వి.ఎన్. ప్రసాదరావును కార్యదర్శిగా ఎన్నుకున్నారు. పర్వతనేని వెంకటేశ్వర రావు మృతికి, రవీంద్రనాథ టాగూర్ మృతికి సభ వారు సంతాపం వెలిబుచ్చారు.

## 18 వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభ

ఈ నిర్బంధ విధానం ఇలా సాగుతున్నప్పటికీ 18 వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభ, విద్యార్థి వైజ్ఞానిక మహాసభలు 1941 నవంబరు 8, 9, 10 తేదీలలో బెజవాడలో జరిగాయి. మహాసభకు శ్రీ భుజేంద్రనాథ్ ముఖర్జీ అధ్యక్షత వహించారు. వైజ్ఞానిక మహాసభలకు "విజ్ఞానం" పత్రికా సంపాదకులు శ్రీ కాళిపట్నం కొండయ్యగారు అధ్యక్షత వహించారు. రాష్ట్ర సంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ ఆమంచర్ల గంగాధర రావు (ఆగష్టు 14 న) అరెస్టు అయినందున ఆయన స్థానంలో శ్రీ చెరుకూరి వెంకటేశ్వర రావుగారు కార్యనిర్వహణ బాధ్యతలు వహించారు.

## సభ విశేషాలు

మహాసభకు 225 మంది ప్రతినిధులు వచ్చారు. గవర్నరు పేట విద్యార్థి చౌకులో రాయలసీమ విద్యార్థి శ్రీ సుబ్బయ్య విద్యార్థి జండా ప్రతిష్ఠించారు.

సభను శ్రీమతి గోగినేని భారతీదేవి రంగాగారు ప్రారంభించారు భుజేంద్ర నాథ్ ముఖర్జీ అధ్యక్షోపన్యాసం యిచ్చారు. గాంధీ పార్కులో నిర్మించిన పెండ్యాలలో జరిగిన వైజ్ఞానిక మహాసభను శ్రీ మోటూరి రాధాకృష్ణగారు ప్రారంభించారు. కాళిపట్నం కొండయ్యగారు అధ్యక్షత వహించారు శ్రీ గోపరాజు రామచంద్రారావు, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ తాపీ మోహనరావుగారు మాట్లాడారు.

వక్తృత్వ పోటీలు, తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ జరిగాయి. సంగీత పోటీలు, ఆటల పోటీలు కూడా జరిగాయి. రాష్ట్ర కార్యదర్శిగా శ్రీ మోటూరి రాధాకృష్ణగారు ఎన్నుకోబడ్డారు.

## నాగపూర్ అఖిల భారత విద్యార్థి మహాసభ

అఖిల భారత విద్యార్థి మహాసభ 1940 డిసెంబరు 25, 26 తేదీలలో నాగపూర్‌లో జరిగింది.

రెండవ ప్రపంచ యుద్ధం - విద్యార్థుల కర్తవ్యం ప్రధాన చర్చనీయాంశం. సభకు శ్రీ హిరేన్ ముఖర్జీ అధ్యక్షత వహించారు. కాని ఈ సభలో కార్యదర్శి శ్రీ ఎమ్. ఎల్. షా. కార్యవర్గంలో మెజారిటీ కోల్పోయి రికార్డు తీసుకొని పారిపోయిరి. నాగపూర్‌లోనే వేరే సభ జరిపాడు. అయితే మెజారిటీ ప్రతినిధులతో అసలు సభ యథాప్రకారం జరిగింది. కె. ఎమ్. అష్రాఫ్ సభను ప్రారంభించారు.

ఎమ్.ఎల్ షా వారణాసి పోటీ మహాసభ జరిపాడు. ఈ పోటీ సభనే నిజమైన సభగా ఆంధ్ర దేశంలోని "వాహిని" పత్రిక వ్రాసింది. ఇది యథార్థం కాదని

సవాలుచేస్తూ గుంటూరు జిల్లా విద్యార్థి ఫెడరేషన్ ప్రధాన కార్యదర్శి శ్రీ ఎల్.బి. గంగాధరరావు ఒక ప్రకటన చేశారు.

## యుద్ధ స్వభావం మార్పు

1939 సెప్టెంబరులో ప్రారంభమైన ప్రపంచ యుద్ధం 1941 జూన్‌లో హిట్లర్, సోవియట్‌పై దండయాత్రతో గుణాత్మకంగా మార్పు చెందింది. ప్రపంచాధిపత్యంకోసం హిట్లర్ ఫాసిజం విజృంభించింది. ఫాసిజానికి వ్యతిరేకంగా పోరాడటమే ప్రపంచ ప్రజల కర్తవ్యంగా ముందుకు వచ్చింది. ఈ సమస్యపై విద్యార్థి ఫెడరేషనులో భిన్నాభిప్రాయం ఏర్పడింది. నాగపూర్‌లో వచ్చిన చీలిక వెనుక ఈ రాజకీయ విభేదాలు కూడా లేకపోలేదు.

## 7 వ అఖిల భారత విద్యార్థి మహాసభ

7 వ అఖిల భారత విద్యార్థి మహాసభ పాట్నాలో 1941 డిసెంబరు 25 నుండి 31 వ తేదీ వరకు జరిగింది. పంజాబ్ కాంగ్రెస్ నాయకుడు మియాన్ ఇఫ్తికారుద్దీన్ గారు అధ్యక్షత వహించారు. డాక్టర్ హుస్సేన్ జహీర్ సభను ప్రారంభించారు.

## మహాసభ ముఖ్య తీర్మానం

"సోవియట్ రష్యా పైన నాజీ జర్మనీ దండెత్తిన తరువాత అమెరికా బ్రిటన్‌లు, రష్యాతో పరస్పర సహకార సంధి చేసుకొనడంతో ఈ యుద్ధం ప్రపంచ యుద్ధంగా మారింది ఇకమీదట ఈ యుద్ధంలో బ్రిటిషు యుద్ధ సన్నాహాలకు సంపూర్ణ సహకారం చేయాలి" అన్న తీర్మానాన్ని మహాసభ ఆమోదించింది.

సభను ప్రారంభించిన హుస్సేన్ జహీర్ మాట్లాడుతూ, "రెండేళ్ళ క్రితం ప్రారంభమైన యుద్ధం ముఖ్యంగా సామ్రాజ్యవాద యుద్ధం అయినప్పటికీ గత 6 నెలల్లో కొన్ని సంఘటనలు జరిగి ప్రస్తుత యుద్ధ స్వభావాన్ని మార్చాయి అని అన్నారు

విద్యార్థి ఫెడరేషన్ ప్రధాన కార్యదర్శిగా పెరిన్ బరూచా (తరువాత పెరిన్ రమేష్ అయ్యారు) ఎన్నుకున్నారు.

## రాష్ట్ర విద్యార్థి సంఘ ప్రకటన

పాట్నా మహాసభ తీర్మానాన్ని అనుసరించి ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ కార్యదర్శి ఒక ప్రకటన చేస్తూ "పాట్నా తీర్మానం దృష్ట్యా ఈ సారి జరిపే స్వాతంత్ర్య దినోత్సవాన్ని ఫాసిస్టు వ్యతిరేక పోరాట దినోత్సవంగా కూడా జరపాలని తెలిపారు." ప్రకటన ఈ విధంగా ఉంది.

"పాట్నాలో జరిగిన అఖిల భారత విద్యార్థి మహాసభ (డిసెంబరు 25-31) తీర్మానం దృష్ట్యా ఫాసిజానికి వ్యతిరేకంగా జరుగుతున్న ప్రపంచ ప్రజా యుద్ధంలో మనం కూడా పాల్గొనాలి" ఈ స్వాతంత్ర్య దినం నాడు ప్రపంచ ప్రజల శత్రువగు ఫాసిజాన్ని నాశనం చేయడానికి జరిగే పోరాటంలో పాల్గొంటామని విద్యార్థులు ప్రతిన చేయాలి రాష్ట్రంలో పలుచోట్ల ఈ విధమైన తీర్మానాలతో స్వాతంత్ర్య దినోత్సవం జరుపబడింది.

## ఫాసిస్టు వ్యతిరేక ప్రజా యుద్ధ దశ - 1942 మే ఢిల్లీ సదస్సు

ఫాసిజానికి వ్యతిరేకంగా ప్రపంచవ్యాపిత పోరాటంలో భారత విద్యార్థి లోకాన్ని కూడా సమీకరించడానికి అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్ ఆధ్వర్యాన 1942 మే 15వ తేదీన ఢిల్లీలో అఖిల భారత విద్యార్థి సదస్సు జరిగింది. ఆంధ్ర దేశం నుండి రాష్ట్ర విద్యార్థి సంఘ నాయకుడు ఎస్ వి. కె ప్రసాదు నాయకత్వాన పరకాల పట్టాభిరామారావు, ఎస్.టి. రంగాచారి మరి ఇద్దరు కామ్రేడ్సుతో కూడిన ప్రతినిధివర్గం ఢిల్లీ సదస్సుకు హాజరైంది. స్వామీ సహజానందసరస్వతి సదస్సును ప్రారంభించారు. సదస్సు ప్రధాన చర్చనీయాంశం: ఫాసిస్టు వ్యతిరేక ప్రపంచ ప్రజా సంగ్రామంలో విద్యార్థుల పాత్ర. పెరిన్ బరూచా ప్రధాన కార్యదర్శి. రమేష్‌చంద్ర సహాయ కార్యదర్శి, కార్యవర్గ సభ్యులు ఫరూఖీ, వై. డి. శర్మ, విశ్వనాథముఖర్జీ, సరళశర్మ తదితరులు చర్చలకు నాయకత్వం వహించారు. దేశరక్షణకు విద్యార్థులు ముందంజవేయాలనీ, విమానదాడి ప్రమాదాన్నుండి రక్షించుకోడానికి ప్రజలకు తర్ఫీదు ఇవ్వాలనీ, ట్రెంచీలు త్రవ్వుట, ప్రథమ చికిత్స మున్నగువాటిలో శిక్షణ పొందాలనీ, వయోజన విద్యా కార్యక్రమం కొనసాగించాలని తదితర నిర్ణయాలు చేయబడ్డాయి. ఫాసిస్టు వ్యతిరేక గేయాలు, వయోజన విద్యా ప్రచార గేయాలు మున్నగువాటిని సదస్సు కార్యకలాపాలను ప్రఖ్యాత సినిమా డైరెక్టర్ శాంతారామ్ ఆధ్వర్యాన ప్రభుత్వ సమాచారశాఖ వారు ఫిల్ము తీశారు. ఫైర్‌ఫైటింగు ప్రథమ చికిత్స మున్నగు కార్యక్రమాలను విద్యార్థి కార్యకర్తలు ప్రదర్శనలు ఇచ్చారు. భారత కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి కామ్రేడ్ పి. సి. జోషీ అజ్ఞాతవాసం నుండి అప్పుడే బైటికివచ్చి ఈ సదస్సుకు హాజరైన విద్యార్థి పార్టీ సభ్యుల సమావేశంలో ఆనాటి రాజకీయ కర్తవ్యాల గురించి మాట్లాడారు. ఈ సభా సందర్భంలోనే ఢిల్లీలో రమేష్‌చంద్ర - పెరిన్‌ల వివాహం జరిగింది.

# 1942 మే 15 ఢిల్లీ విద్యార్థి కన్వెన్షన్ మరికొన్ని వివరాలు

"పాట్నా మహాసభలో (1941 డిసెంబరు 25-31 తేదీలు) భారత విద్యార్థులు ముందంజ వేసి ప్రపంచ ప్రజల ఫాసిస్టు వ్యతిరేక యుద్ధమే భారత స్వాతంత్ర్య యుద్ధమని చాటి నూతన పంథా యిచ్చారు.

పాట్నా యిచ్చిన నూతన పంథాకు డిల్లీ కార్యాచరణ యిచ్చింది.

జాతీయ రక్షణ మహాసభకు దేశంలోని వివిధ విద్యార్థి సంఘాలకు యువజన సంఘాలకు, ఎ. ఆర్. పి సంఘాలకు ఆహ్వానాలు పంపబడ్డాయి.

మే 15 వ తేదీన ఉదయం మహాసభాధ్యక్షులైన స్వామీ సహజానంద సరస్వతిగారికి స్టేషన్‌వద్ద స్వాగతమిచ్చి ప్రజా యుద్ధ నినాదాలతో గొప్ప విద్యార్థి ప్రదర్శన జరిగింది. మధ్యాహ్నం వివిధ రాష్ట్రాల నుండి వచ్చిన 500 మంది ప్రతినిధులతో విషయ నిర్ణయ సభ జరిగింది. కామ్రేడ్ ఫరూకి "యుద్ధం - జాతీయ రక్షణ" అనే ప్రధాన తీర్మానం ప్రవేశపెట్టారు. సంయుక్త జాతీయ ప్రతిఘటనకోసం, కాంగ్రెస్ ముస్లింలీగ్ ఐక్యతకోసం కొత్త ప్రయత్నం అత్యావసరంగా చేయాలి. దేశరక్షణాధికారం అధీనంలోకి తెచ్చుకొని కాంగ్రెస్ లీగు సంయుక్త మంత్రి వర్గాలు ఏర్పడాలి. జపాన్ శత్రువును ప్రతిఘటించాలి. భారత విద్యార్థులందరూ అందుకు లేవాలి ప్రజావలంటీరు దళాల్లో ఎ.ఆర్.పి. దళాల్లో చేరాలి. యుద్ధం చేస్తున్న సైన్యాలకు సహాయం చేయాలి ప్రజలకు - సైన్యాలకు మధ్య సామరస్యం పెంపొందించాలి.

"విముక్తి పోరాటం అనే మరో తీర్మానంలో ప్రపంచ ప్రజల విముక్తి పోరాటం ప్రారంభమైందనీ, ప్రపంచ సామ్రాజ్య వాదానికి బల్లెపు మొనగానున్న ఫాసిస్టు దురాక్రమణ దారులకు వ్యతిరేకంగా సోవియట్ జాతీయ చైనా, బ్రిటన్ అమెరికా దేశాల ప్రజలు జరిపే యుద్ధం ప్రజా యుద్ధమనీ, అదే భారత విముక్తి పోరాటమనీ" తెలిపారు.

సోవియట్, చైనా, బ్రిటన్ విద్యార్థులకు అభినందన సందేశాలు పంపుతూ వేర్వేరు తీర్మానాలు చేశారు. సభకు వచ్చిన వివిధ విద్యార్థి డిటెన్యూల యిచ్చిన సందేశాలను ఆమోదిస్తూ మరో తీర్మానం చేశారు.

కామ్రేడ్ సజ్జాద్ జహీర్ మహాసభను ప్రారంభించుతూ ప్రజా చొరవతో దేశరక్షణ కార్యకలాపాల్లో పాల్గొనాలని అన్నారు. స్వామీ సహజానంద సరస్వతీ తమ అధ్యక్షోపన్యాసంలో "నేడు ప్రపంచ సామ్రాజ్యవాదం రెండు ముఠాలుగా చీలి బలహీన పడటం ప్రపంచ అభివృద్ధి శక్తులదే పైచేయి అవడం సుస్పష్టం.

చక్కని అవకాశాన్ని వినియోగించుకొని ప్రపంచ ప్రజలు జరుపుతున్న ఫాసిస్టు వ్యతిరేక ప్రజా యుద్ధాన్ని బలపరచడమే మన తక్షణ కర్తవ్యం" అన్నారు.

విద్యార్థుల కోర్కెలు అనే తీర్మానంలో విద్యార్థుల యుద్ధ సమయంలోని అత్యవసర కోర్కెలు, డిమాండ్లు తెలియజేయబడినాయి. యుద్ధ పరిస్థితుల్లో గూడా విద్య తప్పక కొనసాగించాలి. పాఠశాలలు మూసివేయరాదు. విద్యార్థి వేతనాలు తగ్గించాలి. విద్యా విధానంలో సైన్సు, టెక్నికల్ నాలెడ్జి, పారిశ్రామిక విద్యలకు ప్రాధాన్యత యివ్వాలి. మిలిటరీ శిక్షణ., ఎ.ఆర్.పి. ప్రథమ చికిత్స నిర్బంధంగా నేర్పాలి.

ఎ.ఆర్.పి. అనే తీర్మానంలో అన్ని రాష్ట్రాలలోనూ, ముఖ్య పట్టణాల లోనూ అఖిల భారత విద్యార్థి సంఘం ఎ ఆర్. పి. తో సన్నిహిత సంబంధం పెట్టుకొని ప్రజాసామాన్యంతో సంబంధం కలపాలి.

బహిరంగ సమావేశానికి "స్టూడెంట్సు కాల్" సంపాదకుడు కామ్రేడ్ రంగ్‌నేకర్ అధ్యక్షత వహించాడు కామ్రేడ్ సోహన్‌సింగ్ జోషి, విశ్వనాథ ముఖర్జీ, కృష్ణన్, నక్వీ మొదలైన వారు ఫాసిస్టు దురాక్రమణ, జాతీయ ప్రతి ఘటన గురించి మాట్లాడారు.

17 వ తేదీన ఎ.ఆర్.పి. ప్రదర్శనలు జరిగాయి. మహాసభ హాలులో వివిధ రాష్ట్రాల నుండి తెచ్చిన చిత్రాలు ప్రదర్శించారు. సోవియట్ మిత్ర మండలి, పీపుల్సు ప్రోగ్రెసివ్ థియెటరు ఎసోసియేషన్, బొంబాయి విద్యార్థి సంఘాల తరపున ప్రదర్శించిన వాల్ న్యూస్ పేపరు, లెనిన్ కార్నర్ ఫాసిస్టు వ్యతిరేక వ్యంగ్య చిత్రాలు, సోవియట్, చైనా యుద్ధ చిత్రాలు బాగున్నాయి. బొంబాయి ప్రోగ్రెసివ్ థియేటర్ ఎసోసియేషన్ తరపున "నలుగురు కామ్రేడ్స్" అనే నాటిక డిటెన్యూల విడుదల గురించి బెంగాల్ విద్యార్థులు మరో నాటిక ప్రదర్శించారు. వివిధ రాష్ట్రాల విద్యార్థులు ఉత్తేజకరంగా పాటలు పాడారు.

— ప్రజాశక్తి, 17-6-42.

## రాష్ట్రంలో మహాసభలు

తదుపరి రాష్ట్రంలో ఫాసిస్టు వ్యతిరేక పోరాటాన్ని ముందుకు తీసుకుపోవ డానికి అనేక విద్యార్థి సభలు జరిగాయి. తూర్పు గోదావరి జిల్లా విద్యార్థి మహాసభ రామచంద్రాపురంలో 1942 జనవరి 31, ఫిబ్రవరి 1వ తేదీలలో కామ్రేడ్ మోటూరి రాధాకృష్ణ అధ్యక్షతన జరిగింది. కామ్రేడ్ పార్వతికృష్ణన్ సభను ప్రారంభించారు. 150 మంది ప్రతినిధులు జిల్లా అంతటినుండి వచ్చారు.

అధ్యక్షులు, ప్రారంభకులు - వైజ్ఞానిక మహాసభ ప్రారంభకులు జటా వల్లభుల పురుషోత్తంగార్లతో 1000 మంది విద్యార్థులతో ఊరేగింపు జరిగింది.

జి. ఎస్. చౌదరిగారు పతాకోత్సవం జరిపారు. మహాసభకు కా|మేడ్ ఎ. ఎన్. ముఖర్జీ, లలితాశంకర్, చలపతిరావు, శ్రీ విస్సా అప్పారావు, మొసలికంటి తిరుమలరావు, మల్లిపూడి పళ్ళంరాజుగార్లు సందేశాలు పంపారు.

ఆహ్వాన సంఘాధ్యక్షులు మహా సభనంతను మృతవీరుడు కా|మేడ్ పర్వతనేని వెంకటేశ్వరరావుకు అంకితం చేశారు. మహాసభ ఆయనకు జోహార్లు అర్పిస్తూ తీర్మానించింది. (కా|మేడ్ పర్వతనేని వెంకటేశ్వరరావు గుంటూరు జిల్లాలో పుట్టినా తన జీవితాన్ని తూర్పు గోదావరి జిల్లా విద్యార్థి ఉద్యమానికి, జిల్లాలో విప్లవోద్యమాలకు ధారపోశారు. శ్రీ వెంకటేశ్వరరావు ప్రఖ్యాత సంగీత విద్వాంసులు శ్రీ పర్వతనేని వీరయ్య చౌదరిగారి కుమారులు. వీరి తల్లి బొల్లమాంబ. వీరయ్య చౌదరిగారు పెదనందింపాడు పన్నుల నిరాకరణోద్యమంలో పాల్గొని వీరోచితంగా పోరాడి అనేక నిర్బంధనలను ఎదుర్కొన్న దేశభక్తులు. అట్టి కుటుంబంలో పుట్టిన వెంకటేశ్వరరావు గారు విద్య నిమిత్తం కాకినాడ వచ్చి అక్కడ విద్యార్థి ఉద్యమాన్ని నిర్మించడంలో ప్రముఖ పాత్ర వహించారు ఆ తరువాత కాకినాడ కార్మికోద్యమ నిర్మాణంలో కూడా పని చేశారు. రెండవ ప్రపంచ యుద్ధం రాగానే ప్రభుత్వ తీవ్ర నిర్బంధ విధానం ప్రారంభం అయింది. శ్రీ వెంకటేశ్వరరావు అజ్ఞాత వాసంలోకి వెళ్ళి రహస్యంగా ఉన్న జిల్లా కమ్యూనిస్టు కేంద్రాన్ని నిర్వహించుతూండేవారు. పోలీసులు వీరున్న రహస్య కేంద్రంపై దాడి చేయగానే రికార్డ్సును ఉన్న పెట్టెను నెత్తినపెట్టుకొని చీకటిచాటున తప్పించుకొని పోతూండగా అప్పుడే కురిసిన వర్షాలవలన వరద నీటిలో మునిగి నేలబారు నూతిలోపడి రాళ్ళకు తల తగిలి బద్దలైపోయి దారుణమైన మరణానికి గురిఅయ్యారు. రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభంలో ఆంధ్ర దేశంలో ఆహుతి అయిన విప్లవకారులలో వీరే మొదటి వారని చెప్పవచ్చు.)

ఫాసిజం ఓటమికి, సోవియట్ విజయానికి, భారత స్వాతంత్ర్యానికి కృషి చేయాలనీ, మహాసభ తీర్మానించింది. మత కలహాలను నిరసించారు. ఎట్టి షరతులు లేకుండా రాజకీయ ఖైదీలనందరిని విడుదల చేయాలని వాలంటీరు దళాలపైన, వయోజన విద్యా ప్రచారంపైన నిషేధాన్ని తొలగించాలని తీర్మానాలు చేశారు కల్చరల్ బ్రిగేడ్సు ద్వారా వేసవిలో ప్రచారం చేయాలని నిర్ణయించారు.

నూతన సంవత్సరానికి బంధకవి రమణమూర్తిగారిని కార్యదర్శిగా ఎన్నుకొన్నారు. (జిల్లా కార్యదర్శిగా అంతవరకు బాలాజీ దాస్ ఉన్నారు.

## వాలంటీర్ కోర్ 'డే'

వాలంటీరు దళాలపె నిషేధం తొలగించాలని కోరుతూ 20-2-42 న

రాష్ట్ర విద్యార్థి సంఘ కార్యవర్గ సమావేశం పిలుపు యిచ్చింది. ఆ రోజున ఊరేగింపులో సభలు జరిపి ప్రభుత్వాధికారులకు వాలంటీరు దళాలపై నిషేధం తొలగించాలని మెమొరాండాలు సమర్పించాలని తెలియజేశారు. ఈ క్రింది కోర్కెలు కోరాలని తెలిపారు :

1. వలంటీరు దళాలపై నిషేధం తొలగించాలి.
2. వలంటీరు దళ నిర్మాణానికి విద్యార్థులు పూనుకోవాలి.
3. ఆయుధ శాసనం రద్దుకావాలి.
4. ప్రజలను ఆయుధ ధారులను చేయాలి.
5. విద్యార్థులకు ఉచిత నిర్బంధ సైనిక శిక్షణ.
6. విద్యార్థులారా ఫాసిస్టు వ్యతిరేక పోరాటానికి సాగిరండు.
7. ఫాసిజం నశించాలి అనే నినాదాలు యివ్వాలని తెలియజేశారు.

## గుంటూరు పట్టణ విద్యార్థి సంఘ తీర్మానాలు

6-3-1942 వ తేదీన గుంటూరు పట్టణ విద్యార్థి సంఘ అడ్‌హాక్ కమిటీ కామ్రేడ్ ఎస్. టి. రంగాచారి అధ్యక్షతన సమావేశమై దిగువ తీర్మానాలు చేశారు.

1. కలకత్తా మెడికల్ కాలేజి విద్యార్థులు లక్నో విద్యార్థులు చేయుచున్న సమ్మెలను బలపరిచారు. వారికి విప్లవాభివందనాలు పంపించారు.

2. కె.వి.ఆర్. గోపాలన్‌కు మద్రాసు హైకోర్టు విధించిన ఉరిశిక్షను నిరసించుతూ ఆ శిక్షను గవర్నరు గారు రద్దు చేయాలని కోరారు.

3. అఖిల భారత విద్యార్థి సంఘం వారు తీసుకున్న యుద్ధ అనుకూల వైఖరిని బలపరిచారు. ఇది ప్రపంచ ఫాసిస్టు వ్యతిరేక పోరాటంగా మారింది గనుక ఈ యుద్ధ విజయానికి పాటుపడాలని నిశ్చయించారు.

4. ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి సంఘ ఆదేశానుసారం వేసవిలో కల్చరల్ బ్రిగేడ్ కార్యక్రమంలో పాల్గొనాలని నిర్ణయించారు.

5. డిటెన్షను విధానాన్ని నిరసిస్తూ ఈ పద్ధతిని రద్దు చేయాలని విద్యాలయ అధికారులను కోరారు.

## పామర్రు :

పామర్రు విద్యార్థి సంఘం ఆధ్వర్యాన 27-2-1942 వ తేదీన జరిగిన బహిరంగ సభలో తుమ్మల గోపాల కృష్ణయ్యగారు సాంఘిక దురాచారముల గురించి, గోపరాజు రామచంద్రారావు గారు విద్యార్థులు - విజ్ఞానం గురించి, మానికొండ సూర్యావతి సోవియట్ మహిళా ఉద్యమం గురించి చదలవాడ పిచ్చయ్య సారస్వతం గురించి, సరోజిని, కమలకుమారి గార్లు విద్యార్థినులు

కర్తవ్యంపై మాట్లాడారు. కోగంటి గోపాల కృష్ణయ్య-ఫాసిస్టు వ్యతిరేక జాతీయ గీతాలు పాడారు. సభకు శ్రీ మోటూరి రాధాకృష్ణ అధ్యక్షత వహించారు.

1941 జూన్‌లో రాష్ట్రంలో వయోజన విద్యా ప్రచారాన్ని నిషేధించింది. ఆ తరువాత క్రమంగా విద్యార్థి ఉద్యమంపై, వామపక్ష ఉద్యమం పైన ప్రభుత్వ నిర్బంధ విధానం హెచ్చింది

## ప్రభుత్వ నిరంబ్ధ విధానానికి వ్యతిరేకంగా పోరాటం

యుద్ధంపట్ల ప్రతికూల వైఖరిని మార్చుకున్నప్పటికీ విద్యార్థి ఉద్యమం పై ప్రభుత్వ నిర్బంధ విధానం 1942 జూలైలో కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగించేవరకు కొనసాగుతూనే వచ్చింది.

విద్యార్థులు వాలంటీరు దళాలను ఏర్పరచుకొనరాదని ప్రభుత్వం నిషేధించింది. వయోజన విద్యా ప్రచారాన్ని నిషేధించింది.

1942 నవంబరులో పశ్చిమ గోదావరి జిల్లా విద్యార్థి సంఘాన్ని నిషేధించుతూ జిల్లా మెజిస్ట్రేటు ఉత్తరువు చేశాడు అంతకుముందు జిల్లా విద్యార్థి సంఘ ఆర్గనైజరు అయిన పరకాల పట్టాభిరామరావును అరెస్టు చేయడానికి పోలీసులు ఆయన యింటిపైన (కవిటం) ఆయన అత్తవారింటి పైన (గుడివాడ) ఒకేసారి దాడిచేశారు అందుచే విద్యార్థి సంఘాల పేరు లేకుండా పశ్చిమ గోదావరి జిల్లా తణుకు, భీమవరం, మార్టేరు, పాలకొల్లు, నర్సాపురం, ఏలూరు తదితర చోట్ల 'స్టూడెంట్సు కల్చరల్ క్లబ్స్' పేరిట బహిరంగ వేదికలను ఏర్పరచి అటు విద్యార్థి సమస్యలపైన ఆందోళన, ఇటు డిబేటింగు, వ్యాస రచన, కల్చరల్ పోటీలు తదితర వైజ్ఞానిక కార్యక్రమాలను జోడించి నడపటం జరిగింది. విచిత్ర వేషాలు, డిటెన్షను సమస్యపై 'వడపోత' అను నాటకం మున్నగు వాటిని స్టూడెంట్సు కల్చరల్ క్లబ్‌లు ప్రదర్శించాయి.

1942 ఆగష్టులో గాంధీ, నెహ్రూ మొదలైన జాతీయ నాయకులందరి క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలో ప్రభుత్వం అరెస్టు చేసింది. అప్పటికే దేశంపై జపాన్ దండయాత్ర ప్రమాదం ఏర్పడింది. కాకసస్ మీదుగా నాజీ జర్మనీ సైన్యాలు, బర్మా మీదుగా జపాన్ సైన్యాల వచ్చి భారతదేశంలో కలుసుకోవాలని, భారతదేశాన్ని ఆక్రమించుకోవాలని కూడా హిట్లర్ పథకం తయారు చేసుకొన్నాడు.

కాంగ్రెస్ ఆగష్టు ఉద్యమం సందర్భంలో జరిగిన విధ్వంసక చర్యలు భారత దేశంపై ఫాసిస్టు దండయాత్రకు అనుకూలంగా పరిణమిస్తాయి గనుక ఈ విధ్వంసక చర్యలను వ్యతిరేకించాలని కమ్యూనిస్టు పార్టీతోబాటు విద్యార్థి ఫెడరేషన్ నిర్ణయించుకొంది.

విధ్వంసక చర్యలలో విద్యార్థులు పాల్గొనరాదని విద్యార్థి ఫెడరేషన్ ఆధ్వర్యాన జరిపిన సభలను-విద్యార్థి ఫెడరేషన్ నుండి చీలి "విద్యార్థి కాంగ్రెస్" పేరిట వేరే విద్యార్థి సంఘాలను పెట్టుకొన్న కాంగ్రెస్ వాదులు కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ అనుయాయులు-విచ్ఛిన్నం చేయసాగారు. వారి దాడులను ఎదుర్కొంటూ అనేక సందర్భాలలో కొట్లాటలకు సన్నద్ధమవుతూ ఆ రోజుల్లో సభలను జరుపుకో వలసి వచ్చేది. కమ్యూనిస్టులను, విద్యార్థి యువజన సంఘాల వారిని కాంగ్రెస్ వారు జాతీయ విద్రోహులుగా చిత్రించుతూండేవారు.

ఈ విధంగా ఆగష్టు ఉద్యమ కాలంలో బ్రిటిష్ సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాట శక్తులమధ్య చీలిక ఏర్పడినప్పటికీ కమ్యూనిస్టు పార్టీ ప్రజలను అంటి పెట్టుకొని ప్రభుత్వ నిర్బంధ విధానాన్ని ఎదుర్కొంటూ యుద్ధ భారం వలన యిబ్బందులు పాలైన ప్రజలను ఆదుకొంటూ ఉన్నట్లే విద్యార్థి ఉద్యమం కూడా విద్యార్థి సామాన్యాన్ని అంటిపెట్టుకొని ఉంటూ బ్రిటిష్ ప్రభుత్వంపై పోరాడింది.

జాతీయ నాయకులను విడుదల చేయాలనీ, జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పర చాలని, ప్రజలపై యుద్ధ భారాన్ని మోపరాదనీ బెంగాల్ కరువు నివారించాలని విద్యార్థి ఉద్యమం ఆందోళన సాగించింది. జపాన్ యుద్ధ ప్రమాదాన్ని ఎదుర్కొనడానికి విద్యార్థులను సమాయత్తం చేసింది.

## విద్యార్థులకు కామ్రేడ్ పెరిన్ బరూచా విజ్ఞప్తి

1942 క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలో అఖిల భారత విద్యార్థి సంఘ కార్యదర్శిని కామ్రేడ్ పెరిన్ బరూచా ఇలా ప్రకటించారు.

''జాతీయోద్యమం పైన ప్రభుత్వం ఒక క్రూరమైన దెబ్బ కొట్టింది. హింస అరాచక శక్తులకు కళ్ళెం విడవటంలో ప్రభుత్వానిదే ప్రధాన బాధ్యత. ఈ పిచ్చిపని ద్వారా ప్రజలను సంఘటితం గాని తిరుగుబాట్లకు రెచ్చగొట్టి తర్వాత రక్త స్రవంతులతో ముంచివేసి అణచి వేయాలని ప్రయత్నించుచున్నది. ఈ చర్యపై ఒక సంఘటిత రూపంలో దేశమంతటా విద్యార్థులు అసమ్మతి తెలియజేయాలని జాతీయ నాయకులను విడుదల చేయాలని ప్రభుత్వాన్ని కోరాలనీ, స్వాతంత్ర్యం ప్రాతిపదిక మీద జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పరచడానికి గాను కాంగ్రెస్‌తో రాయబారాలు జరుపమని కోరాలనీ, విద్యార్థులను అఖిల భారత విద్యార్థి సంఘం కోరుతోంది. కాంగ్రెసేతర పార్టీలను ముఖ్యంగా ముస్లిం లీగ్‌ను అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్, అఖిల భారత విద్యార్థి సంఘం, అఖిల భారత కిసాన్ సభ మొదలగు పురోగామి శక్తులతో కలిసి ఐక్య కంఠంతో జాతీయ నాయకులను విడిచి పెట్టాలని, జాతీయ ప్రభుత్వం ఏర్పరచడానికి రాయబారాలు ప్రారంభించాలని, ప్రభుత్వాన్ని కోరాలి. స్వాతంత్ర్యాన్ని

గుర్తించాలని. ప్రజా విశ్వాసాన్ని, అన్ని పార్టీల సపోర్టును కలిగియుండే జాతీయ ప్రభుత్వం కావాలనీ, కోరే కాంగ్రెస్ తక్షణ కోర్కెను (కాంగ్రెస్‌తో తమలో తమకు ఎట్టి విభేదములున్నప్పటికీ) సంయుక్తంగా యీ పార్టీలన్నీ, బలపరుస్తున్నాయనే సంగతిని ప్రభుత్వం తెలుసుకొనేటట్లు చేయండి.

విద్యార్థులారా! జాతీయ వాంచకొరకు, నిర్బంధ విధానానికి ప్రతికూలంగా సంఘటిత రూపంలో ప్రదర్శనలు చేయండి. మీ మతులు పోగొట్టుకోకండి రెచ్చగొడితే ఆ వలలో పడకండి. సంఘటితం కాని హింసా చర్యలు జాతీయ ఆత్మహత్యకు దారితీస్తాయి నిరంకుశాధికారుల వలలో పడటమవుతుంది. విద్యార్థులారా! జాతీయ ప్రభుత్వానికి గానూ, జాతీయ ఐక్యతను సాధించడానికి మార్గం సంఘటిత పోరాటమనీ, అభివృద్ధి నిరోధక నిరంకుశాధికారులకు సహాయపడే తాత్కాలిక ఉద్రేక తిరుగుబాట్లు గావని, చెప్పే అఖిల భారత విద్యార్థి సంఘ పాలసీని జ్ఞాపకముంచుకోండి" —ప్రజాశక్తి 19-8-42

అయినప్పటికీ అనేక చోట్ల విద్యార్థులను ప్రభుత్వం అరెస్టు చేసి శిక్షలు విధించింది. పశ్చిమ గోదావరి జిల్లా విద్యార్థి వైజ్ఞానిక దళంపై సమస్యలపై ప్రచారం చేస్తూ వైజ్ఞానిక ప్రదర్శనలు యిస్తూంటే 1942 మే నెలలో 7 గురున్న విద్యార్థి దళాన్ని అరెస్టు చేసింది. సుమారు 5 నెలలు విచారణ జరిపి 6 నెలలు కఠిన శిక్షలు విధించింది. శిక్షలు పొందిన వారిలో పరకాల రమణరావు, వంకా సత్యానారాయణ, నండూరి శ్రీరామారావు, పరకాల శేషావతారం, భూపతిరాజు సుబ్బరాజు, పిట్టల సంజీవరావు, ఎండగండి కమ్యూనిస్టు నాయకుడు పేరిచర్ల సోమరాజు ఉన్నారు. భీమవరం తాలుకా ఎండగండిలో ఈ దళంవారు గాంధీజీని, ఇతర జాతీయ నాయకుల విడుదల చేయాలని, ఆహార సమస్య పరిష్కారానికి ఆహార కమిటీలను వేయాలని ప్రచారం చేశారు. "తిండికోసం" అనే నాటికను ప్రదర్శించారు. విద్యార్థి సంఘ యాజమాన్యాన, కమ్యూనిస్టు పార్టీ "బురకథా"తో కాంగ్రెస్ ప్రచారం చేస్తున్నారనీ, 26 వ రూలు అతిక్రమించారనీ జిల్లా అధికారులు నేరం ఆరోపించారు భీమవరం, తాడేపల్లిగూడెం సబ్ జైళ్ళలో వీరిని ఈ 5 నెలల కాలం నిర్బంధించారు. ఇందులో ఎక్కువ మంది మైనారిటీ తీరని విద్యార్థులే. చివరకు 18-9-1943 న వీరందరికి భీమవరం మేజిస్ట్రేటు 6 నెలలు చొప్పున కఠిన శిక్ష విధించారు. ఇందులో కామ్రేడ్ పి. సోమరాజు (కమ్యూనిస్టు) ఎండగండిలో ఈ విద్యార్థులకు ఆతిధ్యమిచ్చిన నేరం క్రింద అదే శిక్షకు విధించబడ్డారు. (ప్రజాశక్తి 29-9-43)

ఈ విద్యార్థులలో నలుగురు మార్టేరు హైస్కూలు విద్యార్థులు. ఇద్దరు తణుకు విద్యార్థులు. వీరి కేసు భీమవరం సబ్ కోర్టులో విచారణ జరిగినప్పుడు మార్టేరు

హైస్కూలు హెడ్మాస్టరు, బ్రిటన్ ప్రభుత్వ అనుకూలవాది అయిన శ్రీ బి. వి నారాయణగారు వీరందరు ప్రభుత్వ విద్రోహ కార్యకలాపాలలో పాల్గొంటు న్నారని సాక్ష్యం యిచ్చారు. తన విద్యార్థులకు వ్యతిరేకంగా ఒక అధ్యాపకుడు కోర్టులో సాక్ష్యం యిచ్చి వారిని శిక్షలకు గురి అయ్యేటట్లు చేయడం ఆ రోజులలో ఇది ప్రథమం. ఆ స్కూలు ఉపాధ్యాయులు, ఆ పట్టణ ప్రజలు గూడా హెడ్మాస్టరు చర్యను నిరసించారు. అంతకు ముందు ఇదే హెడ్మాస్టరు, పాత విద్యార్థుల సంఘ వార్షికోత్సవంలో తన చర్యలను విమర్శించుతూ మాట్లాడిన పరకాల రమణరావును టి.సి. యిచ్చి స్కూలునుండి వెళ్ళగొట్టారు.

ఎండగండిలో అరెస్టయి, ఆనాటి బ్రిటిష్ సామ్రాజ్య వాద వ్యతిరేక పోరాటంలో పాల్గొని స్వాతంత్ర్య సమర యోధులుగానూ, దేశభక్తులుగానూ తయారైై ఈ విద్యార్థి కార్యకర్తలందరూ ఆ తరువాత యించుమించు అందరూ కమ్యూనిస్టు ఉద్యమంలోకి వచ్చి ముఖ్య కార్యకర్తలుగా పనిచేశారు.

## ఇతరచోట్ల నిర్బంధ విధానం

కర్నూలు విద్యార్థి సంఘ ఆర్గనైజరు జి. వెంకటరెడ్డి గారికి సంవత్సరం కఠిన శిక్ష విధించబడింది. (14-10-42)

గుంటూరు పట్టణంలో విద్యార్థిగా ఉన్న కామ్రేడ్ వై.వి. బసవయ్య గారిని సుమారు 10 రోజుల క్రితం అరెస్టు చేశారు. (నవశక్తి 7-10-42).

1-10-42 వ తేదీన ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి సంఘ కార్యదర్శి కామ్రేడ్ మోటూరి రాధాకృష్ణను, జిల్లా విద్యార్థి సంఘ ఆర్గనైజరు కామ్రేడ్ ఎన్. వెంకటస్వామిని, బాపట్ల తాలూకా యువజన సంఘ ఉపాధ్యక్షులైన కామ్రేడ్ బ్రహ్మాండం సుబ్బారావుగారలను అరెస్టు చేశారు.

గుంటూరులోనే 5 వ ఫారం విద్యార్థి కామ్రేడ్ జి. నాగభూషణంను 1-10-42 న పోలీసులు అరెస్టు చేశారు.

1942 సెప్టెంబరు 5 వ తేదీన గుంటూరు జిల్లా విద్యార్థి సంఘ ఆర్గనైజరు కమ్యూనిస్టు అయిన మోటూరి కట్టయ్యను పోలీసులు అరెస్టు చేశారు. మరునాడు ఆయన సామానును సోదా చేశారు. ఏ విధమైన నిషిద్ధ గ్రంథాలు దొరకలేదు. అంతకు ముందు గుంటూరు పట్టణ విద్యార్థి సంఘ కార్యదర్శి ఎస్.టి. రంగాచారిని అరెస్టు చేశారు. (16-9-42 ప్రజాశక్తి)

## పౌరసత్వ హక్కుల దినం - నిర్బంధ విధానానికి ఖండన

ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ కార్యవర్గం 1943 సెప్టెంబరు 11, 12 13 తేదీలలో గుంటూరులో సమావేశమై ప్రభుత్వ నిర్బంధ విధానాన్ని ఇలా ఖండించింది.

"పశ్చిమ గోదావరి జిల్లాలో విద్యార్థి సంఘ దైనందిన కార్యక్రమాలు, మీటింగులు 56 వ సెక్షన్ క్రింద నిషేధించబడినాయి. కాకినాడ, అనంతపురం మొదలగు చోట్ల విద్యార్థి సంఘాల మీటింగులకు అనుమతి యివ్వడం జరుగలేదు. కాన, ఈ కనీస పౌరసత్వ హక్కులు సాధించడానికి అక్టోబరు 20 వ తేదీన పౌరసత్వ హక్కుల దినం" జరపాలి. ఆనాడు మీటింగులు పెట్టి పై చర్యలు ఉపసంహరించుకోవాలని తీర్మానాలు చేసి, ఆయా జిల్లా కలెక్టర్లకు మద్రాసు ప్రభుత్వానికి పంపాలి. మహజర్లపై సంతకాలు చేయించి పంపాలి. (ప్రజాశక్తి, 13-10-43).

ఏలూరు తాలూకా యువజన సంఘం, పట్టణ విద్యార్థి సంఘం, యువజన సంఘం, ప్రెస్ కార్మికసంఘాల ఆధ్వర్యాన ఊరేగింపు బహిరంగ సభలు జరిగాయి. సభకు శ్రీ సత్తి రాజు రామమూర్తిగారు (జిల్లా కాంగ్రెస్ సంఘ కార్యదర్శి) అధ్యక్షత వహించారు. అత్తలూరి సర్వేశ్వరరావు, బనిసెట్టి అప్పారావు, కె. పోతురాజు, కరణం సింహాచలం, పేటేటి వెంకటరత్నం, ఆకుల వెంకట సుబ్బారావు గార్లు మాట్లాడుతూ రాజకీయ ఖైదీలందర్నీ విడుదల చేయాలనీ, ఫాసిజానికి వ్యతిరేకంగా ప్రజలను సమీకరించే నాయకుల విడుదల అత్యవసరమని కోరారు. (ప్రజాశక్తి, 22-7-1942).

## అనంతపురం విద్యార్థుల పోరాటం

అనంతపూర్ జిల్లా విద్యార్థి నాయకులు కామ్రేడ్స్ ఎన్. రాజశేఖర రెడ్డి (బెనారస్ విద్యార్థి) వి కె. ఆదినారాయణరెడ్డి, తిరుమలరెడ్డి మొదలైన 8 గురు విద్యార్థులు 1942 సెప్టెంబరు 10వ తేదీన అరెస్టు చేయబడ్డారు. అనంతపూర్ కాలేజీ లేబరేటరీని తగులబెట్టబడిన సందర్భంలో వారిపై మిథ్యారోపణలతో ఈ అరెస్టులు జరిగాయి. జిల్లా విద్యార్థి నాయకత్వాన్నంతా జైలులో పెట్టారు. ఇందుపై ఆనాటి రాష్ట్ర విద్యార్థి సంఘ ప్రముఖులు శ్రీ ఎస్. వి. కె. ప్రసాద్ ఒక వ్యాసం ప్రజాశక్తిలో వ్రాస్తూ ఇలా తెలిపారు.

"కాలేజీ లేబరేటరీకి సంభవించిన ఈ దురదృష్ట సంఘటనకు ప్రతివారు చింతించవలసిందే. ఇది కేవలం ఒక అరాచక చర్య. ఈ చర్యలు స్వాతంత్ర్య సంపాదనకు సాధనాలని ఎవరూ నమ్మరు. ఇట్టి అరాజక చర్యల నుండి విద్యార్థులను కాపాడిన ఈ విద్యార్థి నాయకులు, ఇట్టి చర్యలకు పూనుకుంటారని, సహాయం చేస్తారని ఎవరూ నమ్మరు. ఇక వీరి నేరం ఏమిటి? అనంతపురం జిల్లాలో విద్యార్థి ఉద్యమాన్ని నిర్మించడమే వీరి నేరం. ఈ జాతీయ క్లిష్ట పరిస్థితుల్లో విద్యార్థుల ఐక్యత కాపాడి విద్యార్థులను సంఘటితంగా ఉంచడమే వీరి నేరం. ప్రజా సేవవల్ల వారి ప్రేమకు పాత్రులై అనంతపూర్ జిల్లాలో-ముఖ్యంగా

అనంతపురంలో విద్యార్థి ఉద్యమాన్ని ప్రధానశక్తిగా చేసి ప్రజల స్వాతంత్ర్యానికి పాటుబడటమే వీరు చేసిన నేరం.

"జులై నెలలో జిల్లాలో కలరా తీవ్రంగా వ్యాపించినప్పుడు దీని నివారణకు జిల్లా విద్యార్థి ఫెడరేషన్ ఎంతో కృషి చేసింది. ఆరోగ్యసూత్రాల బోధన, త్రాగే నీటిని పరిశుభ్రపరచడం, కల్లు-సారా దుకాణాలను మూయించడం, కలరా టీకాలు వేయించడం, దళాలుగా పల్లెటూళ్ళకు వెళ్ళడం మొదలైన విస్తృత కార్యక్రమం చేపట్టి కలరా వ్యాపించకుండా అరికట్టగల్గారు. అలాగే అన్ని వస్తువులను కంట్రోలు ధరలకు అమ్మించడంలో విశేష కృషి చేశారు. సంతరోజుల్లో కంట్రోలు ధరలను తెలిపే అట్టలను ప్రతీ దుకాణం దగ్గర పట్టుకొని నిల్చోవడం, అధిక ధరలకు వస్తువులను అమ్మే వర్తకులను అరెస్టు చేయించడం, జరిమానాలు విధింపజేయడం, తప్పు కొలతలు, తప్పు తూనికలు పట్టించివేయడం, మొదలైన కృషి చేశారు.

"జాతీయ నాయకుల అరెస్టు పట్ల విద్యార్థి లోకంలో తీవ్ర ఆగ్రహావేశాలు పెల్లుబికినప్పుడు ఈ నిరసన ప్రదర్శనలకు క్రమబద్ధంగా నాయకత్వం వహించి అరాచకచర్యలకు దిగకుండా చూశారు. 1942 సెప్టెంబరు 10వ తేదీన కాలేజీ, మూడు హైస్కూళ్ళ విద్యార్థుల సమ్మె, 3000 మందితో పెద్ద ఊరేగింపు మున్నగు వాటికి వి. కె. ఆదినారాయణరెడ్డి, యల్లయ్యగారు నాయకత్వం వహించారు. పరిమితి లేని సమ్మెవల్ల విద్యార్థి ఐక్యత చెడుతుందనీ, ఇది హానికరమనీ నచ్చచెప్పి వారించారు. 12వ తేదీనుండి ప్రభుత్వ నిర్బంధ విధానానికి వ్యతిరేకంగా మరల సమ్మె ప్రారంభమైనప్పుడు ఈ కామ్రేడ్సు వారి నుండి విడివడిపోక విద్యార్థులలోనే ఉండి, తమ పాలసీని ప్రచారం చేస్తూ వచ్చారు. సెప్టెంబరు 24 న కాలేజీ గేట్లువద్ద నున్న విద్యార్థులపై రిజర్వు పోలీసులు తుపాకి మడమలతో, లాఠీలతో కొట్టినప్పుడు, ఈ కామ్రేడ్సు ధైర్యంతో విద్యార్థుల మధ్య నుండి, ఆ దెబ్బలకు గురి అయ్యారు. వలంటీర్లుగా పనిచేస్తున్న స్త్రీ విద్యార్థి కామ్రేడ్స్ 15 మంది ధైర్యంగా నిలబడ్డారు. ఇందులో ఆర్గురికి గాయాలు తగిలాయి. విద్యార్థులందరూ నిర్మాణయుతంగా బెదరిపోయేటట్లు విద్యార్థి కామ్రేడ్స్ చూశారు. క్రమేణా సమ్మె ఉధృతం తగ్గింది. మరల సమ్మె చేయాలని కొందరు విద్యార్థులు పట్టు పట్టినప్పుడు సమ్మె విషయమై అందరు విద్యార్థులు కలిసి నిర్ణయించాలని చెప్పి కామ్రేడ్స్ ఆదినారాయణ రెడ్డి, తిరుమల రెడ్డి విద్యార్థుల సభలో, ఇట్టి సమ్మెలవల్ల అరాజక చర్యలవల్ల విద్యార్థుల ఐక్యత ఎట్లు నాశనమయ్యేది విశదపరిచారు. విద్యార్థులు అధిక భాగం సమ్మెకు వ్యతిరేకంగా ఓటు

చేసి, సమ్మె రాకుండా చేశారు. సమ్మెకనుకూలురు కూడా విద్యార్థుల ఐక్యత కాపాడి సమ్మెకు పూనుకోకుండా మానివేశారు.

"ఈ పరిస్థితుల్లో సెప్టెంబరు 10 న కాలేజీ కెమిస్ట్రీ లేబొరేటరీ తగులబెట్ట బడింది. లక్ష రూపాయల నష్టం జరిగింది. స్థానిక పోలీసులు వెంటనే ఈ కామ్రేడ్సునందరిని అరెస్టుచేసి కుట్ర క్రింద కేసు పెట్టారు. అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్ పాలసీని పూర్తిగా అనుసరించిన ఈ 8 మంది విద్యార్థి కామ్రేడ్సు అనంతపూర్ విద్యార్థి ఉద్యమాన్ని నిర్మించారు. నడిపారు. అనంతపూర్‌లో బలమైన రాజకీయ శక్తిగాచేశారు. విద్యార్థి సంఘం, విద్యార్థుల, ప్రజల ప్రేమను సహాయాన్ని సంపాదించింది. నిర్బంధ విధానం విద్యార్థులలోని ఐక్యతను బలాన్ని చెడగొట్టలేకపోయింది. ఈ అరెస్టుల ద్వారా విద్యార్థుల ఐక్యతను, బలాన్ని విచ్ఛిన్నం చేయాలని ప్రయత్నం జరుగుతూంది. నూతనంగా అభివృద్ధి అయి, జిల్లాలో స్వాతంత్ర్యోద్యమానికి అగ్రగామిగా ఉన్న విద్యార్థి సంఘాన్ని విచ్ఛిన్నం చేయాలని ప్రయత్నం జరుగుతోంది.

"ఇదే సమయంలో కాలేజీ ప్రిన్సిపాల్ తన నిరంకుశ నిర్బంధ విధానాన్ని ప్రారంభించారు. అరెస్టయిన కాలేజీ విద్యార్థులందరిని కాలేజీ నుండి తొలగించాడు. జరిమానాలు వేశాడు. మన కామ్రేడ్సుకు ఈ క్లిష్ట పరిస్థితులలో అండగా నిలబడాలి. అనంతపూర్ విద్యార్థి ఉద్యమాన్ని రక్షించాలి. అనంతపూర్ విద్యార్థి సంఘానికి (టాగూర్ లాడ్జి, న్యూటౌన్) సంఘీభావం తెల్పుతూ తీర్మానాలు చేసి పంపండి. వారి డిఫెన్స్‌కై మీకు చేతనైనంతవరకు ధనం వసూలు చేసి ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి సంఘానికి పంపండి!''

—ప్రజాశక్తి వారపత్రిక, 14-10-1942

## రాష్ట్ర వ్యాపిత ఆందోళనకు విజ్ఞప్తి

ఈ సందర్భంలోనే రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ కార్యదర్శి యిలా విజ్ఞప్తి చేశారు.

"అనంతపురంలో విద్యార్థులపై పెట్టబడిన కేసులో సాక్ష్యానికై పోలీసులు విద్యార్థులనేకులను భయపెడుతున్నారు. ఈ కేసు విచారణకై స్పెషల్ కోర్టును ఏర్పాటు చేయాలని ప్రభుత్వాన్ని పోలీసులు కోరారు. స్పెషల్ కోర్టు తీర్పుపై అప్పీలు ఉండదు. ఈ విధంగా అనంతపుర విద్యార్థి ఉద్యమాన్ని విచ్ఛిన్నం చేయడానికి ప్రయత్నిస్తున్నారు. ఈ కుట్రను భగ్నం చేసి వెంటనే వీరందరిని విడుదల చేయాలని ఆందోళన చేయాలి."

# ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ పిలుపు

ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ వర్కింగ్ కమిటీ సమావేశం 1942 అక్టోబరు 16 వ తేదీ నుండి 19 వరకు జరిగింది. సమావేశం ఈ దిగువ తీర్మానాలు ఆమోదించింది.

"మన జాతీయోద్యమంలో విషమ పరిస్థితులేర్పడిన తరువాత జరిగిన ప్రథమ సమావేశం యిదే. సమావేశానికి 6 జిల్లాల నుండి 13 మంది సభ్యులు వచ్చారు. అరెస్టుల వల్ల, రాయలసీమ నుండి ఎవరూ రాలేకపోయారు. జిల్లా ప్రతినిధులిచ్చిన రిపోర్టులను ఆధారంగా తీసుకొని విద్యార్థి ఉద్యమంలో జాతీయ సంక్షోభం యొక్క ఫలితాలు సాకల్యంగా చర్చించబడ్డాయి. ఈ చర్చల ఫలితంగా అనేక మంది సోదర విద్యార్థులు తాత్కాలికంగా మన నుండి వేరుపడినప్పటికీ తిరిగి నేడు ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ వైపుకు వస్తున్నారు. స్కూళ్ళు, కాలేజీలు పూర్తిగా మానివేయాలని ప్రారంభించిన ఉద్యమంలో ఫల శూన్యతను తెలుసుకొని, సరియైన మార్గమేదో తెలుసుకోడానికి, మన వద్దకు వస్తూన్నారు. కొన్ని చోట్ల ఫార్వర్డు బ్లాకు అనుచరులు, కొన్ని చోట్ల గుడ్డి దేశభక్తులు పోటీగా విద్యార్థి సంఘాలు స్థాపించడానికి ప్రయత్నించినప్పుడు అచటి విద్యార్థులు విముఖత చూపి యున్నారు. కృష్ణా జిల్లా పామర్రులో ఫార్వర్డు బ్లాక్ వారికి బుద్ధి చెప్పి తరిమివేశారు. ఈ సంక్షోభంలో కొత్తగా రాజకీయ చైతన్యం పొందిన విద్యార్థి సోదరులు అనేక మంది జాతీయైక్యతా పాలసీని అంగీకరించి, విద్యార్థి సంఘాలను బలపరుస్తున్నారు. విద్యార్థి సంఘమే లేని పాలకొల్లులో ఈ నూతన కామ్రేడ్స్ బలమైన విద్యార్థి సంఘాన్ని నిర్మిస్తున్నారు.

## అనంతపూర్ విద్యార్థులకు జేజేలు

అనంతపూర్ విద్యార్థుల వీరోచిత పోరాటానికి వర్కింగ్ కమిటీ జేజే లర్పించింది. వారి అరెస్టులను ఖండించింది. వెంటనే వారిని విడుదల చేయవలసిందని ప్రభుత్వాన్ని కోరింది. అరెస్టు చేయబడిన రాష్ట్ర ఫెడరేషన్ కార్యదర్శి శ్రీ మోటూరి రాధా కృష్ణను, మరి యిద్దరు కామ్రేడ్సును విడుదల చేయాలని కోరింది. డిసిప్లిన్ పేరుతో అనేక స్కూళ్ళలోనూ, కాలేజీలలోనూ జరిగే అమానుష చర్యలను ఖండించింది. అట్టి చర్యలను విద్యార్థులు తమ ఐక్యతాబలంతో ఎదుర్కోవాలని హెచ్చరించింది.

## జాతీయైక్యతా వాదం

ప్రస్తుత విషమ పరిస్థితుల నుండి బైటపడాలంటే, విద్యార్థులందరూ కార్యరంగంలో దూకి జాతీయైక్యతకు పాటుపడాలి. నవంబరు 1 నుండి 8 వరకు ఆంధ్ర దేశమందలి విద్యార్థులందరూ యితర పార్టీల సహకారంతో "జాతీయైక్యతా

వాదం"ను జయప్రదంగా జరుపవలసిందని, రాష్ట్ర వర్కింగ్ కమిటీ విజ్ఞప్తి చేసింది ఆ వారంలో విద్యార్థులందరూ యిదివరకెన్నడూ ప్రదర్శించని పట్టుదలతో జాతీయైక్యతా ఉద్యమాన్ని ముందుకు తీసుకు పోవలసిందిగా వర్కింగ్ కమిటీ ఆశిస్తోంది.

—ఎస్.వి.కె. ప్రసాద్ వ్యాసం - ప్రజాశక్తి 28-10-42

గుంటూరు పట్టణ విద్యార్థి సంఘ యాజమాన్యాన బహిరంగ సభలు జరుపుకోడానికి అనుమతి లేనందున విద్యార్థుల గదుల్లో 13 సమావేశాలు ఏర్పాటు చేయబడ్డాయి.

అనంతపురం విద్యార్థులను వెంటనే విడుదల చేయాలనీ, దక్షిణ ఆర్కాటు జిల్లాలో 20 మంది విద్యార్థులను ఎక్స్టరన్ చేసిన జిల్లా మెజిస్ట్రేటు చర్యను ఖండిస్తూనూ ఈ ఆర్డరును రద్దు చేయాలని కోరుతూనూ, విద్యార్థులను డిస్మిస్ చేయుట మొదలైన నిరంకుశ చర్యలు సాగిస్తున్న అన్నామలై యూనివర్శిటీ వైస్ చాన్సలర్ చర్యను ఖండించుతూనూ, ఆ సమావేశాలలో తీర్మానాలు చేశారు.

పశ్చిమ గోదావరి జిల్లా పాలకొల్లు, మారుటేరు విద్యార్థి సంఘాల వారు కూడా అనంతపురం విద్యార్థి నాయకుల విడుదలను కోరుతూ తీర్మానించారు.

బెజవాడ విద్యార్థి సంఘం 300 మంది విద్యార్థుల సంతకాలతో మద్రాసు ప్రభుత్వానికి ఒక మహజరు పంపుతూ, ఫాసిస్టు ప్రతికూలురైన అనంతపురం విద్యార్థి నాయకులు, లేబరేటరీని తగులబెట్టడం వంటి విధ్వంసక చర్యలకు పాల్పడ్డారనీ ఈ కేసు రుజువు చేయలేక పోలీసులు స్పెషల్ కోర్టు ఏర్పరచాలని ప్రభుత్వాన్ని వత్తిడి చేస్తున్నారనీ ఇది పూర్తిగా అన్యాయమనీ, అందుచేత వారిని వెంటనే విడుదల చేయాలని కోరారు.

అలాగే తూర్పు గోదావరి జిల్లా రామచంద్రాపురంలో ఇదేవిధంగా అనంతపూర్ విద్యార్థి పోరాటంపై తీర్మానాలు చేశారు.

రేపల్లె విద్యార్థి సంఘం 29-10-42 వ తేదీన సమావేశమై అనంతపూర్ విద్యార్థుల ఆదర్శ కృషిని అభినందిస్తూ వారి నాయకులను అరెస్టు చేసినందుకు అసమ్మతి తెలుపుతూ వారిని విడుదల చేయాలని కోరింది.

బెజవాడ విద్యార్థి సంఘం 26-10-42న సమావేశమై అనంతపూర్ విద్యార్థులను వెంటనే విడుదల చేయాలని ప్రిన్సిపాల్ విద్యార్థులను కాలేజీ నుండి వెళ్ళగొట్టుట జరిమానాలు విధించుట అన్యాయమనీ వాటిని రద్దు చేయాలని కోరుతూ తీర్మానించింది.

తటారి గ్రామంలో విద్యార్థులు బేషరతుగా అనంతపురం విద్యార్థులను విడుదల చేయాలని స్పెషల్ కోర్టు ఏర్పరచరాదనీ కోరుతూ తీర్మానించారు.

ఈ రాష్ట్రవ్యాపిత ఆందోళన ఫలితంగా చివరకు 1942 సెప్టెంబరు 10వ తేదీన కెమిస్ట్రీ లేబరేటరీని తగులబెట్టారనే ఆరోపణపై అరెస్టు చేయబడిన నీలం రాజశేఖర రెడ్డి మొదలైన 8 మంది విద్యార్థులను డిసెంబరు 17 వ తేదీన స్పెషల్ మెజిస్ట్రేట్ విడుదల చేశారు. రాష్ట్రమంతటా విద్యార్థులు చేసిన ఆందోళనకు ఘనవిజయం లభించింది.

## కొల్లూరు హైస్కూలు విద్యార్థుల విజయం

గుంటూరు జిల్లా కొల్లూరు హైస్కూలు విద్యార్థులను "వార్ ఫ్రంటులో" చేరాలని విద్యాధికారులు నిర్బంధించారు. కాని విద్యార్థులందరూ తిరస్కరించి తమ ఐక్యతా బలాన్ని ప్రదర్శించారు. గుంటూరు ట్రైనింగు స్కూలులో ఒక విద్యార్థి ఇందుకు నిరాకరించినందుకు సంజాయిషీ అడుగుతూ డి. ఇ. ఓ. నోటీసు పంపితే ఆ విద్యార్థి దానికి జవాబుగా తాను వార్ ఫ్రంటులో చేరవలసిన అవసరమేమీ లేదనీ, నిర్బంధించితే కోర్టులో ఫిర్యాదు చేస్తానని వ్రాశాడు - ప్రజాశక్తి 22-12-42

## విద్యార్థులకు కిరసనాయిల్ సప్లయి

కైకలూరు, గుడివాడలలో విద్యార్థి సంఘం గావించిన ఆందోళన ఫలితంగా ప్రభుత్వాధికారులు కంట్రోలు ధరకు కిరసనాయిల్ సప్లయి చేయడానికి అంగీకరించారు. కైకలూరులో స్కూలు ఫైనల్ విద్యార్థులకు మాత్రం నెలకు రెండు డబ్బాల లోపున శాంక్షన్ అయ్యింది. గుడివాడ విద్యార్థులందరికి నెలకు 5 డబ్బాలు శాంక్షన్ అయింది. విద్యార్థి సంఘం తరపున విద్యార్థులు దీనిని పంచుతున్నారు.

## జాతీయ వాంఛా దినం

గుంటూరులో 100 మంది విద్యార్థులు ఊరేగింపు బహిరంగసభ జరిపారు. కామ్రేడ్ మోటూరి హనుమంతరావు గారు అధ్యక్షత వహించారు. ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ కార్యదర్శి శ్రీ మోటూరి రాధాకృష్ణ శ్రీ కంభంపాటి శ్రీరామమూర్తి, భాస్కరరావు గార్లు ఉపన్యసించారు.

కాకినాడలో 300 మంది విద్యార్థులు కార్మికులు కలిసి ఊరేగింపు, సాయంత్రం కాలేజీ ఎదుట బహిరంగ సభ జరిపారు. 500 మంది సభలో పాల్గొన్నారు. సభకు బాలకృష్ణ అధ్యక్షత వహించారు. కె. అప్పారావు, మేకా పట్టాభిరామయ్య ఉపన్యసించారు. కొంతమంది రౌడీలు మీటింగు పాడుజేయడానికి ప్రయత్నించారు. కాని విఫలమయ్యారు. జాతీయైక్యతకు వెంటనే కృషి చేయవలసిందిగా ఎ.ఐ.సి.సి. కి టెలిగ్రాము పంపారు.

రామచంద్రాపురం (తూ. గోదావరి జిల్లా) విద్యార్థి సంఘం ఆధ్వర్యాన పెద్ద ఊరేగింపు, బహిరంగ సభ జరిగాయి. కామ్రేడ్ బి. వి. రమణమూర్తి (జిల్లా విద్యార్థి సంఘ ఫెడరేషన్ కార్యదర్శి) వి. ఎస్. ఆర్. దీక్షిత్ గార్లు ఉపన్యసించారు.

రాజమండ్రి ఆర్ట్సు కాలేజీ విద్యార్థులు 13-8-42 న సమ్మె చేశారు. శ్రద్ధానంద ఘాట్‌లో కామ్రేడ్ బాలాజీదాస్ అధ్యక్షతన బహిరంగ సభ జరిగింది. 14-8-42 న ట్రైనింగు స్కూలు విద్యార్థులు మున్సిపల్ హైస్కూలు విద్యార్థులు సమ్మె చేశారు. జాతీయ నాయకులు విడుదల కోరుతూ తీర్మానించారు.

## విజయనగరంలో అరెస్టు

1942 సెప్టెంబరు 21 న విజయనగరంలో విద్యార్థి నాయకులు కామ్రేడ్ కోడుగంటి గోవిందరావు, తదితరులను విద్యార్థులకు రెచ్చగొడుతున్నారనే ఆరోపణతో పోలీసులు అరెస్టు చేశారు.

ఆగష్టు ఆఖరు వారంలో తణుకులో హరిజన హాస్టల్ విద్యార్థులకు కామ్రేడ్ వంకా సత్యనారాయణ ఎ. ఆర్. పి. ట్రైనింగు యిచ్చారు. 75 మంది విద్యార్థులు ఇలా ట్రైనింగు పొందారు.

మారుటేరులో పరకాల శేషావతారం సెప్టెంబరు 4 వ తేదీనుండి విద్యార్థులకు ఎ. ఆర్. పి. ట్రైనింగు యిచ్చారు.

**కాకినాడ :-** కాకినాడ విద్యార్థి సంఘం 4 వ వార్షికోత్సవం 1942 సెప్టెంబరు 26 వ తేదీన కామ్రేడ్ జి. బాలాజీదాస్ అధ్యక్షతన జరిగింది. మహాసభలో జాతీయ నాయకుల విడుదల గురించిగాని, నిర్బంధ విధానాన్ని ఖండిస్తూ గాని తీర్మానాలు చేయకూడదని స్థానిక ప్రభుత్వోద్యోగులు పోలీసులు ఉత్తర్వులిచ్చారు. అయినప్పటికీ మహాసభ జరిగింది. జాతీయైక్యత గురించి, విద్యార్థులలో ఉపన్యాస పోటీలు జరిగాయి. కామ్రేడ్ కె. వెంకట్రావు జండా ప్రతిష్టాపన చేశారు. కామ్రేడ్ శౌరి కృష్ణమూర్తి చిత్రకళా ప్రదర్శన జరిపారు. శ్రీ కె వి. నారాయణరావు గారు ఈ మహాసభను ప్రారంభించుతూ నాటి బానిస విద్యా విధానాన్ని ఖండించారు. పాట్నా అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్ చూపిన పంథాను విద్యార్థులంతా బలపరచవలసిందని హెచ్చరించారు. 27 వ తేదీన జరిగిన వైజ్ఞానిక మహాసభకు సుప్రసిద్ధ రచయిత శ్రీ ముద్దుకృష్ణ అధ్యక్షత వహించారు. ఉపన్యాసాలు, వ్యాస రచన సంగీత పోటీలలో విద్యార్థులు పాల్గొన్నారు. పిమ్మట కొన్ని నాటకాలు ప్రదర్శించబడ్డాయి.

**పాలకొల్లు :-** పాలకొల్లు విద్యార్థి సంఘం ఆధ్వర్యాన 1942 సెప్టెంబరు 5 వ తేదీన 100 మంది విద్యార్థులు - తెల్ల కాగితాలును కంట్రోలు ధరలకు

యిప్పించాలని సబ్ కలెక్టర్ వద్దకు రాయబారం వెళ్ళారు. దస్తా ఒక్కంటికి 0-3-9 చొప్పున, ప్రభుత్వం కంట్రోలు చేస్తే, మార్కెట్లో 8 అణాలకు, 9 అణాలకు కూడా అమ్ముతున్నందున, అలాంటి వర్తకులపై చర్య తీసుకోవాలని కోరారు. సబ్ కలెక్టరు స్థానిక వర్తకులతో సంప్రదించి ఏర్పాట్లు చేస్తానని వాగ్దానం చేశారు.

విజయనగరం పట్టణ విద్యార్థి సంఘ యాజమాన్యాన 16-12-42 వ తేదీన పట్టణ తృతీయ విజ్ఞాన మహాసభ జయప్రదంగా జరిగింది. కామ్రేడ్ సెట్టి ఈశ్వరరావు విద్యార్థి పతాకోత్సవం జరిపారు. సమావేశానికి కామ్రేడ్ వై. విజయకుమార్ అధ్యక్షత వహించారు. కామ్రేడ్ రామలింగయ్య ప్రారంభోత్సవం చేశారు. కామ్రేడ్ కె. గోవిందరావు ఐక్యతా తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. జాతీయ విద్యార్థి సంఘానికి చెందిన నల్గురు ఈ తీర్మానాన్ని వ్యతిరేకించబోయి భంగపాటు చెందారు · అంతకు ముందు 4 రోజులు వరుసగా గోడలమీద "కమ్యూనిస్టులు దేశద్రోహులని వీరు చిత్రాలు చిత్రించారు. కాని తీరా వేదిక ఎక్కి అరాజక చర్యలు తమ పంథా కాదని ఒప్పుకున్నారు. ఐక్యతా తీర్మానాన్ని ఏకగ్రీవంగా ఆమోదించబడింది. సాయంత్రం వైజ్ఞానిక సభకు 1200 మంది హాజరయ్యారు. సమాజం - సాహిత్యం, రచయితలు - ప్రజలు మొదలైన విషయాలపై ఉపన్యాసాలీయబడ్డాయి. తరువాత దేశభక్తులు అనే నాటకం వేయబడింది. చిట్టివలస కార్మికులు బుర్రకథ చెప్పారు.

బెజవాడ విద్యార్థి సంఘ సప్తమ వార్షికోత్సవం 1942 ఆగష్టు 1, 2 తేదీలలో జరిగింది. 1 వ తేదీ ఉదయం విద్యార్థి సంఘ జండాలతో ఊరేగింపు జరిగింది. కామ్రేడ్ టి. వెంకటేశ్వరరావుగారు విద్యార్థి సంఘ జండా ఎగురవేశారు. సాధారణ సంఘ సమావేశానికి కామ్రేడ్ ఎమ్. రాధాకృష్ణ ఎమ్.ఎ.గారు (ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి సి ఎం.ఎ కార్యదర్శి) అధ్యక్షత వహించారు. ఆర్. వి. రంగారావు సాంవత్సరిక నివేదిక ప్రవేశపెట్టారు.

తరువాత యుద్ధము జాతీయ ప్రతిఘటన, యుద్ధకాలపు విద్యార్థుల కోర్కెలు రాజకీయ ఖైదీల విడుదల గురించి తీర్మానాలు గావించారు. నూతన సంవత్సరానికి ఐ. ముత్యాలు కార్యదర్శిగానూ, ఎ. బి గంగాధరం సహాయ కార్యదర్శిగానూ ఎన్నుకోబడ్డారు. సాయంత్రం మహాసభకు కామ్రేడ్ కంభంపాటి సత్యనారాయణ (జూనియర్) అధ్యక్షత వహించారు. శ్రీ కా. టగడ్డ రాజగోపాలరావు సభన

ప్రారంభించారు. ఎమ్. రాధాకృష్ణ, పి. సుందరం, పి శ్రీరాములు ఉపన్యసించిన పిదప, ఫాసిస్టు వ్యతిరేక గేయాలతో సభ ముగిసింది.

రెండవ రోజు వైజ్ఞానిక సభ, ఆటల పోటీలు జరిగాయి. గోపరాజు రామచంద్రరావుగారు అధ్యక్షత వహించారు. విశ్వనాథ సత్యనారాయణ గారు సభను ప్రారంభించారు. శ్రీ త్రిపురనేని రామస్వామిచౌదరి ఉపన్యసించారు. వయోజన విద్యా ప్రచారంపై నిషేధం తొలగించాలని మహాసభ తీర్మానించింది.

## రాష్ట్రి విద్యార్థి నాయకునికి శిక్ష

ఆంధ్ర రాష్ట్రి విద్యార్థి సంఘ కార్యదర్శిగా పనిచేసిన కామ్రేడ్ ఎమ్. రాధాకృష్ణకు వారితో అరెస్టు చేయబడ్డ మరి యిద్దరు కామ్రేడ్సుకు ఒక్కొక్క సంవత్సరం చొప్పున కఠిన శిక్ష విధించారు.

# దక్షిణ భారత విద్యార్థి కన్వెన్షన్ దేశరక్షణ మహాసభ

దక్షిణ భారత విద్యార్థి కన్వెన్షన్ దేశ రక్షణ మహాసభ 1942 జూలై 4 వ తేదీన (మద్రాసులో) జరిగింది. 1000 మంది విద్యార్థులతో ఫాసిస్టు ప్రతికూల ప్రజాయుద్ధ స్వాతంత్ర్య సమర నినాదాలతో మిన్నుముట్టుతూ ఊరేగింపు బయలుదేరింది. ఉదయం శ్రీ మోహన్ కుమార మంగళం విద్యార్థి జండాను ఎగురవేశారు. ఆంధ్ర, తమిళ, కేరళ, తిరువాన్కూర్‌ల నుండి 400 మంది విద్యార్థి ప్రతినిధులు వచ్చారు. "ఫాసిస్టులను పాతిపెట్టాలి. భారత భూమిని కాపాడాలి. జాతీయ సమ్మేళనాన్ని సాధించాలి. జాతీయ ప్రభుత్వాన్ని స్థాపించాలి" అనే నినాదాలు మారుమోగాయి. విద్యార్థులు పాడిన ఆంధ్ర. తమిళ, కేరళ ఫాసిస్టు ప్రతికూల గీతాలు సభికులను ఆవేశ పరిచాయి.

సభకు అధ్యక్షత వహించి కళ్యాణకృష్ణన్ (ఎన్. కె. కృష్ణన్) తమ ఉపన్యాసం ఇస్తూ, మిత్రరాజ్యాల ప్రజలు, ఆక్రమిత యూరప్ ప్రజలు, సోవియట్ నాయకత్వాన సాగించే ఈ యుద్ధం ప్రజాయుద్ధం. ఈ యుద్ధాన్ని ప్రపంచ ప్రజల విముక్తి పోరాటంగా సాగించినప్పుడే ప్రజలకు విజయం లభించుతుంది. అందుచేత భారత ప్రజలు ఈ యుద్ధంలో జయంపొందుట ద్వారానే జాతీయ విముక్తి పొందగలరు. భారతదేశం ఫాసిస్టు ప్రమాదంలో పడనున్నది. దేశ రక్షణ సమస్యపై జాతీయ ప్రతిఘటనను పెంపొందించాలి. జాతీయైక్యతను, కాంగ్రెస్-ముస్లింలీగ్ ఐక్యత కొరకు సర్వవిధాలా పాటుపడాలి ... విచ్ఛిన్నమయ్యే బ్రిటిషు సామ్రాజ్యవాదం నుండి రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకొని జాతీయ ప్రభుత్వాన్ని స్థాపించాలి. పవిత్ర భారత భూమిని జయప్రదంగా రక్షించుటకు విద్యార్థులంతా సాగిరావాలి. ఫాసిజాన్ని నిర్మూలించాలి. మన ప్రాచీన విజ్ఞాన సంప్రదాయాన్ని, గౌరవాన్ని నిలబెట్టండి. 50 సంవత్సరాలుగా స్వాతంత్ర్య పోరాటంతో మనం ధారపోసిన త్యాగాన్ని, మన పవిత్ర ఆశయాలను మంటలో కలిసి పోకుండా కాపాడవలసిన పవిత్ర సమయం ఆసన్నమైంది."

తరువాత విద్యార్థి డిటెన్యూల తరపున బాల దండాయుద్ధం మాట్లాడారు. అఖిలభారత విద్యార్థి ఫెడరేషన్ ఢిల్లీ మహాసభలో ఆమోదించిన తీర్మానాన్ని వివిధ రాష్ట్ర ప్రతినిధులు చర్చించారు.

కామ్రేడ్ లతీఫ్ విముక్తి పోరాట తీర్మానాన్ని ప్రవేశ పెట్టారు. కామ్రేడ్ మోహన్ కుమార మంగళం "జాతీయ రక్షణ యుద్ధం" అనే తీర్మానాన్ని ప్రతిపాదించుతూ ఇలా అన్నారు. "భారతదేశ రక్షణకు జాతీయైక్యతను బలపరచే యుద్ధ ప్రయత్నాలకు తోడ్పడాలి జాతీయైక్యతను విచ్ఛిన్నం చేసే నేషనల్ వార్ ఫ్రంటులో విద్యార్థులు చేరకూడదు. భారతదేశ రక్షణకు తోడ్పడే వైమానిక దాడి రక్షణ కృషిని, సైన్యాన్ని బలపరచాలి. సైన్యానికి - ప్రజలకు మధ్య నున్న అగాథాన్ని పూడ్చుటకు ప్రయత్నించాలి." అన్నారు.

విద్యార్థుల యుద్ధ కాలపు కోర్కెలు ఆర్గనైజేషన్, ప్రాంతాలను ఖాళీ చేయడంపై తీర్మానాలు చేయబడ్డాయి. విద్యార్థులకు విద్యాలయాలలో వైమానిక దాడి రక్షణ శిక్షణ, ప్రథమ చికిత్స, ఉచిత నిర్బంధ సైనిక శిక్షణ యివ్వాలని తీర్మానించారు. ఈ స్వాతంత్ర్య పోరాటంలో నిర్బంధ విధానాన్ని మాని, విద్యార్థుల విజ్ఞాన, మానసిక శక్తుల అభివృద్ధికి సర్వ అవకాశాలనిచ్చి, విద్యార్థుల ఉపాధ్యాయుల మధ్య సామరస్యాన్ని పెంపొందించుటకు ఉపాధ్యాయులు కృషిచేయాలని కోరారు.

5 వ తారీఖున తమిళంలో చిన్న నాటకాలను బహిరంగ సభలో ప్రదర్శించారు. ఉత్తేజకరమైన పాటలు, గేయాలు పాడారు. సభ జయప్రదంగా ముగిసింది.

(ప్రజాశక్తి 15-7-1942)

## 19 వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభ (1942 నవంబరు 12-14 తేదీలు)

గత సంవత్సరం (1941) కాకినాడలో జరుపదలచిన రాష్ట్ర విద్యార్థి మహాసభకు ప్రభుత్వం అనుమతించలేదు. జాతీయనాయకులు అరెస్టు అయిన తరువాత, మొట్టమొదటిసారిగా జరిగిన ఆంధ్ర విద్యార్థులసభ 19వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభ - 1942 నవంబరు 12, 13, 14 తేదీల్లో గుంటూరులో జరిగింది. రాష్ట్రంలో ఉన్న 11 జిల్లాల్లో బళ్ళారి, కడప జిల్లాలనుండి తప్ప అన్ని జిల్లాలనుండి ప్రతినిధులు వచ్చారు. ప్రేక్షకులు, ప్రతినిధులు కలిసి 438 మంది ఉన్నారు. జాతీయ విద్యార్థి సంఘాల నుండి కొందరు ప్రేక్షకులు వచ్చారు. మద్రాసు విద్యార్థి సంఘం నుండి రామకృష్ణన్ సౌహార్ద్ర ప్రతినిధిగా వచ్చారు.

అఖిలభారత విద్యార్థి సంఘ కార్యదర్శి కామ్రేడ్ ప్రశాంత్ సన్యాల్ మహాసభను ప్రారంభిస్తూ 11 వేలకు పైగా సభ్యత్వం కలిగి, ఆంధ్ర విద్యార్థి ఉద్యమం దినదినాభివృద్ధి పొందుతూందనీ అఖిలభారత విద్యార్థి సంఘంలో ఒక ప్రముఖస్థానం వహిస్తుందనీ అన్నారు. బెంగాల్‌లో కరువు భయంకర స్థితి చెప్పి దేశాన్ని రక్షించాలంటే బెంగాల్ ప్రజలను రక్షించుకోవాలని, విద్యార్థులందరూ

క్షామ నివారణ ఐక్యకమిటీలు ఏర్పరచి సాధ్యమైనంత సహాయం బెంగాల్‌కు పంపాలన్నారు. బెంగాల్‌లో నిముషానికి ౬గురు చనిపోతున్నారని చెప్పారు.

మహాసభకు అధ్యక్షతవహించిన కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్యగారు తమ ఉపన్యాసంలో ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి సంఘం ఏ ఒక్క రాజకీయపార్టీకో సంబంధించినది గాదన్నారు. విద్యార్థులలో అనేక రాజకీయాభిప్రాయాలు గల వారుంటారు. విద్యార్థులందరూ సమావేశమై మెజారిటీ నిర్ణయించిన ప్రకారమే కార్యక్రమం నిర్ణయించుకుంటారు. ఈ ప్రజాస్వామిక సూత్రం ప్రకారం ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి సంఘం మొదలునుండి పనిచేస్తూంది. ఇటువంటప్పుడు మరొక సంఘాన్ని ఆర్గనైజు చేయడం విద్యార్థి ఉద్యమాన్ని విచ్ఛిన్నం చేయడం అవుతుంది. ఈరోజు ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి సంఘం మన దేశాన్ని రక్షించుకుంటూ యుద్ధాన్ని బలపరచుట ద్వారానే స్వాతంత్ర్యం వస్తుందని చెప్పుచున్నది. ఈనాడు రెండు మూఠాల మధ్య యుద్ధం జరుగుచున్నది. ఒకటి సోవియట్ రష్యా, చైనా, బ్రిటన్, అమెరికా ప్రజలు. రెండో పక్షం జర్మను, జపానులు. మనం మొదటి పక్షం గెలవాలని, ఆ పక్షం గెలిస్తేనే ఏ దేశానికైనా స్వాతంత్ర్యం నిలుస్తుందని చెబుతున్నాం. ఈ పక్షం గెలవాలని మనం కోరేటప్పుడు మనం యుద్ధానికి తటస్థంగా ఉండటంలోగాని, వ్యతిరేకంగా ఉండటంలోగాని అర్థం లేదు. ఈ యుద్ధాన్ని బలపరుచుట ద్వారానే మనం స్వాతంత్ర్య పోరాటాన్ని ముందుకు తీసుకుపోగల్గుతాం.... మన జాతీయ కాంగ్రెస్ కూడా మిత్ర రాజ్యాలు గెలవాలని చెప్పింది. మిత్ర రాజ్యాలకు తోడ్పడుటకు మన దేశాన్ని రక్షించుకొనుటకు జాతీయ ప్రభుత్వాన్ని కోరింది. కాని బ్రిటిషు ప్రభుత్వం జాతీయ ప్రభుత్వం యివ్వడానికి నిరాకరించింది. నాయకులను అరెస్టు చేసింది. విధ్వంసక చర్యలు కాంగ్రెస్ కార్యక్రమమని వారినందరినీ ప్రజల నుండి వేరుపరచి, నాయకుల విడుదలకు విద్యార్థులంతా ఐక్యం గావాలని సుందరయ్యగారు హెచ్చరించారు.

తరువాత కార్యదర్శి శ్రీ తమ్మారెడ్డి సత్యనారాయణ 2 సంవత్సరాల నివేదిక ప్రవేశ పెట్టారు.

మహాసభలో ప్రధాన చర్చనీయాంశం విద్యార్థి ఉద్యమంలో ఐక్యతను తీసుకు రావడం గురించి. ఈ తీర్మానాన్ని కార్యదర్శి తమ్మారెడ్డి సత్యనారాయణ ప్రవేశ పెట్టారు. విద్యార్థులంతా ఐక్యం కావడానికి కనీస కార్యక్రమం సూచించబడింది. ఈ తీర్మానం మీద ప్రతీ జిల్లా నుండి ఒక్కొక్కరు మాట్లాడారు. విద్యార్థి ఉద్యమంలో ఐక్యత తీసుకువస్తామని, విచ్ఛిన్నశక్తులను వేరుచేస్తామని వారంతా ఉద్ఘాటించారు. మహాసభకు వచ్చిన జాతీయ విద్యార్థి సంఘాల దేశభక్తులు కూడా

శీర్మానాన్ని బలపరచారు. పలువురు జాతీయ విద్యార్థిసంఘ సభ్యులు తమ సంఘాలకు రాజీనామా యిచ్చి విద్యార్థి ఫెడరేషన్‌లో చేరారు.

వైజ్ఞానిక మహాసభను తాపీ ధర్మారావుగారు ప్రారంభించుతూ "ప్రజలు-సాహిత్యం" అను అంశంపై ఒక గంట సేపు మాట్లాడారు. ఇంగ్లీషులోనూ, తెలుగులోనూ వాగ్వివాద పోటీలు, వివిధ జిల్లాల దళాలమధ్య వైజ్ఞానిక పోటీలు జరిగాయి. బహుమతులు యిచ్చారు.

వైజ్ఞానిక పోటీలను, ఆతరువాత జరిగిన విద్యార్థి ప్రదర్శనను చెడగొట్టడానికి విచ్ఛిన్నకారులు విఫలయత్నం చేశారు. 4000 మందితో స్వరాజ్య మైదాన్‌లో బహిరంగ సభ జయప్రదంగా జరిగింది.

నూతన కార్యవర్గానికి తమ్మారెడ్డి సత్యనారాయణ ప్రధాన కార్యదర్శిగా, ఎన్.వి. నరసయ్య, బి వి. రావు, కె వెంకటప్పయ్య సహాయ కార్యదర్శులుగా, శ్రీ వి. మధుసూదనరావు, ఎమ్. రామకృష్ణారావు (కృష్ణా), కె. వి. బసవయ్య, వి. గోపాలరావు (గుంటూరు), ఇ. వెంకటేశ్వర్లు (వైజాగ్), డి. సురేంద్రనాథ చౌదరి, మేకా పట్టాభిరామయ్య (తూర్పు గోదావరి), వరిగొండ వెంకట సుబ్రహ్మణ్యశర్మ, మారెళ్ళ నరసింహారావు (పశ్చిమ గోదావరి), శ్రీనివాసులు రెడ్డి (నెల్లూరు), గంగిరెడ్డి, తిరుమలరెడ్డి (అనంతపురం), ఎస్. జానకి (కృష్ణా) కార్యవర్గసభ్యులుగా ఎన్నుకోబడ్డారు.

# ముగింపు

1937 లో గుంటూరులో 14 వ మహాసభ జరిగిన నాటినుండి 1942 నవంబరులో తిరిగి గుంటూరులో 19 వ మహాసభ జరిగేవరకు గడచిన 5 సంవత్సరాలలో రాష్ట్రవ్యాపితంగా 11 జిల్లాలకు విద్యార్థి ఉద్యమం విస్తరించింది. గుంటూరు మహాసభ నాటికి 11,304 మంది విద్యార్థులు విద్యార్థి ఫెడరేషన్‌లో సభ్యులుగా ఉన్నారు. అంటే ఆనాటికి రాష్ట్రంలో ఉన్న మొత్తం విద్యార్థులలో మూడవవంతు సంఘటితం చేయబడ్డారు. కృష్ణా జిల్లాలో కొన్నిచోట్ల నూటికి నూర్గురు సభ్యులుగా చేరారు. ఈ విధంగా విద్యార్థి సంఘం ఆంధ్ర చరిత్రలో ఎప్పుడూ లేనంతగా అభివృద్ధి చెందింది.

విద్యారంగంలో బ్రిటిష సామ్రాజ్యవాదులు ప్రవేశపెట్టిన బానిస విద్యా విధానాన్ని, దానిలోని డిటెన్షన్ విధానం మొదలైన చెడుగులన్నింటిని ఎదుర్కొని పోరాడుతూ విద్యార్థులలో దేశభక్తిని రుగుల్కొల్పి భారత జాతీయోద్యమంలో విద్యార్థి ఉద్యమాన్ని ఒక అంతర్భాగంగా చేస్తూ, విద్యార్థి ఉద్యమాన్ని అణచి వేయడానికి ప్రభుత్వం ప్రవేశపెట్టిన యూనివర్శిటీ ఆర్డినెన్సులను ఎదుర్కొంటూ వయోజన విద్యా ప్రచారం మొదలైన నిర్మాణ కార్యక్రమాల ద్వారా ప్రజలలో విద్యావిజ్ఞానాల వ్యాప్తికి తద్వారా వారిలో స్వాతంత్ర్య కాంక్షను రగుల్కొల్పుతూ ఈ దశలో (1936-42) తన చరిత్రాత్మక కర్తవ్యాన్ని నిర్వహించింది.

రెండవ ప్రపంచయుద్ధం తొలిదశలో సామ్రాజ్యవాద యుద్ధకాల నిర్బంధ విధానాన్ని ఎదుర్కొంటూ ఆ తరువాత దశలో ఫాసిజానికి వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో విద్యార్థి ఉద్యమం సముచిత పాత్ర నిర్వహించింది. యుద్ధకాలంలో బెంగాల్, రాయలసీమ కరువు సహాయ కార్యక్రమాలకు తోడ్పడింది. బ్లాక్ మార్కెట్‌కు వ్యతిరేకంగా పోరాడింది. 1942 ఆగష్టు ఉద్యమ దశలో విద్యార్థి ఉద్యమంలో వచ్చిన చీలికను అధిగమించి తిరిగి ఐక్య విద్యార్థి ఉద్యమ నిర్మాణానికి 1942 నవంబరు 19 వ మహాసభలో తన కృషి కేంద్రీకరించింది. తరువాత దశ 1942-48 లో విద్యార్థి ఉద్యమం రాష్ట్రంలో మరింత ఉన్నత స్థాయికి అభివృద్ధి చెందింది.

## సాంస్కృతిక రంగం - విద్యార్థి ఉద్యమం

1915లో గురజాడ అప్పారావుగారు మృతి చెందారు. 1919లో కందుకూరి వీరేశలింగంగారు మృతి చెందారు. వీరి మృతితో ఆంధ్ర సాంఘిక, సాంస్కృతిక

పునరుజ్జీవనోద్యమంలో కొంత నిస్తబ్దత ఏర్పడినప్పటికీ, జాతీయోద్యమ ప్రభావం సాంఘిక సాంస్కృతిక రంగాల మీద ఎంతగానో ప్రసరించింది. జాతీయోద్యమ కాలంలో వెలువడిన సాహిత్యం, కులతత్వానికి, మతమౌఢ్యానికి వ్యతిరేకంగా, సాంఘిక దురాచారాలకు వ్యతిరేకంగా దేశభక్తియుత కవితలు, కావ్యాలు, నాటకాలు, సాంఘిక సంస్కరణలను ప్రబోధించే సాహిత్యం విద్యార్థులను ఉత్తేజ పరిచేవి. వీరేశలింగం, చిలకమర్తి వంటి వారి రచనలు విద్యార్థి దశలో తనను ఎంతో ఉత్తేజపరిచాయని శ్రీ సుందరయ్య తన స్వీయచరిత్రలో వ్రాసుకున్నారు. బందరు హిందూ హైస్కూలులో చదువుకుంటూ శ్రీ చంద్ర రాజేశ్వరరావుగారు వీరేశలింగం ప్రహసనాలను, శకునాలు, దెయ్యాలు, భూతాలు మొదలైన వాటి గురించి వ్రాసినవి చదివి, ఉత్సాహపడి వాటిని ప్రదర్శించామని అన్నారు.

జాతీయోద్యమకాలంలో రాయప్రోలు సుబ్బారావు, విశ్వనాథ సత్యనారాయణ, దేవులపల్లి కృష్ణశాస్త్రి, వేదుల సత్యనారాయణశాస్త్రి మున్నగువారి దేశభక్తి గేయాలు విద్యార్థులను ఉత్సాహపరిచేవి. గరిమెళ్ళ సత్యనారాయణగారు "మాకొద్దీ తెల్ల దొరతనం" మొదలైన చరిత్రాత్మకమైన పాటలు రాజమండ్రి ట్రైనింగు కాలేజీలో (1919-22) ఎల్.టి చదవడానికి వచ్చి అక్కడే వ్రాశారు. పాడారు అందుకు ఆయనకు 2½ సంవత్సరాలు శిక్ష విధించారు.

కాకినాడ పి. ఆర్. కాలేజీలో తెలుగు అధ్యాపకులుగా పనిచేసిన దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు, పెద్దాపురం హైస్కూలులో వేదుల సత్యనారాయణ శాస్త్రిగారు, రామచంద్రాపురంలో ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి మున్నగువారు విద్యార్థులలో సాహిత్య అభిలాషను, దేశభక్తిని ప్రోత్సహించుతూ ఉండేవారు.

## యువ పతాక

స్వాతంత్ర్యం, శాంతి, అభ్యుదయం అన్నవి ఆనాటి విద్యార్థి, యువజన సంఘాల ఆశయాలుగా ఉండేవి ఈ ఆశయాలు మూడూ కలిసి వచ్చేటట్లు పాడుకోవడానికి వీలైన విధంగా కూడా ఒక గేయం వ్రాసి యివ్వవలసిందని తూర్పు గోదావరిజిల్లా విద్యార్థి సంఘనాయకులు శ్రీ పి.ఎస్. శర్మ, పర్వతనేని వెంకటేశ్వర రావు తదితరులు కోరగా దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు తూర్పుగోదావరి జిల్లా ప్రథమ విద్యార్థి మహాసభకు (1938 డిసెంబరు 10, 11 తేదీలు) "యువపతాకం" అనే గేయం వ్రాసియిచ్చారు. కృష్ణశాస్త్రిగారి మేనకోడళ్ళు వింజమూరి సీత, అనసూయలు ఆగేయాన్ని మహాసభకు వచ్చి జండా ప్రతిష్ఠాపన సమయంలో పాడారు. 1939 లో కాకినాడలో జరిగిన 16 వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభకు కూడా వీరు వచ్చి ఈ గేయాన్ని పాడారు. ఆనాటి విద్యార్థి యువజనోద్యమాలు రాబోవు నవ సమాజ నిర్మాణానికి అరుణారుణ తారలుగా అరుణకాంతి

ధారలుగా కృష్ణశాస్త్రిగారు అభివర్ణించిన తీరు, "యుగయుగాల పీడకలలు, స్వార్థము, మోసము తొలగిపోయి ముందు కలదు లోకానికి ముక్తి - అమర జీవశక్తి" అన్న ఆశాభావాన్ని స్ఫురింపజేసిన పద్ధతి ఎంతో ప్రశంసనీయంగా ఉంది. (చూడండి అనుబంధం)

## వైజ్ఞానిక కార్యక్రమాల ప్రాధాన్యత

1937 లో గుంటూరులో 14 వ రాష్ట్ర మహాసభ, 1939 లో బెజవాడలో 15 వ మహాసభ జరిగిన తరువాత విద్యార్థి ఉద్యమం కొంత సంఘటితపడిన తరువాత శారీరక, వైజ్ఞానిక కార్యక్రమాల ఆవశ్యకతను గుర్తించింది. కాకినాడలో 1939 సెప్టెంబరులో జరిగిన 16 వ రాష్ట్ర విద్యార్థి మహాసభకు కార్యాచరణ సమాలోచన చేస్తూ డాక్టర్ కె. సోమయ్య ఇలా తెలియజేశారు.

"సభ్యులు విద్యార్థి సంఘాలలో విరివిగా చేరాలంటే లలితకళలు ఆచరణలో పెట్టాలి. ఇది కాన్ఫరెన్సు కాలంలో జరుపుటకు ప్రయత్నములు జరుగుతున్నవి కాని తక్కిన కాలంలో ఆచరణలో పెట్టాలంటే "కల్చరల్ సెక్షన్" వేరే స్థాపించాలి.

"స్పోర్ట్సు, ఆటలు మన కార్యక్రమంలో లేకపోవుటచే వాటిలో అభిలాష కల్గిన విద్యార్థులు మన సంఘాలలో చేరుటలేదు. కనుక వీరి సానుభూతి సంపాదించాలంటే ''జిమ్నాశియం'' ఒకటి స్థాపించాలి.

"బెజవాడ-కాకినాడ సభల మధ్య జరిగిన కార్యక్రమాన్ని సింహావలోకనం చేస్తే తేలినవి రెండు విషయాలు: ఒకటి - విద్యార్థి సంఘాల నభివృద్ధిపరచుటకై స్పోర్ట్సు లలితకళలతో కూడిన విశాలమైన కార్యక్రమం కావాలి. వాటి ద్వారా విద్యార్థులలో రాజకీయ చైతన్యం కల్గించుటకు పూనుకోవాలి. ఇది నిర్మాణ సమస్యలలో ప్రధాన విషయం".

ఈ దృష్ట్యానే కాకినాడలో జరిగిన 16 వ రాష్ట్ర మహాసభలో ఆటలు, పాటలు, ఉపన్యాస పోటీలు, నాటకాలు మొదలగు కార్యక్రమాలు ప్రవేశపెట్టడం జరిగింది. శ్రీ ఎమ్.ఎస్. మూర్తిగారు రచించిన ''ఏమిచేయాలి''? (వాట్ టు డు?) అనే సాంఘిక నాటకం ప్రదర్శనకు తయారు చేయబడింది కాని ప్రభుత్వం అనుమతి యివ్వకపోవడంవలన చివరి నిముషంలో ప్రదర్శించబడలేదు. వక్తృత్వ పోటీలు, ఆటలు పోటీలు జరిగాయి.

బెజవాడలో 18 వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభతో పాటు, విద్యార్థి వైజ్ఞానిక మహాసభ కూడా జరుపబడింది. (1941 నవంబరు) వైజ్ఞానిక మహాసభకు విజ్ఞానం పత్రికా స పాదకులు శ్రీ కాశీపట్నం కొండయ్యగారు అధ్యక్షత

వహించారు. మోటూరు రాధాకృష్ణ ప్రారంభించారు. గోపరాజు రామచంద్రారావు, విశ్వనాథ సత్యనారాయణ, తాపీ మోహనరావు గార్లు పాల్గొన్నారు. వక్తృత్వ పోటీలు తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ జరిగాయి. సంగీత పోటీలు, ఆటల పోటీలు కూడా జరిగాయి.

## కాకినాడ విద్యార్థి వైజ్ఞానిక సభ (కల్చరల్ కాన్ఫరెన్సు)

కాకినాడ 16 వ రాష్ట్ర విద్యార్థి మహాసభ అనంతరం జరిగిన జిల్లా విద్యార్థి మహాసభలన్నీ వైజ్ఞానిక మహాసభలు కూడా జరుపనారంభించాయి. (కల్చరల్ కాన్ఫరెన్సులను వైజ్ఞానిక సభలు అని ఆనాడు పిలిచేవారు. సాంస్కృతిక సభలు అనే పదం ఆనాటికి వాడుకలోకి రాలేదు )

కాకినాడ పట్టణ విద్యార్థి సంఘాధ్వర్యాన 1940 జనవరిలో విద్యార్థి వైజ్ఞానిక మహాసభ జరిగింది. సుప్రసిద్ధ అభ్యుదయ కవి, స్వాతంత్ర్య సమర యోధుడు శ్రీ హరీంద్రనాథ్ చటోపాధ్యాయ మహాసభ ప్రారంభోత్సవం చేశారు. విద్యార్థులు దేశ స్వాతంత్ర్య సమరంలో పాల్గొనడమే కాక ప్రగతిశీల సాహిత్యం, కళల ద్వారా విద్యార్థి లోకాన్ని, ప్రజానీకాన్ని ఉత్తేజపరచాలని శ్రీ హరీంద్ర ఉద్బోధించారు. తాను రచించిన "కర్డ్ సెల్లర్" (గొల్లవాడు) ఏకపాత్రాభినయం ద్వారాను, ఇతర జాతీయ గీతాలనుపాడి విద్యార్థులను ఉత్తేజపరిచారు. సాయంత్రం విద్యార్థులు ఏకాంక నాటికలు ఇతర కళా ప్రదర్శనలు యిచ్చారు. వింజమూరి సోదరీమణులు సీత, అనసూయలు వచ్చి విద్యార్థి గేయం యువ పతాక, ఇతర జాతీయ గీతాలు పాడారు. సభకు అనేకమంది విద్యార్థులు, లెక్చరర్లు కూడా హాజరయ్యారు. సభానిర్వాహకుడు, పట్టణ విద్యార్థి సంఘ కార్యదర్శి అయిన పరకాల పట్టాభిరామారావు కళాప్రదర్శనల గురించి మాట్లాడుతుండగా స్టేజిమీదకు వచ్చి పోలీసులు అరెస్టు చేసి తీసుకుపోయారు. ఆ తరువాత కొంత సేపటికి గాని అదొక విచిత్ర వేషమని తెలియక సభ అంతా ఒక్కసారి అల్లకల్లోల మైంది. విద్యార్థులలో ఈ వైజ్ఞానిక సభలు, ప్రదర్శనలు రాజకీయ చైతన్యం లేని విద్యార్థులను కూడా ఆకర్షించి వారిని విద్యార్థి ఉద్యమం లోనికి తీసుకు రావడానికి తోడ్పడ్డాయి.

## ఆంధ్ర అభ్యుదయ ఉత్సవాలు

కాకినాడ పి.ఆర్. కళాశాలలో 1940 జనవరి 29 నుండి మూడు రోజులు ఆంధ్రాభ్యుదయోత్సవాలు జరిగాయి. విద్యార్థి సంఘ నాయకులు శ్రీ పి.ఎస్.శర్మ, పరకాల పట్టాభిరామారావు మొదలైనవారు ఈ ఉత్సవాలను జయప్రదం చేయడానికి విద్యార్థులు విరివిగా పాల్గొనడానికి కృషి చేశారు. శ్రీ ఎమ్. ఎస్. మూర్తిగారు వ్రాసిన "జండా మా జాతికి జీవన మోయి, జననీ జన్మభూమికే

వందనమోయి" అను గేయాన్ని పట్టాభి రామారావు పాడారు. ఇతర దేశభక్తి గేయాలను వింజమూరి సీత, అనసూయలు పాడారు చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు ఉదయం సభలోనూ, దంటు సుబ్బావధానిగారు, కోదాడ రామకృష్ణయ్యగారు సాయంత్రం సభలలోనూ, ఆంధ్ర సాహిత్యం గురించి, ప్రత్యేకాంధ్ర రాష్ట్రం గురించి మాట్లాడారు దంటు సుబ్బావధానిగారు పండితరాయలు గురించి ప్రత్యేకోపన్యాసం యిచ్చారు. మరుసటి రోజు సభలో బుర్రా శేషగిరిరావు గారు, మామిడిపూడి వెంకటరంగయ్యగారు, భావరాజు కృష్ణారావుగారు మాట్లాడారు.

మూడవ రోజు సభలో చాలా మంది ప్రముఖులు పాల్గొన్నారు. అందులో మల్లంపల్లి సోమశేఖర శర్మ, కొడాలి చంద్రమౌళీశ్వరరావు, అడవి బాపిరాజు, కోలవెన్ను రామకోటేశ్వరరావు మొదలైన వారున్నారు. వీరు ఆంధ్రుల చరిత్ర, సాహిత్యం, కళల గురించి మాట్లాడారు. అడవి బాపిరాజుగారు చిత్రకళా ప్రదర్శనానికి ప్రారంభోత్సవం జరిపారు. హఠయోగ ప్రదర్శనలు మున్నగునవి కూడా జరిగాయి. మొత్తం మీద ఆంధ్రాభ్యుదయోత్సవాలు, ఆ రోజుల్లో విద్యార్థులలో ఆంధ్రాభిమానాన్ని కల్గించడానికి ఆంధ్రుల ఉజ్వల చరిత్రను, సాహిత్యం, కళలను తెలుసుకోవడానికి, వారిలో దేశ భక్తిని, జాతీయ చైతన్యాన్ని కల్గించడానికి తోడ్పడ్డాయని చెప్పవచ్చు ప్రతీ సంవత్సరం జరిగే ఈ ఆంధ్రాభ్యుదయోత్సవాలలో విద్యార్థి సంఘ కార్యకర్తలు పాల్గొంటూ ఉండేవారు.

## హరీన్ చటో ఏకాంక నాటిక "విగ్రహం" అనువాదం

దేశభక్తి యుత గేయాలు, నాటికలు ఆ రోజుల్లో విద్యార్థుల్లో యువ రచయితలలో కల్గించిన ఉత్సాహానికి, ఉత్తేజానికి నిదర్శనం. హరీంద్రనాథ చటోపాధ్యాయ రచించిన 'విగ్రహం' అనే గేయ నాటికకు ఆనాటి పి.ఆర్. కాలేజీ విద్యార్థి,యువ రచయిత అయిన శ్రీ ముప్పని చిన అంకయ్య సరళ వ్యవహారిక భాషలో చేసిన చక్కని తెలుగు అనువాదం నిదర్శనంగా చెప్పవచ్చు. దేవుని పేరుతో స్వార్థపర వర్గాలు, పూజారులు సామాన్య ప్రజలను ఎలా అజ్ఞానాంధ కారంలో వుంచి, వారి శ్రమను దోచుకొంటున్నారో తెలిపే ఈ గేయ నాటిక ఇలా ప్రారంభమవుతుంది. ఈ నాటికను నాటి పార్టీ పత్రిక నవశక్తి 18-1-39 వ తేదీ సంచికలో ప్రముఖంగా ప్రకటించింది.

ఏకాంక నాటిక - విగ్రహం - శ్రీ హరీంద్రనాథచటోపాధ్యాయ అనువాదం శ్రీ ముప్పన చిన అంకయ్య, నవశక్తి 18-1-1939.

"ధూపధూపములు దీవుడే నిజముగ
దీపజ్యోతులు తెలిసికొన్నచో
రాతి బొమ్మలకు సిగ్గు చెందడా
రంజన మిడునా చింతనొందడా?
మాయలమారుల అన్నెము పున్నెము
మాగధ గీతులు అసలే ఎరుగని
స్తోత్రపాఠకులు పేదల నెత్తురు
శుష్కప్రియములు పీల్చి, క్రౌర్యమున
శిలావిగ్రహము మతము పిచ్చితో
చెవుల సోకునా ? మట మాయలతో
దేవుని పేరను కపట నటనలతో
జరిగే మోసము కలుష తాండవం
దేవునికోసం సలిపే లోకము
జరిగే నాశము విశ్వనాథునకు
వేడుక యగునా?"

ఒక ముసలిది, యువతి, యువకుడు, గృహస్తు, గృహిణి, మిల్లుకూలి, ప్రజలు, పూజారి, కవి మొదలైన పాత్రల ద్వారా హరీన్ చట్టో, సమాజంలోని ఆర్థిక అసమానతలు, ప్రజల దారిద్ర్యం గురించి దేవునికి సూటి ప్రశ్నలు వేయిస్తాడు.

"ప్రభుడవంట, కృపారాశివంట
మాబోటు లాకటి మాడుచుండ
మచ్చరాడే, నీదుమహిమకు దేవ ?
అయ్యయ్యో ! ఇది ఏమి అన్యాయమయ్య
కరువులేకాదు, రోగములేకాదు
కూడు గుడ్డకు నోచుకోనట్టి మమ్మే
తొలి ముద్దజేసి, యాకలి నోర్చుకొనుము
ఎండగాసినా, వానలెత్తి వచ్చినను.
వరద వచ్చినను, సాగరమ్ము పొంగినను
ముందు మా గుడిసెలే మునుగును దేవ !

పేదలైనను నీకు బిడ్డలు కారే
ఏల దీనుల మొరలాలింపవు స్వామి ?"

చివరకు ప్రజలు ఆ విగ్రహాన్ని కదిలించి, పెకలించి చూస్తే దానిక్రింద బంగారు నాణెములు కనబడతాయి. పేదలు, ఆ నాణెములను స్వాధీనపరచుకుంటారు. (తెరవాలుతుంది)

ప్రజా విప్లవానికి సూచనప్రాయంగా హరీంద్రనాథ చటోపాధ్యాయ 1939 ఆ ప్రాంతాలలో వ్రాసిన ఈ ఏకాంక నాటికను చాలా హృద్యంగా (ఆనాటికింకా అభ్యుదయ రచయితల ఉద్యమం ప్రారంభం కాలేదు.) శ్రీ ముప్పన చినఅంకయ్య (ఇంటర్ సీనియర్ విద్యార్థి - పెద్దాపురం) అనువదించిన తీరు విద్యార్థులలో, యువ రచయితలలో ఉద్భవించుతున్న అభ్యుదయ భావాలకు అద్దం పట్టిందని చెప్పవచ్చు. ఆనాటి నవశక్తి పత్రికను విద్యార్థులు విరివిగా చదువుతూండేవారు. నేషనల్ ఫ్రంట్, నవశక్తి స్టూడెంట్సుకాల్ పత్రికలలో వచ్చే రాజకీయ, ఆర్థిక, సాహిత్య వ్యాసాలు విద్యార్థులను ఉత్తేజపరిచేవి అందులోని రచనలను అనువదించి కాలేజీ మాగ్జయిన్‌లకు వ్యాసాలు వ్రాయడం జరిగేది. ఆనాటి విద్యార్థి పత్రిక "స్టూడెంట్స్‌కాల్"లో జమీందారు దురాగతాలకు గురియైన పేద రైతు గాథ "అపరాధి" అను పేరుతో పరకాల పట్టాభిరామారావు పి.ఆర్. కాలేజీ మాగ్జయిన్‌లో ప్రచురించారు.

## జిల్లా మహాసభలలో

తూర్పు గోదావరిజిల్లా తృతీయ విద్యార్థి మహాసభ అమలాపురంలో 1941 ఫిబ్రవరి 7, 8, 9 తేదీలలో జరిగినప్పుడు జిల్లా విద్యార్థి వైజ్ఞానిక మహాసభ కూడా జరిగింది. శ్రీ అడవి బాపిరాజుగారు మహాసభను ప్రారంభించారు. ఆంధ్ర సాహిత్యం, కళలు గురించి మాట్లాడారు.

తూర్పు గోదావరిజిల్లా 4వ విద్యార్థి మహాసభ, దానితోబాటు విద్యార్థి వైజ్ఞానిక మహాసభ 1942 జనవరి 31, ఫిబ్రవరి 1 తేదీలలో రామచంద్రపురంలో జరిగింది. వైజ్ఞానిక మహాసభకు శ్రీ జటావల్లభుల పురుషోత్తం అధ్యక్షత వహించారు. ఆటలు, సాంస్కృతిక పోటీలు జరిగాయి.

అలాగే పలుచోట్ల విద్యార్థి సంఘాలు కూడా ఆటలు, పాటలు, ఇతర సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించ నారంభించాయి.

## మార్క్సిస్టు సిద్ధాంతాల అధ్యయనం

కాకినాడ కాలేజీ విద్యార్థులకు కమ్యూనిస్టు నాయకులు మార్క్సిస్టు అధ్యయన తరగతులు నడిపేవారు. ఆనాటి జిల్లా పార్టీ నాయకులు మహీధర జగన్ మోహన్‌రావు, అనంతం, మహీధర రామమోహనరావు, పర్వతనేని వెంకటేశ్వర రావు మొదలైనవారు ఒక్కొక్క అధ్యయన తరగతిని వారంరోజులు నడిపి

కుటుంబం, పుట్టుపూర్వోత్తరాలు, రాజ్యాంగ యంత్రం, లెనిన్ బోధనలు మున్నగు నవి చదివించి చెప్పేవారు.

## నవశక్తి పత్రికలో

కాకినాడ కాలేజీలో విద్యార్థి రచయితలు శ్రీ కస్సా వాసుదేవరావు, శ్రీ యర్రమిల్లి నరసింహారావు మున్నగువారు ఆనాటి పార్టీ పత్రిక నవశక్తిలో అనేక రాజకీయ సిద్ధాంత వ్యాసాలు వ్రాస్తుండేవారు. శ్రీ కస్సా వాసుదేవరావు "మార్క్సిజం - చారిత్రక భౌతికవాదం" గురించి ధారావాహికంగా వ్యాసాలు వ్రాశారు. విద్యార్థులకు రాజకీయాలెందుకు? అన్న వ్యాసంలో నాటి కాంగ్రెస్ మంత్రులు విద్యార్థులు రాజకీయాలలో పాల్గొనకూడదనే చెప్పే వాదనల నన్నింటిని శ్రీ వాసుదేవరావు పూర్వపక్షం చేశారు. స్పెయిన్ విద్యార్థుల విప్లవ పోరాటం, పాలస్తీనా విమోచనా పోరాటం మున్నగు అంశాలపై కూడా వాసుదేవరావు వ్యాసాలు వ్రాశారు. అంతర్జాతీయ ఉద్యమ విశేషాలు వయోజన విద్య మున్నగు విషయాలపై యర్రమిల్లి నరసింహారావు అనేక వ్యాసాలు వ్రాశారు.

## వ్యవహారిక భాష - నవ్య సాహిత్య పరిషత్ సభలు

1936 డిసెంబరు, 1937 జనవరి ప్రాంతాలలో గుంటూరులో జరిగిన నవ్య సాహిత్య పరిషత్ సభలు-అందులో గిడుగు రామమూర్తిగారు వ్యవహారిక భాష గురించి చేసిన ఉపన్యాసాలు విద్యార్థులను ఎంతగానో ప్రభావితం చేశాయి. ఆనాడు ఎ. సి. కాలేజీలో తెలుగు అధ్యాపకులుగా ఉన్న తెలికిచర్ల వెంకటరత్నం గారు ఈ సాహిత్య సభల నిర్వాహకులు. శ్రీ వై. వి. కృష్ణారావు మొదలైన విద్యార్థి సంఘ ముఖ్యులు రెండు రోజులల్లో ఈ సభలకు హాజరయ్యారు.

వ్యవహారిక భాషకు - రాజకీయోద్యమాలకు గత సంబంధాన్ని గిడుగు రామమూర్తిగారు తమ మహోపన్యాసంలో తెలియజేశారు.

"పూర్వం మన దేశంలో ప్రజలను విజ్ఞానవంతులను చేయాలనే దృష్టి లేదు. ఆనాడు రాచరిక వ్యవస్థ ఉండేది. విద్యా బోధన కొందరికే పరిమితం. ఆ పరిస్థితిలో గ్రాంథిక భాష వృద్ధి చెందింది. మనమిపుడు ప్రజాస్వామ్య యుగంలో ప్రవేశిస్తున్నాము. ప్రతీ పౌరుడు దేశ భవిష్యత్తు, తన భవిష్యత్తు ఆలోచించుకొని ఓటు చేయడం ఈ పద్ధతిలో మూల సూత్రం కనుక ప్రజా భాష, ఉపన్యాస సంప్రదాయాలు అభివృద్ధి అవుతున్నాయి. కావాలి. ఇందుకు తగిన భాష వ్యవహారిక భాష. భవిష్యత్ ప్రజాస్వామ్య యుగానికి చెందినది నా వ్యవహారిక భాషా ఉద్యమం" అని గిడుగు రామమూర్తిగారు చెప్పిన మాటలు వారి చారిత్రక దృష్టి విద్యార్థులను ఎంతగానో ఆకర్షించాయి.

# 1938 కమ్మ హాస్టల్ వార్షికోత్సవం సాంస్కృతిక ప్రదర్శనలు

1938లో గుంటూరు కమ్మ హాస్టలు వార్షికోత్సవాలను పురస్కరించుకొని విద్యార్థులే ఆనాటి అధ్యాపకులలో (ఎ. సి. కాలేజీ) విద్యార్థి ఉద్యమాన్ని, సమ్మెలను వ్యతిరేకించిన వారిపై వ్యంగ్య నాటికలు ప్రదర్శించారు.

ప్రదర్శనలో మొదటి కళారూపం "ప్రొఫెసర్సు పెరాక్సిజం" కాలేజీ విద్యార్థుల సమ్మెకు ద్రోహం చేసిన ప్రొఫెసర్సు పశ్చాత్తాప పడిన విషయాన్ని శ్రీ మోటూరు హనుమంతరావు మోనోయాక్టింగ్‌గా ప్రదర్శించారు. ప్రదర్శనలోని రెండవ అంశం ''ఫాసిస్టు కోర్'' అనే నాటిక. ఇది ఆనాటి పత్రిక చిత్రగుప్తలో వచ్చింది. అదొక వ్యంగ్య నాటిక. హిట్లర్, ముస్సోలినీ టోజోల కోర్టు ముద్దాయి పండిట్ నెహ్రూ. సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాటం జరుపుతున్న నేరానికి పండిట్ నెహ్రూను విచారించి 150 ఏళ్ళు కఠిన కారాగార శిక్ష విధిస్తారు. భారత దేశంలో సగటు ఆయుర్దాయం 22 సంవత్సరాలే గదా? శిక్ష ఎలా అమలు పర్చాలంటే శాస్త్ర పరిశోధకులను నెహ్రూ జీవిత పరిమాణం 150కి పెంచే కృషి చేయమని ఆదేశిస్తారు. ఆ సందర్భంగా నెహ్రూ సామ్రాజ్యవాదులను, వారి నమ్మిన బంటులను బహిర్గతం చేస్తూ చేసిన ఉపన్యాసం చేస్తాడు.

సామ్రాజ్యవాదం - ఫాసిజం నిజస్వరూపాలను ఎండగట్టడమే కాక, మానవ మారణహోమానికి సైన్సును ఆనాడు ఎలా దుర్వినియోగ పరిచేది స్ఫురింపజేసే ఈ నాటిక విద్యార్థులలో రాజకీయ చైతన్యం కల్గించడానికి బాగా ఉపయోగ పడిందని ప్రదర్శనలో 3వ అంశం గురజాడ వారి కన్యాశుల్కంలోని కొన్ని భాగాలు: ఇందులో వేములపల్లి శ్రీకృష్ణ, మోటూరు హనుమంతరావు, టి. వెంకటేశ్వర రావు పాత్రధారులు.

ఈ వార్షికోత్సవ సమయంలోనే 50 మంది విద్యార్థులకు కామ్రేడ్ చండ్ర రాజేశ్వర రావుగారు ''యూత్ గార్డ్సు''గా వలంటీరు శిక్షణ యిచ్చారు. వీరు ఖాకీ యూనిఫారమ్‌లు, ఎర్రటి రుమాళ్ళు మెడలో కట్టుకొని హాస్టల్ వార్షికోత్సవాన్ని పర్యవేక్షించారు. వామపక్ష రాజకీయాలకు నిలయంగా ఉండే గుంటూరు కమ్మ హాస్టలులో మార్క్సిస్టు అధ్యయన తరగతులు నిత్యం జరుగుతూండేవి. మీరట్ థీసిస్, ఇతర మార్క్సిస్టు గ్రంథాలను నేషనల్ ఫ్రంటు, నవశక్తి, స్టూడెంట్సు కాల్ మున్నగు పత్రికలను చదివేవారు. కమ్యూనిస్టు నాయకులు పులుపుల శివయ్య, ప్రభల కృష్ణమూర్తి, మాడభూషి వెంకటాచార్య మున్నగువారు వచ్చి ఈ అధ్యయన తరగతులను నిర్వహించుతూండేవారు.

## వయోజన విద్యా ప్రచారం - కల్చరల్ కార్యక్రమాలు

వయోజన విద్యా ప్రచార కార్యక్రమం చేపట్టవలసిన అవసరం ఏర్పడి నప్పుడు సాంస్కృతిక కార్యక్రమాల ఆవశ్యకత విద్యార్థి సంఘాలకు మరింత ఏర్పడింది.

ప్రజల దైనందిన కష్టాలను ప్రతిబింబించే నాటకాలు, జాతీయ భావాన్ని పెంపొందించే హరికథలు మొదలైనవి ప్రదర్శించాలనీ, '10-12 మందితో ఏర్పడే దళంలో ఒక వైద్య విద్యార్థి, ఒక చిత్రకారుడు, ఒక పాటగాడు, ఒక ఫోటో గ్రాఫరు ఉండాలని' 15-3-1939 లో యర్రమిల్లి నరసింహారావు నవశక్తిలో ఆంధ్ర విద్యార్థుల వయోజన విద్యా ప్రచారం అన్న వ్యాసంలో తెలియజేసారు. ఆటలు, పాటలు ద్వారా గ్రామీణ ప్రజలను విద్యావంతులను, విజ్ఞానవంతులను చేయాలని తెలిపారు.

మద్రాసు విద్యార్థి సంఘం (యమ్. యస్. ఓ.) వయోజన విద్యా ప్రచార శిక్షణా శిబిరానికి ఒక సిలబస్‌ను 21-12-1938 నవశక్తిలో ప్రకటిస్తూ జాతీయ గీతాలు గ్రామీణ ఆటలు, ఏకాంక నాటకాల ప్రదర్శన మొదలైన కార్యక్రమాలను సూచించింది. మద్రాసులో వారం రోజులు శిక్షణ కూడా యిచ్చింది.

వయోజన విద్యా ప్రచారానికి ఆ రోజుల్లో అనేక గేయాలు కూడా రచించి ప్రచారంలోకి తీసుకురావడం జరిగింది. చైనా విద్యార్థులు నడుపుతున్న వయోజన విద్యా ప్రచారం యొక్క విశిష్టతను కూడా ఈ గేయాలలో పేర్కొనబడింది.

రాష్ట్ర విద్యార్థిసంఘ నాయకులలో ఒకరైన డాక్టర్ కె. సోమయ్య రచించిన పాట పేర్కొనదగినది.

"అన్నా ! చదువుకొనగ రావన్నా ! అన్న పల్లవితో ప్రారంభమయ్యే ఈ గేయం చాలా ఆకర్షణీయంగా ఉండేది. "గుడులే బడులు-గోడలే పలకలు, పాటలే పాఠాల్, మాటలే", "చదువులు అన్న చదువుకొనగ రావన్నా" అని రాత్రి బడులకు వయోజనులు రావాలని ఈ పాట ఉద్బోధించేది.

ఈ పాటను ఢిల్లీలో 1942 మే 15 న ఎ. ఐ. ఎస్. ఎఫ్ జరిపిన ఫాసిస్టు వ్యతిరేక సదస్సులో, పరకాల పట్టాభి రామారావు పాడటం దానిని ఫిల్ము డివిజన్ వాళ్ళు ఇతర గేయాలతో పాటు చిత్రీకరించడం కూడ జరిగింది.

## కల్చరల్ క్లబ్‌ల నిర్మాణం

1939 రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభం అయిన తరువాత విద్యార్థి ఉద్యమంపై ప్రభుత్వ తీవ్ర నిర్బంధ విధానం సాగినప్పుడు 1941 ఆ ప్రాంతాలలో పశ్చిమ గోదావరి జిల్లాలో విద్యార్థి సంఘాలను నిషేధించినప్పుడు విద్యార్థి కల్చరల్ క్లబ్‌లను బహిరంగ వేదికలుగా స్థాపించడం జరిగింది.

ఈ కల్చరల్ క్లబ్‌ల ఆధ్వర్యాన వ్యాసరచన, ఉపన్యాసం పోటీలు, ఆటలపోటీలు, విచిత్ర వేషాలు, నాటకాల ప్రదర్శనలు మార్టేరు, తణుకు, భీమవరం, తదితర చోట్ల ఏర్పాటుచేసి, విద్యార్థులను విద్యార్థి సంఘాలలోకి సమీకరించడం జరిగింది.

మార్టేరులో 1941 లో జరిగిన కల్చరల్ క్లబ్ కాన్ఫరెన్సుకు సుప్రసిద్ధ కవులు, రచయితలు అయిన కవికొండల వెంకటరావుగారిని ఆహ్వానించడం జరిగింది. విద్యార్థి ఉద్యమాన్ని కల్చరల్ క్లబ్ వైజ్ఞానిక కార్యక్రమాలను ఆయన ప్రశంసించుతూ మాట్లాడారు. డిటెన్షను విధానాన్ని నిరశించుతూ జిల్లా విద్యార్థి సంఘ ఆర్గనైజరు పరకాల పట్టాభి రామారావు రచించిన ''వడపోత'' అనే నాటకాన్ని విద్యార్థులు ప్రదర్శించారు. డిటెన్షను పద్ధతిని అమలు చేసిన హెడ్మాష్టరును ఈ నాటిక ప్రదర్శనలో ఎత్తిపొడిచి అపహాస్యం చేయడం విద్యార్థులలో ఎంతో ఉత్సాహాన్ని రేకెత్తించింది. జిల్లాలో యితర చోట్ల కూడా ''వడపోత'' నాటకం ప్రదర్శనలు యిచ్చారు. ఇతర జిల్లాలకు కూడా ఈ నాటకం పంపబడింది.

## విద్యార్థి గేయాలు

కాకినాడలో ప్రసిద్ధ నాటక రచయిత కవి శ్రీ ఎమ్.ఎస్. మూర్తి వ్రాసిన ''జండా మా జాతికి జీవనమోయీ'' అన్న జండా పాట; పశ్చిమగోదావరి జిల్లాలో స్వాతంత్ర్య సమరయోధుడు, సోషలిస్టు పార్టీ నాయకుడు అయిన శ్రీ ఇవటూరి శరభరాజు రచించిన మరొక విప్లవ గేయం 'మ్రోగినదోయీ' ఆ రోజుల్లో విద్యార్థి సభలలో, సమావేశాలలో ఎంతో ప్రసిద్ధి పొందిన గేయాలుగా ప్రచారంలోకి వచ్చాయి. అలాగే జాతీయ విప్లవకారుల గేయం ''భయపడి చావుకు పారిపోకురా!'' ''చావు తప్పదిల సత్యమురా! ఆనందముతో మృత్యువు నెవ్వడు ఆహ్వానించునో వాడే వీరుడు!'' అన్న గేయమూ, ''సుమవాంఛ'' అనే డాక్టరు కె. సోమయ్య హిందీ నుండి అనువదించిన గేయము, ''అన్నమే పరబ్రహ్మంబని తెలియుడు, అన్నమే పరబ్రహ్మం'' (ఇది హరీంద్రనాథ చటోపాధ్యాయ గేయానికి డా. సోమయ్య అనువాదం) అన్న గేయం కూడా ఆనాడు విద్యార్థులలో బహుళ ప్రచారంలోకి వచ్చాయి.

ఆ గేయాలలో ఈ రచయితకు జ్ఞాపకం ఉన్నంతవరకు 626 వ పేజీలో యివ్వబడినవి.

(రచన : శ్రీ ఇవటూరి శరభరాజు)

ప్రోగినదోయీ
ప్రోగినదోయీ! ప్రోగినదోయీ
యువజన వీరకుమారా, వేగమే రావోయీ
ఘణ ఘణ ఘణ ఘణ రణ ఘంటారావమిదే
ప్రోగినదోయీ, ప్రోగినదోయీ

గుండ్లు జొచ్చి మన గుండెల చిందే, రక్త ధారలన్
వ్రాయుదమోయీ, స్వతంత్ర్య భారత స్వచ్ఛ నామమును
పాడుదమోయీ! భావి భాగ్యమును ॥ప్రో॥

మనము చచ్చినా మన సమాధులే
పూలవనములై వెలయును ముందున
మంగళకరమౌ భాగ్య భవనములు
భావి సంతతికి వేగమే రావోయీ ॥ప్రో॥

(అసంపూర్తి)

## సుమవాంఛ

(అనువాదం : డాక్టర్ కె. సోమయ్య)

నే కోరలేదోయి
నీలవేణుల
నిండుకొప్పులో
దూరాలనీ
కులుకుచూ
మెప్పులు పొందాలనీ ॥నే కోరలేదోయీ॥

రారాజు శిరముపై
రాజిల్లగా కోరి
శంకరుని తలపైనను
నర్తించు సౌభాగ్యమే కోరనూ ॥నే కోరలేదోయీ॥

పూమాలలో చేరి
పూబోండ్ల
బిగువైన
పాలిండ్ల నాడాలనీ

యువకుల భావాలు
రేపాలనీ ॥నే కోరలేదోయీ॥
స్వాతంత్ర్య సమరాన
తనువు లర్పించేటి
వీరులేగెడు
త్రోవనూ ఓ దేవః
విసిరివేయుము చాలునూ
విసిరివేయుము చాలునూ ॥నే కోరలేదోయీ॥

* * *

ఆకలి (భూకా భూక్)

హరీంద్రనాథ చటోపాధ్యాయ
అనువాదం : డాక్టర్ సోమయ్య.

అన్నమే పరబ్రహ్మంబని
తెలియుదు
అన్నమే పరబ్రహ్మం ॥అన్నమే॥
పాలని పిల్లలు
ఏడ్చుచుండగా
తిండిలేక
భార్య పస్తుండగా
ఎవరికొరకు
ఈ హరి భజన?
ఎవరి కొరకు
ఈ హరి భజన ॥అన్నమే॥

(అసంపూర్తి)

## తెలంగాణా విద్యార్థి ఉద్యమం (1937 - 1942)

నైజాం నవాబు ఫ్యూడల్ నిరంకుశ పాలన క్రింద హైద్రాబాదు సంస్థానంలో మిగిలిన భాషా ప్రాంతాలతో పాటు తెలంగాణా ప్రాంతం విద్యా, విజ్ఞానాలలో ఎంతో వెనుకబడి ఉండేది.

1937 - 38 నాటికి సంస్థానమంతటా కలిపి ఒకే ఒక ఉస్మానియా యూనివర్శిటి, 5 ఇంటర్మీడియట్ కాలేజీలు ఒక డిగ్రీ కాలేజీ (నైజాం కాలేజీ) 31 హైస్కూళ్ళు, 105 మధ్య తరగతి పాఠశాలలు, 400 ప్రాథమిక

పాఠశాలలు ఉండేవి. తెలుగు, కన్నడ, మరాఠీ మాతృ భాషలుగా కల్గిన 88 శాతం ప్రజలపై 12 శాతం మంది మాట్లాడే ఉర్దూ భాషను నైజాం ప్రభుత్వం రుద్ది యూనివర్శిటీ స్థాయిలో బోధనా భాషగా కూడా ప్రవేశ పెట్టింది. సంస్థాన జనాభా 1 కోటి 65 లక్షలు తెలుగు మాట్లాడే వారు 90 లక్షల మంది ఉండేవారు. 1937 - 38లో బాలికల పాఠశాలలు 766 మాత్రమే ఉండేవి. పత్రికలు, లైబ్రరీలు నామమాత్రం ఉండేవి. తెలంగాణా ప్రాంతంలో 8 లైబ్రరీలు మాత్రమే ఉండేవి

నైజాం నిరంకుశ పాలనలో పౌర హక్కులు పూర్తిగా మృగ్యం. ఇత్తే హాదుల్ ముసల్‌మాన్ మినహా మిగిలిన రాజకీయ పార్టీలు నిషేధం. బ్రిటీషు ఇండియాలో స్వాతంత్ర్యం పోరాటం సాగుతున్నప్పటికీ హైద్రాబాదు సంస్థానంలో దాని ఛాయలు ఏమీ లెకుండా చాలా కాలం నైజాం నిరంకుశ ప్రభుత్వం జాగ్రత్త పడింది.

విద్యార్థుల కార్యకలాపాలపై అనేక ఆంక్షలు విధించారు. వారు ఏ రాజకీయ ఉద్యమంలోనూ, రాజకీయ కార్యకలాపాల్లోనూ పాల్గొన వీలులేదు.

ఉస్మానియా యూనివర్శిటీ ప్రవర్తనా నియమాల ప్రకారం యూనివర్శిటీ విద్యార్థుు ముందుగా యూనివర్శిటీ అధికారుల అనుమతి లేకుండా ఏ రాజకీయ, సామాజిక, సాంస్కృతిక సంఘాలలో చేరకుండానూ, ఏ బహిరంగ వేదిక నుండి ప్రసంగించ కుండానూ నిషేధించాయి.

## వందేమాతరం ఉద్యమం

పౌరహక్కుల అణచివేతకు వ్యతిరేకంగా ఉస్మానియా యూనివర్శిటీ విద్యార్థులు ప్రప్రథమంగా నడిపిన తీవ్ర నిరసన ఉద్యమం 1938 లో ప్రఖ్యాతి వహించిన "వందేమాతరం" ఉద్యమం. దేశ స్వాతంత్ర్య పోరాటం యొక్క ప్రభావం 1938 నవంబరులో, హైద్రాబాదులో ప్రారంభమైన స్టేటు కాంగ్రెస్ సత్యాగ్రహ పోరాటం యొక్క ప్రభావం కూడా విద్యార్థులపై పడింది.

ఉస్మానియా యూనివర్శిటీలోని హిందూ ప్రార్థనా మందిరంలో కొన్ని సంవత్సరాల పాటు వందేమాతరం గీతాన్ని ప్రతీరోజూ విద్యార్థులు పాడుకొంటూ వుండేవారు. 1938 నవంబరు 28 న యూనివర్శిటీ అధికారులు ఈ గీతాన్ని పాడ రాదని నిషేధించుతూ ఉత్తర్వులు జారీ చేశారు

ఈగీతం రాజకీయ వివాదాస్పదమైందనీ హిందూయేతర విద్యార్థుల భావాలను దెబ్బ తీస్తుందని నైజాం పాలకులు సాకులు చెప్పారు.

అధికారుల ఆజ్ఞలను ఉల్లంఘించి విద్యార్థులు వందేమాతరం గీతాన్ని పాడటం కొనసాగించడంలో ఉస్మానియా యూనివర్శిటీకి చెందిన 350 మందితో సహా హైదాబాదుకు చెందిన 1200 మంది విద్యార్థులు, మహబూబ్ నగర్‌కు

చెందిన 120 మంది, సిటీ కాలేజీకి చెందిన 70 మంది, వరంగల్, ఔరంగాబాదు, బీదర్ తదితర ప్రాంతాలకు చెందిన 350 మందికి పై విద్యార్థుల పేర్లను ఆయా విద్యా సంస్థల హాజరు పట్టినుండి కొట్టివేశారు.

స్టేటు కాంగ్రెస్ మితవాద నాయకత్వం విద్యార్థులపోరాటాన్ని బలపరచడం పోయి క్షమాపణ పత్రాలు వ్రాసి యిచ్చి విద్యాలయాల్లో తిరిగి చేరిపోమ్మని సలహా యిచ్చింది. ఈ వైఖరిని విద్యార్థులు త్రోసి పుచ్చారు. ఇందులో పెక్కు మంది విద్యార్థులు నాగపూర్ యూనివర్శిటీకి వలస పోయారు. హైద్రాబాదులోనే కాక, దేశమంతటా ఈ వందేమాతరం ఉద్యమం తీవ్ర సంచలనం కలిగించింది. జవహర్ లాల్ నెహూ్రి, ఆచార్య నరేంద్రదేవ్ ఎం. ఎన్. రాయ్ మున్నగు జాతీయ నాయకులు, సోషలిస్టు నాయకులుతో వీరు సంబంధాలు పెట్టుకున్నారు. వందేమాతరం విద్యార్థి సంఘాన్ని ఏర్పరచగలిగారు. స్టడీ సర్కిల్స్ నిర్వహించారు. ఎక్కువ మంది వామపక్ష భావాలవైపు మొగ్గారు. ఆరుట్ల రామచంద్రా రెడ్డి, సర్వదేవభట్ల రామనాథం, దేవులపల్లి వెంకటేశ్వరరావు మొదలైన అనేక మంది ఈ విధంగా సోషలిజం వైపు వచ్చారు. ఆ తరువాత తెలంగాణా కమ్యూనిస్టు ఉద్యమాన్ని నిర్మించిన ప్రముఖులలో వీరు కూడా ఉన్నారు. స్టేటు కాంగ్రెస్ మితవాద నాయకత్వం.

హైద్రాబాదులో బయలుదేరిన ఈ వందేమాతరం ఉద్యమాన్ని అణచడంలో, వారిని విద్యా సంస్థలనుండి వెళ్ళగొట్టడంలో ఆనాడు నిజాం ప్రభుత్వానికి కార్య నిర్వాహక అధ్యక్షుడుగా ఉన్న సర్ అక్బర్ హైదరీ ప్రధానపాత్ర వహించాడు. విశాఖపట్నం ఆంధ్ర యూనివర్శిటీ స్నాతకోపన్యాసం యివ్వవలసిందిగా అక్బర్ హైదరీని మద్రాసు గవర్నరు ఆర్థర్ హోప్ ఆహ్వానించాడు. ఇందుపై అక్బర్ హైదరీని స్నాతకోపన్యాసాన్ని బహిష్కరించాలనీ, హైద్రాబాదు విద్యార్థుల పోరాటంపట్ల సంఘీభావం ప్రకటించాలనీ, ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి సంఘం నిశ్చయించి ఆందోళన చేయడం, అక్బర్ హైదరీ తోకముడవడం జరిగింది. ఆంధ్రలో తెలంగాణా విద్యార్థి ఉద్యమం పట్ల ఇది తొలి సంఘీభావ చర్య అని చెప్పవచ్చు.

## కామ్రేడ్స్ అసోసియేషన్

స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహోద్యమం, వందేమాతరం విద్యార్థి ఉద్యమం సంస్థానంలోని యువజనులలో విద్యార్థులలో నూతనోత్సాహాన్ని, రాజకీయ చైతన్యాన్ని కల్గించింది. మరోవైపున ఆంధ్ర మహాసభలో క్రియాశీల నాయకత్వం ఆవిర్భవించింది. 1941 లో చిలుకూరులో జరిగిన ఆంధ్ర మహాసభకు శ్రీ రావి నారాయణ రెడ్డి అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డారు. ప్రజాతంత్ర సోషలిస్టు భావాలకు ఆంధ్ర మహాసభలో వ్యాపించసాగాయి.

ఒకవైపు ముస్లిం పాలక వర్గాలు, ముస్లిం విద్యార్థులలో, యువకులలో మత మత్తుమందు ప్రయోగించుతున్నప్పటికీ, మరోవైపు ప్రజాతంత్ర భావాలు

కల ముస్లిం విద్యార్థులు, ముస్లిం ప్రొఫెసర్లు కూడా వందేమాతరం ఉద్యమం పట్ల జాతీయ ఉద్యమం పట్ల సానుభూతి వ్యక్తం చేశారు. యూనివర్శిటీ అధికారులు అనుసరించుతున్న నిర్బంధ విధానాన్ని ఖండించారు. ఇట్టి ముస్లిం విద్యార్థి నాయకులలో సయ్యద్ అలం ఖుంద్‌మీర్, ప్రొఫెసరులలో హుసేన్ అలీఖాన్ ముఖ్యులు. వీరు సామ్రాజ్య వాదమునకు ఫాసిజానికి, నైజాం నిరంకుశ ప్రభుత్వానికి వ్యతిరేకంగా యువకులను సమీకరించడానికి నిశ్చయించారు.

1939 చివరి మాసాలలో వారు "కామ్రేడ్సు అసోసియేషన్" ఈ పేరుతో ఒక యువజన సంస్థను ఏర్పాటు చేశారు. అభ్యుదయ భావాలు గల ప్రొఫెసరు ఖలీఫా అబ్దుల్ హకీం కూడా ఈ సంస్థ స్థాపనకు తోడ్పడ్డారు. రాజబహద్దూర్ గౌడ్, మఖ్దుం మొహియుద్దీన్, జవాద్ రజ్వీ, ఓంకార్ ప్రసాద్, హుస్సేనీ షాహిద్, శ్రీనివాస్ లాహోటీ మొదలైన వారందరూ ఈ కామ్రేడ్సు అసోసియేషన్ సంస్థాపక సభ్యులలో ఉన్నారు. రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, పద్మజా నాయుడు, డాక్టర్ జయసూర్య మొదలైన వారందరూ ఈ సంస్థను ప్రోత్సహించి, తీర్చిదిద్దిన వారిలో ఉన్నారు. హిందూ ముస్లిం ఐక్యత, అన్ని కాలేజీలు, పాఠశాలల్లో విద్యార్థి సంఘాల నిర్మాణం, మహిళలకు సమాన ప్రతిపత్తి, కార్మిక, రైతు సంక్షేమం, నిరక్షరాస్యత నిర్మూలన మొదలైన ఆశయాల కోసం కృషి చేయడానికి ఈ సంస్థ వారు కార్యక్రమం తీసుకున్నారు. రాజీ వ్యతిరేక దినం, హిందూ ముస్లిం ఐక్యతా దినోత్సవం, జపాన్ వ్యతిరేక దినం మొదలగునవి జరిపారు. స్టేటు కాంగ్రెస్ నాయకులు వార్షికోత్సవ సభలకు హాజరవుతూండేవారు. ఈ సంస్థ నాయకులు పౌరసత్వ హక్కుల కోసం కృషి చేస్తూండేవారు. ట్రేడ్ యూనియన్‌ల నిర్మాణం కూడా చేశారు.

మూడవ వార్షికోత్సవానికి రాజ బహదూర్‌గౌడ్ అధ్యక్షత వహించారు సుత్తి, కొడవలి మధ్యలో తెల్లటి నక్షత్రం పొందుపరచిన అరుణ పతాకాన్ని వేదికపై అలంకరించారు. సామ్రాజ్యవాద కబంధ హస్తాల నుండి హైద్రాబాదు సంస్థానాన్ని విముక్తి గావించడమే తమ లక్ష్యమని అధ్యక్షులు తమ ఉపన్యాసంలో ప్రకటించారు.

శాస్త్రీయ సోషలిజం గురించి అధ్యయన తరగతులు నడిపారు. చట్టబద్ధమైన కమ్యూనిస్టు పార్టీ వేదికగా ఇది పని చేసిందని చెప్పవచ్చు. (1942 లో కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగించే వరకు)

## అఖిల హైద్రాబాదు విద్యార్థి సంఘం

హైద్రాబాదు సంస్థానంలోని విద్యార్థి ఉద్యమానికి ఒక సంఘటిత రూపం యివ్వడానికి 1939 అక్టోబరున ఒక తొలి ప్రయత్నం జరిగింది. అఖిల హైద్రాబాదు స్టూడెంట్సు ఎసోసియేషన్ పేరిట ఒక సంస్థ ఏర్పాటు చేయబడింది.

కాని యిది స్టేటు కాంగ్రెస్ నాయకత్వ పలుకుబడి క్రింద సంస్కరణవాద దిశగా విద్యార్థి ఉద్యమాన్ని మళ్ళించడానికి జరిగిన యత్నమే

అందువలన 1939 నవంబరులో వామపక్ష ప్రజాతంత్ర భావాలు గల విద్యార్థులలో మరో సమావేశం జరిగింది. శ్రీ రామానంద తీర్థ అధ్యక్షత వహించారు. ఈ సమావేశం వందేమాతరం ఉద్యమాన్ని బలపరచినప్పటికీ, విద్యార్థుల ప్రాథమిక హక్కులపై నిర్దిష్ట డిమాండ్లను రూపొందించడంలో విఫలమైంది.

వామపక్ష భావాలు గల ఓంకార్ ప్రసాద్, బి ఎస్. పరాంజిపే, కె బి. దేశపాండే, అంబాదాస్ వాద్వేల్కర్ తదితరులు కామ్రేడ్సు ఎసోసియేషన్‌కు చెందిన ఆలంఖుందుమిరి, ఇబ్రహీం, కుతుబ్-ఇ-ఆలం, దిల్వాకిర్ అలీఖాన్, రాజబహదూర్ గౌడ్, జవాద్ రజ్వీ, హుస్సేన్ షహీద్‌లు, ఔరంగాబాదుకు చెంది, ఉస్మానియా యూనివర్శిటీ హాస్టళ్ళలోని ప్రగతిశీల భావాలు కల ముస్లిం విద్యార్థులు వీరంతా కలిసి 1940 లో రెడ్డి హాస్టలులో ఒక సమావేశం ఏర్పాటు చేశారు. ఇందులో కమ్యూనిస్టు భావాలు గలవారిదే అగ్రస్థానం. స్వాతంత్ర్యం, శాంతి, ప్రగతి అన్న పతాకం క్రింద విస్తృత ప్రాతిపదిక గల అఖిల హైద్రాబాదు విద్యార్థి సంస్థను ఏర్పాటు చేయాలని ఈ సమావేశంలో నిర్ణయించారు. సమావేశానికి కమ్యూనిస్టు నాయకులు శ్రీ రావి నారాయణ రెడ్డి, బద్దం ఎల్లారెడ్డి మఖ్దూం మొహియుద్దీన్, రాజబహదూర్ గౌడ్, జవాద్ రజ్వీలు ఆధ్వర్యం వహించారు. వివిధ రాజకీయ పార్టీలకు, గ్రూపులకు చెందిన హిందూ - ముస్లిం విద్యార్థులందరిని, ఏ రాజకీయ పార్టీకి చెందనటువంటి ప్రగతిశీల భావాలు కల విద్యార్థులను సైతం సంస్థ ఆకర్షించి యిముడ్చుకోగల్గింది. 1941 జూన్‌లో అఖిల హైద్రాబాదు స్టూడెంట్సు యూనియన్ నిబంధనావళిని విడుదల చేశారు.

హైద్రాబాదు విద్యార్థి లోకాన్నంతా ఐక్యం చేయడం, విద్యా వ్యవస్థలో సంస్కరణలను ప్రతిపాదనలను సూచించడం, విద్యార్థుల హక్కుల కోసం పోరాడటం, పౌరహక్కుల బాధ్యతల ప్రాధాన్యాన్ని విద్యార్థులకు తెలియజేయడం సంస్థ లక్ష్యంగా ప్రకటించారు. విద్యార్థులలో క్షణ సమస్యలను రూపొందించారు.

1. ఉస్మానియా విశ్వవిద్యాలయానికి దేశవ్యాపిత గుర్తింపు పొందే నిమిత్తం ప్రభుత్వాన్ని ఒత్తిడి చేయడం.

2. విశ్వవిద్యాలయంలో అన్ని తరగతులలో ప్రవేశంపై గల అన్ని ఆంక్షలను తొలగించడం.

3. విశ్వవిద్యాలయ హాస్టళ్ళలో నిర్బంధంగా ఉండాలన్న షరతును రద్దు చేయించడం.

4. మెట్రిక్యులేషన్‌తో సహా అన్ని విశ్వవిద్యాలయ తరగతుల ద్వైవార్షిక పరీక్షల నిర్వహణ

5. సెలెక్షన్ పరీక్షల రద్దు.

6 బాలికలకు పెద్ద సంఖ్యలో ప్రాథమిక పాఠశాలల తక్షణ ఏర్పాటు.

1941 జనవరి 16న రాజా ప్రతాపగిర్జీ కోఠీలో డాక్టర్ గోపాలదాస్ అధ్యక్షతను ఎ హెచ్ ఎస్.యు ప్రారంభ సమావేశం జరిగింది. ఉస్మానియా విశ్వవిద్యాలయానికి చెందిన ప్రొఫెసర్ అబ్దుల్ మజీద్ సమావేశానికి ప్రారంభోత్సవం చేశారు. బి.కె. నారాయణ ఆహ్వాన సంఘాధ్యక్షులు. విద్యార్థుల డిమాండ్లన్నిటినీ తీర్మానాల రూపంలో ఆమోదించారు. అక్బర్ అలీఖాన్ కార్యదర్శిగా, ఓంకార్ ప్రసాద్ ఆర్గనైజింగ్ కార్యదర్శి, బి ఎస్. పరాంజిపే కోశాధికారిగా, రాజబహదూర్‌గౌడ్, జవాద్ రజ్వీ, బి కె. నారాయణ్, అంబాదాస్ వాద్వల్కర్ తదితరులు సభ్యులుగా కమిటీ ఏర్పాటు చేయబడింది.

కమ్యూనిస్టులు, కాంగ్రెస్‌వారు, సోషలిస్టులు, ప్రజాతంత్ర స్వభావం గల ముస్లిం విద్యార్థులు, చివరకు ఏ పార్టీకి చెందని విద్యార్థులను సైతం తనలో యిముడ్చుకొన్న ప్రప్రథమ రాష్ట్ర వ్యాపిత విద్యార్థిసంఘం ఎ హెచ్.ఎస్.యు. అనడంలో ఎట్టి సందేహం లేదు.

## ఉస్మానియా యూనివర్శిటీ విద్యార్థి యూనియన్ ఎన్నికలు

వందేమాతరం ఉద్యమం అనంతరం యూనివర్శిటీలోని హిందూ విద్యార్థులు విశ్వవిద్యాలయ విద్యార్థి యూనియన్ ఎన్నికలను బహిష్కరించారు ఈ సమస్యపై ఎ.హెచ్ ఎస్ యు. విద్యార్థుల డిమాండ్లపై స్పష్టంగా ఒక మ్యానిఫెస్టో తయారు చేసి, దాని ప్రాతిపదికపై హిందూ ముస్లిం విద్యార్థులను సమైక్యపరచగల్గింది. మతానికి అతీతంగా విద్యార్థులను సమీకరించి ఎన్నికలలో పాల్గొని చరిత్రాత్మక విజయం సాధించింది. లౌకిక ప్రజాతంత్ర పంథాలో ఎ.హెచ్.ఎస్.యు. తీసుకున్న వైఖరి హిందూ - ముస్లిం, మతతత్వవాదులను చిత్తు చేయగల్గింది. అటు ఆర్యసమాజ్, ఇటు ముస్లిం మతోన్మాదుల విచ్ఛిన్నకర మత ప్రచారాన్ని, యూనివర్శిటీ అధికారుల విచ్ఛిన్నకర అణచివేత చర్యలను ఎదుర్కొని తిప్పికొట్టగల్గింది. హాస్టళ్ళలో, బస్తీలలో వందలాదివిద్యార్థుల సమావేశాన్ని ఏర్పాటు చేసి బ్రహ్మాండమైన ప్రచారం చేసింది.

1941-42 విశ్వవిద్యాలయ విద్యార్థి యూనియన్ ఎన్నికలలో విజయం పొందడంతో విద్యార్థి లోకంలో ఎ. హెచ్. ఎస్. యు. ప్రతిష్ఠ బాగా పెరిగింది.

యూనియన్ ప్రధాన కార్యదర్శిగా ప్రముఖ విద్యార్థి నాయకుడు అక్విల్ అలీఖాన్ ఎన్నుకోబడ్డారు.

ఈ విజయం అనంతరం నగరంలోని వివిధ జిల్లాలోని వివిధ కళాశాలలు, పాఠశాలలకు విద్యార్థి ఉద్యమాన్ని ఎ. హెచ్. ఎస్. యు. విస్తరించగల్గింది విద్యార్థి సంఘాలను నిర్మించి పటిష్ట మొనరించగల్గింది.

1942 ఆగష్టు ఉద్యమంలో గాంధీజీ, నెహ్రూ, అబ్దుల్‌కలామ్ అజాద్ మున్నగు జాతీయ నాయకుల అరెస్టుకు నిరసనగా ఎ. హెచ్. ఎస్. యు. సమ్మెలు ప్రదర్శనలు నిర్వహించింది. ఈ సమరశీల పోరాటానికి ఎ. హెచ్. ఎస్. యు కార్యదర్శి ఓంకార్ ప్రసాద్, జావద్ రజ్వీ, డి. ఎస్. పరాంజిపేలు ధైర్యంగా నాయకత్వం వహించారు. సికింద్రాబాదులో శ్రీధర్, మార్కండేయ, ఎస్. మాధవరావు నాయకత్వం వహించారు. క్విట్ ఇండియా ఉద్యమం పట్ల అవలంభించవలసిన వైఖరిలో ఎ. ఐ. ఎస్ ఎఫ్‌లో చీలిక వచ్చిందిగాని హైద్రాబాదు విద్యార్థిఉద్యమంలో అందుకే చీలిక రాలేదు. దేశంలో ఇతరచోట్ల విద్యార్థి కాంగ్రెస్ ఏర్పడింది.

యుద్ధకాలంలో నిజాం ప్రభుత్వం ప్రజల పౌరసత్వ హక్కులను అణచివేసింది. ఉస్మానియా యూనివర్శిటిలోకూడా విద్యార్థులు, రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక కార్యకలాపాలలో, చివరకు విద్యార్థి సంఘ కార్యకలాపాలను కూడా నిషేధించారు. ఈ నిర్బంధ విధానంలోనే ప్రధాన కార్యదర్శి జావద్ రజ్వీని 1941లో యూనివర్శిటీనుండి బహిష్కరించారు.

తమ హక్కులు, స్వేచ్ఛలపై విధించబడిన ఆంక్షలపట్ల విద్యార్థులలో ఉన్న తీవ్ర అసంతృప్తి విద్యార్థులను రైల్వే పోలీసులు అరెస్టులు చేసిన సందర్భంలో, ఒక్కసారిగా పెల్లుబికి అయత్నకృత సమ్మెరూపంలో ప్రబద్దలై బయట పడింది. యూనివర్శిటీ విద్యార్థుల సార్వత్రిక సమ్మెకు ఎ హెచ్. ఎస్. యు. నాయకత్వం వహించింది. సమ్మె ముఖ్య నాయకులలో ఒకరైన కామ్రేడ్ ఓంకార్ ప్రసాద్‌ను విశ్వవిద్యాలయంనుండి అటుపిమ్మట బహిష్కరించారు.

యూనివర్శిటీ విద్యార్థుల సార్వత్రిక సమ్మె, డిమాండ్లపై ఎ. హెచ్. ఎస్. యు. వేసిన కరపత్రంలో పేర్కొన్న అంశాలు.

1. విశ్వ విద్యాలయంలో విద్యార్థి ప్రతినిధిని బేషరతుగా చేర్చుకోవాలి ?

2. సిఫారసులకు సంబంధించిన విషయాలను చూస్తున్న విచారణ కమీషన్ నివేదికను ప్రచురించాలి.

3. ఉస్మానియా విశ్వ విద్యాలయ విద్యార్థుల యూనియన్‌ను ప్రజాతంత్ర పంథాలో ఏర్పాటు చేయాలి.

4. ప్రవర్తనా నియమావళిని రద్దు చేయాలి
5. విద్యార్థుల పౌర స్వేచ్ఛలపై ఎలాంటి ఆంక్షలను విధించరాదు.
6. ప్రస్తుత ప్రతినిధుల వ్యవస్థను మార్చాలి.
7. విశ్వవిద్యాలయ న్యాయస్థానాన్ని ఏర్పాటు చేయాలి.
8. ఉస్మానియా విశ్వవిద్యాలయ విద్యార్థుల సమ్మెకు తోడ్పాటుగా రాష్ట్ర వ్యాపితంగా విద్యార్థులు సమ్మె చేయాలి.

ఈ సమ్మె పోరాటాలతోనూ, అంతకు ముందు నుండి (1940-44) ఎ. హెచ్ ఎస్.యు. సమరశీల పోరాట కార్యక్రమాలతోనూ ఒక రాష్ట్ర వ్యాపిత బలీయమైన స్వతంత్ర పునాది గల్గిన సంస్థగా నిజాం ప్రభుత్వ మతోన్మాద కుతంత్రాలను ఎదుర్కొని నిలబడగల్గిన సంస్థగా ఎ. హెచ్.ఎస్.యు. రూపొందింది. ఈ సమరశీల సంస్థను నిషేధించాలని ప్రభుత్వ ఉన్నతాధికారులు నిర్ణయానికి వచ్చారు. అయితే చివరకు చట్టబద్ధంగా నిషేధించడానికి బదులు ఎ. హెచ్. ఎస్.యు. దాని శాఖలను, అనుబంధ సంఘాలను రాజకీయమైనవిగా ప్రకటించింది. ఎ. హెచ్. ఎస్. యు లో సభ్యత్వాన్ని, లేదా కార్యకలాపాల్లో పాల్గొనడాన్ని నిషేధించింది. అయినప్పటికీ విద్యార్థి ఉద్యమాన్ని ఏమీ అణచలేక పోయింది.

## 1942 నాటికి ఎ.హెచ్.ఎస్.యు. నిర్మాణ పరిస్థితులు

అఖిల హైద్రాబాదు స్టూడెంట్సు యూనియన్ స్థాపించబడిన రెండు మూడేళ్ళలోనే (1940-41) హైద్రాబాదు నగరానికే కాక, తెలంగాణా అంతా తాలూకా స్థాయిలో వ్యాపించింది. బహిరంగసభలు జరుపుకోవడానికి అవకాశం లేనందున హాస్టళ్ళు విద్యార్థి సంఘ కార్యకలాపాలకు కేంద్రాలైనాయి. హైద్రాబాదు నగరంలో యూనివర్శిటీ హాస్టళ్ళు, రెడ్డి హాస్టల్, వైశ్యహాస్టల్, మరాఠీ హాస్టల్ మొదలైనవి. సూర్యాపేటలో క్రామేడ్ ధర్మబిక్షం, కరీంనగర్‌లో ప్రభాకరరావులు నడిపిన విద్యార్థి హాస్టళ్ళు, రాష్ట్రంలో వివిధ ప్రాంతాలలో ఇటువంటి అనేక హాస్టళ్ళు విద్యార్థి ఉద్యమ కేంద్రాలుగా వుండేవి. కేంద్రాలకే పై నుండి సర్క్యులర్లు పంపడం, కేంద్ర నాయకులువచ్చి సమావేశాలు జరపడం మొదలైనవి చేస్తూ ఉండేవారు

1942 జనవరిలో ఎ. హెచ్. ఎస్. యు. సన్నిహిత సదస్సు జరిగిన తరువాత 1942 డిసెంబరులో రెడ్డి హాస్టలులో ప్రథమ సదస్సు, 1943 నవంబరులో ద్వితీయ సదస్సు జరిగాయి. మొదటి సదస్సు నాటికే వరంగల్, నిజామాబాదు, మహబూబ్‌నగర్, వనపర్తిలలో యూనియన్ శాఖలు నిర్మించ

బడినాయి. రెండవ సదస్సు నాటికి ఖమ్మం జిల్లాకు వ్యాపించింది. ప్రతీ సదస్సులో సాంస్కృతిక కార్యక్రమాలు కూడా జరిగాయి. 1943 నవంబరులో రెడ్డి హాస్టలులో విద్యార్థి సాంస్కృతిక మహాసభ జరిగింది. హిందూ ముస్లిం ఐక్యత జాతీయ సమగ్రత గురించి, యూనివర్శిటీ ప్రొఫెసర్లు వచ్చి మాట్లాడారు. హైద్రాబాదు నగరం, వివిధ జిల్లాలకు చెందిన మరో విద్యార్థి సదస్సు 1945 లో జరిగింది. వరంగల్, నల్గొండ, నిజామాబాదు తదితర జిల్లాల నుండి విద్యార్థులు హాజరయ్యారు. ఉర్దూను నిర్బంధ భాషగా ఉంచుతూనే మాతృ భాష విద్యా బోధన జరుపాలనీ, అన్ని జిల్లాలలోనూ పరీక్షా కేంద్రాలు నెలకొల్పాలనీ, సాంకేతిక పాఠశాలలు ఏర్పరచాలనీ, ద్వైవార్షిక పరీక్ష పెట్టాలనీ ఇతర తీర్మానాలను చేశారు. వేసవి వయోజన విద్యా ప్రచార కార్యక్రమాన్ని కూడా రూపొందించారు.

తెలంగాణా ప్రాంతంలో అన్ని జిల్లాలకు, కొన్ని ఎ. హెచ్. ఎస్. యు. దాని క్రియా శీల కార్యకలాపాలు విస్తరించాయి. నల్గొండ, వరంగల్, ఖమ్మం, కరీంనగర్, మెదక్, మహబూబ్‌నగర్ తదితర యూనిట్లు చాలా క్రియాశీల మైనవి. ఆనాటి ముఖ్య కార్యకర్తలలో తీగల సత్యనారాయణ, లింగారెడ్డి, సీనారెడ్డి, టి. ఎల్. నరసింహారావు, యాదవరెడ్డి, సి హెచ్. రాజేశ్వరరావు, వెంకటరెడ్డి, సి హెచ్. హనుమంతరావు, నాగేశ్వరరావు, కి. శే. కేనల్ కిషన్ మొదలైన వారున్నారు. తెలంగాణా లోని వివిధ జిల్లాలో ప్రగతిశీల భావాలు కల కొంతమంది కాంగ్రెస్ విద్యార్థులు ఎ. హెచ్. ఎస్. యు. తో కలిసి పని చేస్తూండేవారు. వారిలో ముఖ్యులు కె. వి. నరసింగరావు, వి. రాజేశ్వరరావు, పి. మోహనరావు మొదలైన వారున్నారు.

హైద్రాబాదులో ఆనాడు నెలకొన్న విచిత్ర పరిస్థితుల్లో ఎ.హెచ్ ఎస్.యు. అధికారికంగా ఎ.ఐ.ఎస్.ఎస్ కు అనుబంధించబడలేదు. అయినప్పటికీ మొదట నుండి అది సౌహార్ద్ర సంబంధాలు కల్గి కౌన్సిల్ సమావేశాలకు, అఖిల భారత మహాసభలకు హాజరవుతూ, కార్యక్రమాలన్నింటిని నెరవేర్చుతూ వుండేది. ది స్టూడెంటు పత్రికను విరివిగా ప్రచారంలోకి తెచ్చింది.

1946 నుండి ప్రారంభమైన నైజాం వ్యతిరేక తెలంగాణ ఉద్యమంలో ఎ. హెచ్ ఎస్.యు. కు చెందిన ఎందరో కార్యకర్తలు పాల్గొన్నారు. అరెస్టులు, అజ్ఞాత వాసాలు, ఎదుర్కొన్నారు. "సజాయన్ ఇండియన్ యూనియన్ దే" సమ్మెలు, ప్రదర్శనలు జరిపారు. నైజాం నవాబు పరిపాలనను కూలద్రోయ

డానికి జరిగిన పోరాటంలో రజాకార వ్యతిరేక పోరాటంలో అనేక మంది విద్యార్థి కార్యకర్తలు పాల్గొన్నారు. గెరిల్లా దళాల్లో చేరారు. అనేక మంది ప్రాణాలు అర్పించారు. ఫ్యూడల్ నైజాం పరిపాలనను కూలద్రోసి, సంస్థానాన్ని భాషా ప్రయుక్తంగా విభజించి, విశాలాంధ్ర నిర్మాణం ఏర్పడడానికి జరిగిన చరిత్రాత్మక పోరాటంలో ఎ హెచ్.ఎస్ యు. తన వంతు పాత్రను నిర్వహించింది. విద్యార్థి ఉద్యమం నుండి వచ్చిన అనేక మంది కార్యకర్తలు కమ్యూనిస్టు పార్టీలు ప్రముఖ స్థానాలు వహించారు.

1. ఎస్. ఎమ్. జవాద్‌రజ్వీ రచించిన "హైద్రాబాదు సంస్థానంలో రాజకీయ చైతన్యం - విద్యార్థి యువజన సంఘాల" పాత్ర.

2. ఎ.ఐ.ఎస్.ఎఫ్. చరిత్ర - ఉజ్వల ఘట్టాలు - అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్ - ఆంధ్రప్రదేశ్ సమితి - ప్రచురణల ఆధారంగా.

# యువజనోద్యమం

1934 డిసెంబరు 31 న విశాఖపట్నంలో ఆంధ్ర రాష్ట్ర సోషలిస్టు పార్టీ మహాసభ జరిగింది. అదే రోజున అక్కడే ప్రథమ ఆంధ్ర రాష్ట్ర యువజన మహాసభ కూడా జరిగింది. తూర్పు గోదావరి జిల్లా కాంగ్రెస్ నాయకులలో ఒకరైన మల్లిపూడి పళ్ళంరాజుగారు అధ్యక్షత వహించారు. శ్రీయుతులు సుందరయ్య, తనికెళ్ళ చలపతి, బాలాంత్రపు సత్యనారాయణ, మల్లెమడుగుల జగన్నాథరావు మొదలైనవారు హాజరయ్యారు. శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్య అధ్యక్షులుగా, సుందరయ్య, బాలాంత్రం గారలు సంయుక్త కార్యదర్శులుగా ఎన్నుకోబడ్డారు.. ఇది సన్నాహక మహాసభగానే పేర్కొనవచ్చు.

తరువాత 1936 జనవరిలో ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు ప్రథమ మహాసభ కాకినాడ అన్నదాన సమాజంలో ఒక రాత్రి రహస్యంగా జరిగింది. పగలు ఆంధ్ర రాష్ట్ర యువజన మహాసభ జరిగింది. ఇది ద్వితీయ మహాసభ. శ్రీ జొన్నలగడ్డ రామలింగయ్య అధ్యక్షుడుగా, శ్రీ అల్లూరి సత్యనారాయణ కార్యదర్శిగా, శ్రీ చంద్ర రాజేశ్వరరావును సహాయ కార్యదర్శిగా ఎన్నుకున్నారు.

జాతీయోద్యమంలో భాగంగా వామపక్ష భావాలు, కల్గిన కాంగ్రెస్ వాదులు, సోషలిస్టులు, కమ్యూనిస్టులు కలిసి రాష్ట్ర యువజనోద్యమాన్ని నిర్మించిన ప్రారంభ దినాలు గురించి, ఉద్యమ మొదటి దశ గురించి 1938 జూలై 13 వ తేదీన నవశక్తి ప్రకటించిన "యువజనోద్యమం గూర్చి సోషలిస్టుల తీర్మానం"లో ఇలా వుంది.

## యువజనోద్యమ ప్రారంభ దశ

"1928-29 లలోనూ 1930-32 సంవత్సరాల మధ్య ఆంధ్ర రాష్ట్రంలో అక్కడక్కడా యువజన సంఘాలుండేవి. కాని ఆ యువజన సంఘాలను సంయుక్త (సంఘటిత) పరచే జిల్లా యువజన సంఘాలు కాని, రాష్ట్ర యువజన సంఘాలు కాని లేవు. వీటికి ఒక విధమైన అభిప్రాయాలు కాని కార్యక్రమం కాని ఉండేవి కావు.

"........యువకులందరూ ఎంతో ఉత్సాహంతో, కొద్దిలో స్వరాజ్యం సంపాదింప గల్గుతామని శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. కాంగ్రెస్ నాయకత్వం ఉద్యమాన్ని రెండు సార్లు అకస్మాత్తుగా ఆపడంతో, కొంత మంది

చోటా నాయకులలోనూ, ఉద్యమంలో పాల్గొన్న యువకులలోనూ అసంతృప్తి కల్గింది.

"........ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ ఏర్పడిన తర్వాత విశాఖపట్నంలో ఈ యువకులు, చోటా కాంగ్రెస్ నాయకులు సమావేశమై 1935 జనవరిలో రాష్ట్ర యువజన సభ జరిపారు. అప్పటికే కొంతమందికి సోషలిస్టులతో సంబంధంకల్గింది. పక్కన చేరిన యువకులలో ముఖ్యమైన వారికి సోషలిస్టు భావాలు కొంతవరకు ఏర్పడి ఉండినాయి. అక్కడ ఏర్పడ్డ (రాష్ట్ర యువజన సంఘ) కార్యవర్గంలో సోషలిస్టులే కార్యక్రమాల్ని సాగిస్తూ వచ్చారు.

"అప్పటికే సోషలిస్టులు పూర్తిఅయిన సెక్టేరియన్ దృక్పథం కల్గి ఉన్నారు. లేబర్ ప్రొటెక్షన్ లీగును పార్టీగా ఉపయోగించుతున్నట్లే, యూత్ లీగ్‌ను ఇంకా విశాలమైన పార్టీగా ఉపయోగించే వారు. యువజన సంఘాల ద్వారా రాజకీయాందోళన - లేబర్ ప్రొటెక్షన్ లీగ్‌ద్వారా కన్న ఎక్కువగా చేస్తూండే వారు. అక్కడక్కడా ఉన్న యువజన సంఘాలన్నింటిని రాష్ట్ర సంఘంక్రింద కేంద్రీకరించి, కార్యక్రమాన్ని యింకా ఎక్కువ తీవ్రంగానూ, నిర్మాణ యుక్తంగానూ కొనసాగించడానికి ఆంధ్ర రాష్ట్ర యువజన సంఘ సమావేశం మరొకటి కాకినాడలో జరిపారు. ఈ పర్యాయం నాయకత్వం పూర్తిగా సోషలిస్టులకు వచ్చింది." (నవశక్తి 1938 జులై 13 సంచికనుండి)

## కాకినాడ ద్వితీయ మహాసభ

1936 జనవరిలో జరిగిన మహాసభ వాస్తవంగా రాష్ట్ర ఉద్యమ నిర్మాణానికి నాంది పలికిందని, యువజన సంఘం-సోషలిస్టు పార్టీ రాజకీయ వేదికగా కాకుండా నిర్దిష్టమైన యువజన సంస్థగా, నిర్ణీతమైన యువజన కార్యక్రమాన్ని అమలు జేసే సంస్థగా పనిచేయడానికి ప్రయత్నాలు ప్రారంభించినదనీ, తీర్మానాన్నిబట్టి స్పష్టమవుతుంది.

1936లో జరిగిన రాష్ట్ర కమ్యూనిస్టుపార్టీ ప్రథమ మహాసభ నాటికి, కమ్యూనిస్టు పార్టీ అంతవరకు ఉన్న సెక్టేరియన్ దృక్పథం నుండి బైటపడి-కాంగ్రెస్‌ను సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్య సంఘటనకు వేదికగా చేయాలనీ, సామ్రాజ్య వాద వ్యతిరేక పోరాటంలోకి కార్మిక, కర్షక, యువజన, విద్యార్థి, మహిళా తదితర తరగతు లన్నింటిని వారివారి వర్గ సంఘాలద్వారా సమీకరించాలనీ నిర్దేశించిన దత్తు బ్రాడ్లీ థీసిస్‌ను అంగీకరించడం జరిగింది. యువజన సంఘాలను యువజన సంఘ కార్యక్రమం ప్రాతిపదికగా పనిచేయించాలనే కొత్త దృక్పథం వచ్చింది. అంతకుముందున్న సెక్టేరియన్ దృక్పథం వలన ఆచరణలో యువజన సంఘాలు కేవలం పార్టీ వేదికలుగా, ఉపాంగాలుగా ఎలా పనిచేస్తూ

ఉండేవి - 1938 సోషలిస్టుపార్టీ తీర్మానం ఇంకా ఇలా తెలుపుతుంది : "సోష లిస్టులకు సెక్టేరియన్ దృక్పథం అలాగే ఉండుట చేత, యువజన సంఘాల ద్వారా ఇదివరకు వలె ఆందోళన జరుపడమే కాక, కాంగ్రెస్ పనిని కూడా సాగిస్తూండేవారు. లేబర్ ప్రొటెక్షన్ లీగ్ వారు కాంగ్రెస్ పార్టీలో చేరిన తరువాత కూడా, సుమారు ఒక సంవత్సరం వరకు యువజన సంఘాల పనిని సరిగా అర్థం చేసుకోలేక, యువజన సంఘాల ద్వారా అంతకు పూర్వం జరుపుతున్న కార్యక్రమాన్నే కొనసాగిస్తూ ఉండేవారు కృష్ణా జిల్లాలో 1937 సంవత్సరం ఆఖరువరకు యువజన సంఘాల తరపున కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ పనిని సాగిస్తూండే వారు."

"......1937 సంవత్సరం మార్చి నెలలో బందరులో తృతీయ ఆంధ్ర రాష్ట్ర యువజన మహాసభ జరిగింది. ఇప్పటికి యువజన సంఘాల పాత్ర అర్థం చేసుకొని యువజన సంఘాలలో పనిచేయుటకు నియమించబడిన కామ్రేడ్స్ తప్ప మిగిలిన సోషలిస్టులందరూ యువజన సంఘాలనుండి బైటకి రావలయుననే నిశ్చ యానికి వచ్చారు. కాని ఆచరణలో ఇది కొంత మాత్రమే జరిగింది. యువజన సంఘాలు యువకులకు ఆర్థిక, రాజకీయ, సాంఘిక, శారీరక విషయాలలో తర్ఫీదునిచ్చే రంగాలుగా ఉండాలనే కార్యక్రమం అమలులో పెట్టక పూర్వమే కొత్తపట్నంలో (రాజకీయ పాఠశాలలో) లాఠీచార్జి జరిగింది ..యువజన సంఘా లలో పనిచేయడానికి నియమింపబడ్డ వారిని ఆ పనిమీద ప్రత్యేక శ్రద్ధ వహించు టకు వీలులేకుండా ఇతర ప్రజా సంఘాల పనికి నియమించడం జరిగింది."

"1937 నవంబరులో పాలకొల్లులో రాష్ట్ర యువజన సంఘ కార్యనిర్వా హక వర్గం సమావేశమై, పై చెప్పిన వారిని దీనినుండి (యువజన రంగంనుండి), తీసివేసి ఇతర కామ్రేడ్స్‌ను ఈ పనికి నియమించింది."

"యువజన సంఘాలు సోషలిస్టుల నాయకత్వం క్రింద నడుపబడుతున్న పార్టీ క్రింది సంస్థలు కావు. అయినప్పటికీ సోషలిస్టులు సెక్టేరియన్ దృక్పథంలో నడపబడడం వలన కాంగ్రెస్ మితవాద నాయకులు యువజన సంఘాలను విరోధ భావంతో చూస్తున్నారు. అంతేకాదు. యువజన సంఘాలు సోషలిస్టు పార్టీగా నడుపబడడంతో యువజన సంఘాలు ఎంత అభివృద్ధి చెందాలో అంత అభివృద్ధి చెందడడం లేదు."

## సెక్టేరియన్ పంథా

ఆనాటి యువజన సంఘాలు స్వరూప, స్వభావాలు ఏమిటో సోషలిస్టు యువజన సంఘాలవలె ఎలా పనిచేసేవో ఈ క్రింది ఉదాహరణలను బట్టి తెలుసు కోవచ్చు.

"1938 మార్చిలో మునగాల పరగణా యువజన మహాసభ జరిగింది. ఆ సందర్భములో జాతీయ జండాను, ఎర్ర జెండాను ఎగురవేశారు. జమీందారీ బిల్లు ప్యాసు కాకపోతే సత్యాగ్రహం చేయాలనీ, ఫెడరేషన్ ప్రతికూల పోరాటంలో పాల్గొనాలనీ, నైజాం రాజ్యంలో అమలు జరుపు పోరాటాలకు నాయకత్వం వహించాలనీ, మహాసభలో తీర్మానాలు చేశారు." (నవశక్తి 15-3-1938)

"నిడదవోలు యువజన సంఘం ప్రకాశం పంతులుగారి జమీందారీ రద్దు చట్టాన్ని బలపరుస్తూ తీర్మానం చేసింది.

వెంకటగిరి యువజన సంఘం సమావేశమై హిందూ, కృష్ణా పత్రికలు జమీందారీ, విచారణ కమిటీలకు వ్యతిరేకంగా వ్రాసినందుకు నిరసించింది.

(నవశక్తి 18-12-38)

ఆనాటి యువజన సంఘాలు ఎక్కువగా ఆనాటి పార్టీ రాజకీయ కర్తవ్యాలనే తమ వేదికలపై నుండి ప్రచారం చేస్తూండేవని ఈ తీర్మానాలను బట్టి స్పష్టమవుతుంది.

అప్పటికి యువజన జండా అంటూ వేరే ఏర్పడలేదు. అందుచేత జాతీయ జండాను, ఎర్ర జండాను రెండింటిని కలిపి ఎగురవేసేవారు. 1938 నాటికి రాష్ట్రంలో రాష్ట్ర యువజన సంఘ సభ్యత్వం 2200 - ప్రాథమిక సంఘాలు 170 మాత్రమే ఉండేవి.

ప్రత్యేకంగా యువకులకు అవసరమైన వైజ్ఞానిక శారీరక విషయాలలో తర్ఫీదు యివ్వడం ఇతర ప్రజా సంఘాల ద్వారా సాధ్యం కాదు. అందువల్ల ప్రత్యేకంగా యువజన సంఘాలు ఉండటం అవసరం."

యువజన సంఘాలు వర్గ సంఘాలు కావు. అన్ని వర్గాలలోని యువకులను సంఘటన చేసి తర్ఫీదు యివ్వాలి. యువకుల సాధారణ కోర్కెలకోసం ఆందోళన చెయ్యాలి."

—యువజనోద్యమం గూర్చి సోషలిస్టుల తీర్మానం-నవశక్తి 13-7-38

యువజన సంఘాలు వర్గ సంఘాలు కావనీ, అన్ని వర్గాల యువకులను సమీకరించవలసిన విశాల వేదికపైన ఈ తీర్మానం మరింత స్పష్టంగా చెప్పడం జరిగింది.

## సెక్టేరియన్ పంథాపై చర్చ

ఆనాడు సోషలిస్టు వారపత్రికగా ఉన్న (కమ్యూనిస్టు పార్టీ పత్రిక) నవశక్తిలో యువజన సంఘాల పాత్రపై ఆసక్తికరమైన చర్చ జరిగింది.

యువజన సంఘాలు రష్యాలోవలె యువ కమ్యూనిస్టు (కామ్సోమాల్స్) సంఘాలుగా ఉండాలని శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు ఒకవైపు; వలస పరాధీన దేశాలలో వలె యువజన సంఘాలు జాతీయ విమోచన ప్రధాన లక్ష్యంగా అన్ని వర్గాల యువకులను సమీకరించే విశాల వేదికగా ఉండాలని శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య మరొక వైపు వాద ప్రతివాదాలు జరిగాయి.

(నవశక్తి 15, 22 తేదీలు, ఫిబ్రవరి 1939)

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యవర్గ సభ్యుడు కుసెనిన్ తయారు చేసిన యువజన థీసిస్‌లో పరాధీన దేశాల యువజన సంస్థలు, కమ్యూనిస్టు పార్టీల వలె పని చేయకూడదని హెచ్చరిక నాటి యువజనోద్యమం గురించిన నూతన అవగాహనకు తోడ్పడింది.

ఇదే 1938 తీర్మానం యువజనసంఘాల దైనందిన కార్యక్రమం గురించి ఇలా తెలిపింది.

## కార్యక్రమం

"1. ఆటలు 2. అధ్యయన తరగతులు 3. రాత్రి పాఠశాలలు 4 లైబ్రరీలు 5. దినోత్సవాలు జరుపుట 6. వలంటీరు దళం 7. యువకులను ఎదుర్కొంటున్న ప్రధాన సమస్య అయిన యువకుల విద్యాభివృద్ధికై -నిరుద్యోగం తొలగించడానికై ప్రభుత్వంపై వత్తిడి చేయుట 8. కాంగ్రెస్ యితర ప్రజా సంఘాలకు సహాయం చేయుట.

పై కార్యక్రమాన్ని కొనసాగించడానికి పార్టీ చేయాల్సిన పనులు

1. వెంటనే రాష్ట్ర జిల్లా ఆఫీసులు పెట్టించి ఉత్తరప్రత్యుత్తరాలు జరిగేటట్లు చూడాలి.

2. రాష్ట్ర సంఘానికి ఒకరిని, ప్రతీజిల్లాకు ఒక్కొక్కరినీ పార్టీ సభ్యులను బాధ్యులుగా పార్టీ నియమించాలి. వీరికి ఇతర బాధ్యతలు ఉండకూడదు.

3. పైన ఉదాహరించిన బాధ్యులు కమిటీగా ఏర్పడి కార్యక్రమాన్ని అమలులో పెట్టడానికి పూనుకోవాలి.

రాష్ట్ర పార్టీ నెలసరి రిపోర్టులు తీసుకొని సరిగా పని జరిగేటట్లు చూడాలి.

## నిర్మాణంలో మార్పులు

14-25 సంవత్సరాల లోపు వారినే యువజన సంఘ సభ్యులుగా తీసుకోవాలి. రాష్ట్రం మొత్తం మీద పనినంతా సాగించడానికి కామ్రేడ్ చంద్ర

రాజేశ్వరరావును నియమించడమైనది. వీరు ప్రతి జిల్లాలోనూ ఒక్కొక్క వ్యక్తిని ఈ పనికి ప్రత్యేకించునట్లు చూడవలయును.

— నవశక్తి, 13-7-1938 యువజనోద్యమం గురించి సోషలిస్టుల తీర్మానం.

అంతవరకు యువజన సంఘ సభ్యత్వ వయస్సు 35 వరకు ఉండేది. అది 25 కు తగ్గించబడింది. అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్ ఆశయాలైన "స్వాతంత్ర్యం-శాంతి-అభ్యుదయం" యువజనోద్యమ ఆశయాలుగా ఆమోదించబడినాయి అదే యువజన పతాకగా స్వీకరించబడింది.

ఈ నూతన కార్యక్రమంతో యువజనోద్యమం అంతకు పూర్వం ఉన్న సెక్టేరియన్ దృక్పథం నుండి బైటపడి ఒక మూలమలుపు తిరిగిందని చెప్పవచ్చు. అన్ని వర్గాల యువకులను సమీకరించగల్గిన ఒక సువిశాల ఉద్యమంగా రూపొంద డానికి తగిన కార్యక్రమం లభించింది.

## మద్రాసులో రాష్ట్ర రాడికల్ యూత్ లీగ్

1935 మద్రాసులో ఆనాటి ఉమ్మడి మద్రాసు రాష్ట్ర ప్రాంత యువజన మహాసభ జరిగింది. దానికి రాడికల్ యూత్ లీగ్ అని పేరు పెట్టారు. అయితే అది ప్రధానంగా కమ్యూనిస్టు పార్టీ బహిరంగ కార్యకలాపాలకు వేదికగా మాత్రమే ఉద్దేశించబడింది. ఆంధ్ర నుండి కమ్యూనిస్టు దృక్పథం గల యువకులు చాలామంది హాజరయ్యారు. అందులో కొండేపూడి లక్ష్మీనారాయణ (పశ్చిమ గోదావరి జిల్లా) మొదలైన వారున్నారు.

# వివిధ జిల్లాల తొలి మహాసభలు

1936 ఫిబ్రవరి 29 వ తేదీన నెల్లూరు జిల్లా యువజన మహాసభ జరిగింది. అప్పుడే జైలు నుండి విడుదలై వచ్చిన ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధుడు, సోషలిస్టు నాయకుడు అయిన శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్య సభకు అధ్యక్షత వహించారు. తమ అధ్యక్ష ఉపన్యాసంలో శ్రీ అన్నపూర్ణయ్య దేశంలో యువజనులు కాంగ్రెస్‌ను వశపరచుకోవాలనీ, కార్మిక, కర్షక రాజ్య స్థాపనకై అది పోరాడేటట్లు చూడాలనీ విజ్ఞప్తి చేశారు.

## కృష్ణా జిల్లా

1936 మార్చి 26 న కృష్ణా జిల్లా యువజన మహాసభ బెజవాడలో జరిగింది. శ్రీ పి. వి. శివయ్య సభకు అధ్యక్షత వహించారు. (వివరాలు లభ్యం కాలేదు).

## పశ్చిమ గోదావరి జిల్లా

1936 మార్చి 2 వ తేదీన భీమవరంలో పశ్చిమ గోదావరిజిల్లా యువజన మహాసభ జరిగింది. శ్రీ గద్దే లింగయ్యగారు అధ్యక్షత వహించారు పిల్లలమర్రి వెంకటేశ్వర్లు ప్రారంభోత్సవం జరిపారు. గారపాటి సత్యనారాయణ అధ్యక్షులుగా, అల్లూరి సత్యనారాయణ కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు.

1936 లోనే (చివరి భాగంలో) ఆచంటంలో పశ్చిమ గోదావరి జిల్లా యువజన మహా సభ (ద్వితీయ సభ) జరిగింది. క్రొవ్విడి లింగరాజు గారు అధ్యక్షత వహించారు.

ఈ పైన జరిగిన అన్ని జిల్లా మహాసభలలోనూ, రాత్రి పాఠశాలలు, ఆటలపోటీలు, గ్రంథాలయాలు మొదలైన అంశాలతో కూడిన కార్యక్రమం ఈయబడుతుండేది.

## అల్లూరి సీతారామరాజు వర్ధంతి సభ నిషేధం

1936 జూన్ 23 న ఏలూరులో ఆంధ్ర రాష్ట్ర యువజన సంఘం ఆధ్వర్యాన తలపెట్టిన అల్లూరి సీతారామరాజు వర్ధంతి సభకు అధ్యక్షత వహించ వలసి ఉన్న మద్దూరి అన్నపూర్ణయ్య, గారపాటి సత్యనారాయణ, బసవరాజు రంగశాయి గారల మీద ప్రభుత్వం నిషేధాజ్ఞలు జారీచేసింది. సభ జరుగనీయ లేదు.

అప్పటికే పశ్చిమ గోదావరి జిల్లాలో ఏలేటిపాడు, జిన్నూరు, పోలమూరు, ఎండగండి, భీమవరం మొదలైన చోట్ల యువజన సంఘాలు స్థాపించబడ్డాయి.

## "చైనా డే"

ఆంధ్ర రాష్ట్ర యువజన సంఘ సహాయ కార్యదర్శి శ్రీ చంద్ర రాజేశ్వర రావు (వెంట్రప్రగడ - వయా ఇందుపల్లి - కృష్ణా జిల్లా నుండి) 1938 జనవరి 5 వ తేదీన ఒక ప్రకటన చేస్తూ జనవరి 9 వ తేదీన చైనా డే జరుపాలని విజ్ఞప్తి చేశారు. అందులో యిలా వుంది.

"చైనా డే జనవరి 9 న జరుపవలసిందిగా పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ పిలుపు యిచ్చారు. చైనా సహాయార్థం విరాళాలు వసూలు చేయాలని విజ్ఞప్తి చేశారు. అందుచేత ఆంధ్ర యువజనులు ఆంధ్ర దేశంలో మూలమూలలో జనవరి 9 న ఈ దినోత్సవం జరపాలి. జపాన్ సామ్రాజ్యవాదము చైనాపై దాడి చేసి విషవాయువు బాంబులను వేసే నిర్ణయంతో చైనా ప్రజలను హత్య చేస్తుంది. చైనాలో జాతీయ ఐక్య సంఘటన ద్వారా జపాన్ దాడిని ఎదుర్కొంటున్నారు. (కొమింటాంగ్ - కమ్యూనిస్టులు కలిసి) భారతదేశంలో మితవాద కాంగ్రెస్ వారు జాతీయ ఐక్య సంఘటన వద్దంటున్నారు. బ్రిటిషు సామ్రాజ్యవాద ప్రభుత్వానికి వ్యతిరేకంగా రైతు కూలీలను కాంగ్రెసులో చేర్చుకొని వారికి ప్రాతినిధ్యం యివ్వ నిరాకరిస్తున్నారు. ప్రపంచంలో సామ్రాజ్యవాదమునకు వ్యతిరేకంగా పోరాడే వారందరూ ఏకం కావాలి అందుచేత చైనా దినోత్సవం జరిపి, విరాళాలు వసూలు చేసి రాష్ట్ర యువజన సంఘానికి పంపాలి."

## లెనిన్ దినోత్సవం

ఆంధ్ర రాష్ట్ర యువజన సంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ అల్లూరి సత్యనారాయణ, 1938 జనవరి 21 వ తేదీన లెనిన్ దినోత్సవం దేశమంతటా జరిపి వారి సందేశాన్ని ప్రజలకు వినిపించాలని విజ్ఞప్తి చేశారు. సోవియట్ యూనియన్ నిర్మాత, మార్క్సిస్టు సిద్ధాంతాన్ని సంస్కరణ వాదాన్నుండి కాపాడి, భవిష్యత్ కమ్యూనిస్టు సమాజానికి పునాదులువేసి, ప్రపంచమంతా యుద్ధ భీతి నావహిస్తున్న సమయంలో సోవియట్ల శాంతి విధానాన్ని చాటుతూ, పెట్టుబడిదారీ విధానం సంక్షోభంలో మునిగిపోతుంటే సోవియట్‌లో సోషలిస్టు నిర్మాణాభివృద్ధి పథంలో నడిపిస్తున్న లెనిన్ ప్రపంచంలోని కష్ట జీవులకెల్ల పూజనీయుడు గనుక అట్టి మహాశయుని దినోత్సవం జరుపాలని ఈ ప్రకటనలో కోరారు. (సభలు ఎక్కడెక్కడ జరిగింది వివరాలు లేవు)

## స్వాతంత్ర్య దినోత్సవంపై నిషేధం తొలగింపు

1937 లో మద్రాసు కాంగ్రెస్ మంత్రి వర్గం స్వాతంత్ర్య దినోత్సవంపై నిషేధాన్ని తొలగించింది. ఇది మంత్రి వర్గమునకు కీర్తి రేఖ. జాతీయ ఐక్య సంఘటన క్రింద అందరమూ నడిచి సామ్రాజ్యవాద ప్రభుత్వాన్ని ఎదుర్కొని పోరాడాలని, స్వాతంత్ర్య దినోత్సవం విరివిగా జరపాలని రాష్ట్ర యువజన సంఘం తరపున శ్రీ అల్లూరి సత్యనారాయణ విజ్ఞప్తిచేశారు. రాష్ట్రంలో పలుచోట్ల యువజన సంఘాలు స్వాతంత్ర్య దినోత్సవాన్ని కడు ఉత్సాహంతో జరపాయి.

## రాష్ట్ర కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ మూడవ మహాసభ
## (1937 నవంబరు 20, 21, 22 తేదీలు)

పాలకొల్లు, నవంబరు 23 : ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ 3 వ మహాసభ పాలకొల్లులో నవంబరు 20, 21, 22 తేదీలలో జరిగింది. ఆహ్వాన సంఘాధ్యక్షులు అల్లూరి సత్యనారాయణ రాజు : ప్రారంభకులు జయప్రకాశ నారాయణ, సభాధ్యక్షులు పుచ్చలపల్లి సుందరయ్య-సభ జరుగుతుండగా ప్రతివాద భయంకర వెంకటాచారిగారు వచ్చారు. (కాకినాడ బాంబు కేసు) వారిని శ్రీ అల్లూరి సభకు పరిచయం చేశారు. బాట్లీవాలా కూడా జామీనుపై విడుదలై వచ్చి సభలో పాల్గొన్నారు.

సమ్మె చేస్తున్న తెనాలి విద్యార్థులను సభవారు అభినందించారు. మద్రాసు ఎడ్యుకేషనల్ రూల్సు 8 వ అధ్యాయము విద్యార్థుల వికాసమునకు భంగకరము కనుక దానిని రద్దు చేయాలని మహాసభలో మరో తీర్మానం ఆమోదించారు.

## రాష్ట్ర యువజన సంఘ సమావేశం

ఇదే సభ సందర్భంలో ఆంధ్ర రాష్ట్ర యువజన సంఘ కార్యనిర్వాహక వర్గ సమావేశం నవంబరు 22 ఉదయం అల్లూరి సత్యనారాయణ అధ్యక్షతక్రింద పాలకొల్లులో జరిగింది. (ఆంధ్రపత్రిక 1937 నవంబరు 7)

## ఆంధ్ర రాష్ట్ర యువజన సంఘ కార్యవర్గం

ఆంధ్ర రాష్ట్ర యువజన సంఘ కార్యనిర్వాహక వర్గ సమావేశం 1938 సెప్టెంబరు 3వ తేదీన కృష్ణాజిల్లా గన్నవరం తాలుకా వీరవల్లిలో ఆంధ్రరాష్ట్ర రైతు మహాసభ పెండాలులో జరుగుతుందని ప్రధాన కార్యదర్శి అల్లూరి సత్యనారాయణగారు (నవశక్తి 27-8-38) ప్రకటించారు. నేషనల్ యూత్ గార్డ్స్, నాల్గవ రాష్ట్ర యువజన మహాసభ, ఇతర విషయాలు ఎజండాగా తెలుపబడినాయి. వీరవల్లిలో జరిగిన రైతు మహాసభ పెండాలులోనే ఈ సమావేశం జరిగింది.

# 1937 – 1939లో ప్రాథమిక యువజన సంఘాల నిర్మాణం – కార్యకలాపాలు

అంతకుముందే కొన్ని ప్రాథమిక సంఘాలు ఏర్పడి పనిచేస్తున్నప్పటికీ, 1938 ప్రారంభంనుండి రాష్ట్రంలోని వివిధ జిల్లాల్లో ప్రాథమిక సంఘాలు నిర్మాణం ముమ్మరంగా ప్రారంభమైందని చెప్పవచ్చు. ప్రాథమిక సంఘాల ఎన్నికలు జరిపి జిల్లా మహాసభలు జరుపడానికి ప్రతినిధులు ఎన్నికలు, ఇతర సన్నాహాలు ప్రారంభించారు. ఆనాటి రాజకీయ సమస్యలన్నింటి పైన తీర్మానాలు గావించారు. మద్రాసు ఋణనివారణ చట్టానికి సవరణలు చేయాలనీ, జైలులో ఉన్న అమీర్ హైదర్‌ఖాన్‌ను విడుదలచేయాలనీ, విప్లవకారులపై సి. ఐ. డి. నిఘాలు రద్దుచేయాలనీ, కోరారు. స్వాతంత్ర్య దినోత్సవంపై నిషేధం తొలగి పోవడంతో యువజన సంఘాలు, స్వాతంత్ర్య దినోత్సవాన్ని గ్రామగ్రామాన పెద్దఎత్తున జరిపారు. ఆనాడు జరుగుతున్న విద్యార్థి పోరాటాలకు సంఘీభావం ప్రకటించారు.

## గుంటూరు జిల్లాలో యువజనోద్యమ నిర్మాణం

గుంటూరు జిల్లాల్లో శ్రీ అమరవాది కృష్ణమూర్తిని జిల్లా సంఘ ఆర్గ నైజరుగా రాష్ట్ర యువజన సంఘ కార్యనిర్వాహకవర్గం నియమించిబడి. జిల్లా లోని ప్రాథమిక యువజన సంఘాలపనిని కేంద్రీకరించి సాధ్యమైనంత త్వరలో జిల్లా యువజన మహాసభకు ఏర్పాటు చేయించు బాధ్యత తాను నిర్వహిస్తున్నా నని, సభ్యత్వ ఫారాలు ప్రణాళికలు అచ్చువేయించాననీ, సభ్యత్వ రుసుం సంవ త్సరానికి 0.2.0 ప్రణాళిక 0.0.3 చొప్పున పంపాలనీ, ప్రాథమిక సంఘాల వివరాలు, కార్యక్రమాల వివరాలు పంపాలనీ అమరవాది కృష్ణమూర్తి ప్రకటన చేశారు. (నవశక్తి 2-2-38)

## యువజన ప్రణాళిక వివరణ

గుంటూరు జిల్లా యువజన సంఘ ఆర్గనైజరు శ్రీ అమరవాది కృష్ణమూర్తి గారు యువజన సంఘం లెందుకు? శీర్షిక క్రింద 6-4-1938 నవశక్తిలో ఒక వ్యాసం వ్రాశారు. అందులో కార్మిక, రైతు సంఘాలతో బాటు యువజన సంఘాలు అన్ని తరగతుల యువకులను సమీకరించి జాతీయ పోరాటంలో

పాల్గొనేటట్లు చేయాలని తెలిపారు. "సత్వర స్వాతంత్ర్య సంపాదనకు యువజనులను సంసిద్ధులను చేయుట. యువజనులను సంఘసేవలో తర్ఫీదు చేయుట" అన్న ఆంధ్ర రాష్ట్ర యువజన సంఘ ప్రణాళికలోని అంశాన్ని వివరించారు. విద్యావసతులు, నిరుద్యోగ నివారణ, నూతన సాంఘిక విధానం కొరకు పోరాడాలని, విప్లవ చైతన్యం కల్గించాలని తెలిపారు. జాతీయ, అంతర్జాతీయ సమస్యలను గురించి యువజనులలో పరిజ్ఞానం, ప్రజలలో ప్రబోధం కల్గించాలని ప్రజలలో విద్యా విహీనత తొలగించాలని, యువకులకు అధ్యయన తరగతులు పెట్టి ఈ అన్ని సమస్యలను వారికి వివరించాలని, ప్రతిచోట తాలింఖానాలు స్థాపించాలనీ, వలంటీరు దళాలను ఏర్పరచాలనీ తెలిపారు.

యువజన సంఘాలు స్థాపించబడితే అవి కాంగ్రెస్‌కు పోటీ అవుతాయనే వారి వాదనను వ్యాసకర్త విమర్శించారు. వాటి సాంఘికావసరాన్ని వివరించారు.

## కొల్లూరు యువజన సంఘం

1939 మే 2వ తేదీన కొల్లూరు యువజన సంఘ సమావేశం కామ్రేడ్ కంభంపాటి సత్యనారాయణ, బి.ఎ. (ఆనర్స్) గారిని అధ్యక్షతను జరిగింది. కల్లూరి చంద్రమౌళి, ఎం ఎల్.ఎ. గారు ప్రారంభోత్సవం జరిపారు. 60 మంది ఎర్ర జండాలతోనూ, జాతీయ జండాలతోనూ ఊరేగింపు జరిపారు. ఏ యువకుడు సామ్రాజ్యవాద యుద్ధాలకు ఆహుతి కావద్దని ఉద్బోధించారు.

## ఖాజీపాలెం యువజన సంఘ తీర్మానాలు

గుంటూరు జిల్లా బాపట్ల తాలూకా ఖాజీపాలెం గ్రామ యువజన సంఘ సమావేశం శ్రీయుత పెండ్యాల లోకనాథం గారి అధ్యక్షతను జరిగింది. ఊటీ బ్యాంకు ఖైదీలు రాజకీయ ఖైదీలు కాదని ప్రధానామాత్యులు (రాజాజీ) పలుకుట శుద్ధ తప్పు; వారంతా రాజకీయ ఖైదీలే గావున ఎట్టి ఆలస్యం చేయక ఆ ఖైదీలను, అమీర్ హైదర్‌ఖాన్ గారిని వెంటనే విడుదల చేయాలని ప్రభుత్వం వారిని కోరారు.

"కామ్రేడ్ భయంకరాచారి గారి వెంట సి.ఐ.డీలను పంచుట రాజాజీ సమర్థించుకొనుచు చెప్పిన మాటలు అసమంజసంగా ఉన్నాయి. రాజకీయవాదులపై సి.ఐ.డి.లను వేయుట కాంగ్రెస్ ప్రతిష్ఠకే భంగంకరం గావున వెంటనే సి.ఐ డి. శాఖ రద్దుచేయాలని" కాంగ్రెస్ మంత్రులను కోరారు.

కాంగ్రెస్ నాయకులైన శ్రీయుత కాశేశ్వరరావుగారు మద్రాసులో ఉపన్యసిస్తూ హిట్లర్, ముస్సోలినీలను దేశభక్తులని చెప్పినందుకు నిరసించుచూ, ఇట్టి ఫాసిస్టు అభిమానులను కాంగ్రెస్‌లో తల ఎత్తనీయకుండా చేయాలని యువకులను ఈ సభ వారు హెచ్చరించారు.

యువజన సంఘం తరపున నవశక్తి పత్రికను తెప్పించుటకును, ఒక ప్రత్యేక గ్రంథాలయం ఏర్పరచుటకు తీర్మానించారు.

## కృష్ణా జిల్లాలో ఉద్యమ నిర్మాణం

కృష్ణా జిల్లా యువజన సంఘ కార్యనిర్వాహక వర్గం బెజవాడలో 16-1-38 వ తేదీన కాట్రగడ్డ రాజగోపాలరావుగారి అధ్యక్షతన జరిగింది.

మార్చి 15 లోపుగా వివిధ గ్రామ సంఘాలను స్థాపించాలనీ, గుంటూరు ఎ.సి. కాలేజీలోనూ, తాడంకి, గుడివాడ హైస్కూళ్ళలో విద్యార్థి సంఘాలు సాగించుతున్న సమ్మెలను బలపరుస్తూనూ, బీహారు రాష్ట్ర కాంగ్రెస్ సంఘం వారు రైతు సంఘాలలో కాంగ్రెస్ వారు పాల్గొనరాదని పెట్టిన నిషేధం సామ్రాజ్య వ్యతిరేక పోరాటం సన్నగిల చేయుచూ యునైటెడ్ ఫ్రంటుకు భంగం కలిగించు చున్నది గావున ఈ చర్యను వ్యతిరేకిస్తూ రాష్ట్ర రైతు సంఘం వారు సూచించిన సవరణ ప్రకారం ఋణ పరిష్కార చట్టం తయారుచేయాలనీ జనవరి 26 న స్వాతంత్ర్య దినోత్సవం జరుపవలెనని తీర్మానాలు ఆమోదించారు.

కృష్ణా జిల్లా యువజన సంఘ కార్య నిర్వాహక వర్గ సమావేశం 2-4-38 వ తేదీన బెజవాడలో రైతు సంఘం ఆఫీసులో జరిగింది. తృతీయ జిల్లా మహాసభను తాడిగడప (బెజవాడ తాలుకా)లో జరుపుటకునై సభకు అల్లూరి సత్యనారాయణగారిని అధ్యక్షులుగా ఆహ్వానించుటకు, కార్యనిర్వాహక వర్గానికి కానూరి బలరామయ్య గారిచ్చిన రాజీనామాను ఆమోదించుటకు, ఊటీ బాంబు కేసు ఖైదీలను, మద్రాసు బాంబు కేసు ఖైదీలను రాజకీయ ఖైదీలుగా నిర్ణయించి వదలిపెట్టాలని మద్రాసు ప్రభుత్వాన్ని హెచ్చరించుతూనూ, కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగించాలని కోరుతూనూ తీర్మానాలు ఆమోదించారు (కార్యదర్శి - రామినేని పిచ్చయ్య)

## కృష్ణా జిల్లాలో గ్రామ సంఘాల నిర్మాణం

**విశ్వనాథపల్లి :-** కృష్ణా జిల్లా విశ్వనాథపల్లి గ్రామంలో యువజన సంఘం స్థాపించబడింద బుర్రా కృష్ణమూర్తి కార్యదర్శిగా, వేమవరపు వెంకటాచలం, శంకరమంచి సూర్యనారాయణ జాయింటు సెక్రటరీలుగా ఎన్నుకోబడ్డారు నవశక్తి, వాహిని, ప్రజాబంధు తెప్పించుటకు; బాట్లీవాలాను విడుదల చేయాలని, సి.ఐ.డి. శాఖ రద్దు చేయాలని మొదలగు తీర్మానాలు చేశారు. (నవశక్తి 15-2-38)

**కొక్కిలి గడ్డ :-** కృష్ణా జిల్లా కొక్కిలిగడ్డ గ్రామ యువజన సంఘం వారు కామ్రేడ్ ఈడ్పుకంటి పరమేశ్వరరావుగారి అధ్యక్షతను స్వాతంత్ర్య

దినోత్సవం జరిపారు. కామ్రేడ్ కోనేరు రాజగోపాలరావుగారు 1857 నుండి నేటి వరకు జరిగిన స్వాతంత్ర్యపోరాటం గురించి వివరించారు.

జమీదింటకుర్రు :- కృష్ణాజిల్లా జమీదింట కుర్రులో ఇతర సంఘాలు వారందరితో కలిసి యువజన సంఘంవారు బ్రహ్మాండమైన స్వాతంత్ర్యదినోత్సవం ప్రదర్శన జరిపారు.

**గుడివాడ** :- 1938 ఆగస్టు 26న గుడివాడ పట్టణ యువజన సంఘం సమావేశమై నూతన సంవత్సరానికి కామ్రేడ్ శెట్టిపల్లి వెంకటరత్నంగారిని తిరిగి అధ్యక్షులుగా, సూరపనేని శేషగిరిరావుగారిని కార్యదర్శిగా కె.డి. భుజంగభూషణ రావుగారిని సహాయ కార్యదర్శిగా ఎన్నుకున్నారు.

## కృష్ణాజిల్లా స్పోర్టు కమిటీ

కృష్ణాజిల్లా స్పోర్టు కమిటీ మీటింగు 16-9-38 న తేదీన గుడివాడలో జరుగుతుందని కన్వీనర్ కాట్రగడ్డ రాజగోపాలరావు ప్రకటించారు.

కృష్ణాజిల్లా యువజన సంఘం వారి యాజమాన్యాన కృష్ణా జిల్లా రైతాంగ విద్యాలయ ఆవరణలో (పొట్టిపాడు) అక్టోబరు 25 నుండి చెడుగుడు, 100గజాల పరుగు, 4 మైళ్ళ సైకిలు స్పీడు, అరమైలు పరుగు, లాంగ్ జంప్, క్రికెట్ బాల్ విసరులు మొదలగు పందెములు జరుగును. వక్తృత్వ పోటీలు - వ్యాసరచన పోటీలు ఈ దిగువ విషయంపై జరుగును అని సమావేశానంతరం వీరు ప్రకటించారు. (నవశక్తి, 28-9-28)

1. స్వాతంత్ర్య పోరాటంలో యువకుల కర్తవ్యం ఏమిటి? 2. ఆంధ్ర రాష్ట్ర ప్రాప్తికి అవసరమైన మార్గమేమిటి? 3. యుద్ధంవస్తే మనం ఏంచెయ్యాలి? 4. వయోజన విద్యా వ్యాప్తికి మార్గాలేమిటి? 5. యువజనుల ఎడ కాంగ్రెస్ కర్తవ్యాలేమిటి? మున్నగు అంశాలపై చర్చ (డిబేట్)జరుగుతుందనీ, కత్తిసాము, కర్రసాము, ప్రదర్శనలు జరుగుతాయని జిల్లాలోని 14-30 సంవత్సరాల మధ్య యువకులు పాల్గొన వచ్చుననీ కృష్ణాజిల్లా యువజన సంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ కాట్రగడ్డ రాజగోపాలరావు తెలియజేశారు.

## ఆటల పోటీలు వివరాలు

1933 అకోబరు 25 నుండి కృష్ణా జిల్లా పొట్టిపాడులో మొట్టమొదటి సారిగా ఆంధ్ర యువజన ఒలింపిక్స్‌ను కృష్ణా జిల్లా యువజన సంఘం నిర్వహించింది. ఈ ఒలింపిక్స్‌లో ఆంధ్రజాతీయ క్రీడలు చెడుగుడు, ఉప్పట్లు మున్నగు అనేక గ్రామీణ ఆటలు పునరుద్ధరించ బడినవి. ఈ చెడుగుడు (కబడికి) కొత్త నిబంధనలు ఏర్పరచ బడినవి. ఇతర ఆధునిక ఆటలు పాటలు బాడ్మింటన్, హైజంప్, లాంగ్‌జంప్, షాట్‌పుట్ మొదలైన పోటీలుకూడా నిర్వహించబడినాయి.

ఇందులో వందలాది యువకులు పాల్గొన్నారు. వేలాది యువకులు చూశారు. యువజన సంఘాధ్వర్యాన ఆటల పోటీలకు ఈ ఒలింపిక్స్ ఎంతో ఉత్సాహాన్నిచ్చాయి. ఆ తరువాత అనేక జిల్లా తాలూకాలలో ఆటల పోటీలకు ఇది నాంది పలికాయి.

## ఆదిమాంధ్ర యువజన సంఘం

5-7-39 న గుడివాడ తాలూకా మందపాడు గ్రామంలో ఆదిమాంధ్ర యువజన సభ జరిగింది. కామ్రేడ్ కమతం వెంకటేశ్వర్లు యువజన సంఘాలు జాతి భేదం లేకుండా జాతీయోద్యమానికి సహాయం చేయాలనీ ఉద్బోధించారు. ఆ రోజుననే తాలూకా సంఘాన్ని స్థాపించారు. అధ్యక్షుడు ఎన్. సూర్యనారాయణ, ఉపాధ్యక్షుడు కె. చలమయ్య, కార్యదర్శి ఆర్. నాగభూషణం, సహాయ కార్యదర్శి కె. నారాయణ రావు.

## జిల్లా సంఘ రాజకీయాందోళన

కృష్ణా మండల యువజన సంఘం సాధారణ సమావేశం 1937 జూలై 27 దినమున గుడివాడ స్థానిక అహింసా సంప్రదాయ భవనమున శ్రీ పిడికిట మాధవరావుగారి అధ్యక్షతను జరిగింది

మండల మహాసభ ఆగష్టు ఆఖరు వారమున దివి తాలూకాలో జరుపుటకు తీర్మానించారు. కొత్త పట్నం స్కూలుపై నిషేధం తొలిగించి నిర్బంధితులపై కేసులు ఎత్తి వేయాలని కోరుతూను, అమీర్ హైదర్‌ఖాన్ గారిని వెంటనే విడుదల చేయవలసిందిగానూ, ఇదివరకు వశపరచుకొన్న పత్రికల ధరావత్తులను ఆస్తులను వాపసు చేయాలని కోరుతూనూ, (కాంగ్రెస్ మంత్రి వర్గము వారిని) ఆగష్టు 2 వ వారంలో ఆంధ్ర రాష్ట్ర రైతు యాత్రలో పాల్గొనే వారికి సర్వ సహాయాలు చేయుటకు, అందులో యువకులు పాల్గొనేటట్లు చేయుటకు "రైతు సంఘం మొదలైన కాంగ్రెసేతర సంఘాలు అనవసరము, కాంగ్రెస్ అందరికీ ప్రాతినిధ్యం వహిస్తుంది. గ్రామ, పట్టణ కాంగ్రెస్ సంఘములన్నియు, మంత్రులకు ఏజంట్లుగా ఉండవలెనని" (మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ పి. రాజగోపాలాచారి) చెప్పుటను నిరసించుతూ, యువజనులు సామ్రాజ్య వ్యతిరేక సంఘములలో కలిసి ఆగష్టు 1 వ తేదీన యుద్ధ ప్రతికూల దినము జరుపాలనీ తీర్మానాలు చేశారు. (1937 జూలై 28, ఆంధ్రపత్రిక)

## కృష్ణా జిల్లా ద్వితీయ యువజన మహాసభ (1937 ఆగస్టు 27)

మచిలీపట్నం, ఆగస్టు 28 : నిన్నటి రోజున కృష్ణా జిల్లా ద్వితీయ యువజన సభ దివి తాలూకా మొవ్వ గ్రామంలో కామ్రేడ్ అన్నాప్రగడ కామేశ్వరరావు

గారి అధ్యక్షతను జయప్రదంగా జరిగింది. ఎస్.ఎస్. బాట్లీవాలా సభను ప్రారంభించారు హజరాబేగం గారు సభలో మాట్లాడారు

ఆహ్వాన సంఘాధ్యక్షులు మండవ కనకయ్య గారు స్వాగతోపన్యాసం చేశారు. బలము గల దేశాలు బలహీన దేశాలను మ్రింగివేస్తున్నారనీ, మన దేశంలో కాంగ్రెస్ మంత్రివర్గాలు అధికారంలో ఉన్నప్పటికీ వాటి పరిమిత అధికారాల వలన ఏమీ చేయలేకపోతున్నారని అన్నారు. అండమాను రాజకీయ ఖైదీలను ఈ మంత్రులు విడిపించలేకపోతున్నారని విమర్శించారు. దేశంలో కార్మిక రాజ్యం స్థాపించవలసిందని కోరారు.

బాట్లీవాలాగారు మాట్లాడుతూ గ్రామీణ దారిద్ర్యం, విద్యావంతులు నిరుద్యోగం, జమీందార్ల విలాస జీవితాలు, గాంధీగారి మానసిక పరివర్తన సిద్ధాంతం, పెట్టుబడిదారీ దోపిడీ విధానం, రష్యాలో కార్మిక, కర్షక రాజ్య స్థాపన మొ॥ విషయాలపై మాట్లాడారు.

అన్నాప్రగడ కామేశ్వరరావుగారు అధ్యక్షోపన్యాసంలో బ్రిటిషు ప్రభుత్వం బాలభటోద్యమం ద్వారా విద్యార్థి యువకులలో ప్రభుభక్తి పరాయణత నేర్పుతుందనీ దీనికి వ్యతిరేకంగా యువకులు యువజనోద్యమం నిర్మించుకోవాలనీ, ఫాసిస్టు దేశాలలో యువజనులను తప్పుదోవల్లో పెట్టారనీ, స్వారమ్ ట్రూపర్స్‌గా తయారు చేస్తున్నారనీ, కాని సోవియట్, చైనాలలో యంగ్ కమ్యూనిస్టు లీగ్‌లు ఏర్పాటు చేసుకొని యువకులు సామ్యవాద సిద్ధాంతాలను అనుసరిస్తున్నారనీ, వలస దేశాలలో యువకులు సామ్రాజ్య వ్యతిరేక పోరాటాలలో పాల్గొని స్వాతంత్ర్యం కోసం పోరాడాలని అన్నారు. భారతదేశంలో యువకులు టెర్రరిజం వైపు పోరాదనీ, అయితే భగత్‌సింగ్, అల్లూరి సీతారామరాజు మున్నగు విప్లవ యోధులు ఎన్నో త్యాగాలు చేశారనీ అన్నారు.

నేడు మన దేశంలో సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనలో కార్మిక, కర్షక, యువజన సంఘాలు స్థాపించి జాతీయోద్యమంలో పాల్గొనాలని, యువజన సంఘాలు, శరీరకాభివృద్ధి తాలింఖానాలు, కర్రసాము, మిలిటరీ డ్రిల్లు, ఈత, మోటారు డ్రైవింగు, రాత్రి పాఠశాలలు, పఠన మందిరాలు, వేసవి శిబిరాలు, సంఘ సంస్కరణ ఉద్యమం, రాజకీయ విద్యాలయాల స్థాపన మున్నగు కార్యక్రమాలు సాగించాలని ఉద్బోధించారు. యూత్ గార్డ్స్ (వలంటీరు దళాలు) తయారు చేయాలన్నారు. స్పెయిన్, చైనాలలో జరుగుతున్న యుద్ధాలు వాటి వెనుక సామ్రాజ్యవాద కుట్రలు వివరించారు.

హజ్రాబేగంగారు సాహిత్యం, కళలద్వారా ప్రజలను ఉత్తేజపరచాలని, కొత్తపట్నం రాజకీయ పాఠశాల ఉదంతం గురించి నాటకం వ్రాయాలనీ,



**కృష్ణా జిల్లా ద్వితీయ యువజన మహాసభ సందర్భముగా 1937 ఆగస్టులో దివి తాలూకా మొవ్వ గ్రామంలో బాట్లీవాలా**

కూర్చున్నవారు ఎడమ నుండి కుడికి

**కొల్లి** సీతారామయ్య, **బాట్లీవాలా,** పుచ్చలపల్లి సుందరయ్య, అన్నాప్రగడ కామేశ్వరరావు, చలసాని జగన్నాధరావు, కడియాల గోపాలరావు.

**మహిళలు ఎడమ నుండి కుడికి**

హజారా బేగం, చంద్ర సావిత్రీదేవి, కామేశ్వరమ్మ, అదేవరుసలో చివరినున్నవారు వల్లభనేని రామబ్రహ్మం మిగిలినవారి పేర్లు గుర్తించలేక



కామ్రేడ్స్ అసోసియేషన్ కార్యవర్గ సభ్యులు (1940-41)

ఎడమ నుండి కుడికి జవాద్ రజ్వీ, రాజ బహదూర్ గౌడ్, మనిక్‌లాల్ గుప్త, ఆలం ఖుంద్ మీర్, ఓంకార్ ప్రసాద్, మీర్ యూసఫ్ అలీఖాన్, సబుద్-ఎ-ఆలం.

కార్టూన్‌లు, బొమ్మలు, పోస్టర్లు ద్వారా కూడా ప్రచారం చేయాలనీ, ఆడపిల్లలను కూడా ఉద్యమంలోకి తీసుకురావాలని అన్నారు.

అల్లూరి సత్యనారాయణ, రావి ఆదిశేషయ్య, ఎస్ కె. అయ్యంగారు, బి. శ్రీనివాసరావు, ఎస్ వి. ఘాటే మున్నగువారు సభకు సందేశాలు పంపారు.

## తీర్మానాలు

అండమాన్ ఖైదీలను విడుదల చేయాలనీ, అండమాన్ ఖైదీల విడుదలకు ఆందోళన చేస్తున్న (బెంగాల్‌లో) వారిపై లాఠీచార్జీలను ఖండిస్తూనూ, కొత్త పట్నం స్కూలు మీద ఆంక్షను తొలగించాలని కోరుతూనూ, సెప్టెంబరు, రైతు దినోత్సవాన్ని జరుపాలనీ, ఎం ఎన్.రాయ్ ప్రచారం చీలిక కల్గించుతూన్నందుకు ఖండిస్తూనూ, కార్మిక, కర్షక సంఘాలు కూడదనే సి రాజగోపాలాచారి వైఖరిని ఖండిస్తూ, ఇండియా ప్రభుత్వ సైన్యాలను చైనాపైకి పంపిన బ్రిటిషు ప్రభుత్వ చర్యను బుల్లాభాయ్ దేశాయ్ సత్యమూర్తి గారలు ఆమోదం తెలిపినందుకు ఖండిస్తూ, ఖద్దరు కట్టాలి అనే నియమము రద్దుచేయాలని, అఖిల భారత కాంగ్రెస్ సంఘానికి సిఫారసు చేస్తూ, కృష్ణా, ఆంధ్ర పత్రికలు సోషలిస్టు పార్టీకి, యువజన రైతు సంఘాలకు చెందిన వార్తలు ప్రకటించనందుకు అసమ్మతి తెలుపుతూ, వారు తమ విధానాలను మార్చుకోకపోతే, ఆపత్రికలను బహిష్కరించ వలసిందిగా హెచ్చరించుతును, కాంగ్రెస్ సంఘ సభ్యత్వం ఒక అణాకు తగ్గించాలని కోరుతూ జైళ్ళలో ఎ బి.సి. క్లాసులను రద్దుచేసి, రాజకీయ ఖైదీలకు ప్రత్యేక తరగతి ఏర్పాటు చేయాలని కోరుతూనూ తీర్మానాలు చేశారు.

నూతన సంవత్సరానికి శ్రీ కడియాల గోపాలరావు అధ్యక్షులుగా, చలసాని జగన్నాధరావు ప్రధాన కార్యదర్శిగా, రామినేని పిచ్చయ్య సహాయ కార్యదర్శిగా, పెండ్యాల వెంకటేశ్వరరావు, కాట్రగడ్డ రాజగోపాలరావు, కోనేరు రాజగోపాల రావు, పిల్లలమర్రి వెంకటేశ్వరరావు, వాసిరెడ్డి నారాయణరావు, చంద్ర సావిత్రి దేవి, సుంకర వీరభద్రరావులను సభ్యులుగా ఎన్నుకొన్నారు.

(ఆంధ్ర పత్రిక 1937 సెప్టెంబరు 2)

## కృష్ణా జిల్లా తృతీయ యువజన మహాసభ (1938 ఏప్రిల్ 20)

కృష్ణా జిల్లా తృతీయ యువజన మహాసభ, బెజవాడ తాలుకా తాడిగడపలో 20-4-38 వ తేదీన జరిగింది. సభకు ఆంధ్ర రాష్ట్ర యువజన సంఘ ప్రధాని కామ్రేడ్ అల్లూరి సత్యనారాయణ అధ్యక్షత వహించారు. సభను ప్రసిద్ధ మీరట్ కుట్ర కేసు ఖైదీ కామ్రేడ్ జోగ్లేకర్ ప్రారంభించారు. నవశక్తి సంపాదకులు కామ్రేడ్ మద్దూరి అన్నపూర్ణయ్య జాతీయజండా, ఎర్రజండాలు ఎగురవేశారు. ఈ

సమయంలోనే అల్లూరి సత్యనారాయణపై ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సంఘం వారు ఆంక్షలు విధించనందువల్ల వాతావరణం ఉద్రేకపూరితమైంది. వీరు రెండేళ్ళపాటు కాంగ్రెస్ సంఘాలకు ఎన్నుకోబడరాదని ఆంక్ష విధించిన ఈ విషయాన్ని రాష్ట్ర కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి సుందరయ్యగారు తంతి ద్వారా తెలియజేశారు. (సభ జరుగుతుండగా) సభ ముందు జోగ్లేకర్, అల్లూరి, అన్నపూర్ణయ్య గార్లను పెద్ద ఊరేగింపుగా తీసుకువెళ్ళారు. జాతీయ జండాలు, ఎర్రజండాలు చేబూని యువకులు "విప్లవం వర్ధిల్లాలి! సామ్రాజ్యవాదం నశించాలి" అని నినాదాలు చేస్తూ ఊరేగారు. "కార్మికులు, కర్షకులు, కరమూ, కరమూ కలిపి జై మనకు, జైయంచు జేజేలు" అని పాటలు పాడుతూ జేజేలు కొట్టారు. గ్రామ రైతులు, స్త్రీలు ఉత్సాహంతో ఈ ప్రదర్శనను చూశారు.

అన్నపూర్ణయ్యగారు పతాకోత్సవం జేస్తూ జాతీయ జండా స్వాతంత్ర్యానికి చిహ్నం. ఎర్రజండా కార్మిక, కర్షక రాజ్యానికి చిహ్నం. జాతీయస్వాతంత్ర్యాధికారం కష్ట జీవుల పరమైనపుడు అది కార్మిక కర్షక రాజ్యముగా పరిణమించును. అప్పుడు ఎర్ర జండాయే జాతీయ జండాయగును. "నాడు కాకినాడలో జిల్లా కలెక్టరు బ్రేకన్ జాతీయ జండాను చూసి చిందులు తొక్కెను. నేడు తెనాలిలో డాక్టరు పట్టాభిగారు ఎర్ర జండాయున్న చోట అడుగు నిల్పనని వెళ్ళిపోయెను". అని అన్నపూర్ణయ్య గారు ఆవేశ పూరితంగా చెప్పిన మాటలకు సభ అంతా చప్పట్లతో మార్మోగెను. ఎర్రజండా తత్వం వారిని కాంగ్రెస్‌లోనుండి తరుమగొట్టడానికి ఆంధ్ర దేశంలో అల్లూరితో బోణి అయిందని ఆయన అన్నప్పుడు సిగ్గు సిగ్గు అని కేకలు ప్రతిధ్వనించెను.

కామ్రేడ్ జోగ్లేకర్ మాట్లాడుతూ (ఆయన 1926-27 నాటి కమ్యూనిస్టు) వర్గ పోరాటం జాతీయ పోరాటంగా ఎట్లు పరిణమించునో సహేతుకంగా నిరూపించాడు. అల్లూరి సత్యనారాయణపై తీసుకున్న డిసిప్లినరీచర్య వ్యక్తిగతము కాదనియు, సోషలిస్టులను, అతివాదులను అరికట్టేందుకు ఆరంభమని అన్నారు. ప్రజాందోళన ద్వారా సామ్రాజ్యవాదంతో ఢీకొనవలెనని అన్నారు.

ఆహ్వాన సంఘాధ్యక్షులు కిలారు వెంకట సుబ్బారావు స్వాగతం చెప్పారు. కామ్రేడ్ అల్లూరి తన అధ్యక్షోపన్యాసంతో ప్రపంచ పరిస్థితులను సింహావలోకనంచేస్తూ యుద్ధం ఏ క్షణాన్నైనా రావచ్చుననీ, ఆ తరుణాన్ని హిందూదేశం స్వాతంత్ర్యసిద్ధికై వినియోగించాలని, యుద్ధంకొరకే ఫెడరేషన్‌ను, ఇంగ్లాండు మన దేశంపై రుద్దడానికి ప్రయత్నిస్తూందనీ అన్నారు. కాంగ్రెస్ మంత్రివర్గాలు ప్రజలకు చేసిన ఉపకారాలు వివరించారు. అయితే అదే సమయంలో చీరాల కాల్పులు, వాల్టీవాలా నిర్బంధము, సి. ఐ. డీలు ప్రజా సేవకులను వెంటాడుట

మున్నగు అకృత్యాలు కాంగ్రెస్ హయాంలో జరుగుతున్నందుకు విమర్శించారు. ఆంధ్ర దేశానికి ఆదర్శ యువకుడైన అల్లూరి సీతారామరాజును ప్రశంసించారు. ఆయన చరిత్రను వ్రాసిన పొన్నలూరి రాధాకృష్ణమూర్తిని, దానిని ప్రకటించిన అతివాద గ్రంథమండలిని స్తుతించారు. నవశక్తిని విశేషంగా ప్రశంసించి అది యువకుల పత్రిక అని ప్రకటించారు.

## తీర్మానాలు

అల్లూరి సత్యనారాయణ ప్రభృతులపై రాష్ట్ర కాంగ్రెస్ వర్కింగు కమిటీ చర్యను నిరసించుతూ శ్రీమతి ఈడ్పుగంటి రత్నమాంబ తీర్మానం ప్రవేశపెట్టారు. కాట్రగడ్డ నారాయణరావు ఎం. ఎల్.ఎ. గారు తీర్మానాన్ని బలపరిచారు. మైసూరు, చీరాల కాల్పులనుఖండించారు. హార్వెల్ రిపోర్టును ఆమోదించిన మద్రాసు కాంగ్రెస్ ప్రభుత్వ వైఖరి పూర్తిగా ఖండించారు. కాంగ్రెస్ మంత్రి వర్గాల కృషిని అభినందిస్తూనూ, వారింకా చేయవలసిన పనులను సూచిస్తూనూ తీర్మానాలు అంగీకరించారు. కమ్యూనిస్టు పార్టీపై నిషేధాన్ని తొలగించాలని కోరారు.

సాంవత్సరిక నివేదికను కార్యదర్శి శ్రీ రామినేని పిచ్చయ్య ప్రవేశపెట్టారు. కృష్ణాజిల్లాలో 140 గ్రామ సంఘాలు 2 వేల మంది సభ్యులు ఉన్నారు.

కామ్రేడ్ కడియాల గోపాలరావుగారినే అధ్యక్షులుగా, కాట్రగడ్డ రాజగోపాలరావు ప్రధాన కార్యదర్శిగానూ, రామినేని పిచ్చయ్యగారు సహాయకార్యదర్శిగానూ 11 మంది కార్యవర్గ సభ్యులను ఎన్నుకొన్నారు.

## జిల్లా యువజన సంఘ కార్యదర్శి ప్రకటన

అల్లూరి సత్యనారాయణగారు, గారపాటి సత్యనారాయణలు పశ్చిమ గోదావరి జిల్లా కాంగ్రెస్ అధ్యక్ష కార్యదర్శులుగా సమర్థవంతంగా పనిచేశారు. ఇట్టి వారిపై రెండేళ్ళు కాంగ్రెస్ సంఘములలో ఎన్నిక సభ్యులుగా ఉండరాదని రాష్ట్రకాంగ్రెస్ కార్యవర్గం నిషేధాజ్ఞలు జారీ చేసింది. ఇందుపై కృష్ణా జిల్లా యువజ సంఘ కార్యదర్శి కాట్రగడ్డ రాజగోపాలరావు ఖండిస్తూ ఇది అతివాదులను అణచుటకు తీసుకొన్న చర్యయని, యువజన సంఘాలు ఖండించుతూ తీర్మానాలుచేసి అఖిల భారత కాంగ్రెస్‌కు పంపించాలనికోరారు.

అల్లూరి అప్పుడు ఆంధ్ర రాష్ట్ర యువజనసంఘ ప్రధాన కార్యదర్శిగానూ, అఖిల భారత కాంగ్రెస్ సంఘ సభ్యులుగాను ఉన్నారు.

## పశ్చిమ గోదావరి జిల్లాలో ఉద్యమ నిర్మాణం

పశ్చిమ గోదావరి జిల్లా యువజన సంఘ కార్యనిర్వాహక వర్గ సమావేశం 20-1-1938వ తేదీన పాలకొల్లులో యువటూరి వీరభద్రరావుగారి అధ్యక్షతను

జరిగింది. ప్రాథమిక సంఘ ఎన్నికలు జరిపి జిల్లా మహాసభను తణుకులో జరుపుటకు నిర్ణయించారు, అని కోసూరు సుబ్బన్న (రాజు) జిల్లా సహాయ కార్యదర్శి ప్రకటించారు.

## తుందుర్రు

పశ్చిమ గోదావరి జిల్లా నర్సాపురం తాలుకా తుందుర్రు గ్రామ యువజన సంఘం 1-4-38వ తేదీన 10 మంది సభ్యులతో ఏర్పరచబడింది. అధ్యక్షులుగా ఆరేటి వీరాస్వామి, కార్యదర్శిగా శ్రీ చీడీ శేషారావు ఎన్నుకోబడ్డారు. (కోసూరి సుబ్బరాజు - పశ్చిమ గోదావరి జిల్లా యువజన సంఘం కార్యదర్శిగా ఉన్నారు.)

భీమవరంలో - భీమవరం తాలుకా యువజన సంఘ వార్షికోత్సవం 12-1-39న జరిగింది. అల్లూరి సత్యనారాయణగారు అధ్యక్షత వహించారు. గుడిపాటి లింగరాజుగారు సభను ప్రారంభించారు.

త్రిపుర కాంగ్రెస్ మహాసభకు మరల బోసుగారినే ఎన్నుకోవాలని, ప్రకాశం కమిటీ రిపోర్టును (జమీందారీ రద్దు) బలపరుస్తూనూ, ఫెడరేషన్‌ను కాంగ్రెస్ నాయకులు ప్రతిఘటించాలని కోరుతూనూ, అల్లూరి సత్యనారాయణ గారిపై డిసిప్లినరీ చర్యను తొలగించాలని కోరుతూ సభలో తీర్మానాలు చేశారు.

## తూర్పు గోదావరి జిల్లాలో ఉద్యమ నిర్మాణం

**కాకినాడ :-** కాకినాడ పట్టణ యువజన మహాసభ 1938 మార్చిలో జరిగింది. శ్రీ సి వి. కృష్ణారావుగారు అధ్యక్షత వహించారు. ఎస్. రామచంద్ర రావును ప్రెసిడెంటుగా, నారాయణను వైస్ ప్రెసిడెంటుగా, రామమూర్తిని, కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు.

## జిల్లా మహాసభ సన్నాహాలు

తూర్పు గోదావరి జిల్లా ద్వితీయ యువజన మహాసభ యిదివరలో ప్రకటించినట్లు మార్చి 25వ తేదీగాక, ఏప్రిల్ 8న చేకువెట్టు పాలెంలో జరుగుతుందనీ, ఆహ్వానసంఘ అధ్యక్షుడు శ్రీ అల్లూరి సీతారామరాజు తెలిపారు.

## తూర్పు గోదావరి జిల్లా యువజన మహాసభ

తూర్పు గోదావరి జిల్లా రాజోలు తాలూకాలో చేకిశెట్టిపాలెంలో కామ్రేడ్ మహీధర రామమోహన రాయ్ (రావు) గారి అధ్యక్షతను తూర్పు గోదావరి జిల్లా యువజన మహాసభ 1938 ఏప్రియల్ 8 న జరిగింది. జిల్లా అంతటి నుండి ప్రతినిధులు వచ్చారు. ఉదయం 7 గంటలకు జాతీయ జండాతోనూ, ఎర్ర జండాతోనూ గ్రామ వీధులన్నీ ఊరేగిన తరువాత తూర్పు గోదావరి జిల్లా మహిళా సంఘ కార్యదర్శిని శ్రీమతి ముప్పలనేని పుష్కరాంబగారు జాతీయ పతాకం ఎగురవేశారు మధ్యాహ్నం అల్లూరి సీతారామరాజుగారు ఆహ్వాన సంఘాధ్యక్షో

పన్యాసం యిచ్చారు. ఆంధ్ర రాష్ట్రి కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ సంయుక్త కార్యదర్శి కామ్రేడ్ జొన్నలగడ్డ రామలింగయ్య గారు ప్రారంభ ఉపన్యాసం యిచ్చారు. తరువాత ప్రధాన కార్యదర్శి కామ్రేడ్ పి. అనంతం గారు గత సంవత్సరం కార్యనివేదికను యిచ్చారు

కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగించవలసిందని, యుద్ధ ప్రతికూల ప్రచారం సాగించవలసిందనీ, మొదలైన తీర్మానాలు చేయబడ్డాయి. సభకు సుమారు 1000 మంది హాజరయ్యారు అనేక మంది స్త్రీ, పురుష ప్రతినిధులు ఉపన్యసించారు. నూతన సంవత్సరానికి శ్రీ మహీధర్ రామమోహరాయ్‌గారు అధ్యక్షులుగానూ, కామ్రేడ్ అల్లూరి సీతారామరాజుగారిని ప్రధాన కార్యదర్శిగానూ, శ్రీమతి నంబూరు మహాలక్ష్మమ్మ సంయుక్త కార్యదర్శిగానూ, మరి కొందరిని కార్యనిర్వాహక సభ్యులుగానూ ఎన్నుకొన్నారు.

## రామచంద్రాపురం తాలూకా యువజన మహాసభ

తూర్పు గోదావరి జిల్లా రామచంద్రాపురం తాలూకా యువజన మహాసభ 1938 జూన్ 19 వ తేదీన కోరుమిల్లిలో కామ్రేడ్ అల్లూరి సత్యనారాయణరాజు గారి అధ్యక్షతను జరిగింది కామ్రేడ్ పి. అనంతంగారు సభా ప్రారంభం చేశారు. 300 మంది హాజరయ్యారు.

జాతీయోద్యమంలో యువజనులు, కర్తవ్యాలు, యువజనోద్యమాన్ని శ్రామిక వర్గోద్యమంతో జత చేయకపోతే వచ్చే నష్టాలు ఇటలీ, జర్మనిలో ఫాసిజం వ్యాపించడానికి, రష్యాలో, చైనాలో కమ్యూనిజం వ్యాపించడానికి యువజన సంఘాలు ఏలాగు తోడ్పడ్డాయో, భారత జాతీయోద్యమంలో యువజనుల స్థానం, కర్తవ్యం నిరూపిస్తూ అధ్యక్షులు ఉపన్యసించారు యువజన సంఘాలు 1) తాలింఖానాలు ఏర్పర్చడం. 2) గ్రంథాలయాలు నడపడం 3) చర్చలు (డిబేటు) ప్రారంభించడం 4) గ్రామ సంబంధమగు పనులలో సంపూర్ణంగా పాల్గొనడం. 5) దివోత్సవాలు సాగించడం. 6) వీలు చిక్కినన్ని ఉపాయాలలో ప్రజలను స్వాతంత్ర్య ఉద్యమానికి సిద్ధం చేయడం మున్నగు కర్తవ్యాలను నిర్వహించాలని తెలియజేశారు.

సభవారు కాశీనాధుని నాగేశ్వరరావు, దేవులపల్లి సూర్యనారాయణరావు, బారు రాజారావుగార్ల మృతికి సంతాపం వెలిబుచ్చారు. మద్రాసు రాష్ట్రింలో పౌరసత్వ హక్కులను అరికట్టినందుకు నిరసించారు. ఫెడరేషన్ పట్ల నిరసన తెలుపాలనీ సంయుక్త ప్రతిఘటన నిర్మించాలనీ, అతివాదుల ఎడల కాంగ్రెస్ మితవాదుల చర్య నిరసించుతూనూ, (అల్లూరి వగైరాలపై ఆంక్షలు) చైనా, స్పెయిను పోరాటాల వల్ల సానుభూతి తెలుపుతూనూ యుద్ధం పట్ల ప్రతికూలత

తెలుపుతూనూ, రాజకీయ ఖైదీల విడుదల చేయాలనీ, కమ్యూనిస్టు పార్టీపై నిషేధం ఎత్తివేయాలనీ, సోషలిస్టు పుస్తకాలపై నిషేధం తొలగించాలనీ తీర్మానాలు ఆమోదించారు.

1. కారల్ మార్క్స్ ఉపదేశాలు. 2. కమ్యూనిస్టు మానిఫెస్టో, 3. అభినవ భారత చరిత్ర, రష్యా విప్లవం (1905) మున్నగు గ్రంథాలపై నిషేధం తొలగించాలని, కార్యకర్తలపై పోలీసు నిఘా తొలగించాలి అని మరో తీర్మానంలో ఆమోదించారు. రాజకీయ ఖైదీల విడుదల చేయాలనీ, కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగించాలనీ, శ్రీనివాస ప్రెస్‌కు యిచ్చిన బెదిరింపు రద్దు చేసుకోవాలనీ కూడా తీర్మానించారు.

## రాజమండ్రిలో స్టడీ సర్కిల్

రాజమండ్రి సిటీ యువజన సంఘ కార్యాలయంలో, కాశీ విశ్వవిద్యాలయం అధ్యాపకులు శ్రీ కాశీపట్నం కొండయ్యగారు (ఎమ్.ఎస్.సి.) స్టడీ సర్కిల్‌కు ప్రారంభోత్సవం జరిపారు. (నవశక్తి 21-9-38)

**ఆత్రేయపురం :-** తూర్పు గోదావరి జిల్లా ఆత్రేయపురం యువజన సంఘ సమావేశం 1938 ఆగస్టు 27న జరిగింది. ముదునూరు సూర్యనారాయణ రాజు అధ్యక్షులుగా, కామ్రేడ్ ఎమ్. సూర్యనారాయణ, కె. సుబ్రహ్మణ్యం గార్లు జాయింటు కార్యదర్శులుగా ఎన్నుకోబడ్డారు. యుద్ధ ప్రతికూల ప్రచార నిరోధక చట్టాన్ని నిరసించుతూ తీర్మానించారు పంచాయతీ బోర్డు చేయవలసిన పనులు సూచించారు.

## రాజమండ్రి హరిజన విద్యార్థి వసతి గృహం

"తూర్పు గోదావరి మండలంలో ఇంగ్లీషు చదువుకొను హరిజన బాలురకు ఉచితముగా అన్నము పెట్టి చదువు చెప్పించుటకు తగిన వసతి గృహం లేక పోవుటచే మేము ఇట్టి వసతి గృహం ఒకటి స్థాపించి జరుపుటకు నిశ్చయించాము. తాలుకాకు ఒక హరిజన బాలుని చొప్పున ఈ ఏడాది ఎనిమిది మంది హరిజన బాలుర భోజన ఖర్చులు అన్నీ కలిపి రు. 80/-అగును. విరాళాలు యివ్వవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం" అని ఈ దిగువ ప్రముఖులు ఒక సంయుక్త విజ్ఞాపనం చేశారు.

చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు, క్రొవ్విడి లింగరాజు, అరవ ఆదినారాయణ, బోడే చిట్టయ్య, అరవ వెంకటస్వామి, బి. మల్లప్ప, డా॥ పి. గురుమూర్తి, దేవత శ్రీరామమూర్తి, బి.ఎన్. మూర్తి, పాము రామమూర్తి, రావు సాహెబ్, చుక్కా అప్పలస్వామి, బత్తుల కామాక్షమ్మ, గోలి రామన్న, ఉడ్ల పుల్లయ్య, కె. వెంకట్రామయ్య, కట్టా సూరయ్య, నేలపూడి సూర్యనారాయణ,

వడ్డాది గురవయ్య, సిరియాల అప్పలస్వామి, వంగల వెంకటరావు, సాకచంద్ర రావు, నక్కా వెంకటరెడ్డి, గోవాడ నిరీక్షణరావు, కర్పోతు సోమన్నగారలు ఈ సంయుక్త విజ్ఞాపనపై సంతకాలు చేశారు. (నవశక్తి, 10-7-1939)

## హరిజన యువజన మహాసభ

తూర్పు గోదావరి జిల్లా రామచంద్రాపురంలో ఆది ఆంధ్ర బోర్డింగు నందు 26-12-1937 సాయంత్రం శ్రీ బి. వెంకన్న బి.ఎ. గారి అధ్యక్షతను హరిజన యువజన మహాసభ జరిగింది. 50 మంది యువకులు హాజరయ్యారు.

ఆ రోజుల్లో వెనుకబడిన కులాల ముఖ్యంగా ఆదిమాంధ్ర (హరిజన) యువకులలో సాంఘిక, రాజకీయ చైతన్యం తీసుకురావడానికి రాష్ట్ర యువజన సంఘం కృషిచేసింది. పార్టీ సభ్యులు, సామభూతిపరులు ప్రత్యేకంగా జరిగిన హరిజన యువకుల సభలలో పాల్గొని వర్గ కోర్కెలను ఆ వేదికలపైనుండి కూడా చాటడానికి కృషి చేశారు.

సభలో శ్రీ ఈలివాడ పల్లిగారు ప్రస్తుతం నిమ్న జాతి అనుభవించుచున్న బాధల గూర్చి వ్యవసాయ కూలీలు అనుభవించుతున్న కష్టాలు, రాత్రి పగలు కష్టపడినను తిండిబెట్టలేని స్థితి గురించి మాట్లాడారు. వ్యవసాయ కూలీ సంఘాలు విరివిగా స్థాపించవలెనని, కార్మిక బాలబాలికలకు ఉచిత విద్యతోబాటు చేతిపనులు, నేత పనులు, నేత నూలువడుకుట, నవారు వేయుట, చాపలు అల్లుట, కమ్మరము, మిషను కుట్టుట, వ్యవసాయము మున్నగు చేతిపనులు నేర్పించవలెననీ, అందుకు తగు రీతిగా హరిజన యువకులను ప్రోత్సహించాలనీ హరిజనులు తమలో ప్రబల మైన దురాచారాలను విసర్జించాలని, మద్యపానం నిర్మూలించాలని అన్నారు. శ్రీ రెడ్డి కామయ్య మాట్లాడుతూ నిమ్న జాతిలో ఐక్యత ఉంటేనే తప్ప కార్మికాభివృద్ధి కలుగదని, ప్రతి పల్లెలో పంచాయతీ ఏర్పరచి తగవులు తీర్చునట్లు ఏర్పాటు చేయాలనీ, విద్య అంటూ లేని కార్మిక తల్లితండ్రులకు, హితబోధ చేయవలెనని, అప్పుడు గాని మన జాతిపైకి రాదనీ అన్నారు.

అధ్యక్షులు మాట్లాడుతూ నిమ్న జాతిలో విద్యనెక్కువ మంది నేర్చినగాని, జాతికి గౌరవం రాదనీ ప్రభుత్వం నిమ్న జాతి వారికి పాఠశాలలు నిర్మించుట, ఉచిత విద్య నేర్పించుట, గృహములు లేని వారికి గృహములు, పరపతి సంఘాలు నెలకొల్పుట మొదలగు సహాయములు చేయాలని కోరారు. మద్రాసు ప్రభుత్వం నిమ్న జాతులలో వున్నా బడ్జెటు చేయనందుకు విచారం వెలిబుచ్చారు.

రాబోవు శాసనసభ సమావేశంలోనైనా నిమ్మజాతి కొరకు తగు సహాయం చేయాలని ఒక తీర్మానంలో కోరారు. మద్రాసు అసెంబ్లీ హరిజన ఎం.ఎల్.ఎ. ఈ విషయంలో ఆందోళన చేయనందుకు విచారం వెలిబుచ్చారు. ఆంధ్ర రాష్ట్ర

నిర్మాణం కోసం యువకులు ఆందోళన చేయాలని, అది ఆంధ్ర అభ్యున్నతికి ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం అత్యవసరమని తీర్మానించారు. సెలవు దినాలలో ఆదిమాంధ్ర విద్యాధిక యువకులు అన్ని గ్రామాలలో తీవ్ర ప్రచారం చేయాలనీ, మద్రాసు ప్రభుత్వం వారు పెట్టు మారిటోరియం బిల్లు వల్ల వ్యవసాయ కార్మికులకు ఏ విధమైన లాభంలేదనీ ఆ బిల్లు కార్మికులకూ అందకూ ఉపయోగ పడునట్లు మార్పు చేయాలనీ కోరారు.

కనీస కోర్కెలు :- తిండి, పొలం, స్వాతంత్ర్యం, శాంతి కావాలి. మగవాళ్ళకు 8 అణాలు, స్త్రీలకు 6 అణాలు రోజు కూలి యివ్వాలి. రోజుకు 8 గంటల పని, వెట్టిచాకిరి నిరోధించాలి, మన బిడ్డలకు ప్రభుత్వం వసతి గృహాలు ఏర్పాటు చేయాలి, ఉచిత నిర్బంధ విద్య యిస్తూ పిల్లలకు తిండిబట్ట యిస్తూ చేతిపనులు నేర్పించాలి. పనులు లేని రోజులలో పని చూపించి జీవనాధారము కల్పించాలి. భీమా పరపతి సంఘాలు ఏర్పరచాలి చిన్న పిల్లలచేత కూలిగాని, పాలేరుతనం గాని చేయించరాదు. అక్రమాలు నీచంగా ఎంచబడు దురాచారాలు, వ్యక్తి స్వాతంత్ర్యాన్ని అరికట్టే మూఢాచారాలు హెచ్చు వడ్డీలు నిషేధించాలి.

ఈ హరిజన యువజన మహాసభ ఆనాడు కనీస వేతనం, పని గంటలు మొదలగు వ్యవసాయ కార్మికుల వర్గ కోర్కెలు ప్రతిబింబించడమే గాక, ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం కోసం పాటుపడాలనీ వేసవి సెలవులలో హరిజన విద్యాధిక యువకులు గ్రామ సీమలలో తీవ్ర ప్రచారం చేయాలనీ, మద్రాసు ప్రభుత్వం ప్రకటించిన ఋణ నివారణ చట్టం వ్యవసాయ కార్మికులకు కూడా వర్తింపు జేయాలనీ కోరింది. వర్గచైతన్యం కల్గించడానికి తోడ్పడే కోర్కెలను ప్రధానంగా ఈ మహాసభ కోరిందే తప్ప, కుల తత్త్వాన్ని ఏ మాత్రం వ్యక్తీకరించక పోవడం ప్రోత్సహించే తీర్మానాలను చేయక పోవడం గమనించదగింది.

వ్యవసాయ కార్మిక సంఘాలను విరివిగా నెలకొల్పాలని వక్తలు సభలో మాట్లాడారు. అప్పటికింక వ్యవసాయ కార్మిక సంఘాలు విరివిగా స్థాపించడం ప్రారంభం కాలేదు. అందుచేత యువజన సంఘ వేదికపై నుండి వ్యవసాయ కార్మిక కోర్కెలను చాటడం జరిగింది.

## విశాఖ మండలంలో

4-6-38 వ తేదీన విశాఖ మండల ద్వితీయ యువజన మహాసభ జరిగింది. సభలో దిగువ తీర్మానాలు చేశారు.

1. ఊటీ బ్యాంకు కేసు శిక్షితులను, మన్యంలో పనిచేసిన శ్రీ హరిదాస్ (ఒరిస్సా)ను వెంటనే విడుదల చేయాలని, 2 కమ్యూనిస్టు కరపత్రం మొదలైన పుస్తకాలపై నిషేధం తొలగించకుండానే ప్రెస్ యాక్టు క్రింద '1905 రష్యా

విప్లవం' అనే పుస్తకాన్ని నిషేధించినందుకు అసమ్మతి తెల్పుతూ పౌరసత్వ హక్కులకు భంగకరమైన ప్రెస్ ఆక్టును రద్దు పరచాలని కోరారు. కొత్తపట్నం రాజకీయ పాఠశాలపై నిషేధం తొలగించాలని కాంగ్రెస్ మంత్రివర్గాన్ని కోరారు. 3 కాంగ్రెస్ ఎన్నికల ప్రణాళిక ననుసరించి, పౌరసత్వ హక్కులకు భంగకరమైన కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగించాలని కోరారు. 4. రాజకీయ సభలకుగాని రైతు సభలకుగాని పోలీసులు హాజరు కావలసిన ఆవశ్యకత లేదు. ఈ విషయాన్ని కాంగ్రెస్ మంత్రివర్గమైనా గుర్తించకపోవడం శోచనీయం. అందుచే అట్టి చర్యలను అవసరమని పోలీసు శాఖకు ప్రధానామాత్యులు ఉత్తర్వు చేయాలి.

## నెల్లూరు జిల్లాలో

నెల్లూరు జిల్లా వెంకటగిరి యువజన సంఘ కార్యదర్శి శ్రీ బీరం రామనాథం ఒక ప్రకటనలో అరవమాలలు ఫారెస్టులో కట్టెలు కొట్టుకుంటూండగా వారిని ఫారెస్టు గార్డులు కొట్టి తిట్టి కట్టెలు లాగుకున్న ఉదంతం తెలిపి కార్మిక నాయకులు కాంగ్రెస్‌వారు ఇందుపై తగు చర్యలు తీసుకోవాలని కోరారు.

## కర్నూలు జిల్లాలో

కర్నూలు జిల్లా గిద్దలూరు యువజన సంఘ కార్యాలయం నుండి పి. రంగారెడ్డి ఇలా ప్రకటించారు.

"ఆంధ్ర రాష్ట్ర యువజన సంఘ కార్యనిర్వాహక వర్గం నన్ను కర్నూలు జిల్లా యువజన సంఘ ఆర్గనైజరుగా నియమించారు సభ్యత్వ దరఖాస్తూ పుస్తకాలు కార్య ప్రణాళికలు అచ్చొత్తించబడినవి. మార్చినెల ఆఖరుకు సభ్యులను చేర్పించగోరుచున్నాను. ప్రస్తుతం జిల్లాలో పనిచేయుచున్న ప్రాథమిక యువజన సంఘముల వివరాలు తెలియగోరుతున్నాను."

కంభం తాలుకా యువజన సంఘ ఎన్నికలు జరిగాయి. జిల్లా యువజన సంఘ ఆర్గనైజరు కామ్రేడ్ ఏతం రంగారెడ్డిగారు అధ్యక్షత వహించారు. బెల్లంకొండ శాయన్నగారు అధ్యక్షులుగా, చేగిరెడ్డి బాలిరెడ్డి, పి కోటయ్యనాయుడు కార్యదర్శిగా ఎన్నికయ్యారు.

## కడప జిల్లాలో

1938 సెప్టెంబరు 1వ తేదీన కడప యువజనులు సమావేశమై వెనుబోలు బాలయ్య శ్రేష్ఠి అధ్యక్షులు, దక్షిణపు శీతారావయ్య ఉపాధ్యక్షులు, పాలెం నరసింహులు, పంద్రా సుబ్బారాయుడు సంయుక్త కార్యదర్శులుగా ఎన్నుకున్నారు. యువజన సంఘం మద్య నిషేధ ప్రచారానికి పూనుకోవాలని తీర్మానించారు.

## అనంతపురం జిల్లాలో

అనంతపురం జిల్లాలో యువజనోద్యమం 1937-38లో ప్రారంభమైంది. యువ కాంగ్రెస్ నాయకులు ఐదుకల్లు సదాశివన్ ప్రోద్బలంతో శ్రీ నీలం సంజీవ రెడ్డి యువజనోద్యమంలోకి వచ్చారు. జిల్లాలో 70 చోట్ల అధ్యయన కేంద్రాలు స్థాపించి 15 రోజుల కొకసారి క్లాసులుపెట్టి రాజకీయాలు చెప్పేవారు. ఆగ్రా నుండి వెలువడే సోషలిస్టు ప్రచురణలను ఆధారంగా చేసుకొని పాఠాలు చెప్పేవారు. జిల్లా యువజన సంఘానికి శ్రీ నీలం సంజీవరెడ్డి అధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు. 1938 వేసవిలో జిల్లాలోని యువకులకు, విద్యార్థులకు ఒక రాజకీయ పాఠశాల హిందూపురంలో నడుపబడింది. దానికి 80 మంది విద్యార్థులు వచ్చారు. అధ్యాపకులుగా నీలం రాజశేఖరరెడ్డి, తరిమెల నాగిరెడ్డి, సదాశివన్, విద్వాన్ విశ్వం, కొందరు కాంగ్రెస్ నాయకులు వచ్చారు.

అనంతపురం మండల యువజన సంఘ ప్రధాన కార్యదర్శి విద్వాన్ విశ్వంగారు 4-7-39న అనంతపురం నుండి ఒక ప్రకటనచేస్తూ ప్రతి తాలూకా లోనూ కనీసం 100 మంది ప్రాథమికసభ్యులుగా చేర్పించాలనీ తాలూకా కమిటీలను ఎన్నుకోవాలనీ ప్రతీ తాలుకా ఒక స్టడీ సర్కిల్‌ను ఏర్పాటు చేయాలనీ యువజన సంఘ సభ్యులను చేర్పించేటప్పుడే కాంగ్రెస్ సభ్యులను చేర్చాలని తెలిపారు.

కాంగ్రెస్ కమిటీలో సామ్రాజ్య వ్యతిరేక సంఘాలు కలిసి స్వరాజ్య దినం జరపాలనీ, కాంగ్రెస్ నేషనల్ డిమాండును ప్రతీవారికి తెలిసేటట్లు ప్రచారం చేయాలనీ ప్రజలలో రాజకీయ చైతన్యం కల్గించాలని యువకులలో విజ్ఞానం, భావ వైశాల్యం కల్గించడం మున్నగు కార్యక్రమం చేపట్టాలనీ విద్వాన్‌విశ్వం తెలిపారు.

## రాయలసీమ యువజన మహాసభ

1939 జూన్ మదనపల్లిలో రాయలసీమ యువజన మహాసభ జరిగింది. అన్ని జిల్లాల నుండి యువకులు పెద్ద సంఖ్యలో హాజరయ్యారు. సింధురాష్ట్ర కమ్యూనిస్టు నాయకులలో ఒకరైన బుఖారీ ఆ మహాసభలో యిచ్చిన ఉపన్యాసం యువజనులలో చాలా ఉత్సాహం కల్గించింది. కీ. శే. భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు రెండు రోజులు అక్కడఉండి ఉపన్యాసమిచ్చి వెళ్ళారు.

రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైన తరువాత నిర్బంధ ప్రొక్యూర్‌మెంటు, సైనిక రిక్రూట్‌మెంటులకు వ్యతిరేకంగా ప్రచారం చేయడానికి జిల్లా యువజన సంఘం "ఆకాశవాణి" పేరుతో రహస్య సైక్లోస్టయిల్ పత్రిక ప్రారంభించింది. ఈ పత్రికను రహస్యంగా నడుపుతున్న ఐదుకల్లు సదాశివన్, జి. రామకృష్ణ, వెంకటనాయుడులను ప్రభుత్వం అరెస్టుచేసింది. సదాశివన్‌కు 18 నెలలు మిగతా యిద్దరికి 8 నెలల శిక్ష విధించబడింది.

ఖర్గపురంలో :- ప్రవాసాంధ్రులుకూడా యువజన సంఘాలు ఏర్పరచు కొనడం జరిగింది. 1938 ఆగష్టు 14న ఖర్గపురంలో ఆంధ్ర యువజన సంఘం వారు ఆంధ్ర పాఠశాలను స్థాపించారు.

## 1937 - 1939 మధ్య యువజనోద్యమ కార్యకలాపాల సింహావలోకనం

1937-1939 మధ్య యువజనోద్యమం, కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి, విశాఖపట్నం, నెల్లూరు, కర్నూలు, కడప, అనంత పురం జిల్లాలకు విస్తరించింది. కోస్తా జిల్లాల్లో జిల్లా సంఘాల నిర్మాణం జరిగింది. జిల్లా మహాసభలు జరిగాయి. ప్రాథమిక సంఘాలు పటిష్ఠంగా నిర్మించబడ్డాయి.

ఆనాటి అతివాద నాయకులందరూ సభలకు ఆహ్వానించబడ్డారు. కమ్యూనిస్టు నాయకులు బాట్లివాలా, హాజ్రా బేగమ్, జోగ్లేకర్ సింధు రాష్ట్ర కమ్యూనిస్టు నాయకుడు బుఖారీ మొదలైన వారు ఈ విధంగా వచ్చిన వారిలో ఉన్నారు. రాయలసీమలో ఆ తరువాత కాంగ్రెస్ ప్రముఖ నాయకులుగా తయారైన శ్రీ నీలం సంజీవరెడ్డి, శ్రీ పిడతల రంగారెడ్డి మొదలైన వారు యువజనోద్య మాలలోకి వచ్చారు. యువజన సంఘాల ద్వారానే రాజకీయాలలోకి వచ్చారు.

యువజన సంఘాలు అతివాద శక్తుల రాజకీయ నివేదికలుగానే ఈ దశలో కూడ పని చేశాయని, ఆయా జిల్లా మహాసభలు ఆఖరుకు ప్రాథమిక యువజన సంఘాలు చేసిన తీర్మానాలను బట్టి విదితమవుతుంది.

ఆనాడు ప్రపంచానికి ఏర్పడిన ఫాసిస్టు ముప్పు, హిట్లర్ జర్మనీ యువకులను స్వారమ్ ట్రూపర్‌గా తయారు చేస్తున్న ఉదంతం, చైనా, స్పెయిన్ ప్రజల పోరాటాలు మున్నగు అంతర్జాతీయ రాజకీయ సమస్యలపై యువకులను చైతన్యపరచి వారికి అంతర్జాతీయ దృక్పథం కల్గించడానికి కృషి జరిగింది. వలస దేశాలలో యువకులు, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలలో పాల్గొని దేశ స్వాతంత్ర్య పోరాటంలోకి రావాలనీ, సామ్రాజ్య వ్యతిరేక జాతీయైక్య సంఘటనను నిర్మించాలనీ ఉద్బోధించబడింది. కొత్తపట్నం రాజకీయ పాఠశాలపై నిషేధం తొలగించి, నిర్బంధితులపై కేసులు ఎత్తివేయాలని, జైలులో నిర్బంధించ బడిన అమీర్ హైదర్‌ఖాన్ విడుదల, ఊటీ బాంబు కేసు, మద్రాసు బాంబు కేసు ఖైదీలను రాజకీయ ఖైదీలుగా పరిగణించి వారిని విడుదల చేయాలి, కాకినాడ బాంబు కేసు ఖైదీ (అండమాన్ ఖైదీ) అయిన ప్రతివాది భయంకర వెంకటా చారిపై సి.ఐ.డి. నిఘా తొలగించాలనీ (వీరిని భయంకరాచారి అని ఆరోజులలో పిలిచేవారు) ఆంధ్ర రాష్ట్ర రైతు రక్షణ యాత్రను జయప్రదం చేయాలనీ, పత్రికలపై విధించిన ధరావతులను వాపసు చేయాలనీ, అతివాద గ్రంథాలపై

నిషేధం తొలగించాలని, జమీందారీ ఎంక్వయిరీ కమిటీ విచారణ మున్నగు ప్రధాన రాజకీయ సమస్యలను, ముఖ్యంగా వామపక్ష ఉద్యమం ఎదుర్కొంటున్న సమస్యల గురించి యువజన సంఘాలు తీవ్రాందోళన గావించి యువజనులను దేశభక్తులుగా తయారుచేసి, వారిని స్వాతంత్ర్య పోరాటంలోకి తీసుకురావడానికి కృషి జరిగింది. శారీరక, వైజ్ఞానిక కార్యక్రమాలు, సంఘ సంస్కరణ, రాత్రి పాఠశాలలు, పఠన మందిరాలు మున్నగు వాటి గురించి తీర్మానాలు చేయబడినవే తప్ప విస్తృతంగా ఈ కార్యక్రమాలు అమలులోకి రాలేదు. కొన్ని కొన్ని చోట్ల మాత్రమే అమలుజేయడం జరిగింది.

యువజనోద్యమం, హరిజన యువకులలో కూడా రాజకీయ చైతన్యం కల్గించగల్గింది. తూర్పు గోదావరి జిల్లా రామచంద్రాపురంలో ఆదిమాంధ్ర (హరిజన) యువజన మహాసభ, ఈ మహాసభ వర్గ కోర్కెలపై చేసిన తీర్మానాలు ఇందుకు నిదర్శనం. సభలో ఏ మాత్రం కులతత్వ ధోరణులు లేకపోవడం గమనించదగిన విషయం. రాజమండ్రిలో హరిజన విద్యార్థి వసతి గృహ నిర్మాణానికి శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం వంటి జాతీయ కవులు కూడా కృషి చేయడం విశేషం.

ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం కావాలనీ కూడా యువజన సంఘాల ఉద్యమం సాగించాయి.

అంతర్జాతీయంగా ఫాసిజానికి వ్యతిరేక పోరాటం, జాతీయంగా సామ్రాజ్య వాద వ్యతిరేక జాతియైక్య సంఘటన నిర్మాణం. స్వాతంత్ర్య సమరానికి యువ జనులను తయారు చేయడం ఈ దశలో యువజనోద్యమం నిర్వర్తించిన ప్రధాన కర్తవ్యాలని చెప్పవచ్చును.

1939 సెప్టెంబరులో రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభం కావడంతోనే సామ్రాజ్యవాద యుద్ధ వ్యతిరేక కార్యకలాపాలతో యువజన సంఘాలు కూడా చురుకుగా పాల్గొన్నాయి. యుద్ధ ప్రతికూల ప్రచారంలో పాల్గొన్న అనేకమంది యువకులు యువజన నాయకులు బ్రిటిషు ప్రభుత్వ నిర్బంధ విధానానికి గురి అయ్యారు.

## 1939-1942 మధ్య యువజనోద్యమం

1939 సెప్టెంబరు 1 వ తేదీన రెండవ ప్రపంచ యుద్ధం ఆరంభం కావడంతోనే బ్రిటిషు సామ్రాజ్య వాద ప్రభుత్వం దేశమంతటా నిర్బంధ విధానం ప్రయోగించింది. ఇంటర్న్మెంటులు, డిటెన్షన్‌లు, అజ్ఞాతవాసాల మధ్య అన్ని ప్రజా సంఘాల బహిరంగ కార్యకలాపాలు ఆగిపోయాయి. యువజన సంఘ నాయకులు, కార్యకర్తలు కూడా అనేకమంది ఈ కాలంలో ప్రభుత్వ

నిర్బంధ విధానానికి గురి అయ్యారు ఈ నిర్బంధ కాలంలో కూడా స్థానిక యువజన సంఘాలు పని చేస్తూనే ఉన్నాయి. స్వాతంత్ర్య దినోత్సవాలు జరుపడం, రాత్రి పాఠశాలలు, లైబ్రరీలు నడుపడం మున్నగు కార్యక్రమాలను సాగిస్తూనే ఉన్నారు.

1941 జూన్ 22 న నాజీ హిట్లర్ మూకలు సోవియట్ పై దండెత్తాయి. సామ్రాజ్యవాద యుద్ధంగా ప్రారంభమైన ప్రపంచ యుద్ధం గుణాత్మకంగా మార్పు చెందింది. ఫాసిజాన్ని ఓడించడమే ప్రపంచ ప్రజాశక్తులన్నింటి కర్తవ్యమైంది. వలస దేశ ప్రజల విముక్తి కూడా ఫాసిజం ఓటమితో ముడివడింది. అందుచేత వలస విముక్తి పోరాటాలు కూడా ఫాసిజం ఓటమికిగాను యుద్ధానుకూల వైఖరిని అవలంభించాయి.

భారతదేశంలో ఫాసిస్టు వ్యతిరేక పోరాటానికి కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం వహించింది. 1942 లో కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగించబడింది. వివిధ ప్రజా సంఘాలు బహిరంగంగా పనిచేయడానికి అవకాశాలు కలిగాయి.

తిరిగి యువజన సంఘాలు పుంజుకొని యుద్ధకాల సమస్యలపై యువజను లను సమీకరించి పని చేయసాగాయి. విస్తృత ఉద్యమంగా యువజనోద్యమం వ్యాపించడానికి వచ్చిన ఈ అవకాశంతో రాష్ట్ర యువజనోద్యమం మరో పెద్ద మలుపు తిరిగింది.

బ్రిటీషు సామ్రాజ్యవాద ప్రభుత్వం ప్రజల అవసరములతో నిమిత్తం లేకుండా యుద్ధ అవసరాలకే ప్రాధాన్యత యివ్వడంతోనూ, అనేక రకాల కంట్రోళ్ళు విధించడంతోనూ, జీవితావసర వస్తువుల కొరత తత్ఫలితముగా బ్లాక్ మార్కెట్ తలెత్తాయి. ఆహారం, బట్టలు కిరసనాయిలు, పంచదార మున్నగు వాటికి విపరీతమైన కొరత ఏర్పడింది. రాయలసీమలో, బెంగాల్ లో ఘోరమైన కరువులు ఏర్పడ్డాయి దేశంపై జపాన్ దాడి ప్రమాదం సంభవించింది. మద్రాసు, విశాఖపట్నం, ఆ తరువాత కాకినాడలపై కూడా జపాన్ విమానాలు బాంబులు వేశాయి.

ఆ రోజులలో యువజన సంఘాలు ఈ ప్రజా సమస్యలన్నింటిలోనూ అమోఘంగా కృషిచేశాయి. బ్లాక్ మార్కెట్ ను పట్టుకోవడంలో ఉన్న మేరకు సరుకును సక్రమంగా అమ్మించడంలోనూ, ఎక్కడికక్కడ నిలబడి పని చేశాయి. తిండి దొంగలకు యువజన సంఘాలంటే సింహ స్వప్నంగా తయారైంది.

రాయలసీమ బెంగాల్ కరువు నిధులు వసూలు చేసి పంపడంలోనూ, రాయలసీమ కరువు నివారణ శిబిరాలలో వలంటీర్లుగా వెళ్ళి పని చేయడంలోనూ యువజన సంఘాలు ఎంతో ప్రశంసనీయంగా పని చేశాయి. మంచినీటి సమస్య,

మరుగుదొడ్లు, గ్రామ పారిశుధ్యం ఒకటేమిటి? అన్ని సాంఘిక సమస్యలలోనూ యువజన సంఘాలు చొరవ తీసుకోవడం ద్వారా ప్రజల మన్ననలకు పాత్రవయ్యాయి. విమాన దాడులు జరిగితే తీసుకోవలసిన జాగ్రత్తలు ప్రథమ చికిత్స మున్నగు వాటిలో తర్ఫీదులు యిచ్చాయి.

## ఫాసిస్టు వ్యతిరేక ప్రజా ఉద్యమం

హిట్లర్ జర్మనీ, ముసోలినీ ఇటలీ, టోజో జపాన్‌లు అక్ష రాజ్యాలుగా రెండవ ప్రపంచ యుద్ధంలో గెలుపొందితే ప్రపంచానికి ఫాసిస్టు బానిసత్వం తప్పదనీ, అందుచేత ఫాసిజాన్ని ఓడించాలనీ, ఫాసిజం యొక్క ప్రమాదం గురించి యువజనోద్యమంలో ఆంధ్రలో బ్రహ్మాండమైన ప్రచారం గావించింది.

ఫాసిజానికి వ్యతిరేకంగా పోరాడుతున్న వారిని, పోరాడదలచిన వారిని నిర్బంధాల నుండి విడుదల చేయాలని కోరుతూ యుద్ధ ప్రమాదం ఏర్పడితే ప్రజలను రక్షించడానికి యువకులకు విమానదాడి రక్షణ, అంటు జాడ్యం నివారణ, ప్రథమ చికిత్స, ప్రజారక్షణ శిక్షణ శిబిరాలను నిర్వహించాలనీ యువజన సంఘాలు నిశ్చయించాయి. సాంస్కృతిక కార్యక్రమాల ద్వారా ప్రజలకు రాజకీయ ప్రచారం సాగించడానికి జానపద కళా స్వరూపాలలో శిక్షణ యివ్వడానికి వైజ్ఞానిక శిక్షణా శిబిరాలు కూడా వివిధ జిల్లాల్లో నిర్వహించబడినాయి. అందులో కృష్ణాజిల్లా గండిగుంటలో జరిగిన శిక్షణ శిబిరం తలమానికంగా ఉంది.

## జాతీయ నాయకుల విడుదలకు ప్రచారం

1942 ఆగస్టు 9న బ్రిటిషు సామ్రాజ్యవాదులు బొంబాయిలో జాతీయ కాంగ్రెస్ నాయకులందరిని అరెస్టు చేసింది. ఫలితంగా దేశమంతటా అశాంతి, క్రోధాగ్ని ప్రజ్వరిల్లింది. కాంగ్రెస్ పేరుతో ఆనాడు జరిగిన విధ్వసంక కార్యక్రమాన్ని వ్యతిరేకిస్తూనే జాతీయ నాయకుల విడుదలకు, జాతీయ ప్రభుత్వ నిర్మాణానికి జాతీయైక్యతకు యువజన సంఘం తీవ్రమైన ఆందోళన సాగించింది.

## ఫాసిస్టు వ్యతిరేక ప్రజారక్షణ శిక్షణా శిబిరాలు

ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి సంఘం జనరల్ సెక్రటరీ శ్రీ ఎమ్. రాధాకృష్ణ, కృష్ణాజిల్లా విద్యార్థి సంఘం తరపున పి శ్రీరాములు, గుంటూరుజిల్లా విద్యార్థి సంఘం తరపున జి. వెంకటేశ్వరరావు, కృష్ణాజిల్లా యువజన సంఘం తరపున, బెల్లపు శోభనాద్రి, కృష్ణాజిల్లా మహిళా సంఘం తరపున శ్రీమతి మానికొండ సూర్యావతి, కృష్ణా జిల్లా రైతు సంఘం తరపున శ్రీ కొల్ల సీతారామయ్య, గుంటూరుజిల్లా వ్యవసాయ కార్మిక సంఘం తరపున పి ఎస్ మల్లికార్జునరావు ఒక సంయుక్త ప్రకటనలో ఆంధ్ర రాష్ట్రమంతటా జిల్లాలవారీగా ప్రజారక్షణ

శిబిరాలు స్థాపించి, ఫాసిస్టు ప్రమాదాన్ని ఎదుర్కోవడానికి ప్రజలను సమాయత్తం చేయాలనీ, జపాన్ దురాక్రమణ ప్రమాదాన్ని ఎదుర్కోవాలనీ. ప్రతి గ్రామంలోనూ, ప్రజారక్షణ దళాలను నెలకొల్పాలని కోరారు ప్రథమ చికిత్స, పౌరరక్షణ, సంఘ వ్యతిరేక శక్తులను, పంచమాంగ దళాన్ని ఎదుర్కొనుట మున్నగు కార్యక్రమాలను చేపట్టాలని ఇందులో కోరారు.

(కాగడా : 1942 మార్చి 18)

ఈ సంయుక్త ప్రకటనను అనుసరించి జపాన్ ఫాసిస్టు దాడి నుండి భారత ప్రజలను రక్షించడానికి దాన్ని జయప్రదంగా ఎదుర్కొని దేశ స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకోవడానికి ప్రజలకు తర్ఫీదు యిచ్చే ప్రజా సేవకులను తయారు చేయడానికి ప్రజారక్షణ శిక్షణ శిబిరాలు యువజన, విద్యార్థి సంఘాల ఆధ్వర్యాన రాష్ట్రంలో అనేక చోట్ల నడుపబడ్డాయి.

## కృష్ణా జిల్లాలో

కృష్ణా జిల్లా గండిగుంటలో 1942 ఏప్రిల్ 10 నుండి 25 వరకు జిల్లా యువజన, విద్యార్థి సంఘాల అధ్వర్యాన జరిగన ఫాసిస్టు వ్యతిరేక ప్రజారక్షణ శిక్షణా శిబిరంలో 30 మందికి విమానదాడి రక్షణ, ప్రథమ చికిత్స, ఫాసిస్టు వ్యతిరేక ప్రచార పద్ధతులు, (పాటలు, బుర్రకథలు, నాటకాలు, ఫ్యాన్సీ డ్రస్ వగయిరా) ప్రపంచ రాజకీయాలు, రాజకీయ భూగోళం, డ్రిల్లు మున్నగునవి నేర్పారు. విద్యార్థులలో వారంతటవారే పాటలు, బుర్రకథలు వ్రాసుకొని సమిష్టిగా నేర్చుకొన్నారు. విమాన దాడి రక్షణ, మంటల నార్పుట, ప్రథమ చికిత్సలను కూడా అందరికీ నేర్పారు. డిబేట్లు కూడా జరిపారు. ఇందువలన ఉపాన్యాసాలు చెప్పడం అలవాటు చేసుకోగల్గారు. 15 సెంటర్లలో దాదాపు నెల రోజులు ప్రజానురంజకంగా ఫాసిస్టు వ్యతిరేక ప్రచారం కొనసాగించారు. గండిగుంట శిక్షణ శిబిరం రాష్ట్రంలో మొట్టమొదటిసారిగా జరిగిన శిబిరం. సాంస్కృతిక కార్యక్రమాల ద్వారా రాజకీయ ప్రచార విధానానికి నాంది పలికింది. ఆ తరువాత ప్రజా నాట్యమండలి ఉద్యమానికి ఇది పునాది వేసిందని చెప్పవచ్చు. బెజవాడలో కూడా గండిగుంటలో 53 శిక్షణా శిబిరం జరిగింది. 44 మంది విద్యార్థులు హాజరయ్యారు

## విజ్ఞాన శిక్షణా శిబిరం

కృష్ణా జిల్లా యువజన విజ్ఞాన ప్రచార దళ శిక్షణా శిబిరం ముస్తాబాద్‌లో జూన్ 15తో జయప్రదంగా ముగిసింది. ముగింపు రోజున 500 మందితో బహిరంగ సభ జరిగింది. అజేయ చైనా, మాతృభూమి హాస్యవేషాలు వేషాల

ద్వారా ప్రజలకు సులభంగా ఫాసిస్టు వ్యతిరేక ప్రచారాన్ని గావించారు. విమాన దాడి రక్షణ గురించి చెప్పారు.

కృష్ణా జిల్లా యువజన సంఘం కార్యవర్గం 7-3-42న సమావేశమై మహాసభలో ఎన్నుకోబడిన అధ్యక్షుడు రాజీనామా పెట్టినందున ఖాళీ అయిన స్థానమునకు అధ్యక్షులుగా శ్రీ వేములపల్లి వెంకటదాసును ఎన్నుకున్నారు. జిల్లా యువజన ఆర్గనైజరుగా తాతినేని సూర్యప్రకాశరావు గారిని (కపిలేశ్వరపురం) ఎన్నుకున్నారు.

కాంగ్రెస్ వారు ఏర్పాటు చేయబోవుచున్న శాంతి సైనికదళంలో యువకు లందరు చేరి శిక్షణ బడయవలసినదిగా హెచ్చరించారు. జిల్లా విద్యార్థి యువజన సంఘాలవారు కలిసి వేసవి సెలవులలో కల్చరల్ క్యాంపు నడపటానికి యువజన సంఘ ప్రతినిధిగా అధ్యక్షుని ఎన్నుకొన్నారు. (కాగడా, 1942, మార్చి 11)

## ఒక విజ్ఞాన కేంద్రం-వ్యాయామ కేంద్రం

జిల్లాలో ఒకే వైజ్ఞానిక కేంద్రాన్ని, యువజన కేంద్రాన్ని నెలకొల్పి యువకులను తర్ఫీదు చేయడానికి జిల్లా యువజన సంఘం కృషి చేస్తుంది. శ్రీ కొల్ల రంగదాసుగారు బెజవాడలో ఒక కేంద్ర వ్యాయామ శాలను, ప్రకృతి వైద్యశాలను నడుపుతున్నారు. వీరి సహాయంతో యువకులు వ్యాయామం, ఆరోగ్యం అభివృద్ధి చేసుకోవాలని వారికి యువజన సంఘాలు ధన సహాయం చేయాలని జిల్లా యువజన సంఘ కార్యదర్శి శ్రీ వేములపల్లి వెంకటదాసు ఒక ప్రకటన చేశారు.

## గుంటూరు జిల్లాలో

గుంటూరు జిల్లా ఫాసిస్టు వ్యతిరేక శిక్షణా శిభిరం 1942 మే 21 నుండి 30వ తేదీ వరకు 10 రోజులు జరిగింది. 44 మంది హాజరయ్యారు.

ఈ అన్ని శిక్షణా శిబిరాలను నడిపిన అనుభవాల దృష్ట్యా శిబిరానికి 20 మంది మించకూడదనీ, ప్రతి శిబిరం నెల రోజులు జరుపాలనీ, క్యాంపుకు ముందుగా సిలబస్ తయారు చేసుకోవాలనీ, వచ్చి వారిని నాలుగు బ్యాచీలుగా విడదీసి 1. ప్రథమచికిత్స, 2. ఎ. ఆర్. పి., 3. డ్రిల్లు, కల్చరల్ ప్రోగ్రాము, 4. ఉపన్యాసకులు ప్రత్యేకించి శిక్షణ యివ్వాలనీ, ఇందుపై ప్రజాశక్తిలో (24-6-1942) సమీక్ష చేయబడింది.

## పెరిన్ బరుచా సందేశం

అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్ ప్రధాన కార్యదర్శి పెరిన్ బరుచా (తరువాత పెరిన్ రమేష్) ఒక సందేశం పంపుతూ ఆంధ్ర దేశంలో ఫాసిస్టు

వ్యతిరేక ఉద్యమాన్ని బలపరచడానికి, సమన్వయ పరచడానికి ప్రజాశక్తి వారపత్రికను ప్రచురించుతున్నందుకు అభివందనలు తెలిపారు.

విశాఖపట్నం కాకినాడల మీద జపాన్ విమానాల దాడి జరిగిన ఈ విపత్సమయంలో భారతదేశ తూర్పు తీరాన్ని ఆంధ్ర ప్రదేశ్ ప్రజలు రక్షించి జపాన్ దురాక్రమణను త్రిప్పికొట్టడంలో ఈ పత్రిక ఎంతగానో ఉత్తేజపచరగలదని బరుచా తమ ఆశాభావాన్ని వెలిబుచ్చారు.

**బాపట్ల తాలుకా ద్వితీయ యువజన మహాసభ :-** 1942 జూన్ 11, 12 తేదీలలో బాపట్ల తాలుకా ద్వితీయ యువజన మహాసభ పాలపర్రులో కామ్రేడ్ మాదాల వీరభద్రారావుగారి అధ్యక్షతను జరిగింది. 26 గ్రామాల నుండి 130 మంది ప్రతినిధులు వచ్చారు.

చెడుగుడి, బాడ్మింటన్ మొదలైన ఆటల పోటీలు జరుపబడ్డాయి 1000 మంది ప్రజలు ఆటలు చూడటానికి వచ్చారు అందులో 200 మంది స్త్రీలు. 1. జపాన్‌ను ఎలా ప్రతిఘటించాలి, 2. యువజన సంఘాల ఆవశ్యకత, 3. కులమత విభేదాల వలన నష్టాలు అనే విషయాలపై వాగ్వివాద పోటీలు జరిగాయి. విచిత్ర వేషాలలో ఫాసిస్టు వ్యతిరేక గేయాలు పాడారు

మహాసభ పెండాల్‌లోనే వైజ్ఞానిక మహాసభ జరిగింది. మోటూరు రాధాకృష్ణగారు అధ్యక్షత వహించారు. సభలో 300 పురుషులు, 400 మంది స్త్రీలు పాల్గొన్నారు.

**నర్సారావుపేట ప్రథమ యువజన మహాసభ :-** 1942 జూన్ 18, 19 తేదీలలో నర్సారావుపేటలో నర్సారావుపేట ప్రథమ యువజన మహాసభ శ్రీ మాదల వీరభద్రరావుగారి అధ్యక్షతను జరిగింది. 32 మంది ప్రతినిధులు వచ్చారు. ప్రస్తుత ప్రజా యుద్ధంలో యువజనుల కర్తవ్యాల గురించి జాతీయైక్యత గురించి, ఫాసిస్టు వ్యతిరేకులైన రాజకీయ ఖైదీలను, డిటెన్యూలందరి విడుదల గురించి ప్రజా రక్షణ దళాల నిర్మాణం గురించి తీర్మానాలు చేశారు. 19వ తేదీన వైజ్ఞానిక మహాసభ జరిగింది. చదలవాడ పిచ్చయ్యగారు అధ్యక్షత వహించారు. మోటూరు రాధాకృష్ణగారు సభను ప్రారంభించారు

**సత్తెనపల్లి తాలుకా రెండవ యువజన మహాసభ :-** 1942 జూలై 11, 12 తేదీలలో సత్తెనపల్లి తాలుకా యువజన సంఘ ద్వితీయ మహాసభ సత్తెనపల్లిలో జరిగింది. 40 గ్రామాల నుండి 300 పైగా యువకులు వచ్చారు. 100 మంది ప్రతినిధులు వచ్చారు. ఆటలు, పాటలు, ఉపన్యాస పోటీలు జరిగాయి. బుర్రకథ, గోసాయి, పార్సీ వేషాలు ధరించి ప్రజలలో ఉత్సాహం కల్గించారు. బహిరంగసభకు 3000 మంది వచ్చారు.

మధ్యాహ్నం జరిగిన ప్రతినిధుల సభలలో శ్రీ ఎల్. బి. గంగాధరరావు, గ్రంథాలయాలు, డిబేట్సు, రాత్రి పాఠశాలలు సాంఘిక, రాజకీయ, ప్రజాసేవ, వైజ్ఞానిక శారీరక కార్యక్రమాలు మున్నగు యువజన సంఘ కార్యక్రమాల గురించి మాట్లాడారు. వలంటీర్లు, యువకులు 300 మందితో ఊరేగింపు జరిగింది.

బహిరంగసభకు శ్రీ శివలింగప్రసాద్ అధ్యక్షత వహించారు. ఆహ్వాన సంఘం తరపున శ్రీ మోర్తుల అమరారెడ్డి స్వాగతం చెప్పారు. అధ్యక్షులు వివిధ దేశాల యువజనోద్యమాల గురించి, శ్రీ దుర్భా కృష్ణమూర్తి వలంటీరు దళాల గురించి, శ్రీ ఎల్.బి. గంగాధరరావు యువజన సంఘ కార్యక్రమం గురించి, మల్లిఖార్జున శర్మగారు రష్యా సాధించిన విజయాల గురించి, జపాన్ ఫాసిజం గురించి, నాళం బసవమ్మ, మోటూరు ఉదయంగార్లు జర్మనీ, జపాన్ ఆక్రమిత దేశాల్లో స్త్రీల దురవస్థల గురించి మాట్లాడారు. వావిలాల వీరభద్రరావు, మాదల వీరభద్రరావుగార్లు ఫాసిస్టు వ్యతిరేక పోరాటం గురించి చెప్పారు.

సత్తెనపల్లి వ్యవసాయ డెమాన్స్ట్రేటర్‌గారు పంటల అభివృద్ధి గురించి చెప్పారు రష్యా - జర్మని యుద్ధం గురించి రామకోటేశ్వరరావు, మీరా, సత్యం గార్లు బుర్రకథ చెప్పారు. బహిరంగసభకు 250 మంద స్త్రీలు కూడా వచ్చారు. అచ్చంపేట నుండి నెహ్రూ స్కౌటు గ్రూపు వచ్చి సేవచేశారు. తాలుకా యువజన సంఘానికి అధ్యక్షులుగా పూదోట రాజయ్యగారు, కార్యదర్శిగా ఆమంచి నరసింహారావుగార్లు ఎన్నుకోబడ్డారు.

## కృష్ణాజిల్లా యువజన సంఘ కార్యవర్గం :

కృష్ణాజిల్లా యువజన సంఘ కార్యవర్గం గుడివాడలో వి.వి. దాస్‌గారి అధ్యక్షతను సమావేశమై, విజ్ఞానాభివృద్ధి గావించుటకు ఆఫీసులో లైబ్రరీని స్థాపించాలని, తాలింఖానాలు ఏర్పరచాలనీ, హెచ్చు ధరలను ప్రభుత్వం కంట్రోలు చేయాలనీ, తూర్పు గోదావరిజిల్లా ప్రజా రక్షణ శిబిరంలో హోమ్ గార్డు (డ్రిల్లును) ప్రభుత్వం నిషేధించినందుకు ఖండించుతూనూ తీర్మానాలు ఆమోదించారు.

## అధిక ధరల కంట్రోలు- బెజవాడ యువజన సంఘం కృషి

యుద్ధం ప్రారంభమైంది మొదలు వ్యాపారస్తులు క్షణక్షణానికి వస్తువుల ధరలు విపరీతంగా పెంచి పౌర జీవితాన్ని దుర్భరం చేస్తూ వచ్చారు. సామాన్య ప్రజలలో అసంతృప్తి హెచ్చు కావడం మొదలుపెట్టింది. గత జనవరి నెలలో బెజవాడలో పరిస్థితులు శృతిమించిపోయాయి. అప్పుడు ఈ ప్రజా అసంతృప్తిని ఒక సంఘటిత రూపం యిచ్చి కార్యక్రమం యిచ్చే నాయకత్వం లేకపోవడంచేత ఒక లూటీ కూడా జరిగింది. ఈ అరాజకీయపు ధోరణులను చూసి యువజన

సంఘం పూరులేకపోయింది. వెంటనే తన కర్తవ్యాన్ని నిర్ణయించుకొని కార్యాచరణకు పూనుకొనినది.

ఈ అధిక లాభాలను అరికట్టడానికి బహిరంగ సభలు, వీధి మీటింగులు, ఊరేగింపులు, ప్రజా విజ్ఞాపనలద్వారా ప్రభుత్వంపై వత్తిడి తేవాలని, ఆందోళన గావించాలనీ నిశ్చయించుకున్నారు. 10-6-42 వ తేదీ లూటీవల్ల కలిగే నష్టాలను తెలియజేస్తూ, సరియైన కార్యక్రమాన్ని సూచిస్తూ ఒక కరపత్రం ప్రకటించి, బహిరంగ సభను ఏర్పాటుచేశారు. సభకు 400 మంది వచ్చారు తరువాత ప్రతీ వార్డులోనూ, ప్రతీపేటలోను మీటింగులు పెట్టబడ్డాయి. ప్రతీ మీటింగులోను పిటీషన్లపై పట్టణవాసుల సంతకాలు తీసుకోబడ్డాయి. ప్రభుత్వం అధిక లాభాలను కంట్రోలు చేస్తామని ప్రకటించికూడా వెంటనే ఆచరణలో పెట్టక కాలాయాపన చేస్తుండటం తగనిపని. ప్రజలలోని అసంతృప్తిని తెలియజేస్తూ మరో కరపత్రం ప్రకటించారు అధికారులు యువజన సంఘం ఆందోళనను అణచివేయ ప్రయత్నించారు కాని లాభంలేకపోయింది. 10 వేల సంతకాలలో పిటీషన్ సమర్పించారు. ఎట్టకేలకు జీవితావసర వస్తువుల ధరలను నిర్ణయిస్తూ జులై 5వ తేదీనుండి అమలులోకి వస్తాయని తహశీల్‌దారు ప్రకటించినారు. కాని అధికారులు వాటిని అమలుజరుపడానికి పూనుకోలేదు. యువజన సంఘం తన ఆందోళనను కొనసాగించడానికే నిర్ణయించింది.

## ఫాసిస్టు వ్యతిరేక ప్రచార సభలు

1942 జులై 12 న నర్సారావుపేట యువజన సంఘం ఆధ్వర్యాన బహిరంగసభ జరిగింది. ఫాసిస్టు వ్యతిరేక రాజకీయ ఖైదీలను విడుదల చేయాలని తీర్మానించారు.

ఒంగోలు తాలుకా యువజన సంఘ కార్యవర్గం 15-6-42న సమావేశమై కాంగ్రెస్, ఫాసిస్టు వ్యతిరేక ప్రజా ఐక్య ఉద్యమానికి కలసిరావాలని, ఎ. ఐ. సి. సి. అందుకు అనుగుణ్యంగా తీర్మానం చేయాలనీ కోరారు. ఫాసిస్టు వ్యతిరేక రాజకీయ ఖైదీలను విడుదల చేయాలని కోరారు. ప్రతీ ఐదారు గ్రామాలకు ఒక కూడలి ఏర్పాటు చేసి ముఖ్యగ్రామంలో కోఆపరేటివ్ స్టోర్సు పెట్టి ప్రజాసామాన్యానికి కావలసిన ఆహార పదార్థాలను లాభాలు లేకుండా అసలు ధరలకే అమ్మించాలని కోరారు బంజరు భూములను వ్యవసాయ కూలీలకు, పేదలకు పంచాలని, వారికి పనులు కల్పించాలనీ (గ్రామలలో చెరువులు, రోడ్లు మొ॥).

గుడివాడ తాలుకా యువజన సంఘ కార్యనిర్వాహక వర్గం 17-7-42 న సమావేశమై గ్రామ యువజన సంఘ కార్యకర్తలకు శిక్షణా తరగతులను ఫిర్కాలవారీగా జరుపుటకు నిర్ణయించారు. రాజకీయ డిటెన్యూలను విడుదల

చేయాలని కోరారు. ఆగష్టు 1వ తేదీన డిటెన్యూల విడుదల దినోత్సవం జరపాలనీ, మహజర్లపై సంతకాలు చేయించాలనీ నిర్ణయించారు

గుడివాడ తాలుకా యువజన సంఘ కార్యవర్గం 1942 సెప్టెంబరు 15వ తేదీన పొట్లూరి సుబ్బారావుగారి అధ్యక్షతను గుడివాడలో జరిగింది. ప్రజా రక్షణ దళాలు స్థాపించుటలో రైతు, కూలీ సంఘాలలో యువజన సంఘాలు కూడా కృషి జరుపాలనీ, అందుకు సంబంధించిన పనులు నిర్వహించుటకు పొట్లూరి సుబ్బారావుగారిని, వై.వి. కృష్ణారావుగారిని నియమించుతూ తీర్మానించారు.

**వెంకటగిరి :-** ఈ నెల 15వ తేదీన వెంకటగిరిలో టౌను యువజన సంఘం యాజమాన్యాన కాంగ్రెస్ నాయకుల అరెస్టులపట్ల అసమ్మతిని ప్రకటించుటకై బహిరంగసభ ఏర్పాటు చేశారు. కాని సభను నిషేధించుతూ స్థానికాధికారులు కామ్రేడ్ బి. శంకరయ్యకు తెలియజేశారు. సాయంకాలం బహిరంగసభకు చాలామంది ప్రజలు వచ్చారు. అక్కడికి కూడా వచ్చి స్థానికాధికారులు సభను నిషేధించారు. అర్గనైజర్లు సభను వారం రోజులపాటు వాయిదావేసి ప్రజలను వెళ్ళి పొమ్మని చెప్పారు.

వెంకటగిరి యువజన సంఘం వారు డిప్యూటీ కలెక్టరు వద్దకు రాయబారం వెళ్ళి అధిక ధరల లాభాలను అరికట్టాని కోరారు. నిర్మాణయుక్తమైన సూచనలను చేశారు. చౌక డిపోలు ప్రభుత్వమే నెలకొల్పాలనీ, ప్రజా కమిటీలను నియమించాలనీ, ఎగుమతి, దిగుమతుల కంట్రోలును ఈ కమిటీకి అప్పగించాలని కోరారు. డిప్యూటీ కలెక్టరు మరునాడు వర్తకులను, యువజనులను పిలిచి, కంట్రోలు ధరలకు ఎక్కువ అమ్మినా, సరకులను నిల్వజేసినా శిక్షిస్తామనీ, సరకులను దిగుమతిజేసే ప్రయత్నం చేస్తాననీ, యువజన వలంటీర్లు దుకాణాల వద్ద కాపలా వుండవలసిందనీ తెలిపారు. యువజన సంఘం అంగీకరించింది.

**పందిళ్ళపల్లి :-** పందిళ్ళపల్లిలో 26-10-42న గ్రామ యువజన సంఘాధ్వర్యాన "మాతృభూమి", కొరియాస్వాతంత్ర్య పోరాటం "గెరిల్లా పోరాటం" అను నాటకాలు ప్రదర్శించబడినాయి. జపాన్ ఫాసిజాన్ని ఎదుర్కొని పోరాడాలనే భావాలను ఈ నాటకాలు ప్రజలలో కల్గించగల్గాయి. ఇటువంటి నాటకాలను యింకా ప్రదర్శించాలని ప్రజలు కోరుతున్నారు.

**బెజవాడ యువజన సంఘం :-** చౌక డిపోలు పెట్టినందుకుగానూ, బెజవాడలో షాహుకార్లు తమ దుకాణంలోనే కొనే సరకులపై కరువు పన్ను అని నూటికి రు. 0-4-0 చొప్పున వసూలు చేస్తున్నారనీ, ఒక్కనెలలోనే ఈ విధంగా రు. 1000/- వసూలు చేశారనీ, ఈ విషయమై ఫిర్యాదు చేసినా స్థానిక అధికారులు చూస్తూ వూరుకున్నారనీ, బెజవాడ యువజన సంఘం వారు ఒక కరపత్రం వేశారు.

1942 జులై చివరి వారంలో కృష్ణా జిల్లా కాటూరు యువజన సంఘం, గుంటూరు జిల్లా, నర్సారావుపేట యువజన సంఘం సంగం జాగర్లమూడి, ఒంగోలు తాలూకా యువజన సంఘం, గుడివాడ తాలూకా యువజన సంఘం, ఫాసిస్టు వ్యతిరేక రాజకీయ ఖైదీలను విడుదల చేయాలని, చౌకడిపోలు నెలకొల్పాలనీ కోరుతూ తీర్మానాలు చేశారు. విజయవాడ పట్టణ యువజన సంఘం, ఏలూరు యువజన సంఘం విజయనగరం విద్యార్థి సంఘాలుకూడా ఇదే విధంగా కోరుతూ తీర్మానాలు చేశాయి.

ఏలూరు తాలుకా యువజన సంఘ యాజమాన్యాన 25-9-42 నుండి 27-9-42 వరకు చాటపర్రు గ్రామంలో అనేక ఆటలలోనూ, వైజ్ఞానిక విషయాల లోనూ పోటీలు జరిగాయి. 8 గ్రామాల నుండి వచ్చిన 181 మంది యువకులు ఉత్సాహంగా పాల్గొన్నారు. 17 వ తేదీన గుత్తా సత్యానారాయణ మూర్తిగారి అధ్యక్షతను జరిగిన బహిరంగసభలో గెలుపొందిన వారికి బహుమతులీయబడ్డాయి. నేటి క్లిష్ట పరిస్థితులలో యువకుల కర్తవ్యాన్ని గురించి కామ్రేడ్స్ గారపాటి యుగంధర్, ఈడ్పుగంటి పూర్ణచంద్ర రావు గార్లు ఉపన్యసించారు. రాత్రి 9 గంటలకు కమ్యూనిస్టులు ప్రజా యుద్ధం గురించి బుర్ర కథ చెప్పారు.

నెల్లూరు జిల్లా కొవ్వూరు తాలూకా యువజన మహాసభ 30-4-1942 న తేదీన అలగాని పాడులో జరిగింది. వివిధ గ్రామాలనుండి 50 మంది ప్రతినిధులు 500 మంది ప్రేక్షకులు వచ్చారు. ఆహ్వాన సంఘాధ్యక్షులైన కామ్రేడ్ చేకూరి వెంకయ్య, సభా ప్రారంభకుడు కామ్రేడ్ కె. కృష్ణారావు సభాధ్యక్షులు ఎ. గంగాధరం (ఆమంచర్ల గంగాధర రావు) ఫాసిస్టు ప్రమాదం గురించి, భారతీయ కర్తవ్యాన్ని గురించి ఉపన్యసించారు. ప్రభుత్వ నిర్బంధవిధానాన్ని ఖండిచుతూ జాతీయైక్యతకు యువకులు కృషి చేయవలసిందని, మహాసభలో తీర్మానించ బడింది కయ్యూరు రైతు నాయకులపై మరణ శిక్షను రద్దు చేయవలసిందనీ వలంటీర్ దళాలపై నిషేధం తొలగించవలసిందని ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించారు.

కృష్ణా జిల్లా నందిగామ తాలూకాలో కామ్రేడ్ రావెళ్ళ హనుమంతరావు ఈ క్రింది గ్రామాలలో పర్యటించి యువజన సంఘాలు స్థాపించారు. లింగాయి, మత్సవాయి, దబ్బాకుపల్లె, వేములనరము, కంభంపాడు, మాచనేని పాలెం, కొణత మాత్మకూరు, పీరులపాడు, చపులపల్లి, ఏలూరు, దాచవరం, మాగల్లు, లింగాలపాడు, పొన్నవరం, పేరుగలపాడు, కంచకచర్ల, పెండ్యాల, చింతలపాడు, రావులపాడు, చెర్వుకొమ్ముపాలెం, కమ్మవారిపాలెం, రాఘవాపురం, నందిగామ, అనాసాగరం, శనగపాడు, అయితవరం, దందర్లపాడు, గుమ్మడి

దుర్రు, పెనుగంచిప్రోలు, అనిగళ్ళపాడు, ముచ్చింతాల, మునగచర్ల మొదలగు అన్ని గ్రామాలలోనూ, జాతీయ నాయకులను విడుదల చేయాలనీ, జాతీయ ప్రభుత్వ స్థాపనకై అన్ని పార్టీలతోనూ సంప్రదింపులు జరపాలనీ, ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానాలు మహజర్లు పంపించారు. మొత్తం 500 మంది యువజన సంఘంలో చేరారు.

కృష్ణాజిల్లా యువజన సంఘ ఆర్గనైజరు తాతినేని సూర్య ప్రకాశరావు గారు తదితరులు ఈ క్రింది గ్రామాలలో సంచారం చేసి జాతీయైక్యత యొక్క అవసరాన్ని గురించి ప్రజలలో ప్రచారం చేశారు. అరాజక చర్యలు మన స్వాతంత్ర్యానికి ఎలా మార్గం కాదో స్పష్టీకరించారు. చోడవరం, కోడూరు, నందిగామ, పెనుమల్లి, దావాజిపాలెం, ముచ్చలగుంట, కలువగుంట పాలెం, చెవెంద్ర, పెందొర్రు. ఈ గ్రామాలన్నింటిలోను యువజన సంఘాలు స్థాపించబడ్డాయి.

విడవలూరు, ఈతముక్కల గ్రామాల్లో అక్టోబరు 1, 2వ తేదీలలో గ్రామ యువజన సంఘాల ఆధ్వర్యాన చిట్టేటి వెంకయ్యగారి అధ్యక్షతన సభలు జరిగాయి. తక్షణమే జాతీయ నాయకులను విడుదల చేయవలసిందని కయ్యూరు నాయకులను విడుదల చేయవలసిందని ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించారు.

## నెల్లూరు జిల్లాలో

నెల్లూరు జిల్లా గూడూరు యువజన సంఘ కార్యవర్గ సమావేశం 4-10-42వ తేదీన కామ్రేడ్ మత్తేఖాన్ అధ్యక్షతను సమావేశమై ప్రభుత్వ విధానాన్ని ఖండిస్తూ జాతీయ నాయకులను వెంటనే విడుదల చేయాలని కోరుతూ, జాతీయైక్యతకు కృషి చేయవలసిందిగా ముస్లింలీగ్‌ను కోరుతూ తీర్మానించారు.

ఒంగోలు తాలుకా యువజన సంఘం తరపున కామ్రేడ్ సి. ఎల్. నారాయణ, ఎం. కేశవులు, వి.వి. దీక్షిత్ తాలుకా అంతటా సంచారం చేసి ప్రజలలో జాతీయ వాంఛను గురించి విరివిగా ప్రచారం చేశారు.

నెల్లూరు జిల్లా ఆత్మకూరు తాలుకా యువజన మహాసభ ఆత్మకూరులో సెప్టెంబరు 1వ తేదీన జయప్రదంగా జరిగింది. 300 మందితో ఊరేగింపు జరిగింది. కామ్రేడ్ జి.సి. కొండయ్య పతాకోత్సవం జరిపారు. 10 గ్రామాల నుండి యువకులు ప్రతినిధులుగా వచ్చారు. రాత్రి మహాసభకు 100 మంది యువకులు వచ్చారు. కయ్యూరు కామ్రేడ్స్ మరణశిక్ష రద్దుచేయాలని చైనా, రష్యా యువకులకు సహకారం ప్రకటిస్తూనూ, బ్రిటిషు ప్రభుత్వ నిర్బంధ విధానాన్ని ఖండించుతూనూ, జాతీయ ప్రభుత్వ స్థాపనకు పూనుకోవలసిందని,

వలంటీరు దళాలపైన, వయోజన విద్యా ప్రచారంపైన నిషేధాన్ని తొలగించవలసిందనీ కోరుతూ తీర్మానాలు ఆమోదించారు.

## కృష్ణాజిల్లా యువజన సంఘ ఆదర్శ కృషి

ఆటల పాటలద్వారా, వ్యాయామ క్రీడలద్వారా యువకులు తమ దేహదారుఢ్యాన్ని విజ్ఞాన సంపదను వృద్ధి చేసుకోవడం ఫాసిస్టు ప్రతికూల పోరాటానికి అత్యవసరం. కృష్ణాజిల్లా యువజనసంఘం ఈ విషయంలో బహు శ్రద్ధగా పాటుపడుతోంది. దీనికి అనుబంధ శాఖలైన గుడివాడ, గన్నవరం, దివి, బందరు, బెజవాడ, తాలుకా సంఘాలు సంవత్సరంలో ఆ యా తాలుకా యువకులను సమీకరించి యువకుల ఆదర్శాలను ప్రచారం చేశాయి.

అన్ని తాలుకాలలో మొత్తం 53 గ్రామాల నుండి వచ్చిన యువకులు ఈ క్రింది పోటీలలో పాల్గొన్నారు. చెడుగుడు టీములు 73, లాంగ్‌జంప్ 73 గురు, (16 అ॥ 9 అం॥) హైజంప్‌లో 60 మంది (5 అ॥ 6 అం॥) హర్డిల్స్ 89 మంది బంతి విసరడంలో 52 మంది (79 గ॥) గుండు విసురుటలో 31 మంది (26 అ 2 అం॥) మైలుపరుగులో 30 మంది (16 ని॥) 100 గజాల పరుగులో 40 మంది, ఫర్లాంగు పరుగులో 12 మంది (1/2 నిముషం) 2 ఫర్లాంగులు ఈతలో 23 మంది (16 ని॥) సైకిల్ స్లో 8 మంది, సైకిల్‌స్పీడు 19 మంది టగ్ అఫ్ వార్ 30 మంది, అడ్డదిడ్డాల పరుగులో 10 మంది. ఈ పోటీలకు హాజరైన ప్రేక్షకులు సుమారు 22,500 మంది. బహుమతులు వైజ్ఞానికంగానూ, శారీరకంగానూ, యువజనాభివృద్ధికి కావలసినవి యివ్వబడ్డాయి. జపాన్ దండయాత్ర ప్రమాదంగల ఆంధ్ర రాష్ట్రంలో యువకులు జపాన్ ప్రమాదాన్ని గుర్తించేటట్లు బహుమతులిచ్చే సమయంలో యువకుల్ని, ప్రేక్షకుల్ని ప్రబోధించుతూ వచ్చారు. యువకులందరిలో ఐక్యత అవసరాన్ని నొక్కి చెప్పారు. దివి తాలుకాలో శ్రీ దండమూడి రాజగోపాలరావు, గన్నవరం తాలుకాలో శ్రీ కొల్లి రంగదాసుగారు కొన్ని వేలమంది ఎదుట బలప్రదర్శన చేశారు. దివి తాలుకాలో దేశభక్తులు మొదలైన నాటికలు ప్రదర్శించారు. ఈ ఆటలద్వారా అన్నివర్గాల యువకులను యువజన పతాకం క్రింద సమీకరించగల్గారు.

బందరు తాలూకా యువజన సంఘ కార్యవర్గ సమావేశం 1942 సెప్టెంబరు 14న పెడనలో శ్రీ మెట్ల వీరయ్యగారి అధ్యక్షతను జరిగింది. తాలుకా ద్వితీయ యువజన మహాసభ అక్టోబరు 9, 10, 11 తేదీలలో జరుపుటకు నిర్ణయించారు. కాంగ్రెస్ నాయకులను విడుదల చేయవలసిందనీ, జాతీయ ప్రభుత్వం స్థాపించవలసిందనీ ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానం ఆమోదించారు.

దివి తాలుకా యువజన సంఘ కార్యవర్గం సెప్టెంబరు 13 న సమావేశమై నాదెళ్ళ వెంకట క్రిష్ణయ్య గారిని తాలుకా ఆర్గనైజరుగా ఎన్నుకొన్నారు. జాతీయ ప్రభుత్వాన్ని వెంటనే ఏర్పరచవలసిందన్న ఆందోళనను కొనసాగించాలని నిర్ణయించారు.

సత్తెనపల్లి :- ప్రజా ప్రతినిధులతో కూడిన ఆహార పదార్థాల సంఘం (ఫుడ్ కౌన్సిల్) స్థాపించి ప్రజలకు సరియైన సప్లయిలు చేయాలని సత్తెనపల్లి తాలుకా యువజన సంఘం తీర్మానించింది.

పందిళ్ళపల్లి, వేటపాలెం, జాంద్రపేట యువజన సంఘాల తరపున స్థానికాధికారుల వద్దకు రాయబారం వెళ్ళారు.

## సాంస్కృతిక పునరుజ్జీవనం-యువజనోద్యమ పాత్ర

1939-42 కాలం నాటి తెలుగు దేశంలో సామాజిక జీవితం, అభివృద్ధి నిరోధక ఫ్యూడల్, జమీందారీ సంప్రదాయాల క్రింద కృంగి కృశించి పోయి ఉంది. నవయుగాంధ్ర నిర్మాతలు కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు, గిడుగు రామమూర్తి, కొమర్రాజు లక్ష్మణరావు మున్నగు మహనీయులు, ప్రారంభించిన సాంఘిక, సాహిత్య, భాషా విప్లవోద్యమాలు వారు అంతరించగానే తిరిగి వెనుకబడి పోయాయి. ఆ మహామహులు తలపెట్టిన ఉద్యమాలను తిరిగి కొనసాగించ వలసిన కర్తవ్యాన్ని ఈ దశలో కమ్యూనిస్టు పార్టీ ప్రోత్సాహంతో అభ్యుదయ రచయితల సంఘం ప్రజా నాట్యమండలి, యువజన, మహిళా సంఘాలు స్వీకరించాయి వారి వర్ధంతులను పెద్ద ఎత్తున జరిపి వారి సందేశాన్ని మరల తెలుగు ప్రజలకు వినిపించాయి.

సాంఘిక దురాచారాలకు, మూఢ నమ్మకాలకు వ్యతిరేకంగా ప్రచారం చేసి, యువజన సంఘాలు ప్రజలలో గొప్ప మార్పు తెచ్చాయి. ఆనాటి పల్లెటూళ్ళలో పండుగలకు కోడి పందాలు, గొర్రె పొట్టేళ్ళ పందాలు జోరుగా జరుగుతూండేవి. (ఇటీవల గ్రామీణ నడమంత్రపు సిరి వర్గాల యువకులు మళ్ళీ కోడి పందాలను పెద్ద ఎత్తున ప్రారంభించారు. కోళ్ళ కాళ్ళకు బంగారు కడియాలు తొడిగి, టాక్సీలమీద కోడి పందాల కేంద్రాలకు జేరుతున్నారు. కోస్తా జిల్లాల్లో ఇదొక పెద్ద వ్యసనంగా ఉంది) త్రాగుడు, పేకాటలతో గ్రామీణ యువకులు సంఘ వ్యతిరేక శక్తులుగా తయారయ్యే వారు. రౌడీల బెడద ఎక్కువగా ఉండేది (ఇటీవల మళ్ళీ రౌడీ బలగాలు రాజకీయ శక్తుల చేతుల్లో పెద్ద బలగాలుగా సంఘ వ్యతిరేక శక్తులుగా తయారయ్యాయి.)

యువజన సంఘాలు, బాల సంఘాలు చేసిన కృషి ఫలితంగా ఈ దశలో తెలుగు గ్రామీణ ప్రాంతాలలో పండుగల స్వరూపాన్నే పూర్తిగా మార్చి వేశాయి.

దసరా, సంక్రాంతి పండుగ రోజులలో, ప్రభాత్ పేర పెద్ద ఎత్తున ఆటల పోటీలు, వ్యాయామ పోటీలు, నాటకాలు, విచిత్ర వేషాల ద్వారా నూతన ప్రత్యామ్నాయ కార్యక్రమాన్ని యువజన సంఘాలు ప్రవేశ పెట్టడంతో యువకులు, కోడి పందాలు, పేకాటల నుండి మరలి ఆరోగ్యవంతమైన ఈ కార్యక్రమాల వైపు ఆకర్షించబడ్డారు. పండుగలు జరిగినప్పుడు. యువజన మహా సభలు జరిగినప్పుడు దేశభక్తుల పేర్లతో గేట్లు నెలకొల్పేవారు. భగత్‌సింగ్ గేటు, టాగూర్ గేటు, జలియన్ వాలాబాగ్ గేటు అని పేర్లు పెట్టేవారు. ఈ విధంగా వారికి జాతీయోద్యమ చరిత్రతోనూ, దేశభక్తుల త్యాగమయ జీవితాలతోనూ పరిచయం చేసి ఉత్తేజపరచడం జరిగింది.

## ప్రాచీన కళా రూపాల పునరుద్ధరణ

బుర్రకథ, జముకుల కథ, గొల్ల సుద్దులు, కోలాటం, భజన, బుడబుక్కల వేషం, పకీర్లు, లంబాడీ డ్యాన్స్, అన్నా చెల్లెళ్ళ సంవాదం, చె చీత-ఒక టేమిటి? ప్రాచీన జానపదా కళా రూపాలన్నింటితో అనాటి ప్రజల సమస్యలు, ఇతివృత్తాలుగా ఒక బ్రహ్మాండమైన సాంస్కృతికోద్యమం తెలుగు గ్రామ సీమలను ఉర్రూతలూగించింది. జాతీయ భావము, దేశభక్తి, నిస్వార్ధ ప్రజాసేవ, ఉన్నత జీవితాదర్శాలు. ఇందులో ప్రబోధించబడేవి. ఫాసిస్టు వ్యతిరేక పోరాటంలో సోవియట్ యువతీ యువకులు, గెరిల్లాలు జరిపే వీరోచిత పోరాట గాథలు, ఆత్మార్పణ యువతీ యువకుల నుత్తేజపరచేవి.

ఎగురవేయ్ భారత భువిపై యువక పతాకం, మాస్కో పొలిమేరలోనా శాల్యూట్, శాల్యూట్ ఎర్ర సైనికుడా, పాడవే, పాడవే తుమ్మెదా మున్నగు పాటల ఎక్కడ చూసినా యువతీ యువకుల నోటి నుండి వినబడేవి.

దసరా పండుగలకు విచిత్ర వేషాలు వేసేవారు. దొంగవర్తకుడు, బెంగాల్ కరువు, గాంధీ-జిన్నాలు కరస్పర్శ, హిట్లరు, ముసోలినీలతో యుద్ధం చేస్తున్న స్టాలిన్ మున్నగు విచిత్ర వేషాలు వేలాది ప్రజలను ఆకర్షించేవి. ఈ విధంగా ఆంధ్ర దేశంలోని అనేక పట్టణాలలో పల్లెల్లో దసరా పండుగలకు పెద్ద ఎత్తు వైజ్ఞానిక ప్రదర్శనలు జరిపి యువజన సంఘాలు ప్రజలలో అపూర్వ సంచలన తీసుకు రాగల్గాయి.

## గ్రామ సీమలలో నూతన జీవితం

యువజన సంఘాలు పెద్ద ఎత్తున అమలు జరిపిన ఈ శారీరక, సాంస్కృతిక కార్యక్రమాల వలన తెలుగునాట ప్రజా జీవితంలో అపూర్వమైన మార్పు ఒక రకంగా నూతన ప్రజా జీవితం ఏర్పడిందంటే అందులో అతిశయోక్తి లేదు. యువజన సంఘాలు నడిపిన రాత్రి పాఠశాలలు, వయోజన విద్యా తరగతుల

వలన గ్రామీణ యువకులలో విద్యా, విజ్ఞానాలు వ్యాపించాయి. గోష్ఠ వార్తా పత్రికలు, వార్తా పత్రిక పఠన కేంద్రాలు, గ్రంథాలయాలు, ఊరూర వెలిశాయి హరిజన వ్యవసాయ కార్మిక యువకులను కూడా యువజనోద్యమం లోకి తీసుకురావడం వలన సవర్ణ యువకులలో అస్పృశ్యత పట్టింపులు సడలి పోయాయి. కులభేదాలు మరిచిపోయి అన్ని కులాల, అన్నితరగతుల యువకులు ఆటలు, పాటలులో పాల్గొనడం ద్వారా, అంత క్రితం గ్రామ కక్షలలో, కొట్లాట లలో కొట్టు మిట్టాడే గ్రామాలలో ఐక్యతా భావం, గ్రామీణ ఆరోగ్య, వైద్య, పారి శుధ్య సౌకర్యాలు, మొదలైన వాటి సాధనకు ఐక్య కృషి, సామరస్యం మొలక లెత్తాయి. యువతరంలో వచ్చిన ఐక్యత - గ్రామ పెత్తందార్ల మధ్య అనైక్యతను, తగువులను సమసిపోయేటట్లు చేసిన సందర్భాలు ఆ రోజులలో అనేకం.

## సాంఘిక సంస్కరణ

ఆబ్దికాలకు, దినాలకు విపరీతంగా ఖర్చు చేయడం బదులు, ఆ డబ్బును మరే ప్రజోపయోగ కార్యాలకు వెచ్చించాలన్న ప్రబోధం ఫలితంగా ఆ ఒకారాలు తగ్గించి, వ్యవసాయ కూలీలకు నూతులు త్రవ్వించడం గ్రంథాలయానికి విరాళా లివ్వడం, పేదలకు భోజనాలు పెట్టడం మున్నగు పద్ధతులు అమలులోకి వచ్చాయి.

వరకట్నాలకు వ్యతిరేకంగా యువకులలో యువజన సంఘాలు తీసుకు వచ్చిన ప్రబోధం ఫలితంగా అనేక వివాహాలు వరకట్నరహితంగా జరిగేవి. అనేక మంది యువకులు అందుకు ముందంజ వేసేవారు. ఆడంబరంలో, అట్ట హాసాలతో మంత్రాలతో పెళ్ళిళ్ళు బదులు, పూలదండల పెళ్ళిళ్ళు పెద్ద ఎత్తున అమలులోకి వచ్చాయి. ప్రేమించి వివాహాలు చేసుకోవడం ఆదర్శవంతంగా ఎంచబడేవి.

అంతవరకు స్త్రీలలో ఘోషా పద్ధతి ఎక్కువగా ఉండేది. యువజన సంఘాలు మహిళా సంఘాలు స్త్రీలను, సభలకు, సమావేశాలకు తీసుకొని రావడం ద్వారా ఈ సాంఘిక దురాచారం చాలా వరకు పటాపంచలైంది. ఇంటింటికి పుస్తకాలు అందించే కార్యక్రమాలద్వారా స్త్రీలలో గ్రంథ పఠనాసక్తి పెంపొందింది.

## వయోజన విద్యా ప్రచారం

వయోజన విద్యా ప్రచారంలో యువజన సంఘాలు నిర్వహించిన పాత్ర జాతీయ ఉద్యమ ప్రముఖుల ప్రశంసలను పొందింది. కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి, విశాఖ మున్నగు జిల్లాల్లో వందల కొలది రాత్రి పాఠశాలలు యువజన సంఘాలచే నడుపబడుతూ ఉండేవి.

1944 ఆగష్టు 29 న విజయవాడలో జరిగిన వయోజన విద్యా సభలో ఆంధ్ర ఉద్యమ నాయకులు దేశభక్తులు, దక్షిణ భారత వయోజన విద్యా ప్రచార

సంఘాధ్యక్షులు అయిన శ్రీ గాడిచర్ల హరి సర్వోత్తమ రావు గారు ఇలా ప్రశంసించారు.

"మాలో ఏ కొద్ది మందిలోనో ఉండే అభిప్రాయాలను బహు జనాభిప్రాయంగా (యువజన సంఘాల వారు) మార్చ గల్గారు. మాలాగ కేవలం పట్టణాల నుండి, కాలేజీల నుండి గాక, పల్లెల నుండి మీరు రావడం మూలాన, ప్రజలతో సన్నిహిత సంబంధం కలిగి ఉండటం మూలాన ఈ కార్యక్రమం మరింత జయప్రదంగా నిర్వహించగలుగుతున్నారు. మీ యువ శక్తికి ఎదురు లేదు. (ప్రజాశక్తి వారపత్రిక 1944, ఆగష్టు 29.)

1943-44 నాటికి యువజనోద్యమం రాష్ట్రంలో 1200 గ్రామాలకు వ్యాపించింది. యువజన సంఘాలలో, బాల సంఘాలలో 40,000 సభ్యత్వం ఉందంటే ఎంత విస్తృత ప్రజా ఉద్యమంగా తయారైందో స్పష్టమవుతుంది. ఒక్క కృష్ణా జిల్లాలోనే 10,000 సభ్యత్వం ఉండేది. రాష్ట్రమంతటా యువజన సంఘాల ఆధ్వర్యాన 140 గ్రంథాలయాలు, 100 గ్రామాలలో రాత్రి పాఠశాలలు, 120 గ్రామాలలో ఆటల కార్యక్రమాలు జరుగుతుండేవి.

యువజనోద్యమం, బాల సంఘాలు గ్రామ సీమలలో తెచ్చిన నూతన జీవితం గురించి 31-1-1945 వ తేదీ ప్రజా శక్తి వారపత్రిక ఇలా వ్రాసింది.

"ఈ విధంగా ఆంధ్ర భూమి యందు శక్తి సమన్వితమైన నూతనత్వం ఆరంభమైంది. నూతన చైతన్యం ఆవరించింది. నిస్తబ్దత, నిర్వీర్యత, నిస్తేజం ప్రజల నుండి దూరమవుతున్నాయి. శతాబ్దాలుగా తమ సాంఘిక రాజకీయ దాస్యానికి కారణభూతమైన దురాచారాలకు, దుర్వ్యసనాలకు, కార్య శూన్యతకు, నిస్సహాయతకు, అనైక్యతకు స్వస్తి చెప్పి ప్రజలు చైతన్యవంతులవుతున్నారు".

—ప్రజాశక్తి

1935 నుండి 1945 వరకు దశాబ్దం కాలంలో ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనకు జరిగిన కృషిలో ఆంధ్ర యువజనోద్యమం మనోజ్వల పాత్ర నిర్వహించింది. అని ఈ చరిత్ర రుజువు చేస్తుంది.

సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడల్ వ్యతిరేక ప్రజాతంత్ర విప్లవంలో ఆనాడు యువజనోద్యమం అగ్రశ్రేణిలో నిలబడి తనపై నున్న చారిత్రక కర్తవ్యాన్ని నిర్వహించింది.

# వ్యవసాయ కార్మికోద్యమం

యావద్భారత దేశంలో మొట్టమొదటిసారిగా వ్యవసాయ కూలీలను వర్గ ప్రాతిపదికపై సంఘటితం చేసిన ఘనత ఆంధ్ర రాష్ట్రంలోని కమ్యూనిస్టులకు దక్కుతుంది. నిరక్షరాస్యత, సాంఘిక దురాచారాలకు లోనై వెనుకబడి ఉన్న వ్యవసాయ కూలీలలో చైతన్యం కల్గించి వారిని ఒక బలమైన రాజకీయ పోరాట శక్తిగా రూపొందించడానికి కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తలు ఎనలేని కృషిచేశారు. భూస్వాముల దాడులకు, పోలీసుల నిర్బంధానికి గురి అయ్యారు. ఎన్ని కష్ట నష్టాలకు గురిఅయినా, పీడితవర్గంగా ఉన్న వ్యవసాయ కూలీలను సంఘటిత పర్చడంలో వెనుకంజ వేయలేదు.

## 1930 దశకం నాటి వ్యవసాయ కూలీల దుస్థితి

వ్యవసాయమే ప్రధాన వృత్తిగా ఉన్న ఆంధ్ర రాష్ట్ర గ్రామీణ ప్రజలలో సగంమంది వ్యవసాయ కూలీలుగా జీవించేవారు. వీరిలో అత్యధికులు మాల, మాదిగ కులాలకు చెందినవారు. అగ్రకులాలవారిచే వీరు అస్పృశ్యులుగా చూడబడే వారు. ఆర్థిక దోపిడీ, సాంఘిక అసమానత, కనీస మానవ అవసరాలు తీరని నికృష్ట జీవితం - ఇది ఆనాటి వ్యవసాయ కూలీల పరిస్థితి. వీరి సాంఘిక వెనుకబాటుతనాన్ని, నిరక్షరాస్యతను పేదరికాన్ని అసరాగా చేసుకుని గ్రామీణ భూస్వాములు, జమీందార్లు అన్ని రకాలుగా వీరిని దోచుకునేవారు.

కూలి రేటు :- కనీస కూలి అనేది లేదు. ఒక గ్రామంలో ఉండే కూలి మరో గ్రామంలో ఉండేది కాదు. సాధారణ దినాల్లో అయితే 0-1-0 అణానుండి 0-6-0 అణాల వరకు కూలి ఇచ్చేవారు. బాగా పని ఒత్తిడి రోజుల్లో మాత్రమే కొన్నిచోట్ల 0-6-0 అణాలు మరికొన్ని చోట్ల 0-8-0 అణాలు కూలి ఉండేది. చాలా చోట్ల కూలి ధనరూపంలో కాక ధాన్యరూపంలో ఇచ్చేవారు. ధాన్యరూపంలో కూలి ఇచ్చేటప్పుడు నాసిరకం ధాన్యాన్ని కూలిగా కొలిచేవారు.

పిచ్చిముంతలు :- ధాన్యరూపంలో కూలి ఇచ్చేటప్పుడు క్రయ విక్రయాలకి ఉపయోగించే కొలపాత్రలని ఉపయోగించేవారు కాదు. తక్కువ పరిమాణం ఉన్న కొలపాత్రలను ఉపయోగించేవారు. వీటినే పిచ్చిముంతలనేవారు.

నాగు లేక నాము పద్ధతి:-వ్యవసాయ కూలీలకు సంవత్సరం పొడుగునా పని ఉండదు. పనిలేని దినాల్లో తిండిగింజలు కూడా దొరకవు. వేరేదారి

లేక పెద్ద రైతుల నుండి భూస్వాముల నుండి అప్పుగా ధ్యానం తీసుకునేవారు. అయితే తిరిగి చెల్లించేటప్పుడు ఇచ్చినదానికన్నా 50 శాతం కొన్ని సందర్భాలలో 100 శాతం అధికంగా వసూలు చేసేవారు. అప్పు తీసుకునేటప్పుడు తక్కువ పాత్రలతోనూ, తిరిగి చెల్లించేటప్పుడు ఎక్కువ పాత్రలతోనూ కొలిచేవారు. పై పెచ్చు అప్పు తీసుకునేటప్పుడు, తిరిగి చెల్లించేటప్పుడు కొలతలు కొలిచిన వ్యక్తికి తూముకు ఒక ముంత ధాన్యం కమీషన్‌గా ఇవ్వాల్సి వచ్చేది.

(4 ముంతలు ఒకకుంచం, 4 కుంచాలు ఒక తూము.)

**వెట్టిపద్ధతి :-** గ్రామ పెద్దలైన కరణం, మునసబు, పెద్ద భూస్వామికి బాగా పని ఒత్తిడి ఉన్న దినాల్లో కూడా ఈ కూలీలు వెళ్ళ పనిచేయాలి. సాధారణంగా ఇచ్చే కూలికూడా వీరు ఇచ్చేవారు కాదు. గొప్ప దయామయుడైతే ఎంతో కొంత ఇచ్చి పంపేవాడు.

భూస్వాముల దోపిడి ఇలా ఉంటే వ్యాపారస్థుల దోపిడీ మరీ దారుణంగా ఉండేది. ప్రతి వస్తువును కూలీలకు అధిక ధరలకు అమ్మేవారు. అంగడికి ధాన్యం పట్టుకు వెళ్తే ఎక్కువ పాత్రలతో కొలిచేవారు. ఏ వస్తువు కొన్నా తూనికలలో దగా చేసే వారు.

వ్యవసాయ కూలీలు ఒక పక్క భయంకరమైన ఆర్థిక దోపడీకి గురిఅవుతూ మరో ప్రక్క అమానుష సాంఘిక అసమానతకు గురి అయ్యేవారు. గ్రామాలలో అంటరానివారుగా అతిహీనంగా వ్యవసాయ కూలీలను చూసేవారు. గ్రామ చావడి, గ్రామ బావుల దరిదాపులకు కూడా రానిచ్చేవారు కాదు. కొత్త బట్టలు కాని చెప్పులు కాని వేసుకుని గ్రామ బజార్లలో తిరగడం మహా నేరంగా పరిగణించే వారు. ఇక విద్య గురించి అసలు మాట్లాడే పనిలేదు. వ్యవసాయ కూలీలను పిల్లలను పాఠశాలలకు రానిచ్చేవారు కాదు. రాత్రి పాఠశాలలో చదవడం కూడా మహా నేరంగా చూసేవారు. వ్యవసాయ కూలీల పరిస్థితి ఇలా వుంటే పాలేళ్ళ పరిస్థితి మరీ దారుణంగా ఉండేది. వీరి పనులకు గంటల నియమం అసలు లేదు. వేకువనే లేచి పాలు పితకడం మొదలుకొని - రాత్రి పక్కలు వేయడం వరకు చిన్న పెద్ద పనులన్నీ పాలేర్లు చేయాలి. సంవత్సరం పొడుగునా పనిచేయాలి. సెలవులు ఉండవు. అన్నం పెట్టి గుడ్డలిచ్చి తూము మొదలుకొని 10 తూముల ధాన్యం జీతంగా ఇచ్చేవారు. మొత్తంగా వీరిది బానిస జీవితమే.

ఈ నికృష్ట జీవితాన్ని భరించలేని వ్యవసాయ కూలీలు అక్కడక్కడ తిరుగుబాట్లు, సమ్మెలు చేసేవారు. అయితే ఇవి నిర్మాణాత్మకంగా ఉండేవి కావు. 1920 దశాబ్ది చివరి కాలంలో ఆది ఆంధ్ర సంఘాలు, అరుంధతీ సంఘాలు, డిప్రెస్డ్ కాస్టు లీగ్, క్రిస్టియన్ సంఘాలు మొదలైనవి కొన్ని ఏర్పడి వ్యవసాయ

కూలీల సమస్యలపై పనిచేయడం ప్రారంభించాయి. అయితే ఇవి కుల ప్రాతిపదిక గానో, మత ప్రాతిపదికగానో వ్యవసాయ కూలీలను సమీకరించాయి కాని మొత్తంగా వ్యవసాయ కూలీలందరిని సమీకరించే ప్రయత్నాలు చేయలేదు. అంతేకాకుండా సాంఘిక సమస్యలు, విద్యా సౌకర్యాలు మొదలైన వాటి గురించే ఈ సంఘాలు కృషి చేశాయి. అసలైన ఆర్థిక సమస్యలపై అంతగా కేంద్రీకరించి పనిచేయలేదు. కూలి రేటు పెంపు కొరకు, ఇతర ఆర్థిక సమస్యలపై అనేకచోట్ల సమ్మెలు జరిగాయి. 1927 లో నెల్లూరు జిల్లా మైపాడులోనూ, 1930 లో పొట్లపాడులోనూ కూలిరేటు కోసం సమ్మెలు జరిగాయి. ఇవన్నీ స్థానికంగా జరిగిన సమ్మెలే తప్ప విశాల ప్రాతిపదికపై కాని, సరి అయిన సిద్ధాంత అవగాహనతో గాని జరిగిన సమ్మెలు కావు. ఇవి ఆర్థిక పరిస్థితి దుర్భరమై నప్పుడు, అప్పుడికప్పుడు చేసిన సమ్మెలు.

వర్గ ప్రాతిపదికపై వ్యవసాయ కూలీలను సమీకరించి, సరిఅయిన సిద్ధాంత అవగాహనతో వీరిని బలమైన రాజకీయ పోరాటశక్తిగా రూపొందించే ప్రయత్నమేమి జరుగలేదు. 1933 వరకు ఇదే పరిస్థితి కొనసాగింది.

సత్యాగ్రహోద్యమంలో పాల్గొని కమ్యూనిస్టు భావాలవైపు ఆకర్షితులైన కొంతమంది యువకులు వ్యవసాయ కూలీల ప్రాధాన్యతను గుర్తించి వారిని సంఘాలలో నిర్మాణం చేసేందుకు ప్రయత్నించారు. అట్టడుగున ఉన్న వ్యవసాయ కూలీలను జాగృతంచేసి, స్వాతంత్ర్య పోరాట స్రవంతిలో ఒక భాగంగా రూపొందించడానికి, వారి సాంఘిక ఆర్థిక సమస్యలపై పోరాడటానికి, విశాల ప్రాతిపదికపై నిర్మించబడే వ్యవసాయ కూలీసంఘాలు అత్యవసరమని ఈ యువకులు గుర్తించారు.

పుచ్చలపల్లి సుందరయ్యగారు తమ స్వగ్రామమైన అలగానిపాడు, ఆ చుట్టుపక్కల గ్రామాలలోని వ్యవసాయ కూలీలను సమీకృతం చేసే ప్రయత్నం 1933 నుండి ప్రారంభించారు. వారిని సంఘంలో నిర్మాణం చేయడంతో పాటుగా వ్యాపారస్థుల దోపిడీనుండి రక్షించేందుకు, ఒక సహకార దుకాణాన్ని కూడా ఏర్పరిచారు. వీరిలోని నిరక్షరాస్యతను రూపుమాపటానికి ఒక వయోజన పాఠశాలను, వ్యవసాయ కూలీల పిల్లలకు ప్రత్యేకంగా మరొక ప్రాథమిక పాఠశాలను కూడా ప్రారంభించారు. రాత్రి పాఠశాలల ద్వారా వర్గసంఘాల నిర్మాణ అవసరం గురించి వ్యవసాయ కూలీలకు వివరించేవారు. కాంగ్రెసులోని అతివాద యువకులకుకూడ వ్యవసాయకూలీల సమస్యలగురించి వారినుండి సంఘ నిర్మాణం చేయాల్సిన ఆవశ్యకత గురించి సుందరయ్య వివరించేవారు. వెన్నెలకంటి రాఘవయ్య వంటి కాంగ్రెసువాదులుకూడా వ్యవసాయ కూలీలను సమీకరించే ప్రయ

త్నాలను ప్రారంభించారు. సుందరయ్యగారి కృషి మూలంగా 1934 లో అలగానిపాడు వ్యవసాయ కూలి సంఘం ఏర్పడింది. ఆంధ్ర రాష్ట్రంలో నిర్మాణ యుతంగా ఏర్పడిన మొట్టమొదటి కూలి సంఘం ఇది. నియమ, నిబంధనావళితో, కార్యక్రమ విధానంతో ఈ సంఘం ఏర్పడింది.

మరో వైపున, కృష్ణా జిల్లా వీరులపాడు గ్రామంలోని వ్యవసాయ కూలీలను సమీకరించేందుకు జొన్నలగడ్డ రామలింగయ్య 1935 చివరిలో పూనుకున్నారు. కరపత్రాల ద్వారా వ్యవసాయ కూలి సంఘ ఆవశ్యకతను, వారి సమస్యలపై పోరాట అవసరాన్ని ప్రబోధిస్తూ ప్రచారం జరిగింది. ఈ కృషి మూలంగా వీరులపాడులో వ్యవసాయ కూలీ సంఘం 1936 లో నిర్మాణ రూపం దాల్చింది. ఇదే విధంగా గుంటూరు జిల్లాలోని దావులూరు, పల్లెకోన గ్రామాలలో కాబోతు రామస్వామి, చింతల సూర్యనారాయణలు, వ్యవసాయ కూలీలను సమీకరించి సంఘ నిర్మాణ కార్యక్రమాలను ప్రారంభించారు. దీని ఫలితంగా 1935 లో దావులూరులోను 1936 పల్లెకోనలో వ్యవసాయ కూలీ సంఘాలు ఏర్పడ్డాయి [1]

ఈ విధంగా ఏర్పడిన వ్యవసాయ కూలీ సంఘాలు ఆంధ్ర రాష్ట్ర వ్యవసాయ కూలీ ఉద్యమానికి ఒక నిర్మాణ రూపం ఇచ్చేందుకు నాంది పలికాయి. కమ్యూనిస్టు భావాలవైపు ఆకర్షితులైన యువకులు, వ్యవసాయ కూలీలలో నూతన చైతన్యం కల్గించి వారిని సంఘటిత పరిచేందుకు ప్రయత్నాలును ప్రారంభించారు. హరిజన వాడల్లో వయోజన పాఠశాలలు నెలకొల్పి వారికి చదువు నేర్పడంతో పాటుగా, వర్గ సంఘాల ఆవశ్యకత గురించి తెలియజేయడం ప్రారంభించారు. రాత్రి వేళలందు గ్రూపు మీటింగులు పెట్టి వ్యవసాయ కూలీలు సంఘటిత మవవలసిందిగా ప్రబోధించడం ప్రారంభించారు.

గుటూరు జిల్లా దావులూరు, పల్లెకోనలలో స్థాపించబడిన వ్యవసాయ కూలీ సంఘాల ప్రభావం క్రమంగా చుట్టుప్రక్కల గ్రామాలకు కూడా విస్తరించింది. "దావులూరు వ్యవసాయ కూలీలు పనికి పోయిన ప్రతీ చోట, కూలీల్లో కూలి సమస్యలపై చర్చలు సాగించడం, ఏ కులానికి చెందినా కూలీలంతా ఒకటే అని ప్రచారం చేయడం ప్రారంభించారు." క్రమంగా 1937 నాటికి తెనాలి, రేపల్లె తాలూకాల్లోని గ్రామాలలో వ్యవసాయ కూలీలు సంఘాలుగా ఏర్పడ సాగారు. కూలీ పెంపు కొరకు 1937 లో తెనాలి తాలూకాలోని దావులూరు మరో 14 గ్రామాలలోని వ్యవసాయ కూలీలు పోరాటం ప్రారంభించారు. 2 మానికల గింజలు లేక 0-4-0 అణాలుగా ఉండే రోజు కూలీని 3 మానికల గింజలు లేక 0-6-0 అణాలుగా పెంచాలని కోరుతూ నాలుగు రోజులు పాటు సమ్మె చేసి విజయం సాధించారు.[2] విజయం సాధించిన ఈ సమ్మె జిల్లా మొత్తంగా వ్యవసాయ

కూలీంలో నూతన చైతన్యాన్ని కల్గించింది. సంఘటితంగా ఉంటే దేనినైనా సాధించవచ్చు అనే ఆశా భావాన్ని వ్యవసాయ కూలీల్లో కల్గించింది. ఈ కాలంలోనే బాపట్ల తాలుకాలోని నర్సాయపాలెం, పెదనందిపాడు మొదలగు గ్రామాంలోని వ్యవసాయ కూలీలు సంఘాలుగ ఏర్పడ్డారు. కొత్త పట్నం రాజకీయ పాఠశాలకు హాజరై వచ్చిన కొల్లా వెంకయ్య బాపట్ల తాలుకాలోని వ్యవసాయ కూలీ ఉద్యమానికి ఒక నిర్మాణ రూపం యిచ్చేందుకు ప్రయత్నించారు. గుంటూరు జిల్లాలో విస్తరిస్తున్న ఈ వ్యవసాయ కూలీ ఉద్యమాన్ని సంఘటిత పరిచి ఒక నిర్మాణ రూపం యిచ్చేందుకు, 1938 మే నెలలో జిల్లా వ్యవసాయ కూలీ ప్రథమ మహాసభను పల్లెకోనలో నిర్వహించారు. ఈ మహాసభలో కాబోతు రామస్వామి, నూతల పాటి జోసఫ్ అధ్యక్ష కార్యదర్శులుగా జిల్లా కమిటీ ఏర్పడింది.

1937 వరకు నెల్లూరు, గుంటూరు జిల్లాలకే పరిమితమైన వ్యవసాయ కూలీ ఉద్యమం క్రమంగా తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలకు కూడా విస్తరించింది. 1937 మద్రాసు రాష్ట్ర అసెంబ్లీ ఎన్నికల సందర్భంగా కాంగ్రెసు విజయానికి కమ్యూనిస్టు కార్యకర్తలు అవిరామంగా కృషి చేశారు. గ్రామ గ్రామానికి తిరుగుతూ కాంగ్రెసు ప్రచారంచేస్తూనే వర్గ సంఘాల ఆవశ్యకత గురించి, వ్యవసాయ కూలీల సమస్యలపై పోరాటానికి, వారిని సంఘటిత పరచవల్సిన అవసరాన్ని గురించి కూడా ప్రబోధించారు. తూర్పు గోదావరి జిల్లాలో 1937 చివరి నాటికి వ్యవసాయ కూలీ ఉద్యమానికి పునాదులు ఏర్పడ్డాయి. కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలో ఉన్న కమ్యూనిస్టులు ఈ విషయంపై ప్రత్యేక శ్రద్ధను చూపారు. జిల్లాలోని వ్యవసాయ కూలీలను సమీకరించి సంఘాలుగా ఏర్పరచటానికి వారి అభివృద్ధికై పాటుపడటానికి 5 గురు సభ్యులుతో కూడిన ఒక ప్రత్యేక ఉప సంఘాన్ని ఏర్పాటు చేసారు. 26-12-37 న కాకినాడలో జరిగిన జిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ మహాసభలో ఈ ఉప సంఘం ఏర్పాటు చేయబడింది.[3]

అసంఘటితంగా ఉన్న వ్యవసాయ కూలీలను సమీకర్ంచి ప్రతి తాలుకాలో కూలీ సంఘాలను ఏర్పాటు చేసేందుకు ఈ ఉప సంఘం కృషి చేసింది. జిల్లా వ్యవసాయ కూలీ ఉద్యమానికి ఒక నిర్మాణ రూపం ఇచ్చేందుకు 1938 జనవరి 2 న రాజోలు తాలుకా మోరీ గ్రామంలో ప్రథమ జిల్లా వ్యవసాయ కూలీ మహాసభ నిర్వహించబడింది. జిల్లాలోని అన్ని తాలూకాల నుండి ప్రతినిధులు ఈ మహాసభకు హాజరయ్యారు.

జిల్లాలో వ్యవసాయ కూలీ ఉద్యమాభివృద్ధికి, సంఘాల నిర్మాణానికి తోడ్పడే విధంగా నియమ నిబంధనావళిని రూపొందిస్తూ ఈ మహాసభ తీర్మానం చేసింది. ఈ జిల్లా మహాసభలో ఆమోదించిన తీర్మానాలు ఈ క్రింది విధంగా ఉన్నాయి.

1. వ్యవసాయ కూలీల ఆర్థిక, రాజకీయాభివృద్ధి కొరకై జిల్లాలో గ్రామ, తాలూకా, జిల్లా సంఘాలు స్థాపించవలయును.

2. 18 సంవత్సరముల పై బడిన పురుషులు, స్త్రీలు, వ్యవసాయ కూలీలు, సంఘ నిబంధనలు ఆశయములు అంగీకరించి, ఒక కాణి సభ్యత్వరుసుము చెల్లించిన సభ్యులుగా చేరనర్హులు.

3. సంఘ నిబంధనలు ఆశయములు అంగీకరించి వ్యవసాయ కూలీల అభివృద్ధికొరకై పాటుపడదలచిన ఇతరులు 8 అణాలు సాలుచందా చెల్లించి, జిల్లా సంఘం అంగీకారమును పొందిన గౌరవ సభ్యులుగా నెంచబడుదురు. అట్టివారు 5%నకు మించరాదు.

4. మార్చి 5వ తేదీలోగా చేరిన సభ్యులు మాత్రమే రాబోయే జిల్లా మహాసభలో పాల్గొన అర్హులు.

వ్యవసాయ కూలీ ఉద్యమాన్ని నిర్మించి వారి సమస్యలపై పోరాడటానికి జిల్లా కమిటీని ఈ మహాసభలో ఎన్నుకున్నారు. ఈ కమిటీ అధ్యక్షులుగా ఉండ్రు సుబ్బారావు కార్యదర్శిగా, కొరపాటి పట్టాభి రామయ్య సహాయ కార్యదర్శిగా, నంబూరి శ్రీనివాసరావు, గెడ్డం మహాలక్ష్మి, కాపూరి పట్టాభి రామారావులు ఎన్నికయ్యారు.[4] ఈ మహాసభ తరువాత జిల్లాలోని వ్యవసాయ కూలీలు, ముఖ్యంగా రాజోలు తాలూకాలో తమ కోర్కెల సాధనకై పోరాట మార్గాలను చేపట్టారు. 1938 ఆగష్టు నెలలో శివకోడు, సావరు, సోంపల్లి ఈదరాడ, పొన్నమండ, అంతర్వేది మొదలగు 10 గ్రామాలో కూలి పెంపుదల కొరకు సమ్మె చేసి విజయం సాధించారు. చిన్నాడం గ్రామంలో నెలరోజులకు పైగా సమ్మె చేశారు. దిండి గ్రామాంలో 4 నెలలు పాటు కూలి పెంపుదల కొరకు వ్యవసాయ కూలీలు సమ్మె చేశారు. ఈ గ్రామాలలోని చిన్న రైతులు కూలీల కోర్కెలను బలపర్చటమే కాకుండా వారితో కలిసి సమ్మె, విజయానికి కృషి చేశారు. తాలుకాలోని వ్యవసాయ కూలీలంతా ఐక్యంగా పోరాడి విజయం సాధించారు. సమ్మెలు జరుగుతున్న గ్రామాలలో వ్యవసాయ పనులు చేయడానికి చుట్టు ప్రక్కల గ్రామాలలోని వ్యవసాయ కూలీలెవరూ రాలేదు. ఈ సమ్మెల ద్వారా సాధించిన

విజయాలు తాలూకా మొత్తంగా వ్యవసాయ కూలీలందర్నీ ఉత్తేజపరిచాయి. వ్యవసాయ కూలీ ఉద్యమానికి రాజోలు తాలుకా ఒక బలమైన కేంద్రంగా రూపొందింది. క్రమంగా రామచంద్రాపురం తాలూకాకు కూడా వ్యవసాయ కూలీ ఉద్యమం విస్తరించింది.

1938 మధ్య కాలానికి తూర్పు గోదావరి జిల్లాలోనే వ్యవసాయ కూలీ ఉద్యమం ప్రచార దశను దాటి నిర్మాణ రూపం తీసుకుంటూ పోరాట దశకు చేరుకుంది. ఇక పశ్చిమ గోదావరి జిల్లా విషయానికొస్తే 1938 నాటికి వ్యవసాయ కూలీ ఉద్యమం ఇంకా ప్రచార దశలోనే వుంది. నర్సాపురం తాలుకాలో అక్కడక్కడ వ్యవసాయ కూలి సంఘాలు ఏర్పడి సాంఘిక దురాచారాలకు వ్యతిరేకంగా పోరాడుతూ వచ్చాయి. బర్మా నుండి వచ్చిన దాసరి వెంకట్రావు, దానియేల్ స్మిత్‌లు, హరిజన, శెట్టి బలిజ, గౌడ పేటలలో వ్యవసాయ కూలీలను సమీకరించి సంఘాలు ఏర్పాటు చేశారు. ఇదే సమయంలో కమ్యూనిస్టు భావాల వైపు ఆకర్షితులైన నెక్కంటి నరసింహారావు మరి కొంత మంది యువకులు కూడా వర్గ దృక్పథంతో వ్యవసాయ కూలీ సంఘాల ఏర్పాటుకు పూనుకున్నారు. హరిజన వాడల్లో వ్యవసాయ కూలీలను సమీకరించి కూలీ సంఘాల ఆవశ్యకత గురించి తెలియజేస్తూ కూలీలను చైతన్యవంతులను చేశారు.

ఇదే విధంగా భీమవరం తాలుకాలోని వ్యవసాయ కూలీలందర్నీ సంఘటిత పరిచేందుకు భూపతిరాజు వెంకట్రామ రాజు అధ్యక్షతన ఒక కమిటీ 1938 ఫిబ్రవరి నెలలో తాలుకా అంతటా పర్యటించింది. ప్రతి కూలీ సంఘంలో చేరాలని, కూలీ సంఘం ఉన్ననాడే స్వాతంత్య్ర పోరాటం ముందడుగు వేస్తుందని తాలుకా గ్రామాలన్నింటిలోనూ ప్రబోధిస్తూ వ్యవసాయ కూలీ సంఘ నిర్మాణానికి పూనుకున్నారు. (నవశక్తి 9-2-38, 2వ పేజీ) తణుకు తాలూకాలో కూడా కమ్యూనిస్టు యువకుల ప్రేరణతో వ్యవసాయ కూలీలు సంఘాలుగా ఏర్పడి పని చేయసాగారు. 1937 నవంబరులోనే తణుకు తాలూకా ముక్కామల గ్రామానికి చెందిన వ్యవసాయ కూలీలు కూలిరేటు పెంపుదల కోసం సమ్మె చేశారు. ఈ కనీస కోర్కెను కూడా మన్నించని భూస్వాములు పోలీసుల సహాయంతో కూలీలపై అనేక కేసులను బనాయించి నానా ఇబ్బందులకు గురిచేసారు. రైతు సంఘ నాయకులు జోక్యం చేసుకుని సమ్మె పరిష్కారానికి భూస్వాములు కూలీల మధ్య ఒక ఒప్పందం కుదర్చడానికి ప్రయత్నాలు కూడా చేశారు. కమ్యూనిస్టుల కృషితోనే పొలమూరు, నేడూరు. ఆచంట, కరుగోలు మిల్లి మొదలగు గ్రామాలలో వ్యవసాయ కూలి సంఘాలు 1938 ప్రారంభకాలంలో ఏర్పడ్డాయి.

# కమ్యూనిస్టుపార్టీ ద్వితీయ రాష్ట్ర మహాసభ, వ్యవసాయ కూలీ ఉద్యమంలో ఒక మలుపు

ఆంధ్ర రాష్ట్ర వ్యవసాయ కూలీ సంఘం అనే పేరుతో ఒక రాష్ట్ర సంఘం 1937 ఆగష్టు 1 న నెల్లూరులో స్థాపించబడింది. ఈ సందర్భంగా ఏర్పాటైన సభకు ఎం. ఎన్. రాయ్ అధ్యక్షత వహించారు. వెన్నెల కంటి రాఘవయ్య 'ఈ సంఘ ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు. వీరితో పాటుగా దువ్వూరి బలరామరెడ్డి, పుచ్చలపల్లి సుందరయ్య, జొన్నలగడ్డ రామలింగయ్య, కంభంపాటి సత్యనారాయణ స్థాయి సంఘ సభ్యులుగా ఎన్నికయ్యారు. అయితే ఈ సంఘం ఎక్కువ కాలం సమైక్యంగా పనిచేయలేక పోయింది. రైతులపట్ల మైత్రీ భావం లేకపోవడం, రైతుల ఎడల ఒంటెత్తు వైఖరి అనుసరించడంవల్ల ఈ సంఘం కార్యాచరణలో వెనుకబడింది వ్యవసాయ కూలీల అభివృద్ధికై పనిచేసే కార్యకర్తలను, వ్యవసాయ కూలీలను సంఘటితం చేయడంలో ఈ సంఘం విఫలమైంది. కొద్ది నెలలలోనే కమ్యూనిస్టులు ఈ సంఘం నుండి వైదొలిగారు.

కాంగ్రెసు సోషలిస్టు పార్టీ పేరుతో తమ కార్యక్రమాలను నిర్వహిస్తున్న కమ్యూనిస్టు పార్టీ సభ్యులు 1938 జూలై నెలలో కమ్యూనిస్టు పార్టీ ద్వితీయ రాష్ట్ర మహాసభను విజయవాడలో రహస్యంగా నిర్వహించారు. వివిధ ప్రజా సంఘాల్లో పార్టీ కార్యకర్తలు ఏ విధంగా పని చేయాలి అనే విషయంపై చర్చించి కొత్త నిర్ణయాలను తీసుకోవడం జరిగింది.

కూలీ సంఘాల ప్రత్యేకతను, రైతులపట్ల వారు అనుసరించవలసిన విధానాన్ని వివరిస్తూ రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ 1938 జూలైలో వ్యవసాయ కూలీలపై ఒక తీర్మానాన్ని ఆమోదించింది. వ్యవసాయ కూలీ సంఘ కార్యకర్తలకు రైతులపట్ల అనుసరించాల్సిన వైఖరిలో కల్గిన సందిగ్ధతను, అనుమానాలను తొలగించి స్పష్టమైన అవగాహనను ఈ తీర్మానం యిచ్చింది.

ఈ నిర్ణయాలను సోషలిస్టు పార్టీ తీర్మానములుగా నవశక్తి పత్రికలలో ప్రకటించారు. వ్యవసాయ కూలీలకు ప్రత్యేకంగా సంఘాలను ఏర్పరచవలసిన అవసరాన్ని నొక్కిచెప్తూ పార్టీ కార్యకర్తలు రైతు కూలి సామరస్యాన్ని పెంపొందిస్తూ సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని ఏవిధంగా తీవ్రతరం చేయాలో ఈ తీర్మానంలో స్పష్టంగా పేర్కొన్నారు. (తీర్మాన పూర్తిపాఠం అనుబంధంగా ఇస్తున్నాం.) ఆంధ్రరాష్ట్రంలో అప్పుడప్పుడే నిర్మాణ రూపం దాలుస్తున్న వ్యవసాయ కూలి ఉద్యమానికి ఈ తీర్మానం కొత్త వెలుగును ప్రసాదించింది.

"వ్యవసాయ సంబంధమగు ప్రతి పనిలోను కూలి చేయువారు వ్యవసాయ కూలీలుగా" పేర్కొంటూ వ్యవసాయ కూలీలకు స్పష్టమైన నిర్వచనం చేసింది రాజకీయ చైతన్య విషయంలో వ్యవసాయ కూలీలకు రైతులకు ఉన్న వ్యత్యాసం వల్లనూ, సాంఘికంగా వ్యవసాయ కూలీలు వెనుకబడి ఉండడంవల్లనూ, రైతులకు - వ్యవసాయ కూలీలకు పరస్పరం అవిశ్వాసం ఉండడంవల్లనూ, వ్యవసాయ కూలీలను ప్రత్యేక సంఘాలుగా ఏర్పరచాలని ఈ తీర్మానం పేర్కొంది. అంతమాత్రంచేత రైతులు - కూలీలు వేరువేరు తరగతులని తలచి వీరిరువురి మధ్య వర్గ తగాదాలు తీసుకురాకూడదని ఇటువంటి ఘర్షణలవల్ల లాభపడేది భూస్వాములు, జమీందారులు, ప్రభుత్వమేనని తీర్మానం విశదపర్చింది. కూలీల సంఘాలు, రైతులను ఎదిరించుటకు కాక తమ కష్టము పోగొట్టుకొనటానికి, రాజకీయ పోరాటానికై స్థాపించ బడుచున్నవని, రైతులు, కూలీలు పరస్పర సహకారంవల్లనే అటు రైతు పోరాటాలు ఇటు కూలీల పోరాటాలు విజయాన్ని సాధించ గలవని ఈ తీర్మానం సూచించింది. ప్రభుత్వ దోపిడీ ఆర్థిక విధానంవల్లనే మధ్య తరగతి రైతులు క్రమంగా క్షీణించి వ్యవసాయ కూలీలుగా మారుచున్నారని, రైతులు - కూలీల మధ్య సఖ్యత కల్గించి సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని తీవ్రతరం చేసినప్పుడే ఇరువురి కష్టాలు తీరగలవని తీర్మానం పేర్కొంది. రైతులు, కూలీలమధ్య సఖ్యత పెంచటానికై పార్టీ కార్యకర్తలు అనుసరించ వలసిన విధానం గురించి వివరమైన సూచనలతోకూడిన కార్యక్రమాన్ని ఈ తీర్మానం అందించింది.

ఏఏ సమస్యలపై వ్యవసాయ కూలీలను సమీకరించి పోరాటాలు నిర్వహించాలోకూడా ఈ తీర్మానం విపులంగా పేర్కొంది "పిచ్చి ముంతలు, పెట్టి చాకిరీ, బూతులు తిట్టుట, కొట్టుట, సాంఘిక అసౌకర్యాలు, లంచగొండితనం, పన్నులు, హెచ్చువడ్డీలు, కుల విచక్షణ లేకుండా కూలీల పిల్లలందరికి "ఉచిత విద్య, అటవీ హక్కులు, కట్టెలు తెచ్చుకొను హక్కు, ఇండ్ల స్థలములు, ఋణములు, ప్రభుత్వమునుండి నిరుద్యోగ భృతి, పాలేర్ల ఇబ్బందులు" మొదలగు సమస్యలను తీసుకుని వ్యవసాయ కూలీలను సంఘటితం చేస్తూ పోరాటాలు చేయ వలసిందిగా ఈ తీర్మానం పిలుపునిచ్చింది.

రాష్ట్ర పార్టీ రూపొందించిన ఈ సూచనలు వ్యవసాయ కూలీ ఉద్యమంలో పనిచేసే కమ్యూనిస్టు కార్యకర్తలకు కొత్త ఉత్తేజాన్ని కల్గించాయి. ప్రచారదశలో ఉన్న ఉద్యమం, పోరాట దశకు మళ్ళింది. ముఖ్యంగా నెల్లూరు జిల్లాలోని పార్టీ కార్యకర్తలు వ్యవసాయ కూలీలను, సమీకరించి సమ్మెలు నిర్వహించడంలో మరో అడుగు ముందుకు వేశారు. బసవారెడ్డి శంకరయ్య, అల్లూరి రంగయ్య తదితర

కమ్యూనిస్టు కార్యకర్తలు, నెల్లూరు, కొవ్వూరు తాలూకాలలో అనేక సమ్మెలు నిర్వహించారు. ఈ సమ్మెలన్నిటిలోనూ విడవలూరు సమ్మె చాలా ప్రధానమైన సమ్మె. 1938 జూలై 22 నుండి ప్రారంభమైన ఈ సమ్మె పిచ్చిముంతలు పోవాలని, రోజు కూలీ ముంతకు తగ్గ రాదని, పాలేర్లకు 2 తూముల పెట్టుబడి ఇవ్వాలని, పశువులు కాసేవారికి, ఇండ్లలో పనిచేసేవారికి పెట్టుబడిని పెంచాలని, వీరికి పాలేర్లకు నెలకు 2 రోజులు సెలవులుగా ప్రకటించాలని, పొల్లు కంచెలలో పేదల పశువులను మేపుకోనివ్వాలని, అడవుల నుండి కూలీలను కట్టెలు తెచ్చుకో నివ్వాలనే కోర్కెలతో 14 రోజులు సాగింది. ప్రారంభంలో 1000 మంది కూలీలతో ప్రారంభమైన ఈ సమ్మెలో క్రమంగా గ్రామంలోని పాలేర్లు, గొడ్లకాపర్లు, ఇంటివద్ద పనిచేసే వారంతా పాల్గొన్నారు. గ్రామంలోని మధ్యతరగతి రైతులు, సోషలిస్టు భావాలుకల్గిన యువకులు ఈ సమ్మెను పూర్తిగా బలపర్చారు. ప్రక్క గ్రామాలనుండి వచ్చే కూలీలను ఆరికట్టడానికి, యువకులంతా దళాలుగా ఏర్పడి ప్రక్క గ్రామాలలో తీవ్ర ప్రచారం చేసారు. కూలీలచేత బలవంతంగా పని చేయించుకోవడానికి పోలీసులను పిలిపించి సమ్మె నిర్వహిస్తున్న కార్య కర్తలను అరెస్టు చేయించారు భూస్వాములు ఎన్ని ప్రయత్నాలు చేసినా సమ్మె విఫలం కాలేదు. చిట్ట చివరకు భూస్వాములు సమ్మె కోర్కెల కంగీకరించి, కూలీలతో రాజీ కుదుర్చుకోవడంతో సమ్మె విరమింపబడింది.

ఈ సమ్మె నెల్లూరు, కొవ్వూరు తాలూకాలలోని వ్యవసాయ కూలీలపై పెద్ద ప్రభావాన్ని కలుగ జేసింది. నెల్లూరు తాలూకాలోని పంచాగ్నుల కాంద్రిక, సోమరాజుపల్లి, పైనాపురం, మామిడిపూడి, ఇందుకూరు పేట, తోటపల్లి, గూడూరు, మొదలైన గ్రామాలలోని 3000 మంది వ్యవసాయ కూలీలు 1938 జూలై ఆగష్టు నెలలో సమ్మెలు ప్రారంభించారు. ఇదే విధంగా కొవ్వూరు తాలూకాకు చెందిన ఊటుకూరు, కొడవలూరు, మొదలగు గ్రామాలలో కూడా 1938 జూలై, ఆగష్టు నెలలో సమ్మెలు చేశారు. కనీస కూలి రేటు పెంచడం, మొదలుగా గల కోర్కెలను కోరుతూ నెల్లూరు, కొవ్వూరు తాలూకాలలోని మొత్తం 50 గ్రామాలలో ఈ సమ్మెలు జరిగాయి. వెన్నెలకంటి రాఘవయ్య, గండవరపు హనుమయ్య, వేమూరి లక్ష్మయ్య వంటి నాయకులు కూలీలను సమీకరించి సమ్మె జరుగుతున్న గ్రామాలలో ఊరేగింపులు నిర్వహించి, కూలీలకు కనీస వేతనం ఇచ్చేవరకు సమ్మె కొనసాగించాలని ప్రబోధించారు. పరంపరగా జరిగిన ఈ సమ్మెలు వ్యవసాయ కూలీ ఉద్యమాన్ని మరింతగా బలపడేటట్లు చేశాయి. ప్రతి గ్రామంలోనూ భూస్వాములు రాజీకి రాక తప్పలేదు. వ్యవసాయ కూలీల కోర్కెలలో చాలావరకు అంగీకరించబడ్డాయి.

వ్యవసాయ కూలీలు, భూస్వాముల ఒత్తిడులకు లొంగకుండా జయప్రదంగా సమ్మె కొనసాగించేటట్లు చేయడానికి నెల్లూరు జిల్లాలోని వ్యవసాయ కూలీలు కొత్త పద్ధతులను ప్రవేశపెట్టారు. విడవలూరు సమ్మె సందర్భంలో కూలీలు, మధ్యతరగతి రైతులు కలసి సమ్మె నిధిని ఏర్పాటుచేశారు. సమ్మెకాలంలో బొత్తిగా దినం గడవని కూలీలకు ఈ నిధినుండి కొంత ధనాన్ని ఇచ్చేవారు. ఈ పద్ధతివల్ల సమ్మె కాలంలో కూలీలు సంఘటితంగా నిలబడి పోరాటం కొనసాగించేందుకు ఎంతో ఉపయోగపడింది.[6]

ఈ సమ్మెలతో ఉత్తేజితులై ఆత్మకూరు తాలుకాలోని కొలగట్ల గ్రామ వ్యవసాయ కూలీలు కూడా సమ్మె ప్రారంభించారు. 1938 ఆగష్టు నెలలో ప్రారంభమైన ఈ సమ్మె సెప్టెంబరు నెలలో కూడా కొనసాగింది. రోజుకు కనీస కూలి 8 అద్దలు కావాలని కోరుతూ కూలీలు ఈ సమ్మెచేశారు.

నెల్లూరు జిల్లాలో వ్యవసాయ కూలీలు సంఘటితమై తమ కోర్కెల సాధనకు పోరాట మార్గాలు చేపడ్తున్న ఈ కాలంలోనే వ్యవసాయ కూలీ ఉద్యమంలో కలిసి పనిచేస్తున్న కమ్యూనిస్టు కార్యకర్తలకు వెన్నెలకంటి రాఘవయ్యకు మధ్య కొన్ని భేదాభిప్రాయాలు పొడచూపాయి. అనేక విషయాల్లో వెన్నెలకంటి రాఘవయ్య అతివాద వైఖరిని, ఒంటెత్తు విధానాన్ని అనుసరించారు. కనీస కూలిరేటుకు ఆందోళన చేయు సందర్భంలో వ్యవసాయం మీద వచ్చే రాబడిని ఆధారంగా తీసుకోవాలని కమ్యూనిస్టులు సూచించగా దానితో నిమిత్తం లేకుండా ఆందోళన చేయాలని రాఘవయ్యగారు వాదించసాగారు."

సమ్మెలలో బీద రైతుల సహాయం కొరకు పూర్తిగా కృషి చేయవలెనని కమ్యూనిస్టులు కోరగా, దానికి రాఘవయ్యగారు అంతగా సుముఖత వ్యక్తపరచ లేదు

అన్ని ప్రయత్నాలు (మీటింగులు, రాయబారాలు) విఫలమైన తరువాత సమ్మెకు సిద్ధం కావాలని కమ్యూనిస్టులు అభిప్రాయపడ్తే సమ్మె, ప్రారంభించి ఆ పిదప మిగిలిన కార్యక్రమాలు చేయాలని రాఘవయ్యగారు నిర్ణయించారు.[7]

రైతులు-కూలీలు మధ్య సఖ్యత చెడకుండా, ఆచరణ సాధ్యమైన కోర్కెల సాధనకు పోరాడుతూ, వ్యవసాయ కూలీ ఉద్యమాన్ని పెంపొందించటానికి కమ్యూనిస్టు కార్యకర్తలు కృషిచేశారు.

రైతు కూలీల మధ్య పరస్పర అవగాహనను పెంచడానికి, వారి మధ్య తలెత్తే వివాదాలను సామరస్య వాతావరణంలో పరిష్కరించడానికి కమ్యూనిస్టు కార్యకర్తలు ఒక చక్కని పద్ధతిని అవలంభించారు. రైతు కూలీ ఐక్యత కొరకు రాష్ట్ర పార్టీ చేసిన సూచనలలో కొన్నింటిని అంగీకరిస్తూ నెల్లూరు జిల్లా కాంగ్రెస్

సోషలిస్టు పార్టీ 31-7-1938 న ఆమోదించిన తీర్మానం పరిశీలిస్తే మనకీ విషయం స్పష్టమవుతుంది తీర్మానంలోని కొన్ని భాగాలు ఈ విధంగా ఉన్నాయి.

"కూలీ సంఘాలలో పని చేసేవారూ, రైతు సంఘాలలో పనిచేసేవారు 15 రోజుల కొకసారైనా కలిసి విషయం చర్చించి ముందు కార్యక్రమం నిర్ణయించుకోవాలి."

"రైతులకు కూలీలకు మధ్య తగాదాలు వచ్చినప్పుడు అర్బిట్రేషన్ కమిటీల ద్వారా పరిష్కరించుకోవాలి."

జిల్లా రైతు సంఘం నుండి ఇద్దరు, జిల్లా కూలీ సంఘం నుండి ఇద్దరు, జిల్లా కాంగ్రెస్ సోషలిస్టు నుండి ఒక ప్రతినిధి ఈ ఆర్బిట్రేషన్ కమిటీలో సభ్యులుగా ఉంటారు. కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ సభ్యుడు ఈ కమిటీ అధ్యక్షుడిగా వ్యవహరిస్తారు.

రైతు సంఘాల సభకు కూలి సంఘం వారు సౌహార్ద ప్రతినిధులను పంపవచ్చును.

ఈ ఆర్బిట్రేషన్ కమిటీ పద్ధతి రైతు కూలీల మధ్య ఐక్యతకే కాకుండా వ్యవసాయ కూలీ ఉద్యమాభివృద్ధికి, కూలీల సమస్యల విషయంలో రైతులు సానుభూతితో అర్థం చేసుకుని తమ తోడ్పాటును అందివ్వడంలో ప్రధాన పాత్ర వహించాయి.

రోజు రోజుకి పెరుగుతున్న అప్పుల బాధ నుండి వ్యవసాయ కూలీలను విముక్తి చేయడానికి ఋణ నివారణ చట్టాన్ని రూపొందించి అమలు జరపాలని కోరుతూ కూలీ సంఘాలు 1938 - 39 కాలంలో కాంగ్రెసు ప్రభుత్వంపై అనేక మార్లు ఒత్తిడి తెచ్చాయి. ఈ విషయంలో రైతుసంఘ నాయకులు కూడా తమ తోడ్పాటును వ్యవసాయ కూలీలకు అందించారు 1939 జనవరి కాకినాడలో జరిగిన ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సాధారణ సమావేశంలో వ్యవసాయ కూలీల ఋణ నివారణ చట్టాన్ని రూపొందించాలని, వ్యవసాయ కూలీల ఆర్థిక పరిస్థితిని అంచనావేసి తగిన చర్యలు చేపట్టడానికి ఒక ప్రత్యేక విచారణ సంఘాన్ని మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం రూపొందించే విధంగా కాంగ్రెసు శాసనసభ్యులు కృషి చేయాలని కోరుతూ రాష్ట్ర రైతు సంఘం శ్రీ కొమ్మారెడ్డి సత్యనారాయణ ఒక తీర్మానాన్ని ప్రవేశ పెట్టారు. ఆ తీర్మాన పాఠం ఈ విధంగా ఉంది.

"వ్యవసాయ కూలీల ఋణ విముక్తికి ప్రత్యేక చట్టము చేయబడునని, సంవత్సరం క్రిందటే వాగ్దానమొనర్చియు, నేటి వరకు వారి ఋణములు రద్దు చేయగల చట్టమును ప్రభుత్వము చేయనందున లక్షల కొలదిగా నున్న వ్యవసాయ కూలీలలో అసహాయక ఆర్థిక దాస్యం పెంపొందుచున్నందున, కనీసం ఆగష్టు

మాసాంతరంలోగా వారి ఋణములను సంపూర్ణముగా రద్దు చేయగలిగిన చట్టమును చేయవలయునని ఈ సంఘం వారు ప్రభుత్వ శాసన సభ్యులకు హెచ్చరిక చేయుచున్నారు.

వ్యవసాయ కూలీల ఆర్థిక పరిస్థితులను విచారించుటకు వెంటనే ఒక కమిటీ నియమించి వారికి కనీసపు వేతనము మొదలగు వారి కనీసపు కోర్కెల సఫలత కొరకు నవంబరు మాసాంతములోగా శాసనము చేయవలయునని, ఈ సంఘం ప్రభుత్వ శాసన సభ్యులను హెచ్చరించుచున్నారు."

1938-39 కాలంలో తూర్పు గోదావరి, గుంటూరు, కృష్ణా, పశ్చిమ గోదావరి జిల్లాలలో వ్యవసాయ కూలీ ఉద్యమం మరికొంత విస్తృతమయింది.

తూర్పు గోదావరి జిల్లా రామచంద్రాపురం తాలుకాలో వ్యవసాయ కూలీ సంఘాలు అనేక గ్రామాలలో ఏర్పడ్డాయి. 1938 అక్టోబరు 4న తాలుకా ప్రథమ వ్యవసాయ కూలీ మహాసభ కపిలేశ్వర పురంలో నిర్వహింపబడింది. గెడ్డం మహాలక్ష్మి అధ్యక్షుడిగా తాలూకా సంఘం ఏర్పాటయింది.

గుంటూరు జిల్లాలో సత్తెనపల్లి, ఒంగోలు తాలుకాలకు ఉద్యమం విస్తరించి గ్రామాలలో కూలీ సంఘాలు ఏర్పడ్డాయి. బాపట్ల తాలుకాలోని వ్యవసాయ కూలీలు రోజుకు 8 గంటలు పని మాత్రమే ఉండాలని, కనీస కూలి పురుషునకు 4 మానికలు, స్త్రీకి 3 మానికలు (నాట్లు, కోతలకి) ఊడ్పుల సమయంలో ఆ కూలీ 5 మానికలుగా ఉండాలని కోరసాగారు. ఖాజీ పాలెంలో 29-1-38 న జరిగిన తాలూకా వ్యవసాయ కూలీ సమావేశంలో తమ కోర్కెలను తెలియచేస్తూ తీర్మానాలు చేశారు. ఋణ పరిష్కార చట్టాన్ని కూలీలకు కూడా వర్తింప జేయాలని, నిజాంపట్నం, గల్లూరు, గనపవరం, పారలి గ్రామాల మధ్యనున్న 2000 ఎకరాల భూమిని పేదలకు ఇవ్వవలసిందిగా ప్రభుత్వాన్ని వత్తిడి చేయాలని కూడా ఈ సమావేశంలో తీర్మానించారు.[9]

కృష్ణా జిల్లాలో దివి, గుడివాడ తాలూకాలలో వ్యవసాయ కూలీ ఉద్యమం ప్రచార దశను దాటి నిర్మాణ దశకు చేరుకుంది. గుడివాడ తాలుకాలో 1937 చివరినాటికే వ్యవసాయ కూలీ ఉద్యమం నిర్మాణ రూపం దాల్చింది. 1937 నవంబరు 28న తటపర్రు గ్రామంలో గుడివాడ తాలూకా ప్రథమ వ్యవసాయ కూలీ మహాసభ జరిగింది. తాలూకాలోని అనేక గ్రామాల నుండి వ్యవసాయ కూలీలు ఈ మహాసభకు హాజరయ్యారు. కూలీల ఐక్యతకొరకు కూలీల అభివృద్ధి కొరకు ఈ మహాసభ అనేక సూచనలు చేసింది. ప్రభుత్వం వారు వ్యవసాయ కూలీల అభివృద్ధికి చేపట్టవలసిన పద్ధతులను కూడా సూచిస్తూ తీర్మానాలు చేసింది.

(కృష్ణా పత్రిక 11-12-37, 22వ పేజీ)

1937-38 కాలంలో గుడివాడ, దివి, గన్నవరం తాలూకాలలో కమ్యూనిస్టు పార్టీ యూనిట్లు గల ఎలమర్రు, వెంట్రప్రగడ, కాటూరు, కవుతరం మొదలైన అనేక గ్రామాలలో, వ్యవసాయ కూలీలు చైతన్యవంతులై సంఘాలుగా ఏర్పడ్డారు. అతి చిన్న గ్రామమైన కోలవెన్నులో కూడా 27-12-38 న వ్యవసాయ కూలీలందరూ సమైక్యమై కూలి సంఘాన్ని ఏర్పాటు చేసుకున్నారు కూలి సంఘం స్థాపన సందర్భంలో ఏర్పాటైన సభకు స్థాపించిన ఎం ఎల్.ఎ గా ఉన్న కాట్రగడ్డ నారాయణరావు హాజరయ్యారు.

1938 చివరినాటికి గుడివాడ తాలూకాలోని వ్యవసాయ కూలీ ఉద్యమం విస్తృత రూపం దాల్చింది 1938 నవంబరు 19 న బల్లిపర్రులాకు వద్ద గుడివాడ తాలూకా ద్వితీయ వ్యవసాయ కూలీ మహాసభ జరిగింది.

వేములపల్లి ఆంజనేయులు అధ్యక్షతన జరిగిన ఈ మహాసభలో ఆమోదించబడిన తీర్మానం పరిశీలిస్తే ఆనాటి వ్యవసాయ కూలీలలో ఉన్న చైతన్యం, పట్టణ కార్మికులపట్ల వారికున్న ఐక్యతా భావం మనకు స్పష్టమవుతుంది. ఈ మహాసభలో ఆమోదించిన తీర్మానాలు ఈ విధంగా ఉన్నాయి.

1. బొంబాయి ప్రభుత్వం వారి కార్మిక బిలు ఎడల తమ అసమ్మతిని తెలుపుటకూ కార్మికులు నవంబరు 7 వ తేదీన రాష్ట్రమంతటా జయప్రదంగా జరిపిన సమ్మె సందర్భంలో కార్మికులపై ప్రభుత్వం తుపాకులు కాల్పించినందుకు ప్రభుత్వ చర్యను ఈ సభవారు నిరసించుతూ, చనిపోయిన - దెబ్బలు తిన్న కార్మికులకు, వారి కుటుంబములకు తమ హృదయపూర్వక సానుభూతిని తెలుపుచున్నారు.

2. గ్రామములందలి బంజరులను, భూస్వాముల స్వాధీనంలో ఫలసాయం లేకుండా ఉన్న భూములను, వ్యవసాయ కూలీల వశంచేసి, సమిష్టి వ్యవసాయ పద్ధతుల మీద సాగు చేయించవలసిందిగా గవర్నమెంటు వారిని ఈ సభవారు కోరుచున్నారు

3. ఏ విధమైన ప్రతిఫలం లేకుండా వ్యవసాయ కూలీలకు గృహ, నీటి, ఆరోగ్యవసతుల నేర్పరచుచు, పల్లెలలోని పిల్లలకు ప్రాథమిక విద్య గరపవలసిందిగా ప్రభుత్వం వారిని కోరుచున్నారు.

4. కాలువలు, రోడ్లు, వంతెనలు మొదలగువాటి కాంట్రాక్టులను గవర్నమెంటు, స్థానిక సంస్థలు, వ్యవసాయ కూలి సంఘాలకే యివ్వవలసిందిగా ఈ సభవారు కోరుచున్నారు.

5 చట్టరూపేణా వ్యవసాయ కూలీలకు కనీస వేతనమును నిర్ణయించవలసిందిగా ప్రభుత్వం వారిని కోరడమైనది.

6 వ్యవసాయ కూలీల ఋణములను చట్టరూపేణా రద్దుచేసి, అవసరమైన ఋణాలను ప్రభుత్వమే బ్యాంకుల ద్వారా, వ్యక్తిగత బాధ్యత మీద, వడ్డీలేకుండా దీర్ఘ వాయిదాల మీద తీర్చుకొనే సదుపాయంతో, వెంటనే యిప్పించ వలసిందిగా ప్రభుత్వమును ఈ సభవారు కోరుచున్నారు.

7. పిల్లలు తక్కువ అయ్యారనే కారణంతో ప్రాథమిక పాఠశాలలు ఎత్తి వేయకుండా, పిల్లలు ఎక్కువగా హాజరు అయ్యే సౌకర్యము లేర్పరచి, విద్యను ప్రోత్సహించవలసిందని కోరుచున్నారు.

8. సామ్రాజ్య యుద్ధాలలో వ్యవసాయ కూలీలు పాల్గొనరాదని హెచ్చరించుచూ, జాతీయ స్వాతంత్ర్యమునకై పోరు సలుపవలసిందని ఈ సభవారు కోరుచున్నారు.

దివి తాలూకాలో చల్లపల్లి నారాయణరావు వంటి పార్టీ కార్యకర్తలు వ్యవసాయ కూలీ ఉద్యమం అభివృద్ధి చెందడానికి విశేషించి కృషిచేశారు. నాగయతిప్ప గ్రామానికి చెందిన గుంటూరు బాపనయ్య కూడా 1939 చివరి నాటికి దివి తాలూకా వ్యవసాయ కూలీ ఉద్యమంలో పనిచేయసాగారు. ఎలమర్రు హరిజన గూడానికి చెందిన అయ్యంకు దావీద్ రాజకీయ చైతన్యం కల్గిన వ్యవసాయ కూలీల నాయకుడిగా ఉద్యమాన్ని పెంపొందించసాగారు. కృష్ణాజిల్లాలో విస్తరిస్తున్న వ్యవసాయ కూలీ ఉద్యమాన్ని సమన్వయ పర్చుకునేందుకు వెంట్రప్రగడలో ప్రథమ జిల్లా వ్యవసాయ కూలీ మహాసభను నిర్వహించారు. 1940 జూన్‌లో జరిగిన ఈ మహాసభలో అయ్యంకు దావీద్ జిల్లా అధ్యక్షుడిగా, గుంటూరు బాపనయ్య జిల్లా కార్యదర్శిగా ఎన్నికయ్యారు పశ్చిమ గోదావరి జిల్లాలో కూడా వ్యవసాయ కూలీ ఉద్యమం విస్తృతరూపం దాల్చింది. 1939-40 మధ్యకాలంలో నర్సాపురం తాలూకాలో పూర్తిగానూ, భీమవరం తాలూకాలోని నవుడూరు, వీరవాసరం, బ్రాహ్మణ చెరువు, పెనుమంట్ర గ్రామాలలోను తణుకు తాలూకాలోని పెరవలి, కానూరు గ్రామాలలోనూ, నర్సాపురం తాలూకాకు ఆనుకొని ఉన్న గ్రామాలలోనూ (తణుకు తాలూకాలో), తాడేపల్లి గూడెం, కొవ్వూరు తాలుకాలలోని కొన్ని గ్రామాల లోనూ కమ్యూనిస్టు పార్టీ ప్రభావం కల్గిన వ్యవసాయ కూలి సంఘాలు ఏర్పడ్డాయి.

ఏలూరు తాలుకాలోని కొవ్వలి, పోతునూరు, గుండుగొలను గ్రామాల లోను, ఏలూరు చుట్టు ప్రక్కల గ్రామాలలోను బలమైన వ్యవసాయ కూలి సంఘాలు ఏర్పడ్డాయి.

ఈ కాలంలో సాంఘిక దురాచారాలకి, కూలి రేటు పెంపుకు కమ్యూనిస్టు కార్యకర్తల నాయకత్వంలో అనేక వ్యవసాయ కూలి పోరాటాలు జరిగాయి.

భీమవరం తాలుకా గనపవరం గ్రామంలో వ్యవసాయ కూలి పోరాటం గురించి కామ్రేడ్ నెక్కంటి నరసింహారావుగారి జ్ఞాపకాలలో ఇలా తెలియ చేశారు.

"గనపవరం గ్రామంలో కూలీలంతా సంఘటితమై కమ్యూనిస్టుల ప్రోద్బలంతో కూలి సంఘాన్ని స్థాపించారు. తమకిచ్చే 4 అణాల కూలిని మరో అణా పెంచమని డిమాండ్ చేశారు. జౌరా కూలి వాళ్ళు కూలి పెంచమని అడగటమా అనే దురహంకారంతో అగ్రకుల అహంకారులు, తమ గూండాలతో హరిజన పేటపై దాడి చేశారు. ఇళ్ళలోని సామాన్లు, మంచాలు వగైరా విరగ కొట్టారు. చాలా మందిని కొట్టారు. దానిపై పరిసర హరిజన వాడల్లో పెద్ద అలజడి రేగింది. చెలరేగిన అలజడిని మతం పేరుతో అణచి వేసే దురుద్దేశ్యంతో భూస్వామి భీమవరం నుండి క్రైస్తవ ఫాదర్‌ని పిలిపించారు. ఇది తెల్సిన నెక్కంటి నరసింహారావు తదితర కమ్యూనిస్టులు, ఫాదర్ ఉపన్యసిస్తున్న చర్చి లోకే సరాసరి వెళ్ళి మతానికి - భూస్వాములకు ఉన్న సంబంధాలు గురించి వివరించగా ఫాదరే తోక ముడిచాడు." ఆ తరువాత కూలీలందర్ని సమైక్యపర్చి సమ్మె నిర్వహించారు. చిట్ట చివరకు భూస్వామి రాజీకొచ్చి హామీ పత్రం వ్రాసి ఇచ్చాడు.

కమ్యూనిస్టు కార్యకర్తలు కూలీల సాంఘిక, ఆర్థిక సమస్యలపై పోరాటాలు సాగిస్తూ తాలూకాలోని వ్యవసాయ కూలీలందర్ని చైతన్యవంతుల్ని చేశారు. 1939 నాటికే వ్యవసాయ కూలీ ఉద్యమానికి నర్సాపురం తాలూకా బలమైన కేంద్రంగా ఏర్పడింది. 1939 జనవరి 27 న నర్సాపురం తాలూకా ప్రథమ వ్యవసాయ కూలీ మహాసభకు తాలూకాలోని అన్ని గ్రామాల నుండి 2000 మంది కూలీలు 80 మంది ప్రతినిధులు హాజరయ్యారు.[9]

వ్యవసాయ కూలీలకు నియమిత కూలి, కాలపరిమితి ఏర్పరస్తూ ప్రభుత్వ శాసనం ఏర్పడాలని, అన్ని సంస్థలందు వ్యవసాయ కూలీ వర్గానికి ప్రత్యేక ప్రాతినిధ్యం కల్పించాలని, జిల్లా బోర్డు కాంట్రాక్టులు వ్యవసాయ కూలీ సంఘాలకే ఇప్పించాలని ప్రభుత్వాన్ని కోరుతూ ఈ మహా సభ ఏకగ్రీవంగా తీర్మానించింది. ఈ మహాసభలో గుబ్బల వెంకన్న అధ్యక్షునిగా, దాసరి వెంకట్రావు ఉపాధ్యక్షునిగా, డానియేల్ స్మిత్ కార్యదర్శిగా, తాలూకా వ్యవసాయ కూలీ సంఘం ఏర్పాటు చేయబడింది.

జిల్లా మొత్తంగా విస్తరిస్తున్న ఉద్యమాన్ని సమన్వయపరుచుకుని, కూలీల సమస్యలపై తీవ్రతరపోరాటం సాగించడానికి 1939 మార్చి 28న పశ్చిమ గోదావరి జిల్లా ప్రథమ వ్యవసాయ కూలీ మహాసభను నిర్వహించారు. ఈ మహా సభ కైకరం గ్రామంలో జరిగింది.

ఈ మహాసభను ప్రారంభిస్తూ మద్దూరి అన్నపూర్ణయ్య చేసిన ప్రసంగం మనకు ఆనాటి వ్యవసాయ కూలీల దయనీయ పరిస్థితిని సవివరంగా తెలియ చేస్తుంది.

''పూర్వ కాలంలో బానిస వృత్తి బాహాటంగా సాగేది. పశువులను ఒక కామందు మరొక కామందుకు అమ్మివేసినట్లు మనుష్యులను కూడా అమ్మివేసి,. శాశ్వత సేవకా వృత్తి పాల్జేసేవారు అది రాక్షస పద్ధతి అని అన్ని దేశాలలోనూ ఘోష బయలుదేరింది. అనేకమంది మహా పురుషులు యీ పద్ధతిని ఐక్య కంఠంతో నిరసించారు కొంతకాలానికి బానిస వృత్తి నిర్మూలించబడింది. కానీ, అది మారు రూపాంతో నేడు ప్రపంచమంతటా తన పైశాచికత్వాన్ని సాగిస్తూనే ఉంది. మన దేశపు వ్యవసాయ కూలీల స్థితిని చూచినపుడు పూర్వపు బానిసవృత్తియే మేలురా అనిపిస్తుంది. ఎందువల్లనంటే, వందలు-వేలు యిచ్చి బానిసలను ఒక రాజు మరొక రాజు వద్ద కొంటాడు. వారికి సరియైన దేహదారుఢ్యం ఉంటేగాని చిరకాలం సేవ చేయటానికి వీలుండదు. కాబట్టి బానిసకు తగిన తిండి గుడ్డ యివ్వవలసి వచ్చేది. కాని నేటి కూలిని అట్టి బాధ్యతతో చూడవలసిన అవసరం లేదు. ఎవడు తక్కువ కూలికి వస్తే వాని చేతనే పని చేయించుకుంటారు. ఆ వేళకు ఆ అణా డబ్బులు పారెయ్యడమే గాని, మర్నాడు కూడా వచ్చి పని చేయగల దారుఢ్యం వానికి ఉందా లేదా అని విచారించేవాడు లేడు.

కాని యిట్టి కూలివాడే నేటి సమాజ సౌధానికి పునాదిరాయి. ఆ రాయి కొంచెం కదిలిందా దివ్య సౌధం కనురెప్ప బాటు కాలంలో నేల కూలుతుంది. సౌధాన్ని చూచి ఆనందభైరవి రాగాన్ని ఆలాపించే కవి కుమారుడు ముఖారి రాగంలోకి దిగవలసి వస్తుంది.

కరాచీ ప్రాథమిక హక్కుల తీర్మానం, కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికా కూలీలలో కాస్త ఆశాజ్యోతిని వెలిగించాయి. ఎనిమిది రాష్ట్రాలలో కాంగ్రెసు గద్దె ఎక్కింది. కార్మికుల కష్టాలు కొంతవరకైనా తొలగిపోతాయని ఆశించారు. కాని, కార్మిక శాసనం నేటివరకు ఒకటైనా చేయలేదు. ఋణనివారణ చట్టం అని పేరు పెట్టాడు. భూమిని అమ్ముకొనే హక్కుగల వాడే "వ్యవసాయకుడు" పొమ్మన్నాడు. ఏమి విపరీతమైన నిర్వచనం. వ్యవసాయ వృత్తినే నమ్ముకొని జీవించు భూమిలేని అసంఖ్యాకులైన కూలీలకు రాజాజీ సున్న చుట్టేడు. వేరేశాసనం తెస్తాం అన్నారు కూలీల అప్పులు తగ్గడానికి, కాని యింతవరకూ దాని సూచన కనపడ్డం లేదు.

కూలీల జనసంఖ్య ఏటేట 50 లక్షల చొప్పున పెరుగుతూ వుంది. కూలీ పనిలో పోటీ ఎక్కువవుతుంది. అందుచేత కూలీ రేటు విపరీతంగా పడిపోతోంది..

కూలి పడిపోతే అప్పులు పెరుగుతాయి. అప్పులు పెరిగితే వెట్టిచాకిరీ ఎక్కువవు తుంది. ఈ గుడు గుడు కుంచంలో పడి కొట్టుకుంటున్నాడు కూలీ

"కార్మిక-కర్షక సమ్మేళనం కావాలని సోషలిస్టులు ఎలుగెత్తి చాటుతున్నారు. నేడు రైతు - కూలీలిద్దరూ అజ్ఞానాంధకారంలో మునిగియున్నారు. కూలీలకు ఎక్కువ కూలినిచ్చుటయే తన దరిద్రానికి కారణం అని రైతు తలచుట పొరపాటు. పన్ను భారం, ఋణ భారం, లంచాలబాధ వీటిచేతనే నేడు రైతు కూలిపోతున్నాడు. ఈ మూడింటికి కారకులు సామ్రాజ్యవాది, జమీందారు, షావుకారు, వీరి నిరంకు శత్వాన్ని నిర్మూలించలేక రైతు మొగునిపై కోపంవచ్చి బిడ్డలను కొట్టిన పెళ్లాం వలె, కూలీల మీద విరుచుకు పడుతున్నాడు. ఇది ఎంతమాత్రం తగదు. రైతు-కూలీల సమస్య పరిష్కారానికి గత జూన్ నెలలో ఆంధ్ర సోషలిస్టు పార్టీ వారు గావించిన సూచనలు చాలా ముఖ్యమైనవి. రైతులు-కూలీలు అనే రెండు సామ్రాజ్య వ్యతిరేక శక్తులు గుద్దులాడుకొంటుంటే షావుకారులు, జమీందారులు, సామ్రాజ్య వాదులు ఏ విధంగా విజృంభిస్తారో ప్రచారకులు గ్రామగ్రామాన ప్రబోధించాలి"

కూలీల అప్పులను రద్దు చేయాలని, కనీస కూలీని నిర్ణయించాలని, పిచ్చి ముంతలను శిక్షార్హం చేయాలని, వెట్టిచాకిరి నిషేధించాలని. అడవులనుండి కర్ర కలప తెచ్చుకునే హక్కు కూలీలకు కల్పించాలని కోరుతూ ఇందుకు అనుగుణంగా ప్రభుత్వ శాసనం చేయాలని ఈ మహాసభ తీర్మానించింది.

జిల్లా మహాసభ అనంతరం, ఏలూరు తాలూకాలోని వ్యవసాయ కూలీ లందరిని సమైక్యపరచి తాలూకా సంఘం ఏర్పరచడానికి ప్రయత్నాలుజరిగాయి. వీటి ఫలితంగా 1939 జూన్ 17న పాలగూడెంలో ఏలూరుతాలూకా ప్రథమ వ్యవ సాయ కూలీ మహాసభ జరిగింది. 1000 మందికి పైగా కూలీలు హాజరైన ఈ సభలో గారపాటి సత్యనారాయణ అధ్యక్షతన తాలూకా కమిటీ ఏర్పడింది.

జిల్లాలోని అన్ని తాలుకాలకు ఉద్యమం విస్తరించడంతో డానియేల్ స్మిత్ ఆర్గనైజరుగా మాతంగి లక్ష్మయ్య ప్రధాన కార్యదర్శిగా జిల్లా వ్యవసాయ కూలీ సంఘం ఏర్పడింది. (39 జూన్ 17న పాలగూడెంలో జరిగిన జిల్లా కార్య నిర్వాహక సభలో ఈ కమిటీ ఎన్నుకోబడింది.

## రెండవ ప్రపంచ యుద్ధం - ఆకలి యాత్రలు

రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమవడంతోనే ప్రజా ఉద్యమా లన్నింటిని ప్రభుత్వం తీవ్ర నిర్బంధ విధానంతో అణచివేయడం ప్రారంభించింది. కమ్యూనిస్టు కార్యకర్తల చర్యలన్నిటిపైన నిఘా పెంచింది. వ్యవసాయ కూలీలకై నిర్వహిస్తున్న వయోజన విద్యా కార్యక్రమాన్ని కూడా కమ్యూనిస్టులు ప్రచార మంటూ నిషేధించింది.[10] యుద్ధం మూలంగా నిత్యావసర వస్తువుల ధరల విపరీ

తంగా పెరగసాగాయి. దీనికి తోడు జిల్లాలలో వర్షాలు లేక పోవడం మూలంగా మెట్ట ప్రాంతాల నుండి పల్లపు ప్రాంతాలు కూలీల వలస పెచ్చు పెరిగింది. దీని వల్ల కూలీలలోపోటీ హెచ్చి కూలిరేట్లు పడిపోసాగాయి. అనేక ప్రాంతాలలో కరువు ఏర్పడికూలీల నిత్య జీవితం గడవడమే దుర్భరమైంది.

ఈ సమస్యలన్నిటి పైన కూలీలను చైతన్యవంతుల్ని చేసి ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చేందుకు కమ్యూనిస్టు పార్టీ ఆకలి యాత్రలను నడిపింది. తాలుకాల వారీగా వ్యవసాయ కూలీలను దళాలుగా ఏర్పరచి గ్రామ గ్రామాన తిరిగి ప్రచారం చేస్తూ వ్యవసాయ కూలీల డిమాండ్లను వ్రాతపూర్వకంగా తయారు చేసి తహసీల్దారు లేదా డిప్యూటీ కలెక్టరుకు సమర్పించడం ఈ ఆకలియాత్రల ముఖ్య కార్యక్రమంగా ఉండేది.

వ్యవసాయ కూలీలందరికి 1. పని తిండి కల్పించాలని 2. బంజరు భూము లను సహకార ప్రాతిపదికపై కూలీలకు సాగుకు యివ్వాలని, 3. వినియోగ దారుల సహకార సంఘాలను ఏర్పాటు చేయాలని 4. కనీస జీవనానికి అవసర మైన కనీస కూలి ఇవ్వాలనే ప్రధాన డిమాండ్లతో ఈ ఆకలి యాత్రలు నిర్వహించబడ్డాయి.

ఆంధ్ర రాష్ట్రంలో మొట్ట మొదటి ఆకలియాత్ర తూర్పు గోదావరి జిల్లా రాజోలు తాలూకాలో నిర్వహించబడింది. పని కల్పించండి, తిండి పెట్టండి అని డిమాండ్ చేస్తూ 1940 మే నెలలో రాజోలు తాలుకాలోని 4-5 వేల మంది కూలీలు డిప్యూటీ కలెక్టర్ ఆఫీసుకు పెద్ద ఊరేగింపుగా వెళ్ళారు. కూలీల మొరను అధికార్లు పట్టించుకోకపోవడంతో సరాసరి భూస్వాముల వద్దకే ఈ ఆకలియాత్రను నడిపారు. యాత్ర శాంతియుతంగానే జరిగినప్పటికి, కూలీలపై పోలీసులు లాఠీ చార్జీ చేసి నాయకుల్ని అరెస్టు చేశారు. ఆకలియాత్రను నిర్వహించిన నాయకులలో 9మందిపై సెక్షన్ 107 క్రింద కేసు బనాయించి విచారణ జరిపారు.

చల్లపల్లి నారాయణరావు, చంద్ర వెంకటరంగయ్య, గుంటూరు బాపనయ్య ఆధ్వర్యంలో దివి తాలూకాలో 3 వ్యవసాయ కూలీ దళాలు ఏర్పడ్డాయి. తాలూకాలోని అన్ని గ్రామాల్లో ఈ దళాలు పర్యటించి కూలీల్ని ఉత్తేజపరిచి అవనిగడ్డ తహశీల్దారు వద్దకు ఊరేగింపుగా వెళ్ళి తమ కోర్కెలను వెల్లడించారు.

గుడివాడ తాలుకాలో తాళ్లూరి మంగపతిరావు తదితర కమ్యూనిస్టు కార్యకర్తల నాయకత్వంలో వ్యవసాయ కూలీల దళం విస్తృతంగా నెలరోజుల పాటు గ్రామాల్లో పర్యటించింది. ప్రతి గ్రామంలోనూ సమావేశం పెట్టి కూలీల్ని చైతన్యవంతుల్ని చేసి గుడివాడలో క్యాంపు చేసిన జిల్లా కలెక్టరుకు కూలీల

ఈ దళ ప్రచారాలలో వ్యవసాయ కూలీ సమస్యలతో పాటుగా సామ్రాజ్య వాద వ్యతిరేక నినాదాల్ని, యుద్ధ వ్యతిరేక నినాదాల్ని యిస్తూ కూలి పోరాటాల ద్వారా స్వాతంత్ర్య పోరాటాన్ని ఏ విధంగా విస్తృత పరచాలో వివరిస్తూ కూలీల్ని ఉత్తేజపరిచేవారు. ఈ విధంగా కృష్ణా జిల్లాలో ఆరు తాలూకాల్లో వ్యవసాయ కూలీలను సమీకరించి ఆకలి యాత్రలు నిర్వహించారు. ఈ ఆకలి యాత్రలలో పాల్గొన్న కూలీల సంఖ్య 2,000 నుండి 6,000 వరకు ఉంది.[12]

గుంటూరు జిల్లా విషయాని కొస్తే వ్యవసాయ కూలీ ఉద్యమం బలంగా ఉన్న రేపల్లె, తెనాలి తాలూకాల్లో ఈ ఆకలి యాత్రలు జరిగాయి.

1940 సెప్టెంబరు 12 న పశ్చిమ గోదావరిజిల్లా నర్సాపురం తాలూకాలో 10 వేల మందితో పెద్ద ఆకలియాత్ర జరిగింది. ఆచంటనుండి బయలుదేరిన ఈ దళయాత్ర 20 మైళ్ళ పొడవున 80 గ్రామాలలో ఎర్ర జండాలతో ఊరేగుతూ "ఆకలి మంటచే మల మల మాడే అనాథలందరూ లేవండోయ్"

"అబ్బబ్బ మన రక్త మాంసములు హరించి ఎందరు తెగబలిసారో" అనే పాటలు పాడుతూ నర్సాపురం సబ్ కలెక్టరు వద్దకు వెళ్ళారు. పాలకొల్లు నుండి నర్సాపురం వరకును 6 మైళ్ళ పొడవున జన సందోహంతో నిండిన ఈ ఊరేగింపు సబ్ కలెక్టరుకు ఆశ్చర్యం, భీతి కల్గించింది[13] ఇదే విధంగా అక్టోబరు 12 న భీమవరం తాలూకాలో కూడా 10 వేల మంది కూలీలతో ఆకలి యాత్ర నిర్వహించబడింది.

ఇదేవిధంగా నెల్లూరు, చిత్తూరు జిల్లాలలో కూడా అనేక తాలూకాలలో ఆకలి యాత్రలు నిర్వహించారు. ప్రభుత్వ నిర్బంధం ఎంత తీవ్రంగా ఉన్నా కమ్యూనిస్టులు వెనుకంజ వేయకుండా ఈ ఆకలి యాత్రలు నిర్వహించడంలో ధైర్య సాహసాలను చూపారు. ఆకలి యాత్రలతో పాటు జరిగిన సామ్రాజ్య వ్యతిరేక ప్రచారం మారుమూల గ్రామాలలోని కూలీల్ని సైతం చైతన్య వంతుల్ని చేసింది. ప్రభుత్వ నిర్బంధం తీవ్రముగా ఉన్నప్పటికి వ్యవసాయ కూలీల సమస్యలపై పరిష్కారానికి కొన్ని ప్రాంతాలలో సమ్మెలు చేశారు.

## వేగూరు సమ్మె - 1941 సెప్టెంబరు

యుద్ధకాలంలో జరిగిన సమ్మెలన్నిటిలోనూ నెల్లూరుజిల్లా వేగూరుగ్రామ కూలీల సమ్మె చాలా ప్రధానమైన సమ్మె. దాదాపుగా 3 నెలలపాటు ఈ సమ్మె జరిగింది. యేటిపొల్లు కట్టలను నామినల్ రేటుకే పశువులను మేపుకొనేందుకు బీదలకివ్వాలని, పిచ్చిమొంతలను తొలగించాలనే ప్రధాన కోర్కెలతో ఈ సమ్మె జరిగింది. భూస్వాముల బీళ్ళ దాటుకుని యేటికట్టలకు పోవలసి ఉన్నందువల్ల వీటిని బీదలకు ఇచ్చేవారు కాదు. కొల్లుకుదురు రాజగోపాలరెడ్డి, ముత్తిన బాల

సుబ్రహ్మణ్యం ఈ సమ్మెకు నాయకత్వం వహించి నడిపారు. సమ్మెను నిర్బంధ విధానంద్వారా అణచివేయాలని భూస్వాములు పోలీసులు ప్రయత్నించారు. గ్రామంలోనే పోలీసు క్యాంపును స్థాపించారు. సమ్మెకు అనుకూలంగా ప్రచారంచేస్తున్న కూలీలపై లాఠీచార్జీ చేయడం, బాయినెట్లుతో పొడవడం చేసేవారు. 50 మంది కూలీలను నాయకులతో సహా అరెస్టు చేసి కావలి సబ్‌జైల్లో ఉంచారు. ఒకబాండు కేసును బనాయించారు. ఇంత నిర్బంధమున్నా కూలీలు సమైక్యంగా సమ్మె సాగించారు. వ్యవసాయ కూలీనాయకుడైన కాలేషా "బండచాకిరీ చేసి బతుకుతాడేగాని కూలన్నా, దినము నీకూలీలో తిండైనా గడుచునా కూలన్నా" అనే పాటలు పాడుతూ కూలీలకు ఎంతో ఉత్తేజాన్ని ఇచ్చేవారు

సమ్మె తీవ్రతరమవడంతో పార్లమెంటరీ కార్యదర్శి బి ఎస్. మూర్తి వచ్చి కూలీలకు భూస్వాములకు మధ్య రాజీకుదిర్చి సమ్మె పరిష్కరించారు.

పెరుగుతున్న వ్యవసాయ కూలి ఉద్యమం ప్రభుత్వాన్ని కలవరపరిచింది. వ్యవసాయ కూలి ఉద్యమంలో పనిచేస్తున్న కమ్యూనిస్టు కార్యకర్తలందరిపైన అనేక కేసులు పెట్టి అరెస్టుచేసింది. నర్సాపురం తాలుకాలో కోసూరు సుబ్బరాజు, నెక్కలపూడి రామారావులు వ్యవసాయ కూలీలను రెచ్చగొడుతున్నారనే నెపంపై 1940 ఆగష్టు నెలలో అరెస్టు చేసింది. ఇతర జిల్లాలలో కూడా కమ్యూనిస్టు కార్యకర్తలనేకమందిని డిటెయిన్ చేసింది. ప్రభుత్వ నిర్బంధ విధానం మూలంగా అనేకమంది రహస్య జీవితం గడపవలసివచ్చింది. 1942 వరకు ఇదే పరిస్థితి కొనసాగింది.

## ప్రజా యుద్ధ కాలం

యుద్ధ స్వభావంలో వచ్చిన మార్పు ఫలితంగా కమ్యూనిస్టు పార్టీ ప్రజా యుద్ధ నినాదాన్ని ఇచ్చింది. యుద్ధ కాలంలో అదుపులేకుండా పెరుగుతున్న ఆహార వస్తువుల ధరలను అరికట్టేందుకు అదనపు భూములను సాగులోకి తేవాలనే నినాదాన్ని ప్రభుత్వం ముందుంచింది. ఆహార వస్తువుల ధరలు పెరగకుండా కంట్రోల్ విధించాలని ప్రజలందరికి ముఖ్యంగా వ్యవసాయ కూలీలకు నిత్యావసర వస్తువులు అందుబాటులో ఉండేందుకు రేషన్ షాపులు తెరవాలని డిమాండ్ చేసింది. గ్రామాల్లో సాగుకు వీలైన బంజరు భూములను, భూస్వాములు అక్రమంగా సాగు చేస్తున్న భూములను వ్యవసాయ కూలీలకు పంపిణీచేసి తద్వారా ఆహార ఉత్పత్తిని పెంపొందించాలని, వ్యవసాయ కూలీలు భూమిని సాగు చేయడానికి అవసరమయ్యే అన్ని వస్తువులను ప్రభుత్వమే పంపిణీ చేయాలని ఆందోళన ప్రారంభించింది. ఈ ఆందోళన ఫలితంగా బంజరు భూములను, రైల్వే భూములను సాగు చేసుకునే రైతులకు వ్యవసాయ కూలీలకు ఒక సంవత్సరం

లీజుపై ఇచ్చేందుకు మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం ఒక కమ్యూనిక్ జారి చేసింది. అయితే క్రింది స్థాయి ఉద్యోగులు గ్రామాధికారులు వ్యవసాయ కూలీలకు భూములు దక్కకుండా అనేక అడ్డంకులు కలిగించారు. ఈ సమస్యలన్నిటిని ప్రభుత్వ దృష్టికి తెచ్చేందుకు వ్యవసాయ కూలీలను సమీకరించి పెద్ద ఎత్తున ఆందోళనా కార్యక్రమాన్ని కమ్యూనిస్టు పార్టీ చేపట్టింది.

గుంటూరు జిల్లా వ్యవసాయ కూలీ సంఘ కార్యకర్తలు దళాలుగా ఏర్పడి 1942 ఫిబ్రవరి 2 నుండి జులై 10 వరకు బంజరు భూముల విషయంలో మద్రాసు ప్రభుత్వ ప్రకటనలను మొత్తం 34 గ్రామాలలో ప్రచారం చేసారు. ఆయా గ్రామాలలో బంజరు భూములు, చౌకడిపోలు విషయంపై కూలీల సమస్యలను 42 పిటిషన్లుగా ప్రభుత్వాధికారులకిచ్చారు.

గుంటూరు జిల్లా వ్యవసాయ కూలీల సమస్యలను జిల్లా కలెక్టరు దృష్టికి తెచ్చేందుకు వివిధ తాలూకాల నుండి వ్యవసాయ కూలీలను సమీకరించి 1942 జూలై 20న మల్లిఖార్జున శర్మ కలెక్టరుకు ఒక మెమొరాండం ఇచ్చారు.

తాలూకాల వారీగా ప్రతి గ్రామంలోనూ, స్థానికంగా బంజరు భూముల ఆక్రమణ గురించి, నీటి ఇబ్బందులు, అధికార్ల బెదిరింపులు, గవర్నమెంట్ కమ్యూనిక్‌కు వ్యతిరేకంగా గ్రామాధికారుల టమటమాలు మొదలగు సమస్యలన్నింటిని సేకరించి ఈ మెమొరాండం ద్వారా తెలియ చేశారు.[14]

ఇదే విధంగా నెల్లూరు జిల్లాలోని వ్యవసాయ కూలీలను కూడా సమీకరించి బంజరు భూముల విషయంలో ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చారు. 1942 జూలై 24 ఆత్మకూరు తాలూకాలోని వ్యవసాయ కూలీలు జి సి. కొండయ్య నాయకత్వంలో తహశీల్దారును కలవడం జరిగింది.

కమ్యూనిస్టు కార్యకర్తలు చేసిన ఈ రాయబారాల వల్ల ప్రభుత్వ అధికార్ల బెదిరింపులు తగ్గడమే కాకుండా, బంజరు భూములను వ్యవసాయ కూలీలు సాగు చేసుకునే అవకాశం ఏర్పడింది.

సమ్మె తీవ్రతరమవడంతో పార్లమెంటరీ కార్యదర్శి బి. ఎస్. మూర్తి వచ్చి కూలీలలకు భూస్వాములకు మధ్య రాజీ కుదిర్చి సమ్మె పరిష్కరించారు.

ప్రభుత్వ బంజరు భూములనే కాకుండా జమీందార్లు ఆక్రమించిన భూములనుకూడా వ్యవసాయ కూలీలకు పంపిణీ చేయాలనే డిమాండ్‌ను కూలీ సంఘాలు తరపున కమ్యూనిస్టులు ప్రచారంచేశారు. యద్దనపూడిలో 20-6-42 జరిగిన దివి తాలూకా వ్యవసాయ కూలీ మహాసభలో జమీందారీ ప్రాంతంలోని భూములను సాగుకు మంజూరుచేయాలని, కోరుతూ తీర్మానించారు. వీటిని అమలుపరిచేందుకు ఆందోళనా కార్యక్రమాన్ని దివి తాలూకా వ్యవసాయ కూలీసంఘం

చేపట్టింది. 1942 జూలై నెలలో మంగళాపురం ముదిరాజు కూలీలు తాము సాగు చేసుకుంటున్న భూములు తిరిగి తమకే ఇవ్వాలని కోరుతూ పెద్దఎత్తున ఆందోళన లేవదీశారు. జమీందారు లాక్కున్న భూములను తిరిగి ఆక్రమించేందుకు వ్యవసాయ కూలీలు నిశ్చయించారు. కూలీసంఘం తరపున చల్లపల్లి నారాయణరావు, గుంటూరు బాపనయ్య, చంద్ర రాజేశ్వరరావు మొదలైన వారంతా ముదిరాజు కూలీలతోపాటు ఈ పోరాటంలో పాల్గొన్నారు. పోలీసుల సహాయంతో జమీందారు ఈ ఉద్యమాన్ని అణచివేసేందుకు తీవ్ర ప్రయత్నంచేసాడు. నాయకులతోపాటు కూలీలనుకూడా అరెస్టుచేసి ప్రభుత్వం శిక్షించింది. కోర్టులో కేసు నడుస్తున్న సమయంలో రాజేశ్వరరావు, నారాయణరావులతో సహా కూలీలంతా ఊరేగింపుగా ఎర్రజండాలతో పాటలు పాడుతూ బందరు, అవనిగడ్డ కోర్టులకు హాజరయ్యేవారు. ఇది దారిలోఉన్న గ్రామాల వ్యవసాయ కూలీలను ఎంతో ఉత్తేజపరిచింది. మంగళాపురం పోరాటం తరువాత కాలంలో జరిగిన జమీందారీ వ్యతిరేక పోరాటానికి బీజాలు వేసింది.[15]

ప్రజా యుద్ధకాలంలో కూలిరేట్లు పెంపుదలకోసం, పిచ్చిమొంతలకు వ్యతిరేకంగా వ్యవసాయ కూలీ సమ్మెలు జరిగాయి. 1942 సెప్టెంబరులో నెల్లూరు జిల్లా పాలట్లపూడి గ్రామంలో ఖరా కొలతలతో కూలి ఇవ్వాలని సమ్మె చేశారు. ఇందుకూరిపేట, కొత్తపల్లి గ్రామాలలో కూడా ఈ సమస్యలపై కూలీలు సమైక్యమై సమ్మెలు చేశారు.

తూర్పు గోదావరి జిల్లా గుడిమళ్ళంకలో జరిగిన రాజోలు తాలూకా వ్యవసాయ కూలీ మహాసభలో పురుషుని కూలీ 5 శేర్లు (లేదా0-5-0) స్త్రీకి 4 శేర్లు (లేదా 0-4-0) ఇవ్వాలని రైతులను కోరారు. దివి తాలూకా వ్యవసాయ కూలీలు కూడా బస్తా ధాన్యం ఎన్ని రూపాయలు అమ్మితే అన్ని అణాల కూలి ఇవ్వాలని డిమాండ్ చేశారు.

## సమిష్టి వ్యవసాయ క్షేత్ర ప్రయోగం

ప్రభుత్వ బంజరు భూములను త్వరితగతిన సాగు చేసి దాని ఫలాన్ని సమిష్టి వ్యవసాయ కూలీలంతా పొందేందుకు సంగం జాగర్లమూడి వ్యవసాయ కూలీ సంఘం (గుంటూరు జిల్లా) ఈ ప్రయోగం చేసింది. కూలి సంఘంలోని 66 మంది కలిసి 5 ఎకరాలు సాగుచేసి సమిష్టి ఫలసాయాన్ని పొందారు. వచ్చిన పంటలో 1/4 వంతు పంటను కష్టకాలంలో వాడుకునేందుకు కూలి సంఘం నిర్ణయించింది.[16]

అయితే ఈ సమిష్టి వ్యవసాయ క్షేత్రం అనేక ఇబ్బందుల వల్ల ఎక్కువ కాలం కొనసాగలేదు. ఏమైనప్పటికి కూలి సంఘం నిర్వహించిన ఈ సమిష్టి

వ్యవసాయ క్షేత్రం వ్యవసాయ కూలి సంఘ చరిత్రలో ఒక విశేషంగానే చెప్పాలి.

## 1943 నాటికి వ్యవసాయ కూలీ ఉద్యమం

1943 ప్రారంభానికి నెల్లూరు, గుంటూరు, తూర్పు గోదావరి, కృష్ణా, పశ్చిమ గోదావరి జిల్లాలలో వ్యవసాయ కూలీలందరికి ప్రాతినిధ్యం వహించే ఏకైక సంఘంగా వ్యవసాయ కూలీ సంఘం రూపు దిద్దుకుంది. పల్లెల్లో భార్యాభర్తల తగాదాలు తీర్చే దగ్గర నుంచి బంజరు భూములు సాగు చేయించే వరకు సంఘ కార్యకలాపాలు విస్తరించాయి. కుల పెద్దలకు బదులుగా వ్యవసాయ కూలి సంఘ నాయకులే పల్లె పెద్దలుగా వ్యవహరించే దశకు ఉద్యమం చేరుకుంది. మాల మాదిగ తగాదాలను రూపుమాపి సహ పంక్తి భోజనాలు ఏర్పాటు చేయడంలోనూ, హరిజన క్రైస్తవ భేదం లేకుండా వ్యవసాయ కూలీలలో సామరస్యం పెంపొందించడంలోనూ సంఘం ప్రధాన పాత్ర నిర్వహించింది.

1943 నాటికి బస్తా ఎన్ని రూపాయిలు అమ్మితే అన్ని అణాలు కూలీగా ఉండాలని, పని గంటలు రోజుకు 7 గంటలు మించరాదని, పాలేర్లకు సంవత్సరానికి 25 బస్తాలు ధాన్యం జీతంగానూ, 15 దినాలు సెలవులుగానూ ఉండాలనే కోర్కెలు సంఘ కోర్కెలుగా రూపొందించబడ్డాయి. కూలీల సమస్యలు పరిష్కరించే విధానంలో రైతు కూలి ఎగ్రిమెంటులకు ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చి రైతు కూలీల మధ్య సామరస్యం పెంపొందించేందుకు కృషి జరిగింది.

వ్యవసాయ కూలీలలో పనిచేస్తున్న కాబోతు రామస్వామి, మల్లిఖార్జున శర్మ, నూతలపాటి జోసఫ్ (గుంటూరు జిల్లా) గుంటూరు బాపనయ్య, చల్లపల్లి నారాయణరావు, అయ్యంకి దావీదు, (కృష్ణాజిల్లా) కందికట్ల నాగభూషణం, కోనేరు రామమోహనరావు, కొరపాటి పట్టాభిరామయ్య, నంబూరి శ్రీనివాసరావు, పెదపాటి వెంకట్రావు (తూర్పు గోదావరిజిల్లా) నెక్కంటి నరసింహారావు, పేరేపు మృత్యుంజయుడు, గోవాడ నిరీక్షణరావు, కోండ్రు సుబ్బారావు (పశ్చిమ గోదావరి జిల్లా) మొదలగు కమ్యూనిస్టు కార్యకర్తలంతా వ్యవసాయ కూలీలలో తలలో నాల్కలవలె మెదిలె ప్రజానాయకులుగా గుర్తింపు పొందారు

అసంఘటితంగా ఉన్న వ్యవసాయ కూలీలను వర్గ ప్రాతిపదికపై సంఘటితం చేయడంలో 1943 నాటికి కమ్యూనిస్టులు కొంతవరకు కృతకృత్యులయ్యారు. కూలిరేటు పెంపకానికై సమ్మెలతో ప్రారంభమైన ఉద్యమం బంజరు

భూములు పంపకం సాగించాలి అనే దశకు చేరుకుంది. 1943 తరువాత రాష్ట్ర స్థాయిలో పూర్తిగా నిర్మాణరూపం తీసుకునే దిశగా ఈ ఉద్యమం సాగింది. 1943 జనవరికి ఆంధ్ర రాష్ట్రంలోని 210 గ్రామాల్లో వ్యవసాయ కూలీ సంఘాలు స్థాపించబడ్డాయి. 13600 మంది వ్యవసాయ కూలీలు ఈ సంఘాలలో సభ్యులుగా చేరారు. 1943 జనవరి తరువాత సంఘ నిర్మాణం చురుకుగా సాగింది. వ్యవసాయ కూలీల దైనందిన సమస్యలపైన కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తలు చేపట్టిన ఆందోళనా, పోరాట కార్యక్రమాల ఫలితంగా వ్యవసాయ కూలీల్లో ఆత్మస్థయిర్యము, పోరాటస్థాయి పెంపొందింది. వర్గ ప్రాతిపదిక పై సంఘటితమవడం హెచ్చింది. 1943 జూలై నాటికి వ్యవసాయ కూలీ సంఘ నిర్మాణం మరింతగా పెరిగింది. ఆంధ్ర రాష్ట్రంలోని 347 గ్రామాల్లో 23,342 మంది వ్యవసాయ కూలీలు వ్యవసాయ కూలీ సంఘ సభ్యులుగా చేరారు.

## ఆధారాలు


1. గుంటూరు జిల్లా వ్యవసాయ కూలీ ఉద్యమ చరిత్ర 3 వ పేజీ.
2. గుంటూరు జిల్లా వ్యవసాయ కూలీ ఉద్యమ చరిత్ర 4 వ పేజీ.
3. 24-12-37 నవశక్తి 10 వ పేజీ.
4. 12-1-38 నవశక్తి 12 వ పేజీ.
5. 9-12-38 నవశక్తి 2 వ పేజీ.
6. బస్వారెడ్డి శంకరయ్య సమాచార పత్రం.
7. 21-9-38 నవశక్తి 12 వ పేజీ.
8. 9-2-38 నవశక్తి 18 వ పేజీ.
9. 8-2-39 నవశక్తి 18 వ పేజీ.
10. గుంటూరు జిల్లా వ్యవసాయ కూలీ ఉద్యమ చరిత్ర 5 వ పేజీ.
11. తాళ్ళూరి మంగపతిరావు సమాచార పత్రం.
12. 'కమ్యూనిస్టు' 1940 డిసెంబరు 12 వ పేజీ.
13. నెక్కంటి నరసింహారావు సమాచార పత్రం.
14. 29-7-42 ప్రజాశక్తి 9 వ పేజీ.
15 ఆంధ్ర ప్రదేశ్‌లో రైతు ఉద్యమాలు పోరాటాలు 154 వ పేజీ.
16. 21-10-42 ప్రజాశక్తి, 7 వ పేజీ.

# మహిళా ఉద్యమం

మహిళా ఉద్యమం స్వాతంత్ర్య ఉద్యమ ప్రభావంతోనే సామ్రాజ్యవాద వ్యతిరేక స్వభావాన్ని సంతరించుకొంది మొదట్లో మహిళలకు చదువు సంధ్యలు, వరకట్న నివారణ, వివాహ స్వేచ్ఛలకే పరిమితమై ఉండేద ఈ ఉద్యమం. బ్రిటీషు ప్రభుత్వోద్యోగుల, ప్రభుత్వ విధేయులైన దేశీయ ఉద్యోగుల భార్యలకే పరిమిత మైన క్లబులు, సంఘాలు కొన్ని ఉండేవి. అవి కూడా స్వల్ప సంస్కరణలను మాత్రమే ప్రచారం చేసేవి. ఈ శతాబ్ద ప్రారంభం నుంచి కందుకూరి, గురజాడ లాంటి సాహితీవేత్తలు సంఘ సంస్కరణ ఉద్యమంలో మహిళలకు గౌరవస్థానం కల్పించారు. స్త్రీ విద్య, వరకట్న దురాచార నిర్మూలన, సానిమేళాల నివృత్తి, వేశ్యావృత్తి నిర్మూలన మొదలైన సంస్కరణోద్యమాలను బ్రహ్మసమాజం మొదలైనవి చేపట్టాయి. ఈ సంఘ సంస్కర్తల ప్రభావంతో మహిళలలో కొంత జాగృతి కల్గినా అది రాజకీయ జాగృతికాదు. జాతీయోద్యమ ప్రభావం వల్లనే మహిళలలో విస్తృత జాగృతికల్గింది. సామ్రాజ్యవాద వ్యతిరేక చైతన్యం కల్గింది. సత్యాగ్రహోద్యమాల్లో అనేకమంది మహిళలు పాల్గొన్నారు. అదివరలో గడప దాటి ఎరుగని "ఘోషా" స్త్రీలు సైతం జైళ్ళకు వెళ్ళారు. సోషలిస్టులు, కమ్యూనిస్టులు రాజకీయ రంగంలో ప్రవేశించిన తర్వాతనే మహిళల ఉద్యమ పరిధి విస్తరించింది. సామ్రాజ్యవాద వ్యతిరేక చైతన్యముతోపాటు, అట్టడుగు వర్గాల అభ్యున్నతి కోసం సోషలిస్టులు, కమ్యూనిస్టులు పనిచేశారు వారి ప్రచార ప్రబోధాల ప్రభావంగా పేద వర్గాల మహిళలు తమ వర్గ కోర్కెల కోసం పోరాడారు. అనేక దౌర్జన్యాలకు, నిర్బంధాలకు గురి అయ్యారు. అయినా ప్రభుత్వ దమనకాండను ప్రతిఘటించి నిలబడ్డారు ఈ నేపథ్యంలో 1937-43 మధ్య మహిళా ఉద్యమాన్ని సమీక్షించుకోవాలి.

కూలీ రక్షణ సంఘం, సోషలిస్టు పార్టీలు ఏర్పడిన ప్రారంభంలో పార్టీ ప్రముఖుల కుటుంబాలలోని స్త్రీలు మాత్రమే పార్టీ కార్యకలాపాల్లో పాల్గొనేవారు. తమ విద్యా స్థాయిని పెంపొందించుకోవడానికి కృషిచేస్తూనే, పార్టీ ప్రచురించే కరపత్రాలు మొదలైనవి అధ్యయనం చేసేవారు ఐక్య సంఘటన ఏర్పడిన తర్వాత కాంగ్రెస్‌లోని అతివాద భావాలు గల మహిళలు మహిళా సంఘాల నిర్మాణానికి పూనుకొన్నారు. కొత్తపట్నం, మంతెనవారిపాలెం పాఠశాలలకు అలాగే

జిల్లాలలో జరిగిన పాఠశాలలకు హాజరైన మహిళా విద్యార్థినులు కూడా ఆ తర్వాత మహిళా ఉద్యమ నిర్మాణంలో పాల్గొన్నారు.

1937 డిసెంబరు నాటికి తూర్పు కృష్ణా జిల్లా మహిళాల సంఘాధ్యక్షురాలిగా వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ పనిచేస్తూవచ్చారు ప్రముఖ స్వాతంత్ర సమరయోధురాలుగా ఆమె గుర్తించబడింది. కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలో కూడా పని చేశారు. జాతీయోద్యమ కాలం నుండి కృష్ణా జిల్లాలో పని సౌకర్యం కోసం తూర్పు కృష్ణా, పశ్చిమ కృష్ణాలుగా విభజించుకొని కాంగ్రెస్ వారు పని చేసుకొనేవారు. బహుశా అదే పంథాలో తూర్పు కృష్ణా జిల్లా మహిళా సంఘం ఏర్పడింది. గుడివాడ, దివి, బందరు, కైకలూరు తాలూకా బందరు, గుడివాడ పట్టణాలు ఈ సంఘ పరిధిలో వున్నాయి. 18 సంవత్సరాలు దాటిన స్త్రీలు అణా సభ్యత్వం చెల్లించిన వారంతా సభ్యులు. జిల్లా కార్యవర్గంలో అధ్యక్షులు, ఇద్దరు కార్యదర్శులు, 10 మంది సభ్యులుండాలి. ప్రతి సంవత్సరం మార్చిలో నూతన కార్యవర్గం ఎన్నుకోవాలి. ఈ నియమాలతో తూర్పు కృష్ణా జిల్లా మహిళా సంఘం పని చేసింది.

కృష్ణా జిల్లా డోకిపర్రులో మహిళా సంఘంలో 15-12-37 నాటికి 53 మంది సభ్యులున్నారు 1938 జనవరి 25 నుండి దివి తాలూకాలో మహిళా సంఘాలు నిర్మించి ప్రచారం చేయాలనే నిర్ణయం ప్రకారం భట్లపెనుమర్రు, పెదసనగల్లు, నర్సంపాలెం, మొవ్వ, మొవ్వపాలెం, పెదముత్తేవి, చినముత్తేవి గ్రామాలలో సంఘాలు ఏర్పరచారు. 38 జనవరి 25 న పామర్రులో జరిగిన తూర్పు కృష్ణా జిల్లా మహిళా సంఘ కార్యవర్గ సమావేశంలో ప్రధానంగా రాజకీయ సంబంధిత తీర్మానాలు చేయబడ్డాయి.

అఖిల భారత రైతు సంఘ కార్యదర్శి, ఎ ఐ సి.సి. సభ్యులు స్వామి సహజానంద సరస్వతి పై బీహార్ రాష్ట్ర కాంగ్రెస్ శిక్షణా చర్య తీసుకొనుట రైతు సంఘాలలో కాంగ్రెసు సభ్యులు పని చేయరాదని కూడా నిషేధించుట, కాంగ్రెస్ ఆమోదించిన మాస్ కాంట్రాక్టు (జన సామాన్యంతో సంబంధాలు పెట్టుకోవాలి అనే) తీర్మానానికి విరుద్ధమనీ, ఇలాంటి చర్య తీసుకొన్న వారిని ఒక కంట కనిపెట్టాలని సుభాష్ చంద్రబోస్‌ను కోరుతూ తీర్మానించారు. తొలుత బోస్ కాంగ్రెస్ అధ్యక్షులుగా ఎన్నికైనందుకు అభినందించారు. హరిపుర కాంగ్రెసుకు ఎన్నికలలో తూర్పు కృష్ణా కాంగ్రెస్ అవలంభించిన పద్ధతి నీతి నియమాలకు విరుద్ధమనీ, అధికారంలో వున్న జిల్లా కాంగ్రెస్ నాయకుల కుటిలరాజనీతిని నిరసించుతూ తీర్మానం ఆమోదించబడింది. జిల్లా నుండి హరిపుర కాంగ్రెస్ ప్రతినిధులకు ఒక్క స్థానం కూడా స్త్రీలకు లేదు గావున, ప్రాతినిధ్యం ఇవ్వాలని

తీర్మానించబడింది. బెజవాడలో కాంగ్రెస్ వాదులు కొందరు గావించిన దౌర్జన్య చర్యలు విచారణీయమని, కాంగ్రెస్ అధికారులు ఈ ఘటనలను విచారించి కాంగ్రెస్ ప్రతిష్ఠ కాపాడాలని కోరారు గుడివాడ, తాడంకి మొదలైన స్కూళ్ళలో తమ హక్కులకై సమ్మె చేసిన విద్యార్థుల పట్ల హర్షం వెలిబుచ్చుతూ, ముఖ్యంగా విద్యార్థినుల ధైర్యాన్ని కొనియాడుతూ తీర్మానించబడింది కలకత్తాలో ఆయిల్ మిల్సు సమ్మెలో పాల్గొన్న 2 వేల మందిని అభినందించుతూ, సమ్మెకు సాను భూతిని తెలియజేస్తూ తీర్మానించింది.

స్త్రీలకు ఆస్తిలో వారసత్వ హక్కు ఉండేటట్లు చట్టాన్ని చేయవలసిందిగా కాంగ్రెస్ ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించింది. మహిళలకు ప్రత్యేక పత్రిక లేని లోటును తీర్చుతూ తోడ్పడుతున్న "నవశక్తి", "ప్రజాబంధు" పత్రికలను అభినందించుతూ వీటి అభివృద్ధికి తోడ్పడవలసిందిగా కోరారు. ప్రతి గ్రామ మహిళా సంఘం విధిగా "నవశక్తి" ఇంకా స్త్రీలకు ఉపయోగించే పత్రికలను తెప్పించి, స్త్రీలంతా సమావేశమై తప్పనిసరిగా చదవాలని సమావేశం గ్రామ మహిళా సంఘాలను హెచ్చరించింది.

ఇదే మాసంలో తెన్నేరు, మంత్రిపాలెంలో మహిళా సంఘాలేర్పడ్డాయి. కాజ గ్రామంలో 50 మందితో ఉన్న మహిళా సంఘం ప్రతి వారం రాజకీయాలు, మహిళల అభివృద్ధికి సంబంధించిన సమస్యలు చర్చించేవారు, ఒక బహిరంగ సభను కూడా నిర్వహించారు. 10-2-38 తూర్పు కృష్ణా జిల్లా మహిళా సంఘ కార్యవర్గ సమావేశం ఈ గ్రామంలోనే జరిగింది.

తూర్పు కృష్ణా జిల్లా మహిళా సంఘ ద్వితీయ వార్షిక మహాసభ 1938 ఏప్రిల్ 20, 21 తేదీలలో జరిగింది. వల్లభనేని సీతా మహాలక్ష్మమ్మ తిరిగి అధ్యక్షురాలుగా ఎన్నికైంది. పతాకోత్సవాన్ని చంద్ర సావిత్రీదేవి జరిపారు. బులుసు అదిలక్ష్మమ్మగారు ఆహ్వాన సంఘాధ్యక్షురాలు. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ కార్యనిర్వాహక సభ్యులుగా పనిచేసి, విశాఖలో మహిళా సంఘంలో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలోనూ పనిచేసిన దర్శి సుభద్రమ్మగారు ప్రారంభోపన్యాసం చేశారు. సంఘ సంస్కరణోద్యమంలో ప్రముఖ మహిళా ఈమె ఈ మహాసభ విషయ నిర్ణయ సభలో చర్చలకు ప్రాధాన్యం యిచ్చింది. విడాకులిచ్చే హక్కు మహిళలకు ఉండాలనే తీర్మానాన్ని చర్చించి ఆమోదించారు. నూతన కార్యవర్గంలో ఉపాధ్యక్షురాలుగా బులుసు ఆదిలక్ష్మమ్మ, ప్రధాన కార్యదర్శినిగా చంద్ర సావిత్రీదేవి, సహాయ కార్యదర్శిని కోనేరు అనసూయాదేవి, మరో 12 మంది కార్యవర్గ సభ్యులు హాజరయ్యారు. జిల్లా వార్షిక నివేదికలో వెల్లడైన విషయాలివి 100 గ్రామాలలో మహిళా కార్యకర్తలు ప్రచారంచేశారు.

35 గ్రామాలకు కాలినడకన వెళ్ళారు. 62 గ్రామాలలో మహిళా సంఘాలను ఏర్పరచారు. వీటి నిర్మాణానికి సోషలిస్టులు, యువజన సంఘాలు తోడ్పడ్డాయి. సంచార ఖర్చులు రూ. 83-13-6 ప్రాథమిక సంఘాల ద్వారా వసూళ్ళు రూ. 98-5-0. విరాళాలు రు. 394-8-0 మొత్తం రూ. 492-13-0 లో మహా సభకు ఖర్చు 379-0-0 పోగా రూ. 113-12-6.

కృష్ణా జిల్లా మహిళా సంఘం స్త్రీలను ప్రబోధించే పాటలకు బహుమతి ఇస్తామని 1938 మే లో ప్రకటించి తర్వాత బహుమతులను ఇచ్చింది. ఆ బహుమతులు స్వల్పమే. ప్రథమ బహుమతి 10 రూపాయలు, ద్వితీయ బహుమతి 5 రూపాయలు. మొదటి బహుమతి దండమూరి సత్యనారాయణరావు, రెండవ బహుమతి పోలంరెడ్డి బుజ్జమ్మగార్లకు లభించాయి. ఈ పాటలను కాటూరు వెంకటేశ్వరరావుగారిచే పరిష్కరింపజేసి అచ్చు వేయాలని తీర్మానించారు. అణాన్నర ధర పెట్టాలి అని నిర్ణయించారు.

1941 స్వాతంత్ర్య దినోత్సవానికి (జనవరి 26) ముందుగా కృష్ణా జిల్లా మహిళా సభ జరిగింది. ఈ సభలో కమ్యూనిస్టు దృక్పథాన్ని ప్రతిబింబించే తీర్మానాన్ని ప్రవేశ పెట్టగా గాంధీవాదులైన మహిళలు తీవ్రంగా వ్యతిరేకించారు. దానిపై రహస్యంగా ఇంగ్లీషు భాషలో వెలువడిన సైక్లోస్టయిల్ పత్రిక "కమ్యూనిస్టు" (1941 జూలై) ఇలా వ్యాఖ్యానించింది. "మా పార్టీ మహిళలు గ్రామాల నుండి వచ్చిన యువతులు. అనుభవం లేని వారు గాంధీ వాదులు అనుభవం కల వక్తలు. మహిళల వేదికను తమ గుత్త సొమ్ముగా ఉపయోగించుకొన్నారు.

కడప జిల్లా బోర్డు అధ్యక్షురాలుగా కడప రామసుబ్బమ్మగారు ఎన్నికైనందుకు అభినందించుతూ, జమీందారీ రైతు విచారణ కమిటీని ఏర్పరచి రిపోర్టు తయారుచేసిన రెవిన్యూ మంత్రి ప్రకాశం గారిని అభినందించుతూ, ఆ రిపోర్టు ఆధారంగా బిల్లు ప్రవేశ పెట్టాలని తీర్మానించారు. రష్యా సంచికలోని మహిళల గురించిన వ్యాసాన్ని కరపత్రంగా అచ్చువేయాలని తీర్మానించారు.

పశ్చిమ గోదావరి జిల్లాలో జాతీయోద్యమం తర్వాత మహిళలు విరివిగా పాల్గొన్నది సోషలిస్టులు, కమ్యూనిస్టులు నడిపిన ప్రజా సంఘాలలోనే. ముఖ్యంగా క్షత్రియ కుటుంబాల నుండి వచ్చిన స్త్రీలు ఘోషా విడిచి పార్టీ ఆధ్వర్యాన జరిగే సభలలోనూ, ఉద్యమాలలోనూ పాల్గొనడం వల్ల అనేక బాధలకు గురి అయ్యారు. పాటక జనం నుండి వచ్చిన స్త్రీలు పార్టీ నిర్వహించిన కార్మిక పోరాటాల్లోనూ, కాళీపట్నం లాంటి జమీందారీ వ్యతిరేక రైతు పోరాటాంలోనూ పాల్గొని అద్భుతమైన సమరశీల స్వభావాన్ని ప్రదర్శించారు. (ఈ జిల్లాలో 1937 ఫిబ్రవరి నుండి మహిళా సంఘాల నిర్మాణ వార్తలు నవశక్తిలో కన్పడుతున్నాయి - సం)

17-2-37 న 20 మంది జిన్నూరులో ఏర్పడిన మహిళా సంఘం భూపతిరాజు వెంకాయమ్మ అధ్యక్షతను సమావేశమై, మహిళా సంఘాల ఆవశ్యకతను గురించి మాట్లాడటమే గాక, రుణ పరిష్కార చట్టానికి ఆమోదం తెల్పుతూ తీర్మానించారు. 1938 జనవరి 18 న ఈ గ్రామ మహిళా సంఘ కార్యవర్గం సమావేశమైంది. జిల్లాలలో విరివిగా మహిళా సంఘాలను ఏర్పరచడానికి కార్యవర్గం నిర్ణయించింది పిత్రార్జిత ఆస్తిలో పురుషులతో పాటు సమాన భాగం ఇచ్చే శాసనం చేయాలని కోరింది. అప్రవర్తన, అనారోగ్యం, అసభ్యత మొదలైన దుర్గుణాలు గల భర్తల నుండి విడిపోడానికి "విడాకుల చట్టం" చేయాలని ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించ బడింది.

25-8-38న పశ్చిమ గోదావరి జిల్లా నర్సాపురంలో మహిళా సంఘాన్ని స్థాపించారు. కేంద్ర శాసన సభలో పి. రాధాబాయి సుబ్బరాయన్ ప్రవేశపెట్టనున్న బహు భార్యా నిరోధక చట్టానికి మద్దతును ఏకగ్రీవంగా అంగీకరించారు. జిల్లా మహిళా సంఘం సూచించే సభ్యుల్ని జిల్లా బోర్డు ఎన్నికలలో మహిళా స్థానాలకు నిలబెట్టవలసిందిగా జిల్లా కాంగ్రెస్ సంఘాన్ని, సివిల్ బోర్డును కోరుతూ తీర్మానించారు. జిల్లా బోర్డు ఎన్నికలలో కాంగ్రెస్ పక్షాన పనిచేయాలనీ కాంగ్రెస్ అభ్యర్థుల విజయానికి కృషి చేయాలనీ తీర్మానించారు.

20-11-38న జిన్నూరులో గ్రామ మహిళా సంఘం సమావేశమై టర్కీ జాతీయ నాయకుడు కెమల్ పాషా మరణం పట్ల విచారాన్ని తెలిపింది. రాధాబాయి సుబ్బరాయన్‌గారు కేంద్ర శాసన సభలో ప్రవేశపెట్టిన బహు భార్య నిరోధక తీర్మానానికి మద్దతు తెలియజేస్తూ, దానిని వెంటనే ఆమోదించాలని కోరింది. మహిళలు ప్రతిరోజూ పత్రికలు చదవాలనీ, డిసెంబరు నెలాఖరులో విరివిగా సభ్యులను చేర్పించాలని తీర్మానించింది.

1939 జనవరి 24న జిన్నూరులో మహిళా సంఘ సర్వసభ్య సమావేశంలో పాలకొల్లు సబ్ ఇన్‌స్పెక్టర్ ఒక స్త్రీని నిరంకుశంగా కొట్టడాన్ని ఖండించారు. కాంగ్రెస్ అధ్యక్షునిగా సుభాష్‌చంద్రబోస్‌నే మరు సంవత్సరం ఎన్నుకోవాలని సూచించారు.

కాళీపట్నం రైతు పోరాటంలో అనేకమంది మహిళలు అరెస్టయ్యారు. వెల్లూరు జైల్లో వీరిని నానా హింసలు పెట్టారు. కొందరిని కొట్టారు ఒకామె స్పృహతప్పి పడిపోయింది. మార్చి 29న ఉద్దరాజు రామంగారు జైలులో మహిళలను ఇంటర్వ్యూ చేయగా అధికారుల వివరాలు తెలుసుకొనేందుకు అవకాశం ఇవ్వలేదు. శాసన సభ్యుల ద్వారా మంత్రి సుబ్బరామన్‌దృష్టికి ఈ విషయం

తీసుకురాగా, డిపార్టుమెంటు విచారణ జరుతామన్నారు గాని అనధికార విచారణకు అంగీకరించలేదు

పశ్చిమ గోదావరి జిల్లా లంకల కోడేరులో 31-1-1938 న జిల్లా మహిళా సభ డాక్టర్ కొమర్రాజు అచ్చమాంబ అధ్యక్షతను జరిగింది. వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ ప్రారంభోపన్యాసం గావించారు.

పశ్చిమ గోదావరి జిల్లా రాజకీయ మహాసభలతో ఈ మహాసభ జరిగింది. 400 మంది మహిళలు హాజరయ్యారు. ఈ సభను జయప్రదం చేయడానికి భూపతిరాజు వెంకాయమ్మ బాగా కృషి చేశారు. సోషలిస్టు దృక్పథంతో సీతా మహాలక్ష్మమ్మ ఉపన్యసించారు. డాక్టరు అచ్చమాంబ గారు తన ఉపన్యాసంలో పరదా పద్ధతిని నిరసించారు. బాల్య వివాహాల వలన అనర్థం తెలియజేశారు మహిళల్లో పేరుకొన్న అజ్ఞానం వల్ల వారికి అనారోగ్య పరిస్థితులు ఏర్పడుతున్నాయని అన్నారు. కాంగ్రెస్ వాదులు సైతం మహిళలకు స్వాతంత్ర్యం ఇవ్వడం లేదని ఆక్షేపించారు. స్వాతంత్ర్యం, సామ్యవాదాల గురించి వివరించారు. మహిళలకు సామ్యవాదమే శరణ్యం అన్నారు. అన్ని రంగాలలో మహిళలు పాల్గొనాలని అన్నారు. మహిళలకు విద్య, వివాహ స్వాతంత్ర్యం కావాలనీ, ఆంధ్ర రాష్ట్రం ఏర్పరచాలనీ తీర్మానించారు.

తూర్పు గోదావరి జిల్లాలో 1938 జనవరి నాటికే జిల్లా మహిళా సంఘం ఏర్పడి వుంది. స్పెయిన్‌లో ఫాసిస్టు దురాగతాలను, చైనాపై జపాను ఫాసిస్టు దురాక్రమణను ఖండించుతూ జనవరిలో ఈ సంఘం తీర్మానించింది. జనవరి 9 న మహిళా సంఘాలు సభలు జరపాలని తీర్మానించింది. జిల్లా మహిళా సభకు అధ్యక్షులు బత్తుల కామాక్షమ్మ. పి. మీరాబాయి, ఎం. పుష్కరాంబ కార్యదర్శినులు.

1938 ఆగష్టు 21 న జి. రత్నమ్మగారి అధ్యక్షతను సభ జరిగింది. మహిళా ఉద్యమ ఆవశ్యకత, బాల్య వివాహాలవల్ల అనర్థం, అస్పృశ్యత వలని చెడుగు, మహిళా విద్యావశ్యకత, ఘోషా పద్ధతి మొదలైన అంశాలపై వక్తలు ప్రసంగించారు. యుద్ధ ప్రతికూల ప్రచారం చేయాలనీ, బ్రిటీషు ప్రభుత్వానికి ఎట్టి సహాయం చేయరాదని హెచ్చరించింది. స్పెయిన్, చైనా ప్రజలకు సానుభూతి తెలియజేసింది.

సంఘ సంస్కరణ, ఆర్థిక రాజకీయ సమస్యలు చర్చించడానికై పరన సమితిని ఏర్పరచాలని తీర్మానించింది

(కాకినాడలో జరిగిన అనేక కార్మిక సమ్మెలలో పాటక స్త్రీలు సాహసంతో నిర్వహించిన పాత్రను కార్మికోద్యమ విభాగంలో చూడవచ్చు - సం)

కొంతకాలం క్రితం పాలకొల్లులో కొందరు మహిళలు సమావేశమై స్త్రీల ఆర్థిక, రాజకీయ, సాంఘిక, నైతిక, శారీరకాభివృద్ధి కొరకు పాటుబడాలనే ఆదర్శంతో రాష్ట్ర సంఘాన్ని నిర్మించాలని తనను కోరారని అప్పట్లో సాధ్యం కాలేదని, ఇపుడు (38 ?) అందుకు కృషి చేస్తానని పుచ్చలపల్లి గోవిందమ్మ గారొక ప్రకటనను నెల్లూరు నుండి చేశారు. కాని అకాల మరణంతో ఆమె ఆ పని చేయలేక పోయింది అయితే మహిళా సమస్యలకు సంబంధించిన వ్యాసాలు 23-2-38 న, 2-3-38 న పొట్లూరి వసుమతిదేవి, 31-8-38 న చంద్ర రాజేశ్వరరావు, 19-4-39 న పర్చూరి సూర్యాంబ, 12-4-39 న పందిరి జగదాంబ నవశక్తిలో ప్రచురించారు.

## ఫాసిస్టు వ్యతిరేక పోరాటం - మహిళా ఉద్యమం

ఆంధ్ర ప్రాంతంపై జపాను దాడి ప్రమాదం ఏర్పడిన సమయంలో ఆంధ్ర కమ్యూనిస్టు కమిటీ ఫాసిజం ప్రతిఘటనకు స్త్రీలను సమాయత్తం చేసింది. స్త్రీలకు ఆత్మ రక్షణ పద్ధతులు నేర్పడానికి పెద్ద ఎత్తున కృషి చేసింది.

ఈ సందర్భంలో కమ్యూనిస్టు నాయకులు కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్య 4-11-42 వ తేదీ ప్రజాశక్తిలో ప్రకటించిన 'ఆంధ్ర స్త్రీలకు ఆంధ్ర కమ్యూనిస్టు కమిటీ విజ్ఞప్తి' అనే వ్యాసం ఎంతో ప్రాముఖ్యత వహించింది.

చిన గంజాం స్టేషనులో రైలు ఎక్కిన ఒక బిక్షుక యువతిని ఒక సైనికుడు అవమాన పరచబోయిన దృశ్యం కామ్రేడ్ సుందరయ్య చూశారు. ఆ క్షణంలో ఆ బిచ్చగత్తె ముఖంలో వ్యక్తమైన గంభీరత, కోపం, ఆ సైనికునిపై అసహ్యం స్త్రీ జాతిలో సహజంగా తమ మాన రక్షణకై ఉండే పట్టుదల, ఆత్మ గౌరవం, ఔన్నత్యం ఉట్టిపడ్డాయని, ఇది మరపురాని దృశ్యమని శ్రీ సుందరయ్య అభివర్ణించారు. ఇటువంటి ఆత్మాభిమానం, మాన రక్షణకై పట్టుదల గల మన స్త్రీలంతా జపాను ఫాసిస్టు పెనుభూతాలు మన దేశం మీదకు వచ్చినప్పుడు పడవలసిన హింసలు తలచుకొని తాను కంపించిపోయాననీ, అందుచే మన స్త్రీలకు ఆత్మరక్షణా పద్ధతులు నేర్పాలనీ ఈ వ్యాసంలో విజ్ఞప్తి చేశారు. "తనకు ఆత్మరక్షణ పద్ధతులు నేర్పే మహిళా సంఘాలుంటే వాటిలో లక్షల మంది చేరతారు. మహిళా సంఘాలు నేడే ఈ కార్యక్రమానికి పూనుకోవాలి. స్త్రీ ఉద్యమాన్ని, అంతేకాదు - స్త్రీ జాతినే ఒక నూతన దశకు ఈ కార్యక్రమం కొనిపోతుంది. మన కమ్యూనిస్టు పార్టీ సభ్యుల భార్యలు, అక్కచెల్లెళ్ళు, తల్లులు, మహిళా లోకాన్ని మేల్కొల్పాలి. జపాన్ ఫాసిస్టులు కమ్యూనిస్టులను, వారి కుటుంబాలలోని స్త్రీలను కూడా వదలిపెట్టరు ఇట్టి పరిస్థితుల్లో పార్టీ కుటుంబాల

స్త్రీలు ఇళ్ళల్లో కూర్చోవడం వినాశకరం. అందుచేత బైటకి వచ్చి తాము శిక్షణ పొందాలి. మహిళా లోకానికి ఈ ఆత్మరక్షణోపాయాలు నేర్పాలి" అని తెలిపారు.

ఆంధ్ర కమ్యూనిస్టు కమిటీ ఆనాడు చేసిన ఈ విజ్ఞప్తి మహిళాలోకంలో అపూర్వ సంచలనం కల్గించింది. తరువాత అనేక శిక్షణా శిబిరాలలో పార్టీ కుటుంబాల స్త్రీలు పాల్గొన్నారు. రాజకీయ శిక్షణ, ఆత్మరక్షణోపాయాలు నేర్చుకున్నారు.

## నారీలోకానికి లేఖాపిలుపు

9-12-1942 ప్రజాశక్తిలో శ్రీమతి పి. భారతీదేవి వ్రాసిన ఒక లేఖపై శీర్షికతో ప్రచురించబడింది. "ఆంధ్ర స్త్రీలకు ఆంధ్ర కమ్యూనిస్టు కమిటీ చేసిన విజ్ఞప్తి గాఢ నిద్రలో ఉన్న మనల్ని ఉలిక్కిపడేలా చేసింది. భారతదేశం ఫాసిస్టు దురాక్రమణ నుండి తప్పించుకొని సంపూర్ణ స్వాతంత్ర్యం పొందడానికి నిజమైన కార్యక్రమాన్ని ఆంధ్ర కమిటీ ఇస్తోంది. 40 సంవత్సరాల క్రింతం జాతీయోద్యమ ఫలితంగా భారత మహిళా సంఘం తలఎత్తింది. కాని ఉద్యోగస్తుల భార్యల చేతుల్లోను, జమీందార్ల చేతుల్లోను వుండిపోవుటచే, అందరి స్త్రీలకు అందుబాటులో ఉన్న కార్యక్రమాన్ని అది యివ్వలేకపోయింది. ఈ సమయంలోనైనా అసలైన కార్యక్రమంతో కమ్యూనిస్టు పార్టీ మనకు నాయకత్వం వహించడం మన అదృష్టం ... ఏ నిముషంలోనైనా మనదేశంలో జపాను దండయాత్ర రావచ్చు ఫాసిస్టుల నెదిరించడానికి స్వాతంత్ర్యం వీరుల పిలుపు రావచ్చు. దానికి మన సోదరీమణులతో సంసిద్ధంగా ఉండాలి ... అని నారీలోకానికి ఆనాడు కమ్యూనిస్టు పార్టీ యిచ్చిన మేల్కొలుపును హర్షించుతూ ఈ లేఖ వ్రాయబడింది.

## మహిళల త్యాగదీక్ష

ఫాసిజం ప్రతిఘటనకు పార్టీ యిచ్చిన పిలుపు మహిళలలో కల్గించిన ఉత్తేజం గురించి 'మహిళల త్యాగదీక్ష' అనే శీర్షిక క్రింద కామ్రేడ్ నండూరి ప్రసాదరావు 18-11-1942 వ తేదీ ప్రజాశక్తి సంచికలో ఒక వ్యాసం వ్రాస్తూ, కామ్రేడ్ సుందరయ్య విజ్ఞప్తి చదివి అనేక మంది మహిళలు ఉత్తేజితులవు తున్నారనీ, నిన్న మొన్నటి వరకు తల్లిదండ్రుల చాటున, అత్తమామల చాటున, పెరిగిన సోదరీమణులు కార్యరంగంలో దూకుతున్నారనీ తెలిపారు

తూర్పు గోదావరికి చెందిన ఒక మహిళ శ్రీమతి దంతులూరి చంద్రమ్మ జిల్లా కమ్యూనిస్టు కమిటీ కార్యదర్శికి ఒక ఉత్తరం వ్రాశారు. ఫాసిస్టులు ప్రమాదం నుండి దేశాన్ని రక్షించుకోవడానికి దేశమంతటా బ్రహ్మాండమైన జాతీ యైక్యతా ఉద్యమం లేవదీయాలనీ, అందుకు స్త్రీలందరమూ తోడ్పడతామని వ్రాశారు. ఈమె మంగళసూత్రాన్ని పార్టీ నిధికి విరాళం యిచ్చారు.

కృష్ణా జిల్లాలో గుడివాడ, బెజవాడ, గన్నవరం మహిళా సంఘం వర్కర్ల సమావేశం జరిగింది. "వంటజెయ్యడం, పిల్లల్ని కనడమే స్త్రీల కర్తవ్యం" అనే హిట్లర్ ధర్మానికి "ప్రతి స్త్రీ ప్రభుత్వాన్ని నడుపగల్గిన సామర్థ్యం కలిగి ఉండాలి." అన్న లెనిన్ మహదాశయానికి గల తేడాను గ్రహించవలసిందని, స్త్రీలకు సంపూర్ణమైన స్వేచ్ఛ స్వాతంత్ర్యం కమ్యూనిస్టు సమాజంలోనే లభ్యమవుతాయనీ, 1857లో భారత స్వాతంత్ర్యం కోసం రాణి ఝూన్సీ లక్ష్మీబాయి, స్పెయిన్‌లో నేడు ఫాసిస్టు నియంతృత్వానికి వ్యతిరేకంగా పోషనారా ఎలా పోరాడారో అలాగే ఫాసిజానికి వ్యతిరేకంగా పోరాడడానికి స్త్రీలు ముందుకు రావాలని అందుకు విరాళాలు యివ్వాలని కార్యకర్తలు విజ్ఞప్తి చేశారు.

15 బంగారు గాజులు, 5 బంగారు ఉంగరాలు, 8 నవరసుల గొలుసులు, వెండికప్పులు, గ్లాసులు, పట్టాలు, మట్టెలు, కుంకుమభరిణలు ఈ మొదలైన తమ ఆభరణాలను విరాళాలుగా స్త్రీలు యిచ్చారు రొక్కం రూపేణా 263/- పోగుపడ్డాయి.

సమావేశానికి వచ్చిన 30 మంది సోదరీమణులు తాము సుందరయ్యగారి వ్యాసాన్ని చదివి ఉత్తేజితులమైనామని, రక్షణోపాయాలు నేర్చుకుంటామనీ ప్రతిజ్ఞ చేశారు. ఈ సమావేశంలో కూడా ఒక మహిళ తన మంగళ సూత్రాన్ని తీసియిచ్చింది.

"ఫాసిస్టు ప్రళయానికి మన చెల్లెళ్ళే చెలియలికట్టలు'' అని నిరూపిస్తున్నారు మహిళలు; కమ్యూనిస్టులకు డబ్బు ఎక్కడిది? మాస్కో బంగారమా?, గవర్నమెంటు లంచాలా? ఈ విరాళాలు యిచ్చిన మహిళల నడిగితే తెలుస్తుంది అని శ్రీ నండూరి ఈ వ్యాసంలో తెలిపారు.

## మహిళా సంఘాల ఫాసిస్టు వ్యతిరేక ప్రచారం

ఆనాడు మహిళా సంఘాలు ఫాసిస్టు వ్యతిరేక ప్రచారాన్ని గ్రామ గ్రామాన సాగించాయి కృష్ణా జిల్లా మహిళా సంఘం తరఫున గుడివాడ, దివి తాలూకాలలో ప్రచారం సాగించబడింది. మహిళా సంఘాలలో విరివిగా సభ్యులు చేరుతున్నారు. జనవరి నెలాఖరుకు 5 వేల మంది సభ్యులను చేర్పించడానికి దీక్షగా పని చేస్తున్నారు. హిందూ లా సవరణకు సంబంధించిన బి. ఎన్. రావు కమిటీ రిపోర్టులో చేయవలసిన మార్పులను గురించి తెలియజేసే మహజర్లపై గ్రామ గ్రామాన వందలకొలదీ స్త్రీలచే సంతకాలు చేయిస్తున్నారు.

పశ్చిమ గోదావరి జిల్లా తణుకు తాలూకాలో 13 గ్రామాలలో స్త్రీల సమావేశాలు ఏర్పాటు చేయబడ్డాయి. 315 మంది స్త్రీలు హాజరయ్యారు.

రాజమండ్రిలో పట్టణ మహిళా సంఘం సమావేశమై పురుషులతోబాటు స్త్రీలకు కూడా సమాన ఆస్తి హక్కు కల్గునట్లు మార్పులు చేసి, బి.ఎన్. రావు కమీటీ రిపోర్టును వెంటనే చట్టంగా తయారు చేయాలని భారత శాసన సభ వారిని కోరుతూ తీర్మానించారు. జాతీయ రక్షణకు జాతీయైక్యమత్యానికి, జాతీయ ప్రభుత్వ స్థాపనకు కాంగ్రెస్ నాయకుల్ని వెంటనే విడుదలచేయాలనికోరారు. ప్రతీ ఆదివారం అధ్యయన తరగతులు నడుపుటకు తీర్మానించారు.

(1942 డిసెంబరు 23, ప్రజాశక్తి)

## హిందూ లా సవరణ బిల్లు

హిందూ లా సవరణ బిల్లులో వివాహం, వారసత్వ హక్కు, దత్తత. విడాకుల విషయంలో స్త్రీలకు జరిగే అన్యాయాలను తొలగించాలనీ, అతుకుల బొంత చట్టాల బదులు ఒక సమగ్ర చట్టం చేయాలనీ, ఈ దశలో మహిళా సంఘం ఆందోళన గావించింది. ఇందుకు సంబంధించి కామ్రేడ్ కె. చలపతిరావు వ్రాసిన వ్యాసంలోని లోపాలను తెలుపుతూ కామ్రేడ్ వి.వి. శాస్త్రి (18-11-42 వ తేదీ ప్రజాశక్తిలో) ఒక వ్యాసం వ్రాశారు.

కృష్ణా జిల్లా మహిళా సంఘ కార్యవర్గం 11-9-42 న జొన్నపాడులో సమావేశమై హిందూ లా సవరణ బిల్లుపై క్రింది తీర్మానం చేసింది.

"కేంద్ర శాసన సభలో ప్రవేశపెట్టిన స్త్రీల ఆస్తి హక్కు చట్టము, బహు భార్యా నిషేధ చట్టము, తిరిగి వ్రాయబడి 1942 మే నెలలో బిల్లు రూపంగా ప్రకటించారు. కాని హిందూ లా లో యింకనూ కొన్ని భాగాలు వ్రాయవలసి ఉన్నాయి కనుక 1946 జనవరి 1 వ తేదీకి అమలు పరచవలసినట్లు ప్రభుత్వం వారు ప్రకటించారు.

"ఇంతవరకు భారత స్త్రీలకు ఆస్థిలో ఏ విధమైన హక్కు లేదు కాని ఈ కొత్త చట్టము స్త్రీలకు కొంతవరకు ఆస్తి హక్కు కలుగజేసింది. దానిలో స్త్రీ పురుష భేదము కనపడుతోంది. కాని ఈ భేదాన్ని తొలగించి స్త్రీ, పురుషులకు సమాన ప్రాతినిధ్యము యివ్వాలి. కాలయాపన జేయక ఈ రెండు బిల్లులను 1943 జనవరి నుండి అమలు పరచాలి. ఈ విషయాలపై గ్రామ మహిళా సంఘాలు తీవ్ర ఆందోళన చేయాలి."

## స్త్రీల పాటల కోసం విజ్ఞప్తి

ప్రస్తుత సమాజంలో మన స్త్రీలనుభవిస్తున్న కష్టాల గురించి, ఫాసిస్టు దురాక్రమణ నెదుర్కోవడంలో స్త్రీల కర్తవ్యాల గురించి చక్కని పాటలు వ్రాసి, కృష్ణా జిల్లా మహిళా సంఘం, గవర్నరుపేట, బెజవాడకు పంపవలసిందిగా

కోరుతూ జిల్లా సంఘం కార్యదర్శి కాట్రగడ్డ హనుమాయమ్మగారు విజ్ఞప్తి చేశారు. బాగా పాటలు వ్రాసినవారికి పదిరూపాయల బహుమతి యివ్వబడును అని తెలిపారు.

"ప్రబోధము" అను మకుటంలో శ్రీమతి వట్టికొండ విశాలాక్షిగారు ఒక గేయం వ్రాశారు. ఇది 1942 డిసెంబరు 2 వ తేదీ ప్రజాశక్తిలో ప్రచురించబడిన స్త్రీల గేయం ఫాసిస్టు వ్యతిరేక పోరాటానికి స్త్రీలు కదిలి రావాలని కూడా ఈ గేయంలో పిలుపు యివ్వబడింది.

"విజ్ఞానమున ఎంతో వెనుకబడి స్త్రీజాతి
బానిసత్వంలోన బంధింపబడుటచే
విజ్ఞానమెల్లెడల వెదజల్లుటకుగాను
విదూషీమణులు నేడు వెడలి రావాలి
పూరుషుల సాయమ్ము పొందగోరాలి.
ప్రాక్తనా భావములు పాడుచేయాలి.

స్వాతంత్ర్యపోరాట శక్తిలో సగమైన
మహిళలందరి స్వేచ్ఛా మంటలో గలిపేసి
స్వాతంత్ర్య సమరాన సాగిపోలేలరంచు
పురుషలోకానికి బోధ చేయాలి.
స్వేచ్ఛ కావాలంచు, స్త్రీ లే అడగాలి !
సాహసంతో స్త్రీలే సాగి రావాలి.
పెట్టుబడిదార్లచే పీడించబడుచుండి
కూడుగుడ్డలేక కుములుచున్నటువంటి
బీద ప్రజ రక్తముం బీల్చి పిప్పిగజేయు
సామ్రాజ్యవాదమును చంపివేయాలి.
ఫాసిస్టు శత్రువుల పాతిబెట్టాలి.
సబలలము మేమంచు చాటి చెప్పాలి."

## మహిళా కార్యకర్తలకు మొదటి రాజకీయ శిక్షణా తరగతులు

కమ్యూనిస్టు పార్టీ చొరవతో ముందు పార్టీ కుటుంబాలకు చెందిన మహిళలకు, స్త్రీల సమస్యలు, జాతీయ, అంతర్జాతీయ రాజకీయాలు, ప్రపంచ జ్ఞానంపై శిక్షణా తరగతులు పెట్టి వారిని మహిళా ఉద్యమ నిర్మాతలుగా, కార్యకర్తలుగా తయారు చేయడానికి ఈ దశలో చాలా కృషి జరిగింది.

1931 నుండి కృష్ణా, పశ్చిమ గోదావరి, తదుపరి గుంటూరు, తూర్పు గోదావరి, నెల్లూరు, తదితర చోట్లకు మహిళా సంఘాలు విస్తరించినప్పటికీ కార్యకర్తలకు రాజకీయ శిక్షణ యివ్వడానికి నిర్మాణయుతమైన కృషి ఈ పాఠశాలలోనే ప్రారంభమైంది.

1942 మే 25 నుండి జూన్ 14వరకు 20 రోజులు కృష్ణా జిల్లా మహిళా సంఘం వారు బెజవాడలో భారత మహిళా మండలి ఆవరణలో మహిళా శిక్షణా తరగతులు నడిపారు. ఇది కృష్ణా జిల్లా స్థాయిలో జరిగింది. డాక్టర్ అచ్చమాంబ, చంద్ర సావిత్రి దేవిగార్లు నిర్వహణ బాధ్యత వహించారు. 45 మంది శిక్షణ పొందారు.

1943 జనవరి ఫిబ్రవరి నెలల్లో 30 రోజులు బెజవాడలో రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ ఆధ్వర్యాన మొట్టమొదటి రాష్ట్ర మహిళా రాజకీయ పాఠశాల జరిగింది. 5 జిల్లాల నుండి 22 మంది మహిళలు వచ్చారు. గవర్నరు పేటలో ప్రత్యేకంగా యిల్లు అద్దెకు తీసుకొని ఈ పాఠశాల నిర్వహించారు. భారతదేశ చరిత్ర, రాజకీయ భూగోళం, జాతీయ, అంతర్జాతీయ రాజకీయాలు, ప్రసూతి, శిశుపోషణ, ఆరోగ్య, పారిశుధ్య విధులు, జపాన్ దండయాత్ర ప్రమాదం దృష్ట్యా స్త్రీలలో ప్రతిఘటన శక్తి కల్గించడానికి డ్రిల్లు, కర్రసాము, ఆత్మరక్షణోపాయాలు మున్నగునవి నేర్పబడ్డాయి.

భారత మహిళా మండలి ఆవరణలో కామ్రేడ్ చంద్ర రాజేశ్వరరావు డ్రిల్లు, కర్రసాము నేర్పారు. మహిళలందరు, యువతులు, మధ్య వయస్కులు కూడా కాకి నిక్కర్లు ధరించి డ్రిల్లు కర్రసాము నేర్చుకున్నారు. శిబిరం చివరి రోజున గవర్నరు పేట వీధుల్లో మార్చ్ కూడా చేశారు. వెల్లంకి వెంకటేశ్వర రావు, కొసరాజు శ్రీరాములు ఆత్మ రక్షణోపాయాలు నేర్పారు. మహిళలకు సైకిలు త్రొక్కుట కూడా నేర్పారు. ప్రతీ రోజు పత్రికా పఠన కూడా జరిగింది.

కామ్రేడ్ మద్దుకూరి చంద్రశేఖరరావు, కామ్రేడ్ సుందరయ్య, కామ్రేడ్ చలసాని వాసుదేవరావుగార్లు జాతీయ, అంతర్జాతీయ రాజకీయాలపై పాఠాలు చెప్పారు. న్యాయవాదులు వి వెంకట్రామశాస్త్రి, కంభంపాటి సత్యనారాయణ (జూనియర్) చరిత్ర, రాజకీయ భూగోళం, స్త్రీల హక్కులు, చట్టాలు మున్నగు వాటిపై పాఠాలు చెప్పారు. చంద్ర సావిత్రీదేవి పాటలు నేర్పారు. డాక్టర్ అచ్చమాంబ ప్రసూతి శిశుపోషణ, ఆహార విజ్ఞానం, ఆరోగ్య శాస్త్రం నేర్పారు. తూర్పు, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాల నుండి మహిళా కామ్రేడ్సు హాజరయ్యారు. ఈ మొదటి పాఠశాలకు హాజరైన వారి పేర్లు ఆనాటి

గ్రూపు ఫోటో ప్రకారం ఎడమనుండి కుడికి క్రిందివరుస కూర్చున్నవారు: పందిరి జగదాంబ, మహీధర సీతాదేవి, (తూ. గోదావరి) దుర్భా హనుమాయమ్మ (గుంటూరుజిల్లా) రెండవ వరుస కూర్చున్నవారు : కొమర్రాజు పద్మ (బెజవాడ) శ్రీమతి కోటమ్మ (తరువాత ముక్తేవి కోటమ్మ) కామ్రేడ్స్ చలసాని వాసుదేవ రావు, మద్దుకూరి చంద్రశేఖరరావు, పుచ్చలపల్లి సుందరయ్య, చండ్ర రాజేశ్వర రావు, మూడవ వరుస నిలబడినవారు : వెల్లంకి సక్కుబాయి, కడియాల రాజ రత్నమ్మ, (కృష్ణా) మాకినేని జగదాంబ (గుంటూరు) చండ్ర సావిత్రిదేవి (కృష్ణా), టి. సావిత్రి (గుంటూరు) గోపరాజు సీతాదేవి (పశ్చిమ గోదావరి) వెల్లంకి అన్నపూర్ణ (కృష్ణా) ఎలమంచిలి కమల (కృష్ణా) నాల్గవ వరుస : మోటూరి ఉదయం (గుంటూరు) జోస్యభట్ల సుబ్బమ్మ (బెజవాడ) పరకాల అహల్యాదేవి (పశ్చిమ గోదావరి) అన్నే రామతులశమ్మ (పశ్చిమ గోదావరి) పరుచూరి సూర్యాంబ (నెల్లూరు జిల్లా) వి. విమల (కృష్ణా) కాట్రగడ్డ హనుమాయమ్మ (కృష్ణా) మానికొండ సూర్యావతి (కృష్ణా) గుంటూరునుండి ఏటుకూరి పంకజమ్మ గారు కూడా క్లాసుకు వచ్చారు కాని మధ్యలో అనివార్య కారణాల వల్ల వెళ్ళి పోయారు.

విజయవాడలో జరిగిన ఈ తొలిరాజకీయ పాఠశాల రాష్ట్ర మహిళా ఉద్య మానికి పునాది వేసింది. పాఠశాలకు వచ్చిన మహిళలందరు మంచి తర్ఫీదు పొంది, రాజకీయ విజ్ఞానంతో చైతన్యంతో వెళ్ళి ఆ తరువాత రాష్ట్ర జిల్లా మహిళా సంఘ బాధ్యతలు స్వీకరించారు. డ్రిల్లు, కర్రసాము, ఆత్మరక్షణో పాయాలు వారిలో ఎంతో ఆత్మవిశ్వాసం కల్గించాయి. డాక్టర్ అచ్చమాంబగారు ఈ క్లాసులో స్త్రీలకు ప్రసూతి - శిశుపోషణ బోధించడానికి నోట్సు తయారు చేసుకొని ఆ తరువాత దానిని మెరుగులుదిద్ది ప్రసూతి - శిశుపోషణ పుస్తకంగా ప్రచురించారు. సులభ శైలిలో తెలుగులో అటువంటి స్త్రీల శిశువుల ఆరోగ్య విజ్ఞానం, శరీర శాస్త్రం గురించి వెలువడిన తొలి గ్రంథం అవడంతో అనేక ముద్రణలు పొంది, వేలకొలది కాపీలు అమ్ముడు పోయాయి. ఈ శిక్షణ తరగతు లలో స్త్రీలకు శరీర నిర్మాణం, గుండె, గర్భాశయం మున్నగునవి బోధించడానికి ఒక మేకను కోయించి డాక్టర్ అచ్చమాంబగారు ఆ భాగాలన్నింటిని స్త్రీలకు చూపించి పాఠాలు నేర్పడం ఒక విశేషం. అలాగే రాజకీయ భూగోళం, గ్లోబు, మ్యాపులు సహాయంతో నేర్పడం వలన మొదటిసారిగా వారికి వివిధ ఖండాలు, దేశాలు ఏమిటో పరిచయం ఏర్పడింది. అలాగే వంట వార్పులు, శాస్త్రీయపద్ధతులు, ఆహార విజ్ఞానంకూడా నేర్పబడింది.

1943 జనవరి 21 వ తేదీన బెజవాడ ప్రజాశక్తి కార్యాలయంలో లెనిన్ 19 వ స్మారక సభ జరిగినప్పుడు స్త్రీల శిక్షణా శిబిరానికి చెందిన స్త్రీలు పాడిన ఫాసిస్టు వ్యతిరేక గేయాలతో సభ ప్రారంభమైంది.

రాష్ట్ర పార్టీ ఆధ్వర్యాన ఆ తరువాత రెండవ మూడవ రాజకీయ పాఠ శాలలు కూడా జరిగాయి. అంతకు ముందు ఆ తరువాత ఏ జిల్లాకు ఆ జిల్లా మహిళా రాజకీయ పాఠశాలలు జరిగాయి.

ఈ పాఠశాలలన్నీ రాష్ట్రంలో పెద్ద సంఖ్యలో మహిళా కార్యకర్తల్ని తయారుచేసి మహిళా ఉద్యమ వ్యాప్తికి తోడ్పడ్డాయి. ఫాసిజానికి వ్యతిరేకంగా స్త్రీలను సమీకరించడానికి వారిలో ప్రతిఘటనా శక్తిని కల్గించడానికి, వారు ఆనాటి అభివృద్ధి నిరోధక సాంఘిక కట్టుబాట్లు అధిగమించి ముందుకు రావడానికి ఎంతగానో తోడ్పడ్డాయి

## గుంటూరు జిల్లా మహిళా శిక్షణా శిబిరం

గుంటూరు జిల్లా మహిళా శిక్షణా శిబిరం తెనాలిలో 17 రోజులు జరిగింది. 1942 డిసెంబరు 9 వ తేదీ ప్రజాశక్తిలో శిబిరం వివరాలు ప్రకటించ బడినాయి. గనుక ఈ శిక్షణా శిబిరం నవంబరు నెలలో అటు ఉండవచ్చు. 28 మంది మహిళలు శిక్షణ పొందారు. ఈ రిపోర్టు ఇలా ప్రారంభమైంది.

"ఝాన్సీ లక్ష్మిబాయి, వీరమల్లమాంబ, గున్నమ్మ వీరి స్వరూపాలు కళ్ళముందు ఆడుతున్నాయి. వారి రక్తనాళాలు ఉబికినాయి. కళ్ళలో తీక్షణత ఉద్రేకం కనబడుతున్నాయి. పిడికిలి బిగించి పైకెత్తి "లెనిన్ డే నాటికి 1500 మంది" అని ఒక్కసారి అరిచారు. (నినాదం చేశారు.) 1500 మందిని చేర్చక పోతే మా బ్రతుకు ఎందుకు? అని సవాలు చేశారు, ఆ శిక్షణా శిబిరంలోని విద్యార్థులు.

తెనాలిలో జరిగిన ఈ శిక్షణా శిబిరంలో రాజకీయ భూగోళం, విమాన దాడి రక్షణ ఉపాయాలు (ఎ.ఆర్.పి. వరకు) సబ్జక్టులు చెప్పబడ్డాయి. ముడి లోహంలాగు శిబిరంలోకి వెళ్ళి పచ్చబంగారం లాగా బైటికి వచ్చారు విద్యార్థులు.

## నూతన విజ్ఞానం - నూతనానుభవం

ప్రతీరోజూ ఉదయం డ్రిల్లు, ప్రతికాపఠనం, ఉపాధ్యాయుల పాఠాలు, మధ్యాహ్నం తిరిగి పాఠాలు, ప్రతి సాయంత్రం ఊరి బైటికి వెళ్ళి ఆత్మ విమర్శన, ప్రతిరాత్రి డిబేట్లు జరిగేవి.

సివిక్స్, రాజకీయ భూగోళం, హిందూదేశ చరిత్ర, సంఘ పరిణామం, చైనా జాతీయోద్యమం, రష్యా విప్లవం, ఫాసిస్టు వ్యతిరేక పోరాటం, మొదలగు

విషయాలలో పాఠాలు చెప్పబడినాయి. అలాగే ప్రతిరోజూ సాయంత్రం స్త్రీవిద్య, ఆర్థికస్థితి, సంఘ బానిసత్వం, దురాచారాలు, జాతీయ పోరాటంలో వారి విధి మొదలైన విషయాలపై చర్చలు జరిగేవి. ప్రతి విద్యార్థినీ చర్చలలో విధిగా పాల్గొనాలి.

## ప్రభుత్వ ఆంక్షలు

ఈ మహిళా శిక్షణా శిబిరం జరుగుతున్న సమయంలో రాష్ట్రంలో వయోజన విద్యపై ప్రభుత్వ ఆంక్ష కొనసాగుతోంది. దీనిని పురస్కరించుకొని అధికారి అనుమతి లేనిదే శిక్షణా శిబిరం నడుపడానికి వీలులేదని స్థానిక సబ్ ఇన్‌స్పెక్టరు నోటీసు జారీ చేశారు. దానిపై శిబిర నిర్వాహకులు కలెక్టరు వద్దకు రాయబారం వెళ్ళి అనుమతి తెచ్చుకొన్నారు.

17 రోజుల శిక్షణ ఫలితంగా వచ్చిన విద్యార్థినులలో ప్రచారకులు, నిర్మాతలు, ఉపాధ్యాయులు తయారయ్యారు. వారిలో దాగి ఉన్న వ్యక్తిత్వం, కుశలత ఉబికి వచ్చాయి. నూతన వికాసంతోపాటు నూతన కార్యదీక్ష ఉద్భవించింది. ఈ 28 మందిలో నూతన జీవితం ప్రారంభమైంది.

—ప్రజాశక్తి 9-12-1942

ఈ శిక్షణా శిబిరం తరువాత గుంటూరులో జరిగిన విషయ నిర్ణయ సభలో జిల్లా అంతటి నుండీ వచ్చిన 65 మంది మహిళలతోసహా శిబిరంలో శిక్షణ పొందిన మహిళలు కూడా పాల్గొన్నారు.

మహిళా సంఘ సభ్యత్వం పావు రూపాయనుంచి అణాకు మార్చాలి అన్న విషయం ముందు చర్చించారు. మహిళా సంఘాలు ప్రజా సంస్థలుగా మారాలి బెనారస్ చీరలనుండి గోనెకట్టల వరకు సంఘం వ్యాపించాలి లేడీస్ రిక్రియేషన్ క్లబ్‌నుండి పల్లెలోని వాడదాకా గుడిసెల వరకు ప్రాకిపోవాలి. అలా వుంటేనే మన సంఘానికి నిలబడే బలం, మన ఉద్యమానికి పోరాడే శక్తి, మన అర్థ బానిసత్వానికి విముక్తి - (ఇదీ అణావాదుల వాదాలు. చివరకు అణావాదులే జయించారు)

తరువాత 11 తీర్మానాలు గావించబడ్డాయి. బాల్య వివాహాల నిషేధం, రావు కమిటీ బిల్లుకు సవరణలు, ఫాసిస్టు వ్యతిరేక పోరాటం మున్నగునవి యిందులో ఉన్నాయి.

తరువాత జరిగిన బహిరంగసభలో ఉపన్యాసాల సారాంశం - ఝాన్సీ లక్ష్మీబాయి, మల్లమాంబ, వీరమాంచాలవరకు ఆదర్శాలు, వారికి మా జోహార్లు. పాషనారా, జోయా మాకు మార్గదర్శకులు. వారికి మా జేజేలు. వీర రష్యా అజేయ

చైనా నారీమణులు, ఫాసిస్టు వ్యతిరేక యుద్ధంలో చూపించే అసమాన త్యాగం, శౌర్యం, ధైర్యం మమ్ములను ఉత్తేజితులను చేస్తున్నాయి. మా మాతృదేశానికి కూడా అట్టి విపత్తే కల్గుతోంది. ఈ విపత్తునుండి దేశాన్ని కాపాడడానికి రష్యా, చైనా యువతులలాగే నిరంతర కృషి చేస్తాం. మీటింగులద్వారా, చర్చలద్వారా, పాటలద్వారా ప్రచారం చేస్తాం. శిక్షణ శిబిరాలద్వారా తోడి యువతులకు ఆత్మ రక్షణోపాయాలు, యుద్ధ సహాయ విధానాలు నేర్పుతాం. మాదేశాన్ని పిల్లల్ని, మానాల్ని కాపాడుకోడానికి మాప్రాణాలను, మాధనాన్ని ఒడ్డుతాం. ముందు వేసిన అడుగును వెనుకకు తీయం."

## వివిధ జిల్లాల్లో మహిళా ఉద్యమ పరిస్థితి (1943 జూలైలో 3 వ రాష్ట్ర పార్టీ మహాసభ నాటికి)

1943 జూలై 8-15 తేదీలలో విజయవాడలో జరిగిన 3 వ ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ మహాసభ నాటికి, అంతకు ముందు జరిగిన వివిధ జిల్లా కమ్యూనిస్టు పార్టీ మహా సభల నాటికి రాష్ట్రంలో మహిళా ఉద్యమం ఏ స్థితిలో ఉందో తెలిపే సమాచారం ఆయా మహా సభల నివేదికలలో ఉంది.

కృష్ణా జిల్లా కమ్యూనిస్టు పార్టీ ద్వితీయ మహాసభ బెజవాడలో 1943 జూన్ 28, 29, 30 తేదీలలో జరిగింది. మహాసభ నివేదిక ప్రకారం జిల్లాలో అప్పటికి మహిళా సంఘ సభ్యత్వం 5158 ఉంది.

పశ్చిమ గోదావరి జిల్లా కమ్యూనిస్టు మహాసభ 1943 జూలై 1,2,3 తేదీలలో ఏలూరులో జరిగింది. 25 గ్రామాలలో 630 మంది మహిళలు, మహిళా సంఘాలలో సంఘటితం చేయబడ్డారని మహాసభ నివేదిక పేర్కొంది.

గుంటూరు జిల్లా కమ్యూనిస్టు పార్టీ మహాసభ 1943 జూన్ 1,2,3 తేదీలలో తెనాలిలో జరిగింది. మహాసభలో 10,000 మహిళా సంఘ సభ్యత్వం చేర్పించాలని కోటా తీసుకున్నారు. (అప్పటికి ఉన్న సభ్యత్వం ఎంతో వివరం లేదు) నెల్లూరు, విశాఖజిల్లా పార్టీ మహాసభలలో మహిళా సంఘ సభ్యత్వం ఎంత ఉందో రిపోర్టులలో లేదు.

"1943 జనవరి 21 వ తేదీన బెజవాడలో జరిగిన లెనిన్ స్మారక దినోత్సవం నాడు ఆంధ్ర కమ్యూనిస్టు కమిటీ విస్తృత సమావేశం జరిగింది. సమావేశం నివేదికలో వివిధ ప్రజారంగాలపై నివేదికలు తీర్మానాలు ఆమోదించ బడ్డాయి. 125 గ్రామాలలో మహిళా సంఘాలున్నాయి. 4 వేల మంది సభ్యురాండ్రు ఉన్నారు అని తెలుపబడింది. ఈ తీర్మానంపై చర్చలో మహిళా ట్రైనింగ్ క్యాంపులో శిక్షణ పొందుతున్న మహిళా కామ్రేడ్సు పాల్గొన్నారు.

ఉద్యమాన్ని వ్యాపింప జేయాలనీ, స్త్రీలందరి హక్కుల కొరకు ఆహార కరువును ఎదుర్కోవడానికి కృషి చేయాలనీ, విమాన దాడి రక్షణ గురించి ప్రథమ శిక్షణ పొందాలనీ తీర్మానించబడింది."

ప్రజాశక్తి, 9-2-1943.

## కృష్ణాజిల్లా మహిళా సంఘ నివేదిక

కృష్ణాజిల్లా మహిళా సంఘ 6వ వార్షికోత్సవ సభ దివి తాలూకా నాదెళ్ల వారి పాలెంలో 1943 ఏప్రిల్ 25, 26 తేదీలలో జరుగుతుందనగా గత మహా సభనుండి ఈ సభవరకు జరిగిన కార్యకలాపాల నివేదికను అధ్యక్ష కార్యదర్శులు మానికొండ సూర్యావతి, కాట్రగడ్డ హనుమాయమ్మగార్లు ప్రకటించారు.

(1943 ఏప్రిల్ 7వ తేదీ ప్రజాశక్తి)

అందులో అంతవరకు జరుపబడిన మహిళా రాజకీయ పాఠశాలల వివరాలు, బి. ఎన్. రావు కమిటీ బిల్లులో సవరణలకై ఆందోళన, స్థానిక సమస్యలు, రాజకీయ సమస్యలు మున్నగునవి వివరించబడినాయి. ఆనాటి ఉద్యమ పరిస్థితి కార్యక్రమం గురించి తెలుసుకోవడానికి ఉపకరించే విధంగా ఉన్న ఈ నివేదికలో ప్రధానాంశాలు యివి :

క్రిందటి మహాసభ జరుపుటకు పూర్వం 1500 సంఘ సభ్యత్వంతో 52 ప్రాథమిక సంఘాలున్నాయి. వీటిలో 15 సంఘాలు పూర్తి కార్యక్రమాన్ని అమలు జరిపాయి. నేడు 3500 సభ్యత్వంతో 60 గ్రామాల్లో సంఘాలు ఏర్పడ్డాయి.

1942 మే 25 నుండి జూన్ 14వ తేదీవరకు మహిళా సమస్యల విషయంలోనూ, పనిచేసే విధానంలోనూ వర్కర్లకు శిక్షణ యివ్వడానికి 20 రోజులపాటు బెజవాడలో శిక్షణా శిబిరం ఏర్పాటు చేయబడింది. 45 మంది యువతులు శిబిరంలో పాల్గొన్నారు. శిక్షణ పొందినప్పటినుండి వీరిలో చాలా మంది మహిళా ఉద్యమ వ్యాప్తికై కృషి చేస్తున్నారు.

1943 జనవరి - ఫిబ్రవరి నెలలో 30 రోజులు (రాష్ట్ర పార్టీ ఆధ్వర్యాన) బెజవాడలో మహిళా శిక్షణాశిబిరం నిర్వహించబడింది. 20 మంది (మరొకరు మధ్యలో వెళ్ళిపోవడం జరిగింది.) శిక్షణ పొందారు. (తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలు, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాలు నుండి మహిళలు వచ్చారు. వీరిలో పదిమంది తమ పూర్తి కాలాన్ని మహిళా సంఘంలో పనిచేయడానికి వినియోగిస్తున్నారు.

ఈ సంవత్సరం 11 ప్రాథమిక సంఘాలు తరఫున అధ్యయన తరగతులు నడుపబడ్డాయి. పత్రికలు, పుస్తకాలు చదివించుట మూఢ విశ్వాసాలు, దురాచారాలు, వాటివల్ల కలిగే నష్టాలను గురించి ప్రచారము జరుపబడింది.

బి. ఎన్. రావు కమిటీబిల్లు : హిందూ న్యాయశాస్త్రాన్ని సవరిస్తూ, బి.ఎన్ రావు కమిటీ ప్రవేశపెట్టిన బిల్లులో కొన్ని సూచనలు చేస్తూ 50 గ్రామాలనుండి 2000 సంతకాలతో కూడిన మహజర్లు, కేంద్ర శాసన సభాధ్యక్షునికి పంపబడ్డాయి. ఈ విషయంలో గ్రామ గ్రామాన స్త్రీలను సమావేశపరచి, హిందూ న్యాయశాస్త్రం గురించి, అందు స్త్రీలకు జరిగిన అన్యాయం గురించి రావు కమిటీ బిల్లును గూర్చి స్త్రీల కర్తవ్యం ప్రబోధం చేయబడింది.

స్థానిక సమస్యలు :- గ్రామాలలో మరుగు దొడ్ల సౌకర్యం లేక స్త్రీలు పడుతున్న యిబ్బందులను పోగొట్టడానికి కృషి చేయబడింది. ఈ విషయంలో కాటూరు, పెద ఓగిరాల, ఇందుపల్లి మొదలైన గ్రామాలలో చక్కటి కృషి సాగించ బడుతోంది. స్థానిక ప్రజా సంఘాల నాయకులుతోనూ, పంచాయతీ బోర్డుల ద్వారానూ, మహిళా వర్కర్లు పనిచేస్తున్నారు. కిరసనాయిల్ విషయంలో మహిళా సంఘం ఆదర్శ కృషి సాగిస్తుంది.

రాజకీయ సమస్యలు :- యుద్ధ పరిస్థితుల మూలంగానూ, జాతీయ ప్రతిష్ఠంభన వల్ల భారత ప్రజలను భీషణరూపంలో ఎదుర్కొంటున్న ఆహార సమస్య మహిళా లోకాన్నికూడా కలవర పరుస్తోంది. ఈ విషయంలో బెజవాడ నగర మహిళా సంఘం చక్కటి కృషి సాగిస్తూంది. చౌక డిపోల వద్దకు వచ్చిన స్త్రీలను క్యూలుగా నిలుచోబెట్టి అందరికీ సకాలంలో వస్తువులు అందునట్లు, చేస్తు న్నారు. వారికి మంచినీటి సౌకర్యం కల్గిస్తున్నారు.

డిటెన్యూలను, రాజకీయ ఖైదీలను చేయాలనీ, గోపాలన్ నంబియారు ఉరి శిక్ష రద్దు చేయాలనీ, కయ్యూరు శిక్షితులను విడుదల చేయాలనీ, ఆందోళన చేయ బడింది. జాతీయైక్యతా ప్రచారంలోనూ, స్వతంత్ర్య దినోత్సవంలోనూ 10 మహిళా దళాలు పాల్గొన్నాయి. ఒక్క బెజవాడలోనే 4 దళాలు పనిచేశాయి.

భవిష్యత్ కార్యక్రమంలో ఆహార సమస్య, గ్రామాలలో మరుగుదొడ్ల సమస్య, ప్రసూతి వైద్యశాలలు, బాలికలకు విద్యాలయాలు మున్నగు సమస్యలపై ఆందోళన ఉద్యమాన్ని నిర్వహించాలని, గ్రామ గ్రామాన మహిళా సంఘాలు నిర్మించాలని, ఈ సమస్యలన్నింటిని 5వ జిల్లా మహాసభలో చర్చించాలని నివేదిక కోరింది.

# గ్రామ గ్రామాన మహిళా సంఘాల స్థాపన : కదలిక

ఈ దశలో మహిళా కార్యకర్తలు దళాలుగా బయలుదేరి గ్రామ గ్రామాన మహిళలను సమావేశ పరచి, వారిస్థానిక సమస్యలు మొదలుకొని, జాతీయ, అంతర్జాతీయ రాజకీయసమస్యల వరకు, స్త్రీల హక్కులగురించి ప్రచారం చేసుకుంటూ కట్టుదిట్టంగా ప్రాథమిక సంఘాలను ఏర్పరచారు. ఉదాహరణకు కొన్ని వివరాలు:-

## గుంటూరు జిల్లాలో

గుంటూరు తాలుకా శేకూరు శివారు శిలపాడు గ్రామంలో 28-3-43న గ్రామ మహిళల సాధారణ సమావేశం జరిగింది. సభకు కామ్రేడ్ సి. పద్మాక్షమ్మ అధ్యక్షత వహించారు. కామేడ్ దుర్భా హనుమాయమ్మ మహిళా ఉద్యమం గురించి విపులంగా ఉపన్యసించారు. తరువాత గ్రామ మహిళా సంఘ ఎన్నికలు జరిగాయి.

కొల్లూరులో 24-3-43న కామ్రేడ్ శాఖమూరి కోటమ్మగారి అధ్యక్షతను 20 మంది మహిళా సంఘ సభ్యులు సమావేశమై ఎన్నికలు జరుపుకున్నారు. సభలో క్రింది తీర్మానాలు గావించబడ్డాయి. 1. పాయిఖానా దొడ్లు లేక ఖాళీ స్థలాలున్నప్పటికీ స్త్రీలు చాలా బాధపడుతున్నారు. వెంటనే పంచాయతీ వారు దొడ్లు కట్టించాలని కోరుతున్నారు. 2. కయ్యూరు కామ్రేడ్స్ తల్లితండ్రులకు అక్కచెల్లెండ్రకు సానుభూతి చూపుతూ, కయ్యూరు యోధులు ఏ ఆశయానికి మరణించారో దానికోసం పాటుపడాలని ఈ సభవారు నిశ్చయించు కొన్నారు, 3. పదిహేను రోజుల కొకసారి సమిష్టిగా పత్రికలు చదువుట యితర వార్తలు తెలుసుకొనుటకు నిశ్చయించబడింది.

దోనెపూడిలో మూడుచోట్ల శాఖమూరి కోటమ్మగారు మహిళలను సమావేశ పరిచారు. కిరసనాయిల్ యిబ్బంది, ఆహార సమస్య, స్త్రీల స్థానిక యిబ్బందులు గురించి చెప్పారు. జాతీయగీతాలు, బుర్రకథ, జోలపాట పాడి వినిపించారు. 40 మంది హాజరయ్యారు. తగిన ప్రోత్సాహం పెద్దలు ఈయక పోవడం వల్ల 8 మంది మాత్రమే సభ్యులుగా చేరారు. మరొకచోట ప్రజాశక్తిలోని అమ్మమ్మ కథను 15 మంది స్త్రీలకు చదివి వినిపించారు.

చినపాలెంలో మహిళలు పత్రికలను సమిష్టిగా చదువుతున్నారు. ఇది 10 మందితో ప్రారంభమైంది. దినపత్రిక ప్రజాశక్తి, అమ్మ, మాలపల్లి, రాజకీయ భూగోళం మొదలైనవి ఉత్సాహంగా చదువుతున్నారు.

వేటపాలెం పట్టణ మహిళా సంఘం 25-3-43వ తేదీన సాధారణ సభ్యుల సమావేశం జరిపింది. 30 మంది హాజరయ్యారు. కామ్రేడ్ సి. లక్ష్మిశేషమ్మ

మహిళా కార్యక్రమం గురించి చెప్పారు. ఫాసిస్టు ప్రమాదము, స్త్రీల కర్తవ్యం ఆంధ్ర స్త్రీలకు, ఆంధ్ర కమిటి విజ్ఞప్తి, కరువు - స్త్రీల కర్తవ్యం, మొదలైన విషయాల మీద మరికొందరు మాట్లాడారు. తరువాత ఎన్నికలు జరిగాయి.

## పశ్చిమ గోదావరి జిల్లాలో

1943 మార్చి 14 మొదలు - 24 వరకు పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరు తాలుకాలో మహిళా ప్రచారం జరిగింది. గోపరాజు సీతాదేవి, అన్నే రామ తులశమ్మ, పుచ్చల సీతారామమ్మ గార్లు ఏలూరు, పోతునూరు, దెందు లూరు, పెదపాడు నాయుడు గూడెం గ్రామాలలో సభలు జరిపారు.

మొదట యింటింటికి వెళ్ళి స్త్రీ సంఘాఐక్యకతను గూర్చి చెప్పుట, తరువాత సభకు పిల్చుట సభలో వివరంగా బోధించిన పిమ్మట సభ్యులను చేర్పించుట జరిగింది. ఏలూరులో పేట పేటకు తిరిగారు. అన్ని చోట్ల సుమారు 180 మంది స్త్రీలు హాజరయ్యారు 94 మంది సభ్యులుగా చేరారు. స్త్రీ విద్య, వితంతు పునర్వివాహం, హిందూ లా సవరణ, ఫాసిస్టు దాడి మున్నగు వాటిపై కార్యకర్తలు మాట్లాడారు. హిందూ లా సవరణను అంగీకరించని కొందరు కూడా మహిళా సంఘాలు అవసరమేనని అన్నారు.

తూర్పు గోదావరి జిల్లా మండపేట ఫిర్కాలో కామ్రేడ్స్ పందిరి జగదాంబ, మహీధర సీతాదేవిగార్లు 1943 ఏప్రిల్ 21 నుండి 26 వరకు మండపేట, ఏడిద, దుళ్ళ, రామచంద్ర గ్రామాల్లో స్త్రీల సభలు జరిపారు. సమావేశాలకు మొత్తం 8 వందల మంది స్త్రీలు హాజరయ్యారు హిందూ లా సవరణ బిల్లును బలపరుస్తూ కొత్త సూచనలు తెలియజేసే సూచనలపై చాలా మంది స్త్రీలు సంతకాలు చేశారు మహిళా సంఘంలో విరివిగా సభ్యులు చేరారు.

పశ్చిమ గోదావరి జిల్లా కమిటం గ్రామం మహిళా సంఘం 1943 మే 3 వ తేదీన పరకాల రత్తమ్మ గారి అధ్యక్షతను, జిమ్నూరు మహిళా సంఘం వితాకుల వెంకాయమ్మ గారి అధ్యక్షతను సమావేశమై ఆహార సమస్యను పరిష్కరించడానికి ప్రభుత్వం చౌకడిపోలు ఏర్పాటు చేయాలనీ కోరారు. ఉరిశిక్షకు గురియైన కయ్యూరు కామ్రేడ్సుపట్ల సంతాపాన్ని ప్రకటించారు.

పశ్చిమ గోదావరి జిల్లా సత్రంపాడు గ్రామంలో అన్నే రామతులసమ్మ గారు యింటింటికి వెళ్ళి హిందూ లా సవరణబిల్లులో స్త్రీలకు కావలసిన హక్కుల గురించి ప్రచారం చేసి, మహజర్లపై సంతకాలు చేయించారు. 12 గురు సభ్యులుగా చేరారు.

ఏలూరు పట్టణం తూర్పు వీధి, పత్తేబాదులలో పరకాల అహల్యాదేవి, అన్నే రామతులశమ్మ జాతీయ నాయకుల విడుదల, ఆహార సమస్య, రావు కమిటీ బిల్లు గురించి ప్రచారం చేశారు. 40 మందిని సభ్యులుగా చేర్పించారు. స్థానిక కమిటీలను ఏర్పరచారు.

గుంటూరు జిల్లా దొండపాడులో 1943 ఏప్రిల్ 26వ తేదీన స్త్రీల సభ జరిగింది. దుర్గా హనుమాయమ్మ గారు మహిళా సంఘ ఆవశ్యకత గురించి మాట్లాడారు. 20 మంది సంఘ సభ్యులుగా చేరారు.

నర్సాయపాలెంలో ఏప్రిల్ 22వ తేదీన స్త్రీల సభ జరిగింది. కామ్రేడ్ కొల్లా పరమ్మ, పత్తిపాటిగార్లు మహిళా సంఘాల ఆవశ్యకత గురించి మాట్లాడారు 40 మంది సభ్యులుగా చేరారు.

## 5 వ కృష్ణాజిల్లా మహాసభ

కృష్ణా జిల్లా మహిళా సంఘ అయిదవ మహా సభ దివి తాలుకా నాదెళ్ళ వారిపాలెంలో 1943 ఏప్రిల్ 25, 26 తేదీలలో జరిగింది. (ఈ మహా సభ రిపోర్టును కామ్రేడ్ సుభద్రయ్య స్వయంగా ప్రజాశక్తి 5-5-1943 తేదీ సంచికలో వ్రాశారు.) 150 మంది ప్రతినిధులు, సుమారు మూడు, నాలుగు వందల మంది ప్రేక్షకులుగాను వచ్చారు. వచ్చిన వారిలో ధనిక రైతు స్త్రీల నుండి వ్యవసాయ కూలీ స్త్రీల వరకు ఉన్నారు. యువతులే కాక, మధ్య వయస్కులు, వృద్ధురాండ్రు కూడా ఉన్నారు. వీరందరూ ఆసక్తితో చర్చలలో పాల్గొన్నారు.

25వ తేదీన ప్రతినిధుల సమావేశంలో వివిధ తీర్మానాలు చర్చించి ఆమోదించారు. రాత్రి బహిరంగ సభలో గుంటూరు మహిళా సంఘ బుర్రకథ దళం మోటూరి ఉదయం మరి యిద్దరు స్త్రీలు బుర్రకథ చెప్పారు. చైనాలో జపాను సైనికుల అమానుషాలను ఈ కథలో మనస్సుకు హత్తుకొనేటట్లు చెప్పారు. బహిరంగ సభకు 1000 స్త్రీలు 500 మంది పురుషులు హాజరయ్యారు. స్థానిక సమస్యలపై కథలను వ్రాసి బుర్రకథ చెబితే ప్రజా చైతన్యానికి ఎంత తోడ్పడేది కన్నులకు కట్టినట్లు అయింది.

26వ తేదీ ఉదయం 300 మంది స్త్రీలతో ఊరేగింపు జరిగింది. స్వాతంత్ర్యం, శాంతి, అభ్యుదయం అనే మహిళా సంఘ జండాను కామ్రేడ్ లీల ఎగురవేశారు. తరువాత శిశు ప్రదర్శన జరిగింది. 26 మంది శిశువుల ఆరోగ్యం; తూకం, పరిశీలించి బడి, బహుమతులు యివ్వబడినాయి. ప్రసూతి, శిశుపోషణ గురించి, పోస్టర్లు, పటాలు చూపబడ్డాయి. రాత్రి మేజిక్ లాంతరున్ ప్రదర్శన

జరిగింది. గ్రామ బాల సంఘం వారు బుర్రకథ చెప్పారు. విమానదాడి రక్షణ, మంటల నార్పుట (స్టిరప్ పంపు) బట్టలు అంటుకున్నప్పుడు నేలమీద పడి ఎలా దొర్లవలసిందీ, మేడపై నుండి తాడు సహాయంతో క్రిందికి దింపడం, మున్నగునవి ప్రదర్శించారు.

26వ తేదీ సాయంత్రం జరిగిన బహిరంగ సభలో ఆహ్వాన సంఘాధ్యక్షులు మాలెంపాటి శారదగారు మహాసభ సన్నాహాల గురించి తెలిపారు. 30 గ్రామాలలో మహిళా సభ గురించి జరిగిన ప్రచారం గురించి తెలిపారు. ధన, వస్తు రూపంలో విరాళాలు వచ్చాయని తెలిపారు. శ్రీమతి దర్శి సుభద్రమ్మ తమ ప్రారంభోపన్యాసంలో, శ్రీ మతి మానికొండ సూర్యావతి తమ అధ్యక్షోపన్యాసంలో ప్రస్తుత అంతర్జాతీయ దేశీయ పరిస్థితులు వివరించి స్త్రీలు ఎదుర్కొంటున్న ఆహార సమస్య, సాంఘిక యిక్కట్లు వీటిని ఏ రీతిగా పరిష్కరించ వలసిందీ, దానికి స్త్రీల సంఘాలు ఎలా కృషి చేయవలసిందీ వివరించారు.

జాతీయ ప్రతిష్ఠంభనను తొలగించి, జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పరచుకోవడానికి చేయాల్సిన పనిని గూర్చి, హిందూ లా సవరణ చట్టాన్ని, స్త్రీలకు పురుషులతో బాటు అన్ని విషయాలలో సమాన హక్కులు యిచ్చేటట్లు సవరించి అసెంబ్లీలో త్వరగా ఆమోదించాలని, అందుకు స్త్రీలు ఆందోళన చేయాలనీ, ఆహార పదార్థాల వినియోగంలో శాస్త్రీయ పద్ధతులు శిశుపోషణలో జాగ్రత్తలు, ప్రసూతి సౌకర్యాలు, మరుగుదొడ్లు, స్త్రీల సంఘాలను అభివృద్ధి చేయడానికి ప్రజారక్షణ దళం, 25 మంది స్త్రీలు తమ పూర్తి కాలాన్ని మహిళా ఉద్యమ నిర్మాణానికి వినియోగించడం, కయ్యూరు కామ్రేడ్సుపై ఒక తీర్మానం, సోవియట్, చైనా స్త్రీలకు అభివందనాలు మున్నగు తీర్మానాలు చేశారు.

క్రొత్త సంవత్సరానికి శ్రీమతి మానికొండ సూర్యవతిని అధ్యక్షురాలుగాను శ్రీమతి వెల్లంకి అన్నపూర్ణమ్మ కార్యదర్శిగానూ, శ్రీమతి యలమంచిలి కమలమ్మ సహాయ కార్యదర్శిగాను ఎన్నుకోబడ్డారు. మరో 9 మందిని కార్యనిర్వాహక సభ్యులుగా ఎన్నుకొన్నారు.

—ప్రజాశక్తి, 5-5-1943

## గుంటూరు జిల్లాలో

గుంటూరు జిల్లా మహిళా సంఘం 1943 ఏప్రిల్ నుండి మే 20 వరకు జరిపిన కృషి ఫలితంగా 12 గ్రామ సంఘాలు ఏర్పడాయి. 645 మంది కొత్త సభ్యులు చేరారు. హిందూ లా సవరణ చట్టం గురించిన మహజర్లపై 2832

సంతాకాలు చేయించారు. 47 గ్రామాల్లో మహిళా సంఘం గురించి, ప్రచారం చేశారు. కా|| వేద్ మోటూరి ఉదయం, పద్మాక్షమ్మ గార్ల బుర్రకథ జట్లు చేస్తున్న ప్రచారం స్త్రీలను బాగా ఆకర్షిస్తున్నది.

## విశాఖ జిల్లాలో

విశాఖపట్నంలో జపాను విమానాల బాంబు దాడి జరిగిన తరువాత మంచి నీటి కుళాయిలు కొన్ని మూసివేశారు. పట్నాన్ని ఖాళీ చేసిన ప్రజలు తిరిగి వస్తున్నారు. వారికి మంచినీళ్ళులేవు. కా|| మేడప్ప సరోజ, లక్ష్మిగార్లు కుళాయిలు తిరిగి తెరువాలని మహజర్లపై సంతకాలు చేయించి వాటిని కమీషనర్‌కు పంపారు. బియ్యం సరఫరా గురించి కూడా వీరు కృషి చేస్తున్నారు.

## హిందూ లా సవరణకై మహజర్లు

హిందూ లా ను సవరించి వెంటనే అమలులో పెట్టాలని కోరుతూ సెలెక్టు కమిటీ రాష్ట్రమంతటనుండి క్రింది విధంగా 120 గ్రామాల నుండి 9526 మంది మహిళల సంతకాలతో మహజర్లు పంపబడినవి.

| జిల్లా | గ్రామాలు | సంతకాలు |
|---|---|---|
| కృష్ణా జిల్లా | 46 | 4797 |
| గుంటూరు | 44 | 2984 |
| తూర్పు గోదావరి | 11 | 730 |
| పశ్చిమ గోదావరి | 13 | 602 |
| చిత్తూరు | 2 | 116 |
| కడప | 1 | 77 |
| నెల్లూరు | 2 | 184 |
| కర్నూలు | 1 | 24 |
| | 120 | 9527 |

అనుబంధం - 1

# 1937 నవంబర్‌లో జరిగిన ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ తృతీయ వార్షిక సమావేశంలో ఆమోదించిన తీర్మానాలు

## 1. సోవియటు యూనియనుకు జేజేలు

20 ఏండ్ల క్రితం జమీందారుల క్రింద, పెట్టుబడిదారుల క్రింద, విదేశీయ సామ్రాజ్యవాదుల ఆర్థిక వత్తిడి క్రింద నలిగి నానాబాధలు పడుతూవున్న కోట్ల కొలది కార్మిక కర్షకులను మానవులగావించి, నూతన మనిషిని, నూతన సమాజాన్ని సృజిస్తూవున్న సోవియట్ యూనియనుకు మన అభివందనములు.

20 ఏండ్లలో ప్రపంచములో మరెచ్చటనులేని ఆర్థికసంపద విజ్ఞానాభివృద్ధి ప్రజాసామాన్య మంతటికీ కలుగజేసి, ప్రపంచమందంతట, శ్రమజీవుల ఆశా జ్యోతియై వెలిగే సోవియట్ యూనియనుకు జేజేలు.

పెట్టుబడిదారీ విధానాన్ని నాశనముగావించి, కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన కార్మిక కర్షక ప్రజాతంత్ర నియంతృత్వ స్థాపన మూలంగానే సోషలిస్టు సమాజాన్ని నేటికి (20 ఏండ్లకు) స్థాపించగల్గి ప్రపంచమందంతా విప్లవ జ్వాలలు ప్రజ్వరిల్ల జేసే సోవియటు యూనియనుకు మా జేజేలు.

విప్లవ జ్వాలలను ఆర్పుటకు సోవియటు యూనియనును పరమార్చుటే పరమోపాయమని సోవియటు యూనియనుపై కయ్యానికి కాలుదువ్వుతున్న జర్మనీ, జపాను, యిటలీ, బ్రిటిషు ప్రభుత్వముల ప్రయత్నాల నెదుర్కొని సోవియటు యూనియనుకు ఏ పరిస్థితులలోనైనా పూర్తిగా సాయపడడానికి శపథము చేస్తూ మేము సోవియటు యూనియనుకు పంపుచున్నాము మా జేజేలు.

సోవియటు స్నేహబృందాన్ని చీలదీయడానికి సోవియటు యూనియనుపై తీవ్రమగు వ్యతిరేక ప్రచారము సాగిస్తువున్న పెట్టుబడిదారీ పత్రికల వ్రాతలకు మేము మోసపోమనియు, సోవియటు రష్యాలోని పరిశ్రమలకు నష్టము కలిగే టట్లును, ప్రజలలో ఎట్టి పలుకుబడిలేని కొలది వ్యక్తులు సోవియటు ప్రభుత్వ

నాయకులను కుట్రగా హత్యగావించడానికి పన్నాగాలు పన్నుచుండ అట్టి వారిపై ప్రభుత్వము తీసుకొన్న చర్యలు గర్హనీయాలు కావనుచు సోవియటుయూనియనుకు పంపుచున్నాము మా జేజేలు.

తన లాభానికే ప్రయత్నిస్తున్నదని అనేకులనేదాన్ని తప్పు అని రుజువు చేస్తూ, ప్రపంచమునందన్ని ప్రభుత్వాలు వెనుకంజ వేసినా, స్పైన్, చీనాలకు తాను మాత్రం సాయం చేస్తూ వున్న సోవియటుకు మా జేజేలు.

ప్రపంచశాంతికి కారణమై ప్రపంచ సామ్రాజ్యవాద యుద్ధాన్ని రానివ్వ కుండ జేస్తూ ప్రతి దేశములోని విప్లవ శక్తులు విజృంభించడానికి అవకాశము కలుగుజేస్తూ ప్రపంచ విప్లవ పోరాటాన్ని పెంపొందింప జేసే సోవియటు యూనియనుకు మా జేజేలు.

## 2. రాబోవు యుద్ధము - మన కర్తవ్యము

నేడు ప్రపంచములోని ప్రతిదేశమూ తీవ్రంగా ఆయుధాలను పెంపొం దించుకుంటున్నది. నేడో రేపో ప్రపంచ యుద్ధము వచ్చే సూచన లగుపడు తున్నాయి.

స్పైనులో పీడితప్రజలయొక్క ప్రభుత్వముపై 15 మాసాలక్రితము ఫాసిస్టు రాజ్యాల ప్రోద్బలమువలన ఆరంభమైన ధనికుల, పెట్టుబడిదారుల తిరుగు బాటు ఇంకను సాగుతూవుంది. నేడు ఫాసిస్టు ప్రభుత్వాలు ఇటలీ, జర్మనీలు సైన్యాన్ని బహిరంగంగానే పంపి స్పైయినుపై యుద్ధము సాగిస్తున్నాయి. అయినను కూలీలు, రైతులు తదితర పీడిత ప్రజాసామాన్యముతో కలసి ఈ దాడిని జయప్రదంగా ఎదుర్కొంటూనే యున్నారు.

చీనాను కబళించాలని, జపానుయుద్ధము ప్రకటించకుండగనే చీనాపై దాడికివెడలి రోజురోజు అనేక పట్టణాలను ధ్వంసము చేస్తూ యుద్ధము చేయని మామూలు ప్రజలమీదకూడా బాంబులు వేసి చంపుతూవుంది చీనా ధైర్యంగా తన స్వాతంత్ర్యాన్ని కాపాడుకోవడానికి పోరాడుతూవుంది.

ఇటలీ జర్మనీ జపానులయొక్క ఈపోరాటాలు సోవియట్ యూనియన్‌పై దాడి వెడలడానికి మొదటి ప్రయత్నాలు. బ్రిటిషు ప్రభుత్వము వెనుకనుండి ఈ ఫాసిస్టు ప్రభుత్వాలకు సహాయం చేస్తూ వుంది.

## 3. కాంగ్రెసు మంత్రివర్గము

కాంగ్రెసు మంత్రిపదవులను స్వీకరించడంవలన పోరాటాన్ని ముందుకు తీసుకుపోగలమని మితవాద కాంగ్రెసు నాయకు లెన్నెన్నో చెప్పేవారు. సోష లిస్టులు అది అసంభవమని చాల ప్రమాదకరమగు విషయమనిన్నీ ఎదుర్కొ న్నారు. కాని వారి మాటను నిర్లక్షించి మంత్రిపదవులు కాంగ్రెసు అంగీకరించింది.

ఇప్పుడు తీవ్రవాద సంఘాలు, ముఖ్యంగా కాంగ్రెసు సంఘాలు కడు జాగ్రత్తగా తనిఖీ సాగించకపోయినచో సంపూర్ణ స్వాతంత్ర్య పోరాటానికి తీవ్రంగా దెబ్బ తగలటానికి అవకాశముందని ఈ సమావేశము యొక్క అభిప్రాయము.

కాంగ్రెసు మంత్రివర్గాలు రాజకీయఖైదీలను కొందరిని వదలివేసినను, పత్రికలు ధరావతులు తిరిగి ఇచ్చివేసినను కాంగ్రెసు తీర్మానాలను ఇంకను పూర్తిగా ఆచరణలోనికి తేలేదు. రాష్ట్రాలలో రాజకీయ ఖైదీలింకను అనేకమంది ఉన్నారు. రైతులకు కార్మికులకు కాంగ్రెస్ ఇచ్చిన కనీసపు హక్కులను బల పరుస్తూ ఇంతవరకు శాసనాలు కొలది రాష్ట్రాలలోనే చేశారు. అవికూడా చాల అసంతృప్తిగా ఉన్నాయి. పైపెచ్చు సమ్మెలనణచివేయడానికి నిర్బంధ శాసనాలు ప్రయోగిస్తూ ఉన్నారు.

మిగిలిన రాష్ట్రాలది యొకయెత్తు, మన మద్రాసు మంత్రులది మరియొక యెత్తు. మన మదరాసు మంత్రులు కావించిన ఈ క్రింది అవకతవకలుచూస్తే ఈ పనులన్నీ కాంగ్రెసు తీర్మానాలకెంత విరుద్ధంగా ఉన్నవో కాంగ్రెసు ప్రతిష్ఠకు ఎంత భంగకరమో విశదమవుతుంది. స్వాతంత్ర్య పోరాటాన్ని పెంపొందించ డానికి కాంగ్రెసు ప్రతిష్ఠను కాపాడవలసి వుంటుంది. దానికి భంగకరంగా పని చేసే రాజాజీమంత్రి వర్గము సరియైన మార్గాన వెళ్ళేవరకు ఈ క్రింది అవక తవకలను దిద్దుకొనేవరకు తీవ్రమైన ఆందోళన సాగించాలి.

1. క్రొత్తపట్టణము ఖైదీలను విడుదలచేస్తూ ప్రకటించిన కమ్యూనిక్‌లోని బెదరింపు, క్రొత్తపట్టణపు వేసంగి పాఠశాల మీద నిషేధపుటుత్తరవును ఇంతవరకు రద్దుచేయకపోవడం.

2. పత్రికలధరావత్తులు తిరిగి ఇచ్చివేస్తూ ఇచ్చిన ఆజ్ఞ, కలెక్టరులు ధరావతులుకోరితే, జోక్యము కలుగజేసికోమని అసెంబ్లీలో చెప్పడం, కొత్త పత్రి కలు బి. శ్రీనివాసరావు "సోషలిస్టు"కు రాజవడివేలుపతి పెట్టదలచుకొన్న ప్రెస్సుకు ధరావత్తులు.

3. న్యాయశాఖను ఎక్సిక్యూటివునుండి విడతీయనని చెప్పడము.

4. సి. ఐ. డి. రాజకీయశాఖ అవసరమని సి. ఐ. డిలు బహిరంగ సభలకు వెళ్ళడం, రిపోర్టులు వ్రాయడం, వ్యక్తులను వెంటాడడము తప్పనిసరి అని సమర్థించడము, కాంగ్రెసు సేవకులపైనను, ముఖ్యంగా సోషలిస్టులపైనను నిర్బంధాలన్నను ఎక్కువ కావించడము.

5. సివిలు సర్వీస్ కలెక్టరులు చాల ఆవశ్యకము అని పొగడడము.

6. రాజకీయాలలో శిక్షననుభవించినవారికి స్థానిక స్వపరిపాలనా సంఘా లలో ఉద్యోగము లివ్వడానికి అభ్యంతరాలను తెలిపే సర్క్యులరును తొలగించ నిరాకరించడము.

7. ఎన్నిక మీటింగులకు హాజరయ్యారని డిస్మిస్ చేయబడ్డ గ్రామోద్యోగుల విషయమై వారు కలెక్టరులకు, రెవిన్యూబోర్డుకు అప్పీలు చేసుకోవలసినదే గాని ప్రభుత్వానికి జోక్యములేదనడము.

8. గవర్నమెంటు ప్రెస్ వర్కరులు యూనియనును ఏర్పాటు చేసుకోడానికి వీలులేదనడము.

9. చక్రవర్తికి వ్యతిరేకంగా రాజద్రోహము పురికొల్పకూడదని, ప్రభుత్వము పోవాలనే ప్రచారము చేయకూడదని ఉద్యోగస్తులను, పోలీసులను మునుపటివలె విమర్శించరాదని రాజాజీ చెప్పడము.

10. కాంగ్రెసు మంత్రుల పాలనలో భారతదేశానికంతా మొదట ఇంటి సోదా కేరళలో నంబూద్రిపాద్ ఇంటలో జరిగించడము.

11. మారుటోరియమునైనా ఇంతవరకు అమలుజరుపకుండడము.

12. జమీన్‌రైతుల కష్టాలెరింగికూడా తిరిగి అనవసరంగా ఒక విచారణ కమిటీని నెలకొల్పడము.

13. రీసెటెల్మెంటులో ఎక్కువజేసిన పన్నును బీదరైతులపైని ఇన్లాక్షన్‌ఫీని (నజరానాను) ఇంతవరకు రద్దుచేయకపోవడము.

14. శాంతియుతంగా పికెటింగుచేస్తూవున్న కార్మికసోదరులను, పి. కృష్ణపిళ్ళను అరెస్టు చేయడము.

15. పుస్తకములపై నిషేధపుటుత్తరువులను తొలగించక కొన్నిటిపై తీసివేయ నిరాకరించడము.

16. శాసన ధిక్కారోద్యమములో వసూలుచేయబడ్డ జిమానాలను వాపసు చేయ నిరాకరించడం.

17. వీటినన్నింటిని తలదన్నేటిపని, సోదరుడు బాటిల్వాలాను 124 ఎ. క్రింద అరెస్టు చేయడము, శిక్ష విధించడము, ఈ శాసనబద్ధ కార్యక్రమము వైపునకు వెళ్ళిపోకదను, అరికట్టడానికి కాంగ్రెసు మంత్రులు కాంగ్రెసు తీర్మానాలకు విరుద్ధంగా పోకుండా చేయాలంటే దేశమంతటా రైతులు, కూలీలు, విద్యార్థులు, యువజనులు, స్త్రీలు తమ తమ కోర్కెలకొరకు అవి వచ్చేవరకు తీవ్రమయిన ఆందోళన గావించాలి.

రాజ్యాంగ విధానము మంత్రుల కడ్డము రావడము నిజమే. అయితే గవర్నరు అడ్డమువచ్చినప్పుడెల్లా ప్రజలకు మంత్రులు తెలుపాలి. తద్వారానే ప్రజల యొక్క కార్యారంభశక్తి ఇనుమడిస్తుంది. అందుచేతలిగే ప్రజావర్తిడిని ప్రజా సంఘాల ద్వారా తీవ్రతమము కావించగలము. ఈ విధంగా పోరాటాన్ని ముందుకు తీసుకుపోగలము కాని, కేవలం శాసనసభలద్వారా సంపూర్ణ

స్వాతంత్ర్యపోరాటాన్ని వృద్ధిగావించగలమనే నమ్మకము పోరాటాన్ని రద్దుగావించి, జాతీయ సంఘటనను పూర్తిగా భగ్నముగావించడానికి మార్గము తీస్తుందని మంత్రులు గ్రహించేటట్లు చేయాలి.

**4.** "కాంగ్రెసులోనుండి తగని వ్యక్తులను తొలగించివేయాలని, కాంగ్రెసులో తీవ్రవాదుల యొక్క న్యాయమగు కార్యాలను" హానికరములంటూ కాంగ్రెసులోను, బయటను కొంతమంది ప్రచారము చేయడమును ఈ సభ ప్రజలకు ముఖ్యంగా ఎత్తిచూపుతూవుంది. వీరియొక్క ఉద్దేశము, తీవ్రవాదులను ఈనెపముక్రింద ప్రజా సామాన్యమునుండి వేరుపరచడమై యున్నది. సామ్రాజ్య వ్యతిరేక సంఘటనలో చీలికలు కల్పించి భగ్నముగావించడానికి చేయబడే అట్టి ప్రయత్నాల నన్నిటిని చాల మెలకువతో ఎదుర్కోవాలని, సామ్రాజ్యవాద వ్యతిరేకులనందరిని ఈ సభ హెచ్చరిస్తూ వుంది.

కోపము కల్గించి, తప్పటడుగులను తీవ్రశక్తులచే వేయించడానికి చేసే వీరి ప్రయత్నాలకు తావియ్యకుండా, ఐక్య సంఘటన భగ్నమయ్యే పనులుగాని, మాటలుగాని వాడకుందురని హెచ్చరిస్తూ వుంది. వీరియొక్క అసమానతకుగాని, హ్రస్వదృష్టికిగాని గురికాకుండడానికి, దేశమందలి సామ్రాజ్యవ్యతిరేక సంఘాలన్నీ కడు జాగ్రత్తగా ఉండవలసిందిగా ఈ సభ కోరుతూ వుంది. ఆవిధంగా లేనిచో బ్రిటిషు సామ్రాజ్య వాదుల పంట పండినట్లే. స్నేహ పూర్వకముగా గావింపబడిన విమర్శనల పట్ల చూపబడుచున్న అసహనము మన పోరాటానికి హితకరమగును. అదేరీతి కాంగ్రెసు శిక్షణకు సంబంధించిన రూల్సును సంకుచితార్థముల గావించడము, దేశమందలి నిజపరిస్థితులకెట్టి సంబంధము లేకపోయినను, "సత్యము, అహింస" అనే ఆచరణకు సంబంధములేని నైతిక సూత్రములను గూర్చి అనవసరముగ గాని, మితిమీరిగాని ప్రచారము చేయడం కూడ మన పోరాటానికి వినాశకరములగును.

ఫెడరేషను :

**5.** మనదేశమును బానిసపద్ధతిలో అణచిద్రొక్కి యుంచుటకు, నూతన రాజ్యాంగ చట్టం యేర్పరచబడినది. ఇందులో ఫెడరేషన్ మిక్కిలి హానికరమైనది. మొత్తం రాజ్యాంగమును భగ్నముచేయుటకు కాంగ్రెసు పూనుకొని యున్నది. ఈ పనిని సాగించుటకే కాంగ్రెసు మంత్రివర్గము లేర్పడుటకు అ. భా. కాంగ్రెస్ సంఘం అనుమతి యిచ్చింది. మరొక వంక బ్రిటిషు ప్రభుత్వం ఫెడిరల్ రాజ్యాంగము నాచరణలోకి తీసుకొని రావటానికి, చురుకుగా వాతావరణము నేర్పరుచుకొంటున్నది. కాని కలకత్తాలో యిటీవల జరిగిన అ. భా. కాంగ్రెసు సంఘములో ప్యాసయిన ఫెడరేషన్ మీది తీర్మానాన్నిబట్టి కాంగ్రెసు

మితవాదనాయకులు రాజ్యాంగము భగ్నముచేయు విషయం మరుగుపరుస్తున్నారనే సందేహము గలుగుచున్నది. కాని కాంగ్రెస్ తన ప్రధానకర్తవ్యం నెరవేర్చడానికి అనగా ఈ బానిస రాజ్యాంగమును భగ్నమొనర్చడానికి బ్రిటిషుప్రభుత్వము వారు ఫెడరల్ రాజ్యాంగము నమలుపరిచేయడల, కాంగ్రెసుమంత్రులు రాజీనామా యిచ్చి, ప్రజా ప్రత్యక్ష నిరోధక చర్యను సాగించవలసినది గను, స్వదేశీ సంస్థానములలో ప్రజల పౌరసత్వ హక్కులకై గావించబడుచున్న పోరాటాన్ని బ్రిటిషు ఇండియాలో బానిసరాజ్యాంగ విధానానికి వ్యతిరేకంగా జరుగుతూఉన్న పోరాటాన్ని జతపరచవలసినదిగను రాబోవు హరిపుర కాంగ్రెసు సమావేశము తీర్మానించవలసిందని కోరుచూ దానికి సోషలిస్టులు ఈ రోజునుండి తీవ్రమైన ఆందోళన సాగించవలెనని తీర్మానించుచున్నారు.

**6.** స్వదేశ సంస్థాన ప్రజలు తమ రాజకీయ హక్కులకొరకై ప్రస్తుతం అఖిల భారత స్వదేశసంస్థాన ప్రజల సమావేశములో ఆందోళన చేయుచున్నారు. సంస్థాన ప్రజల ఆర్థిక రాజకీయ హక్కులు ప్రతి నిముషమునకు నిరోధింపబడు చుండుట మూలమున అచ్చట ప్రజలు చాల వెనుకబడియున్నారు. ప్రపంచము లోని అన్ని దేశములలోను ఫ్యూడల్ విధానం మీద ప్రజలు విప్లవము లేవదీసి ఆ విధానమును రద్దుచేసి యుండగా భారతదేశములో సామ్రాజ్యవాదులు తమ సామ్రాజ్యము సుస్థిరమైన పునాదులపై నుంచుటకుగాను దేశములో అమలులో నుంచిన యీ స్వదేశీ సంస్థాన, జమీందారీ పద్ధతులను పోగొట్టవలెనన్న సంస్థాన ప్రజలేగాక బ్రిటిషుప్రాంత ప్రజలు కూడా ఆందోళన చేయవలసి యుండును.

ఈ ప్రధాన విషయములో జాతీయ కాంగ్రెస్‌లో మేము మా సానుభూతిని తెలుపుచున్నామని మాత్రమే తెల్పుట చాలదనియు ప్రత్యక్ష పోరాటములో సంపూర్ణ సహాయమును చేసెదమనియు కాంగ్రెస్‌వారు తెల్పుట అత్యవసరము.

**7.** ఆంధ్రదేశాన్ని ప్రత్యేక రాష్ట్రముగ జేయడము ఆంధ్రదేశమునందలి ప్రజాసామాన్యముయొక్క రాజకీయ చైతన్యానికి, పోరాటానికి చాలా సహాయకారి కాని వెంటనే కాంగ్రెస్ మంత్రులు అఖిలభారత కాంగ్రెస్ కమిటీ తీర్మానానుసారం ఆంధ్రదేశాన్ని ప్రత్యేకరాష్ట్రముగా చేయడానికి తగిన ప్రయత్నాలు చేయాలి.

**8.** ఈ క్రింది పుస్తకాలపైనను తదితర నిషేధించిన పుస్తకాలపైనను నిషేధపుటాజ్ఞలను వెంటనే తొలగించమని మద్రాసు ప్రభుత్వాన్ని ఈ సభవారు కోరుచున్నారు.

1. సామ్రాజ్యవాదము, 2. కమ్యూనిస్టు కరపత్రము, 3. నీతిమంజరి, 4 బార్డోలి విజయం, 5. మార్క్సు ఉపదేశాలు, 6. ప్రభుత్వ ధనము, మన బీదతనము, 7. స్వప్న ప్రయాణము, 8. రాజనీతి సారం.

**9.** మద్రాసు కాంగ్రెసు మంత్రివర్గమువారు బొంబాయి కార్మికనాయకుడైన బాటిల్వాలాగారిని ఇదివరకు కాంగ్రెసుచే నిరసింపబడినట్టిన్నీ ఎలెక్షను ప్రణాళికలో రద్దు చేయాలని నిర్ణయించబడినట్టిన్నీ 124 ఎ సెక్షనుక్రింద అరెస్టు చేయుటయు శిక్షవిధించుటయు కాంగ్రెసు పాలసీకి విరుద్ధమని బ్రిటీష్ ప్రభుత్వంపై అవిశ్వాసం బోధించడము సంపూర్ణ స్వాతంత్ర్యము కోరేవారందరి విధి, కాబట్టి కాంగ్రెసు ఏజెంట్లుగా పనిచేయవలసిన కాంగ్రెసు మంత్రివర్గము అందులకు చర్యగైకొనుట అక్రమమని ఈ సభవారు భావించుచు అఖిలభారత కాంగ్రెస్ కమిటీ ఈ అరెస్టుకు, శిక్షకు కారకులైన రాజగోపాలాచారిగారిపై డిసిప్లనరీ చర్యగైకొనవలెనని అ.భా.కాం. కమిటీలో తీర్మానము తీసుకొని రావలసినదిగా తత్సంఘ సభ్యులైన కాంగ్రెసు సోషలిస్టులను ఈ సభవారు కోరుచున్నారు. బాటిల్వాలాగారిని ఎట్టి షరతులు లేక వెంటనే విడుదల చేయవలసినదిగా మద్రాసు ప్రభుత్వమును ఈ సంఘమువారు హెచ్చరించుచున్నారు. బాటిల్వాలాను విడుదల చేసే వరకు తీవ్రమైన అందోళన గ్రామగ్రామాన సాగిస్తూ వుండవలసినదిగా సోషలిస్టులను హెచ్చరిస్తూ వుంది. ఈ అందోళనలో కాంగ్రెసు సంఘాలు, కార్మిక కర్షక స్త్రీ, యువజన విద్యార్థి సంఘాలు పాల్గొనుగాక అని కోరుతూ ఉంది. ఈ అందోళనకు ప్రధాన నినాదము "బాటిల్వాలాను విడుదలైనా చేయండి లేక రాజీనామానైనా ఇవ్వండి".

**10.** ప్రజాసేవకులపైనను ముఖ్యంగా సోషలిస్టులపైనను ఈ మధ్యనే కాంగ్రెస్ మంత్రివర్గము క్రిందనే సి.ఐ.డి.ల సర్వైలెన్సు (వెంటాడుట) హెచ్చు చేయబడుట, రాజగోపాలాచారిగారు బ్రిటిషు పతాకం యిచ్చట ఎగురుచుండగనే ప్రభుత్వం తమది అనియు, సి ఐ డీ లు ప్రజలేమిచేయుచున్నది తెలుసుకొనుటకు అవుసరమనియు తెలుపుట, ఎన్నో మార్పులు ఎంత లేని కల్పనలైన సృష్టించగలరని ఋజువుచేయబడిన సి ఐ.డి. శాఖవారి రిపోర్టులపై ఆధారపడదలచుటయు స్వాతంత్ర్యోద్యమానికి విఘాతము కలిగించుట అని యీ సభవారు తలంచుచు ప్రజాసేవకులు ముఖ్యంగా సోషలిస్టులను సి.ఐ.డీ.లు వెంటాడుటను వెంటనే మాన్పించవలసినదిగా కాంగ్రెసు మంత్రులను హెచ్చరించుచున్నారు.

**11.** బొంబాయి కాంగ్రెసు మంత్రివర్గమువారు షోలాపూరు,అహమ్మదాబాదు నగరములలో 144 సెక్షను ప్రయోగించుట, అహమ్మదాబాదులో కార్మికుల సమ్మె సందర్భమున 1932 ఎమర్జెన్సీ పవర్సుయాక్టును, క్రిమినలులా అమెండుమెంటు యాక్టును ప్రయోగించుట, కాంగ్రెసు ప్రతిష్టకు భంగకరమనియు, ఎన్నికల ప్రణాళికకు వ్యతిరేకమనియు అభిప్రాయపడుచూ వీనిని వెంటనే ఉపసంహరించుకోవలసినదిగా యీ సభవారు కోరుచున్నారు.

**12.** క్రిమినలు ట్రైబ్స్ఆక్టు కూలీలయొక్క ప్రజలయొక్క ప్రాథమిక హక్కులకు భంగకరముగాన దానిని వెంటనే రద్దు చేయవలెనని ప్రభుత్వమును ఈసభవారు కోరుచున్నారు.

**13.** మద్రాసు ప్రభుత్వం 23-9-37 న ప్రకటించిన మారుటోరియం బిల్లును కాలనిర్ణయంలేకుండా వాయిదా వేయుటవల్ల ఋణగ్రస్తులకు అపారనష్టము వాటిల్లుచున్నదనియు, ఋణదాతలు సొమ్మును రాబట్టుకొనుటకై అన్నివిధములైన యిబ్బందులను కలిగించుచున్నారనియు, ప్రభుత్వదృష్టికి తెస్తూ వెంటనే ఋణములను రాబట్టుకొనుటకై చేయు అన్నివిధములగు చర్యలను ఆపుతూ వెంటనే ఒక ఆర్డినెన్సును ప్రకటించ వలసినదనియు, ఆ ఆర్డినెన్సు జూలై 14 వ తేదీ నుండి అమలులో నున్నట్లు ప్రకటించవలెననియు యీసభవారు ప్రభుత్వమును కోరుచున్నారు.

## కూలీ రైతు సమస్య

**14.** తమవలెను, తమకంటెను హీనమైన జీవితాలు గడుపుచున్న కూలీలు సంఘముల నేరుచుకొనుటను గాంచి అనవసరంగా రైతులు భయపడి వారిని అణగద్రొక్కుటకు ప్రయత్నించి, భూస్వాముల జమీందారుల మాయలలోపడి కూలి సంఘముల స్థాపించువారిపై కేసులను పెట్టుటకు, బ్రిటిషు ప్రభుత్వపు సహాయము కోరుట పొరపాటని భావించుతూ సంపూర్ణ స్వాతంత్ర్యమునుకోరుప్రతి రైతునుకూలీ సంఘములకు అడ్డుతగులక యిద్దరునుకలిసి జమీందారులకు బ్రిటిషు ప్రభుత్వమునకు వ్యతిరేకముగా తమతమ సంఘాలద్వారా కష్టాలను బాపుకొనుటకు ప్రయత్నించవలెనని యీసభవారు కోరుచున్నారు.

రాష్ట్రమందంతటను వ్యవసాయకూలీ సంఘాలను విరివిగా స్థాపించడానికి పార్టీసభ్యులు పూనుకోవాలి. రాష్ట్ర వ్యవసాయకూలీ సంఘాన్ని ఏర్పాటు చేయవలయును.

## విద్యా నిబంధనలు

**15.** మద్రాసు ఎడ్యుకేషనల్ రూల్స్ ఎనిమిదవ అధ్యాయము విద్యార్థుల రాజకీయవికాసమునకు చాల అభ్యంతరముగాను, వారి సామాన్య పౌరస్వాతంత్ర్యమునకు భంగకరముగా వున్నదిగాన అట్టి నియమములతో కూడిన ఎనిమిదవ అధ్యాయము ఎడ్యుకేషనల్ రూల్స్ నుండి తొలగించవలసినదిగా యీసభవారు మద్రాసు ప్రభుత్వమును హెచ్చరించుచున్నారు.

అధ్యాయం-8 (మదరాసు ప్రభుత్వం ప్రకటించిన విద్యానిబంధనలు. సం॥)

# శిక్షాచర్యలు

**కళాశాలలు**

93. రాజభక్తిలేని కార్యాలకు ఒక కోర్టులో శిక్షించబడిన ఏ విద్యార్థినైనను, ప్రభుత్వము యొక్క అనుమతిని ముందు పొందక, కళాశాలలోకి చేర్చుకోరాదు. ప్రభుత్వాధికారానికి వ్యతిరేకంగా సాగించబడే రాజకీయ ఆందోళనలో కళాశాలలో వుండే పట్టభద్రులుగాని, పట్టభద్ర బిరుదుకై చదివే వారు గాని పాల్గొనరాదు. విద్యార్థిదశలో ఉండే వ్యక్తులు సంబంధముంచుకోరాదని కనబడే ఏ ప్రజా ఉద్యమంలో కూడా విద్యార్థులు పాల్గొనరాదని, కళాశాలాధ్యక్షులు (ప్రిన్సిపాల్స్) తమ సొంత విచక్షణ నుపయోగించి నిషేధించవచ్చును.

94. కళాశాల విద్యార్థులు రాజకీయ సభలకు వెళ్ళి అచట నిషేధించబడిన రీతిగాగాని, విద్యార్థికి తగిన రీతిగాగాని కళాశాల యొక్క విద్యాకార్యక్రమానికి గాని, కళాశాలా సమిష్టి జీవితానికి గాని, అడ్డుతగిలే రీతిగా రాజకీయ ఆందోళనలో పాల్గొనిన ప్రిన్సిపాలు అట్టి విద్యార్థిని సస్పెండు చేయవచ్చు లేదా పూర్తిగా కళాశాలనుండి పంపివేయవచ్చు. టెరమ్ సెర్టిఫికేటులను కొంత నియమిత కాలము వరకు ఇవ్వ నిరాకరించవచ్చు. వారి విషయమై విశ్వవిద్యాలయాధికారులకు విశ్వవిద్యాలయ నిబంధన క్రింద చర్యతీసుకోవడానికి రిపోర్టు చేయవచ్చు.

95. కళాశాలలో ఉన్న పట్టభద్రుల యొక్క పట్టభద్ర బిరుదుకై చదివే వారి యొక్క ప్రవర్తన కళాశాల యొక్క గాని, హాస్టలు యొక్కగాని ఆవరణలో నియమిత మొనరించడానికి, కళాశాలాధ్యక్షులుగాని, (ప్రిన్సిపాలుగాని) హాస్టలు అధికారులుగాని అప్పటికప్పుడు శిక్షానిబంధనలను, శాశ్వతముగ గాని, తాత్కాలికముగ గాని ఏర్పరచవచ్చును.

96. వీరు అట్లే కళాశాల హాస్టలు బయట, 93, 94 సెక్షనులో చెప్పబడిన నియమాలను పాటించేటట్లు చేయడానికి కళాశాల యొక్కగాని, హాస్టలు యొక్క గాని గౌరవాన్ని, పేరును కాపాడడానికి కావలసిన నియమాలను ఏర్పరచవచ్చును.

97. కళాశాలాధ్యక్షులు, హాస్టలు అధికారులు ఈ క్రింది శిక్షలు విధించ డానికి పూర్తి అధికారము కలిగి ఉందురు జరిమానాలు, హాజరైన దినాలు హాజరు కానట్లు గుర్తుపెట్టడము, టెరమ్ సర్టిఫికేటుల నివ్వ నిరాకరించడము, విద్యార్థులను తాత్కాలికంగా తొలగించడము, పూర్తిగా తొలగించడము.

98. కళాశాలలోని అధ్యాపకులు, (ప్రొఫెసర్లు, లెక్చరర్లు) రాజభక్తి లేనట్టి గాని, అయిష్టము. అసంతృప్తి రేకెత్తించగలిగినట్టి భావాలను విద్యార్థులలో కలుగజేసినా, విద్యార్థుల మనస్సులను రాజకీయ ఆందోళనకు మరల్చినా, రాజకీయ సభలకు హాజరు కమ్మని ప్రోత్సహించినా లేక తానే వారిని అట్టి సభలకు తీసుక

పోయినా, తాను ఉద్యోగములో నున్న కళాశాల యొక్క పనిని, జీవితాన్ని అల్లకల్లోలము గావించ గల్గిన కార్యవిధానాన్ని అవలంభించినా, అతని చర్యలు అతని విధ్యుక్త ధర్మము నుల్లంఘించినట్లు పరిగణింపబడి తగురీతిని, చర్యకు గురియగును.

రికగ్నైజ్డు స్కూలుస్ :

99. ముందుగా ప్రభుత్వపుటనుమతి లేనిదే, కోర్టుచే రాజభక్తిలేని కార్యాలకు శిక్షించబడిన విద్యార్థిని పాఠశాలలో చేర్చుకోకూడదు. ఒక సంస్థయొక్క మేనేజరుగాని దానిలోని ఉద్యోగిగాని, అధ్యాపకుడుగాని ప్రభుత్వాధికారానికి వ్యతిరేకంగా రాజకీయాందోళనలో పాల్గొనుటకు వీలులేదు. అట్లే రాజభక్తి లేనట్టిగాని, అయిష్టము కలిగించేటట్టిగానీ భావాలను కలిగించడానికి కూడా వీరికి వీలులేదు. విద్యార్థులకు రాజకీయ సభలకు పోనివ్వకూడదు. వారిని ఎట్టి రాజకీయాందోళనలోను పాల్గొననివ్వకూడదు.

100. అధ్యాపకులచేగాని, మేనేజింగు అధికారులచేతగాని, అట్టి ప్రవర్తన కొనసాగించబడుతుండినా, ప్రోత్సాహించబడుతుండినా లేక అనుమతించబడుతుండినా, డైరెక్టరు ఆఫ్ పబ్లిక్ ఇనస్ట్రక్టరు హెచ్చరిక గావించి అట్టి తప్పిదము చేస్తూ ఉన్న స్కూలును గుర్తించకుండవచ్చు. దానికి ఇస్తూ ఉండిన సహాయాన్ని మానివేయవచ్చు లేదా గవర్నమెంటు స్కాలరుషిప్పుకు పోటిచేయు హక్కుగాని, గవర్నమెంటు, విద్యాధికులను పొందేహక్కుగాని లేకుండా జేయవచ్చు.

101. ఉపాధ్యాయుని యొక్క బహిరంగ భాషణలు అతని యాజమాన్యమును నున్న బాలుర యొక్క నియమితానుబద్ధ (ఆర్డర్‌లీ) అభివృద్ధికి భంగకరమయ్యేవి అయిననూ అధికారత యెడల వారికి గల గౌరవమును భగ్నమొనర్చేటట్టు ప్రజలగా ఉండడానికి వారి ప్రయోజకత్వానికి భంగమును కలిగించేటట్టి భవిష్యజ్జీవనములో వారి పురోభివృద్ధికి అడ్డు తగిలేటట్టి సిద్ధాంతాలను విద్యార్థుల అపరిపక్వ మనస్సులలో జొప్పించినా, రాజకీయ సభలకు తానే విద్యార్థుల తీసుకుపోయినా, లేక అట్టి సభలకు వారు హాజరుకావడానికి ప్రోత్సాహించినా, అతని చర్యలు, అతని కర్తవ్యానికి భంగకరమని తీసుకొనబడును. దానికి తగిన శిక్షాచర్యలకు పాత్రుడగును.

**16.** ఈ నెల 14 వ తేదీన మన మద్రాసు కాంగ్రెసు అసెంబ్లీ పార్టీ వారు అత్యధిక సంఖ్యాకులతో ప్రధాన మంత్రి, రాజగోపాలాచారిగారు మన ప్రాంతమున శాంతిభద్రత కాపాడుటకొరకు చేసిన చర్యను ఆమోదించుచు వారిపై సంపూర్ణ విశ్వాసమును ప్రకటించి యున్నారు. ఇది కామ్రేడ్ బాట్లీవాలా గారి అరెస్టు విషయములో కాంగ్రెసు మంత్రివర్గము వారు యిచ్చిన అనుమతిని,

శాంతిభద్రత కాపాడుటకు అని చేసిన యితర చర్యలను సమర్థించుటయే యగును.

బాట్లీవాలాగారి అరెస్టు తరువాత దేశములో ముఖ్యముగా మన ప్రాంతములో, వివిధ ప్రజా సంఘాలు, ప్రజాసభలు, చాలాచోట్ల కాంగ్రెసు సంఘములు, కాంగ్రెసు మంత్రివర్గము వారి చర్యలకు అసమ్మతిని చూపి ఆయన విడుదలకు ఆందోళన చేసియున్నారు.

యీ సంగతి తెలిసియు ప్రజలచే ఎన్నుకోబడిన మన కాంగ్రెసు శాసన సభా సభ్యులు ప్రజాభిప్రాయమునకు వ్యతిరేకముగా పై తీర్మానమును ప్యాసు చేయుట అసమంజసమని అభిప్రాయపడుచు సామ్రాజ్య వ్యతిరేకులందరు, కాంగ్రెసు సంఘాలు, యితర ప్రజా సంఘాలు బహిరంగ సభలలో యీ మన శాసనసభ్యుల యొక్క యీ ఆమోదపు చర్య యెడల తమ తీవ్ర అసమ్మతిని చూపవలసినదిగా యీ సభవారు కోరుచున్నారు.

**17.** రాయలసీమలో కొన్ని జిల్లాలలో అనగా కడప, బళ్ళారి మొదలగు జిల్లాలలో వర్షములులేక పంటలు చాలా చెడిపోయి కరువు తాండవమాడుచున్నది. గాన వెంటనే ప్రభుత్వమువారు ఒక అనధికార విచారణ సంఘమును నియమించి వారి సూచనల ప్రకారముగా రైతులకు శిస్తుల ముజరాల నిప్పించియు, పని లేని వారికి పనిని చూపించియు ఏర్పాటు చేయవలెను. లేనిచో కాంగ్రెసు ప్రతిష్టకు తీరని కష్టములు కలుగునని ఈ సభవారు తీర్మానించుచున్నారు.

**18.** హైదరాబాదు రాష్ట్రములో రాజ్యాంగ సంస్కరణ విచారణ జరుగుచున్న తీరు విచారణ రహస్యంగా చేయుచున్న పద్ధతిని ఈ సభవారు తీవ్రంగా నిరసిస్తూ, ఆ రాష్ట్రములోని ప్రజా పక్షము లన్నిటి అభిప్రాయమును బహిరంగముగ తీసుకొనుట అత్యావసరమని అభిప్రాయపడుతున్నారు.

## రాబోవు కాంగ్రెసు కమిటీ ఎన్నికలు

**19.** రాష్ట్ర మంతటా కాంగ్రెసు కమిటీ ఎన్నికలు యిక నెలకు రాబోవుతున్నాయి. మన రాష్ట్రంలో కాంగ్రెసులో చేరిన 3½ లక్షల సభ్యులలో తీవ్రమైన ఆందోళన సాగించాలి. కాంగ్రెసు సోషలిస్టులు సరియైన కాంగ్రెసు వారనీ, సంపూర్ణ స్వాతంత్ర్య పోరాటాన్ని పెంపొందింపచేయడానికి కాంగ్రెసును సరియైన మార్గాన పోవునట్లు చేయగలిగింది వీరియొక్క యీ క్రింది కార్యక్రమమేనని, కాంగ్రెసు కార్యక్రమాన్ని సోషలిస్టులు సరిగా ఆచరణలో పెట్టుచున్నారనిన్నీ కాంగ్రెసు సభ్యులందరు గ్రహించేటట్లు ప్రచారము సాగించవలసి యుంటుంది.

కాం||గెసు నిర్మాణము

సంఘ ప్రాతినిధ్యాన్ని కాం||గెసు అంగీకరించాలి. సంఘాలలోని సభ్యుల సంఖ్య ననుసరించి వెంటనే యివ్వకపోయినను, ఆంధ్ర రాష్ట్ర కాం||గెసు వర్కింగు కమిటీ అంగీకరించిన ఈ క్రింది ప్రణాళికనైనా అంగీకరించాలి.

## సంఘ ప్రాతినిధ్య ప్రణాళిక

ఎ. 1. ప్రతి గ్రామ కాం. సంఘ కార్యనిర్వాహకవర్గమునకు ఆ గ్రామంలోని రైతు, కార్మిక, స్త్రీ సంఘములు 25 మంది సభ్యులు తక్కువగాకుండ నున్నచో సంఘమునకు ఒక ప్రతినిధి వంతున పంపవచ్చును.

బి. 1. తాలూకా కాం. సంఘమునకు ప్రతి తాలూకా రైతు సంఘము, కార్మిక, స్త్రీ సంఘములు 100 మంది సభ్యులకు తక్కువ కాని సభ్యులు కలిగియున్నచో తాలూకా సంఘమునకొక ప్రతినిధివంతున ఎన్నుకోవచ్చును.

2. తాలూకాలోని గ్రామ కాం. కార్యనిర్వాహక సంఘములోని రైతు సంఘ ప్రతినిధులు, అలాగే కార్మిక, స్త్రీ సంఘ ప్రతినిధులు ఒక్కొక్క సభ్యుని తాలూకా కాం. సంఘమునకు ఎన్నుకోవచ్చును.

సి. 1. పట్టణములోని వివిధ డివిజనల్ కాం. కార్యనిర్వాహక వర్గములకు డివిజనులో నుండు కార్మిక, స్త్రీ సంఘములు ఒక్కొక ప్రతినిధివంతున ఎన్నుకొనుటకు హక్కుగలదు.

2. పట్టణకాం||గెసు సంఘములో వివిధ డివిజనల్ కాం. కమిటీలలోని వివిధ సంఘ ప్రతినిధులు సభ్యులమ్యేదరు.

డి. 1. జిల్లా కాం. సంఘమునకు జిల్లాలోని తాలూకా పట్టణ కాం||గెసు సంఘములలో నుండు రైతు, కార్మిక, స్త్రీ సంఘ ప్రతినిధులు ఒక్కొక్క సంఘమునకొక్కొక్క ప్రతినిధిని ఎన్నుకోవచ్చును.

2. 500 సభ్యులకు తక్కువకాని జిల్లా రైతుసంఘము, కార్మిక, స్త్రీ సంఘములు జిల్లా కాం. సంఘమున కొక్కొక్క ప్రతినిధిని ఎన్నుకొని పంపుకొనవచ్చును.

ఇ. 1. రాష్ట్ర కాం||గెసు సంఘమునకు జిల్లాకాం||గెసు కమిటీలలోనుండు, రైతు కార్మిక, స్త్రీసంఘ ప్రతినిధులు ఒక్కొక్క సంఘమునకొక్కొక్క ప్రతినిధిని ఎన్నుకొనవచ్చును.

2. రాష్ట్ర కార్మిక, రైతు, స్త్రీసంఘాలకు 1000 మందికి తక్కువకాని సభ్యులున్నచో ఒక్కొక్క సంఘమునకు ఒక్కొక్క ప్రతినిధిని ఎన్నుకొనవచ్చును.

యఫ్. 1. యీవిధముగా ఎన్నుకోబడిన రైతు, కార్మిక, స్త్రీ సంఘ ప్రతినిధులు కాంగ్రెసు సభ్యులు కావలెను.

2. యీ వివిధ సంఘములు సంపూర్ణ స్వాతంత్ర్యమే తమ ఆదర్శమని ప్రత్యేక తీర్మానరూపమున ప్రకటించిననే ప్రతినిధులను ఎన్నుకొనుటకు హక్కు గలిగియుండును.

3 కాంగ్రెసు కమిటీలకు ఎన్నుకోబడినవారిని ఎన్నుకొన్నవారు తమ యిష్టమువచ్చినపుడు మొత్తము సభ్యులలో నూటికి 50 మందికి పైగా ఓట్లున్నచో తొలగించి వారిస్థానే కొత్తవారిని ఎన్నుకోడానికి హక్కుండాలి.

4. పై కమిటీలు సమావేశము కావడానికి కనీసము ఒక నెలరోజులు ముందు తీర్మానములను ప్రకటించి క్రింద కమిటీల అభిప్రాయాలను తెలిసికోడానికి పంపాలి.

5. ఖద్దరు వేసుకొనడము సంపూర్ణ స్వాతంత్ర్యమునకు మార్గముకాదు. కాని ఇంతవరకు ఖద్దరు కట్టటమే స్వాతంత్ర్య యోధులకు, స్వాతంత్ర్య పోరాటానికి, ప్రధాన చిహ్నముగా పరిగణింపబడుతూ వచ్చినది. అందువలననే ఖద్దరు కట్టుకొనేవారు మాత్రమే ప్రతినిధులుగా ఎన్నుకోవలెనని కాంగ్రెసు కమిటీలలో నియమమేర్పడ్డది. అటువంటి నియమముండడం వోటర్ల ప్రధాన హక్కులను నిరోధించడం సాధారణంగా ప్రతి ఎన్నికలోనూ ప్రతివోటరూ ఎన్నుకోడానికి ఎన్నుకోబడడానికి అర్హుడు, కాన కాంగ్రెసు నియమావళిలో అందుకు భిన్నంగా వుండడం న్యాయంకాదు. ఖద్దరు కట్టినా, ఆర్థిక కారణాలవల్లకానీ తదితర కారణాలవల్లకానీ కట్టజాలకకోయినా కాంగ్రెసు సభ్యుడైన ప్రతిమనిషికి ఎన్నుకోబడడానికి కూడా అర్హత ఉండాలి.

## కాంగ్రెసు వెంటనే ప్రజలకు ఈ హక్కులను వచ్చేటట్లు చూడాలి

## 1. రైతుకోర్కెలు :

**అప్పులు :**

1. అప్పులమీద, డిక్రీలమీద, కోర్టులలోని కేసులమీద వెంటనే మారిటోరియమును ప్రకటించవలయును. అప్పుల విషయమై సమగ్రమగు శాసనము వచ్చేవరకు మారిటోరియము అమలులో ఉండాలి.

2. అప్పులు చెల్లించనందులకు అరెస్టు చేయకూడదు.

3. అసలు పెట్టుబడిమీద జరిగిన కాలము పన్నెండు సంవత్సరములు మించినంతవరకు, జరిగిన కాలంలో సంగభాగమీదనే వడ్డీ లెక్కించవలయును. పన్నెండు సంవత్సరాలు పైబడిన కాలమునకు వడ్డీ అసలే లెక్కించరాదు.

పత్రముమీద ఎట్టి వడ్డీరేటు ఉదహరించబడినను లెక్కింపదగిన కాలము మీద వందకు సంవత్సరానికి రూ. 3-0-0 వడ్డీకన్న ఎక్కువ కట్టరాదు.

పై ప్రకారము తేల్చబడిన అసలు వాయిదాలు మొత్తమును ధరల పతనము ననుసరించి తగ్గించగా వచ్చిన మొత్తమును ప్రభుత్వమే బాకీదారులకు చెల్లించ వలయును. 60 సంవత్సరములలో సంవత్సరమున కింతయని పరిమితి నియ మించి వసూలు చేసుకొనవలయును. వడ్డీ నూటికి సం॥నకు 3 రూ॥ల కన్న ఎక్కువ ఉండరాదు.

4. వడ్డీగాగాని, అసలులోకిగాని బాకీదారుడు తాను అప్పుతెచ్చిన మొత్తా నికి రెండింతలు కట్టినచో, మిగిలిన అప్పునంతను రద్దుచేయాలి.

5. ఇకముందు అప్పులకు నూటికి రూ. 6-0-0 ల కన్న వడ్డి యుండ రాదని శిక్షణార్హమగునని శాసించవలయును. వడ్డీవ్యాపారస్థులకు లైసెన్సులను ఏర్పరచవలయును.

6. నూటికి 4 శాతంకు ఎక్కువకాని వడ్డీకి రైతులకు అప్పులు ప్రభు త్వము ఇవ్వాలి.

**భూమిశిస్తులు :**

1. బాకీపడియున్న మగతాలను, శిస్తులను రద్దుచేయాలి.

2. ప్రస్తుత శిస్తువిధానాన్ని మార్చి పొలముమీదవచ్చు ఆదాయము ననుసరించి పన్ను విధించాలి.

250 రూ॥ల లోపు ఆదాయము వచ్చు రైతులపై పన్ను వేయరాదు.

2505-00 రూ॥ల ఆదాయము వచ్చు రైతులపై నూటికి 20 రూ॥ల వంతున పన్ను వేయాలి.

500 - 1000 రూ॥ల లోపల ఆదాయము వచ్చు రైతులకు నూటికి 25 రూ॥ల వంతున ఇదేవిధంగా పన్ను హెచ్చిస్తూ 40000 రూ॥లు వచ్చు వారికి నూటికి 75 రూ॥ల వంతున పన్నువేయాలి. జమీందారులకు కూడ యీ పన్ను వేయాలి.

3. పై విధానము అమలులోనికి వచ్చువరకు, అన్ని ప్రాంతాలలోని రీసెటిల్‌మెంటురేట్లు పూర్తిగ రద్దుచేస్తూ, వెనుకటి రేట్లను సగమువరకు తగ్గించ వలయును.

నీటితీరువ, నీటివసతులను ఏర్పర్చడానికి అయ్యే ఖర్చులకు నూటికి 4-0-0 రూ. ల కన్న హెచ్చు లాభ ముండరాదు.

4. కౌలుదార్లు ఇచ్చే మిగతా ఖర్చులుపోను వచ్చే ఫలితములో సగము నకు మించియుండరాదు. ఇంతకు తక్కువగా ఇప్పుడున్నచో దానిని హెచ్చించ

రాదు. ఖర్చులుపోను వచ్చే ఫలితమెంతో నిర్ణయించడానికి పది సంవత్సరాలు కొక పర్యాయము రైతు సంఘ ప్రతినిధులు సగము, ప్రభుత్వ ప్రతినిధులు సగము మందియున్న విచారణ సంఘాన్ని ఏర్పరచాలి.

5. రైతువారీ ప్రాంతాలలో కౌళ్ళు 5 సంవత్సరాలకు తక్కువగా ఉండరాదు.

6. నజరానను బీద రైతులపై లేకుండ చేయవలయును.

అడవులు :

1. రిజర్వు అడవులలో అధమము 3 వరవంతైనా, 2 మైళ్ళ వరకైనా రైత్వారీ అడవులుగా మార్చి గ్రామ రైతు సంఘాల పంచాయితీల అధీనములో ఉంచవలెను మిగతా అడవుల నిర్వహణమందు సంఘాలకు తగిన ప్రాతినిధ్యము ఇవ్వవలెను.

2. రిజర్వు అడవుల ప్రక్కనున్న గ్రామాల పశుగణమునకు వలయు జలాశయములు రిజర్వు అడవులలోనే ఉన్నయెడల రాకపోకలకు తగిన హక్కులు రైతులకే ఉండవలయును.

3. కుటుంబ పోషణకు గాని, వ్యవసాయ పనిముట్లకు గాని రిజర్వు అడవుల నుండి వ్యవసాయకులు కట్టె, కలప, కంప, ఆకు మొదలగునవి ఉచితముగా తెచ్చుకొనుటకు హక్కుండవలయును.

4. గవర్నమెంటు అడవులలో బందిలిదొడ్డి చార్జీలు నూటికి 50 వంతున తగ్గించాలి. అడవులు లేనిచోట్ల మేతకు తగిన ఏర్పాట్లు చేయాలి.

5. జమీందారీ అడవులన్నీ ప్రభుత్వము వశము కావాలి.

6. ఇప్పుడు ప్రభుత్వం వారు అవలంబించుచున్న కూపుల పద్ధతిని పూర్తిగా మార్చివేసి ఈ క్రింది విధంగా సంస్కరించవలయును.

రైతుకు కావలసిన వ్యవసాయ పనిముట్లు ప్రతి గ్రామమునకు అందుబాట్లో ఉండులాగున కూపులు ఏర్పరచాలి. ఆ కూపులను కంట్రాక్టులకు ఇవ్వక ప్రభుత్వమే నడపాలి.

7. రైతుల మీద పెట్టబడిన ఫారెస్టు కేసులన్నిటిని వెంటనే రద్దుచేయాలి.

8. అడవి ప్రదేశములలో నివసించేవారికి, క్రూరమృగముల బారినుండి రక్షించుకోవడానికి ఆయుధాల లైసెన్సు ఇప్పించవలయును.

9. అడవి వివాదాల తీర్పులకై నియమింపబడు ఉద్యోగులు అడవి డిపార్టుమెంటుకు చెందియుండరాదు. అడవి కోర్టులను ఉన్నత న్యాయ శాఖోద్యోగులతో, రైతు సంఘ ప్రతినిధులతో ఏర్పరచవలయును. రైతు సంఘాలు వాని ముందు సమిష్టి బాధ్యతతో వాదించుటకు హక్కు కలిగి ఉండాలి.

10. రైతులకు వివిధ వ్యవహారములలో ఇవ్వవలసిన నోటీసు, ఇప్పటి కంటే రెట్టింపు కాలవ్యవధి ఇచ్చి, వేయదగు శిక్షలను సగానికి తగ్గించి, జైలునకు పంపుట అసలే రద్దుచేయవలెను.

చౌకధరలకు పరికరాలు, విత్తనాలు సప్లయి ప్రభుత్వము చేయాలి.

## 2. జమీను రైతుల కోర్కెలు :

1. జమీను రైతులకు, రైత్వారీ రైతులకున్న హక్కులన్నీ, సౌకర్యము లన్నీ ఉండాలి.

2. ఎట్టి సందర్భంలోనూ చుట్టుప్రక్కల రైతువారీ ప్రదేశములలో ఉన్న రేట్లకన్న జమీందారీ ఏరియాలో శిస్తు రేట్లు మించరాదు.

3. జమీందారీ, యినాందారీ, మొఖాసాదారీ యావత్తు గ్రామాల్లోనూ సర్వే సెటిల్‌మెంటులు నీటి వసతుల రిపైర్లు, శిస్తు వసూళ్ళ వసతులు వెంటనే జమీం దారుల స్వంత ఖర్చుతో ప్రభుత్వమే యేర్పరచవలయును.

4. పైర్లవారీ శిస్తులను ధాన్యపు శిస్తులను వెంటనే రద్దుచేయవలయును.

5. నీటిపారుదల వసతులన్నిటిని గవర్నమెంటు అధీనము క్రింద పి.డబ్ల్యు.డి. వారు ఆయా ప్రదేశ రైతు సంఘములు కలిసి పరిపాలన చేయునట్లు చేయవలయును.

6. పశువుల మేతకై అడవులున్నచోట్ల ఆ యా గ్రామాలకు రైతు సంఘాలు, పంచాయతీలు, నిర్ణయించు రీతిని, అడవిని గ్రామ సమిష్టి వినియో గార్థము వదలివేయవలయును.

7. అమలులోనున్న పుల్లరి రేట్లను సగము వరకు తగ్గించవలయును.

8. కుటుంబ అవసరము కొరకును, పేదరైతుకుగాని, వ్యవసాయ కూలీ లకు గాని అడవినుండి కట్టె, కలప, కంప, ఆకు వగైరాలను ఉచితముగా తెచ్చు కొనుటకు అధికారముండవలయును. అనాదినుండి అడవులయందును, కొండల యందును, నీటివనరులయందును (చెరువులు, కొండలోయలు) ఉన్న అధికార ములు రైతుల కట్లే రిజర్వు చేసి యుంచవలయును.

9. జమీందార్లకు భూశిస్తులపై నున్న ప్రథమ చార్జీ హక్కును తొల గించవలయును. రైతు అధీనపు భూముల శిస్తులు, రైతుల చరాస్థి, భోజనానికి తగిన ధాన్యం వగైరాలపై జప్తు తేరాదు. ఆయా భూముల మీద బాకీపడ్డ శిస్తుకు రిజిష్టరు పోస్టుద్వారా డిమాండు నోటీసు యిచ్చి తరువాత జప్తుచేసి కోర్టు ద్వారా వేలం జరుపవలెను.

10. ప్రస్తుతము రైతుల స్వాధీనమును బట్టి భూమిని సర్వే చేసి ప్రతి రైతుకు ప్రత్యేక పట్టాలు జమీందారు స్వంతపూచీతోనూ, ఖర్చుతోనూ యివ్వ వలెను.

11. మరు ఫసలీలో వెనుకటి ఫసలీ శిస్తు వసూలు చేయరాదు.

12. రైతులుజమీందారుల కివ్వవలసిన పాతబాకీలను రద్దుచేయవలయును.

13 చట్టరీత్యా స్పష్టముగా నిర్ణయింపబడిన శిస్తులు సెస్సులు తప్ప జమీందారులు రైతుల నుండి అక్రమ వసూళ్ళు చేయుచున్నారని రైతులు అర్జీ పెట్టుకొన్న యెడల ప్రభుత్వము స్వయముగా విచారించవలయును.

14. చెరువులు, చెరువులోతట్లు, బోదెలు, వరువకాలువలు, రుద్రభూములు, గ్రామ కంఠములు, వనములు వగైరా సాముదాయక భూములపై జమీందారులకు యెట్టి హక్కుండరాదు.

15. నదీ ప్రవవాహంవల్ల విరిగిపోయిన లంకలకు వెంటనే శిస్తు తీసివేయ వలయును. మరల క్రొత్తగా లంక పెరిగిన ఆ రైతుకే నజరానా లేకుండా శిస్తు గట్టుకొని పండించుకొను అధికారముండవలయును. హెచ్చుగా యేర్పడిన జాస్తి లంకభూమిపై గ్రామ పంచాయితీకే ఆధికారముండవలయును.

16. ఎస్టేటు భూములకు సంబంధించిన వ్యవహారములన్నీ పరిష్కరించుటకు రైతు సంఘ ప్రతినిధులతో గూడిన ల్యాండు కోర్టుల నేర్పరచ వలెను. ల్యాండు కోర్టుల తీర్పును తిరిగి విమర్శ చేయుటకు హైకోర్టుకు మాత్రమే హక్కుండవలెను.

17. జమీందారీ ఏరియాలో కూడ రైతువారీ యేరియాలో వలె పంటలు పోయినపుడు రెమిషన్ను యిచ్చు ఏర్పాటు శాసనబద్ధము చేయవలయును.

## 3. వ్యవసాయ కూలియొక్క కోర్కెలు :

1. నెలకు కనీసపు 10 రూ. ల జీతము. దినానికి కనీసము 6 అణాలు.

2. వారానికి పాలేర్లకు 48 గంటలకన్న ఎక్కువ పని ఉండరాదు. రోజుకు 8 గంటలకన్న ఎక్కువ పని ఉండకూడదు. ఇంతకు తక్కువగా పని చేస్తూ ఉన్నవారికీ నియమము వర్తించరాదు. ఇంతకు పైనున్న గంటలకు మామూలు రేటుకు రెట్టింపు కూలీ ఇప్పించవలయును.

3. అమావాస్య రోజు శలవు ఇప్పించవలయును. ఇవి గాక సంవత్సరానికి 30 రోజులు జీతముతో అగంతుక సెలవు (కాజువల్ లీవు) ఇప్పించ వలయును.

4. బానిసత్వపు పద్ధులను రద్దుచేయాలి.

5. నాములను రద్దు చేయాలి.

6. ప్రస్తుతమున్న అప్పులన్నిటిని రద్దు చేయాలి.

7. నూటికి 3-0-0 ల కన్న ఎక్కువ కాని సాధారణ వడ్డీతో (సింపిల్ ఇంటరెస్టుతో) ప్రభుత్వం అప్పు యివ్వాలి. రైతులు, ఆసాములు, తమ కూలీలకు పనిలేని రోజుల్లో నిర్బంధంగా 6 రూ.లకు మించని వడ్డీకి అప్పులివ్వాలి.

8. వ్యవసాయ కూలీలకు ఇండ్లు ప్రభుత్వం కట్టించి యిచ్చి వారి ఆదాయములో 20 వ వంతుకన్న ఎక్కువకాని అద్దెలకు ఇవ్వవలయును.

9. ప్రస్తుతము వలె సగము జీతముగాక కనీసము మూడు వంతుల జీతాన్ని ప్రతి వారము యివ్వాలి.

10. సాగుకు లాయకుగా వున్న బంజరు భూములను వ్యవసాయ కూలీలకు సహకార పద్ధతులపై సాగు చేసుకొనుటకు ఎట్టి నజరానాను లేక ఇవ్వవలయును. దానికి కావలసిన, పరికరములు, పెట్టుబడి ప్రభుత్వము సప్లయి చేయాలి.

11. ఖరా కొలత పాత్రలతో జీతాలు యివ్వాలి.

12. డబ్బురూపాన కూలి కావలయుననిన డబ్బు రూపముగానే యివ్వవలయును.

13. నిరుద్యోగ భృతి, ముసలివారికి పెన్షనులు, వారి సంపాదనలో సగమునకు తక్కువ కాని మొత్తములు ఏర్పరచాలి.

14. అపాయాలకు, జబ్బులకు వ్యవసాయ కూలీలకు కంపెన్సేషన్ ఆక్టు వర్తించవలయును.

15. క్రిమినలు ట్రైబ్సు ఆక్టును రద్దు చేయాలి.

## 4. పారిశ్రామిక కూలీల కోర్కెలు :

1. రోజుకు 8 గంటలకు ఎక్కువ కాని పని.

2. నెలకు 30 రూపాయల కనీసపు జీతము.

3. నిరుద్యోగ భృతి, ముసలి వారికి పెన్షనులు నెల 1కి 15 రూ. లకు తక్కువకాని మొత్తము.

4. ఉచిత గృహవసతి, వైద్య సహాయము

5. 14 ఏండ్లలోపలనున్న బాలురను పనిలో ఉంచుకోవడము దండనార్హము నరించుట.

6. సంవత్సరానికి నిండు జీతంతో ఒక నెల సెలవు. నిండు జీతంతో క్యాజువల్ లీవు ఒక నెల. సగము జీతంతో సిక్‌లీవు ఒక నెల.

7. సమ్మె చేయడానికి, పికెటింగు చేయడానికి హక్కు ట్రేడ్ డిస్ప్యూట్స్ (కార్మిక తగాయిదాల) ఆక్టు, మోపీ సవరణ, స్టేయిన్‌స్ట్రయికు సవరణలను రద్దు చేయాలి.

8. గర్భిణీ స్త్రీలు కనుటకు ముందును, వెనుకను రెండేసి నెలలు జీతంతో సెలవు.

9. కార్మిక సంఘాలను యజమానులు గుర్తించాలి.

10. కార్మికులకు, వారి బిడ్డలకు ఉచిత విద్యావసతులు.

## 5. విద్యార్థుల కోర్కెలు :

1. బడి జీతాలను తగ్గించాలి. గేమ్సు ఫీని తగ్గించాలి.

2. టెక్స్టు పుస్తకాలను ఏర్పరచడములో పూర్తిగా క్రొత్త పంథాను త్రొక్కాలి.

3. బడికి వెళ్ళే గంటలను మార్చాలి.

4. విద్యార్థులపై చూడబడే అవమానాలు, బెదరింపులు, జరిమానాలు, చీవాట్లు ఇంపోజిషనులు, కొట్టడము పోవాలి.

5. రాజకీయాలలో పాల్గొనడానికి విద్యార్థులకు హక్కు.

6. విద్యార్థి సంఘాలను గుర్తించవలయును. విద్యార్థులకు కావలసిన శిక్షణ నిబంధనల నన్నిటినీ విద్యార్థి సంఘాలే ఏర్పరచుకొనే హక్కులు ఉండాలి.

7. పరీక్షా విధానము మారాలి.

## 6. చిన్న దుకాణదారులు, చేతివృత్తిదారులు :

1. చౌక వడ్డీలకు అప్పులు.

2. చౌక ఖర్చులకు పరికరాలు.

3. పని చూపించలేకపోతే నిరుద్యోగ భృతి.

4. లైసెన్సు ఫీజు లేకుండ చేయడము, లేక తగ్గించడము.

## 7. స్త్రీల హక్కులు :

1. వారసత్వపు హక్కులు.

2 పురుషులతో సమానమగు హక్కులు అన్ని విషయాలలోను.

**8.** వెనుకబడిన జాతులవారికి, రైతులకు, వ్యవసాయ కూలీలకు ఇవ్వ మన్న హక్కులన్నీ ఇవ్వవలయును. వెనుకబడియున్న ప్రదేశములను తొలగించి మామూలు రాజ్యాంగములో కలుపవలయును.

## కామ్రేడ్ ప్రధాన కార్యదర్శికి అభివందనాలు

సంవత్సరము నుండి మన పార్టీకి ప్రధాన కార్యదర్శిగా వుండి కామ్రేడ్ అన్నపూర్ణయ్యగారు మన రాష్ట్రములో పార్టీని మితవాదుల యొక్కయు, సామ్రాజ్యవాదుల యొక్కయు, రాయి అనుయాయుల యొక్కయు దాడులనుండి

పూర్తిగా రక్షించి సర్వ విధముల పార్టీని అభివృద్ధికి తీసుకొని వచ్చినందున అన్నపూర్ణయ్యగారిని ఈ సభవారు హృదయపూర్వకముగ అభినందించుచున్నారు.

## ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ కార్యనిర్వాహక వర్గము

కామ్రేడ్సు,

1. పుచ్చలపల్లి సుందరయ్య, జనరల్ కార్యదర్శి
2. మద్దూరి అన్నపూర్ణయ్య. | సంయుక్త కార్యదర్శులు
3. జొన్నలగడ్డ రామలింగయ్య | సంయుక్త కార్యదర్శులు
4. అన్నాప్రగడ కామేశ్వరరావు
5. అల్లూరి సత్యనారాయణ
6. మద్దుకూరి చంద్రశేఖరరావు
7. పోతేపెద్ది నరసింహమూర్తి
8. చలసాని వాసుదేవరావు
9. సి.హెచ్. రాజేశ్వరరావు
10. పి. వి. శివయ్య
11. కంభంపాటి సత్యనారాయణ
12. వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ
13. కోడి నరసింహము
14. పైడిమర్రి సత్యనారాయణ.

[ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ తృతీయ వార్షిక సమావేశపు తీర్మానాలు - ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ కార్యదర్శి ప్రచురించిన కరపత్రం పూర్తి పాఠం. 1937 లో కాంగ్రెసు సోషలిస్టు పార్టీ మూడవ ప్రచురణ ఇది — సం॥]

అనుబంధం - 2 'ఎ'

# 1938 జూన్ నెలలో జరిగిన ఆంధ్రరాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ రెండవ మహాసభ ఆమోదించిన తీర్మానాలు (కమ్యూనిస్టు పార్టీపై నిషేధము ఉన్నందువల్ల వీటిని సోషలిస్టు పార్టీ తీర్మానాలుగా "నవశక్తి" పత్రికలో ప్రకటించారు – సం॥)

## జాతీయ కాంగ్రెసు - సోషలిస్టులు

ఏ. భారతదేశంలో సామ్రాజ్యవాదాన్ని ఎదిరించుటకు జాతీయైక్య సంఘటన స్థాపించడానికి, కాంగ్రెసునే పునాదిగా తీసికొని పనిచేయ నారభించాలని నిర్ణయించుకొన్నను ఆంధ్ర సోషలిస్టులు యునైటెడ్ ఫ్రంటును స్థాపించుటయందలి ప్రధాన సూత్రాలను అంతగా అవగాహనం చేసికోలేదనే చెప్పాలి. అందుచేత కాంగ్రెసు పునాదిగా తీసుకోడం అనేదాన్ని పూర్తిగా అతివాద ధోరణిలో కొందరు మతవాద ధోరణిలో కొందరు అర్థం చేసుకున్నాం. (1) వర్గ సంఘాల నుండియే, వాటి ద్వారానే రాజకీయ చైతన్యం పొందిన వారినే కాంగ్రెసులో చేర్పించినప్పుడే అది యునైటెడ్ ఫ్రంట్‌కు పునాది అవుతుందని మొదటివారి వాదన. పరాధీన దేశాలలో, అందులో ముఖ్యంగా, వ్యవసాయదార్లు, మధ్య తరగతి జనులలోను, రాజకీయ చైతన్యం ముందు కలుగుతుంది. దానికి ఎక్కువ అవకాశాలున్నాయి. రాజకీయ చైతన్యం ద్వారా వర్గసమస్యల కోసం పోరాడేందుకు పూనుకొంటారు. అందుచేత మొదటివాదన (Left Sectarianism) అతివాద సెక్టేరియ నిజంగాపరిణమిస్తుంది.

(2) రెండవరకం, కాంగ్రెసును మనం స్వాధీనం చేసుకోవాలనే దృక్పథానికి దారితీసేటట్టు, ప్రచారం లేకుండా సభ్యులను జేర్పించడం, అందులోనూ, స్వంతడబ్బు కూడా అక్కడక్కడ ఖర్చు చేశారు. మిత వాదులను క్రిందికి దింపడమే ప్రధానమనీ, అందుకోసం వారిలోని పరస్పర వైషమ్యాలను వినియోగించడానికి కూడా వెనుకంజ వేయలేదు. ఇందుచేత ప్రజాపోరాటం ద్వారా కాంగ్రెసు పోరాటాన్ని ముందుకు నెట్టే అవసరాన్ని గుర్తించక, కాంగ్రెసును స్వాధీనం చేసుకోగలమనే అభిప్రాయాన్ని (దీనిని సిద్ధాంతరీత్యా అంగీకరించక పోయినా, ఆచరణలో మాత్రం) సోషలిస్టు పార్టీ సామాన్య సభ్యులలో వ్యాప్తం గావించాం. ఈ పోకడ యునైటెడ్ ఫ్రంటు భాగమైన కాంగ్రెసు నాయక వర్గంతో కక్షలను పెంచి, ప్రజలలో గంద్రగోళానికీ, జాతీయ విద్రోహులకు కాంగ్రెసు నంతటినీ విమర్శించడానికీ అవకాశం మిచ్చింది.

మితవాద నాయకులు తమ స్థానాలు నిలుపుకోడానికి ఎన్నికలలో ప్రజాతంత్రానికి వ్యతిరేకమైన పద్ధతులు అవలంబించారు. మనకు కాంగ్రెస్ వర్కర్ల లోనే పలుకుబడి వుందిగాని, ప్రజాసామాన్యం మొత్తంమీద కావలసినంతలేదు. ఈ విషయాన్ని మనం గుర్తించలేదు మితవాదులు మనవారిపై డిసిప్లినరీ చర్య తీసికోడానికి ముందు తటపటాయించినా, తరువాత ధైర్యంగా తీసుకోగలిగారంటే కారణం మన వెనుక ఆర్గనైజు చేయబడిన ప్రజాబలం లేదని గ్రహించుటే. మనకున్న ఈ లోపాన్ని మన పని ద్వారా ఐక్యతకే మనం చేసే త్యాగంద్వారా ప్రజలు రోజు రోజు పోరాటాన్ని నడపడం ద్వారా, జాతీయైక్య సంఘటనకు నడిపేశక్తిగా మారడం ద్వారా తొలగించ గలుగుతాము. తొలగించాలి కూడాను.

(బి) ఆంధ్రదేశంలో పట్టణాలయందలి మధ్యతరగతి ప్రజలు (ప్లీడర్లు, షాపుకార్లు, చిన్న దుకాణాదార్లు మొదలైనవారు) పల్లెలలో పెద్ద రైతులు, చిన్న రైతులు, వడ్డీ వ్యాపారస్తులు మొదలైన తరగతులవారు, కాంగ్రెసులో ఎక్కువగా వున్నారు. అయినా, నాయకత్వం, బూర్జువా దృక్పథం కలిగిన, ప్లీడర్లు, డాక్టర్లు, [INTELLECTUALS] షాపుకార్లు, పెద్ద రైతులు నుండియే వచ్చింది.

నాయకత్వం, ప్రాథమిక సంఘాల [INITIATIVE] ప్రోత్సహించడం లేదు. రాష్ట్ర నాయకులు ప్రత్యేక రైతు సంఘాలను ఆమోదించరు. అవి కాంగ్రెసుకు అనుబంధాలుగానే వుండాలంటారు. రాష్ట్ర సంఘం, కిసాన్ సబ్ కమిటీని ఏర్పరచి, రైతు సంఘాలకు వ్యతిరేకియైన వ్యక్తిని దానికి కార్యదర్శిగా నియమించింది. రైతుల కనీసపు కోర్కెలలో కొన్నింటిని అంగీకరిస్తూ తీర్మానిస్తుంది. కాని అవి ఆచరణలోకి తేవడానికి కావలసిన ప్రజా పోరాటాలకు

ప్రయత్నాలు చేయలేదు. ఆ పని మనవంతు నాయకులు కాం. సో పార్టీని కాంగ్రెసుకు ప్రత్యర్థిగా భావిస్తున్నారు. దీనికి మనం ఎన్నికలలో అవలంబించిన విధానం మన విమర్శనా పద్ధతులు కొంత కారణం. ఒక వైపు సోషలిస్టులు దౌర్జన్యవాదులని ప్రకటించడానికి కొందరు కాంగ్రెసు నాయకులు వెనుదీయలేదు. కాంగ్రెసు కమిటీలలో సోషలిస్టులము వ్యతిరేక పక్షంగానే ఉండి అందరూ అంగీకరించిన విషయాలకు ప్రాముఖ్యత నీయకుండా, అంగీకరించని విషయాలకే ప్రాముఖ్యత నిస్తున్నాము మనవిధి, యునైటెడ్ ఫ్రంటు ప్రకారం, విభేదాలను వెనక్కి నెట్టి, అంగీకృత విషయాలను అమలు జరిపించడానికి పూనుకొనడమే.

ఫెడరేషన్ విషయంలో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు నాయకత్వం, కాంగ్రెసు మహాసభా తీర్మానాన్ని ప్రచారంచేసి, ఫెడరేషనకు వ్యతిరేకంగా పోరాటానికి సంసిద్ధం చేయడంలేదు. ఆంధ్ర రాష్ట్ర విషయంలో రాష్ట్ర నాయకులు అవలంబించే ఆందోళననుబట్టి ఫెడరేషన్ ఏవో కొన్ని మార్పులతో అమలు జరుగుతుందనీ, అప్పుడు ఆంధ్రరాష్ట్రంకూడా సంపాదించుకో వచ్చునని వారి అభిప్రాయమైనట్లు విశదమౌతోంది. అందులో ముఖ్యంగా లోథియన్ - గాంధీగార్ల స్టేటుమెంట్లు, బూలాభాయిగారి స్టేటుమెంట్లు సమయంలోనే ఆంధ్రరాష్ట్ర ఆందోళన మిన్నుమిట్టుటకూడా ఈ ఆశను వెల్లడిస్తున్నాయి. ఆంధ్ర కాంగ్రెసు అధ్యక్షులు మొదట అతివాద స్టేటుమెంట్లు ఇచ్చినా కడవరకు దానిమీద నిలబడలేదు. మిగతా ఆంధ్ర కాంగ్రెసు నాయక వర్గంలో ఈ విషయమై ప్రత్యేక అభిప్రాయం లేదు.

బాట్లీవాలా అరెస్టు, చీరాల కాల్పులు మొదలైన విషయాలలో రాష్ట్ర కాంగ్రెసు సంఘం అతివాద దృక్పథం అనుసరించింది.

పౌరసత్వ హక్కులను నిరోధించు చర్యలను, అధికారులు సమర్థించినపుడు మంత్రులను విమర్శించుతూ తీర్మానించినా ప్రజాందోళన లేవదీయలేదు. ప్రజాందోళన చేయకపోయినా ఈ విమర్శలవల్ల కాంగ్రెసు మంత్రివర్గానికి ఈ విషయంలో ఏమిచెయ్యాలో చూపెట్టారు కొంతవరకు చేయించ గలిగారు.

(సి) ఆంధ్ర రాష్ట్రంలో కాంగ్రెసు సభ్యులు 3½ లక్షలు అన్ని జిల్లాలలోనూ సరి సమానంగా లేరు. నెల్లూరు 12,000, గుంటూరు 83,000, ప. కృష్ణా 44,000, తూ. కృష్ణా 38,000, ప. గోదావరి 41,000, తూ. గోదావరి 39,000, విశాఖపట్టణము 40,000, రాయలసీమ 12,000. జిల్లా సంఘాలు, స్థానిక సంఘాల ఎన్నికలు వచ్చినపుడు తప్ప సభ్యులను చేర్పించుట, పై సంఘాల సర్క్యులర్లను క్రిందికి పంపుట తప్ప వేరే పని చేయడం లేదు. కాంగ్రెసు కమిటీలు అన్నిచోట్లా లేవు. ప. కృష్ణా కాం. సంఘం రైతు సమస్యల మీద గుంటూరు జిల్లా కాం. సంఘం చీరాల కాల్పులు సమ్మెరు స్కూలు

పైనా చురుకుగా పనిచేశాయి. ఇట్టి ఆందోళనలు ప్రజా ప్రదర్శనలుగా మార్చు డానికి మనం పూనుకొన్నట్లయితే కాంగ్రెసు సంఘాలే ప్రజల హక్కులను కాపాడే సంస్థలుగా తయారవుతాయి. మితవాదుల చేతుల్లో వున్న తాలూకా కాం.సంఘాలు అక్కడక్కడ ప్రాథమిక సంఘాల నేర్పరచడానికి కృషి చేస్తున్నా సోషలిస్టు లున్న చోటనే ఈ విషయంలో ఎక్కువ పని జరుగుతోంది. కాని అన్ని చోట్లా తాలూకా సంఘాలు లేవు ఏర్పడిన ప్రైమరీ కమిటీల ఎలా పనిచేయించాలో కాంగ్రెసు, యునైటెడ్ ఫ్రంటుగాను, ప్రజల రక్షక సంస్థలాగునను తయారు చేయుటకు ఇది ఏమి చెయ్యాలో మాత్రం వీరికి తెలియదు.

కాంగ్రెసులో చేరిన మూడున్నర లక్షంలోను సుమారు 25,000 మందిని మన సభ్యులు చేర్పించారు. కాని రాజకీయ ప్రబోధం చేయలేదనియే చెప్పవచ్చు, ప్రాథమిక సంఘాల జనరల్ బాడీలను మాత్రం అప్పుడప్పుడు అక్కడక్కడ సమావేశం చేస్తూ ప్రస్తుత రాజకీయ పరిస్థితులను గూర్చి, ఉపన్యాసాలు మాత్రం చెపుతున్నారు. కాంగ్రెసు అభిమానులైన ప్రజలు, మనవారి నందరినీ, సిన్సియర్, కష్టపడి పనిచేసే వారుగానే భావిస్తున్నా, మనం చెప్పేవి అసాధ్యమని, దుడుకు వారమని భావిస్తున్నారు. నాయకులు కూడా ఇదేవిధంగా చూస్తూ తమ ప్రత్యర్థుల మని తలంచుచున్నారు. ఈ సందర్భంలో ఇంకొక్క విషయాన్ని కూడా చెప్పాలి. పట్టణాలందలి మధ్యవర్గం ప్రజలకు మన యెడల వ్యతిరేకభావం వ్యాప్తమైవుంది. నాయకులను గూర్చి, మంత్రులనుగూర్చి మన మవలంబించు విమర్శనా పద్ధతియే దీనికి కారణం. పట్టణాల్లో, మధ్యతరగతికి, దినదినాభివృద్ధి పొందుతామనే ఆశ కనుపించుటచేతా, పట్టణాల్లో బూర్జువా వర్గానికి ప్రాబల్యం వుండడంచేత, పల్లెటి గ్రామాల్లో ఆర్థికంగా కృశిస్తూన్న ప్రజలకు, బూర్జువాకు మధ్యనుండే స్పర్థయే ఈ వ్యతిరేక భావానికి పునాది.

రాష్ట్ర కాంగ్రెసు కమిటీలో మన పార్టీ సభ్యులు 20 ప. కృష్ణా జిల్లాలలో, కర్నూలు, సోషలిస్టులు అధ్యక్ష స్థానంలో నున్నారు. గుంటూరులో యునైటెడ్ ఫ్రంటు కార్యక్రమంతో పనిచేస్తున్నారు

కాంగ్రెసు మహా సభాధ్యక్షుడు ప్రకటించిన దినోత్సవాలు, డిమాన్‌స్ట్రేషన్లు జరపడంలో ఇదివరకు సోషలిస్టులకు, కాంగ్రెసు మితవాదులకు ఎర్రజెండా విషయంలోనూ, నోటీసులలోను కాం.సో. పార్టీ ప్రజా సంఘాలపేర్లు చేర్పించుట లోను తగాదా వచ్చింది. వేరువేరుగా సభలు. డిమాన్‌స్ట్రేషన్లు కూడా జరిపాం. అది సరియైన పద్ధతికాదు.

ఇకముందు కాం. అధ్యక్షుడు ప్రకటించిన దినోత్సవాలను, కాంగ్రెసు సంఘాల యాజమాన్యమున జరుపడానికి ప్రయత్నించాలి. స్థానిక కాంగ్రెస్

సంఘం పనిచేయనిచో అధ్యక్ష కార్యదర్శులను మేల్కొల్పుట మన విధి. వారు పనిచేయ నిరాకరించినపుడే కా సో. పార్టీ, ఇతర సామ్రాజ్య వ్యతిరేక సంస్థల తరపున చేయాలి. ఈ ప్రయత్నాలవలన కొంతకాలానికైనా కాంగ్రెసు సంఘం పనిచేస్తుంది.

కాంగ్రెసు సంఘం దినోత్సవాలు జరుపుతున్నప్పుడు సోషలిస్టులమగు మనం వారితో కలిసియే పనిచేయాలి. ఎర్రజెండాను ప్రదర్శించడానికి ఇతర సంఘాల పేర్లు చేర్చడానికీ, సోషలిస్టుల అధికారంలోవున్న చోట్లు వీనికొరకు వారి అంగీకారం పొందుటకు ప్రయత్నించాలి. అంగీకరించనిచో వారితో కలసియే దినోత్సవాలు జరపాలి గాని వేరే సభలు, ఊరేగింపులు జరుపరాదు.

2. రాష్ట్ర సంఘంలోనూ, జిల్లా సంఘంలోనూ సోషలిస్టులు ప్రస్తుతం వలె అపోజిషను కోసం, అపోజు చేయడం మానివేయాలి. మనము కాంగ్రెస్ సంఘాలలో సూచించు పాలసీ ప్రవేశపెట్టు తీర్మానాలు, మనం ఎంతవరకు పోగ ళమో సూచించునవిగా కాక, మొత్తంపై కమిటీ సభ్యులు అంగీకరించేవిగా ఉండాలి రాజకీయ సిద్ధాంత తీర్మానాలు మాత్రం పార్టీలైనుకు భిన్నంగా వుండ కూడదు. లంచగొండితనం, పోలీసు దౌర్జన్యం, రైతు కార్మికుల కోర్కెలు (కాం మితవాదులు కూడా అంగీకరించునవి) తీసుకొని వాటిపై ఆందోళన సాగిం చాలి. ప్రాథమిక కాంగ్రెసు సంఘాలు పనికి తోడ్పడుతూ, సామాన్య సభ్యు లందరికి చైతన్యం కలిగేటట్లు చేయాలి ప్రతి గ్రామం లోని సభ్యులను సంఘా లుగా ఏర్పాటుచేసి సామాన్య సభ్యుల మీటింగులు జరిపించాలి.

రైతులు కార్మికులు దిన దిన కష్టాలు ఎదుర్కొనుటకు చేయు పోరాటాలను బలపరుస్తూ స్థానిక కాంగ్రెసు సంఘాలు నిజమైన సంయుక్త జాతీయైక్య సంఘ టన యగునట్లు చేయాలి. అంటే కాంగ్రెస్ సంఘం, స్థానిక రైతు, కార్మి కుల కష్టాలను ధ్వనింపజేయాలి. ఈ విధానం ద్వారానే కాంగ్రెసు నంతనూ, మితవాద నాయకులతో సహా స్వాతంత్ర్య పోరాటాన్ని పీడితప్రజలందరి సంఘ టనతో హెచ్చుస్థాయికి గొనిపోడానికి సోషలిస్టులు మార్గదర్శకులు అవుతారు. ప్రజా పోరాటాలలో పాల్గొనునప్పుడు కాంగ్రెసులోను కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ లోను రైతు సలహాలలోను సభ్యులను జేర్పించాలి.

ఈ క్రింది ప్రచారంతో కాంగ్రెసు సభ్యులను చేర్పించాలి.

1. బలవంతంగా భారతదేశంపై రుద్దబడుచున్న ఫెడరేషన్‌కు వ్యతిరేక ముగా పోరాటాన్ని బలపరచండి.

2. కార్మిక కర్షక ప్రజాసామాన్యం యొక్క కోర్కెలను, వారు ప్రత్యేక సంఘాలుగా ఏర్పడే హక్కును కాపాడటానికి కాంగ్రెసును బలపరచాలి.

3. కాంగ్రెసును ప్రజాస్వామ్య మొనర్చి ప్రైమరీ కమిటీలు సంయుక్త సంఘటనా, ప్రదర్శనలు జరిపించునట్లు చేసి జాతీయైక్య సంఘటన యొక్క జీవకణాలుగా పని చేయించాలి.

కాని సభ్యులను చేర్పించుటలో సోషలిస్టులు స్వంత డబ్బు ఖర్చు పెట్టి చేర్పించరాదు. అట్లు చేసిన వారిపై డిసిప్లినరీ చర్య గైకొనవలెను. మితవాదులకు పోటీ చేయుటయే ప్రధానంగా పెట్టుకోకూడదు. సోషలిస్టు పార్టీ సభ్యులు తప్పక ఎన్నుకోబడతారనే నమ్మకం వుంటే గాని పోటీ చేయరాదు

కమిటీల అధ్యక్ష కార్యదర్శుల ఎన్నికలలో, పలుకుబడి గల మితవాదులకు పోటీ కొరకు పోటీ పెట్టరాదు. మితవాది అతివాది పోటీలో మనం అతివాదికి ఓటు చెయ్యాలి కాని ఆ పోటీ పెట్టుటకు సోషలిస్టులే కారణం కారాదు.

4. వెంటనే చేయవలసిన పనులు.

ఎ) ప్రతి జిల్లా సోషలిస్టు పార్టీ కార్యనిర్వాహకవర్గము, ఆయా తాలూకాలలో చేర్పించవలసిన కాంగ్రెసు ప్రాథమిక సభ్యుల సంఖ్య నిర్ణయించాలి.

బి) కాంగ్రెసు ఎన్నికలలో కాంగ్రెసు యునైటెడ్ ఫ్రంటు కార్యక్రమాన్ని ప్రచారం గావిస్తూ, ఆ కార్యక్రమం అమలు జరపడానికి ప్రయత్నిస్తాము. కావున తమ్ము ఎన్నుకోవాలని ప్రచారం గావించాలి కాం॥ ఎన్నికలు కాంగ్రెసుకు సోషలిస్టులకు పోటీ రంగం కాకూడదు.

సి) ప్రాథమిక సంఘాలను ఏర్పరచి వాటిని ప్రజాసామాన్యపు హక్కులు సంరక్షించునవిగా చేయాలి.

డి) 'నవశక్తి'లో, కాంగ్రెసులో సోషలిస్టుల పనిని రివ్యూ చేసి సూచనలిస్తూ వ్యాసాలు వ్రాయాలి. అందుకై జిల్లా కాం॥ సంఘాలలో తమ పనిని గురించి జిల్లా కాం॥ సో॥ పార్టీ కార్యనిర్వాహక వర్గం నెలకొక రిపోర్టు పంపాలి.

ఇ) స్థానిక కార్మిక కర్షకుల కనీసపు హక్కులను, పౌరసత్వ హక్కులను కాంగ్రెసు కమిటీల (మితవాద నాయకులతో సహా) సహకారంతో సంపాదించడానికి సర్వవిధాల ప్రయత్నించాలి.

యఫ్) కాంగ్రెసు నిబంధనావళిలో ఈ మార్పు కొరకు ఆందోళన సాగించాలి.

1) పట్టణ, తాలుకా, కాం॥ సంఘాలకు సింగిల్ నియోజక వర్గాలు ఏర్పాటుచేయాలి.

2. పట్టణ, తాలుకా, సంఘాల నుండి జిల్లా సంఘానికి, జిల్లా సంఘం నుండి రాష్ట్ర సంఘానికి ప్రపోర్షనల్ రిప్రజెంటేషన్ (సింగిల్ ట్రాన్సఫరబుల్ వోటు ద్వారా) పద్ధతిని ఎన్నికలు జరపాలి.

జి) వాలంటీరు దళాలను కాంగ్రెసు క్రింద ఏర్పాటు చేయాలి.

**ఆందోళనా విధానం :**

ప్రస్తుతం గావిస్తున్న ఆందోళనా పద్ధతిలో కాంగ్రెసు కాన్ఫరెన్సులలో తప్ప మిగిలిన ప్రజా సంఘముల యొక్క పార్టీయొక్క కాన్ఫరెన్సుల బహిరంగ సమావేశములు మానివేసి వాటిని డెలిగేట్ల మీటింగులుగా జరపాలి. అట్టి సంఘములు ఏర్పడడానికి కావలసిన బహిరంగ సమావేశాలను ఏర్పాటు చేయ వలయును. అంతేగాక ఆందోళన రోజు రోజు కష్టాలపై సాగించడానికి ప్రజల యొక్క సభలు, ర్యాలీలు విరివిగా సాగించవలెను. టూర్లు కూడా అవసరమై నప్పుడల్ల ఏర్పాటు చేయుచుండవలయును.

1. సంఘములున్న స్థలములలో డెలగేట్ల మీటింగులు, లేని స్థలములలో ర్యాలీలు, ఏర్పాటుచేయుటకు కనీసము నెల రోజులకు సాధ్యమైతే రెండు నెలకు ముందు జిల్లా కమిటీ సమావేశమై ఈ సమావేశాలకు కావలసిన ఏర్పాటు లన్నియు చిత్తుగా నిర్ణయించవలెను. ఈ చిత్తు నిర్ణయములను ఆ రంగములో (ఫ్రంటులో) పని చేసే పార్టీ సభ్యులందరి ముందు పెట్టవలెను. పార్టీ సభ్యు లందరిని గాకపోయినను అవసరము సాధ్యము అనుకున్న వ్యక్తులందరి ముందైన పెట్టవలయును. ఈ మీటింగుకు పార్టీ సభ్యులు కాకపోయినను ఆ ప్రజా సంఘములో పనిచేసే ముఖ్యమైన వారి నందరినీ కూడ ఆహ్వానించాలి. రాజకీయ సూత్రములు, రాజకీయ తీర్మానాల మీద తప్ప మిగిలిన విషయములలో పార్టీ సభ్యులకు మేండేటు మామూలుగా యివ్వకూడదు.

2. సమావేశాలకు అప్పులు చేయకూడదు. ఎంత, ఎవరు, ఎచ్చట వసూలు చేయవలసినది నిర్ణయించాలి.

3. సమావేశము జరుగుటకు ముందు ఎన్ని ప్రచారపు సభలు జరుప వలసినది నిర్ణయించాలి.

4. ఈ ప్రచారం చేయుచున్నప్పుడు ఆయా సంఘములను ఏర్పరచ డానికి పునాదిగా ఇంతమంది సభ్యులను చేర్పించాలని నిర్ణయించవలయును.

5. జనరల్ ప్రాపగాండలో మిగిలిన సంఘాలలో చేరవలసిన ఆవశ్య కతను తెలియజేయాలి. మిగిలిన సంఘాలను ముఖ్యంగా కాంగ్రెసు కమిటీలను ఈ సమావేశము జయప్రదంగా సాగించడానికి సాయపడేటట్లు చేయాలి.

6. సమావేశములో చర్చకు కావలసిన తీర్మానాలను తయారు చేయవల యును. ఇది ప్రజలను అప్పుడు ఎదుర్కొంటున్న సమస్యలను గూర్చి వానిని ఏవిధంగా పరిష్కరించాల్సి వుంటుంది అనే ప్రశ్నలను గూర్చి ప్రధానంగా వుండాలి.

7. పై కమిటీలనుండి గాని ఇతర జిల్లాల నుండి గాని, ఎట్టి సహాయము కావలసినదీ తెలియజేయాలి.

8. ఈ ఆందోళనము, సమావేశములను నవశక్తిలో ప్రధాన ఘటనలుగా ప్రదర్శించాలి.

ఈ విధంగా సమావేశములు ఏర్పాటు చేస్తూ ఎవరి స్థానములో వారు ఎవరికి వప్పజెప్పిన ప్రజా సంఘము పనివారు చేసుకుంటూ వుండే మన ఆందోళన, నిర్మాణపద్ధతిలో నేడు అవసరమైన మార్పును తీసుకొని వచ్చిన వారమగుదుము. దీనివలననే ఈ పోరాటాలను ఆరంభించి నడపడానికి ప్రజాసామాన్యములో విస్తృతమైన పనిని సాగించడానికి అవకాశం ఏర్పడుతుంది.

[నవశక్తి, 29-6-38, 11 వ పేజీ
నవశక్తి, 6-7-38, 7వ పేజీ]

అనుబంధం - 2 'బి'

# కేవలం ఆర్థిక హక్కులకై పోరాడుట మాత్రమే రైతు ఉద్యమ ఆశయం కాదు

## రైతు ఉద్యమం యెడల సోషలిస్టుల వైఖరి

ఆంధ్ర దేశములో రైతు సంఘములు సంఖ్యలోనూ, సభ్యత్వములోనూ అభివృద్ధి పొందినప్పటికిని, రైతు ఉద్యమము తగినంత శాస్త్రీయమైన అభివృద్ధి పొందినదని చెప్పుటకు వీలులేదు. రైతు సంఘాలలో సోషలిస్టులు పనిచేయుచున్నప్పటికిని, రైతు సంఘములను జాతీయైక్య సంఘటనకు నిజమైన ప్రాతిపదికలుగా ఏర్పరచజాలకపోయారు. కేవలం, సభ్యులను అభివృద్ధి చేయుట, సంఘాలను విరివిగా స్థాపించుట, ఆందోళన విరివిగా చేయుట ద్వారానే రైతు సంఘములలో పనిచేశారు. జాతీయ ఉద్యమంతో తగినంత సంబంధము పెట్టుకోలేకపోయారు.

రైతు సంఘాల తరపున, రైతు కష్టాలను నివారించుటకు రైతు యాత్రలు అనేకము సల్పారు. అనేక ప్రదర్శనలు చేశారు. సభలు పెట్టారు. కొని చోట్ల పోరాటములను గూడ నడిపారు వాటి అన్నిటి వల్ల రైతులలో గొప్ప చైతన్యము కల్గిన మాట నిజమే. రైతుల శక్తులను రేకెత్తించి సంఘటించిన మాట వాస్తవమే. ప్రత్యేకంగా రైతు సంఘాలు ఒక శక్తిగా పరిగణింపబడిన మాటయు సత్యమే. సోషలిస్టుమైన మనకు, ఈ వివిధ శక్తులు ఎంతవరకు రాజకీయాభివృద్ధికి అనగా జాతీయ ఉద్యమమునకు తోడ్పడినది పరిశీలించవలసి వుంది. ఎందుకనగా, రైతు సంఘాల యెడల మనకున్న దృక్పథము ఇది (రైతు సంఘాల ద్వారా రైతులందరిని, వారి కష్టములను నివారించుకొనుటకు సంఘటన పరచి, ఒక శక్తిగా చేయుటకును) కేవలం ఈ శక్తిని తమ వర్గ హక్కుల కొరకు పోరాడునట్లు చేయుటయేగాక దేశస్వాతంత్ర్యము కొరకు పోరాడి తద్వారా తమకు విముక్తి కలుగజేసుకొనుటకు తగిన రాజకీయ చైతన్యము కలుగజేయుటకును, రైతు సంఘాలు పాటుపడునట్లు చేయుట మన విధి.

ఇప్పుడు మనము చాల క్లిష్ట దశలో ఉన్నాము. ఒక వైపున, రైతు సంఘాలు కాంగ్రెసుకు వ్యతిరేకమనియు, జాతీయోద్యమమును బలహీన పరచుచున్నవనియు, కాంగ్రెసు వారిలో కొందరు ఆరోపణలు చేయుచున్నారు. రైతు ఉద్యమములోనే, ఒక కేంద్రీకరణమైన - ఐక్యమతముతో కూడిన - ఒకే నాయకత్వము రాలేదు, మన రాష్ట్రములో రైతు నాయకుడైన రంగాగారితోను, వారి అనుచరులతోను, సరియైన సంబంధము లేకుండ వుంది. ఇదీగాక కాంగ్రెసు సంఘాలతో చాల తక్కువ సంబంధము కలిగి, కొన్ని అనవసర తగాదాలతో మరింత దూరమైపోవుచున్నాము. ఈనాడు రైతు సంఘాలు కాంగ్రెసు సంఘాలతో కలిసి పనిచేసి, జాతీయైక్య సంఘటన నభివృద్ధి గావించుటకు మన రాష్ట్రంలో అనేక అవకాశములున్నవి దాని అర్థం, కాంగ్రెసు నాయకులందరు రైతు ఉద్యమమును అంగీకరించి సహాయపడుదురని కాదు. కాంగ్రెసు సంఘ కార్యక్రమము ద్వారాను, రైతు సంఘాల కార్యక్రమము కోర్కెల యెడల వెల్లడించే వైఖరి ద్వారాను, జాతీయైక్య సంఘటనకు హెచ్చు అవకాశములన్నవని బోధపడుచున్నది. ఏలనన, ఆం॥ రా॥ రైతు సంఘ కనీసకోర్కెల ప్రణాళికను ఆం॥ రా॥ కాం॥ సంఘం అంగీకరించియున్నది. రైతుయాత్రలు సాగించేటప్పుడు, జిల్లా, తాలుకా కాంగ్రెసు సంఘములు సహాయపడినవి. కావున ఈ రోజున రైతు సంఘములు కాంగ్రెసుకు దూరమైపోకుండ కాంగ్రెసు సంఘములతో కలిసి పనిచేయుచు, జాతీయోద్యమమును బలిష్టమొనర్చుటకు అవకాశములు హెచ్చుగా నున్నవి.

ఇదేగాక, మన పరిస్థితులు రోజు రోజు మారుచున్నవి. దరఖాస్తులు,, రాయబారములతోనే కాలము గడుపక, అన్ని ప్రాంతములలోను, ముఖ్యంగా, జమీందారీ ప్రాంతములలో రైతులలో గల్గిన చైతన్యము వలన పోరాటమును రైతులు సాగించుచున్నారు ఈ పోరాటములలో ఇంతవరకు మనము నిర్దిష్టమైన కార్యక్రమము నిచ్చియుండలేదు.

ముఖ్యంగా ఈ పోరాటములే మన జాతీయైక్య సంఘటనను పెంపొందించుటకు ఆధారములు. ఇట్టి పోరాటముల ద్వారానే నికరమైన జాతీయైక్య సంఘటన ఏర్పడుతుంది. మన సంఘములు తృప్తికరముగా పనిచేయకుండుటకు రోజు రోజు కష్టాలను పోగొట్టుకొనుటకు కలుగుచున్న యీ చిన్ని పోరాటాలను నిర్లక్ష్యము చేసి, దైనందిన కార్యక్రమమును మరచిపోయి వుండుటచేతనే, జాతీయైక్య సంఘటనను నిర్మించుటకు ముఖ్యమైన ఈ దైనందిన కార్యక్రమమును మరచినప్పుడు జాతీయైక్య సంఘటనావశ్యకతను కూడ మరచిపోతిమి.

పై విమర్శనను బట్టి యీ క్రింది విధముగ మనము సత్వరమే పూనుకొని పనిచేసిననే గాని మన రైతు ఉద్యమము శాస్త్రీయముగ పని చేయజాలదు.

1. ప్రపథములలో, వేరు వేరు భావములతో పనిచేయుచున్న అనేక గ్రూపులను ఒక ఐక్య కార్యక్రమమును ఆధారముగా చేసుకొని కలిసి, ఇప్పుడున్న అడ్డంకులను తొలగించుకొనుట (ముఖ్యంగా రంగాగారితోను వారి అనుచరుల తోను ఘనిష్ఠమైన సంబంధము పెట్టుకొని దైనందిన కార్యక్రమములో సహకార భావముతో పనిచేయుట.)

రైతుల యొక్క కష్టాలు, రైతు సంఘాలు తెలిసికొని వెంటనే స్థానిక కాంగ్రెసు కమిటీలకు తెలియజెప్పి, వారు అంగీకరించినచో జాయింటు నాయకత్వమున, లేకున్న కాంగ్రెసు నాయకత్వముననే, రైతు సంఘాలు అదికూడ అంగీకరించ నప్పుడు స్వయముగను, రైతు సంఘాలు రైతులకొరకు పాటు పడాలి

రైతు సంఘాల పని వేరుగ భావించక జాతీయ కార్యక్రమములో ఒక భాగముగ నెంచుచు జాతీయైక్యతకు రైతు ఉద్యమం తోడ్పడునట్లు చేయాలి.

కాంగ్రెసుకమిటీలతో జాయింటు సంఘాలు ఏర్పరచి ప్రతిస్థానిక కాంగ్రెస్ సంఘంకూడ, రైతుల దైనందిన కార్యక్రమములో, పోరాటములో పాల్గొనట్లు చేయాలి.

రైతు సంఘాలు, కాంగ్రెసు సంఘాలకు పోటీ సంఘాలుగా వుండునట్లు వుండకూడదు. కాంగ్రెసులోని ప్రజాసామాన్య మంతకు రైతు సంఘాల పనికూడ ముఖ్యమైన కాంగ్రెసు పనే అనే భావము గలగాలి. ఇది, పనిద్వారానే చూపెట్టు గలుగుతాము.

ఎచ్చట, స్థానిక కాంగ్రెసు సంఘాలు మన కార్యక్రమమును అంగీకరించి పూర్తిగా పని చేయుట కిచ్ఛగించునో అచ్చట కాంగ్రెసు సంఘ పెత్తనము క్రిందనే పని సాగించాలి. మనము పెత్తనము వదలివేయుటకు సిద్ధపడి వారితో కలిసికొనవరకు, పని జేసేటట్లు చూడవలెను. పెత్తనము కాంగ్రెసు తీసికొన్నను, అట్టి పరిస్థితులలో నిజముగ మనమే ముఖ్యపాత్ర వహించి పని చేయవలయును. గాన మనకు పలుకుబడి ఏమి వుండదనే భయము అవుసరము లేదు.

రైతు సంఘము తరపున చేయు ప్రతి పనికి కాంగ్రెసు సహాయమును, కాంగ్రెసు మద్దత్తును స్వీకరించవలెను.

2. ఇప్పుడు మనము చేయుచున్న ఆందోళనా పద్ధతులలోనే తృప్తిచెందక, నిర్మాణ సమస్యలకు ఎక్కువగా ప్రాముఖ్యత నీయవలెను. ఈ క్రింది విధముగ నిర్మాణమును వెంటనే ఏర్పాటు చేయవలెను.

ప్రతి రైతు వర్కరును, నిర్ణీతమైన పనులుపంచుకొని, నిర్ణీత స్థలములలో పని చేయవలెను. రైతు సంఘాలను స్థాపించుటతోను, సభ్యులను చేర్పించుటతోనే

మన రైతు కార్యక్రమం పూర్తికాకూడదు. ముఖ్యంగా, స్థానిక సంఘములు స్థానిక ఇబ్బందులను గూర్చి పనిచేయుటకు పూనుకొనేటట్లు చేయాలి క్రింది సంఘాలు జిల్లాలోని కేంద్ర సంఘముతో ఎప్పటి కప్పుడు ఉత్తర ప్రత్యుత్తరములు జరుపు తుండేలాగున చేయుట ఆ స్థానిక వర్కర్ల, ముఖ్యముగా అచ్చటి పార్టీ సభ్యుల విధి. గ్రామ సంఘాలలో చేర్పించునప్పుడు, పేద రైతులు, మధ్య తరగతి రైతులును హెచ్చుగా చేరునట్లు మన పార్టీ సభ్యులు చూడాలి.

రైతు వాలంటీరు దళములను, గ్రామమున కొకటిగాని, లేక కొన్ని గ్రామముల కొకటి గాని వెంటనే ఏర్పాటు చేయవలయును.

**వెనువెంటనే ఆచరణయోగ్యమైన కార్యక్రమము:**

రైతుల దైనందిన కష్టములను తొలగించుటకు, చేయుచున్న పోరాటములు, ఇంతవరకు ఈ పోరాటముల విషయములో చాల అశ్రద్ధ వహించియుంటిమి. ఇకముందు, ముఖ్యంగా జమీందారీ రైతు ప్రదేశములలో వెనువెంటనే వచ్చుచున్న రైతు పోరాటములను ఆర్గనైజు చేసి సర్వతోముఖముగా అభివృద్ధి చేయవలయును. రైతు పోరాటములను నడుపుటకు సంసిద్ధులమై యుండవలెను. అవసరమైతే ప్రత్యక్ష చర్యలకు కూడ కొన్ని ప్రదేశములలో పూనుకొనవలెను.*

ప్రతి జిల్లాలో, ఒక నిర్ణీత కాలములో చేర్పించవలసిన సభ్యుల మొత్తము సంఖ్యను నిర్ణయము చేసి, ఆ సభ్యులను చేర్పించుట పూర్తి యగునట్లు చూడవలెను.

లేనిచోట్ల క్రొత్త సంఘములను ఏర్పరచు సమస్యను గురించి, వెనుకబడిన ప్రదేశాలలో హెచ్చుగా ఆందోళన ద్వారా ప్రచారము సాగించవలెను. ఎచ్చట మనకు రైతు సంఘాలు విరివిగా నున్నవో అచ్చట మన బలమును స్థిరపరచుకొని అచ్చటి ఉద్యమమును నిర్మాణ యుక్తముగ ఏర్పరచవలెనేగాని, అన్ని చోట్ల ఏమీ నిర్మాణము లేకుండ సంఘాలను విరివిగా స్థాపించి, అన్ని చోట్ల వచ్చు సమస్యలను ఎదుర్కొనన అశక్తులమై పోరాదు.

వెనువెంటనే అన్ని సంఘములను కలుపుకొని ఐక్య కంఠముతో పోరాడుటకు వీలుండునట్లు ఒక కార్యక్రమమును నిర్ణయించి, దానిని సాధించుటకు, తద్వారా అన్ని సంఘములకు మధ్య ఘనిష్ఠ సంబంధము ఏర్పరచునట్లు చేయవలయును. ఈ క్రింది కోర్కెల నాధారముగా గైకొనవలెను.

1. ఎస్టేటు ల్యాండు ఆక్టు సవరణ గూర్చి ఆందోళన.
2. అడవుల ఇబ్బందులు.
3. మైనరు ప్రాజెక్టుల నిర్మాణము.

4. లంచగొండి తనమును నిర్మూలించుట.

5. జమీందారీ ప్రదేశాలలో జరుగు అన్యాయములను, దౌర్జన్యములను ఆపుటకు ఆందోళన.

6. పరపతి సౌకర్యములను కలుగజేయుటకు ఆందోళన.

7. రైతు సమావేశాలు (Rallies) తరచుగా ఏర్పాటు చేసి వాటిలో కాంగ్రెసు సంఘములు కూడ పాల్గొనునట్లు చేయుట.

8. కౌలుదార్ల హక్కులను కాపాడుట.

**పార్టీ పత్రిక నుండి, పార్టీ నుండి సహాయం :**

వివిధ ప్రాంతాలలో జరిగిన విషయములు సమగ్రముగా వ్రాస్తూ ఆయా పరిస్థితులలో ఏ విధముగ నడచుకోవలెనో సూచించుట.

రైతు వర్కర్లకు, వివిధ పరిస్థితులలో ఏయే విధముగ నడుచుకోవలెనో సూచించుట.

శాసన సభలచే చేయబడిన చట్టములను గురించి ప్రభుత్వముచేయు ఇతర పనులను గురించి ప్రజా సామాన్యము చేయవలసిన పనులను వెల్లడించవలెను

కాంగ్రెసు ఎన్నికల ప్రణాళిక, వైజపూర్ తీర్మానముల ప్రకారం, కాంగ్రెసు మంత్రివర్గం శాసన సభలు, ఏయే చర్యలు తీసుకోవలెనో అందు విషయమై ప్రజలేమి చేయవలెనో వ్రాయవలెను.

వివిధ రాష్ట్రములలో ప్రభుత్వములు రైతులకెట్టి సౌకర్యములు కలిగించినవో తెలియజేస్తూ చెయ్యని రాష్ట్రములలో ప్రజలు ఎట్టి ఆందోళన చేయవలెనో వెల్లడించవలెను.

రైతు ఉద్యమము, జాతీయైక్య సంఘటనను ఎట్లు బలపర్చవలెనో వ్రాయవలెను.

రైతు పోరాటములు బయలుదేరినప్పుడు ఆందోళన ఎట్లు చేయవలెనో వ్రాయవలెను.

సోవియట్ యూనియన్‌లో వ్యవసాయ వృత్తి ఎట్లు అభివృద్ధియగుచున్నదీ వ్యాసాలు వ్రాస్తూ వుండాలి.

---

* ఇట్టి పరిస్థితులు ప్రజా సామాన్యంలో కాంగ్రెసు పలుకుబడిని భగ్నం చేయుటకై జమీందార్లు ప్రజలపై నిర్బంధాలను అధికము చేయుటచే ఏర్పడినవి. ఈ విషయములో రైతు సంఘములు వెంటనే తగు నిర్ణయమునకు వచ్చి తగు చర్య తీసుకోవలెను.

[నవశక్తి, 13-7-38, 9, 13 పేజీలు].

అనుబంధం - 2 'సి'

# వ్యవసాయ కూలీలకు ప్రత్యేక సంఘాలు అవసరమే : రైతుల - కూలీల సామరస్యానికి మనమేమి చేయాలి ?

## వ్యవసాయ కూలీల గురించి సోషలిస్టుల తీర్మానం

**నిర్వచనము :**

వ్యవసాయ సంబంధమగు పనులలో కూలి చేయువాడు వ్యవసాయ కూలి యనబడును.

**పరిస్థితులు :**

నేటి సమాజంలో పీడింపబడే వర్గాలలో వీరు ఒక ప్రధానవర్గంగా యున్నారు. వీరియొక్క జీవితమంతా కూలిమీదనే ఆధారపడియుంది, పాలేర్లుగా వున్నవారికితప్ప తక్కినవారికి సంవత్సరంలో సగంభాగం పనిదొరకదు. దిన వేతనాలు 0-1-6 నుండి 0-6-0 వరకు యుంటుంది. బాగా పని ఒత్తిడికాలంలో రోజుకు 0-6-0 కొన్నిచోట్ల 0-8-0 కూలీ దొరుకుతుంది. కూలీలో కనీసపు కూలి నిర్ణయము లేదు ఇది వేరువేరు తాలూకాలలో గ్రామాలలో స్థానిక పరిస్థితుల బట్టి వేరు వేరుగా యుంటుంది. కూలి ధాన్యరూపంగాను, డబ్బురూపంగాకూడా ఇవ్వబడుతుంది. వీరిలో దాదాపు అందరు అప్పులతో బాధపడుతుంటారు. గ్రామంలో నుండే ధనిక రైతులు, చిన్న వ్యాపారస్థులు, కొందరు మధ్యతరగతి రైతులు వీరికి చాలా హెచ్చు వడ్డీకి అప్పు ఇస్తుంటారు. ఎల్లప్పుడు చాకిరిచేస్తూ తాము ఎప్పుడో అప్పుగా పుచ్చుకొన్న చిన్న మొత్తాలనుకూడా వాళ్ళ జీవిత కాలంలో ఎప్పుడు చెల్లించుకోలేక యుంటారు. కొన్ని స్థలాల్లో వీరు ధనిక రైతుల ఇండ్లలో నెలలో కొన్ని రోజులు వుచితంగాకూడా (Free labour) సేవ చేయ వలసి వుంటుంది. మధ్యకాలపునాటి మూఢ నమ్మకాలు, ఆచార వ్యవహారాలు వీళ్ళను క్రుంగదీసివేస్తూ యున్నవి. సంఘంలో నుండే పై తరగతులయొక్క ఒత్తిడినంతా వీరే అధికంగా భరిస్తారు. దాదాపు అందరూ తక్కువ కులాలు

అనబడే కులాలకు చెందియుంటారు. పై కులాలు తరగతులు వీరిని అన్నివిధాల నీచంగా చూస్తారు. వీరిని రైతులు తిట్టటం, కొట్టటం తరచుగా ఉంటుంది. దాదాపు బానిసలయొక్క జీవితంమాదిరిగా యుంటుంది వీరియొక్క జీవనం, వ్యవసాయ కూలీలలో అధికసంఖ్యాకులు మాల మాదిగలుగా నున్నారు. వీరియొక్క అవస్థ ఇంతా అంతా యని చెప్పనలవి కాదు. అసలే విద్యాసౌకర్యాలు తక్కువ. దానితో పాటు అస్పృశ్యతా పిశాచం వీరిని విద్యావిహీనులుగా మరింతగా చేసింది. ప్రభుత్వ పాఠశాలల్లోకి, బావులవద్దకుకూడ వీరికి అర్హత యుండదు. బ్రిటిషు ప్రభుత్వముయొక్క దోపిడి విధానం మూలకంగా, కుటుంబంయొక్క వ్యాపకం మూలకంగా, పరిశ్రమలు ప్రోత్సహించబడక పోవుటచేత పూర్వము మధ్యతరగతి రైతులుగా యుండేవారు కాలక్రమేణా క్షీణించి, ఏమాత్రమూ భూమిలేక కూలి మీదనే ఆధారపడియుండు వ్యవసాయ కూలీలుగా మారుచున్నారు.

కాని పై కులాలలో నుండు రైతులు క్షీణించిపోయి కూలీలుగా మారి నప్పటికి కులాల యొక్క తీవ్రత సాంఘిక దురాచారాల ఫలితంగా ఆర్థికంగా ఒకే తరగతికి చెందినప్పటికి పై కులాలకు చెందిన కూలీలకు క్రింది కులాలకు చెందిన వ్యవసాయ కూలీలకు మధ్య కావలసినంత స్నేహభావము కలిగించుట లేదు. బీద రైతులు కూడా హీనకులస్థులైన కూలీలను పీడించుటవల్ల రెండు తరగతుల మధ్య నుండు వైషమ్యాలు వీరిద్దరికి మధ్య కూడా ప్రవేశించుచున్నవి. ఇవి ఒక్కొక్క స్థలంలో తీవ్రమగు తగాదాలకు కారణమవుతూ యున్నవి. రాచకీయంగా వ్యవసాయ కూలీలు చాల వెనుకబడి యుందురు. ఇంతవరకు కాంగ్రెసు ప్రచారము మధ్యతరగతి రైతులవరకు వ్యాపించింది. అసలు గ్రామానికి వేరే దూరంగా యుండే అస్పృశ్యులనబడేవారి ఆర్థిక రాజకీయాభివృద్ధికి తోడ్పడుటలో మన నాయకులు, రాజకీయవేత్తలు, నిర్లక్ష్యంచేసిరి. హిందూ సంఘం అంతా మాల మాదిగలను పూర్తిగా ఎంతో కాలమునుండి అణగద్రొక్కుతూ యుంటే క్రైస్తవ మతస్థులు వచ్చి వారిలో కొందరికి కొంతవరకు ఆశ గొల్పించారు. విద్యకు, సాంఘిక గౌరవానికి కొంతవరకు విదేశీయులు మతరూపేణా తోడ్పడ్డారు. ఈ కారణాలవల్ల వీరిలో జాతీయ చైతన్యం చాలా తక్కువగా యుంటుంది, కొన్ని స్థలాల్లో జాతీయ ఉద్యమం యెడల ద్వేషభావం కూడా గల్గింది.

## ఉద్యమ చరిత్ర :

వ్యవసాయ కూలీ ఉద్యమంలో పనిచేయటానికి అనేకులు అనేక వుద్దేశాలతో బయలుదేరారు, అమాయకులగు ప్రజలతో కొంతవరకు సంబంధం కలుగచేసుకొని, కొన్ని సౌకర్యములు కలుగచేసి వారిపైన పెత్తనం వహించటానికై, పంచాయతీబోర్డు మొదలగు వాటిలో పదవులు బడయటానికై కొందరు

ఆ ఉద్యమాన్ని బయలుదేరతీశారు. కుల వైషమ్యాలు ఆధారంగా చేసుకొని తాము తమ కులమును ఉద్ధరించటానికై కంకణం కట్టుకొన్నామంటూ, కొందరు కులస్థులనుండే వ్యవసాయ కూలీ ఉద్యమం అంటూ బయలుదేరారు. కాంగ్రెసులో వున్నత పదవులు దొరకనివారు, రైతు ఉద్యమం, రైతు నాయకుల యెడ వ్యక్తిగత ద్వేషాలుగలవారు కూడా ఈ ఉద్యమంలో పనిచేయసాగారు. రైతు ఉద్యమం యొక్క అభివృద్ధిని చూచి భయపడి రైతుకు, కూలీలకు తగాదాబెట్టి కూలీలను తమ పక్షము చేసుకొని రైతులను తొక్కిపెట్టుటకై కొందరు ఈ ఉద్యమం లేవదీశారు.

వ్యవసాయ కూలీలు దేశంలో పీడింపబడే వర్గాలలో ఒకరు, అధిక సంఖ్యాకులు; ముఖ్య విప్లవశక్తులలో వొకటి. వీరియొక్క పేద రైతులయొక్క తదితర రాజకీయ శక్తుల యొక్క జాతీయ ఐక్యసంఘటన అత్యంత అవసరమని గుర్తెరింగిన సోషలిస్టులు మరి యొక వైపునుండి ఈ ఉద్యమం ప్రారంభించారు.

1934 సంవత్సరము నుండి ఈ ఉద్యమం ప్రారంభమయిందని చెప్పవలసియుంది. కాని ఈ పని ఎవరికి తోచినట్లు వారు తమ తమ స్థలాల్లో చేసేవారు. నెల్లూరు జిల్లాలో కూలీల సంఘాలు వ్యవసాయ కూలీలలో కొందరి ఏనాదులపై సి. టి. యాక్టు మొదలగు నిర్బంధములను చాలవరకు తగ్గించుటకై తోడ్పడ్డది. గ్రామాల్లో సభలు పెట్టుచున్నప్పటికి ఏవో కొన్ని గ్రామాలలో తప్ప సంఘాలు ఏర్పడలేదు. మొదటిసారి గుంటూరు జిల్లాలో 1934 లో కరపత్రముల ద్వారా కూలీల కష్టాల గురించి వారికి ప్రబోధము చేయుచు ప్రచారము సాగింది. ప్రభుత్వమువారు ఉద్యమాన్ని మొదటనే త్రొక్కివేయటానికి ప్రయత్నం చేశారు. ప్రెస్సు యాక్టు ఉపయోగించారు. అంతటితో ఉద్యమం కొన్ని నెలలు ఆగిపోయింది. తిరిగి 1936 ఆఖరులో కొన్ని సంఘాలు ఏర్పడ్డాయి. రాత్రి పాఠశాలలు కూడా నడపబడ్డాయి. నెల్లూరు జిల్లాలో చాలా సమ్మెలు జరిగాయి. 1937 మొదటిసారి నామమాత్రమున ఆంధ్ర రాష్ట్ర వ్యవసాయ కూలీ సంఘము నెల్లూరులో స్థాపింపబడింది. ఈ ఉద్యమాన్ని విప్లవ పద్ధతుల మూలకంగా పెంపొందించటానికి రైతుల యెడ స్నేహభావం సాధ్యమైనంత వరకు గల్గించటానికి వీరు ప్రయత్నించలేదు. తరువాత కొద్ది నెలలకు ఈ రాష్ట్ర సంఘంలో సోషలిస్టు వ్యక్తుల యొక్క ప్రవేశం ఎక్కువగా కల్గింది. కాని సంఘంలో చేరిన నాయకులందరి మధ్య ఏకాభిప్రాయము, సఖ్యత ఏమాత్రం లేదని చెప్పవలసియుంది. ఇంతవరకు నిర్ణీత నియమావళి గాని, కార్యక్రమంగాని లేదు. ప్రాథమిక సంఘములకు రాష్ట్ర సంఘములకు సంబంధం

బొత్తిగాలేదు. 1938 లో కొన్ని జిల్లాలలో జిల్లాసంఘాలు, జిల్లా మహాసభలు జరిగాయి. డబ్బు ఇచ్చి ఏజంట్లను ఏర్పరచి వ్యవసాయ కూలీ సంఘాలు స్థాపించటం మొదలుపెట్టారు. వ్యవసాయ కూలీ సమస్య ఈ సంవత్సరంలోనే రాజకీయంగా ప్రాధాన్యత వహించట గల్గినది. సోషలిస్టులు దానియొక్క ప్రాముఖ్యత పూర్తిగా గ్రహించగల్గి తీవ్రముగా ఈ సమస్య విషయం చర్చలు చేయగల్గారు. పత్రికల్లో ఈ విషయమై వ్యాసాలు ప్రకటింపబడ్డాయి.

## ప్రత్యేక సంఘాలు ఎందుకు అవసరం :

విద్య, ఆచారాలు, సాంఘిక మర్యాదలు, వునికి వీటిల్లో రైతులకు కూలీలకు చాలా వత్యాసాలున్నాయి. రాజకీయ చైతన్యం రైతులలో చాలినంత లేనందు వల్ల, కూలీలలో అసలే లేనందువల్ల ప్రస్తుతంలో రైతులు, కూలీల మధ్య తీవ్ర మైన తగాదాలున్నవి. పరస్పరం విశ్వాసం అసలే లేదు. కులభేదంవల్ల పేద రైతుకూడా పేద కూలీని చాలా నీచంగా నిర్దాక్షిణ్యంగా చూస్తాడు. వీరిద్దరిని ఇట్టి పరిస్థితులలో ఒకే సంఘంలో చేర్చుట అసంభవం అని అనుభవం తెలియ పరుస్తూ యుంది. అంత మాత్రాన వీరిద్దరు పరస్పర విరుద్ధమగు రెండు తరగతు లని తలంచి వర్గపోరాటము వీరిద్దరి మధ్య తీసుకొని రాకూడదు. ఈ విధంగా కొందరు రాజకీయ జ్ఞానం ఏమాత్రము లేనివారు, అపోహబడుచున్నారు. కాబట్టి వేర్వేరు సంఘాలు వ్యవసాయ కూలీలకు చాలా అవసరం.

ప్రత్యేక సంఘాల యొక్క అవసరం గుర్తించిన మన కామ్రేడ్సు రైతు కూలీసఖ్యతకొరకై వీరిద్దరిమధ్యను తాత్కాలికసంఘర్షణకొరకై తీవ్రప్రచారము ద్వారా ఈ రెండు శక్తులను సమ్మిశితము చేసి సామ్రాజ్య ప్రతికూల పోరాట ముఖంగా వీరి దృష్టి మరల్చుటకై నిరంతరం పని చేయాలి. రైతు సంఘాల్లో, కూలీ సంఘాలలో పెత్తనం మన పార్టీవారు పూర్తిగా వహిస్తే చాల భాగం తగా దాలు చాకచక్యంగా తప్పించవచ్చును.

### రైతు సంఘాల్లో పనిచేయు పార్టీ సభ్యులు గమనించవలసిన విషయాలు:

1. సంఘము స్థాపించుటకు ముందు గ్రామములో సభ పెట్టి దేశములో ముఖ్యమగు రాజకీయ ఆర్థిక పరిస్థితులు, ముఖ్యంగా రైతుల దుస్థితి, కాంగ్రెసు సంఘము మొదలగు వాటిని గురించి విపులంగా బోధించాలి. పిదప సభ్యులను చేర్చి సంఘములుగా ఏర్పాటు చేయవలయును.

2. రైతుల యొక్క పోరాటములో కేవలం రైతుల యొక్క బలము చాలదనియు, రైతుల యొక్క క్షేమం, పోరాటముయొక్క అభివృద్ధి వ్యవసాయ కూలీల మీద కూడా ఏ విధంగా ఆధారపడిందో, రైతుకూలీల మధ్య నుండు తగా దాలు జమీందారులకు, ప్రభుత్వానికి ఏ విధంగా సహాయ పడుచున్నదో కూలీల సంఘాలు రైతులను ఎదిరించుటకు గాక తమకష్టములను పోగొట్టుకోడానికిన్నీ,

రాజకీయ పోరాటానికై స్థాపింపబడుచున్నవనీ, నేడు కూలీలు కోరు కోర్కెలు చాలా సామాన్యమైనవనీ, బోధచేయాలి

3. రైతు పాటలతోపాటు, కూలీపాటలు నినాదాలు కూడా చెప్పాలి. రైతు సభల్లో కూలీల హక్కుకొరకై కూడా తీర్మానాలు పెట్టాలి [ఆచార్య రంగాగారి వ్యవసాయ కూలీలను గురించిన కరపత్రం]

4. పీడాకరమగు ప్రభుత్వ ఆర్థిక విధానంవల్ల, రైతులు కాలక్రమేణ క్షీణించిపోవుటచేతనే వ్యవసాయ కూలీల సంఖ్య పెరిగిపోతుందని ఋజువు చేయాలి.

5. ప్రతి సభలో ఎర్రజెండా ఉపయోగిస్తూ రైతు, కూలీ సమ్మేళనాన్ని గురించి విశదీకరిస్తూ రష్యా ఉదాహరణగా చెప్పాలి.

6. రైతుయొక్క బీదతనానికి ప్రభుత్వం హెచ్చు వడ్డీలు, ఉద్యోగస్థుల లంచగొండితనమే కారణమని కూలీలకిచ్చే జీతాలుకాదని నచ్చచెప్పాలి.

**కూలీలలో పనిచేయువారు గమనించవలసిన విషయాలు :**

1. ప్రతి గ్రామంలో మొదటిసారి సాధ్యమైనంతవరకు రైతు, కూలీల జాయింటు సమావేశం జరపాలి.

2 రైతు పాటలుకూడా పాడాలి.

3. రైతులు, కూలీలు, కలియుటకు వీలుగాయుండే ఉమ్మడి స్థలంలో సభలు పెట్టాలి.

4. స్థానిక కాంగ్రెసు సంఘంలో ముఖ్యముగా రైతు సంఘములో పని చేయువారి యొక్క సహాయం తీసుకోవాలి.

5. మొదటిలోనే ప్రధానంగా ఆర్థిక సమస్యలను తీసుకొనకూడదు.

6. తగాదాలు వచ్చినప్పుడు రైతు పెద్దలు కూలీల పెద్దలు కలసి పరిష్కారం చేసుకోవాలి

7. కూలీలకు సంబంధించిన ఈ క్రింది విషయములగూర్చి పనిని ఆరంభించాలి.

**కార్యవిధానము :**

పిచ్చకుంచాలు, వెట్టిచాకిరీలు, బూతుల తిట్టుట, కొట్టుట, చేలోపండిన ధాన్యము, నాటువిధానము, సాంఘిక అసౌకర్యాలు, లంచగొండితనము, పన్నులు, బంజరు భూములు, హెచ్చు వడ్డీలు, వయోజన విద్యలో హక్కు, కంట్రాక్టులు, వ్యవసాయ కూలీ పిల్లలందరికి, కులవిచక్షణ లేకుండ ఉచిత విద్య, అటవీ హక్కులు, కట్టెలు తెచ్చుకొను హక్కు, యిండ్ల స్థలములు, ఋణములు ప్రభుత్వము నుండి నిరుద్యోగ భృతి. పాలేర్ల అబ్బందులు.

(నవశక్తి 13-7-38/- 10, 11 పేజీలు)

భావాలు కొంతవరకు ఏర్పడియుండినాయి. ఇక్కడ ఏర్పడ్డ రాష్ట్ర కార్యనిర్వాహక వర్గములో సోషలిస్టులే, కార్యక్రమాన్ని సాగిస్తూ వచ్చారు.

అప్పటికి సోషలిస్టులు పూర్తిఅయిన సెక్టేరియన్ దృక్పథం కల్గిఉన్నారు. లేబర్ ప్రొటెక్షన్ లీగును పార్టీగా ఉపయోగించుతున్నట్టే యూత్‌లీగ్‌ను ఇంకా విశాలమైన పార్టీగా ఉపయోగించేవారు. యువజన సంఘాల ద్వారా, రాజకీయాందోళన, లేబర్ ప్రొటెక్షన్ లీగు ద్వారా కన్నా ఎక్కువచేస్తూ ఉండేవారు. అక్కడక్కడ ఉన్న యువజన సంఘాలన్నింటినీ రాష్ట్ర సంఘం క్రింద కేంద్రీకరించి, కార్యక్రమాన్ని ఇంకా ఎక్కువ తీవ్రంగానూ, నిర్మాణ యుక్తంగాను కొనసాగించడానికి, ఆంధ్ర రాష్ట్ర యువజన సంఘ సమావేశము మరొకటి కాకినాడలో జరిపారు. ఈ పర్యాయం నాయకత్వం, పూర్తిగా సోషలిష్టులకు వచ్చినది.

ఇప్పటికి యువజన సంఘాలు ఆంధ్ర రాష్ట్రంలో బాగా అభివృద్ధి చెందినాయి. సోషలిస్టులకు సెక్టేరియన్ దృక్పథం అలాగే ఉండుటచేత, యువజన సంఘాల ద్వారా ఇదివరకు వలె ఆందోళన జరపటమే గాక, కాంగ్రెసు పనిని కూడా సాగిస్తూ ఉండేవారు. లేబరు ప్రొటెక్షను లీగు వారు. కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలో చేరిన తర్వాత కూడా సుమారు 1 సంవత్సరం వరకు యువజన సంఘాల పనిని సరిగ్గా అర్థం చేసికోలేక, యువజన సంఘాల ద్వారా అంతకు పూర్వం జరుపుతున్న కార్యక్రమాన్నే కొనసాగిస్తూ ఉండేవారు. కృష్ణా జిల్లాలో 1937 వ సంవతర్సం అఖరువరకు, యువజన సంఘాల తరపున కాం. సో. పార్టీ పనిని సాగిస్తూ ఉండేవారు.

1937 వ సంవత్సరము మార్చి నెలలో బందరులో, తృతీయ ఆంధ్ర రాష్ట్ర యువజన సంఘపు కాన్ఫరెన్సు జరిగింది. ఇప్పటికి యువజన సంఘాల పాత్రను అర్థం చేసుకొని. యువజన సంఘాలలో పనిచేయుటకు నియమింపబడిన కామ్రేడ్సు తప్ప మిగిలిన సోషలిస్టులందరు యువజన సంఘాల నుంచి, బైటికి రావలయుననే నిశ్చయానికి వచ్చారు. అచరణలో ఇది కొంతవరకు మాత్రమే జరిగింది. కాని, యువజన సంఘాలు, యువకులకు ఆర్థిక, సాంఘిక, రాజకీయ, శారీరక, విషయాలలో తరిఫీదు నిచ్చే రంగాలుగా ఉండాలనే అసలు కార్యక్రమాన్ని అమలులో పెట్టక పూర్వమే, కొత్తపట్టణంలో లాఠీ చార్జి జరిగింది. ఈ విషయం మీద, యువజన సంఘాలు తీవ్రమైన ఆందోళన చేసినవి. తర్వాత కూడా యువజన సంఘాలలో పనిచేయుటకు నియమింపబడ్డ వారిని ఆ పని మీద ప్రత్యేక శ్రద్ధ వహించుటకు వీలు లేకుండా ఇతర ప్రజా సంఘాల పనిని చేయటానికి నియమించింది. ఇంతవరకు యువజన సంఘాల ద్వారా చేస్తున్న ఆందోళనా కార్యక్రమం కూడా తగ్గిపోయింది.

1937 వ నవంబరు, నెల పాలకొల్లులో రాష్ట్ర యువజన సంఘ కార్య నిర్వాహక వర్గం సమావేశమై, పై చెప్పిన వారిని దీని నుంచి తీసివేసి ఇతర కామ్రేడ్స్‌ను ఈ పనికి నియమించింది. ఈ ప్రకారమే, జిల్లా కార్యనిర్వాహక వర్గములలో నుంచి కూడా, యువజన సంఘాలతో పనిచేయని వారిని తీసివేసి, ఇతర కామ్రేడ్స్‌ను నియమించాలని అనుకొన్నది. ఈ పని సాగలేదు. దీనికి కారణం పార్టీలో పనిని విభజించక పోవడం, సరియైన కట్టుబాటుతో పనిచేయక పోవడం, అనగా పార్టీ సరిగా పనిచేయక పోవడం. చివరకు ఒక కృష్ణా, తూర్పు గోదావరి జిల్లాలలో తప్ప సాంవత్సరిక సమావేశాలు కూడా జరుగకుండా పోయినాయి.

యువజన సంఘాలు సోషలిస్టుల నాయకత్వం క్రింద నడుపబడుచున్న పార్టీ క్రింది సంస్థలు కావు. అయినప్పటికి సోషలిస్టులు సెక్టేరియన్ దృక్పథంలో నడపడం వలన కాంగ్రెసు మితవాద నాయకులు యువజన సంఘాలను విరోధ భావంతో చూస్తూనే ఉన్నారు. ఇంతేగాక యువజన సంఘాలు సోషలిస్టు పార్టీగా నడుపబడుటచే యువజన సంఘాలు ఎంత అభివృద్ధి చెందాలో అంత అభివృద్ధి చెందలేదు.

అయినా కృష్ణాలో 120 మందికి, గుంటూరులో 50 మందికి మిలిటరీ శిక్షణ ఇవ్వగలిగింది. రాష్ట్రం మొత్తం మీద నేడు యువజన సంఘ సభ్యులు దాదాపు 2200 మంది. ప్రాథమిక సంఘాలు 170. కాని దినోత్సవములయినా జరుపునవి సుమారు 40 మాత్రమే ఉంటాయి. యువజన సంఘాలు అసెంబ్లీ ఎన్నికలలో పూర్తిగ పనిచేసి కాంగ్రెసు అభ్యర్థుల విజయానికి సాయపడినవి. రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుని అభినందనములు కూడ పొందినవి. కొంతమంది కా॥ సో॥ పార్టీ బాగా బలపడ్డది, యువజన సంఘాలు అనవసరం, మిగతా యువజన కార్యక్రమం కాంగ్రెసు కమిటీల ద్వారా చేయవచ్చునని వాదించు చున్నారు. వీరి వాదనలు సరియైనవి కావని ఈ క్రింది కారణాలు రుజువు చేస్తాయి.

1. ఆటలు, పాటలు, వైజ్ఞానిక విషయాలు (కల్చరల్ అండ్ ఔట్ డోర్ ఆక్టివిటీస్) కాంగ్రెసు కమిటీల ద్వారా చేయించటానికి వీలులేదు.

2. రాష్ట్ర యువజన సంఘంతో పరిచయం లేకుండానే కొన్నిచోట్ల యువజన సంఘాలు ఏర్పడుతున్నాయి. యువజన సంఘాలు రద్దు చేసే యెడల రియాక్షనరీలు ఈ సంఘాలను ఏర్పరచి యువకులను తప్పుత్రోవ పట్టిస్తారు.

3 వాలంటీరు దళాన్ని ప్రస్తుతం ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘం ఏర్పరచక, ప్రోత్సహించక, నిరోధించునట్లుకూడ కనపడుచున్నది. అతివాదుల పలుకుబడిలో ఉన్న కాంగ్రెసు కమిటీల ద్వారా తప్ప తదితర చోట్ల వాలంటీరు దళాన్ని ఏర్పరచటం సాధ్యం కాదు. అతివాదుల పలుకుబడిలో ఉన్న కమిటీలు

చాలా తక్కువ. కనుక ఇతర చోట్ల వాలంటీరు దళం యువజన సంఘాలద్వారా ఏర్పరచాల్సిన అవుసరం వుంది.

ప్రత్యేకంగా యువకులకు అవుసరమైన వైజ్ఞానిక శారీరక విషయాలలో తర్ఫీదు ఇవ్వటం ఇతర ప్రజా సంఘాల ద్వారా సాధ్యం గాదు. అందువల్ల ప్రత్యేకంగా యువజన సంఘాలుండటం అవుసరం ఉంది.

యువజన సంఘాలు వర్గ సంఘాలు కావు. అన్ని వర్గాలలోని యువకులను సంఘటన చేసి తరిఫీదు ఇయ్యాలి. యువకుల సాధారణ కోర్కెల కోసం ఆందోళన చేయాలి.

## కార్యక్రమము

1. ఆటలు, 2. అధ్యయన తరగతులు, 3. రాత్రి పాఠశాలలు, 4. లైబ్రరీలు, 5. దినోత్సవాలు జరుపుట, 6. వాలంటీరు దళం, 7. యువకులను ఎదుర్కొను చున్న ప్రధాన సమస్య అయిన యువకుల విద్యాభివృద్ధి. నిరుద్యోగమును తొలగించడానికి ప్రభుత్వాన్ని వత్తిడి చేయుట, 8. కాంగ్రెసు, ఇతర ప్రజా సంఘాలకు సహాయం చేయటం.

## వాలంటీరు దళం

కాంగ్రెసు కమిటీలు ఒప్పుకున్నచోట్ల వాటి యాజమాన్యం క్రిందనే వాలంటీరు దళాన్ని ఏర్పరచాలి. ఇతర చోట్ల యువజన సంఘాలు, ఇతర ప్రజా సంఘాల సహకారాన్ని తీసుకొని ఏర్పరచాలి. కాని కాంగ్రెసు వాలంటీర్ల దళంలో యువజన వాలంటీరు దళం వీలు దొరికిన వెంటనే కలపాలి.

## పై కార్యక్రమాన్ని కొనసాగించడానికి పార్టీ చేయాల్సిన పనులు

1. వెంటనే రాష్ట్ర, జిల్లా ఆఫీసులు పెట్టించి ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగేటట్లు చూడాలి.

2. రాష్ట్ర సంఘానికి ఒకరినీ, ప్రతి జిల్లాకు ఒక్కొక్కరినీ పార్టీ సభ్యులను బాధ్యులుగా పార్టీ నియమించాలి. వీరికి ఇతర బాధ్యతలు వుండకూడదు.

3. పైన ఉదహరించిన బాధ్యులు కమిటీగా ఏర్పడి కార్యక్రమాన్ని అమలులో పెట్టటానికి పూనుకోవాలి.

రాష్ట్ర పార్టీ నెలసరి రిపోర్టులు తీసుకొని సరిగా పని జరిగేటట్లు చూడాలి.

## నిర్మాణంలో మార్పులు

14-25 సంవత్సరముల లోపు వారినే యువజన సభ్యులుగా తీసుకోవాలి.

రాష్ట్రం మొత్తం మీద పనినంతా సాగించడానికి కామ్రేడ్ చంద్రరాజేశ్వర రావును నియమించడమైనది వీరు ప్రతి జిల్లాలోను ఒక్కొక్క వ్యక్తి ఈ పనికి ప్రత్యేకించునట్లు చూడవలయును. (నవశక్తి, 13-7-38, పేజీ. 11)

అనుబంధం - 2 'ఇ'

# ఆంధ్ర రాష్ట్ర కార్మికోద్యమం పరిశ్రమలు అభివృద్ధి కాలేదు ఉద్యమం ప్రారంభ అవస్థలో వుంది

## ట్రేడ్ యూనియన్ ఉద్యమంపై సోషలిస్టుల తీర్మానం

ఆంధ్ర రాష్ట్రంలో ట్రేడ్ యూనియను ఉద్యమం యొక్క ప్రత్యేక స్వభావం.

ఆంధ్ర దేశము వ్యవసాయ దేశం కావడం వల్లను, పెద్దపెద్ద పరిశ్రమలు లేకపోవుట చేతను, కార్మికోద్యమము ఎక్కువ అభివృద్ధి చెంది తగినంత రాజకీయ శక్తిగా ఉండుటకు అవకాశములు తక్కువగా వున్నవి.

ముఖ్యమైన పరిశ్రమ రైల్వే. దాదాపు 20,000 మంది కార్మికులు పని చేస్తున్నారు రైల్వే వర్కు షాపులు రాజమండ్రి, బెజవాడ, బిట్రగుంట, దొనకొండ, గుంతకల్లులో ఉన్నవి.

విశాఖపట్టణం జిల్లాలో నెల్లిమర్ల, చిట్టివలస జ్యూటు పరిశ్రమలో 5000 మంది కార్మికులు పని చేస్తున్నారు. ఏలూరులో ఒక జ్యూటు ఫ్యాక్టరీ యున్నది కాని అది ప్రస్తుతము పని చేయుట లేదు. గుంటూరులో ఉండిన ఫ్యాక్టరీ కూడ పోయింది.

బట్టల మిల్లులు పందలపాక (తూర్పు గోదావరి జిల్లాలో) ఉన్నవి. ఇచ్చట 800 మంది పని చేస్తున్నారు. ఈ వరకు బెజవాడకు సమీపంలో తాడేపల్లిలో ఒక మిల్లు యుండేది, పెద్దాపురంలో సిల్కు ఫ్యాక్టరీ ఒకటి ఉంది. చేతి మగ్గాలమీద పనిచేస్తారు. గుంటూరు జిల్లా చీరాల పొగాకు ఫ్యాక్టరీలో 1000 మంది ఉంటారు సీజను వచ్చినపుడు 5 - 6 వేల మంది పని చేస్తారు. పొగాకు ఫ్యాక్టరీలన్నీ గ్రామాలలోనే ఉన్నాయి. అవి సీజనులో మాత్రమే పని చేస్తుంటాయి.

చక్కెర ఫ్యాక్టరీలు ఉయ్యూరు, సామర్లకోటలలో ఉన్నవి.

బెజవాడ, ధవళేశ్వరంలలో పి డబ్ల్యు డి. వర్కుషాపులున్నాయి.

రాజమండ్రిలో పేపరు మిల్సు ఉన్నాయి. ప్రస్తుతం 200 మంది పని చేస్తున్నారు.

విశాఖపట్టణంలో హార్బరు వర్కర్లు 2000 మంది వున్నారు. కాకినాడ హార్బరు లేకపోయినా, తీరప్పు ఓడలు వస్తూపోతూ వుంటాయి. ఇచ్చట కూడా డాక్ వర్కర్లు ఉన్నారు.

నెల్లూరు జిల్లాలో అభ్రకపు గనులు, కడప, కర్నూలు జిల్లాలలో రాతి గనులు ఉన్నాయి. విశాఖపట్టణం జిల్లాలో మాంగనీస్ గనులున్నాయి.

చాలా చోట్ల వేరుసెనగ నూనె మిల్లులు, బియ్యపు మరలు (మిల్లులు) ఉన్నాయి. 10 మొదలు 1000 మంది కార్మికులతో నడపబడుతూ ఉన్నవి. అవి కూడా అధికమైన పెట్టుబడిచేత నడుపబడుట లేదు, కాన ఫ్యాక్టరీలు స్థిరంగా వుండుటలేదు.

ఆంధ్రరాష్ట్రంలో ఉన్న మున్సిపాలిటీలలో దాదాపు విద్యుచ్ఛక్తిని నెల కొల్పుతున్నారు. అందుచే ఎలక్ట్రికు కార్మికులను కూడ సంఘటన చేయవలసి ఉంటుంది.

మున్సిపాలిటీలలో పాకీ పని చేసేవారు, వీధులను ఊడ్చేవారు, తదితర మున్సిపాలిటీ వర్కర్లు చాలామంది ఉన్నారు.

తోళ్ళ పరిశ్రమ గుంటూరు, కృష్ణా, పశ్చిమ గోదావరి జిల్లాలో ఉన్నది. ఇచ్చట కూడ ట్రేడు యూనియనులు వృద్ధి పొందుతూ ఉన్నాయి.

పెద్ద పరిశ్రమలున్న చోట్ల గొప్ప ట్రేడు యూనియనులను వృద్ధి పొందించడానికి అవకాశముంది. పట్టణాలలో ఉన్న ఫ్యాక్టరీ పనివారలు, తోళ్ళ పనివారలు, ప్రెస్ వర్కర్సును, మున్సిపలు వర్కర్సును సంఘాలుగా ఏర్పరచిన రాజకీయ శక్తిగా కార్మికోద్యమం ఆంధ్రరాష్ట్రంలో తయారవుతుంది. ఫ్యాక్టరీల లోనూ, యితర పరిశ్రమలలోనూ పనిచేయు కార్మికులు గ్రామాలలో నుండుట చేత రైతు దృక్పథము (పెజంట్ క్యారక్టర్) వదలలేదని చెప్పవచ్చును.

## ట్రేడు యూనియను సంఘటన యొక్క ప్రస్తుత స్థితి, దాని బలము

యమ్.యస్ యమ్. రైల్వే పనివారల యూనియను బ్రాంచి 1920 సం॥న బెజవాడలో ఏర్పాటు కావింపబడి పని చేయుచున్నది. యూనియనులో సభ్యత్వము ఎక్కువగా ఉన్నప్పటికీ 1932 లో జరిగిన సమ్మె విఫలం అయినందున యూనియను బలహీనపడింది. 1936 నుండి అభివృద్ధి చెందుతూ వచ్చి

1938 సం॥లో రాజమండ్రి, బిట్రగుంటలలో కూడ బ్రాంచీలు ఏర్పాటు చేయగల్గింది. సభ్యత్వం 2500.

డాక్ వర్కర్సు యూనియను 1935 లో ప్రారంభమైంది 1500 మంది సభ్యులుండేవారు. కార్యదర్శి తప్పుడు పద్ధతుల వల్ల యూనియను బలహీనత జెందుతూ వచ్చింది. ప్రస్తుతం సభ్యత్వం 800.

నెల్లిమర్ల జ్యూటు వర్కర్సు యూనియను 1932లో ఏర్పాటు కాబడి 500 మంది సభ్యులు ఉన్నారు. చిట్టవలస యూనియను 1933 లో ఆర్గనైజు కాబడి 200 మంది సభ్యత్వం ఉండేది. చిట్టివలస కార్మిక కాంగ్రెసు సంఘంగా మార్చబడి ప్రస్తుతపు సమ్మెను సాగిస్తూ ఉంది. సభ్యత్వము 2000 దాకా అభివృద్ధి చెందింది.

చీరాల పొగాకు ఫ్యాక్టరీ యూనియను 1937లో స్థాపించబడి, 3000 సభ్యత్వమును కలిగిఉండేది. సమ్మె సందర్భములో కాల్పుల ఫలితాన యూనియను సభ్యత్వం తగ్గింది.

సామర్లకోటలో చక్కెర, ఆబ్కారీ, ఫ్యాక్టరీ కార్మికుల యూనియను నామమాత్రముగా ఉంది.

ఆంధ్ర రాష్ట్రంలో ప్రెస్ వర్కర్సు యూనియన్లు తెనాలి, గుంటూరు, బెజవాడలలో 1935లో స్థాపించబడినాయి. మొదటినుండి సోషలిస్టుల నాయకత్వం క్రిందనే ఉండుటచేత వారితో రాజకీయ పరిజ్ఞానము హెచ్చు. ఆంధ్రరాష్ట్ర ప్రెస్ వర్కర్సు యూనియను సభ్యత్వం 500.

ముఖ్యమైన పరిశ్రమలలో ఉన్న ట్రేడు యూనియనులన్నియూ, సంస్కరణవాదుల (రిఫార్మిస్టు) చేతులలో ఉండుటచేత సోషలిస్టులు తగినంత పని చేయలేకపోవుటచేత వర్గ కలహంమీద ఆధారపడిన ట్రేడు యూనియను చైతన్యముకూడ సరిగా లేదని చెప్పవచ్చును కొన్ని పట్టణాలలో మాత్రమే కొద్దిమంది పార్టీ సభ్యులు, ట్రేడు యూనియను పనిని ప్రారంభించినప్పటినుండి ఆ ప్రదేశాలలోనైన ఇట్టి చైతన్యాన్ని కలుగజేయ గలిగారు.

## చేసిన పనులు – లోపాలు

ఆంధ్రదేశములో, కూలీ సంరక్షణ సంఘం ద్వారా కార్మికుల మధ్య పని జేయడం ప్రారంభించాము. అప్పుడే గుంటూరు, తెనాలి, బెజవాడ ప్రెస్ వర్కర్సు యూనియనులను ఏర్పాటు చేశాం. విశాఖపట్టణంలో మనము హార్బరు వర్కర్సు యూనియనును ఏర్పాటు చేశాము. అధ్యక్షుడుగా ఉన్న సంస్కరణ వాదితో సహకార పద్ధతితో పని జేయటానికి బదులుగా, ఆయన నాయకత్వాన్ని తొలగించటానికి యూనియనునుకూడ భగ్నం కావించేటంత సంకుచిత పద్ధతులను కొందరు

సభ్యులు అవలంభించడము మూలంగా, యూనియను సభ్యుల మధ్య పలుకుబడి, సంబంధం పోయింది. అప్పటినుండి చేసిన పొరపాట్లను సవరించుకొని, ఐక్య సంఘటనను దృష్టిలో పెట్టుకొని పని సాగించడంవల్ల, నాయకత్వం మరియొకరి చేతులలో ఉన్నప్పటికీ యూనియను సభ్యులమధ్య సోషలిస్టులకు పలుకుబడి హెచ్చి, ట్రేడు యూనియను రోజురోజుకు తీవ్ర దృక్పథం అవలంబిస్తూవుంది. (మిలిటెంటు అవుతూ ఉంది.)

రైల్వే యూనియన్ సంస్కరణ వాదులలో ఉన్నప్పటికి పార్టీ సభ్యులు రైల్వే కార్మికుల మధ్య పని జేశారు. మన పార్టీ సభ్యులు పనిచేయడం మొదలు పెట్టినప్పటి నుండి యూనియను అభివృద్ధి జెంది, బెజవాడ బ్రాంచి క్రింద రెండు సబ్ బ్రాంచీలు ఏర్పాటు చేయగల్గింది. వారిలో తగినంత రాజకీయ చైతన్యం వృద్ధి పొందకపోయినా, ట్రేడ్‌యూనియన్ చైతన్యం ఎక్కువయింది. ప్రతి వర్కుషాపు ఉన్న ప్రదేశాలలో సభ్యులు పనిజేసి ఉండినా మిలిటెంటు యూనియన్లుగా అభివృద్ధి చేయగలిగేవారం. గుంటూరు జిల్లాలలో పొగాకు కార్మికుల మధ్య కొద్ది నెలల నుండి పనిజేయ ప్రారంభించాము. చీరాల సమ్మె నుండి సభ్యులు పనిజేసిన ఫలితంగా ఆ యూనియనులో కూడ స్థానము సంపాదించ గలిగాం.

జనుపనార పరిశ్రమ, బట్టల మిల్లుల పరిశ్రమ కార్మికుల మధ్య పని చేయలేదు. ఫ్యాక్టరీ కార్మికుల మధ్య తెనాలిలో తప్ప మిగిలిన స్థలాలలో పనిజేయ లేదు. ఎక్కువ జిల్లాలలో మోటారు డ్రైవర్సు యూనియన్ ఏర్పాటు అయినప్పటికి వానిలో పార్టీ సభ్యులు, పశ్చిమగోదావరి, కర్నూలులో తప్ప, ఎవరూ పని జేయుటలేదు. గుంటూరు జిల్లా మోటారు డ్రైవర్సు యూనియను పార్టీ సభ్యుల ప్రోత్సాహం సలహాలమీద ఏర్పడినా పార్టీ సభ్యులు వారితో సంబంధము ఉంచుకొనకపోవడము వల్లయూనియన్ పనిచేయుటలేదు. ఆంధ్రరాష్ట్ర ప్రెస్ వర్కర్స్ యూనియన్‌ను ఏర్పాటుజేసి ప్రతి ముఖ్యపట్టణంలో యూనియన్‌లు ఏర్పాటు జేశాము. బెజవాడ, తెనాలి, ఏలూరులలో ప్రెస్ వర్కర్స్‌లో రాజకీయ చైతన్యం అభివృద్ధి జెందినది. ట్రేడ్ యూనియన్‌ను పని జేయుచున్న పార్టీ సభ్యులు చాల కొద్దిమంది, మొత్తము మీద నిర్లక్ష్యము చేశామని చెప్పవచ్చును.

## మన కర్తవ్యము

1. కార్మిక సంఘం, కార్మికుల వర్గపోరాటమును నడుపు సంస్థ, మరియు కార్మికులు సోషలిజం కోసం పోరాడడానికి తర్ఫీదు రంగము. కార్మికవర్గ పార్టీకి, కార్మికవర్గ బలము ముఖ్యము. ఆంధ్రదేశములో కార్మిక వర్గమునుండి పార్టీ లోనికి సభ్యులు రానిదే పార్టీ కార్మిక స్వభావము పొందదు. (పొలిటేరియనైజ్

కాదు) పార్టీని ప్రొలిటేరియనైజ్ చేయడానికి ట్రేడుయూనియన్సు చాలా ముఖ్యము. కార్మికులు రోజు రోజు జరుపు పోరాటము ద్వారా తమ హక్కులు సంపాదించ ప్రయత్నిస్తారు. సోషలిజము వచ్చేదాక తమ పూర్తి హక్కులు రావని గుర్తించి సోషలిజము స్థాపించడానికి కార్మికవర్గ పార్టీ అవసరమని గ్రహించి పార్టీలోకి వస్తారు.

2. కాన ట్రేడు యూనియను పని యందు ఎక్కువ శ్రద్ధ వహించాలి. కార్మికుల రాజకీయ చైతన్యము, వారు రోజు రోజు జరుపు పోరాటము వల్లనే అభివృద్ధి జెందుతుంది. యజమానులు వారి శ్రమ శక్తిని దోపిడి చేయు అన్ని ప్రయత్నాలను ఎదుర్కొని పోరాటము సాగించవలసి వుంటుంది. సంఘాలు ఏర్పాటుగాని పరిశ్రమలలో ట్రేడు యూనియనులను ఆర్గనైజు చేయడము మన ముఖ్య కర్తవ్యము కావాలి. నామ మాత్రమే ఉన్న ట్రేడు యూనియనులను వృద్ధి జేసి కార్మికుల పోరాటాలను నడుపుటకు పార్టీ పూనుకోవాలి. ఆంధ్ర దేశములో పెద్ద పెద్ద పరిశ్రమలలో పనిజేయు కార్మికులు రిఫార్మిస్టుల పలుకుబడిలో ఉన్నారు. రిఫార్మిస్టు దృక్పథం నుంచి కార్మికులను మరల్చడానికి వారి నాయకత్వములో నున్న ట్రేడు యూనియనులలో కూడ పార్టీ సభ్యులు పనిజేయాలి. కార్మికుల దైనందిన కష్టాలలో పాల్గొంటూ వారి వర్గ సంఘములను వృద్ధి పరచుచూ పోరాటాన్ని ముందుకు తీసుకుపోవాలి. వర్గ పోరాటము తీవ్రపడుచున్న కొలది రిఫార్మిస్టు నాయకులుకూడ ముందుకు రావాలని ఉంటుంది. స్టడీ సర్కిల్సు రాత్రి పాఠశాలలు ద్వారా కార్మికులకు తగిన తర్ఫీదు యిచ్చి, వారిలో నుండి పార్టీలోకి సభ్యులను తీసుకపోవాలి. ఈ విధంగా పార్టీలోకి వీరు వచ్చినపుడు ప్రస్తుత పార్టీసభ్యులకు నేడు మిగిలియున్న పెట్టిబూర్జువా వాసనలు (ప్రిజుడిసెసు) పూర్తిగా పోతాయి.

3. కార్మికులకు గల్గు చిన్న యిబ్బందులనుకూడ తీసుకొని ఆ యిబ్బందులను తొలగించుటకు తీవ్రమైన కృషి జేయాలి. వారి యొక్క తాత్కాలిక కోర్కెలకొరకు ఆందోళన చేయాలి. ప్రతి పరిశ్రమలోనూ, పనిజేయు కార్మికుల తాత్కాలిక కోర్కెలను, కార్మికులు చెప్పు రోజు రోజు కష్టాలను ఆధారం జేసుకునే తయారుజేయాలి. వారందరిచేత అంగీకరించబడ్డ ఆ సామాన్య కోర్కెలను సంపాదించుటకు వారి వర్గ సంఘాలలోనికి వారిని తీసుకొని రావాలి. అన్ని పరిశ్రమలలో పనిజేయు కార్మికులకు, సంబంధించిన యీ కనీసపు కోర్కెలకు, వారిని క్రోడీకరించి ఉద్యమము ముందుకు తీసుకోవాలి.

1. 8 గంటలకు మించని పని.
2. కనీసము 25 రు. జీతం.
3. నిరుద్యోగ భీమా, ముసలితనంలో పెన్షన్సు.
4. సంవత్సరమునకు ఒక నెల జీతంతో సెలవు.

5. ఉచిత గృహము, ఉచిత వైద్య సహాయము.

6. 14 సం॥ లోపల వారిని ఫ్యాక్టరీ పనిలోకి తీసుకోకూడదు. తీసుకోవడం దండనార్హము చేయాలి.

7. గర్భిణీ స్త్రీలకు జీతం మీద రెండు నెలలు సెలవు.

8. సమ్మె చేయడానికి, పికెటింగు జేయడానికి హక్కు.

9. యూనియనులను గుర్తించాలి.

10. వాక్స్వాతంత్ర్యము, పత్రికా స్వాతంత్ర్యము, సమావేశ స్వాతంత్ర్యము.

11. కార్మికులకు, వారి పిల్లలకు ఉచిత విద్యా సౌకర్యాలు.

12. కార్మిక తగాదాల చట్టాన్ని రద్దు చేయాలి.

13. "వేతనాల ఆక్టు" (పేమెంటు ఆఫ్ వేజెస్) లోని మోడీ సవరణను రద్దుచేయాలి.

14. ఫ్యాక్టరీ యాక్టు ప్రతి 5 గురు పనిజేయు కార్ఖానాకు వర్తించేటట్లు చేయాలి.

4. కార్మికుల హక్కులను కార్మిక వర్గానికి జెందని యితర ప్రజా సామాన్యములో కూడ ప్రచారం జేయాలి. కార్మిక పోరాటాలను యితర ప్రజా సామాన్య పోరాటాలను, సమన్వయం జేసి ఉద్యమం నడిపితేగాని జాతీయ ఐక్య సంఘటనను నిర్మించలేము. జాతీయ ఐక్య సంఘటనకు పునాది అయిన, కాంగ్రెసు కమిటీలు, కార్మికుల కనీసపు కోర్కెలు సామాన్య పౌరసత్య హక్కులు కాన కార్మికుల పోరాటంతో సంబంధం కలుగజేసుకొనేటట్లు చేయాలి.

అంటే కార్మిక సమ్మెలను కాంగ్రెసు బలపరచి ఆందోళన సహాయము గావించేటట్లు తీసుకురావాలి.

వెంటనే పార్టీ ఈ క్రిందిసూచనలను ఆచరణలో పెట్టాలి.

1. ప్రతి జిల్లాలో ఒక పార్టీ సభ్యుడు రైల్వే కార్మికుల మధ్య పని జేయాలి.

2. జిల్లాలో ఇతర ట్రేడు యూనియను పనికోసం తగినంత మంది పార్టీ సభ్యులను వినియోగించాలి.

3. రాష్ట్ర పార్టీ ఒక లేబరు సబ్ కమిటిని ఏర్పాటు చేయాలి.

4. లేబరు సబ్ కమిటీకి ట్రేడు యూనియను ఉద్యమము మీద అవసరమైన సారస్వతమును, విషయాలను అందజేయాలి.

5. ప్రతి జిల్లానుండి ట్రేడు యూనియను పనికి నియమించిన పార్టీ సభ్యుడు ఆఫీసుకు రిపోర్టులను ప్రతి నెలా పంపాలి.

(నవశక్తి, 20-7-38, పేజీలు 6, 7)

అనుబంధం - 2 'ఎఫ్'

# ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఉద్యమం

## విద్యార్థులపై, సోషలిస్టులు గావించిన తీర్మానము

1920-21 సహాయ నిరాకరణోద్యమములలో విద్యార్థులను, పాశ్చాత్య విద్య నేర్పే పాఠశాలలను బహిష్కరించమని, ఆదేశించింది కాంగ్రెసు. అందుకు కారణాలు :

1. జాతీయతకు వ్యతిరేకమని, రాజభక్తి భావాలను పురిగొల్పుతుందనీ
2. భరింపరాని ఖర్చనీ
3. వృత్తివిద్య కాకపోవడం వల్ల నిరుద్యోగ సమయాల్లో నిరుపయోగమనీ

విద్యార్థి ఉద్యమం, కాంగ్రెసు ప్రారంభించిన సామ్రాజ్య వ్యతిరేక పోరాట ఫలితంగా పుట్టింది.

1922 నాటికి, కాంగ్రెసు ప్రత్యక్ష పోరాటాన్ని విరమించింది. తరువాత 1929 వరకు చట్ట సమ్మత మార్గాలు త్రొక్కింది.

1920-21 లో విద్యార్థులలో రెచ్చకొట్టబడ్డ జాతీయ భావాలు, సామ్రాజ్య వ్యతిరేకోత్సాహము 1924 లో ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభలో ప్రదర్శితమైనవి.ఎంత అనిశ్చితమైనా, విద్యార్థి ఉద్యమం ఇంతటితో ఒక సంఘటనా రూపం పొందినదని చెప్పవచ్చు. కాని అప్పటి కాంగ్రెసు వలె మితవాద ధోరణిలో నడిచింది. ఏవో కొన్ని తీర్మానాలు చేయడం, విందులు, వినోదాలు జరపడంతో 1936 నాటికి 13 మహాసభలు గడచినవి. కాకపోతే కొంత స్పష్టంగా జాతీయ భావాలు వెల్లడించింది. ఇది మొదటి దశ.

## రెండవ దశ

1928 లో ఏర్పడ్డ ఆర్థిక మాంద్యం, 1930-31, 32, 33 ఉద్యమాలు ఆర్థికంగాను, రాజకీయంగాను, సాంఘికంగాను హిందూ దేశంలో బ్రిటిషు సామ్రాజ్యవాద విద్యా విధానం యొక్క నిజ స్వరూపాన్ని ఎక్కువగా విశద పరచినవి. ఉద్యమాలలో జైళ్ళకు పోయిన కొందరు విద్యార్థులు, యువకులు, విద్యకై ఉత్తర హిందూ స్థానానికి పోయిన కొందరు విద్యార్థులు సోషలిజంతో

పరిచయానికి వచ్చారు. దీనివల్ల హిందూ దేశానికి స్వాతంత్ర్యం సోషలిస్టు ప్రభుత్వ స్థాపనతోటే సాధ్యమని, ఇందుకు జరిగే విప్లవంలో కార్మికులు నాయకత్వానికి వస్తారని, కర్షకులు, విద్యార్థులు, యువకులు, మొదలైన పీడిత ప్రజాసామాన్య మంతా ఈ నాయకత్వం క్రిందికి రావాలని అభిప్రాయాలు ప్రచారం చేయబడ్డాయి.

1935 మధ్య కాలానికి, సంపూర్ణ స్వాతంత్ర్య సంపాదన, ప్రస్తుతం జాతీయ పోరాటానికి నాయకత్వం వహించి వున్న బూర్జువాల చేతకాదనీ, అందుకు పీడిత ప్రజా సామాన్యం (కార్మికులు, కర్షకులు, విద్యార్థులు, స్త్రీలు) యొక్క సామ్రాజ్య వ్యతిరేక సంస్థలతోకూడిన జాతీయైక్య సంఘటన నిర్మించా లనే భావాలు అంతర్జాతీయంగా, ఫాసిజానికి, యుద్ధానికి వ్యతిరేకంగా ప్రజా సంఘటన (పీపుల్స్ ఫ్రంటు) ఏర్పరచాలన్న భావానికనుగుణ్యంగా - మన దేశంలో సోషలిస్టులకును గలిగాయి. ఈ ఉద్దేశముతో విద్యార్థుల అధ్యయన తరగతులు - ఎక్కువగా సోషలిస్టులు పెట్టారు. వారి కనీసపు ఆర్థిక రాజకీయ హక్కులను గురించిన ప్రచారం ఎక్కువైంది. స్థానిక విద్యార్థి సంఘాలు ఏర్ప డడం మొదలు పెట్టినవి. కాని ఈ సంఘాల కార్యక్రమం ఇంకా నిశ్చితం కాలేదు. సభ్యత్వం గాని, ఆఫీసులు గాని లేవని చెప్పవచ్చు.

1936 లో అఖిల భారత విద్యార్థి సంఘం ఏర్పడినది. విద్యార్థుల సర్వ సాధారణమైన కనీస హక్కుల ప్రణాళిక ఏర్పరచబడ్డది. 1937 లో ఎసెంబ్లీ ఎన్నికలలో విద్యార్థులు తీవ్రంగా పాల్గొన్నారు. దీనివలన విద్యార్థి సంఘాలు ప్రత్యేకముగా ఏర్పరచటానికి అవకాశం కల్గింది. 1937 మే నెలలో విశాఖపట్టణం విద్యార్థులు కొందరు ఆంధ్రరాష్ట్ర విద్యార్థి సంఘమేర్పరచి, దానిని అఖిల భారత సంఘానికి అనుబంధించాలనుకున్నారు.

1937 లో కొత్త పట్టణం పాఠశాలకు ఆంధ్ర దేశమంతటి నుంచి కాలేజీ హై స్కూళ్ళలో చదువుకునేవారు వచ్చారు. వీరిలో చాలా మంది నిషేధాన్ని ఉల్లంఘించి జైలుకు పోయారు. తెనాలిలో విడుదల అయిన వెంటనే, ఇక కొంద రితో కలిసి (వీరిలో చాల మంది సోషలిస్టులు) గుంటూరులో ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహా సభ జరుప నిశ్చయించారు. కనీస హక్కుల ప్రణాళికతో గూడిన విజ్ఞప్తి విరివిగా పంచిపెట్టబడ్డది. మహా సభాధ్యక్షుడు కామ్రేడ్ బాట్లీవాలా 15 రోజులు ముందుగానే వచ్చి, ఆంధ్ర దేశమంతటా విద్యార్థులలో తీవ్రమైన ప్రబోధం కలిగించాడు. స్థానిక సంఘాలు కొత్తవి ఏర్పడ్డవి. ఉన్నవి పని చేయ మొదలు పెట్టినవి.

ఈ లోపల, అంతకు ముందు ఉన్నదా లేదా అన్నట్లు నడుస్తున్న పాత విద్యార్థి ఫెడరేషను, జరుగబోయే దానిని 14 వ మహా సభగా పరిగణించి రికార్డు పంపారు.

1937 ఆగస్టు చివరి వారంలో ఆంధ్ర విద్యార్థి ఫెడరేషన్ 14 వ సమావేశం జరిగింది. ఆంధ్ర రాష్ట్ర విద్యార్థులకు సంబంధించిన కనీస హక్కులను గురించిన నిశ్చితమైన తీర్మానాలు చేయబడ్డవి. హక్కుల ప్రణాళిక, నియమావళి, (కాన్‌స్టిట్యూషన్ అండ్ చార్టర్ ఆఫ్ డిమాండ్సు) తయారైంది.

ఆ రోజుల్లో యం. యన్. రాయ్ ఆంధ్ర దేశానికి రావడం జరిగింది. విద్యార్థి సంఘాల మీద చిన్న చూపు చూచాడు. దానితో రాయిస్టు విద్యార్థులు కొందరు, అసంతృప్తి చెందిన పూర్వ ఫెడరేషన్ అధికారులు కొందరు, ఏదో గిల్లి కజ్జా పెట్టుకున్నారు. కాని ఇది, సిద్ధాంత బలాన్ని పొందిన నూతన ఆంధ్ర విద్యార్థి ఫెడరేషన్ రాకముందు నలిగి నశించి పోయింది.

## మూడవ దశ

ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభ జరిగిన తరువాత ఆంధ్ర దేశ విద్యార్థులలో నూతనోత్సాహం రేకెత్తింది. వారి హక్కులను గురించిన చైతన్యం, వాటిని సాధించుకునే పట్టుదల ఎక్కువైనవి. అందుకు వారు తీవ్రంగా సమ్మెలు సాగించారు. నవంబరు మొదటి రోజుల్లో ఆంధ్ర దేశంలో మొట్టమొదటగా, విద్యార్థులు కనీస హక్కులకోసం తెనాలి హైస్కూలులో బ్రహ్మాండమైన సమ్మె జరిగి పరిపూర్ణ జయం పొందింది. పామర్రు హైస్కూలు సమ్మె కూడ జయప్రదంగా జరిగింది. ఈ సమ్మె, కృష్ణా జిల్లాలోని సమ్మెలకు దారితీసింది. విద్యార్థుల కనీస కోర్కెలలో తీవ్రమైన కోరిక డిటెన్షన్లు రద్దు చేయాలని యీ కోర్కె మీద మొట్టమొదటి సమ్మె గుంటూరు క్రిస్టియన్ కాలేజీలో జరిగింది. చాలా బలంగా జరిగిన ఈ సమ్మెకు ఆయువు పట్టు సామ్యవాద దృక్పథం కలిగిన విద్యార్థులే. నాయకత్వం వహించింది కూడా ఈ సోషలిస్టు విద్యార్థులేనని చెప్పాలి. డిటెన్షన్లు రద్దు కావాలనే కోరిక మీద జరిగిన మొట్టమొదటి సమ్మె గాబట్టి చరిత్రాత్మకమవడమే కాకుండా, ఇందులో నాయకత్వం చేసిన లోపాల వల్ల కూడ ఇది చరిత్రాత్మకమైనదనియే చెప్పాలి.

## లోపాలు

1. రెండు శాఖలుగా వున్న మేనేజిమెంటులో ఒక శాఖనందు మెత్తదనం చూపడంవల్ల విద్యార్థులకు ప్రిన్సిపాలుపై కావలసినంత ఒత్తిడి తీసుకురాబడలేదు.

2. లెక్చరర్లను ఎక్కువగా విమర్శించి వారి సానుభూతిని పోగొట్టుకున్నారు.

3. సమ్మెకు నాయకత్వము వహించిన విద్యార్థులు, పిలువక ముందే రాయబారము లారంభించారు.

4. రాజీ షరతులకు ఒప్పుకొమ్మని లెక్చరర్ల ఇండ్లదగ్గర విద్యార్థి ప్రతినిధుల కాన్వాసింగ్.

5. పురజనులనుండి ఒత్తిడి తీసుకొని వచ్చుటకు తగినంత ప్రయత్నించక పోవుట.

వీనివల్ల సమ్మె పూర్తిగా జయం పొందలేదు. ఈ తరువాత ఆంధ్ర దేశమంతటా హైస్కూళ్ళలోనూ, కాలేజీలలోనూ ఈ డిటెన్షన్ల కోరికమీద సమ్మెలు జరిగినవి. ఒకటి రెండు తప్ప మిగిలిన అన్ని చోట్ల పూర్ణంగా జయంపొందినవి.

తరువాత విశాఖపట్టణం మెడికల్ కాలేజి విద్యార్థులు, తమ కాలేజ్ డిగ్రీలు ఎన్ని విన్నపాలు పంపుకున్నా గుర్తించడంలేదని సమ్మె చేశారు. ఆరోగ్య శాఖా మంత్రి రాజన్‌గారు అన్ని సంగతులు చక్కబడేటట్లు చూస్తామని వాగ్దానం చేయ దలచే సమ్మె చాలించారు. ఆ వాగ్దానం అప్పటికి ఇప్పటికి అలానే వుంది.

## ప్రస్తుత స్థితి

ఆంధ్రరాష్ట్ర ఫెడరేషన్ ఏర్పడ్డ తరువాత విద్యార్థి ఉద్యమంలో సమ్మెలు తప్ప చెప్పుకోదగ్గ కార్యక్రమమేమీ జరుగలేదు. సమ్మెలలో సృష్టించే విప్లవ చైతన్యానికి ఫలితంగా మంత్రిపదవి [illegible] రాజకీయ పాత్రలకు [illegible] పైగా విద్యార్థులు వచ్చారు. మహాసభలో ప్రసంగాలు [illegible] ప్రకటనలు, కార్యక్రమం తీర్మానాలు, [illegible], అచ్చు వేయించి పంచి పెట్టడం [illegible] ఫెడరేషన్‌కొక ఆఫీసుగాని, సభ్యుల లిస్టుగాని ఉత్తర ప్రత్యుత్తరములుగాని లేవు. జిల్లా ఫెడరేషను ఏర్పడ్డవి. వాటి స్థితి యింతే. విప్లవ చైతన్యం ఎం[illegible] తైనా, సిద్ధాంత బలం [illegible]. విద్యార్థి సోదరులకు కాంగ్రెసు, [illegible] మహాసభ సంఘ [illegible] కాంగ్రెసు [illegible] నిర్మించాలని మాటలు చెప్పారేగాని, కాంగ్రెసు ప్రాథమిక సంఘాలకుగాని విద్యార్థి ప్రాథమిక సంఘాలకుగాని, [illegible] కార్యక్రమం లేకపోవడంతో [illegible] సంబంధం కూడా లేకపోయింది. ఏదో ఎన్నికల్లలో పాల్గొనటం మాత్రం జరిగింది. అక్కడక్కడ దినోత్సవాలు జరుపడంలో సోషలిస్టు పార్టీ యువజన సంఘాల జాబితాకు తమ పేరు జేర్చటం మాత్రం జరిగింది. ఒకవేళ చురుకుగా ఉత్సవాలు జరిపినా, కాంగ్రెసు సంఘాలతో సంబంధం లేకుండ జరిపినవి. ఇది స్థానిక సోషలిస్టు పార్టీకి, కాంగ్రెసు సంఘానికి వున్న సంయుక్త సంఘటన (యు.యస్.యఫ్) కార్యక్రమాన్ని అనుసరించి వుంటుంది. రాష్ట్రం మొత్తం మీద అన్ని విద్యార్థి సంఘాలు సోషలిస్టు పలుకుబడి క్రింద ఉన్నవని చెప్పవచ్చును. మొత్తం

మీద విద్యార్థి ఉద్యమంలో సెక్టేరియనిజం ఎక్కువగా అగుపడుతుంది. దీనికి కారణం కాంగ్రెసు సంఘాలతో కలిసి చేయగల దైనందిన కార్యక్రమం నిర్ణయించక పోవడం. విద్యార్థుల సమ్మె పోరాటాలలో కాంగ్రెసు నాయకులుగాని, సంస్థలుగాని జోక్యం పుచ్చుకోకపోవడం.

రాష్ట్రంలో అధికారం వహించియున్న కాంగ్రెసు మంత్రివర్గం వారు సమ్మెలు జరుగునంత కాలము మాట్లాడకుండ వూరుకున్నా ఇటీవల రెండు కమ్యూనిక్కులు ఇచ్చారు. వీటివల్ల కాలేజీ, హైస్కూలు అధికారుల చేతుల్లో నిరంకుశాధికారాలు వెంటబడ్డాయి. బందరు కాకినాడ కాలేజీల నుండి, సమ్మెలలో పాల్గొన్న వారినీ, విద్యార్థి సంఘాలను నడిపే వారిని కొందరు విద్యార్థులను పంపివేశారు. దాదాపు అన్నిచోట్ల పూర్వపు రాజీ ఒడంబడికలు ఉల్లంఘింపబడుతున్నాయి. (గుంటూరు, బందరు, నెల్లూరు.)

**ముందు కర్తవ్యం :-** అవసరంగా ఆఫీసులు నెలకొల్పాలి.

విద్యార్థుల సాధారణ కనీసపు కోర్కెలను స్థానిక ఇబ్బందులను గురించి ప్రచారం చేస్తూ స్థానిక సంఘాలేర్పరచాలి. సభ్యులను అలాగే చేర్పించాలి.

స్థానిక సంఘాలు పూర్వము సమ్మెల సందర్భంలో జరిగిన రాజీ షరతులు ఆచరణలో ఎంతవరకు వచ్చినవో, విద్యార్థులకు, స్కూలు అధికారులకు తెలియజేస్తూ వుండాలి. (వ్రాతమూలకంగా)

తల్లిదండ్రుల కోసం, ఇతర ప్రజలకోసం, అర్థమయ్యేటట్లు ఈ విషయమై కరపత్రాలు వేయించి పంచిపెట్టాలి.

విద్యార్థుల కోర్కెల గురించి, సంఘాల దినచర్యలను గురించి, ఉపాధ్యాయులకు లెక్చరర్లకు తెలియజెప్పాలి.

ప్రతివారం విద్యార్థి సంఘ సభ కూడాలి (దీనికి సభ్యులు కాని ఇతర విద్యార్థులు కూడ రావచ్చును. కాని ఓటింగు హక్కు వుండదు.

## దిన దిన కార్యక్రమము

జాతీయ, అంతర్జాతీయ రాజకీయాల మీద, అభివృద్ధికరమైన సారస్వతం మీద, చర్చలు ఉపన్యాసాలు

అప్పుడప్పుడు ఉపన్యాస పోటీ, వ్యాసరచన పోటీలు ఆటలలో పోటీలు (సంఘంలో చేరకపోయినా సంఘ ఆశయాన్ని ఒప్పుకునే వారందరు పోటీచేయ నర్హులుగా వుండాలి.) వాలంటీరు దళాలు. రాత్రి పాఠశాలలు.

లెక్కలు. (స్టాటిస్టిక్స్) దీనిని గూర్చి విద్యార్థులు తెలుసుకోవాలి.

నిరుద్యోగులు - విద్యావంతులు
విద్యలేనివారు,

కార్మికులు:- కుటుంబ ఖర్చులు - అప్పులు,

## అధ్యయన తరగతులు

విద్యార్థులతో పనిచేసేవారు, మద్రాసు ఎడ్యుకేషనల్ రూల్సు, ఇతర రాష్ట్ర నిబంధనలతో పోల్చి చదవాలి.

జాతీయ, అంతర్జాతీయ విద్యార్థి ఉద్యమాలు, కొన్ని విద్యా విధానాలు (వార్ధా విద్యా విధానం ప్రత్యేకంగా) జాతీయ ప్రజా విప్లవంలోనూ, సోషలిస్టు విప్లవంలోనూ విద్యార్థుల భాగం, వీనిని గూర్చి తెలిసికొని వుండాలి.

జాతీయ దినోత్సవాలు జరపాలి. రాష్ట్ర మంతటా ఈ క్రింది వాటి విషయమై విద్యార్థి ఫెడరేషన్ ఆందోళన చేయాలి. రాష్ట్రం మొత్తం మీద ఉద్యమం లేవదీయాలి.

మద్రాసు విద్యా చట్టం 8 వ అధ్యాయం రద్దు చేయాలి.

గవర్నమెంటు విద్యార్థులపై ప్రకటించిన కమ్యూనిక్కులు రద్దు చేయాలి.

డిటెన్షన్లను రద్దు చెయ్యాలి.

హెచ్చించిన జీతాలను పూర్వపు రేటుకు తగ్గించాం.

విశాఖపట్టణం మెడికల్ డిగ్రీల విషయమై ఆందోళన సాగించాలి.

## పార్టీ బాధ్యతలు

బాగా చురుకుగా పనిచేసే విద్యార్థి సోదరులను, సోషలిజంలో నమ్మిన వారిని పార్టీలో చేర్చుకొని వారికి ఇతర రంగాల్లో జరిగే పోరాటాన్ని పరిచయం చేయాలి. జాతీయైక్య సంఘటనా విధానం బాగా బోధించాలి. స్థానిక, జిల్లా, రాష్ట్ర పార్టీలు, స్థానిక, జిల్లా రాష్ట్ర విద్యార్థి సంఘ కార్య నిర్వాహక వర్గాల లోనూ పార్టీ సభ్యులను ఒకరి కొకరిని పరిచయం చేయాలి.

ఇది వరకు కంటే ఎక్కువగా అధ్యయన తరగతుల ద్వారా సిద్ధాంత బలం ఎక్కువయ్యేటట్లు చెయ్యాలి. ఇతర పుస్తకాలు చదివించాలి.

(నవశక్తి, 10-8-38. పేజీలు, 15-17)

# రాష్ట్రం రావాలంటే బ్రిటిష్ వారితో రాయబారాలు పనికి రావు–ఆంధ్ర రాష్ట్రానికి అడ్డంకు బ్రిటిష్ ప్రభుత్వమే

## రాష్ట్రోందోళన సక్రమంగా సాగాలి

**ఆంధ్ర రాష్ట్ర సమస్య :**

ప్రత్యేక భాష లేక ప్రత్యేక చరిత్ర, ప్రత్యేక భూభాగమందు నివాసము, ప్రత్యేకమగు విజ్ఞాన సంపత్తి, స్వతంత్ర ఆర్థిక జీవనానికి కావలసిన సంపత్తి గలది ఒక జాతి. ఆంధ్రులకు ఇవన్నీ కలవు. అందుచే ఆంధ్రుల కొకజాతికి కావలసిన ఈ లక్షణాలతో పాటు ప్రత్యేక స్వతంత్ర రాష్ట్రముగా ఏర్పడుటకు గావలసిన జనాభా, సరిహద్దులు, (సముద్రతీరముకూడా) గలవు. అందుచే ఆంధ్ర రాష్ట్రమును ఏర్పరచాల్సి యుంటుంది. సోషలిస్టులందరూ రాష్ట్ర నిర్మాణాలను పైసూత్రాల ననుసరించియే చేస్తారు సోవియటు రష్యాలో ఉన్న వివిధ జాతులకు ప్రత్యేకరాష్ట్రములు ఏర్పాటుచేసి యున్నారు. కాంగ్రెసుసంస్థకూడా స్వరాజ్యంతో పాటు భాషాప్రయుక్త రాష్ట్రాలు రావలసి యుంటుందని నిర్ణయించింది.

**ఆంధ్ర రాష్ట్రము నేడే ఎందుకు రావాలి?**

అయితే బ్రిటిష ప్రభుత్వాధికారం పోయేవరకు, సంపూర్ణ స్వాతంత్ర్యము సంపాదించే వరకు, రాష్ట్రోందోళన మానివేయ మనడంలో, అర్థము లేదు. సోషలిస్టులు సంపూర్ణ స్వాతంత్ర్య సంపాదనకు, రైతులయొక్క, కూలీలయొక్క రోజురోజు కష్టాలను పోగొట్టడానికి జరిగే పోరాటాలు అభివృద్ధి కావడమే మార్గమని నమ్ముతారు. అదే విధంగా ఈ రోజు రోజు పోరాటాలను అభివృద్ధిచేయడానికి తద్వారా సత్వర స్వరాజ్య సంపాదనకు, ఆంధ్ర రాష్ట్ర నిర్మాణము చాల అవసరమని సోషలిస్టులు నమ్ముతారు. అందుకనే ఫెడరేషను వచ్చినా రాకపోయినా, రాజకీయ ఖైదీల విడుదలకోసం, పౌరసత్వ హక్కులకోసం, కార్మిక కర్షకుల హక్కులకోసం, ఏవిధంగా ఆందోళన పోరాటము సాగిస్తారో అదేవిధంగా రాష్ట్రం

కోసం కూడా సాగిస్తారు స్వాతంత్ర్య సంపాదన కార్మిక కర్షకుల హక్కులను పెంపొందింప జేయడానికి ఏవిధంగా సాయపడుతుందో అట్లే రాష్ట్రసంపాదన, స్వాతంత్ర్య పోరాటాన్ని అభివృద్ధిచేయడానికి సాయపడుతుంది. 1935 ఇండియా ఆక్టులోని ఫెడరలు రాజ్యాంగ విధానాన్ని భగ్నము చేయడానికే, కాన్స్టిట్యుయంటు అసెంబ్లీ ద్వారా నూతన రాజ్యాంగ ప్రణాళికను ఏర్పరచడానికే, రాష్ట్రాందోళన అంతే కాని, ప్రస్తుత రాజ్యాంగ విధానములో కొద్ది మార్పులు చేస్తూ, ఆ మార్పులలో ఆంధ్రరాష్ట్రమును లేక భాషా ప్రయుక్త రాష్ట్రమును ఏర్పరచడానికి బ్రిటిషు ప్రభుత్వము అంగీకరించినంత మాత్రమున బ్రిటిషు ప్రభుత్వపు ఫెడరలు విధానమును అంగీకరించడానికి రాష్ట్రాందోళన కాదు.

## ఆంధ్ర రాష్ట్ర నిర్మాణము స్వాతంత్ర్య పోరాటానికి ఏవిధంగా తోడ్పడుతుంది?

స్వాతంత్ర్య పోరాటం కోసం ప్రజలలో రాజకీయ చైతన్యం, సంఘటనా శక్తి వృద్ధి కావాలి. వీనికోసం ప్రజా సామాన్యపు రోజు రోజు హక్కులకోసం జరిగే పోరాటాలు అభివృద్ధి చెందాలి. దీనికోసం, ప్రజలందరూ వాడుతూవున్న భాషలోనే, అన్ని వ్యవహారాలు, ఉత్తర ప్రత్యుత్తరాలు సాగడము, రాజకీయ ప్రచారానికి ఆందోళనకు సాయపడుతాయి. ఇది భాషా ప్రయుక్త రాష్ట్రములో సాధ్యమైనట్లు వివిధ భాషలుగల రాష్ట్రములో సాధ్యము కాదు.

నేడు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు కమిటీ తీర్మానాలు చూడండి. కొత్త పట్టణము శిక్షితుల విడుదల చేస్తూ కాంగ్రెసు మంత్రివర్గము చేసిన ప్రకటనను రద్దు చేయమన్నది. బాటిలీవాల అరెస్టుకు అసమ్మతి తెలుపుతూ విడుదలచేయమన్నది. పోలీసు రిపోర్టర్ల పోలీసు నిఘా మానివేయాలన్నది. పోలీసుల నడవడి, ప్రభుత్వోద్యోగుల నడవడి ఏమాత్రము మార్పు చెందలేదనియు తగిన చర్యలు తీసుకోవలసినదనియు హెచ్చరించినది. లంచగొండితనాన్ని రూపుమాపు చేయడానికి పూనుకోవాలంది. రాజకీయాలలో పాల్గొని ఉద్యోగాలు పోగొట్టుకొనిన గ్రామోద్యోగులను పనిలోనికి తిరిగి తీసుకోమంది. మారిటోరియము బిల్లు విషయములోను, తదుపరి రైతు ఋణ పరిష్కార చట్టము విషయములోను జమీందారీ రైతుల హక్కుల సందర్భములోను మొత్తము మీద రైతు హక్కుల విషయమై ఆంధ్ర రైతు సంఘము వారి సూచనలను అంగీకరించింది. తుంగభద్రా ప్రాజెక్టును నిర్మించి రాయలసీమలో సదా తాండవమాడే కరువును పోగొట్టమంది. అట్లే ఇరిగేషను ప్రాజెక్టుల విషయమై ప్రత్యేక శ్రద్ధ వహించమంది. చీరాల కాల్పుల విషయమై మంత్రివర్గపు చర్య తప్పని కార్మిక హక్కులను సమర్థించింది. మంత్రివర్గముపై విశ్వాసము ప్రకటిస్తూనే, లా అండ్ ఆర్డరు పరిపాలన చాలా

అధ్వాన్నముగా ఉందని, కాంగ్రెసు ఆదర్శాలకు, వాగ్దానాలకు వెనుకబడి ఉందనీ ప్రకటించింది. కాంగ్రెసు మంత్రివర్గాన్ని విమర్శిస్తూ, సరియైన మార్గాన్ని బెట్ట డానికి ప్రయత్నించింది. కేరళ కాంగ్రెసు కమిటీ కూడ పై దృక్పథాన్నీ కల్గి వుంది. అయినప్పటికి తమిళ రాష్ట్ర కాంగ్రెసు కమిటీ, ఈ తీవ్ర దృక్పథమును, ఈ సరియైన దృక్పథమును తీసుకొనకపోవడం వల్ల, ఆంధ్ర కాంగ్రెసు తీర్మానా లన్నీ బూడిదలో పోసిన పన్నీరయ్యాయి. ఆంధ్ర రాష్ట్రమే ఉంటే, ఈ మార్పులన్నీ ఆంధ్ర రాష్ట్ర మంత్రివర్గం చేత చేయించగల్గి ఉండేది. అదేవిధంగా కేరళ రాష్ట్రముంటే కేరళ కాంగ్రెసు కమిటీ కూడా చేయించగల్గేది.

నేడు రాజకీయముగా వెనుకబడియున్న తమిళనాడులో ఆంధ్ర రాష్ట్రాన్ని జతపర్చి యున్నందున, తమిళనాడు ముందుకు వెళ్ళుతూ ఉండే ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసును, వెనక్కి లాగేస్తూ ఉంది. ప్రత్యేక రాష్ట్రముగా ఉన్నందువలననే తీవ్ర కాంగ్రెస్ సంఘముగల సంయుక్త రాష్ట్రాల మంత్రివర్గము, కాంగ్రెస్ కార్యక్రమాన్ని ఆచరణ పెట్టుచూ మిగిలిన రాష్ట్రాలన్నింటికి ఆదర్శప్రాయ మవుతూ ఉంది. ఏవిధంగా కాంగ్రెసు రాష్ట్రాల చేతలు కాంగ్రెసేతర రాష్ట్రాలలో (బెంగాలు, పంజాబు, సింధు, అస్సాములో) కూడా ప్రజాచైతన్యాన్ని ప్రజా పోరాటాన్ని, రేకెత్తించుచున్నాయో అట్లే కాంగ్రెస్ రాష్ట్రములలో కూడా ముందంజ వేసే యు.పి. (సంయుక్త రాష్ట్రాల) మంత్రివర్గము మిగిలిన కాంగ్రెస్ రాష్ట్రములలో రాజకీయ చైతన్యాన్ని, కాంగ్రెస్ కార్యక్రమాన్ని అమలులో పెట్ట డాన్నీ, తద్వారా స్వాతంత్ర్య పోరాటాన్ని ఎక్కువచేస్తూవుంది. యు.పి.తో పాటు ఆంధ్ర కేరళాలు కూడా ప్రత్యేక రాష్ట్రాలుగా ఉంటే మార్గదర్శకంగా ఉండేవి. ఒక రాష్ట్రానికి బదులు మూడు రాష్ట్రాలు ఈ తీవ్ర పంథాను త్రొక్కితే, స్వాతంత్ర్య పోరాటానికెంత ఊతగా ఉండేదో, స్వాతంత్ర్య పోరాటము ఎంత ముందుకు వెళ్ళేదో ?

ఆంధ్రరాష్ట్రములోనే కాంగ్రెసు మంత్రివర్గము చేసిన లోపాలను రానివ్వ కుండా కాంగ్రెసు కార్యక్రమమును ఆచరణలో పెట్టిఉన్నప్పుడు కాంగ్రెస్ ఎంత బలపడిఉండేదో వేరే చర్చించ నవసరము లేదు. రైతు కార్యక్రమమును ఆచరణ లోనికి తెచ్చియుంటే రైతులను కాంగ్రెస్‌లోనికి ఎంత ఎక్కువగా తీసుకొని రాగల్గియుండేదో? తుంగభద్రా ప్రాజెక్టుతో రాయలసీమలో కాంగ్రెస్ ఉద్యమము ఎంత విజృంభించి యుండేదో? ఈ అభివృద్ధి కూడ మిగిలిన రాష్ట్రాలలో ఎట్టి ఫలితాలకు, మార్పులకు కారణమయ్యేదో?

వెనుకబడియున్న తమిళనాడును వదలుదము, దానిని రాజకీయంగా యథా స్థానములోనే ఉంచుదమని కొందరు వాదించవచ్చు. ఇది ఎంతమాత్రమూ సబబు

కాదు, కేవలము ఒకే భాషా రాష్ట్రంగా ఉన్నప్పుడు ప్రజలందరికీ అర్థమయ్యేటట్లు వ్యవహారాలన్నీ ఆ భాషలో జరుగుతాయి. కాబట్టి తద్వారా తమిళనాడు కూడ ముందుకు వెళ్ళుతుంది. అంతేగాక వెనుకబడియున్న దేశాలను ముందుకు తీసికొని రావడానికి మార్గము. అభివృద్ధిచెందిన ప్రాంతాలు దానిలో భాగమై తమ వ్యక్తిత్వాన్ని తద్వారా తమ అభివృద్ధిని కూడా పోగొట్టుకోవడము కాదు. వెనుకబడియున్న సంస్థానములను ముందుకు తీసుకురావడానికి బ్రిటిషు రాష్ట్రములు స్వదేశ సంస్థానాలలో చేరాలనీ ఎవరూ అనరు. అనకపోవడమే కాక స్వదేశ సంస్థానాలు బ్రిటిషు రాష్ట్రాలతో పాటైనా అభివృద్ధి చెందేవరకు, పెడరేషను వారిలో చేరడము, అసంభవమని కూడా ఆందోళన చేస్తున్నారు. అందుచే వెనుకబడియున్న రాష్ట్రాలను ముందుకు ఈడ్చుటకు మార్గము, ముందుకువెళ్ళిన రాష్ట్రాలు తమ అభివృద్ధి మూలంగా ప్రజలలో ప్రజా చైతన్యానికి పరోక్షంగా సాయపడడంతో పాటు ప్రత్యక్షంగా కూడా అన్ని విధాల తమ శక్తికొలది సాయము చేయుటయే.

## రాష్ట్రాందోళనానికి రాజాజీ పైనున్న అసంతృప్తి కారణం కాదు

రాజాజీ అంటే ఆంధ్రులకు కన్నెర్ర అనియు, రాజాజీ ఏమిచేసినా ఆంధ్రులకు అనుమానమేననియూ, రాజాజీపై ఆంధ్రులకున్న ఈ అసంతృప్తియే ఆంధ్ర రాష్ట్రాందోళనకు కారణమయిందని కొంతమంది అంటారు.

ఆంధ్రులకు రాజాజీపై ఆ అసంతృప్తి వుంది. దీనికి కారణం రాజాజీ తమిళుడు కాబట్టి కాదు. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు తీర్మానాలు బుట్టదాఖలు అవుతూ వుంటే, ఆంధ్రుల రాజకీయ కాంక్ష బుగ్గియైపోతూ వుంటే, ఆంధ్రులు అన్నము లేక హాహాకారాలు చేస్తూంటే తుంగభద్రా ప్రాజెక్టు జోలికిపోక ౭ కోట్ల రూపాయలతో పాపనాశం విద్యుచ్ఛక్తి స్కీముకుపోతే ఆంధ్రులలో అసంతృప్తి కలిగించిందంటే ఆశ్చర్య మెందుకు?

తిరిగి రాష్ట్రాందోళన ముమ్మరముగ సాగడానికి కారణం ఈ అసంతృప్తి కాదు. ఆంధ్రులకు అన్నము కావాలి. ప్రాజెక్టులు కావాలి. పోలీసు దౌర్జన్యాలు పోవాలి. నిర్బంధాలు తొలగాలి. పౌరసత్వ హక్కులు కావాలి. వీనితోపాటు వీని కోసంకూడా రాష్ట్రమూ కావాలి. రాష్ట్రముతోపాటు, రాష్ట్రము కోసం కూడ దేశ స్వాతంత్ర్యం కావాలి. ఇవి ఏమీ రానందున బయలుదేరిన అసంతృప్తి పెడమార్గాన బడింది. ఎందుకంటే ఈ రాష్ట్రాందోళనను నెపంగా తీసికొని జస్టిసు పార్టీలాంటి జాతీయ విద్రోహులు కాంగ్రెసు మంత్రివర్గంపై ప్రజలకు దురభిప్రాయం కలిగించడానికి, పూనుకుంటున్నారు. పికిటింగుకూడ ఆరంభించాలని

ప్రచారం చేస్తూ ఉన్నారు. శాసన సభాసభ్యులు రాజీనామా ఇవ్వాలని కూడా అంటున్నారు. ఈ సమస్య మిగిలిన సమస్యలనన్నింటిని మరచిపోయేట్లు చేయ కల్గుతూ వుంది. ప్రజాసామాన్యానికంతకూ, ఆంధ్ర రాష్ట్ర సమస్య జీవన మరణ సమస్యగా పరిణమించినట్లు భ్రమ ఇతరులకు కల్గిస్తూవుంది. ఇతరులకే గాక రాష్ట్ర నాయకులకు కూడ కల్గించింది. సోషలిస్టులుకూడ ఈ ప్రవాహంలోకి ఈడ్వబడ్డారు. సోషలిస్టులూ, కాంగ్రెసు నాయకత్వము వెంటనే మేల్కోవాలి. ఆంధ్రరాష్ట్రం ఎంత అవశ్యకమయినా, దానికోసం మనమెంత ఆందోళన చేయ వలసిన ఆవశ్యకత ఉన్నా, ఆంధ్ర రాష్ట్ర సమస్యలాంటి ప్రధాన సమస్యలు మనలను ప్రతిరోజు ఎదుర్కొంటూ ఉన్నామని అలాంటి సమస్యలలో ఆంధ్రరాష్ట్ర సమస్య ఒకటి మాత్రమే అని ఎంత త్వరలో గుర్తిస్తే ఆంధ్రరాష్ట్రోద్యమానికి, కాంగ్రెసు ఉద్యమానికి, స్వాతంత్ర్య ఉద్యమానికి అంత మంచిది.

ఆంధ్ర రాష్ట్రము రానిదే, మిగిలిన సమస్యలను గూర్చి ఆంధ్ర ప్రజలను ఎదుర్కొనే రోజురోజు కష్టాలను గూర్చి ఆలోచించడము నిష్ప్రయోజనమంటారు కొందరు. ఈ విధంగా అనుకోడానికి కారణం రాజాజీయే మన కోర్కెలకు అడ్డు వస్తున్నాడనే పొరపాటు అభిప్రాయమే. మన ఆకాంక్షలకు నిజమైన అడ్డంకి, ఆంధ్ర రాష్ట్రమన్నా అడ్డమువచ్చే బ్రిటిషు ప్రభుత్వమనేది ఒకటి నేడుకూడ మన దేశములో ఉన్నదనే విషయము వీరు మరచిపోతున్నారు.

రాజాజీ చేసిన లోపాలను, పొరపాటులను మనము సవరించుకొనేటట్లు చేయలేక పోవడం మన అశక్తతను తెల్పుతుంది. కాంగ్రెసు శాసనసభా సభ్యుల పార్టీ మీటింగులో, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు కమిటీ చేసిన సూచనలు విమర్శ నలను ఆచరణలో పెట్టమని ఎంతమంది ఆంధ్ర శాసన సభ్యులు పట్టుపట్టారు? ఈ విషయాలను గూర్చి పార్టీ మీటింగులలో చర్చలయినా జరిగినాయా? ఈ విషయాలను గూర్చి దేశములో కాంగ్రెసు కమిటీగాని, శాసన సభా సభ్యులుగాని చేసిన ఆందోళనచే కూర్చుకొనిన ప్రజాబలము ఎంత? కేవలము తీర్మానములు ప్యాసుచేసినంత మాత్రాన రాజాజీగాని, పై కమిటీలు గాని అంగీకరించుననే భావంతో ఉండినారు కాబోలు? ఆ సిద్ధాంతాన్ని నేటికైనా విడచి ప్రజాందోళన అవసరతను గుర్తించి నందులకు సంతోషము. కాని ఈ ప్రజాందోళనము ఒక్క విషయములోనే, ఒక్క విషయము పైననే కేంద్రీకరింప జేయుట, పోరాటాన్ని వక్రమార్గాన త్రొక్కునట్లు చేయుటయే అని కూడా గ్రహించాలి.

పార్టీ సభలోగాని, శాసన సభలోగాని ప్రజా సామాన్యమందుగాని మూగ నోము అవలంబించక ప్రజాహక్కులకోసం కాంగ్రెసు శాసన సభా సభ్యులు, కాంగ్రెసు కమిటీలు ఆందోళన సాగించియుంటే, ప్రజా సంఘటన కావించియుంటే

రాజాజీ బ్రిటిషు ప్రభుత్వపు టొత్తిడికి లొంగక పౌరసత్వ హక్కులను కాపాడి యుండే వాడు. క్రొత్త పట్టణపు నిషేధము పోయేది. బాటిల్వాలా అరెస్టు ఉండేది కాదు. పోలీసుల నిఘా, పోలీసుల రిపోర్టులు బొంబాయి, బీహారు, యు. పి. మధ్య పరగణాలు, ఒరిస్సాలో వలె లేకుండా పోయేవి. చీరాల కాల్పులకు కారకులగు ఉద్యోగులు, శిక్షింపబడకుండుట, కాల్పులకు గురియైన కార్మికులకు నిరుద్యోగము ఉండేవి కావు. పోలీసుల దౌర్జన్యాలు అణగి ఉండేవి. లంచగొండి తనము తగ్గియుండేది. రైతుల కష్టాలు తగ్గి కాంగ్రెసు ముందుకు వెళ్ళియుండేది. తుంగభద్రా ప్రాజెక్టును మూలకు త్రోసి, పాపనాశం హైడ్రో ఎలక్ట్రికు స్కీమును 2 కోట్ల రూపాయలు ఖర్చు పెట్టడానికి రాజాజీ, బ్రిటిషు విద్యుచ్ఛక్తి కంపెనీవారు తమ లాభాలపై బ్రిటిషు బురాక్రసీ మూలంగా తెచ్చిన ఒత్తిడికి లొంగియుండడు.

ఆంధ్ర రాష్ట్ర సమస్యను కణ్వ మహర్షి ప్రేమతో రాజాజీ చూడకుండే వాడు. ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రము స్వాతంత్ర్య పోరాటానికి దోహదమని ఎంచి, దానికి అడ్డు తగిలే బ్రిటిషు ప్రభుత్వమును ఎదిరించి యుండేవాడు.

అయితే మనమిప్పుడు ఏమి చేయాలి.

రాయబారాలతో రాష్ట్రము రాదు.

బ్రిటిషు ప్రభుత్వంతోటి రాయబారాలతో రాష్ట్రము వస్తుందని సోష లిస్టులు ఏనాడు నమ్మలేదు. నమ్మరు. కాని రాయబారమువలన నష్టముందని అనుకోరు. ఆంధ్ర కాంగ్రెసు నాయకులు ఫెడరేషన్ రాకముందే రాష్ట్రం కోసం రాయబారము వెళ్ళితే ఫెడరేషనును కాంగ్రెసు అంగీకరించడానికి తయారయిం దని లోకానికి చాటడానికి బ్రిటిషు ప్రభుత్వము పూనుకొంటుందనడంలో అర్థము లేదు. ఆంధ్ర రాష్ట్రము వస్తే ఫెడరేషనును భగ్నము చేయడానికే ఉపయో గిస్తుంది. ఆంధ్ర రాష్ట్రము ఇచ్చినంత మాత్రాన ఫెడరేషనుకు అంగీకరిస్తామని ఆంధ్ర రాయబారము చెప్పియుండేది కాదు. ఫెడరేషను రాకపూర్వమే రాష్ట్రము కావాలనే రాయబారము, రాష్ట్రము ఇచ్చినంతమాత్రమున ఫెడరేషనుకు అంగీక రిస్తారనడము అర్థములేని వాదన. ఒకవేళ బ్రిటిషు ప్రభుత్వము ఆ విధంగా తప్పు అభిప్రాయము లోకానికి చాటినా కాంగ్రెసు దానిని ఖండించగలదు. లోధియను, సామ్యూలు, వైస్రాయి రిన్‌లిత్‌గోలతో సంభాషణలు వివిధ రాష్ట్ర ములలో మంత్రి పదవుల తీసికోవడము, బ్రిటిషు ప్రభుత్వానికి ఫెడరేషనును ఆచరణలో పెట్టడానికి సాధ్యమవుతుందని, కొద్ది మార్పులతో కాంగ్రెసుకూడ అంగీకరిస్తుందని లోకానికి చాటడానికి కావలసినంత అవకాశాలు కలిగించాయి. అంత మాత్రముచే కాంగ్రెసు నాయకులు ఆ పనులను మానివేయునపుడు రాయ

బారము వలన వచ్చే నష్టమేమిటో అర్థము కావడములేదు. వర్కింగు కమిటీ రాయబారము పనికిరాదని తీర్మానించి ఆంధ్ర దేశములో అనవసర అలజడి కల్గించ కల్గింది. మిగిలిన సమస్యల నన్నింటిని ఆంధ్ర కాంగ్రెసు నాయకులు సైతము మరచిపోయేటట్లు చేయగల్గింది.

అందుచేతనే రాయబారమును వెళ్ళనిచ్చి యుండవలసినది. రాయబారము వెళ్ళిన పిదప రాష్ట్ర నిర్మాణానికి కావలసినంత ఆందోళన, పోరాటము బ్రిటిషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఆంధ్ర కాంగ్రెసు నాయకులు సాగించియుండేవారు. నేటివలే రాజాజీమీద, భారత కాంగ్రెసు వర్కింగు కమిటీ మీద విరుచుకు పడే వారు కారు.

## శాసనసభలో తెలుగులో మాట్లాడినంత మాత్రమున రాష్ట్రము రాదు

ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు వర్కింగు కమిటీ, విశ్వవిద్యాలయము కాలేజీల లోను, పాఠశాలలోను, తెలుగులోనే చదువు చెప్పాలని, బ్యాంకులు, మునిసిపాలిటీలు, జిల్లా బోర్డులు కోర్టులు తెలుగులోనే తమ వ్యవహారములన్నియు జరుపుకోవాలనీ హెచ్చరిక గావించింది. ఆంధ్రుల మధ్య విద్య, వ్యవహార దక్షత, రాజకీయ పరిజ్ఞానము, మామూలు జనులలో కూడ కల్గాలంటే అన్ని వ్యవహారాలు తెలుగులోనే జరగాలి. భాష, సారస్వతము, విజ్ఞానము, కళలు వృద్ధిపొందాలన్నా తెలుగులోనే వ్యవహారాలన్నీ జరగాలి.

మద్రాసు శాసనసభలో తెలుగు సభ్యులందరూ తెలుగులోనే మాట్లాడ వలయుననీ, ఇతరులు తమ తమ మాతృభాషలోగాని, ఇంగ్లీషులోగాని మాట్లాడిన తెలుగులోకి తర్జుమా చేయించవలసినదిగా కోరవలయునని మరియొక తీర్మానం కూడ రాష్ట్ర కాంగ్రెసు వర్కింగు కమిటీ చేసింది.

ఈ తీర్మానములోని మూల సిద్ధాంతము సరియైనదే. 5 కోట్ల ప్రజల తరపున వెళ్ళి, వారి శ్రేయస్సు కోసం చట్టాలు చేసేటప్పుడు, జరిగే చర్చలన్నీ ప్రతినిధులందరూ పూర్తిగా గ్రహించడానికి, ప్రజల యొక్క భావాలను, కోర్కెలను చక్కగా చాటడానికి వచ్చిరాని ఇంగ్లీషు నుపయోగించక మాతృభాషను ఉపయోగించడము పరమావశ్యకము, అది అందరికి తెలియుటకు భాషాంతరీకరణము కూడ అవసరమే, ఇవి రెండూ లేనపుడు, వెళ్ళిన ప్రతినిధులు మూగ ప్రతినిధులు అవుదురే గానీ ప్రజా ప్రతినిధులు కాజాలరు. కాని ఆరు భాషల్లోకి ప్రతి ఉపన్యాసము, ప్రతి ప్రశ్న, ప్రతి సమాధానము భాషాంతరీకరించాలని యుంటుందంటే శాసనసభా కార్యక్రమము సాగదనుట నిజమే. ఈ వాదనే భాషాప్రయుక్త రాష్ట్రము లేక శాసన సభా కార్యక్రమము ఎంత

బూటకమో, నిజంగా ప్రజా ప్రతినిధి సభ కాదో తెలియజేయడానికి పూర్తిగ పనికి వస్తుంది. అందుచే ప్రత్యేక రాష్ట్రాన్ని నిర్మించడానికి అవసరత, వెంటనే నిర్మించాల్సిన అవసరతను ఇది తేట తెల్లము చేస్తుంది.

భాషాప్రయుక్త రాష్ట్రాలు వచ్చేవరకు ప్రస్తుతపు శాసన సభలు నిజమైన ప్రజా ప్రతినిధి సభలుగా పనిచేయజాలవు. ఈ లోటును తాత్కాలికంగా మనము సహించక చేసేదేమీ లేదు. యుక్త వయస్సు వచ్చిన వారి కందరికీ ఓటు లేక ఎన్నుకోబడిన శాసన సభ లోపభూయిష్టము అయినా దానిని తాత్కాలికంగా అంగీకరించి ఉన్నదానినే పోరాటానికి ఉపయోగిస్తున్నాము. అదే రీతి శాసన సభా కార్యక్రమమును ఎక్కువ మందికి అర్థమయ్యే భాషలో సాగిస్తూ, ఎవరి మాతృభాషలో వారు మాట్లాడడానికి కూడ అధికారము కలుగజేసి పని సాగించాలని ఉంటుంది. అంటే ఇప్పటి మాదిరివలే సాగించాలి.

శాసన సభా కార్యక్రమము జరుగకుండా చేసినంత మాత్రాన ఆంధ్ర రాష్ట్రము దగ్గరకు రాదు. ఇది స్టాన్లీ ప్రభువును కదల్చజాలదు. రాజాజీ మీద ఒత్తిడి కలిగించి, రాజాజీకి గుణపాఠము చెప్పడము కావచ్చు కాని, బ్రిటిషు ప్రభుత్వముపై ఒత్తిడి తీసుకురానిదే ఆంధ్ర రాష్టము వస్తుందనుకోవడము నేల విడిచి సాముచేయడమే.

## రాష్ట్రము రావడానికి ఏమి చేయాలి

ఆంధ్ర రాష్ట్రము ఇప్పుడే, నేడే, స్వాతంత్ర్యము రాకముందే రావాలని మనము కోరడంలో ఉద్దేశం రాజాజీ మీద కక్ష కట్టి, ప్రత్యేక రాష్ట్రము వస్తే మనవారు కొంతమంది మంత్రులు ఉన్నతోద్యోగులవుతారని కాదు. మనము రాష్ట్రాన్ని నేడే కోరడానికి కారణం.

1. ప్రజాసామాన్యపు ఆర్థిక హక్కులను పౌరసత్వ హక్కులను వృద్ధి పొందించడానికి.

2. దీని మూలంగా ప్రజాసామాన్యంలో రాజకీయ చైతన్యాన్ని పెంపొందింపజేసి స్వాతంత్ర్యాన్ని త్వరలో సంపాదించడానికే మనము రాష్ట్రాన్ని స్వాతంత్ర్యము రాకముందే నేడే రావాలని కోరుతున్నాము.

అంటే రాష్ట్రసంపాదన స్వాతంత్ర్య సంపాదనకు ఒక ప్రధాన విషయముగా మనము చూస్తున్నాము. అందుచే సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని దగ్గరుకు తెచ్చే మిగిలిన ప్రజా పోరాటాలను కూడా ఇంత ప్రధానంగానే చూడాలి. వాని కోసం మనము పూర్తిగా ఆందోళన సాగించాలి. రాజాజీకాని మద్రాసు కాంగ్రెసు మంత్రివర్గము కానిమునుపు చేసిన పొరపాటులను తిరిగి చేయనివ్వకుండా జాగ్రత్తపడాలి. వాటిని సవరించుకొనేటట్లు చూడాలి.

దీనికి మార్గము రాష్ట్ర కాంగ్రెసు శాసన సభా పార్టీలో రాజాజీ యొక్క రాజీనామా బెదిరింపుకు లొంగక నిర్మొగమాటంగా పార్టీ సభ్యులు మంత్రివర్గపు

పొరపాటులను విమర్శించాలి. అవసరమయితే దిద్దుకోకపోతే, వ్యతిరేకంగా పార్టీ సభలో ఓటు చేయాలి. శాసన సభలో మంత్రివర్గాన్ని విమర్శించడానికి కాంగ్రెసు సభ్యులకు కూడా హక్కు ఉండాలి. యు.పి.లో వుంటే మద్రాసులో ఎందుకు ఉండకూడదు ? ప్రజా సామాన్యములోకి వచ్చి ఆందోళన సాగించాలి. అఖిల భారత కాంగ్రెసు కమిటీ జోక్యము కల్గించుకొనేటట్లు చూడాలి. దానికోసం కావలసిన ప్రజాందోళన చేయాలి.

ప్రజా హక్కులను సంపాదిచడానికి ప్రజాందోళన శాసనసభల బయట కూడా చేయాలి. కాంగ్రెసు మంత్రివర్గం కూడా ప్రజాందోళన లేనిచో పొరపాటులు, చాల ప్రమాదకరమైన పొరపాటులు కూడా బ్రిటిషు బ్యూరాక్రసీ ఒత్తిడి వలన చేస్తుంది.

ఈ విధంగా ప్రజా హక్కుల కోసం పోరాటము సాగిస్తూరావాలి. ఆంధ్ర రాష్ట్రము ఆంధ్ర ప్రజల యొక్క హక్కు. పౌరసత్వ హక్కులు ఏవిధంగా ప్రజల ఆర్థిక హక్కుల సంపాదనకు తోడ్పడుతాయో, అట్లే ఆంధ్ర రాష్ట్రము, పౌరసత్వ హక్కులు, నిజమైన ప్రజా ప్రభుత్వమును సంపాదించడానికి తోడ్పడుతుంది.

అందుచే ఆంధ్రరాష్ట్రం కోసం చేసే ఆందోళన స్వాతంత్ర్యంకోసం, పౌరసత్వ హక్కులకోసం, ప్రజా సామాన్యం యొక్క ఆర్థిక హక్కుకోసం జరిపే పోరాటములో ఒక భాగంగానే ఉంటుంది. ఉండాలి.

ఆంధ్ర రాష్ట్రము కోసం ఉద్యమము తీవ్రంకావాలంటే, బీదరైతులు, కూలీలు, ప్రజా సామాన్యమంతా దానికోసం ప్రయత్నించాలంటే ఈ క్రింది కోర్కెలను గూర్చి ఆందోళన చేయాలి.

1. తుంగభద్రా ప్రాజెక్టు.
2. 5 ఎకరముల లోపువారికి అప్పు రద్దుచేసి పరపతి కలిసేటట్లు ఏర్పాట్లు చేయడము.
3. రు. 250ల లోపల ఆదాయము గల రైతులకు పన్నులేకుండా చేయడము.
4. రైత్వారీ రైతుల కున్న హక్కులన్నీ జమీన్ రైతులకు కలుగజేయడము.
5. నీటిపారుదలలు ఎక్కువ జేయడము.
6. వ్యవసాయ కూలీలకు, పారిశ్రామిక కూలీలకు కనీసపు జీతము, సెలవులు నిరుద్యోగభృతి ఏర్పరచడము.
7. నిర్బంధ ప్రాథమిక విద్యను నెలకొల్పడము.
8. దేశభాషలో వ్యవహారాలన్నీ సాగించడం.

["ఆంధ్రరాష్ట్ర సమస్య"పై సోషలిస్టుల తీర్మానము - సం॥]
నవశక్తి 10. 8. 38: 8, 9 పేజీలు.

అనుబంధం - 3 'ఎ'

# 1939 లో జరిగిన కొన్ని జిల్లా కాంగ్రెసు సోషలిస్ట్ పార్టీ మహాసభల తీర్మానాలు–వివరాలు

## పశ్చిమ గోదావరి జిల్లా సభ

ఈ నెల (జనవరి-సం॥) 4, 5 తేదీల యందు జిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ప్రతినిధుల మహాసభ తణుకులో శ్రీ యర్రమిల్లి రామనాథంగారి భవనంలో కామ్రేడ్ అల్లూరి సత్యనారాయణగారి అధ్యక్షతన జరుపబడెను. సభకు జిల్లా అన్ని ప్రాంతములనుండి 50 మంది ప్రతినిధులు వచ్చిరి. ప్రతినిధులు కాని పార్టీ సభ్యులను కొందరిని సభకు రానిచ్చిరి. రాష్ట్ర సోషలిస్టు పార్టీ కార్య నిర్వాహక సభ్యులును, రాష్ట్ర రైతు సంఘ కార్యదర్శియు అగు కామ్రేడ్ చలసాని వాసు దేవరావుగారు మహాసభకు వచ్చి వారి సలహాలనిచ్చి తోడ్పడిరి.

4వ తేదీ ఉదయం గం. 10-00లకు కార్యనిర్వాహకవర్గము సమావేశమై మహాసభలో ప్రవేశపెట్టు తీర్మానములను గురించియు, కార్యదర్శియొక్క గత సంవత్సర రిపోర్టు, ముందు కార్యక్రమాన్ని గురించి చర్చించిరి.

మధాహ్నం 3 గం.లకు ప్రతినిధుల సభ సమావేశమైనది. మొదట్లో అధ్యక్షులు అంతర్జాతీయ పరిస్థితులు సంవత్సరమునుండి ఏ విధంగా మారుచున్న దియు, స్పెయిన్‌లో ప్రజా ప్రభుత్వాన్ని నాశనం గావించేందుకు ఫాసిస్టు రాజ్యాలతో బ్రిటన్ ఏకమై ఏవిధంగా ఎదుర్కొంటున్నది, చైనాపై జపానువారి దండయాత్ర, హిందూదేశ పరిస్థితులు, సంస్థానాలలో బాధ్యతాయుత ప్రభుత్వంకొరకు సంస్థానప్రజల పోరాటం, బ్రిటిష్ సామ్రాజ్యవాదులచే దేశంపై రుద్దజూచుచున్న ఫెడరేషన్‌వల్ల మనకు కలిగే నష్టాలు, దాని నెదుర్కొనుటలో అతివాదుల, మితవాదుల దృక్పధాలు దానిని ఎదుర్కొనుటలో ఎట్టి సంకోచము లేకుండా పోరాటాన్ని సాగించవలసిన పరిస్థితులలో త్రిపుర కాంగ్రెస్‌కు అధ్యక్షుని ఎన్నిక, ఆ ఎన్నిక ఫలితంగా దేశంలో కలుగుతున్న మార్పులను గురించి మాట్లాడిరి.

పిమ్మట తీర్మానములను గురించి చాలా దీర్ఘంగా, విపులంగా చర్చలు రాత్రి 10 గటల వరకు జరుపబడెను.

6వ తేదీ ఉదయం గం. 8.30 లకు ఒక ఊరేగింపు వందమంది బారులు దీర్చి నడుస్తూవుంటే అదొక సైన్యమా అనిపించింది. ఊరేగింపు ముఖ్య వీథులు తిరిగి తాలూకా ఆఫీసుకు ఎదురుగా బజారులో బహిరంగసభ జరుపబడెను. సభకు కామ్రేడ్ అల్లూరి సత్యనారాయణగారు అధ్యక్షత వహించిరి. అధ్యక్షులు, కామ్రేడ్ బనిశెట్టి అప్పారావు కొవ్వలి గోపాలరావుగార్లు సోషలిస్టుపార్టీ సిద్ధాంతాలనుగురించి ప్రపంచ పరిస్థితులను గురించి విపులంగా మాట్లాడిరి. సభా ప్రారంభంలో కామ్రేడ్ మైలవరపు రామారావు "లాఠీ" "మరోప్రపంచం" పాటలతో సభికులను మైమర పించినారు.

తిరిగి గం. 10.0 లకు మహాసభ ప్రారంభమై మిగిలిన తీర్మానములు గావించబడెను. సభ 6వ తేదీ సాయంత్ర గం. 4. లకు పూర్తియయ్యెను.

**సభలో గావింపబడిన తీర్మానములు :**

1. మంత్రి రాముని మీనన్, భీమవరం తాలూకా కాంగ్రెస్ వర్కరు అల్లూరి సుబ్బరాజుగార్ల అకాలమరణానికి తమ గాఢ సంతాపాన్ని వెలిబుచ్చుతూ, వార్ల కుటుంబాలకు సానుభూతిని తెలుపుతూ యీ సభవారు తీర్మానించుచున్నారు.

2. ఫెడరేషన్:- భారతదేశమందలి అధిక సంఖ్యాకులచే నిరసించబడి నప్పటికీ, భారతీయుల స్వయం నిర్ణయమునకు వ్యతిరేకముగా నూతన ఇండియా చట్టములోని ముఖ్య భాగమైన ఫెడరేషను భాగమును సామ్రాజ్యవాదమును వచ్చే యుద్ధములో రక్షించు కొనుటకుగాను, నింకుశముగా దేశీయులపై రుద్దుటకుగాను బ్రిటిషు ప్రభుత్వము చాల తొందరపడుచున్నట్లు యిటివల వైస్రాయిగారి స్టేటు మెంట్లే చెప్పుచున్నవి. ఈ సందర్భములో ప్రజలందరు ఫెడరేషను యేపరిస్థితు లలోను స్థాపించకుండుట చేయుటకుగాను తీవ్రకృషి తమతమ సంఘాలద్వారా కాంగ్రెసు సోషలిస్టు, కాంగ్రెసు సంఘాలు ప్రజలను యిప్పటినుండే ఆలస్యం లేకుండా తయారుచేయవలయునని యీ సభవారు సోషలిస్టుల, కాంగ్రెసు సంఘాలను ముఖ్యంగా కృషిచేయవలసినదిగా కోరుచున్నారు.

**నిర్మాణము.**

3 జిల్లా పార్టీని పునర్నిర్మాణము చేయుటకుగాను ఈ క్రింది ఏర్పాట్లను చేయవలెను.

1. పార్టీ ఆర్గనైజరు నొకరిని నియమించవలెను.

2. ఏ తాలుకాకు ఆతాలూకా సంఘము సమావేశమై పార్టీ తరపున చేయ వలసిన వివిధ రంగములలోని పనిని విభజించుకొనవలెను. అనివార్య పరిస్థితుల

లోను, జిల్లా సంస్థను మార్చినప్పుడును తప్ప ఆ విభజన ప్రకారం పని ఎలప్పుడు జరుగుచుండ వలెను.

3. ఆ స్థలములోనే మరల మార్పు చేయబడు వరకు పనిచేయు చుండ వలెను.

4. పార్టీకి సంబంధించిన విషయములను గూర్చి పార్టీ కార్యదర్శి గారికి ప్రతి నెల రోజుల కొక పర్యాయము తప్పనిసరిగా నివేదికను పంపుచుండవలెను. ప్రజాసామాన్య సంఘాలలో బాధ్యత స్థానమందున్న పార్టీసభ్యులు మాత్రమే అట్టి సంఘముల గూర్చి నివేదికలు పార్టీకి పంపుచుండవలెను.

5. తప్పనిసరిగా ప్రతి 15 రోజుల కొక పర్యాయము రాజకీయ చర్చలు ప్రతి సెంటరులోను జరుపు చుండవలెను.

6. పై నిర్మాణ కార్యక్రమాన్ని పూర్తిగా అమలు జరపాలంటే ఆర్థిక సహాయం కావాలి. అందుకు పార్టీ కామ్రేడ్స్, ముఖ్యంగా డెలిగేట్సుగా వచ్చిన కామ్రేడ్సు పూర్తిగా శ్రద్ధతీసుకోవాలి. ప్రతి పార్టీ కామ్రేడ్ తానుచేయు పనికి అడ్డురాకుండా నెలకు రూ. యిస్తూ వుంటే మనం అనుకున్న నిర్మాణకార్యం జరగడానికి వీలుటుందిగాన పార్టీ కామ్రేడ్సు ఏవిధంగానైనా సరే యీ మొత్తాన్ని ప్రతినెల చెల్లించితీరాలి

7. పార్టీ కార్యదర్శులుగా యుండువారు మరియే యితర సంఘాలలోనూ అధ్యక్ష కార్యదర్శులుగా యుండరాదు.

**పార్టీ పత్రిక**

రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ పత్రిక నవశక్తిని యింతవరకు అనేక ఆర్థిక చిక్కులకులోనై కూడ యింతవరకు చాల జయప్రదంగా నడిపించిన రాష్ట్ర పార్టీని యీసభవారు అభినందించు చున్నారు.

1. పార్టీ పత్రికపై కనీసం ప్రతి 15 రోజులకు ప్రతి సభ్యుడు విమర్శలు వ్రాస్తూ వుండాలి.

2. జిల్లాకి ఏర్పరచబడిన కోటాను పూర్తిచేయుటకుగాను ప్రతి సభ్యుడు పూర్తి కృషిగావించాలి.

3. ప్రతి గ్రామంలోను ప్రజా సామాన్యంనుండి పత్రికకు చందాలు వసూలు చేయవలెను.

**సుభాషు విజయానికి అభివందనములు**

5. అఖిలభారత కాంగ్రెసు మహాసభకు అతివాదియైన శ్రీ సుభాష్‌చంద్ర బోసును అధ్యక్షునిగా ఎన్నుకొని భారత కాంగ్రెసు ప్రతినిధులు ఫెడరేషన్‌పట్ల

తమ నిశ్చితాభిప్రాయమును ఘంటాపథంగా చాటినందులకు యీసభవారు ప్రతినిధుల నభినందించుచున్నారు.

భారత ప్రజాపరిషత్తును స్థాపించుటకు తగిన కార్యక్రమమును నిర్ణయింప త్రిపురీ కాంగ్రెసు ప్రతినిధులను గోరుచున్నాము. నూతన కార్యనిర్వాహక వర్గమును ఏర్పరచు కొనడములో కాంగ్రెసు ఐక్యతను, స్వాతంత్ర్య పోరాటమును మనమునందిడుకొని ఫెడరేషన్ వ్యతిరేకులగు అతివాదుల మెజారిటీ తప్పక వర్కింగు కమిటీలో నుండునట్లు చూడమని సలహానిచ్చు చున్నాము. అట్టి యావత్తు కార్యక్రమములకు సుభాష్‌బాబు యిచ్చే నాయకత్వమునకు సంపూర్ణ సహకార మిచ్చుటకు సోషలిస్టులను ప్రజాసామాన్యముకు, కాంగ్రెసువాదులను తదితర సామ్రాజ్య వ్యతిరేకులందరినీ కోరుచున్నారు.

ఇంకనూ, కాశీపట్నం గుంటుపల్లి జమీందారీ రైతుల పోరాటాన్ని బలపరుస్తూ రైతులకు సంపూర్ణ సహాయం చేయుటకు ఒక ఉపసంఘమును నియమించుచునూ సంస్థాన ప్రజలపోరాటాన్ని బలపరుస్తూవచ్చే త్రిపురీ కాంగ్రెసు మహాసభలో సంస్థాన ప్రజా పోరాటాన్ని కాంగ్రెస్ ప్రత్యక్ష పోరాటాన్ని నడుపవలసినదనియూ, ప్రకాశం కమిటీ రిపోర్టును రాష్ట్ర రైతుసంఘ సూచనలతో ఏప్రియల్ నెలలో చట్టం గావించమనియూ, చట్టమయ్యే లోపల జమీరైతుల హక్కులు హరింపబడకుండా తగిన రక్షణ కలుగజేయమనియూ, బొంబాయి ట్రేడ్ డిస్పూట్సు బిల్లు కార్మికోద్యమమునకు భంగమని యెంచి సమ్మెచేసిన కార్మికుల నభినందించుచూ, ఆ చట్టాన్ని మార్పుచేయమని కాంగ్రెసు మంత్రుల చర్యలకు అసమ్మతి వెల్లడిస్తూను, యీ జిల్లాలో నిరంతర ప్రజా సేవకులగు అల్లూరి, గారపాటి గార్లపై రాష్ట్ర కాంగ్రెసువారు తీసుకొన్న డిసిప్లినరీ చర్యలను తొలగించమని రాష్ట్ర కాంగ్రెసు సంఘాన్ని కోరుతూనూ, విద్యార్థులలో యీ మధ్య ఏర్పడిన సంచలనముతో బాటు యీ జిల్లాలో కొడవలూరు, తణుకు, పాలకొల్లులలో వార్ల హక్కులపై సమ్మెల గావించినందుకు అభినందిస్తూ సంఘాలను ఏర్పరచుకోమనియు, బెజవాడలో ఆంధ్ర పార్లమెంటరీ కమిటీలో కొందరు సభ గావించి సుభాష్ చంద్రబోసు, శ్రీనివాసయ్యంగారలు ఆంధ్రదేశము వచ్చినప్పుడు బెజవాడ వస్తే నల్లజెండాలు చూపెట్టాలని తీర్మానించుటను తీవ్రంగా గర్హిస్తూ, యిట్టి అభివృద్ధి నిరోధకులను జాగ్రత్తగా కనిపెట్టుచుండవలయునని ప్రజాసామాన్యాన్ని కోరుతూ వారు మొదట శ్రీనివాసయ్యంగారికి స్వాగతమివ్వ తీర్మానించి, తిరిగి రద్దు చేసికొనుటకు కాంగ్రెసు మెజారిటీనున్న పురపాలక సంఘము వారికి తగినపని యనియూ, తీర్మానించబడెను.

పిమ్మట క్రొత్త కార్యనిర్వాహకులను, పార్టీ ఆర్గనైజరును ఎన్నుకొన బడిరి.

1. ఉద్ధరాజు రామం (ఆర్గనైజరు)
2. గారపాటి సత్యనారాయణ (కార్యదర్శి)
3. గొట్టుముక్కల వెంకట్రామరాజు
4. అల్లూరి సత్యనారాయణ
5. పేటేటి వెంకటరత్నం
6. కలిదిండి సుబ్రహ్మణ్యం
7. భూపతిరాజు వెంకమ్మ
8. మల్లంపల్లి సుబ్బారావు
9. దాట్ల సూర్యనారాయణ రాజు
10. బనిసెట్టి అప్పారావు
11. కృత్తివెంటి వెంకటేశ్వరరావు

రాష్ట్ర పార్టీ మహాసభకు ఇరవైమంది ప్రతినిధులను ఎన్నుకొనబడిరి.

మహాసభకు వచ్చిన ప్రతినిధులకు భోజన వగైరా సదుపాయాలు చేసి అన్ని విధాల తోడ్పడిన శ్రీ ఇందుకూరి సుబ్బరాజు గారికి అభినందనలు తెలిపి సభ ముగింపబడెను. (నవశక్తి, 15-2-39, 16 వ పేజీ)

## అనుబంధం - 3 'బి'

# కృష్ణాజిల్లా సోషలిస్టుపార్టీ మహాసభ

ది. 25-2-39 వ తేదీన గుడివాడ తాలూకా జమీగొల్వేపల్లిలో కామ్రేడ్ చలసాని వాసుదేవరావు గారి అధ్యక్షతను కృష్ణా జిల్లా కాం॥ సో॥ పార్టీ తృతీయ కాన్ఫరెన్సు జరిగింది.

## తీర్మానములు

పార్టీ కార్యదర్శిగారిచే చదవబడిన రిపోర్టును చర్చించి ఆమోదించబడెను.

## స్వదేశ సంస్థానములు

ఢెంకనాల్, తిరువాన్కూరు, రాజకోట మొదలగు స్వదేశ సంస్థానములలో అతి కనీసమైన పౌరసత్వపు హక్కుల సంపాదనకోసం ధైర్యముగా పోరాడుచున్న సంస్థాన ప్రజలను యీ సభ వారు అభినందించుచున్నారు. సంస్థాన ప్రజలు తమ పోరాటమును తామే సాగించుకొనవలెనను తీర్మానమును అతివాదులు వ్యతిరేకించినను మితవాదులు హరిపురా కాంగ్రెసులో నెగ్గించుకొనిరి. కాని ఈ రోజునకైనను గాంధీజీ, యితర మితవాదులు సంస్థాన ప్రజలు పోరాటము యావద్భారత సమస్యగా జేయవలెనని గుర్తించినందులకు సంతసించుచు, సంస్థాన ప్రజల పోరాటంలో పాల్గొని, నడపుచున్న వారిని యీ సభ వారు అభినందించు చున్నారు.

సంస్థాన ప్రజలు సంస్థానాధీశుల మధ్య జరుగుచున్న పోరాటము ఇండియా ప్రజలు బ్రిటిషు సామ్రాజ్యమునకు జరుగుచున్న పోరాటములో అంతర్భాగము కనుక సంస్థాన ప్రజల పోరాటమును కాంగ్రెసు నాయకత్వం క్రిందనే జరుప బడవలెనని ఈ సభవారు కోరుచున్నారు. కాంగ్రెసు మంత్రులు స్వదేశ సంస్థానాల రక్షణ చట్టమును బ్రిటిషు ఇండియాలో ఎట్టి పరిస్థితులలోను అమలు జరుప కూడదని యీ సభ వారు కోరుచున్నారు.

## క్రిమినల్ ట్రైబ్సు యాక్టు

ఎరుకల, యానాదుల, పడ్డి మొదలగు జాతి వారు సిటీ యాక్టు క్రింద చాల మంది యున్నారు. వీరు నానా రకముల బాధలు పడుచు పోలీసు వారి

దౌర్జన్యముల క్రింద నలిగిపోవుచున్నారు. కాంగ్రెసు వారు మంత్రిపదవులలో నున్నను యీ రోజులలో కూడ భారతదేశ పౌరులగు వారికి యాటవిక జాతి వారనే సాకు చేత యింకను సిటీ యాక్టు నుంచుట చాల హాస్యాస్పదము. కాన వారిని సిటీ యాక్టు నుండి తొలగింపవలసినదిగా మద్రాసు ప్రభుత్వము వారిని కోరుచున్నారు.

## నైజాం సంస్థానం - బ్రిటీషు ఇండియా

నైజాము సంస్థానము పరిసరములలోనూ, మధ్యలోనూ బ్రిటీషు ఇండియా గ్రామములున్నవి. ఆయా గ్రామ ప్రజలు నైజాము గ్రామముల గుండా, యన్. యన్. ఆర్. వై. ద్వారా తమ స్వంత పనుల మీద బ్రిటిషు ఇండియా వాసులు పోవలసి యున్నది. అట్టి సమయములో నైజాము పోలీసులు ఈ ప్రజలను భయ పెట్టి పోలీసు ఠానాలకు తీసుకొని పోవుచున్నారు. ఇది బ్రిటిషు ఇండియా ప్రజల పౌరసత్వ హక్కులకు భంగకరము కాన మద్రాసు ప్రభుత్వం వారు అట్టి బ్రిటిషు ఇండియా ప్రజలకు తగు రక్షణ నీయవలసినదిగా ఈ సభవారు కోరుచున్నారు.

## ప్రకాశం కమిటీ రిపోర్టు

జమీందారీ విధానము పూర్తిగా రద్దు గావించని యే చట్టము రైతులకు సంపూర్ణ రక్షణ కలుగ జేయదు. అయినప్పటికి 130 సంవత్సరముల నుండి జమీందారుల పీడనచే నలిగిపోవుచున్న రైతుల హక్కులను కొంతవరకైన ప్రకాశం గారి జమీందారీ కమిటీ రిపోర్టు రక్షించుట కుపకరించునని యీ సభ వారు అభిప్రాయ పడుచు వెంటనే, ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘ సూచనలతో కూడిన చట్టమును గావించిన గాని రైతులకు మేలు కలుగ జాలదని యీ సభ వారు నమ్ముచున్నారు.

## కాంగ్రెసు మంత్రులు - కార్మిక విధానము

కాంగ్రెసు మంత్రులు దాదాపు 2 సం॥ల నుండి పని చేయుచున్నను యింకను కాంగ్రెసు ఎన్నిక ప్రణాళికలోని కార్మిక కార్యక్రమమును మద్రాసు రాష్ట్రంలో అమలు జరుపలేదు. మద్రాసు కాంగ్రెసు మంత్రులు న్యాయమైన హక్కుల కొరకు కార్మికులు జరుపుచున్న పోరాటములను నిరుత్సాహపరుచుట, పికెటింగు గురించి విపరీత నిర్వచనము చేయుట, కార్మికుల మీద పోలీసులు చేయుచున్న దుండగముల సమర్థించుట, పైగా పోలీసుల కాల్పులను సమర్థించి, పెట్టుబడి దారులకు సహాయపడుచున్నారు. చీరాల, చిట్టి వలసలో కాంగ్రెసు మంత్రులవలంభించిన కార్మిక విధానము బ్రిటిషు పెట్టుబడిదారులకు సహాయ

పడింది. యజమానులకు, కార్మికులకు వచ్చిన తగాదాలలో పరస్పర ఒడంబడిక మంచిదని చెప్పుచు, దానికి తగిన పరిస్థితులను ఏర్పరచనందున అనగా కనీసం కార్మిక సంఘములను ఎట్టి షరతులు లేకుండా యజమానులు గుర్తించునట్లు ఏర్పాటు చేయకపోవుట వలన, మద్రాసు మంత్రులు కార్మికవిధానము యజమానులకు అనుకూలముగా వుంటున్నది. ఈ పాలసీ ఎన్నికల ప్రణాళికకు విరుద్ధం.

కాంగ్రెసు మంత్రులు ఎన్నిక ప్రణాళికలో వుదహరించిన కోర్కెలను యిచ్చుచూ వెంటనే శాసనాలు చెయ్యాలి. ఫ్యాక్టరీ యాక్టు చిన్న చిన్న వర్కుషాపులకు కూడ వర్తింపచేటట్లు చేయాలి. ఇందుకై పార్టీ సభ్యులు తీవ్ర ఆందోళన చేయాలి.

## రైతు సంఘములు - మన కర్తవ్యము

రైతు సంఘాల బాధ్యత నానాటికి హెచ్చుచున్నది. రైతు ఉద్యమము తీవ్ర రూపము దాల్చుచున్నది. అయినప్పటికి రైతు సంఘాలు ప్రస్తుతపు రాజకీయ పరిస్థితులలో తగిన పాత్ర వహించగల బలిష్టమైన నిర్మాణమును కల్గిలేవు. అందుచే ప్రస్తుతపు రాజకీయ పరిస్థితులలో తగిన బాధ్యత వహించి స్వాతంత్ర పోరాటంలో నిర్మాణయుక్తముగా పాల్గొనగలుగుటకు పార్టీ సభ్యులు యీ క్రింది సూచనల ప్రకారం తీవ్రకృషి చేయవలెను.

1. రైతు సంఘములలో పనిచేయుట అనగా ప్రాథమిక సభ్యులను చేర్పించుచు ప్రాథమిక కమిటీలను యేర్పర్చడమే గాదు. ప్రాథమిక సభ్యులను యేదో యొకప్పుడు చేర్పించక రైతులకున్న అత్యవసర యిబ్బందులను తొలగించుటకు పూనుకొనుచూ సంవత్సరం పొడుగునా చేర్పించవలెను. ఇట్లు చేసిన యెడల ప్రాథమిక సభ్యులను చేర్పించుటే ప్రధాన విషయముగా యుండక రైతు సంఘ వ్యవహారములలో యొక విషయముగానే యుండును. ఇందువలన సభ్యత్వ సంఖ్య గూడ యిప్పటికన్న తగ్గజాలదు.

2. గ్రామములోనూ ప్రాథమిక సంఘాలను పని చేసినా చేయకపోయినా విధిగా యేర్పరచవలెననే భావము తొలగవలయును. ఇందులకు ప్రతి గ్రామ గ్రామాన కమిటీలను యేర్పరచుటకు బదులు ప్రస్తుతము వున్న రైతు సంఘములు పూనుకొని స్థానిక యిబ్బందులను తొలగించుటకు పని చేయవలెను.

3. ప్రస్తుతము వివిధ ప్రాంతములలో రైతులు సలుపుచున్న పోరాటములలో పాల్గొని రైతు ఉద్యమమును అభివృద్ధి పరచటము రైతుల పోరాటము లెచ్చట అభివృద్ధి గాంచుటకు అవసరముండునో అచ్చట రైతు సంఘముల యాజమాన్యమున పోరాటమును జరుపుటయు, ప్రధాన అత్యావసర కార్యక్రమముగా రైతు సంఘములలో పని చేయు పార్టీ సభ్యులు తలంచి పని చేయవలెను.

4. రైతు సంఘములు గూడ రైతు సంఘాలనే అంగీకరించబడే వ్యవసాయ కూలీల కనీస కోర్కెలను రైతులు నెరవేర్చునట్లుగాను, వ్యవసాయ కూలీలు, రైతుల మధ్య సామరస్యమును పెంపొందించుటకును రైతు సంఘాలలో నున్న పార్టీ సభ్యులు తీవ్ర కృషి చేయవలయును.

## వ్యవసాయ కూలీలు

ఇప్పటివరకును వ్యవసాయ కూలీలను మనము సంఘటన చేయలేక పోతిమి. బ్రిటీషు ప్రభుత్వము వీరిని సైన్యమందు చేర్చుటకు పూనుకొననున్నది. కొంతమంది మతము పేరిట వీరిని తమ పలుకుబడిలో వుంచుకొనుటకు ప్రయత్నించుచున్నారు. గత స్వతంత్ర పోరాటములో వీరి ఆర్థిక సమస్యలకు సంబంధించని కార్యక్రమములు అగుటవలననూ, వీరియందు ఆర్థిక పోరాటము, రాజకీయ పోరాటములుగా మారి రాజకీయ చైతన్యము కలుగకపోవటము వలన వీరు జాతీయ పోరాటమునకు సహకారము చేయలేదు. ప్రస్తుత అంతర్జాతీయ పరిస్థితుల రానున్న ఆర్థిక దుస్థితి పరిస్థితుల ననుసరించి వీరి కోర్కెల కొరకు మనము వీరిని సంఘటనము చెయ్యాలి. వీరిని రాజకీయ పోరాటములోనికి తీసుకొని రావటమునకు వీరి ఆర్థిక హక్కుల కొరకు సంఘటనము జరపాలని వీరు బ్రిటీషు ప్రభుత్వము జాతీయ పోరాటమునకు వ్యతిరేకముగా వినియోగించు కొనకుండుటకు వారికి రాజకీయ చైతన్యము కలుగచెయ్యాలి, అందువలన వారిని ఈ క్రింది కోర్కెలపై సంఘటన పర్చాలి.

1. ఇండ్లకు గవర్నమెంటు 2/3 మాత్రమే అప్పుగా యిస్తున్నారు. వీరికియింట్లో సౌకర్యాల నిమిత్తం ప్రయత్నిస్తూ పూర్తిగా యింట్లో సౌకర్యము గవర్నమెంటు చెయ్యవలసినదిగా ప్రభుత్వముపై వత్తిడి తేవాలి.

2. నీటి సౌకర్యాలు, వంతెనలు, ఉచిత వైద్యశాలలు ఏర్పాటు కొరకు గవర్నమెంటుపై ఒత్తిడి తేవాలి.

3. కొన్ని గ్రామాలలో నామ పద్ధతి యితర గ్రామాలలో ఎక్కువ రేటు ఉన్నా అచ్చటికి కూలీలను పోనీయక పోవటం అమలులో ఉన్నాయి. దీన్ని అరికట్టుటకు ప్రయత్నిస్తూ రైతు సంఘాలు సహాయం చేయునట్లు మన పార్టీ సభ్యులు చూడాలి.

4. డెల్టా గ్రామాలలో ఊడ్పులు, కోతలు, ఉన్న రెండునెలలు తప్ప మిగిలిన రోజులలో కూలీ దొరకదు. ఆ రోజులలో పని చూపించవలసిందిగా గవర్నమెంటుపై ఒత్తిడి తేవాలి.

5. యుద్ధ ప్రతికూల ప్రచారపు ఏర్పాట్లు.

6. రైతులు పెద్ద వడ్డీ మీద అప్పులు పెట్టి, వెట్టిచాకిరి చేయించుకుంటు న్నారు. దీనిని నిరోధించడానికి పెట్టుబడి తక్కువ వడ్డీమీద అప్పులు యిచ్చుటకు లేబరు కో-ఆపరేటివ్ బ్యాంకును ఏర్పరచుటకు ఒత్తిడి తెచ్చుట.

7. బంజరు భూములు ప్రభుత్వమే పెట్టుబడి పెట్టి సహకార వ్యవసాయ పద్ధతిమీద వ్యవసాయ కూలీలకు యిచ్చుటకు ప్రభుత్వంమీద ఒత్తిడి తెచ్చుట.

8. వ్యవసాయ కూలీల ఋణమును పూర్తిగా రద్దుపర్చుటకు శాసనము ప్రభుత్వము తీసుకొని రావాలి.

## నూతన కార్యనిర్వాహక వర్గమునకు ఈ దిగువవారు ఏకగ్రీవముగా ఎన్నుకొనబడిరి

ప్రధాన కార్యదర్శి :- చంద్ర రాజేశ్వరరావు

జాయింటు కార్యదర్శి :- వెల్లంకి విశ్వేశ్వరరావు

కార్యనిర్వాహక సభ్యులు:- 1. మునిపల్లి రామారావు, 2. కాకర్ల చంద్ర శేఖరరావు, 3. పి.వి. సుబ్బారెడ్డి, 4. యార్లగడ్డ బసవయ్య, 5. కాట్రగడ్డ రాజ గోపాలరావు, 6. కృత్తివెంటి కుటుంబరావు, 7. పిల్లలమర్రి వెంకటేశ్వర్లు 8. పొట్లూరి సుందరం, 9. నండూరి ప్రసాదరావు.

(నవశక్తి., 15.3.39, పేజీ 17)

## అనుబంధం - 3 'సి'

# గుంటూరు జిల్లా సోషలిస్టు పార్టీ మహాసభ
## (20-3-1939)

గుంటూరు జిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ మహాసభ గుంటూరు టౌన్ హాలులో కామ్రేడ్ వావిలాల గోపాలకృష్ణయ్య గారి అధ్యక్షత క్రింద జరిగింది.

కార్యదర్శి వార్షిక నివేదికను ఇచ్చిన మీదట ఫెడరేషన్ ప్రతికూల ప్రచారమును, త్రిపురీ కాంగ్రెసు జాతీయ వాంఛా తీర్మానమును అమలు జరుపు విషయమై, రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ వారు ఇచ్చిన కార్యక్రమమును నిర్వర్తించుటకు గాను జిల్లాలోని తాలూకా పార్టీలన్నీ దళాలేర్పాటు చేసి ఏప్రిల్ 7 వ తేదీ నుండి ప్రచారం చేయాలని మే నెలలో వేసంగి పాఠశాలలు 4 రెవెన్యూ డివిజనులకు నాలుగింటిని నడుపవలెనని తీర్మానింపబడినది.

తరువాత ఈ క్రింది తీర్మానాలా మోదింపబడ్డవి.

1. కామ్రేడ్ కృపాస్కయా (లెనిన్ సతి) తన జీవితాంతం వరకు విశ్వ సేవ కోసమే పాటు పడి, లెనిన్ జీవితమంతా సహచారిణిగా వుండి, అతనిని ప్రోత్సహిస్తూ కార్మిక కర్షక కళ్యాణానికి జీవితం ధారపోసి ఈ మధ్యనే మరణించి నందుకు ఈ సభ వారు సంతాపపడుచున్నారు.

2. కాళీపట్నానికి రెవిన్యూ మంత్రి ప్రకాశం గారు వెళ్ళి అచ్చటి రైతు కష్టములను విచారించి వారికి తగిన సహాయం చేస్తానని చెప్పినప్పటికీ, "తప్పుడు సలహాతో, తొందరపాటుతో సాగించబడిన కాళీపట్నం రైతు సత్యాగ్రహాన్ని నిరసించుతున్నామని, ఆ సత్యాగ్రహంలో పాల్గొనిన కాంగ్రెసు వర్కర్ల దగ్గర నుంచి సంజాయిషీ తీసుకొనుటకు రాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శిని నియమించామని" చేయబడిన రాష్ట్ర కాంగ్రెసు వర్కింగు కమిటీ వారి తీర్మానం, పురాతనం నుంచి తామనుభవిస్తున్న కనీసపు కోర్కెల కొరకు పోరాడుతూ ప్రభుత్వపు క్రూర నిర్బంధ విధానాన్ని, జమీందారు యొక్క అన్యాయపు దోపిడీని నిరుత్సాహపరచి కాంగ్రెసు నుంచి రైతు ప్రజా సామాన్యాన్ని, రైతు ఉద్యమాన్ని వేరు చేసి, కాంగ్రెసు నడుపుతున్న స్వాతంత్ర్య పోరాటాన్ని బలహీనపరుచును. అంతేకాకుండా

రాష్ట్రం వారి ఈ తీర్మానం రైతు సంఘాలను గుర్తిస్తూ, చేయబడ్డ ఫెయిజుపూరు హరిపుర కాంగ్రెసు తీర్మానాలకు పూర్తి భిన్నముగా నున్నది. కనుక ఈ తీర్మానమును కావించిన రాష్ట్ర కాంగ్రెసు కమిటీ వారి వైఖరి పట్ల పూర్తి అసంతృప్తిని ఈ సభవారు వెలిబుచ్చుచు కాళీపట్నం రైతుల సత్యాగ్రహానికి పూర్తి ప్రోత్సాహం యివ్వవలెనని కోరుచున్నారు. కాంగ్రెసు వర్కర్లకు ఏ విధమైన అడ్డంకులు, నిరుత్సాహము, డిసిప్లినరీ చర్యల భయము కలుగకుండా రాష్ట్ర కాంగ్రెసు కమిటీవారు, రైతు ఉద్యమంలో పాల్గొననివ్వటం ద్వారా రాష్ట్రంలోని రైతు ఉద్యమానికి కాంగ్రెసుకు సన్నిహితమైన సామరస్యపు సంబంధాలను పెంపు చేసుకోటం స్వాతంత్ర్య ఉద్యమానికి అత్యవసరం. కాబట్టి కాళీపట్నం రైతు సత్యాగ్రహంలో పాల్గొనిన కాంగ్రెసు వర్కర్లనుంచి సంజాయిషీ తీసుకోవాలనే యత్నం మానుకొని వారికి తగిన సహాయం చేయవలెనని రాష్ట్ర కాంగ్రెసు వారిని కోరుతున్నారు.

రైతులపై లాఠీ చార్జీలు, అరెస్టు, శిక్షలు ప్రయోగించిన పశ్చిమ గోదావరి జిల్లా కలెక్టరునే అచ్చట (కాళీపట్నం) రైతు జమీందారు మధ్య వచ్చిన తగాదాను ఎంక్వైరీ చేయుటకు కాంగ్రెసు మంత్రివర్గం నియమించటం ఘోరంగా ఉన్నదని అభిప్రాయపడుచు, ఒక నిష్పాక్షిక కమిటీ ద్వారా ఎంక్వైరీ నడపవలసినదని మంత్రివర్గమును కోరుచున్నారు.

చిట్టివలస కాల్పులు:- చిట్టివలస జనపనార మిల్లులలో సమ్మె జేస్తున్న (స్టే ఇన్ స్ట్రైక్) కార్మికులను అర్ధరాత్రివేళ, దీపాలార్పి, గేట్లు మూసి, తుపాకులతో కాల్చి, లాఠీలతో కొట్టిన పోలీసు అధికారుల చర్యలను ఖండించుచున్నాము.

కార్మికుల కష్టాలను, యజమానుల దుండగాలను, సమ్మెకు గల ఇతర కారణాలను గమనింపక, కాంగ్రెసు మంత్రివర్గము, సమ్మెను ఖండిస్తూ పోలీసు కాల్పులను సమర్థించుచు ఇచ్చిన కమ్యూనిక్కు, ప్రజల తరపున ఉండవలసిన కాంగ్రెసు మంత్రివర్గానికి తగదని అభిప్రాయపడుచున్నాము.

సమ్మెలో పాల్గొని, ధైర్యముగా పోరాడి లెక్కలేని త్యాగం చేసిన కార్మికులకు హృదయపూర్వకంగా అభినందిస్తున్నాము.

4. పనివారిని మరింత నష్టపరచు క్రూర నిబంధనలకు సమ్మతింపలేదను మిషమీద తెనాలి లక్ష్మీ ప్రెస్ యజమానులు లాకవుట్ ప్రారంభించి 40 మంది పనివారిని 12 వ తేదీ నుంచి నిరుద్యోగులుగా చేసినందుకు వారి చర్యను తీవ్రముగా ఈ సభవారు ఖండించుచున్నారు. అన్ని బాధలకు లోనగుతూ కూడ ప్రెస్సు యజమానుల అన్యాయాలను తీవ్రంగా ప్రతిఘటిస్తున్న వర్కర్లను

అభినందిస్తూ, వారల ఆర్థిక సహాయానికి, జిల్లాపార్టీ శాఖలు డబ్బు వసూలుచేసి వారికి అనుకూలముగా ఆందోళన సభలు జరుపవలెను.

5. మంగళగిరి క్రిష్ణా సిమెంటు వర్క్సు కూలీలపైనున్న క్రిమినల్ కేసులను వెంటనే ఉపసంహరించుకొనమని గవర్నమెంటు వారిని కోరుచున్నాము.

6. లోగడ జిల్లా పార్టీ కార్యనిర్వాహక వర్గం యిచ్చిన జిల్లా బోర్డు కార్యక్రమమును జిల్లా పార్టీ శాఖలు, పార్టీ సభ్యులు అందరు అన్ని ప్రాంతాలు ప్రచారం చేస్తూ ఆ ప్రచారములో స్థానిక కాంగ్రెసు కమిటీలు, జిల్లా బోర్డు ప్రతినిధులు పాల్గొంటూ ఉండేటట్లు చూడవలెను.

జిల్లా బోర్డు సభ్యులుగా ఉన్న పార్టీ సభ్యులు ఆ కార్యక్రమమును, తమ యొక్క నియోజక వర్గాల్లో ప్రచారము గావిస్తూ జిల్లా బోర్డు కాంగ్రెసు పార్టీలో, జిల్లా బోర్డులో నెగ్గేందుకు ప్రయత్నిస్తుండవలెను.

7. ఇంతవరకు రాష్ట్ర కాంగ్రెసు కమిటీ వారు ఒక నిర్ణీతమైన జిల్లా బోర్డు మొదలగు స్థానిక సంస్థలకు నిర్ణీతమైన కార్యక్రమమును ఇవ్వవలసిన అవసరమును గుర్తించనందుకు ఆశ్చర్యపడుతూ, ప్రజాహితమైన ఒక కార్యక్రమమును సత్వరంగా యివ్వవలసిందని ఈ సభవారు కోరుచున్నారు.

8. 1936 ఎస్టేట్ల ఎమెండుకు చట్ట ప్రకారం అగ్రహార రైతులకు అగ్రహారపు భూములలో కూడివరం హక్కు యిచ్చినది. ఆ హక్కుల అనుభవం కొరకు ఇంతవరకు అగ్రహారం దార్లతో రైతులు పోరాడుచున్నారు. కొంతమంది అగ్రహారం దార్లతో రైతులు పోరాడుచున్నారు. కొంతమంది అగ్రహారందార్లు లొంగి 1936 చట్ట ప్రకారం తగాదా పరిష్కారం చేసుకొనినారు. కొంతమంది అగ్రహారీకులు రైతులకు హక్కులివ్వనందున రైతులకు దావాలు వేసికొనినారు.

ఇంతలోకే జమీందారీ విచారణ సంఘము రిపోర్టు వెనుక అగ్రహారం రైతులిచ్చిన హక్కులు తీసివేయ సూచించింది. ఈ రిపోర్టు చూచి అగ్రహారం దారులు స్థానిక అధికారుల బలముతో రైతులను పొలముల నుండి తరుమగొట్టు చున్నారు. భూములను బీళ్ళు పెట్టుచున్నారు.

రెవెన్యూ మంత్రిగారు తమ సంచారములో ఎవరి హక్కులు వారికే ఉండునని చెప్పినారేగాని అగ్రహారం రైతులకు ఫలాన హక్కులిస్తామని చెప్పలేదు. కాబట్టి మంత్రివర్గం తమ బిల్లు ప్యాసు చేసేదాకా పాత ఆక్టు ప్రకారం స్థానిక అలవాటుల ననుసరించి రైతు ఎట్టి దావాలు వేయకుండావే కుడివరం హక్కును ఇవ్వవలెను.

స్థానిక అధికారుల చర్యల పైన రిపోర్టులు రాగానే కాంగ్రెసు, కాంగ్రెసు సోషలిస్టు, రైతు సంఘం ప్రతినిధుల సహాయంతో జిల్లా అధికారుల విచారణ సలిపి, స్థానిక అధికారుల పైన తగు చర్య తీసుకొనవలెనని ఈ సభ వారు తీర్మానించుచున్నారు.

9. నూతన సంవత్సరమునకు ఈ క్రింది కార్యనిర్వాహక వర్గమును ఎన్నుకోవడమైనది.

1. కామ్రేడ్ పి. వి. శివయ్య, ప్రధాన కార్యదర్శి
2. వావిలాల గోపాల కృష్ణయ్య, సహాయ కార్యదర్శి
3. శ్రీ గిరిరాజు సత్యనారాయణ
4. ముత్తేవి మాధవాచారి
5. మాదాల వీరభద్రరావు
6. లావు అంకమ్మ
7. కొండాలి ఆంజనేయులు
8. జాబిన సుబ్బారావు
9. యస్. వి. యల్. నరసింహం
10. చదలవాడ పిచ్చయ్య

(నవశక్తి, 5.4.39. పేజీ. 16)

## అనుబంధం - 3 'డి'

# నెల్లూరు జిల్లా

నెల్లూరు జిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ తృతీయ కాన్ఫరెన్సు కామ్రేడ్ పి. సుందరయ్యగారి అధ్యక్షతన (జనవరి - సం॥) 4, 5 తేదీలలో పార్టీ కార్యాలయములలో సమావేశమై ఈ క్రింది తీర్మానములు గావించినది.

1. కార్యదర్శి రిపోర్టు చర్చించి అంగీకరించడమైనది.

2. ఆల్ ఇండియా నేషనల్ కాంగ్రెసు అధ్యక్షపోటీలో సుభాష్ చంద్ర బోసు గారికి కలిగిన విజయము కేవలము అతివాదుల విజయము కాదు. ఫెడరేషనుకు వ్యతిరేకముగానున్న చాలా మంది కాంగ్రెసు మితవాదులు కూడా సుభాష్‌కు వోటుచేయుటవల్లనే వారికి విజయం కల్గింది డాక్టరు పట్టాభి వోటమి తన వోటమి,తన సిద్ధాంతాల వోటమి అందుచేతను అనుయాయులగు కాంగ్రెసు మితవాద నాయకులను కాంగ్రెసు నుండి బయటికి రావలయునని గాంధీజీ సూచించాడు. కాంగ్రెసులో చీలికలు యేర్పడు స్థితికి తీసుకొని వచ్చినది. పట్టాభి వోటమి గాంధీజీ సిద్ధాంతముల వోటమి కాదు.

కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికను కాంగ్రెసు తీర్మానాలను ఆచరణలో పెట్టక ఫెడరేషనును అంగీకరించే యత్నాలు మితవాద నాయకులు చేయు విధానానికి వోటమి. ఈ పరిస్థితులలో కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గమునందుగానీ కాంగ్రెసు నీతియందుగాని తీవ్రమార్పు జరుగదు. యీవరకు చేసిన తీర్మానాలే ఖచ్చితముగా ఆచరణలలో పెట్టెదరు. అయినా కాంగ్రెసు మితవాద నాయకులు వర్కింగు కమిటీలో నుండకపోయినను సుభాషు చంద్రబోసు యేమాత్రం జంకక తన యిష్టము వచ్చిన వర్కింగు కమిటీని వేసుకొని కాంగ్రెసు తీర్మానాలు పూర్తి తన దృక్పథము ప్రకారము ఆచరణలో పెట్టి పని చేయవలసినదిగా కోరుచున్నాము.

3. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ రాబోవు వార్షిక సమావేశమునకు యీ క్రింది వారిని డెలిగేట్లుగా ఎన్నుకొనడమైనది.

1. బి. శంకరయ్య
2. పి. నరసింహం
3. యస్. శంకరయ్య
4. ఆర్. ఆదిశేషయ్య

4. నెల్లూరుజిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ కార్యనిర్వాహక వర్గమునకు యీ క్రింది వారిని యెన్నుకొనడమైనది.

1. బి. శంకరయ్య, జనరల్ కార్యదర్శి
2. యం. హనుమంతరావు, సహాయ కార్యదర్శి
3. యస్. శంకరయ్య
4. ఏ. రంగయ్య
5. ఆర్. ఆదిశేషయ్య
6. గంగా చినకొండయ్య
7. యం. బాలసుబ్రమణ్యం
8. బి. రామనాథం
9. ఎ.వి. కిష్టయ్య

కార్యనిర్వాహక కమిటీ మెంబర్లు

5. పార్టీ లెక్కలు సరి చూచిన మీదట అంగీకరింపబడినవి.

6. సామ్రాజ్య వ్యతిరేక సంస్థయైన కాంగ్రెసు తరపున వెళ్ళిన మద్రాసు రాష్ట్ర మంత్రులైన శ్రీ గౌరవనీయులు బెజవాడ గోపాలరెడ్డి, రామనాథన్, మునిస్వామిపిళ్ళె గార్లు ప్రొక్లమేషన్ పెరేడ్‌లో సామ్రాజ్య చిహ్నమైన యూనియన్ జాక్‌కు 1-1-39 తేది. సాల్యూటు చేసినందులకు వారి చర్యలను తీవ్రముగా ఖండించుచూ ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటీ వారు తగిన చర్య తీసుకొనవలసినదిగా తీర్మానించడమైనది.

(నవశక్తి. 15-2-39, పేజీ. 17)

## అనుబంధం - 3 'ఇ'

# తూర్పు గోదావరి జిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ మహాసభ

4-1-30 తేదీన ఉదయం 8 గంటలకు పార్టీ ఆఫీసులో కామ్రేడ్ పెన్మెత్స సూర్యనారాయణ గారి అధ్యక్షతను పై మహాసభ జరిగినది. జిల్లాలోని వివిధ ప్రాంతముల నుండి పార్టీ సభ్యులు సభకు హాజరైరి.

పార్టీ సభ్యులైన కామ్రేడ్ గోవిందమ్మ గారి అకాల మరణమునకు విచారమును తెలియజేస్తూ, ఏకగ్రీవముగా తీర్మానించబడెను. కార్యదర్శి గత సంవత్సరపు నివేదిక చదివిన పిమ్మట ఏకగ్రీవంగా ఆమోదించబడెను. తరువాత జిల్లా పార్టీ నిబంధనావళి భావి కార్యక్రమము, కొన్ని నిర్మాణ సమస్యలను గురించి చర్చ జరిగిన నిర్ణయాలు జరిగిన పిమ్మట ఈ క్రింది తీర్మానములు ఏకగ్రీవంగా ఆమోదించబడెను.

1. సామర్లకోటలో ది డెక్కన్ షుగర్ అండ్ అబ్కారీ ఫ్యాక్టరీ కూలీల సమ్మె సందర్భములో అరెస్టు చేయబడిన వారిపై నున్న కేసులను సమ్మె పరిష్కారమైన పిదప కూడ ప్రభుత్వము రద్దు చేయనందుకు విచారమును తెలియజేయుచు వెంటనే ఆ కేసుల నుపసంహరించుకో వలసినదిగా మద్రాసు మంత్రి వర్గమును ఈ సభవారు కోరుచున్నారు.

2. రాజధానిలో కూలీ పరిస్థితులు చాలా అక్రమముగ నున్నవి యజమానులు కూలీల వేతనములు తగ్గించుట హెచ్చు కాలం పని చేయించుకొనుట కార్మిక సంఘాలను గుర్తించక పోవుట అనేకమంది పనివారలను నిరుద్యోగులుగ చేయుట, మొదలగు చర్యలు సాగిస్తున్నారు. కార్మిక లోకానికి కొరతయైన శాంతిని కలుగ జెయ్యాలంటే కాంగ్రెసు మంత్రి వర్గము అనుకూలమైన కార్మిక చట్టమును తక్షణమే తీసుకు రావాలని ఈ సభవారు తీర్మానించుచున్నారు.

పిమ్మట ఈ క్రింది కార్యనిర్వాహక వర్గమును నూతన సంవత్సరమునకు ఏకగ్రీవముగ ఎన్నుకొనబడిరి.

1. కామ్రేడ్ కొరపాటి పట్టాభిరామయ్య, 2. పి. అనంతం గారు, 3. సి. వి. కృష్ణారావు గారు, 4. పెన్మెత్స సూర్యనారాయణ గారు, 5. రావు వెంకట జగ్గారావు గారు, 6. ఇనుగంటి నారాయణరావు గారు, 7. చింతం సత్యనారాయణదాసు గారు, 8. చొప్పల నవరత్నం గారు, 9. కాకరాల కామేశ్వరశాస్త్రి గారు.

పెన్మెత్స సూర్యనారాయణ, కార్యదర్శి.

(నవశక్తి, 14-6-39. పేజీ 2).

## అనుబంధం - 4

# 1943 జూలై ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ మూడవ మహాసభ నివేదిక

### జైలులో వున్న కామ్రేడ్స్‌కు అభివందనాలు

నేడు జైళ్ళలో నిర్బధింపబడివున్న పార్టీ కామ్రేడ్స్‌కు యీ మహాసభ అభివందనాలు తెలుపుతూంది.

ఆగష్టు 9 తరువాత సంఘటనలలో ప్రజలకు - పోలీసులకు మధ్య నిలబడి పని చేసినందుకు, కాంగ్రెసు నాయకులకొరకు, ఆహార సమస్యా పరిష్కారం కొరకు, కృషి చేసినందుకు అనేక మంది కామ్రేడ్స్ నిర్బంధించబడ్డారు. ఫాసిస్టు దండయాత్రనుండి దేశాన్ని రక్షించడానికి, పంచమాంగ దళాన్ని రూపుమాపడానికి విధ్వంసక చర్యలను ఆపి, దేశభక్తులందరిని దేశరక్షణ నిమిత్తం ఐక్యపరచడానికి యీ కామ్రేడ్స్ కృషి చేశారు.

దేశ రక్షణ కొరకు జపాన్ దుండగీడులను ఎదిరించడానికి తమ సర్వస్వం అర్పించి పని చేస్తున్న కమ్యూనిస్టులను అరస్టు చేయడం, దేశరక్షణకు ప్రజలను సంఘటిత పరచడానికి తహతహలాడుతున్న ఈ దేశభక్తులను విడుదల చేయక పోవడం పంచమాంగ దళానికి సహాయపడటమేనని నిరంకుశాధికార వర్గం గుర్తించడం లేదు.

జైళ్ళలో వున్న కామ్రేడ్స్ అందరికీ యీమహాసభ అభివందనాలు తెలుపుతూంది. వారి విడుదల కొరకై నిరంతర కృషిచేస్తామనీ, వారిని ప్రజల మధ్యకు తెచ్చేవరకు విశ్రాంతి తీసుకోమని శపథం చేస్తున్నాం.

ప్రతి కామ్రేడ్ యొక్క విడుదల కొరకు ప్రత్యేకంగా ఆందోళన చేయవలసిందని స్థానిక కమిటీలకు యీ మహా సమావేశం హెచ్చరిస్తోంది. వీరి విడుదలకై చేసే ఆందోళనను జత చేసినట్లయితే ఆదొక బ్రహ్మాండమైన ఉద్యమంగా మనంజేసే ఆందోళనలతో కాంగ్రెస్ నాయకుల విడుదలకై వృద్ధి చెందుతుంది. అపుడు నిర్బంధ విధానం పటాపంచలుగాక తప్పదు. దేశభక్తులందరూ మన మధ్యకు వస్తారు. యిందుకొరకు ఎడతెగని కృషిచేయాలని యీ సమావేశం బయటవున్న కామ్రేడ్స్‌ను, ప్రజలను హెచ్చరించుతోంది.

# అధ్యాయము - 1

# రాజకీయ నివేదిక

## ఆంధ్ర పార్టీ పుట్టుక

ఆంధ్ర రాష్ట్రంలో పార్టీ బొంబాయి, బెంగాల్ వగైరా కొన్ని రాష్ట్రాల్లో యేర్పడ్డ తరువాతనే స్థాపించబడింది. ఇతర ప్రదేశాల్లో అదివరకే జరుగుతున్న యెర్రజెండా ప్రచారం ఆంధ్రదేశంలో 1934 నాటికి ప్రవేశించింది.

1930-33 నాటి కాంగ్రెసు శాసనోల్లంఘనోద్యమములో ఆంధ్ర దేశము నుండి జైళ్ళకు వెళ్ళిన కాంగ్రెసు యువకులకు సోషలిస్టు టెర్రరిస్టు భావాలు గల అతివాదులతో సంబంధం కల్గింది. అప్పటికే గాంధీ తత్వము యెడల అసంతృప్తి చూపెడుతున్న వీరు జైళ్ళలోని సోషలిస్టుల, టెర్రరిస్టుల సంబంధంతో గాంధీ పంథా స్వాతంత్ర్యమును సంపాదించుటకు నిరుపయోగమైనదని, సోషలిస్టుల కార్యక్రమం ద్వారా స్వాతంత్ర్యోద్యమం జయప్రదమవుతుందని తెల్సుకున్నారు. సోషలిష్టు పంథా విలువను రాజకీయంగానే గాకుండా, ఆర్థికంగా గూడా సోషలిజం ఒక్కటే ప్రపంచానికంతకూ సరియైన విధానమని గూడ గ్రహించారు. 1935-36 సంవత్సరాలలో ధనికవాద ప్రపంచమంతటా చెలరేగుచున్న ఆర్థిక సంక్షోభము, అదే సమయాన సోషలిస్టు విధానము అనుసరించిన సోవియట్ యూనియన్‌లో సర్వతోముఖాభివృద్ధి గూడ వీరికి సోషలిస్టు సిద్ధాంతములో నమ్మకాన్ని మరింత ధృడపర్చాయి. జైళ్ళ నుండి విడుదల కాగానే వీరందరూ ప్రజల మధ్య సోషలిస్టు ప్రచారానికి పూనుకున్నారు.

మరొక మార్గం ద్వారా గూడ ఆంధ్ర రాష్ట్రంలో సోషలిస్టు గ్రూపులు ఏర్పడ్డాయి. బెనారస్ హిందూ విశ్వ విద్యాలయానికి యిచ్చటి నుండి వెళ్ళిన విద్యార్థులకు అచ్చట అంతకు ముందే యేర్పడ్డ కమ్యూనిస్టు గ్రూపులతో సంబంధం గలిగింది. అట్టి వారందరూ ఆంధ్ర దేశానికి తిరిగి వచ్చిన తరువాత (1934 లో) యిచ్చట గూడ పార్టీ గ్రూపులుగా యేర్పడ్డారు.

మద్రాసులో "యంగ్ వర్కర్సు లీగ్" అనే కమ్యూనిస్టు భావాలు గల గ్రూపు యీ సమయంలోనే యేర్పడింది. దాని ద్వారా గూడ ఆంధ్ర రాష్ట్రంలో పార్టీని యేర్పరచడానికి ప్రయత్నాలు జరిగాయి.

ఈ వివిధ ప్రయత్నాల ఫలితంగా 1934 సెప్టెంబరు 15 వ తేదీ నాః ఆంధ్ర దేశంలో కమ్యూనిస్టు పార్టీ సభ్యులు 40 మంది వున్నారు. అప్పటి నుః పార్టీ కార్యక్రమము ననుసరించి వీరందరూ పనిచేయడం ప్రారంభించారు.

## జాతీయైక్య సంఘటన రోజులకు ముందు పార్టీ కార్యకలాపాలు

కమ్యూనిస్టు పార్టీ కార్మికవర్గ రాజకీయ పార్టీ అగుటచేత కార్మికవర్గంలో గట్టి స్థానం సంపాదించుటకు ప్రయత్నం చేయుటే ప్రథమ కర్తవ్యమనే భావంతో, ఆంధ్రదేశం పారిశ్రామిక దేశం కాకపోయినా, వున్న కొద్ది కార్మికుల లోనే (ప్రెస్ వర్కర్సు, తోటి కార్మికులు, జూట్ వర్కర్సు వగైరా) పని జేయడానికి అప్పటి పార్టీ సభ్యులందరూ కేంద్రీకరించారు. ఇంకా యితర ప్రజా రంగాలలో ప్రవేశించకుండా నేరుగా కార్మికుల్లోకి దుమికారు. 1934 సంవత్స రంలోనే "లేబర్ ప్రొటెక్షన్ లీగ్"లు ఏలూరు, గుంటూరు, బెజవాడ, నెల్లూరు పట్టణాల్లో స్థాపించబడ్డాయి. కార్మికుల కొరకు పనిజేస్తూ వున్నప్పటికీ, యివి ప్రధానంగా పార్టీ రాజకీయ వేదికలుగా వుండేవి. సోవియట్ యూనియన్, సోష లిజం గూర్చి విరివిగా రాజకీయ ప్రచారం జేస్తూ వుండేవి.

రైల్వే కార్మికులలో పనిచేయడానికి గూడ కొందరు కామ్రేడ్సు కొన్ని కేంద్రాలకు ప్రత్యేకించబడ్డారు. వ్యవసాయ కూలీలలో గూడ (నెల్లూరు, గుంటూరు జిల్లాలలో) కొన్నిచోట్ల ప్రచారం జరిగింది.

ఆంధ్ర దేశంలోని కార్మికుల మధ్య యిదివరకెన్నడు యీ విధంగా ప్రచారం చేయబడలేదు. ఆంధ్రలో ట్రేడ్ యూనియన్ ఉద్యమాన్ని నిర్మించ డానికి ప్రయత్నించినది మన పార్టీ ఒక్కటే.

ఈ కాలంలో "లేబర్ ప్రొటెక్షన్ లీగ్"ల తరపున కార్మికుల్లో పనిచేయ డమే గాకుండా, గ్రామాల్లో యువజన సంఘాలు స్థాపించి, రాజకీయంగా కాంగ్రెసు ఉద్యమం ద్వారా ముందుకు వచ్చిన వర్కర్లందరిలో సోషలిస్టు ప్రచారం జరుపబడింది. అయితే యీ యువజన సంఘాలకు యువజన ప్రజా సామాన్యాన్నంతటినీ ఆకర్షించగలిగిన కార్యక్రమం లేదు. ఆ దృక్పథంతో ప్రయత్నం గూడ లేదు. "లేబర్ ప్రొటెక్షన్ లీగ్"ల వలెనే యివి గూడ పార్టీ రాజకీయ ప్రచార, ఆందోళనా వేదికలుగా వుండిపోయాయి. ఇందులో అతివాద దృక్పథం గల రాజకీయంగా చురుకుగా పనిజేస్తున్న యువకులు మాత్రమే సభ్యులుగా వుండేవారు. సెక్టేరియన్ దృక్పథంతో పనిజేసినప్పటికినీ, కాంగ్రెసులో చురుకుగా పనిచేయు యువకులందరినీ పార్టీ వైపుకు యీ యువజన సంఘాలు ఆకర్షించగలిగాయి.

**ఫలితాలు :**

"లేబర్ ప్రొటెక్షన్ లీగ్" యువజన సంఘాల ద్వారా పార్టీ సభ్యులు గావించిన కృషివలన ఆంధ్ర దేశమంతటా (రాయలసీమ జిల్లాలు తప్ప) గాంధీ సిద్ధాంతాలకుమారుగా, సోషలిస్టుసిద్ధాంతాల ననుసరించిపనిచేసినప్పుడే స్వాతంత్ర్య పోరాటాన్ని సాగించి జయప్రదమొనర్చ గలుగుతామని ప్రచారం చేయబడింది. కాంగ్రెసు యువకులు హెచ్చు మంది మన పార్టీ వైపునకు ఆకర్షింపబడ్డారు. ప్రథమ పర్యాయంగా ఆంధ్ర దేశంలో కార్మికోద్యమం నిర్మింపబడింది. అంతే గాకుండా, జాతీయరంగంలో పనిచేస్తున్న వర్కర్లకు రాజకీయంగా మేల్కొన్న ప్రజలకు సోవియట్ యూనియన్, చైనా, స్పెయిన్ దేశాల గూర్చి - సానుభూతి ప్రచారం గావించడం ద్వారా, ఫాసిజాన్ని అబిసీనియాపై ఇటలీ దురాక్రమణను ఖండించడం ద్వారా, అంతర్జాతీయ దృక్పథం మొదటిసారిగా యేర్పడింది. భారతదేశ స్వాతంత్ర్య పోరాటం, అంతర్జాతీయ ప్రజల స్వాతంత్ర్య పోరాటంతో మిళితమై వుందనే అంతర్జాతీయ దృక్పథం గూర్చి ప్రచారం చేయబడింది. వీటన్నిటి ఫలితంగా మనపార్టీకి ఆంధ్రరాజకీయ రంగంలో ఒకస్థానం లభించింది.

**మనలోట్లు :**

సెక్టేరియన్ దృక్పథంతో పనిచేయడం మన పెద్ద లోపం. సోషలిజాన్ని గూర్చి జనరల్‌గా ప్రచారం చేశామే గాని, ప్రజల మధ్య ముఖ్యంగా రైతు సామాన్యంలోనూ, కాంగ్రెసు సంఘాలలోను పనిజేయలేదు. కాంగ్రెసు యువకులను మనవైపుకు ఆకర్షింపగలిగినా, కాంగ్రెసు సంఘాలలో జేరి పనిచేయకపోవడం వలన కాంగ్రెసు ప్రజాసామాన్యానికి మనం దూరమైపోయాము.

ఆంధ్ర రాష్ట్రంలో కాంగ్రెసు సోషలిస్టు పార్టీ 1934 లోనే యేర్పడ్డప్పటికిని, సెక్టేరియన్ దృక్పథ ముండుట చేత 1936 వరకూ దానిలోగాని, కాంగ్రెసులోగాని చేరి పనిజేయడాన్ని ప్రధాన విషయంగా పార్టీ తీసుకోలేదు. 1936 సెప్టెంబరు రాజమండ్రిలో జరిగిన ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ సమావేశం తరువాత, కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ద్వారా పార్టీ సభ్యులంతా పనిజేయ సాగారు. దీనితో సెక్టేరియన్ రోజులు అంతరించాయి. జాతీయైక్య సంఘటన కొరకు కాంగ్రెసు ద్వారా పూర్తి ప్రయత్నం చేయబడింది. పార్టీ బహిరంగ వేదికగా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ తయారు చేయబడింది.

# అధ్యాయము - 2

# జాతీయైక్య సంఘటన రోజులు
## (1938 కాన్ఫరెన్సు వరకు)

### కాంగ్రెసు పార్టీ

1935 వ సంవత్సరంలో జరిగిన 7 వ కమ్యూనిస్టు అంతర్జాతీయ మహా సభ సమావేశ నిర్ణయాల ఫలితంగా జాతీయైక్య సంఘటన నినాదం ప్రాముఖ్య తను పార్టీ పూర్తిగా గుర్తించింది. మన దేశానికి ఆ నిర్ణయాలను అన్వయింప జేస్తూ, జాతీయ సమైక్యతను కాంగ్రెసు ద్వారానే యెలా నిర్మించవలసిందీ తెలియపర్చుతూ 1936 లో భారత కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమ మిచ్చింది. దాని ననుసరించి మన రాష్ట్రంలో కాంగ్రెసు జాతీయైక్య సంఘటనగా తయారు చేయుటకు పార్టీ ప్రయత్నించింది. పార్టీ సభ్యులందరూ అంతవరకూ దాదాపు బహిష్కరించిన కాంగ్రెసు సంఘాలలో సభ్యులుగా చేరడం. యితరులను సభ్యులనుగా చేర్పించడం ప్రారంభించారు. కాంగ్రెసు సంఘాలతో సన్నిహిత సంబంధం పెట్టుకున్నారు 1937 ఎన్నికలలో కాంగ్రెసు అభ్యర్థుల విజయం కొరకు పార్టీ తరపున ప్రత్యేక కృషి చేయబడింది. దీనితో అంతకు ముందు పార్టీ సభ్యులకు కాంగ్రెసు సంఘాలతో వున్న సంబంధం బాగా దృఢపడింది. పశ్చిమ గోదావరి జిల్లా కాంగ్రెసు సంఘం పార్టీ సభ్యుల అధీనమైంది. పశ్చిమ కృష్ణా జిల్లాలో పార్టీ సానుభూతి పరుల చేతుల్లోకి వచ్చింది.

కాని ఆ రోజుల్లో కాంగ్రెసు సంఘాల యెడల పార్టీ అవలంబించిన వైఖరి సరియైనది కాదు. జాతీయైక్య సంఘటనను నిర్మించడమంటే, కాంగ్రెసు సంఘాలను మితవాదుల పలుకుబడి నుండి తప్పించి అతివాదులు, స్వాధీనం చేసుకోవడమే ప్రధానమైనదని పార్టీ సభ్యులలో చాలా మంది భావించారు. కార్మిక, కర్షకోద్యమము వగైరా ప్రజా ఉద్యమాలను స్వతంత్రంగా నిర్మించి వాటి కోర్కెలకొరకు కాంగ్రెసు సంఘాలకు సన్నిహిత సంబంధం కలుగజేయడం, వీటి అన్నింటితో జాతీయైక్య సంఘటనను కాంగ్రెసు ద్వారా నిర్మించడం ప్రధాన విషయాలనేది గుర్తించలేదు. అందుచేత కాంగ్రెసు సంఘాలలో అతి

వాదులకు, మితవాదులకు కాంగ్రెసు సంఘాలు స్వాధీనపర్చుకోవడంలో పోట్లాటలు (కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి) తీవ్రమయ్యాయి. అతివాదులకు, ప్రత్యేకంగా స్వతంత్ర పలుకుబడి ప్రజలమధ్య లేకపోవడం వలన, మితవాదులు అతివాదులను కాంగ్రెసు సంఘాల నుండి తరిమివేయడానికి సాహసించారు. (కృష్ణా, గుంటూరు) పార్టీ ఆధ్వర్యము క్రింద నడుపబడే పశ్చిమ గోదావరి జిల్లా కాంగ్రెసు సంఘం గూడ ఆదర్శంగా నడుపబడలేదు. పార్టీకి కాంగ్రెసులో వున్న ముఖ్య స్థానాన్ని ఆధారంగా జేసుకుని, ప్రజల మధ్య పార్టీకి స్వతంత్ర పలుకుబడి సంపాదించుటకు కృషి చేయజాలక పోయారు. అందువలన పశ్చిమ గోదావరిలో కాంగ్రెసు గాక యితర ప్రజా సంఘాలు బలపడలేదు. పార్టీకి జిల్లా రాజకీయ రంగంలో స్వతంత్ర స్థానం రాలేదు.

**ఇతర రంగాలలో పార్టీకృషి**

రైతులలో : కాంగ్రెసులోనే గాక ఇతర ప్రజారంగాల్లో గూడ పార్టీ పనిజేసింది. రైతు సంఘాల్లో పనిచేయడం అన్ని జిల్లాలలో పార్టీ సభ్యులు ప్రారంభించారు. 1937 జూలైలో పార్టీ సభ్యుల నాయకత్వాన రంగా గ్రూపు సహకారంతో, ఆంధ్రదేశ రైతురక్షణ యాత్ర ప్రారంభింపబడింది. దీని ఫలితంగా ఆంధ్ర జిల్లా రైతాంగంలో తీవ్ర సంచలనం పుట్టింది. ఈ సంచలనాన్ని అన్ని జిల్లాలలోనూ పార్టీ సభ్యులు రైతు సంఘాల నేర్పరచడం ద్వారా సంఘటితపర్చారు. రైతు సంఘాలు యేర్పడ్డప్పటికీ అవి ఆందోళనా, ప్రచార దశల దాటి ముందడుగు వేయలేదు. రైతుల దైనందిన యిబ్బందులను తీర్చడానికి కృషి చేస్తూ ప్రజా ఉద్యమాలను, పోరాటాలను నిర్మించలేదు.

విద్యార్థుల్లో :

1937లో జరిగిన అసెంబ్లీ యెన్నికలలో విద్యార్థులు విరివిగా పాల్గొన్నారు. ఎన్నికల్లో పార్టీ యిచ్చిన నినాదాలు విద్యార్థులను బాగాఆకర్షించాయి. పార్టీతో వారికి సంబంధం యేర్పడింది. బాగా ముందుకు వచ్చిన విద్యార్థులు, 1937 మేలో పార్టీ ఆధ్వర్యము క్రింద కొత్తపట్టణములో నడుపబడ్డ వేసంగి రాజకీయ శిక్షణా శిబిరంలో తర్ఫీదు పొందిన తరువాత విద్యార్థుల్లో పనిజేశారు. విద్యార్థి ఉద్యమము పార్టీ ఆధ్వర్యం క్రింద ప్రారంభమైంది. 1937 ఆఖరులో, 1938 ప్రారంభంలోను డిటెన్షన్ సమస్యపై వచ్చిన సమ్మెలు ఆంధ్ర విద్యార్థులను కదల్చాయి. 5 జిల్లాలలో విద్యార్థి సంఘాలు ఏర్పడ్డాయి.

పార్టీ వివిధ రంగాల్లో పనిచేయడం ద్వారాను, ఎన్నికల్లో పాల్గొని తీవ్రంగా కృషి చేయడం వలన ముందుకు వచ్చిన మిలిటెంట్సును తర్ఫీదు చేయడం. పార్టీ సభ్యులకు సిద్ధాంత పరిజ్ఞానం యివ్వడం అవసరమైంది. ఇందుకు

గాను కొత్తపట్నంలో వేసంగి రాజకీయ పాఠశాల 1937 మేలో పెట్టబడింది. రాష్ట్రమంతటినుంచి 200 మంది పార్టీ సభ్యులుగాని, పార్టీ వైపుకు ఆకర్షించబడ్డ మిలిటెంట్సు గాని శిక్షణ పొందారు.

ఈ పాఠశాలల ద్వారా పార్టీ రాయలసీమ జిల్లాలకు (చిత్తూరు, కర్నూలు) వ్యాపించింది. స్కూలులో తయారైన విద్యార్థులందరు తమ తమ ప్రాంతాలలో పార్టీ కార్యక్రమాన్ని, సోషలిజాన్ని గూర్చి ప్రచారం చేస్తూ ప్రజారంగాల్లో పని చేయడం ప్రారంభించారు. రాష్ట్రమంతటా ఆర్గనైజరుగా పార్టీ అధ్వర్యముక్రింద పని ప్రారంభమయింది.

1937 డిసెంబరులో "నవశక్తి" పార్టీ పత్రికగా స్థాపించబడింది. పార్టీ చరిత్రలో యిది ఒక ముఖ్యఘట్టం. వివిధ రంగాలలో అభివృద్ధి అవుతూ వున్న ప్రజా వుద్యమాలను ఎప్పటికప్పుడు నడుపుట, జాతీయైక్య సంఘటనా నినాదాలను రాష్ట్ర పరిస్థితుల కన్వయింపజేసి, వాటి ననుసరించి కామ్రేడ్స్ చేత ప్రజారంగాలలో పనిచేయించుట, పార్టీ సభ్యుల మార్క్సిస్టు సిద్ధాంత పరిజ్ఞానమును దృఢపర్చుట. యీ సమస్యలు పార్టీని ఎదుర్కొన్నాయి. వీటిని పరిష్కరించడానికి "నవశక్తి" స్థాపించబడింది. 2000 - 2500 ప్రతులు అచ్చువేయబడుతూ వుండేవి.

1938వ సంవత్సరం మేలో రెండవ వేసంగి రాజకీయ పాఠశాల మంతెన వారిపాలెంలో పెట్టబడింది. కొత్తపట్నం స్కూలు నాటి స్థితి కంటే పార్టీ స్థితి చాలా అభివృద్ధి అయింది. మొత్తం 300 మంది విద్యార్థులు (80 మంది స్త్రీలతో సహా) శిక్షణ పొందారు. కొత్తపట్నం స్కూలులో తర్ఫీదు చేయడంవలన పార్టీ పలుకుబడి హెచ్చింది. ఇంక చాలామంది యువకులు పార్టీ వైపుకు ఆకర్షించబడ్డారు. అందుచేత పార్టీ సభ్యత్వం కూడా పెరిగింది 1938 జులై నాటికి పార్టీ సభ్యత్వం 200 లకు పెరిగింది.

**సాధించిన ఫలితాలు :**

1. పార్టీ, పార్టీవైపుకు ఆకర్షింపబడ్డవారు మాత్రమే ఆంధ్ర రాజకీయ రంగంలో అతివాద దృక్పథంతో సంఘటిత రాజకీయ శక్తిగా పనిజేసేవారు అందుచేత ఆంధ్ర కాంగ్రెస్ నాయకులు తమ ప్రజా నాయకత్వానికి పోటీగా మన పార్టీ తయారవుతుందని గుర్తించారు.

2. అన్ని జిల్లాలలోనూ పార్టీ సభ్యులు సామాన్య సోషలిస్టు ప్రచారదశ నుండి వివిధ ప్రజారంగాలలో చొరబడి పనిచేయడం ప్రారంభించారు.

3. కాంగ్రెస్ ఎన్నికలలో కాగ్రెస్ విజయానికి తీవ్రంగా కృషిచేయడం వలన నిఖార్సు అయిన సామ్రాజ్యవాద వ్యతిరేకులుగా, ప్రజల్లోనూ, కాంగ్రెస్ ప్రజాసామాన్యంలోనూ మన పార్టీ సభ్యులు పరిగణింపబడ్డారు.

4. సెక్టేరియన్ దృక్పథం విడనాడి జాతీయైక్య సంఘటనా నినాదంతో అన్ని జిల్లాలలోను కాంగ్రెసులో జేరి పార్టీ సభ్యులు పనిచేయడం ప్రారంభించారు. దీని ఫలితంగా అతివాద దృక్పథంతో చురుకుగా పనిచేస్తున్న కాంగ్రెసువాదులు మన పార్టీ వైపుకు ఆకర్షించబడ్డారు.

5. వేసంగి పాఠశాలల ద్వారా వచ్చిన కాంటాక్టులతో రాయలసీమ జిల్లాలకు గూడ పార్టీ వ్యాపించింది.

లోపాలు :

1. కాంగ్రెసు సోషలిస్టు పార్టీగా పనిచేయించడం వలన పార్టీకి బహిరంగ రాజకీయ వేదిక లభించింది. అయినను కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ప్రాథమిక యూనిట్లను సరిగా పని చేయించలేదు. అందుచేత మనం నిర్మాణరీత్యా బలపడ లేదు. జిల్లా కమిటీలు మాత్రం జిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో ప్రాక్షన్సుగా పనిజేశాయి. రాష్ట్ర కమిటీ గూడ దాదాపు అంతే. చాలాచోట్ల సెల్లులు పని చేయలేదు.

2. జాతీయైక్య సంఘటనా నినాదముల నంగీకరించి పనిజేస్తున్నప్పటికి, వాటిని వివిధ రంగాలలో యెలా అన్వయింపజేయాలో స్పష్టమైన దృక్పథం యింకా పార్టీకి అబ్బలేదు. అందుచేత పార్టీ సభ్యులు గావించే ఆందోళనను ఎలా సంఘటితపర్చాలో తెలుసుకోజాలక పోయారు.

## అధ్యాయము - 3

# జాతీయైక్య సంఘటన రోజులు

## (1938 నాటి పార్టీ కాన్ఫరెన్సు నుండి సామ్రాజ్యవాద యుద్ధ ప్రారంభం వరకు)

సామాన్య సోషలిస్టు ప్రచార ఆందోళన దశల నుండి జాతీయైక్య సంఘటనా నినాదాలతో పార్టీ సభ్యులు వివిధ రంగాల్లో పనిచేయడం ప్రారంభించి నప్పటి నుండి పార్టీని నిర్మాణరీత్యా కొన్ని సమస్యలు ఎదుర్కొన్నాయి. కేవలం ఆందోళన చేసి వూరుకున్నంత మాత్రాన అభివృద్ధి వుండుట లేదు. అందుచేత ఆందోళనతో పాటు సంఘటన, నిర్మాణం చేయవలసి వచ్చింది. అదిగూడా జాతీయైక్య సంఘటనా నినాదాల కనుగుణ్యంగా చేయాలి. ప్రతి రంగంలో (కాంగ్రెసు, రైతు, కూలి, విద్యార్థి రంగాలు) జాతీయైక్య సంఘటనా నినాదాల ననుసరించి ప్రజలను ఎలా సంఘటితపర్చాలో, విడివిడిగా వున్న వీటన్నిటిని యెలా సమన్వయించి జాతీయైక్య సంఘటనను నిర్మించాలో పార్టీ స్పష్టం చేయ వలసి వచ్చింది. ఇట్టి స్పష్టమైన దృక్పథం సభ్యులకు కలుగజేస్తేనే గాని పార్టీ మొత్తంగా ముందుకు పోవడానికి వీలులేకపోయింది. అంతేగాకుండా పార్టీ సభ్యత్వం గూడా 200కు పెరిగింది. వీరందరిని రాజకీయంగాను, నిర్మాణరీత్యా ఐక్యపర్చి జాతీయరంగంలోనూ, తదితర అగ్రగాములుగా పనిజేయడానికి ఉత్తేజ పర్చడం అవసరమైంది. అందుకుగాను 1938 జూన్ నెలలో రాష్ట్ర పార్టీ, కాన్ఫరెన్సు జరుపబడింది

ఈ కాన్ఫరెన్సు చాల ప్రాముఖ్యమైనది. 1935 జనవరిలో కాకినాడలో జరిగిన ప్రథమ ఆంధ్ర రాష్ట్ర పార్టీ కాన్ఫరెన్సు నాటికి పార్టీని ఎదుర్కొన్న ఆందోళన, నిర్మాణపు సమస్యలను సంపూర్ణంగా పరిష్కారం జేసింది. ప్రతి ఫ్రంటుకు జాతీయైక్య సంఘటన నినాదాల ననుసరించి ఎలా పనిజేయాలో థీసిస్‌లు తయారు చేయబడ్డాయి. ముఖ్యంగా అంతవరకు సెక్టేరియన్ దృక్ప థంతో పనిజేస్తున్న యువజన, వ్యవసాయ కూలీ ఫ్రంటులకు స్పష్టమైన కార్య క్రమం యివ్వబడింది. యువజన సంఘాలు పార్టీ రాజకీయ వేదికలుగా గాకుండా,

యువకుల ప్రజా సామాన్యాన్ని ఆకర్షించే వైజ్ఞానిక, సాంఘిక, శారీరక కార్య క్రమాన్ని అనుసరించి పని జేయాలని ప్రథమ పర్యాయంగా స్పష్టపర్చబడింది. అలాగే వ్యవసాయ కూలీలకు, రైతులకు మధ్య సామరస్యం కొరకు, వ్యవసాయ కూలీ ప్రధాన హక్కులకొరకు ఎలా పోట్లాడాలో నిర్వచించబడింది.

ఈ విధంగా వివిధ ప్రజారంగాలకు ఖచ్చితమైన, ఆచరణ యోగ్యమైన కార్యక్రమం యివ్వబడుటచేత, జాతీయైక్య సంఘటనా నినాదములు ఆచరణలో యెలా పెట్టాలో, పార్టీ సభ్యులకు స్పష్టమైన దృక్పథం యేర్పడింది. నిర్మాణ రీత్యా మరొక అడుగు ముందుకు వేయడానికి సాధ్యపడింది. ప్రాథమిక నిర్మాణ సూత్రాలు స్పష్టంగా తెలుసుకోబడ్డాయి.

రాజకీయ, నిర్మాణ కార్యక్రమం యివ్వడంలో, అర్థం జేసుకోవడంలో జయ మొందినప్పటికీ అవి ఆచరణలో పూర్తి జయమొందడానికి తగిన రాజకీయ చైతన్యాన్ని గడించలేదు. రాష్ట్ర పార్టీ నాయకత్వంలో పూర్తిగా రాజకీయ ఐక్యత ఏర్పడలేదు. జిల్లాలలో గూడ రాజకీయంగా ఐక్యత పొందిన జిల్లా పార్టీ నాయకత్వాలను స్థాపించలేదు.

**పార్టీ - ప్రజా రంగాలు :**

కాన్ఫరెన్సు తదుపరి పార్టీ సభ్యులు వివిధ రంగాల పనిని గూర్చి యేర్పడ్డ స్పష్టమైన దృక్పథంతో పనిజేయడం ప్రారంభించారు. విద్యార్థులలోను, కూలీల్లోను మన స్థానం యింకా బలపడింది. యువజన సంఘాలు, మాత్రం చప్పబడిపోయాయి. వెంటనే ఆటలు వగైరా కార్యక్రమంతో యువక ప్రజా సామాన్యమును ఆకర్షింపజేసి నూతన పంథాను, యువకులను సమీకరించడానికి ఒక్క కృష్ణా జిల్లాలో తప్ప యితర జిల్లాలలో కృషి చేయలేదు. కృష్ణా జిల్లాలో ఆటల కార్యక్రమము తీసుకుని పనిజేయడం ప్రారంభించినప్పటినుండి, యువజన రంగంలో పెద్ద మార్పు వచ్చింది. యువక ప్రజా సామాన్యం యువజన సంఘాల వైపుకు ఆకర్షింపబడడం వల్ల యువజన సంఘాలకు ప్రజాధారం యేర్పడింది. నూతనంగా మహిళా ఉద్యమంగూడ కృష్ణా జిల్లాలో బయలుదేరింది.

కాంగ్రెసు సంఘాలు :- ఎసెంబ్లీ ఎన్నికలలో కాంగ్రెసు విజయవంతమై కాంగ్రెసు మంత్రి వర్గం యేర్పడడం వలన కాంగ్రెసులోనికి నూతనంగా అనేక మంది వచ్చారు. ఇదివరకే కాంగ్రెసులో పనిజేస్తూ, పార్టీ వైపుకు ఆకర్షించ బడిన కాంగ్రెసు రేంక్ అండ్ ఫైల్ అసెంబ్లీ ఎన్నికల్లో పార్టీ యిచ్చిన స్పష్టమైన కార్యక్రమంతో బాగా రేడికలైజ్ ఆయ్యారు. పార్టీ సభ్యులకు, కాంగ్రెసులో జేరి పనిజేయడం ప్రారంభించిన తరువాత వీరితో ముఖ్యంగా యువకులతో సంబంధం

కలిగింది. వీరందరిపై పార్టీ యిచ్చిన జాతీయైక్య సంఘటనా కార్యక్రమ ప్రభావం పడింది. అందుచేత వీరందరూ పార్టీ వైపుకు ఆకర్షింపబడ్డారు

ఇలా పార్టీ వైపుకు ఆకర్షింపబడ్డ కాంగ్రెసు వర్కర్లందరనూ వివిధ ప్రజా రంగాలలో పనిచేయించడం ద్వారా సంఘటిత పరచలేక పోయాము. దీనికి ముఖ్య కారణం, పార్టీ సభ్యులలో కాంగ్రెసులో పనిజేసే విషయములో డీవి యేషన్సు వుండుటే. కాంగ్రెసు సంఘాలను, విరివిగా సభ్యులను జేర్పించి ఆక్ర మించుకొని, మితవాదుల పలుకుబడి నుండి వాటిని తొలగించక పోయినంతకాలం, కాంగ్రెసు సంఘాలు పార్టీ కార్యక్రమము ననుసరించి పనిజేయజాలవనియు, అందుకుగాను ప్రధానంగా చేయవలసినది, పార్టీ వైపుకు ఆకర్షింపబడిన కాంగ్రెసు అతివాదుల, పార్టీ సభ్యుల శక్తిని కేంద్రీకరించి వాటిని ఆక్రమించుకోవాలనే డీవియేషన్ అన్ని జిల్లాలలోను వుండేది. అందుచేత మన పార్టీ వైపుకు ఆకర్షింప బడ్డ కాంగ్రెసు వర్కర్లందరునూ సభ్యులను జేర్పించడమునకే ఉపయోగింప పడ్డారు గాని, వారిచేత వివిధ ప్రజారంగాలలో ప్రజలమధ్య పనిజేయడానికి తద్వారా పార్టీకి స్వతంత్ర ఆధారము, పలుకుబడి యేర్పరచడానికి ప్రయత్నించ లేదు. దీని ఫలితంగా కాంగ్రెసు సంఘాలు ఎన్నికల తగాదాలల్లో మునిగిపోయాయి. మితవాదులకు అతివాదులకు పోట్లాటలు ముదిరి పార్టీచే ఆకర్షింపబడ్డ కాంగ్రెసు వర్కర్లకు పార్టీ దృక్పథం కన్న అతివాద జాతీయ దృక్పథం ఏర్పడింది. పార్టీ సభ్యులు గూడ దీనికి లొంగిపోయారు. తదితర ప్రజారంగాలపని వెనుక బడింది. తత్ఫలితంగా పార్టీ సభ్యులను జూలై 9 ప్రదర్శనలలో పాలొన్నం దుకు కాంగ్రెసు కమిటీల నుండి మితవాదులు వెళ్ళగొట్ట గలిగారు.

రాష్ట్రమంతటా వున్న యీ డీవియేషన్ పశ్చిమ గోదావరి జిల్లాలో చాల ప్రమాదంగా మారింది. జిల్లా, తాలూకా కాంగ్రెసు సంఘాల నాయకత్వాన్ని పార్టీ సంపాదించిన తదుపరి, పార్టీ సభ్యులు అదివరకు జేస్తున్న ప్రజా సంఘాల కొద్ది పనిని గూడ పూర్తిగా మానేశారు. కాంగ్రెసు సంఘాల తరపున కాంగ్రెసు కార్యక్రమమును అమలు జరుపుతూ మాత్రం వున్నారు. దీని ఫలితంగా కాంగ్రెసు కంటే వేరుగా స్వతంత్ర స్థానం ప్రజల్లో పార్టీకి యేర్పడలేదు. పార్టీ స్వతంత్ర స్థానం కోల్పోయింది. దీనివలన సామ్రాజ్యవాద కాలంలోను, జాతీయ సంక్షోభ దశలోనూ పార్టీ పాత్రను నిర్వహించజాలక నిర్బంధానికి గురి అయింది.

గుంటూరు జిల్లా పార్టీ సభ్యులలో యింకొక డీవియేషన్ వచ్చింది. పార్టీ కార్యక్రమముతో అప్పుడప్పుడు జిల్లా కాంగ్రెసు నాయకులు సహకారం చేయడం వలన వారికి నిజమైన అతివాద ధృక్పథం వున్నదని, అభివృద్ధికరమైన ముఠా అని పార్టీ భ్రమపడింది. అప్పుడప్పుడు మనతో సహకరం చేయడం. వాస్తవంగా

వారికి అతివాద దృక్పథం వుండిగాదు. రంగా ముఠాకు వాకిరి వున్న స్పర్థ ఫలితంగా, జిల్లా కాంగ్రెసు నాయకులు ఆపర్యూన్యునిస్టు పంథాలో అతివాదులుగా ప్రవర్తించారు. దీని ద్వారా తమ పలుకుబడి క్రింద వున్న కాంగ్రెసు వర్కర్లను రంగా ముఠా వైపుకుగాని, కమ్యూనిస్టుల వైపుకు గాని పోకుండా చేసుకొని కాంగ్రెసులో వాళ్ళ నాయకత్వాన్ని స్థిరపర్చుకున్నారు. యిది గ్రహించక కాంగ్రెసు నాయకత్వపు సహకారము పార్టీకి సంపాదించగలిగామనే తలంపుతో కాంగ్రెసు వర్కర్లతో పూర్తి సంబంధం పెట్టుకుని వారిపై స్వతంత్ర పార్టీ పలుకుబడిని సంపాదించడానికి ప్రయత్నమే చేయలేదు. అందుచేత కాంగ్రెసులో చురుకుగా పని చేసే వర్కర్లతో హెచ్చు సంబంధం కలుగలేదు.

## రైతు రంగం

ఈ రంగంలో పనిజేసేది మన పార్టీ, రంగ ముఠా. రైతు సమస్య యెడ మన పార్టీ కున్న దృక్పథం విప్లవకరమైనది. రంగా ముఠాది సంస్కరణవాద దృక్పథం. కాంగ్రెసులో అధికార స్థానాలను ఆక్రమించడానికి, వాటిని ఆధారంగా గొని ఎన్నికల్లో కాంగ్రెసు తరపున హెచ్చు స్థానాలను తన ముఠాకు సేకరించడానికి, కాంగ్రెసు నాయకులపై వత్తిడి చేయడానికి మాత్రమే రైతు ఉద్యమాన్ని నిర్మించడంలో రంగా ముఠా ప్రధానోద్దేశ్యము. విప్లవకర పంథాను రైతు ఉద్యమాన్ని నిర్మించి జాతీయ రంగంలో నిశ్చితమైన పాత్రను కార్మిక వర్గంతో కలిసి నిర్వహించి స్వాతంత్ర్య ఉద్యమాన్ని పంథాలో అభివృద్ధి చేసే ఉద్దేశ్యమే రంగా ముఠాకు లేదు. అందుచేత కాంగ్రెసు నాయకులు ప్రజా ఉద్యమమును అభివృద్ధి చేయకుండా జాతీయ రంగంలో దానికున్న ఆర్థిక, రాజకీయ స్థానంతో ప్రభుత్వాన్ని బెదిరించాలని యెలా చూస్తోందో అలాగే రంగా ముఠా కూడ రైతు ఉద్యమాన్ని నిర్మాణయుక్తంగా, విప్లవ పంథాను సంఘటిత పర్చుటకు ప్రయత్నించుటకు బదులు, గ్రామ ధనిక రైతుల అండతోనే కాంగ్రెసు నాయకులను బెదరించాలని చూచింది. అందుకు రైతు ఉద్యమాన్ని ధనిక రైతుల హక్కులకు భంగం కల్గని పంథానే పోనిచ్చింది. ఈ హద్దులు దాటి రైతు ఉద్యమము విప్లవ పంథా వైపుకు పోయే చోట్ల, రైతు ఉద్యమ విచ్ఛేదకులుగా రంగా ముఠా ప్రవర్తించారు. (కాళిపట్నం, మునగాల రైతు పోరాటాలు) రైతు ఉద్యమాన్ని యీ ఆశయాలతో నడుపుటకుగాను, రంగా ముఠా సంస్కరణ పోరాట, నిర్మాణ పద్ధతుల నవలంభించింది. రైతు కోర్కెలకొరకు జనరల్‌గా ఆందోళన గావించుట, వాటి కొరకు ప్రభుత్వోద్యోగుల వద్దకు రాయబారాలు, యాత్రలు గొంపోవుట తప్ప,రైతు ఉద్యమాన్ని నిర్మించుటకు ఏమీ ప్రయత్నించ లేదు. రైతు ఉద్యమ శైశవ దశలో యీ పద్ధతులు అవసరమైనప్పటికీ రైతు

ఉద్యమమును ఎల్లప్పుడూ యీ హద్దులలోనే వుంచడం సంస్కరణ వాదమవు తుంది. ఒక స్థాయివచ్చిన తరువాత యింతకన్న విప్లవకర పద్ధతులు (రైతులను తమ తమ కోర్కెలకొరకు సమీకరించడం, పోరాడించడం, స్థానిక జిల్లా వ్యాపిత రైతు పోరాటాలను తీసుకురావడం వగైరా పద్ధతులు) అవలంభించి రైతులను మరొక అడుగు ముందుకు తీసుకుపోవాలి. ఈ విధంగా చేయక, రైతుల ప్రత్యక్ష చర్యలకు, పోరాటాలకు ఆడ్డంకులు గల్గిస్తూ రంగా ముఠా సంస్కరణ వాద పంథాను అవలంభించింది.

రంగా ముఠా ప్రధాన మార్గం సంస్కరణ పంథా అయినప్పటికినీ, వారి అనుచరులు అచ్చటచ్చట దుందుడుకు చర్యలకు అరాచక చర్యలకు దిగుట గూడా గద్దు. ప్రజా విప్లవ శక్తిపై నమ్మకములేని పెటీ బూర్జువా రాజకీయాలే దీనికి కారణం. ఈ రాజకీయాలే సామ్రాజ్యవాద కాలంలో ఫార్వర్డు బ్లాకులో కలవడానికి ఆగష్టు సంఘటనలప్పుడు ఫార్వర్డు బ్లాకు, కాంగ్రెసు సోషలిస్టుల తోను కలిసి విధ్వంసక చర్యలను ఆర్గనైజు చేయడానికి కొంతవరకు దారి తీశాయి.

మన పార్టీ దృక్పథానికి, రంగా ముఠా వైఖరికి యీ ముఖ్య భేద మున్ననూ, యీ కాలంలో రంగా ముఠాతో కలిసే మనం పనిచేశాం. రైతు ఉద్యమము ఆందోళన ప్రచార దశలలోనే వుండిపోవుట చేత రంగా ముఠాకు, మన పార్టీకి కొద్దిచోట్లనే తప్ప తీవ్ర భేదాభిప్రాయాలు రావడానికి అవకాశం లేకపోయింది. మన పార్టీగూడ రైతు ఉద్యమాన్ని ఆందోళన, ప్రచారదశ నుండి ముందుకు గొంపోజాలక పోయింది. కాళీపట్నం, మునగాల ప్రాంతాల్లో తప్ప, రైతు పోరాటాలను ఎచ్చటా మనం నడుపలేదు. రాష్ట్రమంతటా ప్రాథమిక రైతు సంఘాలు ఏర్పరచినా వాటిచేత కొంతవరకైనా పని చేయించజాలక పోయాం. అందుచేత రైతు సంఘ నిర్మాణము అస్థిపంజరముగా మాత్రమే వుండి పోయింది. మన యీ లోటువలన రంగా ముఠా సంస్కరణ వాద, అపర్చ్యూ నిస్టు పంథా అవలంభించుచున్నా, అదే రైతు రంగంలో యింకా ప్రధాన శక్తి గానే వుండిపోయింది.

## వ్యవసాయ కూలి రంగం

పార్టీ కాన్ఫరెన్సులో స్పష్టమైన కార్యక్రమం యివ్వబడ్డా యీ రంగంలో హెచ్చు అభివృద్ధి జరగలేదు. తూర్పు, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లా లలో వ్యవసాయ కూలీ సంఘాలు స్థాపించడానికి ప్రయత్నాలు జరిగాయి. ఉద్య మము ఆందోళన, ప్రచార దశలలో మాత్రమేవుంది. సోవియట్ యూనియన్ గూర్చి, సోషలిజాన్ని గూర్చి బాగా ప్రచారం జరిగింది. కూలీలలో సంచలనం కల్గింది.

అంతే. తూర్పుగోదావరి జిల్లాలో యీ రంగంలో కామ్రేడ్స్ చాల సెక్టేరియన్ దృక్పథంతో పనిచేశారు. రైతులు విప్లవ పంథాకు రారనియు, వ్యవసాయకూలీల హక్కులకొరకే ముందు పనిచేయడానికి పూనుకోవాలనే మార్క్సిస్టు వ్యతిరేక, సెక్టేరియన్ దృక్పథంతో పనిచేశారు. రైతు కూలీ సామరస్యం ప్రధానమైన విషయమనియు, అందుకుగాను రైతుల మధ్య రైతు సంఘాల ద్వారా, కూలీల మధ్య కూలీ సంఘాలద్వారా పార్టీ కృషిచేస్తూ వుండాలనే పార్టీ కాన్ఫరెన్సు (1938) థీసిస్ మూలబెట్టారు.

దీని ఫలితంగా అచ్చటి కామ్రేడ్స్ రైతులనుండి దూరమయ్యారు. అంత క్రితం రైతుసంఘాలద్వారా కామ్రేడ్స్ పొందిన ఫలితాలన్నిటిని కోల్పోయారు. ఆ సందర్భంగా గొని వచ్చిన కూలీ సమ్మెలు విజయవంతం కాకపోవడం వలన కూలీలు కూడ నిస్పృహ జెందారు.

## కార్మిక రంగం

నూతనంగా చీరాల పొగాకు పనివారల సంఘంతోను, చిట్టివలస జూట్ కార్మిక సంఘంతోను, సంబంధం యేర్పడింది. కాకినాడలో పీచు వగైరా పనివారల సమ్మెలు నడిపాం. కాని వీటన్నిటిలోను పార్టీ దగ్గరకు వచ్చిన మిలిటెంట్సును తర్ఫీదు చేసి పార్టీ సభ్యులుగా చేయలేదు. దాని ఫలితంగానే యుద్ధ దశలో వచ్చిన ప్రభుత్వ నిర్బంధ విధానం వలన కార్మిక రంగంలో పనిజేసే కామ్రేడ్స్ అరెస్టు అవడంతోనే సంఘాల పని కుంటుపడింది.

## విద్యార్థి రంగం

1937 లో ప్రారంభించబడ్డ విద్యార్థి ఉద్యమం 1938 లో ఇంకా విస్తరించింది. కాని విద్యాలయాధికారులు 1937 లో తిన్న దెబ్బ నుండి కోలుకొని దాడి సాగించరు. ఈ దాడి కనుగుణ్యంగా విద్యార్థులను ఎక్కువగా ఐక్యపర్చి, విద్యార్థి సంఘాలను చక్కగా నిర్మించజాలక పోవుటచే కొన్ని విద్యార్థి కేంద్రాలలో దెబ్బతిన్నారు.

## "నవశక్తి" ప్రచారం

జాతీయైక్య సంఘటనా నినాదాలను రాష్ట్ర పరిస్థితులకు అన్వయింపజేస్తూ అంతర్జాతీయ, జాతీయ పరిస్థితులను ఎప్పటికప్పుడు పార్టీ సభ్యులకు విశదీకరించుతూ వుండడంవలన "నవశక్తి" పార్టీ సభ్యులలో రాజకీయైక్యత నెలకొల్ప గల్గింది. కమ్యూనిస్టు దృక్పథంతో పత్రిక నడుపబడుటవలన పార్టీ సభ్యులలో ప్రారంభంనుండి సరియైన జాతీయ, అంతర్జాతీయ దృక్పథం పార్టీ సభ్యులకు అలవడింది. దీనివలన త్రిపురీ కాంగ్రెసు అప్పుడు అతివాద జాతీయ దృక్పథానికి లోబడిపోలేదు: అందువలన ఫార్వర్డు బ్లాకు నిర్మాణమునకు రాష్ట్రంలో

అవకాశం లేకుండా పోయింది. కాని బోస్ చేసే విచ్ఛిన్న ప్రయత్నాలను కేంద్ర పార్టీ వ్యతిరేకించేటప్పుడు పార్టీ సభ్యులలో చాల అసమ్మతి వినవచ్చింది. అందుకు కారణం మనలో యింకా తీవ్ర జాతీయవాద చిహ్నాలు దాగి వుండడమే. అయినప్పటికి పార్టీ యెడల వుండే భక్తి ఎట్టి చీలికలు కలుగకుండా ఆపగల్గింది. అంతర్జాతీయ దృక్పథం బాగా అబ్బడంవలన సోవియట్ యూనియన్ అంటేను, ప్రపంచ ప్రజల స్వాతంత్ర్య పోరాటమంటేను, అకుంఠిత విశ్వాసం ఏర్పడింది. యిప్పటికి ముఖ్యంగా ఫాసిస్టు వ్యతిరేకతత్వం బాగా యేర్పండిది.

పార్టీ సభ్యుల సిద్ధాంత పరిజ్ఞానం పెంపొందించడానికి గూడ "నవశక్తి" ప్రత్యేక కృషి చేసింది. నవంబరు సంచిక, త్రిపురీ సంచిక, మేడే సంచికలు గూడా పార్టీ సభ్యులకు రిఫరెన్సు పుస్తకాలుగా వున్నాయి.

పార్టీ సభ్యులలోనేగాక, జనరల్‌గా యువకుల్లో అతివాద భావాలు, సోషలిస్టు భావాలు తీవ్రమవడానికి యెంతేని "నవశక్తి" తోడ్పడింది. రాష్ట్రం లోని యువకులతో రాజకీయ స్థాయి హెచ్చించడానికి బాగా తోడ్పడింది.

పార్టీ నిర్మాతగా మాత్రం "నవశక్తి" విఫలమైంది. ప్రజా ఉద్యమాలను నిర్మించడానికి అభివృద్ధి పర్చడానికి తోడ్పడజాలక పోయింది.

## పార్టీ నిర్మాణము

పార్టీ నిర్మాణము బాగా వెనుకబడిపోయింది. ప్రజా రంగాల్లో ఆందోళన, ప్రచారాలతోనే ప్రజా ఉద్యమము ఎలా ఆగిపోయిందో, పార్టీ నిర్మాణ రంగంలో కూడా కాంగ్రెసు సోషలిస్టు పార్టీని ఏర్పరచడం దాన్ని పార్టీ రాజకీయ వేదికగా ఆందోళన ప్రచారాలకు ఉపయోగించుకోవడం మాత్రమే జరిగింది. కాని పార్టీ సభ్యులను సెల్లులలో వుంచి పార్టీ జీవితం, ఆర్గనైజ్‌డ్ జీవితం నారికి అబ్బేటట్లు చేయజాలకపోయాం. పార్టీ నిర్మాణము సరిగా లేక పోవడం వలన ప్రజా రంగాలలో మన ఆందోళన, ప్రచారాల ద్వారా ఉత్పన్నమైన మిలిటెంట్సును సంఘటిత పరచలేక పోయాం.

పార్టీ సభ్యులలో రాజకీయైక్యత కొంతవరకు వుంది గాబట్టి, పాలసీ అంటేనూ, పార్టీ అంటేనూ బాగా భక్తి విశ్వాసాలు ఏర్పడ్డాయి. పార్టీ చైతన్యం యిదివరకక్కంటే అభివృద్ధి అవుతోంది.

కాని కాన్ఫరెన్సు నాటికి వున్న పరిస్థితిలోనే దాదాపు నిలిచి వున్నాం. నాయకత్వంలో యింకా పూర్తిగా ఐకమత్యము నెలకొల్పలేదు.

# పార్టీకి ఆంధ్ర రాజకీయ రంగంలో వున్న స్థానం

పై విధంగా పార్టీ వివిధ రంగాలలో గావిస్తున్న కృషి వలన ఆంధ్ర రాజకీయాల్లో ఒక ప్రధాన శక్తిగా పార్టీ పరిగణింపబడింది. అతివాద ముఠాకు మన పార్టీయే నాయకత్వం వహించింది.

కాంగ్రెసు మంత్రి వర్గాల ద్వారానే స్వాతంత్ర్యం లభించుతుందనే (కాన్‌స్టిట్యూషనల్) భ్రమలు ప్రజల్లోనూ, కాంగ్రెసు ప్రజా సామాన్యంలోనూ, కాంగ్రెసు నాయకులు చాటుతూ వుండే అసెంబ్లీ కార్యక్రమాన్ని, బైట ప్రజా ఉద్యమాలను సమన్వయింపజేసి స్వాతంత్ర్య ఉద్యమాన్ని ఎలా ముందుకు గొంపోవాలో ఆచరణలో మన పార్టీ సభ్యులు చూపెడుతూ వుండడం వలన సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని, జెండాను నిలబెట్టి ఉద్యమాన్ని అభివృద్ధి చేసింది పార్టీయే అని ప్రజలు గుర్తించారు.

ప్రజలపై పార్టీ నాయకత్వాన్ని సంపాదించగల్గే సంఘటిత ప్రజా ఉద్యమాన్ని గాని, పోరాటాలను గాని మన పార్టీ నడుపక పోవుటచే ప్రజలు, మన పార్టీపై మంచి అభిప్రాయమున్నా తమ నాయకులుగా యింకా గుర్తించలేదు. బ్రిటిషు సామ్రాజ్య వాదంతో అగ్ర శ్రేణిలో వుండి పోరాడుటకు వెనుదీయని ధీరత్వం గల యువకులుగా మాత్రమే మన పార్టీని పరిగణించారు.

## అధ్యాయము - 4

# సామ్రాజ్యవాద యుద్ధారంభం నుండి ప్రజా యుద్ధారంభం వరకు

సామ్రాజ్యవాద యుద్ధారంభంతో బూర్జువా, పెటీ బూర్జువా, అతివాద పార్టీల దివాళా కోరుతనం బయటపడింది. యుద్ధారంభంలో ప్రారంభమైన విప్లవావకాశాలను ఉపయోగించుకొని సత్వర స్వాతంత్ర్య సంపాదనకు గడంగే దానికి బదులు, కాంగ్రెసు నాయకత్వం ప్రభుత్వానికి వచ్చిన దుస్థితి నాధారంగా గొని దాన్ని వత్తిడిచేసి తగినన్ని హక్కులు గుంజడానికి ప్రయత్నించింది. జాతీయ ప్రభుత్వాన్ని బ్రిటీషు ప్రభుత్వము నెలకొల్పితే యుద్ధంలో సహకారం చేయడానికి తయారైంది. అప్పుడు కోరింది బ్రిటీషు ప్రభుత్వముతో రాజీగాదు. యుద్ధ పరస్థితుల ననుసరించి ప్రజల్లో గల్గిన తీవ్ర అసంతృప్తిని సంఘటితపర్చి, బ్రహ్మాండమైన ప్రజా ఉద్యమాన్ని కాంగ్రెసు ఆధ్వర్యము క్రింద గొనివచ్చి, సంపూర్ణ స్వాతంత్ర్యమును సంపాదించవలెనని ప్రజలందరూ, జాతీయవాదులు కోరారు. ప్రజలను యుద్ధానికి, ప్రభుత్వానికి వ్యతిరేకంగా సమీకరించిక ప్రభుత్వంతో బేరమాడుతూ తిష్టవేసుకుని కాంగ్రెసు నాయకత్వం కూర్చుంది. బేరం ఎప్పటికైనా చెడకుండా వుండుటకు యుద్ధ ప్రయత్నాలకు వ్యతిరేకంగా పని జేయకుండా, నామకః నైతిక విరోధము చూపెడుతూ కూర్చుంది.

కాంగ్రెసు సోషలిస్టు పార్టీ యీ పాలసీని వ్యతిరేకించకుండా, కాంగ్రెసు పోరాటం తీసుకొస్తే పోరాటంలో పాల్గొందామని కూర్చుంది.

జాతీయ బూర్జువా నాయకత్వమునకు తోకగానే మారిపోయింది.

ఫార్వర్డు బ్లాకు అతివాద జాతీయ దృక్పథంతో, కాంగ్రెసులోని జాతీయ సంఘటనను విచ్ఛిన్నం చేయడానికి పనిచేసింది. ఆ మార్గం ఫలించనప్పుడు నిస్పృహ జెంది, కాంగ్రెసు నాయకత్వాన్ని లొంగదీయడానికి జాతీయ విచ్ఛిన్న శక్తులు, కమ్యూనిస్టులు అయిన హిందూ మహాసభతో చేరి అంతులేని అపర్చ్యునిస్టు మార్గాన బట్టింది. ఈ అపర్చ్యునిజమే చివరకు ఫాసిస్టుల క్యాంపులో కలిసిపోవడానికి దారితీసింది.

ఈ పరిస్థితుల్లో మన పార్టీ యొక్కటే విప్లవకర జాతీయ పంథా అవలంబించింది. జాతినంతా ఐక్యపరచి స్వాతంత్ర్యోద్యమాన్ని ముందుకు తీసుకుపోగల రాజకీయ పాలసీ ఒక కార్మిక వర్గమునకే వుంది. కార్మిక వర్గ రాజకీయ పార్టీ అయిన మనపార్టీ "కార్మిక పంథా"ను ప్రచురించడం ద్వారా అట్టి మార్గాన్ని దేశానికి చూపెట్టింది. స్వాతంత్ర్య ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోయే బాధ్యత తదితర పార్టీలన్నీ విఫలమగుట వలన, మనపార్టీపై బడింది. ఈ బాధ్యత చాలా భారమైంది గూడాను.

## మన పార్టీ రాష్ట్రంలోని యితర రాజకీయ పార్టీలు

అఖిల భారత కాంగ్రెసు నాయకత్వం అవలంబించే రాజీ పంథానే రాష్ట్ర కాంగ్రెసు నాయకులు గూడా అవలంబించుతూ వుండడం వలన యిదివరకే వారవలంభించే (కాన్‌స్టిట్యూషనల్) పంథాతో విముఖత్వము చెందిన కాంగ్రెసు ప్రజాసామాన్యంలో మరింత అసంతృప్తి చెలరేగింది. కాంగ్రెసు వ్యక్తిగత సత్యాగ్రహం ప్రారంబించినప్పటికిని, పార్టీ బలముగా వున్న ప్రదేశాల్లో పెక్కుమందిని యీ కార్యక్రమము ఆకర్షించలేదు. చివరకు దానిలో పాల్గొన్న వారు గూడ దాని నిష్పలతను గ్రహించారు. రాయలసీమ వగైరా వెనుకబడియున్న ప్రదేశాల్లో యువకులను కదిల్చి వారిలో చాలామందిని రాజకీయాల్లో గొనివచ్చింది. యిట్టి వారందరినీ ఫార్వర్డు బ్లాకులో సంఘటితపర్చడానికి మన రాష్ట్రంలో గూడ ఫార్వర్డు బ్లాకు ప్రయత్నించింది. కాని అప్పటికే ఫార్వర్డు బ్లాకు నిజస్వరూపం (హిందూ మహాసభతో సహకారం చేయడం, పార్టీ వ్యతిరేక ప్రచారం చేయడం) బయటపడడం వలనా, ఫార్వర్డు బ్లాకు నాయకులపై కన్నా కాంగ్రెసు ప్రజా సామాన్యానికి మనపార్టీ పైనే హెచ్చు గౌరవం, మన్నన వుండడం వలనా ఫార్వర్డు బ్లాకు నిర్మాణం రాష్ట్రంలో జరుగకుండా ఆపగలిగాం. అంతేగాకుండా అప్పటి వరకూ కాంగ్రెసు సోషలిస్టు పార్టీగా పనిజేస్తున్న మన పార్టీ సభ్యులూ, సానుభూతిపరులు, యింకా కొంతమంది మిలిటెంట్సు పార్టీగా ఆర్గనైజు అయి పార్టీ సెల్లులుగా యేర్పడడం వలన ఫార్వర్డు బ్లాకు మనపార్టీని చీల్చలేకపోయింది.

పశ్చిమ కృష్ణాలో కాంగ్రెసు నాయకత్వంలో ఒక భాగం ఫార్వర్డు బ్లాకులో చేరినప్పటికీ, కాంగ్రెసు మిలిటెంట్సును మన పార్టీలో యిముడ్చుకొని ఫార్వర్డు బ్లాకును కాంగ్రెసు ప్రజాసామాన్యం నుండి బాగా వేరుపర్చగల్గాం.

మొదటినుంచి కమ్యూనిస్టు పార్టీ రాజకీయ పంథాలో పనిజేస్తూ వుండడం వలన కాంగ్రెసు సోషలిస్టు పార్టీగా పనిజేస్తున్నా రేంక్ అండ్ ఫైలుకు పార్టీ అంటేనే భక్తి విశ్వాసాలున్నాయి. స్థానిక నాయకులంటేనే విశ్వాసముంది గాని,

అఖిల భారత సోషలిస్టు నాయకులకు రేంక్ అండ్ ఫైలుకు యేమీ సంబంధం లేదు. అందుచేత యుద్ధారంభంలో కాంగ్రెసు సోషలిస్టు పార్టీని గూడ రద్దుచేయ గల్గాం. పార్టీని అవిచ్ఛిన్నంగా నిర్మించగలిగాము.

రంగా ముఠా యుద్ధమొచ్చాక ఫార్వర్డు బ్లాకులో కలవడం వలన అతివాద ముఠాపై దానికున్న పలుకుబడి కొంతవరకు సన్నగిల్లింది. ఫార్వర్డు బ్లాకులో కలవడానికి రంగా ముఠాకు మొదటినుంచి వున్న ఆపర్చ్యూనిజమే కారణం. అతివాద జాతీయవాదులందరూ ఫార్వర్డు బ్లాకులో జేరి పోతారని, దానితో జేరక పోతే వారిపై పలుకుబడి పోతుందనే ఆపర్చ్యూనిస్టు దృక్పథమే. కొంతవరకు దానికున్న అతివాద దృక్పథం గూడ కారణమే. ఫార్వర్డు బ్లాకులో జేరినా రైతు సంఘాలను యింకా విడనాడలేదు. కమ్యూనిస్టులపై యుద్ధారంభంతో ప్రారంభ మైన ప్రభుత్వ నిర్బంధాన్ని అవకాశంగా తీసుకుని రైతు సంఘాలపై తమ గుత్తస్థాపించుటకు అనేక విధాల ప్రయత్నాలు జేశారు. తమ ఆపర్చ్యూనిస్టు రాజకీయాల వలన అతివాద దృక్పథం గల వారిలో (ముఖ్యంగా కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి, తూర్పుగోదావరి జిల్లాలలో) కోల్పోయిన పలుకు బడిని తిరిగి సంపాదించ లేక పోయింది. వెనుకబడియున్న రాయలసీమ, నెల్లూరు, వైజాగ్ జిల్లాలలో మాత్రం యింకా తగినంత పలుకుబడి వుంది. కడప, కర్నూలు జిల్లాలలో క్రొత్తగా ముందుకు వచ్చిన వారిని తమ రైతు సంఘాల వైపుకు ఆకర్షించగలిగారు.

కమ్యూనిస్టులకు తగిన పలుకుబడి వున్న జిల్లాలలో రైతు సంఘాలను పనిజే యించకుండా, కమ్యూనిస్టులను రానీయకుండా అనేక అడ్డంకులు పెట్టారు. (గుంటూరు, పశ్చిమ గోదావరి జిల్లాలు) యిందుకు మన కామ్రేడ్సు సెక్టేరియన్ దృక్పథం. (గుంటూరు) ప్రభుత్వ నిర్బంధం గూడ తోడ్పడ్డాయి.

## పార్టీ కార్యకలాపాలు

రాష్ట్రంలో యుద్ధం ప్రారంభం నుండి మన పార్టీ యొక్కటే సరియైన జాతీయ పాలసీతో, తీవ్ర యుద్ధ వ్యతిరేక ఉద్యమాన్ని సాగించింది. ప్రారం భంలో బహిరంగ సభల ద్వారా యుద్ధ వ్యతిరేక ప్రచారం జేయాలనే డీవియేషన్ వున్నా, దానివలన ప్రభుత్వ నిర్బంధం పార్టీకి హానికరంగా పరిణమించక ముందే పార్టీ మేల్కొని బహిరంగ యుద్ధ వ్యతిరేక ప్రచారాన్ని మాన్పించింది. రహస్య ప్రచారం ద్వారా, గ్రూపు మీటింగుల ద్వారా యీ ప్రచారం గావిస్తూ ప్రజల్లో సామ్రాజ్యవాద వ్యతిరేక తత్వాన్ని నిలబెట్టాం. ఇందుకుగాను పార్టీ రహస్య పత్రిక "స్వతంత్ర భారత్"ను స్థాపించాం. 3000 ప్రతులు అచ్చు వేయించి, ఈ ప్రచారాన్ని 1000 గ్రామాల్లో గావించాం. దీని ద్వారా

అతివాద దృక్పథం గల యువకులందరూ పార్టీ చుట్టూ మూగారు. రాజకీయ రంగంలో వున్న విద్యార్థుల నందరినీ పార్టీవైపుకు ఆకర్షించ గల్గుట చేత, వీరి నుండి విద్యార్థి ఉద్యమాన్ని అన్ని ప్రాంతాల్లో నిర్మించుటకు తగిన కేడర్లను సంపాదించగలిగాం.

ఎన్నో నిర్బంధాలను ఎదుర్కొంటూ ప్రభుత్వంతో తీవ్రంగా పోరాడు చున్నది మన పార్టీ ఒకటేనని ప్రజలందరూ గుర్తించారు. దీనివలన ప్రజల్లో గూడ పార్టీ ప్రతిష్ట చాలా హెచ్చింది.

"స్వతంత్ర భారత్" ప్రచారం వలన కడప, అనంతపూర్ జిల్లాలలో గూడ పార్టీ కాంటాక్టులు యేర్పడినాయి. ఇదే సమయంలో, హైదరాబాదుకు కూడ పార్టీ వ్యాపించింది.

## ప్రజారంగాల్లో పార్టీ పని

యుద్ధానికి పూర్వం ప్రజా ఉద్యమాన్ని ఆందోళన, ప్రచార దశలకు మించి అభివృద్ధి చేయజాలకపోవుటచే స్థానికంగా యెచ్చటికచ్చట స్వంత చొరవతో పనిచేసే శక్తి గల వర్కర్లు అభివృద్ధిగాలేదు. అన్ని పనులు నాయకులే చేయాల్సి వచ్చేది. ఆ బలహీనత యుద్ధ మొచ్చాకా పార్టీ నాయకులపైన, ప్రభుత్వ నిర్బంధం తీవ్రం చేసేటప్పటికి మరింత ప్రస్ఫుట మైంది. బహిరంగంగా ఆందోళన చేసే నాయకులు గాని, తన వద్దకు వచ్చి సలహా లిచ్చేవారు గాని, రహస్య జీవితం గడపవలిసి వచ్చినప్పుడు యుద్ధానికి పూర్వం జరిగే ఆందోళన ప్రచారాలు గూడ సాధ్యం కాలేదు. అందుచేత మొత్తం మీద యీ కాలంలో ప్రజారంగాలు హెచ్చుగా అభివృద్ధి కాలేదు.

కాని యుద్ధం రావడంతోనే మన రాష్ట్ర, జిల్లా పార్టీ నాయకత్వాలను రహస్యముగా వుంచి ప్రభుత్వ నిర్బంధము నుండి రహస్య కాలమంతా కాపాడుట చేత, స్వతంత్ర రాజకీయ శక్తిగా అభివృద్ధి అవుతూ వచ్చిన కృష్ణా, గుంటూరు తూర్పు గోదావరి జిల్లాలలో ప్రజా రంగాలలో కొంత పని జరిగింది. గుంటూరు, తూర్పు గోదావరి జిల్లాలలో సెక్టేరియన్ దృక్పథంతో పనిచేయడం వలన ఫలితం అంతగా రాలేదు.

కృష్ణా జిల్లాలో జిల్లా రైతు సంఘం యుద్ధానికి పూర్వమే రైతుల యిబ్బం దులను తీర్చడానికి పనిచేయడం ప్రారంభించింది. యుద్ధ మొచ్చాక యీ పని మరింత హెచ్చయింది. అందుచేత చాల గ్రామాల్లో రైతుల కోర్కెల కొరకు రైతు సంఘాల పని చేయించడానికి కేడరు తయారైంది. దాంతో సామ్రాజ్యవాద యుద్ధ కాలంలో ప్రభుత్వ నిర్బంధమున్నా, రైతు ఉద్యమం అభివృద్ధి అయింది. దీనితో రంగా ముఠాకు కృష్ణాలో స్థానం లేకుండా పోయింది. అలాగే యువజన

సంఘాలు ఆటల కార్యక్రమం సాగించుతూ వుండడం వలన యువక ప్రజా సామాన్యం బాగా ఆకర్షించబడి, యువజన సంఘం ప్రజా సంఘంగా మారింది. 1940 ఫిబ్రవరిలో జరిగిన జిల్లా బోర్డు ఎన్నికలలో పార్టీ సభ్యులు కాంగ్రెసు అభ్యర్థుల విజయం కొరకు తీవ్ర కృషి జేసి, కాంగ్రెసుకు అఖండ విజయాన్ని చేకూర్చి జిల్లా బోర్డులో అనేక సంవత్సరాల నుండి పాతుకుపోయిన జస్టిస్‌పార్టీకి చావు దెబ్బ కొట్టారు. దీనితో జిల్లా కాంగ్రెసు నాయకుల అసహ్యా ప్రవర్తనతో విముఖత్వం పొంది నిస్పృహ చెంది యున్న కాంగ్రెసు ప్రజా సామాన్యమంతా వుత్సాహపడి పార్టీ జెండా క్రిందికి వచ్చింది అప్పటినుండి కృష్ణా జిల్లా పార్టీ ప్రజా పార్టీగా అవడం ప్రారంభమైంది. కాంగ్రెసు వర్కర్లందరను పార్టీవైపుకు ఆకర్షించడం, వారిచేత ప్రజా రంగాలలో (యువజన, రైతు, విద్యార్థి) పని చేయించడంద్వారా పార్టీ నిర్మాణంలోకి గొని రావడం వలన ప్రజా పార్టీగా మారడానికి అవకాశం ఏర్పడింది.

గుంటూరులో యుద్ధారంభంతో పార్టీ సభ్యులు గ్రామాల్లో పని చేయడానికి పూనుకున్నారుగాని, జిల్లా రాజకీయాలలో తగినంత మార్పు తీసుకురాలేదు రైతు సంఘంలో సెక్టేరియన్ దృక్పథం పని జేయడం వలన రంగా ముఠాకు జిల్లాలో వున్న పలుకుబడిని తొలగించలేక పోయారు. కాంగ్రెసు ప్రజా సామాన్యంతో హెచ్చు సంబంధం యుద్ధానికి పూర్వమే లేకపోవడం వలన, వారు కాంగ్రెసు కార్యక్రమముతో అసంతృప్తి చెందినా, వారికి ప్రజారంగాలలో కార్యక్రమ మిచ్చి, పార్టీ నాయకత్వం క్రింద పని చేయించ జాలక పోయారు. అందువలన వారిని పార్టీ వైపుకు ఆకర్షించజాలక పోయారు. కాంగ్రెసు వ్యక్తిగత సత్యాగ్రహం వచ్చిన తరువాత వీరంతా జైళ్ళకు పోయారు. లేకపోతే రాజకీయ రంగం నుండి విరమించారు.

యుద్ధానికి పూర్వంవలె గాక యుద్ధమొచ్చాక గ్రామాలకువెళ్ళి ప్రజలతో సంబంధం పెట్టుకోవడానికి ప్రయత్నం జరిగింది. కాని, యుద్ధానంతరం పార్టీ కొంతవరకు అభివృద్ధే అయింది. అయినా జిల్లా రాజకీయాలను పార్టీ కను కూలంగా మార్చగల్గేంత శక్తి పార్టీకి రాలేదు. ఒక ముఠాగా మాత్రమే యుండి పోయారు.

పశ్చిమ గోదావరిలో యుద్ధానికి పూర్వం పార్టీకి స్వతంత్ర పలుకుబడి గాని, ప్రజారంగాలలో స్వతంత్ర స్థానంగాని లేకపోవడంవలన యుద్ధ మొచ్చాక పార్టీ స్థితి మరింత అధ్వాన్నమైంది. పార్టీని యిదివరలో అనుసరిస్తూ వుండే కాంగ్రెసు వర్కర్లందరూ రాజకీయ రంగాన్నుండి విరమించుకోవడం గాని,

కాంగ్రెసు వ్యక్తి గత సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొనడం గాని జరిగింది. పార్టీ సభ్యులు ప్రజలకు సంబంధంలేని ఒక ముఠాగా తయారయ్యారు. పార్టీ పంథాలో ఎలా పనిజేయాలో తెలియక నిస్పృహ చెంది ఊరికే కూర్చోవడమో, వెనుకటి బహిరంగ పద్ధతులతో పనిజేసి ప్రభుత్వ నిర్బంధానికి గురి అవ్వడమో జరిగింది. దీని ఫలితంగా పార్టీ అభివృద్ధి అవడంగాని, ప్రజా ఉద్యమము అభివృద్ధి గావడం గాని ఏమీ జరుగలేదు.

తూర్పుగోదావరి జిల్లాలో పూర్వపు సెక్టేరియన్ దృక్పథం మరింత ప్రమాదకరంగా పరిణమించి పార్టీలో ఫాక్షనలిజముకు దారితీసింది. వ్యవసాయ కూలీ రంగంలో తీవ్ర సెక్టేరియన్ తత్వం, పార్టీ నిర్మాణములో దుందుడుకు పనులు, అరాచకత్వం ప్రబలి చివరకు రైతుల నుండి, కాంగ్రెసు ప్రజా సామాన్యం నుండి బాగా దూరమై పోలీసు నిర్బంధానికి గురి అయింది. దీనితో పార్టీలో నిస్పృహ, చీలికలు ప్రబలి పార్టీ అభివృద్ధికి ఎంతో అడ్డుపడ్డాయి.

రాయలసీమ జిల్లాలలో "స్వతంత్ర భారత్" ప్రచారంవలన కాంటాక్టులు ఏర్పడ్డా వాటిని పార్టీ కార్యక్రమముపై ప్రజారంగాల్లో పనిజేయించ గల్గే పార్టీ అభివృద్ధి కాకపోవడం వలన పార్టీ సభ్యులు కొన్ని ప్రాంతాలలో రంగా ముఠా యెడల సెక్టేరియన్ దృక్పథం అవలంభించుటవలనా, అతివాద దృక్పథం గల యువకుల పార్టీ యిముడ్చుకో జాలక పోయింది.

ఇదివరకు కాంగ్రెసు మంత్రుల కాలంలో చిట్టివలస కార్మికులతో మనకు ఏర్పడిన సంబంధాలు బలపడి సామ్రాజ్యవాద యుద్ధదశలో జూట్ వర్కర్సు యూనియన్‌కు మన కామ్రేడ్ కార్యదర్శిగా ఎన్నుకోబడ్డాడు. నాటి నుంచి క్రమంగా యూనియన్‌లో మన నాయకత్వం బలపడింది.

విశాఖపట్టణ రేవు పనివారి సంఘంలో మనం పనిజేసి కార్మికుల నాయకత్వం సంపాదించాము. మన కామ్రేడ్ అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. నాటి నుండి యీ సంఘం మన పలుకుబడిలోనేవుంది. 90% కార్మికులు యూనియన్‌లో సభ్యులుగా వున్నారు.

వివిధ పట్టణాలలో మున్సిపల్ వర్కర్సు యూనియన్లు మన కామ్రేడ్సు కృషితో బయలుదేరి 1941లో ఆంధ్రరాష్ట్ర మున్సిపల్ వర్కర్సు యూనియన్ ఏర్పడింది. అప్పటి నుండి క్రమంగా యీ సంఘం బలపడి నేడు మన పార్టీ వెనుకవున్న ఒక బలమైన కార్మిక సంఘంగా వుంది.

## విద్యార్థి రంగం

విద్యార్థి సంఘాలున్న చోట్ల బలపడ్డవి. విజ్ఞానాన్ని కార్యక్రమం ద్వారా వెనుకబడి వున్న విద్యార్థులను గూడ సంఘాలలోనికి తెచ్చాం. విద్యార్థులలోని

కేడర్లందరిని పార్టీవైపు ఆకర్షించి, ప్రాక్షను నిర్మాణాన్ని ప్రారంభించాం. నిర్బంధ విధానంవల్ల వైజాగ్, నెల్లూరు జిల్లాలలో దెబ్బతిన్నా, పశ్చిమగోదావరి, రాయల సీమ జిల్లాలకు వుద్యమాన్ని వ్యాపింపజేశాం.

## పార్టీ నిర్మాణం

పార్టీని నిర్మించడానికి ప్రయత్నించిందీ కాలములోనే. రహస్య కాలమంతా పార్టీ నాయకత్వాన్ని, పార్టీ కేంద్రాన్ని భద్రంగా ప్రభుత్వ నిర్బంధానికి గురి కాకుండా కాపాడుట వలన పార్టీ నిర్మాణమును అభివృద్ధి చేయగల్గాం. 'స్వతంత్ర భారత్' ప్రచారం, ప్రజారంగాలలో పని, పార్టీ రహస్య కేంద్రం భద్రంగా వుండుటవలననే సాధ్యమైంది పార్టీ రహస్య, బహిరంగ కార్యకలాపాలను బాగా సమన్వయం చేయగల్గాము. "స్వతంత్ర భారత్" రహస్యంగా ప్రజలమధ్య పంచి పెట్టడంలో, రహస్య యంత్రాన్ని, నడవడంలో పార్టీవైపు ఆకర్షింపబడిన వారంతా దాదాపు పార్టీ సభ్యులుగా గాని, పార్టీ సానుభూతిపరులుగా గాని తయారయ్యారు. అందుచేత ప్రజా యుద్ధం ప్రారంభమయ్యేటప్పటికి పార్టీ సభ్యత్వం 700 లకు, సహాయక సభ్యత్వం 450కు పెరిగింది. పార్టీ సభ్యుల ముఖ్య పని ఒక కృష్ణా జిల్లాలో తప్ప స్వంతంత్రి భారత్‌ను పంచి పెట్టడమే అవడం వలన యితర జిల్లాలలో ప్రజా రంగాల పని హెచ్చుగా అభివృద్ధి అవలేదు. పార్టీ వైపుకు ఆకర్షించబడ్డ యువకుల నందరిని ప్రజా రంగాలలో పని జేయించి యున్నట్లయిన పార్టీ సభ్యత్వం అనేక రెట్లు పెరిగి యుండేది. అలా జరుగక పోవడం వలన పార్టీ సభ్యత్వంలో నూటికి 50 వంతులు కృష్ణా జిల్లాలోనూ, తతిమ్మా 50 వంతులలో హెచ్చు భాగం గుంటూరు, పశ్చిమ గోదావరి, తూర్పుగోదావరి జిల్లాలలోనే వుండిపోయింది. పార్టీ పలుకుబడికి, ప్రతిష్టకు తగినట్లు అన్ని జిల్లాలలో పార్టీ సభ్యత్వము అభివృద్ధి గాక చాల హెచ్చు తగ్గులుగా వుంది.

పార్టీ సభ్యులకు పార్టీ జీవితం ఏర్పడడం ఈ కాలంలోనే, సెల్లులుగా విభజించి పార్టీని నిర్మాణయుక్తంగా పనిచేయించుటకు ప్రథమ పర్యాయంగా ప్రయత్నించబడింది. దీని ఫలితంగా పార్టీ సభ్యుల చైతన్యం, క్రమశిక్షణ, స్థాయిలు చాల హెచ్చాలు. సిద్ధాంత పరిజ్ఞానం గూడ హెచ్చింది.

పార్టీ లేనిదే విప్లవాన్ని సాధించడం, ఎన్ని విప్లవకర పరిస్థితులున్నా అసంభవమనే ముఖ్య విషయాన్ని సభ్యులు ఈ రోజుల్లోనే గ్రహించారు పార్టీని నిర్మించడానికి పూనుకోవడం ద్వారా పార్టీ మొత్తంగా, ముఖ్యంగా పార్టీ నాయకత్వం ఎంతో అనుభవాన్ని గడించింది. దీని ఫలితంగా నాయకత్వంలో

విధాలా ఐక్యత చేకూరి బాగా బలపడింది. పార్టీలో పాక్షన్సు (తూర్పు గోదావరి జిల్లాలో తప్ప) లేకుండా చేయగల్గాము.

## మన లోట్లు - సాధించిన విజయాలు

సామ్రాజ్యవాద యుద్ధ కాలమంతా కాంగ్రెసు నిస్తబ్దత రూపేణాగాని, తరువాత వ్యక్తిగత సత్యాగ్రహం రూపేణాగాని సాగించిన కార్యక్రమము ప్రజల్లో ఉత్సాహాన్ని పుట్టించలేదు. ఈ కాలంలో నిజమైన యుద్ధ వ్యతిరేక ఉద్యమాన్ని నడుపుతూంది. మన పార్టీయే అగుటచేత మన పార్టీ ప్రతిష్ఠ సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజానీకమంతటిలో హెచ్చింది. రాజకీయ రంగంలో ఒక ప్రధాన శక్తిగా మన పార్టీని ప్రజలు గుర్తించారు. కాని ప్రజారంగాల్లో పని హెచ్చుగా చేయక కేవలం యుద్ధ వ్యతిరేక ప్రచారం, స్వతంత్ర్య భారత్‌ను పంచడంతోనే పార్టీ సభ్యులు కూర్చోవడం వలన ప్రజానాయకులుగా పార్టీ సభ్యులు తయారవ్వ లేదు.

విద్యార్థి కూలీ ఉద్యమాలు పూర్తిగా మన పార్టీ పలుకుబడి క్రిందనే వున్నాయి. వ్యవసాయ కూలీ ప్రజా సామాన్యమును గూడ ఆకలియాత్రల ద్వారా పార్టీ వైపుకు ఆకర్షించాము. కాని అంతటితోనే ఆగిపోయి. రోజువారీ ఇబ్బందులను తొలగించడానికి పనిజేస్తూ ఘనిష్ఠ సంబంధం పెట్టుకోకపోవడం వలన తద్వారా వచ్చిన పలుకుబడి అస్పష్టంగానే వుండిపోయింది.

## అధ్యాయము - 5

# ప్రజా యుద్ధారంభం నుండి ఆగష్టు సంఘటనల వరకు

సోవియట్ యూనియన్‌పై జర్మన్ ఫాసిస్టులు దాడి వెడలడంతో యుద్ధ స్వభావంలో తీవ్ర మార్పు వచ్చింది. సామ్రాజ్యవాదయుద్ధం ప్రజాయుద్ధంగా మారిపోయింది. ఈ మార్పు, తూర్పున జపాన్ 1941 డిసెంబరు 7 వ తేదీన అక్షరాజ్యాల పక్షాన యుద్ధంలో దిగి, ఫిలిప్పైన్ దీవులు, ఈస్టు యిండీస్, బర్మా, మలయా దేశాలు ఆక్రమించడంతో మనదేశానికి గూడ మరింత ప్రస్ఫుటమైంది. ఇంతవరకు సాగించుతూ వున్న యుద్ధ వ్యతిరేకపు ఉద్యమం ఇకముందు సాగించితే జాతీయంగా గాని, అంతర్జాతీయంగా గాని ఐక్యతను పెంపొందించడానికి బదులు, ప్రపంచాధిపత్యం కొరకు పోరాడుతున్న ఫేసిస్టుల ప్రయత్నాలకు దోహదమిస్తుంది. దీనివలన మన స్వాతంత్ర్యము గాని, ప్రపంచ ప్రజల స్వాతంత్ర్యము గాని సాధింపబడదు. ఫాసిస్టుల క్రింద బానిసత్వం స్థిరపడుతుంది. అందుచేత ప్రజా యుద్ధమయ్యాక ప్రపంచ ప్రజలందరూ ఐక్యమై సోవియట్ ప్రజల నాయకత్వం క్రింద యుద్ధంలో ఫాసిస్టులను ఓడించడానికి గావించే అంతర్జాతీయ పోరాటంలో మన స్వాతంత్ర పోరాటం గూడ ఒక భాగంగా జేసినప్పుడే మనకు స్వాతంత్ర్యం లభిస్తుంది. అప్పుడే మనం బ్రిటీషు సామ్రాజ్యం నుండి విముక్తులము గావడానికి గావించే ప్రయత్నాలకు ప్రపంచ ప్రజల సహాయం లభ్యమవుతుంది.

ఈ నూతన పరిస్థితుల్లో స్వాతంత్ర పోరాటాన్ని నూతన పంథాను నడుపవలసి వచ్చింది. ప్రపంచ ప్రజలందరికి వలెనే భారత ప్రజలకు గూడ దేశ రక్షణ ప్రధాన జాతీయ కర్తవ్యమైంది. ఇందుకు జాతినంతను ఐక్యపర్చి సంపూర్ణ జాతీయైక్యతను నెలకొల్పుట ప్రప్రథమ పని అయింది. మనదేశంలో ప్రధాన రాజకీయ పార్టీలైన కాంగ్రెసు - ముస్లింలీగ్‌ల మధ్య ఐక్యత యేర్పడితే గాని జాతీయైక్యత సాధ్యం కాదు. ఇందుకు కృషిజేయడమే ప్రస్తుత పరిస్థితుల్లో స్వాతంత్ర్యం కొరకు కృషిజేయుట, తదితర మార్గాలన్నీ భారతదేశ ప్రజలను, ప్రపంచ ప్రజలను ఫాసిస్టుల క్రింద బానిసలుగా జేయడానికే తోడ్పడుతాయి

పై నూతన మార్పు వచ్చినప్పటికి మనం, సోవియట్‌పై జర్మన్ దాడి వచ్చాక 6 నెలల వరకు గుర్తించక యుద్ధ వ్యతిరేక ఉద్యమాన్నే సాగించాం. దీనికి కారణం ప్రజల్లోవున్న బ్రిటిషు వ్యతిరేకత యొక్క ప్రభావం మనపై గూడ పడింది మనం కమ్యూనిస్టులుగా ఆలోచించకుండా తీవ్ర జాతీయవాదులు గానే ఆలోచించాము. ఈ తప్పును తెలుసుకొని పై కార్యక్రమము ఇవ్వడానికి ఆరునెలలు పట్టింది. తత్ఫలితంగా పార్టీలో ఏర్పడ్డ విస్తబ్ధతను తొలగించి ముందుకు పోజాలకపోయాం.

కాంగ్రెస్ నాయకత్వము గాని, ముస్లిం లీగ్ నాయకత్వం గాని యీ నూతన మార్పును గుర్తించి దేశ రక్షణకొరకు ప్రజలను ఐక్యపర్చుటకు పూనుకోలేదు.

బ్రిటిషు ప్రభుత్వం, జాతీయ ప్రభుత్వాన్ని స్థాపించనిదే దేశ రక్షణ కొరకు కృషిచేయడం సామ్రాజ్యవాదాన్ని బలపర్చడం అని కాంగ్రెస్ నాయకత్వం తలచింది. పాకిస్థాన్ ప్రసాదించనిదే దేశీయ రక్షణను బలపర్చడం ముస్లిం ప్రజల హక్కుల కొరకు పోరాడడం మానివేయడమేనని ముస్లింలీగ్ భావించింది. రెండు పక్షాలు బూర్జువా దృక్పథంతోనే బ్రిటిషు సామ్రాజ్యవాదం వైపు ఎదురుచూస్తున్నాయి గాని ప్రజలపై విశ్వాసంతో ప్రజలను ఐక్యపర్చుటకు సమీకరించుటకు నిరాకరించాయి.

అందుచే మన పార్టీ యిచ్చిన కార్యక్రమ మొక్కటే దేశాన్ని ఫాసిస్టుల నుండి రక్షించేటి. స్వాతంత్ర్యాన్ని గడించేది. ముస్లిం జాతులకు స్వయం నిర్ణయ హక్కును సంపాదించగల్గేది అయింది.

పార్టీ యీ పాలసీ, ప్రజాయుద్ధముగా మారాక ఆరు నెలలకు పార్టీ సభ్యులకు తెలియడం వలన దానిని సరిగా అర్థంచేసుకొని ప్రజల్లో ప్రచారం జేయడానికి మరింతకాలం మనకు పట్టింది. సోవియట్‌తో సంధి జేసుకొని బ్రిటిషు ప్రభుత్వం ఫాసిస్టులతో పోరాడటం ప్రారంభించిన తరువాత గూడ మన పార్టీ సభ్యులు యుద్ధ ఫండు వసూళ్ళకు వ్యతిరేకంగా పనిచేయటం మానలేదు. ప్రజా యుద్ధమొచ్చాక మనపార్టీ సానుభూతిపరులలో సోవియట్‌తో ప్రభుత్వం కలిసి యుద్ధం చేస్తున్నప్పుడు ఎందుకు యుద్ధఫండులు యివ్వగూడదనే సందేహాలు వచ్చాయి. కాని మనిలో వున్న అతివాద జాతీయ తత్వం యుద్ధంలో గల్గిన మార్పును గ్రహించలేకపోయింది.

మొదట్లో వచ్చిన సెంటరు పార్టీ డాక్యుమెంట్సు రాయిస్టు డీవియేషన్స్‌తో వుండడంవలన, "ఫార్వర్డు టు ఫ్రీడమ్" వచ్చినా యింకా పార్టీ సభ్యులలో ఆ

డీవియేషన్స్ కొనసాగుతూ వచ్చాయి. "సోవియట్ యుద్ధం మన యుద్ధం'' అనే డీవియేషన్స్‌తో పనిజేశాం. దేశాన్ని రక్షించుకోవడానికి ప్రజలనందర్నీ ఐక్యపర్చ డానికి పూనుకోవడం ద్వారా ఇంతవరకెన్నడూలేని జాతీయైక్యతను సాధించుదామని, అట్టి జాతీయైక్యతకొరకు కృషిచేయడమే ఈ నూతనపరిస్థితుల్లో స్వాతంత్రపోరాట మును సాగించడమనేది, స్వాతంత్ర్యమునకు ఇదొక్కటేమార్గమనియు చెప్పలేదు. అందుచేత అతివాద దృక్పథం గల యువకులకు, జాతీయవాదులకు మన పాలసీ సోవియట్ యూనియన్ పాలసీపై ఆధారపడి యుంటుందని, జాతీయ శ్రేయస్సును ప్రధానంగా చూడమనే దురభిప్రాయం గలిగింది. సోవియట్ యూనియన్ ఆజ్ఞ ననుసరించి, బ్రిటిషు సామ్రాజ్యవాదంతో పోరాటమును తాత్కాలికంగా మానేశామనే దుష్ప్రచారం సాగింది. పార్టీ వెనుకటి చరిత్రను బట్టి బ్రిటిషు ప్రభుత్వంతో సహకారం చేస్తున్నామనేది విశ్వసించకపోయినా, ప్రభుత్వ వ్యతిరేక ద్వేషం వుండుట చేత, మన పాలసీపై ప్రజలు కదలలేదు.

ప్రజలను గాని, జాతీయ వాదులను గాని మన వైపుకు ఆకర్షింపజాలక పోయాం. సామ్రాజ్య వాద కాలంలో పార్టీ సభ్యులలోనూ, సానుభూతిపరులలో గలిగిన పార్టీ చైతన్యం, క్రమశిక్షణల ఫలితంగా ప్రజా యుద్ధ పార్టీ పాలసీపై ముగ్గురో, నలుగురో తప్ప పార్టీలో నుండి పోలేదు. పార్టీని అవిచ్ఛిన్నంగా వుంచుకోగల్గాం.

## జపాన్ వ్యతిరేక ప్రచారం

ప్రజా యుద్ధ పాలసీని గూర్చి పార్టీ సభ్యులకు విశదపర్చుతూ, పార్టీ సభ్యుల, సానుభూతిపరుల మధ్య ప్రచారం చేయడమే గాక ప్రజల్లో గూడ మన పాలసీని గూర్చి యీ కాలంలో ముఖ్యంగా విశాఖపట్టణం, కాకినాడలపై జపాన్ బాంబులు పడ్డ తరువాత తీవ్ర ప్రచారం జరుపబడింది. మన పాలసీ ఒకటే ఎలా నిజమైన జాతీయ పాలసీయో, స్వాతంత్రమును గడించేదో తెల్పే ప్రచారం గాక, జపాన్ వ్యతిరేక ప్రచారం చేయబడింది. దీని ఫలితంగా రాష్ట్రంలో రాజకీయంగా వున్న నిస్తబ్ధత తొలిగిపోయింది. ప్రజల్లో జపాన్‌ను వ్యతిరేకించాలనే భావాలు కలిగాయి. కాని దానికన్నా జాతీయైక్యత ద్వారా జాతీయ ప్రభుత్వాన్ని సాధించి దేశరక్షణ సాగించాలనే భావం ప్రజల్లో కలుగజేయకుండా జపానుతో బాటు బ్రిటిషు ప్రభుత్వాన్ని తీవ్రంగా నిందించడం వలన ప్రజల్లో ప్రభుత్వ వ్యతిరేక ప్రచారం ఆగస్టు సంఘటనలలో ప్రజలు పాల్గొనకుండా నివారించడానికి తోడ్పడలేదు. ప్రజారంగాల పనిమాత్రం అభివృద్ధిగాలేదు.

మన పార్టీ సభ్యులకు మాత్రం యీ ప్రచారంతో ప్రజలను బాగా సమీకరించగలమనే ఆత్మ విశ్వాసం వచ్చింది. ఇందుకు కారణం ప్రజల్లో ప్రచారం చేయడానికి నూతన పద్ధతులు అవలంభించడం, వైజ్ఞానిక ప్రచార కార్యక్రమంతో వేలాది ప్రజలలో సులభంగా ప్రచారం చేయవచ్చునని కృష్ణాజిల్లా కామ్రేడ్సును చూపెట్టారు. గండిగుంటలో వైజ్ఞానిక శిక్షణా శిబిరం పెట్టి వర్కర్సును యీ పద్ధతులలో తర్ఫీదు చేయడానికి ప్రథమ ప్రయత్నం జరిగింది. గుంటూరులో గూడ కొంత ప్రయత్నం జరిగింది. పార్టీకి ప్రజలతో సన్నిహిత సంబంధం యేర్పడడానికి, పార్టీ పాలసీ వైపుకు ఆకర్షించడానికి యెంతేని తోడ్పడ్డాయి.

## పార్టీ నిర్మాణము

పార్టీ నిర్మాణం అంతగా అభివృద్ధి గాలేదు. పార్టీ సభ్యులను పార్టీ నుండి పోకుండాను, ప్రజా యుద్ధ పాలసీని గూర్చి వారికి విశదపర్చడానికి ప్రయత్నాలు తప్పితే పార్టీ నిర్మాణమును ఇంకా ముందుకు తీసుకుపోవడానికి ప్రయత్నాలేమీ చేయబడలేదు. పార్టీపై నిషేధం తొలగడంతో (1942 జూలై 23) పార్టీ నిర్మాణ పద్ధతులలో మార్పు వచ్చింది. రహస్యంగా వుండే ముఖ్య కామ్రేడ్సు అంతా బహిరంగంగా పనిజేసే అవకాశం రావడంవలన, జైళ్ళలోని కామ్రేడ్సు విడుదలగుట చేతనూ, పార్టీ బహిరంగ ఆఫీసులు పెట్టి లీగల్‌గా ఫంక్షన్ జేయడానికి అవకాశమొచ్చింది. దీనితో పార్టీ నిర్మాణములో నూతన శకం ఆరంభమైంది.

ఇదే సమయంలో పార్టీ పాలసీని గూర్చి పార్టీ సభ్యులకు ఎప్పటికప్పుడు విశదపర్చుటకుగాను పార్టీ పత్రిక స్థాపించడం అవసరమైంది. 1942 జూన్ 17వ తేదీన పార్టీ లీగల్ పత్రిక "ప్రజా శక్తి" ప్రథమ సంచిక వెలువడింది. ఆగష్టు సంఘటనలతో ఏర్పడిన జాతీయ సంక్షోభ క్లిష్ట పరిస్థితులలో సరియైన రాజకీయ పంథాను ఎప్పటికప్పుడు పార్టీ సభ్యులకు చూపెట్టి రాజకీయైక్యతను నెలకొల్పడానికి "ప్రజాశక్తి" తరువాత ఎంతేని తోడ్పడింది.

# అధ్యాయము - 6

# జాతీయ సంక్షోభ దశ

## (అక్టోబరు - నవంబరు)

**ఆగస్టు సంఘటనలు :-** అంతర్జాతీయ రంగంలో ప్రపంచ ప్రజలు బ్రిటిషు సామ్రాజ్య వాదులపై గావించే వత్తిడి ఫలితంగా కాంగ్రెసు నాయకులు జపాను దాడి ప్రమాదాన్ని గుర్తించి, తాము జాతీయ ప్రభుత్వాన్ని స్థాపింపక పోయినప్పటికి తమతోకలిసి జపానును వ్యతిరేకించుతారనే భ్రమతో సత్యాగ్రహం ఖైదీలను 1941 నవంబరు మాసానికి పూర్తిగా విడుదల గావించారు. విడుదలానంతరం సత్యాగ్రహోద్యమమును విరమింపజేస్తూ యుద్ధ వ్యతిరేకతను మాత్రం మానుకున్నారు. కాని, తమ చుట్టూ ప్రపంచం అంతా గిర్రున తిరుగుతూవున్నా, జాతీయ నాయకత్వం 'నిరీక్షిస్తూ కూర్చునే" విధానమే అవలంభించింది. యుద్ధం ఎడల కాంగ్రెసు నాయకులలో రెండు దృక్పధాలున్నాయి. గాంధీ నాయకత్వం క్రింద ఒక ముఠా యుద్ధంలో ఏమి జోక్యం కలుగజేసుకోకుండా తటస్థ విధానం అవలంభించుతూ, సామ్రాజ్యవాదం యేమి చేస్తుందో "నిరీక్షిస్తూ" కూర్చోవాలని వాదిస్తోంది. ప్రస్తుతం జరిగే యుద్ధం రెండు సామ్రాజ్యవాదాల మధ్య జరగే యుద్ధమగుటచే ఎవరు గెలిచినా ఒకటేనని యీ ముఠా భావం. రెండో ముఠా నెహ్రూ నాయకత్వం క్రింద యుద్ధంలో మిత్ర రాజ్యాలు గెలవాలని వాంచించుతారు కాని యింతకంటే ముందుకు వెళ్ళరు. యుద్ధంలో ప్రజలు విరివిగా పాల్గొనడానికి జాతీయ ప్రభుత్వం సంపాదించడానికి అవసరమైన ప్రజా కార్యక్రమమివ్వరు. రెండు ముఠాలు ముందడుగువేసే అవకాశాన్ని బ్రిటిషు సామ్రాజ్యవాదం చేతుల్లోనే వుంచాయి. ఈ విధంగా "నిరీక్షిస్తూ కూర్చునే" నినాదంపై రెండు ముఠాలకు మధ్య ఐక్యత కుదిరింది.

జాతీయైక్యత ద్వారా భారత ప్రజలు బ్రిటిషు సామ్రాజ్య వాదులను లొంగదీయజాలక పోయినా, బ్రిటిషు, అమెరికన్ ప్రజల వత్తిడి వలన క్రిప్సు రాయబారం భారతదేశానికి పంపబడింది. ముస్లిం జాతుల స్వయం నిర్ణయ హక్కును అంగీకరించి, జాతీయైక్యతను ఏర్పరచి సామ్రాజ్యవాదుల బలహీనమైన కీలక స్థానంలో అంతర్జాతీయంగా, జాతీయంగా దెబ్బకొట్టి జాతీయ ప్రభు

త్వాన్ని యేర్పరచే అవకాశాన్ని జాతీయ నాయకత్వం జారవిడచింది. తత్ఫలితంగా భారత ప్రజల అనైక్యతను, బ్రిటిషు లేబరు పార్టీ నాయకుల విద్రోహాన్ని బ్రిటిషు సామ్రాజ్య వాదులు విరివిగా ఉపయోగించుకొని బ్రిటిషు ప్రజలకు, భారతీయులకు మధ్య చీలిక ఏర్పరచగలిగారు. జాతీయైక్యత లేకపోవడం ఒక్కటే నిరంకుశాధికార వర్గము యొక్క బలమని స్పష్టమయింది. భారతీయులపై పెత్తనం చలాయించడానికి యిదొక సాధనంగా ఉపయోగపడుతోంది. కాబట్టి సామ్రాజ్యవాదులు యుద్ధంలో ప్రజల సహకారాన్ని కోరక, ఇండియాను మిలిటరీ బలంతో రక్షించుకోడానికి నిశ్చయించారు. అందుకు అధికారాన్ని ఆవంతైనా సడలించక, తీవ్ర నిర్బంధాన్ని మరల ప్రవేశ పెట్టారు.

పరిస్థితుల్లో గల్గిన యీ మార్పుతో నెహ్రూ ముఠా సందిగ్ధావస్థలో బడి చివరకు వార్ధా వర్కింగు కమిటీ సమావేశంలో గాంధీ ముఠాకు లొంగిపోయింది. ఫాసిజాన్ని భారతీయులందరూ ప్రతిఘటించాలని చెపుతున్నా మరొక వైపున ప్రభుత్వాన్ని లొంగదీసే పోరాటం అవసరమనే పంథాకు వచ్చారు. దీనీ ఫలితమే బొంబాయి అ.భా. కాంగ్రెసు కమిటీ తీర్మానం. తత్ఫలితంగా వచ్చిన జాతీయ సంక్షోభం.

ఫాసిస్టులు యుద్ధంలో ఓడిపోవాలని వాంఛించినా, జాతీయ నాయకత్వం తమకు జాతీయ ప్రభుత్వం రానంతవరకు యుద్ధం సామ్రాజ్య వాద యుద్ధమనే యింకా నమ్ముతూ వుంద. కాబట్టి యుద్ధానికి ఆటంకాలు కల్పించి బెదిరిస్తే సామ్రాజ్యవాదులు క్రిందికి దిగి వస్తారని వాదించారు. అందుకు జాతీయైక్యత సాధ్యం కాదు గాన పోరాటం తప్పగత్యంతరం లేదని వీరి వాదన.

బొంబాయి సమావేశమునకు ముందునుండే సిద్ధపడి వున్న ప్రభుత్వం. సమావేశానంతరం ఒక్క పెట్టున కాంగ్రెసు నాయకులను అరెస్టు గావించి అదివరకే బ్రిటిషు వ్యతిరేకతతో మండిపడుచున్న ప్రజల నుద్రేకపర్చి ఆగష్టు సంఘటనలలో దేశాన్ని ముంచి వేసింది.

## పార్టీ - వివిధ పార్టీలు - ప్రజలు

ఆగష్టు సంఘటనలో ప్రారంభమైన జాతీయ సంక్షోభం నుండి దేశాన్ని రక్షించడానికి పార్టీ యీ క్రింది కార్యక్రమ మిచ్చింది.

1. ప్రజలు ఉద్రిక్తులై విధ్వంసక చర్యలకు, అరాచక చర్యలకు దిగకుండా సకాలంలో జోక్యం కలుగజేసుకుని నివారించాలి.

2. ప్రభుత్వ నిర్బంధ విధానం జరుగకుండా, ప్రభుత్వానికి, ప్రజలకు మధ్య పార్టీ సభ్యులు నిలబడి పనిజేయాలి. జాతీయ నాయకుల విడుదలకు పనిజెయ్యాలి.

3. పార్టీ సభ్యులెవ్వరూ గాభరాపడి యేమీ చేయకుండా, యిది సర్వనాశనానికి దారితీసే జూదమని తిట్టుతూ కూర్చోరాదు.

4. జాతీయైక్యతను నిర్మించుటకు కృషిచేయడం ద్వారానే స్వాతంత్ర్యమును ఎలా యీ నూతన పరిస్థితుల్లో సంపాదించ గల్గుతామో ధైర్యంగా, ఆత్మవిశ్వాసంతో ఓపికతో ప్రజలలోను. జాతీయవాదులలోను తీవ్ర ప్రచారం సాగించుతూ వుండాలి.

ఈ కర్తవ్యాలను మన రాష్ట్రంలో పార్టీ ఎంతవరకు నెరవేర్చింది? ప్రజలను జాతీయవాదులను ఆగష్టు సంఘటనలలో పాల్గొనకుండా చేయజాలక పోయినప్పటికిని, ప్రారంభంనుండి పార్టీ సభ్యులు ప్రభుత్వ నిర్బంధ విధానమునకు వ్యతిరేకంగా పనిచేస్తూ వచ్చారు. అరాచక చర్యలు, విధ్వంసక చర్యలు, వ్యాపించకుండా కృష్ణా, గుంటూరు, తూర్పు గోదావరి జిల్లాలలో పార్టీ సభ్యులు కృషి గావించారు. కృష్ణా జిల్లాలో పార్టీ కృషి వలననే విధ్వంసక చర్యలు హెచ్చుగా జరుగలేదు. గుంటూరు జిల్లాలో విధ్వంసక చర్యలు హెచ్చుగా జరిగిననూ అవి వ్యాపించకుండా తెనాలి, గుంటూరు, రేపల్లె వగైరా ప్రదేశాల్లో తీవ్ర కృషి గావించారు. ప్రభుత్వ నిర్బంధానికి కూడ గురి అయ్యారు. తూర్పు గోదావరి జిల్లాలో కాకినాడ, రాజమండ్రి వగైరా పట్నాలలో విధ్వంసక చర్యలు జరుగకుండా మన పార్టీ సభ్యులే ఆపగలిగారు. పశ్చిమ గోదావరి జిల్లాలో పార్టీ పూర్తిగా విఫలమైంది. దానికి కారణం పార్టీకి స్వతంత్ర రాజకీయ పలుకుబడి లేకపోవడం, పార్టీ సభ్యులు, కాంగ్రెసువాదులు అరాచక చర్యలను వ్యాపింపజేస్తూ వున్నప్పటికీ, ప్రజలు మన మాటవినరని ఆత్మవిశ్వాసం లేక కళ్ళుమూసుకుని కూర్చోవడం (గుంటూరు జిల్లాతో, పశ్చిమ గోదావరి జిల్లాతో సరిపోల్చి చూడండి.)

విధ్వంసక చర్యలు ఆపజాలకపోవడమే గాక పార్టీ అంతా ఈ బలహీనత వలన ప్రభుత్వ నిర్బంధానికి గురి అయింది. పార్టీ సభ్యులు చాలామంది పార్టీ ముఖ్యులు కొందరు అరెస్టు గావించబడి పార్టీ పెద్ద నష్టాన్ని పొందింది.

విద్యార్థిరంగంలో మొదటి రోజుల్లో విద్యార్థులు మన మాట వినక సమ్మెలకు గడంగినప్పటికి, తరువాత పార్టీ సభ్యుల కృషివలన చురుకుగా యిదివరకు విద్యార్థి ఉద్యమంలో పనిజేసే వర్కర్లు మన పంథాకే వచ్చారు. అయినా యింకా విద్యార్థి ప్రజాసామాన్యం మన పాలసీ ఎలా సరియైన జాతీయ విప్లవ పాలసీయో గ్రహించలేదు. అందుచేత జాతీయ విద్యార్థి సంఘాల పలుకుబడి సంపూర్ణంగా విద్యార్థులపై తొలగిపోలేదు. విద్యార్థి పార్టీ సభ్యులు ఎవరూ పార్టీనుండి విడిపోకుండా వుంచుకోగలగడం గొప్ప ఫలితమే.

మన పార్టీనుండి వెళ్లగొట్టబడ్డవారు, ఫార్వర్డు బ్లాకు, రంగా ముఠా, అరెస్టు గాకుండా దిగబడివున్న కాంగ్రెసు ఛోటా నాయకులు మన పార్టీపై విపరీతమైన దుష్ప్రచారము గావించారు. దానితో "స్వాతంత్ర్య పోరాటము" సాగించే రోజుల్లో బ్రిటిషు ప్రభుత్వము నుండి డబ్బు తీసుకుని, సహకారం చేస్తున్నామని దుష్ప్రచారము చేశారు. కాని ఈ దుష్ప్రచారాన్ని ఎవరూ నమ్మలేదు. పార్టీ సభ్యులు యిదివరకు చేసిన త్యాగాల ఫలితంగా యీ దుష్ప్రచారాన్ని ఎచ్చటా ఫలించలేదు. రాజకీయంగామాత్రం వీరంతాకలిసి కమ్యూనిస్టు వ్యతిరేకకూటమిగా తీవ్రంగా పని చేశారు. విద్యార్థులలోనూ, యువకులలోనూ మనకున్న పలుకుబడిని నాశనం చేయ తీవ్ర కృషి చేశారు. కాని ఈ ముఠాలో వాళ్ళిదివర కెన్నడూ యువకుల నాకర్షించగల్గే ప్రజాకార్యక్రమమును అనుసరించి పని చేసి వాళ్ళలో కేడర్లను సంపాదించి యుండకపోవుటచేత ఈ ప్రయత్నం విఫలమైంది. అచ్చటచ్చట జాతీయ యువజన విద్యార్థి సంఘాలు స్థాపించినా, అవి తగినంతగా యువకుల్లోను, విద్యార్థుల్లోను స్థానం సంపాదించలేదు.

ప్రజలు మాత్రం మన పార్టీ పాలసీని అర్థం చేసుకోలేదు. రష్యాకనుకూలమైన పద్ధతే గాని, జాతీయపంథా గాదనే తలచారు. ఆగస్టు సంఘటనలు సమసిపోయిన తరువాత అరాజకోద్యమము వలన గూడ ప్రయోజనము లేదనే గ్రహించారు. కాని ప్రభుత్వ నిర్బంధము వలన నిస్పృహ జెంది రాజకీయం నుండి విరమించుకున్నారు. గాని మన వైపుకు రాలేదు. అలాగే కాంగ్రెసు ప్రజాసామాన్యం గూడ నిస్పృహ జెందిపోయింది. వీరిలోని ప్రభుత్వ వ్యతిరేక తత్వం జపాన్ అనుకూల పోకడగా మాత్రం మారింది. బ్రిటిషు అపజయాలను హర్షించడం మొదలు పెట్టారు. మన పార్టీ సభ్యులు గూడ హెచ్చుగా అరెస్టు గావడం చూస్తున్నారు. గాన బ్రిటిష్ ప్రభుత్వంతో మనం కలిసిపోయామనే ఫార్వర్డు బ్లాక్ రంగా ముఠాల దుష్ప్రచారాన్ని ప్రజలు విశ్వసించలేదు. "ప్రజాశక్తి"ని బహిష్కరించాలనే ఫార్వర్డు బ్లాక్ వగైరాల ప్రచారాన్ని గూడ ప్రజలు చెవినిబెట్టలేదు. మన పార్టీ పాలసీ యేమో గూడ తెలుసుకుందామనే కుతూహలంతో మన పత్రికను చదువుతూనే వున్నారు. జనరల్‌గా రాజకీయ చైతన్యం ప్రజలలో హెచ్చగుట చేత పత్రికా పఠనం గూడ హెచ్చయింది. అందుచేత మన పత్రిక చదువరులు బాగా హెచ్చారు. 2500 లో ప్రారంభమైన పత్రిక 5000 ల వరకు వెళ్ళింది.

పార్టీ సభ్యత్వం అభివృద్ధిగాలేదు. గాని, ఆగస్టు సంఘటనలో పార్టీ నిర్మాణమును అవిచ్ఛిన్నంగా నిలుపుకోగల్గుట గొప్ప విషయమే. ముగ్గురు, నల్గురు తప్ప రాష్ట్రం మొత్తం మీద పార్టీ సభ్యులెవ్వరూ పార్టీ నుండి బైటకు పోలేదు.

ప్రారంభంలో గాభరా పడినప్పటికిని, కొద్ది రోజులలోనే అరాచక చర్యలకు, ప్రభుత్వ నిర్బంధానికి వ్యతిరేకంగా నిలబడి పని చేయగల్గారు.

ఈ సమయంలో పార్టీ సభ్యులు ఒకే రాజకీయ పంథాతో పనిచేయడానికి "ప్రజాశక్తి" ఎంతేని తోడ్పడింది.

## అక్టోబరు రాష్ట్ర కమిటీ ప్లీనం సమావేశం నుండి లెనిన్ డే వరకు

**అక్టోబరు ప్లీనం ఫలితాలు :-** 1942 సెప్టెంబరులో సమావేశమైన కేంద్ర కమిటీ ప్లీనం ప్రజాయుద్ధ కాలాన్ని, జాతీయ సంక్షోభ దశను సింహావలోకనం చేసి, ఇదివరకు యివ్వబడిన నినాదాలను నూతన పరిస్థితుల కనుగుణ్యంగా పునరుద్ఘాటించింది. అంతేగాక యీ నినాదాలను ఆచరణలోనికి తేవడానికి, జాతీయైక్యతా ఉద్యమము సాగించడానికి స్పష్టమైన కార్యక్రమమిచ్చింది. పార్టీ నిర్మాణమునకు సంబంధించినంతవరకు ఈ ముఖ్య నినాదాలిచ్చింది. (1) కమ్యూనిస్టు పార్టీని ప్రజాపార్టీగా నిర్మించాలి. (2) పార్టీ నాయకత్వానికి తిరిగి శిక్షణ యివ్వాలి. 3) పార్టీ యూనిట్లను పార్టీ పద్ధతులలో పని చేయించాలి. అక్టోబరులో రాష్ట్ర కమిటీ ప్లీనం సమావేశమై పై నిర్ణయాలను అమలు జరపడానికి కార్యక్రమమిచ్చింది.

అక్టోబరు రాష్ట్ర కమిటీ ప్లీనం సమావేశం ఆంధ్ర పార్టీ జీవితంలో చరిత్రాత్మకమైనది. ఆ సమావేశపు నిర్ణయాల, కార్యక్రమ ఫలితంగా ఆంధ్ర రాజకీయ రంగంలోనూ, పార్టీ నిర్మాణములోను అద్భుతమైన ఫలితాలు గల్గాయి. ఆగష్టు సంఘటనలద్వారా ఆంధ్ర ప్రజానీకానికి జాతీయ రంగంలో గలిగిన నిస్పృహ నిస్తబ్దతలను పారదోలడానికి, మన పార్టీ ప్రజాపార్టీగా మారడానికి అవకాశమేర్పడింది. ప్రజారంగంలో పనిగూడ చాలా అభివృద్ధి అయింది.

ప్రతి సభ్యుడు, ప్రతి రంగానికి నిర్ణీత కోటాలను ఏర్పరచి నిర్ణీతకాలంలో పూర్తి చేయాలనే పద్ధతి అవలంబించడం అక్టోబరు ప్లీనంయొక్క విశేషం. ఈ పద్ధతివలన ప్రతి పార్టీ సభ్యుడు చురుకుగా పనిజేసేవాడుగా తయారవడమే గాకుండా, జాతీయ సంక్షోభమును తొలగించి, దేశాన్ని ముందుకు గొనిపోవడానికి ప్రస్తుతం మన పార్టీపైబడ్డ భారీ బాధ్యతలను తప్పక పార్టీ నిర్వహించే అవకాశం ఏర్పడింది. ఇప్పటినుండే మన పార్టీ పార్టీగా పనిజేయడం ప్రారంభమైంది.

**జాతీయైక్యతా వారం :-** ఆగష్టు సంఘటనల తదనంతరం అరాజకోద్యమం విఫలమైనదని ప్రజలు గ్రహించారు. కాంగ్రెసు ప్రజా సామాన్యం గూడ కాంగ్రెసు ఉద్యమం విఫలమైనదని తెలుసుకున్నారు. గాని దానికి కారణం

సక్రియైన ఆర్గనైజేషన్ లేకపోవడం అని భావించారు. నిస్పృహ చెంది కూర్చున్నారు. రాష్ట్ర జిల్లా కాంగ్రెసు నాయకులు, చోటా నాయకులు జైళ్ళకు పోవడం వలన, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు రహస్య యంత్రం ఫార్వర్డు బ్లాకు, రంగా ముఠా చేతుల్లో బడింది. వీరు రహస్య కరపత్రాల ద్వారా కమ్యూనిస్టులపై దూషణ, దుష్ప్రచారం, జపాన్ అనుకూలప్రచారం (బాంకాంగ్ సైగాన్ రేడియోలను వినమనే కరపత్రం) గావించుతూ హఠాత్తులైన కొంతమంది కాంగ్రెసు వాదులను జేరదీస్తున్నారు. ఇదే సమయంలో రంగా ముఠా రైతు సంఘాలను విచ్ఛిన్నంచేసే ప్రయత్నాలు చేస్తోంది. అ. భా. రైతుసంఘాన్ని రాష్ట్రమంతటా రైతు సంఘ నిర్మాణాన్ని రద్దు గావించుతూ నవంబరు 8వ తేదీన ప్రకటించారు. ఇందుకు కారణాలు రెండు వున్నాయి: 1. కాంగ్రెసు పేరిట జరుగుచున్న అరాచకోద్యమాన్ని, కాంగ్రెసు నాయకులు బైటలేని సమయంలో, ఆర్గనైజ్ చేసి, తద్వారా కాంగ్రెసు ప్రజాసామాన్యమును తన వైపుకు ఆకర్షించి కాంగ్రెసులో ప్రముఖ స్థానాన్ని ఆక్రమించుకోవడం 2. రైతు ఉద్యమములో కమ్యూనిస్టులు పనిజేస్తుండడం వలన రైతుల్లో తమకున్న స్థానం పోతుందనే భయంతో కమ్యూనిస్టుల కృషికి అడ్డంకులు గల్గించుట. వీనిని, రైతు సంఘ నిర్మాణమును రద్దు గావించి ఉద్యమాన్ని విచ్ఛిన్నం గావించుట ద్వారా సాధించాలని చూశారు.

ఈ ఆశయాలను యీడేర్చుకోవడానికి అ. భా. రైతు సంఘం యుద్ధం ఎడల, అరాచకం ఎడల అవలంబించే రాజకీయ పంథాను సాకుగా తీసుకొన్నారు. ఈ సాకు కాంగ్రెసు ప్రజాసామాన్యాన్ని, కాంగ్రెసులో ముఖ్య వర్కర్లను తమ వైపుకు ఆకర్షించడానికి బాగా పనికి వస్తుంది. తద్వారా కాంగ్రెసులో ముఖ్య స్థానాన్ని పొందడమనే తమ ఆశయాన్ని యీడేర్చుకోవచ్చు. ఈ ఆశయంతో, ఫార్వర్డు బ్లాకుతో కలిసి ఆంధ్ర రాష్ట కాంగ్రెసు రహస్య యంత్రాన్ని నడుపుటలో రంగా ముఠా కూడ కృషి చేస్తుంది.

విద్యార్థులలో విద్యార్థి వర్కర్లను మన వైపుకు త్రిప్పుకోగల్గాము. కాని వీరి చేత యింకా మన పంథాను పని చేయించజాలకున్నాము. విద్యార్థి ప్రజాసామాన్యం గూడా నిరుత్సాహ పడి వుంది. జాతీయ విద్యార్థి సంఘాల తరపున యింకా కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారం జరుగుతూనే వుంది.

ఈ పరిస్థితుల్లో మన రాష్ట్రంలో జాతీయైక్యవాదం ప్రారంభించాం. పార్టీ సభ్యులంతా ఒక్కరు కూడా మిగలకుండా యీ వారంలో పనిచేయడాని పూనుకున్నారు. ప్రభుత్వ నిర్బంధం దారుణంగా వుండడం చేత ఈ వారంలో జాతీయ నాయకులను విడుదలగావించాలని ప్రభుత్వానికి మహజర్లు పెట్టించడం, యింటింటికి పోయి జాతీయైక్యతావసరాన్ని గూర్చి ప్రచారంచేస్తూ ముస్లింలకు స్వయం నిర్ణయ

హక్కుయివ్వాలని హిందువులచేత, జాతీయ నాయకులను విడుదల చేయించుటకు జిన్నా పూనుకొని పనిజేయాలని ముస్లింములచేత మహజర్లపై సంతకాలు చేయించడం-ప్రచార పద్ధతులలో ముఖ్యమైనవి. ప్రథమ పర్యాయముగా జాతీయ సంక్షోభాన్ని తొలగించడానికి జాతీయైక్యత ప్రాముఖ్యతను, జాతీయైక్యతను సాధించడానికి కాంగ్రెసు ముస్లిం జాతుల స్వయం నిర్ణయ హక్కును గుర్తించడం ఎంత అవసరమో ప్రచారం జేయబడింది. రాష్ట్ర మొత్తంమీద (ప్రెస్‌కు రిపోర్టులు వచ్చినంతవరకు) 750 గ్రామాల్లో 1,25,000 మంది ప్రజల చేత ఈ మహజర్లపై సంతకాలు చేయించబడ్డాయి.

**ఫలితాలు :-** రాజకీయంగా రాష్ట్రంలో గొప్ప ఫలితం సాధించబడింది. ప్రజల్లోనూ, కాంగ్రెసు ప్రజా సామాన్యంలోను ఏర్పడ్డ నిస్పృహ, నిరుత్సాహం తొలగించబడింది. ప్రభుత్వంపై అమిత ద్వేషంవలనా, ఫార్వర్డు బ్లాక్ గావించే జపాన్ అనుకూల ప్రచారం ద్వారా కాంగ్రెస్ ప్రజా సామాన్యంలోనూ, హతాశులైన దేశభక్తులలోనూ గల్గిన జపాను అనుకూలభావాలు తొలిగిపోయాయి. దీనితో ఫార్వర్డు బ్లాక్ జపాన్ అనుకూలప్రచారానికి ఆధారం కొంతవరకు పోయింది. మన పార్టీ జాతీయైఖ్యత నినాదపు రాజకీయ ప్రాముఖ్యతను ప్రథమ పర్యాయంగా అర్థంచేసుకున్నారు. జాతీయ నాయకుల విడుదల కొరకు, దారి తెన్ను గానక, హతాశులై పడివున్న దేశభక్తులు అనేకమంది మనపార్టీ పాలసీయే సరియైన పంథా అని ప్రథమ పర్యాయంగా అంగీకరించడము ప్రారంభించారు. ఫార్వర్డు బ్లాక్ ప్రచారం ఎంత విద్రోహకరమైనదో తెలుసుకో గలిగారు. ఇంతవరకు రాజకీయంగా గాలియే సోకని ప్రజాసామాన్యంలో గూడ మన ప్రచారం వలన సంచలనం గల్గి ఆ ప్రదేశాల్లో పార్టీకి కొత్త కాంటాక్టులు ఏర్పడినాయి. జపాను ఫాసిస్టులు వస్తే స్త్రీలు పడే బాధల్ని గూర్చి ప్రచారం చేసినప్పుడు స్త్రీలలో ఆత్మరక్షణ జేసుకోవాలనే ఆవేశం మన ప్రచారం ద్వారా కలిగింది.

మొట్ట మొదటిసారిగా పార్టీ అంతా ఒక్కటీమ్ లాగా కదలింది. ఇదివరకెన్నడూ, ఎవరూ పోని ప్రదేశాలకు కూడ పోయి తీవ్ర ప్రచారం చేశారు. ఈ ప్రచార ఫలితంగా మన పార్టీ పాలసీ యొక్కటే దేశాన్ని జాతీయ సంక్షోభం నుండి రక్షించి స్వాతంత్ర్య పంథాను ముందుకు గొంపోతుందనే అకుంఠిత ఆత్మవిశ్వాసం పార్టీ సభ్యులలో కలిగింది. పార్టీ పాలసీని ఒకే పర్యాయం రాష్ట్రమంతటా స్వతంత్రంగా ప్రజలముందు పెట్టి పార్టీ ప్రత్యేక పాత్రను స్పష్టపరిచారు. ప్రథమ పర్యాయంగా పార్టి పేరుతో పార్టి ఫండు ప్రజా సామాన్యం నుండి వసూలు చేశారు. (సుమారు లక్ష)

లోపాలు :- "జాతీయైక్యతయే పోరాటం అనే నినాదంలో పార్టీ పాలసీ అంతా యిమిడి వున్నదనే భావాన్ని ప్రజల్లో ప్రచారం చేయజాలకపోయాం.

ప్రభుత్వానికి విన్నపముగా మహజర్లను పెట్టించడం సంతకాల ఉద్యమపు ఉద్దేశ్యంగాదని, అధికారాన్ని జారవిడవడానికి అంగీకరించని ప్రభుత్వ హస్తాల నుండి అధికారాన్ని గుంజుకోడానికి ప్రజాఐక్యతే ఆయుధమనీ, ప్రజలందరూ ఏకమై యీ మార్గాన నడుచుట నేటి ప్రధాన కర్తవ్యమనీ స్పష్టంగా ప్రజలకు చెప్పలేకపోయాము. మహజర్ల ఉద్యమం ప్రజా ఐక్యతను సాధించడానికి ప్రభుత్వం నిర్బంధాన్ని దారుణంగా వుపయోగిస్తున్నప్పుడు, ప్రజలు నిస్సహాయులై వున్నప్పుడు, ప్రథమ సోపానంగా అవలంబించామనియు, ఈ ప్రజా ఐక్యతను నిర్మించే ప్రయత్నాలు ఒక రాజకీయ ఉద్యమంగా జరుపుతూ వుండాలని చెప్పలేకపోయాము. ప్రజల నిత్య జీవితానికి సంబంధించిన సమస్యలపై ప్రజలు ఐక్యమై వాటి పరిష్కారానికి పూనుకోవడం ద్వారానే జాతీయైక్యత క్రమ క్రమేణా ఎలా సాధ్యమవుతుందో చెప్పలేకపోయాము. అందుచేత జాతీయైక్యత విప్లవ స్వభావాన్ని ప్రజలు గ్రహించేటట్లు చేయలేకపోయాం. ప్రజలు మన ప్రచారం వల్ల ఉత్తేజపూరితులై తమంత తాము కార్యాచరణకు పూనుకునేటట్లు చేయజాలకపోయాం.

జాతీయైక్యతా వుద్యమము వేరు ప్రజారంగాల పనివేరు, అనే ధోరణిలో పనిజేశాం. అందుచేతనే జాతీయైక్యతా వారంతోనూ తరువాతనూ మన పార్టీతో సంబంధం కలిగిన ప్రజలనందరినీ ఆయా ప్రజా సంఘాలలో సభ్యులుగా జేర్పించజాలకపోయాము.

**ప్రజారంగాలు : పార్టీ :-** అక్టోబరు రాష్ట్ర కమిటీ ప్లీనంలో ప్రతి రంగానికి లెనిన్ డే లోపల పూర్తిచేయవలసిన నిర్ణీత కోటాలు తీసుకోబడ్డాయి. ప్రజా సంఘాలను ఆర్గనైజుడుగా అభివృద్ధి జేయడానికి నిజమైన ప్రయత్నం పార్టీ సభ్యులందరిచేత యిప్పటినుంచే ప్రారంభించబడింది. దీని ఫలితంగా ప్రజా రంగాలు బాగా అభివృద్ధి పొందాయి.

**రైతు రంగం :-** రంగా ముఠా విచ్ఛిన్న ప్రయత్నాలు తీవ్రంగా జేసినప్పటికిని ఆంధ్ర రాష్ట్రమంతటా రైతు సంఘాలను పునర్నిర్మించాం. రాష్ట్రం మొత్తం మీద 56000 రైతు సంఘ సభ్యత్వం 1720 గ్రామాల్లో 4 మాసాలలో చేర్పించగలిగాము. 1434 ప్రాథమిక సంఘాలను స్థాపించాం. జిల్లా, రాష్ట్ర రైతు సంఘాలను సక్రమమైన ఆఫీసులతో పునః స్థాపించి రాష్ట్రమంతటా రైతు సంఘాల పనిని సమన్వయం చేయగలిగాం. అయినప్పటికిని రంగా గ్రూపుకు రైతుల్లో అస్పష్టమైన పలుకుబడి తగినంతగానే వుంది. రైతుల దైనందిన

యిబ్బందులను నివారించుటకు రైతు సంఘాలు పూనుకొని పనిచేయకపోవుట చేత మన పార్టీ రైతాంగానికి రాష్ట్రం మొత్తంమీద నాయకత్వం వహించజాలకపోయింది. స్థానికంగా ఇలా పనిజేసేచోట్ల ప్రజానాయకులుగా రైతు సంఘాలలో పనిజేసే మన పార్టీ సభ్యులు తయారయ్యారు.

రైతు సంఘాల కార్యకర్తలకు ఎలా పనిచేయాలో తర్ఫీదు యివ్వడం గాని, రైతు సంఘాలలో పార్టీ నిర్మాణమును అభివృద్ధి చేయకపోవడం గాని మరొక లోపం.

**విద్యార్థి ఉద్యమం :-** జాతీయైక్యతా వారంలో విద్యార్థుల్లో మనపార్టీ పాలసీని విశదపర్చుతూ సాగించిన ప్రచారంలో మన విద్యార్థి కేడర్లు బాగా పనిజేశాయి. మన పాలసీ అంటే బాగా విశ్వాసం గలిగింది. అత్యాచకోద్యమము ద్వారా నూతనంగా రాజకీయ చైతన్యం పొంది ముందుకు వచ్చిన విద్యార్థి కేడర్లను మాత్రం యింకా రాజకీయంగా మనవైపుకు త్రిప్పుకోలేదు. జాతీయైక్యతా వారంలో సాగించిన ప్రచార ఫలితంగా విధ్వంసక చర్యలు ఫాసిస్టు దాస్యానికి దారితీస్తాయని మాత్రం వీరిలో చాలామంది గ్రహించారు. విద్యార్థి ప్రజా సామాన్యంలో గలిగిన రాజకీయ నిరుత్సాహాన్ని కొంతవరకు తొలగించగలిగాము.

ఆగష్టు ఉద్యమంలో నూతనంగా రాజకీయ రంగంలోకి వచ్చిన, చురుకుగా పనిజేస్తున్న విద్యార్థి వర్కర్లను రాజకీయంగా మన వైపుకు త్రిప్పుకోవాలని అక్టోబరు ప్లీనంలో యివ్వబడిన ప్రధాన కర్తవ్యం మాత్రం నిర్వహించబడలేదు. సభ్యత్వం మాత్రం 5000 నుండి 7675 వరకు పెరిగింది. పార్టీ సభ్యత్వం 54 నుండి (ఆగష్టు సంఘటనలకు ముందు) 124 వరకు పెరిగింది.

విద్యార్థుల దైనందిన కోర్కెల కొరకు గూడ కృషి చేయడం ప్రారంభించాము డిటెన్షన్ రద్దు కొరకు, కిరసనాయిల్, కాగితం సప్లయి కొరకు విద్యార్థి సంఘాల ద్వారా పనిజేశాం. విజ్ఞాన ప్రచార పద్ధతులను గూడ అవలంభించి విద్యార్థులను బాగా ఆకర్షించాం. కాని యిందులో కొంత డీవియేషన్ గూడా వుంది. కొన్ని జిల్లాలలో రాజకీయంగా పనిజేస్తే విద్యార్థులను ఆకర్షించడం కష్టమనే వుద్దేశంతో ఎకనామిస్టు పంథా అవలంబించాం. రాజకీయంగా విద్యార్థులను మన వైపుకు త్రిప్పుకోంది జాతీయ విద్యార్థి సంఘాలకు విద్యార్థి లోకంలో ఆధారం లేకుండా చేయలేమనే రాజకీయ దృక్పథాన్ని వదలివేశాం.

**యువజనోద్యమము :-** ఇంతకుముందు ఒక కృష్ణా జిల్లాలోనే యువజన సంఘాలకు యువక ప్రజాసామాన్యంతో సంబంధముండేది. 1942 ఏప్రిల్ తరువాత నుండి యువజన సంఘాల్లో గుంటూరు, పశ్చిమ గోదావరి జిల్లాలో

గూడ ఆటల కార్యక్రమము, వైజ్ఞానిక ప్రచార పద్ధతులు ప్రవేశపెట్టబడ్డాయి. దానితో గుంటూరు జిల్లాలో కూడ యువజన సంఘాలు యువక ప్రజా సామాన్యాన్ని ఆకర్షించాయి. వైజ్ఞానిక ప్రచారం పద్ధతులు క్రొత్తవి అనేకం ప్రవేశపెట్టబడ్డాయి. దీనితో రాష్ట్రంలో యువజన సభ్యత్వం 400 గ్రామాల్లో 14729 వరకూ చేర్పించబడింది.

రాష్ట్రమంతటా యువజనోద్యమానికి ప్రమాదంగా పరిణమించుచున్న రాష్ట్రీయ స్వయంసేవక సంఘాల వ్యాప్తిని అరికట్టడానికి ఆర్య వైశ్య యువ జన సంఘం వగైరా కుల యువజన సంఘాలను ఆకర్షించడానికి ప్రయత్నం జేయాలని ప్రథమ పర్యాయంగా నిర్ణయింపబడింది. కాని ఈ నిర్ణయాన్ని అమలు జరుపడానికి కృషి చాల నామ మాత్రంగానే చేయబడింది. యువజన సంఘాలు ఆటపాటలద్వారా వైజ్ఞానిక ప్రచారపద్ధతులద్వారా యువ ప్రజాసామాన్యాన్ని బాగా ఆకర్షించడానికి తీవ్ర ప్రయత్నాలు ముఖ్య జిల్లాలన్నిటిలో చేయబడ్డాయి. దానివలన యువజనోద్యమానికి జాతీయ యువజన సంఘాలద్వారా వచ్చే ముప్పును చాలమట్టుకు తొలగించగల్గాం.

వ్యవసాయ కూలీ రంగం :- వ్యవసాయ కూలీ ఉద్యమము ప్రచార ఆందోళన దశలనుండి వ్యవసాయ కూలీల దైనందిన కోర్కెల కొరకు పని జేయడం ప్రారంభించింది. ఈ విధంగా చాల కొద్ది ప్రవేశాల్లో మాత్రమే జరిగింది. (కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి) తూర్పు గోదావరి జిల్లాలో ఆగష్టు సంఘటనలకు పూర్వం తిన్న దెబ్బనుండి యింకా కోలుకోలేదు.

సాగు కాని బంజరు భూములను వ్యవసాయ కూలీలకు సాగుకిప్పించుట, కరువురోజుల్లో వ్యవసాయ కూలీలకు రైతులచేత ధాన్యం అప్పుగాను, ఉచితంగానూ యిప్పించి కరువు, దోపిళ్లు లేకుండా చేయుట, ధాన్యపు ధరల పెరుగుదల ననుసరించి కూలీరేట్లను హెచ్చించుటకు రైతుల్లో కృషి చేయుట. యివి వ్యవసాయ కూలీ సంఘాల తరఫున రైతు సంఘాల సహకారంతో గావించిన ముఖ్యపనులు. కాని కృష్ణాజిల్లాలో తప్ప తక్కిన జిల్లాలలో ప్రయత్నం జరిగినా వీటిని ప్రాముఖ్యంగా తీసుకుని పనిచేయజాలకపోయారు కృష్ణాజిల్లాలో కామ్రేడ్సు గావించినకృషివలన గ్రామాల్లో వ్యవసాయ కూలీ ఉద్యమం అంటే రైతులు సానుభూతితోనే చూడడం ప్రారంభించారు. వ్యవసాయ కూలీలు గావించిన పై కృషి వలన రాష్ట్రంమొత్తం మీద వ్యవసాయ కూలీసంఘ సభ్యత్వం 210 గ్రామాల్లో 13600 వరకూ జేర్పించబడింది.

గ్రామైక్యతకు వ్యవసాయ కూలీ సామరస్యమే పునాదిగా చెయ్యాలనే అక్టోబరు ప్లీనం ప్రధాన కర్తవ్యాన్ని చాల తక్కువగా నిర్వహించారు. ఒక కృష్ణా

జిల్లాలో తప్ప దీనిని ప్రధానంగా తీసుకోలేదు. అచ్చటగూడ పార్టీకి రైతుల్లోను, కూలీల్లోను వున్న బలానికి తగినట్లుగా కృషి చేయజాలకపోయారు.

కార్మిక రంగం :- ఆంధ్ర రాష్ట్రంలోని కార్మికోద్యమాన్ని ప్రారంభం నుండి పార్టీయే నిర్మించింది. రైల్వే, జూట్, ప్రెస్, మున్సిపల్, పొగాకు, హార్బరు కార్మికుల్లో పార్టీ సభ్యులు పనిచేస్తున్నారు. ప్రారంభంనుండి, కార్మికుల్లో రాజకీయ చైతన్యం కలుగజేయడానికన్నా ఆర్థిక హక్కుల కొరకు పనిజేయడానికే పార్టీ సభ్యులు పనిచేశారు. అందుచేత కార్మికుల్లో పార్టీ సభ్యత్వం పెరగడం గాని, రాజకీయ చైతన్యం గల్గడం గాని, అధమము ట్రేడ్ యూనియన్లు రెగ్యులరుగా పనిజేయడానికి తగిన ట్రేడ్ యూనియన్ కేడర్లు గాని అభివృద్ధి కాలేదు.

పార్టీ సభ్యులు యుద్ధ అలవెన్సుల కొరకు, చౌక డిపోల కొరకు, యింకా యితర ఆర్థిక హక్కుల కొరకు పనిజేస్తూ వుండడం వలన ట్రేడ్ యూనియన్ సభ్యత్వం మాత్రం 22200 (రైల్వేతో సహా) వరకూ పెంపొందింది. రాష్ట్ర మంతటా ముఖ్య.పట్టణాలలో మున్సిపల్ కార్మికులకు మన కృషి ఫలితంగా యుద్ధ అలవెన్సులు రూ. 4-8-0 ల వరకూ తెప్పించాం తతిమ్మా పరిశ్రమలలో గూడ యుద్ధ భృతులు కొంతవరకు సంపాదించాం.

రైల్వే పని వారిని, రేవు పనివారిని, నూటికి 80 మందికి పైగా మిలిటరీ యూనిట్సులో జయప్రదంగా చేర్పించాము.

ప్రధానలోటు, పార్టీ ఉత్పత్తి విధానం గూర్చి ఏమీ చెప్పక పోవడం, దేశ రక్షణ కొరకు ఉత్పత్తిని కుంటుపడకుండా సాగించడం కార్మికుల ప్రథమ జాతీయ కర్తవ్యమని వాళ్ళలో ప్రచారం చెయ్యలేదు. కార్మికుల కోర్కెలను యజమానులు, ప్రభుత్వం యీడేర్చితేనే ఉత్పత్తిని హెచ్చు చేయడానికి వీలవు తుందనే దృక్పథంతోనే కామ్రేడ్సు పనిచేశారుగాని, దేశ రక్షణను జయప్రదంగా సాగించడానికి, ఉత్పత్తిని ఎన్ని అడ్డంకులు వచ్చినా కుంటుపడకుండా సాగించడం కార్మికుల ప్రధాన కర్తవ్యం అని ధైర్యంగా ప్రచారం చేయజాలక పోయారు. దాని ఫలితంగా కార్మికుల్లో వెనుకటి మాదిరిగానే రాజకీయ చైతన్యం అభివృద్ధి గాలేదు. దానితో పాటు పార్టీ సభ్యత్వం హెచ్చుగా పెంపొందలేదు.

మహిళా రంగం:- ఒక కృష్ణా జిల్లాలోనే వుండే మహిళా ఉద్యమము యితర జిల్లాలకు కూడా ప్రాకింది. అక్టోబరు ప్లీనం అయిన తరువాత జపాన్ ఫాసిస్టు దుండగీడుల నుండి తమను, తమ పిల్లలను, తమ దేశాన్ని రక్షించుకో డానికి మహిళలకు కామ్రేడ్ సుందరయ్య ఆంధ్ర కమిటీ తరపున యిచ్చిన విజ్ఞాపన ఆంధ్ర మహిళా ఉద్యమంలో ఒక అద్భుతమైన మార్పును గొని వచ్చింది. దానితో పార్టీ కామ్రేడ్స్ భార్యలు, అక్కచెల్లెండ్రు రాజకీయ చైతన్యం పొంది

మహిళా సంఘాలల్లో పనిజేసేవారు ముందుకు వచ్చి తమ ఆత్మరక్షణకు పూను కున్నారు. ఈ సంచలనాన్ని సంఘటిత పర్చడానికి, ఆంధ్ర కమిటీ తరపున ఒక మహిళా క్యాంపు 1943 జనవరిలో పెట్టబడింది. దానిలో గుంటూరు, కృష్ణా, పశ్చిమ గోదావరి, నెల్లూరు, తూర్పు గోదావరి జిల్లాల మహిళా వర్కర్లకు ట్రెయినింగు యివ్వబడింది. తత్ఫలితంగా గుంటూరు జిల్లాలో బాగాను, పశ్చిమ తూర్పు గోదావరి జిల్లాలలో కొద్దిగాను మహిళా సంఘాలు ఏర్పడ్డాయి. కేవలం జపాన్ వ్యతిరేక ప్రచారమే గాకుండా, స్త్రీల దైనిక యిబ్బందుల (పాయిఖానా సౌకర్యాలు కలుగజేయడం, సాంఘిక దురాచారాలు గూర్చి ప్రచారం, పత్రికా పఠనం వగైరా) ను తీసుకుని స్త్రీలలో పనిచేయడం వలన కృష్ణా జిల్లాలో వలె, గుంటూరు జిల్లాలో గూడ మహిళా ఉద్యమము వ్యాపించే అవకాశాలు గల్గాయి. రాష్ట్రం మొత్తం మీద 124 గ్రామాల్లో 4200 మంది సభ్యులను జేర్పించగల్గారు. పార్టీ సభ్యత్వం గూడ 20 వరకు పెరిగింది.

## ఆహార సమస్య - ప్రజా రక్షణ దళాలు

ఆంధ్ర దేశంలో ప్రథమ పర్యాయంగా 1941 నవంబరులో ఆహార సమస్య తీవ్రమైంది. కొన్ని పట్టణాలలో కరువు దోపిళ్ళు గూడ వచ్చాయి. కాని క్రొత్త పంటలు వచ్చేసరికి ధరలు తగ్గిపోయి తాత్కాలికంగా వచ్చిన ఆహార కరువు లేకపోయింది. జపాన్ యుద్ధంలోకి ప్రవేశించిన అనంతరం ఆగష్టు సంఘటనలు వచ్చిన తరువాత ఆహార సమస్య మరల బాగా తీవ్రమైంది. ఆహారపు ధాన్యాల ధరలు అన్నీ విపరీతంగా పెరిగిపోయాయి. తిండి దొంగలు, అధిక లాభాలు గుంజేవాళ్ళు హెచ్చు అయ్యారు. జాతీయ సంక్షోభంతో ఆర్థిక సంక్షోభం కూడ అంతర్భూతమై పోయింది. పట్టణాలలో సామాన్య ప్రజలకు ఆహార పదార్థాలు అందుబాటులో లేకుండా పోయాయి. ఈ పరిస్థితులలో మన పార్టీ కామ్రేడ్సు ముఖ్యంగా పట్టణాలలో చౌకడిపోలను స్థాపింపజేయడానికి తీవ్ర కృషి జేసి దాదాపు అన్ని ముఖ్య పట్టణాల్లో జయము పొందారు. గ్రామాల్లో గూడ పార్టీ సభ్యులకు పలుకుబడి వున్న గ్రామాల్లో వ్యవసాయ కూలీలకు ఉచితంగా రైతుల చేత ధాన్యం యిప్పించడానికి కృషి చేశారు. గ్రామాల్లో మన కామ్రేడ్సు యీ కృషి వలననే, 1942 వ సంవత్సరం కరువు రోజుల్లో గ్రామాలు దోపిళ్ళకు గురిగాకుండా జేయ గల్గాము. తాత్కాలికంగా నెత్తిమీదకు వచ్చినపుడు మాత్రమే యిలా చేశాము గాని ధీర్ఘదృష్టితో ఆహార సమస్యను పరిష్కరించడాన్ని రాష్ట్రమంతటా ప్రధాన కర్తవ్యంగా తీసుకుని పని చేయలేదు. ఇలా చేయడమే జాతీయైక్యతను ఆచరణలో నిర్మించడమనేది గుర్తించలేదు. అందుచేత ఆహార కమిటీలు పెట్టడంగాని ప్రజారక్షణ దళాలను ఏర్పరచడంగాని

చేయలేక పోయాము. ప్రజా రక్షణ దళాలు పెట్టిన చోట్లగూడ నామమాత్రంగా వున్నాయి గాని పనిచేయలేదు.

అధికాహారోత్పత్తికి కొంతవరకు కృషి చేశాం. కొన్ని పోరాటాలు గూడ నడిపాం. (మంగళాపురం) రాష్ట్రం మొత్తంమీద సుమారు 3000 ఎకరాలు సాగు చేయించాం. కాని ప్రభుత్వ సహకారం లేకపోవుటచేత పూర్తిగా జయప్రద మవ్వలేదు. ఈ విషయములో కొంత సెక్టేరియన్‌గా పని చేయడం వలన జమీందార్లు గ్రామ రైతుల సహకారం పొందలేకపోయారు. తత్ఫలితంగా ఇతర వర్గాల సహకారం లేకుండా ఒంటరిగా పార్టీ సభ్యులు పనిచేయడం వలన హెచ్చుగా ఫలితాలు లభించలేదు.

## విమానదాడి రక్షణ దళాలు

పౌర రక్షణలో పాల్గొనడానికిగాను విమాన దాడి రక్షణోపాయాలను ప్రజలకు నేర్పడానికి ఎ. ఆర్. పి దళాలు తర్ఫీదు చేయబడ్డాయి. రాష్ట్రసంఘం తరపున గుంటూరు, కృష్ణా, పశ్చిమ, తూర్పు గోదావరి, నెల్లూరు జిల్లాలలోను విమానదాడి రక్షణ శిబిరాలు పెట్టబడ్డాయి మొత్తంమీద సుమారు 60 విమాన దాడి రక్షణ దళాలు తయారు చేయబడ్డాయి. ఈ దళాలు ఆయా ప్రదేశాల్లో గ్రామాలలో, పట్టణాలలో ప్రజలకు విమానదాడి రక్షణోపాయాలు నేర్పాయి. విమానదాడి రక్షణ ప్రదర్శనాలు గావించాయి. ఇవి ప్రజలను బాగా ఆకర్షించాయి ముఖ్యంగా మంటలనార్పు దళాలు మంటల నార్పుటలో ప్రజలకు తోడ్పడి వారి మన్ననను పొందాయి.

కాని తరువాత మనం యీ పనిని కొనసాగించలేదు ట్రెయినింగు యివ్వడం ఆపివేశాం. ఇది కొంతవరకు విమానదాడి ప్రమాదం తప్పిపోయిందనే ప్రజల్లో ఏర్పడిన భ్రమకు అలసత్వానికి ప్రతిబింబమే- ఏ. ఆర్. పి. ప్రచారంలో భాగాలైన మంటలనార్పే దళాలను ప్రథమ చికిత్స దళాలను వృద్ధి చేయక పోవడం క్షంతవ్యం కాదు.

## పార్టీ నిర్మాణము

అక్టోబరు ప్లీనం సమావేశానంతరం పార్టీ నిర్మాణములో చాలా ముఖ్యమైన ఫలితాలు గల్గాయి. పార్టీ సభ్యత్వం 738 నుండి 1078 వరకు పెరిగింది. అన్నిటి కన్నా ముఖ్యమార్పు పార్టీసభ్యులలోవచ్చిన చైతన్య ఫలితంగా నూటికి 40 వంతులు పార్టీకి సర్వకాలం పనిజేసేవారుగ తయారయ్యారు చాలామంది తమ ఆస్తులను సర్వస్వం పార్టీకిచ్చారు పార్టీ హోల్‌టైమర్సు సంఖ్య 429 వరకు పెరిగింది.

పార్టీ నిర్మాణంలో పై విధంగా గల్గిన ఫలితాలు పార్టీ స్వభావాన్నే పూర్తిగా మార్చివేశాయి. పార్టీ నేడు యేకొద్దిమందితో గూడిన ఒక ముఠాగాను ఆంధ్ర రాజకీయరంగంలో ప్రధాన రాజకీయ శక్తిగా వుంది. రాజకీయాలే వృత్తిగా గల్గిన హోల్‌టైమర్సు మన పార్టీలో వున్నంత సంఖ్య ఆంధ్ర దేశంలోని మరే యితర రాజకీయ సంస్థలోనూ గూడ లేదు. ఈ ప్రధాన మార్పు పార్టీ స్వభావాన్ని మార్చడమేగాక, ఆంధ్ర రాజకీయాలతో పార్టీ ప్రధానమైన పాత్రను వహించే అవకాశం గలిగింది.

కాని పార్టీ నిర్మాణములో యింక లోపాలు లేకపోలేదు. కార్మికవర్గం నుండి హెచ్చు మంది పార్టీ సభ్యులను తయారుజేయలేదు. అందుచేత కార్మిక వర్గ ఆధారం యింకా పార్టీకి ఏర్పడలేదు. విద్యార్థుల నుండి, మహిళల నుండి గూడ పార్టీలోకి నూటికి 12 మందే వచ్చారు. పార్టీ మొత్తపు విజ్ఞానస్థాయి హెచ్చాలంటే విద్యార్థులనుండి యింకా హెచ్చుగా పార్టీ సభ్యులను సంపాదించాలి.

అన్నిటికంటే ముఖ్య లోటు పార్టీ రాష్ట్రమంతటా బలిష్టంగా లేదు. పార్టీ సభ్యత్వంలో నూటికి 50 వంతులు కృష్ణా జిల్లాలో వుంది. కృష్ణా, గుంటూరు జిల్లాలలో నూటికి 70 వంతులు సభ్యులున్నారు. ఈ విధంగా పార్టీ అభివృద్ధి విపరీత అసమానత్వంతో కూడుకొని వుంది. ఈ అసమానత్వం వలన పార్టీ స్థానికంగా మాత్రమే బలంగా వుందిగాని, రాష్ట్రం మొత్తంమీద ప్రజా నాయకత్వం వహించేంతటి స్థితిలో లేదు.

## పార్టీ ఫండు - పార్టీ పత్రిక

పార్టీ ఫండు రాష్ట్రం మొత్తం మీద లెనిన్ డే నాటికి సుమారు లక్ష వరకు వసూలు చేశాం. హెచ్చు భాగం పార్టీ సభ్యులే యిచ్చారు పార్టీ సభ్యులు గావించిన త్యాగాల ఫలితంగా పార్టీ ప్రతిష్ట ప్రజల్లో బాగా హెచ్చింది. బ్రిటీషు ప్రభుత్వం నుండి డబ్బు తీసుకుంటున్నారనే ఫార్వర్డు బ్లాక్ దుష్ప్రచారానికి అక్షరాల ఎచ్చటా స్థానం లేకుండా పోయింది. ఇదివరకు ఏ కొద్ది మంది ఉత్తమ పార్టీ సభ్యులు గావించే త్యాగం ఇప్పుడు పార్టీ సభ్యులలో చాలా భాగానికి సామాన్య విషయమైనది. ఇందువలన పార్టీ సభ్యుల త్యాగ ప్రమాణం చాలా హెచ్చు స్థాయిలలోకి వెళ్ళి అ.భా. పార్టీకే ఆదర్శప్రాయమయింది.

కాని ఒక ముఖ్యలోటు జరిగింది. వసూలైన పార్టీ ఫండు చాలా కాలం వరకు పార్టీ ఖర్చులకు వస్తుందనే దృష్టితో రెగ్యులర్‌గా పార్టీ ఖర్చులకు వసూలు చేసే పద్ధతిని మానివేసి, ప్రతి జిల్లా కమిటీ లెనిన్ డే ఫండుపైన ఆధారపడి కూర్చుంది. ఇలా చేయడం పార్టీని నిర్మించడం గాను, ధ్వంసం చేయడం.

పార్టీ పత్రిక అమ్మకంలో అద్భుతమైన ఫలితాలు వచ్చాయి. 5000 నుండి 9000 వరకూ పత్రిక అమ్మకం పెరిగింది. పార్టీపై ఫార్వర్డు బ్లాకు, రంగా ముఠా, ఛోటా కాంగ్రెసు నాయకుల దుష్ప్రచారమున్నా, పార్టీ వివిధ రంగాల్లో గావించిన కృషి ఫలితంగా పై ఫలితం సాధించాం.

జాతీయ నాయకుల విడుదల, తదితర రాజకీయ ఖైదీలను గూర్చి పత్రిక ద్వారా తీవ్ర ఆందోళన చేయబడింది జమీందారు రైతుల, కూలీల మధ్య జరిగిన పోరాటాలలో రైతుల, కూలీల పక్షం వహించి పత్రిక తీవ్ర ఆందోళన గావించింది. అధిక పంటల వుత్పత్తి విషయమై, ప్రజలు ప్రభుత్వ ప్రకటనలను ఉపయోగించుకొని ఎలా బంజరు భూములను సాగుచేయించాలో ప్రచారం చేసింది. రైతులకు అధిక పంటలు పండించే మార్గం చూపెట్టింది. అధిక ధరల సమస్యా పరిష్కారాన్ని గురించి ఆందోళన గావించుతూ ప్రచారం గావించింది.

పత్రిక, ఆందోళన, ప్రచారాలకు సంబంధించినంతవరకూ కర్తవ్యాన్ని నెరవేర్చింది గాని, ఉద్యమాలను నిర్మించడానికి వాటికి దినదినమూ సూచనలివ్వ సక్రమంగా జరుగలేదు. పార్టీ ఆర్గనైజరుగా బాగా పనిచేయలేదు.

పట్టణాల్లో హెచ్చు భాగం పత్రిక అమ్మకానికి బజారు అమ్మకాల మీద ఆధారపడ్డారు. కాని హెచ్చు భాగం బాకీలు చెల్లించారు గాని బజారు అమ్మకాన్ని చందా దారులగా మార్చడానికి ప్రయత్నించలేదు.

**ఫలితాలు :-** మన పార్టీ పై విధంగా గావించిన కృషి ఫలితంగా, ఆంధ్ర దేశ రాజకీయ జీవితంలో నూతన అధ్యాయం ప్రారంభమైంది. ఆంధ్ర దేశ రాజకీయ రంగంలో ఒక ప్రధాన శక్తిగా తయారై, ప్రజల జీవితానికి సంబంధించిన ప్రతి విషయంలోను మనపార్టీ జోక్యం కలుగజేసుకొని ప్రజలకు మార్గం చూపెట్టగల శక్తి పార్టీకి లభించింది ఆంధ్ర దేశంలో యే యితర రాజకీయ పక్షానికంటే గూడ పార్టీ రాజకీయంగాను, నిర్మాణరీత్యా నేడు బలంగా వుంది కాంగ్రెసుకు పార్టీకంటే ప్రజాపలుకుబడి వుంది గాని నిర్మాణరీత్యా మన పార్టీ కాంగ్రెసు సంస్థ కంటే బలంగా వుంది. ఏ కొద్దిమంది యువకులతో గూడిన ముఠాగా గాకుండా, ప్రజలకు అన్ని రంగాలలోనూ మార్గదర్శకంగా వుండి నాయకత్వం వహించాల్సిన స్థితిలోనికి పార్టీ ప్రవేశించింది ప్రజాపార్టీగా మారుతోంది.

**మన బలహీనతలు :-** కొన్ని ప్రాంతాల్లో ప్రజా సంఘాలు ప్రజల దైనందిన కోర్కెలకొరకు కృషిజేస్తున్నా, మొత్తంమీద ప్రజా రంగాలలో మనం ఇంతవరకు గావించిన కృషి ఆందోళన, ప్రచారస్థాయి దాటలేదు. మనం గావించిన

ప్రజా సంస్థల నిర్మాణం గూడ నిజమైన నిర్మాణం కాదు కేవలం నిర్మాణం యొక్క అస్థిపంజరము మాత్రమే ప్రజా సంఘాలు స్థానిక ప్రజా ఇబ్బందులను తీసుకొని వాటి నివారణ కొరకు కృషి చేయగల నిర్మాణయుక్తంగా లేవు. ప్రజా యిబ్బందులను నివారించడానికి. ప్రస్తుతం మనం నిర్మించిన నామకః ప్రజా సంఘాలు పూనుకోకపోతే ప్రజా ఉద్యమము ఇంక హెచ్చుస్థాయికి పోజాలక పోవడమే గాకుండా, వున్న కాస్త ఉద్యమము గూడి విచ్ఛిన్నమవుతుంది.

రాజకీయంగానూ, నిర్మాణయుక్తంగాను, మనపార్టీ తదితర ఏ రాజకీయ పక్షానికన్నా గూడ బలముగా వున్నప్పటికిని, అన్ని గ్రూపులు మనకు వ్యతిరేకంగానే యింకా పనిజేస్తున్నాయి. అందుచేత యీ గ్రూపు పలుకుబడి నుండి ప్రజలను తప్పించనిదే, మన పార్టీ పాలసీతో ప్రజలు గట్టిగా పనిజేయడానికి పూనుకోనిదే పార్టీ నిర్మాణయుక్తంగానూ, రాజకీయంగానూ స్థిరంగా బలబడజాలదు.

# అధ్యాయము - 7

# 1943 లెనిన్ డే నుండి యిప్పటి వరకు

**లెనిన్ డే రాష్ట్ర కమిటీ ప్లీనం సమావేశం:-** అక్టోబరులో జరిగిన రాష్ట్ర కమిటీ ప్లీనం సమావేశంలో యిచ్చిన కార్యక్రమాన్ని ఎంతవరకు నెర వేర్చిందో పరిశీలించి, ముందు కర్తవ్యాలను నిర్ణయించడానికి యీ సమావేశం జరుపబడింది. ఈ సమావేశం యిచ్చిన ముఖ్య రాజకీయ, నిర్మాణ బాధ్యత లేమి?

ఆంధ్ర రాష్ట్రంలో కూడ 1942 డిసెంబరు నుండి ఆహార సమస్య మరీ తీవ్రమయింది. దీనితోపాటు కిరసనాయిల్, అగ్గిపెట్టెలు, పంచదార, బట్టలు వగైరా అత్యవసర జీవితావసరాలు కూడ ప్రజలకు అందుబాటులో లేకుండా పోయాయి. ధరలు 4 లేక 5 రెట్లు పెరగడమే కాకుండా మార్కెట్‌లో నుండి యీవస్తువులు మాయమయ్యాయి. అందుచేత యిదివరలో పట్టణాలనే ఆవరించి యున్న ఆహార సమస్య గ్రామాలకు కూడా వ్యాపించింది. గ్రామ ప్రజలందరూ యీ సమస్యను గురించి తీవ్ర ఆందోళన పడుతున్నారు. ఆంధ్రదేశంలో జాతీ యైక్యత కొరకు పనిజేయడమంటే, ఆహారపదార్థాలను తదితర జీవితావసరాలను ప్రజలకు అందజేయడానికి ప్రజలను సమీకరించి ఐక్యపర్చడమే ప్రధాన విషయ మయింది. అందుచేత లెనిన్ డే ప్లీనం ఆహార సమస్యా పరిష్కారం కొరకు ప్రజలను ఐక్యపర్చడం, అందుకు ఆహార కమిటీలను, ప్రజా రక్షణ దళాలను పల్లెలలోనూ, పట్టణాలలోను ఏర్పరచడం. ఆహార డిపోలవద్ద ప్రజలందరకూ ధాన్యం సరఫరా అయ్యేటట్లు, శాంతి కాపాడబడేటట్లు చూడ్డం ప్రధానంగా చేయ వలసిన కర్తవ్యమని నిర్ణయించింది. జాతీయైక్యతా వుద్యమాన్ని ప్రజలు దైనందిన కోర్కెలు, ఆహార సమస్య అధిక ధరల అలవెన్సు మొదలయిన వాటితో కలిపి సాగించక, విడివిడిగా సాగించడమును పూర్తిగా మానివేయాలని ఆదేశించింది. అంతేగాకుండా యీ కార్యక్రమమంతా ప్రజా సంస్థల ద్వారా చేసి, వాటిని చురుకుగా పనిజేసే సంస్థలుగాను, ప్రజాధారముగల వాటిగను తయారు చేయాలని స్పష్టం జేసింది. ఆంధ్రదేశం ప్రధానంగా వ్యవసాయక వస్తువులను ఉత్పత్తిజేసే రాష్ట్రమగుటచేత, దేశరక్షణ కొరకు వుత్పత్తిని అభి వృద్ధి చేయాల్సిన జనరల్ కర్తవ్యాన్ని నిర్వహించడానికి, అధికపంటలను

ఉత్పత్తి చేయడానికి,సాగులోలేని భూములను సాగుచేయడానికి రైతులు, కూలీలు పూనుకోవాల్సి వుంటుంది. దీనిని కూడ స్పష్టపరిచింది.

ఈ రాజకీయ బాధ్యతలను నిర్వహించడానికి పార్టీ నిర్మాణ రీత్యా యే కర్తవ్యాలు నిర్వహించాలో గూడ తెల్పింది పార్టీని ప్రజా పార్టీగా తయారుజేయడానికి ముఖ్య అడ్డంకుగా పార్టీలో వున్న ప్రాప్తకాలజ్ఞతను రూపు మాపాలని తెలిపింది. నాయకత్వానికి ఆర్గనైజర్లుకు పార్టీ పాలసీ గూర్చి, జాతీయైక్యతా ఉద్యమాన్ని సాగించాల్సిన నూతన పంథాను గూర్చి, ప్రజాపార్టీని నిర్మించే విధానాన్ని గూర్చి తిరిగి శిక్షణ యివ్వడం వెనువెంటనే చేయాల్సిన పని అనియు అందుకు ఆర్గనైజర్ల స్కూళ్ళు నడపాలని నిర్ణయించింది. అంతేగాకుండా పార్టీ పద్ధతులలో పనిచేయించడానికి తగిన బందోబస్తు రాష్ట్ర జిల్లా కమిటీలు ఏర్పాటుచేసే పార్టీ నూతన పరిస్థితుల్లో దాని బాధ్యతలు నిర్వహించుతుంది. అని స్పష్టం జేసింది.

ఈ కర్తవ్యాలను నిర్వహించడానిక వివిధ రంగాలకు జిల్లాల వారీగా కోటాలు యివ్వబడ్డాయి.

ఫిబ్రవరి సెంట్రల్ కమిటీ ప్లీనం సమావేశం:- పై రాజకీయ నిర్మాణపు కర్తవ్యాలను యింకా విపులీకరించుతూ, స్పష్టంగా ఫిబ్రవరిలో జరిగిన సెంట్రల్ కమిటీ ప్లీనం తెల్పింది. పార్టీ సభ్యులలోని ముఖ్య డీవియేషన్లు చూపెట్టింది. ప్రధానమైనది ప్రాప్తకాలజ్ఞత. మనం అన్ని పనులు కలిపి చేయడానికి బదులుగా మిగతా పనులకు దెబ్బ తగిలినప్పటికి ఒక పనిచేస్తూ వుండమని ఈ క్రింది విషయాల ద్వారా చూపెట్టింది.

1. జాతీయ సంక్షోభం యొక్క మొదటి దశలో ప్రభుత్వ నిర్బంధానికి వ్యతిరేకంగా ప్రచారం సాగించాం. కాని పార్టీ యిచ్చిన "విధ్వంసక చర్యల నుండి దేశ భక్తులను, ప్రజలను మరల్చాలి." అనే నినాదాన్ని ప్రధానంగా ప్రచారం చేయలేదు.

2. సంక్షోభం యొక్క రెండవ దశలో (అక్టోబరు ప్లీనం తరువాత) ప్రజా సంస్థల కార్యక్రమము మానివేసి జాతీయైక్యతా ప్రచారాన్నే జేశాం. ప్రజల దైనందిన కోర్కెలను జాతీయైక్యతా నినాదాలతో ముడిపెట్టి ఆ కోర్కెలను తీర్చుటద్వారా జాతీయైక్యతను క్రింద నుంచి నిర్మించుతూ ప్రజా సంస్థలలో సభ్యులను జేర్పించలేదు.

3. జాతీయైక్యతా వారం అయిపోయిన తరువాత జాతీయైక్యతా ప్రచారాన్ని ఆపి, ప్రజా సంస్థలలో మెకానికల్‌గా సభ్యులను చేర్పించాం.

4. డిసెంబరు 1942 లో ఆహార సంక్షోభం రావడంతో జాతీయైక్యతా ప్రచారం, చివరకు ప్రజా సంస్థలపని కట్టిపెట్టి ఆహార సమస్యను గూర్చి ప్రజా సంస్థల పనితో సంబంధం లేకుండా పనిజేశాం.

పై డివియేషన్లను దిద్దుకొని జాతీయైక్యతా ఉద్యమము, ఆహార సమస్యా పరిష్కార కృషి, ప్రజా సంస్థలను అభివృద్ధి జేయడం, ప్రజాపార్టీగా పార్టీని నిర్మించడం వీటన్నిటిని ఒకదానితో ఒకటి కలిసి ఎలా పనిజేయాలో స్పష్టమైన కార్యక్రమ మివ్వబడింది.

ఆహార సమస్య మీద పార్టీ జనరల్ నినాదాలను గూర్చి ప్రచారం జేయక ప్రతి గ్రామంలోనూ, పట్టణంలోను వున్న ఆహార సమస్యలను ప్రాతిపదికగా తీసుకుని ప్రజాసంస్థల ద్వారా పనిజేయడమే జాతీయైక్య ఉద్యమమును నిర్మించడ మని స్పష్టపర్చుతూ, ఆహార సమస్యగూర్చి పనిచేయడం ప్రధానంగా తీసుకోవా లని చెప్పబడింది ఆహార సమస్యనుగూర్చి ప్రాక్టికల్ సమస్యలు తీసుకోకుండా ప్రభుత్వాన్నే విమర్శించడానికి యిదొక మార్గంగా తీసుకోవడం నెహ్రూ వాద మనియు, దానివలన ఆహార సమస్య పరిష్కరించబడకపోగా పార్టీ ప్రభుత్వ నిర్బంధానికి గురి అవుతుందని హెచ్చరించబడింది.

ఉత్పత్తిని హెచ్చుచేయడానికి కార్మికులు ముందడుగు వేసి పనిజేయాలని, అలా చేయడం దేశభక్తి పూరితమైన కర్తవ్యంగా వారు భావించేటట్లు చేసేవారిని ఉత్తేజ పరచాలని ఫిబ్రవరి సెంట్రల్ ప్లీనం పార్టీ వుత్పత్తి విధానంగూర్చి స్పష్టం చేసింది. ఇందుకు ఇదివరకుకన్నా అనేకరెట్లు కార్మికుల్లో మన రాజకీయ పాలసీని ప్రచారం గావించి, కార్మికుల రాజకీయ చైతన్యాన్ని హెచ్చు జేస్తేనే సాధ్యమవు తుందని పార్టీ సభ్యులను హెచ్చరించింది.

ఈ కార్యాలన్నీ సాధించడానికి మన పార్టీని ప్రజా పార్టీగా చేయవలసిన ఆత్యవసరాన్ని విశదీకరించి ప్రజాపార్టీగా జేయడానికి నూతన పార్టీ నిర్మాణ పద్ధతులు సూచించింది. (పార్టీ సభ్యుల అర్హతలు, పార్టీకి మిలిటెంట్సుకు మధ్య అంతస్థులు లేకుండా చేయడం, జనరల్‌బాడీ పార్టీ కాన్ఫరెన్సులు ప్రతినెలా పిలిచి రాజకీయ రిపోర్టింగు యివ్వడం వగైరా పద్ధతులు.)

ఈ సమావేశం జరుగుచున్నప్పుడు భారత రాజకీయ రంగంలో ఒక ప్రధాన ఘట్టం సంభవించింది. గాంధీజీ ఉపవాసం ప్రారంభించడంతో, గాంధీజీ విడుదల సమస్య అన్నిటినీ మించిన ప్రధాన రాజకీయ సమస్య అయింది. గాంధీజీ విడుదల కొరకు పనిజేయడానికి, జాతీయైక్యతా ఉద్యమాన్ని నిర్మించ డానికి వున్న పరస్పర సంబంధాన్ని తెల్పుతూ గాంధీజీ విడుదల ఉద్యమాన్ని

ప్రధానంగా తీసుకొని ఎలా నడిపించాల్సిందీ ఫిబ్రవరి సెంట్రల్‌కమిటీ ప్లీనం కార్యక్రమాన్ని యిచ్చింది.

పైన వివరించిన లెనిన్‌డే రాష్ట్ర ప్లీనం, ఫిబ్రవరి సెంట్రల్ కమిటీ ప్లీనం నిర్ణయాలను ఎంతవరకు నెరవేర్చిందీ పరిశీలిద్దాం.

## పార్టీ - ప్రజారంగాలు

పార్టీ సభ్యులు ప్రజల జనరల్, ఆర్థిక, రాజకీయ సమస్యలను మాత్రమే తీసుకుని పనిజేయడం, ప్రజలకు నిత్యజీవితంలో వచ్చే అసంఖ్యాకమైన కష్టాలను నివృత్తిజేయడానికి అంతగా ప్రయత్నించకపోవడం. తీసుకున్న సమస్యల సైతం ఆందోళన ప్రచార దశలోనే వదిలివేయడంవలన ప్రజా సంస్థలు నామ మాత్రంగా ఎలావుందీ లెనిన్ డే రాష్ట్రకమిటీ ప్లీనంలో నొక్కిచెప్పిన గుణపాఠాన్ని పార్టీ సభ్యులు బాగా గ్రహించారు. అందువలన అన్ని జిల్లాలలోనూ ప్రజలదైనందిన కష్టాల నివృత్తికోసం పాటుబడటం ప్రారంభించారు. అధిక ధరల అలవెన్సు, కిరసనాయిలు పంపకం, ఆహార కమిటీలు ఏర్పరచడం మొదలగు ఎన్నో విజయాలను సాధించారు. ఇంకా పెనాల్టీలను రద్దు చేయించడం వగైరా ఎన్నో రైతు సమస్యలకొరకు కామ్రేడ్సు పనిజేస్తున్నారు. కామ్రేడ్సు, ప్రజాసంఘాలు వున్న ప్రతీచోటాగూడ ఇలా సర్వత్రా జరగాలనే నిర్ణయం పూర్తిగా అమలు జరగడంలేదు. అంతేగాకుండా స్థానిక యిబ్బందులను తీసుకుని కామ్రేడ్సే చేస్తున్నారుగాని ప్రజలను సంఘటించి వారే వారి కోర్కెలకోసం పోరాడేలా చేయలేకపోతున్నారు. వివిధ రంగాలలో ఎలా చేసింది చూద్దాం.

**రైతురంగం :-** ప్రాథమిక సంఘాలు రైతుల దైనందిన కోర్కెలకొరకు పోరాడడం మొదలుపెట్టాయి. కిరసనాయిల్ పంపకం, జీవితావసర వస్తువులను కో-ఆపరేటివ్ స్టోర్సు పెట్టి ప్రజలకు సరఫరాచేయడం, ధాన్యం ఫండులను ప్రోగు చేయడం (చాల కొద్దిప్రదేశాల్లో మాత్రమే) ప్రారంభించాయి. అపరాధపు శిస్తులను రద్దు చేయించడానికి కృష్ణా, గుంటూరు, నెల్లూరు, కడప, పశ్చిమ గోదావరి జిల్లాలలో రైతుసంఘాల తరఫున ఆందోళన గావించి చాలావరకు జయము సేకరించబడింది. ఆంధ్ర రైతు ఉద్యమములో ప్రాథమిక సంఘాలు రైతుల దైనందిన కోర్కెలపై కేంద్రీకరించి పనిచేయడం యిదే ప్రథమ పర్యాయం. అందుచేత రైతు సంఘాలు నిజమైన ప్రజానాయకత్వం వహించుతున్నాయి. (కృష్ణా, గుంటూరు జిల్లాలు) దీని ఫలితంగా ఆంధ్ర రాష్ట్రంలో రైతుసంఘ నిర్మాణమును మరింత బలపర్చాం. సభ్యత్వాన్ని 56000 నుండి 70000 వరకూ పెంచగల్గాం. 260 ప్రాథమిక సంఘాలను అదనంగా పెట్టగల్గాం. కృష్ణా జిల్లాలో మొదటిసారి రైతు మహాసభకు 15000 మంది రైతులను, 2000 మంది

వాలంటీర్లను సమీకరించి ఆంధ్ర రైతాంగ చరిత్రలో నూతన శకాన్ని ప్రారంభించారు.

కాని యింకా రంగా మురాను రైతురంగం నుండి వేరుచేయలేదు. రైతు ఉద్యమాన్ని విచ్ఛిన్నం చేయగల శక్తి గల్గేవుంది. (జమీన్ రైతు సంఘాన్ని నెల్లూరులో తిరిగి పునరుద్ధరించారు.) కొన్ని ప్రదేశాల్లో మాత్రమే ప్రాథమిక రైతు సంఘాలు పైవిధంగా గావించుచున్న కృషి రాష్ట్రమంతటా చేసినప్పుడు రంగా మురాను రైతాంగం నుండి పూర్తిగా వేరుచేయగల్గుతాం.

నిర్మాణరీత్యా ప్రాథమిక రైతు సంఘాలను స్థాపించడం, జిల్లా రాష్ట్ర రైతు సంఘాలను పునరుద్ధరించడం జరిగిందిగాని, రైతు సంఘాలలో హోల్ టైము పనిజేసే కార్యకర్తలను తర్ఫీదుజేయనంత కాలం ప్రతి ప్రాథమిక రైతు సంఘం రైతుల దైనందిన కోర్కెల తీసుకుని పనిచేయడం సాధ్యం కాదు. కాన గ్రామ, తాలుకా, జిల్లా రైతు సంఘం కార్యకర్తలకు రైతు సంఘాలను ఎలా పని చేయించాలో తగు శిక్షణనివ్వాలి. రాష్ట్ర రైతు సంఘం యీ పనిని యిప్పుడే ప్రారంభించింది.

జాతీయైక్యతకు, జాతీయ రక్షణకు, రైతుల దైనందిన యిబ్బందుల నివారించే కృషికి గల పరస్పర సంబంధాన్ని రాజకీయంగా రైతులకు విశదీకరించక ఆర్థిక దృక్పథంతోనే పనిజేయడం వలన దేశరక్షణ ఎడల తమ బాధ్యత లేవో రైతులు గ్రహించేటట్లు చేయజాలకపోయాము. అందుచేతనే అధిక పంటలను పండించడానికి రైతులను రాజకీయంగా ఉత్తేజపర్చజాలక పోయాము. అంతే గాకుండా రైతుకూలీ సామరస్యాన్ని గొనివచ్చి గ్రామైక్యతను సర్వత్రా సాధించలేకపోయాము.

వ్యవసాయ కూలీ రంగం :- వ్యవసాయ కూలీ సంఘ సభ్యత్వం మెకానికల్‌గా పెంపుదల చేయడం తప్ప యీ రంగంలో అన్నివిధాలా విఫలులమయ్యాము. ముఖ్యంగా బంజరు భూములను సాగులోనికి తీసుకురావడానికి అక్టోబరు ప్లీనం, లెనిన్ డే ప్లీనం సమావేశాల మధ్య జరుపబడిన ప్రయత్నాలను గూడ పునరుద్ధరించలేదు. ప్రాథమిక కూలీ సంఘాలు అస్పష్టమైన ప్రచారం, ఆందోళనలతో కాలం గడిపాయేగాని, కూలీల దైనందిన కోర్కెలను తీసుకుని పనిచేయడం గాని, రాజకీయంగా వాటి ముఖ్య బాధ్యత అయిన కూలీ-రైతు సామరస్యాన్ని ఏర్పర్చడానికి కృషిచేయడం గాని జరుగలేదు. తాత్కాలికంగా పని రోజులగుట వలన (కోతలు వగైరా) ఆహార పదార్థాలు తాత్కాలికంగా లభించుట చేత, రోజూరోజూ ఆహార సమస్య ఎంతో క్లిష్టమయ్యేది. అంతఃకలహాలు చెలరేగేదీ దూరదృష్టితో ఆలోచించడమే మానివేశారు.

సభ్యత్వం మాత్రం 347 గ్రామాల్లో 23342 మందిని చేర్పించాం. ప్రాథమిక సంఘాలు పెట్టడం గాని, యిదివరకే ముందుకు వచ్చి పనిజేస్తున్న కూలీ వర్కర్లను పార్టీ సభ్యులుగా జేర్చుకుని వారికి తర్ఫీదు యివ్వడము గాని తగినంతగా జరుగలేదు. నిర్మాణరీత్యా చాల బలహీనంగా వుంది.

ట్రేడ్ యూనియన్ రంగం :- ఈ రంగంలో ముఖ్యంగా సాధించిన విజయం ఆంధ్ర రాష్ట్రంలోని ముఖ్య ట్రేడ్ యూనియన్లను అ. భా. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసుకు అనుబంధ శాఖలుగా ఏర్పరచడం. ఇదివరలో అ. భా. ట్రేడ్ యూనియన్ ఉద్యమముతో ఆంధ్ర ఉద్యమమునకు ఏమీ సంబంధం లేకుండా వుండేది. ఇలా చేర్పించడం వలన అ.భా. ట్రేడ్ యూనియన్ సంఘంలో పార్టీ పలుకుబడి, స్థానాలు హెచ్చు అవడానికి అవకాశం లభించింది. రాష్ట్రం మొత్తం మీద వివిధ ట్రేడ్ యూనియన్ల కార్యకలాపాలను సమన్వయం చేసి కేంద్రీకృతంగా నడపడానికి ప్రయత్నం చేయబడింది ఇంచు ఒక రాష్ట్ర ఆర్గనైజరు ప్రత్యేకంగా నియమించబడ్డాడు.

కాని ముఖ్య లోటు అలాగే వుంది. కార్మికుల్లో రాజకీయ చైతన్యం చాల తక్కువగా వుంది. అందుచేత తమ ఆర్థిక హక్కుల కొరకు పోరాడుటకు మాత్రమే ఉత్సాహం చూపుతారు. తదితర పౌరుల ఎడల తమకున్న బాధ్యతలను నిర్వహించడానికి గాని, ఉత్పత్తిని హెచ్చు చేయడానికి గాని, ఏమీ ఉత్సాహం చూపరు. ఆంధ్ర రాష్ట్రంలో మున్సిపల్ వర్కర్ల సంఘాలు నేరుగా మన పార్టీ ఆధ్వర్యము క్రింద నడుపబడుతూ అన్ని యూనియన్లకంటే నిర్మాణయుక్తంగానూ, చైతన్య యుతంగాను వున్నాయి. అట్టి సంఘాలే తమ యుద్ధ అలవెన్సుల కొరకు పోరాడినంత గట్టిగా పట్టణాలలో బజారు శుభ్రతను, పౌరుల ఆరోగ్యాన్ని కాపాడుటకు కృషిజేయడానికి ఏమీ ఉత్సాహం చూపడం లేదు. అంతేగాకుండా అందులో పనిజేసే మన కామ్రేడ్సు పౌరుల యెడ వారికున్న యీ బాధ్యతను నిర్వహించాలని గట్టిగా చెప్పడానికి జంకుతారు. ఈ విధంగా పనిజేయడం దేశ రక్షణ బాధ్యతలను గుర్తెరిగి పని జేయడం గాదు. ఎకనామిస్టులలాగ పనిచేయడం, ఇతర కార్మిక సంఘాలలో కూడా యిదే స్థితి. ఉత్పత్తిని అభివృద్ధి చేయడానికి, కార్మికుల బాధ్యతలను రాజకీయంగా చెప్పడానికి, సమ్మెలు లేకుండానే కార్మికుల హక్కులను ఎలా సంపాదించవచ్చునో రాజకీయంగా నచ్చచెప్పడానికో కామ్రేడ్సు జంకుతారు. సమ్మెలు వస్తే హుషారుగా పనిచేస్తారు. ఈ డీవియేషన్సు పోగొట్టుకోనిది మన పార్టీ ఉత్పత్తి విధానాన్ని అమలుపర్చజాలము. కార్మికుల కోర్కెలను యీడేర్చజాలము. అతివాద జాతీయవాదులవలె ప్రవర్తించి జైళ్ళకు పోతాం.

ఈ ఉత్పత్తి విధానాన్ని అమలు జరిపినప్పుడే పార్టీ సభ్యులను కార్మికుల నుండి సంపాదించి పార్టీకి నిజమైన స్థానాన్ని గడించుతాం.

## విద్యార్థి, యువజనోద్యమాలు

విద్యార్థి రంగంలో కొంత ముందుకుపోయాం. గాంధీజీ - వైస్రాయి ఉత్తర ప్రత్యుత్తరాలను ఉపయోగించుకుని జాతీయ విద్యార్థి సంఘాల పలుకుబడి నుండి విద్యార్థి ప్రజా సామన్యాన్ని (గుంటూరు, విజయనగరం మినహా) తొలగించగల్గాం. గాంధీజీ విడుదల ఆందోళన ద్వారా విధ్వంసక చర్యలకు వ్యతిరేకులైన కాంగ్రెసు విద్యార్థులను మనవైపుకు ఆకర్షించాం. వారిని తరువాత డిటెన్షన్ రద్దు, తెల్ల కాగితాలు, కిరసనాయిల్ సప్లయి వగయిరా విద్యార్థుల కోర్కెలకై మనతో కలిసి పనిజేసేటట్లు చేశాం. దానితో అరాచకోద్యమములో చైతన్యం పొంది ముందుకు వచ్చిన విద్యార్థి కేడర్లను కొంతవరకు మనవైపుకు త్రిప్పుకున్నాం. విద్యార్థి కోర్కెలకొరకు పోరాడుటకు వీరిని మనతో కలిసి వచ్చేటట్లు చేయగల్గాము. గాని వీరిని యింకా రాజకీయంగా మనవైపుకు పూర్తిగా త్రిప్పుకోలేదు. మన పంథా ఒక్కటే సరియైన పంథా అని నచ్చజెప్పలేదు. అయినప్పటికి వీరికి జాతీయ విద్యార్థి సంఘాలకు వున్న లంకె తెగగొట్టగల్గాం. జాతీయ విద్యార్థి సంఘాలలోని అపకమ్యూనిస్టుల నుండి, కరుడు గట్టిన కమ్యూనిస్టు వ్యతిరేకుల నుండి చాలా మట్టుకు వేరుజేశాం గాని అట్టివారికి విద్యార్థి రంగంలో పూర్తిగా స్థానం లేకుండా చేయలేకపోయాము. అందుచేత విద్యార్థి సామాన్యంపై, వారినందరినీ జాతీయైక్యత పాలసీ వైపుకు త్రిప్పుకుని, మన రాజకీయ పలుకుబడి యింకా స్థాపించలేదు. వారిలో వచ్చిన నిరుత్సాహం, నిస్పృహలను మాత్రం కల్చరల్ కార్యక్రమం ద్వారా, విద్యార్థుల దైనందిన కోర్కెలను సాధించడం ద్వారా పోగొట్టగలిగాం.

తత్ఫలితంగా విద్యార్థి ఉద్యమం రెండు జిల్లాల (కడప, కర్నూలు) లో తప్ప మరల మన పార్టీ నాయకత్వం క్రింద పునఃస్థాపించాం. విద్యార్థి ఉద్యమమును తలిమా అన్ని జిల్లాలలో విద్యార్థి సంఘాలను పెట్టి పని చేయించ గల్గుతున్నాం. పరీక్ష రోజులు, సెలవు రోజులు అగుటచేత సభ్యత్వం ఏమీ పెరగలేదు.

పార్టీ కామ్రేడ్సులో మాత్రం కొన్ని డివియేషన్సు వచ్చాయి. పార్టీ కమిటీలు విద్యార్థి ఫ్రాక్షనులతో అవినాభావ సంబంధ ముంచుకుని తరచు తనిఖీ చేస్తూ, ఎప్పటికప్పుడు కార్యక్రమమిస్తూ వాటిని నడపడం లేదు. విద్యార్థి రంగానికి విద్యార్థి ఫ్రాక్షనులను సర్వాధికారులుగా చేసివేస్తున్నాయి. జోక్యం కల్పించుకోవడం లేదు. స్థానిక కమిటీలు అచ్చటి విద్యార్థి సెషన్సుకు దైనిక

గ్రైడెన్సు యిచ్చుట లేదు. పార్టీ కమిటీలు బలహీనంగా వున్న చోట్ల విద్యార్థి కార్యకర్తలు చేత విద్యార్థేతర రంగాల్లో గూడ పనిజేయించడం వలన విద్యార్థి రంగం బలహీనపడిపోతూ ఉంది. (చిత్తూరు, విజయనగరం, బందరు.)

రాష్ట్ర, జిల్లా విద్యార్థి సంఘ నాయకులు, ముఖ్యంగా జిల్లా నాయకులు పార్టీ లీడర్లుగా మాత్రమే వుంటున్నారు. విద్యార్థులతో సాధ్యమైనంత ఎక్కువ సంబంధం పెట్టుకోకపోవడం వలన యీ కార్యకర్తలు విద్యార్థి ఉద్యమ నాయకులుగా పరిగణింపబడుటలేదు. ఆందోళన జరుపడం, పార్టీని నిర్మించడం, ప్రజా సంస్థలచేత పనిచేయించడం ఒకే పర్యాయము జరగాలన్న ఫిబ్రవరి సెంట్రల్ కమిటీ నినాదం ఏమీ అమలు పర్చలేదు. గాంధీజీ ఉపవాసం, స్వాతంత్ర్య దినోత్సవ సందర్భాలలో తతిమ్మా పనులన్నీ కట్టిపెట్టారు.

**యువజన రంగం :-** యువజనోద్యమము దాదాపు అన్ని జిల్లాలకు వ్యాపించింది. (వైజాగ్, అనంతపురం జిల్లాలు తప్ప.), మొత్తం రాష్ట్ర మంతటా 500 గ్రామాల్లో 18000 సభ్యత్వం చేర్చబడింది. గుంటూరు జిల్లాలో కృష్ణా జిల్లాలో వలె యువజన సంఘాలు సర్వత్రా వ్యాపించుతూ ఉన్నాయి. అన్నిచోట్ల వైజ్ఞానిక ప్రచార పద్ధతులు, ఆటల కార్యక్రమము అవలంబించ బడుతున్నాయి.

కృష్ణా, గుంటూరు జిల్లాలలో యువజన సంఘాలు రాజకీయ రంగంలో గూడ తీవ్రంగా పనిచేశాయి. గాంధీజీ విడుదల కొరకు, ఉయ్యూరు కార్యకర్తలు విడుదల కొరకు యీ రెండు జిల్లాల నుండి దాదాపు టెలిగ్రాములు గానీ, మహజర్లు గాని ప్రతి ప్రాథమిక సంఘం నుండి వెళ్ళాయి. స్వతంత్ర దినోత్సవము, జాతీయవాద సందర్భంలో జాతీయైక్యతా నినాదం గూర్చి ప్రతి యింటికి బోయి ప్రచారం గావించబడింది.

యువజన సంఘాల తరపున ప్రజారక్షణ దళాల నేర్పరచి సంఘ సేవ జేయబడింది. బెజవాడలో కలరా వచ్చినప్పుడు యువజన సంఘాలు గావించిన కృషి ప్రశంసనీయమైనది. ఆహార డిపోల వద్ద, తిరణాలల్లో శాంతిని కాపాడ డానికి యువజన సంఘాలు, ప్రజారక్షణ దళాలు చాల తోడ్పడ్డాయి. కిరస నాయిల్ పంపకంలో గూడ రైతు వాలంటీరు దళాలకు తోడ్పడ్డాయి.

పై పనుల వలన జాతీయ యువజన సంఘాలు కృష్ణా జిల్లాలో పూర్తిగా పడుకున్నాయి గుంటూరు జిల్లాలో యింకా పూర్తిగా పోలేదు. అచ్చట కూడ స్థానిక యువజన సంఘాలు కల్చరల్ కార్యక్రమము తీసుకుని యువక ప్రజా సామాన్యాన్ని మన వైపుకు ఆకర్షించగల్గితే, వాటి స్థానం లేకుండా పోతుంది.

రాష్ట్రం మీద యువజనోద్యమానికి ప్రమాదంగా బయలుదేరుచున్న రాష్ట్రీయ స్వయంసేవక సంఘాలను పూర్తిగా రూపుమాపుటకు తగినంత కృషి జేయలేదు. దాని నుండి వచ్చే ప్రమాదం గ్రహించకపోవడమే దానికి కారణం. ముఖ్యంగా పట్టణాలలో మన యువజన సంఘాలలో లేని యువకులను రా. స్వ. సేవక సంఘాల తాలింఖానా, ఆటల కార్యక్రమం బాగా ఆకర్షించుతున్నాయి. దాదాపు ప్రతి పట్టణంలోనూ వాటి శాఖలు, తాలింఖానాలు స్థాపించబడ్డాయి. వీటికి పట్టణ హిందూ లాయర్లు, డాక్టర్లు, వర్తకులు హెచ్చుమంది ధనసహాయం చేయుటచేత బలపడుచున్నాయి. ఈ ప్రమాదాన్ని పట్టణాలలో వున్న మన యువజన సంఘాలు గర్తించలేదు. మన యువజన సంఘాలు ప్రతి పేటలోను పెట్టి వాటికి ప్రత్యమ్నాయంగా మన యువజన కార్యక్రమమూ, ముఖ్యంగా యువకులను ఆకర్షించే మిలిటెంటు స్పోర్ట్సు, తాలింఖానా కార్యక్రమము అవలంబించకపోతే యీ ప్రమాదం చాలా హెచ్చు అవుతుంది.

కుల యువజన సంఘాలను కూడ మనవైపుకు ఆకర్షించడానికి తీవ్ర ప్రయత్నాలు జరుగుట లేదు. పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి జిల్లాలలో యువజన సంఘాలు సరిగా కృషిచేయకపోవడం వలన నర్సపూరు తాలూకాలో ఆదిమాంధ్ర యువజన సంఘాలు, సామర్లకోట, రాజమండ్రి, పెద్దాపురం మొదలగు చోట్ల సంస్కరణవాదుల సంఘాలు బలపడ్డాయి. ఈ దశలో బాల సంఘాలు నిర్మించడం ప్రారంభించబడింది.

**మహిళా ఉద్యమము :-** 1948 జనవరిలో రాష్ట్ర కమిటీ తరఫున ప్రారంభించబడ్డ మహిళా క్యాంపు సాగింపబడుతూ వుంది. ఇంతవరకు 100 మందికి యీ స్కూళ్ళలో తర్ఫీదు యివ్వబడింది. వారి రాజకీయ స్థాయి ఎంతో హెచ్చింది. అందువలన పట్టణాలలోని మధ్యతరగతి స్త్రీల గౌరవాన్ని కూడ పొందుచూ వారిలోకి కూడ మహిళా ఉద్యమాన్ని వారు వ్యాపింపజేస్తున్నారు.

కృష్ణా, గుంటూరు జిల్లాలలో ఆహార సమస్య తీవ్రత గూర్చి, దాన్ని పరిష్కరించడానికి స్త్రీలు యే విధంగా పనిజేయాలో ప్రచారం గావించారు. కాని స్త్రీలు చౌకడిపోల వద్దకు, కిరసనాయిల్ పంపకానికి, ఆహార సభల్లోకి ప్రభుత్వోద్యోగుల వద్దకు రాయబారాల్లోకి గాని రాలేకపోయారు.

స్త్రీలలో జపానుదాడి ప్రమాదాన్ని, దానిని ఎదుర్కోవలసిన అవసరాన్ని గూర్చి గుంటూరు, కృష్ణా జిల్లాలలో స్త్రీ సంఘాల తరఫున పాటల ద్వారా, బుర్రకథల ద్వారా మీటింగుల ద్వారా చక్కని ప్రచారం జరిగింది. మరుగదొడ్ల సౌకర్యం కొరకు కృషిచేయబడింది. కృష్ణాలో 8 గుంటూరులో 4 గ్రామాల్లో

మరుగుదొడ్లు కట్టించగల్గారు. ఇట్టి సమస్యల మీద చదువురాని స్త్రీలను గూడ స్త్రీ సంఘాల వైపుకు ఆకర్షించగలుగుచున్నారు. కార్మిక స్త్రీలతో గూడ బెజవాడ, కాకినాడ, రాజమండ్రి, గుడివాడలలో ప్రచారం జరిగింది.

రావు కమిటీ బిల్లుమీద కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి జిల్లాలలో బాగా ప్రచారం జరిగింది. మొత్తం మీద 120 గ్రామాల్లో 10,000 సంతకాలుతో రావు కమిటీ బిల్లు బలపర్చుతూ, కొన్ని సవరణలు చూపెడుతూ మహజర్లు కమిటీ అధ్యక్షునికి పంపబడ్డాయి. ఈ ప్రచారం సామాన్య స్త్రీలలో తీవ్ర సంచలనం కలుగజేసింది. కాని యీ సంతకాల ఉద్యమముతో పాటు సభ్యులను గూడ జేర్పించకపోవుటచే మంచి అవకాశం పోగొట్టుకున్నారు.

పై పనుల ఫలితంగా ఆంధ్రలో మహిళా ఉద్యమము ముందుకుపోయింది. సభ్యత్వం 8800 వరకు పెరిగింది. సభ్యత్వం పెరిగినా సంఘ నిర్మాణం సరిగా లేదు. జిల్లా సంఘాలు తప్ప, గ్రామ సంఘాలు కృష్ణా, గుంటూరు జిల్లాలలో తప్ప హెచ్చుగా పనిచేయడం లేదు. పార్టీలో మహిళా సభ్యత్వం ౭౦ నుండి 1000 వరకు పెరిగింది.

వైజ్ఞానిక ప్రచారం :- ప్రజా సామాన్యంలో బాగా చొరబడడానికి వైజ్ఞానిక ప్రచార పద్ధతుల వలన ఎంతేని అవకాశముంటుందని ఆంధ్రలో గత రెండు సంవత్సరాల నుండి చేస్తున్న ప్రచారం వలన స్పష్టమైంది. గుంటూరు, కృష్ణా జిల్లాలో బుర్ర కథల ద్వారా వేలకువేల ప్రజల్లో రాజకీయ ప్రచారం జరుపబడుతోంది. ఫాన్సీ డ్రెస్సులు గూడ చాలా ఆకర్షణీయంగానే వుంటున్నాయి. కృష్ణా జిల్లాలో యిటీవల అభివృద్ధి చేసిన భజన పద్ధతులు వెనుకబడి వున్న ప్రజా సామాన్యంలో గూడ చొరబడుటకు వుపయోగించుచున్నాయి. మొత్తం మీద యీ వైజ్ఞానిక ప్రచార పద్ధతులవలన ఆంధ్ర విజ్ఞాన రంగంలో గొప్ప మార్పు వచ్చింది. పాత పద్ధతుల ద్వారా, నూతనాభిప్రాయాలు, రాజకీయ ప్రచారం చేయడంవలన ప్రజాసామాన్యాన్ని ఎంతేని వైజ్ఞానికంగానూ, రాజకీయంగానూ ముందుకు గొంపోవడానికి అవకాశమేర్పడింది. బుర్రకథలు, వేషాలు ఆకర్షణీయంగా వున్నట్లు నాటకాలు, సమిష్టి గానం అంత ఆకర్షణీయంగా వుండుట లేదు. నాటకాలు ఆకర్షణీయంగా లేకుండుటకు ప్రజలకు పరిచయమైన భాషలోనూ, జాతీయంగాను వుండకపోవడమే కారణం. ఒక్క కృష్ణా, గుంటూరు జిల్లాలు తప్ప యీ వైజ్ఞానిక పద్ధతులను విరివిగా మరి యే యితర జిల్లాలు ఉపయోగించడం లేదు. విద్యార్థి, యువజన విజ్ఞాన ప్రచారక శిబిరాలలో తయారైన వారు యితర జిల్లాలలో కూడ ప్రచారం చేస్తున్నారు.

# ఆహార సమస్య - ప్రజా రక్షణ దళాలు

ఆహార సమస్యలకు సంబంధించిన సమస్యలను గూర్చి కామ్రేడ్సు ప్రజా సంఘాలలో పనిచేయడం ప్రారంభించారు. రాష్ట్రమంతటా ముఖ్య పట్టణాల్లో చౌక డిపోల వద్ద శాంతిని కాపాడడానికి, చౌక డిపోలు హెచ్చు చేయించడానికి యిందుకు ప్రజారక్షణ దళాలను ఏర్పర్చడానికి, బాగానే కృషి జరిగింది. గ్రామాల్లో కిరసనాయిల్, అగ్గిపెట్టెలు, పంచదార వగయిరా జీవితావసర వస్తువులను ప్రజలకు సరఫరా చేయడానికి బాగా కృషి జరిగింది. ముఖ్యంగా కృష్ణా, గుంటూరు జిల్లాలలో కిరసనాయిల్ పంపకంలో కామ్రేడ్సు బాగా తోడ్పడ్డారు. రాయలసీమ కరువు నివారణ కొరకు పార్టీ కామ్రేడ్సు చాల కృషి చేశారు. గ్రామాల్లో జరిగే చాల వివాహాల సందర్భంలో గూడ ప్రజల నుండి పైనిధికి వసూలు గావించారు. ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘం తరపున 23 గురు వర్కర్లను రూ 6000 లున్నూ పంపారు అనంతపూరులో కామ్రేడ్సు దీనిపైననే పార్టీ శక్తి నంతా కేంద్రీకరించి, ప్రశంసనీయమైన కరువు నివారణ ప్రయత్నాలు గావించారు జిల్లాలోని ముఖ్యమైన ప్రజా శ్రేయోభిలాషుల నందరి దృష్టిని ఆకర్షించుచున్నారు. కర్నూలులో మాత్రం సెక్టేరియన్ దృక్పథంతో వుండి కామ్రేడ్సు కరువు నివారణ కొరకు పనిచేయకుండా కాలం వృధా చేశారు. కడపలో గూడ యింతే

కృష్ణా జిల్లాలో జూన్ 13వ తేదీన జిల్లాలోని అన్ని పక్షాలనుండి 600 మంది ప్రతినిధులతో గూడిన జిల్లా ఆహార కాన్ఫరెన్సును జరిపారు. అన్ని వర్గాల, పార్టీల ప్రతినిధులను యీ విధంగా సమీకరించడం వల్ల మన పార్టీ కృష్ణాలో ప్రజానాయకత్వం వహించుతోందని రుజువవుతుంది. యీ విధంగా పార్టీ ఆహార సమస్యను పరిష్కరించడానికి జేసిన కృషి ఫలితంగా ప్రజలందరూ కమ్యూనిస్టు పార్టీ కృషిని గుర్తించారు స్థానిక ముస్లింలీగు, వర్తక సంఘాలు స్థానిక కాంగ్రెస్‌వాదులు పార్టీతో కలిసి సహకారం జేస్తున్నారు.

రాష్ట్రంలో ఆహార పదార్థాల కొరతను తొలగించడానికి తీవ్రంగా పనిజేస్తున్నది మన పార్టీ యొక్కటే అయినప్పటికిని పార్టీ చేయవలసినంత, ప్రస్తుత స్థితిలో చేయగలిగినంత పనిని చేయలేదు. దానికి కారణం ఆహార సమస్య వలన మన రాష్ట్రంలో గూడ ముందు ముందు వచ్చే తీవ్ర ప్రమాదాన్ని గుర్తించక పోవడమే. పార్టీ సభ్యులు ప్రజానాయకులుగా వున్నచోట్ల గూడ, పార్టీకి నిశ్చితమైన ప్రజా పలుకుబడి వున్నచోట్ల గూడ ఆహార కమిటీలను ఏర్పరచి ధాన్యపు ఫండులు ప్రోగుచేయలేదు. రైతుకూలీ సామరస్యానికి తీవ్ర కృషి చేసి ముందు ముందు రాబోయే క్షామ పరిస్థితుల్లో గ్రామ శాంతిని కాపాడి, జాతీయైక్య

తను ఏర్పరచడానికి పునాది వేయలేము. అలా చేసి వున్నట్లయితే గ్రామసుస్థితను పలు ప్రాంతాల్లో ఏర్పరచగలిగే వాళ్ళం పార్టీ రాజకీయ పలుకుబడి యింకా ముందుకు పోయేది.

ఆహార సమస్యను పరిష్కారము చేయడానికి చేసిన కృషి వేరు జాతీయైక్యత అవసరాన్ని గూర్చి చేసిన ప్రచారం వేరు. రెండూ విడివిడిగా చేశాము గాని కలిపి ప్రతి రంగంలోను చేయలేదు. జాతీయవారం, గాంధీజీ ఉపవాసం, స్వాతంత్ర్య దినోత్సవం సందర్భాలలో జాతీయైక్యతగూర్చి ప్రచారం గావించాం. తతిమ్మా అప్పుడు కేవలం ఆహార సమస్యకు సంబంధించిన సమస్యలను ఆర్థిక దృక్పథంతో జాతీయైక్యతా ఉద్యమానికి, మనం చేసే కృషికి వున్న పరస్పర రాజకీయ సంబంధం గూర్చి చెప్పడం వదలివేశాం. ఇది ప్రధాన లోపం. ఇక ముందు రెండింటిని సమన్వయం చేస్తూ ప్రచారం చేయాలి.

ఇంకో లోపం అతివాద జాతీయ దృక్పథంతో ఆహార సమస్యను గూర్చి ఆందోళన గావించడం, హెచ్చుగా ప్రభుత్వాన్ని గూర్చే తిట్టాం. ప్రభుత్వం గూడ ఆహార సమస్యను పరిష్కరించడానికి నిరంకుశ పద్ధతులలో పనిచేస్తున్నా అది కూడ సమస్యా పరిష్కారానికి ఆదుర్దా చూపుతోందనీ, మనం గుర్తించలేదు. ప్రజలను ప్రాక్టికల్ నినాదాల మీద సమీకరించి ప్రభుత్వోద్యోగులు బాగా నిరోధించి చాల అడ్డంకులు గల్గించారు.

ఆహార పదార్థాల అధికోత్పత్తి విషయంలో లెనిన్ డే నుండి మే డే వరకు మనం గావించిన కృషి తగినంత లేదనే చెప్పాలి. బంజరు భూములను సాగు చేయించడానికి తగినంతగా కృషి చేయలేదు. ఇదివరలో సెక్టేరియన్ దృక్పథంతో పనిచేయడం వలన జమీందార్లు గాని, ప్రభుత్వోద్యోగులు గాని మనకు సహకారం చేయక పూర్తి అడ్డంకులు గల్గించారు. దానితో నిరుత్సాహపడి కూర్చున్నాము. మన విఫలతకు మన సెక్టేరియన్ దృక్పథమేనని గ్రహించజాలక పోయాము.

అంతేగాకుండా రైతు సంఘాల ద్వారా అధిక పంటలకు గావించిన కృషి గూడ కేవలం ఎకనమిస్టు దృక్పథంతోనే గానించాం. రైతులు తమకు లాభాలు వచ్చే మార్గం రైతు సంఘాలు చెప్పుతున్నాయని మాత్రమే మన అధిక పంటల వుత్పత్తి ప్రచారాన్ని అర్థం చేసుకున్నారు గాని అధిక పంటలను పండించడం దేశభక్తి పూరితమైన తమ బాధ్యత అనియు, అలా పండించకపోతే దేశాన్ని ఆర్థిక, రాజకీయ సంక్షోభం నుండి పారద్రోలజాలమని రైతులు దేశభక్తితో తెలుసుకునేట్లు మనం ప్రచారం చేయలేకపోయాం.

# పార్టీ నిర్మాణం

పార్టీని ప్రజా పార్టీగా జేయాలన్న ఫిబ్రవరి సెంట్రల్ కమిటీ నినాదాన్ని ఒక విధంగా అమలు పర్చాము. పార్టీ సభ్యత్వం 1176 నుండి 3250 వరకు పెంచాం. పార్టీ సహాయక సభ్యులను, సానుభూతిపరులలో చాలామందిని పార్టీ సభ్యులుగా తీసుకున్నాం. ఈ విధంగా ప్రజాపార్టీగా జేసినా వీరందరిని ప్రజా సంఘాలలో చురుకుగా పనిచేయించి పార్టీకి ప్రజాధారాన్ని బాగా అభివృద్ధి చేయడం మాత్రం జరుగలేదు ఇది జరుగకుండా సభ్యత్వం పెరిగినంత మాత్రాన నిజమైన ప్రజాపార్టీ గానేరదు

పార్టీ సభ్యుల వర్గ స్వభావంలోనూ, ఒక జిల్లాకు, మరొక జిల్లాకు మధ్య పార్టీ సభ్యులను జేర్పించడంలో వున్న అసమానత్వం అలాగే వుంది. విద్యార్థుల నుండి, స్త్రీల నుండి, కార్మికుల నుండి పార్టీ సభ్యత్వాన్ని హెచ్చు చేయడానికి ప్రత్యేక కృషి చేయబడలేదు ఇప్పటికి కృష్ణా, గుంటూరు జిల్లాల పార్టీ సభ్యత్వం మొత్తం రాష్ట్ర సభ్యత్వంలో నూటికి 75 వంతులు. ఇందుకు ముఖ్య కారణం: ముఖ్యమైన పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి జిల్లాలలో పార్టీలు నిస్తబ్దతగా వుండడమే ప గో. జిల్లాలో ప్రభుత్వ నిర్బంధ విధానం వలన, బయట వున్న నాయకులు చొరవ చూపకపోవడం వలన, కృష్ణా, గుంటూరు జిల్లాలలో పార్టీలోకి వచ్చిన నూతన జ్యోతి అచ్చట కనుపించలేదు. తూ.గో. జిల్లాలో జనవరి ప్లీనం నాటికి అటువంటి మార్పు వచ్చినప్పటికి ఆ జిల్లాలో ముఖ్యులైన కొందరు వ్యక్తి దురహంకారానికి దాసులైపోయి ఫాక్షనలిజం ప్రారంభించి పార్టీలో చీలికలు కలుగజేయుట వలన అభివృద్ధి ఆగిపోయింది. రాయలసీమ జిల్లాలు (కడప, కర్నూలు మినహా) నెల్లూరు జిల్లా క్రమంగా అభివృద్ధి అవుతున్నాయి విశాఖపట్నంలో గూడ పార్టీ క్రమంగా అభివృద్ధి అవుతోంది. కృష్ణా జిల్లాలో పార్టీ అన్ని తాలూకాలకు వ్యాపించి పార్టీ అభివృద్ధిలో అసమానత్వాన్ని తొలగించగలిగింది. గుంటూరులో యింకా యీ అసమానత్వం వుంది.

పార్టీ నాయకులకు, ఆర్గనైజర్లకు రాష్ట్ర కమిటీ మూడు స్కూళ్ళు పెట్టి 75 మందికి శిక్షణ యిచ్చింది ఈ స్కూళ్ళుగాక కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి జిల్లాలలో సెల్లు కార్యదర్శుల స్కూళ్ళు జరిగాయి. మొత్తం 180 మందికి తర్ఫీదు యివ్వబడింది ఈ స్కూళ్ళ ఫలితంగా జిల్లా, తాలూకా కమిటీలు, కొన్ని సెల్లులు బాగా పనిజేస్తున్నాయి. రెగ్యులర్‌గా పై కమిటీలకు రిపోర్టులు పంపబడుతున్నాయి. పార్టీ ఫారము కొంతవరకు వచ్చింది.

పార్టీ ఫండు వసూళ్ళు మాత్రం లెనిన్ డే వరకు జరిగినంత ఉత్సాహంగా జరుగలేదు. కారణం పార్టీ సభ్యుల ఆస్తులను అమ్మడంలో ఆలస్యం జరిగింది. పార్టీ సభ్యులు గూడ యిందుకు శ్రద్ధ చేయలేదు ప్రజల నుండి వసూలు చేయడం బొత్తిగా వెనుకబడింది. అందుచేత ప్రజాపార్టీగా తయారుగావడం ప్రారంభించి నప్పటినుండి జిల్లా పార్టీల ఖర్చులు హెచ్చు అగుటచేత జిల్లాబడ్జెట్లు సరిపుచ్చడం కష్టమవుతుంది. ఒక జిల్లా కమిటీకి గూడ దాని ఖర్చులకు సరిపోయే నికరాదాయము గాని, రెగ్యులరుగా వసూళ్ళు గాని లేవు. కాని జిల్లా కమిటీలు రానున్న ఆర్థిక దుస్థితిని గుర్తించి రెగ్యులర్ చందాలను వసూలు చేయడానికి ప్రయత్నించు తున్నాయి. కాని ఇంతవరకు ఏపీ విజయం పొందలేదు. పార్టీ ఆర్థిక దుస్థితికి పార్టీ వేతనాలు తీసుకునే పార్టీ హోల్ టైమర్లు గూడ కొంతవరకు బాధ్యులే. ఉద్యోగుల జీతాలవలె నెల అయ్యేసరికి పార్టీ కమిటీల నుండి తమ పార్టీ వేతనాలు డిమాండు చేయడమే చేస్తున్నారు గాని, తమ వేతనాలకు, యింకా తదితర ఖర్చులకు తాము పార్టీ ఫండును ప్రజల నుండి వసూలు చెయ్యాలనే ముఖ్య విషయాన్ని గుర్తించుట లేదు.

ప్రతి జిల్లా కమిటీ తనకయ్యే ఖర్చులను ప్రజల నుండి, సెల్లుం ద్వారా రెగ్యులరుగా వసూలుచేసి ఆర్థిక పరిస్థితులను స్థిరపర్చుకోకపోతే ఇట్టలతో గట్టిన గృహంవలె పార్టీ నిర్మాణం కూలిపోవలసి వస్తుంది. ప్రజా పార్టీగా తయారైన మన పార్టీ ఈ కార్యాన్ని సాధించగల్గుతుంది. పార్టీ సభ్యుల పెటీ బూర్జువా మొఖమోటమి తత్వమే యిందుకు అడ్డంకు.

పార్టీ పత్రిక అమ్మకం మాత్రం తగ్గిపోయింది. 9 వేల నుండి 6300 వరకు తగ్గిపోయింది కారణం విడి అమ్మకాలను తగ్గిపోకుండా చేయలేకపోవడమే. చందాదారుల సంఖ్యమాత్రం తగ్గలేదు. పత్రిక వెళుతున్న గ్రామాలసంఖ్య 1600 నుండి 1900వరకు పెరిగినా పత్రిక అమ్మకం తగ్గిపోయిందంటే పత్రిక రాజకీయా లలో లోటువుండి గాదు. పార్టీ కామ్రేడ్సు పత్రిక అమ్మకంలో అవలంబించే పద్ధతులలో లోటు మాత్రమే. పత్రిక అమ్మకం తగ్గిపోవడమే గాకుండా ఏజంట్లు రూ. 800 ల వరకు బాకీ పెట్టారు దానికి కారణం అమ్మే పత్రికాపీని రొఖ్ఖానికి అమ్మకుండా అప్పుకు అమ్మడం. తదుపరి అప్పులను ఖచ్చితంగా గూడ వసూలు చేయకపోవడం. పార్టీ సభ్యుల పెటీ బూర్జువా, బోల్షివిక్ వ్యతిరేక పద్ధతుల వలన పత్రిక అమ్మకం పడిపోయింది.

పత్రిక రాజకీయంగా ప్రజలను బాగా ఆకర్షించింది. పత్రికపై గావించే దుష్ప్రచారం చాల తగ్గింది. పత్రికను ఒక ముఖ్య రాజకీయ పత్రికగా ప్రజలు గుర్తించారు. పార్టీ ఆర్గనైజరుగా గూడ తయారవుతోంది.

**ఫలితాలు :-** ఆంధ్ర దేశం మొత్తం మీద కమ్యూనిస్టు పార్టీయే నిర్మాణ యుక్తమైన ప్రధాన రాజకీయ శక్తిగా తయారై ప్రజా నాయకత్వం వహించే

శక్తి దానికి వస్తోంది. ఆంధ్రలో రాజకీయ చైతన్యం గల యువకుల్లో నూటికి 75 మంది పార్టీలో గాని, పార్టీ పాలసీని అనుసరిస్తూ గాని వున్నారు. పార్టీకి అన్ని జాతులలోను, వివిధ ప్రజా సంస్థలలోనూ ఆర్గనైజు అయివున్న ప్రత్యేక ప్రజా పలుకుబడి యింకా ఎక్కువైంది. కృష్ణా జిల్లాలలోను సంస్థానంలోను మన పార్టీకే కాంగ్రెసు మితవాద పక్షం కన్నా ఎక్కువ పలుకుబడి వుంది. గుంటూరు, పశ్చిమ గోదావరి జిల్లాలలో మన పార్టీ పలుకుబడి హెచ్చినను కాంగ్రెసు మితవాదుల పలుకుబడిని మించలేదు. రాయలసీమ జిల్లాలలో మన పార్టీ తప్ప యితరులెవరూ ప్రజల సమస్యలను గురించి స్పష్టమైన కార్యక్రమంతో పనిజేయక పోవుట వలన ప్రస్తుతం అచ్చట మన పార్టీ రాజకీయ రంగంలో పనిజేస్తున్న ప్రధాన శక్తిగా తయారవుతోంది. రాయలసీమలోని కాంగ్రెసు వర్కర్లందరూ అతివాద దృక్పథము గల సిన్సియరు వర్కర్లగుట చేతను, వారిపై అచ్చట మితవాద కాంగ్రెసు నాయకులకు సంఘటిత పలుకుబడి లేకపోవుట వలనను వారిని మన పార్టీ వైపుకు త్వరలో ఆకర్షించడానికి అవకాశం వుంది. అలా చేస్తే రాయలసీమలో మన పార్టీ కృష్ణా జిల్లాలో మాదిరిగా ప్రజాపార్టీగా తయారు గావడానికి అవకాశముంది.

ఆంధ్రలో రాజకీయంగా ప్రాముఖ్యత గల మిగతా గుంటూరు, పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి జిల్లాలలో పార్టీ యింకా ప్రధాన రాజకీయ శక్తిగా తయారుగాకపోవడం వలన రాష్ట్రం మొత్తం మీద యింకా మితవాదులదే ప్రజా పలుకుబడిలో పైచేయి అని చెప్పవచ్చును కాని అన్ని జిల్లాలలోనూ మన పార్టీ పలుకుబడి క్రింద ప్రత్యేక తాలూకాలు, ఫిర్కాలు వున్నాయి. చాలా మంది పార్టీ సభ్యులు వ్యక్తులుగా పార్టీలో జేరడమే గాకుండా వారి కుటుంబాలను కూడ మొత్తంగా పార్టీలోకి తీసుకువస్తున్నారు.

1943 జనవరికి మితవాద కాంగ్రెసు, రంగా ముఠా, ఫార్వర్డు బ్లాకు కలిసి పార్టీని ఒక్క ముఠాగా వ్యతిరేకించారు. కాని పార్టీ యొక్క నిరంతర కృషి వలన, గాంధీజీ - వైస్రాయి లేఖల వలన ఆ ముఠా విచ్ఛిన్నమవుతోంది. పూర్వం మన పార్టీని రాజకీయంగా మాత్రమే వ్యతిరేకించిన కాంగ్రెసు మితవాద పక్షంపై ముఠా నుంచి చీలిపోయింది. కాని కాంగ్రెసు మితవాద పక్షంలో పూర్వం నుంచీ మనకు వ్యతిరేక ప్రచారం జేస్తున్నవారు రంగా ముఠా (జమీన్ రైతు ముఠా) ఫార్వర్డు బ్లాకు కలిసి యింకా పార్టీని వ్యతిరేకించుతూనే వున్నారు. కాని వీరి పంథా ప్రజల ప్రయోజనాలకు వ్యతిరేకమైన పంథా అగుటచేత, మన పార్టీ పంథా ప్రజలను రక్షించేది అగుటచేత యీ ముఠా రోజు రోజుకూ క్షీణించుతోంది. కాని దానంతటది క్షీణించిపోదు. మన పార్టీ ఆర్గనైజుడుగా కృషి చెయ్యాలి.

# అధ్యాయము - 8

# పార్టీ నిర్వహించాల్సిన ముందు కర్తవ్యాలు

ఇంతవరకు పార్టీ పుట్టుక నుంచీ యిప్పటివరకు గావించిన కృషినిగూర్చి విచారించాం. పార్టీ ఎలా అభివృద్ధి అవుతూ వచ్చిందో చూచాం. ఇక ముందు పార్టీ అభివృద్ధి అయి ప్రజాపార్టీగా తయారుగావాలంటే యేంచెయ్యాలో తెలుసుకో వలసి వుంది. ప్రజా పార్టీగా తయారు చేయడానికి అవసరమైన పరిస్థితులు ఏర్పడ్డాయి. ఉన్న అడ్డంకులను తొలగించుకొని బోల్షివిక్ దీక్షతో ముందుకు పోవాలి.

## జిల్లా పార్టీల ముఖ్య కర్తవ్యాలు

రాష్ట్రం మొత్తం మీద మనపార్టీ అభివృద్ధి పొందాలంటే జిల్లా పార్టీలకున్న ప్రత్యేక బలహీనతను ప్రజా పార్టీలుగా అవి తయారు అగుటకు వున్న ప్రత్యేక అడ్డంకులను తొలగించుకోడానికి తీవ్ర కృషి గావించాలి. అప్పుడే రాష్ట్రం మొత్తం మీద ప్రజా పార్టీగా తయారై ప్రజానాయకత్వం వహించే స్థితి మన పార్టీకి కలుగుతుంది. కాన ఈ క్రింది ప్రధాన బాధ్యతలను ఆ యా జిల్లా పార్టీలు నిర్వహించాలి.

**విశాఖపట్నం జిల్లా :-** ఇప్పటివరకు యీ జిల్లా కామ్రేడ్సు కార్మికులు విద్యార్థులలో మాత్రమే పనిజేస్తున్నారు. రైతుల్లో పనిజేయడం: పార్టీకి కేడరు, పలుకుబడి వున్న ప్రాంతాలలో కూడ రైతు రంగంలో పని జరుగుటలేదు. రైతుల్లో వ్యాపించనిదే వ్యవసాయక రాష్ట్రమైన మన రాష్ట్రంలో మన పార్టీ ప్రధానస్థానం గడించడం అసంభవం. కాన ఈ జిల్లా కామ్రేడ్సు యీ క్రింది బాధ్యతలు ప్రధానంగా తీసుకుని పనిచేయాలి.

1. చిట్టివలస చుట్టుపట్ల ప్రాంతాలలో వున్న గ్రామాలలో రైతుసంఘాలు స్థాపించి రైతు ఉద్యమాన్ని అభివృద్ధి చెయ్యాలి. ఇలాగే విశాఖపట్నం చుట్టు ప్రక్కల వున్న గ్రామాల రైతుల్లో పనిజేయాలి. ఇందుకు హార్బరు అండ్ పోర్టు కార్మిక సంఘానికి చెందిన చుట్టుప్రక్కలగ్రామాల కార్మికుల సహకారంతో విశాఖపట్నంలోని కామ్రేడ్స్ పనిజేయాలి.

2. చీపురపల్లి, అనకాపల్లి తాలూకాలలో మన కామ్రేడ్సు రైతుల మధ్య ప్రస్తుతం గావిస్తున్న పనిని యింకా తీవ్రం గావించాలి. కాంటాక్ట్సు వున్న ప్రదేశాల్లో రైతు సంఘాలను స్థాపించి వాటిచేత ఆ ప్రాంతాల రైతుల దైనందిన కోర్కెల కొరకు పనిజేయించాలి. లేనిచోట్ల కాంటాక్ట్సు ఏర్పరచుకుని తాలూకా అంతటా వ్యాపించాలి.

3. ఈ జిల్లాలో బర్మా కాందిశీకుల సమస్య చాలా ప్రధానమైనదగుట చేత దాన్ని గూర్చి పనిచేయాలి. జిల్లా ఆఫీసు ఒకటిపెట్టి ఒక హోల్ టైము పనిచేసే కామ్రేడ్‌ను ఈ పనికొరకై నియమించాలి.

4. విద్యార్థుల్లో ఈ జిల్లా కామ్రేడ్సు పనిచేస్తున్నప్పటికిని విద్యార్థి రంగం నుండి పార్టీ ఇతర రంగాల్లో పనిజేయడానికి కేడర్లు తయారు కావడం లేదు. దీని వలన జిల్లా వాసులు హెచ్చుగా పార్టీ హోల్ టైమర్సుగా రావడం లేదు. యిందుకు యితర జిల్లాలపై ఆధారపడవలసి వస్తోంది. ఈ పరిస్థితి తొలగ నంత కాలం జిల్లా పార్టీ అభివృద్ధి గాదు. అందుచేత విద్యార్థి రంగం నుండి ఆ జిల్లావాసులైన వారిని యితర రంగాలలో పనిచేయడానికి, హోల్ టైమర్సుగా పార్టీ తయారు చెయ్యాలి. విద్యార్థి రంగంలో పనిచేసే కామ్రేడ్సు యిందుకు ప్రత్యేక కృషి గావించాలి. ఈ జిల్లాలో కళాశాలల్లో చదువుకొనేవారిలో నూటికి 75 మంది జిల్లాయేతరులే గాబట్టి కళాశాల విద్యార్థుల నుండియే గాక హైస్కూలు విద్యార్థుల నుండి ఆ జిల్లా వాసులైన విద్యార్థుల నుండి హోల్ టైమర్సుగా సంపాదించడానికి అవకాశముంటుంది. కాన హైస్కూలు విద్యార్థులలో గూడ విద్యార్థి ఉద్యమాన్ని వ్యాపింపజేయాలి. వారి నుండి పార్టీ కేడర్లను అభివృద్ధి గావించాలి.

**తూర్పు గోదావరి జిల్లా :-** ఈ జిల్లా పార్టీ అభివృద్ధికి పెద్ద అడ్డంకుగా వుంది ఫాక్షనలిజం. పార్టీలోని ఫాక్షనలిజమును రూపుమాపందే ఒక్క అడుగైనా పార్టీ ముందుకు వేయలేదు. అంతేగాకుండా పూర్తిగా విచ్ఛిన్నం గావడానికి యిది దారితీస్తుంది. కాన పార్టీని అభివృద్ధిజేయడానికి ప్రప్రథమముగా జేయ వలసిన పని పార్టీ నుండి ఫాక్షనలిజమును సమూలంగా, రూపుమాపడం, పార్టీ సభ్యులందరూ గూడ యిందుకు కృషి చేస్తేనేగాని యిది సాధ్యపడదు

ఈ జిల్లాలోని కామ్రేడ్సు సెక్టేరియన్ దృక్పథంతోనూ, అరాచక పద్ధతులతో వ్యవసాయ కూలీల మధ్య పనిజేయడం వలన రైతులకు వ్యవసాయ కూలీలకు తీవ్ర వైషమ్యాలు వచ్చాయి. పార్టీకి జిల్లా వ్యాపిత పలుకుబడి, స్థానం రావాలంటే, ప్రజాపార్టీగా తయారవ్వాలంటే ఈ వైషమ్యాలను తొలగించాలి. రైతు ఉద్యమాన్ని ఒక వైపున, వ్యవసాయ కూలీ ఉద్యమాన్ని మరొకవైపున అభివృద్ధి చేస్తూ వ్యవసాయ కూలీ రైతు సామరస్యాన్ని నెలకొల్పడం ప్రధాన

కర్తవ్యంగా పార్టీ సభ్యులు తీసుకోవాలి. రైతు, వ్యవసాయ కూలీల మధ్య పనే పార్టీ ప్రధాన పనిగా పరిగణించాలి.

పేపరు మిల్లు, టెక్స్టయిల్, పి. డబ్ల్యు. డి పంచదార పరిశ్రమలలో కేంద్రీకరించి పనిజేయాలి.

ఇలా చేస్తే ఈ జిల్లాలో పార్టీ సభ్యులలో వున్న ఫాక్షనలిజము, సెక్టేరియన్ దృక్పథం పోయి, పార్టీ ఎంతో అభివృద్ధి అవడానికి అవకాశముంది.

**పశ్చిమ గోదావరి జిల్లా :-** ఈ జిల్లాలో ప్రారంభం నుండి యిప్పటి వరకు పార్టీ స్వతంత్ర రాజకీయ శక్తిగా తయారుగాక పోవడం గొప్ప లోటు. అందువలననే సామ్రాజ్య వాద యుద్ధ కాలంలోనూ, జాతీయ సంక్షోభంలోనూ యితర జిల్లాలలో పార్టీ అభివృద్ధి అయి, పార్టీ సభ్యులలో చురుకుదనం, ఉత్తేజం వచ్చినా, యీ జిల్లా పార్టీలో అభివృద్ధి లేకపోవడమే గాక నిస్తబ్దత గూడ ఏర్పడింది. కాన పార్టీ అభివృద్ధి గావాలంటే యీ ప్రధాన లోటును తొలగించడానికి తీవ్ర ప్రయత్నాలు జరగాలి. స్వతంత్ర రాజకీయ శక్తిగా తయారగుటకు పార్టీ పలుకుబడి క్రింద స్వతంత్ర ప్రజా ఉద్యమాన్ని నిర్మించగల్గినప్పుడే సాధ్యమవుతుంది. అందుచేత రైతు, వ్యవసాయ కూలీ, మహిళా, విద్యార్థి యువజన ఉద్యమాలను స్వతంత్రంగా పార్టీ నాయకత్వం క్రింద నిర్మించాలి. వీటిల్లో పార్టీ పలుకుబడిని, స్థానాన్ని స్థాపించి స్థిరపరచాలి.

జూట్, తోళ్ళ పరిశ్రమ కార్మికుల్లో పని జేయాలి.

పై కర్తవ్యాలు నిర్వహింపబడాలంటే, పార్టీ సభ్యులలో ప్రతి ఒక్కరు యిప్పటికన్నా అనేక రెట్లు చురుకుగా పనిజేయుటకు దీక్ష బూనాలి.

**కృష్ణా జిల్లా :-** పార్టీ ప్రజానాయకుడుగా తయారైనప్పుడే మన పార్టీ నిజమైన ప్రజా పార్టీగా పరిగణింపబడుతుంది. యిలా తయారుగావడానికి ఈ జిల్లా పార్టీకి అన్ని అవకాశాలు వున్నాయి. బలిష్టమైన ప్రజా ఉద్యమాలు పార్టీ నాయకత్వం క్రింద నిర్మింపబడుతున్నాయి. కాని వీటి నిర్మాణం ఇంకా అస్థిపంజర దశను పూర్తిగా దాటలేదు. తమకు నాయకత్వం వహించి ప్రతి విషయంలోనూ నడిపించేదాన్నిగా ప్రతి ప్రాథమిక ప్రజాసంఘాన్ని ప్రజాసామాన్యం యింకా పరిగణించలేదు. ఇలా పరిగణించేటట్లు ప్రతి గ్రామ రైతు, వ్యవసాయ కూలీ సంఘం పూర్తిగా కృషి చేయాలి తమ ప్రాంతాలలో వున్న ప్రజలకందరికి ప్రాథమిక రైతు కూలీసంఘాలు నాయకత్వం వహించే శక్తిని సంపాదించాలి.

2. ఈ జిల్లాలో పార్టీ నిర్మాణములో ఒక ప్రత్యేక లోటు వుంది. పార్టీ ఆర్గనైజర్లకు ప్రజా సంఘాల్లో పనిచేసే ఆర్గనైజర్లకుమధ్య విభేదాలు ఏర్పడ్డాయి. పార్టీ ఆర్గనైజర్లు ప్రజారంగాల అనుభవం లేకుండా సిద్ధాంతాలను వల్లించేవారుగా

తయారగుటచేతను, ప్రజా సంఘాలలో పనిజేసేవారు సరియైన రాజకీయ దృక్పథం లేకుండా, ఏదోవిధంగా పనులు చేసేవారుగా తయారగుటచే ఈ విభేదాలు గల్గాయి. పార్టీ ఆర్గనైజర్లకు ప్రజా సమస్యలు ఏమీ తెలియవనియు, ప్రజారంగాలలో పనిజేసే వారికి రాజకీయ దృష్టి, సిద్ధాంత పరిజ్ఞానం ఏమీ లేదని ఒకరు నొకరు ఎత్తి పొడుచుకుంటూ పరస్పర విశ్వాసాలు గోల్పోయారు. ఈ పరిస్థితులు పార్టీని తీవ్ర ఫాక్షనలిజంకు గురిచేస్తాయి. వీటిని తొలగించనిదే పార్టీకి ప్రజా నాయకత్వం రావడం సాధ్యం గాదు. కాన వెంటనే పార్టీలో పూర్తి ఐకమత్యం నెలకొల్పడానికి ఈ క్రింది పనులు గావించాలి.

ఎ. పార్టీ ఆర్గనైజర్లు కేవలం సిద్ధాంతాలను వల్లించేవారుగానే వుండి పోకుండా, ప్రజా సమస్యలను పరిష్కరించడానికి తగిన సామర్థ్యం, ప్రజానుభవం గడించాలి. ప్రతిపార్టీ ఆర్గనైజరు గూడ ప్రజానాయకుడుగా తయారు గావాలి. అప్పుడే పార్టీ సభ్యులు, ప్రజా రంగాలల్లో పనిజేసేవారి గౌరవాన్ని, విశ్వాసాన్ని పొందగలుగుతారు.

బి. ప్రజా సంస్థలలో పనిజేసే ప్రతి ఆర్గనైజరు రాజకీయంగా అభివృద్ధి పొందాలి. తన సిద్ధాంత పరిజ్ఞానాన్ని పెంపొందించుకోవాలి. పార్టీ పద్ధతులలో పనిజేయడం అలవర్చుకోవాలి. అప్పుడే ఆత్మవిశ్వాసం వస్తుంది. పార్టీ ఆర్గనైజర్ల గౌరవాన్ని పొందగలుగుతారు.

ఈ పై పిఘలను యీ జిల్లా కామ్రేడ్స్ నెరవేర్చితే తప్పక తమ పార్టీని నిజమైన ప్రజాపార్టీగా చేసి, ప్రజాలపై నాయకత్వాన్ని సంపాదించగల్గుతారు.

గుంటూరు జిల్లా :- ఈ జిల్లాలో మన పార్టీ స్వతంత్ర పలుకుబడిగల ఒక రాజకీయ శక్తిగా పరిగణింపబడుచున్ననూ, యింకా ప్రధాన రాజకీయ శక్తిగా పరిగణింపబడుటలేదు. ఇందుకు కారణం జిల్లాలోని కాంగ్రెసు వర్కర్లందరినీ పార్టీలోకి లాగజాలకపోవడమే. అందుజేత యీ జిల్లాలో కాంగ్రెసు వర్కర్లను మన ప్రజారంగాల కార్యక్రమం ద్వారా పార్టీలోకి తీసుకురావడం ప్రధానంగా జేయవలసిన పని.

జిల్లాలో మన నాయకత్వాన నిర్మించిన ప్రజా ఉద్యమము యింకా ఆందోళన దశలోనే వుంది. ప్రజా సంఘాలు నిర్మాణరీత్యా చాల బలహీనంగా వున్నాయి. ప్రాథమిక ప్రజా సంఘాలు పనిచేయడం కొద్దిచోట్ల తప్ప యింకా ప్రారంభం గాలేదు. అందుచేత ఆందోళన దశనుండి ప్రజా సంఘాలు నిర్మాణ దశకు పోవాలి. ప్రతి ప్రాథమిక సంఘం ప్రజల దైనందిన యిబ్బందులను నివారించుటకు పూనుకొని నిజమైన ప్రజా పలుకుబడిని సంపాదించాలి. అప్పుడే

ప్రజా సంఘాలలో మన పార్టీకి సంఘటితమైన పలుకుబడి వస్తుంది. తద్వారా పార్టీని ప్రజా పార్టీగా తయారుచేయడానికి పూర్తి అవకాశాలు లభిస్తాయి.

నెల్లూరు జిల్లా :- ఈ జిల్లా పార్టీ యింకా గ్రూపు దశ పూర్తిగా దాట లేదు. ఇప్పుడిప్పుడే జిల్లా అంతటా పార్టీకి కాంటాక్టులు ఏర్పడుతున్నాయి. ప్రజా ఉద్యమాన్ని నిర్మించడానికి పునాది వేయబడుతోంది. జిల్లాలో ప్రధాన శక్తిగా పార్టీ తయారు గావాలంటే పార్టీ సభ్యులందరూ రైతు సంఘాలలో పని చేయడంపై కేంద్రీకరించాలి. రైతు ఉద్యమాన్ని అభివృద్ధి చేయడం ద్వారా పార్టీ కేడర్లు తయారవుతాయి. పార్టీ స్థానం బలపడుతుంది.

జిల్లాలో ప్రధాన పరిశ్రమ (పారిశ్రామికంగా) అభ్రకపు గనులు. ఈ పరిశ్రమలోని కార్మికుల మధ్య పనిచేయనిదే పార్టీ పునాది విస్తరించజాలదు. జిల్లా మొత్తం మీద కార్మిక వర్గంపై పార్టీ ప్రభావం వుండదు. అందుచేత యీ పరిశ్రమలోని కార్మికుల్లో పనిచేయడంపై పార్టీ కేంద్రీకరించాలి

రాయలసీమ జిల్లాలు :- ఈ జిల్లాలలో పార్టీ యింకా శైశవావస్థలోనే వుంది. ఇప్పుడిప్పుడే అభివృద్ధి అవుతోంది. ఈ జిల్లాలోని పార్టీలకు ప్రజా సంబంధం గల్గాలంటే రాయలసీమ ప్రజానీకాన్నంతా కదల్చివేస్తూ వున్న కరువు సమస్యను పరిష్కరించడానికి పూనుకొంటేనే సాధ్యమవుతుంది. ఇదివరకు హెచ్చు ప్రజా సంబంధం లేని మన పార్టీకి రాయలసీమలో కరువు సమస్యపై కేంద్రీకరించి పనిచేయడం అవసరం. ఇలా చేస్తే పార్టీకి ప్రజా సంబంధం కల్గడమే గాక, కాంగ్రెసు ఉద్యమాల ద్వారా రాజకీయ రంగంలోనికి వచ్చిన కాంగ్రెసు వర్కర్లందరినీ మన పార్టీలోనికి యిముడ్చుకోవడానికి పెద్ద అవకాశ మేర్పడుతుంది. తత్ఫలితంగా రాయలసీమలో ప్రధాన రాజకీయ శక్తిగా మన పార్టీ తయారవుతుంది. కాన కడప, కర్నూలు, అనంతపురం జిల్లా పార్టీలు ముఖ్యంగాను, చిత్తూరు జిల్లా పార్టీ కొంతవరకు కరువు నివారణ ప్రయత్నాలపై శక్తినంతా కేంద్రీకరించి పనిజేయాలి. ఈ విధంగా కల్గే ప్రజాసంబంధాన్ని పురస్కరించుకుని రైతు ఉద్యమాన్ని నిర్మించాలి. కరువు నివారణ ప్రయత్నాల ద్వారా పార్టీకి సంబంధమున్న ప్రతి గ్రామంలోనూ రైతు సంఘాన్ని స్థాపించాలి. మిలిటెంట్సును పార్టీలోనికి తీసుకుని జిల్లా వ్యాపితమొనర్చాలి. అనంతపూరు, మదనపల్లి కాలేజీ విద్యార్థులతో కేంద్రీకరించి పనిజేయాలి.

పైన వివరించబడిన బాధ్యతలను జిల్లా పార్టీలు నిర్వహించడంతోపాటు రాష్ట్రం మొత్తంమీద మన పార్టీ వివిధ ప్రజారంగాల్లో యీ క్రింద బాధ్యతలను నెరవేర్చినప్పుడే నిజమైన ప్రజాపార్టీగా తయారవుతుంది.

# పార్టీ నిర్మాణం

1. పార్టీ సభ్యత్వపు పెంపుదలతో ప్రస్తుతం ఒక జిల్లాకు, మరొక జిల్లాకు వున్న అసమానత్వాన్ని పోగొట్టాలి. వెనుకబడివున్న జిల్లాలు కూడా త్వరగా పార్టీ సభ్యత్వాన్ని పెంపొందించాలి.

2. పార్టీ సభ్యులకు, పార్టీ ఫంక్షనరీలకు రాజకీయ శిక్షణ యివ్వడానికి రాష్ట్ర కమిటీ, జిల్లాకమిటీలు శాశ్వత ఏర్పాట్లు గావించాలి.

3. పార్టీ ఆర్గనైజర్ల స్కూళ్ళను రాష్ట్రకమిటీ కొనసాగించుతూ వుండాలి. సెల్లు కార్యదర్శులకు తర్ఫీదు యివ్వడానికి కృష్ణా, గుంటూరు, నెల్లూరు, పశ్చిమ గోదావరి, తూర్పుగోదావరి జిల్లాలలో స్కూళ్ళను నడపాలి. రాష్ట్ర పార్టీ ఈ స్కూళ్ళను తనిఖీ చేస్తుండాలి.

సామాన్య పార్టీసభ్యులు, మిలిటెంట్సు రాజకీయ పరిజ్ఞానాన్ని అభివృద్ధి జేయడానికి ప్రతి పార్టీ సెల్లు ఈ క్రింది ఏర్పాట్లు చెయ్యాలి.

ఎ. ప్రతి సెల్లూ ఇంతవరకూ తెలుగులో మార్క్సిస్టు మూల సిద్ధాంతాల గూర్చి, సోవియట్ యూనియన్, సోషలిజాన్ని గూర్చి ప్రచురించబడిన గ్రంథాలను సేకరించి ఒక లైబ్రరీని ఏర్పాట్లుచెయ్యాలి. వీటి నాధారంగా గొని సెల్లు కార్యదర్శులు పార్టీ ఆర్గనైజర్లు (వీలున్నప్పుడు) అధ్యయన తరగతులు పెట్టాలి.

బి. "ప్రజాశక్తి". ప్రజాశక్తి ప్రచురణల, తదితర పార్టీ ప్రచురణలను అధ్యయనం గావించుటకు పార్టీ సభ్యులను, మిలిటెంట్సును కలిపి రీడింగు గ్రూపులుగా ఏర్పాటు చేయాలి. ప్రతి పార్టీసభ్యుడూ తప్పనిసరిగా "ప్రజాశక్తి", ప్రజాశక్తి ప్రచురణలు చదవాలి.

సి. చదువను, వ్రాయను రాని పార్టీ సభ్యులకు, మిలిటెంట్సుకు, చదువుట వ్రాయుట, నేర్పుటకు ప్రతి సెల్లు ఏర్పాట్లు గావించాలి.

3. పార్టీనంతటను పార్టీపద్ధతులలో పనిజేయుంచుటకు ఈ క్రింది పనులు చెయ్యాలి.

ఎ. సెల్లు కార్యదర్శులు తమంతట తామే చొరవతో పనిజేయుటకు తయారుగావాలి. పార్టీ ఆర్గనైజర్లు సెల్లు కార్యదర్శులను ఈ విధంగా తయారు జేయుటకు వారి రాజకీయ ప్రాక్టికల్ పరిజ్ఞానమును పెంపొందించాలి.

బి. ప్రతి సెల్లు, స్థానిక కమిటీ, జిల్లా కమిటీకి వర్కు రిపోర్టును తప్పనిసరిగా ప్రతి 15 రోజులకు పంపాలి.

సి. ప్రతి జిల్లా కమిటీ ప్రతి 15 రోజులకొక పర్యాయం జిల్లా పార్టీ రాజకీయ నిర్మాణపు నివేదికను రాష్ట్ర కమిటీకి పంపాలి. జిల్లా కమిటీలు పంపే ప్రతి రిపోర్టుపైనా రాష్ట్ర కమిటీ విమర్శన పంపుతూ వుండాలి అలాగే జిల్లా

కమిటీలు తాలుకా కమిటి సెల్లుల రిపోర్టుల గూర్చి విమర్శపంపుతూ వుండాలి.

డి. ప్రతి జిల్లా కమిటీ సమావేశానికి రాష్ట్ర కమిటీ సభ్యుడుగాని, రాష్ట్ర ఆర్గనైజరుగాని హాజరవుతూ వుండాలి. అలాగే జిల్లా కమిటీలు గూడ తమ క్రింది కమిటీల సమావేశాలకు తమ ప్రతినిధులు హాజరయ్యే యేర్పాట్లు గావించాలి. అంతేగాకుండా ప్రజా సంఘాలలోని పార్టీ ప్రాక్షన్సుకు జిల్లా జనరల్ బాడీ మీటింగులకు గూడ జిల్లా కమిటీ ప్రతినిధులు హాజరవ్వాలి.

ఇ. ప్రజా రంగాల్లో పనిజేసే రాష్ట్ర, జిల్లా, తాలుకా ఆర్గనైజర్లు తమ పార్టీ కమిటీలకు తమ వర్కు రిపోర్టు గూర్చి 15 రోజులకొక పర్యాయం రిపోర్టు పంపాలి.

యఫ్. జిల్లా కమిటీలు, రాష్ట్ర, జిల్లా, పార్టీ ఆర్గనైజర్లు తప్పనిసరిగా "ప్రజాశక్తి" "పీపుల్సు వార్" గూర్చి విమర్శనను రాష్ట్ర కమిటీకి ప్రతి వారం పంపాలి. ఫంక్షనల్ సెల్లుగా పనిచేసేచోట్ల సెల్లు సమిష్టి విమర్శనను పంపాలి.

ఈ విధంగా జేస్తే రిపోర్టింగు, పార్టీ చెకప్, ప్రజారంగాల ఫంక్షనరీలకు అవసరమైన రాజకీయ ప్రాక్టికల్ పరిజ్ఞానం లేకపోవడమనే ఆర్గనైజేషన్‌లోని నేటి ప్రధాన లోటును తొలగించుకొని, పార్టీని పార్టీ పద్ధతులలో పనిజేయించ గలుగుతాం.

4. నానాటికి హెచ్చు అవుతూవున్న జిల్లా, రాష్ట్ర కమిటీల ఖర్చులకు తగ్గిపోయిన రెగ్యులర్ ఆదాయ మార్గాలు సంపాదించక పోతే పార్టీ ఆర్థిక దుస్థితికి లోనవ్వాల్సి వస్తుంది. పార్టీ ప్రస్తుత నిర్మాణమే కుంటుబడిపోవలసి వస్తుంది. కాన ప్రతి జిల్లా కమిటీ తన ఆదాయ వ్యయాలను మూడు నెలల లోపల సరిపెట్టుకోవాలి. వ్యయానికి తగిన రెగ్యులరుగా ఆదాయాన్ని సంపాదించాలి.

5. పార్టీ పత్రిక : విడి అమ్మకాలను ఖచ్చితంగా రొఖ్ఖానికి అమ్మాలి. లేదా ముందు నెలకు సరిపడిన డబ్బు అడ్వాన్సు వసూలు చేయాలి. ఏ సందర్భంలోనూ అరువు యివ్వరాదు వెంటనే పాత బాకీలను వసూలు చేయాలి.

పార్టీ ఆర్గనైజర్లు పార్టీ కమిటీలు ఏజన్సీలను తనిఖీ చేయడం, ఎన్ని అమ్మతున్నారో, బాకీ తీర్చుతున్నారో లేదో పత్రికలు మిగిలిపోతున్నాయేమో పరిశీలించడం తమ విధిగా ఎంచాలి.

ఏజంటు ఏవారం అమ్మకం డబ్బు ఆవారం స్థానిక పార్టీ కార్యదర్శి వద్ద డిపాజిట్ చేయాలి. నెలాఖరుకు ప్రజాశక్తి బిల్లును చెల్లించివేయాలి. దీని కంతకూ బాధ్యత స్థానిక కమిటీ కార్యదర్శిపై వుంటుంది.

బజారు అమ్మకాల ద్వారా పరిచయులైన వారిని క్రమముగా చందా దారులుగా చేర్పించాలి. వారిని రాజకీయంగా అభివృద్ధిచేయాలి. ఇంకా హెచ్చు గ్రామాలలో పత్రికను వ్యాపింపచేయాలి.

## ప్రజా రంగాలు

**రైతు సంఘాలు:-** రైతు ఉద్యమాన్ని ఆందోళన దశ నుండి దాటించాలి. రైతుల దైనందిన కోర్కెల కొరకు ప్రతి ప్రాథమిక రైతుసంఘం కృషిజేసేటట్లు చూడాలి.

రైతు రంగంలో ,పార్టీకి వ్యతిరేకంగా వివిధ జిల్లాలలో రంగా మురా, ధనిక రైతులు, ప్రభుత్వ అనుకూల పార్టీలు ఒక కూటమిగా తయారై రైతు ఉద్యమాన్ని విచ్ఛిన్నం గావించడానికి గావించే విచ్ఛిన్న ప్రయత్నాలను యీ రంగంలో పనిజేసే కామ్రేడ్సు ఎదుర్కోవాలి. ఈ ప్రమాదం ఎచ్చటెచ్చట వుంటుందో అచ్చటల్లా రైతుసంఘాలు రైతుల దైనందిన యిబ్బందులను తీసుకొని వాటిని నివారించుటకు పూర్తిగా కృషిజేస్తూ, మన అధీనం క్రింద వున్న రైతు సంఘాలకు—రైతులకు సన్నిహిత సంబంధం ఏర్పరచాలి.

రైతు కూలీ సామరస్యాన్ని సాధించడానికి గ్రామ రైతు సంఘాలు వెను వెంటనే పూనుకోవాలి. (ముఖ్యంగా పనిరోజుల్లో కూలీ సంఘాల నిర్ణయం ప్రకారం రైతు సంఘాల్లో పనిజేసే పార్టీ సభ్యులు తమ పలుకుబడి క్రింద వున్న రైతులందరి చేత కూలి యిప్పించేటట్లు రైతుల్లో ప్రచారం చేయాలి. తాము ముందు యిచ్చి ఆదర్శం చూపెట్టాలి. ధాన్యపు ఫండులను ఏర్పరచుటకు పూనుకోవాలి.) రైతు సంఘ సభ్యులను చేర్పించడం. (స్త్రీలను కూడ చేర్పించాలి) దైనందిన యిబ్బందులను తొలగించుటకు ప్రయత్నం చేయడం. ఒకదాని వెంట ఒకటి ఎప్పుడూ జరుగుతూనే వుండాలి. రైతుల దైనందిన కోర్కెల కొరకు నడిపే ప్రతి ఆందోళనా సమయాన్ని ఉపయోగించుకోవాలి.

తాలుకా, జిల్లా రైతు సంఘ కార్యకర్తలకు, చురుకుగా పనిజేసే గ్రామ సంఘ నిర్వాహకులకు తర్ఫీదు యివ్వాలి.

ప్రతి జిల్లా రైతు సంఘం తన ఆఫీసు ఖర్చులకు, ఆ రంగంలో పార్టీ వేతనాలపై పనిజేసే ఆర్గనైజర్లను పోషించడానికి సరిపోయే ఆదాయాన్ని గడించాలి.

**వ్యవసాయ కూలీ రంగం :-** వ్యవసాయ కూలీయేతరుల సహాయం లేకుండానే కూలీల నుండి వచ్చిన పార్టీ కేడర్లతో యీ ఉద్యమం నడిచే అవకాశం ఏర్పడుతుంది. (కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి జిల్లాలు) వ్యవసాయ కూలీల నుండి పార్టీ సభ్యులుగాను, మిలిటెంట్సుగాను తయారైన చోట్ల యీ రంగంలో వారు గావించిన విధుల గూర్చి వారికి తర్ఫీదు యిచ్చుట. రాజకీయ, ప్రాక్టికల్ పరిజ్ఞానమును కలుగజేయుట. యీ రంగంలో పార్టీ నిర్వహించవలసిన ప్రధాన బాధ్యత.

అన్ని జిల్లాలలోనూ కూలీయాత్రలు జరపడం వగైరా ఆందోళన పద్ధతులతోనే సంతృప్తి చెందడం మానివెయ్యాలి. కూలీల దైనందిన యిబ్బందులను తొలగించుటకు కూలీ సంఘాలు పూనుకోవాలి. అంతేగాకుండా ఇళ్ళ స్థలాలు, నూతులు, దారి సౌకర్యాలు, పంచాయతీలు, స్థానిక సంస్థలు కూలీలకు ఏర్పరచేందుకు కూలీ సంఘాలు కృషి చెయ్యాలి. కలరా, మశూచికం, విష జ్వరాలు వగైరా అంటువ్యాధులు కూలీలలో వ్యాపించకుండా వైద్య సహాయం ప్రభుత్వం ద్వారానూ, ప్రజల ద్వారాను లభించేటట్లు కృషి చేయాలి.

వ్యవసాయ కూలీ మిలిటెంట్సునుండి పార్టీ సభ్యులను హెచ్చుగా జేర్పించడానికి, వారికి శిక్షణ యివ్వడానికి ఆ రంగంలో పనిచేసే కామ్రేడ్సు పూనుకోవాలి.

**కార్మిక రంగం :-** పార్టీ ఉత్పత్తి విధానమును ప్రచారం చేయడం ద్వారా కార్మికుల్లో రాజకీయ చైతన్యం కలుగజేయడానికి ప్రత్యేక కృషి గావించాలి. కార్మిక సంఘములను కార్మికుల నుండి తయారయ్యే పార్టీ సభ్యులు, మిలిటెంట్సు నడుపుకొనేటట్లు వారికి తర్ఫీదు యివ్వాలి. ట్రేడ్ యూనియన్ కేడర్లను తయారు చెయ్యాలి.

స్థానిక ఆర్గనైజర్లు, పార్టీ కమిటీలు ఆయా ప్రాంతాలలోని రైల్వే సెల్సు కార్మికుల పనిని ప్రత్యేక శ్రద్ధవహించి అభివృద్ధి చేయాలి.

పార్టీ కార్మిక సభ్యత్వం యిప్పటికంటే రెట్టింపు గావాలి.

వైజాగ్, కాకినాడ, రాజమండ్రి, ఏలూరు, బెజవాడ, గుంటూరు, గూడూరు పట్టణాలలోను, ముఖ్య పరిశ్రమల్లోనూ కేంద్రీకరించి పని చెయ్యాలి. చేనేత పారిశ్రామికుల్లో పని జేయాలి.

## విద్యార్థి, యువజన సంఘాలు

**యువజన సంఘాలు :-** ప్రతి గ్రామ సంఘాన్ని చురుకుగా పనిజేయించాలి. చురుకుగా పనిజేసే చోట్ల ఆఫీసులు పెట్టాలి.

ఆర్. ఎస్. ఎస్. విష కౌగిలినుండి యువకులను రక్షించడానికి ప్రతి పట్టణంలోను పట్టణ సంఘం, పేట్ల సంఘం పెట్టి యువకులందరిలో చొరబడి పోవాలి తాలింఖానాలు, డ్రిల్లు, ఆటలు, వైజ్ఞానిక కార్యక్రమము తీసుకుని యువకుల నందరిని మన వైపుకు ఆకర్షించాలి.

గుంటూరు జిల్లాలో కల్చరల్ కార్యక్రమముపై కేంద్రీకరించి స్థానిక సంఘాల చేత చురుకుగా పని జేయించాలి. అప్పుడే అచ్చటి జాతీయ యువజన సంఘాలను యువక ప్రజా సామాన్యం నుండి పూర్తిగా వేరుజేయ గల్గుతాం. తూర్పు గోదావరి జిల్లాలో సామర్ల కోట, రాజమండ్రి, పెద్దాపురం మొదలగు చోట్ల సంస్కరణవాదుల చేత స్థాపించబడ్డ యువజన సంఘాలలో మన కామ్రేడ్స్ చేరి వాటిలోని యువకులను మన వైపుకు త్రిప్పుకోవాలి. అలాగే పశ్చిమ గోదావరి జిల్లాలో నర్సాపూరు తాలూకాలో ఏర్పడ్డ ఆదిమాంధ్ర యువజన సంఘాలతో సంబంధం పెట్టుకొని వాటిని మన వైపుకు ఆకర్షించాలి. పట్టణాలలో మహమ్మదీయ యువకులను గూడ యువజన సంఘాలలోకి రప్పించాలి అలాగే వ్యవసాయ కూలీ, కార్మిక యువకులను కూడా జేర్పించాలి

ప్రతి గ్రామ, పట్టణ యువజన సంఘం క్రింద చాల సంఘాల్ని ఆర్గనైజు చెయ్యాలి.

విద్యార్థి సంఘాలు:- కాంగ్రెసు పలుకుబడి క్రిందవున్న విద్యార్థుల, విద్యార్థి సంఘాల పలుకుబడి క్రింద వున్న విద్యార్థుల మధ్య ఐక్యత గొనిరావడం విద్యార్థి రంగాల్లో పనిజేసే కామ్రేడ్సు ప్రధాన బాధ్యత అయివుంది. ఆహార సమస్య కొరకు పనిజేయడం, పౌర రక్షణలో పాల్గొనేటట్లు చేయడం, విద్యార్థులను పంచమాంగదళ చర్యల నుండి రక్షించడం గాంధీజీ విడుదల కొరకు పనిజేయడం. వీటిని విద్యార్థుల మధ్య ఐక్యమత్యతను నెలకొల్పడానికి సాధనాలుగా ఉపయోగించాలి. గాంధీజీ విడుదల కొరకు ఐక్యతా ప్రజా ఉద్యమాన్ని నిర్మించడానికి కాంగ్రెసు ముస్లిం జాతుల స్వయం నిర్ణయ హక్కును అంగీకరించడం. విధ్వంసక చర్యలను ఆపి, జాతీయోద్యమం నుండి పంచమాంగ దళమును పారదోలడం ఎంత అవసరమో కాంగ్రెసు విద్యార్థులకు బాగా నచ్చచెప్పాలి కాలేజీ, హైస్కూలు విద్యార్థి యూనియన్లను ఏర్పరచాలి. విద్యార్థి ప్రజా సామాన్య జీవితంతో కాలేజీ, స్కూలు కమిటీల ద్వారా హాస్టలులోని విద్యార్థి జీవితంలోనూ పాల్గొనాలి. అప్పుడే విద్యార్థి లోకాన్నంతటిని సంఘటితపర్చవచ్చును. అదే విధంగా పార్టీ సెల్సును గూడ టెరిటోరియల్ బేసిస్ మీదగాక, ఫంక్షనల్ బేసిస్ మీద ఆర్గనైజు చెయ్యాలి.

పార్టీ కమిటీలకు, విద్యార్థి ఫ్రాక్షనులకు పూర్తి సమన్వయముండాలి. విద్యార్థి ఫ్రాక్షన్ నాయకులు విద్యార్థి ప్రజాసామాన్యముతో బాగా సంబంధం పెట్టుకుని వారి నాయకులుగా తయారు గావాలి.

విద్యార్థి రంగంలో పనిజేయడానికి మంచి ఆందోళనాపరులను తయారు చెయ్యాలి. విద్యార్థులలో ఆర్. యస్. యస్. ప్రచారం ఆపడానికి యీ క్రింది పనులు గావించాలి.

ఎ) ఆర్. యస్. యస్. విద్యార్థులను ఆకర్షించిన చోట్ల దానిలోకి బాగా సమర్థులైన, నమ్మకమైన కామ్రేడ్సును కొందరిని పంపించి అలా ఆకర్షింపబడ్డ విద్యార్థులలో ప్రచారం చేసి వారిని ఆర్. యస్. యస్. విష కౌగిలి నుండి రక్షించాలి.

బి) ఆర్. యస్. యస్ లో చేరిన విద్యార్థులను ఆహార సమస్యపైన వాలంటీర్లుగా పని జేయించడానికి ప్రత్యేక కృషి జేయాలి.

సి) యువజన సంఘాలు బలహీనంగా వుండి, ఆర్. యస్. యస్.దళాలు యువజనులను ఆకర్షించిన ప్రదేశాల్లో విద్యార్థి వర్కర్లు ఆ ప్రదేశాల యువజన సంఘాలకు ఆర్. యస్. యస్. దళాలను బలహీన పర్చడానికి ప్రత్యేకంగా సహాయం చేయాలి.

డి) కర్రసాము, కత్తిసాము, డ్రిల్లు వగైరా వ్యాయామ పద్ధతులద్వారా ఆర్. యస్. యస్ ను విద్యార్థులనుండి, యువకులనుండి దూరం చేయడం సాధ్యమవుతుంది.

స్త్రీ విద్యార్థినులను గూర్చి ప్రత్యేక శ్రద్ధ వహించాలి.

## మహిళా రంగం

. మహిళా ఉద్యమమునకు నిర్మాణ రూపం యివ్వాలి. అందుకు సభ్యత్వం చేర్పించిన చోటల్లా ప్రాథమిక సంఘాలు పెట్టించి వాటిచేత యీ క్రింది పనులు చేయించాలి.

ఎ) స్త్రీలకు జపాన్ దాడివల్ల కలుగనున్న ప్రమాదాన్ని గూర్చి, ఫాసిస్టు దాడిని యితర ప్రజాసామాన్యంతో కలిసి ఎదుర్కోవలసిన అవసరాన్ని గూర్చి ప్రచారం చెయ్యాలి.

బి) ప్రజారక్షణ దళాలలో వుత్సాహవంతులైన స్త్రీలను జేర్పించి వారిచేత ఆహార డిపోలవద్ద పనిజేయించాలి. గ్రామాల్లో ఆహార కమిటీల నేర్పరచడానికి స్త్రీలలోగూడ తగిన ప్రచారం చేయాలి.

సి) మహిళా సంఘాలు ఆహార సమస్యలను పరిష్కరించడానికి పట్టణాల లోను, గ్రామాల్లోను యితర ప్రజా సంఘాలతోను సహకారం చెయ్యాలి.

డి) ప్రసూతి, లెట్రిన్ సౌకర్యాల కొరకు, స్త్రీలకు గ్రంథాలయాలు, రాత్రి పాఠశాలలు, అధ్యయన తరగతులు పెట్టి మూఢనమ్మకాలను తొలగించి విజ్ఞానాన్ని అభివృద్ధి చేయడానికి ప్రయత్నించాలి.

ఇ) స్త్రీలకు ఆస్థి హక్కు సంక్రమించాలనే ఆందోళన తీవ్రంగా జేయాలి.

యఫ్) స్త్రీలకు ఆత్మరక్షణోపాయాలు నేర్పాలి.

2. మహిళా సంఘాలలోకి వ్యవసాయ కూలి, కార్మిక స్త్రీలను గూడ కొనివచ్చుటకు ప్రయత్నించాలి.

3. తమ భార్యలను, అక్క చెల్లెండ్రను మహిళా సంఘాలలో జేర్పించ డానికి, రాజకీయంగా అభివృద్ధి జేయడానికి కృషి చేయడం, తన ప్రాంతంలో స్త్రీ ఉద్యమ వ్యాప్తికి తోడ్పడడం పార్టీ సభ్యులు తమ కర్తవ్యంగా ఎంచాలి.

## ఆహార సమస్య - అధికోత్పత్తి

ఆహార సమస్యలను పరిష్కరించడానికిగాను ఆహార కమిటీల ద్వారా గ్రామైక్యత, పట్టణ ప్రజలైక్యతను నిర్మించడమే ప్రధాన కర్తవ్యము. పట్టణా లలో పట్టణ ప్రజలకు సరిపోయె ఆహార సప్లయి ప్రభుత్వం చేసేందుకు, చౌక డిపోలను ఏర్పరచేందుకు, రేషనింగు అమలు పర్చేందుకు ఆహార కమిటీల ద్వారా పట్టణ ప్రజలైక్యతను నిర్మించాలి. ఆహార డిపోవద్ద శాంతిని కాపాడ డానికి, పంచమాంగదళ ప్రభావంచే కరువు దోపిళ్లు రాకుండా చేయడానికి, ఆహార కమిటీలు పనిజేస్తూ ప్రజా ఐక్యత ద్వారా ఆహార సమస్యను పరిష్క రించుకోవాలి గ్రామాల్లో ఆహార కమిటీలను ఏర్పరచి గ్రామైక్యతను నెల కొల్పాలి. గ్రామైక్యతను కూలీ - రైతు సామరస్యాన్ని స్థిరపర్చడానికి, గ్రామ ఆహార సమస్యను పరిష్కరించడానికి ధాన్యపు ఫండులను ఏర్పరచాలి. గ్రామ అవసరాలకు సరిపోగా మిగిలే ధాన్యాన్ని ఆహార కమిటీల ద్వారా బైటకు ఎగుమతి చెయ్యాలి. దాని ద్వారా ప్రభుత్వ కమాండరింగు పద్ధతి అవసరం లేకుండానే చేయవచ్చు. రాయలసీమ కరువు నివారణ కొరకు కామ్రేడ్సు వున్న ప్రతి ప్రాంతం నుండి ధన, ధాన్య వస్త్ర సహాయం తగినంతగా జరిగేటట్లు చూడాలి.

అధిక పంటలను పండించడం తమ దేశభక్తి పూరితమైన కర్తవ్యంగా రైతులు గ్రహించేటట్లు, అందుకు రైతాంగమంతా ఐక్యమయేందుకు వారిలో కామ్రేడ్సు తీవ్ర ప్రచారం చెయ్యాలి.

